# పదబంధ పారిజాతము

[నుడికారముల బృహన్నిఘంటువు]

ప్రథమ సంపుటము

సంపాదకవర్గం :

నార్ల వెంకటేశ్వరరావు

విద్వాన్ విశ్వం

తిమ్మావజ్ఝల కోదండరామయ్య

ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

తిలక్ రోడ్డు, హైదరాబాదు.

# పీఠిక

పరస్పరభావవినిమయం ప్రధానలక్ష్యంగా ఏర్పడిన భాష నానాటికీ పదునుదేరుతూ వస్తుంది. అవసర మేర్పడిన కొల్లా, ఆసక్తి పెంపొందిన కొల్లా, మానవవిజ్ఞానం వికసించిన కొల్లా, మనసూ మేధా నేవళం తేలిన కొల్లా భాషలో మార్పులూ, చేర్పులూ, కూర్పులూ అనంతంగా వర్ధిల్లడం అనూచానంగా వస్తున్నది.

తన మనోభావాల నన్నింటినీ తోడివారికి చెప్పుకోన గలచేవ తన భాషకు సంతరించుకోనడంలో ప్రతి మనిషీ, ప్రతి కాలంలోనూ ప్రయత్నపూర్వకంగానో, అప్రయత్నం గానో ఎంతో కొంత కృషి చేస్తూనే వుంటాడు. తత్ఫలితంగా ఒకనాటికంటె మఱొకనాడు భాషలో కొత్తమాటలూ, కొత్త మాటలతేటలూ, మాటలు కొత్తవి కానప్పుడు వానికే కొంగ్రొత్త భావచ్ఛాయలూ ఏర్పడుతూ వస్తున్నవి.

సామాన్యంగా విడివిడిగా పొడి మాటలుగా ఉన్నవే, అపూర్వసమ్మేళనంతో – ఆ మాటలకు విడివిడిగా వేనికీ లేని ఏదో ఒక అపూర్వభావవ్యక్తీకరణకు మూలము లై – విశిష్ట పదబంధాలుగా భాషలో నిలిచిపోతున్నవి.

వానినే పదబంధము లనీ, నుడికారము లనీ, పలుకు బడు లనీ, జాతీయము లనీ పేర్కొంటూ ఉంటాము. ఇవే కవితాలతాంకుర ప్రథమాలవాలా లనీ విజ్ఞులు భావిస్తారు.

మాటకు 'కళ్ళలో కారం పోసుకోను' అన్న పలుకు బడి తీసుకుందాం. ఇందులో మూడు పదా లున్నవి: కళ్ళు, కారము, పోసుకొనుట. కాని ఈ మూడు మాటల చేరిక వాని విడివిడి అర్థాలకు వేనికీ చెందని అసూయాగ్రస్తతను వెలనాడుతున్నది.

'కాస్త పచ్చగా కనిపిస్తే సరి అది కళ్ళలో కారం పోసుకుంటుంది.'

పై వాక్యం ఎక్కడో ఏ మహావిద్వాంసుడో, మహాకవో ఉపయోగించే అపూర్వభాషావిశేషం కాదు. మీరూ, మేమూ ప్రతి పల్లెపట్టునా, ప్రతి రచ్చపట్టునా ఏనాడు పడితే ఆనాడు వినే అవకాశ మున్నదే - వింటున్నదే - ఆ మాట.

అంటే, తనలోని ఏదో ఒక విశిష్టమూ ఉజ్వలమూ తీవ్రమూ అయిన భావాన్ని వినిపించుటకూ, ఎదుటివారి మనసున సూటిగా అంతగానూ నాటునట్లు చేయుటకు ప్రయత్నించుటలో ఇలాంటి విలక్షణపదబంధాలను ప్రతి తెనుగు తల్లీ, తండ్రీ, పిల్లలూ సృష్టిస్తూనే వున్నారు. తత్ఫలితంగానే అనేకం భాషలో ప్రవేశిస్తున్నవి.

పై వాక్యాన్ని అలాగే మఱొకభాషలో ఏ పదానికి ఆ పదానికున్న అర్థమూ, వాక్యంలో కారకం అవీ చూచి, వ్యాకరణయుక్తంగా అర్థం చెప్పి, అలాగే అనువదిస్తే ఆ నిర్దిష్ట మైనభావం ఘటిస్తే రాదు.

అందుకనే అది నుడికారము, తెనుగునుడులలోని ఒకానొక విశిష్టపదబంధవైచిత్రి అనుకుంటాము.

ఇది తెనుగులోనే కాదు. ప్రతిభాషలోనూ వున్నదే. మన కిక్కడ ప్రసక్తం తెనుగు గనుక తెనుగుసంగతే అనుకుంటున్నాము.

'ఒళ్ళంతా జెఱ్ఱులు ప్రాకినట్లున్న' దన్నప్పుడు మనకు తోచే భావస్ఫూర్తి కవి గ్రహించే తా నా మాటల వేటకు దిగి మఱింత వాటంగా చెప్పడం ఆరంభించినాడు. అందుకే ఇవి కవితాలతాంకురానికి ఆలవాలము లనుట.

ఇలాంటి నుడికారాలు అనేకవిధాలుగా వున్నవి.

కొన్ని మనిషిఅవయవాలపై ఏర్పడినవి. నెత్తిన నోట పెట్టుకొని చెప్పడం మొదలు, కాలికి బలపం కట్టుకొని తిరగడం దాకా ప్రతి అవయవంపైనా ఎన్నో కొన్ని నుడికారాలు ఏర్పడినవి.

అలాగే మనం నిత్యం చూస్తున్న పశుపక్ష్యాదుల నుండి కొన్ని ఏర్పడినవి. గోడమీది పిల్లి, దీపంముందు బల్లి మొదలు, కోతికి కొబ్బరికాయ చిక్కినట్లూ, కుక్కలు కాట్లాడుకున్నట్లూ మొదలు, కాలు ద్రవ్వడం, గర్జించడం మొదలు, దున్నమీద వాన కురిసినట్లు వఱకూ అనేకం ఇలా వచ్చినవి.

తాము గమనిస్తున్న పరిసర ప్రకృతి ప్రభావ పరిజ్ఞానం నుంచీ ఎన్నో వచ్చినవి. ఇసుక వేస్తే రాలనంత జనం మొదలు సూదిమొన మోపడానికి వీలు లేకుండా వఱకూ, వర్షం వెలిసినట్లుగా సద్దు మణగడం మొదలు కుండపోతగా కురవడందాకా ఇవి ఉన్నవి.

అఱచేతి రేకలు కనిపిస్తున్న వనుటతో వేకువ నతను ముచ్చటగా చెప్తాడు. కాదారి మాదారి ప్రొద్దని చీకటిని సూచిస్తాడు. ఎంత గొప్పకవి మనిషి!

ఇలా ఏర్పడిన నుడికారాలు కాక, కేవలం ఊది చెప్పటకూ, నొక్కి వక్కాణించుటకూ కొన్ని జంటపదాలను తను సృష్టించుకున్నాడు. ఒకప్పు డామాటను కాస్త అందంగా అనడంవఱకే అయినా సరే అనువదించుకున్నాడు.

నగా నట్రా, పురుగూ పుట్రా, సుళువూ ఒళువూ: ఇలా ఎన్నెన్నో వెలసినవి. పరువు అన్నా, ప్రతిష్ఠ అన్నా ఒకటే. అయితే నేం? పరువూ ప్రతిష్ఠా ఉన్న కుటుంబం అనుటలో ఒక విలక్షణపదబంధం ఏర్పడినది.

ఇలాంటివి కాక శబ్దపల్లవక్రియ లెన్నో విశిష్ట విలక్షణస్ఫూర్తితో నుడికారాలలో చేరినవి.

చన్నిచ్చుట చన్ను నిచ్చుట కాదు; కొండ చేయుట కొండను చేయుట కాదు; పీట పెట్టుట పీటను పెట్టుట కాదు. సరే. నోరు చేయుట నోరును చేయుట అని తెనుగువా డనుకోగలడా?

అట్లే కయ్యము పోడుచుట, అప్పు పోడుచుట, ఆన పోడుచుట మొదలగువానిలోని పోడుచుట ఆ విశిష్టపద

సంయుతితో స్ఫురింపజేసేఅర్థం కలది వానితో చేరినప్పుడే అవుతుంది.

మిన్ను ధన్నుటలో, తల దన్నుటలో, జిగి తన్నుటలో తన్నుట మన మామూలు తన్నుట కాదు. చెట్లు వట్టు, తిప్పలు వట్టు. కొండలు పట్టు వగైరాలు అనేక విశిష్ట భావద్యోతకాలు.

అఱ్ఱు అవసర మిచ్చుట, పూజ యిచ్చుట, చెఱి యిచ్చుట, అనుజ్ఞ యిచ్చుట, మొల యిచ్చుట, దళ మిచ్చుట ఇత్యాదులు. ఎన్నిరకాల రీతులనో అపూర్వపద విశిష్టసాన్నిహిత్యంతో యీ యిచ్చు అర్థ మిస్తున్నది.

చెఱపట్టుట చెఱను పట్టుట కాదు కదా! కొమ్ములు సూపుట కొమ్ములను చూపుట కాదు కదా.

ఇలా అనేకంగా వున్నవి.

మఱి కేవలం ధ్వన్యనుకరణాలై వచ్చినవి చాలానే కలవు. కొఱకొఱ లాడు, మెఱమెఱ లాడు, పటపట పండ్లు కొఱుకు, చిటపట వాన కురియు ఇలాంటివి.

అర్థవైలక్షణ్యం లేకున్నా ఒకే రూపంలో ఉండే కను ముక్కు తీరు, అరిషడ్వర్గాల వంటివి కొన్ని.

ఇవన్నిటినీ చేర్చి నుడికారాల నిఘంటువును వేఱుగా తయారు చేయవలె నన్న సంకల్పం కేవలం గ్రంథస్థమైన వానిని ఒకచో చేర్చుటకే కాక, అసలు గ్రంథస్థం కానివీ, నిఘంటువుల కెక్కనివీ వందలూ వేలూ ఉండి పోగా వానిని చేర్చుటక్కూ అయి ఉన్నది.

ఆంగ్లాది ఇతరభాషలలో కోశనిర్మాతలు ఆ యా ప్రధానపదాల క్రిందనే, ఆ పదం కొలికిపూసగా ఏర్పడిన నుడికారాల నన్నిటినీ విశేషార్థవివరణలతోపాటు ఇస్తూ వస్తారు.

మన కోశాలలో సూర్యారాయాంధ్ర నిఘంటువు (జన్యపదాలు), వావిళ్ళ నిఘంటువు కొన్నిటిని ఇవ్వవలె నని ప్రయత్నించినా ఆ పని సమగ్రంగా లేదు. అసలు కేవలం

వాడుకలో ఉన్నవి ఎక్కటా వారి ఉద్దేశం కాదు. మఱి శబ్ద పల్లవక్రియలను ఆ పదబంధంలోనుండి తప్పించి ముందు పదానికి అర్థం మార్చి వ్రాసి యిచ్చుటతో నుడికారపు వడుపే తెలియరాకుండా పోయినది.

చన్నిచ్చుట అన్నది అలా ఒకటిగా కాక, చన్ను అనుమాటకు స్తన్యము అన్న అర్థం కూడా ఉన్న దని వ్రాసి, ఆ ప్రయోగ మిచ్చి ప్రయోజనం తక్కువ. చన్నుకు స్తన్య మన్నది చన్నిచ్చుటలో తప్ప వ్యస్తంగా ఎన్నడూ రాదు. అలాంటప్పుడు ఆ మాటకు ఆ అర్థమూ ఉన్న దనుట ఎలా? విభిన్నపదాల కలయికతో అవలా విశిష్టార్థాలలో ఏర్పడిన మాటలు.

ఈ విషయం శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 'సాహిత్యసమీక్ష' లో విపులంగా చర్చించినారు.

అట్లని ఏవీ కోశాలలో చేర లేదని కాదు. బ్రౌణ్యాం మొదలు, వావిళ్ళదాకా ఎన్నో చేరినవి. కొన్ని ఏపదం క్రిందనో ప్రయోగాలలో ముక్కు మొగం తెలియకుండా కూర్చున్నవి. కొన్ని విడివడిపోయి వేరు కాపురాలు పెట్టినవి.

మఱి అలా కాక నుడికారాలను వేఱుగా, అకారాదిగా సంగ్రథనం చేయడానికి తొట్టతొలిసారి ప్రయత్నించినవారు శ్రీ నాళం కృష్ణారావుగారు. 'తెలుగు జాతీయములు' అను పేర వా రొక గ్రంథం రెండు సంపుటాలలో ప్రచురించారు.

అందులో కేవలం రెండువేల చిల్లర పదబంధాలు మాత్రమే చేరినవి. అయినా వారి కృషి ప్రప్రథమం, ప్రముఖం.

ఇలా అటూ చెటూ చెదరి ఉన్నవే కాక మొత్తం వాడుకలో ఉన్నవీ. వాడుకలోనూ గ్రంథాలలోనూ కూడా ఉన్నవీ, గ్రంథాలలో మాత్రమే మిగిలి వాడుకలో మాయ మయినవీ అన్నీ — పై వర్గా లన్నింటికి చెందినవానిని ఒక చోట చేర్చవలె నని ఆంధ్రసాహిత్యఅకాడమీ మహా సంకల్పం చేసి, మాకు పని అప్పగించినది.

ఇదొక మహాసముద్రమథనంవంటిపని. మనవాఙ్మయం అనంతం. అందులో అచ్చయినవీ, అచ్చు కానివీ, అపపాఠాలతో అచ్చయినవీ, అసమగ్రంగా వెలువడినవీ, అంతు తెలియనివీ, అంతు పట్టనివీ ఎన్నో గ్రంథా లున్నవి.

ఇక కోశాదులలో సంగ్రథిత మైనవానిని ఈ దృష్టితో వేఱు చేసి సరిచూచుకుంటున్నప్పుడు అర్థాలు సరికొత్తగా చూచుకొని నిర్ణయించుకొనవలసిన అవసరమూ ఏర్పడినది. కొన్ని వాడుకలో ఏ మూలో ఒకమూల సునిర్దిష్టమూ సుస్పష్టమూ అయిన అర్థంలో ఉండగా, ఆ వాడుక వినక చెప్పిన సుదూరార్థాలూ అవీ సరిచేసుకొనకా తప్ప లేదు. పైగా పాఠాలను కొన్నిచోట్ల సరిదిద్దుకొంటే తప్ప కుదరని పట్టులూ చాలానే కనిపించినవి.

ఇలా ఈపని సువిస్తృత మై పోయినది. అందువల్ల కొంత పరిశ్రమ ఎక్కు వైనా తప్ప దని సరికొత్తగా ప్రధాన గ్రంథసంచయా న్నంతటినీ నన్నయనుండీ నేటి కవులలో తెనుగు నుడికారపు సొంపులు నింపుకున్న పలువురు రచయితల గ్రంథాలదాకా చూడవలసి వచ్చినది.

అట్లని ప్రతిగ్రంథం చూడడం సాధ్యమా? ప్రాచీన గ్రంథసంచయంవఱకూ, దాదాపు ఏ యుగంలో నైనా సరే ప్రధానగ్రంథాల నన్నిటినీ పరిశీలించడం జరిగినా, నేటి వానిమాట అలా చెప్ప వీలు లేదు కదా!

మఱి వాడుకలో మాత్రమే ఉన్నవాని సంగతి ఏమని చెప్పగలం? అవెన్నో ఎటు పడితే అటు సాగరాగాధాలలో కలిసిపోయిన మంచి ముత్యాలలా చిప్పల పొత్తిట దాగి ఉన్నవే! అవెట్లా ఎన్నని పైకి తేగలం?

అయినా సాహసించినాము. విన్నవన్ని, విన్నవా రుపయోగించగా విన్నవన్ని, విని వ్రాసినవారు వ్రాయగా చూచినవన్ని – ఇలా చాలవఱకు సేకరించినాము.

తొలుత ఏదో యింతే కదా అనుకున్న కృషి తలకు మించిన బరు వైనది. అయినా పూనికతో పాఠాలమొదలు,

అర్థాల మొదలు. వాని ప్రయోగాల మొదలు. వాని వాడుకం మొదలు అన్నిటినీ పరిశీలించి ఒకకొలికికి తేగలిగినాము.

ప్రతి పదబంధానికీ అర్థం, వివరణం, ప్రయోగం దాదాపు ఇచ్చినాము. ప్రయోగంతోపాటు నేడూ వాడుకలో ఉన్నప్పుడు మేమే ఆ నుడికారం ఉపయోగించేతీరును తెల్పుతూ అర్థం స్ఫురింపజేసే వాక్యాన్ని చేర్చినాము. కేవలం గ్రంథస్థమే అయినప్పుడు ప్రయోగమే ఇచ్చినాము. కేవలం వాడుకలోనే మేము వినిన దైనప్పుడు వాడుకలోని వాక్య మొకటి మాత్రమే ఇచ్చి వున్నాము. జంటపదాలను ధ్వన్యనుకరణాలను సూచించాము.

మఱొక - మనభాషలో మాత్రమే ఉన్న - ఇబ్బంది చెప్పక తప్పదు. ఆంగ్లంలో మఱి ఏ పదబంధంలో నైనా ఆ మాట మాటగానే ఉండి పోతుంది. మన కలా కాదు. కన్ను - కంటిలో రూపం మారుతుంది కదా. అట్లే కన్ను బహు వచనంలో కన్నులు. కనులు. కండ్లు. కళ్ళు ఇలా నాలుగు రూపాలలోనూ వినవస్తుంది. మఱి అన్నిటా అవెలా ఇవ్వడం? చాలవఱకు ప్రధానంగా అన్ని రూపాలలో కానవచ్చేవి కొన్ని యిచ్చినా, మిగతవి ఒక రూపంలో ఆ అక్షరంక్రింద కానరాక పోతే మఱొకఅక్షరం క్రిందిరూపంలో ఉంటుంది. అన్నీ అన్నిరూపాలలో ఇస్తే అనవసర గ్రంథవిస్తరణం అవుతుం దనీ ఒకభయం.

ఇక ఎన్నడూ రగడగానే ఉండి ముగబడని బండి ఱాలూ రేఫలూ ఉండనే ఉన్నవి. ఇదొక పెద్ద సమస్య. అయినా నేఁటి వాడుకలోనూ. చాలవఱకు వ్రాతలోనూ పాటింపనిది. అందుకని రెండిటా కొన్ని యిచ్చాము. కొన్ని ఏదో ఒకటిక్రింద ఇచ్చాము. యథార్థానికి మేము ఈ ప్రత్యేకపదబంధంలోని రేఫం — శకట రేఫమా? సాధు రేఫమా? అని సిద్ధాంతరాద్ధాంతాలకు దిగ లేదు. దిగితే మా కాలం దానికే సరిపోయేది. అది ప్రస్తుతనిఘంటువునకు ప్రయోజనకారి కాదు.

అలాంటిదే మన అరసున్న పరుసదనం. ఇందులో మేము ప్రధానపదబంధసూచికలో గాని, మా వివరణంలో గాని, మా వాక్యాలలో గాని అరసున్నలు అసలు ఉపయోగించ లేదు. ప్రయోగాలలో మటుకు ఉన్న వున్నట్టు ఉంచాము.

నిజమే! అర్థం విభేదింపజేసే అరసున్నలూ వున్నవి. అయినా అవి ప్రయోగాలలో ఎలాగూ ఉన్నవి. వాడుకలోనే డెలాగూ అంతరించినవి. అందుకని ఈ పద్ధతిని మే మనుసరించాము.

వివరణలో సాధ్య మయినంత ఆ పదబంధ మెలా ఏర్పడిందీ మాకు తెలిసిందాకా వ్రాశాము. బొత్తిగా తెలియని కొన్నిటికీ ఆ మాట ఒప్పుకునే అర్థం చెప్పాము. ఇంకా తేలనివీ, ఆలోచించవలసి ఉన్నవీ అలా అని తెలివిడి చేశాము.

వివరణంలో కేవలం ఇంతదాకా వచ్చిన కోశాలలోని అర్థాలను అలా పరిగ్రహించక కొత్తగా చెప్పినవీ చాలానే ఉన్నవి. వానికి తగిన ఉపపత్తి ప్రతిచోటా చెప్పడం సాధ్యం కాక పోయి ఉండవచ్చును. వీ లున్నచోట వ్రాశాము. మా మట్టుకు మాకు తగినంత ఉపపత్తు లున్నప్పుడే ఇలా విభిన్నార్థం వ్రాశాము.

ఇవన్నిటినీ ఇక్కడ వివరించడం అసాధ్యం. అనేక గ్రంథం అవుతుంది. అ దిక్కడ అవసరమూ కాదు.

ఆఁ! అన్నట్లు వివరణాదు లన్నీ వ్యావహారికంలోనే ఉన్నవి. అందుకు ఉపపత్తు లీనాడు చెప్పవలెనా?

శక్తివంచన లేకుండా ఒక సంవత్సరానికి పైగా మేము చేసిన కృషి ఈనాడు మీ ముం దున్నది. అయితే, ఒక్కటి మాత్రం జ్ఞాపకం చేయక తప్పదు. భాషామహాసముద్రం గడవ నీదినా మని చెప్పడం ఎవ్వరి తరం?

అందులో నుడికారాలవంటివి వాడుకలోనే ఎన్ని ఉన్నవో లెక్కపెట్టి చక్కబెట్టినా మనడం చుక్కలను లెక్కించినా మనుట వంటిదే. అయినా చుక్కల లెక్కలంచనా వేస్తూనే ఉన్నారు. ఆలాగే మేమూ చేశాము.

ఇది సర్వసమగ్రమూ, స్వయంసంపూర్ణమూ అని చెప్పడం లేదు. అలా ఒక్క విడతలో బయట పడవేసే వీలున్న పని కాదిది.

ఇది చూచినవారు తా మిందులో చేర లేదని తోచిన వానిని దయతో తెలియజేస్తే వినమ్రులమై స్వీకరిస్తాము.

ఇదొకరి పని కాదు. భాషాసేవ పరమావధిగా మేం చేయగలిగినది చేశాము. ఇలాగే ఇంకా మేము వెలికి తీసుకొని రాగలవానినీ. తర్వాత తెలిస్తే వానినీ, మిగతవారు తెలిపేవానినీ అన్నిటినీ ద్వితీయ ముద్రణంలో చేరుస్తాము.

అలా ఒకటి రెండు ముద్రణాలైతే కాని, ఒక రకమైన సమగ్రత రాదు.—అప్పటికైనా వస్తే మాట!

ఏమైనా మా యీ కృషిని ఆంధ్రవిద్వల్లోకమూ, సహృదయజగత్తూ, జిజ్ఞాసువులూ తప్పక సానుభూతితో అర్థం చేసుకొనగల రనీ, అంచనా వేసుకొనగల రనీ, అభినందించగల రనీ ఆశిస్తున్నాము.

ఈ మహాప్రయత్నంలో ఎందఱో మాకు తోడ్పడినారు.

ప్రాచీనాధునిక గ్రంథసంచయంలోనుండి కొన్ని కావ్యాదులను చదివి వానిలో ఉన్నవానిని వేఱుగా ఎత్తి వ్రాసి యిచ్చుటలో మాకు తోడ్పడిన మిత్రులు వీరు: శ్రీ గన్నవరపు సుబ్బరామయ్య; శ్రీ బులుసు వెంకటరమణయ్య; శ్రీ రావూరి దొరస్వామి శర్మ; శ్రీ తిరుమల రామచంద్ర; శ్రీ జాస్తి జగన్నాథం; శ్రీ యామిజాల పద్మనాభస్వామి.

అట్లే నుడికారాలు, సామెతలు వగైరాల సేకరణలో ప్రభుత్వనియమితులై కృషి చేసిన శ్రీ సంపత్ రాఘవాచార్యులు తాము వ్రాసి ఉంచినవానిని మాకు పంపారు.

వా రందఱికీ కృతజ్ఞులము.

మే మిందులో ఉదహరించిన గ్రంథాలే కాక ఇంకెన్నో పరిశీలించాము. ఏదో ఒకదానినుండి ప్రయోగమిస్తే సరిపోవును గనుక, చదివినవానిలో ఎక్కువపాలు

పదులూ ఇరవైలుగా ఉన్న గ్రంథాలన్నిటా ఇవి పునఃపునరావృత్తములు గనుక ఇలా అగుట తప్ప లేదు.

అచ్చులో మే మనుసరించిన పద్ధతి యిది: ప్రధాన మైన నుడికారం పెద్ద అక్షరాలలో ఇచ్చి, అంతకంటె చిన్న దానిలో మా వివరణం యిచ్చాము. ప్రయోగం – అది గ్రంథంలోని దై తే ఆ ఆశ్వాసపద్యాది సంఖ్యనో, పుట సంఖ్యనో ఇచ్చి – చిన్న అక్షరాలలో ఇచ్చాము. మా వాడుకలోని వాక్యమూ అంతే.

ఇది సులువుగా చూచుకొనుటకు వీ లవుతుం దని మా ఆశ. అక్షరక్రమం అంచటివలెనే అనుసరించాము.

ఈ అచ్చు విషయంలో ఎంతో ఓపిక చూపి, ఎన్ని మార్చినా, చేర్చినా ఒక్క మాట అనక మాతో సహకరించిన 'ఫ్రీడమ్ ప్రెస్' వారిని అభినందించి తీరాలి.

ఎంత కన్నులో కన్ను పెట్టి చూచినా ఏమూలో అచ్చుతప్పో, రెండుమా ర్లొకపదం పడుటో, వాడుకమాట క్రింద 'వా.' జారిపోవుటో, అక్షరక్రమంలో ఏ నాలుగో అక్షరమో క్రమం తప్పుటో – ఇలాంటి చిన్న పొరపాట్లు జరిగినా జరిగి ఉండవచ్చు.

ఏమైనా ఈ మా కృషిని మన్నించి, అభిమానించి, ఏమైనా సలహా లిస్తే తప్పక స్వీకరించగలము.

నుడికారాల నిట్లా పెద్దయెత్తున నిఘంటురూపంలో సంగ్రథించుటలో మే మెంతవఱకు చరితార్థుల మైనామో అందుకు సహృదయులే ప్రమాణం. ఏ కొంతవఱకు మే మిందులో కృతకృత్యుల మైనా మా కృషి ధన్య మనే భావిస్తాము.

—సంపాదకవర్గం.

ఈ నిఘంటునిర్మాణంలో మాకు విశేషంగా తోడ్పడిన గ్రంథములలో కొన్ని—కాలక్రమంగా.

ఆంధ్రమహాభారతము.
కుమారసంభవము.
బసవపురాణము.
పండితారాధ్యచరిత్రము.
భాస్కరరామాయణము.
రంగనాథరామాయణము.
నిర్వచనోత్తరరామాయణము.
దశకుమారచరిత్ర.
మార్కండేయపురాణము.
హరివంశము.
నృసింహపురాణము.
ఉత్తరహరివంశము.
కేయూరబాహుచరిత్ర.
కాశీఖండము.
భీమఖండము.
హరవిలాసము.
శృంగారనైషధము.
పలనాటి వీరచరిత్ర.
శివరాత్రిమాహాత్మ్యము.
క్రీడాభిరామము.
భాగవతము.
ద్విపదభాగవతము.
శృంగారశాకుంతలము.
జైమినిభారతము.
మనుచరిత్రము
ఆముక్తమాల్యద

పారిజాతాపహరణము.
కాళహస్తిమాహాత్మ్యము.
పాండురంగమాహాత్మ్యము.
రామాభ్యుదయము.
శ్రీరాధామాధవము.
వసుచరిత్ర.
సుగ్రీవవిజయము.
నిరంకుశోపాఖ్యానము.
ప్రభావతీప్రద్యుమ్నము.
కళాపూర్ణోదయము.
తాళ్లపాక సంకీర్తనలు.
గౌరన హరిశ్చంద్ర ద్విపద.
నవనాథచరిత్రము.
రుక్మాంగదచరిత్ర.
విజయవిలాసము.
సారంగధరచరిత్రము.
క్షేత్రయ్యపదములు.
రాజగోపాలవిలాసము.
హేమాబ్జనాయికాస్వయంవరము.
కట్టా వరదరాజు రామాయణము.
రాధికాసాంత్వనము.
ఉత్తరరామాయణము.
శతకసంపుటములు.
కన్యాశుల్కము.

సాక్షి సంపుటములు.
తిరుపతి వెంకటకవుల గ్రంథ
ములు.
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి
గ్రంథములు.
కవిరాజ త్రిపురనేని రామస్వామి
చౌదరిగారి గ్రంథములు.
ఏటుకూరి వెంకటనరసయ్యగారి
గ్రంథములు.
నార్లవారి గ్రంథములు.
పెన్నేటిపాట.
విశ్వనాథ సత్యనారాయణగారి
గ్రంథములు.
సురవరం ప్రతాపరెడ్డిగారి
గ్రంథములు.
సాహిత్యసమీక్ష.
బ్రౌను నిఘంటువు.
శబ్దరత్నాకరము.
సూర్యరాయాంధ్ర నిఘంటువు.
వావిళ్ల నిఘంటువు.
తెలుగు జాతీయములు...
ఇత్యాదులు.

ఇవి, మిగతవి ప్రక్క జాబితాలో వివరంగా చేరి వున్నవి.

# ఉదాహృత గ్రంథ సంకేత సూచిక

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| అచ్చ. / అచ్చ. రామా | అచ్చతెనుగు రామాయణము | కూచిమంచి తిమ్మకవి |
| అనిరు / అని | అనిరుద్ధచరిత్రము | కనుపర్తి అబ్బయామాత్యుడు |
| అ. మ. క / అష్టమ. క | అష్టమహిషీకల్యాణము | తాళ్లపాక చిన్నన్న |
| అలుగు | అలుగురాజు | ఏటుకూరి వెంకటనరసయ్య |
| అహల్యా | అహల్యాసంక్రందనము | సముఖము వెంకటకృష్ణప్ప నాయకుడు |
| ఆం. నా | ఆంధ్రనామసంగ్రహము | పైడిపాటి లక్ష్మణకవి |
| ఆం. భా / ఆంధ్ర. భా | ఆంధ్రభాషార్ణవము | నుదురుపాటి వెంకన |
| ఆం. వా | ఆంధ్రవాచస్పత్యము | కొట్ర శ్యామలకామశాస్త్రి |
| ఆనంద | ఆనందరంగరాట్ఛందము | కస్తూరి రంగకవి |
| ఆము | ఆముక్తమాల్యద | శ్రీకృష్ణదేవరాయలు |
| ఆశ్విన. మా | ఆశ్వినమాహాత్మ్యము (తె. జా.) | |
| ఇందు | ఇందుమతీపరిణయము | కుమారధూర్జటి |
| ఉ. రా / ఉత్తర. రామా | ఉత్తరరామాయణము | కంకంటి పాపరాజకవి |
| ఉద్భ | ఉద్భటారాధ్యచరిత్రము | తెనాలి రామలింగకవి |
| ఉషా | ఉషాపరిణయము | పసుపులేటి రంగాజమ్మ |
| ఉ. హరి | ఉత్తరహరివంశము | నాచన సోమన |
| ఎడ్వ. నాట. | ఎడ్వర్డు నాటకము (తె. జా.) | |
| ఒంటి. శత | ఒంటిమిట్ట రఘువీర శతకము | రాయకవి తిప్పయ్య |
| కవ. (కవత్స్న) | కవత్స్నవిజయము | మట్ల అనంతభూపాలుడు |
| కన్యా. శు | కన్యాశుల్కము | గురజాడ అప్పారాయకవి |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
| --- | --- | --- |
| కఠి. శత. | కఠివేల్పు శతకము | |
| కలు. శ. | కలువాయి శతకము | |
| కవిక | కవికర్ణరసాయనము | సంకుసాల నృసింహకవి |
| కవిచకోర | (తె. జా.) | |
| కవిజ | కవిజనాశ్రయము | రేచన |
| కవిజన | కవిజనరంజనము | అడిదము సూరకవి |
| కవిమాయ | (తె. జా.) | |
| కవిరా | కవిరాజమనోరంజనము | కనుపర్తి అబ్బయామాత్యుడు |
| కవిస | కవిసర్పగారుడము | బసవన |
| కళా | కళాపూర్ణోదయము | పింగళి సూరన |
| కా. మా. (కాళ) | కాళహస్తిమాహాత్మ్యము | ధూర్జటికవి |
| కామేశ్వరి. శత | కామేశ్వరిశతకము | |
| కావ్యా | కావ్యాలంకారచూడామణి | విన్నకోట పెద్దన |
| కాశీ | కాశీఖండము | శ్రీనాథుడు |
| కాశీయా | కాశీయాత్రాచరిత్ర | ఏనుగుల వీరాస్వామయ్య |
| కాళ. శత | కాళహస్తీశ్వర శతకము | ధూర్జటికవి |
| కాళిందీ | కాళిందీకన్యాపరిణయము | అహోబలపతి |
| కుక్కు | కుక్కుటేశ్వరశతకము | కూచిమంచి తిమ్మకవి |
| కుచే | కుచేలోపాఖ్యానము | గట్టుప్రభువు |
| కుమా.<br>కు. సం.<br>కు. | కుమారసంభవము | నన్నిచోడకవి |
| కుమార. శత | కుమారశతకము | పక్కి వెంకటనరసయ్య |
| కుమారీ. శత | కుమారీశతకము | |
| కువల | కువలయాశ్వచరిత్రము | సవరము చిననారాయణకవి |
| కృష్ణ | కృష్ణరాయవిజయము | కుమారధూర్జటి |
| కృష్ణక | కృష్ణకర్ణామృతము | వెలగపూడి వెంగన |
| కృష్ణ. శకుం | శకుంతలాపరిణయము | కృష్ణకవి |
| కృష్ణా | కృష్ణాభ్యుదయము | గోంతేటి సూరన |
| కేయూ<br>కేయూర | కేయూరబాహుచరిత్రము | మంచన కవి |
| కొత్త | కొత్తగడ్డ | నార్ల వెంకటేశ్వరరావు |
| క్రీడా | క్రీడాభిరామము | వినుకొండ వల్లభరాయడు |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| క్షేత్రయ్య | క్షేత్రయ్యపదములు | క్షేత్రయ్య |
| క్షేత్రలక్ష్మి | క్షేత్రలక్ష్మి | ఏటుకూరి వెంకటనరసయ్య |
| గంధ | గంధవహము | మంచెర్ల వాసుదేవకవి |
| గీర | గీరతము | తిరుపతి వెంకటకవులు |
| గుంటూ | గుంటూరుసీమ | తిరుపతి వెంకటకవులు |
| గువ్వలచెన్న | గువ్వలచెన్నశతకము | పట్టాభిరామకవి |
| గౌ. హరి<br>గౌర. హరి | హరిశ్చంద్ర ద్విపద | గౌరన |
| చంద్ర | చంద్రభానుచరిత్రము | తరిగొప్పుల మల్లన |
| చంద్ర. వి. (చంద్రరేఖా) | చంద్రరేఖావిలాపము | కూచిమంచి జగ్గకవి |
| చంద్రా | చంద్రాంగదచరిత్రము | పైడిమఱ్ఱి వెంకటపతి |
| చంద్రి | చంద్రికాపరిణయము | సురభి మాధవభూపాలుడు |
| చంపూ | చంపూరామాయణము | ఋగ్వేదము వేంకటచలపతి |
| చమ | చమత్కారమంజరి | సింహాద్రి వెంకటాచార్యులు |
| చింతా | చింతామణి నాటకము (తె. జా.) | |
| చిత్ర. భా. | చిత్రభారతము | చరిగొండ ధర్మన్న |
| చెన్న | చెన్నబసవపురాణము | ఆత్మకూరి పాపకవి |
| జగ | జగన్నాటకము | నార్ల వెంకటేశ్వరరావు |
| జాహ్నవీ | జాహ్నవీమాహాత్మ్యము | ఏనుగు లక్ష్మణకవి |
| జైమి | జైమినిభారతము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి |
| జ్ఞానప్రసూనాంబికా | జ్ఞానప్రసూనాంబికాశతకము | |
| తపతీ | తపతీసంవరణోపాఖ్యానము | అద్దంకి గంగాధరకవి |
| తారా | తారాశశాంకవిజయము | శేషము వెంకటపతి |
| తాళ్ల. సం. | తాళ్లపాక సంకీర్తనలు | తాళ్లపాకము కవులు |
| తిరుపతి.ప్రభా.నాట | ప్రభావతీ ప్రద్యుమ్న నాటకము | తిరుపతి వెంకటకవులు |
| తె. జా | తెలుగు జాతీయములు | నాళము కృష్ణారావు |
| తెలుగునాడు | తెలుగునాడు | దాసరి లక్ష్మణకవి |
| త్యాగరాజు | త్యాగరాజకీర్తనలు | త్యాగయ్య |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| త్రివేణి | త్రివేణి | ఏటుకూరి వెంకటనరసయ్య |
| త్రిశంకుస్వర్గం | (తె. జా.) | |
| దశ (దశకు) | దశకుమారచరిత్ర | కేతన |
| దశా | దశావతారచరిత్ర | ధరణిదేవుల రామయమంత్రి |
| దాశ. శత. | దాశరథి శతకము | కంచెర్ల గోపన్న |
| దేవీ | దేవీభాగవతము | తిరుపతి వెంకటకవులు |
| ద్వా | ద్వాత్రింశత్సాలభంజికలు | కొఱవి గోపరాజు |
| ద్వాద | ద్వాదశరాజచరిత్రము | |
| ద్వి<br>ద్విప. భాగ | ద్విపద భాగవతము-దశమ స్కంధము | మడికి సింగన |
| ద్విప. భల్లా. | ద్విపద భల్లాణచరిత్రము | |
| ద్వి. నల | ద్విపద నలచరిత్ర | చక్రపురి రాఘవాచార్యులు |
| ద్వి. సారంగ | ద్విపద సారంగధరచరిత్ర | కూచిమంచి తిమ్మకవి |
| ధర్మజ | ధర్మజరాజసూయము (తె. జా.) | |
| నందక | నందకసామ్రాజ్యము (తె. జా.) | |
| నమశ్శి | నమశ్శివాయ శతకము | |
| నరస | నరసభూపాలీయము | మూర్తికవి |
| నలచ | నలచరిత్ర | చక్రపురి రాఘవాచార్యులు |
| నవ | నవనాథచరిత్రము | గౌరన |
| నానా | నానారాజసందర్శనము | తిరుపతి వెంకటకవులు |
| నా. మా | నార్లవారి మాట | నార్ల వెంకటేశ్వరరావు |
| నాయకు | నాయకురాలు | ఏటుకూరి వెంకటనరసయ్య |
| నారా. పంచ | పంచతంత్రము | నారాయణకవి |
| నారా. రుక్మి | రుక్మిణీకల్యాణము | అజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసు |
| నారా. శత | నారాయణశతకము | బమ్మెర పోతన |
| నిరం<br>నిరంకు | నిరంకుశోపాఖ్యానము | కందుకూరి రుద్రకవి |
| నిర్వ<br>నిర్వ. ఉత్త<br>నిర్వ. రామా | నిర్వచనోత్తరరామాయణము | తిక్కన |
| నీతిసీస | నీతిసీసపద్యశతకము | తాళ్లపాక పెదతిరుమలయ్య |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| నీలా | నీలాసుందరీపరిణయము | కూచిమంచి తిమ్మకవి |
| నృసిం | నృసింహపురాణము | ఎఱ్ఱన |
| నై, నైష | నైషధము | శ్రీనాథుడు |
| పంచ. వేంక | పంచతంత్రము | వేంకటనాథుడు |
| పండిత | పండితరాయ విజయము | తిరుపతి వెంకటకవులు |
| పండితా | పండితారాధ్యచరిత్రము | పాలకురికి సోమనాథుడు |
| పతివ్రతా | పతివ్రతామాహాత్మ్యము (తె. జా.) | |
| పద్మ | పద్మపురాణము | మడికి సింగన |
| పద్య. బసవ | పద్య బసవపురాణము | పిడుపర్తి సోమనాథుడు |
| పరమ | పరమయోగివిలాసము | తాళ్లపాక చిన్నన్న |
| పల. (పల్నాటి) | పలనాటి వీరచరిత్ర | శ్రీనాథుడు |
| పాంచా | పాంచాలీపరిణయము | కాకమాని మూర్తికవి |
| పాండ. జన | పాండవజననాటకము | తిరుపతి వెంకటకవులు |
| పాండ. ప్రవా | పాండవప్రవాసనాటకము (తె జా.) | ,, |
| పాండవాశ్వ | పాండవాశ్వమేధ నాటకము | ,, |
| పాండ. విజ, పాం. విజ | పాండవవిజయ నాటకము | ,, |
| పాండవో | పాండవోద్యోగ నాటకము | ,, |
| పాండు | పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి |
| పాణి | పాణిగృహీత | తిరుపతి వెంకటకవులు |
| పారి | పారిజాతాపహరణము | ముక్కు తిమ్మన |
| పార్వ | పార్వతీపరిణయము | రాయ రఘునాథభూపాలుడు |
| పె. పా. (పెన్నే) | పెన్నేటిపాట | విద్వాన్ విశ్వం |
| ప్రబంధ | ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము | గణపవరపు వెంకటకవి |
| ప్రబోధ | ప్రబోధచంద్రోదయము | నందిమల్లయ, ఘంటసింగయ |
| ప్రభా | ప్రభావతీప్రద్యుమ్నము | పింగళి సూరన |
| ప్రభా. నాట | ప్రభావతీ ప్రద్యుమ్న నాటకము | తిరుపతి వెంకటకవులు |
| ప్రభు (ప్రభులిం) | ప్రభులింగలీల | పిడుపర్తి సోమనాథుడు |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| బసవ | బసవపురాణము | పాలకుఱికి సోమనాథుడు |
| బహులా (బహు) | బహులాశ్వచరిత్రము | దామెర్ల వెంగళభూపాలుడు |
| బాణాల. కాళ | కాళహస్తి మాహాత్మ్యము | బాణాల శరభకవి |
| బాల | బాలరామాయణము | తిరుపతి వెంకటకవులు |
| బాలనీతి | బాలనీతిశతకము | |
| బిల్హ | బిల్హణీయము | చిత్రకవి సింగన |
| బుద్ధ | బుద్ధచరిత్రము | తిరుపతి వెంకటకవులు |
| బొబ్బిలి | బొబ్బిలియుద్ధనాటకము | ,, |
| భద్రగిరి | భద్రగిరి శతకము (తె. జా.) | |
| భద్రావత్యు | భద్రావత్యభ్యుదయము (తె. జా.) | |
| భర్తృ. సు | భర్తృహరి సుభాషితములు | ఏనుగు లక్ష్మణకవి |
| భల్లాణ | భల్లాణచరిత్రము | చితారు గంగాధరకవి |
| భాగ | భాగవతము | పోతనాదులు |
| భాను | భానుమతీపరిణయము | రెంటూరి గంగరాజు |
| భార | భారతము | కవిత్రయము |
| భా. రా<br>భాస్క. రా | భాస్కరరామాయణము | భాస్కరాదులు |
| భాస్క. శత | భాస్కరశతకము | మారద వెంకయ్య |
| భీమ | భీమఖండము | శ్రీనాథుడు |
| భోజ | భోజరాజీయము | అనంతామాత్యుడు |
| భోజసుతా | భోజసుతాపరిణయము | కోటేశ్వరుడు |
| మగువ | మగువ మాంచాల | ఏటుకూరి వెంకటనరసయ్య |
| మదన. శత | మదనగోపాల శతకము | వంకాయలపాటి వెంకటకవి |
| మను | మనుచరిత్రము | అల్లసాని పెద్దన |
| మన్నారు | మన్నారుదాసవిలాస నాటకము | పసుపులేటి రంగాజమ్మ |
| మల్లభూ (మల్ల) | మల్లభూపాలీయము | ఎలకూచి బాలసరస్వతి |
| మల్హ | శృంగార మల్హణ చరిత్ర | ఎడపాటి ఎఱ్ఱన |
| మహా. ప్ర. | మహాప్రస్థానం | శ్రీ. శ్రీ |
| మాటా | మాటా మంతీ | నార్ల వెంకటేశ్వరరావు |
| మానినీ | మానినీశతకము | |
| మార్క | మార్కండేయపురాణము | మారన |
| ముకుంద | ముకుందవిలాసము | కాణాద పెద్దన |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
| --- | --- | --- |
| ముద్రా | ముద్రారాక్షసము | తిరుపతి వెంకటకవులు |
| మృచ్ఛ | మృచ్ఛకటిక | ,, |
| మృ. వి | మృత్యుంజయవిలాసము | గోగులపాటి కూర్మనాథకవి |
| మైరా | మైరావణచరిత్రము | |
| మొల్ల. రామా / మొల్ల | మొల్ల రామాయణము | ఆతుకూరి మొల్ల |
| యయాతి | యయాతిచరిత్ర | పొన్నిగంటి తెలగనార్యుడు |
| యామున | యామునవిజయము (తె. జా.) | |
| రంగ. రా | రంగనాథరామాయణము | గోన బుద్ధారెడ్డి |
| రంగా | రంగారాయచరిత్రము | దిట్టకవి నారాయణకవి |
| రఘు. రా. | రఘునాథరామాయణము | తంజావూరు రఘునాథ నాయకుడు |
| రసిక | రసికజనమనోభిరామము | కూచిమంచి తిమ్మకవి |
| రాజగో | రాజగోపాలవిలాసము | చెంగల్వ కాళయకవి |
| రాజ. చ. (రాజశే) | రాజశేఖరచరిత్రము | మాదయగారి మల్లన |
| రాజవా | రాజవాహనవిజయము | కాకమాని మూర్తికవి |
| రాధా | రాధామాధవసంవాదము | వెలిదిండ్ల వెంకటపతి |
| రాధి / రాధికా | రాధికాసాంత్వనము | ముద్దుపళని |
| రామకథా | (తె. జా) | |
| రామచం | రామచంద్రవిజయము | చిలకమర్తి లక్ష్మీనరసింహకవి |
| రామరామ శత. | రామరామ శతకము | |
| రామలిం | రామలింగేశ్వరశతకము | |
| రామా / రామాభ్యు | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుడు |
| రా. వి | రాజవాహనవిజయము | కాకమాని మూర్తికవి |
| రుక్మాం | రుక్మాంగదచరిత్ర | ప్రౌఢకవి మల్లన |
| రుక్మి | రుక్మిణీపరిణయము | సత్యవోలు భగవత్కవి |
| రుద్రమ | రుద్రమదేవి | ఏటుకూరి వెంకటనరసయ్య |
| లక్ష | లక్షణసారసంగ్రహము | చిత్రకవి పెద్దన |
| లక్ష్మీ. వి | (తె. జా) | |
| వర. రా | రామాయణము | కట్టా వరదరాజు |
| వరా / వరాహ | వరాహపురాణము | నందిమల్లయ, ఘంటసింగయ |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| వసు | వసుచరిత్రము | రామరాజభూషణుడు |
| వాల్మీ | వాల్మీకిచరిత్ర | రఘునాథనాయకుడు |
| వాసి | వాసిష్ఠరామాయణము | మడికి సింగన |
| విక్ర | విక్రమార్కచరిత్రము | జక్కన |
| విక్రమ | (తె. జా) | |
| విజ / విజయ | విజయవిలాసము | చేమకూర వెంకటకవి |
| విజ్ఞా (విజ్ఞానే) | విజ్ఞానేశ్వరీయము | కేతన |
| వి. పు. (విష్ణు. పు) | విష్ణుపురాణము | వెన్నెలకంటి సూరన |
| విప్ర | విప్రనారాయణ చరిత్ర | చదలువాడ మల్లయ |
| విశ్వనాథ. శత | విశ్వనాథశతకము | |
| విష్ణు. నా | విష్ణుమాయానాటకము | చింతలపూడి ఎల్లన |
| వీర | వీరభద్రవిజయము | పోతన |
| వీరనారాయణ శత. | వీరనారాయణ శతకము | |
| వెంకటే | వెంకటేశాంధ్రము | గణపవరపు వెంకటకవి |
| వెంకటేశ | వెంకటేశ శతకము | |
| వేణు. | వేణుగోపాల శతకము | సారంగపాణి |
| వేం. మా | వేంకటాచలమాహాత్మ్యము | తరిగొండ వెంకమ్మ |
| వేమన | వేమన శతకము | వేమనయోగి |
| వైజ (వైజ. విలా) | వైజయంతీవిలాసము | సారంగు తమ్మయ |
| వ్యాస. నాట | (తె. జా) | |
| వ్యాఖ్యా. చాటు | (తె. జా) | |
| శకుంతలా | శకుంతలాపరిణయము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి |
| శతా | శతావధానసారము | తిరుపతి వెంకటకవులు |
| శరభాంక | శరభాంకలింగ శతకము | శరభాంకకవి |
| శశాం | శశాంకవిజయము | శేషము వేంకటపతి |
| శశి (అప్ప) | శశిరేఖాపరిణయము | అప్పకవి |
| శివ. (శివరాత్రి) | శివరాత్రిమాహాత్మ్యము | శ్రీనాథుడు |
| శివధ. | శివధనుర్భంగము | |
| శివ. సా. (శివతత్త్వ) | శివతత్త్వసారము | మల్లికార్జునపండితుడు |
| శుక | శుకసప్తతి | పాలవేకరి కదిరీపతినాయకుడు |
| శృం. నైష. | శృంగారనైషధము | శ్రీనాథుడు |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| శృం. శా | శృంగారశాకుంతలము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి |
| శృం. సా | శృంగారసావిత్రి | రఘునాథనాయకుడు |
| శేష | శేషధర్మము | తామరపల్లి తిమ్మయ |
| శ్రవ | శ్రవణానందము | తిరుపతి వేంకటకవులు |
| శ్రీనివా | శ్రీనివాసకల్యాణము | |
| శ్రీరం. మా. | శ్రీరంగమాహాత్మ్యము | భైరవకవి |
| శ్రీరంగే. శ. | శ్రీరంగేశ శతకము | |
| శ్రీరాధా | శ్రీ రాధామాధవము | చింతలపూడి ఎల్లయ |
| షోడ. | షోడశకుమారచరిత్రము | వెన్నెలకంటి అన్నమయ్య |
| సంపంగిమన్న | సంపంగిమన్నశతకము | పరమానందయతి |
| సదానంద. శత | సదానందశతకము | |
| సమీర. | సమీరకుమారవిజయము | పుష్పగిరి తిమ్మన |
| సర్వేశ | సర్వేశశతకము | యథావాక్కుల అన్నమయ్య |
| సాంబ | సాంబనిఘంటువు | కస్తూరి రంగకవి |
| సాంబో | సాంబోపాఖ్యానము | రామరాజు రంగప్పరాజు |
| సా<br>సారం | సారంగధరచరిత్రము | చేమకూర వెంకటకవి |
| సాక్షి | సాక్షి సంపుటములు | శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| సానం | సానందోపాఖ్యానము | శివరామకవి |
| సింహా | సింహాసనద్వాత్రింశిక | కొఱవి గోపరాజు |
| సింహా. నార<br>సిం. నార | సింహాద్రి నారసింహశతకము | గోగులపాటి కూర్మనాథకవి |
| సుగ్రీ | సుగ్రీవవిజయము | కందుకూరి రుద్రకవి |
| సుదక్షి | సుదక్షిణాపరిణయము | తెనాలి అన్నయ్య |
| సుమతి | సుమతిశతకము | బద్దెనకవి |
| సురా | సురాభాండేశ్వరము | గట్టుప్రభువు |
| సూరన | | అడిదము సూరకవి |
| సౌందర్య. స | సౌందర్యసమీక్ష (తె. జా.) | |
| హంస | హంసవింశతి | అయ్యలరాజు నారాయణామాత్యుడు |
| హ. స. | హరిశ్చంద్రనలోపాఖ్యానము | రామరాజభూషణుడు |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| హర (హరవి) | హరవిలాసము | శ్రీనాథుడు |
| హరి | హరివంశము | ఎఱ్ఱన |
| హరిశ్చ | హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి |
| హరిశ్చంద్ర | (తె. జా.) | |
| హేమా | హేమాబ్జనాయికా స్వయంవరము | మన్నారుదేవుడు |

గమనిక: తె. జా. గుర్తున్న గ్రంథాలు 'తెలుగు జాతీయములు' నుండి ఉద్ధృతములు.

---

## ఇతర సంకేతములు

| సంకేతము | వివరము |
|---|---|
| కన్న | కన్నడము |
| కాంబెల్ | కాంబెల్ నిఘంటువు |
| చా | చాటువు |
| చూ | చూడుడు |
| జం | జంటపదము |
| తమి | తమిళము |
| తె. జా | తెలుగు జాతీయములు |
| పా. పా | పాత పాట |
| పా. వా | పాత వాడుక |
| బ్రౌన్ | బ్రౌణ్యము. |
| వా | వాడుక |
| వావిళ్ల. ని. | వావిళ్ల నిఘంటువు |
| శ. ర. | శబ్దరత్నాకరము |
| సా | సామెత |
| సా. స. | సాహిత్యసమీక్ష |
| సూ. ని | సూర్యారాయాంధ్ర నిఘంటువు |

మిగతవి స్పష్టములు.

**అ౦ అనిన ఢం అన నేరదు**

అక్షరక్రమం తెలియదు. చదు వేమాత్రం రాదు.

చూ. ఓ అంటే నా రాదు.

"అక్కట! పొట్ట చించిన నొకక్షుర మైనను రాదు, లెక్కలుం డక్కలు గాని య మ్మనిన ఢ మ్మన నేరఁడు." శుక. 4.38.

**అంకకా డగు**

చలము పట్టువా డగు.

"కలహమున కంకకాఁ డయి కాలు ద్రవ్వ." ఆము. 5.84.

**అంకచండాల మగు**

నానాబీభత్స మగు; రోత పుట్టించున దగు.

"చాపకూ డఁటె వానిజన్మ మాఅడి వోవ నంకచండాల మైనది మతమ్ము." నాయక. 21 పు.

**అంకపొంకాలుగ (జ్వరం కాయు)**

విపరీతంగా. ...

"అంకపొంకాలుగా జ్వరం కాస్తూ ఉంది." వ్రాను.

**అంకమాలికలు**

దేవునిపేరు ఉన్న స్తోత్రములు.

"లీల నీశ్వరు నంకమాలిక ల్పాడుచో గీతభేదంబుల రీతు లెఱఁగ". హనూ. 3.38.

**అంకమ్మ శోకాలు**

వెఱ్ఱి యేడ్పులు.

**అంకమ్మ సివాలు**

పూనకం వచ్చినట్లు వేయు గంతులు.

**అంకవన్నె**

రికాబు. గుఱ్ఱపుజీనుకు అటూ ఇటూ వ్రేలాడుతూ కాలు పెట్టుకొనుట కైన ఇనుప కడెము.

"అంకవన్నె యొకటి సాహిణి యవ్వల నూఁదిపట్టఁ దనయనుఁగు చెలికాఁడు కై దండ యొసఁగ" ప్రభా. 2.38.

"ఇలఁ బాదద్వయి రాయ నళ్కొసఁగు నెందే పాఱుచో నంకవన్నెలు రెండై." ఆము. 2.27.

చూ. అంకెవన్నియ; అంకెవన్నె.

**అంకాపొంకములు**

కోపము; వైరము; తీవ్రము.

"అంకాపొంకాలు దరికొనంగ నిరంకుశ సాహససమర్థుఁ డగుదశముఖుఁడుఁ." రామా. 7.49.

"బెడిద మా శృంగార బీభత్సములకు నంకాపొంకములు." కవిస. 1 ఆ.

"జ్వరము అంకాపొంకములుగా వచ్చినది" శ.ర.

**అంకిత మిచ్చు**

కృతి యిచ్చు.

"తిక్కన తనభారతభాగాన్ని హరిహర నాథునకు అంకిత మిచ్చినాడు." వా.

**అంకితము చేయు**

కృతి యిచ్చు.

"పోతన తనభాగవతాన్ని శ్రీరామ చంద్రునకు అంకితం చేసినాడు." వా.

**అంకిత మొనర్చు**

అంకిత మిచ్చు.

"అంకిత మొనరుఁ దెనుఁగుపే శ్శరసి కూర్చి, గరిమతో నాంధ్రనామసంగ్రహ మనంగ" ఆం. నా. దే. 3.

**అంకిలి నొక్కుకొని పోవు**

నోట మాట రాక పోవు.

కొత్త. 13.

**అంకిలిపడు**

ఆగిపోవు.

"అంకిలి పడియెడుపనులకు, సంకటపడు టదియు నొక విచారమె"

భోజ. 6 ఆ. 376.

**అంకిలిపెట్టు**

అడ్డు, ఆపు.

"వాఁ డాయతశక్తి నన్ను నిట నంకిలి పెట్టినయప్డు" భా. రా. సుం. 71.

**అంకిలిసేయు**

వెనుదీయు.

"అంకిలిసేయక తూఁగ నోపినన్."

భోజ. 7.17.

**అంకురారోపణము**

ఆరంభము. ఏ శుభకార్య ప్రారంభంలో నైనా పాలికా పూజ చేసి, అందులో నవ ధాన్యాలు చల్లి మొలక పోస్తారు. అందుపై వచ్చిన పలుకుబడి.

"ఈనాడు మన కృషికి అంకురారోపణం జరిగింది."

చూ. అంకురార్పణము.

**అంకురార్పణము**

చూ. అంకురారోపణము.

"........చెల్వపుఁ గ్రొవ్వుపెంపునం బొదలెడురంభకున్ సవతిపోరు గణించుట కంకురార్పణం, బిది యిటు గొంత చేసితి." కళా. 2.3.

**అంకుశమునకు రానిది**

మాట విననిది.

ఏనుగు అంకుశంతో పొడిస్తే మాట వింటుంది. అలా విన నప్పుడు అంకుశానికి రానట్లు. లక్షణయా మాట విననిది. వశమునకు రానిది.

**అంకెకు రాని**

వశమునకు రాని.

"అంగన నమ్మ రాదు తనయంకెకు రానిమహాబలాఢ్యు వే, భంగుల మాయ లొడ్డి చెఱుపం దలపెట్టు."

భాస్క. శత.

**అంకెకు వచ్చు**

దారికి వచ్చు.

"ఇల నాయంకెకు రావు యింద్రియ ములు నా వైనా కలసి నామర్మములే కాఁడి పారీఁ గాని"

తాళ్ల. సం. 10.58.

**అంకెగొను**

ఆక్రమించు, వశము చేసు కొను.

"మబ్బులదరి పూత్కృతి రవిమధ్య మంకెగొనఁగఁ జిక్కువడక చరించు నం దొక్కకరటి." రా. వి. 3.49

## అంకెవన్నియ

రికాబు.

"గోమేధికంబులఁ గొమరొందుకళ్లెంబు వజ్రాలమే లంకెవన్నియలును."

ఉ. రా. 7 ఆ.397.

చూ. అంకవన్నె.

## అంకెవన్నె

రికాబు.

"వడిఁగట్టి కవారలు పావడ మిడి హెచ్చరిక రాయవరగండ యనన్, బెడ యంకెవన్నెపైఁ గాలిడ కపుడు చివుక్కు మనఁగ నెక్కెం దేజిన్."

కువల 2 ఆ. 56.

చూ. అంకవన్నె; అంకెవన్నియ.

## అంకె వేసుకొను

కాడిని మెడక్రిందికి వేసుకొని ఎద్దు ముందుకు నడవ నిరాకరించు.

"ఇంక బండి ఏం నడుస్తుంది. వలపటి గిత్త కాస్తా అంకె వేసుకున్నది." వా.

## అంగగొను

అడుగు వేయు—ముందుకు నడచు.

"అపఖ్యాతి నీకు నని నంగగొని కొలిపించితిఁ గొలుచు."

పండితా. ప్రథ. పురా. పుట. 288.

## అంగజాల

కంచుకి, రాణివాసం కాపలా మనిషి.

"అంగజాలలు కాలుకాలం బెనఁచుకొని చాఁపకట్టువడం గూలిన."

కాశీ. 6 ఆ. 227.

## అంగట్లో పెట్టు

అంగడి పెట్టు, బహిర్గతము చేయు.

చూ. అంగడిపెట్టు.

## అంగడి కెక్కు

వీధి కెక్కు, బజారు కెక్కు—బహిరంగ మగు.

"మారుని చేతిఘాత నభిమానము లోక సఖీజనంబుచే, నారడి గప్పినన్ వలపు లంగడి కెక్కక కోరినప్పుడే, కూరిమి వల్లభుం గలిసి కోర్కి ఫలించి సుఖించు కన్నియల్..." కవిక. 3.82

## అంగడి కెత్తిన దివ్వె

ఇతరుల కుపయోగపడునది.

చూ. బయల నెత్తిన దివ్వె.

తాళ్ల. సం. 5.1.

## అంగడి నమ్మికొను

అందులోనే పడి తన్నుకొను.

"ఆపద లంగడి నమ్మి కొనరో పాపాత్ములు పైపైఁ బడకా."

తాళ్ల. సం. 5.42.

## అంగడి పెట్టు

బట్టబయలు చేయు.

"తలఁపున నెంత మోహపరితాపము గల్గిన దాఁచుకొందురో, యలయిక లేక యీ కరణి నంగడి పెట్టుదురో లతాంగులు..." కువల. 3.43.

"పేద తెవు లింక నంగడిఁ బెట్టకున్నఁ దీఱదు." సుదక్షి. 2.51.

## అంగడి బడు

పాటిపోవు, బజారున బడు.

"ఆవల భయపడ్డవారంగడిఁ బడితే దొర, లోవుల విచారించి పూరడింతు రంత లోనె." తాళ్ల. సం. 8.70.

**అంగడివాడ**

బజారు, అంగడివీథి.

**అంగడివీధి**

బజారు.

చిత్తూరుజిల్లాలో నేటికీ బజారును అంగడివీధి అనే అంటారు. అంగళ్ళున్న వీధి.

**అంగదట్టము**

పావడ, గాగర. (అంగధట్టి - కన్నడం.)

"తతనితంబాభోగధవళాంశుకములోని యంగదట్టపుఁగావిరంగువలన, శశికాంత మణిపీఠి జాజువాఱఁగ." మను. 2.27.

**అంగన్యాసం**

జపానికి ముందు ఆయా అవయవాలను ఆయా మంత్రభాగం అంటూ తాకుట.

చూ. కరన్యాసం.

**అంగప్రదక్షిణం**

ఏ దేవాలయాన్నో తిరిగి ప్రదక్షిణం చేయకుండా, తానే గిరగిరతిరిగిప్రదక్షిణంచేయుట.

**అంగబిళ్ళ**

మానంబిళ్ళ. ఆడపిల్లల మొలకు కట్టేబిళ్ళ.

**అంగభోగము**

అంగపూజ.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 200.

**అంగమొల**

దిసమొల—బట్టాబాతాలేనిస్థితి.

**అంగమొల లగు**

దిగంబరు లగు.

"మదనభూతము సోఁకినమగువలు పురుషులు, అదనవిరిదలై అంగమొలలై పెదవి నెత్తురు లీర్చి."

తాళ్ళ. సం. 9.205.

**అం గయినచోటు**

అన్నీ అమరినచోటు.

**అంగరంగభోగములు**

అంగరంగవైభవము.

**అంగరంగవైభవము**

దేవుని ఊరేగింపులో అన్ని హంగులూ ఏర్పఱచి బయలు దేర దీసినప్పటి వైభవం.

"ఎపుడు నంగరంగవైభవముల."

సారం 1.24.

"రంగడు అంగరంగవైభవములతో వేంచేస్తున్నాడు." (ప్రా॰ఛా॰)

**అంగరక్ష**

1. తాయెత్తు, లేక యంత్రము. 2. రక్షకము.

మంత్రశాస్త్రంలో కొన్ని యంత్రాలను రాగిరేకులపై వ్రాసి అట్లే కాని, ఆ రేకును తాయెత్తులో ఉంచి కాని కట్టితే ఆయా పీడలు ఆయా యంత్రాల మూలంగా తొలగు నని అంటారు.

వర. రా. బా. పు 116. పంక్తి 18,

**అంగరొల్లెలు**

ఒకరక మైనపిండివంట.

హంస. 1.105.

**అంగలార్చు**

ఏడ్చు, వగచు

"ఆకంఠంబుగ నీవు మాధుకరభిక్షా
న్నంబు భక్షింపఁగా లేకున్నఁ గడు
నంగలార్చెదవు మేలే లెస్స."

కాశీ. 7.162.

"రాలేదు రాలేదు అని ఊరికే అంగ
లారుస్తూ కూర్చుంటే ఏం లాభం రా?
ఏదో ఒకటి చెయ్యాలి గాని." వా.

**అంగలు వేయు**

కాలు చాచి అడుగిడు, గబ
గబా నడచు.

"వాడు అంగలువేసుకొంటూ వెళ్లాడు."
"వాడు అంగలు వేసుకుంటూ నాలుగు
నిమిషాల్లో ఇల్లు చేరుకున్నాడు." వా.

చూ. అంజెలు వేయు.

**అంగళ్ళవాడ**

బజారు, అంగడివీథి.

**అంగవస్త్రము**

పైపంచ–ఉత్తరీయము.

**అంగిట నూరు అమృతము**

అందుబాటులో ఉన్న మనో
రథపరిపూర్తి కారకము.
ముంగిటిపెన్నిధి అనుట.
ఏమాత్రం శ్రమించక అంగి
టనే అమృత మూరుతుంటే
ఇంకేం? ఎంతైనా త్రాగ
వచ్చు గదా. అందుపై వచ్చి
నది.

"ముంగిటిపెన్నిధి దంగేటిజున్ను, నంగిట
నూరెడునమృతం బనంగ".

చూ. ముంగిటిపెన్నిధి.

**అంగిటబెల్లమై**

ఏమీ అన లేక.

"అధిపుఁ డాడుమాట కంగిటి బెల్లమై
కూరుచుండి రొదిగి గుటక లిడుచు."

నాయక. 44 పు.

**అంగిటిముల్లు**

కిఱునాలుక, కొండనాలుక
అగు.

"నీకు నఱిమియో? కోనయో? యంగిటి
ముల్లో? ఎఱుఁగను మందు బ్రూ
కేమి?" బసవ. 3 ఆ. 59 పు.

**అంగిటిము ల్లొత్తు**

చిఱునాలుక లేక కిఱునాలు
క–కొండనాలుక జారినప్పుడు
దగ్గు వస్తుంది. దానిని వెల్లుల్లి,
మిరియం దంచి నడిమివేల
నుంచుకొని ఒత్తుతారు. అది
పైకి వెళ్ళి పోతుంది.

బస. 3 ఆ. 58 పుట.

చూ. చిఱునాలుకగు. కొండనాలు
కగు.

**అంగుటమున నేల వ్రాయు**

కాలి బొటనవ్రేలితో నేల
వ్రాయు. ఇది సిగ్గును సూచిం
చును.

ద్విప. భాగ. 134 పు.

**అంగుడుదుడుపు**

మాటలు మోసేవాడు,
తంటాలమారి.

**అంగుడు లేదు**

నోరు వచ్చినవాడనుపట్ల ఉప యోగించేమాట.

"అంగుడు లేనట్టుగా అలా కూర్చున్నా వేమి రా?" వా.

**అంగుదారు**

ప్రోత్సాహకుడు.

భోగంమేళంలో వెనుకపాట పాడేవారిని అంగుదారు లం టారు. తద్ద్వారా వచ్చిన పలుకుబడి.

చూ. హంగుదారు.

**అంగుష్ఠమాత్రుడు**

పొట్టివాడు.

"అంగుష్ఠమాత్రుడికి ఆ అమ్మాయిని ఎలా యిస్తాము. అ దేమో ఒడ్డూ పొడుగూ అయిన పిల్ల." వా.

**అంగోష్ఠపు పొట్టి**

లావాటి మనిషి.

**అంచనా వేయు**

ఏపని కయినా ముందు ఇంత కావచ్చు నని ఉజ్జాయింపుగా లెక్క వేయు.

"ఈ ప్రాజెక్టున యాభైలక్షలు అవుతుం దని అంచనా వేశారు."

"ఈపని రెండునెలలలో కావచ్చు నని అంచనా వేశాము. చూడాలి." వా.

చూ. అంచించు.

**అంచపదము**

హంసపాదు.

వ్రాతలో ఏ దయినా మరిచి పోతే హంసపాదము వంటి గురుతు వేసి పైన వ్రాస్తారు. అందుపై వచ్చినపలుకుబడి.

**అంచించు**

అంచనా వేయు.

తమి. "అంజిత్తల్."

చూ. అంచనా వేయు.

**అంచి పుచ్చు**

పంపు.

"ప్రతిగ నందుల కంచి పుచ్చు."

భార. అశ్వ. 3.

**అంచు గట్టుకొని వచ్చు**

అంతము సమీపించు, ముగియ వచ్చు.

"వాడి కేదో అంచు గట్టుకొని వచ్చింది. అందుకే నాతో చెలగాటం ఆడుతు న్నాడు." వా.

"ఆ వ్యవహారం అంచు గట్టుకొని వచ్చింది. ఇక తెలుస్తుంది అయ్యూపని." [వా.

**అంచుముట్టని**

వగ దెగని

"ఈయంచుముట్టని సింగారము లేమి?"

పాంచా. 4 ఆ.

"ఇంకా యీపని అంచుముట్ట లేదు - ఇ దేమి అంచు ముట్టే వ్యవహారంగా లేదు."

వా.

**అంచులవాడు**

చిత్రకారుడు, బట్టలకు రంగులు వేయువాడు.

**అంచులు తీరినవయసు**

సమగ్రయౌవనము.

"అంచులు తీరినవయస్సులో ఉందా? అలా చేయక ఏం చేస్తుంది?" వా.

అంచులు తీరు

సమగ్ర మగు, నిం డగు.

చూ. అంచులు తీరిన వయసు.

అంచెలు గట్టు

బారులు కట్టు.

"అనిలంబు లేదును నంచెలంచెలు గట్టి యాకాశవీథి నందంద నడవ."

కాశీ. 1.132.

"అంచెలు గట్టి కాళ్లతోడు పై చనసీవు గదమ్మ ప్రోదిరాయంచలు"

మను. 5.61.

అంచెలంచెలుగా

అక్కడక్కడా ఆగుతూ.
దశలవారీగా.

అలుగురాజు. 42 పు.

అంచెలమీద

అక్కడక్కడా గుఱ్ఱాలను మారుస్తూ.

పూర్వం తపాలు తీసుకొని పోవుటకూ, ఏదయినా రాజ కార్యముమీద పోవునపుడూ సరాసరి ఒకే గుఱ్ఱం లేదా గుఱ్ఱాలజత చాలదూరం పోవడం అసంభవం కనుక అక్కడక్కడా వానిని మార్చి వెళ్లేవారు. దానిమీద వచ్చిన పలుకుబడి.

అంజనమున మాటలాడ నేల ?

కనబడుతున్న దానికి వర్ణన యెందుకు ?

నిధులు తెలుసుకొనుటకు అంజనమును వేసేవారు. ఏవో కొన్ని మూలికలను కాల్చి ఆపొడిని నూనెలో కలిపి అంజనం తయారు చేస్తారు. దానిని తమలపాకువంటి దాని మధ్యలో బొట్టుగా పెట్టి దీపంముందు దాని నుంచి ఎవరినో—సామాన్యంగా పిల్లలను చూడ మంటారు. అందులో అవన్నీ వారికి స్పష్టంగా కనిపిస్తా యని అంటారు. కనబడుతున్న దానికి ఇక చెప్పవలసిన అవసరం లేదు కదా! అందుపై వచ్చినపలుకుబడి.

"అంజనంబున మాటలాడ నేమిటికి ? ముంజేతి కంకణంబున కద్ద మేల ?"

సారం. 1.844.

అంజలి గుంజలి యార్చు

గట్టిగా అఱచు.

"అంజలి గుంజలి యార్చి."

బసవ. 4.194.

అంజలి చేయు

నమస్కరించు.

"అనలుం డంజలి చేసి నంతకుఁడు సాష్టాంగంబు గావించె." పారి. 3.7.

అంజలి యొనర్చు

నమస్కరించు.

"జయదేవ సుకవి కంజలి యొనర్చి."

రుక్మాం. 1.13.

అంజెలు వేయు

గబగబ నడచు.

"ఆ అమ్మాయి వచ్చిం దనేసరికి వాడు

అంజెలు వేసుకుంటూ వెళ్లాడు.'' వా.

చూ. అంగలు వేయు.

**అంటకత్తెర వేయు**

వెంట్రుకలు కుఱుచగా కత్తిరించు.

**అంటకముట్టక**

చూ. అంటీ ముట్టక.

**అంటకాగు**

జతగా దగ్గఱ ఉండు.

కొత్త. 102.

**అంటకుండి ఆడుప్రాయము**

చిఱుతప్రాయము.

సంసారంలో కల్పించుకోకుండా ఆడుతూ పాడుతూ గడిపే ప్రాయం అనుట.

"అంటకుండి యాడునట్టి ప్రాయమొకింత నడుచు నంతలోన..."

కళా. 6.76.

చూ. అంటి కుంచి ఆడుప్రాయము.

**అంటగట్టు**

1. బలవంతముగా తగులగట్టు.

"నే నెంత వద్దని మొత్తుకున్నా వినకుండా ఆపిల్లను నా కంట గట్టినాడు. నేను నానాబాధా పడుతున్నాను." వా.

"నేను పోయేది లేదు. పెట్టేది లేదు. వద్దంటే వినకుండా అదేదో బెనిఫిట్ నాటకమని వాడు నా కొక టిక్కెట్టు అంటగట్టి పోయినాడు." వా.

2. ఆరోపించు.

"ఎవడో చేసినతప్పు నా కంట గట్టాడు." వా.

**అంటగట్టుకొని**

వెంటబెట్టుకొని, కలిసి యుండి.

"రాకుమారుని నంటం గట్టుకొని శంఖలిఖితుల కట్టెదురం దెచ్చి."

జైమి. 4.125.

"వాడు ఎక్కడికి వెళ్లినా భార్యను అంటగట్టుకొని పోతుంటాడు." వా.

"వాళ్లిద్దరూ ఎప్పుడూ అంటగట్టుకొని తిరుగుతూ ఉంటారు." వా.

చూ. అంటగట్టు.

**అంట గదుము**

తుదివరకూ తఱముకొనిపోవు.

"ఎడఁబాయనికి బల్విడి నంట గదుముచు, నట్టిట్టు వడిఁ ద్రోపులాడు నవియు." కళా. 8.81.

**అంటగ నేయు**

నాటునట్లు వేయు.

"కుశు నురం బానక పర్వశరాహతిచే నంటఁగ నేసి." జైమి. 6.185.

**అంటగు**

ముట్టగు.

"కోడలు అంటయింది. మాటాడుతూ కూర్చుంటే ఎట్లా అమ్మా!" వా.

**అంట దఱుము**

దొరికేవరకూ తఱుము.

"అగ్ని నాలుక లేదు నంటఁ దఱిమి."

కాశీ. 3.31.

**అంట పొడుచు**

బాగా నాటునట్లు పొడుచు.

**అంట బలియు**

బాగా బలియు, రెండూ కలిసిపోవునట్లు అనుట.

"అంట బలిసినతొడలు."

గౌర. హరిశ్చం. పం. 1088.

**అంటముట్టరాని అగ్రహారము**
మరీ సున్నిత మైనమనిషి-
ఏమన్నా ఓర్చుకో లేనివాడు
అనుపట్ల ఉపయోగిస్తారు.

**అంటరానివాడు**
అస్పృశ్యుడు.
లక్షణయా సంబంధ ముంచు
కొనరానివా డని అర్థ మయి
నది.
"వాళ్లందరూ కలిసి న న్నంటరాని
వాణ్ణిగా చూస్తున్నారు." వా.

**అంటలుగట్టు**
అతుకుకొనిపోవు, గుంపు చేరు.
"వాడు చాలానాళ్లు జబ్బుపడ్డాడు.
వెంట్రుక లన్నీ అంటలు గట్టుకొని
పోయినవి."
"జనం అంటలు గట్టుకొని ఆతిరునాళ్లను
చూస్తున్నారు." వా.

**అంటించు**
ముట్టించు, కొండెములు చెప్పు.
"సాయంత్రం అయింది. దీపం అంటిం
చు. పొయ్యి అంటించు."
"ఇక్కడ ఒకమాట అనీ అనక ముందే
వాడు పక్కింటికి వెళ్లి అంటించి
ఉంటాడు. అందుకే వాడంటే భయం
నాకు." వా.

**అంటి కుంచి ఆడుప్రాయము**
చిన్నతనము.
ఆడుకొనువయసు అనుట.
"అంటి కుంచి యాడునట్టిప్రాయ మెు
కింత, నడచునంతలోన నాదుసతులఁ,
బుణ్యశీలయుతలఁ బోకార్చుకొన్నట్టి,
నాకుఁ బుత్త్రి లనుట నగవు గాదె!"
కళా. 6.75.
చూ. అంటకుండి ఆడు ప్రాయము.

**అంటితే మసి అవుతుంది**
కల్పించుకొంటే ఏమి వస్తుం
దో అని దూరదూరంగా ఉండే
వారివిషయంలో అనేమాట.
వంటయింటిలో పుట్టినపలుకు
బడి కావచ్చును.
"వాడు అంటితే మసి అవుతుంది
అన్నట్లు ప్రవర్తిస్తుంటాడు." వా.

**అంటి బాస చేయు**
ఒట్టు పెట్టుకొను.
"అంటు పడ లేదటంచు మి మ్మంటి
యిపుడు, బాస లెల్లను జేసెద భాను
రాంగి." రాధి. 4.10.

**అంటి ముట్టక**
తనకు సంబంధము లేనట్లు.
"వాడు ఈవిషయంలో అంటి ముట్టక
తిరుగుతున్నాడు." వా.

**అంటి ముట్టరాని అగ్రహారము**
సున్నిత మైనది.
అగ్రహారాల్లో పూర్వం బ్రా
హ్మలే ఉండేవారు. కాబట్టి
అది చాలా ఆచారవంత మై
నది అనుటపై యేర్పడిన
పలుకుబడి. ఏమి అన్నా
నొచ్చుకొనేవారి విషయంలో
ఇప్పుడు ఎక్కువగా ఉపయో
గిస్తారు.

"ఇంత అంటిముట్టరాని అగ్రహార మైతే నలుగుర్లో తిరగడ మెందుకురా? నలుగురితో కలిశాక ఎవర్లో ఒకరు ఏదో ఒకటి అననే అంటారు." వా.

**అంటి ముట్టేవారు**

కులస్థులు.

"అంటిముట్టేవాళ్లు లేనిఊళ్లో ఉండడం కష్టం." వా.

**అంటుకాడు**

స్నేహితుడు, ప్రియుడు.

"అటువలె నంటుకాఁడు చనినంత." శశాం. 4.28.

**అంటుకుంటే వదలడు**

వట్టి కబుర్లపోతును చూచి అనేమాట.

"అదుగో వా డొస్తున్నాడు. అంటుకుంటే వదలడు. త్వరగా వెళదాం పద." వా.

**అంటుకుండ**

వంట చేసి కడుగనికుండ.

**అంటుకొనిపోవు**

కలుచుకొనిపోవు, తగులుకొను.

"కాగితాలు అంటుకొనిపోయినవి" "వాడు దాన్ని అంటుకొని పోయినాడు." వా.

**అంటునూనె**

తలంటు నూనె.

**అంటుపట్టు**

అశౌచము వచ్చు.

తనవాళ్లు చనిపోయినప్పుడో, ప్రసవించినప్పుడో వచ్చే మైలను అశౌచం, అంటు అని అంటారు.— జాతాశౌచం, మృతాశౌచం—అని అది ద్వివిధం. తద్ద్వారా వచ్చిన పలుకుబడి.

"ఈ నెలలో సత్యనారాయణవ్రతం చేసుకుందా మనుకుంటూంటే యింతలో మా బావగారు చనిపోయి మాకు అంటు పట్టింది." వా.

**అంటుపడు**

ముట్టగు.

చూ. అంటువడు.

**అంటుపోగులు**

చెవులకు అంటుకొనునట్లుగా చేసినపోగులు.

**అంటుమోవ తెగు**

పూర్తిగా తెగు.

"కలనూ లెల్లను నంటుమోవఁ దెగి రాఁగాఁ గొంతసే పుండి." ఆము. 4.3.

**అంటుఱాయి**

సూదంటురాయి, అయస్కాంతము.

"ఇను మంటుఱాతికి నెగసినభంగి." భాగ. 7 స్కం.

**అంటువడు**

ముట్టగు.

"మా ఆవిడ అంటుపడ్డది. ఇంక నేనే చేయి కాల్చుకోవాలి." వా.

**అంటు వాయకుండు**

విడువక తిరుగు.

"గమనించుతటి మందగమనశ్శ్రేంగా రాప్తి, నంటు వాయక వెంట వెంట నెయిదు." శుక. 1. ఆ. 391 ప.

చూ. అంటి యుండు, వెన్నంటి యుండు.

అంటూసొంటూ

సంబంధ మున్నవారు, మిగిలిన మెతుకులు ఇత్యాదులు.

జం.

"వాడికి అంటూ సొంటూ లేదు. బోలెడు ఆస్తి."

"కుండలో అంటూ సొంటూ ఊడ్చి వాడికే పెట్టేశాను. మరీ పొయ్యి ముట్టిస్తే తప్ప గత్యంతరం లేదు." వా.

అంటేసుకొను - (అంటవేసుకొను)

ముట్టుకొను. పిల్లల ఆటల ద్వారా వచ్చినపలుకుబడి.

"నేను పరిగత్తితే నన్నంటేసుకొనే వాడు ఈ భూప్రపంచకంలో లేడు."

వా.

అంట్లబోకి

ఒక తిట్టు.

వంటయింటి ద్వారా వచ్చిన పలుకుబడి. బోకి—పాత్ర.

అంటయినపాత్రను మనవాళ్లు మైలగా చూస్తారు. మైల వెధవ అని అర్థం.

"వాడు ఒట్టి అంట్లబోకి." వా.

అంట్లవెధవ

ఒక తిట్టు.

చూ. అంట్లబోకి.

అంట్లు తోమేవాడు

అడంగులవాడు. ఒక తిట్టు.

అంట్లు నాకేవాడు

ఒక తిట్టు.

లక్షణయా ఎంగిలిమెతుకులు తినేవాడు అన్న అర్థంలో వచ్చినపలుకుబడి.

"వా డేమి పెద్దమనిషి. ఒట్టి అంట్లు నాకేవాడు." వా.

అంట్లు పొడుచు

తల కంటుకొని ఉన్న పేలను క్రుక్కు—

"అంట్లఁ బొడిచి."

పాండు. 3.30.

అంట్లొత్తు

అంట్లు త్రొక్కు—.

"అం ట్లొత్తుపదనున నం ట్లొత్తు..."

కళా. 4.79.

అండగొట్టు

వెనుదీయు.

"అమ్మహాత్ముమీఁది చాయం జన వెఱచి యండగొట్టుచు నిలుచుటయు."

పరమ. 1.175.

అండగొను

ఆశ్రయించు.

"నీ వండగొనియెదు నిలిచి యిచ్చోట."

మార్క. 1.182.

"ఈతని...అండగొని తప్పదు చావున కంచు నున్నవాఁడు."

భార. ఉద్యో. 4.208.

అండదండ

సహాయము.

"ఒండె వాదింపు మొండె నే నోడితి నను మొండె, యను సద్గురుండె మా కండదండ."

శంకరవిజయ కథా. 4.10.

**అండజశయ్య**

హంసతూలికాతల్పము.

భార. సభా.

**అండబ్రతుకు**

ఎవరిపైనో ఆధారపడిన బ్రతుకు.

"వానిది ఒట్టి అండబ్రతుకు. సొంతంగా జీవించ లేడు." వా.

**అండబాయు**

ఎడబాయు.

"ఆరామయండఁ బాయక... యారాజవరుండు నిజపురాంతఃపురముం జేరి..." శుక. 1 ఆ. 489 ప.

**అండా ఆపూ**

సహాయము.

"వాడికి అండా ఆపూ లేదు." వా.

**అంతకంతకు**

1. క్రమక్రమంగా.

"అంతకంతకూ వాడి దౌర్జన్యం ఎక్కువై పోతూ ఉంది." వా.

చూ. అంతంతకు.

2. రోజురోజుకూ

"అంతకంతకూ వాడు మితిమీఱి పోతున్నాడు." వా.

**అంత కింతయింది ఇంత కెంతో?**

ఇంకా యెన్నికష్టాలు రానున్నవో? ఇం కేమేమి కానున్నదో అనే భావచ్ఛాయలలో ఉపయోగించే పలుకుబడి.

**అంతకూ ఇంతకూ**

ప్రతి చిన్నదానికీ.

"అంతకూ యింతకూ వాడు నొచ్చుకుంటూ ఉంటాడు."

"అంతకూ యింతకూ ఆవిడ మాయింటికి పరుగెత్తుకొంటూ వస్తుంది."

**అంతకు కడ కనుచు**

చంపు.

"మహాస్త్రప్రకరం, బంతకుకడ కనిచెం బరి, శ్రాంతం బగు మద్రనాథు రథికచయంబున్."

భార. శల్య. 1.300.

**అంత చేసి ఇంత తెచ్చుకొను**

అంత చేసి యింత ఫలితం తెచ్చుకొన్నావు—అను పట్ల ఉపయోగించేపలుకుబడి.

"ఇంత దెచ్చికొంటి వంత సేసి."

భార. భీష్మ. 1.67.

**అంతంత**

దూరదూరములోనే, క్రమముగా.

"నెచ్చెలిపిండు నంతంత నిలువఁ బనిచి."

భార. విరా. 1.246.

"ఇంతయును నంత నంతంత నెఱిఁగి పొదరు, నిబ్బరపు గబ్బి గుబ్బల యుబ్బు కతన. వసు. 2.85.

**అంతంతకు**

క్రమంగా.

"అంతంతకూ ఈ వ్యవహారం ముదిరి పోతూ ఉంది." వా.

**అంత పైపై పడి ఉన్నదా?**

అంత సులభమా? కా దనుట.

"మహాకవితావివేచనా, భ్యాస మనంగ నంతఁ బయిపైఁ బడి యున్నదె?"

నానా. 25.

**అంతమనిషి**

అంత యోగ్యత కలవాడు.

అంతపని చేయగలవాడు.

"అంతమనిషి యిలా చేస్తా డని నే ననుకోలేదు."

"వా డంతమని షయితే యిం కేముమ్మా! నేను హాయిగా ఉందును."

"వాడు అంతమనిషి ఎప్పు డయ్యాడు? నాకే ఎసరు పెట్టాడూ?"

"వా డంతమనిషని నే ననుకో లేదు." వా.

**అంత మాట**

అనరాని మాట.

"వాడు అంతమాట అన్నా డా? అంత మా టన్నాడూ వాడు?" వా.

**అంతరపల్లటీ**

పైన గిరికీలు కొట్టేపావురము.

దానిద్వారా గిరికీలు కొట్టు టకు కూడా వాచక మయినది.

"వాడు అంతరపల్లటీ కొడుతున్నాడు." వా.

**అంతర మెఱుగనివాడు**

తారతమ్యజ్ఞానం లేనివాడు.

"వానికి పెద్దాపిన్నా అంతరం తెలి యదు."

"అంతర మెరుగనివాడు. వానిజోలికి ఎవరు పోతారు?" వా.

**అంతరువు**

యోగ్యత, అంతరము.

"నీ అంతరు వేమి? నా అంతరు వేమి? నీతో నాకు వాద మేమిటి?" వా.

**అంతర్ధానంబు సేయు**

అదృశ్య మగు.

కాశీ. 6.138.

**అంతర్మదాలు**

అయిదు అంతర్మదాలు. సం యోగాదులు.

"సంయోగాది పంచ విధాంతర్మదంబులు." శుమా. 11.137.

**అంతల పొంతలవారు**

చుట్టాలు.

"అంతలపొంతలవా రున్న ఊళ్లో అంతో యింతో ఉంటే గాని మర్యాదగా ఉండదు." వా.

**అంతవట్టు**

యావత్తు.

ఒట్టు మొత్త మని, లెక్క లలో వెరసి అనే అర్థంలో ఉపయోగిస్తారు.

**అంతవట్టువారు**

అంతంత గొప్పవారు.

"అంతవట్టువారును...గూలిరి." భార. శల్య. 2.135

**అంతవాడు**

అంత యోగ్యత కలవాడు.

"అంతవాణ్ణి బజారులో నిలదీసి అది అడిగిన మాటలు అబ్బ! వినలేము." వా.

**అంతవాడవే**

ఔను, నీవు ఆపని చేయగల వాడవే. ఎవ డైనా తన్ను గూర్చి చెప్పుకొంటున్నప్పుడు ఔ నంటూ ఎదుటివాడు ఆడు మాటలు.

"అనుటయు నంతవాఁడ వె కదా యని మిక్కిలి గారవించి," పారి. 2.76.

"ఔను. నీ వంతవాడవే నాయనా." వా.

అంతశయ్య

మరణశయ్య.

"వాడు మంచం పట్టాడు. అది యింక అంతశయ్యే."

"వాడు అంతశయ్యమీద ఉండి చెప్పిన మాటలను మనం అంతలోనే మరిచిపోవడం న్యాయం కాదు." వా.

అంతశ్శీతం

మనస్పర్థ; అలుకోలులు.

వైద్యశాస్త్రరీత్యా వచ్చిన పలుకుబడి. లోపల శీతం చేరకుని తిన్నగా అది శరీరాన్ని లొంగదీసే జబ్బుగా మారుతుంది.

"వాళ్లల్లో ఈమధ్య అంతశ్శీతం బయలుదేరింది." వా.

అంతసేపు

చాలసేపు.

"అక్కడికి వెళ్లి అంతసేపు కూర్చుంటే ఇక్కడిపని అంతా ఎవరు చేస్తారనుకొన్నావు."

"ఎక్కడికి వెళ్లినా అంతసేపు చేస్తూ ఉంటే నీకు పని చెప్పడానికే భయంగా ఉంది." వా.

అంత సేయు

అనుకొనుటకు వీలు కానంత పని చేయు.

"మొన్న మేరుగిరిపాటి నిశాచరి నంత సేసె, నేఁ దేపున గట్టు బండి నిడ యుందఱుఁ జూడఁగ నింత సేసె."

ని. పు. 7.83.

"అంతపని చేశాడా వాడు? వాడు అంత పని చేస్తాడని నే ననుకోలేదు." వా.

అంతు కనుక్కొను

తుది మొదలు చూచు, గుట్టూ మట్టూ తెలిసికొను.

"ఈ వ్యవహారంలో అంతు కనుక్కునే దాకా నేను వదల దలచుకోలేదు."

"వా డింతకు వచ్చాడూ? వాడి అంతు ఏదో కనుక్కొంటాను." వా.

అంతుచిక్కు

చూ. అంతుపట్టు.

అంతుదొరకు

చూ. అంతుపట్టు.

అంతుపట్టు

లోతుపాతులు తెలియు.

నా. మా. 106.

అంతు పంతు

మొదలు కొన. జం.

"వీడి దుర్మార్గానికి అంతూ పంతూ లేకుండా పోయింది." వా.

అంతు పొంతు లేదు

అనంతము.

"అంతును బొంతునుం గలదె యమ్మరో." నానా. 207.

అంతు పంతు లేక

అడ్డీ ఆగీ లేక.

"అంత కంత కది యంతును బంతును లేక వర్ధిల్లె." పాణి. 1.104.

అంతూ యింతూ

మొత్తంమీద.

"అంతూ యింతూ వాడు రాడనేగా నీ వనేది?" వా.

## అంతా యింతా

ఏ కొంచెమో అనుట.

"అన్నియును జూచుచుండెద నంతా యింతా." నిరంకు. 2.55.

"వారికి అంతో యింతో ఆసి ఉంది."

"వాడు అంతో యింతో చదువు కున్నాడు." వా.

## అంతో యింతో

ఏ కొంతో.

"అంతో యింతయు పండుభూమి గలదోళి?" గీర. 41.

"వాడు అంతో యింతో చదువుకొన్న వాడు. ఆస్తిపరుడు. ఈ సంబంధానికి ఏమి లోటు వచ్చింది?" వా.

## అంతై యింతై

పెద్ద దవుతూ, పెరుగుతూ.

"తా నంత యై యింత యై యొాలి నొయ్యన బాల్యకేళి వదలె." కళా. 6.204.

## అందచందములు

రూపరేఖలు. జం.

"వరిష్ఠుఁడై శైశవంపు ముద్దులు గుల్కు తనయుని యందచందములు చూచి." అనిరు. 5.91.

## అందదుకులైన

చాలీచాలని.

లక్షణయా అందీ అందనట్టు అని కూడా మారి 'ఈ వ్యవహారం ఎన్నాళ్లైనా అందదుకులుగానే ఉంది. ఏది తేలదు' అని వాడుకలో వినబడుతుంది.

## అందని పొందని

అతకని.

"వాడి వన్నీ అందని పొందని మాటలు." వా.

## అందని మ్రానిపండు

అలభ్యవస్తువు.

"అతని బింబాధరం బందని మ్రానిపం, డని విచారించె మదాలసాఖ్య." కవిరా. 3 ఆ.

"ఆపిల్లనే పెళ్లి చేసుకోవా లని ఊరేగుతున్నావు. ఆవిడ అందనిమానిపండు అని తెలుసుకో." వా.

## అందని మ్రాని పండ్ల కఱ్ఱులు చాచు

దొరకనివానికై ఆశించు.

"కందిన యన్యకాంతయెడఁ గామము దక్కుము నన్నుఁ జేరరా, దందని మ్రాని పండునకు నఱ్ఱులు సాఁతురె..." భాస్క. సుంద. 192.

"అకట! యందనిపంటికి నఱ్ఱు సాఁచెఁ జిత్త మిటమీఁద నే నేమి సేయుదాన?" విక్ర. 1.129.

## అందని మ్రాని పండ్ల కాస వహించు

"అందని మ్రానిపండులకు నాస వహించినరీతి దివ్యసం, క్రందనపట్టణద్వారద గామినిపొం దెదఁ గోరి వేడ్కమై, నిందుల కేగుదెంచుట కొకించుక నెయ్యమెలర్ప..." రసిక. 3.14.

చూ. అందనిమ్రానిపండ్ల కఱ్ఱులు సాచు.

అందంబు గూడుకొను

ఇష్టము న్నా లేకపోయినా ఇష్ట మున్నట్టు నటించు.

"మీఁదఁ గార్యంబులు గలమాకు దీనిఁ గా దనం బనిలే దని యందంబు గూడు కొని ఛందోనువర్తనపరుం డై."
అను. 6.36.

శ. ర. లో 'కలిసికొను' అను అర్థ మిచ్చారు. అది కుదురుట లేదు.

అందముల దీవి

అందాల రాణి.

ఇక్కడ దీవి అంటే స్థానము.

"తావి తేనియబావి యందముల దీవి."
హంస. 2.20.

అందలమం దుంచినకుక్క

యోగ్యస్థానమందున్న నీచుడు.
గువ్వలచెన్న. 90.

అందలంబులు

బాల్యక్రీడావిశేషము.

"అందలంబులు మఱి కుందికాళ్ళు."
వి. పు. 7.202.

వాడి భుజంమీాద వీడి రెండు చేతులూ, వీడి భుజంమీాద వాడి రెండుచేతులూ పెట్టి నడుమ ఒకపిల్లవాణ్ణి ఎక్కించు కొని 'దేవుడమ్మ దేవుడూ' అని ఊరేగిస్తూ ఆడేఆట.

అంద తొకటి యగు

ఏక మగు.

"అసుర క్తి మీా రంద తొక్క టై యాద రించరాదా?
షోడా. పు. 34.

అంది పొందని

అతకని.
రుద్రమ. 56 పు.

అందిక పొందిక

ఈడుజోడు వంటిది. జం.

"దానికీ దీనికీ అందికా పొందికా లేదు."
వా.

అందిన చేనిపంట

అందుబాటులోనిది.

"ఎందు చూచిన శ్రీ వెంకటేశుఁ డున్నాఁ డనియెడి అందినచేనిపంట లనుభవించు."
తాళ్ల. సం. 9.70.

అంది పుచ్చుకొను

గ్రహించు, దొరకి పుచ్చు కొను, సరిగ్గా అతికినట్లు.

"వాడు కాళ్లు అంది పుచ్చుకొన్నాడు."

"సిగ అంది పుచ్చుకొన్నాడు."

"వాడు అన్నదాని కల్లా వీడు అంది పుచ్చుకొన్నట్టుగా సమాధాన మిస్తూ వచ్చాడు."
వా.

అంది పొందినట్టివారు

చుట్టాలు.

"ఈ ఊళ్లో అందిపొందినవారు ఎవరూ లేరు. అందుకని యేకార్య మయినా పొరుగూరుకు పోవలసి వస్తుంది." వా.

అందిన సిగ అందకున్న కాళ్లు

సమయానుకూలంగా ప్రవర్తిం చేవా డనుట.

"...ఏ మనవచ్చు నీగుణం, బవు నవు నందినఁ జిగయు నందక యున్నను గాళ్లు పట్టుకొం, దువు హారిణాంక..."
విజ, 3.51.

అందుకొను

పరిగ్రహించు.

"ఆ పాయసంబుఁ దా నందుకొనియె."

రంగ. రా. బాల. పు. 19. పంక్తి 21.

అందుకొన్నట్టు

దగ్గరగా.

"గుంతకల్లునుంచి మన్మాడుమీద పోతే కాశీ అందుకొన్నట్టు ఉంటుంది." వా.

అందుబడి యగు

అందుబాటులోనికి వచ్చు.

ఇది నేను అందుబాటు అనే రూపంలోనే కానవస్తుంది.

"సమస్తజీవులకు నందుబడి యైన దేవభూజ మయ్యె." భోజ. 1.79.

అందుల కేమి ?

దాని కేమి ?

పరవా లే దనుట.

"నా విని యందుల కేమి స్వభావగతింబాడు మనిన భామిని గానప్రావీణ్యముఁ జూపెను గడు." కళా. 7.199.

అందె వేసినచేయి

సమర్థుడు.

ఏదైనా పనిలో – విద్యలో సమర్థుడైనవానిచేతికి అందె వేసేవారు. అందుపై యేర్పడినది.

అంపకము గాంచు

సెలవు తీసికొను.

"అంపకము గాంచెఁ దీర్థయాత్రాభిరతిని." విజయ. 2.41.

అంపకము చేయు

పంపించు.

"పూర్వమున బ్రహ్మసభకు నేఁ బోయి కొంత, కాల మందుండి యజుఁ డంపకంబు సేయ. హంస. 4 ఆ. 7 ప.

చూ. అంపకాలు పెట్టు.

అంపకాలు

అత్తవారింటికి కొత్తకోడలిని పంపునప్పుడు అప్పగించుటలు. లక్షణయా అప్పగించు కాను కలు.

అలాగే పెండ్లికి వచ్చినచుట్టాలను సాగనంపునప్పుడు చేసే మర్యాదలకు కూడా వాచక మయింది.

"అంపకాలవేళ అలా యేడవకూడదు తల్లీ !" వా.

"పెళ్లి అంతా అయిపోయినది. ఇంక అంపకాలే తరువాయి." వా.

అంపకోల

అమ్ము.

అర్కనందను సెలకట్టె యంపకోల. క్రీడా. పు. 71.

అంపతప్పు

దెబ్బ తప్పించుకొను నేర్పు.

"కానకు నంపతప్పెఱుఁగుగబ్బిమెకంబులు." కకు. 4.57.

అంపబంపు

అంపించు, పంపించు, పంపు.

"అజ్జముప్రోలి కతని నంపఁబంపినవాఁడ నంపించినాఁడ."

పండితా. ద్వితీ. మహి. పుట. 17.

**అంపాచారంపు వానలు**

జడివానలు.

"అంపాచారంపు వానలప్పుడు కురిసె."
వి. పు. 7.67.

**అంపించు**

పంపు.

చూ. అంపబంపు.

**అంపుదోళ్ల వెధవ**

ఒకతిట్టు. అసమర్థుడు.

**అంబకళము**

అంబలి.

ఈ అంబకళమే అంబలి అయి యుండవచ్చును.

"అతని నగరఁ గాచునంబకళంబు ప్రతి వచ్చునే." బస. 5.152 పు.

**అంబటిప్రొద్దు**

దాదాపుతొమ్మిదిగంటలవేళ, ఉదయము.

అంబళ్లు తాగేప్రొద్దు అనుటపై ఏర్పడినది. రాయల సీమలో రైతులు, కార్మికులు ఇత్యాదులు ఉపయోగించే పలుకుబడి.

"అంబళ్లప్రొద్దయింది. త్వరగా చేలోకి వెళ్లాలి." వా.

"అంబటిప్రొద్దు కాఁగసె" పె. పా.

**అంబ పలక లేదు**

డబ్బు చిక్కలేదు, పని కాలేదు అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

**అంబళ్ళపొద్దు**

చూ. అంబటిప్రొద్దు.

**అంబస్తు**

లోకజ్ఞానము లేనివాడు.

ఆం. భా.

**అంబాజీపేట ఆముదం**

పట్టుకొంటే వదలని.

ఇది స్థానికంగా యేర్పడిన పలుకుబడి.

**అంబూకృతి చేయు**

తూథూ అని మూయు, ఉమ్మి వేయు.

"కం పగుచూడ్కిఁ జూచి యం, బూకృత మాచరించుటకు బుద్ధి దలంక." పాండు. 3.95.

**అంబేద**

దుర్బలుడు, అసమర్థుడు.

"వేదులు బల్కిన న న్నదర వేయఁగఁ జూచెదు ఇందు నంత నంబేదలు లేరు." పద్మ. 3.

"వాడు ఒట్టి అంబేద. వాణ్ణి పంపించి ఏం లాభం?" వా.

**అంబోదరగిడ్డడు**

శాన కడుపువాడు.

**అంశచక్రము**

జాతకంలో రాశిచక్రం కాక అంశచక్రం ఒకటి ఉంటుంది. ఏ ఏ నవాంశలో యే గ్రహా లున్నదీ, లగ్నం ఏ నవాంశ అయినదీ తెలిపేచక్రం.

## అంశపురుషుడు

దశావంతుడు.

"వాడు చాలా అంశపురుషుడు. అడివి లోకి వెళ్ళినా వాడి కన్నీ అమరు తాయి." వా.

చూ. అంశ మంచిది.

## అంశ మంచిది

దశావంతు డనుట.

"వాడి అంశ చాలా మంచిది. చేసినా చేయక పోయినా దర్జాగా నడుస్తూ ఉంది." వా.

## అంశలో....

దశలో...

జ్యోతిశ్శాస్త్రరీత్యా వచ్చిన పలుకుబడి. ఏ లగ్నంలోని యే అంశలో పుట్టాడు అన్న దానిపై ఫలితాలు చెప్పడం జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయం.

"వా డిప్పుడు మంచిఅంశలో ఉన్నాడు. మనలాంటివాళ్లను పలకరిస్తాడా ?"

"వాడు మంచి అంశలో పుట్టాడు. ఏం వచ్చినా వాణ్ణి ఏం చెయ్యదు." వా.

చూ. అంశ మంచిది.

## అకట(టా)వికటం అగు

పరిహాసపాత్రమగు అస్తవ్యస్తమగు.

"వాడు ఏది మాట్లాడినా అకటవికటమే."

"ఆ పని అంతా అకటావికటం అయిపోయింది." వా.

## అకటావికటపు మనిషి

వక్రంగా మాట్లాడేవాడు.

## అకటావికటపు రాజు అస్తవ్యస్తపు ప్రధాని అన్నట్లు

ఎగుడుదిగుడుగా పాడుపాడుగా ఉన్న దనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

జానపద కథలలోనుండి వచ్చిన పలుకుబడి. ఆ పేరు గలరాజు, ప్రధాని ఒక ఊళ్లో ఉంటారు. వాళ్లు రాత్రి అంతా పని చేయాలని పగ లంతా నిద్ర పోవా లని శాసిస్తారు.

"వాళ్లింటి వ్యవహారం అంతా అకటావికటపు రాజు అస్తవ్యస్తపుప్రధాని అన్నట్లుగా ఉంది." వా.

## అకస్మాత్తుగా

ఉన్నట్లుండి.

"వాడు అకస్మాత్తుగా అక్కడికి వచ్చాడు." వా.

## అకాండతాండవం

అసందర్భప్రసంగం; అనవసర ఆవేశం.

"వాడిది వట్టి అకాండతాండవం."

"అనే దేదో వా డియెదుట అనక యింట్లోకి వచ్చి అకాండతాండవం చేస్తా వేమిటి ?" వా.

## అకారతుగా

అకారణంగా.

## అకాలకూష్మాండం

నిరర్థకజన్మ మనుట, నిష్ప్రయోజకు డనుట.

"వాడు ఒట్టి అకాలకూష్మాండం" వా.

**అకాలభోజనం**

వేళ మీఱినభోజనము.

"ఎండలో రావడం, అకాలభోజనం, మహా ఆయాసంగా ఉంది. కాస్సేపు నడుం వాలిస్తే గాని కుదరదు." వా.

**అక్కతోడు**

'అక్కతోడు సుమీ నాకు ముక్క రైనఁ, జేసి తెప్పించు మని."

నిరంకు 2.115.

**అక్కడక్కడ**

కొన్నిచోట్ల.

"అక్కడక్కడా అంటుండగా విన్నాను." వా.

"అక్కడక్కడా మచ్చ లున్న ట్లున్నాయి." వా.

**అక్కడ భోంచేసి ఇక్కడ చేయి కడుగుకొనవలెను**

తక్షణమే రమ్మనుట.

"అమ్మకు చాలా జబ్బుగా ఉంది కాబట్టి వెంటనే రావలెను. అతి జరూరు. అక్కడ భోంచేసి యిక్కడ చెయ్యి కడుగుకొనవలెను." వా.

"వాడు దాన్ని పట్టాడు. ఎప్పుడూ అక్కడే. తనింట్లో తిని దానింట్లో వచ్చి చెయ్యి కడుక్కుంటాడు." వా.

**అక్కడికి అక్కడికే సరిపోవు**

ముటీముటాలుగా సరిపోవు.

"అంతపంట వచ్చినా అక్కడికక్కడికే సరిపోవడమే కష్టంగా ఉంది. ఆ కాస్తా పోతే దేవుడే దిక్కు." వా.

**అక్కన్నమాదన్నలు**

ఎప్పుడూ కలిసి తిరుగువారు.

"వాళ్లిద్దరూ అక్కన్నమాదన్నలు."

వా.

**అక్కరగాడు**

తనపని తీర్చుకొనువాడు.

"అక్కఱకాడ వై అందంద ప్రేరేచి."

క్షేత్రయ్య.

**అక్కఱ గాచు**

సమయమున కాదుకొను

"మునిమాపు బలు గంబమునఁ బుట్టి బంటున, క్కఱఁ గాచినట్టి సింగంబ వీవ." పారి. 1.49.

**అక్కరపడు**

అవసర మేర్పడు.

"అక్కరపడి నీదగ్గరకు వచ్చాను. తప్పక సహాయం చేయాలి."

"పదిరూపాయలు అక్కరపడింది." వా.

**అక్కఱకు రాని**

పనికి రాని, పనికి మాలిన.

రాయలసీమలో ఇది చాలా ప్రచురంగావినబడే పలుకుబడి.

"ఈ అక్కఱకురాని మాటలతో ఏం పని." వా.

"అక్కఱకు రాని చుట్టము." సుమ.

"వాడు వట్టి అక్కఱకురాని ముండా కొడుకు." వా.

**అక్కఱగండడు**

అక్కఱ గడుపుకొనువాడు, స్వార్థపరు డనుట.

ఇతరుల అక్కఱను స్వార్థము నకై ఉపయోగించుకొనువాడు.

"అక్కఱగండఁడై యప్పటప్పటికి వెక్కసంబున నూర్లు వేలు నప్పిచ్చి ముట్టఁ జిక్కిన వేళ ముట్టి చేపట్టి రట్టఁడై తిరిగి పత్రంబులు గొనుచు."

గా. హరి. ద్వి. 477-480.

శ. ర. లో శ్రద్ధ గలవాడు అనీ, సూ. ని. వావిళ్లలలో ఆవశ్యకతను కనిపెట్టువాడు, అవసరమును గ్రహించువాడు అనీ ఇచ్చిన అర్థాలు సరికావు.

**అక్కఱచీటి**

జాబు.

"కొనగోర మొగలిరేకునఁ గమ్మకస్తూరి వలపు నక్కఱచీటి వ్రాయవమ్మ." రాజగో. 2-44.

**అక్కఱ తీరేవఱకే**

స్వార్థం తీరేదాకే

"వాడిస్నేహమంతా అక్కఱతీరేవరకే. ఆతరవాత మొహం చూపిస్తే ఒట్టు." వా.

**అక్కఱ దీర్చు**

సమయమునకు పనికి వచ్చు.

"ఆపద కైనబంధుజన మక్కఱ దీర్చు ధనంబు." నిరంకు. 4.99

"నా యక్కఱ దీర్పవచ్చిన లతాంత కృపాణివి నీవె నీకు నేఁ, దక్కితి నంచుఁ బ్రేమ నిగుడన్..." శుక. 3 ఆ. 532 ప.

**అక్కఱపడి**

పనిపడి.

"అక్కఱపడి నీవు వేఁడుటిది కర్జమె." భార. ఆర. 7. ఆ.

"పదిరూపాయలు అక్కఱపడి నీ దగ్గరకు వచ్చాను." వా.

**అక్కఱ లేదు**

చాలు, వద్దు, కాబట్టదు.

"అన్నం అక్కఱ లేదు. కాస్త మజ్జిగ పోయండి చాలు." వా.

"నాకు కాఫీ అక్కఱ లేదండి. కాసిని మంచినీళ్లు ఇవ్వండి." వా.

"వాడికి పనీపాటా అక్కఱ లేదు. ఏదో నవల చిక్కితే చాలు. చదువుతూ కూర్చుంటాడు." వా.

**అక్కలవాడ**

పూటకూళ్లమ్మ లుండుచోటు.

చూ. అక్కవాడ.

**అక్కవాడ**

పూటకూళ్లమ్మలు నివసించే చోటు.

చూ. అక్కలవాడ.

"అక్కవాడల నరకూళ్లు మెక్కి." ఆము. 6.67.

**అక్కసు పట్టలేక**

కోపము, కసి తీరక.

రుద్రమ 15 పు.

**అక్కా ఆలీ అను**

బూతులు తిట్టు.

"వాడి దగ్గిరికి ఈవిషయమై పోతివా వాడు అక్కాఆలీ అని మొదలు పెడతాడు." వా.

**అక్కిలజేయు**

కుంచించు.

"తొ మ్మక్కిలఁజేసి చేసి." క్రీడా. పు. 15.

**అక్కిలివడు**

చెడు, కలతపడు.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 178.

**అక్కుగొఱ్ఱు**

బాధ కలిగించునది, పక్కలోని బల్లెము.

"అవనీశులకు నెల్ల నక్కుగొఱ్ఱగుచు." బసవ.

**అక్కున నద్దు**

కౌగిలించుకొను.

అక్కున జేర్చు-అక్కున నొత్తు కొను ఇత్యాదులు.

**అక్కుపక్షి**

1. తిట్టు.

"అగ్గి రాములు కొరకచ్చు అక్కుపక్షు లింగిలాయలు." ప్రభా. నాట. 5.

2. దుర్బలుడు, ఎముకలపోగు అనుట.

తిరుపతి. ప్రభా. నాట. 5 పుట.

"వాడు వట్టి అక్కుపక్షి." వా.

**అక్కుమాలిన భంగి**

దిక్కు లేనట్లు, ఇక్కడ ఆప్తు డెవరూ లేనట్లు.

గుండె అన్న అర్థం 'అక్కు'కు చెప్పి వావిళ్లాదులు ఈ ప్రయోగ మిచ్చినవి. ఆ అర్థం సరిపడదు. గుండెమాలుట ఏమిటి? అక్కుపక్షిలో ఉన్న అక్కు, ఱొమ్ము గుండె-కాక మఱొకటని తెలుస్తూనే ఉంది.

"అక్కుమాలినభంగి నగ్రహారంబు చక్కన మీ కెట్లు చనఁ జేరవచ్చు." బస. 7 ఆ. 185 పుట.

**అక్కెత్తికొనక**

నడు మెత్తక, ఎడ తెఱపి లేక.

"నడుం ఎత్తకుండా పనిచేస్తు న్నాడు" అని వాడుకలో ఉంది. నడుముకు బదులిక్కడ అక్కు - ఱొమ్ము.

"ఇట్లందఱు న్నక్కెత్తికొనక చేయు శిశిరోపచారంబులు." కుమా 5.159.

**అక్కెత్తుకొనక**

తదేకదృష్టితో, విడువకుండా, నడుమెత్తక వంటిది. నడుము నకు బదులు ఇక్కడ అక్కు.

"అక్కెత్తుకొనక చేయుశిశిరోపచారంబులు." కు. సం. 5.151.

(పాఠాంతరం పై రూపాంతరం)

**అక్షతయోని**

కన్య.

**అక్షతలుపడు**

చూ. అక్షింతలు పడు.

**అక్షతలు వేయు**

చూ. అక్షింతలు వేయు.

**అక్షతారోపణం**

తలంబ్రాలు పోయుట.

"తొమ్మిదిగంటలకు అక్షతారోపణం. మీరు తప్పకుండా రావాలి." వా.

**అక్షమాల**

జపమాల.

అక్షరక్రమా న్ననుసరించి జపమాల కూర్చేవారు. 'అ' నుండి 'క్ష' వరకూ అక్షర క్రమం కనక వచ్చినపలుకుబడి.

**అక్షయ్యంబుగ**

సమృద్ధిగా.

"అక్షయ్యంబుగ దివ్యమాధుకరభిక్షా న్నంబు వడ్డించె..." హర. 5.45.

**అక్షరం రాదు**

కొంచెం కూడా చదువు రాదు.

"వాడికి అక్షరం రాదు. అయినా వాడి తలబిరుసుతనం చూస్తే నాకు ఆశ్చర్యం వేస్తుంది." వా.

## అక్షరక్రమం తెలీదు

ఏమాత్రం చదువు రాదు.

"వాడికి సరీగా అక్షరక్రమం కూడా తెలీదు." వా.

చూ. వర్ణక్రమం తెలీదు.

## అక్షరచౌరవ

చదువులో ప్రావీణ్యము.

"వాడికి అన్నచౌరవే కాని అక్షరచౌరవ లేదు." వా.

## అక్షరజ్ఞానం

చదువు.

"వాడికి అక్షరజ్ఞానం ఉంది. ఏదో పొట్ట పోసుకో లేక పోతాడా."

"వాడు ఏదో అక్షరజ్ఞానం కలవాడు. ఆస్తి లేకపోతే యేం?" వా.

## అక్షరజ్ఞానశూన్యుడు

నిరక్షరకుక్షి.

"వాడు ఒట్టి అక్షరజ్ఞానశూన్యుడు. వాడితో ఎవరు వేగుతారు?" వా.

## అక్షరక్షరం తప్పు

ప్రతిదీ తప్పే.

"ఆ పుస్తకంలో అక్షరక్షరం తప్పూ." వా.

## అక్షరక్షరం పట్టి చూచు

క్షుణ్ణంగా పరిశీలించు.

"నీ వేదో పండితుడి వని వచ్చాను. ఈ పుస్తకంలో అక్షరక్షరంపట్టిచూచి సవరించి యిచ్చేభారం నీదే." వా.

## అక్షరం మార్చడానికి వీల్లేదు

యథాతథంగా ఉండాలి, ఏమాత్రం మార్చరాదు.

"ఇందులో అక్షరం మార్చడానికి వీల్లేదు."

"ఈ దస్తావేజును ఆయన అక్షరం మార్చడానికి వీల్లేకుండా రాశాడు." వా.

## అక్షరంముక్క రాదు

కొంచెం కూడా రాదు.

"వాడికి వ్యాకరణం ఒక అక్షరం ముక్క రాదు."

"వాడి కీ వ్యవహారంలో ఒక్క అక్షరం ముక్క తెలియదు." వా.

చదువుపై వచ్చిన పలుకుబడి.

## అక్షరలక్షలు

పూర్వం కవిత్వం చెప్తే సంతో షించిన రాజు ఒక్కొక్క అక్ష రానికి లక్షచొప్పున ఇచ్చే వాడు. అందుపై వచ్చిన పలుకుబడి.

"ఈ కావ్యానికి నాదగ్గఱ డబ్బే ఉంటే అక్షరలక్షలు ఇచ్చి ఉందును." వా.

## అక్షరలక్షలు చేయు

అమూల్య మగు. అతిమనోజ్ఞ మగు.

"వాడిపద్యం అక్షరలక్షలు చేస్తుంది."

"అక్షరలక్షలు చేసేమాట అన్నావు." వా.

## అక్షరాభ్యాసం

తొలిసారిగా పిల్లలకు అక్షర ములు నేర్పుట. ఇది ఒక సంస్కారం.

"ఇంపుసొంపులు గ్రుమ్మరింపు మాటల వీణ, పలుకుల కక్షరాభ్యాసమొసఁగు." అని. 2.31.

**అక్షరాలా**

పూర్తిగా.

పత్రాలు వాటిల్లో రూపాయలను అంకెలతో వేసి అక్షరాలా యిన్ని రూపాయలు అని యిక దిద్దుటకు వీలులేకుండా వ్రాశేవారు. అందుపై వచ్చిన పలుకుబడి.

"వాడు చెప్పిందంతా అక్షరాలా నిజం." వా.

**అక్షరాలు**

1. చదువు, వ్రాత.

"వాడికేవో నాలుగు అక్షరాలు వచ్చు.

"వాడి అక్షరాలు ముత్యాలకోవలా ఉంటాయి. నీ అక్షరాలేమో కోడి గీతలు." వా.

2. లిపి.

తెలుగక్షరాలు, అరవ అక్షరాలు. వా.

**అక్షరాలు కూడుకుంటూ**

తడబడుతూ.

"వాడేదో అక్షరాలు కూడుకుంటూ చదవగలడు. అదీ పాండిత్యమేనా?" వా.

**అక్షింతలు పడు**

దూషణకు పాత్రమగు.

"నిన్ను చేరదీస్తే నానెత్తిన నాలుగు అక్షింతలు పడడం తప్పితే జరగబోయేదేముంది?" వా.

**అక్షింతగింజలు పడు**

పెండ్లి అగు.

"ఏదో ఆ పిల్ల నెత్తిన నాలుగు అక్షింత గింజలు పడితే నా బాధ్యత తీరిపోతుంది." వా.

**అక్షింతలు వేయు**

తిట్లు తిట్టు.

"వాడు వచ్చి నాలుగు అక్షింతలు వేసి పోయాడు." వా.

**అక్షిగతు డగు**

కంటబడు. ఒక కంట కనిపెట్ట దగు, అనగా విద్వేషి అగు.

**అఖండదీపం**

దేవాలయంలో ఏ క్షణం లోనూ ఆరిపోకుండా పెట్టే దీపం.

"వైరిమదాంధకారమున కఖండదీపముగఁ జేసి." నిర్వ. ఉ త. 1.3.

"మా ఊళ్లో శివాలయంలో అఖండ దీపాలు ఎప్పుడూ వెలుగుతూంటాయి." వా.

**అఖండదీపారాధన**

దేవాలయంలో అఖండదీపాలు పెట్టుట.

"అఖండ దీపారాధనకుగా రెండు ఆవులను ఆలయానికి దానం చేశారు." వా.

చూ. అఖండదీపం.

**అఖండ మైన**

అతిసునిశిత మైన.

"వాడు అఖండ ప్రజ్ఞకలవాడు. వాడు అఖండప్రతిభాశాలి. వానివి అఖండమైన తెలివితేటలు." వా.

**అఖండుడు**

కూలంకషప్రజ్ఞ కలవాడు.

"వాడు వ్యాకరణశాస్త్రంలో అఖండుడు. వాణ్ణి తప్పు పట్టాలంటే పతంజలే దిగి రావాలి." వా.

అఖిలంబులకు వచ్చునట్లు

సర్వార్థసాధక మగునట్లు, ఇహపరసాధకంగా.

అన్నిటికీ పనికివచ్చునట్లు అని అర్థము.

"అత్తెఱంగఖిలంబులకు వచ్చునట్లుగా విన్నవించెద." పాండు. 1.98

అఖిలనియోగంబు

డెబ్బైరెండు నియోగముల వారున్నూ; గ్రామంలోని అన్ని వృత్తులవారున్నూ.

"అఖిలనియోగంబు గొలువ నన్నరేంద్రుండు." బస. 6 ఆ. 170 పుట.

అఖిలాండకోట్లు

అనేకబ్రహ్మాండములు; అఖిలాండకోటి బ్రహ్మాండాలు.

"ఆవనజజుఁ డంత నఖిలాండకోట్లు గాలించి గాలించి."
పండితా. ప్రథ. వాద. పుట. 611.

అగచాట్లపోతు

కష్టుడు.

అగచాట్లమారి

కష్టుడు.
చూ. అగచాట్లపోతు.

అగచాట్లు

కష్టాలు.

"దైవమా! యిటువంటి యగచాట్లు పగవారికైనం దగవుసుమీ యని."
ఉత్తర. రామా. 6.348.

"ఎన్నో అగచాట్లు పడి ఈనాటికి కాస్త నిలవదొక్కుకున్నాము." వా.

అగడు పెట్టు

అల్లరిపెట్టు, అగుడు అనే రూపమే వాడుకలో వినవస్తుంది.

"వాడు ఊరికే అగుడుపెడుతున్నాడు." వా.

అగడుకాకి

ఆకతాయి.

"అగడలు మహాధూర్తు లగడుకాకులు." హరి. 5.10.

"వాడు ఒట్టి అగడుకాకి. అల్లరిపెట్టేస్తాడు." వా.

అగడు చేయు

అల్లరిపెట్టు.

"వాడు నలుగురిలో ఊరికే నన్నగుడు చేస్తున్నాడు." వా.

అగడువడు

పదిమందినోళ్లలో పడు. చెడ్డ పేరు తెచ్చుకొను.

"అగడువడి పడి పడసినయట్టి పసిఁడి." విప్ర 3.17.

"ఆ అత్త, కోడలు అంతా తినేస్తూ ఉందో అని ఊరికే అగుడు పెడుతుంది." వా.

"అగుడు మొగుడిపాలు అనుభవం మిండగాడిపాలు." సా.

అగడుసేయు

అల్లరిపెట్టు.

"ఏ లగడు సేసెదు రచ్చలఁబెట్టి యింత." సారం. 3.13.

అగతికంగా

మరోదారి లేక.

"ఏదో అగతికంగా మీయింట్లో వచ్చి పడ్డా మని నోటికి వచ్చినట్లల్లా అనడం బాగులేదు."
"వా డేదో అగతికంగా అక్కడికి వెళ్ళాడు." వా.

## అగమ్యగోచరం

ఏమాత్రం అంతు చిక్కనిది.
"ఆ వ్యవహారం నాకు అగమ్యగోచరంగా ఉంది." వా.

## అగలూ పొగలూ

గొడవగా, బాధగా.
"వాడిపని అగలూ పొగలూగా ఉంది." వా.

## అగవుతగవులు

ఇచ్చిపుచ్చుకొనుటలు, మాట మర్యాదవంటిది. జం.
"అది విని చెలంగె మత్సతి యటుల గాదె, యల్లుఁ డని యాడుబిడ్డని యగవు తగవు, లంపకము శుభశోభన మని యి వెల్ల, సంతసముఁ జేయుఁ గన్యకాజనము లకును." దశా. (బల) ఆ. 9 పే. 289.
"వధూటుల కల్లుఁ డనుచు నగవు దగవు లటంచు నెయ్యంబు లంచు నంపకంబు లటంచు మరి యెన్ని యైనఁ గలవు." కవల. 3.65.

## అగసాలె నిజము

నమ్మరానిది.
స్వర్ణకారులు సత్యము చెప్ప రనుటపై వచ్చినది. రాధి. 4.79.

## అగస్త్యభ్రాత

పేరూ ఊరూ లేనివాడు. అనామకుడు.
"వాడు ఒట్టి అగస్త్యభ్రాత. వాణ్ణి అడిగితే ఏం తెలుస్తుంది." వా.

## అగస్త్యమంత్రం

జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం అంటూ కడుపు తడుముకొను. అగస్త్యవాతాపుల కథపై వచ్చిన పలుకుబడి.
"కడుపు నిమిరికొంచు అగస్త్యమంత్రములు నొడివి." దశా. 2.630.

## అగాడీ పిఛాడీ తెంచుకొని

ఉచ్చులు తెంచుకొని పరుగెత్తుపట్లనే ఉపయోగిస్తారు.
పూర్వం గుఱ్ఱానికి వెనుకా ముందూ గుంజలు పాతి కట్టి వేసేవారు. వాటిని తెంచుకొని పరుగెత్తడంపై వచ్చినది.
"వాడు అగాడీ పిఛాడీ తెంచుకొని పరుగెత్తాడు. ఆ మాట వినగానే" వా.

## అగాధము

అంతు పట్టనిది.
"ఆ వ్యవహారం అంతా అగాధంగా ఉంది." వా.

## అగావుగా

అకస్మాత్తుగా.
నూ. ని

## అగు గాక

కానీ.

**అగుగాములు**
ఓగాములు, మంచిచెడ్డలు.

**అగుబొమ్మ**
సరే.
"అని చెప్పిన విని యగుఁ బొ, మ్మని కైకొని." భార. విరా. 1.114.

**అగుడుపడు**
నలుగురినోళ్ల లో నాను.
"ఈపనులవల్ల, అగుడుపడిపోవడంతప్పితే ప్రయోజనం యేమైనా ఉందా?" వా.

**అగుడుబ్రతుకు**
నలుగురినోళ్ల లో నానుతూ ఉండే జీవితం.
"నీది ఒట్టి అగుడుబతుకు అయిపోయిందమ్మా!" వా.

**అగులెమ్మ**
కానిమ్ము.
వాడుకలో 'ఔ లే.'
"దీని నెల్లిదముం జేసినజాడ దోఁచు నోకో యౌ లె మ్మిందు నే నున్కి." పారి. 1.54.

**అగ్గము చేయు**
పాల్పఱచు.
"మ మ్మంగజువూవుఁదూపులకు నగ్గము సేసి." భాగ. దశ. పూ. 1011.

**అగ్గల కెగురు**
పై కెగురు.
"వాడు అగ్గల కెగిరి పోతున్నాడు." వా.

**అగ్గలమీద పోతున్నాడు**
మహావిజృంభణలో ఉన్నాడు. ఎవరినీ లెక్కపెట్టటం లేదు అన్న సందర్భంలో ఉపయోగిస్తారు.
"వా డెక్కడమ్మా! అగ్గలమీద పోతున్నాడు. మాలాంటి వాళ్ళం కళ్ళపడతామా?" వా.

**అగ్గి అయిపోవు**
ఉగ్రుడగు.
"వాడు ఆమాట వినేసరికి అగ్గి అయిపోయినాడు." వా.

**అగ్గి కక్కు**
"వాడు అగ్గికక్కుతున్నాడు." వా.
చూ. అగ్గి కురుస్తున్నాడు.

**అగ్గి కురియు**
కోపంతో ఉండు.
"వాడు అగ్గి కురుస్తున్నాడు. వాడిదగ్గరికి ఇప్పుడు పోవద్దు." వా.

**అగ్గిపిండం**
శీలవంతుడు, దగ్గరకు ఎవరినీ చేర నియ్యనివాడు, సాహసి.
"వాడా! అగ్గిపిండం.ఏమనుకున్నావో."
"నీ అల్లిబిల్లి కబుర్లన్నీ పనికిరావక్కడ. వాడు అగ్గిపిండం." వా.

**అగ్గిపెట్టు**
నిప్పంటించు, అగ్నిసంస్కారము చేయు.
"వాడికి అగ్గిపెట్టేదిక్కుకూడా లేదు."
"ఆ ఊళ్లో వాడికి అగ్గిపెట్టారట." వా.
ఇదేమాటనే కోపంతో—ఏదో ఒకటిచేయి, పడవేయి అనే అర్థాలలో అంటారు.
"ఏదోఒకటి అగ్గిపెట్టు, తొందరగా ఆఫీసుకు వెళ్లాలి." వా.

"ఆ పుస్తకం ఇట్లా అగ్గి పెట్టరా."
"అదేదో పని చేయమంటే అదంతా అగ్గి పెట్టాడు." వా.

ఇది రాయలసీమలో వినిపించే పలుకుబడి. ఇదే కోస్తా ప్రాంతాలలో 'తగులవేయి' అన్నరూపంలో కానవస్తుంది.
చూ. తగులవేయు.

**అగ్గిపెట్టె**
నిప్పుపుల్లల పెట్టె.

**అగ్గి బడు**
పాడగు.
"ఏ మన నేర్తు మదీయభాగ్య మిట్లగ్గిఁ బడఁగఁ జేసినమదాంధుని నంచు..." కా. మా. 2.111.
"నాపని యిట్లా అగ్గిబడింది. నా సంసారం యిట్లా అగ్గిబడింది. వా.

**అగ్గిమీద గుగ్గిలం వేసినట్లు**
అమితంగా చెలరేగుపట్ల ఉపయోగించే పలుకుబడి. మండిపడు అనుట.
అగ్గిమీద గుగ్గిలంవేస్తే భగ్గుమంటుంది. అందుపై ఏర్పడినది.
"నీవూ కనిపించావా ఇక వాడు అగ్గిమీద గుగ్గిలం వేసినట్లే భగ్గుమంటాడు." వా.

**అగ్గి మ్రింగు**
కోపపడు.
"అగ్గి మింగుతున్నాడు. వాడి దగ్గరికి ఇప్పుడు పోవద్దు." వా.

**అగ్గిరాముడు**
క్రూరుడు, కోపధారి.

**అగ్గి రాలుస్తున్నవి (కండ్లు)**
కోపంతో ఎఱ్ఱగా ఉన్నవి.

**అగ్గిలాంటి మనిషి**
చాలా శీలవంతు డనుట.
"వాడు అగ్గిలాంటి మనిషి. డబ్బూ గిబ్బూ పే శత్తావా నీపని అసలు కాదు." వా.

**అగ్నికణం**
మిణుగురు పురుగు.

**అగ్నిచిత్తు**
అగ్నిచయనం చేసినవాడు.

**అగ్నిదగ్ధుడు**
పాడయినవాడు.

**అగ్నిమండలం**
పైరు కొట్టివేసే ఒక పురుగు. అది తగిలితే ఒంటిమీద బొబ్బలుపోతాయని అంటారు.
"అది పైత్యం కాదు రా. అగ్నిమండలప్పురుగు సోకి ఉంటుంది." వా.

**(అగ్ని)మలుగు**
ఆరిపోవు.
"వెలసె వెలుఁగు గాని మలుఁగడు (అనలుడు)." కుమా. 9.161.

**అగ్నిమాంద్యం**
అజీర్ణరోగము.

**అగ్నిముఖము**
జీడి.

**అగ్నిముఖుడు**
బ్రాహ్మణుడు, దేవుడు.
"అగ్నిముఖా వై దేవాః"

అన్న వైదిక ప్రవచనంపై వచ్చిన పలుకుబడి.

**అగ్నియిచ్చు**

అగ్నిసంస్కారము చేయు.

"భూకాంతుల ననేకసహస్రసంఖ్యులం బ్రోవులు గాఁ బెట్టించి సమగ్రదారు సముదయంబు లమర్చి యగ్ని యిచ్చిరి." భార. స్త్రీ. 2.172.

**అగ్నిశిఖ**

కుంకుమపూవు.

**అగ్నిహోత్ర మయి పోవు**

మండిపడు.

"నే నామాట అనేసరికి వాడు అగ్నిహోత్రం అయిపోయాడు." వా.

**అగ్రతాంబూలము**

సభలో పెద్దవారి కిచ్చు మొదటి తాంబూలము. పెండ్లిండ్లూ వాటిలో పెద్దవారికే మొదటి తాంబూలం ఇస్తారు. అది గౌరవ సూచకం.

"...తుట్టతుదకుఁ గట్టుకొన్న దానిని బిలుచుట యైన చేత కాని చచ్చు పెద్దమ్మలతో నగ్రతాంబూలమునకు సిద్ధ మయినాఁడే!" సాక్షి. 189 పే.

"నీ కేం అగ్రతాంబూలం ఇస్తారా." వా.

**అగ్రపుస్తకములు**

వేదములు.

"అగ్రపుస్తకంబు లర్చించి చూచుచు."

**అగ్రహారపుచేయి**

చాలా ఘటికుడు.

కన్యా. శు.

**అగ్రహారభుక్తులు**

అగ్రహారీకులు.

పనీ పాటా లేక తిని కూర్చునే వారిపట్ల నిరసనగా ఉపయోగించేపలుకుబడి.

**అగ్రహారము**

బ్రాహ్మణు లుండే స్థలం.

బ్రాహ్మణులుమాత్రమే ఉండే గ్రామం.

**అగ్రహారములో తమ్మళి జోస్యము**

కుదరనిది. చెల్లనిది.

తాతకు దగ్గులు నేర్పుటవంటిది. అగ్రహారంలో ఉన్నవాళ్లలో చాలమంది గొప్ప జ్యోతిష్కులే ఉంటారు. తమ్మళి-వట్టి పూజారి అక్కడికి పోయి చెప్పేజోస్యం యే ముంటుంది?

"ఏమ్మెలు నాముందఱనా, యమ్మక్కారో చెల్ల వగ్రహారములోనన్, దమ్మళి జోస్యము లన్నవిధ మ్మిది." రుక్మాం. 5.88.

**అగ్రాసనం**

ప్రధానస్థానము.

సభలలో వానిలో మొదటగా పెద్దలను కూర్చోబెట్టడం అలవాటు. అందుపై వచ్చిన పలుకుబడి.

**అగ్రాసనాధిపతి**

సభాధ్యక్షుడు - ప్రెసిడెంటు.

ఇటీవల ఏర్పడిన పలుకుబడి.
"ఈసభకు ఫలానావారిని అగ్రాసనాధిపతిగా ఉండవలసిందని కోరుతున్నాను." వా.

**అఘటనఘటనాపటిమ**

చేయుటకు వీలు కానిపనులను కూడా చేయగలశక్తి.
"పతి మెచ్చ నఘటనఘటనాపటిమ నమ్మహామంత్రి రాజ్యభారమ్ము దీర్చు." హంస. 5.261.

చూ. అఘటనఘటనాసమర్థుడు.

**అఘోరించావు**

ఏడిచావు.
నిరసనగా ఎదుటివాడిని అను మాట.

కొత్త. 12.

**అఘోరించు**

1. బాధపడు.
"వీడి కొంపలోపడి పదేండ్లుగా అఘోరిస్తున్నాను." వా.
2. నిరసనగా అనునప్పుడు ఉపయోగించే పలుకుబడి.
"ఏదో ఒకటి అఘోరించు."
"అఘోరించావు ఊరుకో."
"అఘోరించాడు వెధవ." వా.

**అఘోరింపు**

ఏడుపు. నిరసనగా అనుమాట.
"ఏమిట్రా! నీ అఘోరింపు. ఏమిటో చెప్పి యేడవరాదూ!" వా.

**అఘోరేభ్యో చేస్తున్నాడు**

ఏడుస్తున్నాడు.
వైదికపరిభాష.
"వాడేదో మూల కూర్చుని అఘోరేభ్యో చేస్తున్నాడేమి? ఏమిటి సంగతి?" వా.

**అచ్చం**

సరిగ్గా.
"అతడు అచ్చం వాళ్ళ తండ్రిపోలిక." వా.

**అచ్చంగా**

సరిగ్గా.
"అచ్చంగా యితను మా బావమరిది పోలికే." వా.

**అచ్చగు**

ముద్రితమగు.
"ఈ పుస్తకం అయిదు సంవత్సరాల కింద అచ్చయింది."
"ఇది యింకా అచ్చుకాలేదు." వా.

**అచ్చుగుండ్ల పేరు**

బంగారుగుండ్లతో చేసినదండ.

**అచ్చటముచ్చట**

ముద్దు ముచ్చట. జం.
"కాపరానికి వచ్చి సంవత్సరం అయింది. కానీ ఒక అచ్చటా ముచ్చటా ఎరుగునా పాపం! ఆ పిల్ల." వా.

**అచ్చతెలుగు**

తత్సమేతరమైనఆంధ్రభాష.
"యయాతి చరిత్ర అచ్చతెలుగు కావ్యము." వా.

**అచ్చనగండ్లు**

అచ్చనగాయలను ఆటలో ఉపయోగించురాళ్లు.

**అచ్చనగాయలు**

ఆడపిల్లలు ఆటలో ఉపయోగించేరాళ్లు, చింతగింజలు.

**అచ్చనపుచ్చు**

అచ్చనగాయవలె వేఱుగా తీసివేయు.

"భాగుకనొక్క డచ్చనపుచ్చి." ఉ. 2.19.

**అచ్చనలాడు**

అర్చించు.

"చెచ్చెర సుతుప్రాణ మిచ్చిన నేఁడ, యచ్చనలాడెద నభవుఁడా మిమ్ము."
పండితా. పురా. 471 పు.

**అచ్చాకు బుచ్చాకులు పలుకు**

చూ. అచ్చికబుచ్చిక లాడు.

**అచ్చాళి**

ఒంటరి.

ఏబాధ్యతా, భారమూ, జంజాటమూ లేనివాడు.

దక్షిణాంధ్రంలో ఈ పలుకుబడిని వాడుతారు.

"అచ్చాళి గాఁగ అనికి సన్నద్ధుల మై యుందము."
పతివ్రతా. 35.

"వాడు అచ్చాళీగా తిరుగుతున్నాడు. దండించే దిక్కు లేదు కనుక." వా.

**అచ్చికబుచ్చిక మాటలు**

కల్లబొల్లి కబురులు, ముచ్చటలు.

**అచ్చికబుచ్చికలు**

ముచ్చటలు.

"అక్కఱఁ జూడ వేటి కల యచ్చిక బుచ్చిక సేయునంచలన్."
విజ. 3.30.

"వాడు అక్కడికి వెళ్ళి అచ్చికబుచ్చిక లాడుతూ కూర్చున్నాడు. వా.

"అచ్చిక బుచ్చిక లడరఁ గొంతకాలంబు గడపి." హరి. 2.69.

**అచ్చికా మచ్చికా లేదు**

ముద్దూ ముచ్చటా లేదు అనుట. జం.

"ఆ ఆలుమగళ్ళకు అచ్చికా మచ్చికా లేదు." వా.

**అచ్చిక బుచ్చికలాడు**

కల్లబొల్లికబుర్లు చెప్పు.

**అచ్చివచ్చు**

శుభప్రద మగు.

కొన్ని తావులు కొందరికే అచ్చి వస్తాయనీ, అక్కడున్నప్పుడు ఎప్పుడూ మంచే కలుగుతుం దనీ, కానప్పుడు కీడు వెన్నాడుతుం దనీ ఒక నమ్మకం. అందుపై వచ్చినపలుకుబడి.

"ఆ యిల్లు మాకు అచ్చివచ్చింది. అంచేతే యెన్ని యిబ్బందులున్నా అక్కడే ఉంటున్నాము." వా.

"ఆ ఊరు మాకు అచ్చి రాలేదు. అందుకని తిరిగి వచ్చివేశాము." వా.

**అచ్చుకట్టు**

ఏర్పఱచు – కట్టు.

"నడవ యచ్చు కట్టిన మునిరాట్పట్టాభిషిక్తు." పాండు. 1.11.

**అచ్చుకట్టు పొలము**

అచ్చుకట్టు వేసినపొలము.

చూ. అచ్చుకట్టు.

**అచ్చుకట్టు వేయు**

నీళ్లు కట్టేముందు మడిని వేరు వేరు కయ్యలుగా చేయు.

"మా పొలం అచ్చుకట్టు వేశాము."
వా.

**అచ్చు కావలిగాడు**
దొంగలు దోచుకొన్న సొమ్మును దండుగ పెట్టుకొనే కావలివాడు. బ్రౌను.

**అచ్చుకుప్ప**
ధనవంతుడు.
ఆంధ్ర. భా. 3 ఆ.
ఇది నేడు వాడుకలో లేదు.

**అచ్చు కొట్టినట్టు**
అచ్చంగా అలాగే.
చూ. అచ్చు దించినట్లు.

**అచ్చుకొను**
ఒకరు ఇవ్వవలసినదానికి తాను బాధ్యుడగు.
"వాడు మా యింట్లో వుండి చుట్టూ అప్పులు చేసి వెళ్ళిపోయాడు. అవన్నీ నేను అచ్చుకోవలసి వచ్చింది." వా.

**అచ్చుకొట్టు**
అచ్చువేయు.
చూ. అచ్చువేయు.

**అచ్చుగా**
అచ్చంగా.
చూ. అచ్చంగా.
"అచ్చుగాఁ దీర్తు మీ యప్పు."
హరి. ద్వి.

**అచ్చు గుద్దినట్లు**
సరిగ్గా అలాగే.
"వీడు వాళ్లనాన్నను అచ్చుగుద్దినట్లు ఉంటాడు." వా.

**అచ్చుపెద్దు**
అచ్చు పోసినఆంబోతు.
చూ. అచ్చు పోసినఆంబోతు.

**అచ్చుదల యగు**
అంగీకార మగు.
"విశ్వపతీ! విరసోపలంబు లెట్లచ్చుద లయ్యె నీకు." కా. మా. 2.121.

**అచ్చు దించినట్లు**
"వీడు వీళ్ళ మేనమామను అచ్చు దించినట్లుగా ఉంటాడు." వా.

**అచ్చు నిలుపు**
దృష్టాంతము నిలుపు.
"దీని కచ్చు నిలిపితిని నీవ!"
కుమా. 7 ఆ. 35 ప.

**అచ్చుపడు**
1. ముద్రిత మగు.
"ఆ పుస్తకం అచ్చుపడి అప్పుడే యాభై యేళ్లు అయింది."
"ఆ పుస్తకం యింకా అచ్చుపడ లేదు."
2. స్పష్టపడు. వా.
"సొమ్మచ్చుపడఁగఁ జేయుటకు."
బ్రౌను. A. 4.187.
"అచ్చుపడఁగఁ బల్కుమీ." మను.
"అనువు మెఱయఁ జొచ్చి మాయ యచ్చుపడఁగన్." పారి. 1.107.

**అచ్చుపడినట్లు**
సరిగ్గా అలాగే, రూపు గొన్నట్లు.
"నెచ్చెలులు దన్నుఁ గొలువఁగఁ, బచ్చవిలుతు కలిమి యెల్లఁ బద్మాసన మై, యచ్చుపడినట్లు మెఱయుచు, నచ్చట కేతెంచె భూవరాత్మజ నెమ్మిన్."
భార. అర. ఆ. 7.

**అచ్చు పొడిచిన**
అచ్చు పోసిన, స్వేచ్ఛాచారి అయిన.
"అచ్చు పొడిచిన యాబోతులరీతిని." ఆం. వా.
చూ. అచ్చువేసిన...

**అచ్చు పొడుచు**
చూ. అచ్చువేయు.

**అచ్చు పోసిన యాబోతు**
చూ. అచ్చు పొడిచిన.

**అచ్చుపోసి వదలు**
విచ్చలవిడిగా వదలు.
"వాణ్ణి అచ్చు పోసి వదిలినారు. ఎప్పుడూ ఊరు తిరుగుతుంటాడు." వా.

**అచ్చు ముచ్చు**
మంచి, చెడు.
బియ్యం మొదలయినవాట్లో మెరికలను ముచ్చని, మిగత వానిని అచ్చు అనేదృష్టితో అచ్చుముచ్చు ఏర్పరచి పెట్ట నునుట అలవాటు. అందుపై యేర్పడిన పలుకుబడి.
"చూడ వచ్చిన నచ్చుముచ్చో యెఱుంగ కాడరా దేల యా పాప మనెడువారు." శుక. 4.46 ప.
"బియ్యం తీసి అచ్చూ ముచ్చూ ఏరి పెట్టు తల్లీ." వా.

**అచ్చు ముచ్చు ఎఱుఁగు**
మంచిదో చెడ్డదో తెలుసుకోను.
బియ్యంలో అచ్చు లనగా మంచి బియ్య మనీ ముచ్చు లనగా మెరికె లనీ అర్థం.

అచ్చూ ముచ్చూ చేసి - అనగా బియ్యము వేఱుపఱచి. అందుపై వచ్చిన పలుకుబడి.
"అచ్చూ ముచ్చూ ఎఱగనివాడు పాపం!" వా.
చూ. అచ్చు ముచ్చు.

**అచ్చులు వెట్టించు**
ముద్రవేయు.
"అమరారి దనపేరి యచ్చులు వెట్టించి సురధేనుసమితిఁ గీలరము సేసె." కుమా. 4.11.

**అచ్చులొత్తు**
అచ్చులు పెట్టించు.
"అందఱి మొగములయం దచ్చు లొత్తి యారిచి పెడబొబ్బ లందంద యిచ్చు." బసవ. 192 పు.

**అచ్చులో లేదు**
ముద్రిత రూపంలో లేదు. అచ్చు అయిన వన్నీ అయి పోయిన వనుట.
"ఆ పుస్తకం యిప్పుడు అచ్చులో లేదు." వా.

**అచ్చువడు**
అంకితమగు.
"భావజు కేళి నచ్చువడి పైఁబడి తద్విటు నిచ్చఁ గూడి." కుమా. 8.158.

**అచ్చు వేయు**
ముద్రించు.
"ఈ పుస్తకమును అచ్చువేసి చాలకాల మయినది."
"దీనిని అచ్చువేసి పెట్ట మని చాల నాళ్లుగా అతడు అడుగుతున్నాడు." వా.

**అచ్చు వేసిన ఆంబోతు**

స్వేచ్ఛాచారి.

దేవునిపేర అచ్చువేసి ఒక ఆంబోతును విడుచు అలవాటుపై వచ్చిన పలుకుబడి. దానినే వృషోత్సర్జనం అంటారు. అది ఎవరి అదుపులోనూ ఉండదు కనుక ఎక్కడ పడితే అక్కడ తిరుగుతూ ఉంటుంది. అందుపై వచ్చిన పలుకుబడి.

"వాళ్ల నాన్న చచ్చిపోయినతరవాత అడిగేవాళ్లూ పెట్టేవాళ్లూ లేక వాడు ఊరకే అచ్చు వేసిన ఆంబోతులా తిరుగుతున్నాడు." వా.

**అచ్చు వేసినయెద్దు**

చూ. అచ్చు వేసినఆంబోతు.

**అచ్చు వోడుచు**

వేఱుగా ఉంచు, అట్టిపెట్టు.

"మూడుపాళ్ళు వెచ్చమునకు రానీక యచ్చు వోడిచి డాఁపవలయు." శృం. శా. 4.17ప.

**అచ్చొత్తిన గొఱ్ఱె**

శివ. 71.

చూ. అచ్చు పోసినఆంబోతు.

**అచ్చొత్తినదియె ?**

ఇదే కావాలని ముద్రవేసి విడిచినదా ?

"నీవు దీనిని జంప నీమమే సెప్పుము [illegible] దీనినే అచ్చొత్తినదియె." బస, 5 ఆ, 125 పుట,

**అచ్చొత్తి విడుచు**

అచ్చు వోసి విడుచు.

దేవార్పణంగా పశ్వాదులను వదలివేయడం ఆచారం. బస. 5 ఆ. 125 పుట.

**అచ్చొత్తు**

ముద్రించు.

"ఇది ఆనంద ముద్రాక్షరశాలయందు అచ్చొత్తింప బడియె." పా. వా.

**అచ్చాణి (డి)**

స్వచ్ఛము, శ్రేష్ఠము.

**అజ కనుక్కొను**

జాడ తెలుసుకొను.

**అజగజన్యాయం**

చూ. అజగజాంతరము.

**అజగజాంతరము**

దానికీ దీనికీ చాలా వ్యత్యాసం ఉన్న దనుట.

చూ. హస్తిమశకాంతరము.

**అజగరోపవాసము**

దొంగ ఉపవాసము.

కొండచిలువ ఒకచోటనే పడి ఉంటుంది. తనదగ్గరికి ఏదో ఒక జంతువు వచ్చేదాకా ఉపవసిస్తుంది. వస్తే మాత్రం వదలిపెట్టదు. దానిపై వచ్చిన పలుకుబడి.

"అజగరోపవాస మల బకధ్యానంబు నక్కవినయ మిట్టినయము లెల్ల." వైజ. 2,19.

**అజ్జ యైనవేళ**

వీలుపడినప్పుడు. అవకాశము చిక్కినప్పుడు.

"అని పలికె నదియు మొదలుగ
వెనుదీయక యజ్జ యైనవేళల నెల్లన్." శుక. 3 ఆ. 494 ప.

**అజాగళ స్తనాలు**

వ్యర్థము లనుట.

"నగంగ నైన వాఁడ్రుచ్చి యజాగళ స్తన సగోత్రులు వారల నెన్న నేటికిన్." కళాపూ. 1.7.

**అజా పజా లేదు**

చూ. అజా వజా లేదు.

**అజా వజా లేదు**

అయిపు లేదు.

"వాడి అజావజా లేదు. మూడు రోజు లయింది వాడు ఇల్లు విడిచిపోయి." వా.

**అజ్ఞాతవాసం**

రహస్యముగా జీవించుట, ప్రజల యెరుకకు రాకుండా ఉండుట.

పాండవులు పండ్రెండేండ్లు అరణ్యవాసం చేసి, ఆతరవాత ఒకయేడు అజ్ఞాతవాసం చేశారు. దానిపై వచ్చిన పలుకుబడి.

"నే నిప్పుడు అజ్ఞాతవాసంలో ఉంటున్నాను. ఒక్కసారే ఒక కావ్యం వ్రాసి ప్రజలముందు పడతాను." వా.

**అటకలు నాకు**

దరిద్రముతో బాధపడు.

అటకలు అనగా వంట చేసుకునే చిన్నకుండలు.

"అత్త అటకలు నాకుతూ ఉంటే అల్లుడు వచ్చి దీపావళిపండగ అన్నాడట." సా.

**అటమటకాడు**

మోసగాడు.

"అటమటకాఁడు మహామాయలాఁడు." గౌర. హరి. 2.646.

**అటమటము**

అయథార్థము.

"అటమటమో లేక నిజమొ." సారం. 2.254.

**అటమున్ను**

అంతకంటె ముందు.

"సృష్టికి నటమున్ను." హర. 3.13.
కాశీ. 4.213.

**అటుకుగింజ**

గడుసరి.

**అటుకులు తిని చేయి కడుగుకొన్నట్లు**

పూర్తిగా సంబంధము వదలుకొన్నట్లు.

అటుకులు తింటే చేయి కడుక్కొనే చేతి కేమీ మిగలదు. ఇక కడుక్కుంటే అసలేమీ ఉండదు కదా!

"మీ చెల్లెలు పోగానే ఆయింటి సంబంధం అటుకులు తిని చేయి కడుక్కున్నట్లయింది." వా.

**అటుండనీ**

అది అలా ఉండనీ.

"ఓరి దండధర! యీ చండితనంబు లటుండనీ రా." హేమా. పు. 29.

**అటువంటివారమా**

అటువంటివారము కాము, మంచివారము అనుట.

"అటువంటివారమా యాఁకలి దప్పుమి క్కిలి పుణ్య మన్న నంగీకరించి."

శుక. 4. ఆ. 7. ప.

"నేను అట్లాంటివాణ్ణి కాదు."

"నేను అట్లాంటిదాన్ని కాదు. నాతో సరస మాడ వద్దు." వా.

ఏకవచనంలో — మహదమహ దర్థకాలు రెండిటా యిది ప్రయుక్త మవుతుంది.

**అటో యిటో తేల్చి చెప్పు**

నిశ్చితాభిప్రాయమును వెల్ల డించు.

రుద్రమ. 9 పు.

**అట్టకట్టు**

చిక్కగా యేర్పడు.

"...క్రొమ్మావి చిగురుఁ బలుపు పెట్టు పెట్టినచందాన నట్టకట్టె."

శకుంతలా. 3.177.

"చెమటకాయలతో ఒళ్ళంతా అట్ట కట్టుకొని పోయింది." వా.

**అట్టళ్లు వన్ను**

కోటకొమ్మలపై కాపలా సైనికుల నుంచుటకై గదుల నేర్పరచు.

"కోట సింగారించి కొత్తళంబుల నెల్ల నట్టళ్లు వన్నించి యాళువరికి."

ఈ. హరి. 2.92.

**అట్టహాసం**

దర్జా, దర్పం.

ఇందులో కొంత 'ఇంత ప్రద ర్శన మెందు' కన్న వ్యంగ్యం అంతర్యాభావమై ఉంది. సంస్కృతంలో మామూలుగా ఉన్న గట్టిగా నవ్వడం అన్న అర్థం ఇందులో మాసి పోయింది.

"వా డిప్పుడు మన కెక్కడ దర్శనం యిస్తాడు. వాడి అట్టహాసమూ వాడూ వెలిగిపోతున్నాడు."

"వాడీ మధ్య మహా అట్టహాసంగా ఉన్నాడు. వా.

**అట్టహాసంగా**

మహా దర్జాగా.

చూ. అట్టహాసం.

**అట్టహాసం పట్టపగలు**

వాడి దర్జా చాలా పెరిగి పోతూ ఉంది అని కొంత నిర సన సూచిస్తూ అనేమాట.

"వాళ్ళ అమ్మమ్మవైపు ముదనష్టపుఆస్తి యేదో వచ్చిపడింది. ఇంకేం! వాడి దంతా అట్టహాసం పట్టపగలుగా ఉంది."

వా.

**అట్టిట్టగు**

1. డోలాందోళిత మగు.

"అయ్యనిమిషలోచనకు హృదయ మట్టిట్టయ్యెన్." నిరంకు. 4.41.

2. సంచలించు.

"ఇది యేమో మన పాళె మెల్ల వగ నట్టిటయి వెతం జెంద..."

శుక. 1. ఆ. 477 ప.

"ఎడఁబాయనీక బల్విడి నంటఁ గదుముచు నట్టిట్టు వడిఁ ద్రోపులాడునవియు."

కళా. 8.81.

**అట్టిట్టు సేయు**

కలతపెట్టు.

"తొట్రించి గొర్ల లోఁ దోడేలు సొచ్చిన, ట్లీగబ్బి వేళ్ళ నట్టిట్టు సేయు."

సారం. 1.92.

**అట్టిద కాక**

సరే, అట్లాగే.

"మా యనుమతిఁజేసి, పుట్టు ద్వితీయ శంభుం డనఁ బుడమి, 'నట్టిద కా' కని యానందలీలఁ, బుట్టె."

బస. 1. ఆ. 8 పుట.

**అట్టుడికినట్లు ఉడుకు**

ఒకవిషయమై గగ్గోలు ఏర్పడు.

"ఆపిల్ల ఎక్కడో లేచిపోయిం దని ఊరంతా అట్టుడికినట్టు ఉడికి పోయింది." వా.

**అట్టుపుట్టు**

పుట్టుపూర్వోత్తరాలు. జం.

**అట్టుపుట్టానవాళ్ళు**

పుట్టుపూర్వోత్తరాలు.

"దాని అట్టుపుట్టు ఆనవాళ్లు వాడిని అడిగితే కాని తెలియవు." వా.

"అట్టుపుట్టానవాళ్లతో నాగుట్టంతయు నీవే చెప్పుచుండ నేను లే దని మఱుగు పఱచుటవలన నేమి లాభము?"

సౌందర్య స. 58.

**అట్టులవోలె**

వలె – ఉపమా వాచకం.

వీనిలో ద్విరుక్తి నన్నెచోడు నిలో విరివిగా కానవస్తుంది.

కుమా. 9.64.

**అట్ల కాక**

సరే.

ఏదైనా ఎవరైనా చెప్పి నప్పుడు మంచిది అన్నట్లే – సరే అన్నట్లే – గ్రాంథికంలో అంటే ఆనాటి వాడుకలోనూ, అట్ల కాక అనుట అలవాటు.

బస. 2 ఆ. 24 పుట.

**అట్లు పోయు**

చూ. దోసెలు పోయు.

**అడకట్టు**

గుత్తిగా యేర్పడు.

"ఎత్తులం గలసి చిగుళ్లు పెట్టి యడకట్టిన క్రొవ్విరి మొల్ల పూవుటెత్తులు."

శకుంతలా. 1.83.

**అడకత్తెర**

పోకలు కత్తిరించుకత్తెర. కన్నడంలో అడకత్తు అంటే ఖండించు అని అర్థం. కొత్తు అన్నా అంతే.

**అడకత్తెర బతుకు**

అటూ యిటూ కూడా బాధ లకు గురి యగుబతుకు.

"నే నటు పోవడం లే దని పుట్టింటివారికి కోపం. వాళ్ళవల్ల యేమీ లాభం లే దని అత్తింటివారికి కోపం. వీళ్ళిద్దరి మధ్యా పడి నాది అడకత్తెర బతుకు అయిపో యింది." వా.

**అడకత్తెరలో పడు**

ఇఱుకున చిక్కుకొను.

"వాడు అడకత్తెరలో పడి మిటకరిస్తున్నాడు." వా.

**అడకత్తెరలో పోకలాగ**

చిక్కులో ఇరుకుకొని పోవు పట్ల ఉపయోగించే పలుకుబడి.

"చెల్లెలు, భార్యా మధ్య వాడు అడకత్తెరలో పోకలాగా అయిపోయాడు." వా.

**అడకొత్తున నొత్తు**

ఇఱుకున పెట్టి బాధించు, అడకొత్తునం దొత్తినట్లు అనుట.

"ఓర్వదు బంధుజాల మడకొత్తున నొత్తును మామగారు." శశాం. 3. ఆ.

**అడగనివానిది పాపం**

అడిగినవాని కల్లా ఇచ్చునను.

అడగనివాడు పాపాత్ముడు అని కూడా అంటారు.

"అందరూ అన్నీ ఒడుచుకొని పోయారు. అడగనివానిది పాపం!" వా.

**అడగిపోవు**

అణగిపోవు.

"పుడిసెడు నీటిచే నడఁగిపోయెడు ధూళికి." జైమి. 5.7.

**అడగోలుకొను**

వశము చేసికొను.

"శంకరార్ధదేహం బడగోలుకొన్న." హరి. ఉ. 6.19.

"ఆ యంబుజనేత్ర నన్ను నడగోల్కొనియెన్." దశ. 5.55.

"ఇల్లడసొమ్ము నడగొలుగొని త్రోచు నతనిగతికి." భోజ. 6.14.

అడమానములోని 'అడ' కూడా యిదే. దీనికి 'అపహరించు' అని అర్థం చెప్పనక్కఱ లేదు. వశము చేసికొను అను అర్థమే అన్నిచోట్లా సరిపోతుంది.

**అడచిపడు**

మిడిసిపడు.

చూ. అడిచిపడు.

**అడజడిపెట్టు**

అలజడి కలిగించు.

"అడజడిపెట్టు మాటలటులాడఁగఁగూడునె యీయకార్యముల్, విడువులతాంగి." మార్క. ఆ. 1.

**అడపకత్తె**

తాంబూలకరండవాహిక.

రాయలసీమలో ఇప్పటికీ వక్క, ఆకు, పొగాకు, సున్నం మొదలయినవి, ఒక గుడ్డతో సంచి కుట్టి అందులో ముఖ్యంగా ఆడవాళ్లు—వేసుకుంటారు. దానిని అడపమనే అంటారు. అడపతిత్తి అన్నా అదే. అడపం పట్టుకొనునది అడపకత్తె.

"అడపకత్తెలు తెలనాకు మడుపులొసగ." వైజ. 1.113.

చూ. అడపది.

**అడపకాడు**

తాంబూలకరండవాహకుడు. అడపది ఆడ దైతే అడపకాడు మగవాడు.

చూ. అడపది.

**అడపట్టె పట్టు**

విత్తిన తరువాత విత్తనాల మీద మన్ను పడేవిధంగా ఒక రక మైన గుంటకను తోలుతారు. అలా తోలడమే అడపట్టె పట్టడం.

**అడపతిత్తులు**

వక్కలు ఆకులు పొవ్వాకు సున్నం వగైరా లుంచుకునే బట్టతో కుట్టినసంచులు. నేటికీ ఇవి వాడుకలో నున్నవి. అడపం అనీ అంటారు అలాంటి తిత్తిని.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 317.

చూ. అడపది.

**అడపది**

తాంబూలకరండ వాహిని. తాంబూలం పళ్ళెం పట్టుకొని ఎప్పుడూ రాజున కిచ్చునది.

"ఆకు మడుపు లీఁ దివిరెడు నడపదాని." ఉ. రా. 4.223.

**అడపాదడపా**

అప్పుడప్పుడూ. జం.

"వాడు అడపా దడపా మాయింటికి వస్తుంటాడు."

"అడపాదడపా వాడికి జ్వరం వస్తుంటుంది." వా.

**అడపొడ**

జాడ. జం.

"వాడి అడాపొడా తెలియడం లేదు. పదిరోజు లయింది ఇల్లు విడిచిపోయి." వా.

**అడపొడ లేకపోవు**

మాపరి పోవు, స్వరూపనాశన మగు.

"ధూర్జటి కంటి కడిందిమంటలో నడపొడ కానరాక తెగటారియు." మను. 3 ఆ.

"వారి యీసుచే నడపొడ లేకపోయె నఁట యల్పము లయ్యెఁ గులాభిమానముల్." కళా. 7.44.

**అడబాల**

మహానసాధ్యక్షుడు—అతనితో పాటున్న ఉద్యోగి.

వంటవాడు వంటలక్క అని శ. ర; కన్నడంలో వంటలక్క, వంటవాడు అని కాక మాంసము అన్న అర్థం కూడా ఉంది. ఇక్కడ మామూలు వంటవాడు కాక ఏ మహానసాధ్యక్షుని వంటి పెద్ద ఉద్యోగో కావచ్చు ననిపిస్తుంది.

"బండారులను నడబాళ్ళఁ బ్రెగ్గడల దండనాయకులను దంత్రపాలకుల." బస. 7 ఆ. 23 పు.

"అడబాల గొనిపోయి యమ్మోనుఁ జించి, కడుపులో నొకబాలుఁ గని వెఱఁ గంది." భాగ. దశ. స్కం.

**అడలడి**

1. అలజడి, ఆందోళన.

"అడలడి బొందఁ గాఁ దగనియట్టిది ద్రోవది—" భార. శాంతి. 1.202.
"ఆ యింతి భ్రమగొని యడలడి."
2. అడలుపడి, అడలి.
కుమా 5.61.

**అడలి చచ్చు**
భయపడు.
"అడలి చచ్చినఁ గాని యప్పు తీయను." వ్యాస. నాట. 33.

**అడవత్రావుడు**
చూ. అదవత్రావుడు.

**అడవనాయాలు**
చూ. అదవనాయాలు.

**అడవపుట్టువు**
నిరర్థకజన్మ.
"వాడిది ఒట్టి అడవపుట్టు. ఇంట్లోకీ పనికి రాడు, బయటికీ పనికి రాడు." వా.

**అడవబతుకు**
వ్యర్థజన్మ.
చూ. అడవపుట్టువు.

**అడవమనిషి**
వ్యర్థుడు.
చూ. అడవపుట్టువు.

**అడవ (దవ) సరకు**
మోటు దినుసు.
"వాళ్ల దంతా వట్టి అడవసరకురా. వాళ్ల లోకి నువ్వెందుకు దిగుతావు?" వా.

**అడవి**
శూన్యం, పాడు.
"అక్కడేమి ఉంది. అడివి."
"అది ఒట్టి అడివికొంప. అక్కడ ఎవరు కాపరం ఉంటారు?" వా.

**అడవికుక్క—**
తోడేలు.

**అడవిగాచిన వెన్నెల**
వ్యర్థము.
"అడవి గాచినవెన్నెల యయ్యె నాదు జవ్వనంబు." మార్కం. 5.8.
"కలయంగ నడవిలోఁ గాచిన వెన్నెల లై చాగుపోసంబు లవధఁ బోవ." నృసిం. 2.90.
"ఆ పిల్ల బతుకు అడవిగాచిన వెన్నెల అయిపోయింది. ఎంత అందంగా ఉంటే నేం? ఎంత తెలివైందై తే నేం?" వా.

**అడవిగోడు**
చూ. అరణ్యరోదనం.

**అడవిమూర్ఖుడు**
అడివిమనిషి, అనాగరకుడు.

**అడవి యామలకము అంబుధి లవణము కూడినట్లు ఎక్కడెక్కడివో ఒకచోట చేరినట్లు.**
"తడవు దినములకును ధరణీసురజ్యేష్ఠ మాకు మీకు సంగమంబు గలిగె నడవియామలకము నంబుధిలవణంబుఁ గూడినట్టు లయ్యె నేఁడు సూడ." కుచే. 2.78.

**అడవుల గలియు**
అడవులు పట్టి పోవు.
వాడు అడవులు పట్టి పోయి నాడు, దేశంమీద పోయి నాడు అనే అర్థంలో నేటికీ వాడుక.

"అరహాతముని హోయి యడవులఁ
గలసె." బస. 6. అ 165 పుట.

## అడవులపాలగు

చెల్లాచెదరయి పాఱిపోవు.

"ఆ కలకలమునఁ జిత్తం బాకులతం
బొంద దొంగ లడవులపాలై."
కా. మా. 4.104.

## అడవుల వెన్నెలలు

పైపై తళుకులు.
తాళ్ళ. సం. 5.24.

## అడసాల

వంటశాల.

అడ, అడు, అడి—వంట అన్న
అర్థంలో కన్నడమున ప్రచు
రంగా ఉన్న పదాలు. అడ
సాల, అడశాల ఇందులోనుండి
వచ్చినవే.

## అడవులుపట్టు

దేశంమీద పోవు.

"ఆ యజమాని శాస్త్రా గుటుక్కు మనే
సరికి ఆకుటుంబం అంతా అడవులుపట్టి
పోయింది." వా.

## అడావడి చేయు

హడావుడి చేయు.

"తొడలయందం బడావడి నొనర్ప."
శ్రవ. 3.25.

## అడిగంట్లు

అడుగులూ బడుగులూ.

"ర, త్నాకర రత్నరాసు లడిగంట్లు."
కవిక. 1.11.

## అడిగండ్లు మడిగండ్లు

అడుగు బడుగూ.

మిగులూసగులూ అనుట. జం.

"అడిగండ్లు మడిగండ్లు తిరిప మిడెడు
కటికిదేబె లెల్ల." వేమన.

శ. ర. లో అడుగు కండ్లు
అనుకొని అడుగున నిలిచిన
రాళ్లు అని అర్థ మిచ్చుట సరి
కాదు.

## అడిగఱ్ఱ

పాదదాసుడు.

"హరగణంబుల కెల్ల నడిగఱ్ఱ ననిన."
ప్రభు. 8.188.

## అడిగించుకొను

ఒకరితో నీతి చెప్పించుకొను,
ఒకరు అనుటకు వీలుగా తప్పు
దారి నడుచు.

"విన్నావొ వినవొ నీతి స, మున్నతు
లడిగించుకొనఁగ నొప్పునివి ధరణ."
నిరం. 3.25.

## అడిగికొను

బ్రతిమాలు.

"అడిగికొన్నను మొగం బిడనీనిచెక్కిళ్లు
ప్రేమ దీఱఁగ ముద్దుపెట్టి పెట్టి."
కవిరా. 5.188.

"ఇట్లా చేయవద్దురా అని ఎన్నోవిధాల
అడుక్కొన్నాను. వాడు వింటేనా?"
వా.

## అడిగినయంతలోన

అడిగినదే తడవుగా, వెంటనే.

"అడిగినయంతలోన సరసాన్నములన్
సమకూర్చు." పారి. 1.61.

## అడిగేవాడు లేడు

అడ్డుపెట్టువారెవ్వరూ లేరు.

ప్రశ్నించేవా రుండరు. ఏమి? అని అనేవా రుండరు.

"ని, న్నడిగెడువాఁ డుండఁడు ప్రా, ద్దుడిగినఁ బయనింపు మించు కోపిక గలుగున్." క్షేత్ర. పు. 37.

చూ. అడిగేవాళ్లు పెట్టేవాళ్లు లేరు.

**అడిగొట్టు**

కుచ్ఛితుడు.

**అడిచిపడు**

మిడిసిపడు.

చూ. అడిచిపాటు.

"నీకు వృద్ధసేవ లేకున్కి యెఱుఁగంగ నయ్యె రిత్త యిట్టు లడిచిపడుటఁ,బట్టి." భార. కర్ణ. 3.71.

**అడిచినుకు పొడిచినుకు**

కొద్దిగా పడువాన.

**అడిచిపాటు**

మిడిసిపాటు.

త్వర, తొందర అని నిఘంటువులలోని అర్థము సరి కాదు.

"సమర ముపేక్షించి శాంతిమై నుండెద నడిచిపా టేటికి." భార. భీష్మ. 3. ఆ.

"జడనిధిచందంబున ని, మ్మడు వొప్పఁగ నిప్పు డేమి మాడెను నిమ్మై, నడచిపడ రిత్త నెవ్వగ, లుడుగుఁడు మఱి చూచు కొంద మొయ్యన తఱిలోన్." భార. శాంతి. 3 ఆ.

"అడిచిపడు నాజ్యహోమ మంత్రాహుతులకు." శృం. నైష. 4 ఆ.

**అడిత్రావు (గు) డనక**

తక్కువతిండి అని చూడక.

"అడిత్రాగు డనక యిప్పటి, కడిఁదికి నేమాంస మైనఁ గ్రక్కునఁ గొనిరం డెడసేయక..." నారా. పంచ. 1 ఆ.

**అడితిదారు**

అడితి పుచ్చుకొని సరు కమ్మువాడు.

చూ. అడిసాటు.

**అడిటపుమెకము**

ఖడ్గమృగము.

**అడిబంటు**

సేవకుడు, కాపలావాడు.

"ఆమని యింద్రియముల కడిబంటును." తాళ్ళ. సం. 7.246.

**అడిబండ**

అధముడు.

ఒక తిట్టు.

**అడిబీరపుతులువ**

డంబాచారపు మనిషి, వట్టి బీరములు పలుకువాడు.

"అడిబీరపు తులువ గెలుచు నటె పాండవులన్." భార. ద్రో. 4.184.

**అడిబీరము**

శుష్కప్రతాపము.

భార. ద్రో. 4.184.

**అడియండ**

నమస్కారము, దాసోహమనుట. అడి - కాలు (అడి + అండ) అడియేన్ వంటిది.

"దండంబు దర్పితోద్దండరక్షోహర్త కడియండ జాతరూపాంబరునకు." రుక్మాం. 1.123.

**అడియడు**

పాదసేవకుడు.

**అడియరి**

సేవకుడు, నీచుడు.

"అడియరితనమున నప్పాండవుల నాశ్ర
యింపఁజాల." భార. సా. 1.7.
"అడియరి యై తా భోగార్థముగా
దాఁచిన." విజ్ఞా. ఆచా. 87.
"అటమటీని తోడ నడియరితోడను
వెలకు నెత్తమాడ వెరవు గాదు."
ఉ. హరి. 3.112.

**అడియాలము**

సంకేతము, ఆనవాలు.

దక్షిణాంధ్రంలో ఇది వాడుకలో నేటికీ ఉన్నది. (రూపాం) అడయాళము. ఇది కన్నడంమాట.

"అందరకు సంజ్ఞలు నడియాలంబులుం
గల్పించి." భార. భీష్మ. 1.122.
"వాడు దొంగిలించినా డనడానికి అడి
యాళం ఏమీ దొరకలే దట." వా.

**అడియాస**

పేరాశ.

"అక్కట! మోసపోయి యడియాసలఁ
జావక యున్నదాన."
భార. విరా. 2.226.
"సామ్యములఁ గోరక పొమ్మడియాస లే
టికిన్." భా. అర. 4. ఆ.
"పాడి వన్నీ ఒట్టి అడియాసలు." వా.

**అడివిమేళం**

అమాయకురాలు. ఏమీ తెలియనిది అనుట.

"ఆవిడ ఒట్టి అడివిమేళం. దాన్ని కట్టు
కొని ఏం చేస్తావు?" వా.

**అడిసాటా**

కమిషను వ్యాపారము.

అడితిగొని చేయు వ్యాపారము. అరసట్టా, సట్టా వ్యాపారం అని నేటివాడుక.

**అడిసిగ్గులు**

నునుసిగ్గులు.

తలవంచుకొన జేయుసిగ్గులు.

ఇందులోని అడికూడా కాలే. కాళ్లు చూచుకొనుట, తల వంచుకొనుట ఒకటే కదా.

"అడిసిగ్గులు తమకంబులు నుడివోవఁగ."
యయాతిచరిత్ర.

**అడుకులు దిన్న ట్లగునే కడుపున గుట్టె త్తినపుడు**

చేసినప్పటికంటె దానిఫలితం అనుభవానికి వచ్చినప్పుడు తెలుస్తుంది అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"అడుకులు దిన్న ట్లగునే కడుపునఁ గుట్టె
త్తినపుడు గడుఁ బఱచితి."
భార. ద్రోణ. 4.89.

**అడుక్కు తిను**

ఒకతిట్టు. కోపంతో ఎక్కడో దేబిరించు అనుట.

"చదువుకోకపోతే అడుక్కు
తింటాడు."
'ఇంతసే పెక్కడ అడుక్కు తింటు
న్నావురా." వా.

**అడుక్కొను**

ప్రాధేయపడు.

"జనని యడుక్కొని చదువుకోఁ

బా మ్మన్న వినక వేమలు వెక్కి వెక్కి యేడ్చు."
హంస. 3 ఆ. 142.

"నామాట వినరా అని యెంత అడుక్కున్నా వాడు విన లేదు." వా.

"పెద్దవాణ్ణి అడుక్కుంటున్నాను. ఇక అక్కడికి వెళ్ళను." వా.

**అడుక్కొని తిను**

చూ. అడుక్కు తిను.

**అడుగంటు**

1. ఇంకిపోవు, తఱుగు, నశించు.
2. అన్నము మొదలగునవి మాడిపోవు.

"లేకి నిధివ్రజంబు, లవలేశము కాంచన భూధరంబు ర,త్నాకరరత్నరాసు లడుగంట్లు......పురవైశ్యుల సంపద లెన్ని చూపుచోన్." కవికర్ణ. 1.11.

"అన్నం అడుగంటింది."

"వాళ్ళింట్లో ఉన్న బంగారం, వెండి అంతా అడుగంటి పోయింది." వా.

**అడుగకుండిన పోదు**

అడిగితీరవలసిందే అనుట.

"అడుగకుండినఁ బోదింక ననుచు బలికె." కళా. 7.6.

"నిన్నీవిషయం అడగాలని చాలనాళ్ళ నుంచీ అనుకొంటున్నాను. ఇన్నాళ్లూ కుదర లేదు. ఇక అడగకుండా ఉండడానికి వీలు లేదు." వా.

**అడుగటు పెట్టను**

కాలు కదల్చను.
ఖండితముగా రానని చెప్పుటలో ఉపయోగించుపలుకుబడి.

"ధరణి విడిచి దివికి నడుగటు పెట్టన్." కళా. 3.244.

**అడుగటు పెట్టలేను**

ముందుకు నడవను.

"తల నిండఁగ నరఁపు వోసితేని నే నడుగటు పెట్టఁగా వెఱతు నచ్యుత" ప్రభా. 1.92.

చూ. అడుగు తీసి అడుగు పెట్టలేను.

**అడుగడు గశ్వమేధము**

అడుగడుగూ ఒక గండం. అశ్వమేధం అతి కష్టసాధ్యమైనయాగం. లక్షణయా అంత కష్టమైనపని అనుట.

"అడుగడు గశ్వమేధ మగు నాజి మొనన్." కుమా. 11.44.

**అడుగడుగునకు**

తేపతేపకు, అడుగు పెట్టినప్పుడెల్ల.

"ఆర్ద్రవస్త్రంబు లంగంబు లంటవడఁకె,కొనుచు నమ్రత నడుగడుగునకుఁ బెద్ద,మాట గోవింద యనుచును." హంస. 4 ఆ. 212.

"వాడు అడుగడుక్కూ ఆక్షేపిస్తాడు." వా.

**అడుగ బంపు**

విచారించు, కుశల మడుగు.

"నాటనుండియుం బదిలము గాఁగ నన్నడుగఁ బంపనికారణ మేమి?" పారి. 2.28.

**అడుగబోవు**

యాచించు.

"బలిదైత్యు నడుగఁ బోయిన నాఁటి హైన్య మొకటి." జైమి. 1.44.

**అడుగవచ్చినవారు**

పిల్లకు పెత్తనము వచ్చిన వారు.

"అడుగ వచ్చినవార లయ్యబలరూప, శీలకులగుణవిఖ్యాతి చాల మెచ్చి." శుక. 2 ఆ. 153 ప.

**అడు గామడ యగు**

ఒక కొంత దూరమే ఆమడ దూరముగా తోచు – దౌర్బల్యాదులవలన.

"పొడలు పెట్టుచుఁ దన కడుగామ డై యుండ." కా. మా. 3.193.

"నల్లరేగడభూమి. వర్షాకాలంలో నడిచే వారికి అడుగు ఆమడగా నుండును." కాశీయా. పు. 51.

**అడుగు ఆమడగా నడుచు**

మహాభారముతో, శ్రమ తో నడుచు.

"ఆ గర్భిణీస్త్రీ అడుగామడగా నడిచి వస్తే నీవు ఏమాత్రం కనికరం లేకుండా పొమ్మంటే యెక్కడకు పోతుంది?" వా.

**అడుగుకొని తిను**

యాచించు.

"వాడు ఊళ్లో అడుగుకొని తింటు న్నాడు. ఆస్తా? పాస్తా?" వా.

**అడుగుగులాము**

పాదదాసుడు.

"రమ్మని పొమ్మని తెమ్మని
యిమ్మని కానిమ్మటంచు నేఁ గొమరుం బ్రా
యమ్మున నానల నిడుసమ
యమ్మునవీదృశులు నాదునడుగుగులాముల్" భద్రావత్య. 2. ఆ.

**అడుగు తప్పని**

జవదాటని.

నా. మా. 94.

**అడుగు దప్పక**

జవదాటక.

"పతిభక్తితోడ జరిపెడు,
వ్రతములు వల దనెడునట్టి వనితలు గలరే?
పతిమాట కడుగు దప్పక,
సతులకు ననుకూలబుద్ధిఁ జరియింపఁ దగున్." రుక్మాం. 4.79.

**అడుగు దప్పినచో దప్పు పిడుగు**

కొంచెము పొరపాటు చేసినా ప్రమాద మగును; కొంచెం జాగ్రత్తపడితే అది తప్పును అనుట. పిడుగు పడునప్పుడు ఒక అడుగు అటు వేసిన ప్రమాదము, ఇటు వేసిన ఆ ప్రమాదము తప్పును. తద్ద్వారా యేర్పడినపలుకుబడి.

"అడుగుఁ దప్పినచోఁ దప్పుఁ బిడుగటంచు. శుక. 1 ఆ. 319 ప.

**అడుగు దాటడు**

ఏమాత్రం మాట నతిక్రమించడు అనుట.

"వాడు అన్నమాట అడుగు దాటితే ఒట్టు." వా.

**అడుగు దీయక**

వెనుకంజ వేయక.

"కడఁగి సింహముమీఁదఁ గవిసిన సైన నడుగు దీయక గుండె లవియ మోఁదు దుము." గౌ. హరి. ప్రథ. పంక్తి 477-78.

**అడుగున పడు**

విస్మృత మగు.

"వాడు కౌముది అంతా చదువు కున్నాడు. కాని అది అంతా యిప్పుడు అడుగున పడి పోయింది." వా.

"నా అర్జీ అడుగున పడి పోయింది. విచారించేనాథుడు లేడు." వా.

**అడుగుపఱచు**

తక్కువపఱచు.

"లలిఁ గొప్పెక్కించితి మధుపుల, శుకులను నడుగుపఱచి పుష్పాస్త్రా! మా,లలకను మంచంబులు బాపలకను బీఁట లనుమాట బళి ... మయ్యెన్." చంద్రా. 5.।।।.

**అడుగు పెట్టకుండు**

ముందుకు సాగకుండు.

"...ఎంత చేసిన నాసింహ మెచటి కడుగు వెట్ట దయ్యెను." కళా. 3.86.

**అడుగు బట్టు**

మూలబడిపోవు, క్రిం దగు.

"బలుసెక నించువి ల్లడుగుబట్టె దేయిపు డాకు బూదిగెంపులఁ ద్రిరుకెక్కె మాఁది." ఆము. 4.96.

**అడుగు బడుగు**

కుండలో ఆఖరున మిగిలినది.

"కాస్త అడుగో బడుగో యేదో ఒకటి వేయం డమ్మా. ఆకలిగా ఉంది." వా.

**అడుగుభద్రం**

నెమ్మది, నిదానం, పదిలం.

"వాడు వట్టి అడుగుభద్రం లేనిమనిషి. ఎప్పుడు ఎక్కడ ఉంటాడో తెలీదు." వా.

చూ. అడుగు లేనిగిన్నె.

**అడుగు మాడు**

చూ. అడుగంటు.

**అడుగుమానిసి**

పాద సేవకుడు.

పాండు. 4.304.

**అడుగు మాలిపోవు**

నిర్మూల మగు.

"అనుజ తనుజులుఁ జెలులు విద్యాములు నడుగు, మాలిపోదురు నిశ్చఁ గా మనుజనాథ!, యొరకఁ గులనాశనం బను దూఱు మేలె, పాండవులతోడ నొడఁ గూడి బ్రదుక వయ్య." భార. ఉద్యో. 3.341.

**అడుగు ముట్టా**

పూర్తిగా.

"ఆవిషయం అడుగుముట్టా తెలుసుకునే దాకా వదిలిపెట్ట దలచుకో లేదు." వా.

**అడుగులకు మడుగు లొడ్డు [లొత్తు]**

అతిభక్తితో సేవించు.

పూర్వం ఎవరైనా గొప్పవారు వస్తే వారి అడుగులు నేలకు తగులకుండా ఉతికిన బట్ట పరచి దానిమీద నడిపించు కొంటూ వచ్చేవారు. అందుపై వచ్చినపలుకుబడి. ఇప్పటికీ కొండఱి పెండ్లిండ్ల లోనూ, శ్రాద్ధాలలోనూ గౌరవసూచకంగా బట్టలు పఱిచి నడిపించుట కాన వస్తుంది.

"జనయిత్రీజనకులం గని మది నడరుచు నడుగులకు మడుగు లొడ్డుచు నరుగు నెడ." పాండు. 2.25.

**అడుగుల వ్రాలు**

పాదాభివందనము చేయు.

"దశరథుఁ డడుగుల వ్రాలు తనయుఁ నిర్వురఁ దాఁ గౌఁగిలించి."
వర. రా. బా. పు. 207 పంక్తి 18.

**అడుగు లాన**

పాదాల సాక్షిగా.

ఒట్టు పెట్టేటప్పుడు చెప్పే మాట.

"నీ యడుగులాన." కాశీ. 7.179.

**అడుగులు తడబడు**

కాళ్లు తడబడు.

"అడుగులు తడఁబడ నడరెడు నడపుం గడఁకల నడుములు గడగడ వడకం..."
కళా. 6.251.

"అడుగులు తడఁబడఁ బులకలు, పొడ మగ సఖివెనుక కొదుగఁ బోవుచు నర సెన్." కళా. 7.147.

**అడుగుల కెఱఁగు**

నమస్కరించు.

"సంతసంబున వచ్చి యా సంయ మీంద్రు, నడుగులకు నెఱఁగుడు నతఁ డాదరమున." పారి. 2.22.

**అడుగులు సడుగులు**

చూ. అడిగండ్లు మడిగండ్లు.

**అడుగులేని గిన్నె**

కుదురులేని మనిషి.

"వాడు వట్టి అడుగు లేనిగిన్నె. ఎక్కడా నాలుగునాళ్లు పని చేయ లేడు." వా.

**అడుగులో అడుగు వేసుకొంటూ**

మెల్లగా.

"ఇలా అడుగులో అడుగు వేసుకొంటూ వెడితే యిక మనం చేరినట్టే." వా.

**అడుగులో దాటిపోవు**

కొంచెములో తప్పిపోవు.

**అడుగులో హంసపాదు**

ఆరంభంలోనే విఘ్న మనుట.

'ప్రథమకబళే మక్షికాపాతః' వంటిది.

"వాళ్లు పిల్లను చూడ్డానికి వచ్చేసరికి మా అమ్మాయి ముట్టయి కూర్చుంది. అడుగులోనే హంసపాదు. ఏ మవు తుందో ఏమో!"

చూ. అంచపదము.

**అడుగువట్టు**

నీటిలో అడుగుభాగమునకు దిగిపోవు.

నౌకలు మొదలగువానివిష యంలో నీరు లోతు తగ్గగా నేల తాకి ఆగిపోయినప్పుడు కూడా అడుగుపట్టిన దంటారు.

"నిర్ఝరగతి ద్రచ్చుచో నడుగువట్టిన తద్గిరి యెత్తవే." పారి. 3.29.

**అడుగు వాసినచో నక్కఱ వాయు**

ఇల్లు దాటిపోతే ఇంక ఇంటి ధ్యాస ఉండదు.

ఇది సామాన్యంగా మగ వాళ్లను గూర్చి చెప్పుటలో ఆడవాళ్లుపయోగించే పలుకు బడి.

"శీఘ్రము పఱతెంచెద ననుట యడుగు వానినచో నక్కఱ వాయు ననుట నిజ మని యెఱుఁగరు గా."
శుక. 3 ఆ. 146 ప.

**అడుగూ బడుగూ**

వంట చేసినపాత్రలో మిగిలిన అంటూ సొంటూ.

"వాళ్లంతా తిని కుడిచినతర్వాత ఇంత అడుగూ బడుగూ ఉంటే నా మొహాన వేస్తారు." వా.

**అడువపుట్టువు**

తక్కువవాడు – ఒకరికింద పడి ఉండేవాడు.

శ. ర. లో కాపువాడు అని ఉన్నది. అది సరికాదు. ఈ అడువ, అడవ, అదువ, అరవ దాదాపు సామాన్యార్థకాలు.

**అడుసున పాతినకంబము**

అస్థిరము.

**అడ్డంగా చీల్చి పారేస్తాను**

తిట్టునప్పు డనుమాట.

"మళ్ళీ యింకోసారి యిలాగే అన్నా వంటే అడ్డంగా చీల్చి పారేస్తాను." వా.

**అడ్డంగా పెరుగు**

లావగు.

"వాడీ మధ్య అడ్డంగా పెరిగి పోతు న్నాడు." వా.

**అడ్డం పుట్టినవాడు**

మొండివాడు, మూర్ఖుడు.

"వాడు అడ్డం పుట్టినవాడు. వాణ్ణి ఒప్పించడం బ్రహ్మతరం కాదు." వా.

**అడ్డకత్తి**

పట్టాకత్తి.

**అడ్డకట్టుకొని**

ఆకట్టుకొని, స్వాధీనము చేసికొని.

"ధీయుత! యడ్డకట్టుకొని తెచ్చి నరుల్ తమ కెక్కరింతలకె, జేయుట నీతివైభవ విశేషము గాదె తలంచి చూడఁగన్." కళా. 7.262.

**అడ్డకమ్మి**

గుమ్మముకమ్మి, లక్ష్మికమ్మి.

**అడ్డకట్టలు**

ఒకరకమైన సుఖరోగము, విఘ్నములు.

చూ. అడ్డకట్ట వేయు.

**అడ్డకట్టవేయు**

ఆటంకపెట్టు.

**అడ్డకాలు వేయు**

విఘ్నము కలిగించు.

ఎవరైనా పోతుండగా కాలు అడ్డం పెట్టినట్లు అనుట.

"తలగలిగినఁ గుళ్ళాయులు, గల వేవగ నె వ నీవు గలిగిన దాదృ, క్కలరవము లెన్నియైనం, గలిగాడుఁ బోకు మని యడ్డగాల్ వేయంగన్." సా. ఆ. 2.

**అడ్డకు పడ్డ పెట్టుకొను**

కొంచానికి ఎక్కువ నష్టపెట్టుకొను.

**అడ్డగట్టమాట**

అడ్డుమాట.

"ని యడ్డగట్టమాటల కీయెడఁ బని లేదు." రుక్మాం. 5.90.

అడ్డగాడిద

తిట్టు. పనీపాటా లేకుండా తిరిగేవాడు.

అల్లరిచిల్లరిగా తిరిగేవాడు.

మాటా. 9.

"వాడు అడ్డగాడిదలా ఊరంతా ఎప్పుడూ తిరుగుతుంటాడు." వా.

అడ్డగాలు వేయు

అడ్డగించు.

"పోకు మని యడ్డగాల్ వేయంగ౯." సారం. 2.16.

అడ్డగోడ

కొంచెం ఎత్తుగా హద్దు నేర్ప రుస్తూ పెట్టుగోడ.

"వాళ్ళింటికీ వీళ్ళింటికీ మధ్య అడ్డగోడ ఒక్కటే వ్యవధానం. వాళ్ళెప్పుడూ అన్నదమ్ముల్లాగా ఉంటారు." వా.

అడ్డగోడమీద దీపం పెట్టినట్లు

అటూ యిటూ కూడా ఉన్న ట్లుండు. ఎటో ఒక వైపు మొగ్గక అనుట.

అడ్డగోడమీది పిల్లి

చూ. గోడమీది పిల్లి.

అడ్డగోలుగ

ఎట్లు పడితే అట్లు.

రుద్రమ. 84 పు.

అడ్డగోలు వ్యవహారం

గందరగోళపు వ్యవహారము.

అడ్డపట్టుపాప

అడ్డపాప.

"అడ్డపట్టెడు పాపఁ డఁటవె యో యమ్మ." సారం. 2 ఆ.

చూ. అడ్డపాప.

అడ్డపట్టుల పాప

చిన్నిపాప.

అడ్డాలలోని పాప. తె. జా.

అడ్డపచ్చ

ముదురుపచ్చ.

"సుకుమార శుకచ్ఛదచ్ఛటా దాయా దంబు లై యడ్డపచ్చ గొనునవియును." కాశీ. 7.26.

అడ్డపడు

1. కాళ్ళమీద పడు. 2. అడ్డు వచ్చు.

"సెగులున నడ్డపడి యేడ్చి." సారం. 3.199.

"తప్పదు బ్రహ్మశతం బడ్డపడిన." గౌర. హరిశ్చం. పం. 1078.

"అడ్డపడి చెప్పుకుంటే వినకపో తాడా." వా.

అడ్డపాప

పసిబిడ్డ.

చిన్నతనంలో పసిపిల్లలను చేతులపై అడ్డముగా పెట్టు కొని పోవుటపై వచ్చిన పలుకు బడి. అడ్డాలలో బిడ్డ డనుట.

"...నోరిలోపల౯ వ్రేలిడినప్పుడుక్ గఱవనేరఁడు నీసుతుఁ డడ్డపాపయా." సారం. 3.58.

చూ. అడ్డపట్టుపాప.

అడ్డపెట్టు

అడ్డగించు.

"ధర్మపరిపాలుర మమ్ము నడ్డపెట్ట..." భాగ. షష్ఠ. 81 ప.

**అడ్డపెట్టు లేక**
ఆటంకము లేకుండ.
"బాడ్డనబావుల నడ్డపెట్టు లేక విహరిం
చుటకు వజ్రనాభునుదల యడిగి."
ప్రభా. 1.121.

**అడ్డపేరు**
ఏదో ఒకందుకై నడుమ ఎవరో
పెట్టినపేరు.
"అతని పేరు శంకరశాస్త్రి అయినా
కూరగాయల కెప్పుడూ దేవిరిస్తూ
ఉండడంచేత కూరగాయలశాస్త్రి అని
అడ్డపేరు వచ్చింది." వా.

**అడ్డపొగ వేయు**
అడ్డు వేయు.

**అడ్డబాస**
బులాకీ.
తె. జా.

**అడ్డమాడు**
వ్యతిరేకించు.
రుద్రమ. 40 పు.

**అడ్డము చెప్పు**
వ్యతిరేకించు.
"ఏది చెప్పినా వాడు అడ్డం చెప్తాడు."
వా.

**అడ్డముపడు**
అడ్డు వచ్చి కాపాడు.
"దాని కడ్డముపడ నెవరు వచ్చిన సమ
యింపుము." మార్కం. 6.158.
ఎవ రడ్డం వస్తారో చూస్తాను
అనే రీతిగా కూడా విన
వస్తుంది.

**అడ్డము వచ్చు**
అడ్డము వచ్చి కాపాడు. అడ్డు
పడు.
"అమ్మధురాపురీరమణు లడ్డము వత్తురు
గాక." భాగ. దశ. పూ. 1474.

**అడ్డ మూడే కళ్లగా తినువాడు**
అడ్డబియ్యం వండగా మూడు
ముద్దలతో మింగివేస్తా
డనుట.
అంటే తిండిపోతు.

**అడ్డమైన**
ఏది పడితే అది, సమయాను
కూలంగా, నీతి నియమం
లేకుండా.
కాశీ. 7.232.
"వాడు అడ్డమైనకూళ్లూ తింటాడు."
"అడ్డమైనవాళ్ల కాళ్లు పట్టుకొం
టాడు."
"అడ్డమైనపని చేస్తాడు." వా.

**అడ్డమైన కూళ్లు కుడుచు**
అన్ని నీచాలకూ పాల్పడు.
"వాడు అడ్డమైన కూళ్లూ కుడుస్తు
న్నాడు." వా.

**అడ్డమైన గడ్డి తిను**
నీచానికి లోబడు.
చూ. అడ్డమైనకూళ్లు కుడుచు.

**అడ్డమైన చాకిరీ**
నానా పనులూ
"వాడు నాచేత అడ్డమైన చాకిరీ
చేయించుకొని తరిమేశాడు." వా.

**అడ్డమైన వాడు**
1. ఎవడు పడితే వాడు.

"ఆ ఊళ్లో అడ్డమైనవాడూ పెద్ద మనిషే." వా.

2. ప్రతివాడు.

"అడ్డమైనవాడూ నన్ను ఆక్షేపించేవాడే."

"ఆ సత్రంలో అడ్డమైనవాళ్లూ దిగుతూంటారు." వా.

## అడ్డమైన మాటలు మాటలాడు

నోటికి వచ్చినట్లు మాట్లాడు.

"వాడక్కడికి వెళ్లేసరికి అడ్డమైన మాటలూ మాట్లాడాడు." వా.

## అడ్డవాటు

అడ్డుపుల్ల.

"అడ్డవాట్లు వేసి చెఱచినం గాని నీకుఁ గునుకు పట్టదు." తె. జా.

## అడ్డవాతియమ్ము

అర్ధచంద్రబాణము.

## అడ్డాదిడ్డముగా

వక్రముగా.

"వాడెప్పుడూ అడ్డాదిడ్డంగా మాట్లాడుతాడు." వా.

## అడ్డాదిడ్డిగా

ఇష్టం వచ్చినట్లుగా, ఒకక్రమం లేక అనుట.

"ఆ ఊరు అడ్డాదిడ్డిగా పెరిగిపోతూ ఉంది. అందమా? చందమా?" వా.

## అడ్డాదిడ్డులు

ఆటంకాలు. జం.

"వినయంబుతోఁ జేరి పని యేమి యనువాఁడె, యరయ కడ్డాదిడు లనుపసాఁగె." కువల. 2.24.

## అడ్డాయుధము

కత్తి – అడ్డకత్తి.

బస. 5 ఆ. 147 పుట.

## అడ్డావిడ్డము తిరుగు

ఎటు పడితే అటు తిరుగు.

"అడ్డావిడ్డము తిరిగే, తెడ్డెఱుఁగునె పాలతీపి." వేమన.

## అడ్డాదిడ్డములు

అవీ ఇవీ.

"వడ్డించు మనుచుఁ గుడుచుచు, నడ్డావిడ్డములు పలుకునంతటిలోనఁ." బసవ. 6.191.

చూ. అడ్డాదిడ్డులు.

## అడ్డిపోవు

ఆగిపోవు.

కొన్ని ప్రాంతాలలో విరివిగా వినిపించేపలుకుబడి.

"అంతా యేర్పాట్లయిన తర్వాత ఉన్నట్లుండి ఆ పెండ్లి అడ్డిపోయింది." వా.

## అడ్డుకట్ట వేయు

విఘ్నము కలిగించు.

అడ్డుకట్ట–ఆటంకము.

## అడ్డుగట్టమాటలు

అడ్డుమాటలు.

"నీయడ్డుగట్టమాటల కీయెడఁ బని యేమి?" రుక్మాం.

చూ. అడ్డుపుల్ల వేయు.

## అడ్డుపుల్ల వేయు

విఘ్నము కలిగించు.

"వాడు ఎక్కడికి వచ్చినా ఏమి జరుగుతున్నా ఏవో ఒక అడ్డుపుల్ల వేయకుండా ఉండడు." వా.

**అడ్డువాట్లు వేయు**

విఘ్నము కలిగించు.

రుద్రమ. 70.

**అడ్డేటుమీద గుద్దేటు**

కాకతాళీయంగా తగిలిన దెబ్బపై మరొక దెబ్బ తగులు.

**అణక వేసుకొను**

మెడమీద నున్న కాడిమాను మెడకిందికి వచ్చునట్లుగా ఎద్దు తిరుగబడు.

"ఆ యెద్దు అణికె వేసుకుంది. దాన్ని లేపేదాకా మనం గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవలసిందే." వా.

**అణుమాత్రము**

ఏకొంచెమున్నూ.

"అణుమాత్రమును గర్వగుణము లేక." కా. మా. 2.7.

"నా కా విషయంలో అణుమాత్ర మైనా సందేహం లేదు."

"వాడికి అణుమాత్రం కూడా కృతజ్ఞత లేదు." వా.

**అణోరణీయాన్ మహతో మహీయాన్**

చిన్నలలో అతిచిన్న, పెద్దలలో అతిపెద్ద.

భగవంతుని విషయంలో ఉపయోగించే వైదికసూక్తి.

**అతంత్రపుమనిషి**

నమ్మడానికి వీలులేని మనిషి.

"వాడు చాలా అతంత్రపు మనిషి. వాణ్ణి నమ్మి యే పనిలోకి దిగడానికీ వీలు లేదు." వా.

**అతంత్ర మయిన**

భద్రంగా లేని.

శ. ర. లో అతంత్రం అంటే స్వాతంత్ర్యము తప్పినది అనుట సరి కాదు. ఇది నేటికీ వాడుకలో భద్రంగా లేదు అన్న అర్థంలో విరివిగా విన వస్తున్నది.

"మాతామహుయాగతంత్రము నతంత్ర (ద్ర)ము చేసి." కాశీ. ఆ. 6.

"ఈ యిల్లు చాలా అతంత్రంగా ఉంది. ఇంతమంది పిల్లలతో వానాకాలంలో ఉండా లంటే భయంగా ఉంది."

"ఆ కుర్చీకాలు కాస్త అతంత్రంగా ఉంది. జాగ్రత్తగా కూర్చో." వా.

**అతకుత లగు**

అతలకుతల మగు.

"అకట యవి సవరింపఁగా నతకుత లయి." బాల. 7.

**అతనిచేతులలో చెంగలమ్మగొట్ట**

ఒక సామెత.

"అకట! వన్యాళి గాంగఁ బొమ్మనుచుఁ గొట్టు, నతని చేతులలోఁ జెంగలమ్మ గొట్ట." శుక. 3 ఆ. 403 ప.

సూ. అతని చేతులు పడిపోను.

**అతని చేతులు పడిపోను**

ఒకసామెత.

"ఎంత దెబ్బ వేశాడు - అతని చేతులు పడిపోను." వా.

**అతలకుతల మగు**

క్రక్కదలిపోవు.

"కుతలము పదహతుల నతలకుతలం బయ్యెన్." సింహా. 1.154.

"ఎడ్లబండిలో ఆ పదిమైళ్లూ ప్రయాణం చేసేటప్పటికి ఒళ్ళంతా అతలకుతలమై పోయింది."
"మిలిటరీవాళ్లు దిగడంచేత ఆ ఊరంతా అతలకుతలం అయిపోయింది." వా.

## అతికమాత్ర

అధికప్రసంగి.

ఇది చిత్తూరుజిల్లాలో విశేషంగా ప్రచారంలో ఉండే పలుకుబడి.

చూ. అదనప్రసంగి.

## అతిగహనము

చాల క్లిష్టమయినది.

"దీని విధానం తెలియఁగంగా......దానతిగహనంబు." భార. అర. 1.33().

## అతిథీ అభ్యాగతీ

వేళకు వచ్చే పథికులూ వారూ. జం.

"వాళ్లింటికి రోజూ అతిథో అభ్యాగతో ఎవరో ఒకరు వస్తూ ఉంటారు." వా.

## అతి పనికి రాదు

ప్రతిదానికి పరిమితి ఉండాలని చెప్పునపుడు అనేమాట.

"స్నేహాలూ, ప్రేమలూ, రావడాలూ, పోవడాలూ ఇవన్నీ ఉండవలసిందే. కాని అతి పనికి రాదు రా బాబూ!" వా.

## అతిమనిషి

మితి మించి ప్రవర్తించువాడు.

"వాడు వట్టి అతిమనిషి. ఏమాత్రం చనువిచ్చినా నెత్తిన కూర్చుంటాడు." వా.

## అతిరథులూ మహారథులూ

ఎత్తిపొడుపుగా, వాళ్ళంతా చాల గొప్పవాళ్లు లే అన్నట్లు ఉపయోగించేపలుకుబడి.

ప్రాచీనయుద్ధ పరిభాషద్వారా వచ్చినది.

"ఉన్నారు గా మీ వాళ్ళంతా అతిరథులూ, మహారథులూ. నా సాయం ఎందుకు కావలసి వచ్చింది?" వా.

## అతిరసాలు

ఒక పిండివంట.

## అతివాసము

చూ. అధివాసరము.

## అతివినయము

ధూర్తత.

అతివినయం ధూర్తలక్షణం అనే నీతివాక్యంపై ఏర్పడినది.

"అదంతా వినయం కాదు. అతివినయం సుమా." వా.

## అతివృష్టి అనావృష్టి

ఏదొచ్చినా ఎక్కువే అనుట.

వర్షసంబంధమైన పలుకుబడి.

"వాడు వస్తే రోజూ వస్తాడు. లేదా కొన్ని నెలలు కనిపించడు. వాడిదంతా అతివృష్టీ అనావృష్టీ." వా.

## అతిశయం

గర్వం.

"కలవారింటి కోడలని దానికి మహా అతిశయం." వా.

"అంత అతిశయాలకు పోవద్దురా? మనమేమి ఉన్నవాళ్లమా? ఏమన్నానా?" వా.

**అతి సర్వత్ర వర్జయేత్**

ప్రతిదానికీ పరిమితి ఉండాలి అని చెప్పవలసినపుడు అనే మాట.

"నీవు మరీ వాడితో అంత పూసుకొని తిరుగుతున్నా వేమిరా? అతి సర్వత్ర వర్జయేత్ అన్నారు." వా.

**అతీ గతీ లేదు**

దానినిగురించి ఏమీ తెలియదు. జం.

"వాడికి పదిజాబులు రాసినా అతీ గతీ లేదు." వా.

**అతుకులబొంత**

చిన్నచిన్న బట్టపేలికలను అన్నిటినీ చేర్చి, బొంతగా కుట్టడం పల్లెలలో నేటికీ అలవాటు. దానిపై వచ్చిన పలుకుబడి.

"ఆ కావ్యం అతుకులబొంతగా తయారైంది. దాన్లో కొంత దీన్లో కొంత తీసి పట్లు వేస్తే అంతకంటే యేమవుతుంది?"

"ఈ అతుకులబొంత సంసారం నేను చెయ్యలేనమ్మా. ఒకటి ఉంటే ఒకటి ఉండదు." వా.

**అతుకులసంసారం**

చాలీ చాలని ఆదాయం గల సంసారం.

"మే మేదో అతుకుల సంసారం చేస్తున్నాము. మా కవన్నీ రావాలంటే ఎక్కడ వస్తాయి?" వా.

**అత్తకోక తొలగినట్లు**

ఏ మనడానికీ వీలు లేనిపరిస్థితి యేర్పడినప్పు డనేమాట. కోక తొలగిం దని చెప్పినా బాగుండదు, చెప్పక పోయినా బాగుండదు.

"నక్క యురులలోనఁ జిక్కుకొన్న విధానఁ, గోరి మునుగు చేసికొన్న పనికిఁ, బేగులోనితీట విత మాగు నన రాగు, అత్తకోక తొలఁగినటులఁ బలుక." రాధికా. 3 ఆ.

**అత్తగంతు**

వేశ్యామాతల గుంపు. శుమా. 8.135.

**అత్తగారి సాధింపు**

ప్రతి చిన్నదానికీ దెప్పిపొడుచుట.

**అత్తపోరు**

అత్త కోడలిని పెట్టుఆరడి.

"ఈ సంబంధం చాలా మంచిది. అత్తపోరూ, ఆడబిడ్డపోరూ ఏమీ లేదు. ఒంటిగాడు. లక్షణమైన సంబంధం." వా.

**అత్తమామలపోరు లేని కాపురం**

కొత్తగా వచ్చిన కోడలిని అత్తమామలు ఊరికే తప్పు పట్టుతూ పోరి బొక్కలాడుతారు. అట్టి పెద్దలెవరూ లేని కాపురము. అనగా స్వేచ్ఛ ఉన్న దనుట.

"నిలనిని వంటవార్పుల నత్తమామల పోరును లేనికాపురము గలిగె." శుక. 3 ఆ. 60 ప.

**అత్తముండ**

నిరసనగా అనునప్పుడు అత్తను గూర్చి అనుమాట.

"ఉత్తముండకంటే అత్తముండ మేలు." సా.

**అత్తమీద కన్నులు అంగడిపై చేతులు**

"నందసుతుఁడు మున్ను నామీఁది ప్రేమచే, నొకటి సేయఁ బోయి యొకటి సేయు, అత్తమీఁదఁ గన్ను లంగటిపైఁ జేతు, లాయె ననుచుఁ దెలియ లరసి నవ్వ." రాధి. 3 ఆ.

**అత్తలాగ**

అత్తవలె పోరు ననుట.

"అత్త లేకపోతే నేం. మా ఆయన ఉన్నాడుగా. ఆయనే నాకత్తగారు." "ఆ మేనేజరు అత్తలాగ అస్తమానం పోరుతుంటా డంటే నమ్ము." వా.

**అత్త లేనికోడలు ఉత్తమురాలు**

దండించువా రెవరూ లేరు. కనుకనే ఆమె తప్పులు బయటపడ వనుట.

"అత్తలేని కోడ లుత్తమ్మురాలు." సా. సా.

**అత్తా లేదు ఆడబిడ్డా లేదు**

దండించువారు, తప్పు పట్టువారు ఎవరూ లే రనుట.

"అత్తా లేదు. ఆడబిడ్డా లేదు. దాని కేం? ఏమయినా చేస్తుంది." వా.

**అత్తారబత్తంగా**

ముడుపులాగా.

క్రొత్త. 29.

**అత్తింటికాపురం**

పరతంత్రజీవనం.

"అక్కడ పని చేయడం అత్తింటి కాపురంగా ఉంది. ఏం చేసినా తప్పే. ఏం చేయకన్నా తప్పే." వా.

**అత్తింటికుంది**

ద్వేషముతో చూడబడునది.

**అత్తింటికోడలు**

మగనాలు.

"అత్తింటికోడలికిఁ గా, హత్తుక నతఁడుండె నొక యువాగ్రణికొలకై." హంస. 2 ఆ. 246 ప.

**అత్తిల్లు చేరి బ్రతుకు**

నీచముగా జీవించు.

కృష్ణనీ. 76.

**అత్తెసరు పెట్టు**

సరియెసురు పెట్టు. బియ్యానికి పైన చేతివ్రేళ్లు మునిగేదాకా నీళ్లుండునట్లు ఉంచి పొయ్యిమీద పెట్టుట. అది ఉడికేటప్పటికి సరిగ్గా ఆ నీళ్లు సరిపోతవి. వార్చవలసిన అవసరం ఉండదు. దీనినే రాయలసీమలో సరియెసరు, సరెసురు అంటారు.

"నేను బయట ఉన్నానా? మా ఆయన కుంపటిమీద అత్తెసరు పెట్టి వెళ్ళిపోతారు? మా యెడపిల్లతోనే దాన్ని పొయ్యిమీదినుంచి దింపించి ఉంచుతాను." వా.

**అదటడచు**

పొగరడచు.

"అదయతఁ బోనీక పొదివి యద
టడఁచె." భాస్క. యుద్ధ. 1808.

## అదనప్రసంగి

అనవసరంగా కల్పించుకొని మాటలాడువాడు.

చిత్తూరు జిల్లాలో ఎక్కువ వాడుకలో నున్నరూపం.

"వాడు వట్టి అదనప్రసంగి. వాడితో ఎవరు పెట్టుకుంటారు?" వా.

చూ. అధికప్రసంగి.

## అదనవిరిద లగు

అదవద లగు.

"మదనభూతము సోఁకినమగువలు పురుషులు అదనవిరిద లై అంగమొల లై పెదవి నెత్తురు లీర్చి."
తాళ్ల. సం. 9.205.

## అదను పదను

తగినసమయము. జం.

"అదనుపదను నెఱూర్చి మాయప్పు దీర్చి, పొమ్ము నీ వన్నఁ బోమె యీ పోరు మాని." హరి. 4.37.

## అదరంట

బాగా, లోతుగా.

"అదరంటఁగా నొక్కి యానఁ బోవ."
రాధి. 1.113.

## అదరగొట్టు

అడలగొట్టు.

"వాడు మాటలతో ఇతరులను అదరగొట్టేస్తాడు." వా.

చూ. అదరవైచు.

## అదరవైచు

బెదరించు.

"అదరవైచియు బుజ్జగించియు బోధించియు." ప్రభావ. 3.142.

చూ. అదరగొట్టు.

## అదరువేటు

ప్రాణానికి ముప్పు లేకుండా భయపెట్టుటకు మాత్రమే కొట్టు దెబ్బలు. రాయల సీమలో విరివిగా వాడుకలో నున్న పలుకుబడి.

"నాలుగు అదురువేట్లు వేసి పంపితే సరి." వా.

## అదవ

1. వికల మయిన.

"వాడిది కొంచెం అదవచేయి."

"వాడికి కాలు అదవ కనక యీడుస్తూ నడుస్తాడు." వా.

2. ఒకరికింద ఉన్నవాడు, దుర్బలుడు, అందువల్లనే తెలివి తక్కువవాడు.

వావిళ్ల వగైరా కోశాలలో ఉన్న అస్థిరుడు అన్న అర్థం సరి కాదు. ఇది నేటికీ రాయల సీమలో ప్రచురంగా అలవాటులో ఉన్నపదం.

## అదవకాపుర ముండు

1. ఎత్తుడుకాపుర ముండు.

2. ఒకరిపై బ్రతుకు.

లక్షణయా అదవకాపుర మనగా అదవవాని కాపురము వంటి కాపుర మనుట.

"కెడసిన గరిసెల క్రింద లాఁగలఁ గ్రుస్సి యదవకాఁపుర ముండు నాఖుతతుల."
ఆము. 6.13.
చూ. అదవ్రతావుడు.

## అదవచిక్కు

అధీనములో నుండి లోకువ యగు.

"నీకు నే నేం అదవ చిక్కినా ననా ? అన్ని మాట లంటున్నావు ?" వా.

"వాడు అదవ చిక్కినవాడు కనుక ను వ్వేం చేసినా చెల్లుతూ ఉంది. ఇం కెవడైనా అయితే ఓర్చుకుం టాడూ ?" వా.

## అదవ్రతావుడు

తిరిపెపు త్రాగుడు.

ఒకరు త్రాగుతూ—వీడు ఎదురుగా ఉంటే పోనీ వాడికీ ఒక ముంత ఇవ్వు అని—యిప్పించునది. అదవ అంటే లోకువ, క్రిందివాడు అనే అర్థాలలో అనేక ప్రయోగాలు కాన వస్తాయి. అదవనాయాలా ఒక తిట్టు.

"తన చెలులిండ్లయం దదవ్రతావుడు త్రావుచు..." పాండు. 3 ఆ. 19 ప.

## అదవదపడు

వ్యథపడు.

"భేతాళుఁ బురికొల్పి పృథవీశు నసిధార, నాతండుఁ దెగి కూల నదవదపడి."
రామకథా. బాల. 7.476.

## అదవద పొందు

కలత చెందు.

"అదవదఁ బొందఁ బా లయితి నక్కట !" హరి. ఉ. 8.199.

## అదవద లగు

చెల్లాచెదరు లగు, కలత చెందు.

"అదవద లైన పయ్యెదలు నందము తప్పిన హారవల్లులున్." విక్ర. 5 ఆ.

## అదవనాయాలు

ఒక తిట్టు.

"పోరా అదవనాయాలా. నీతో నేం నాకు ?" వా.
చూ. అదవ.

## అదవబతుకు

నీచపుబతుకు.

"నాది వట్టి అదవబతుకు అయి పోయింది." వా.

## అదవెట్టు.

మొఱపెట్టు.

"అని యిట్లు ధరణీసురుం డదవెట్ట భాగవతశ్లోభమునకు భువనభర్త యు భయంపడి." ఆము. 7.48.

## అదాట్టుగా

హఠాత్తుగా.

"వాడు అదాట్టుగా వచ్చి పట్టు కొన్నాడు." వా.

## అది ఒకటే కొదవ

కావలసి నన్నీ అయినవి, అదొక్కటే తక్కువ అనుట.

"ప్రజలయిండ్లఁ గన్నపెట్టని దొక్కటే కాని కొదవ, కడకు దుర్వృత్తు లన్నియుఁ గఱచె నతఁడు."
నిరంకు. 2.26.

"వాడు దివాలా తీయడం ఒక్కటే కొదవ." వా.

2. ఏమున్నాయి గనుక అద లేదని?

"ఒకరు :- ఎంతమంచి షిఫాను చీరలు వచ్చాయనుకున్నావు!

"మరొకరు :- అదొక్కటే తక్కువమ్మా! నా మొహానికి." వా.

## అది కాదు

వాక్యోపస్కారకము.

## అది గాక

అంతే కాక.

ఏదైనా ఒకటి చెప్పి మరొకటి చెప్పేటప్పుడు ఉపయోగిస్తారు.

"వానికి మన మంటే పడదు. వాడా లోభి. ఇలాంటప్పుడు మనం పోయి అడిగితే వాడిస్తాడా చస్తాడా? అది గాక అంతదూరం మనం పోయి వచ్చేంత సావకాశం కూడా లేదు." వా.

రూ. అదీ గాక.

## అది నేరమా?

అది ఒక తప్పా?

ఏదో కొంత పొరపాటున్నా అదంత పెద్ద తప్పుకాదు అని చెప్పటలో ఉపయోగించే పలుకుబడి.

"ముదురు చందురుఁ గావి కెమ్మోవి మీఁద, నాఁట నొత్తిని పలుగంటి నాటుపట్ల...అది నేరమా తలంప." రాజగో. 3.36.

"ఆయన వచ్చేటప్పటికి నేను ఇంట్లో లేను. అదీ ఒక నేరమా? దాని కింత గొడవ పెట్టాలా? ఇంతేనా అనుకుని కాఫీహోటలుకోసమే వచ్చాను."

"వాడిని చేరదీసి అన్నం పెట్టాను. అదీ ఒక నేరమా?" వా.

## అది మొదలుకొని

అక్కడినుండి.

"అది మొదలుకొని చెప్ప మొదలిడ యనిన." కళా. 3.287.

## అది యట్లుండె

అది అలా ఉండనీ.

"అది యట్లుండె నన్నిగ్రహంబైన వివిధోప చారంబుల సంఘటింపఁ బెంపునం బ్రవర్తిల్లుచుండు." ప్రభా. 1.80.

"అది అలా ఉండనీ..." వా.

## అది యెంతమాత్రము?

అదెంత పని?

అతిసులభ మనుట.

"చేసి కావలె...
అన నది యెంతమాత్రము ధరామర నందన వేడు మింక నొండు..." నిరం. 4.122.

"అ దెంతపని? ఒక నిమిషంలో చేస్తాను." వా.

"నాలుగు పద్యాలూ ఇప్పుడు రాస్తాను. అ దెంత మాత్రం." వా.

## అదిరిపాటు

1. అకస్మాత్తు, హఠాత్తు.

2. మిడిసిపాటు.

"అదిరిపాటెవ్వఁ డీక్షించె నాకసమున హాటకపు నుష్టపింగళుఁ డైనపురుషు, నాతనికి వత్సరద్వయం బవధి చూ వె." కాశీ.

"వాడి అదిరిపాటు చెప్పటానికి తరం కాదు." వా.

**అదిశం**

విచిత్రం, వింత, ఆశ్చర్యం.

ఇది 'అతిశయం' నుండి వచ్చినపలుకుబడి.

దక్షిణాంధ్రంలో ప్రచురంగా వినిపించేపలుకుబడి.

"వాళ్లేదో ఆ బిడ్డను అడుగు కింద పెట్టనీయకుండా సాకుతున్నారు. మహా అదిశంగా వీళ్లకే పిల్ల ఉన్నట్లు."

"అదేం అదిశమమ్మా! పిల్లను అత్తవారింటికి పంపడానికి అంత యిదయి పోతున్నారు." వా.

**అది సంపాయిస్తున్నది**

ఒడలమ్మకొని పబ్బు చేసుకుంటున్నది అనుట.

చిత్తూరుజిల్లాలో ఇది యెక్కువగా వినవస్తుంది.

**అది సుత**

అదిమొదలు.

నాయక. పు. 9.

**అదీ ఒక గొప్పా**

గొప్ప కా దనుట.

"భండనమందు నాకు నొక పాండవు లెంతటివారు." పాం. విజ.

"వాడేదో నాలుగుపద్యాలు రాశాడట. అదీ ఒక గొప్పే?" వా.

**అదీ ఒక తప్పా?**

"ఆయన బజారులో వెడుతూ ఉంటే నేను అరుగుమీదినుంచి లేవలేదట. అదీ ఒక తప్పా? వాడితో అన్ని మాట లన్నాడట."

"వాడేదో పద్యాలు వినిపించాడు. సరే. విన్నాను గదా. తానేదో శాస్త్రి [illegible] [illegible] తే దట. [illegible] [illegible] గా [illegible]." వా.

[illegible]

**అదుసు బదుసు**

అనుపాను. [illegible]

"అదనుం బదను నెరింగి [illegible] చాలు." తాళ్ల. సం. 3.582.

**అదుపు ఆజ్ఞ**

కట్టుబాటు. [illegible]

"వాడు ఈమధ్య బాగా అదుపూ ఆజ్ఞా లేక తిరుగుతున్నాడు." వా.

**అదురుగుండె**

భయస్థుడు.

"వాడు వట్టి అదురుగుండె. ఒంటరిగా ఒంటికి కూడా పోలేడు." వా.

**అదురుగుండె, పిక్కబెదురు లేమి**

నిర్భీకత్వము.

"మేర మీఱు సంఖ్య మెఱయుదు రవ్వీట, నదురుగుండె పిక్క బెదురు లేక." రంగా. 1.13 పే.

**అదురుతిక్క**

ఒక పశురోగం.

"ఉంగిడి, యదురుద్రిక్క యనువానికి నా పేరు సెప్పినం జాలు."

భార. విరా. 1.286.

"నరిడి పప్పు కప్ప నావురు కడుపూద, యదురుద్రిక్క యనంగ నడరి మరియుఁ, దెవులు లెన్నియేనిఁ దవిలి యెంతయు మహో, గ్రంబు లయ్యెఁ బశుగణంబు నందు." హరి. పూ. 6.46.

**అదురు బెదురు**

భయము. [illegible]

"వాడు ఎంత కటిక-చీకటిలో అయినా అదురూ బెదురూ లేకుండా పోతాడు."
వా.

**అదురూ బెదురూ లేక**

జంకూ గొంకూ లేక. జం.
"వాడు అదురూ బెదురూ లేక అర్థ రాత్రిలో ఆ అడివిలో నడచి పోతాడు." వా.

**అదురుమనిషి**

భయస్థుడు.

**అదేం గగనం?**

అదేమి గొప్ప, అదేమి ఘన కార్యం?
"ఆ పుస్తకం ఒకరోజులో చదవడం అదేం గగనమా?"
"అదేం గగనం లెద్దూ." వా.

**అదేం బంగారమా?**

అంత విలువ కానిది అనుట.
"వాడు ఆ పుస్తకం చూచి యిస్తానంటే యివ్వ లేదు. అదేం బంగారమా?" వా.

**అదే పదివేలు**

అంతమాత్రం చాలు. అదే గొప్ప.
"చేరిక నిచ్చి పాదములఁ జేర్పఁ డదే పదివేలు." పాణి. 6.107.
"మీరు జాబు రాస్తే చాలు. అదే పదివేలు. రానక్కరలేదు." వా.

**అదే పనిగా**

తదేకదీక్షతో.
"తిరిగితి పెల్లదేశము లదే పనిగా." సానా. 83.

**అద్దంతరపు సిరి**

నడుమంత్రపు సిరి.
కొత్త. 14.

**అద్దపునీడ**

అశాశ్వతము.
తాళ్ల. సం. 5.311.

**అద్దము చూచు**

ముకురవీక్ష చేయు.
వేశ్యలకు కన్నెరికం పెట్టే ముందు అద్దం చూపించడం అనేది ఒక ఆచారం.
"పుష్యనక్షత్రమునందు నీయనుఁగు గాదిలికూఁతురు చూచు నద్దముఁ." క్రీడా. పు. 62.

**అద్దములాగ**

పరిశుభ్రంగా, మిసమిసలాడు నట్లుగా.
"వాళ్ల యిల్లు అద్దంలాగ ఉంటుంది. పాలు పోసి పాలు ఎత్తుకో వచ్చు." వా.

**అద్దములోని ముడుపు**

వట్టి దనుట.
అద్దములో ప్రతిఫలించినడబ్బు తీసుకొనుటకు రాదు కదా.
తె. జా.

**అద్దములో నీడ కాసపడు**

అలభ్యమునకై వేకారు.
"బుద్ధులు తప్పి నేమిటికిఁ బోయిన నీళ్లకుఁ గట్టవెట్టనీ, యద్దములోని నీడకెటు లాసపడం బోఁగుం దలోదరీ!" ఉ. హరి. 5.157.

**అద్దు పద్దు**

అదుపు ఆజ్ఞ. జం.

"అద్దూ పద్దూ లేక వా డీమధ్య మితి మీఱి పోతున్నాడు." వా.

**అద్దుముద్దు**

ముద్దు ముచ్చట. జం.

"అద్దుముద్దు మీఱి యాఁడది మగఁడంచుఁ, గూడిమాడి యాడఁ జూడఁ దలఁచి." రాధి. 3 ఆ.

**అద్దెకు తిప్పు**

అద్దెకు ఇచ్చు.

"వాడు ఉన్న నాలుగు ఇళ్లూ అద్దెకు తిప్పుతూ జీవిస్తున్నాడు." వా.

**అద్భుతపడు**

ఆశ్చర్యపడు.

"అశ్వముఁ గొంచుఁ వీధి నేఁగ నద్భుతపడి." జైమి. 2.29.

**అద్వైతము**

చాదస్తము.

"వాడి దంతా ఒట్టి అద్వైతం." వా.

**అధవా**

ఒకవేళ.

"వసుమతిపై నధవా నన్నుఁ బుట్టింప నూహ కలెనేని." వరాహ. '.156.

"నీవు వస్తే మంచిది. అధవా ఏకారణం వల్లయినా నువ్వు రాలేక పోతే మీ వాణ్ణయినా తప్పకుండా పంపించు." వా.

**అధాయకుడా విధాయకుడా ?**

వాడికి చెప్పి ఏమి ప్రయోజనం ? వా డిందులో చేయగలది యేమి కలదు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"వా డేమి అధాయకుడా ? విధాయకుడా ? వా డేమంటే నేమి ? వా.

**అధికప్రసంగము చేయు**

అనవసరముగా జోక్యము కలిగించుకొని మాట్లాడు.

**అధికప్రసంగి**

వాచాలుడు.

చూ. అదనప్రసంగి.

**అధికమాసము**

సూర్యుడు ఒకే రాశిలో ఉండగా రెండు చాంద్రమాన మాసములు ఆరంభమైతే తొలిది అధికమాసం. రెంటికీ ఒకే పేరు ఉంటుంది.

అధికచైత్రము, నిజచైత్రము ఇత్యాదులు.

**అధికాచమానం**

బహిర్దేశమునకు వెళ్లుట వైదికుల పరిభాష.

చూ. అల్పాచమానం.

**అధివాసరము**

తద్దినానికి ముందునాటిరాత్రి ఉపవసించుట. దీనినే అతివాసమనీ వాడుకలో అంటారు.

(రూపాం) అతివాసము.

**అధీతి బోధాచరణ ప్రచారణములు**

చదువుట, ఇతరులకు చెప్పుట, ఆ ప్రకారం ఆచరించుట, వానిని అనుసరించ మని యిత

రులలో ప్రచారము చేయుట. చము వనగా ఇది అని మన పూర్వుల అభిప్రాయం.

అద్ధాన్నం

ఇది కోస్తాజిల్లాలలో వినిపించే రూపం.

చూ. అధ్వాన్నం.

అధ్వాన్నం

దిక్కు-మాలినది, పాడుది.

"డించిపోవఁ దగవా యధ్వాన్నపుం బట్టునన్." హర. 3.86.

ఈ అధ్వాన్నం అనేకరకాలుగా ఉపయోగిస్తారు.

"ఈ పుస్తకం చాలా అధ్వాన్నంగా ఉంది"

"తండ్రి చాలా కష్టపడి సంపాదించి పోయిన ఆస్తి నంతా వాడు నాలుగు రోజులలో అధ్వాన్నం చేసి పారేశాడు."

"ఎందుకు రా ఈ అధ్వాన్నపుబతుకు."

వా.

అనంతశయనం

పాడె.

అంతము లేనిశయనము కనుక.

అనక్షరకుక్షి

చదువు రాని మొద్దు.

చూ. నిరక్షరకుక్షి.

అనగా అనగా

తెలుగునాట ప్రతి జానపద కథా 'అనగా అనగా' అన్న పలుకుబడితో ప్రారంభం కావడం అలవాటు.

అనగా అనగా ఒక ఊరు, అనగా అనగా ఒక రాజు— అన్నట్లు.

"అనఁగా ననఁగా నొకపుర మొనరుం జంద్రవతి యనఁగ." శుక. 1.171.

అనగి పెనగి

అన్యోన్యముగా-కలసి మెలసి.

"అరమరలు లేనికూరిమి ననఁగి పెనఁగి." పారి. 1.94.

అనగిపెనగి యుండు

స్నేహముగా కలసి మెలసి యుండు.

అనగ్నిదగ్ధుడు

నిప్పు పెట్టినా కాలనివాడు.

అనధ్యయనం

చదువగూడని రోజు.

చతుర్దశి, పూర్ణిమ లేక అమావాస్య, ప్రతిపత్తులలో వేదాధ్యయనం చేయరా దని శాస్త్రం. అష్టమి కూడా వీనిలో చేర్చుట కలదు. (రూపాం) అనధ్యాయం.

చూ. శిష్టానధ్యాయం.

అనబట్టదు

1. ఏమీ అన లేము.

"అనబట్టదు లోకములోన నిట్టి వేసవి గలదే?" కుమా. 6.138.

2. ఇలా అని చెప్ప వీలు లేదు.

"అయ్యో! మా సంసారం ఇట్లా అనబట్టదమ్మా!"

వా.

**అనబట్టు**

అనుటకు తగు, అనవలసి వచ్చు. రాయలసీమలో వాడుకలో ఉంది.

"ఇట్లా అని అనబట్టదు వాడి సంగతి."
"ఇట్లా చేస్తా వుంటే ఏవో గట్టిగా అనబట్టుతుంది." వా.

**అనరాదు గాక**

అనగూడదు గానీ.

'అనరాదు గాక నా యింటన కా దిటువంటి చెలువ నాకంబునఁ గల్గునె." కళా. 5.117.

"అనగూడదు గానీ వా డంత నీచుడు మరొకడు ఉండడు." వా.

"నాకొడుకు కనక అనరాదు గానీ వాడు మంచి దిట్టమైనపండితుడు." వా.

**అనలు కొనలు పాఱు**

తీగ సాగు, వృద్ధి చెందు.
తీగ పెరిగేటప్పుడు ననలు వేస్తూ పెరగడం ద్వారా వచ్చినపలుకుబడి.

"అనలుం గొనలుం బాఱుచు, మనమున నా కోర్కె తీఁగె మగువకు మిగులన్." కళా. 6.212.

"కుటిలాలక కూర్మి యనలుఁగొనలుం బారన్." సారం. 3.144.

"అమరఁగ లతికలు...గుము రై, యెలదోఁట యనలు గొనలుం బాఱెఁ." విప్ర. 2.24.

చూ. తీగసాగు.

**అనవలసి యంటి**

మాటసామెతగా చెప్పితి నే కానీ మ రేమీ కాదు అన్న సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

"అనవలసి యంటి నిన్నుం, గనుఁగొనుటే చాలు బడలికలు కనుపించెన్." శుక. 2 ఆ. 523.

**అనాగతవిధాత**

రాబోవు కీడును ముందే గ్రహించి దానికై జాగ్రత్త పడువాడు.
పంచతంత్రంలోని మూడు చేపలకథపై వచ్చినపలుకుబడి. భారతంలోనూ ఉన్నది.

**అనాఘ్రాతపుష్పము**

వాసన చూడనిపూవు, అనను భూతపూర్వము.
పాండు. 5.186.

**అనిగొను**

యుద్ధము చేయు.
యామున. 1.221.

**అనిచి పుచ్చు**

పనిమీద పంపు.

"నన్నుం దగవుగ భూవిభుకడ కనిచి పుచ్చు." భాస్క. అర. 2.176.

**అనియు ననక మునుపే**

వెంటనే అనుట.
నోటిమాట నోటిలో ఉండగానే, అనీ అనక ముందే, వచ్చీ రాక ముందే, చేసీ చేయక ముందే, చెప్పీ చెప్పక ముందే-ఇలాంటివి పెక్కులు.

"అని యనియు ననక మునుపే యనఘా!..." శుక. 2 ఆ. 165. ప.

**అనీ కొనా తెలియ లేదు**

మొదలూ, తుదీ తెలియ లేదు. అల్లుటలో తొలుత ఆరం భించేటప్పుడు 'అని' వేస్తారు. అలాగే ఆఖరున ఉన్నది కొన. అవి రెండూ తెలియుట అనగా అందలి వివర మంతా తెలియుట — తుదీ మొదలూ కూడా.

"ఇందులో అనీకొనా తెలియడం లేదు." వా.

**అనీ మొనా తెలియదు**

ఇందులో మొదలేదో తుది ఏదో తెలియదు. అంటే దాని తత్త్వం తెలియ దనుట. జం.

"అనీ మొనా తెలిస్తే గానీ ఏ ముడీ విప్పలేము." వా.

**అనుకణకస్**

పై పై పడగా, వర్షించగా.

"ఉర్వీతల మద్రువఁగ నుల్కాపాతం బనుకణఁక." కుమా. 2.14.

**అనుకుంటూ ఉండగా**

ఆ ప్రస్తావమే జరుగుతుండగా.

"అనుకుంటూండగానే వచ్చావు. నూరేండ్లాయుస్సు." వా.

**అనుమానం పెనుభూతం**

అనుమానం చెడ్డది.

చూ. అనుమానం ప్రాణసంకటం.

**అనుమానం ప్రాణసంకటం**

అనుమానం చెడ్డది.

"వాని కేదో అనుమానం పట్టుకొంది. రోజురోజుకూ నీరసించి పోతున్నాడు. అనుమానం ప్రాణసంకటం." వా.

చూ. అనుమానం పెనుభూతం.

**అనుమానపు పీనుగ**

వట్టి అనుమానపు మనిషి అని నిందగా అనుటలో ఉపయోగించేపలుకుబడి.

"వాడింట్లో ఎక్కడ దిగనిస్తాడు రా. ఒట్టి అనుమానప్పీనుగ." వా.

**అనుమానపు మనిషి**

అడుగడుగునా సందేహాలుండే మనిషి.

"వాడు చాలా అనుమానం మనిషి. ఏది నిశ్చయించుకోవాలన్నా సంవత్సరాలు పడుతుంది." వా.

చూ. అనుమానపుపీనుగ.

**అనుము, మినుము అనకుండు**

ఏమీ అనకుండు, మౌనము వహించు.

"అనుము మినుము ననక చాటునఁ గూర్చుండె నక్కటకట!" గుంటూ. పూ. పు. 31.

"నే నెంత నెత్తి పగలగొట్టుకుంటున్నా వాడు అనుమూ మినుమూ అనకుండా బెల్లంకొట్టిన రాయిలా ఉంటే నే నేం చేసేది?" వా.

**అనువు గానిచోట అధికుల మన రాదు**

కుదరనిచోట మన గొప్ప చూపరాదు.

"ఇల్లూ వాకిలీ అంతా వాడిది. సంపాదించి తెచ్చి వేస్తున్న వాడు వాడు. మనం ఎవరం ఏ మనడానికీ? వాడి ప్రవర్తన బాగా లేకపోతే అది వేరేమాట. మన

మే మనగలం? అనువు గానిచోట అధి కుల మనరాదు అని నోరుమూసుకొని కూచోవలిసిందే.'' వా.

## అనువు దప్పు

పస చెడు.

''అనువు దప్పిరి నొచ్చి రలసి రాపద నొంది, రదవద లైరి చీకాకుపడిరి.'' హరవి. 3.10.

## అనువుపఱచు

అమర్చు.

''అఱుత రుద్రాక్షమాలిక లనువు పఱచి.'' కాశీ. 1. 95. శివ. 3.12.

## అనువొందు

ఏర్పడు.

''మనుజాధిపదనుజాధిపు లనువొందిరి రామరావణాకారములన్.'' శకుంతలా. 3.135.

## అనుష్ఠానము తీర్చు

సంధ్యావందనాదులు నిర్వర్తించు.

''స్నానంబు సేసి నిజక, ర్మానుష్ఠానంబు దీర్చి.'' కా. మా. 119.

## అనక్కను కగు

మెత్తమెత్తనగు, ద్రవీభూతమగు.

''అరుణకరోత్కరాభిహతి నక్కను కయ్యెడు సాంద్రచంద్రికాంతరమున.'' కుమా. 8.182.

## అన్నగఱు

అన్నగార్లు.

కంచుకి మొదలయినవారు.

తమి. ''అన్నగళ్.''

''అన్నగఱు మాట...'' మన్నారు. పు. 4.

## అన్నచొరవ

తినుటలో ప్రావీణ్యము.

''వాడికి అన్నచొరవే కాని అక్షర చొరవ లేదు. ఏంలాభం?'' వా.

## అన్నచొఱవే గాని అక్షర చొఱవ లేదు

విద్యాగంధం లేనివా డనుట.

''వాడికి అన్నచొఱవే గాని అక్షర చొఱవ లేదు.'' సా.

## అన్నట్టు

వాక్యోపస్కారకము.

## అన్న తర్వాత

అయినప్పుడు...

''మొగు డన్నతర్వాత ఆ మాత్రం దండించకుండా ఉంటాడా?'' వా.

''ఉద్యోగ మన్నతర్వాత ఏవో కొన్ని నిర్బంధాలు లేకుండా ఎట్లా ఉంటాయి.'' వా.

## అన్నదమ్ము లగు

సమాన మగు.

''క్రేగంటి మాపున గిఱికొన్న సన్న గే దంగిఱేకుల కన్నదమ్ము లగుచు.'' ఉ. హరి. 1.151.

## అన్నన్న

ఆశ్చర్యార్థకము.

నేటికీ యిది వాడుకలో నున్నది.

''కొన్నంగడిలోపలనే, యన్నన్నా! మాఱుబేర మగునే చెలియా!'' రాధి. 3 ఆ. 22 ప.

## అన్నప్రాశం

పిల్లలకు తొలిసారిగా అన్నము పెట్టుటకై చేయు సంస్కా-

రము. పంచదశ కర్మలలో ఒకటి.
"ఈ నెలలో చిన్నవాడికి అన్నప్రాశం చేయాలి." వా.

**అన్నము నీళ్లు చెల్లు**
ఋణము తీరిపోవు, చనిపోవు.
"అన్నము నీళ్లు చెల్లిపోయాయి. వాడు పోయాడు. ఎవరిని అని ఏమి ప్రయోజనం?" వా.

**అన్నము పువ్వులవలె నున్నది**
ముద్ద కాకుండా విడివిడిగా కనుల పండువుగా ఉన్నదనుట.
"నిర్వారి బియ్యంబునఁ బువ్వులవలె నుండ వండి వార్చిన యుపహారభాండంబులు." కా. మా. 3.36.

**అన్నమూ లేదు - సున్నమూ లేదు**
ఏమీ లేదనుట. జం.
నిరసనగా అనుమాట.
"ఈ వేళప్పుడు ఏం అన్నమయ్యా? అన్నమూ లేదు సున్నమూ లేదు. పో." వా.

**అన్నమో రామచంద్రా యను**
ఆకలితో అల్లాడు.
"దారిద్ర్యంబు తట్టుముట్టాడ, అన్నమో రామచంద్రా యనుచు......"
ధర్మరా. 6 పు. 2 పం.

**అన్నశాంతి**
ఏదైనా దోషం ఉంటే తచ్ఛాంతికై అన్నదానం చేయుట.
"అన్నశాంతి చేస్తే ఈ దోషం పరిహారమవుతుంది." వా.

**అన్నసంస్కారము**
వంట.
"యామార్ధమునకె కావింతు నన్న సంస్కారంబు." పాండు. 4.153.

**అన్నసూక్తం**
అన్నం పరబ్రహ్మస్వరూపం అంటూ అన్నాన్ని స్తుతించే వైదికసూక్తం.

**అన్నసూక్తం పఠించు**
ఆకలి గొను.
"వాడు అన్నసూక్తం పఠిస్తూ కూర్చున్నాడు." వా.

**అన్నానా ఆడానా ?**
ఏమీ తిట్టలేదనుట. జం.
"నే నేమి అన్నానా? ఆడానా? మూతి ముడుచుకొని మూల కూర్చోవలసినంత పనేముందే నా తల్లీ!" వా.

**అన్నానికి లేదు**
దరిద్రుడు.
"వాడికి తినబోతే అన్నానికి లేదు. అయినా జంభం చూస్తే యింత పొడుగు వుంది." వా.

**అన్ని దొంతులును చెప్పగ నేటికి**
అన్నీ వరుసగా చెప్పుతూ ఉండుటకు? దొంతులు పేర్చినట్టు వరుసగా అన్నిటినీ వరుసబెట్టి ఎందుకు చెప్పవలెను అని భావార్థం. దొంతులు క్రమంగా పెద్దది క్రింద, దానికంటె చిన్నది

పైన ఇలా క్రమానుసారం పేరుస్తారు.

"పరము తపం బడంచి మతి పార్వతి
యం దనురక్తుఁ జేయ మా, యిరువు
రకుం గుమారుఁ డుదయించిన మాపగఁ
దీరు వంచు నచ్చెరువుగ నన్నిదొంతు
లును జెప్పఁగ నేటికి." కుమా. 4.50.

**అన్నినయట్ల**

నోటికి వచ్చినట్లు – అందిన అట్లెల్లా...

"అన్నినయట్ల యమ్మని సురాధిపులం
జెడనాడుచున్న నీయున్నతికం బె."
కుమా. 2.28.

**అన్ని యున్న విస్తరి**

నిండుకుండ లాంటి పలుకుబడి. అన్నీ వడ్డించిన విస్తరి యెగిరి పడదు. అందుపై వచ్చిన పదబంధం.

"ఆయన అన్నీ ఉన్న విస్తరి. ఏమాత్రం తొణకకుండా తూచి మాట్లాడతాడు."
వా.

**అన్నీ అతుకులే**

ఒకటీ పూర్తిగా, చాలినంతగా లే దనుట.

"పొద్దున్నుంచీ లేనివి వెతుక్కోవ డానికే సరిపోతుంది. అన్నీ అతుకులే నాయె." వా.

**అన్నుకొను**

మద మెత్తు.

కాశీ. 2.138.

**అన్నుకొలుపు**

ప్రోత్సహించు.

"...ఒక కొందఱు దాల్తు రప్పటి
కలుషపథప్రవర్తనమె కర్మపువాసన
లన్ను గొల్పఁగన్." కళా. 2.108.

**అన్నుపట్టు**

గర్వించు.

"అదన నన్నపు నామేన నన్నుపట్టెను."
తాళ్ళ. సం. 10.253.

**అన్నెకాడు**

అన్యాయస్థుడు.

"అన్నెకాఁడై వాడు నావల పిల్ల నారు దూలు చేసెనే." క్షేత్రయ్య.

**అన్నెము పున్నెము తెలియని**

అమాయకమయిన; పుణ్యం పాపం తెలియని అనుట.

"అన్నెమూ పున్నెమూ మనకు తెలీదు. ఆ భగవంతుడికే ఎరుక." వా.

"ఆ పిల్లకు అన్నెం పున్నెం తెలియదు. దాన్ని యేడిపిస్తా వెందుకు రా." వా.

**అన్యథా భావించు**

అపోహపడు.

"నే నేదో అన్నా నని అన్యథా భావించకండి." వా.

**అన్యథా శరణం నాస్తి**

ఇక గత్యంతరం లేదు అనుట. అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ—అను శ్లోకంలోని భాగం.

**అన్యథా శరణం బొందు లేదు**

వేఱే దిక్కు లేదు.

సంస్కృతవాక్యం – అన్యథా శరణం నాస్తి – కూడా శిష్ట

వ్యవహారంలో పలుకుబడి అయి పోయినది.

పండితా. ప్రథ. దీక్షా. పుట 102.

## అన్యాయ మింత గలదె

ఇంత అన్యాయం ఎక్కడైనా ఉందా? ఏదైనా అత్యాహితం జరిగినప్పుడు అను మాట.

"నీ వింత లన్యాయ మింత గలదె."

కళా. 5.18.

## అప ఉపస్పృశ్య

చేతులు కడుగుకొని అనే అర్థంలో నేటికీ ఉపయోగిస్తారు.

వైదికపరిభాష.

"ఆ వ్యవహారం ఇంక లాభం లే దని అపఉపస్పృశ్య అనుకొని వచ్చేశాను."

వా.

## అపదూఱు

అపవాదు.

## అపథ్యం చేయు

రోగి తినగూడని వస్తువులు తిను.

"వాడు అపథ్యం చేశాడు. రోగం మరీ తిరగబెట్టింది."

వా.

## అపనమ్మకపు మనిషి

నమ్మరానివా డనుట.

"వాడు చాలా అపనమ్మకపు మనిషి. చేస్తా నని ఒకవేళ వాడు మాట చెప్పినా మనం నమ్ముకొని కూర్చోవ ఢానికి వీలు లేదు."

వా.

## అపనమ్మిక

అనుమానము, నమ్మిక ము లేమి.

"సా మ్మొకచో నుండఁగ నపనమ్మిక యొకచోట నుండు."

హరిశ్చ. 5.316.

## అపనయించు

ఆపు, తొలగించు. చాలించు.

"అతనితో సల్లాపంబుల నపనయించి"

భీమ. 4.39.

## అపనింద

అపవాదు.

"వాడు అన్యాయంగా నా మీద అపనింద వేసి పోయాడు."

వా.

చూ. అపవాదు.

## అపనింద పాలుసేయు

అపవాదు వేయు.

"వాడికి ఏ పాపం తెలీదు. అన్యాయంగా వాణ్ణి అపనిందపాలు చేశారు."

వా.

## అపనింద మోపు

చూ. అపనింద వేయు.

## అపనింద వేయు

అపవాదు మోపు.

"ఏ పాపమూ ఎఱుగని ఆ అమ్మాయి మీద అపనింద వేసి ఏమి బావుకుంటావు రా!"

వా.

చూ. అపనింద మోపు.

## అపనెపము

అపనింద.

"అటఁ బోయినంతలో నపనెపమాను."

ద్వి. సారంగ. 1 భా. 387

"వాడు నామీద ఉట్టినే అపనెపం వేశాడు."

వా.

**అపపాడి**

అన్యాయము.

"అవనిపతులు పలువు రపపాడి నొక్కనిఁ, దన్నుఁ బొదివికొనినఁ దరల కదిరి." మార్కం. 8.113.

**అపప్రథ**

ప్రవాదము. నిజముఁ కాదన్న సూచన ఇందులో ఉన్నది.

"వాడు చాలా గర్విష్ఠి అని ఒక అప ప్రథ యేర్పడింది. వాడితో నాలుగు మాటలు మాట్లాడితే అది వట్టిఅపప్రథ అని యిట్టే తెలిసి పోతుంది." వా.

**అపభ్రంశపుమనిషి**

వక్రపు మనిషి.

"వాడు వట్టి అపభ్రంశపు మనిషి." వా.

చూ. అపసవ్యపు మనిషి.

**అపరం**

ఉత్తరక్రియలను చేయించే కల్పం.

"వాడు అపరం చెప్పుకొన్నాడు ఆయన దగ్గఱ." వా.

"నేను అపరం చేయించను. పై ఊరి నుంచీ మీ రెవరి నైనా పిలుచుకో వలసిందే." వా.

చూ. అపరక్రియలు.

**అపరక్రియలు**

ఉత్తరక్రియలు.

"మా నాన్న అపరక్రియలకు మా మేన మామే రాలేదు. ఇంక తక్కిన వారి మాట ఎందుకు?" వా.

చూ. అపరం.

**అపరబృహస్పతి**

చాలా తెలివితేటలు గలవాడు. ఇది వ్యంగ్యంలో ఎక్కువగా వినబడుతుంది.

"వాడు అపరబృహస్పతి కదా! వాణ్ణి వెళ్లి అడగండి. నన్నడిగి ఏం ప్రయో జనం?" వా.

చూ. అపరవాచస్పతి.

**అపరవాచస్పతి**

చూ. అపరబృహస్పతి.

**అపరాతిరి**

అర్ధ రాత్రి.

"వాడు అపరాతిరివేళ వచ్చి నన్ను నిద్ర లేపాడు. ఇంతకూ సంగ తేమయ్యా అంటే వడ్లగింజలో బియ్యపుగింజ." వా.

**అపరాధము చెల్లించు**

జరిమానా కట్టు.

"అపరాధం చెల్లించితే కానీ వాడు విడుదల అయ్యేసావకాశం కనబడదు." వా.

**అపరాధము వేయు**

జరిమానా వేయు.

దక్షిణాంధ్రంలో నేటికీ వాడు కలో ఉంది.

"వాడికి యాభైరూపాయలు అపరాధం వేశారు." వా.

**అపవర్గము**

మోక్షము.

**అపవాదం (దు)**

చెడ్డపేరు.

"ఏమీ చేయక పోయినా ఉత్తపుణ్యా నికే నామీద అపవాదు వచ్చి పడింది." వా.

**అపశకునపు పక్షి**

ఎప్పుడూ అశుభం పల్కేవాడు.

"శుభమా అని వెడుతుంటే ఈ అపశకునపు పక్షి ఎదురయ్యాడే! ఏ వెధవ మాట అంటాడో." వా.

**అపశబ్దపుకూతలు**

అశుభసూచకమైనమాటలు.

"వాడు నోరెత్తితే అపశబ్దపుకూతలే. శుభం పలకరా పెండ్లికొడకా అంటే పందిటి నిండా ముండమోపులే అంటాడు." వా.

చూ. అపసవ్యపు కూతలు.

**అపశబ్దభయం నాస్తి అప్పశాచార్యసన్నిధౌ**

వాడి వన్నీ అపశబ్దాలే అనే అర్థంలో వ్యంగ్యంగా ఉపయోగించే పలుకుబడి.

తాతాచార్యుల కథపై వచ్చిన దని ప్రతీతి.

"అపశబ్ద భయంనాస్తి అప్పశాచార్య సన్నిధౌ, అనాచార భయం నాస్తి తిప్ఠమ్మాత్రస్య సన్నిధౌ." చా.

**అపసవ్యపు కూతలు**

"వాడి వన్నీ అపసవ్యపు కూతలే." వా.

చూ. అపశబ్దపుకూతలు.

**అపసవ్యపు మనిషి**

సరైనమనిషి కా దనుట.

"వాడు వట్టి అపసవ్యపు మనిషి. అన్నీ లోకవిరుద్ధంగానే చేస్తాడు." వా.

**అపస్వరం**

వేదోచ్చారణలో ఉదాత్తానుదాత్త స్వరిత స్వరాలను తప్పుగా నుచ్చరించుట.

"వాడు పంచదశకర్మలూ చేయిస్తాడు. కానీ, అడుగడుగునా అపస్వరాలే." వా.

**అపస్మారమెత్తు**

పిచ్చి యెత్తు.

కాశీ. 2.138.

**అపాత్రదానం**

అనర్హుడికి దాన మిచ్చుట.

"అపాత్రదానం పుణ్యహేతువు కాజాలదు." వా.

**అపార్థం చేసుకొను**

అపోహ పడు అనే అర్థంలో నేటి వ్యవహారం.

"వాడు నన్ను అపార్థం చేసుకొన్నాడు. నే నేపాపం యెఱుగను." వా.

నాపై అపోహ పడె ననుట.

**అపురూపము**

అమూల్యము, అరుదు.

"ఈ కావ్యం చాలా అపురూపంగా ఉంది."

"ఆ అమ్మాయిది చాలా అపురూపమైనపుట్టుబడి."

"ఆ అమ్మాయిని వాళ్లు చాలా అపురూపంగా చూచుకుంటారు."

"ఈమధ్య మంచినెయ్యే యీ వూళ్లో అపురూప మయిపోయింది." వా.

**అపేక్ష చేయు**

కోరు.

"రాగంబు నోడిచి ముక్తి, శ్రీ గౌరవముల కపేక్ష చేయు మునులకున్." విప్ర. 2.80.

**అపోహము పుచ్చు**

పాడు చేయు.

"లోలదృగ్గుచు లపోహము పుచ్చియు భోగవృద్ధి నిష్ఫలముగఁ జేసియున్." కుమా. సం. 7.41.

అప్పగింతపాటలు

నూతనవధువును అత్తవారింటికి పంపునప్పుడు పాడే పాటలు.

అప్పగింత పెట్టు

1. నూతనవధువును అత్తవారి కప్పగించు.

2. చిన్నపిల్లలను మఱొకరికి అప్పగించు.

అప్పగింతలు

1. నూతన వధువును అత్తవారింటి కంపుట.

2. ఇంటి యజమాని చని పోతూ చిన్నపిల్లలను మరొకరికి అప్పగించుట.

అప్పటి కప్పటికి

అప్పుడప్పుడు, తఱుచు.

"...తప్ప కతఁ డమరమానియ, యప్పటి కప్పటికి వచ్చు యదుపతికడకున్."
కళా. 1.172.

"అప్పటప్పట వాడు మా యింటికి రావడం కద్దు." వా.

అప్పడములుగా నమలు

అవలీలగా నమలు.

నారా. రుక్మిణీకల్యాణము.

అప్పనగొను

పైవారాదరపూర్వకముగా నిచ్చుదానిని స్వీకరించు. అప్పనపెట్టు అన్నది వైష్ణవ పరిభాషగా వినబడుతుంది. దేవాలయాదులలో ప్రసాదాన్ని భక్తులు అప్పన పెట్టమంటారు. దీనిమీద మరింత సాగి, అప్పనము-ఊరక వచ్చినది అన్న అర్థాలలో కొన్ని ప్రాంతాలలో 'ఇదేమి అప్పనంగా వచ్చిందా' అని వాడుకలో వినబడుతుంది.

ఇదే అర్థంలో 'ఉద్దరకు వచ్చిందా' అని రాయల సీమలో అంటారు.

"......గణనాథున కీవచ్చుఁ గదా యవి యని కోమటి కొమిరె వాని యప్పనఁ గొనుచున్."
శుక. 2 ఆ. 216 ప.

అప్పన పంపు

కానుక లిచ్చు.

"వలసలు పోవు వారుఁ, దగు వస్తువు లప్పన పంపువారుఁ గే,వలవినయంబుతో గొలుచు వారును సైరి." కళా. 8.45.

అప్పప్ప

ఆశ్చర్యార్థకము.

"అప్పప్ప భవత్ప్రభావవిభవాఢ్యత."
సారం. 1.31.

అప్పలప్ప లను

పిల్లలను దగ్గరకు పిలుచుట లోని అనుకరణము.

"అప్పలప్ప లనినంత గద్దించి యశోద మేను కౌఁగలించుశిశువు."
తాళ్ళ. సం. 4.1.

అప్పవిందులయాట

ఒక బాలక్రీడ.

పండితా. ప్రథ. పురా. పుట 460.

**అప్పసంలో పెల్ల వేసినట్లు**

బురదకాలువలో మట్టిపెళ్ళ వేసినట్లు.

చెడ్డవాని నోటికి పోయి తిట్లు తెచ్చుకొనే సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

**అప్పా!**

ఆశ్చర్యార్థకము.

"అప్పా యప్పురిఁ జెప్ప నొప్పుగురు రూపాజీవికారత్నముల్." రా. వి. 1.58.

**అప్పాట**

ఆవిధంగా - ఆసమయంలో.

ఆపాట్న అనే రూపంలో రాయలసీమలో వినబడుతుంది.

"పాక దళ బొందు నెప్పు డప్పాటఁ గాని." భీమ. 3.72

**అప్పా నాయనా అను**

ఎదుటివానిని గౌరవముతో చూచు.

"ఎవరువచ్చినా అప్పా నాయనా అని ఎంతో ఆదరిస్తాడతను." వా.

**అప్పీలు లేదు**

తిరుగు లేదు.

ఇది కోర్టువ్యవహారాలద్వారా వచ్చినపలుకుబడి.

అపీలున్న దనగా దానిపై తిరిగి విచారించి తప్పో ఒప్పో నిర్ణయించే అధికారం మరొకరి కుంటుం దనుట. అది లేదంటే వాడిదే తుదిమాట.

"వాడిమాట కిక అప్పీలు లేదు." వా.

**అప్పు చేసి పప్పుకూడు తిను**

ఏవిధంగా చేసి అయినా సుఖమనుభవించు.

తగనిపని చేసి భోగ మనుభవించు.

పప్పుకూడు భోగసూచకము.

"వాడి కేం? ఎప్పుడూ సుఖమే. అప్పు చేసి పప్పుకూడు తినేరకం." వా.

**అప్పుపుట్టు**

అప్పు దొరకు.

"ఆ ఊళ్లో గింజుకొన్నా అప్పు పుట్టదు." వా.

దీనినే పరపతికల్గు అనే అర్థంలో కూడా ఉపయోగిస్తారు.

"వాడికి ఎక్కడా దమ్మిడీ అప్పు పుట్టదు." వా.

అనగా పరపతి లేనివా డనుట.

**అప్పు పెట్టు**

అప్పిచ్చు.

"నాలుగు రూపాయలు అప్పు పెట్టవోయ్. తర్వాత ఇస్తాను." వా.

**అప్పులగంప**

అప్పులమయము.

భద్రగిరి. 71.

**అప్పులపా లగు**

ఋణగ్రస్తు డగు.

"ఎంద అప్పులపా లగు టెఱుఁగఁ బడదు." శ్రవ. 2.60.

**అప్పుల ముంచు**

అప్పులపాలు చేయు.

యామున. 4.42.

**అప్పులలో మునుగు**

అప్పుల పాలగు. [వా.

"వాడు అప్పులలో మునిగి పోయాడు."

**అప్పులు పుట్టు**

అప్పు దొరకు.

"అప్పులు పుట్టక పరపతి తప్పి."
రుక్మాం. 4.110.

**అప్పులు పొడుచు**

అప్పులు చేయు.

"పాండుఁబట్టుల నప్పులు పొడిచి పొడిచి." పాండు. 3.18.

**అప్పుసప్పులు**

అప్పులు. జం.

"అప్పుసప్పులు దీసి యడిగిన నియ్యక బహుఋణంబుల పాలు పడెను వీఁడు."
సానం. 2.106.

చూ. అప్పూ సప్పూ.

**అప్పూ సప్పూ**

అప్పు. జం.

"అప్పోసప్పో చేసైనా పిల్లకు చీర పెట్టాలి." వా.

చూ. అప్పుసప్పులు.

**అప్రస్తుతప్రసంగం**

అసందర్భ మైనమాట.

"అప్రస్తుతప్రసంగం చాలు. కట్టి పెట్టు." వా.

**అబద్ధం వా సుబద్ధం వా కుంతీ పుత్రో వినాయకః**

అదంతా అబద్ధం అనేటప్పుడు ఉపయోగించే పలుకుబడి. నిజమో అబద్దమో కుంతి కొడుకు వినాయకుడు అంటే అంతా అబద్ధమే కదా.

"నీ యిష్టం వచ్చినమాట అడుగు. వాడు వెంటనే అర్థం చెప్పి పారేస్తాడు. అంతే. అబద్ధం వా సుబద్ధం వా కుంతీ పుత్రో వినాయకః." వా.

**అబద్ధాలకోరు**

అబద్ధీకుడు.

"వాడు పట్టి అబద్ధాలకోరు. వాణ్ణి నమ్మడానికి వీలు లేదు." వా.

**అబద్ధాల పుట్ట**

వాడాడేవన్నీ అబద్ధాలే అనుట.

చూ. రోసాల పుట్ట.

**అబ్బగంటు**

ఇది నీసొత్తు కాదు అని గట్టిగా అనవలసినప్పుడు ఉపయోగించేమాట.

"ఇదేం నీ అబ్బగంటా? మమ్మల్ని ఎవరినీ ఇక్కడికి రావద్దంటావు." వా.

**అబ్బగాడుగ పోవు**

దిక్కులు పట్టి పోవు.

"మునిగాలఁ దన్ని చనుగతి ఘనజఘనం బాసి యబ్బగాడుగఁ బోయెన్." పంచ. (వేం) 4.169.

**అబ్బగించు**

ఓర్చు, నిలువ గలుగు.

"మహాప్రభంజనహతికిఁ గుంజర ఘట లబ్బగింపక." కుమా. 12.31.

**అబ్బగింపక**

సహింపక, తాళలేక.

"అతిభీషణశాసను లైన గణాధీశ్వరుల కవిదల కబ్బగింపక."
కుమా. 2.69.

"వాని పటుదండముల కమరానీకము లబ్బగింపక." కుమా. 4.5.

**అబ్బబ్బ**

భరింప రాని పనుపట్ల అనే ఉపస్కారకం.

"అబ్బబ్బ! ఏమి అల్లరి చేస్తున్నార్రా." వా.

**అబ్బురమా ?**

అరుదు కా దనుట.

"అ దేమి అబ్బురమా ? ఎవడు పడితే వాడే చేస్తాడు." వా.

చూ. అదేం గగనమా ?

**అబ్రహ్మణ్యము**

ఏ దైనా అనాహూతం జరిగి నప్పుడు అను మాట. సంస్కృత నాటకాల్లో తరచూ ద్విరుక్తమై వినబడు తుంది.

"అబ్రహ్మణ్యము! లోన వైచుకొనె నన్యాయంబునకా మత్సుతకా." ఆము. 7.44.

**అభయము**

శరణు; నన్ను రక్షించు మంటూ ఒకరిని శరణు చొచ్చే వారు అనేమాట. అభయ మివ్వు డని భావం.

"అభయ మభయ మయ్యా అంబికా నాథ !"

పండితా. ప్రథ. వాద. పుట. 631.

**అభయదానం బిచ్చు**

రక్షింతు నని మాట యిచ్చు.

"సాధ్వసంబున జనుల్ శరణంబు వేడిన, నభయదానం బిచ్చునట్టి వారు." రుక్మాం. 2.89.

**అభయహస్త మిచ్చు**

భయము లేద ని ధైర్య మిచ్చు.

"కంపము నొంద నోడకుం డని తిమి రంబు తా నభయహస్తము లిచ్చె ననంగ." పారి. 2.36.

**అభాండము వేయు**

అపవాదు వేయు.

"పాపం! అలాంటి అమ్మాయిమీద అభాండాలు వేసి వాళ్ల కాపురం తీశాడు." వా.

**అభినవించు**

క్రొత్తదనము లొలుకు.

"వెలయ రసంబులం దభినవించె రసంబులు..." కుమా. 9.38.

**అభిషేక మాడు**

స్నాన మాడు.

"అభిషేక మాడు నేయుభివర్ణితాచార దిగ్గజానీతమా తేటనీట." పాండు. 1.2.

**అభిషేకించిన అగ్నిహోత్ర ములా**

బొగ్గులాగ నల్లగా.

"నేను ఆ మాట అనేసరికి వాడి మొహం అభిషేకించినఅగ్నిహోత్రంలా అయి పోయింది." వా.

**అభోజనం పడుకొను**

పస్తు పరుండు.

కన్యా. కు.

"వాడు రాత్రి అభోజనం పడు కొన్నాడు." వా.

అభ్యంగము
నూనె అంటుకొని చేయు స్నానము.
హర. 4.79.

అభ్యంజనోద్వర్తన స్నానంబులు
తలంటుకొని నలుగు పెట్టుకొని స్నానము చేయుటలు.
ఇది కలిసే వాడడం అలవాటు.
"అభ్యంజనోద్వర్తన స్నానానంతరంబన." కుమా. 9.23.

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా
శుభ పరంపరలు కలుగునట్లుగా.
ప్రబంధాల అవతారికలలో విరివిగా కానవచ్చేపలుకుబడి.
"(కృతిపతికి) అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పరం బూనిన...కథా ప్రారంభం బెట్టిదనిన."
—చాలా ప్రబంధాలలో.

అభ్యుదయించు
అభివృద్ధిపఱచు, పెంచు.
"అథరారుణద్యుతి నభ్యుదయింపవే పాలఁతి నీయాననాంభోజ మలర."
కుమా. 5.131.

అభ్రచ్ఛాయ
అస్థిరము.
మేఘమునీడ కాసే పయినా ఉండదు కనుక.
పాండు. 3.72.

అభ్రపుష్పము
గగనకుసుమము.
"పాపము లభ్రపుష్పములు, బంధనముల్ శశశాబశృంగముల్, తాపవికారముల్ మరుజలంబులు పుట్టువు లశ్మతైలముల్."
పాండు. 5.72.

అమందానంద కందళిత హృదయారవిందుడై
సంతోషించి అనుపట్ల విరివిగా ఉపయోగించేపలుకుబడి.

అమాంతంగా
ఉన్నట్టుండి – పూర్తిగా.

అమాంబాపతు
చిల్లర, అన్నిరకాల–
"అమాంబాపతు కాగితా లన్నీ ఇందులోనే ఉన్నాయి." వా.
"అమాంబాపతు జనం అంతా ఆ యింట్లో చేర్రారు." వా.

అమానుషమైన
అవమానకరమైన.
"ఇంత అమానుషమైన పని చేస్తుందని నే ననుకో లేదు." వా.

అమారుగా
సిద్ధంగా.
"ప్రయాణానికి అమారుగా ఉన్నారు." వా.

అమావాస్యమందు
చూ. అమాసమందు.

అమాసమందు
ఇది రాయలసీమలో ప్రచురంగా ఉన్నమాట. నాగలాపురందగ్గర ఒక కుటుంబం వారు ప్రతీ అమావాస్యనాడూ ఆ మందిస్తారు. ఏవో

కొన్ని ఆకులు దంచిన పొడి అది. ఆ పొడి తిని జొన్న సంకటి తింటే సర్వరోగాలూ నివారణ అవుతా యని గొప్ప నమ్మకం. నేటికీ కొన్ని వేల మంది అక్కడ చేరుతుం టారు.

ఇది తరువాత పలుకుబడిగా మారింది. అమావాస్యమందు అని తొలిరూపము.

"ఓ యబ్బా! యి దేమి అమాస మందా? ఈన ఇస్తానే బాగు కావ డానికి?" వా.

**అములు చేయు**

అధికారము చెలాయించు.

కొత్త. 33.

**అమృతకలశం**

ఒక తినుబండం.

**అమృతఘుటికలు**

ఒక తినుబండం.

**అమృతహస్తము**

వ్యాధినివారకమైన చేయి. చెయివాసిగలది.

"ఆయనది అమృతహస్తం.మన్ను మాత్ర చేసి యిచ్చినా రోగం నయమవుతుంది." వా.

**అమృతహస్తుడు**

అత నేమిచ్చినా రోగనివారణ అగును అనుపట్ల ఉపయోగిస్తారు.

వెంక టేశ. 15.

**అమ్మక చెల్ల**

ఆశ్చర్యార్థకము.

"అమ్మక చెల్ల! నా హృదయ మమ్మక చెల్లదు." విజయ.

చూ. అమ్మ నే జెల్ల.

**అమ్మకు రెండు అబ్బకు రెండు వచ్చు**

తలిదండ్రులకు చెడ్డ పేరువచ్చు.

కుమారీ. శత. 19.

"ఈ పిల్ల అత్తవారింటికి వెడితే అమ్మకు రెండు అబ్బకు రెండు వస్తాయి. అలా పెంచారు మీరు." వా.

**అమ్మక్క**

ఆశ్చర్యార్థకము.

"అమ్మక్క యని సతు లక్కజం బంద." .రా బాలకాండ.

చూ. అమ్మక చెల్ల.

**అమ్మగా చిక్కిన మేకవోలె**

ఏకాకిగా; ఒక్క చిక్కి.

మేక లన్నీ అమ్మి వేయగా మిగిలి పోయిన మేక అతి దుర్బలమైనదిగా ఉంటుంది.

"హతశేషసైన్యముల్, గ్రక్కున విచ్చి వీపువెనుకన్ మఱి మానిసి లేక యమ్మఁగాఁ, జిక్కినమేఁకవోలె వగఁ జెంది నిజాధిపుఁ డొంటిఁ జిక్కఁగన్." కళా. 8.65.

**అమ్మతోడు**

అమ్మసాక్షిగా, ఒకరకమైన ప్రమాణవాక్యము.

గుంటూ. పూ. 16 పు.

**అమ్మను పట్టి వసంతము చిమ్మి నట్టు**

వరుసాడ తగని వారితో సరస ములకు దిగినట్లు.

వాడుకలో అన్నను పట్టుకొని వసంతా లాడినట్లు అన్న రూపంలో కానవస్తుంది.

"కమ్మని తేనెలు జడిగొన
నమ్మల నిటు నింతు రయ్య యబ్జాలయపై
నమ్మను బట్టి వసంతముఁ
జిమ్ముద మనుపలుకు నిజము చేసి మనోజా!" లక్ష్మీ వి. 4.68.

**అమ్మనే జెల్ల**

ఆశ్చర్యార్థకం.

"అమ్మ నేఁ జెల్ల నెపతయో యవల నొక్క, కొమ్మ నా ప్రాణవిభు నేలుకొనియె నేము. శుక. 1 ఆ. 396 ప.

చూ. అమ్మక చెల్ల.

**అమ్మయ్య**

ఏదో బరువు తీరినట్లు ఊరట తో అనుమాట.

"అమ్మయ్య! యిప్పటి కీపని ముగిసింది." వా.

**అమ్మయ్య యను**

ఆశ్చర్యము ప్రకటించు, ఊరటను తెలుపు.

"సతీపతుల జాతిరీతు లమ్మయ్య యని రతిప్రియుఁడు వొగడ."

రాధి. 1.67.

"అమ్మయ్య! అనుకోవచ్చు ఈపని అయిపోయింది." వా.

**అమ్మలక్కలు**

ఇరుగుపొరుగు స్త్రీలు.

"ఇరుగుపొరుగున అమ్మలక్కలు చేరి మొగమోటము పెట్టి అడిగిన తప్పించుకొన లేక ఆమె సర్వము వారలతో చెప్పివై చెను..."

కవిమాయ. అం. 4. పే. 65 పం. 7.

**అమ్మలక్క లని తూలు**

అమ్మా అక్కా అని ప్రాధేయ పడు.

"తోడిఁబడ నమ్మలక్క లని తూలుచు దీనత దోయి లొగ్గుచుకా."

ఆము. 2.59.

**అమ్మవారు**

మశూచికము.

"ఆ ఊళ్లో అమ్మవారు ప్రబలంగా ఉం దట! అక్కయ్యపిల్లలను వెంటనే పిలిపించి వేస్తే బాగుండును." వా.

**అమ్మశక్తిలాగా**

భయంకరంగా.

దుర్గ, కాళి యిత్యాదులను అమ్మశక్తులు అంటారు.

**అమ్మా ఆలీ అను**

బూతులు తిట్టు.

**అమ్మా ఆలీ ఎంచు.**

బూతులు తిట్టు.

చూ. అమ్మా ఆలీ అను.

**అమ్మా ఆలీ తిట్టు**

బూతులు తిట్టు.

చూ. అమ్మా ఆలీ ఎంచు.

**అమ్ముడు గడచు**

అమ్ముడు పోవు. వివాహమై అత్తవారింటికి పోవు.

పూర్వపు రోజుల్లో కన్యను

ఇన్ని గోవుల కని, ఇంత ధనాని
కని ఓలి తీసుకొని యిచ్చుఅల
వాటుపై వచ్చిన పలుకుబడి.
"ఏ నమ్మడు గడవఁగ."
పాండు. 3.35.

## అమ్ముడు పోవు

ఒకరు చెప్పినట్లు ప్రవర్తించు.
వా. మా. 130.

## అమ్ముడు వోవు

అమ్మబడు.
అనగా దాసు డగు, వశ మగు
అనుట.
"మన మే మమ్ముడు వోతిమో యితని
కిక్." వరా. 11.37.
"వానికి వీడు అమ్ముడు పోయినాడు."
వా.

## అమ్ముల నూఱు

యుద్ధమునకు సిద్ధపడు.
యుద్ధసన్నాహము చేయు
నప్పుడు బాణములకు పదును
ఎక్కించుటకై నూఱుటపై
యేర్పడినపలుకుబడి.
కత్తులు నూఱుట వంటిది.
"మదనుఁ డమ్ముల నూతె హిమంబు
పేరె, జడిసి విరహిణి వగఁ గూ రె
జార చోర..." మను. 3.23.
చూ. కత్తులు నూఱు.

## అమ్మే దొకటి అసిమిలో దొకటి

సంచిలో ఒకటి పెట్టుకొని
మరొకటని విక్రయింప
జూచు. మోసగించు.
తాళ్ల. సం. 8. 176.

## అయంపిండులు

తద్దినపుబ్రాహ్మలు.
అలాంటి వారిని తక్కువ
చూపు చూడడంపై నీచ
జీవనం చేసేవాడు అనే
అర్థంలో ప్రయోగింప బడు
తుంది.

## అయఃపిండం

కొలుకుకుడు పడనిది.
"కాశీఖండ మయఃపిండం."
గూ. ఇనుపగుగ్గిళ్లు.

## అయగారితనము

"అక్కలివడునె నీ యయగారితనము."
పండితా. ప్రథ. పురా. పుట. 30.

## అయవారు

ఉపాధ్యాయుడు.
"అయ్యవారు నిద్రింపఁగా......అయ
వారు మిడికి కూయ." హంస. 3.144.

## అయవారై చరించు

గౌరవముతో బ్రతుకు.
కాశీ. శత. 73.

## అయిదారు రోజులలో

కొన్ని రోజులలో.
"అఁ. అన్నా శ్లెందుకూ? అయిదారు
రోజుల్లో వచ్చి వేస్తా గా." వా.

## అయినకల

మంచికల.
"అవ్విధంబునఁ బవళించి యైనకలయ
గంటి భవదీయకారుణ్యగరిమవలన."
శుక. 4 ఆ. 126 ప.

## అయిన నే మయ్యె

అయితే నేమి?

అయితే మాత్ర మేమి కొంప మునిగింది అని ఊతపదంగా అనడం వాడుక.

" .....తిరిగి పులిపులి సైతిన్...
"ఏన సేమయ్యో నిచ్చోట నరయుచున్న దానఁ బులు లున్నవో యని కాన నింక." శుక. 2 ఆ. 260 ప.

## అయినవాళ్ళు కానివాళ్ళు

అందరూ అనుట.

"ఢీలా పడినప్పుడు అయినవాళ్లూ కాని వాళ్లూ అంతా అనేవాళ్లే." వా.

## అయినదానికీ కానిదానికీ

ప్రతి చిన్న దానికీ, తప్పున్నా లేక పోయినా.

"వాడు తన భార్యను ఊరికే అయిన దానికీ కానిదానికీ తప్పు పట్టుతుంటే ఆవిడ చెప్పకుండా పుట్టినింటికి పోయింది." వా.

## అయిదు పది కావించు

ముక్కలు చేయు.

"కైదువ లైదు పది కావించియుఁ గుత్తుక లుత్తరించియు." వరాహ. 2.29.

## అయిదు పది సేయు

నమస్కరించు.

చూ. ఐదు పది సేయు.

## అయిదుమూళ్ళనేల

చనిపోవు నప్పటికి అంతే కదా కావలసినది అన్న సందర్భంలో ఉపయోగిస్తారు.

సమాధ చేయుట కనుట.

"ఎన్ని ఎకరాలు సంపాదిస్తే నేం? కడకు మనకు కావలసిం దల్లా అయిదు మూళ్ల నేల." వా.

చూ. ఆరడుగుల నేల.

## అయిదువ

ముత్తైదువ.

మాంగల్యసూచకంగా పంచ లక్షణాలను చెప్తారు.

పసుపు, కుంకుమ, గాజులు, తాళిబొట్టు, చెవాకు— మాంగల్యలక్షణాలు.

## అయిదువేళ్లూ నోట్లోకి వెళ్ల

కాస్త తినడానికి ఉండు.

కొత్త. 148.

## అయినంతకు

చేత నయినంతవఱకు.

అయివకాడికి అని వ్యవహార రూపం.

రుద్రమ. 16 పు.

## అయినకాడికి తెగ నమ్ము

వచ్చినంతకు అమ్మి వేయు.

కొత్త. 14.

## అయిం దయింది

చూ. అయిం దవుతుంది.

## అయిం దవుతుంది

ఏమైనా కానీ, చేసి తీరవల సిందే.

దీనినే 'అయిం దయింది' అని కూడా వ్యవహరిస్తారు.

"ఈ వ్యవహారంలో వేలకొద్దీ నష్టమయింది. కడకు ఈ కోర్టులో మనకు

త్వర మయింది. అయిం దవుతుంది. హైకోర్టు సంగతీ చూద్దాం." వా.

**అయిరకన్ను**

వేగి నీరు కారుతూ ఉండే కన్ను. నేటికీ ఈ నూట 'అవిరయిందే – అయిరయింది కన్ను' అని అలవాటులో ఉంది.

పండితా. ద్వితీ. మహి. పుట 108.

**అయిరేనికుండలు**

చూ. అతిమెన కుండలు.

**అయివేజు**

ఆదాయము.

కొత్త. 143.

**అయిసకలడ్డు**

ఐసరబొజ్జ వంటిది.

**అయోమయం**

గందరగోళం,

"ఆ ఊళ్లోకి వెళ్లాను. అంతా అయోమయం. దారీ తెన్నూ తెలియ లేదు." వా.

**అయ్యా అప్పా అంటే వింటాడా ?**

నయముతో విన డనుట.

"వాడు మహా దుర్మార్గుడు. అయ్యా అప్పా అంటే వింటాడా ?" వా.

**అయ్యకు విద్యా లేదు అమ్మకు గర్వమూ లేదు**

సత్త్వమూ లేదు ఆడంబరమూ లేదనుట.

మానినీ. 19.

**అయ్యగారు**

ఉపాధ్యాయుడు.

హంస. 3.144.

**అయ్య జియ్యలు పెట్టు**

గౌరవించు.

"...గరణీరమణు లయ్య జియ్యలు పెట్టుచు." సారం. 1.62.

**అయ్యవారి తలవాకిలి**

చూ. అయ్యావార్లంగారి నట్టిల్లు.

**అయ్యవారి సంసేవవేళ సమ్మగా రుగడించిరో**

ఏకాంతంలో భార్య చెప్పిన మాటను భర్త వినును అన్న సత్యం పై ఏర్పడిన పలుకుబడి. ఇది రకరకాలుగా ఉంటుంది. 'నను గ్రోవ మని చెప్పవే సీతమ్మ తల్లి' అనేపాటలో యిదే ధ్వనిస్తుంది.

కళా. 5.52.

**అయ్యవారు**

ఉపాధ్యాయుడు.

హంస. 3.144.

చూ. అయవారు.

**అయ్యవారమ్మ**

ఉపాధ్యాయిని.

"మా ఊళ్లోకి ఈమధ్యే ఒక అయ్యవారమ్మ వచ్చింది." వా.

**అయ్యవారికి చాలు అయిదు వరహాలు**

మహర్నవమి రోజుల్లో పిల్లలతో పాటలు పాడించు

కొంటూ అయ్యవార్లు బయలు దేరడం. గృహస్థు లేవో కొన్ని గింజలో, బహుమతులో యివ్వడం పరిపాటి. ఆ పాటల లోని భాగమే యిది. 'అయ్యవారికి చాలు అయిదువరహాలు, పిల్లవాండ్రకు చాలు పప్పుబెల్లాలు' గొప్ప ఆశలకు పోవడం లేదు అనే సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

"నే నేం మేడ లిమ్మంటానా? మిద్దె లిమ్మంటానా? ఏదో ఇంత మిగులో సగులో పడేస్తే చాలు. అయ్యవారికి చాలు అయిదువరహాలు అని." వా.

**అయ్యవారిని చేయబోతే కోతి పిల్ల యింది**

ఒకటి చేయబోతే దానికి వ్యతిరేక మయింది. పని వికటించింది అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

**అయ్యవారిని చేయబోయి కోతిని చేసినట్లు**

మంచి చేయబోగా చెడు అగుపట్ల ఉపయోగించే పలుకుబడి.

**అయ్యవార్లంగారి నట్టిల్లు**

శూన్య మనుట.

అయ్యవార్లంగారు డబ్బు లేని వాడు కనుక అతడి నట్టిల్లు శూన్యంగా ఉంటుంది.

"అయ్యవార్లంగారి నట్టిల్లువలె మీ యలి కము లిట్లు వట్టివై యున్న వేమి?" సాక్షి. 91 పు.

**అయ్యసాము ఇంటిలోనే**

అసమర్థునిపట్ల ఉపయోగించే పలుకుబడి. వాని పరాక్రమం ఇంటిలోనే కాని బయట కాదనుట.

సింహా. నార. 74.

**అరకూళ్లు మెక్కు**

కన్నకూళ్లు తిను.

"అక్కవాడల నరకూళ్లు మెక్కి మీఁద వీని శేఖర మొక తులాత్రివ్యజ్యము కొని." ఆము. 7.5.

**అరగంట గనుగొను**

ఓరగా చూచు, కనులర మోడ్చి చూచు.

"అరగంటం గనుఁగొంట మందగతిఁ బూర్ణాహంకృతిం బ్రార్థనాకర భుక్తిస్థితి..." కా. మా. 1.25.

**అరగన్ను**

మ్రాగన్ను.

"వాడు అరగన్ను పెట్టి నిద్ర పోతున్నాడు." వా.

**అరగలిగొను**

సంకోచించు.

"అరగలిగొన కిత్తు రల్ల భక్తులును." బస. 3.56.

**అరగూడు**

గోడలో కట్టిన గూడు. దీనికి

మూత ఉండదు. ఇందులో దీపం పెడతారు.

"సాయంత్రం అయింది. అరగూట్లో దీపం పెట్టవే." వా.

## అరచేతిది

అందుబాటులోనిది.

"శ్రీవైకుంఠుని దాసుల నుట యర చేతిది మోక్షము మా కిది వో." తాళ్ల. సం. 9.83.

## అరచేతిమాణిక్యము

అందు బాటులో నున్న అమూల్యవస్తువు.

కరతలామలకము వంటిది.

"సమధిక బ్రహ్మవిజ్ఞానసంపద నీకు నరచేతిమాణిక్య మనఘచరిత." రాధా. 1.54.

## అరచేతిలో వైకుంఠము చూపు

అరచేతిలో స్వర్గం చూపు.

చూ. అరచేతిలో స్వర్గం చూపు.

## అరచేతిలో స్వర్గం చూపు

మాయ చేయు, మోసము చేయు, మాటలతో నే సంతృప్తిపఱచు.

"వాడు అరచేతిలో స్వర్గం చూపి స్తాడు." వా.

చూ. అరచేతిలో వైకుంఠము చూపు.

## అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు

అతిసులభముగా. బాగా తెలి సేటట్లు.

"పలుకఁ దలంప దవ్వు లగు భారతరామ కథారములో విభాసిలఁగ నరంటిపం డొలిచి చేతికి నిచ్చినరీతి..." కళా. 1.6.

"ఆయన ఏ పుస్తకం పాఠం చెప్పినా అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు చెబుతారు." వా.

## అరటి పండ్లు వేయు

అవమానించు.

"మును చెప్పినకథ లేసట వినిపించిన నరఁటిపండ్లు వేయుదు చెలియా!" శుక. 3 ఆ. 596 ప.

## అరణ మిచ్చు

ఆడపడుచులను అత్తవారింటికి పంపేటప్పుడు అమూల్యవస్తువులను దాసదాసీలను ఇచ్చు. యామున. 4.232.

## అరణ్యచంద్రిక

అడవి గాచినవెన్నెల.

చూ. అడవి గాచినవెన్నెల.

## అరణ్యరోదనం

వ్యర్థము.

"తేరు హుటాహుటిం గదిని దృష్టి కగోచర మైయయోధ్యకుం, జేరె నరణ్య రోదనముఁ జేయుచు నమ్మిథిలేశుపుత్రి మూర్ఛారభసంబునన్ ధరణి వ్రాలె." జైమి. 6.77. భోజ. 5.56.

"నీ అరణ్యరోదనం వినేనాథు డెవ డున్నాడు?" వా.

"నువ్వు ప్రభుత్వాన్ని ఎంత విమర్శిస్తే నేం? ఏం చేస్తే నేం? అంతా అరణ్య రోదనం." వా.

## అరదండాలు

బేడీలు.

"అరదండాలు వేసి వాణ్ణి కోర్టుకు తీసుకు వెళ్లారు." వా.

**అరదళం పటాసు**

పటాసు వంటివా డనుట.

హరిదళమే అరదళం.

"వాడా అరదళంపటాసు ఎక్కడా దాగడు." సా.

**అరదేసి**

పరదేశి.

(తమి)

**అరదేశి పరదేశి**

అతిథి అభ్యాగత.

"అరదేశి పరదేశి వస్తే వాళ్ళింట్లో ఏ వేళప్పుడైనా ఆదరిస్తారు." వా.

**అరనిద్దుర**

సగమునిద్ర.

సారం. 3.152.

**అరపడకిల్లు**

పడకగది. అర అంటే గది.

"చన ని ట్లరపడకింటిలోని కనిచి." రాధి. 1.74.

**అరపైకము చేయని**

అరకాసు చేయని, విలువ లేని, పనికిమాలిన.

"అరపైకంబును జేయని హరివాసరము నకు నై నిజాత్మజుఁ జునుమన్." రుక్మాం. 5.143.

**అరమర**

సంకోచం, పొరపొచ్చెములు.

"ఈ యరమరంబునఁ బోమన సీదు నాకు," సై. 8.75.

చూ. అరమరము.

**అరమరపుల జొక్కు**

పరవశప్రాయత నొందు.

"అరమరపుల నేఁ జొక్కితి తనిసే దిఁక సెన్నఁ డొకో."

తాళ్ల. సం. 6.127.

**అరమరము**

పొరపొచ్చెములు.

చూ. అరమరికలు.

**అరమరిక**

పొరపొచ్చెము.

"అరమరిక లేనిచుట్టలు." క్షేత్రయ్య.

**అరమోడ్పు కనులు**

అర్ధనిమీలిత నేత్రములు.

**అరవగోల**

అర్థముకాని అల్లరి.

"అరవగోల యనెడి యార్యుల మాట యత్తతిని..." గీర. 64.

**అరవము మొత్తుకోళ్ళు**

అర్థం కానిది.

"ఏమిటో! ఆయన ఉపన్యాసం అంతా అరవం మొత్తుకోళ్లు చింత గుగ్గిళ్లుగా ఉన్నది." వా.

"అరవం మొత్తుకోళ్లు చింతగుగ్గిళ్లు." సా.

**అరవమేకు**

తగులుకొంటే వదలనిది.

గీర. లోకా .20.

**అరవయేడుపు**

పొంగ యేడుపు, కూలి యేడుపు.

"అవన్నీ అరవ యేడుపులే. అత డున్నంత దాకా ఏడ్పించి బొక్క లాడిందిగా."

## అరవర లగు

చిందరవందర యగు, ఎండి వరు గగు, వాడివత్తలగు.

"అంతంత విచ్చి యరవరలై పొంతలేక పలపల నై." ఉ. హరి. 1.148.

"విరహాగ్ని వలన దేహము, లరవర లై హస్త భూషణావళు లెల్లన్, హరిఁ గోరి జాతి పడఁగా, నరుదుగ నొక చోటఁ గూడి యందఱుఁ దమలోన్." విష్ణుపు. 7.352.

## అరవాయి

సంకోచము.

"అరవాయి గొనక నడపుము." భార. ఉద్యో. 4.101.

చూ. అరవాయిగొను.

## అరవాయిగొను

సంకోచించు.

"వృష్ణి కుమారవరు లనేకు లట్టి యోధులు పోర నరవాయి గొందురే?" భార. ఉద్యో. 1.268.

"కురుసైన్యము నిస్సారం, బరయఁగ మన బలము లెల్ల నతిదృఢములు నీ, వర వాయి గొనక నడపుము." భార. ఉద్యో. 4.101.

"చుట్టం బని యరవాయి గొనుట కర్జంబు గాదు." భార. కర్ణ. 3 ఆ. 122.

"అరవాయి గొనక." భీమ. 2.140.

## అరవై మంద్దైనా సరా?

ఎంతమంది దైనా సరి కారు అనుట.

"అరువదిమంది యైన సరియా మరి యా కరియాన యానకున్." శ్రవ. 5.39.

## అరవై యారు దేశాలు

అన్ని దేశాలూ అనుట.

ఆ కాలంలో భరతఖండాన్ని అరవై యారు దేశాలు గా విభజించుకొన్నారు.

"అరవైయారు దేశాలలో వాణ్ణి జయించినపండితులు లేరు."

చూ. ఛప్పన్నారు దేశాలు.

## అరసావు

మూర్ఛ.

"అతండు నీమ అందికి నరసా వొనర్చె." ద్రోణ. 5.173.

## అరసేయక

సంకోచము లేక.

"అరసేయ కొక మాట యానతి యిండు."

వర. రా. కిష్కిం. పు 290. పంక్తి 16.

## అరికట్టు

అటకాయించు.

"తాల్మి యరికట్ట లేక జననాయకుఁడు."

వర. రా. అయో. పు. 332. పం క్తి 7.

## అరికట్టుకొని

అడ్డుపడి.

"ఎలుఁగులో హరిణంబులుఁ గోట్ల సంఖ్య భీకరరవముల్ చెలంగ నరికట్టుక యున్నవి." రుక్మాం. 3.9.

## అరికాలిమంట నడినెత్తి కెక్కు

అతికోపము కలుగు.

"వాడు ఆ మాట అనేసరికి నా కరికాలి మంట నడినెత్తి కెక్కింది." వా.

### అరికాలి నవ్వ
ప్రయాణేచ్ఛ.
ప్రయాణసూచక మగు శకున శాస్త్రప్రవచనము రీత్యా వచ్చినపలుకుబడి.
"వాడి కెప్పుడూ అరికాలిలో నవ్వ పెడుతూ ఉంటుంది." వా.

### అరిగాపు
సామంత రాజు.

### అరిగొలుపు
ఎక్కిడు, ఎక్కుపెట్టు.
"అమ్మరి గొలిపె మరుఁడు."
కుమా. 5.36.

### అరిగోలు
పడవ.

### అరిగోరు వెట్టు
భాగము పెట్టు.
"అట్టి కర్మములకు నరిగోరు వెట్టేము."
తాళ్ల. సం. 9.198.

### అరిపడు
అడ్డపడు.
"మాకు నిప్పు డరిపడ్డదురాత్ముల..."
భాగ. 3.523.

### అరిబోయు
ఎక్కుపెట్టు.
"ఘనశస్త్రం బరిఁ బోసి యార్చి."
జైమి. 5.13.

### అరివెట్టు
కప్పము కట్టు.
"మన కరివెట్టనిమహీపుఁడు లేఁడు."
ద్వి. జగ. పు. 202.

### అరిషడ్వర్గాలు
కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు.
"అరిషడ్వర్గాలు జయిస్తేగానీ యోగి కాలేడు." వా.

### అరుగుదెంచు
వచ్చు.
"స్థితి దప్పి యరుగుదెంచిన భూవిభుని."
రుక్మాం 2.106.
"అలసమ్మృదులాంగకంబు సై యరుగు దెంచు, నన్నిజపరిగ్రహము..."
పాండు. 1.129.
"అయోధ్యకు నరుగుదెంచుటయు."
రంగ. రా. బాల. పు. 8. పంక్తి. 18.

### అరుంధతి
పతివ్రత.
అరుంధతి మహాపతివ్రత అని ప్రసిద్ధి. అందుపై వచ్చిన మాట.
"యామినీకాంతముఖీ! యరుంధతివి కానక నీపయిఁ గానిపోని యీ వింత ఘటించినట్టి..."
శుక. 4. 54. ప.

### అరుంధతీదర్శనమగు
కనబడకపోవు.
"ఆమె యెక్కడ కనబడుతుంది? ఆమె దర్శనం మరీ అరుంధతీదర్శనం అయిపోయింది." వా.

### అరుణజలం
రక్తము.
"వినుతారుణ జలనిగళిత ఘనమన."
కుమా. 12.17.

**అరుణధారలు**

రక్తధారలు

"పరులపైఁ గ్రమ్మెడు నరుణధారలు దమ మేని గ్రొంగంటులలోనఁజొచ్చి..."

కుమా. 11.135.

**అరుణాంబుధారలు**

రక్తధారలు.

"తనరు నరుణాంబుధారల ననవరతము దొప్పఁదోఁగి."

కుమా. 11.206.

**అరుణాంబువులు**

రక్తము.

"నవధాతుజలము లరుణాంబువులై."

కుమా. 5.157.

**అరువుతిక్క**

ఉంగిడిరోగము. పశువులకు వస్తుంది.

బ్రౌను.

**అరువు తెరువు**

దారి తెన్ను. జం.

"ఉభయభారతికి సదుత్తరం బిడనినాఁ, డద్వైతమత మిల నరువు తెరువు, లేనిదై పోవదే..."

శంకరవిజయ కథా. 4.44.

**అరువులు చేయు**

వారిసంగతీ వీరిసంగతీ మాట్లాడుకుంటూ కాలము గడుపు. ఇది రాయలసీమలో ప్రచురంగా వినవచ్చేపలుకుబడి.

"కోడ లేమో కోడి కూసినప్పటినుంచీ తెక్కలు విరుచుకుంటూ, ఉంటే ఆడబడుచేమో అరువులు చేసుకొంటూ కూర్చుంటుంది."

వా.

**అరువు లేనిమనిషి**

ఏది యెలా చేయవలెనో తెలియనివాఁడనుట.

"వాడు ఒట్టి అరువు లేనిమనిషి. వాడేం చేస్తాడు!"

వా.

**అరులు మరులు**

వయసు పండిం తరువాత తిబ్బిబ్బు పడుట. ఇది నేఁటికీ రాయలసీమలో అలవాటులో ఉన్న పలుకుబడి.

"అరవైయేండ్లయింది పాపం. అరులు మరులు పట్టిపోయి యేదో ఒకటి అంటూ ఉంటాడు. ఆయన మాటలకేమి!"

వా.

**అఱ్ఱుకట బెట్టుకొను**

చంక నుంచుకొను.

"జనకుఁడఱ్ఱుకటఁ బెట్టికొనియొక నాడు చని సరోవరతీరమున బాలు నునిచి..."

బస. 6. 151 పుట.

చూ. అఱుకట నిడుకొను.

**అర్ఘ్యపద్యములు వోయు**

అర్ఘ్యపాద్యము లిచ్చు, రాగానే అతిథికి కాళ్లు కడుగుకొనుటకై నీళ్లిచ్చు.

"అడుగుల కర్ఘ్యపద్యములు వోయుచును."

పండితా. ప్రథ. దీక్షా. పుట.135.

**అర్చ లిచ్చు**

పూజించు.

"భక్తితోడ...తోడ్కొని చని యర్చ లిచ్చి." భార. శాంతి. 6.564.

**అర్ధచంద్రం**
నఖక్షతం.

**అర్ధచంద్రప్రయోగం**
మెడబట్టి గెంటుట.
"నీవు వాళ్ళింటికి వెళ్ళి హెచ్చుతక్కువగా మాట్లాడావా నీకు అర్ధచంద్రప్రయోగం తప్పదు. జాగ్రత్త." వా.

**అర్ధచంద్రప్రయోగము చేయు**
మెడబట్టి గెంటు.

**అర్ధజరతీ న్యాయం**
ప్రామాణికం కొంతా, ప్రమాణరహితం కొంతా కలిసి ఉండడం.
గుడ్డులో సగం పిల్ల పొదగడానికి వదిలి, సగం కూర చేసుకోవడం అసాధ్యం అనుటపై వచ్చిన సంస్కృత న్యాయం.

**అర్ధాంతరంలో**
మధ్యలో, పూర్తి కాక ముందే.
"వాడు చేస్తూ చేస్తూ అర్ధాంతరంలో వదిలిపెట్టి పోయినాడు. ఆ పని అంతా నేనే చేసుకోవలసి వచ్చింది." వా.

**అర్ధాకలి**
కడుపు నిండా తిండి లేమి.
"ఆమె చేత అన్నం తింటే అర్ధాకలితో చావవలసిందే." వా.

**అ్రాడు**
తచ్చాడు.
"కాముఁ డ్రాడుచున్నాఁడు."
రాధా. 4.314.

**అ్రుగుత్తిక యగు**
కంఠాభరణ మగు.
"కోమలాంగికి నగ్రుగుత్తిక వై యుండి కలకంఠమా కనికరము వలదె."
కవిక. 3.120.

**అర్లుమర్లు**
చూ. అరులుమరులు.

**అఱకట నిడుకొను**
చంక బెట్టుకొను.
చూ. అర్కుట బెట్టుకొను.
"కొడుకు దా నఱకట నిడుకొని వచ్చె."
బస. 6 ఆ. 152 పుట.

**అఱకాల బెట్టి నేల రాచు**
వేధించు.
"బింకములు కూల నఱకాలఁ బెట్టి నేల రాచకున్నను నాపేరు రాధ కాదు."
రాధి. 3.15.
చూ. నేలబెట్టి కాలరాచు.

**అఱకాల ముల్లు గొనక**
ఏమాత్రం శ్రమపడక, నిరపాయంగా.
"అఱకాల ముల్లు గొన కిటఁ, దిరిగి రఘుస్వామి యేఁగుదెంచున్ మదిలోఁ, దరుణీ! వెఱవకు విపినాం, తరమున నిను విడిచి పోక తగ దిఁక నాకున్."
రామాభ్యు. 5.172.

**అఱకాలు గొను**
అఱకాలిలో గ్రుచ్చుకొను.
"ఒక కొయ్య యఱకాలు గొన్న."
పండితా. ప్రథ. పురా. పుట 390.

**అఱకాలు తడి కాకుండా**
నిరపాయముగా, అశ్రమంగా.
"ఉదక మిరుదెసలఁ బాయ...పోవఁగా

నయ్యేడు......అరుగు మఱకాలు తడి
గాకుండ.'' భోజ. 3.23.

**అఱకాళ్ళకు నఱచేతు లొగ్గు**

ఎక్కువగా ఆదరించు.

"చెమరు నెత్తురు నవు బంధుసమితి
గరముఁబ్రీతి నఱకాళులకు నఱచేతు
లొగ్గనునికి యెక్కడ......''
నిర్వ. రామా. 5.104.

**అఱకొఱగా**

అసంపూర్ణంగా.
రుద్రమ. 91.

"ఏం చేసినా అఱకొఱగా చేయడం
నా కిష్టం లేదు.'' వా.

**అఱగాల గన్ను వచ్చినట్లు**

చీకటిలో కూడ చక్కగా
వెళ్లి గమ్యస్థానమున చేరు
టకు కాలిలోనే కళ్ళుండు
వలె గదా. అందుపై వచ్చిన
పలుకుబడి.

"చెదర కఱగాలఁ గన్ను వచ్చినవిధాన
నాథసంకేతముల కేఁగు నడికిరేలు
కాయసంభవబాధాసహాయ యగుచు
స్వైరిణీకోటి నిర్భయస్వైరధాటి.''
పాండు. 4.28.

**అఱగాలు**

సంపూర్ణముగా కాలు, భస్మ
సాత్కార మగు.

"కని కోపించెనో గానక. మును కోపిం
చెనో. మహోగ్రముగ నుగ్రుఁడు నూ,
చినఁ గాలెనో చూడక యట మును
గాలెనో నాఁగ నిమిషమున నఱ
గాలెన్.'' కుమా. 5.51.

**అఱగొండెతనము**

దుర్మార్గము.

**అఱగొడ్డెతనము**

మూఢత్వము, దుష్టత్వము.

"అద్రిరాభక్తుని యఱగొడ్డెతనము, విదె
లాడుట గాక వింగుమె తొల్లి, విపరీత
మందఱు వినఁ బలికింతుఁ, ద్రిపురారి నను
దెల్ల...'' బస. 5.127.
చూ. అఱగొండెతనము.

**అఱగొడ్డెము**

చూ. అఱగొండెతనము.

**అఱగొఱ లెఱుగకుండు**

లోటుపాటులు లేకుండు.

"తానుం బతియున్, మనమున నఱగొఱ
లెఱుఁగక యనితరసులభైకసుఖము
లందుచు రనుచున్.'' పారి. 4.62.

**అఱచేత గనందగు**

స్పష్టముగా తెలిసికొన దగు.
అఱచేతివలె స్పష్టముగా
చూడ నగు.

అఱచేతిని స్పష్టముగా చూడ
వచ్చును కదా!

"లక్ష్మీశ్రవిభు దివ్యలీల లఱచేతఁ గనం
దగు దీన దీనుగన్.'' పాండు. 2.169.

**అఱచేత నావహిల్లు**

అందుబాటులోనికి వచ్చు.

"అఖిలసిద్ధులు నఱచేత నావహిల్లు.''
భార. శాంతి. 3.415.

**అఱచేత నిమ్మపండువలె**

సుఖముగా, హాయిగా.

"ఖరభానుప్రియసూనుఁ డిప్పుడు నినుం
గారించునే కా విభుం, డఱచే లోపలి
నిమ్మపంటివలె నత్యాసక్తి మన్నింప
నౌ, ఖ్యాతస్సైకస్థితి నుండి...''
సారం. 2.111.

**అఱచేత బండ్లు వచ్చినప్పుడు కఱచెదవు కాక**

నీ కంత గొప్పతనం వచ్చినప్పుడు చూద్దాం లే! ఇందులో అలాంటి గొప్పతనం నీ కెప్పుడూ రాదు అన్న సూచన కూడా ఇమిడి ఉన్నది. అఱచేతికి పండ్లు రావడమూ అసంభవం, నీవు కఱవడమూ అసంభవమే ననుట.

"అఱపు లుడిగి పోపో నీ, యఱచేతం బండ్లు వచ్చినప్పుడు మమ్మం, గఱచెదవు గాని." కళా. 3.230

"అఱచేతఁ బండ్లు వచ్చినఁ, గఱతువు గాకిత్తు కార్ముకప్రతిపక్షా!" నిరం. 3.32.

**అఱచేత బ్రాణము లిడుకొను**

పిడికిట ప్రాణములు పట్టుకొను.

ప్రాణభయముతో ననుట.

"పిఱుఁదం గురుధరణీపతి, యఱచేతం బ్రాణములుగ నభియాతిబలం, బుఱని తెగువ ముందటఁ బెన్, గొఱలుట చిత్తమునఁ బెట్టుకొని విహరించెన్." భార. స్త్రీ పర్వ. 2 ఆ.

**అఱచేత వ్రాలు గనువేళ**

తెల తెలవారునప్పుడు.

అఱచేతి రేకలు కనబడుతుండగా అని యిప్పటికీ అంటూరు.

"అఱచేత వ్రాలు గనున, త్తఱిఁ బడెనొక యంపకట్టె..." ఆము. 7.10.

**అఱచేతిమాణిక్యము**

అందుబాటులోని అమూల్యవస్తువు.

"శీతాంశుధరుఁ డఱచేతిమాణిక్యంబు. కద్రూజకటకుండు గాదె కొలుచు." శృం. శా. 4 పే. 82.

చూ. అరచేతి మానికము, కరతలామలకము.

**అఱచేతిది**

సులభసాధ్యము, అందుబాటులోనిది.

"పరము నిహము నఱచేతిదే ప్రయాస మించుక లేదు. తాళ్ల. సం. 5.265.

**అఱచేతిభోగ్యము**

అందుబాటులో నున్నది. అరచేతిలోనిదానివలె అనుభవింప అతిసులభ మనుట.

"సర్వసామగ్రి నీ, యఱచేతి భోగ్యము." హర. 4.23.

**అఱచేతిమానికము**

అందుబాటులో నున్న అమూల్యవస్తువు, అఱచేతిలోని మాణిక్యము.

"ప్రతిదేవతలు నన్ను బయలు సెత్తిన దివ్వె, యఱచేతిమానిక మనుట దప్పె." ఉ. హరి. 5.92.

చూ. అరచేతి మాణిక్యము.

**అఱచేతి యుసిరికాయ**

సంపంగిమన్న శత. 7.

చూ. కరతలామలకము.

**అఱచేతిలోనిది**

అందుబాటులోనిది.

"శిష్టాన్నభోజనపరు లగు పుణ్యులకుం
బుణ్యలోకంబు లఱచేతిలోనివి గావె."
భార. శాంతి. 1.72.

**అఱచేతు లొగ్గు**

చూ. అఱచేతిది.

అఱచేతు లడ్డముగా పెట్టు.
ఉత్త. 6.138.

**అఱచేయు**

మనః పూర్వకంగా కాక యేదో పట్టీ పట్టనట్లు చేయు.

"అఱచేసిన దోషము వచ్చు."
భోజ. 4.38.

**అఱజాతి**

నీచుడు.

కులహీను డనుటపై వచ్చిన పలుకుబడి.

"నీవను లఱజాతివి."
హరి. పూ. 5.24.

"ప్రల్లదు డఱజాతి భక్తిహీనుండు."
బసవ. 1 ఆ.

**అఱ తలనొప్పి**

ఒంటిపార్శ్వం నొప్పి.

తల ఒకవేపే నొప్పి ఉదయం ప్రారంభమై మధ్యాహ్నం దాకా పెరుగుతూ వస్తుంది. ఇది ఆరంభ మయితే చాలా కాలం ఉండడం, విపరీతంగా బాధించడం అలవాటు.

"పొద్దున్నే సూర్యోదయం కాక ముందే పెరుగన్నం తింటే మూడురోజులలోనే అరతలనొప్పి మాయమై పోతుంది."
వా.

**అఱపులకు నేర్పరి**

మాటలలో గట్టివాడు, క్రియలో నేర్పరి కాదన్న సూచన ఇందులో ఉన్నది.

"నిను నెఱుఁగనె యఱపులకును
నేర్పరి వని......" కళా. 7.22.

**అఱపోటుడు**

గూనివాడు.

**అఱమపోటుడు**

కపటబ్రాహ్మణుడు.

"అఱమపోటుండు ప్రక్కలు విఱుఁగ
నగుచు."
కుమా. 7.19.

**అఱలేని కూర్మి**

అఱకోఱ లేనిప్రేమ.

"ధవుఁ డఱ లేనికూర్మి జవదాటక నీపలు
కాదరింపఁగా." పారి. 1.62.

**అఱవచాకిరి**

గొడ్డుచాకిరి.

"ఎవరు చేస్తారు రా వాళ్ళింట్లో అరవ
చాకిరీ." వా.

**అఱవయేడుపు**

దొంగయేడుపు.

"ఈ అఱవయేడుపులు ఏడిస్తే నేను
మోసపోయేవాణ్ణి కాదు తెలుసుకో."
వా.

**అఱసేయక**

వెనుదీయక—మనసులో దాచుకొనక.

"నీవ నఱసేయక చెప్పెద."
కాశీ. 6.267.

**అఱిమెనకుండలు**

అయిరేని కుండలు.

పెండ్లిండ్లలో కొన్ని వర్గాలలో ముందుగా ఉల్లెడ పట్టుకొని మేళతాళాలతో వెళ్ళి కుమ్మరియింటినుండి అలివేణి కుండలు తెస్తారు. వీటికే రూపాంతరాలు అఱివెణ కుండలు, అలివేణి కుండలు, అవిరేని కుండలు, అయిరేని కుండలు. వీటిపై రంగులతో చిత్రించడం కద్దు.

**అఱివెణకుండలు**

చూ. అఱిమెన కుండలు.

**అఱగ్రమ్ము**

పైబడు, కవియు.

"అఱగ్రమ్మి మఱియు నిట్లనిరి నరేంద్ర
గిఱిగొన్న ప్రేమ భోగినులఁ గామంబు."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 966.

"పఱచు నెత్తురుటేర్లు బహుమాంస
ములకు, నఱగ్రమ్మ భూతంబు లై
రణం బొప్పె."

రంగ. రామా. సుం. 265 పు.

**అఱదెవులు**

క్షయ.

**అఱ్ఱాక యిడు**

ఆటంకపెట్టు.

చూ. అఱ్ఱాకలఁ బెట్టు.

"ఆఁకొని యఱచెడు ప్రేవులు
నేకట వో నమలవలయు నీమాంసము న
ఱ్ఱాఁక యిడి యివ్విధంబునఁ
దేకువ చెడి పల్కె నగునె ధేనువు
నాతోన్."

భోజ.

**అఱ్ఱాకల బెట్టు**

బాధపెట్టు.

"నీ వాఁకొన్నాఁడవు భోజనోత్తరమునం
దాస్థానమై యుండ న,ఱ్ఱాఁకం బెట్టక
చెప్పెదన్ సకలవృత్తాంతంబునున్."

కాశీ. 7.174.

"ప్రసూనబాణుఁ డఱ్ఱాఁకలఁ బెట్టిఁ దా
నఱవ నావెలబాలికకై విటావళిన్."

కళా. 1.133.

"......సాకఁగదే నన్నిపు డ
ఱ్ఱాకలఁ బెట్టక పలాశనాసక్తుఁడవై."

కా. మా. 3 ఆ. 89 ప.

**అఱ్ఱాకలి సేయు**

కడుపు నిండా పెట్టక బాధపెట్టు.

నేడు అర్ధాకలి అరకడుపు అనే మాటలతోనే యిది కనపడుతుంది.

"అఱ్ఱాకలి సేయకుము."

భోజ. 6. 165.

చూ. అర్ధాకలి.

**అఱ్ఱాడు**

ఉత్కంఠగొను; ఆశతో చుట్టుముట్టుల తిరుగు.

"ఒక్క వేదండస్వామి మదంబు సేసెఁ
గరిణీధామంబు లఱ్ఱాడఁగాన్."

కుమా. 1.86.

"చిగురు జొంపములందుఁ దగిలి యఱ్ఱా
డుచుఁ గెరలు కోయిల సుస్వరముల
కును."

మార్కం. 5.7.

"ఇబ్బాలకులు మన వాలకపు సొమ్ము
లందు నేమేనియు నపహరింపుటకు
నఱ్ఱాడుచున్నవారు. మీరలీ
మ్రుచ్చుల నెచ్చరికం గనుపెట్టుకొని
యుండుడు..."

ప్రభా. 1.107.

**అట్టు కట్టున బొడిచిన ట్లగు**

మిక్కిలి బాధ కలుగు.

"కొట్టి కోలాహల మొనర్చి గోడు గుడిపి, రట్టు కట్టునఁ బొడిచిన ట్లయ్యెఁ బసికి." నాయకు. 43 పు.

**అలంకారవిద్యార్థి**

విద్యార్థి వేషమే కాని ఆజిజ్ఞాస లేనివాడు.

"వాడు వట్టి అలంకారవిద్యార్థి. వాడికి చదు వేం వచ్చు? వేషం మాత్రమే." వా.

**అలంగం తిరగడం**

స్వేచ్ఛగా తిరగడం.

నిరసనగా అనుమాట.

**అలకపాన్పు**

పెండ్లిలో జరిపే ఒక సాంగెం. మంచం పడక వేసి, దాని మీద నూతనవధూవరులను కూర్చుండ బెట్టి, దంపతి తాంబూలాలూ అవీ ఇప్పించడం కూడా ఇందులోని భాగమే. అప్పుడు అల్లుడు కోరిన యే కోరిక నయినా మామగారు తీర్చడం విధి. అది తీర్చే దాకా అల్లుడు అలకపట్టి ఉంటాడు.

"ఆ అల్లుడు అలకపాన్పుమీద రేడియో కొని మ్మని అడిగా డట." వా.

**అలగాజనం**

చిల్లరజనం.

కొత్త. 315.

**అలజడి**

ఆందోళన.

**అలజడిపెట్టు**

తొందరపెట్టు.

"అప్పిచ్చిన వారలు మా, యప్పులు పెట్టు మని చాల నలజడి వెట్టన్." సుశ్లో. 4.110.

మా. అడజడిపెట్టు.

**అలబలము**

కలకలము.

"అలబలముతోడ మ్మ్రొగయు లరిగిరి వెంటఁ." సారం. 1.85.

**అలబలము సేయు**

అల్లరి చేయు. కలకలధ్వనులు చేయు.

"అల బలము లసంఖ్యము లై, యలబలములు సేయుచుండ..." విజయ. 3.140.

"అలబలము సేయు శుకశారికల నదల్చి," విప్ర. 2.56.

**అలమారుచు**

బండి యెద్దులలో వలపటి దానిని దాపటికీ, దాపటి దానిని వలపటికీ మార్చి కట్టు.

**అలరమ్ములు**

పుష్పబాణములు.

"అలిగి విరహుల నలరమ్ము లాడ నేసి." కుమా. 9.124.

**అలరుతేనెలు చిందు**

మాధుర్యము లొలుకు.

"...జవరఁదనము నలరుం దే నెల్చిం దినగతి మాధుర్యముఁ బొందుపడ న్వీణె మ్మట్టి పొలఁతుక పాడెన్."
కళా. 2.33

అలరొందు

ఒప్పు.

"అది చూచి యలరొందు నగచర విభుని."
వర. రా. బా. పు. 18. పం క్తి 8.

అలవి కాదు

సాధ్యము కాదు.
రాయలసీమలో ఇది నేటికీ వాడుకలో ఉన్న మాట.
వ్యతిరేకార్థములో మాత్రమే యిది ప్రయుక్తమవుతుంది.

"బలహీనుఁ డైన వానికి నలవియె మోపెట్టి తెలియ నక్కార్యకముఁ."
భార. ఆది. 7.234.

"వృత్రు ఘనబాహుబలం బలవికి మీఱెను."
భార. ఉద్యో. 1.125.

"చేరలఁ గప్పుకో నలవి గామిఁ జీదరం జెంది." పారి. 4.14.

"నలినాయతాక్షి లేనడ లెంచ నంచవ య్యాళికత్తెకు నైన నలవి గాదు."
శుక. 2.7.

"వాడికి అలవిగాని పొగరు." వా.
రూ. అలివికాదు...

అ(లి)వి కాదు

సాధ్యము కాదు.
దేనినైనా తన చెప్పుచేతుల లోనికి తీసుకొనగాదు.
ఇది వాడుకలో కూడ ఉన్నది.
వాడు అలివి గాని మనిషి అని రాయలసీమలో వాడుక.

"అతన్ని పట్టడానికి అలివి కాదు."
"ఏ మనుకొన్నావో? వాడికి అలివి కాని కోపం." వా.
"ఆ తిరునాళ్ల లో అలివిగాని జనం."

అలసి సొలసి

శ్రమపడి.

"అలసి సొలసి ప్రియంవద యంకపాలి.
శకుం. 2.228.

అలికి ముగ్గు పెట్టినట్లు

చక్కగా తీర్చినట్లు.
లోపాలను కప్పిపుచ్చి అన్న సూచన కూడా యిందులో ఉంది.

"ఆవిడ మాట్లాడితే అలికి ముగ్గుపెట్టి నట్లుగా ఉంటుంది." వా.

అలికిడి చేయు

సంతానవతి యగు, గర్భిణి యగు.

"ఏమిరా! మనమరాలు ఏమైనా అలికిడి చేసిందా?" వా.

అలిగి తన్నిన పఱుపు పయి పడినట్లు

చెడుపు చేయగా వానికి మంచి జరిగినట్లు.

"వెఱవకు కలలోఁ జేసిన
కొఱగామికి వగచుచోట గుణరత్నము చే
కుఱె నీకు నలిగి తన్నినఁ
బఱుపుపయిం బడినయట్లు పద్మదళాక్షీ!"
ఉ. హరి. 5.153.
పండితా. పూ. 387 పు.

**అలిగి పఱపుపై పడినగతి**

కారణము బాధ కలిగించున దైనను కార్యము శుభప్రద మైనపట్టుల ఉపయోగించే ఉపమానం.

రొట్టె విరిగి నేతిలో పడినట్లు వంటిది.

"నీ వీక నడవిఁ జరింపఁగఁ గలుగు టలిగి పఱపుపైఁ బడినగతి యయ్యె." కా. మా. 4.146.

చూ. తన్నిన పరపుపై పడినట్లు.

**అలివేణికుండలు**

చూ. అతిమెనకుండలు.

**అలుక తీర్చు**

బుజ్జగించి కోపము తీర్చు.

"అలుక దీర్చెదఁ గాదేని జలరుహాక్షి." ప్రభా. 5.137.

**అలుకలు తీర్చు**

కోపము పోగొట్టు.

"వలపులపల్లవుం డొకఁడు పట్టిచలంబున నేఁపదీన పై, యలుకలు తీర్చి తీర్చి యొక యచ్చర వచ్చి..." మను. 5.62.

**అలుకుచుట్ట**

తిట్టు.

పేడ అలకడానికి ఉపయోగించే గుడ్డపేలిక అనుట.

"వాడో అలుకుచుట్ట." వా.

**అలుకు వోదు**

ఈ చెడ్డపేరు, ఈ మచ్చ పోదు.

"నే నేం తప్పుచేశా నని అలుకు?" అని నేటి వాడుకలో ఈ అలుకు కనిపిస్తుంది.

"పొరిగొన కీయ లుక్ర నో దని నూచు..."

పండి. ద్వితీయ. మహిమ. 47 పుట.

**అలుగువారు**

పొంగిపొరలు.

అలుగు లనగా తూములు.

చెఱువు నిండా నిండినప్పుడే అలుగులు పారడం జరుగుతుంది.

"అరిది సురతభావరసము లలుగువారఁ బోలును." సాళ్వ. సం. 3.219.

చూ. అలుగులువాఱు.

**అలుగులు వాఱు**

చెఱువులు నిండినప్పుడు పైన నీళ్లు ఒక వేపు దొరలి పోతాయి. అలాగే లక్షణయా ఇట నిండి పొరలి పారు అనుట.

"పశ్చైరం బలుగులు వాఱె రా యనుచు." బస. 7. 201 పుట.

"చనుఁగప్పు దొలఁగ వాసనగాలి కెదు రేఁగఁ, బరు వొప్ప నలుఁగులఁ బాఱు కరణి." మను. 3.31.

"చెఱువులు అలుగులు పారినవి." వా.

చూ. మఱవపాఱు.

**అలుచగు**

చులకన యగు.

నేటి వాడుకలో అలుసగు అన్నట్టుగా వినవస్తుంది,

"పీడుఁబట్టు అలుచాయె వేడుక లుడి పోయెను." తాళ్ల. సం. 5.128.
"వాడింటికి పదేపదే పోవడంవల్ల అలుసై పొయ్యాను." వా.

## అలో లక్ష్మణా యను

పరిదేవించు.

"......బావమాని దివి రాహువుం బట్టి మ్రింగంగ నై, యల్లో లక్ష్మణ యంచుఁ బాతె నతఁ డయ్యాఖండలుం జూచుచున్, బెబ్లో భీభర మేఁచ నింద్ర! మహీభృద్భేదీ యటంచుణ్ వెసణ్." రామకథా.ఉత్త.కాం.పూ.భా. 8.48.

## అలో పొలో యను

కుయ్యో మొర్రో యను.

"తను దత్తుగాఁ గయికొనినతల్లి యలో పొలో యంచు దుఃఖమ్ము నొందుచుండ." పాణి. 5.108.

## అలా్ౖాగనాయాలు

తిట్లు.

చూ. అలా్ౖగవాడు.

## అలా్ౖగవాడు

నీచుడు. హల్లా అంటే తేలిక.

చూ. హలా్ౖగవాడు.

"వాడు వట్టి అలా్ౖగవాడు. వాడికి కాస్త దూరంగా ఉండడం మంచిది." వా.

## అల్లకల్లోల మగు

నానా అల్లరీ అగు.

"దివిటీదొంగలు వస్తున్నా రనేసరికి ఊరంతా అల్లకల్లోలం అయిపోయింది." వా.

## అల్లటపెట్టు

కష్టపెట్టు.

అల్లాడునట్లు చేయు అని అర్థం.
నేటి రూపం అల్లాడపెట్టు.

"నన్నింత అల్లట పెట్టెదో యయ్య నేనెఱుఁగ." బస. 1.10.

## అల్లము తాడే బెల్ల మయినది

గతిలేనమ్మకు గంజే పానకము వంటిది.

అల్లం కారంగా ఉంటుంది. అదే బెల్లంగా మారింది అనుట.

## అల్లరీ ఆగం

చూ. అల్లరీ హంగామా.

## అల్లరీ హంగామా

గందరగోళం, హడావుడి.

"వాడి దంతా వట్టి అల్లరీ హంగామా. చేసేదీ లేదూ పెట్టేది లేదూ." వా.

చూ. అల్లరీ హంగామా.

## అల్లల నాడు

కదలాడు (బరువుతో) ధ్వన్యనుకరణము.

"లేచి, కుచంబులున్ దుఱుము లేనడుమల్లల నాడ నయ్యెడన్." మను. 2.29.

## అల్లాటప్పా

తేలిక మైనది, మామూలు.

వ్యతిరేకార్థంలోనే వినవస్తుంది.

"ఇదేం అల్లాటప్పా వ్యవహారం కాదు. నిదానంగా ఆలోచించు." వా.

## అల్లాడగ

గజగజలాడగా.

భీమ. 1.47.

**అల్లాడి ఆకులు మేయు**

నానాకష్టాలు పడు.

"అల్లాడి ఆకులు మేసి ఆ ఊరు వెడితే తీరా వాడు ఇంట్లో లేడన్నారు." వా.

**అల్లాడు**

నాదించు, కొట్టుకొను.

అలుగురాజు. 65 పు.

**అల్లారుబెల్లం**

ప్రియమైనది.

"ఎల్లబంధువులకు నల్లారుబెల్లమై." కళా. 6.197

**అల్లారుముద్దుగా**

గారాబంగా.

"అనుఁగుంగ్రీడల నెల్లవారలకు నిట్లల్లారుము ద్దైనకూఁతునకున్." వసు. 3.32.

"వాళ్ళు ఆ పిల్ల నెంతో అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు." వా.

**అల్లిందామరయునుబోలె**

అవినాభావముగా.

"నీరజవదనా!, యేమిటికిఁ దలఁకె దల్లిం, దామరయునుబోలె నుండి తగవు విడుతురే." ఉ. హరి. 5.20.

**అల్లిబిల్లికొను**

వ్యాపించు.

"మావులఁ గ్రోవులు నల్లిబిల్లికొను కాంతారంబులందు." మను. 2.22.

**అల్లిబిల్లిగ నల్లుకొను**

చిక్కగా అల్లుకొను.

"వాసంతిక లుద్యల్లీల నల్లిబిల్లిగ నల్లికొనిన యొక లతాగృహాంతర సీమన్." మను. 3.113.

**అల్లిబిల్లిగా**

చిక్కగా.

"అల్లిబిల్లిగా నల్లుకొను బొండు మల్లియల." రాధి. 1.115.

**అల్లిబిల్లి యగు**

కలసిమెలసి యుండు, మూడి మూడి యున్నట్లు.

"అరిగి తనమార్గిచెలువతో నల్లిబిల్లి, యగుచు నెప్పటియట్ల సెయ్యమున నుండె." పరమ. 3.274.

**అల్లిబిల్లై యుండు**

ఆనందముతో నుండు.

"బల్లిదుం డలమేల్మంగపతి అల్లిబిల్లై యున్నాఁ డమ్మా యశోదమ్మా." తాళ్ల. సం. 10.161.

**అల్లిబెల్లిమాటలు**

కల్లబొల్లి మాటలు.

వెంకటే. 3.161.

**అల్లిరము లారగించు**

అల్లెము తిను.

"అల్లిరము లారగించ వెన్నుఁడ వై వేడుకతో విచ్చేసినట్లు." తాళ్ల. సం. 9.144.

**అల్లుకొను**

1. వ్యాపించు.

"జలశీకరంబులు చదలెల్ల నిండి... చుక్కల నల్లుకొనఁగ." వర. రా. యు. పు. 16 పంక్తి 25.

2. వృద్ధిచెందు.

"అల్లుకొనెఁ గర్మములు అక్కడికి నిక్కడికి." తాళ్ళ. సం. 7.256.

**అల్లుగుజ్జు**
అల్లుడు.
"నీ యల్లుగుజ్జు తనయుఁడు పుట్టెన్." భార. అశ్వ. 3.169.

**అల్లుడుకోమాళ్ళు**
వారతోపాటుగా ఉండే అంగ రక్షకులు.
బ్రౌను.

**అల్లుతండము**
విటుల మొత్తము.
వేశ్యామాతకు విటు లందరూ అల్లుళ్లే. దానిపై వచ్చిన పలుకుబడి.
"అల్లుతండంబుచే ధన మెల్లఁ గొనుచు." దశ. 5.17.

**అల్లుని మంచితనము**
అరుదనుట.
"అల్లుని మంచితనంబును, గొల్లని సాహిత్యవిద్య...... లేవు."
సుమతి.

**అల్లునేరేళ్లు**
పిల్లల ఆటలు.
"అవల వెన్నెలలో అల్లునేరే ళ్లింతె నివలి నిన్నటియునికి నేఁటికిఁ గలదా?"
తాళ్ల. సం. 5.274.
చూ. అల్లోనేరేళ్లు.

**అల్లుండ్రబూచి**
వేశ్యామాత.
అల్లుండ్రపాలిటి దయ్యము.
"లోకముల కెల్ల నూచి యల్లుండ్ర బూచి." శుక. 3.18.

**అల్లు పొల్లెఱుగని**
ఏమాత్రం కళంకం లేని.
"అల్లుపొల్లెఱుఁగని నా కులం బను మంచి, మడుఁగుఁ జీరకుఁ జాల మైల సోఁకె." ఉత్త. హరి. 5.92.

**అల్లెము తిను**
మనుగుడుపులు గుడుచు.
"మా అల్లుడు అల్లెం తినడానికి వచ్చి ఉన్నాడు." వా.
"నీకేం రా అల్లెం తిన్న అల్లుడు లాగా ఉన్నావు." వా.
"వాడు అల్లెము తింటున్న అల్లుడు లాగా వాళ్లింట్లో మసులుతున్నాడు." వా.

**అల్లోనేరేళ్లు**
వెన్నెలలో ఆడుఆట.
"...వెన్నెల దినమున
నల్లోనేరేళ్ళు గాక యావలఁ గలవే."
రా. సుం. కాం. 181.
చూ. అల్లునేరేళ్లు.

**అల్పాచమానం**
మూత్రవిసర్జనం.
వైదికపరిభాష.
"అల్పాచమానం చేసి వస్తాను. కాసేపు క్షమించండి." వా.

**అవకతవక**
అస్తవ్యస్తపు – అర్థం లేని.
"ఇలాంటి అవకతవక పనులు చేస్తే గొంతుమీదికి వస్తుంది. జాగర్త." వా.

**అవకతవక పని**
తెలివితక్కువపని.
చూ. అవకతవకమనిషి.

అవకతవక మనిషి

తెలివితక్కువ వాడు.

చూ. అవకతవక పని.

అవఘళించు

ధిక్కరించు.

ఇది సామ్యమును దెలుపు మాట.

నైష. 1.37.

అవతల చెంబు ఇవతల పెట్టదు (డు)

ఏపనీ చేయదు (డు).

"ఇవతల చెంబు అవతల పెట్టకుండా సంసారం ఎలా నడుస్తుంది." వా.

అవతల పుల్ల ఇవతల పెట్టదు (డు)

ఏపనీ చేయదు(డు) అనుట.

చూ. అవతల చెంబు...

అవతారం

వేషం.

నిరసనలో అనుమాట.

"ఏమిట్రా ఆ అవతారం. కాస్త మొహం కడుక్కొని బట్టలు మార్చుకుని రా." వా.

"వాడూ వాడి అవతారం చూస్తే వాంతి కొస్తుంది." వా.

అవతార మగు

పుట్టు.

"క్షీరవారాశిలో నవతార మయ్యెఁ, దార (యనుకన్యక)."

హర. 6.86.

అవతార మెత్తు

అవతరించు,

"ఎత్తితే యవతార మీ యుగమందు."

పల. పు. 13.

అవదకాకి

సలుగాకి.

"కూర్చి చెట్టఁ బట్టుకొని తెచ్చె లోపలి కవదకాకి నారి యత్తలారి."

పంచ. వేం. 1.595.

అవదూలు

చూ. అపదూలు.

అవధారు

అవధరించు; విను డని పెద్ద లతో చెప్పునప్పుడు అను మాట.

"తర్జిత భవ యవధా రవధారు."

పండితా. ప్రథ. పురా. పుట. 376.

అవని దూరు

భయపడి పాఱిపోవు.

"కొండలో సెనవచ్చు ననవచ్చు నతఁ డైన నవని దూరు."

పాండు. 1.74.

అవపథ్యము

ఔపథ్యము అన్నట్లు వాడుకలో వినబడుతుంది.

"అవపథ్యం చేయడంతో రోగం తిరగబెట్టింది." వా.

చూ. అపథ్యము చేయు.

అవపాడి

అన్యాయము.

"అధికారిచయము దత్త, ద్విథముల నవపాడి చేసి వివిధధనంబుల్ ...... అంతకంతకుఁ జెఱిచెన్."

దశ. 11.116.

చూ. అపపాడి.

**అవమానపడు**

అవమానము పొందు.

"అంత అవమానపడి వానింటికి మళ్ళీ వెళ్ళడ మెందుకని?" వా.

**అవమానపఱచు**

అవమానించు.

"ఒకరిని అవమానపఱచడంవల్ల వచ్చే లాభం ?" వా.

**అవమానపెట్టు**

అవమానించు.

**అవల నే నున్నాను**

మిగత పని అంతా నేను చూచుకుంటాను లెమ్మని అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఇందులకై యే యడ్డము వలవ దవల నే నున్నాఁడన్. ఆము. 2.93.

"అవతల నే నున్నానుగా. అదంతా నేను చూచుకుంటాను." వా.

**అవశాత్తుగా**

అకస్మాత్తుగా.

కాశీయా. 322.

**అవసరనైవేద్యం**

ఏదో శాస్త్ర కడుపునకు వేయుట కగునది.

నైవేద్యం స్థానే అది లేన ప్పుడు ఏదో ఒకటి పెట్టుటపై వచ్చినపలుకుబడి.

"ఇప్పటికి ఈ అవసర నైవేద్యం కానివ్వండి. ఊరికి వెళ్ళేటప్పటికి పొద్దు పోతుంది." వా.

**అవసర మిచ్చు**

దర్శన మొసగు.

"అవసరం బిచ్చి శివుడు బ్రహ్మాచ్యుతాదిదేవతల గారవించె."

కాశీ. 7.222.

భాగ. అష్టమ. 220. ప.

**అవసరములవారు**

ప్రతీహారులు.

"మాఱాక దెల్పఁ దేమఱక రాజునకు, జనుఁ డన్న విని యవసరములవారు."

వర. రా. బా. పు. 203. పంక్తి 11.

**అవసరవేళ**

పూజావేళ.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 236.

**అవాకుచవాకులు**

అస్తవ్యస్తపు మాటలు.

పనికిమాలిన మాటలు. జం.

"వదరుచు నున్నవారు అవాకు చవాకులు." గీర. లోకా. 12.

చూ. అవాకులు చవాకులు.

**అవాకులు చవాకులు**

"ఏవేవో అవాకులూ చవాకులూ నాలుగు వాగి పోయినాడు." వా.

చూ. అవాకుచవాకులు.

**అవాఙ్మానసగోచరుడు**

మాటకూ, మనసుకూ అందని వాడు—భగవంతుడు.

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ." అన్న వైదిక సూక్తిపై వచ్చినపలుకుబడి.

**అవిచారితరమణీయము**

చూ. అపాతరమణీయము.

**అవినాభావసంబంధం**

ఎల్లప్పుడూ కలిసి యుండుట, విడదీయరాని సంబంధ మనుట.

"కావ్యానికీ, రసానికీ యెప్పుడూ అవినాభావసంబంధం ఉంటుంది." వా.

**అవును కాదు అను**

ఎదురు చెప్పు.

"కలలోనైనను నీదు మాటలకు నౌఁగాదంచు మాటాడుటల్, గలవో?" రాజగో. 1.99

"నీ మాట కెప్పుడైనా అవును కాదు అన్నానా?"

"వాడు నీ వేం చెప్పినా అవును కాదు అనకుండా చేస్తాడు." వా.

**అవు గాక**

కానీ అనుట.

హర. 4.39.

**అవు గా దను**

తిరస్కరించు, బదులు చెప్పు.

"హరివార మైతిమి మ మ్మవు గాదనఁగ రాదు. తాళ్ల. సం. 6.40.

**అవుగాములు**

మంచిచెడ్డలు. జం.

"నీవు చని యవుగాములు నిశ్చయించి, యాశఁ దెగఁ గోయు మది య మర్త్యారిణరక్షు." ప్రభా. 3.107.

చూ. ఔగాములు.

**అవుడుకఱచు**

పెదవి కొఱుకు.

"గుర్రి వెంద్రఁ జైత్రుఁ డొందఁగఁ, గర నులుకఁ గొమ్మవి యవుడు కఱచిన నును వా, తెరమీఁదఁ గానవగు పలువరుస." పారి. 3.48.

**అవురు దర్భ యగునె?**

ఆకారసామ్య మున్నప్పటికీ పవిత్రత అన్నిటా ఉండ దనుట.

వేమన. 80.

**అవురుసవ్వ రగు**

మిక్కిలి గాసిపడు.

"ఏపు దెగి యవురుసవ్వరగ యనువు దప్పి యదవదగ్గు."

ఉ. హరి. 1.148.

"అవురుసవ్వరైరి గుజగుజ ల్వోరి డస్సి రొల్లబోయిరి వెగ్గిరి తల్లడిలిరి."

హరవి. 3.10.

**అవుల బుచ్చు**

త్రోసిపుచ్చు, పోనాడు.

పండితా. ద్వితీ. మహి. పుట 214.

**అవులెమ్మ**

ఔ లే.

"అవులెమ్మని యూఁబడిలెన్ సుదంత."

పారి. 1.69.

చూ. అగు లెమ్ము.

**అవ్వను పట్టుకొని వసంతా లాడు**

అసమానులతో సరసాలకు దిగు.

"అత నేదో పురాణం చెప్పుకొనే ముసలాయన. ఆయనదగ్గర నీ పాండిత్యం వెలగబెడతా వేమిటిరా? అవ్వను పట్టుకొని వసంతా లాడినట్లు!" వా.

చూ. అమ్మను పట్టి వసంతము చిమ్మినట్టు.

**అవ్వల నడుగు పెట్టు**

నిర్బంధించుటలో ఉపయోగించుపలుకుబడి.

ఈ పని చేసి కానీ కదల వీలు లేదనుట.

"అర్థమిప్పించి యవ్వల నడుగు వెట్టు."
శుక. 3 ఆ. 40 ప.

"ఆ డబ్బు అక్కడ పెట్టి అవతలికి అడుగుపెట్టు." వా.

"ఇందులో సంతకం పెట్టి కాని అవతలికి అడుగు పెట్టడానికి వీలు లేదు." వా.

**అవ్వలికించుకొను**

తొలగించు, అవ్వలికి త్రోయు.

"......యుముక నవ్వలికించికొని."
దశకు. 10.105.

**అవ్వలిమో మగు**

మాఱుమో మగు.

"నివ్వెఱఁ గందుచు మదిలో, నవ్వలిమో మయ్యె నప్పు డనిరుద్ధుండున్."
ఉషా. 3.41.

**అవ్వలిమో మివ్వల యగు**

అటునుండి యిటు తిరుగు.

"తెర దీసి యాసలతో దృష్టించి చూచిన చూపు వరుస నవ్వలిమో మివ్వలైన నవ్వు." తాళ్ల. సం. 3.182.

**అశక్తదౌర్జన్యం**

చూ. అసమర్థదుర్జనత్వం.

**అశ్రులు మీటు**

గోటితో కన్నీరు తుడుచు.

"వదన మక్కునఁ గృపతో, నొత్తి మొగ మెత్తి యశ్రులు, మెత్తనఁ గొనఁ గోరఁ బాఱ మీటుచు నుండెన్."
మను. 3.137.

**అశ్మా చ మే....**

వాడిదగ్గర ఏమున్నది మన్ను-దుమ్ము అనే అర్థంలో ఉపయోగించే వైదిక పరిభాష.

'అశ్మాచ మే మృత్తికాచ మే' అన్న చమకంలోని మంత్రంపై వచ్చినపలుకుబడి.

'వాడిదగ్గర యేముంది ? అశ్మాచమే.'
వా.

"అశ్మాచమే మృత్తికాచమే."
చమకం.

**అశ్రుతర్పణం**

జలాంజలి.

తిలజలతర్పణము కాక అశ్రుతర్పణము కూడా యిటీవల వాడుకలోనికి వచ్చినది.

**అష్టకష్టాలు పడు**

అన్నివిధము లయినబాధలు పడు.

దాస్యం, పేదతనం, భార్యాహీనత, ఆదరువు లేకపోవడం, అడుక్కోవడం, ఇవ్వ లేకపోవుట, అప్పులపాలుగావడం, దేశాటనం అన్నవి అష్టకష్టాలుగా పరిగణితము లయినవి. అందుపై వచ్చిన పలుకుబడి.

"నేను అష్ట కష్టాలు పడి ఆ పిల్లను సాకాను." వా.

**అష్టనీరాంజనములు**

ఎనిమిది అర్చనలు.

దర్శన, అవసర, మజ్జన, మాంగల్య, శృంగార, మహా, ఆనంద, అసంఖ్యాత నీరాంజనములు.

పండితా. ప్రథ. దీక్షా. పుట 189.

**అష్టవిధవధలు**

ఎనిమిదిరకాలైన చంపుటలు.

**అష్టశోభనములు**

అష్టవిధములయిన మంగళకార్యములు; అలంకారాదులు.

"తన పురంబునం దష్ట శోభనంబులు దేవగృహంబులయందు విశేష పూజలు సేయించె." భార. అర. 2.221.

**అష్టాంగ మెఱగి**

అష్టాంగములు తాకునట్లు నేలపై సాగిలపడి, సాష్టాంగపడి.

"ఆ లలనకు నతి డష్టాంగ మెఱఁగి." బస. 6. ఆ. 150. పుట.

**అష్టాదశపురాణాలు**

పదునెనిమిది పురాణాలు.

మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యత్, బ్రహ్మాండ, బ్రాహ్మ, బ్రహ్మవైవర్త, వామన, వాయవ్య, వైష్ణవ, వారాహ, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాందములు.

"మద్వయం భద్వయం చైవ
బ్రత్రయం వచతుష్టయం
అనాపలింగ కూస్కాని
పురాణాని పృథక్ పృథక్." చా.

**అష్టాదశవర్ణనలు**

నగరము, సముద్రము, ఋతువు, చంద్రోదయము, సూర్యోదయము, ఉద్యానము, సలిలక్రీడ, మధుపానము, రతోత్సవము, విప్రలంభము, వివాహము, పుత్రోత్పత్తి, మంత్రము, దూతము, ప్రయాణము, నాయకాభ్యుదయము, శైలము, యుద్ధము—వీని వర్ణనలు.

**అష్టాదశవర్ణాలు**

పదునెన్మిది కులాలు.

బస. 7 ఆ. 180 పుట.

**అష్టాదశవిద్యలు**

పదునెనిమిది విద్యలు.

చతుర్దశవిద్యలు, ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము కలిసి పదునెనిమిది.

**అష్టావక్రుడు**

వట్టి వక్రబుద్ధి అనే అర్థంలో ఉపయోగిస్తారు.

ఇది అసలు ఒక ఋషి పేరే అయినా తరువాత ఈ యర్థం లోనే వాడుకలో నిలిచింది.

"వాడు వట్టి అష్టావక్రుడు." వా.

## అష్టావక్రంగా

పాడుగా.

"వా డే పని చేసినా అష్టావక్రంగా ఉంటుంది." వా.

## అష్టోత్తరశతనామావళి జపించు

స్తోత్రపాఠం చేయు.

నూట యెనిమిది పేర్లతో దేవతలను పూజించడం అలవాటు.

"వాడు రోజూ వెళ్లి వాడిదగ్గఱ అష్టోత్తరశతనామావళి జపిస్తుంటాడు." వా.

## అసంబద్ధప్రలాపం

అప్రస్తుతప్రసంగం.

"వాని వన్నీ అసంబద్ధప్రలాపాలు." వా.

చూ. అప్రస్తుతప్రసంగం.

## అసడ్డమాటలు

అడ్డుమాటలు.

నేటికీ రాయలసీమలో 'ఏ పని చేస్తామన్నా అన్నీ అసడ్డాలే. ఏదైనా మంచిపని చేస్తామంటే లక్ష అసడ్డాలు' అని ప్రచురంగా వినబడుతుంది. నిరసనవాక్యము అని వావిళ్ల లోనూ, అశ్రద్ధ, ఉపేక్ష, తృణీకారము, తిరస్కారము అని సూ. ని. లోనూ, అసడ్డ అనేమాట కిచ్చిన అర్థాలు సరి కావు.

"సరకు సేయ వను చసడ్డ మాటలు గొన్ని యాడినంత నేమి."

భార. శాంతి. 4.426.

## అసమర్థదుర్జనత్వం

చేత గాని దుష్టత.

వాడు చెడ్డవాడే కాని చెడుగు చేసే శక్తి లేదు అనేపట్ల ఉపయోగిస్తారు.

"వా డేదో న న్నీపుస్తకం రాయమన్నారని ఊరికే యెత్తిపోసుకుంటున్నా డట. పోనీ అది ఆపగలడా? అదీ చేతకాదు. ఇదే అసమర్థ దుర్జనత్వం అంటే." వా.

## అసమీక్ష్యకారి

ఆలోచింపక పని చేయువాడు, దూరదృష్టి లేనివాడు.

## అసలార

ఎసలార – బాగుగా ఒప్పిదముగా.

"అసలార మాయింట నారగించినను బసవనమంత్రి ఏ బ్రదుకుదు ననిన."

బస. 7 ఆ. 204 పుట.

## అసలుకొను

అలముకొను.

"ఒడల నసలుకొను నెత్తురుఁ గడిగి."

జైమి. 6.128.

## అసలుకొల్పు

అలంకరించు.

"మనిబొట్టు బోనాన నసలు కొల్పిన కన్ను." క్రీడా. పు. 45.

**అసలు చొచ్చి అలయు**

తెలిసి తెలిసి బాధలో పడు.

తాళ్ళ. సం. 11. 3 భా. 74.

**అసలు మసలు**

సమాన మగు. ఎసక మెసగు లాంటిది.

"కిసలయచ్ఛవి పునరుక్తి నసలు మసలు." పాండు. 1.131.

**అసవు సవు లగు**

అదవదలగు.

హర. 3.10.

**అసహాయశూరుడు**

ఏ సహాయమూ లేకనే పోరాడగలవాడు అనుట.

పోరులోనే కాక దేనిలో సమర్థుడైనా దీనిని ఉపయోగిస్తారు.

"వాడు ఏ దేశానికి పోతే నేం? ఏ ఊరికి పోతే నేం? జయించికొని రాగలడు. అసహాయశూరుడు మరి." వా.

**అసావాదిత్యో బ్రహ్మ గా**

ఏదో సూటిగా చెప్పక తిరుగుళ్లుగా చెప్పు.

సంధ్యావందనంలో 'అసా వాదిత్యో బ్రహ్మ' అంటూ తల చుట్టూ చెయ్యి తిప్పుతూ నీళ్లను చల్లుట పై వచ్చిన పలుకుబడి.

"ఈ అసావాదిత్యో బ్రహ్మ అంతా నాకు సరిపడదు. ఇస్తే ఇస్తా నను. లేకుంటే లే దను." వా.

**అసికోతలు కోయు**

కడికండలుగా చేయు.

చిన్న చిన్న ముక్కలుగా నఱుకు.

"నెట్టన మొల నున్న నెఱికత్తిఁ దిగిచి, కొన్నింటి ముక్కలు కొన్నింటి చెవులుఁ, గొన్నింటి చెక్కులుఁ గోఁతలు వెట్టి, యసికోఁతలుగఁ గోయు." ద్వి. హరిశ్చ. పూ. 2040.

**అసిధారావ్రతము**

అతికష్టమైనది.

కత్తిపాదరపై నడచుటవంటిది అనుట.

"వానితో వ్యవహరించడ మంటే అసిధారావ్రతమే." వా.

**అసిమిలోని దొకటి, అమ్మోడి దొకటి**

ఒకటి ఉంటే ఒకటి పైకి చెప్పు.

"అసిమిలోని దొకటి యమ్మోడి దొక్కటి, నీ చరిత్ర మెల్ల నేడు తెలియ." హరి. 2.151.

చూ. అమ్మోడి దొకటి అసిమిలో దొకటి.

**అసియాడు**

అటూ ఇటూ తీగవలె వంగు, ఊగు. అసి = కత్తి - కూడా అలా కదిలించినప్పుడు అసియాడుతుంది. అందు పై వచ్చినమాట కావచ్చును.

"కౌనుఁదీగ లసియాడ." భీమ. 5.15.

పాండు. 3.77.

విజయ. 1.126.

**అసివోవు**
వ్యర్థమగు.
"అసి వోవ వచ్చునా యసివోక యనుచు." గౌర. హరి. ద్వి. 2608.

**అసురుసురగు**
"ముసురుకొను జరభరంబున, నసురుసురై యున్నమమ్ము నడికించితివి..." మను. 4.
చూ. అవురుసవురగు.

**అసూర్యంపశ్య**
ఎండకన్నెఱుగనిది.
చాలా సుకుమారి అనుటకు దీనిని విరివిగా ఉపయోగిస్తారు. రాజస్త్రీలను అసూర్యంపశ్యలని అనేవారు.

**అస్ఖలితబ్రహ్మచారి**
బ్రహ్మచర్యవ్రతమును అక్షరాలా అనుష్ఠించేవాడు.

**అస్తమానం**
ఎల్లప్పుడూ.
సూర్యాస్తమాన మయ్యేవరకూ అనుటలో మిగిలి అదే అర్థాన్ని సూచించేమాట.
"అస్తమానం ఇదే గొడవ పెట్టుకొని కూర్చుంటే ఇంట్లో పని అంతా ఎవరు చేస్తారనుకున్నావు?" వా.

**అస్తమానూ**
ఎల్లప్పుడూ.
"అస్తమానూ ఈ వేధవ గొడ వేమిటి?" వా.
చూ. అస్తమానం.

**అస్తవ్యస్తపు మాటలు**
అందిక పొందిక లేనిమాటలు.
"అస్తవ్యస్తపుమాటలాడఁ గొందఱు." భార. సౌప్తి. 1.197.

**అస్తవ్యస్త మగు**
తలక్రిందు లగు.
"దుస్తరమును నగు నస్త, వ్యస్తంబగు నేని నాకు వగపు గదిరెడున్." భార. ద్రోణ. 2.303.

**అస్తుబిస్తుగా**
చాలీ చాలక.
కొత్త. 276.

**అస్తువిస్తగు**
సతమత మగు, బాగా అలసిపోవు.
త్రివేణి. 68 పు.

**అస్త్రశస్త్రాలుడుగు**
బల ముడుగు.
"అక్కడికి పోయివచ్చేటప్పటికి అస్త్రశస్త్రాలు ఉడిగి పోయాయి." వా.

**అస్త్రసన్యాసము చేయు**
పని మానివేయు.
భీష్ముడు శిఖండిముఖం చూచి అస్త్రసన్యాసం చేయుటపై యేర్పడినపలుకుబడి.
"ఈ వయసులోనే అస్త్రసన్యాసం చేస్తే ఎట్లానోయ్!" వా.

**అసాధ్యపు పిండం**
గడసరి.
"వాడు చాలా అసాధ్యపుపిండం." వా.

**అస్తావిస్తం**
అర్థమర్థం.

అ స్తవ్యస్తానికి జానపదరూపం కావచ్చును.

**అస్థు లరిగేటట్లు**

ఎముకలు విరిగేటట్లు.

"అస్థు లరిగేటట్లు పనిచేసినా అక్కడి కక్కడికే సరిపోవడం కష్టంగా ఉంది." వా.

**అస్మాకం**

ఉంపుడుకత్తె.

వైదికులు మాత్రమే ఉపయోగించేమాట.

'అస్మాకం సహ కుటుంబానాం' ఇత్యాది సంకల్పంలోని వాక్యంలోని భాగం. ఇతర వైదికపరిభాషలవలెనే ఇది తర్వాతి పదానికి – కుటుంబానికి సూచక మయినది.

ఆ కుటుంబమే ఉంపుడుకత్తెగా నెమ్మదిగా మారినది.

**అహమించు**

నేనే అన్నిటినీ చేయగలను అని ధీమాతో విజృంభించు.

"లెక్కకున్ మిగిలినసేన నొక్కఁ డహమించి వధించుట." జైమి. 2.43.

**అహోరాత్రస్య**

ఎల్లప్పుడూ.

"అహోరాత్రస్య వాడి కదేపని. వేరే పని లేదు." వా.

**ఆకను బెట్టు**

కష్టపెట్టు, అడ్డగించు.

"తద్భటపరంపర యాఁకను బెట్టి యుండఁగన్." విప్ర. 5.24.

**ఆకతాయి**

గుంట.

"వాడు వట్టి ఆకతాయి. చదువూ లేదు, సామూ లేదు. వా.

**ఆకత్రాడు**

కవ్వమునకూ స్తంభమునకూ కట్టుత్రాడు.

"ఆహవప్రవహోదు లగుమారుతంబులు తగులఁగట్టిన యాకత్రాళ్లు కాఁగ." భీమ. 4.59.

**ఆక పెట్టు**

అడ్డగించు.

"నభస్థలి నంబుధ నాకపడక చరియింపక." భాస్క. కిష్కిం.

**ఆకసము తూటు పొడుచుక యైన చనును**

ఏవిధముగానైనను తప్పించుకొని పోవును.

"ఆకసము తూటు వొడుచుక యైనఁ జనును." హంస. 4.198.

**ఆకగొను**

నిరుద్ధుడగు.

"ద్రోణు బాణావృతుఁ జేయ నతం డాఁక గొనక యతని ధనువు ద్రేఁ కని భల్లమునఁ ద్రుంచి."

భార. ద్రోణ. 1.201.

**ఆకగొలుపు**

ఆకర్షించు, నిలబెట్టు.

"మడుగు మాసిన నైన మగువ పిఱుందు సో, యగము చూపఱ చిత్త మాఁక గొలుప." ఉ. హరి. 1.57.

**ఆకటదూకట నలుగు**

ఆకటిదప్పులచే శాధ చెందు.

"ఆకట మాకట నలిగితిరి."

భా. 2.124.

**ఆకటిపంట**

పోషకము.

ఆకలి తీర్చుట కనువైన పంట వంటి దనుట.

"......సురసమూహము నాకటి పంటలు." పాండు. 1.109.

**ఆకట్టు**

అడ్డగించు.

"డొల్లునీరంబు నాకట్టఁ జెల్లుఁ గాక, డొల్లుగుణ మది మాన్పంగఁ జెల్లునెట్లు?" కవిక. 4.119.

**ఆకయిల్లు**

చెఱసాల.

"ఆఁకయింటి కావలివారు మేల్కాని చూచి." భాగ. దశ. పూ. 148.

**ఆకలి ఆఱిపోవు**

ఆకలి మఱింత ఎక్కువైనప్పుడు అనుమాట.

"ఇంక అన్నం తినలేను. ఆకలి ఆరిపోయింది." వా.

**ఆకలి చచ్చిపోవు**

ఆకలి అడగిపోవు.

"వేళ మించిపోయి ఆకలి చచ్చిపోయిం దమ్మా!" కొత్త. 63.

**ఆకలిచావు**

తిండి లేక చనిపోవుట.

"బెంగాలు కరువులో ఆకలిచావులు విపరీతమై పోయినట్లు మనం పత్రికల్లో చదివాం." వా.

**ఆకలి రుచి ఎఱుగదు**

ఆకలివల్లనే రుచిగా ఉన్నది అన్నసందర్భంలో ఉపయోగిస్తారు.

"ఆకలి రుచెఱుగదు. నిద్ర సుఖ మెఱుగదు." సా.

"పది మైళ్లు నడిచి వెళ్లాను. మిట్ట మధ్యాహ్నం. ఆ మహాతల్లి అన్నం మాత్రమే ఉంది నాయనా అని అప్పటికప్పుడు నాలుగు మిరపకాయలు ఉప్పురాళ్లు విస్తట్లో నలిపి వేసింది. ఆ రోజు తిన్నాననూ ఏం చెప్పను లే. అంత రుచైన భోజనం ఇంతదాకా మరి నా అనుభవంలోకి రాలేదు. అందుకే ఆకలి రుచి యెరుగదు అంటారు." వా.

**ఆకల్లాడ్డం లేదు**

గాలి యేమాత్రం లేదు. ఆకులు ఆడితే గాలివస్తుంది కదా.

"ఊరికే ఉక్క పోస్తూ ఉంది. ఆకల్లాడ్డం లేదు." వా.

**ఆకారపుష్టి**

వేషం మాత్రమే అనుట.

ఆకారపుష్టి నైవేద్యం నష్టి.

"వాడి దంతా ఆకారపుష్టి. పొట్ట పొడిస్తే అక్షరంముక్క లేదు." వా.

**ఆకాశంగద్ద తన్నుకు పోవు**

సంబంధం లేనివాడు కాజేయు.

"వీడూ వాడూ ఆ ఆస్తికోసం వివాద పడుతూ ఉంటే అది కాస్తా ఆకాశం గద్ద తన్నుకు పోయింది." వా.

**ఆకాశంనుండి ఊడిపడ్డట్టు**

మానవాతీతునివలె.

"ఏదో ఆకాశంనుండి ఊడిపడ్డట్టు మాటాడుతున్నావే?" వా.

**ఆకాశంవంక చూచు**

ఏమీ చెప్పలేకపోవు.

**ఆకాశచిత్రము**

నిరాధారమైనది.

"......ఇటు లేఁ దర్కింప నిం కేల కణ్వుని లోకమ్మున నూర్ధ్వరేతుఁ డన విందుం గాదె యట్లౌట నా, యనఘుం డీచెలి నెట్లు గాంచుఁ గలదే యాకాశచిత్రం బిలన్." శకుం. 2.24.

**ఆకాశతాండవం**

ఊరికే గంతులు వేయుట.

**ఆకాశపంచాంగం**

"వాడి దంతా ఆకాశపంచాంగం. దాన్ని ప్రమాణంగా నమ్ముకుంటే నగుబాట్లపా లవుతాం." వా.

చూ. ఆకాశపురాణం.

**ఆకాశపురాణం**

అర్థం లేనిసంగతి. ఆధారం లేని వట్టి ఊకదంపుడు.

నానా. 38.

"వాడి దంతా వట్టి ఆకాశపురాణం." వా.

చూ. ఆకాశపంచాంగం.

**ఆకాశమంత పందిరి**

పెద్ద పందిరి.

జానపద కథల ద్వారా వచ్చినపలుకుబడి.

"ఆకాశమంత పందిరి. భూమంత అరుగు. కస్తూరి కళ్లాపు. ముత్యాల ముగ్గులు. ఆ రాజకుమార్తె వివాహం రంగరంగవైభవంగా జరిగింది." వా.

**ఆకాశమున దాపరము లిడగల**

నింగికి నిచ్చెన వేయగల- అసాధ్యకార్యములను నిర్వర్తించే నెఱజాణ అనుటలో...

కుమా. 8.135.

**ఆకాశరామన్న**

పేరు లేకుండా ఉత్తరాలూ, అర్జీలు రాసేవాడు.

"ఎవడో ఆకాశరామన్న ఏదో రాశాడట! వీడు నమ్మాడట. ఏం లక్షణంగా ఉంది వ్యవహారం?" వా.

**ఆకాశరామన్న అర్జీలు**

అనామక లేఖలు.

"ఆ సబ్ ఇన్‌స్పెక్టరు లంచాలు తీస్తాడని ఈమధ్య బోలెడు ఆకాశరామన్న అర్జీలు వచ్చాయట. దాంతో వాణ్ణి మార్చేశారు." వా.

చూ. ఆకాశరామన్న జాబులు.

**ఆకాశరామన్న జాబులు**

ఆకాశరామన్న అర్జీలు.

చూ. ఆకాశరామన్న అర్జీలు.

**ఆకాశవాణి**

అశరీరవాక్కు.

మన పురాణాలలో ఏదయినా ఆకాశవాణి చెప్పడం, దానిని వేదవాక్కుగా స్వీకరించడం

ప్రసిద్ధంగా కనబడుతుంది. అందుపై వచ్చినపలుకుబడి.

"నీ కేం ఆకాశవాణి చెప్పిందా?" వా.

**ఆకాశానికి ఎత్తు**

గొప్పగా పొగడు.

"వాడికి సరిపోతే ఆకాశానికి ఎత్తుతాడు. లేకపోతే పాతాళంలోకి త్రోస్తాడు." వా.

**ఆకాశానికి చిల్లిపడినట్లు**

వర్షం విపరీతంగా వచ్చిన దనుటలో ఉపయోగించే పలుకుబడి.

"ఈరోజు వర్షం ఆకాశానికి చిల్లిపడినట్లు మహాజోరుగా కురుస్తూ ఉంది." వా.

**ఆకాశానికి నిచ్చెన వేయు**

అసాధ్యకార్యము చేయు.

"ఆకాశానికి నిచ్చెనలు వేయాలంటే మన తరమా ?" వా.

**ఆకు, అలము**

ఆకులు. జం.

"వనమున నాకలంబు దిని వంతలఁ గుందుచు నింత కెన్నఁడే, ననుజుఁడు దాను జచ్చు నడియాస లిఁకేటికి..."

భాస్క. సుంద. 186.

చూ. ఆకలములు.

**ఆకు కందకుండా పోకకు పొందకుండా**

అందికా పొందికా లేకుండా. ఏదీ తేల్చి చెప్పడం లేదనే అర్థంలో ఉపయోగిస్తారు.

నాయకు. 7 పు.

"ఆకుకు అందకుండా పోకకు పొందకుండా మాట్లాడితే ఏం లాభం రా." వా.

**ఆకుచాటు పిందెవలె**

పెద్దలచాటున ; ఏమాత్రం దెబ్బ తగలకుండా.

"......మీ పదయుగంబుల దాఁపున నాకుచాటుపిందియవలె నుండు నేను ధరణీతలభారముఁ బూన నేర్తునే."

నలచ. 2.69.

చూ. ఆకుమఱుగుపిందెవలె.

**ఆకుజిలుకల మొత్తంబువంతున**

అధికముగా; గుంపులు గుంపులుగా.

చేలలో పంట నిండుగా ఉన్నప్పుడు ఈ ఆకుచిలుకలు విపరీతంగా వస్తాయి. దానిమీద యేర్పడినపలుకుబడి.

"బేడిసెకదుపుభంగిని... యాకుజిలుకల మొత్తంబు వంతున..."

హంస. 3.29.

**ఆకు మడిచి ఇచ్చు**

తాంబూల మిచ్చు.

"కర్పూరంబు తోడి బాగా లీరాదో యాకు మడిచి యీరాదో చెలీ !"

కళా. 4.70.

**ఆకుమడుపులు**

తములపాకుల చిలకలు

"హెచ్చువాసన వక్క లిచ్చి చుట్టిన యాకు మడుపు లీఁ దివిరెడునడపదాని."

ఉత్త. రామా. 423.

**ఆకుమఱుగుపిందెవలె**

ఆకుచాటుపిందెవలె.

"తల్లిదండ్రులయొద్ది తనయులగతి నాకు మలుఁగుపిందెలరీతి నెఱి వహించి."
హరిశ్చంద్ర. 1.212.
చూ. ఆకుచాటుపిందెవలె.

## ఆకులపడు

కలత చెందు.

"ఆ కలకల మాలించిన, దాకులపడినది వగర్చినది." నాయకు. పు. 89.

## ఆకులు వేసికొను

తాంబూలము వేసికొను.

"పండుటాకులు క్రంపు భాగములను వేడ్కతోడుత నిద్దఱు వేసికొనుచు."
హంస. 1. 240.
చూ. వక్కాకు వేసికొను; ఆకు వేసుకొను.

## ఆకులలోపలి పిందె

మానినీ. 56.
చూ. ఆకుముఱుగుపిందె.

## ఆకులు అలము

ఆకూ అలమూ అని వాడుక. చెట్టు చేమాలాంటిది. ఒకే అర్థ మున్నపదాలయుగళం. జం.

"అడవి చెట్టుల బంక, లాకులు నలము."
పండితా. ప్రథ. పురా. పుట. 378.

## ఆకులు లేచినవి

ఇంతమంది భోజనం చేసినారు అనేసందర్భంలో ఉపయోగించేపలుకుబడి.

"వారింటి పెండ్లిలో పూటకు వెయ్యి ఆకులు లేచినవి." వా.

## ఆకులు వేసినారు

భోజనానికి లేవండి అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఆకులు వేసినారు. కాళ్లు కడుక్కోండి." వా.
చూ. కంచాలు పెట్టినారు.

## ఆకులో మిడత

మహా నెఱజాణ అనే అర్థంలో వెక్కిరింపుగా అనేమాట. ఆకులమీద ఉన్న మిడత ఎగిరెగిరి పడుతూ ఉంటుంది. అందుపై వచ్చినపలుకుబడి.

"అదా అమ్మా! ఆకులో మిడత." వా.

## ఆకులోకి వచ్చు

భోజనము సమకూరు.

"ఊరికే కూర్చుంటే ఆకులోకి ఎట్లా వస్తుంది?" వా.

## ఆకు వేసుకొను

తాంబూలము వేసుకొను.

"ఆకు వేసుకోండి సామీ!" వా.
చూ. ఆకులు వేసికొను.

## ఆకుసన్నాలు

ధాన్యంలో ఒక భేదము.

## ఆకూ వక్కా

తాంబూలం.

"ఆకూ వక్కా తెచ్చి యీవే. అయ్యగారొచ్చారు." వా.

## ఆకొత్తు

అడక త్తెర.

**ఆగడపలు**

సోపానములవలె తీరిన మబ్బులు.

పాండు. 3.179.

**ఆగడించు**

ఆగడము సేయు. రచ్చకీడ్చు, అగుడు పెట్టు.

"అజ్జదాసయగారి నాగడించితివా."
పండితా. ద్వితీ. మహి. పుట. 214.

**ఆగమేగాలమీద పోవు**

అతివేగంగా పోవు.

"ఆవిడకు జబ్బని తెలిసేసరికి అతడు ఆగమేగాలమీద పోయినాడు." వా.

**ఆగమ్మకాకిలా తిరుగు**

అనవసరంగా ఊరికే తిరుగు.

"వాడు ఆగమ్మకాకిలా ఊరంతా తిరుగుతూ ఉంటాడు. వాడికి పిల్ల నివ్వమంటే ఎవ రిస్తారు?" వా.

**ఆగ్రహోదగ్రు డగు**

కోపంతో మండిపడు.

ఇది ఇలా కలిసి ప్రచురంగా వాడుకలో ఉన్నది.

"వాడు ఆగ్రహోదగ్రు డయినాడు—నే నామాట చెప్పేసరికి." వా.

**ఆఘాయిత్యము చేయు**

1. చిన్నదానికి పెద్దగా అల్లరి పెట్టు.

2. దౌర్జన్యము చేయు.

**ఆచంద్రతారకం**

కలకాలమూ.

చూ. ఆచంద్రతారార్కం.

**ఆచంద్రతారార్కం**

కలకాలం.

చంద్రుడూ, నక్షత్రాలూ, సూర్యుడూ ఉన్నంత కాలం.

చూ. ఆచంద్రతారకం.

**ఆ చెంపా యీచెంపా వాయించు**

ఎడాపెడా కొట్టు.

"ఆ చెంపా యీ చెంపా వాయిస్తే వాడే నిజం చెప్తాడు." వా.

**ఆచూకి తీయు**

జాడ తీయు.

"ఆ దొంగ కేసు విషయమై ఆచూకీ తీయడానికి పోలీసు వాళ్లు తిరుగుతున్నారు." వా.

**ఆజానుబాహుడు**

ఒడ్డూపొడుగూ అయినవాడు.

మోకాలు తాకేచేతు లున్నవాడని వాచ్యార్థం.

"వాడు మాంచి ఆజానుబాహుడూ, స్ఫురద్రూపీ." వా.

**ఆజు బాజుల**

చుట్టుపట్ల.

"మోజుపడి యున్న నాజుం, బాజుల నిలువంగ వీలుపడునే? చెపుమా?"

మగువ. 2.31.

"ఈ ఆజుబాజుల్లో అతనంత మాటవాసి కలవాడు మరొకడు లేడు." వా.

**ఆజ్ఞ తల మోచు**

ఆనతి శిరసావహించు.

"మీ యాజ్ఞఁ దల మోచి పోయెద."
పండితా. ద్వితీ. పర్వ. పుట 287.

**ఆజ్ఞ వెట్టు**
ఆజ్ఞాపించు.
"ఆజ్ఞ వెట్టించి చే తడియాఱ దిపుడు."
కా.మా. 1.54.

**ఆజ్ఞ సేయించు**
ఆజ్ఞానువర్తిని చేయు.
"శూర్పణఖ వచ్చుటయు ఆ పొలంతిని బట్టి యాజ్ఞ సేయింప."
వర. రా. బా. పు. 16 పంక్తి 2.

**ఆంౘడెబ్బతనం**
పెంకెతనం, పిల్లలు చేసే అల్లరి అని వావిళ్ళ. అహం అనే అర్థంలో పెద్దాపురం ప్రాంతంలో వాడతారట.

**ఆట ఆడించు**
వేధించు.
"వాడేదో మహా మిడిసిపడుతున్నాడు. వాణ్ణి ఒక్క ఆట ఆడించి వదిలి పెడతాను." వా.

**ఆట కట్టు**
పని ముగియు.
చదరంగం ద్వారా వచ్చిన పలుకుబడి.
రాజు షహ్ చెప్పగానే ఆట కట్టిపోతుంది.
"మహా మిడిసిపడుతూ ఉండేవాడు. ఆ దావాతో వాడి ఆట కట్టింది." వా.
"ఏ మనుకున్నావు? నా తడాఖా. మూడు నిమిషాల్లో వాడి ఆట కట్టించేస్తాను చూడు." వా.

**ఆటకత్తెటమ్ములు**
నటకులల సంఘాలు, నాటక సంఘాలు.
పండితా. ద్వితీ. పర్వ. పుట 470.

**ఆటది**
1. ఆడుది.
2. చిన్నపిల్ల, ఆటలాడు కొనునది.
3. ఆడునట్టి వేశ్య, నట్టువరాలు.
"ఆటదాన నబలనైన నే నించుక, యలిగి చూచుకొను భయమునం దలరు. గుగ్గుసుగ్రీవలోచనోద్భూతవహ్నికి, సరి నిలువ నీకు నెంత కోలంది."
కుమా. 4.74.
ఇక్కడ ఆటదాని ను అన్న అర్థంలో ఉన్నట్లున్నది.
"ఆటదానికి వశ మమ్మ యీ మేటి కోటలు దాంట..."
గౌర. హరి. ద్వి. 2407.
"ఆటదానిని జంపు టవినీతి యనక."
పండితా. ప్రథ. పురా. పుట. 285.

**ఆట పట్టించు**
ఏడిపించు, శాస్తి చేయు.
"వాడి ఆట పట్టిస్తాను. ఏ పెద్ద మనిషి అడ్డు వస్తాడో తెలుస్తుంది." వా.

**ఆటపట్టు**
స్థానము.
"రామేశ్వరతీర్థము కలికంబున కాటపట్టు." భీమ. 3.155.

**ఆటపాటలు**
ఆటలు, పాటలు. జం.
"అట్టి హరికీర్తనములు నీ కాటపాట, లిందిరాప్రాణవిభుండు నీ కిష్టదైవము."
నలచ. 2.27.

**ఆట మాని ఒడ్డుకొనబడు**

మధ్యలో ఆట మానివేసి ఓటమిని అంగీకరించు.

తన్నెలానో వదలివేయమని చెప్పుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"సకియలు జాగు మానుఁ డిఁకఁ జాలును బోవుద మాట మాని యొ, డ్డుకొనఁ బడెన్ నృపాత్మజ కడున్ బరితాపము నొంది..." నలచ. 3.264.

**ఆటలమ్మ**

మశూచికంలో ఒక భేదము.

ఇది సామాన్యంగా పిల్లలకు వస్తూంటుంది. తట్టు, చిన్నమ్మ, పెద్దమ్మ ఇతరభేదాలు.

**ఆటలో అరటిపండు**

వట్టిది.

ఆటలో ఒక్కొక్క రాయికో పండుపేరు పెడతాం. అసలవి ఊహామాత్రమైనవే.

**ఆటవిడుపు**

సెలవు.

వీధిబళ్ళలో నేటికీ ఈ మాట ఇలాగే వినవస్తూంది.

"ఉడిగములవారలకు నాటవిడుపు గాఁగ." కువల. 4.101.

**ఆట సాగదు**

తోచినట్లు ప్రవర్తించుటకు వీలు లేదు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"సంస్కృతమ్మున నింతగా సాగ దాట." పాణి. 1.29.

**ఆటి నిల్చు**

ఆగి నిలుచు.

"ఏమియుఁన్, డయ్యక కొంతసేపు పెను ఘాకను జేతుల కాటి నిల్చువాఁ, డెయ్యెడ." ప్రభా. 2.59.

**ఆటోపంగా**

అట్టహాసంగా.

"చాలా ఆటోపంగా ఉన్నాడు." వా.

**ఆట్లాడుకుంటున్నాను!**

చూ. ఆడుకుంటున్నాను.

**ఆట్లుపోట్లు**

బాధలు. జం.

**ఆడంగులలో పెదబావగారు**

ఎప్పుడూ ఆడవాళ్లతో ఉండేవాడు.

నిరసనగా అనేమాట.

"ఉన్నాడుగా ఆడంగుల్లో పెదబావగారు. ఎక్కడెక్కడి కబుర్లూ తెస్తాడు." వా.

**ఆడంగులవాడు**

ఆడచేష్టలు చేసేవాడు, నపుంసకుడు.

"వాడు వట్టి ఆడంగులవాడు. బయట ఏం కనిపిస్తాడు?" వా.

**ఆడకాడకు**

అక్కడికక్కడకు.

"ఏం జరగడం లే అమ్మా! ఆడకాడకు సరిపోతుంది." వా.

**ఆడదక్షత**

ఆడదిక్కు.

"ఆడదక్షత లేనియింట్లో పిల్లలు ఎలా ఉంటారు మరి!" వా.

చూ. ఆడదిక్కు.

ఆడదానిచేతి అర్థము

నిలవనిది.

చూ. ఆడుపడుచు సిరి.

ఆడదిక్కు

చూ. ఆడదక్షత.

ఆడపాప

రాజాస్థానాలలో పెండ్లి చేసుకొనకుండా ఉండేదాసి.

"కార్వేటినగరంలో ఇన్నూరు మంది ఆడపాపలు ఉండేవారు." వా.

ఆడబిడ్డలాంఛనాలు

పెండ్లిండ్లలో వరుని తోబుట్టువులకు చీరలు, సొమ్ములు వగైరాల కని యిచ్చుకానుకలు.

"ఆడబిడ్డలాంఛనాలకు అధమపక్షం అయిదువంద లయినా యివ్వందే పెండ్లి కుదరడం కష్టం అన్నారు అవధానులు గారు." వా.

ఆడబోవుతీర్థ మెదు రగు

కోరినపని తనంతటనే సిద్ధించు.

"ఆడుమిందునఁ గైలాస మాడఁబోవు తీర్థ మెదు రైనరీతి సిద్ధించు ననుడు." కా.మా. 3.214.

ఆడబోయిన తీర్థ మెదురు వచ్చినట్లు

శ్రమ లేక మనోరథం సమకూరిన దనుట.

పండితా. ప్రథ. పురా. పుట 387.

చూ. ఆవులు తలంచినచోట పూరి మొలచినట్లు.

ఆడికపడు

నిందపడు.

"ప్రజలచే నాడికపడుదును." జైమి. 8.114.

ఆడికొను

1. ఒకరిని గూర్చి చెప్పుకొను. నిందగా మాటలాడుకొను.

"అతని దుశ్చారిత్రము లెల్ల విని యక్కడక్కడ నాడికొనం దొడంగిరి." శివ. 3.119.

2. నిందలు వేయు.

"బంధువుల్ గనినచోఁ బరఁగ నిందింతురు, తోడికోడలు మూడ నాడికొనును." హంస. 1.125.

ఆడికోలు

నింద.

"కుల మెంచ రాడికోళ్ళకుఁ దలకరు." హంస. 5.267.

ఆడిన దాట పాడినది పాటగా

స్వేచ్ఛగా; అడ్డుపెట్టువారు ఎవరూ లే రనుట.

"వా డాడింది ఆట, పాడింది పాటగా ఉంది. అనేవారా? ఆడేవారా?" వా.

ఆడిపోసికొను

వెనుక తిట్టుకొను.

"వారు ఊరికే నన్ను ఆడిపోసుకొంటున్నారు. నే నేపాపమూ ఎఱుగను." వా.

ఆడుంబసిపని

బాల్య చేష్ట, పసిపిల్ల చేయ వలసినపని.

"వసుధాధరేంద్రసుత నీ వసదృశముగ, శివునిఁ గూడియాడుట యాడుం బసిపని." కుమా. 7.37.

ఆడుకట్టు

ఆడుపోడిమి.

"శాల్తి యొప్పిద మాడుకట్టు నుజ్జ్వలము సేయంగ..."

భార. విరా. 1.228.

ఆడుకుంటున్నాను !

వినోదంగా గడపడం లేదు; పనే చేస్తున్నాను అని చెప్పడానికి వ్యంగ్యంగా ఉపయోగించే పలుకుబడి.

"ఏమిటమ్మా! అన్నిసార్లు పిలుస్తావు. నే నేం ఆడుకొంటున్నానా?" వా. "ఆఁ అవును. నువ్వే ఇంటిపను లంతా చేస్తున్నావు. నే నేమో ఆడుకొంటున్నాను!" వా.

చూ. ఆట్లాడుకుంటున్నాను.

ఆడుకూతురు

ఆడపిల్ల.

"పడసెఁ గాదె శంకర, గొనకొనఁ బుంస్త్వమ్ము నాడుకూతురు నీచేన్."

శివ. సా. 417.

"ఆడుకూతురు నలా ఏడిపించ రాదురా." వా.

ఆడుకొన నోరు గల్గు

దూషించుట కవకాశము కలుగు.

"అకట! నాయీడు రాచకన్నెకల కెల్లఁ, గడఁగి న న్నాడుకొన నోరు గల్గె నే మనందు." శుక. 1.474 ప.

ఆడుగోడు పోసికొను

ఆడవారిని యేడిపించు.

"ఈ ఆడుగోడు, పోసికో నేల నీవంటి పుణ్యమతికి." పాండ. జన. నాట. 26.

ఆడుగొల

స్త్రీహత్య.

తాళ్ల. సం. 6.57.

ఆడుచు పాడుచు

తీరికగా, అనాయాసంగా. జం.

"ఆడుచుఁ బాడుచు నభిమతార్థములు, వేడుక భక్తులు వేఁడిన నిత్తు."

ప్రభులిం. 14.112 పు.

"అంటును సొంటునుం దెలుప కాడుచుఁ బాడుచుఁ గూడుచుండెఁ బో."

పాణి. 3.82.

చూ. ఆడుతూ పాడుతూ.

ఆడుతీర్పరులు

ఆడపెత్తనదారులు; పోసగరనుట.

తీర్పరు లెప్పుడూ మగవారే అయి యుండవలె నన్న అపోహపై యేర్పడినపలుకుబడి.

కుక్కు. 22.

ఆడుతూ పాడుతూ

హాయిగా, అవలీలగా.

"ఆడుతూ పాడుతూ ఆ యింతపనీ చేసుకోవచ్చు." వా.

చూ. ఆడుచు పాడుచు.

ఆడుతోడ బుట్టరె ?

అక్కచెల్లెండ్లు లేరా ?

ఏ పురుషు డైనా ఒక స్త్రీతో అవమానకరంగా ప్రవర్తించి

నప్పుడు ఆడవాళ్లు అనేమాట. 'నీకు అక్కాచెల్లెళ్లు లేరా? నన్నలా అవమానిస్తావా' అని. నేటికీ వాడుకలో 'నీకేం అక్కాచెల్లెళ్లు లేరా? నా వెంట బడుతున్నావు?' అంటారు. ఆడు తోడు లేరా? అని కూడా క్వాచిత్కంగా అంటారు.

"పుర మిది చూడఁ జింత చెడిపోయె నయోమతి యాడుతోడఁ బుట్టరె? నను వంటి సాధ్విని..." శుక. 2.369.

**ఆడుదోడునను బుట్టవె?**

నీకు అక్కా చెల్లెండ్లు లేరా?

"బోయవె యాఁడుదోడునను బుట్టవె శాపనిమిత్తమే తపంబు."

మను. 4.87.

చూ. ఆడుతోడ బుట్టరె.

**ఆడుపడుచు**

భర్తృ సోదరి.

చూ. ఆడుబిడ్డ.

**ఆడుపడుచు సిరి**

నిలవనిది.

ఆడవాళ్ల చేతిలో డబ్బు నిలవదనుట. మగవారే పెత్తనం వహించవలెనన్న నాటి భావంపై ఏర్పడినది.

గువ్వలచెన్న. 33.

చూ. ఆడదాని చేతి అర్థము.

**ఆడుపాటు**

స్త్రీత్వము.

"మాయయు జీవుడుం జెలసి మైత్రి నొకానొకఁ డాదరించుచుం బాయక యాడుపాటు మగపాటువడన్."

పాండు. 4.274.

**ఆడుబిడ్డ**

ఆడుపడుచు.

ఆడుబిడ్డ, ఆడుపడుచు అను మాటలు భర్తృసోదరి అన్న అర్థంలో నేటికీ వాడుకలో ఉన్నవి.

"క్షాత్త్రగాఁ జేయుంచునన్న సుకృ-తకసేనుఁడులు దుర్వ్యగ్రమా యాడుబిడ్డ." పాండు. 3.50.

"పెళ్లిలో ఆడబిడ్డ (పడుచు) లాంఛనాల కని వాళ్లు చాలా పట్టిగారు. అంచేత పెళ్లి కుదరలేదు."

"ఉగాదికి మా ఆడపడుచును పంపమని మా వారు వాళ్ల వాళ్లకు రాశారు."

వా.

చూ. ఆడుపడుచు.

**ఆఢ్యుడు**

నాథుడు.

"వాళ్ళ యింటికి ఆఢ్యుడు ఎవడూ లేడు." వా.

"వాళ్ళగి ఆఢ్యుడు లేని సంసారం."

వా.

చూ. నాథుడు.

**ఆణిపూస**

శ్రేష్ఠుడు.

"కాళిదాసు కవుల్లో ఆణిపూస." వా.

**ఆతని పేరికూర నంజుకుము**

ఆతని పేరయినా ఎత్తకుమనుట. వాని పేరున్న కూర కూడా ముట్టకూడదంటే అంతేకదా.

పరమ పాపిఅని భావము.

"కడుఁ గుటిలవర్తనుం డెన్నఁడు నాతని పేరికూర నంజకుము నృపా!"

హరి. 2.38.

## ఆతపత్రంబు లూదు

గొడుగులు పట్టు.

"దిగధీశు లున్నతస్థిరభక్తియుక్తి నాతతమాక్తికాతపత్రంబు లూఁద."

కుమా. 9.28.

## ఆతురసన్యాసం

ప్రాణాపాయస్థితిలో ఁసుకొను సన్యాసం.

ఎలాగూ ఆశ లేనప్పుడు వదలుకొన్నాడు – అన్న సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

"వాడు లక్షరూపాయలు ఆ స్కూలుకు విరాళం ఇచ్చాడట. ఎందుకో తెలుసా? ఇన్‌కంటాక్సు బాధ తప్పించుకోడానికి. ఇదంతా ఆతురసన్యాసం."

వా.

## ఆదట వోవక

ఆశ తీరక.

"అయ్యనఘుఁడు దానిఁ జిత్తమున నాదట వోవక చూఁచె."

భార. ఆది. 4.145.

## ఆద మఱచి నిద్రపోవు

నిర్భయముగా నుండు.

"పగతురు నేఁ డాదమఱచి నిద్ర వోదురది తటి పోడువఁగ."

భార. సౌప్తి. 1.51.

## ఆదము నిద్రవోవు

ఆదమఱచి నిద్రించు.

నేడు ఆదమఱచి ... అన్న రూపంలోనే వాడుక.

"అమృతాబ్ధి సొచ్చి యాదము, నిద్రవోయిన పీతాంబరుడు బిట్టుచెదరి లేవ."

కుమా. 11.3.

## ఆదరబాదర

1. త్వరత్వరగా.

"గంట అయిపోయిం దని నేను ఆదరబాదరా బయలుదేరి వచ్చాను." వా.

2. తగిన యేర్పాట్లేవీ లేకనే.

"మేనేజరు పిలిచా డనేసరికి ఇతను ఆదరాబాదరా పరిగెత్తాడు. ఆ తొందరలో అకౌంటుపుస్తకం కాస్తా ఇక్కడే పెట్టిపోయి నాలుగుచీవాట్లు తిన్నాడు."

వా.

3. తొందరగా.

"ఆదరాబాదరా నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని వచ్చాను." వా.

## ఆదాయము చాలదు

చాలినంత వరుంబడి లేదనుట.

"ఆదాయం చాలని ఉద్యోగం ఉండీ ప్రయోజనం తక్కువ." వా.

## ఆదాయవ్యయాలు

జమాఖర్చులు.

## ఆది ఇచ్చు

కొలత యిచ్చు.

"గాజులకు ఇప్పుడే ఆది యిచ్చి వచ్చాను. గుర్తుంగా లేకపోతే నాకిష్టంలేదు. అందుకనీ..." వా.

**ఆదికారణము**

మూలకారణము.

"ఆదికారణ మతఁడ మీ యాపదలకు."
భార. కర్ణ. 2.124.

**ఆదికొను**

పైబడు, మార్కొను.

"వృషభంబున కాదికొను బెబ్బులియుం బోలె." భార. విరా. 5.73.

**ఆది తీసుకొను**

కొలత తీసుకొను.

"దర్జీ వాడు ఆది తీసుకొని పోయి పదినాళ్లయింది. ఇంకా చొక్కాలు కుట్టి యివ్వనంటున్నాడు." వా.

**ఆదిమలత్రయము**

"ఆదిమలత్రయహరణ మా."
పండితా. ప్రథ. పురా. పుట 277.

**ఆదివావిత్రోడ**

ఒక వరుసక్రమములో; యథాక్రమముగా.

"ఆదివావిత్రోడ నంతంత దవ్వుల, నుండఁ బంచి యంబుజోదరుండు."
హరి. 6.43.

**ఆదిపెట్టు**

తాకట్టుపెట్టు, కుదువపెట్టు.

"కాసువీసంబు వెడలమి గ్రాసమునకు నాది పెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని."
మను. 3.129.

**ఆదెబ్బతో....**

ఆ పనివల్ల, కొంత నష్టం జరిగాక.

"ఆ దెబ్బతో వాడు దారికి వచ్చాడు."
వా.

**ఆనందపదములు**

జానపదగేయములలో ఒక నిశ్చిత శాఖ అయి ఉంటుంది. ఆనందాన్ని సూచిస్తూ ఆడుతూ పాడుకునే పదాలు.

పండితా. ప్రథ. పాద. పుట 513

**ఆనందము మరుగు**

సుఖము మరుగు.

"కానఁ బటిచ్చల మగురాజ్యానందము మరఁగి యింద్రియారాముఁడ నై."
ఆము. 2.81.

మరుఁగు: వాడుకలో మరుగుగా వినవస్తుంది.

**ఆనందవార్ధి దేల్చు**

ఆనందింప జేయు.

"తమకమున నింపు లెల్లను దమక తమక వలసె నని యెంచ నానందవార్ధిఁ దేల్చె." రాజగో. 1.19.

**ఆనకట్ట**

నదులకూ వాగులకూ కట్టకట్టి నీరు నిలువచేసి సాగుకు ఉపయోగించడంకోసం కట్టేకట్ట.

"గోదావరి కృష్ణలకు ఆనకట్ట కట్టడం వల్లనే అక్కడ దరిద్రం పోతుంది."
వా.

**ఆనతిచ్చు**

చెప్పు – వచించు.

**ఆనతి యిచ్చు**

చూ. ఆనతిచ్చు.

**ఆనతి మీరెదైన దాటమి**

ఆజ్ఞ ఏమాత్రం మీరక పోవుట.

మూారెడు అనగా లక్షణయా కొంచెము అనుట. అణు మాత్ర మని యీా సంద ర్భంలో వాడుక.

**ఆననము లేగతి నాలోకింతు ?**

వాడి మొఖ మెట్లా చూస్తాను? ఏదైనా తనకు గొప్ప అవ మానం జరిగినప్పుడు తన స్నేహితుల యెదుట పడలేక పోవుట సహజము. దీనికి వ్యావహారిక రూపం వారి ముఖం ఎట్లా చూస్తాను ?

"ఈ కలహ మపుడ వినఁబడు నాకం బున, సురల యాననము లేగతి నాలో కింతు..." కళా. 3.245.

చూ. ముఖం ఎట్లా చూస్తాను.

**ఆనపొడుచు**

ఆజ్ఞాపించు.

"అలికుంతల చెలుల నేల యాన వొడి చెదు." ప్రభా. 5.39.

చూ. ఆనవొడుచు.

**ఆనబెట్టు**

ఆకలి తీరా అన్నం పెట్టు. నిరసనగా ఒకరినిగురించి తిండి పోతు అంటూ అనేమాట.

"వీడికి మేం ఆనబెట్ట లేమమ్మా!" వా.

**ఆనమాలు**

చూ. ఆనవాలు.

**ఆన యిడు**

ఒట్టుపెట్టు.

సారం. 2.205.

**ఆన లిడు**

ఆజ్ఞాపించు.

**ఆనలు వొడిపించు**

ఆజ్ఞాపించు, ఆనపెట్టు.

"ఆనలు వొడిపించి యాదృతి స్వర్ణ వర్షం పవర్షనా వారక కనక వర్షంబుఁ గురియించె."

పండితా. ద్వితీ. మహి. పుట 118.

**ఆనవాయితీ**

మామూలు.

క్రౌ త్త. 26.

**ఆనవాలపాయసము**

నానబాలుతో చేసినపాయ సము.

"అమృతరసోపమం బైనకమ్మని యాన వాల పాయసము జంబాల మయ్యె."

నైష. 6.124.

**ఆనవాలు**

చిహ్నము, గురుతు. ఈ ఆనవాలు ఆనమాలు అనే రూపంలో వాడుకలో విని పిస్తుంది.

"ఆనవాలు దెమ్ము నృపుపాల ననియె." భార. అశ్వ. 3.95.

చూ. అడయాళము; ఆనవాలుపట్టు.

**ఆనవాలు పట్టు**

గుఱుతుపట్టు.

"అయ్యో! నువ్వు మా రామయ్య కొడుకా! ఆనవాలే పట్టలేదే." వా.

"వాడు ఆనమాలు పట్టలేకుండా చిక్కి పోయాడు." వా.

చూ. ఆనవాలు.

**ఆనవెట్టు**

ఆజ్ఞాపించు.

**ఆనవోడుచు**

ఆజ్ఞాపించు.

"దొంగ లాన వోడిచినఁ గోకల్ విడు తురెకి?" కళా.

"అలికుంతల! చెలుల నేల నాయాన వోడిచెదు." ప్రభా. 5.39.

**ఆనవైచు**

ఆజ్ఞాపించు.

"ఆనవైచినట్లు వాహిని యివుర జలము వాటె నిసుక ఏఁప." భోజ. 3.18.

**ఆనాలు**

ఆనవాలు, నానబ్రాలు, వడపప్పు; నానవేసిన పెసర పప్పును ఉపవాసం ఉండవలసిన పండుగలలో ఉపయోగిస్తారు.

చూ. ఆనవాలపాయసము.

**ఆనిపట్టు**

ఊని పట్టు.

"ఆనిపట్టి నేఁ బాపపుణ్యములు అనుభవించవలె నన్నప్పుడు."

తాళ్ల. సం. 9.17.

**ఆనుకొను**

తిను.

నిరసనలోనే వాడుక.

"ఆనుకోవడానికి అయిదిస్తరాకుల అన్నం కావాలనే. ఇక్కడ పుల్ల అక్కడ తీసిపెట్టడు గదా? ఎట్లా వస్తుంది అంటలి?" వా.

**ఆనుపానులు**

పుట్టుపూర్వోత్తరాలు. జం.

"ఆ విషయంలో ఆనుపానులు తెలుసుకొని నాకు రాస్తే చూస్తాను." వా.

**ఆనోటా ఆనోటా**

కర్ణాకర్ణికగా.

"ఆనోటా ఆనోటాం పడి వీడి వ్యవహారం నలుగురికీ తెలిసిపోయింది." వా.

**ఆపద మొక్కులు సంపద మఱపులు**

ఆపదలు వచ్చినప్పుడు మొక్కుకోవడం, సంపదలు వచ్చినప్పుడు మఱచిపోవడం మానవనైజ మనుట. సంపదగును పులు అని కొన్ని ప్రాంతాల వాడుక. జం.

**ఆపసోపములు పడు**

అసురుసు రను; అలయు.

"పలుతాపంబున నాపసోపములు చూపట్టంగ నిట్టట్టుగా, నలసెం బంటవలంతి దీని కిఁక శైత్యప్రక్రియల్ సేయఁగా వలె......" భద్రాయు 3.191.

**ఆపాతమధురము**

వినగానే బాగుంటుంది–తరచి చూస్తే కాదు.

**ఆపాతరమణీయము**

విన్నవెంటనే ఆనందింప జేయునది.

సంగీత మాపాతరమణీయమని పెద్దలు చెప్తారు.

ఇంతే కాక యిది పైకి బాగా

కనిపించినా లోతుగా చూస్తే అలా ఉండదు అనే అర్థంలో కూడా ఉపయోగిస్తారు.
"ఇది కేవలం ఆపాతరమణీయమైన మాట. ఆలోచిస్తే యిందులో సారం నిస్సారమే అని నీకే తేలుతుంది."
చూ. ఆపాతమధురం; అవిచారితరమణీయము.

## ఆపూటకు లేని

మిక్కిలి పేద యైన.
"ఆపూటకు లేనివాడే అంత మిడిసిపడితే యింక ఉన్నవాడిసంగతి చెప్పాలా?" వా.

## ఆపేరికూర నంజమి

ఆపేరే పడదనుట.
"భీమధన్వుండు దినిన నా పేరి కూర వంజ నేనిది వెలి గాఁగ నాకు నొక్క." దశకు. 10.18.
చూ. ఆతని పేరికూర నంజు.

## ఆపైన దేవు డున్నాడు

చేయగలిగింది చేసితి ననుట.
"నేను చేయగలిగింది చేశాను. ఆపైన దేవు డున్నాడు." వా.

## ఆపోవని

సంతృప్తి చెందని.
"కోపము నుబ్బును గర్వము, నాపోవని మునికియును దురభిమానము ని, ర్వ్యాప పారత్వము ననువవి, కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా!" భార. ఉద్యో. 1 ఆ.

## ఆపోశనము పట్టు

సంధ్యావందనాదులలో తర్జనితో చూపుడువేలిని మడిచి ఆ అరచేతిలో ఏర్పడు పల్లములో తీర్థము పోసుకొని మంత్రపూర్వకముగా తీసుకొనుటను ఆపోశనం అంటారు. ఆవిధముగా జలమును లోనికి తీసికొను.
"బడబాగ్ని వడికి లోపడని పాథోరాశి భోరునఁ గొనియె నాపోశనముగ." కా.మా. 1.124.

## ఆపోశనించు

ఆపోశనము గొను.
"దివ్యాస్త్రనైపుణి ... ప్రాణములు నాపోశనింపఁగా నాశించె." వర.రా.యు.పు. 240 పంక్తి 13.

## ఆప్రొద్దు పోయి రాజనట్టి

ఆపూటకుకూడ గడవని (పేద)
"ఆప్రొద్దు పోయిరాజనట్టి నిర్పేదయు." పాండు. 1.101.

## ఆబాలగోపాలము

చూ. ఆబాలవృద్ధాదులు.

## ఆబాలవృద్ధాదులు

అందఱూ.
చిన్నా పెద్దా అంతా అని నేటి వాడుక.
పండితా. ప్రథ. దీక్షా. పుట 161.
చూ. ఆబాలగోపాలము.

## ఆ బుర్రలో విత్తనాలే

అదే రకమే అనుట.
కూరగాయల విత్తనాల వంటి వానిని సొరకాయ బుర్రలో వేసి ఉంచే అలవాటు పై యేర్పడినది. ఒకే బుర్రలోఒకరకమైన విత్తనాలే వేస్తారు.

**ఆభాస్యుడు**

అపహాస్యపాత్రుడు.

అనగా పనికిరానివాడు అనుట.

"ఇదేమి సిద్ధి యాభాస్యున కేల చొప్పడు." విక్రమ. 3.7.

**ఆభిచారంబు వేల్చు**

ఒకరికి చెరుపు సేయుటకై హోమాదులు చేయు.

"భూరిక్రియల నాభిచారంబు వేల్చు."
పండితా. ప్రథ. వాద. పుట 683.

**ఆభ్యంతరరతి**

బాహ్యరతికి భిన్నమైన సంభోగము.

కుమా. 9.152.

**ఆమంత్రణము వడయు**

సెలవు తీసుకొను, పొందు.

"అతనిచే నాలింగితుండై యామంత్రణంబు వడసి." భాగ. స్క. 1.233.

**ఆమంత్రణము సేయు**

పిలుచు, సెలవు తీసికొను.

"ఆమంత్రణంబు సేసి యంతర్హితుండయ్యె." భార. అశ్వ. 3.155.

**ఆమటపదిట**

పదామడల దూరంలో.

ఇంతపరిధిలో ననుట – దీనిని అనేకరకాలుగా అంటారు.

ఆమడ అంటే పదిమైళ్లు.

నేటికీ ఈ లెక్క ఉన్నది.

"ఆమట పదిట లింగార్చకుం డనెడు నామంబు వినగ రా దేమి కర్మంబొ."
బస. 6 ఆ. 155 పుట.

"పదామట్లో అంత పండితుడు లేడు."

"చుట్టూ పదామడల్లో ప్లీడరు లేడు."

"పది ఆమట్లో పోస్టాఫీసు లేదు." వా.

**ఆమని బుగబుగలు**

అసిరమైనవి.

వసంతకాలములో మాత్రమే వాసనలు గుబులొక్కను నని వాచ్యార్థము.

పాండు. 3.72.

**ఆమవడ**

పెరుగువడ. పెరుగు గారె.

**ఆమశ్రాద్ధం**

బియ్యం పిండి నగ్గిరాలతో – అన్నంతో వంటతో నిమిత్తం లేకుండా చేసే శ్రాద్ధం.

**ఆమాటా యీమాటా**

ఒక నిర్దిష్టకార్యాన్ని సూచించేవి కాక లోకాభిరామాయణంగా మాట్లాడుమాటలు.

"వాడు ఆమాటా యీమాటా మాట్లాడి పోయాడే కాని ఈ సంగతే చెప్పలేదే?" వా.

"మేము ఆమాటా ఈమాటా మాట్లాడుకొంటూండగా నీ సంగతీ వచ్చింది."

"ఆమాటా యీమాటా మాట్లాడి వాడు నన్ను బుట్టలో వేశాడు." వా.

"ఆమాటా యీమాటా మాట్లాడి వాకిటిదాకా వెళ్లి ఆతరవాత అసలు విషయం బయట పెట్టాడు." వా.

**ఆము కవియు**

పొగ రెక్కు.

"ప్రామిన్కు సెత్తాము లాముకవియు."
పాండు. 2. 152.

"కాలుపుల్ దిని యాము కవిసి."
సారం. 1.68.
"సెలసంజ యాము కవిసె——"
చూ. ఆముకొను.

ఆముకొను
బలిసిన.
లక్షణయా అతిశయించు.
"ఆముకొన్న ప్రేమచే." క్షేత్రయ్య.
చూ. ఆముకవియు.

ఆముపెద్దు
పొగరు పట్టినయెద్దు.

ఆముదంగాడు
పట్టుకొంటే వదలనివాడు.
"వాడు పట్టి ఆముదంగాడు. వాడెక్కడ తటస్థపడ్డాడు రా నీకు." వా.

ఆముదం త్రాగినమొగం పెట్టు.
నిస్పృహను, చేతకానితనమును స్ఫురింప జేయు.
"ఎందుకు రా? అలా ఆముదం తాగిన మొహం పెట్టుకొని కూర్చుని ఉన్నావు?" వా.

ఆముదము రాయు
నష్టపెట్టు.
"నే నేదో చుట్టపుచూపుగా పోతే నాకు ఆముదం రాశాడు." వా.

ఆముపట్టు
అహాముపట్టు, పొగ రెక్కు.
"వాడికి మహా ఆముపట్టి ఉంది లే." వా.

ఆమూలచూడముగా
ఆమూలాగ్రముగా, పూర్తిగా.
"ఆమూల చూడముగ నెఱింగింతున్." విప్ర. 4.40.

ఆయకట్టు
సాగుకు లాయి కయినభూమి.
"ఆ చెరువుకింద మున్నూరు ఎకరాల ఆయకట్టు ఉంది." వా.

ఆయగాళ్ళు
ఊరిలోని వివిధవృత్తులవారు.

ఆయన కాయ నై
తనంతకు తానే.
"ఆయన కాయనై రణమునందలి కోర్కె నినుఁ వరించె."
పాండవాశ్వ. 61.

ఆయములు ముట్టుకొను
కళ లంటు, మర్మము లంటు.
"అంగము లొరసుకొంటూ ఆయములు ముట్టుకొంటూ." తాళ్ల. సం. 3.539.

ఆయపాటున
మర్మస్థానంలో.
ఆయువుపట్టున అనడానికి వాడుకరూపం.
"వాడు ఆయపాటున కొట్టేసరికి వీడు కపీమని నేల పడ్డాడు." వా.

ఆయవారపు సంచి
బిచ్చపుసంచి.
"అంకభాగమునందు నాయవారపు సంచి." జైమి. 7.197.

ఆయవారము
బిచ్చము.
"ఆయవారముకంటె నధికకల్యాణంబు పతిగయొన్నుల ధాన్యభక్షణంబు."
భాగ. 7.410.

ఆయవార మెత్తు
బిచ్చ మెత్తు.

"ఆయ వారసెత్తి అతను చదువుకున్నాడు." వా.

### ఆయవ్యయాలు
జమాఖర్చులు.

### ఆయాసపడు
శ్రమపడు.

"పనులయెడ నాయాసపడినవారి నెల్ల మిగుల మన్నింపుఁడు."
భాస్క. బాల. 115.

### ఆయువు దెగు
ఆయుర్దాయము తీరు.

"ఆయువు దెగినట్టి జంతువులు సచ్చు."
భార. అను. 5.58.

### ఆయువుపట్టు
ముఖ్యమైనది.

"కథ కంతా ఆయువుపట్టు ఇక్కడే ఉంది." వా.

### ఆయువు మూడు
అవసానదశ వచ్చు.

"ఆయువుమూడినట్టి సన్న్యాసికిఁ గట్టె నైదువతన మ్మొకఁ డమ్మకుఁ దక్కవయ్యెఁ బో." నాయక. 8 పు.

### ఆయు వెక్కు
ఆయుర్వృద్ధి కలుగు.

"ఎల్లవారును గడు నాయు వెక్కవగయుఁ జెవులు......లేకున్నారు."
హరి. 5.6.

### ఆయె వోయె
అయిందేదో అయింది, పోయిందేదో పోయింది.

"పోనీ నేఁటికి నాయెఁబోయెఁ గడు దుర్బుద్ధిన్ విచారింప నేలా?"
శా.మా. 2.123.

"నీయంతవాని కిటు లౌ,నా? యాయెం బోయె నిప్పు డైనం దపసిన్, డాయక నీ నాయుసులుల, నే యనువున నేటు సేయ నెంచెదొ యనుచున్."
రామకథా. బాల. 4 ఆ.

### ఆయె నౌ లే
అది సరేకానీ.

"ఆయె నౌలే యిది వట్టి శంక."
సారం. 2.22.

### ఆరంభశూరత్వము
ప్రారంభంలో మాత్రమే పట్టుదల కనబఱచుట.

"వాడి దంతా ఆరంభ శూరత్వం. నాలుగు రోజులు పోతే ఏమీ చేయఁడు."
వా.

### ఆరగాగు
బాగా కాగు.

"ఆరంగాఁగిన పాలమీఁగడలు హస్తాబ్జంబులం దేవి." హరి. 5.207.

### ఆరగింపు
భోజనం; నైవేద్యం. కొంచెం నిరసనగానూ అంటారు.

"వాడికి పొద్దున్నే ఆరగింపు అయితే గానీ బయటికి బయలుదేరడు." వా.
"స్వామికి ఆరగింపు అవుతున్నది."
వా.

### ఆరగూరు
నిండారు.

"అట్లు జనమేజయుఁడు వగ నారఁగూరి." భార. శాంతి. 3.346.

### ఆరటపడు
కష్టపడు.

**ఆరటపెట్టు**

కష్టపెట్టు.
ఆరటం ఆరాటం అన్న రూపంలో నేటికీ వాడుకలో వినవస్తుంది.
పాండు. 4.289.

"వాళ్లు తల్లులూ పిల్లలూ ఎంత ఆరాటపడి పోతున్నారో చెప్పలే మమ్మా!"
"ఏమిట్రా ఆ ఆరాటం! కాసేపు ఆగు."
వా.

**ఆరడిబోవు**

వ్యర్థమగు.
"రాముని కార్య మారడిఁ బోయె."
వర.రా. కిష్కి. పు. 501 పంక్తి 1.

**ఆరడుగుల నేల**

చూ. అయిదుమూళ్ల నేల.

**ఆరబండు**

కలమాగు.
"ఒకమాన నారఁబండిన పండ్లు."
భార. శాంతి. 1.160.

**ఆరబట్టు**

నిందించు, కడిగి ఆరవేయు.
"బ్రాహ్మణమత మారఁబట్టు ములుచ."
నాయకు. 15 పు.
చూ. ఉతికి ఆరవేయు.

**ఆరాటపడు**

ఆవేదన చెందు.
"మన సారాటపడం జేసి కాని రాదుడిగింపక."
కేయూ. 2.37.

**ఆరింద**

ఆరితేరిన ఆడది, నెఱజాణ.
జన. 41.

"ఆ పిల్ల ఏదో ఆరిందాలా మాట్లాడుతుంది."
వా.
రూ. ఆరిందా.

**ఆరిందా గోవిందా అయినట్లు**

సమర్థునకే శాస్తి అయ్యె ననుట.

**ఆరితేరిన ఘటం**

గడుసరి.
"వాడు ఇందులో బాగా ఆరితేరిన ఘటం. వాడిదగ్గర నీ ఆటలేమీ సాగవు."
వా.

**ఆరితేరు**

గడిదేరు. ఢక్కా మొక్కీలు తిను.
"హరుకంటి సెగ కోర్చి యారి తేరిన మారుఁడు."
విజయ. 3.25.

**ఆరినపుండ్లు కోలలను గెలికిన క్రియ**

మఱచినబాధను తిరిగీ జ్ఞప్తికి తెచ్చుపట్ల అనే సామ్యం. మానిపోయిన పుండును సూదితో కెలికినట్లు.
పండితా. ద్వితీ. మహి. పుట 169.

**ఆరివేరము**

కలహప్రియత్వము.
"గగనమువనుండి వచ్చె నాకస్మికముగ నారివేరంపుఁదపసి దైత్యారికడకు."
పారి. 1 ఆ.

**ఆరివేరము చేయు**

గందరగోళము చేయు.
"......తల్లియస్థుల కొకమాట పాపకర్ముండు చెం చర్థభార మనుచు

కంచనాపాటవంబునఁ గొంచుఁ బోయి
యూరివేరంబు చేసినకారణమున."
కాశీ. 5.68.

## ఆరుదూఱు

అల్లరి, నింద.
"వాడు ఆరుదూఱు చేసెనే."
క్షేత్రయ్య.
"వారక యత్తగారికనుబ్రాము నిజే
శ్వరు మోసపుచ్చి యే, యూరును దూఱు
నైనఁ బడి యెందఱు...కోరిననాథునిం
గలిసి కొల్లలుగా సుఖ మంద రన్న."
అహల్యా. 3.33.
"వారి కెవ్వారికి లేనియూరుదూఱు నీ
తలసె వ్రాసెనే ధాత."
అహల్యా. 3.46.

## ఆరు నూరయినా నూరు ఆర యినా....

ఏది ఏమయినా అనుట.
"ఆరునూ రయిన వెనుకాడడు."
రుద్రమ 42 పు.
"ఆరు నూరయినా నూరు ఆరయినా
యీ పెళ్లి జరిగి తీరవలసిందే." వా.

## ఆరునెలల బేరము

త్వరగా తెమలనిది.
"వాణ్ణి పిలుచుకొనిపోతే యీ పని
తెములుతుందా? వాడి దంతా ఆరు
నెలల బేరం." వా.

## ఆరున్నొకటి

ఏడు.
ఏడు అనుట అమంగళసూచక
మని కొలచడం, తూచడం
వగైరాలలో ఆరున్నొకటి
అనడం వాడుక.

## ఆరున్నొక్కరాగం తీయు

ఏడ్చు.
"మా అబ్బాయి అప్పుడు ఆరున్నొక్క
రాగం తీశాడు." వా.
చూ. ఆరున్నొక్కరాగం లంకించు
కొను.

## ఆరున్నొక్కరాగం లంకించు కొను

చూ. ఆరున్నొక్కరాగం తీయు.

## ఆరుబత్తుల కంపెనీ

టపాలాకోరు ముఠా.
ఆర్బత్ నాట్ కంపెనీ దివాలా
తీయడం ప్రసిద్ధం. అందుపై
తరువాత యేర్పడిన పలుకు
బడి.

## ఆరుమూడు చేయు

పని చెడగొట్టు.
కలువాయి. 29.

## ఆరు మూడైనా మూడు ఆరైనా

ఏమైనా సరే అనుట.
"ఆరు మూడైనా మూడు ఆరైనా ఆ
ఊరికి నేను ఈ రాత్రి వెళ్ళడం
తప్పదు." వా.
చూ. ఆరునూరయినా నూరుఆరయినా.

## ఆరుస్తావా తీరుస్తావా?

నీ కెందుకు ఈ సంగతి అను
పట్ల ఉపయోగించే పలుకు
బడి.
"నీ కెందుకురే అవన్నీ. నీ వేం ఆరు
స్తావా? తీరుస్తావా?" వా.
చూ. ఆర్చేదా తీర్చేదో.

**ఆరూ పోరూ**

పోరుట; గోకుట. జం.

ముఖ్యంగా అత్తింటివారిపోరు.

"ఆవిడది ఆరూ పోరూ లేనిసంసారం." వా.

**ఆరూ మూడూ అట్లపిండి అగు**

చెడిపోవు అనే అర్థంలో ఉపయోగించే పలుకుబడి.

"ఆపని అంతా ఆరూ మూడూ అట్ల పిండి అయిపోయింది." వా.

**ఆరోగణము**

భోజనము (కన్నడం – ఆరోగణ) నైవేద్యము.

రూ. ఆరోగిణము.

"హరునకు నిత్యంబుఁ గరికాలచోడ నరపతి యారోగణము నెమ్మి జలుపఁ బలకల నేతినప్రాసంగుఁబ్రాలు..." బస. 5 143 పుట.

**ఆరోగ్యం మహాభాగ్యం**

ఆరోగ్యం మొదట చూచుకోవాలి అని చెప్పవలసి వచ్చినపుడు అనేమాట.

"మరీ అంత రాత్రింబవళ్లు పని చేస్తే ఎట్లా రా? ఒళ్లు చెడదూ? ఆరోగ్యం మహాభాగ్యం అన్నారు." వా.

**ఆరోగ్యస్నానం**

జబ్బుపడి లేచిన తర్వాత చేసే మొదటి స్నానం.

"నిన్ననే ఆరోగ్యస్నానం చేశావు. అప్పుడే బయటికి ఎందుకు వెడతావు బాబూ!" వా.

**ఆర్చి తేళ్ళ దలబెట్టు**

అనవసరంగా శోధించు, గుట్టు బయట బెట్టు.

"ఏల చలంబు నీ వడిగెదేని వచించెద నాదు గోప్యముల్, బేలవె యార్చి తేళ్లఁ దలబెట్ట..." ప్రభా. 3.147.

**ఆర్చి పేర్చి**

సింహనాదం చేసి, విజృంభించి.

"ఆర్చి పేర్చి మారుఁ డారీతి నేయంగ." చంద్ర. విలా. 2.42.

**ఆర్చు తీర్చు**

ఊరార్చు.

"ఆర్పఁగఁ దీర్పఁగ మిక్కిలి, నేర్పు గలవయస్యలట్లు నెలఁతయు మీ మీ, నేర్పునఁ బలికెద రక్కట, యేర్పడ మీ కీ విచార మేటికిఁ జెపుఁడా." ఆము. 5.65.

**ఆర్చెదో తీర్చెదో**

ఆరుస్తావా తీరుస్తావా?

నీకు చెప్పి యేమి ప్రయోజనం అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఆర్చెదో తీర్చెదో తెలుప నయ్యెడి దేమి?" సారం. 3.184.

చూ. ఆరుస్తావా తీరుస్తావా?

**ఆర్చేవారా తీర్చేవారా?**

దిక్కెవరూ లేరనుట.

"ఏదో అవస్థ పడుతున్నాను. ఎవరితో చెప్పుకొని ఏం లాభం? ఆర్చేవారా? తీర్చేవారా?" వా.

**ఆర్పఁగ దీర్పఁగ**

ఆర్చుటకూ, తీర్చుటకూ సమర్థమైన.

"ఆర్పఁగఁ దీర్పఁగ మిక్కిలి నేర్పు గలవయస్యుఁ డట్లు." ఆము. 5.65.

**ఆర్వేరము**

చూ. ఆరివేరము.

**ఆఱగలదీపము మండినట్లు**

ఆరిపోయేముందు దీపం విపరీతంగా వెలుగుతుంది అంటారు. దానిపై వచ్చిన పలుకుబడి.

చావు తెలివి వంటిది.

"ఆఱంగలదీపము ట్లతఁడు మండుంగాక." భార. కర్ణ. 3.49.

**ఆఱడిచావు**

దుర్మరణం, చెడు పేరుతో చావు.

"కుసుమాయుధు నాఆడి చావు చూచి." కుమా. 5.30.

**ఆఱడి తెచ్చు**

నింద తెచ్చు.

"అనఘుని ధర్మపత్నికి నహల్యకు నాఱడిఁ దేఁ దలంచి." విప్ర. 3.48.

**అఱడిపడు**

అల్లరిపడు.

చూ. ఆఱడిపుచ్చు.

**ఆఱడిపుచ్చు**

1. వ్యర్థపఱుచు.

2. బాధించు.

"ఆఱడి చేసి నా తగుల మాఱడిపుచ్చఁగ నేల కేల!" విరా. 2 253.

"నన్నిటు గానపాలు చేసి యాఱడి పుచ్చితి." నిర్వ. 9.88.

**ఆఱడిపెట్టు**

అల్లరిపెట్టు, బాధపెట్టు, వ్యర్థము చేయు.

"నామనసు మోహము కాఱడి పెట్టి నీవు నన్నొల్లక పీడ నాదెదవు." వి. పు. 2.233.

**ఆఱడిపోవు**

వ్యర్థమగు.

లక్ష్యం చావు, పాడగు, భగ్నమగు అనే అర్థాలలో ఇది ప్రయుక్త మవుతూ వుంటుంది.

"అనవుడుఁ గృష్ణుఁ డిట్టులను నాఱడి వోయెఁ బ్రయత్న మెల్ల." భార. అశ్వ. 3.59.

"హా! పుత్రవర్గ మిటు లాఱడి వోవ." భార. స్త్రీ. 1.10.

**ఆఱు మూడైనా మూఱు ఆఱైనా**

ఏది ఏమైనా అనుట.

రూ. ఆరుమూడైనా మూడు ఆరైనా.

**ఆఱు మూడగు**

చెడిపోవు.

"ఆపని అంతా ఆరు మూడు అయి పోయింది. వా.

**ఆలగోడు బాలగోడగు**

కరుణాక్రందనపూరిత మగు.

ఆవులగోడు, బాలలగోడు—ఆవులూ, పిల్లలూ అతికరుణంగా విలపిస్తారు కదా!

"అతగాడు పోయేసరికి వాళ్లయిల్లంతా ఆలగోడూ బాలగోడూ అయి పోయింది." వా.

**ఆలగోడు బాలగోడుగా ఉండు**

అతిశోచనీయస్థితిలో ఉండు.

"పాపం! వాళ్లింట్లో నిన్న రాత్రే

హఠాత్తుగా ఆయనభార్య చనిపోయిం దట. అంతా ఆలగోడూ బాలగోడు గా ఉంది.'' వా.

## ఆలనా పాలనా లేదు

చూచేవా రెవరూ లేరనుట.

''ఆ తోట ఆలనా పాలనా లేక పాడయి పోయింది.'' వా.

## ఆలపాడి

పాలిచ్చు ఆవులకలిమి.

మేకపాడి వంటిది.

పాండు. 2.111.

## ఆల బేల

అమాయకురాలు. జ౦.

''ఆలవు బేలవు కడుఁ గోమరాలవు...'' కుమా.

## ఆలము చేయు

ఉపేక్ష చేయు.

''అని పలుకు నమ్మరాళిలోలనయన పలుకు లాలంబు సేసి చక్రవాకి యిట్లనియె.'' మను. 6.68.

## ఆలము సేయు

వ్యర్థపఱచు, గాయపఱచు.

''కూర్మి యెల్ల నే డాలము సేసి.'' కుమా. 11.55.

## ఆలవట్ట మిడు

గుడ్డతో గుండ్రముగా కూర్చిన విసనకఱ్ఱతో వీచు. ఇప్పటికీ దేవాలయాలలో దేవునిమెరవణి ఊరేగింపులలో పట్టుకొని పోతారు. వీని పిడి కఱ్ఱ చాలా పొడవుగా ఉంటుంది.

''మృగాక్షు లాలవట్టంబు లిడ.'' భార. స్త్రీ. 2.38.

## ఆలవట్టము

వస్త్రంతో గుండ్రంగా తయారుచేసిన విసనకఱ్ఱ; ఆలయోత్సవాలలో, రాజోపచారాలలో ఉపయోగించే గుడ్డ గొడుగు.

''ఆలవట్టములుఁ జామరలు...'' పండితా. ప్రథ. వాద. పుట. 518.

''మృగాక్షు లాలవట్టంబు లిడ...'' భార. స్త్రీ. 2.38.

''కమలదళము మృణాళకాండమునఁ జేర్చి, యాలవట్టంబు గావించి లీల మెఱయ, విసరు—'' నిర్వ. 8.62.

''అచ్చరవిరిబోడు లాలవట్టము లూన, విను టెంకిచెలులు వీవనలు వైవ.'' అచ్చ. సుంద. 35.

## ఆలించి విను

శ్రద్ధగా విను, సావధానంగా విను.

''రతిరోదనధ్వని వసంతకు చెవులం జిలికిన నులికిపడి యద్దెస యాలించి విని.'' కుమా. 5.87.

## ఆలిగొను

పరిహాసించు.

''అకట! సైరంధ్రి నన్నని ట్లాలిగొనఁగ, సేల.'' భార. విరా. 4.18.

చూ. ఆలిబుచ్చు.

## ఆలిబుచ్చు

పరిహాసించు.

చూ. ఆలిగొను.

**ఆలిసేయు**

వ్యర్థము చేయు.

"కూలి చేసినతప మెల్ల నాలి సేసె."
కమా. 4.409.

**ఆలూ చూలూ లేదు**

భార్యాపిల్లలు లేరు. కాస్త నిరసనగా వానికి యేమీ లేదు అనుపట్ల ఉపయోగిస్తారు.

"ఆలూ చూలూ లేనివా ణ్ణెవడు నమ్ముతారు రా?" వా.

**ఆలూ లేదు చూలూ లేదు కొడుకుపేరు సోమలింగం**

అసలింకా ఆరంభం కాక ముందే ఫలితాన్ని గూర్చి ఉవ్విళ్లూరేపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఉద్యోగానికి దరఖాస్తు పెట్టావో లేదో అప్పుడే యింక్రిమెంటు లెక్క వేస్తున్నా వేమిట్రా? ఆలూ లేదు చూలూ లేదు కొడుకుపేరు సోమలింగం అన్నాట్ట." వా.

**ఆలెగాడు**

నౌకరు. శ. ర. ఆయగాడు అనే వాడుకలో వినబడుతుంది.

**ఆలె(ల)పొయ్యి**

స్నానానికి నీళ్లు కాచు పొయ్యి. దీన్ని సామాన్యంగా ఒక బిందో కాగో పెట్టి చుట్టూ కట్ట కట్టి వేసి ఉంటారు. ఆ బిందె తీయుటకు రాదు. దానిని ఆలపొయ్యి అని నేడు అంటారు.

**ఆలేకార్లు**

అధికారులు, ఆఫీసర్లు. నిత్యబహువచనము.

"సర్కారు సిబ్బంది సరి చేయుటకుఁ గొంత, సాలు జమాబందిసాలు గొంత, పారుగూరి మన్నీల సరఫరా కింత యూ, లేకార్ల లంచాలలోకి కొంత... కొంత కొంతయె ఖుస్పు కొండంత యయ్యె."
పెన్న. 2.

**ఆలోకనవిద్య**

ఇంద్రజాలము.

**ఆళ(ల)తి సేయు**

ఝంకారము చేయు (తుమ్మెదల విషయంలోనే ఈ పదం కనబడుతోంది.) అందుతో పాట పాడు, ఆలపించు అన్నట్లు మారింది.

"ఆడెడు నెమ్మిఁ గనొనకు నుమ్మ బయల్పడ నాడుచిల్కతో, నాడకు మమ్మ, తేటిగెడ నాళతి సేయకు మమ్మ."
కమా. 5.131.

"సోలుచు సమ్మదరసమున, గ్రోలుచు, వనపాల బాలికలు నవలతికాం,దోలముల వేడ్క సలుపుచు, నాళతు లూనఁ జేసి పాడి రభినవలీలన్."
కమా. 4.112.

"కో, యిలల యెలుంగు లోలిఁ గొని యింపుగఁ జిల్కలతోడ నెమ్మి మై, నలవడి మాటలాడి యళు లాలతి సేయఁగఁ బాడి దాగురిం, తలు హరితోడ నాడుదురు తద్వనవీథులయందు గోపికల్."
హరి. పూ. 8.35.

**ఆళులపొల్లులు**

ఆడు పోడుములు, స్త్రీ రీతులు.

"పాడవు నూడ మగల పొల్లలు నాళుల పొల్లలును నిజంబుగాలె నుండు."

కుహూ. 11.46.

చూ. మగలపొల్లలు.

**ఆవంత**

కాసంతో, కొంచెం అనుట.

"ఆవంత శంక లేక."

భార. కర్ణ. 3.288.

**ఆవగింజలో అరభాగమైనా**

ఏకొంచెం కూడా.

"ఆవగింజను నరభాగమైనఁ గాదు."

పాణి. 2.11.

**ఆవగింజలో అరసగము కాలేదు**

కొంచెము కూడా కాలేదు.

ఆవగింజ అతి చిన్నది.

"ఇంకా ఆవగింజలో అరసగం కూడా కాలేదు. అప్పుడే ఏదో కొంప మునిగి పోతుందని గోల పెడతా వేమిటోయి!"

వా.

**ఆవటము చేయు**

అమర్చు, పొందుపఱచు.

"వరదాభయంబు లావటము చేసి."

పాండు. 2.229.

**ఆవడ**

పెరుగువడ.

**ఆవ తాగిన పసరమువలె**

పిచ్చెత్తినట్లు అనుట.

చూ. ఆవ ద్రావినట్లు.

**ఆవ దిన్నట్లు**

కడుపులో ఆవాలు పోసుకొన్నట్లు.

ఎక్కువ దిగులునూ శోకాతిరేకాన్నీ తెలియజేసే పలుకుబడి.

"ఆవ దిన్నట్లు ఖేదావహం బయ్యె."

వర.రా.అయో. పు. 330. పంక్తి 6.

**ఆవ ద్రావినట్లు**

కడుపులో చేయి వేసి కలచినట్లు.

ఆవాలు నూరి త్రాగితే కడుపులో విపరీతమైన ఆరాటం కలుగుతుంది.

"ఆవ ద్రావిన శోక నటునటిల్లు."

రాధి. 3.120.

చూ. ఆవతాగినపసరమువలె.

**ఆవల నీవలన్**

అక్కడక్కడా, అక్కడా యిక్కడా.

వాడుకలో అక్కడా ఇక్కడా అనేరూపమే నిలిచి ఉంది.

"ఏ సావల నీవలన్ విని." విక్ర. 5.15.

"వాడేదో బాగా సంపాయించాడని అక్కడా యిక్కడా అంటూండగా విన్నాను." వా.

**ఆవలింపులు వచ్చు**

విసుగెత్తు.

"వాడి ఉపన్యాసం వింటూంటే నాకు ఆవలింపులు వస్తున్నాయి." వా.

చూ. ఆవులింతలు వచ్చు.

ఆవలిమో మిడు

అయిష్టమును సూచిస్తూ మాఱు మొగము పెట్టు.

"ఆవలిమో మిడి తాఁ గ్రోలె."

విప్ర. 2.63.

చూ. మాఱుమో మిడు.

ఆవిడ

భార్య; ఆమె.

"మా ఆవిడ దీనికి సుతరామూ ఒప్పుకోవడం లేదు." వా.

"మీ ఆవిడగారో చెప్తాను ఉండండి. మీ రేమో మహా ఖుస్సు పెట్టేస్తున్నారు." వా.

"ఆవి డెవరు ?" వా.

ఆవుగోవు

సాధువు.

"ఆయన దేముంది పాపం ! ఆవుగోవు."

ఆవును చంపి చెప్పులు దానం చేయు

అల్పమైన మంచిపని కోసం మహాపాపానికి ఒడిగట్టు.

"వాడు ఆవును చంపి చెప్పులు దానం చేస్తాడు. ఏమి లాభం ?" వా.

ఆవురు మను

వాపోవు.

కా త. 303.

ఆవుర్న నోరు తెఱచు

ఆవురు మని నోరు తెఱచు.

క్రీడా. పు. 73.

ఆవులాంటివాడు

సాధువు.

"ఆయన కే పాపం తెలియదు. ఆవులాంటివాడు." వా.

ఆవులింతలు వచ్చు

నా. ఆవలింపులు వచ్చు.

ఆవులిస్తే ప్రేవులు లెక్కపెట్టగల

అతిసూక్ష్మబుద్ధి అయిన; ఎదుటివాని సత్తాసారం గ్రహించగల.

"వాడు ఆవులిస్తే ప్రేవులు లెక్క పెట్ట గలవాడు. వాడిదగ్గర మన ఆట లేవీ సాగవు." వా.

ఆవులు తలచినచోట పూరి మొలిచినట్లు

చక్కని సౌకర్యం ఏర్పడిన దనుట. ఆవులు మరొక చోటికి వెళ్ళకుండా తాను కున్న చోటనే పచ్చిక మొలిస్తే మఱింకేమి ?

పండితా. ప్రథ. పురా. పుట 387.

ఆవులువారు

అలసిపోవు, ఆవులింతలు వచ్చు స్థితికి వచ్చు.

"ఆవులువారెడిమేని అలుపులతోడ."

తాళ్ల. సం. 3.403.

ఆవేశకావేషాలు

కోపోద్రేకాలు. జం.

"ఆవేశకావేషాలు పెచ్చుపెరిగి ఆఊళ్లో ఖూనీలు జరిగాయట." వా.

ఆశకు మట్టు లేదు

ఇంత ఆశ అయితే ఎలా అను పట్ల ఉపయోగించే పలుకు బడి.

బాణాల. కాశ. 10.

ఆశపాతకం మనిషి

దురాశాపరుడు.

"వాడు ఒట్టి ఆశపాతకం మనిషి. ఏమిచ్చినా వానికి తృప్తి అనేది ఉండదు." వా.

ఆశాశల ద్రిప్పు

అటు ఇటు, ఇటు అటు త్రిప్పు; ఆశ పెట్టి త్రిప్పు.

"ఏయ విచారించిన దూఁటి దాటుకొని త న్నాశాశలం ద్రిప్పి." కా.మా. 3.60.

ఆషాఢభూతి

హితవంచకుడు.

అమాయకంగా కనబడుతూ ద్రోహం చేసేవాడు.

పంచతంత్రంలోని కథపై వచ్చినపలుకుబడి.

ఆషామాషీ

కులాసాకబుర్లు.

"ఏదో ఆషామాషీగా మాట్లాడుకొంటూ ఉంటే నీ ప్రస్తావన వచ్చింది. నే నేదో ఒక మంచిమాటే వేశాను మరి!" వా.

ఆసపడు

ఆసించు.

"అతని నాసపడి పలుకుచుండిరి." భార. ద్రోణ. 1.17.

"పరకాంతలకు నాసపడనివాఁడు." జైమి. 3.40.

ఆసవిఱుపు

ఆశాభంగము కలుగజేయునది.

"యాచకకోటుల కాసవిఱుపు." శుక. 3.20.

ఆస సేయు

ఆశించు.

"వెండియుం గడుసరి దానవులు మిసిమి గలపసిఁడి కాసచేసి పడఁద్రోసి గాసిం బఱచినప్రాసాదంబులును." ఉ. హరి. 1.53.

"అల్లనఁ జెనులింప నాస సేయుటయు." గౌ. హరి. ప్రథ. పంక్తి. 978.

ఆసాస నత్తాడు

మిక్కిలి ఆశతో వేకారు.

"పరువంబు గాక చొప్పడని మామిడి తేనె, లాన నాసాస నత్తాడునవియు!" పారి. 3.51.

ఆసాసల

ఎక్కువ ఆశతో.

ఈ ద్విరుక్తి ఆధిక్యమును తెలుపును.

"బ్రమసి యాసాసల రసవాదము లొనర్చి, ప్రకటించి రాజపట్టికలు దీర్చి." శుక. 3.372.

ఆసాంతము

పూర్తిగా.

"అవల నెత్తివత్తు రాసాంత మూడ్చురు." నాయకు. పు. 108.

అసీమాంతం చేయు

సాగనంపు.

పొలిమేరదాకా సాగనంపే అలవాటుపై వచ్చినపలుకుబడి.

ఆసువోసిన కండెవలె

ఒకచోట నిలువక.

ఆసువోసిన కండె అటూ ఇటూ ఆగకుండా తిరుగుతూ ఉంటుంది.

**ఆసు వోసెడుదాని హస్తంబురీతి**

ఒకచోట నిలువక.

నేతపనిలో ఆసు పోయునప్పుడు చేయి అటూ ఇటూ గబగబా తిరుగుతుంది.

"ఆసు వోసెడుదాని హస్తంబురీతిని, గుంచె దీసెడుదాని కొమరు మిగుల."

హంస. 1. 220.

చూ. ఆసు వోసినకండెవలె.

**ఆసేతుశీతనగం**

చూ. ఆసేతుహిమాచలం.

**ఆసేతుహిమాచలం**

సేతువు మొదలుకొని హిమవత్పర్వతంవరకూ. యావద్భారతదేశంలోను అనుట.

ఇదే పలుకుబడి ఆయా పదాల పర్యాయపదాలతో కూడా మన కావ్యాలలో ప్రయోగిస్తారు.

చూ. ఆసేతుశీతనగం.

జం.

**ఆస్తిపాస్తులు**

"వానికి ఆస్తిపాస్తు లేమీ లేవు. ఆ ఉద్యోగం ఉంది. వాడున్నాడు." వా.

చూ. ఆస్తీ పాస్తీ.

**ఆస్తీ పాస్తీ**

ఆస్తి. జం.

"వాడికి ఆస్తా పాస్తా ? ఏమీ లేదు."

"వాడి కింత ఆస్తీపాస్తీ ఉంది. తాను తినగలడు. ఒకరి కింత పెట్టగలడు." వా.

**ఆస్థాన మగు**

ఉండు; కొలువుండు.

"సువర్ణ స్తంభయుత సౌధంబు గాంగ నాస్థాన మై."

పాండు. 1.21

**ఆహా పుట్టజేయు**

ఆశ్చర్యము కలిగించు.

"ఆహా పుట్టఁ జేయంగ."

హర. 6.100.

**ఆహా పుట్టు**

ఆశ్చర్య మగు.

"ఆహా పుట్టెడు లాఁతి చూపఱకు హాహా పుట్టు మీవారికిన్."

భార. శల్య. 2.248.

**ఆహా వుట్టిపడు**

ఆశ్చర్యపడు.

"పౌరకమలేక్షణ లాహా వుట్టి పడిన యట్లన్, దేవునిఁ గన మఱచి యి ట్లనిరి తమలోనన్."

శుక. 2.16.

**ఆహిపెట్టు**

కుదువపెట్టు; తాకట్టు పెట్టు.

తాళ్ల. సం. 10.142.

**ఇంక ఎక్కడ ?**

ఇంక వారి ప్రస్తావనకే ఆస్కారం లేదు అనుపట్ల ఉపయోగిస్తారు.

"కటకటా ఇంక నెక్కడ చోడనృపతి, కటకటా యింక నెక్కడి వెలనాడు."

పండితా. ద్వితీ. మహి. పుట 51.

"వాన రాలేదు. ఇం కెక్కడిపంటలు." వా.

చూ. ఇంకేమి ?

**ఇంక నా చేత గాదు**

ఇకమీఁద నాకసాధ్య మనుట.

"నా చేత నింకఁ గా దిది యోఁ చెలువుడ యనఁగ." కళా. 1.201.

"ఇంతదాకా ఏదో చేస్తూ వచ్చాను గాని యింక నాచేత కాదు." వా.

**ఇంకబాఱు**

ఇంకిపోవు.

"పారావారస్స్రు లింకఁ బాఱిన." భాగ. 8.595.

**ఇం కేమి?....**

ఇం కెక్క-డ?

ఇక అది అసంభవ మనుట.

"సాయంత్ర మయింది. వా డిం కేం వస్తాడు?" వా.

"మబ్బు పట్టింది. ఇం కేం వెడతాం." వా.

"కరువు వచ్చింది. ఇం కేం నిభాయిస్తాం?" వా.

చూ. ఇంక ఎక్కడ?

**ఇం కేమైనా ఉందా?**

చాలా ప్రమాద మనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"వీడు నోటికి వచ్చినట్లు వాగుతున్నా డేఁ? అది ఆయనకే తెలుసుం దనుకో. ఇం కేమైనా ఉందా?" వా.

**ఇంగితజ్ఞుడు**

ఎదిరి మనసు నెఱుగగల వాఁడు.

"వాడు ఏమైనా ఇంగితజ్ఞుడు. మన వాడికే ఇంగితజ్ఞానం లేదు." వా.

**ఇంగిలాయి.**

శుంఠ, తిట్టు.

"ఇంగిలాయలు కొంటె కోణంగు లైన." ప్రభా. నాట. 5.

**ఇంగిలాయి**

చేపలలో ఒక భేదము.

**ఇంగువకట్టిన గుడ్డ**

ఏమీ లేక పోయినా వెనుక బాగా బతికినవారిలో ఎంతో కొంత ఔదార్యం, ఉత్తమత ఉంటుం దని అనేపట్ల ఉపయోగించేపలుకుబడి.

ఇప్పు డందులో ఇంగువ లేక పోయినా, యింగువ కట్టినగుడ్డకా వాసన ఉంటుం దనుటపై యేర్పడినపలుకుబడి.

"వాళ్ళ సంసారం ఎంత చితికిపోయినా యిప్పటికీ అతిథీ అభ్యాగతీ అంటూ వస్తే పొమ్మనరు. ఎంతైనా ఇంగువ కట్టినగుడ్డ వాళ్ళకుటుంబం." వా.

**ఇంచి మంచి పెట్టు**

అవీ యివీ యిచ్చు (మంచి చేసుకొను)

ఇంచిమంచి–ఒక తినుబండము అని వావిళ్ల.

"దాసితోడ మాలిమి యొనర్చుకొని యించిమంచి పెట్టి." శుక. 3.295.

**ఇంచుకంత**

కొంచెము.

"ఇంచుకంత నిక్కిన." ఆము. 5.116.

**ఇంచుకవడి**

కొంచెము సేపు.

**ఇంచుటలుక**

ప్రణయకలహము.

కవిక. 1.21.

**ఇంచుమించుగా**

రమారమిగా, కొంచెము హెచ్చుతక్కువగా.

"వానికి ఇంచుమించుగా పదేళ్లు ఉంటాయి." వా.

"ఆవూరికీ యీవూరికీ యించుమించుగా పదిమైళ్లదూరం ఉంటుంది" వా.

**ఇంచుమించు లాడు**

హెచ్చుతక్కువగా మాట్లాడు. లక్షణయా తిరస్కరించు.

"ఇంచుమించు లాడు నించుమించు."

విజయ. 1.36.

**ఇంచులాడి**

కులుకులాడి.

"ఏమి కన్నీరు నించెదే ఇంచులాడి."

కాశీ. ద. 2.66.

**ఇంట దయ్యమువలె నుండగ**

ఇంత మనిషిని ఇంట ఎదుట ఉండగా నాకన్నె కప్పి ఇంత పని చేస్తావా?—అన్న భావంలో ఉపయోగించే పలుకుబడి.

"ఇర్వ్యేడ గలిగిన రోవెల, యియ్యక నా కెఱుక లేక యిటు నే నింటం, దయ్యమువలె నుండఁగ నా, తొయ్యలితో......" శుక. 3.35.

"దయ్యంలాగ అత్త యింట్లో ఉంటే దానిష్టంగా అది చేస్తున్నది." వా.

"దయ్యంలాగ నే నింట్లో ఉన్నాను గదా. నాతో ఒక మాట అనవద్దా." వా.

**ఇంట గుడిచి యింటి వాసాలు లెక్కించు**

ఉపకారికే అపకారము చేయు.

ఒక కథపై వచ్చిన పలుకుబడి. ఎవరో ఒకణ్ణి ఆదరించి అన్నం పెట్టి యింటిలో ఉంచుకోగా, వాడా యిల్లు నాదే అన్నాడట. దానికి సాక్ష్యమేమి టంటే యీ యింట్లో ఎన్ని వాసాలున్నాయో నాకు తెలుసు అన్నాడట.

"రాక రాక వచ్చె రాజు శిష్యుఁడు నని, గారవింప సపరివారుఁ డగుచు, నింటఁ దిని గణించె నింటివాసను లిట్టు, లేటి శిష్యు లింక నేటి గురులు?"

త్రిశంకుస్వర్గం. అం. 2. పే. 15.

**ఇంట నెన్నడు లేని**

వంశములో లేని.

"ఇంట నెన్నఁడు లేని యీ హీనవిద్య, యెన్నఁ డభ్యాస మాయెరా కన్న తండ్రి!" నిరం. 2.83.

"ఇలాంటిది మాయింట్లో ఎన్నడూ లేదు." చూ. ఇంటా వంటా లేదు.

**ఇంట పోయి రాజదు**

తిండికి లేదు. ఉండి పోయ్యి రాజితేనే గదా తిండి.

"దినదినము ననక యే వన, మున నేగక యున్న నింటఁ బ్రొయి రాఁజదు గా."

శుక. 3.251.

**ఇంటాతడు**

మగడు

"మా యింటాతఁ డెపుడైనఁ గలసిన నాతని గాఁ దలంతు." అహల్యా. 3.58.

చూ. ఇంటియాతఁడు; ఇంటాయన.

**ఇంటాయన**

మగడు.

"మా యింటాయన ఊళ్లో లేదు." వా.

చూ. ఇంటాతడు.

**ఇంటావిడ**

ఇల్లాలు

ఇది కోస్తాప్రాంతంలో విని పించేమాట.

"మా యింటావిడకు శాస్తి సుస్తీ చేసింది." వా.

**ఇంటా వంటా లేదు**

ఈ వంశంలో యిలాంటి అల వాటు లేదు, ఇలాటి దుర్గు ణాలు వీరికి బొత్తిగా లేవు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"పైచు పెట్టు లీఁక నింటఁగా వంట లే విప్పనుల్." పాణి. 5.3.

"ఇలాంటి వెధవపనులు మా యింటా వంటా లేవు. వీడు మాయింట్లో చెడ బుట్టాడు." వా.

రూ. ఇంట నెన్నడు లేని.

**ఇంటికంటె గుడి భద్రము**

సొంతం దానికన్నా తిరె పెంగా వచ్చినదే హాయి—అని సూచించేపలుకుబడి.

"వానికి అత్తారిల్లే బాగుందిట. ఇంటి కంటే గుడి భద్రం అన్నారు." వా.

**ఇంటికన్న గుడి పదిలము**

సింహా. నార. 2.

చూ. ఇంటికంటే గుడి భద్రము.

**ఇంటికాపు**

గృహస్థు.

**ఇంటికి కాక పోవు**

ఇంటిపట్టున ఉండక పోవు, ఇంటికి పనికి రాక పోవు. సాంబనిఘంటువులో ఇంటికి కాకపోవుట అనగా ముట్టగుట అని ఉన్నది. ఇది నేడు ఇలా వాడుకలో ఉన్నట్టు కన బడదు.

"ఉన్న ఒక్కకొడుకూ యింటికి కాకుండా పోయాడు." వా.

"ముగ్గురు కొడుకు లుంటే ముగ్గురూ మూడు ఊళ్లల్లో ఉద్యోగాలు చేస్తూ ఒక్కడూ యింటికి కాకుండా పోయాడు." వా.

**ఇంటికి నిల్లు గట్టుకొని యేగు**

ఇంటిల్లిపాదీ పోవు.

కుటుంబపరివార సమేతముగా నను‌ట.

"ఇంటికి నిల్లు గట్టుకొని యేగఁగ వచ్చు మురారివెంట నా, యింటికి వచ్చి పూజ గొని యేఁగుట నన్నుఁ గృతార్థుఁ జేఁత." కళత్ర. 2.4.

**ఇంటికుక్కలు**

దాసులు, బానిసలు, ఆశ్రి తులు.

"ముక్కంటి నీయింటికుక్కల మనుచు. జక్కులు గిక్కులు మ్రొక్కుచుఁ గొలువ." బసవ. 4 98.

**ఇంటికొస్తుందా వాకిటికొస్తుందా?**

దానివల్ల ఏమీ లాభం లేదు అనేఅర్థంలో ఉపయోగించే పలుకుబడి.

"వాడితో తగాదా యెందుకు రా? ఇంటి కొస్తుందా? వాకిటి కొస్తుందా?" వా.

**ఇంటిగుట్టు**

కుటుంబంలోని ఆంతరంగిక వ్యవహారాలు.

"ఇంటిగుట్టు రచ్చ కెక్కఁ దొడఁగె." నాయక. పు. 102.

"వాళ్ల యింటిగుట్టు ఎవరికీ తెలియకుండా పెట్టుకొని వస్తున్నారు." వా.

**ఇంటిచాయల్లో**

ఇంటి చుట్టుపట్టుల.

క్రొత్త. 31.

**ఇంటితనం**

కులీనత.

మర్యాద గలకుటుంబ మనుట.

"వాళ్ల యింటితనం మంచిది." వా.

**ఇంటితనస్థుడు**

మర్యాద గల కుటుంబానికి చెందినవాడు.

"వాడు చాలా ఇంటితనస్థుడు." వా.

**ఇంటిదొంగ**

ఇంటిలోనే ఒకడుగా ఉంటూ దొంగతనం చేసేవాడూ, పరాయిగా ప్రవర్తించేవాడూ.

"ఇంటిదొంగను ఈశ్వరు డైనా పట్టలేడు." సా.

**ఇంటిపట్టు**

స్థావరము.

"పసుపుని గ్గులు బేలు సాఁపజన్నిద మొప్పఁ, బ్రమథాధిపతి యింటిప ట్టైతిం గె." మను. 2.11.

"ఒక్కక్షణం యింటిపట్టున ఉండే వాడు కాదు గదా. వీడు పెండ్లి కాగానే చూచావా?" వా.

**ఇంటిపట్టు ఎఱుఁగు**

ఒక చోట స్థిరముగా కాపుర ముండుటకు అలవాటగు.

"ప్రమథాధిపతి యింటిప ట్టెఱింగె." మను. 2.11.

**ఇంటిపనులు నూఱు నటు వెట్టు**

సొంతపనులు ఎన్ని ఉన్నా మానివేసి మఱొకదానికై పోవు.

"ఇవ్విధంబునఁ జలిదీఱ యింటిపనులు, నూఱు నటు వెట్టి వల్లభునోరుఁ గొట్టి." శుక. 3.350.

**ఇంటిపాప**

దాసి.

శ.ర.

**ఇంటిపేరు**

వంశనామము.

"ఇంటి పే రడిదమువార్." సూరన.

**ఇంటిపేరు కస్తూరివారు**

పేరు గొప్ప ఊరు దిబ్బ అన్నట్లు. ఒక సామెతలోని భాగం.

"ఇంటిపేరు కస్తూరివారు ఇల్లంతా గబ్బిలాల కంపు." సా.

"ఆఁ. వాడు పుట్టుశాస్త్రులే కాని పెట్టు శాస్త్రులు కాదంటారు. వాణ్ణి శాస్త్రులనడం ఇంటిపేరు కస్తూరివారు అన్నట్లే." వా.

**ఇంటిపైకి తెచ్చుకొను**

ఎక్కడిదానినో తానై తన మీదకే తెచ్చుకొను.

"మింటిపయి నుంటగా దని యింటిపైకిఁ, దెచ్చుకొంటి నటంచుఁ జెన్ టెచ్చ వెడలు." ఆము. 5.146.

**ఇంటిబంటు**

సేవకుడు.

"దర్పకు నేలెదె యింటిబంటుగన్." శకుం. 2.91.

**ఇంటిబల్లియు చౌక సేయు**

ప్రతివారికీ చులకన యగు.

"ఇల్లిల నుండ నింటం, బల్లియు ననుఁ జౌక సేయుం బలుకులు విన రే, యెల్లెడ లోకములో మగఁ, డొల్లని యాసతిని మారి యొల్ల దనంగన్." శుక. 2.64 పే.

**ఇంటిబిడ**

దాసి.

వేంకటేశాంధ్రము.

**ఇంటిమగడు**

భర్త.

"ఇంటిమగనిఁ జూచి యిల్లాలుగుఃఖించి, వెంట విటునిఁ దగిలి వెతలఁ బడును." వేమన.

**ఇంటియతడు**

మగడు.

"మా యింటియతని కాస పుట్టింప." శుక. 2.111.

చూ. ఇంటాతడు; ఇంటాయన.

**ఇంటియాతడు**

మగడు. ఇంటాయన అని నేడు వినిపిస్తుంది.

"కాంతకు మానరక్షకుఁ డింటియాతండు." శృంగా. శకుం. 4.82.

"మాయింటాయన ఊళ్లో లేరు." వా.

చూ. ఇంటాతడు; ఇంటాయన.

**ఇంటియాలు**

ఇల్లాలు.

"ఇంటియాలి విడిచి యిల జారకాంతల వెంటఁ దిరుగువాఁడు వెఱ్ఱివాఁడు." వేమన.

**ఇంటి యెనుబోతునకంటె మదంబు హెచ్చు**

బాగుగా క్రొవ్వి యుండు ఎనుపోతు (దున్న) ను పనీపాటా లేక పనికి రాక కొవ్వెక్కి ఉన్నవారితో పోల్చడం పరిపాటి.

ఇంటి యెనుబోతు తిండి తిని మరింత బలిసి ఉంటుంది.

"ఒకానొక, కైన గర్భముం బాదలని దాట యింటి యెనుఁబోతునకంటె మదంబు హెచ్చి." హంస. 5.24.

"వాడు దున్నపోతులాగా ఉన్నాడు." వా.

**ఇంటివాడు**

కులస్థుడు, వంశీకుడు.

వాడుకలో – మీారు ఏయిళ్ల వాళ్లు నాయనా! అనగా ఏ కులస్థులు అనే అర్థంలోనే

యిప్పటి అలవాటు.

"పాకనాటింటి వాడవు."

భీమ. 1.23.

ఇంటివారిని లేపి యీవల దొంగ బంటుకు చే యిచ్చు

విశ్వాసద్రోహం చేయు.

ఇంటివారితో ఉన్నట్లే ఉండి దొంగకు సాయపడు కపటి అనుట.

నగళ్లలో కొలువు—దొంగళ్లలో ఒళుపు అనుసామెత వంటిది.

"ఇంటివారిని లేపి యీవల దొంగ, బంటుకుఁ జే యిచ్చుపాపాత్ముఁ రాల !"

గౌర. హరి. ద్వి. 984.985.

ఇంటిలో దీపం పెట్టు

పడిపోతున్న సంసారాన్ని నిలబెట్టు.

"ఆయన మా యింట్లో దీపం పెట్టిన మహానుభావుడు."

వా.

ఇంటిలోన గుంఁడ్రించుచున్న కడుపు నిండునె?

నిర్వ్యాపారంగా ఉంటే పొట్ట గడవదు అనే సందర్భంలో ఉపయోగించే మాట. ఈ సందర్భంలోనే గోళ్లు గిల్లుకొంటూ కూర్చుంటే ముందు కెలా వస్తుంది అంటారు.

"నీవు మతి యింటిలోన గుంఁడ్రించు చున్నఁ, గడుపు నిండునె దొరఁ జేరి గ్రాస మడుగు."

శుక. 2.371.

ఇంటిలో నేదుము ల్లగు

పక్కలో బల్లెం అగు—అనుట.

"ఎలసి యేప్రొద్దుఁ గను వొంద నీక మరుఁడు, కలహమున కంకకాఁ డయి కాలు ద్రవ్వఁ, బాండుబహుళ క్షపా పరంపరలు వెడల, నింటిలో నేదుము ల్లయ్యె నిందుముఖికి." ఆము. 5.84.

ఇంటిలో పోరు

అనుక్షణ బాధాకరము

తాళ్ల. సం. 12.198.

ఇంటిలో భద్రము

జాగ్రత్తగా ఉండు.

ఎవరైనా పెద్దవారు పయనమై పోవునప్పుడు ఇంటిలో ఉన్నవారితో చెప్పుమాట. చిన్నవారు పోవునప్పుడు కూడా పెద్దలుఇట్లే 'భద్రంగా వెళ్లు' అంటారు.

"పయన మెఱిఁగించి యింటిలో భద్ర మనుచు."

హంస. 110.

"ఎల్లుండి వస్తాను. ఇంట్లో భద్రం నాయనా!"

వా.

ఇంటిల్లిపాది

కుటుంబంలోని అందరూ.

"వాళ్లు పెళ్ళికి యింటిల్లిపాదీ వెళ్లారు."

వా.

"ఆ పెళ్లికి మేం యింటిల్లిపాదీ వెళ్లాము."

వా.

ఇంటివాడు

1. గృహస్థు.

2. వంశీకుడు.

"ఇంటివాఁ డన గృహస్థున కగు."

సాంబ.

"పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు.

భీమ. 1.23.

**ఇంటివేల్పు**
కులదైవము.
చూ. ఇలవేల్పు.

**ఇంటిశుద్ధి ఇల్లాలిశుద్ధి**
ఇల్లాలి పరిశుభ్రత యింటి పరిశుభ్రతవల్లనే తెలియుననుట.
"ఇంటిశుద్ధో యిల్లాలుశుద్ధో అన్నారు. ఆ అమ్మాయి యిల్లు అద్దంలాగా పెట్టుకుంటుంది." వా.

**ఇంటిసాలు**
ఇలువడి; సంప్రదాయం.
"వాళ్ల యింటిసాలు మంచిది కాదు." వా.

**ఇంట్రపడు**
సమ్మర్దమగు.
"ఇంట్రపడ కుండఁగా నిల్పె నెడము లిచ్చి." హరి. ఉ. 9.144.
చూ. ఇంట్ర మగు.

**ఇంట్ర మగు**
సందడి యగు.
"ఎదురుగా నేగుదెంచుచో నింట్ర మయ్యెఁ, బెండ్లి యిరువంక చుట్టంపుఁ బెద్దలకును." నైష. 6.84.
చూ. ఇంట్రపడు.

**ఇండె గట్టెడిది**
పూమాల గట్టునది.
ఇండై. తమిళం — ఇండె. కన్నడం.

**ఇండె వాయు**
చీలు.

**ఇండెవాలు**
బీటలువాలు.

**ఇండ్ల నెత్తినదీపశిఖలు**
ఇండ్లపై నిలిపినదీపాలు.
"వెలఁది యిచ్చటి సంపెంగ విరులు గహన, దేవతలయిండ్ల నెత్తినదీప శిఖలు." మను. 3.76.

**ఇంత అంత యని**
ఇంతుంది అంతుంది అని— చెప్ప లేము. అనగా అత్యధిక మనుట.
"నలుగడ నింత యంత యని నాలుకఁ జెప్పఁగఁ బెద్ద..." కుమా. 11.15.

**ఇంత అంత అని పేర్కొన రాదు**
చెప్ప లేనంత యెక్కువ అనుట.
"ప్రేమ మదింత యంత యని పేర్కొన రాదు." విజయ. 1.189.

**ఇంతగా నోచితి**
నేను చేసుకొన్న పనులకు ఫలిత మిట్లు పరిణమించినది. అనగా నా కర్మ యిలా కాలింది అని నేడు అనడం వంటిది.
"ఇంతగా నోఁచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మొయి నున్నదాననో." పారి. 1.90.

**ఇంత గిల్లి పెట్టు**
కాస్త తుంచి యిచ్చు.
రామచం. 46.
"ఎదురుగా పిల్లవాడు ఉంటే యింత గిల్లి పెట్టనైనా పెట్టకుండా వాడు గారె లన్నీ తినేశాడు." వా.

**ఇంతకు దెచ్చెను**

ఇంత దుఃఖస్థితికి కారణమయ్యెను.

"తాఁ జెప్పవచ్చినవు లింతకుఁ దెచ్చెఁగా యంచు, మాను యే మన లేక మోము వంచు." శుక. 3.486.

**ఇంతకు నంత అయి అంతకు నింత అయి**

'అణోరణీయాన్ మహతో మహీయాన్' అన్న దాని కిది ప్రతిరూపము.

చిన్నలో చిన్న పెద్దలో పెద్ద అయి అనుట.

పాండు. 5.51.

**ఇంత కెత్తికొన్నాడు, ఇంకెంత కెత్తికో నున్నాడో ?**

ఇంత చేసినవాడు ఇం కెంత చేయ నున్నాడో ?

"ఇట్లింత, కెత్తికొన్నాఁ డింక నిట మీద నెంత, కెత్తికో నున్నాఁడో?" బస. 5.135.

**ఇంత చేయు**

ఇంత పని చేయు; చెప్పరానంత చెరుపు చేయు.

"అతివ యెవ్వతో యింత, చేసె ననుచు మమ్ముఁ జెండుఁ దొలుత." ప్రభా. 1.134.

"అది వచ్చి యింత చేసింది." వా.

ఆపల్కు ఇంత చేసెను అన్నప్పుడు.

ఆ మాట ఇంత ఉపద్రవము తెచ్చినది అని భావం.

"హృదయమున నిల్పి యూపలు కింత సేసె, ననుచు..." కళా. 3.220.

"అప్పు డెప్పుడో చూశాను తే అన్నాడు. ఆ మాట ఇంత చేసింది. గొంతుకు పట్టుకుంది." వా.

**ఇంత టంతట పొంచి యుండు**

అక్కడక్కడ దగ్గరలో దాగి యుండు.

"గాని చెలు లింతటంతటఁ బొంచి యుండ..." కళా. 4.61.

**ఇంతట నంతట**

సామాన్యంగా; చూ. అ కే.

"ఇంతుల నేచు పాతక మ దింతట నంతటఁ బోదు—" వసు. 4.28.

"ఇంతట్లో అంతట్లో తీరే కష్టాలు కావమ్మా యివి!" వా.

**ఇంతటిలో పతి పాటిపోవడు**

ఇంతలోపల అయ్యే కార్య మేమీ చెడదు అనుటలో ఉపయోగిస్తారు. ఇది ఎన్నో వాక్యాలలో కనబడుతుంది— 'ఇంతట్లో ఆ వచ్చినవా డేమీ పారిపోడు లేవే?' 'తల దువ్వుకోకపోతే ఆ వచ్చిన వాడు (మగడు) పారిపోతాడా?' అని వయ సయినపిల్లలను హాస్యం చేస్తారు.

"ఇందుల కొక్క గాఢ గల దింతటిలోఁ బతి పాటిపోవఁ డో యిందునిభాననా! వినుము..." శుక. 2.99.

**ఇంతనాటినుండి**

చిన్నతనమునుండి.

"ఏ నింతనాఁటినుండియు మానవతుల లోన నింత మానవతిని సై..."

శుక. 1.134.

"వాడు ఇంతవాడుగా ఉన్నప్పాటు చూచాను."

"వాణ్ణి ఇంతనాటినుంచీ నే నెఱుగుదును."

"ఆ పిల్ల యింతనాటినుంచే మాటకారి." వా.

**ఇంతనె ముగిసెనే?**

ఇంతలోనే అయి పోయిందా? అయి పోలేదు అనుట.

"ప్రభావతి వివర్ణ ముగువదనముతోఁ, గనుపట్టుడు నింతనె ముగి, సెనె కార్యం బేల యింత చింతిల ననుచుఁ."

ప్రభా. 3.92.

**ఇంత పాటులు పడి**

ఇంత అవస్థ పడి.

"ఇంత పాట్లను బడి కన్న యీ మిత్ర మహిమకుఁ..." కళా. 3.108.

"ఇన్ని పాట్లు పడి వీళ్లను సాకితే పెద్దవాళ్లు అయ్యాక నన్ను ఏం చేస్తారో యేమో?" వా.

చూ. ఇన్ని పాట్లు పడి.

**ఇంత పిలిచి పెట్టు**

ఆదరించు.

రామచం. 10.

"ఎదురుగనే ఉంటాను గదా! ఆవిడ యింత పిలిచి పెట్టిన పాపాన పోలేదు." వా.

**ఇంత మసి మోవక**

ఇంత దుమ్ము కొట్టక.

"వారిలో మెుగ దగువాని కింత మసి మోవక త్రుంగుట యెట్లు సైన్యముల్." జైమి. 2.43.

'వాడు ని న్నన్నిమాటలని అంత అవమానం చేస్తే వాడి మొహాన ఇంత మసికొట్టకుండా ను వ్వెట్లా వచ్చావు?' వంటి పలుకుబడులలో కాన వచ్చే భాగమే యిది.

**ఇంతమాత్ర**

చాల స్వల్ప మనుట.

"ఇంతమాత్ర సుఖంబున కేల..."

దశా. 3.90.

ఈపాటి ఈమాత్రం అని కూడా నేటి అలవాటు.

"ఇంతమాత్రానికే అంత మిడిసిపడితే ఎలా నే." వా.

**ఇంతమాత్రము**

చూ. ఇంతవట్టు.

**ఇంతమాత్రాన**

ఇంతమాత్రానికే.

"నీ కింతమాత్రాన విన్నంబడ నేల పోదు నిదె." పారి. 4.62.

**ఇంతమాత్రము ఎఱుగంగ లేనా?**

ఇంతమాత్రము తెలియదా? ఏ కొంతో తనకు తెలుసు ననుట.

"నా సేవ చేయుచు నింతమాత్రము నెఱుంగఁగ లేన..." కళా. 5.45.

"నే నిన్నాళ్లనుంచీ పత్రికలు చదువుతున్నాను. ఎంత రైతు నైనా హిట్లరు

తెలుగుదును. నా కింతమాత్రం తెలి యదా ?" వా.

**ఇంతమాత్రమె కాదు**

ఇంతే కాదు...

ఏవైనా గుణాలను వర్ణించే టప్పుడు, మరికొన్ని చెప్పవల సినచోట యీ పలుకుబడిని ఉపయోగిస్తారు.

"ఇంతమాత్రంబె కాదు శ్రీమంతుఁడును నితాంతశుభవంతుఁ డగువసుమంతుఁ డలర." శుక. 1.178.

"అతడు ధనవంతుడు, విద్యావంతుడు. ఇంతే కాదు. ఉదారుడు." వా.

**ఇంతమొగము చేసుకొను**

చిన్నబుచ్చుకొను.

"రాగానే అతను లేచిపోయేసరికి తాను ఇంత మొగం చేసుకున్నాడు."

**ఇంత యం తనగ రాని**

ఎంతో చెప్ప వీలు లేని; అత్యధిక మైన.

"అంత నయ్యంతి యింత యం తనఁగ రాని, వంతఁ దన యంతిపురిఁ జేరి కంతునిశిత..." శుక. 1.236.

**ఇంత యింతగా కోసినా పాపం లేదు**

ఎంత శిక్షకైనా తగు నను పట్ల ఉపయోగించే పలుకు బడి.

"కోసిన నేమి పాప మగుఁ గోమలి నాలుక యింత యింతగా."
పారి. 4.12.

**ఇంతలింతలు**

చిన్నచిన్న.

"ఇంతలింతలు తునియ లై."
ఉద్యో. 3.117.

**ఇంతవట్టు**

1. ఇంతమాత్రము.

"ఇంతవట్టు తగఁ జేయుము."
భార. అర. 4.387.

"ఇంతవట్టు నిజంబు."
భార. ఉద్యో. 2.302.

వాడుకలో ఇంతమాత్రం అని వినిపిస్తుంది.

"నువ్వు అది అంతా చేయ నక్కర లేదు. ఇంతమాత్రం చేస్తే చాలు." వా.

"వాడు చెప్పిందంతా యేమో కానీ ఇంతమాత్రం నిజం. వాడు ఆ ఊరు వెళ్ళి వచ్చాడు." వా.

2. ఇంతవఱకు – ఇంతకాలం.

"ఇట్టి నీవు సుట్టము వై యింతవట్టు, వారిలో నున్నవాఁడవు వారిజాక్ష !"
హరి. పూ. 7 ఆ. 233 ప.

చూ. ఇంతమాత్రము.

**ఇంతవార మనుకొను**

గర్వించు.

"తరుణీ యేరికిఁ జెల్లునె, యరయఁగ నే నింతవార మనుకొన నిదిగోఁ..."
కళా. 1.179.

"మే మింతవార మని మిడిసిపడడం యేమంత మంచిది కాదమ్మా! కోడలా!" వా.

**ఇంతలు కన్నులు**

ఇంత విశాలములయిన కన్నులు.

"ఇంతలు కన్ను లుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర !"
మను. 2.41.

వాడుకలో చాలా రకాలుగా వినవస్తుంది.

'ఇంత మొగము చేసుకొన్నాడు.' 'ఇంత తింటాడు.' వీనిలో ఆ యింత తోపాటు చేయితో పరిమాణం చూపేవారు కావచ్చును. అందుకే ఆ యింత ఒకప్పుడు వైశాల్యాన్ని. అధిక్యాన్ని. మరొకప్పుడు తద్విరుద్ధ రూపాన్ని తెలుపుతుంది.

**ఇంతలేసి**

"ఋషుల పాలింటి వేయింతలేసి పనులు." కాశీ. 2.104.

"తలఁపం గూడునె యింతలేసి దొరలకా దైన్యంబు..."

భార. ఉద్యో. 2.302.

నా. ఇంతేసి.

**ఇంత సేయు**

ఇంతవరకూ తెచ్చు. ఈ స్థితికి తెచ్చు.

"కుబేరుఁ డేఁగె నద్దనుజుల నింత చేసిన విధాతకు గోడనఁబోవు చాడ్పునన్." ఉ. హరి. 1.42.

**ఇంతా అంతా**

ఇంతా అంతా, ఎంతని చెప్ప గలము అను పలుకుబడిలో వలె–కొంచెము కాదు, అధికము అని చెప్పుటకు ఉపయోగిస్తారు.

"ధన్యత్వము......ఇంతంత యన నావశంబె?"

పండితా. ప్రథ. పురా. పుట 272.

**ఇంతింత గాని**

ఎక్కువయిన, కొలదికి మీరిన అనుట.

"ఇంతింత గాని తమి."

సారం. 2.39.

**ఇంతిం తన రాక**

అపరిమితముగా, ఇంత అంత అని చెప్పలేనంత.

"అంతంతకు వైరాగ్యం, బింతిం తన రాక యొలమి నిగుడొత్తె."

విప్ర. 1.83.

**ఇంతింత యగు**

కొంతకొంత క్రమక్రమంగా పెరుగు.

"ఇంతింతై వటుఁడింత యై." భాగ.

**ఇంతింతలు**

మిక్కిలి చిన్నవి. స్వల్పములు.

"ఇంతింతలు గునియలు సేసె."

భార. విరా. 5.153.

"నా తపము పెంపుగ్ సూడ నింతింతలే..." ప్రబోధ. 2.22.

**ఇంతింతవారలు**

గొప్పవారు.

ఇంతలేసి పనులు, ఇంతలు కన్నులు – మొద. వానిలో వలె హస్తాది విక్రియలతో ఇంతంతవా రనుటలో వచ్చినది.

"ఇంతింతవారల కీశ్వరావసర, మింత దుర్ఘట మన్న నితఁ డెంతవాఁడు."
పండితా. ప్రథ. పురా. పుట. 379.

## ఇంతెందుకు

ఇది అంతా దేనికి ?

సారాంశం చెబుతాను అను పట్ల ఉపయోగించేపలుకుబడి.

"ఇంతెందుకు? నే రాలేను. రాను." వా.

## ఇంతేసి

ఇంత పెద్ద వైన అనుట.

"ఇంతేసి బలు ద్రాఁకు లెవ్వఁడు వేయించె." శృం. సా. 2.97.

"వాళ్ళింటి పెండ్లిలో ఇంతేసి లడ్లు వేశారు." వా.

చూ. ఇంతలేసి.

## ఇంద

"రా యింద కో తమ్మరతి నొల్లవేని." పండితా. 297.

"కరముల్ సాచి త మింద యింద మని." సారంగ. 1.50.

"యిందమనుచునిచ్చె." రామా. 6.198.

"ఇంద, ఇది తీసుకో." వా.

చూ. ఇందము.

## ఇంద కో

ఇంద, తీసుకో.

"రా యింద కో తమ్మరతి నొల్లవేని." పండితా. 297.

## ఇందడవు

ఇంత సేపు.

"ఇందడవు సెందుల నుండితి." మల్హ. 2.72.

## ఇందనుక

ఇంతదాకా, ఇప్పటివరకూ.

"ఇందనుకఁ బాదులు ద్రవ్వియు." విప్ర. 3.84

## ఇందము

ఇదిగో తీసికొనుము.

"బొమ్మ పొత్తిక లడిగితి కొమ్మ యింద, మనుచు నిచ్చె." భార. విరా. 5.30.

"కరముల్ సాచి తమిం ద యింద మని." సారంగ. 1.50.

## ఇందాక

ఇంతవరకు, ఇంతకుమునుపు.

"ఇందాఁక విశ్రమించితిని." భార. శల్య. 2.66.

"ఇందాక నే వెళ్ళాను." వా.

"ఇందాక వెళితే వాడు లేడు. వా.

## ఇందు

ప్రీంత వగు, రుచించు.

"పుక్కిటను నాజ్య మిందునే." వేంక. పంచ. 2.247.

"ఇందని యామునే."
యయాతి. 4.155.

"జిహ్వకున్ వంటక మిందునే." కాశీ. 1.108.

"నాకు పొద్దున్నే కాఫీ తాగితే యిందదు." వా.

"వాడికి అన్నం యిందడం లేదు." వా.

## ఇందునా అందునా

ఇహపరములలో.

"వాడు ఇందునా అందునా చెడ్డాడు." వా.

## ఇందుప్పు

సైంధవలవణము.

నేటికీ ఆయుర్వేద వైద్యులు ఇందుప్పు అనే అంటారు.

**ఇందు మోసము కలదే**

ఇందులో అన్యథాత్వం ఏమీ లేదు.

"మీ జనకుఁడు దొడ్డఁగినఁ జాలును, మునుముట్టిన వత్తు నిందు మోసము గలదే." ఉ. హరి. 4.40.

**ఇందు ర మ్మనుటయు నిల్లు సేకొనెదవు**

రమ్మంటే వచ్చి పీఠం వేస్తానంటావు.

ఇలాంటి పలుకుబడులు చాలా ఉన్నవి. వీనిభావార్థం కొంచెం అవకాశం ఇవ్వగా దానిని పరిపూర్తిగా ఆక్రమించుకొందు రనుట.

"అవ్వికచపంకజలోచన సాంథ యిందు ర, మ్మనుటయు నిల్లు సేకొనెద వదిర మత్పతి వచ్చువేళ." శుక. 3.196.

**ఇందు ర మ్మన్న నిల్లెల్ల గైకొనినట్లు**

ఆశ్రయ మివ్వగా అంతా అపహరించినట్లు.

"కామినీమార! వాఁడు నిక్కముగఁ జేసె, నిందు రమ్మన్నచోట నిల్లెల్లఁ గొనుట." శివల. 2.23.

**ఇందుల**

1. ఇందలి.

"ఇందుల తాత్పర్యము." భార. శాంతి. 5.17.

2. ఇక్కడికి.

"ఎందుండి వచ్చి తిందులకు." భార. ఆది. 4.23.

3. దీనికి.

"ఇందులకుఁ బొందుపడు ప్రత్యుత్తరంబుల." ఆము. 6.36.

4. వీనిలో.

"నీకు నెద్ది ప్రియ మిందులలో." జైమి. 5.133.

**ఇంద్రకోశము**

మంచె.

**ఇంద్రగోపం**

ఆరుద్రపురుగు.

**ఇంద్రచాపము**

ఇంద్రధనుస్సు.

"ఇంద్రచాపంబు వొడిచె." హర. 2.18.

**ఇంద్రజాలము**

మాయ.

"ఇంద్రజాల మీ దేహసుఖంబు." కవిరా. 1.32.

**ఇంద్రపదవి**

గొప్పది, ప్రాప్యము.

"తెగువయె యింద్రపదవి యనఁ, దగు బుద్ధి జనింపఁ బోలుఁ దరుణీ! నీకుఁ." హంస. 1.126.

**ఇంద్రభోగము**

గొప్పవైభవము.

"ఉర్వీపతి కింద్రభోగ మటు వేడ్క నొనర్ప ముఖాబ్జముం గడున్." కళా. 7.157.

**ఇంద్రుడు చంద్రుడు అను**

పొగడు.

"తా రెవ్వరి నొల్ల కొక్కటయి యింద్రుఁడు చంద్రుఁ డటంద్రు." ఆము. 5.56.

"కాస్త పలకరిస్తే ఇంద్రుడు చంద్రుడు అనడం వానికళ." వా.

**ఇంద్రుడు చంద్రుడు దేవేంద్రుడు అను**

పొగడు.

"ఎవడు పైనుంటే వానిని ఇంద్రుడు చంద్రుడు దేవేంద్రుడు అనడం వాడి కలవాటు." వా.

**ఇంపారగ**

బాగుగా.

"ఈ సువ్రతం బవళ్యము ముద మింపారఁగ జరుపుఁడు." రుక్మాం. 1.110.

**ఇంపిత మగు**

హిత వగు.

"నాకు వంకాయలు వంటి కింపితం కావు."
"ఆయి ల్లెంతో కంటి కింపితంగా ఉంది." వా.

**ఇంపెసలారు**

ఒప్పు.

**ఇంపొందు**

సంతోషించు.

"తెల్లం బౌను నింపొందఁగన్."
భాస్క. రా. యు. 401.

**ఇకఇకలు పకపకలు**

నవ్వుతూ తుళ్లుతూ ఉండుటనే నిరసనభావంతో అంటారు.

"వాడూ అదీ ఆ గదిలో చేరుకొని ఒకే యికయికలు, పకపకలు." వా.

**ఇక చాలు**

కట్టిపెట్టు, చాలించు.

"ఇక చాలు, ఊరుకో." వా.

**ఇక చెప్ప నేల?**

చెప్పవలసిన అవసరం లేకనే తెలుస్తున్న దనుట.

"చల మరిగాడ్పులం గలుగు చల్లదనం బికఁ జెప్ప నేటికిన్." విప్ర. 2.66.
"వాడి సంగతిక చెప్పాలా? దేవాంతకుడు." వా.

**ఇకమీద**

ఇప్పటినుండీ.

"ఈ రోజు క్షమించాను. ఇకమీద పది గంటలకు సరిగ్గా రావాలి." వా.

**ఇకిలించు**

పండ్లికిలించు.

కావ్యాల్లో ఇగిలించు గా నున్నా వాడుకలో ఇకిలించు అనే వినిపిస్తుంది.

"తగిలించుకొన్న పిమ్మట, నిగిలించు టెకాని కార్య మేమున్న దిక్?" శుక. 3.78.
"ఎదురుగా ఇకిలించడం వెనుక తిట్టడం వాని అలవాటు." వా.

చూ. ఇగిలించు.

**ఇక్కట్టు**

ఇబ్బంది, ఇఱుకు.

"ఎందుఁ జనఁగ రాని యిక్కట్టు ప్రాప్తించె." కృష్ణ. 3.43.
"ఇక్కట్టు త్రోవల నెగు రైన."
దశా. 8.214.

**ఇక్కడక్కడ వడు**

చెల్లాచెదర రగు, నిలువరము లేక బాధపడు.

"అదరి మొన లిక్కడక్కడ వడి."
నిర్వ. 6.121.

**ఇక్కడ పుల్ల అక్కడ పెట్టడు**
ఏమాత్రం వంగి పని చెయ్యడు అనుట.
స్త్రీలింగంలోనూ ఇదే 'పెట్టదు' అని ఉంటుంది.
"వాడు ఇక్కడ పుల్ల అక్కడ పెట్టడు. మరీ వేళకు అన్నీ కావాలి." వా.
చూ. అక్కడ పుల్ల ఇక్కడ పెట్టడు.

**ఇక్క డున్నట్టుగా**
వెంటనే.
కొ. త. 51.
"ఇక్కడున్నట్టుగా రావాలి." వా.

**ఇక్కన్ను**
రెండుకన్నులు.
"ఇక్కంటితో నొక్క యింతి యేతెంచె." బస. 3.18 పు.

**ఇక్కపట్టు**
ఉనికిపట్టు.
"క్రొక్కారు మెఱుఁగుల యిక్కపట్టిది." కుమా. 3.18.

**ఇక్కలువడు**
కదలిపోవు.
"ఒండొంటిం దాఁకు రభసంబున నిక్కలువడఁ గ్రుక్కం ద్రొక్కుచు మెండు చెడి బెండువడి." భాగ. 8.55.

**ఇక్కిలి దక్కి**
విరివి యై, లావెక్కి.
"ఇక్కిలి దక్కి నిక్కి మెఱుఁగెక్కి...తగునీచనుదోయి." మల్హ. 3.101.

**ఇక్కుపాటు**
కష్టము, ఇక్కట్టు.
"నీ కిట్టి యిక్కుపాటు గల్గెనే తండ్రి యనుచు."
రంగ. రా. సుందరా. 436.

**ఇక్కువ లంటు**
కళ లంటు.
"ఇక్కువ లంట..." నీలా. 3.94.

**ఇక్ష్వాకులనాటిది**
చాలా ప్రాచీనము; తాతల నాటిది.
వ్యంగ్యంగా కూడా ఇది చాలా పాతపడింది అనే అర్థంలో ఉపయోగిస్తారు.
ఇక్ష్వాకులు మనకు చాలా ప్రాచీనపాలకులు. అందుపై వచ్చినది.
"బోటి యద్ది యిక్ష్వాకులనాఁటి దొర." పాణి. 2.104.
"ఆ సిద్ధాంతం ఇక్ష్వాకులనాటిది. ఇప్పుడేమి పనికి వస్తుంది?" వా.
"అదంతా యిక్ష్వాకులనాటి మాట లే. ఇప్పటి సంగతి చెప్పు." వా.

**ఇగిరించు**
1. చిగుర్చు.
"...వీణాదండము చిగిరించె నా." రాజ. చ. 1.4.
2. ఎక్కుబడు.
"అనుమఁ దలిగి మొగ మిగిరింపన్." యయాతి. 3.25.
3. ఇంకించు.
"పయోధినాథజీవన మిగిరించి." పద్మ. 7.39.

**ఇగిలించు**
పండ్లిగిలించు.

"తగిలించుకొన్నపిమ్మట, నిగిలించుమటె కాని కార్య మే మున్నది?" శుక.3.78.
చూ. ఇకిలించు.

## ఇగురబెట్టు

(అన్నము) ఉడకబెట్టు.
"అన్నం ఇగరబెట్టడం అన్నా రావాలి గదా అంత పెద్దపిల్లకు." వా.
'ఇగుర' ఇగరగా వినవస్తుంది.

## ఇగురవేయు

వండు.
"రాత్రికి నాలుగుగింజలు ఇగర వేస్తే పోతుంది. ఉన్నపచ్చడితో ఏదో యింత తింటాము." వా.

## ఇగురుకూర

పొడికూర, వేంపుడు, తాళింపు.

తాళింపు వేసి వండినకూరను ఒక్కొక్క వేపూ, ఒక్కొక్క వర్గంవారూ పై పేళ్లలో ఏదో ఒకదానితో వ్యవహరిస్తారు. కూర చేర్చకనే ఇగురు అనీ అనడం కద్దు.

## ఇగురుకొను

ఇగురొత్తు.
చూ. ఇగురొత్తు.

## ఇగురువంటకము

సరెసురు పెట్టి అనగా అత్తెసరు పెట్టి వండినఅన్నము.
చూ. ఇగురవేయు.

## ఇగురొత్తు

కలుగు.
"మోద మిగురొత్తఁ బాదాబ్జములకు మ్రొక్కి." రుక్మాం. 1.29.

## ఇగుర్కొను

చూ. ఇగురుకొను.

## ఇగో

ఇదిగో.
"వీడి గో గుఱ్ఱపుదొంగ వచ్చె." జైమి. 3.114.
"ఇగో ఈ రెండు రూపాయలూ ఇప్పుడు తీసుకో. తర్వాత చూద్దాం." వా.

## ఇగ్గులాడు

లాగు, పట్టుక వేలాడు, పెనగు లాడు, పీకులాడు.

కొంచెం అసంతృప్తిని తెలుపుతూ అనేమాట. 'నన్ను పట్టుకొని యిగ్గులాడితే యేమి లాభం ఉంది? ఇంక ఎవరినైనా ధనవంతుల నాశ్రయించు' ఇలా రాయలసీమలో విరివిగా వినవస్తుంది.
"ఏదో దీన్ని పట్టుకొని ఇగ్గులాడుతున్నాను. ఏ మవుతుందో ఏమో." వా.
"ఏదో వాణ్ణి నేను పట్టుకొని ఇగ్గులాడడం తప్పితే వాడికి ఏ మైనా నాపైన ఉందా?" వా.

## ఇగ్రుచు

ఇగురొత్తు.
"ఇగ్రుచుకొర్కులఁ దనడెంద మివతళింప." కవిక. 3.222.
శివరాత్రి. 2.39.
చూ. ఇగురొత్తు.

**ఇచ్చకబుచ్చకములు**

అచ్చికబుచ్చికలు. జం.

నలచ. 6.162.

**ఇచ్చక మాడు**

ముఖప్రీతి మాటలాడు, ముఖస్తుతి చేయు.

**ఇచ్చకాలమారి**

ముఖస్తుతి చేయువాడు.

"వాడు వట్టి ఇచ్చకాలమారి. వాడి మాటలు నమ్మవద్దు." వా.

**ఇచ్చకులు**

ఇచ్చకాలు మాట్లాడువారు.

"అప్పు డిచ్చకు లగుకు బ్రాహ్మణులు గొందఱు." ఆము. 4.46.

**ఇచ్చకు వచ్చినట్లు మాట్లాడు**

ఇష్టము వచ్చినట్లు మాటలాడు అనగా నిందించు, తూలనాడు.

"ఇత్తఱి రేగి రేగి తన యిచ్చకు వచ్చిన వెల్ల నాడెడిన్." కా. మా. 3.44.

**ఇచ్ఛగించు**

ఇష్టపడు, కోరు.

**ఇచ్ఛగొను**

కోరు.

**ఇచ్ఛ గోరు**

కోరు, ఇష్టపడు.

"కేవలతాసుఖ మిచ్ఛఁ గోరుచున్." భీమ. 4.7.

**ఇచ్ఛమానికము**

చింతామణి.

"ఇచ్ఛమానిక మేయూరి రచ్ఛబాయి." చంద్ర. 2.66.

**ఇచ్ఛమెచ్చు**

1. ప్రియపడు, మెచ్చుకొను.

"ఆత్మచిత్తముం దోఁచిన చందముం దెలియఁ దోఁచిన నచ్చర లిచ్ఛ మెచ్చకే." ఉ. హరి. 1.163.

2. సంతోషించు.

"సకలసైన్య మిరుగడలఁ గొల్వఁ దన పురీవరముఁ జేరె, నేలికయుఁ దల్లిదండ్రులు నిచ్ఛ మెచ్చ." శుక. 1.429.

**ఇచ్ఛసలుపు**

కోర్కె తీర్చు.

"నా యిచ్ఛ సలుపు మోజియ్యా." పండితా. ద్వితీ. పర్వ. పుట. 477.

**ఇచ్చికబుచ్చిక సేయు**

విజయ. 3.30.

చూ. అచ్చికబుచ్చిక సేయు.

**ఇచ్చిపుచ్చుకొను**

1. పరస్పరం వియ్య మందు.

"మాకూ వాళ్లకూ యిచ్చిపుచ్చుకోవడాలు తరతరాలుగా వస్తున్నవి." వా.

2. పరస్పరం సహాయము చేసుకొను.

"ఇరుగూపొరుగూ వాళ్లన్నతర్వాత యిచ్చిపుచ్చుకోవడా లంటూ ఉంటేనే." వా.

"వాళ్లకూ మాకూ ఇచ్చిపుచ్చుకొనడాలు ఉన్నాయి." వా.

3. లావాదేవీలు.

"ఆ షాహుకారు దగ్గర యిచ్చి పుచ్చుకోవడం మా నాన్నకాలంనుంచీ అలవాటు." వా.

**ఇచ్చిపుచ్చుకోలు**

చూ. ఇచ్చిపుచ్చుకొను.

**ఇచ్చిపుచ్చుకొను సంబంధము**

సమీపబాంధవ్యము.

కాళ. శత. 36.

**ఇచ్చిపుచ్చుకొన్న యాలగ్రద్ద**

దాన మిచ్చినది తిరిగి తీసు కొనేలోభి.

"ఏము నలువురందు నెవ్వాఁడు గాఁజాలు
నిచ్చిపుచ్చుకొన్న యాలగ్రద్ద
మాకు నింపు గాపు మాను మీసుద్దులు
కలహముల మొగంబ కలియుగంబ!"

నైష. 7.107.

**ఇచ్చుబాస**

వాగ్దానము.

"నా, యిచ్చుబాస కౌరవేంద్ర వినుము." భార. ద్రోణ. 5.388.

**ఇచ్ఛావృత్తి**

స్వేచ్ఛాసంచారము.

హంస. 5.211.

**ఇచ్ఛించు**

కోరు.

"ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛించితిని వాని." భాగ. 8.661.

**ఇజారాపాట**

కల్లు, సారాయి అమ్ముతున్న రోజుల్లో కల్లంగళ్లను ప్రభుత్వం వేలం వేసేవారు. ఆ వేలంపాటను ఇజారాపాట అని, అలా వేలం పాడి గుత్తకు తీసుకొనడమును ఇజారా తీసుకొనుట అనీ అంటారు.

**ఇజ్జలజ్జలవారు**

దగ్గఱివారు, ఇరుగుపొరుగు వా రిన్నట్లు.

"తమ యిజ్జలజ్జలవారిఁ దనవారిఁ, దన తల్లిదండ్రుల వారి...రప్పింప."

పండితా. ప్రథ. పురా. పుట. 288.

**ఇటబట్టి**

ఇప్పటినుంచీ.

"ఇటఁబట్టి నీకు మీ యనియెద రాజు పాదముల యాన సుమీ మఱి యేమి పల్కనకా." నైష. 3.114.

**ఇటు న టాడకుండ**

ఏమీ అనకుండా, అదీ యిదీ అనకుండా.

"తనతల్లి యతని నేమియు నిటునటాడకుండం బ్రార్థించుచుండె."

కళా. 4.74.

**ఇటు పుల్ల అటు వేయకుండు**

ఏ మాత్రం పని చేయక ఉండు.

"ఆ ఆడపడుచు ఇటు పుల్ల తీసి అటు వేయదు. అంతా కోడలే నెత్తిన వేసికొని చేయాలి." వా.

చూ. ఇక్కడ పుల్ల అక్కడ పెట్టదు.

**ఇటువంటి**

ఇట్టి.

"ఇటువంటివి యిట కెక్కడివి."

ఆము. 6.60.

"సుగవా రిటువంటివారి మదిలో."

విక్రమ.
కళా. 3.88.

"ఇటువంటి దానిని నే నెక్కడా చూడ లేదు." వా.

ఇటువలె

ఇట్లు, ఈలాగు.

ఇట్లా అనేరూపంలో నేడు వాడుక.

"ఇటువలె జవ్వనంపుమద మెచ్చఁగ." ఉత్తరరా. 1.172.

"ఇట్లా జరుగుతూండగా..." వా.

ఇట్టట్టనక

అడ్డు చెప్పక.

"ఇట్టట్టన కింకఁ దత్ఫలము లన్నిటి నొందుము." భార. శల్య. 2.134.

"ఇట్టట్టనక." కాశీ. 4.98.

ఇట్టట్టనజాలవు

కిం అన లేవు? ఏ మాత్రం ఎదురు చెప్ప లేవనుట.

"చిత్తంబు తనయాజ్ఞఁ జేసి వర్తించెనే, నిట్టట్టనఁగఁ జాల వింద్రియములు." భీమ. 5.160.

ఇట్టట్టన వచ్చునే!

ఏమాత్రం అనడానికైనా వీ లుందా అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"నిన్ను నిట్టట్టన వచ్చునే." భార. ఉద్యో. 1.297.

"వాడేదైనా పని చేస్తే ఇట్లా అని అనడానికి వీ లుందా!" వా.

ఇదే నేటి వాడుక.

ఇట్టటు గ్రుక్కు

నీళ్లు నములు, మాటలు మ్రింగు.

"ప్రత్యుత్తరం బేమియుఁ దోఁపమినికి నిట్టటు గ్రుక్కుచు నున్నట్టిలా గరసి." ప్రభా. 5.73.

ఇట్టట్టుపడు

1. క్రిందుమీదు లగు.

"దట్టిఁ బడినపులుఁగులగతి నిట్టట్టు పడంగ నునిచి యెంతయు వేడ్కన్." కా. మా. 3.201.

2. గందరగోళపడు.

"అతని విధ మెఱింగింప నిట్టటు పఱచు." ఆము. 4.154.

"పట్టణ మిట్టట్టువడఁ గదల్చి." ఉ. హరి. 1.20.

ఇట్టటు వడగా

అటూ ఇటూ కదలునట్లు — పూర్తిగా అనుట.

"అయ్యేటినీరు పఱపెఁ బట్టణ మిట్టటు వడఁ గదల్చి." ఉ. హరి. 1.9.

ఇట్టట్టొనరించు

చెల్లాచెదరు చేయు, ఇటు అటు పాఱిపోవునట్లు చేయు.

"భల్లూకమండలి నిట్టట్టొనరించి యుండ దండ న్విస్మయం బొప్పఁగన్." శుక. 1.265.

ఇట్టిక సూడినవాడు

తిరిగి చూడక పారిపోవువాడు. ఇటుక కాల్చినవాడు వెనుకకు తిరిగి చూడక పరుగెత్తిపోవలె ననుఆచారముపై వచ్చినది.

"ఇట్టిక సూఁడినవాఁడో, యొట్టిడుకొన్నాఁడో." ఉ. హరి. 1.36.

ఇట్టికాడు

ఈలెకాడు.

"ఉచ్చిపోవైచునిట్టికాని." శమా. 11.39.

**ఇట్టిపాటి**

ఈ మాత్రం.

"కా దన కిట్టిపాటి యపకారము."
భార. ఆది. 1.124.

**ఇట్టే**

ఉన్నపాటున, వెంటనే.

"ఇట్టే చని బాలభానునిఁ బట్టె నపుడు."
ఉత్త. రా. 5.100.

"ఇట్టే పోయి వచ్చేశాడు."

"పద్యం చదివీ చదవక ముందే అతను ఇట్టే అర్థం చెప్పేస్తాడు." వా.

**ఇట్లు ఎల్లదినములు రావు**

ఇట్లాగే ఎప్పుడూ ఉండదు. నీ వనుకొన్నదానికంటే విరుద్ధంగా జరుగవచ్చును సుమా అను హెచ్చరిక యిందులో గుప్తమై ఉన్నది.

"...ఇట్లు వర్తిలుటఁజేసి మృగేక్షణ యైన నిట్లరా, వెల్ల దినంబులున్ సవతి యేగతిఁ గలునో." కళా. 1.166.

"ఊళ్లోవాళ్లెవ్వరినీ నువ్వు లెక్క చేయడం లేదు. రోజులు ఇలాగే ఎప్పుడూ ఉండవు." వా.

ఇదే వాడుకలో రూపం.

**ఇట్లే ఎప్పుడూ ఉండదు**

చూ. ఇట్లు ఎల్లదినములు రావు.

**ఇడికుడకలు**

పిండివంట, ఆవిరికుడుములు.

"ఏలకికాయలు వెన్న మెఱుంగులు నిడికుడకలు...ఆదిగా గల భక్ష్యవిశేషంబులు." హంస. 1.105.

**ఇడుగడపడు**

బాధపడు.

"కడలేని విరహవేదన నిడుగడపడు చుండుకంటె." సమా. 6.5.

**ఇడుగడ సేయు**

బాధపడు, బాధపెట్టు.

"అత్మలో నిడుగడ సేయుచున్ గడు సహింపక కద్రువ." భార. ఆది. 2.42.

"వేయి విధంబుల భంగపెట్టుచున్... ఇడుగడసేయఁగా వలయు నీలువుమాలిన అంకటాంద్రకు." విష్ణు. ఆచా. 111.

**ఇడుపులు పాటు**

బీరములు పల్కు.

దశ. 6.70.

**ఇడుమపడు**

కష్టపడు.

"ఇడుమపడఁడె కాననభూమిన్." భార. అర. 2.6.

**ఇడుమపాటు**

కష్టము.

"ఇడుమపాట్లకుఁజొచ్చినయింగితంబు." కళా. 4.99.

**ఇడుమలు గుడుచు**

కష్టాలు పడు.

"బ్రహ్మరాక్షసుఁ డింతిపైఁ బాయకున్న, మంత్రవాదుల వెదకుచు మందు లెఱుఁగు, వారిఁ దడవుచుఁ గనుకలి వంతఁ జింత, నొంది యిడుమలు గుడుచుచు నున్నవాఁడు." దశ. 11.36.

"అనుచుఁ దగ డాసి చేష్టలు, కనుఁగొని ప్రజ విరియ నరచి గారుడమంత్రం, బున దోషంబుం దీర్చెద, నని యిడుమలు గుడిచి మంత్ర మఫలం బైనన్." దశకు. 5.98.

**ఇడుముకొను**

ఇముడ్చుకొను, చేర్చుకొను.

"కడుఁ బ్రియ మెలర్పఁ గౌఁగిట, నిడుము
కొని..." శుక. 1.305.

**ఇడ్డబొట్టు వలె**

కదలకుండా.

పెట్టుకొన్న బొట్టు అని ఇం
దాకా ఇడ్డబొట్టును అందరూ
అంటున్నారు.

ఇ దింతేనా అని సందేహం.
బొట్టులాగా అనడం కంటే
మఱేం కేదైనా విశేషార్థ ముం
దేమో అనిపిస్తున్నది.

ఆలోచింపవలసి ఉన్నది.
ఇంకా తేల లేదు.

"ఇడ్డబొట్టువోలె నింటిలో నుండక."
శమా. 6.16.

**ఇతఃపరము**

ఇంతకంటె వేఱు.

"నీవే తప్ప నితఃపరం బెఱుఁగ."
భాగ. 8.90.

**ఇత డెంత వాడు?**

వీ డెంత?

"ఇంతింతవారల కీశ్వరావసర, మింత
దుర్ఘట మన్న నితఁ డెంతవాఁడు."
పండితా. ప్రథ. పురా. పుట. 379.

**ఇతని కితండె సాటి**

ఇతనికి సమానుడు లేడు
అనుట, అప్రతిమానుడు.

"ఇతని కితండె సాటి యగు నీతని కీతఁడె
సాటి వచ్చు." పారి. 5.29.

**ఇతర మనక**

ఏమీ అనక.

ఇంకేమీ అనక అన్నది
వాడుకలో రూపము.

"ఏమి సేయుదు మని ధూర్తు నితర మనక,
డెందమున సందియ మొకింత చెంద
కపుడు." హంస. 2.215.

**ఇతరేతరమతి**

అన్యోన్యబుద్ధి.

"ఇత రేతరమతి సంభా, వితలక్షణకలన
మొంది." భార. శాంతి. 6.454.

**ఇతికర్తవ్యతామూఢుడు**

ఏమి చేయుటకూ దిక్కు
తోచనివాడు.

**ఇతోధికంగా**

ఇంతకంటే ఎక్కువగా.

మంచి జరుగుతుం దన్న సంద
ర్భంలోనే దీనిని ఉపయో
గిస్తారు.

"ఈసారి సకాలంలో వానలు కురవడం
వల్ల యితోధికంగా పంటలు పండవచ్చు
నని రైతులు సంతోషిస్తున్నారు." వా.

**ఇత్యాదులు**

మొదలగునవి, వగైరా.

"ఉప్పూ, చింతపండూ, మిరప
కాయలూ ఇత్యాదు లన్నీ ఆ అంగట్లోనే
కొంటూ ఉంటాము." వా.

**ఇదంతన మైన**

ఆధునిక మైన, ఇప్పటి దనుట.

**ఇదమిత్థ మను**

నిర్ధరించి చెప్పు.

"ఇది గాక శమనకృత్యం, బిద
మిత్థ మ్మనఁగఁ గూడదు." దశా. 2.1[illegible]

"ఈవ్యాజ్యం ఎలా పరిణమిస్తుందో
మిత్థ మని చెప్పలేము."

**ఇదమిత్థము**

1. ఇది ఇట్లా అని.

"ఇదమిత్థ మ్మని యేనును
మది మితి సేయంగ నేర..."
పాండు. 3.125.

2. సారాంశము.

"అతను గంటలకొద్దీ ఏవేవో చెప్పాడు. ఇదమిత్థం తేల్చి చెప్పడు." వా.

**ఇదానీంతనము**

ఆధునికము.

**ఇది గాక**

మరిన్నీ.

ఏదైనా చెప్తూ మరొక ఉపపత్తిని తెలిపేటప్పుడు ఉపయోగించేపలుకుబడి.

ఈ 'ది' 'దీ' అని దీర్ఘంతో కూడా వినిపిస్తుంది.

"ఇది గాక మఱొక మెలిక కూడా ఇందులో ఉంది." వా.

రూ. ఇదీ గాక.

**ఇదిగో అంటే ఇన్నూరేండ్లు**

ఇప్పుడే చేస్తానంటూ కాలం గడిపేవాని విషయంలో ఉపయోగించేపలుకుబడి.

"వాణ్ణి నమ్ముకుంటే ఇక నాపని అయినట్లే. వాడు ఇదుగో అంటే ఇన్నూరేండ్లు." వా.

రూ. ఇదుగో అంటే ఇన్నూరేళ్లు.

**ఇదిగో అదిగో అని చూచు**

ఇదో వస్తుంది అదో వస్తుంది అని వృథాగా ఎదురు చూచు.

"మా, కోసము తల్లిదండ్రు లిదిగో నదిగో నని చూచు టాయె."
నానా. 47.

**ఇది తడవ బని లేదు**

దీన్ని గూర్చి ఆలోచించవలసిన అవసరం లేదు.

"దీని కెంత వలసిన నేయు యిది దడవం బని లేదు." కళా. 3.66.

**ఇది పోలు నిది పోల దని**

ఇది మంచి, ఇది చెడ్డ అని.

"ఇది పోలు నిది పోల దని చెప్పఁ దెలియునే, యసగుఁ బోడువ."
పాండు. 5.229.

**ఇది యది యనక**

అడ్డు చెప్పక.

"ఇది యది యన కూరకునికి యెంతయు నొప్పున్." భార. ఉద్యో. 2.59.

"వాడిపాటికి వా డేదో చెప్పుకొంటూ ఉంటాడు. ఇదీ అదీ అనకుండా వింటే సరి. మన కెందుకు వచ్చినగొడవ." వా.

రూ. ఇదీ అదీ అనకుండా.

**ఇదియే పదివేలు**

ఇంతే చాలు.

జరిగిన యేస్వల్పమైనపనినో మహాకార్యంగా భావించుటలో ఉపయోగించుపలుకుబడి.

"ఇదియె పదివేలు వైభవం బెల్ల నాఁడు, నల్లపూసలు చెవియాకు నాకుఁ జాలు."
శుక. 2.84.

"నువ్వు తిరిగి వచ్చావు. అదే నాకు పదివేలు. డబ్బు పోతే పోయింది." వా.

రూ. అదియే పదివేలు.

ఇది యేమి పెద్ద బ్రహ్మాండమా
ఇ వ్రాక లెక్కా, ఇ వ్రాక గొప్పా అనుట.
"ఇది యేమీ పెద్ద బ్రహ్మాండమా ?" శ్రవ. 5.5.

ఇది యేమి పాపమో !
ఇ దేమి అన్యాయం అన్న లాంటి పలుకుబడి.
"ఇది యేమి పాపమో యబల !" పాణి. 3.5.

ఇదీ అదీ అనకుండా
చూ. ఇది యది యనక.

ఇదీగాక
చూ. ఇదిగాక.

ఇదేనా రావడం ?
ఎవరైనా బంధుమిత్రులు ఇంటికి వచ్చినప్పుడు చేసే పలకరింపు.
"ఓహోహో బావగారు ! ఇదేనా రావడం." వా.

ఇదే పనిగా
ఇతరపనులు మాని.
"ఈ మాడ్కి నిదియ పనిగాఁ, గామాంధుం డగుచు నున్నఁ గార్యము లెల్లన్." కా. మా. 2.22.

ఇద్ద రిద్దరే
ఇద్దరూ ఒకలాంటివారే.
"...హతమనస్కులు నిద్దరు నిద్దరే వృథా." దేవీ. 5.211.
రూ. ఇద్దరూ ఇద్దరే.

ఇనుడు గుడిచిన నీ రగు
ఇంకిపోవు, ఎండిపోవు.
"చలవమందుల శైత్యంబు సంభవిలక, యినుఁడు గుడిచిననీ రయ్యె." శకుం. 3.44.

ఇనుపకచ్చడములు
వాచ్యార్థం ఇనుముతో చేసిన కౌపీనము లేదా లంగోటీ అనే అయినా, లక్షణయా నిష్ఠుర బ్రహ్మచర్యానికి సంకేత మయినది.
"...యినుప కచ్చడాల్ గట్టికొను మునిముచ్చు లెల్లఁ, దామరసనేత్ర లిండ్ల బందాలు గారె." మను. 2.73.
"విషయాంతరము గిల్లి వేయని వారికి నినుపకచ్చడమున కెంత దవ్వు ?" పాండు. 4.278.
"తెమలి యినుపకచ్చడము లూడివడు నన్న, నున్నవారి నింక నెన్న నేల ?" విక్ర. 8.73.

ఇనుపకుందు
వాకిలి తిరుగుటకై వేసిన గుండ్రని యినుపగూటము. కాంబెల్.

ఇనుపగజ్జెల తల్లి
దరిద్రదేవత.
"వాళ్లయింట్లో యినుపగజ్జెలతల్లి తాండవిస్తూ ఉంది." వా.

ఇనుపగుగ్గిళ్ళు
కొఱుకుడు పడనివి.
ముఖ్యంగా అర్థమూ, భావమూ సులువుగా తెలవి కావ్యాలపట్ల, ఇతరములపట్ల ఉపయోగించే పలుకుబడి. తాళ్ల. సం. 7.34.

"శ్రీ హర్షుని నైషధశ్లోకాలు ఇనుప గుగ్గిళ్లు." వా.
చూ. అయఃపిండం.

**ఇనుపచిట్టెము**
మండూరము.
ఆయుర్వేదంలో ఉపయోగించే ఖనిజము.

**ఇనుపతెర**
దాటరాని ఆటంకము.
నేటి రాజకీయాలలో 'ఐరన్ కర్టన్' అన్న యింగ్లీషు మాటనుండి వచ్చిన పలుకుబడి.
నా. మా. 131.

**ఇనుపతేలు**
నల్ల తేలు.
ఎఱ్ఱతేలుకు, బాపన తేలుకు వ్యతిరేకం.
చూ. ఎఱ్ఱతేలు, బాపనతేలు.

**ఇనుపదారి**
రైలుమార్గము.

**ఇనుపమంగలమువలె నుండు**
విపరీతముగా కాలిపోవుచుండు.
"ధరాతలం బినుపమంగలముం బలె నుండెఁ గాలి." కా. మా. 1.123.

**ఇనుపమొలకు మేడ గాల్చు**
అల్పలాభానికై అనంతనష్టము కలిగించుకొను.
ఇనుపచీలకోసం మేడను ఎవరైనా కాల్చుకొంటారా?
"కరవాలుఁ జేతఁ బూనినకరణి, నినుపమొలకు మేడఁ గాల్చుట సుమ్మీ."
రుక్మాం. 5.143.

**ఇనుపయెడ్లు**
ఎనుములు. గేదెలు, దున్నలు.
శాసనపరిభాష.
ఎనపగొడ్లు అని రాయలసీమలో నేటి వాడుక.
అసలు ఇనుపయెడ్లే ఇన్పయెడ్లు, ఎన్పయెడ్లు, ఎన్పగొడ్లుగా మారిఉండవచ్చును. ఎనుములు అని ప్రత్యేకించి వాడడం కూడా కద్దు.

**ఇనుమడి**
రెండింతలు, రెట్టింపు.
చూ. ఇబ్బడి.

**ఇనుమడించు**
ఎక్కువగు.
"ఇనుమడింపద మానసమున నలంత." భార. స్త్రీ. 2.166.

**ఇనుమడి చేవానికి తగర మడుచు టెంత?**
సులభమనుట.
ఇనుము చాలా గట్టిలోహం. దాన్నే సాగగొట్ట గలవానికి తగరం మరీ మెత్తన కనుక చాలా సులభం కదా.
"ఎన లేక యెదిరికి నినుమడి చేవారికి తన తగర మడువఁ దడ వయ్యేనా?" తాళ్ల. సం. 8.61.

**ఇనుమాఱు**
రెండుమారులు.

"కర్ణుం డినుమా ఱొంకశరము దొడు గునే." కర్ణ. 3.317.

**ఇనుమిక్కిలి**

ఇబ్బడి.

"రాజుకంటె నినుమిక్కిలి మా కను రక్తిమె." సారం. 2.268.

**ఇనుమిక్కిలిగా**

అధికముగా.

"మందగా, మిని యను బెల్ల నప్ప డినుమిక్కిలిగా దన యంటె నిల్వగఁ." విజ. 3.207.

"ఈ సంవత్సరం వాడి ఆదాయం ఇనుమిక్కిలిగా పెరిగింది." వా.

**ఇనుము గూడి యున్న అగ్నికి పెట్టు వచ్చు**

సహవాసదోషంవల్ల కష్టములు కలుగు ననుటను సూచించే పలుకుబడి.

"ఇనుముఁ గూడి యున్న యగ్నికిఁ బెట్టు రాకుండు నెట్టు." కళా. 7.261.

చూ. వరుగుతో దాగరయు నెండినట్లు.

**ఇనుము సంగతిజేసి యిల బావ కుండు వనుగొని మర్దింప బడునట్లు**

సహవాసదోషం వల్ల బాధ ననుభవించుపట్ల అంటారు.

పండితా. ప్రథ. వాద. పుట. 695.

**ఇనుమో ఊయో**

చాలా కఠిన మనుట.

"నాయుల్ల మరయ నినుమో ఊయో కా కిట్లు రూపఱిన్ విన నేర్చెన్." భార. భీష్మ. 3.419.

**ఇన్నాళ్లు**

ఇంతకాలంగా.

"ఇన్నాళ్లు నడుగఁ బుత్తేఁడు." నైష. 3.123.

"ఏలా పుట్టె నీ దూఱు నీ కిన్నాళ్ లేనిది." సారం. 3.88.

"ఇన్నాళ్ళూ ఎంతో హాయిగా వున్నాం. ఇప్పుడు కలతలారంభమైనవి." వా.

**ఇన్నాళ్లుగా లేనిది**

ఇంతవరకూ ఎప్పుడూ లేనిది.

"ఏలా పుట్టె నీదూఱు నీ కిన్నాళ్ లేనిది." సారం. 3.88.

"ఇన్నాళ్లుగా లేనిది వాడికి ఈ దుర్బుద్ధి ఎందుకు పుట్టిందో తెలియదు." వా.

**ఇన్నూఱు**

రెండువందలు.

"ఇన్నూఱు మున్నూఱు నేనూఱు కన్నులు గల వేలు పెవ్వానిఁ గన్న తండ్రి." నైష. 6.72.

**ఇన్నగుండు**

తుపాకిగుండు.

"తామరతూడు నాళములఁ దార్కొను తుమ్మెద యిన్నగుండులు, దామతఁ గూర్చి." కాళిందీ. 3.155.

**ఇన్మాఱు**

రెండుమాఱులు.

భార. అను. 3.284.

**ఇపు డేమి గంటి**

ఇప్పుడే యేమయింది?

ఇంకా ముందున్న దనుట.

"ఇపు డేమి గంటి నా కెక్కడి సిద్ధ సంకల్పత." ప్రభా. 4.51.

**ఇప్పపూమొగ్గలబోని బుగ్గలు**
అందమైనబుగ్గలు. కవిసమయసిద్ధమైనఉపమానం.
"అంబురుహముఖుల యొప్పులకుప్ప లగు నిప్పపూమొగ్గలం బోని బుగ్గలం వగ్గలిక నూపుకమ్మపంజుల..."
మను. 3.28.

**ఇబ్బంది**
కష్టము.
"ఈ యిబ్బందిలో కూడ ఆదుకో వాలి." వా.

**ఇబ్బందిగాడు**
దెబ్బలికీ, చిలుతపులికీ పుట్టినపులి.
బ్రౌను; శ. ర.

**ఇబ్బందిపడు**
చిక్కుపడు.
"ఆ ఊళ్లో డబ్బు లేక నేను చాలా యిబ్బందిపడి పోయాను." వా.

**ఇబ్బడి**
రెండింతలు.
"వేడ్క యిబ్బడి గాదే."
ఉత్త. రామా. 2.240.
"కాస్త జాగ్రత్తగా చేస్తే యింత కిబ్బడి ముబ్బడి చేయొచ్చు." వా.
చూ. ఇనుమడి, ఇమ్మడి.

**ఇముడుకొను**
1. కాపాడు.
"కొన్నినాళ్లు నన్నిముడుకొమ్ము కరుణ ననాథ ననిన." ప్రబో. 5.81.
2. చేరుకొను, కలుసుకొని పోవు.
"వాడు వాళ్ల అత్తగారింట్లో బాగా యిముడుకొని పోయాడు." వా.

**ఇమురుకొను**
హరించుకొని పోవు.
"ఇమురుకపోవఁజొచ్చిన దీపమునకుఁ, జమురు వోసినయట్లు."
రంగ. రామా. అయో. 145.

**ఇమ్మడి**
రెండింతలు
"ఉత్సవోన్మత్తభావ మిమ్మడి యై ప్రమోదంబునం జేలిరి."
భార. అశ్వ. 3 ఆ.
రంగ. అయో. 145 పు.
చూ. ఇనుమడి, ఇబ్బడి.

**ఇమ్మడి ముమ్మడి**
ఇబ్బడి ముబ్బడి, రెండింతలు మూడింతలు.
"ఇమ్మడి ముమ్మడి యితరదేశంబు లిమ్మహీ."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 416.

**ఇమ్ముకొను**
వ్యాపించు.
"నెమ్మి పురి విచ్చెఁ గాలుష్య మిమ్ముకొనియె." కాళిందీ. 2.43.

**ఇమ్ముల నుండు**
నెమ్మదిగా నుండు.
"మునుల సద్గోష్ఠి నిమ్ముల నున్న వేళ."
గౌ. హరి. ఉ. పంక్తి. 12.
"ఇమ్ముల నున్నవాఁడె హరి."
భాగ. స్క. 10 (పూ.) 1474.

**ఇయత్త**
సత్తా, సారం.

"వాడి యియత ఇంతా అని తెలిసే అప్పుడు ఏం చేసేదీ ఆలోచించవచ్చు."
వా.
చూ. ఇయత్త్వం.

### ఇయత్త్వం
సత్తా సారం.
చూ. ఇయత్త.

### ఇయ్యకొను
ఒప్పుకొను.

### ఇయ్యకొలుపు
ఒప్పించు.
భార. ఉద్యో. 1.27.

### ఇయ్యకోలు
ఒప్పుదల, అంగీకారము.
"ఎవ్వని చరిత మియ్యకోలై రాశి కెక్కు లోకనులు."
పండితా. ప్రథ. పురా. పుట 385.
"ఇయ్యకోలు మైఁ జనియె."
ఉద్భ. 2.226.

### ఇయ్య యను
సరే అను.
"నా సుతునకు భార్య వగు మన్న నొడఁబడి యియ్య యనియె."
భార. ఆది. 4.141.

### ఇయ్యసేయు
ఒప్పుకొను.
రాజశే. 3.19.

### ఇరవందు
ఒప్పారు.
భాగ. పూ. 10.463.

### ఇర వగు
నెలకొను, ఉండు.
"ఈడనే శ్రీ వెంకటాద్రి నిర వైతి వనుచు." తాళ్ల. సం. 6.162.
"అం దిర వై యయ్యెల లూగుచున్నది." విప్ర. 2.62.
నైష. 1.52.

### ఇరవారు
ఒప్పు.
"పరిణయ మిరవారఁగ నాఁడు చేసితి."
భా. రా. సుం. 294.

### ఇరవుకొను
నెలకొను.
"కొల నైన...ఇచ్చోట నిరవుకొన్నది చూడుఁడు."
వర. రా. కిష్కి. పు. 480. పంక్తి. 12.

### ఇరవుకొలుపు
నెలకొల్పు.

### ఇరవుకొల్పు
నెలకొలుపు.

### ఇరవు చూపు
స్థాన మిచ్చు.
"సుస్థికి నిరవు చూపెడుచేతు లివియె సో." తాళ్ల. సం. 5.108.

### ఇరవు దప్పినమాట
క్రమము తప్పినమాట.
"ఇరవు దప్పినమాట నెటి కాదెదవు?"
ద్విప. జగ. పు. 213.

### ఇరవు పడు
నెలకొను.

### ఇరవుపఱచు
ఉంచు, నెలకొలుపు.
"ఈశానుదిక్కునం దిరవుపఱిచె."
పాండు. 5.157.

ఇరవై ముప్ఫై రోజులలో

కొద్దిరోజులలో.

"చాలా నా ళ్లుండను. ఇరవై ముప్ఫై రోజులలో వచ్చేస్తాను. బెంగ పెట్టు కోకు." వా.

ఇరవొందు

నెలకొను.

ఇరసాలు చేయు

కిస్తీ వసూలు చేసినడబ్బును తాలూకా కచ్చేరికి పంపించు.

ఇరాఖు

పండ్రెండు.

"ఇరాఖు మేనులం దా నటు దిద్ది దూతి చనె." రుక్మి. 1.43.

ఇరిమిరిమి చూచు

బిక్కిరిచూపులు చూచు. ఇఱు ఉరుమి ఉరిమిగా కనబడదు. కాని అలాంటిదే ఇది.

"ఇల మృగము ట్లిరిమిరిమి చూచుచును."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 441.

ఇరియించు

భస్మము చేయు.

"నాసల నెసఁగుశిఖియసమున, మసుఁగు మనోభవు నెత్తనిమే, నిరియించితి."
ఉద్భ. 3.289.

ఇరివిలి

తొలి; పోగలతో చేయబడిన రంధ్రము.

శ. ర.

ఇరుకుచేతి....

లోభి యైన, ధారాళ మైనచేయి కాదను పట్లు, మనిషి వాడు ఇత్యాదు లతో చేరి విశేషణంగా ఉప యుక్త మవుతుంది.

"ఎంతుంటే నేం? వాడు వట్టి యిరుకు చేతి మనిషి. ఇస్తాడా? పెడతాడా?" వా.

"ఆ ఇరుకు చేతివానిదగ్గఱ కెందుకెళ్ళారు? ఇస్తాడా? పెడతాడా." వా.

ఇరుగాలిపసులు

ద్విపాదపశువులు — నీచు లనుట. పశువులే కాని రెండే కాళ్ళు. ఇంతే భేదం అని...

"ఘు ష్మిరుగాలి పసుల." బస. 6.525.
మా. ఇర్గాలి పసులు.

ఇరుగాలు నిలువక

ఒక్కచోట నిలువక.

"ఇరుగాల నిలువక యేఁగు బెగడి."
కవిక. 4.99.

చూ. రెండుకాళ్లూ ఒకచోట పెట్టక.

ఇరుగింటి దయ్యము పొరుగింటి గూబ

దుష్టస్త్రీ.

గూబ అమంగళసూచకము.

దయ్యం భయంకర మైనది.

"ఇరుగింటి దయ్యంబు పొరుగింటికిని గూబ, యెదురింటివారల కెదురు చుక్క." శుక. 3. 20.

ఇరుగిల్లు

ప్రక్క యిల్లు.

ఇరుగుపొరుగు

ప్రక్క యింటివారు.

ఇరుగూ పొరుగూ అని నేటి వాడుక.
"ఒక్క లగ్న మేర్పఱిచి యిరుగుపొరుగు నెఱుఁగకుండ..." శుక. 2. 166.
చూ. ఇజ్జలజ్జలవారు; అంతసాంతల వారు; ఇరుగుపొరుగులు.

**ఇరుగుపొరుగులు**

ప్రక్కయిండ్లవారు.
"ఇరుగు పొరుగు లెఱుఁగక యుండఁన్." రాధ. 1.33.

**ఇరుచంబడు**

కుంచించుకొని పోవు.
"ఇరుచంబడి గుమ్మడిమూట గట్టి." క్రీడా. పు. 15.

**ఇరుచెవి యెఱుగకుండా**

పక్కవానికి తెలియకుండా.
"ఇరుచెవి యెఱుఁగక యుండం, దరుణీ సుఖ మనుభవింప..." ఉ.హరి. 5.197.
"ఏఁగె దేవేంద్రుఁ డిరుచెవి యెఱుఁగ కుండ." భీమ. 4.50.
రూ. ఇరుసెవి యెఱుగకుండా.

**ఇరుజీవి ఎరగకుండా**

రెండవవానికి తెలియకుండా, రహస్యముగా ననుట.
వాడుకలో మాత్రమే ఉంది.
"వా డేం చేసినా ఇరుజీవి ఎరక్కుండా చేస్తాడు." వా.

**ఇరుదలపాము**

రెండుతలల పాము, బురద పాము.

**ఇరుదలపులుగు**

గండభేరుండము.

**ఇరుదలశిఖండి**

మేదరకత్తి.
"కోసినవెదురు సలాకల, నేసినయిరుదల శిఖండి." క్రీడా. పు. 22.

**ఇరుదెసకొలువు**

ఇద్దఱిక్రింది ఉద్యోగం.
"ఇ క్కెల చెల్లు నీ కిరుదెసకొలువు." బస. 6. 168 పుట.

**ఇరుమే నయి**

అతిలాఘవంతో—ఒకడు యిద్దఱుపోలికగా విజృంభించి.
"హరుఁడు వినోదార్థముగా, నిరుమే నయి రణ మొనర్చె." భార. ద్రోణ. 5.295.

**ఇరులుకొను**

క్రమ్ము, వ్యాపించు.
"శైత్యపాండిమలు దుషారాంతమునఁ జేరి, నిరులుకొనెఁ ద్రాక్షపందిరుల విరుల." ఆము. 5.139.

**ఇరులుకొల్పు**

చీకటి కలుగజేయు.
"ఇరులు కొల్పుచు నున్న వీ ప్రావృషేణ్యాశరదంబులు." వర. రా. కిష్కి. పు. 393 పంక్తి. 11.

**ఇరువాయికట్టు**

మలమూత్రబంధ మగు.

**ఇరువైపుల కను గల్గి**

జాగ్రత్తగా.
రెండువేపులా కన్ను వేసి ఉండాలి—అన్నట్లు నేడు విన వస్తుంది.

"ఇరుకెలంకులను కనుగల్గి దిక్కులు కలయఁ గన్గొనుచు."
వర. రా. కిష్కి. పు. 286. పం. 16.

ఇరు లన్న నోయని యెడు తమిస్ర

కటిక చీకటి.

పిలిస్తే పలికే దగ్గరల్లో కావలసినంత ఉన్నా అనే భావం సూచితము.

"మరులు దీఁగ మెట్టి యిరు లన్న నోయని యెడి తమిస్రఁ గానుపడి."
ఆము. 6.12.

చూ. పిలిస్తే పలుకు.

ఇరుసెవి యెఱుగకుండా

రెండవ చెవికి తెలియనీయకుండా – ఇతరుల కెవరికీ తెలియకుండ రహస్యముగా అనుట.

"ఇరుసెవి యెఱుఁగక యుండం, దరుణీసుఖ మనుభవింపఁ దలచిన."
ఉ. హరి. 5.197.

చూ. ఇరుచెవి యెఱుగకుండా.

ఇర్గాలిపసులు

ద్విపాదపశువులు.

మనుష్యులను నిందించుటలో అనుమాట. కాళ్ళసంఖ్యలో భేదమే కాని పసుసమానులే అనుట.

"ఇర్గాలి పసులగు గాళ్ళతా పసులు నిందింప."
పండితా. ప్రథ. పురా. పుట. 389.

చూ. ఇరుగాలిపసులు.

ఇఱియుకౌగిలి

బిగికౌగిలి.

"ఎగుగొత్తఁగా నేర్చె నిఱియుకౌఁగిటి యందు."
కవిక. 3.226.

ఇఱుకటమున బడు

చిక్కుకొను; ఇఱుకులో పడు.

"పెనుసందడిలో నిఱుకటమునఁ బడ్డన్న పని."
నైష. 4.124.

ఇఱుకటములు

తిప్పుడుమాటలు.

"ఈ యిఱుకటములు మాని, లేదు గొంకితి నని తెల్పుమ."
ద్వి. హరిశ్చ. పూ. 140214.

ఇఱుకాటము

సలము చాలమి.

"ఇల్లు ఇఱుకాటంగా ఉంది." వా.

"అక్కడ దారి యిఱుకాటంగా ఉంది." వా.

ఇఱుకాటంలో పడు

చూ. ఇఱుకులో పడు.

ఇఱుకున పడు

ఎటూ చెప్ప లేనిసితిలో పడు.

"వాడు వాణ్ణి ఎదుట ఉంచుకొని నన్ను నిలదీసి అడిగేటప్పటికి కాస్త యిఱుకున పడ్డాను." వా.

ఇఱుకుమ్రాను

తోటలకూ దొడ్లకూ చుట్టూ ముళ్ళకంచె వేసి దారిలో ఒక యిఱుకుమానును నాటుతారు. అది పంగలకొయ్య. మనిషి పట్టడానికి తగినంత సందే అందులో ఉంటుంది. దానిని

నేటికీ యిఱుకుమాను అనే
అంటారు.

"ఇఱుకుమాను వేస్తే గాని వాళ్లో పశు
వులు పడకుండా ఉండవు." వా.

ఇఱుకుమ్రాకులు

రథచక్రములక్రింద పోటీగా
పెట్టుకొయ్యలు.

"ఇఱుకుమ్రాఁకుల వైచి యే తెల్ల
యనుచుఁ ద్రోయించిన నింతైనఁ జెగల
దయ్యె." శుక. 2.12.

ఇఱుకులో పడు

సంకటావస్థలో చిక్కుకొను.

"వా డిప్పుడు ఇఱుకులో పడ్డాడు.
ఇప్పుడు దాదుకోక పోతే మనస్నేహం
ఎందుకు?" వా.

ఇఱుకులో సరుకుమంత్రంచేయు

చిక్కులో పడినప్పుడు దాని
నుపయోగించుకొని తన పని
గడుపుకొనుపట్ల ఉపయుక్త
మయ్యే పలుకుబడి.

"వా ళ్లేనో యిబ్బందుల్లో ఉంటే అప్పి
చ్చినట్టే యిచ్చి ఆపాలం వాడు ఇఱు
కులో సరుకు మంత్రం చేశాడు." వా.

ఇఱుచీకటి

కారుచీకటి.
అతిశయార్థద్యోతక మైన
ద్విరుక్తి.
ఇరులు = చీకటి.

"ఇఱుఁ జీకటి నిశల నింక నెవ్వండ
నుపునే." హర. 3.88.

ఇఱుముకొను

వ్యాపించు.

"ఇఱుసుకొనం దొడంగె దెస
లేచినచీకటి నంచు.—"
భా. రా. యు. 1084.

ఇఱ్ఱింకుచూపులు

తళుకుచూపులు.

"ఈక్షింపఁగా నేర్చె నిఱ్ఱింకుఁ
జూపుల." కవిక. 3.226.

నిలిచి నాచుచూపులకు వ్యతి
రిక్తము లయినవి.

ఇఱ్ఱింకు లింకించు

ఇంకునట్లు చేయు. లక్షణయా
అడఁగునట్లు చేయు.

"ఎవ్వాఁడు పింఛ్యాద్రి నిఱ్ఱింకు లింకించె
గంభీరహుంకారగర్జనముల."
భీమ. 2.77.

ఇఱ్ఱింకు లింకు

ఇంకిపోవు, ఎండిపోవు, నీర
సిల్లు.

"భౌమవారపు వీరభద్రపళ్ళెర సుడు
గృహాకైవతంబు లిఱ్ఱింకు లింక."
ఆము. 4.43.

"ఎండేని నఘము లిఱ్ఱింకు లింకు."
భీమ. 3.66.

ఇఱ్ఱింకులు చేయు

పోగొట్టు.
నైష. 7.993.

ఇఱ్ఱి గోఱజము

కస్తూరి.

ఇఱ్ఱిదీముభోగములు

చంచలము లైనసుఖములు.
ఇఱ్ఱిదీము మృగతృష్ణకు
తెలుగుమాట అనిపిస్తుంది.

"వెత్తి వలిసి లోఁకలి వెసఁ జుట్టుకొన్నట్లు, యిత్తిదీను భోగముల సేసేము."
తాళ్ల. సం. 8.174.

**ఇలకఱచు**

"మన సిలకఱచి ధైర్య మూఁత గాఁగ నిలిచి—"
భా. రా. యు. 702.
చూ. ఇల్కుఱచు.

**ఇలకోడి**

ఈలపురుగు.

**ఇలపేర్పున**

నేలకు దగ్గఱగా.
"మిక్కిలి పొడవు చనఁగ నెక విమానంబు, నిలపేర్పున కొంత సేరఁ బోనిచ్చె." కళా. 1.194.

**ఇలట ముండు**

ఇల్లట ముండు.
అల్లుడు పెండ్లి చేసుకొని అత్త వారింటిలోనే ఉండి పోవుట.
"వెల్మఁ డొక్కఁడు...అలివ నర్థించి యిలట నుండఁగ."
పండితా. ప్రథ. పురా. పుట 293.
చూ. ఇల్లట ముండు.

**ఇలలో కలలో లేనిమాట**

అసంభవము.
"వాడు ఆపిల్లను చేసుకుంటా డనుకోవడం ఇలలో కలలో లేనిమాట." వా.

**ఇలలో లేనిమాట**

అసంభవము.
"ఇలలో లేనిమాట చెప్తే ఏం లాభంలే!" వా.

**ఇలాకా వేసుకొను**

సంబంధము కలుపుకొను.
'మీరు యిలాకాలో ఎవరైనా పిల్ల లున్నారా' వగైరా చోట్ల మీకు సంబంధించినవారిలో అన్న అర్థం కానవస్తుంది. ప్రాంతం అనే అర్థంలో కూడా ఇలాకా వాడడం కద్దు.

**ఇలిభిక్ష బలిభిక్ష దొరకదు**

పరమలోభి కొంప అనుట.
ఎంత లేనివాడైనా ఇలి (ఈగ)కి యింత పెడుతుంది. అలాగే భూతబలిగా ఏముద్దో పెడతారు. ఆ మాత్రం కూడా లేనివాడనుట.
"వాళ్ళింట్లో ఇలిభిక్ష బలిభిక్ష దొరకదు." వా.

**ఇలి యిడు**

ఎంగిలి మెతుకులు విదిలించు.
"ఈఁగ కన్నఁడు నే నిలి యిడనివారు."
నైష. 7.53.

**ఇలుకరించు**

పండ్లు బిగబట్టి కోరలు కఱచుకొను.
"భూకాంత పెదవట్టుకుఁ గాక వదన మిలుకరింపఁ గాన్పించినపండ్లొ."
వరాహ. 10.30.
చూ. ఇలకఱచు.

**ఇలు చూఱ విడుచు**

నిలువుదోపువలెనే ఇంటిలో ఉన్న సర్వస్వాన్నీ యితరులకు ఇచ్చివేయు.
"నిశ్చలభక్తిం జోగులకును జంగాల

మీా, యిలు మూఁటవిడిచి యిటు రా,వల
యున్ వైష్ణవుల కొసఁగవల దేమైనన్."
శుక. 3. 71.

చూ. మూఁటగొను, మూఁటవుచ్చు.

## ఇలు డించి

ఇల్లు వదలి వేసి.

"హీనదశకు నోడి యిలు డించి పరదేశ
ములకు నిట్లు వచ్చితిమి." భోజ. 2.16.

## ఇలు తీర్చు

గృహము నిర్వహించు. ఇంటి పనులు నిర్వర్తించు.

"సుఖులై తలిదండ్రులు గూడి దేవి
యున్, దేవరవోలె నుండి యిలు
దీర్పఁగఁ గాపుర మొప్పఁ వానికిన్."
మను. 1.53.

## ఇలుదొర

ఇంటి యజమాని.

చూ. ఇలుఱేడు.

## ఇలు నించికొను

ఇంటికి కావలసిన వస్తుసామ గ్రిని సమకూర్చుకొను.

"ఇలునించికొనుట మొదలుగఁ, జలమున
మెండొడ్డి మిగులఁ జండించుచు..."
శుక. 3.344.

## ఇలు నింపడము

గృహప్రవేశము.

ప్రాను.

## ఇలు నెత్తిగట్టుకొని పోగల్గుదురే

ఎవరైనా ఏదైనా యివ్వక పోయినప్పుడు మీా కున్న దంతా చచ్చినతరువాత తీసుకు పోతారా అని నిరసనగా అనేమాట.

"ఇలు నెత్తిఁ గట్టుకొని పోఁ,గలుగుదురే
దివికిఁ దాము గడపటఁ బొరుగూ, రుల
వెంటఁ జనరే?" శుక. 3.183.

## ఇలుపట్టు

ఇంటిపట్టు.

"ఇలుప ట్టిమ్ములఁ బడసితి."
హరి. ఉ. 1.36.

## ఇలుఱేడు

ఇంటి యజమాని.

చూ. ఇలుదొర.

## ఇలువడి

సంప్రదాయము. కులీనత; అట్లా ముందుకు సాగి ఏర్పడిన అర్థం పాతివ్రత్యం.

"ఏటంపుఁ బద మగునిలువడి నూచి."
పండితా. ప్రథ. పురా. పుట. 479.

"వలను గులంబు లేని పరివారము
కోటియు నేల...ఇలువడి గల్గెనేని యిల
నెల్లను నేలఁగఁ జాలు."
భార. శాంతి. 3.103.

"కులమును రూపును బ్రాయము, నిలువ
డియుం గలుగునరున కీఁ గంటి నినున్."
రాజ. చ. 3.195.

"ఇలువడి ఘటశుద్ధి గలిగినకాంతలందు
నిలుతు." భార. అను. 1.285.

"ఇలువడి వదలుట యొగ్గు వొమ్మనక."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 125.

"కులసతి యనియెడు కూరిమి లేక,
యిలువడి గల దనియెడుప్రేమ లేక."
అదే. 285 పుట.

చూ. ఇల్వడి.

## ఇలువరుస

కులీనత్వము, గొప్ప వంశము నకు చేరి యుండుట.

"ఇలువరుసయు మానుషముం, గల రాజుల యిండ్లఁ గన్నెకలు పుట్టు చెడం." శుక. 3.521.
"ఇలువరుస చెడఁగ బం ధులు తల వంపఁగ..." భాగ. 9.382.
చూ. ఇల్వరుస.

## ఇలువాడు

గృహశుద్ధి చేయు. ఇండ్లలికి ముగ్గు పెట్టు.
"లలన యిలువాడి నాగుంచు, వలచిన చవి వంటకములు వండి."
భార. ఆను. 5.290.

## ఇలువుట్టు

దాసి, బానిస.
కేవలం ఆనాటి పనికి వచ్చిన వాడు కాక ఇంటి వంశ సగా వస్తున్న దాసుడు, దాసి.
"నంబి, కేతల్లి యేకోడు నేయిలు వుట్టు."
పండితా. ద్వితీ. మహి. పుట. 135.

## ఇలువుట్టు గొంతి

ఇలువుట్టు దాసి, బానిస.
వంశపరంపరగా ఇంటిలో దాసికి దాసికి పుడుతూ వచ్చింది.
"ఇలువుట్టు గొంతుల కెన గానినన్ను."
పండితా. ప్రథ. పురా. పుట. 473.
చూ. ఇలువుట్టు దాసి.

## ఇలువుట్టుచిన్న

దాసికొడుకు.
"మాయిలువుట్టు చిన్న, వడుగు సేయఁ గట్టవచ్చు మా దాసి, కొడుకు."
పండితా. ద్వితీ. మహి. పుట. 125.

## ఇలు వెడలు

బయలుదేరు.
పాండు. 5.207.

## ఇలు వెళ్లనీక

ఇంటినుండి బయటికి పోనీయక—ఆత్మాదరముతో చూస్తూ అనుట.
"ఎపుడు సంధ్యలయందు నిలువెళ్లనీక నన్నొనె కడుతల్లి యెంతో ఆలునాకొ..."
మను. 2.17.
"అతడు తనకొడుకును ఇల్లు దాటి వెళ్ళనీకుండా చూచుకుంటాడు." వా.

## ఇలువేల్పు

కులదైవము.
ఇలువేలుపు అని వాడుక.
ఆ యిలవేల్పే యిలువేలుపు.
నిరం. 4.31.

## ఇలుసూఱగా

ఇలుదోపిడిగా.
అనగా ఇంట నున్న సర్వస్వం అర్పించి అనుట.
"...తమయింటఁ గలయంత వట్టు ...ఇలుసూఱగా భక్తి నెలమి నర్పించి."
పండితా. ద్వితీ. మహి. పుట. 183.
చూ. ఇలు సూఱవుచ్చు.

## ఇలుసూఱ విడుచు

1. ఇల్లు కొల్లపెట్టు; పూర్తిగా వదలివేయు.
"ఇల నిట్టిచోద్యంబు లిటు దొల్లి నేఁడు వింధుమేయిలు సూఱ విడుతురే తొల్లి."
పండితా. ప్రథ. పురా. పుట. 494.
2. సర్వస్వమూ అప్పగించు.

"మిండజంగమునకు...బండరు విలు సూఱ విడుచు."

పండితా. ద్వితీ. మహి. పుట. 189.

రూ. ఇలు చూఱవుచ్చు.

**ఇల్కఱచు**

1. ఈలకఱచు – కఱచుకొని పోవు.

"రక్తధారల బెగడు గప్పిన, తెప్ప లిల్కఱచిన, డెంద మదరిన..."

పండితా. ద్వితీ. మహి. పుట. 474.

2. గట్టిగా పట్టుకొను.

"పండ్లీలకఱచుకొన్నాడు." వా.

చూ. ఇలకఱచు.

**ఇల్లంట్రము**

చూ. ఇల్లఱికము.

**ఇల్లంట్రకము**

చూ. ఇల్లఱికము.

**ఇల్లటము**

చూ. ఇల్లంట్రము.

**ఇల్లటపల్లుడు**

అత్తవారింటనే ఉండుఅల్లుడు.

**ఇల్లటపుటల్లుడు**

చూ. ఇల్లటపల్లుడు.

**ఇల్లడధనము**

దాపుడుధనము

చూ. ఇల్లడసొమ్ము.

**ఇల్లడపెట్టు**

ఇల్లడగా ఉంచు; ఒకరి ఇంట్లో ఉంచు.

"సహదేవు నిల్లడవెట్టి."

భార. విరా. 2.221.

చూ. ఇల్లడల్ పెట్టు.

**ఇల్లడ(ల్) పెట్టు**

ఒకచోట దాచుటకై ఇచ్చి ఉంచు.

"అలకలపాల్పు తేఁటిగములందు, మదాలసయానలీల హంసలకడ, వక్త్రభాతి జలజంబులపైఁ, దనుకోమలంబు దీఁగల దెస, దృగ్విలాసము మృగంబులచే నగజాత యిల్లడల్, గలయఁగఁ బెట్టె నాఁ దను వికాసము లేఁదెఁ దపఃప్రసంగతిన్." కుమా. 6.91.

**ఇల్లడమానిసి**

ఇల్లడగా పెట్టినమనిషి.

"ఈతనికి నిల్లడమానిసి నేను."

వి. పు. 5.151.

**ఇల్లడసొమ్ము**

ఒకరి దగ్గర దాచ మని యిచ్చినసొమ్ము.

**ఇల్లనారాయణమ్మ**

పరమలోభి.

'ఇల్ల' అంటే అరవంలో లేదు అని అర్థం.

ఎప్పుడూ లేదనేవా డనుట.

"వాడు వట్టి యిల్ల నారాయణమ్మ."

వా.

ఇల్లనారాయణమ్మ శతకము.

**ఇల్లఱికము**

అల్లుడు అత్తవారింటిలోనే ఉండుట.

"ఇల్లఱికం పెట్టుకొని మా పిల్లను ఇద్దామని ఉంది. కొడుకులు ఎలాగూ లేరాయె." వా.

చూ. ఇల్లంట్రము.

**ఇల్లలికిన పండు గగునా ?**
ఏదో కొంత తొలిపనులు జరిగి నంతమాత్రంతోనే అంతా అయినట్లు సంతోషింప రా దనుట.
ఇల్లలకడం పండుగలో చాలా ప్రాథమిక మైనపని.
ఆపని కాగానే పండుగ అయిన దనుకుంటే ఎట్లా ?
"త్రుళ్ళఁగ నేటికి నిలు నిలు, ముల్లలికినఁ బండు వగునె యింతటిలోనే, వల్లభునకుఁ గడు నచ్చిన, యిల్లాలివె ? యేను లాంతినే పోఁదోలన్." కళాపూ. 3.190.
సా. ఇల్లలకగానే పండుగవుతుందా ?

**ఇల్లలికి ముగ్గు పెట్టు**
అలంకరించు.
పండుగ పబ్బము లప్పుడూ, ఏదైనా శుభకార్యం జరిగి నప్పుడూ ఇల్లలికి ముగ్గు పెట్టడం ఆచారం. దీనిమీాద వచ్చినదే 'ఇల్లలుకగానే పండుగ అవుతుందా' అన్న సామెత.
"ఇల్లలికి ముగ్గు పెట్టి మ, హోల్లాసము పల్లవింప నొక్కొ సెలుంగుం, బళ్ళెమునఁ గోసి వైచిన..." శుక. 2.23.

**ఇల్లాది**
ఇంటిల్లిపాదీ, ఇంటిలోనివా రందరూ.

**ఇల్లాదివోవు**
ఇంటివా రందఱూ వెళ్ళు.
ఇంటిల్లిపాదీ అని నేటి వాడుక.
ఇల్లు వదిలి వలసపోవుటగా ఇక్కడ కానవస్తుంది.
"కరికాల మండలేశ్వరుఁడు, కావేరి గట్టింపఁ గడఁగి యిల్లాది,వోవనీక యేను వోయెద నంచు... వెట్టికిఁజను పెల్ల..." బసవ. 4.115. పుట.

**ఇల్లాపె**
ఇంటావిడ, ఇల్లాలు, భార్య.
"అవ్వా బువ్వ బు వ్వంచు ని,ల్లాపెన్ జీర్ణ పటాపకర్ష ముల నడ్డాడింపఁగా." పల్లభూ. పై. 21.

**ఇల్లామల్లి**
చూ. ఇల్లావల్లి.

**ఇల్లాలితనము**
పాతివ్రత్యము.
"తార కేయిల్లాలితనము తగ్గ." అహల్యా. 3.39.

**ఇల్లాలు**
గృహిణి, పతివ్రత.
"ఈ పాప నిచ్చెద నిల్లాలిఁగా నీకు." రుక్మాం. 5.77.
"ఆమె చాలా గొప్ప ఇల్లాలు." వా.

**ఇల్లావల్లి**
ఇటు సంగతులు అటూ, అటు సంగతులు ఇటూ చెప్తూ, తగాదాలు పెడుతూ ఉండే పిల్ల. తిట్టుగా ఉపయోగిస్తారు. చిల్లావల్లి అనడం వాడుక.
"అది వట్టి యిల్లావల్లి. దానితో ఏమీ పెట్టుకో వద్దు." వా.
చూ. ఇల్లామల్లి.

**ఇల్లాలు**
గృహిణి.

**ఇల్లిగ్గులు**
సంకోచములు.

"ఇల్లిగ్గులు గానవచ్చి హృదయములో నన్." ఉ. హరి. 5.166.
శ. ర. లోనూ—దాని నను సరించి కావచ్చు వావిళ్లని. లోనూ ఉన్న 'వెనుక కొంఱ గుటలు' అన్న అర్థం ఇక్కడ కుదురుట లేదు.

**ఇల్లిముక్కు**
ముక్కులో నెత్తురు కారే ఒక రోగము.

**ఇల్లు ఇరకటం ఇల్లాలు మర్కటం**
అన్నీ యిబ్బందులే అన్న అర్థంలో ఉపయోగిస్తారు. ఒక సామెత పై వచ్చిన పలుకుబడి.

"నా దంతా మహాయిబ్బందిగా ఉంది. ఇల్లు యిరకటం ఇల్లాలు మర్కటం." వా.
"ఇల్లు ఇరకటం ఇల్లాలు మర్కటం. సా.

**ఇల్లు కట్టుకొను**
శాశ్వతంగా ఉండు.

"నిరతమును నిల్లు గట్టుకొ మ్మరుగు మింక." సుకన్య. 59.

**ఇల్లు కళలం**
ఇల్లు ఇరకట మనుట.

"ఇల్లు కళలంగా ఉంది." వా.

**ఇల్లు కాలా**
ఒక తిట్టు.
'దాని, వాని' ఇలా కలిపే వాడుక.

"వా నిల్లు కాలా." వా.
"దానిల్లు కాలా. ఏమిరంపు చేస్తుం దమ్మా." వా.

**ఇల్లు గట్టుకొను**
స్థావర మేర్పరచుకొను, నివసించు.

"కొడుకులును దోడ రా నట్టడవిని నిలు గట్టికొంటి వటరా." పాండవాశ్వ.33.

**ఇల్లు గడచు**
జీవనము జరగు.

"ఇల్లు గడవడమే కష్టంగా ఉంది. ఇంక ఒకరికి ఏం పెడతాం?" వా.

**ఇల్లు గుల్ల చేయు**
కొంప పాడు చేసుకొను.

"ఇల్లు గుల్లఁగఁ జేసి యిల్లాలి నెగ రోసి వేశ్యకై యూరూరు వెడలువారు."
చింతా. 4.37.

**ఇల్లు చాలదు**
చాలినంత వసతి లేదనుట.

"పిల్లలందరు వస్తే ఈ యిల్లు చాలదు." వా.

**ఇల్లు చెఱచు**
కులనాశనము చేయు.

"బాలికాగ్రగణ్య లీలావతీకన్య, యిల్లు చెఱపఁ బోడమె నేమొ యనుచు."
శుక. 1.459.

**ఇల్లు చేరుకొను**
ఎక్కడికైనా వెళ్లి తిరిగీ యింటికి వచ్చు.

"అతను పొద్దున్నంచీ ఎక్కడ తిరిగినా సాయంత్రానికి తప్పకుండా ఇల్లు చేరుకుంటాడు." వా.

**ఇల్లుటాలు**

ఇల్లాలు.

"నందుని యిల్లుటా లగుయశోద." నీలా. 1.77

**ఇల్లు దోచిపెట్టు**

ఇంట నున్న దానిని యితరులకు పెట్టు.

ఇది తగి దనేభావం ఇందులో ఇమిడి ఉన్నది.

"చూచి చూడక యిల్లు దోచిపెట్టితిమి." అలుగురాజు. 67 పు.

"ఆపిల్ల కాపరానికి వచ్చిన మూడో రోజునుండే వాళ్ల వాళ్లకు యిల్లు దోచి పెట్టడం ప్రారంభించింది." వా.

**ఇల్లు నడపు**

సంసారము నడపు.

"గొల్లఁడు వ్యాధుఁడు రజకుఁడు కల్లమ్మెడువాఁడు లోనుగాఁ గొందఱు దా, రిల్లాలప్పరువం దగు, నిల్లు నడపు చనవు వాని కిచ్చినకతనన్." విజ్ఞా. వ్యవ. 80.

**ఇల్లు నిలుపుకొను**

వంశము నిలుపుకొను.

"వలదు సీత నిచ్చి నలినాప్తకులనాథు కొలువు పట్టి యిల్లు నిలుపుకొనుము." రామా. 7.74.

**ఇల్లు నిల్పు**

సంసారము పాడు గాకుండా నిలబెట్టు.

"శాపంబు తడకట్లు దీర్చి గౌతము నిల్లు నిల్పి." వర. రా. బా. పు. 156. పంక్తి 17.

**ఇల్లు బావురు మను**

ఎక్కువమంది ఉండి వెళ్లి పోగా శూన్యముగా తోచు.

"గండుగోజాలు తిరనాళ్లలాఉండినదా? పిల్లలంతా వెళ్లిపోయేసరికి యిల్లు బావురు మంటూ ఉంది." వా.

**ఇల్లును ముంగిలి జీవితమ్ముగా**

సంకుచితంగా; కూపస్థమండూకం వలె.

శరభాంక. 59.

**ఇల్లును వాకిలి చూచికొను**

కుటుంబ యాజమాన్యము వహించు.

"......సంపల్లాభంబున వేగ వత్తు నిపు డాత్మఁ ఖేదముం జెందకే యిలుఁ వాకిలిఁ జూచికొమ్ము మద మత్తేభేంద్రకుంభ స్తనీ!" తారా. 2.125.

వాడుకలో ఇల్లూ వాకిలీ చూచుకొను అని వినవస్తుంది.

**ఇల్లు నెత్తి గట్టుకొని పోవు.**

చూ. ఇలు నెత్తి గట్టుకొని పోఁగల్గుదురే.

**ఇల్లు పట్టక తిరుగు**

ఇంటిపట్టున ఉండక తిరుగు.

ఇల్లు చాలనట్లు లేదా ఇల్లు సరిపడనట్లు అన్న అర్థంలో ఆరంభమైనా, కడ కిది ఇంటిపట్టున ఉండక ఊరిలో తిరుగు

అన్న అర్థంలోనే నిలిచి పోయి నది.

"తానె తోతులకాంతు పదంబుకతన నిల్లు పట్టక తిరిగెను నివ్విధమున."
శుక. 2.138.

**ఇల్లు పట్టిన**
మగడు చనిపోగా పుట్టింటికి తిరిగి వచ్చివేసిన.

"ఇల్లుపట్టిన వెధవాడపడుచు కని మా నాన్న కొంతపొలం రాసి పోయాడు."
వా.

**ఇల్లుపట్టు విడుచు**
ఇంటిపట్టు వదలు.
ఇంటిపాటున అన్న రీతిగా ఈ ఇంటిపట్టు రాయలసీమలో నేటికీ వినబడుతుంది.

"బాంధవులఁ బాసి తమ యిల్లుపట్టు విడిచి."
ఉ. హరి. 4.47

**ఇల్లు పెటికి పందిరి వేయు**
1. ఉన్నదానిని పడగొట్టి అంతకంటె మర్వల మైన దానిని కట్టు.

"ఇలా యిల్లు పెరికి పందిరి వేసు కుంటారా? ఎవ రైనా?"
వా.

2. కేకలు వేయు.

"వాళ్ల నాయన యింటికి వచ్చి చూచా డంటే యిల్లు పెటికి పందిరి వేస్తాడు."
వా.

**ఇల్లు పెళ్లు**
ఇల్లంతా అనుట. జం.
పెళ్లు అనగా పెరడు. రాయల సీమలో ముఖ్యంగా చిత్తూరు ప్రాంతంలో ఈమాట నేటికీ బాగా అలవాటులో ఉంది.

"పీకను గాఁ జెడి నేఁ డిల్లుపెళ్ళు."
గౌర. హరి. ద్వి. 18.94.
రూ. ఇల్లూ పెళ్ళూ.

**ఇల్లు-పొల్లు**
ఇల్లూ వాకిలీ వంటిది. జం.
ఇల్లు పెళ్లు కావచ్చు నేమో!
పెళ్లు అనగా పెరడు, లోగిలి అని రాయలసీమలో వాడుక.

"లోలత్వంబున మత్తకాశినుల కిల్లుం బొల్లునుం జెల్లఁగా, నేలా వెచ్చము సేయ నెవ్వలన మన్నీలా ధ్యులం జాలరే."
పాండు. 3.42.

**ఇల్లు బంగార మగు**
భాగ్యము కలిసి వచ్చు.

"కరుణ గల్గిన నిల్లు బంగార మౌను."
శ్రవ. 1.103.

**ఇల్లు వాడ యెఱుగని**
అమాయకురా లయిన.

"తత్ప్రియభామయు బుద్ధిహీన యిలు వాడ యెఱుంగదు."
భోజ. 2.4.

**ఇల్లు వెయ్యిమొదళ్లు వర్ధిల్లు**
తామరతంపరగా వృద్ధి చెందు.

**ఇల్లూ ఇల్లాలూ**
జం.
సంసారం.

"వా డీమధ్యే నిమితపడ్డాడు. ఇల్లూ, ఇల్లాలూ, అదీ..."
వా.

**ఇల్లూ పెళ్లూ**
ఇల్లూ వాకిలీవంటి పలుకుబడి. జం.

"నువ్వు ఊరంతా చక్కబెట్ట నక్కఱ లేదు. నీ యిల్లూ వెళ్లూ చూచుకుంటే చాలు." వా.

మా. ఇల్లు సెళ్ళు.

**ఇల్లూరు**

ఇతరులది.

అర్థంలోనూ రూపంలోనూ ఇల్లడ కిది దగ్గఱగా ఉన్నది.

"ఇల్లూరను సంభావనతో నిలఁగాచితి." భాస్క. యుద్ధ. 2596.

"ఇల్లూరు సొమ్మును నేమఱు చొప్పఁ లేద." భాస్క. యుద్ధ. 2600.

**ఇల్లూ లేదు వాకిలీ లేదు**

వాడి కేమీ లే దనుట.

"వాడి కే ముందిక్! ఇల్లూ లేదు వాకిలీ లేదు." వా.

**ఇల్లూ వాకిలీ చూచుకొమ్మ**

నీ గృహకృత్యం నిర్వర్తించుకో.

బయటి వ్యవహారాలు నీ కెందుకు అనుట.

"ఇలున్ వాకిలి చూచుకొమ్మ మదమత్తేభేంద్రకుంభ స్తనీ!" శశాం. 2.187.

**ఇల్లెపు జేప**

చేపలలో ఒకరకము.

హంస. 4.187.

**ఇల్వాడి**

ఇలువరుస, కులీనత.

"రాముఁడు పెద్దకాల మటు రావణు నింట వసించియున్న యా, కోమలి సీతఁ దెచ్చుకొని కూరిమి నొందు దలంపకున్న వాఁ, డేమిటిమర్లొ రాసుతుల కెక్కడి ఇల్వాడి యంచు," పద్మ. 9.8.

అభిమానము అని వావిళ్ల నిఘంటువు. అది సరి కాదు.

మా. ఇలువడి.

**ఇల్వరుస**

కులీనత.

ఇల్వరిస్త (పాఠభేదం)

"ఇల్వరుస లాఱడి వోవఁగ." భాగ. 10. పూ. 992.

"వాళ్ల యిల్లువరుస సేసీగా మంచిది కాదు." వా.

**ఇవతళించు**

చల్ల నగు.

"ఇగురుచు కొమ్మ్కలఁ దన డెంద మివతళింప." మా. ఇవతాళించు.

**ఇవతాళించు**

చల్ల నగు, గడ్డకట్టు.

"ఇవతాళించె సుగంధగంధవహము!" దశా. 7.174.

"శిశిరకాలంబునం దివతాళించు కొలకుల..." హర. 4.14.

"నవనీహారపయోఘశీన్మలయజస్నానార్ద్ర పర్యంత మై, యివతాళించు విదర్భరాజతనయా హృద్యస్తనద్వంద్వమున్." శృం. నైష. 34.

**ఇవముకొను**

చల్లబడు.

"మంచున నివముకొంటి..." కాశీ. 6.44.

**ఇవముగొను**

చల్లబడు.

ఇవము = మంచు.

"మరందవృష్టిచే నివము గొనంగ." కళా. 4.80.

"ఎడలూని చీకట్లు నివము గొనుచు—" యయాతి. 1.116.
పాండు. 4.5.

## ఇవి చేతులు కావు కాళ్లు

ఎలాగైనా మీరు సాయపడాలి అని బ్రతిమాలుటలో పెద్దవారు చిన్నవారితో అను మాట.

"ఇవి చేతులు కావు కాళ్ళు. నన్నెలాగో రక్షించాలి." వా.

చూ. చేతులు కావు కాళ్లు.

## ఇవురబారు

ఇగిరి పోవు, ఇంకి పోవు. కవిక. 2.60.

"ఈసారి యెండ లధికమై ఆచెఱువంతా యిగరబారి పోయింది." వా.

## ఇవురొత్తు

పుట్టు, పొడసూపు.

"సిగ్గు మోమున నివురొత్తె." వెంక. పంచ. 3.39.

## ఇవుర్వంటకము

అత్తెసరు పెట్టి దించిన అన్నము.

"వండి గించినయివుర్వంటకంబు." కాశీ. 3.121.

చూ. ఇగురువంటకము.

## ఇష్టగోష్ఠి

ఇష్టాగోష్ఠి,
ఏదో ఒక కార్యసరణిగా కాక అవీ ఇవీ మాటలాడుకొనుట. నలుగురు కలిసి పిచ్చాపాటి మాట్లాడుకోవడం.

"మనుజేశుఁడు కొలిచిన పరి, జనములతో నిష్టగోష్ఠి సలిపెడిచో." మను. 6.71.

చూ. ఇష్టాగోష్ఠి.

## ఇష్టదేవత

అభిమాన దైవము. ఇలువేల్పు.

"అని యిట్లిష్టదేవతాప్రార్థనం బొనరించి—"

ఇత్యాదిగా తెలుగుప్రబంధములలో వాడుక.

## ఇష్టపూర్తి

ఇష్టము నెఱవేరుట.

## ఇష్టప్రకారముగా

తలచిన ట్లెల్ల, స్వేచ్ఛగా.

"వాడు తన కూతురు పెండ్లిలో ఇష్టప్రకారంగా ఖర్చు పెట్టాడు." వా.

## ఇష్టభోగములు

కోరినభోగములు.

"నువ్వీదేవాలయనిర్మాణానికి సహాయం చేశావంటే నీ కిష్టభోగాలు సమకూరుతాయని దేవుడు స్వప్నంలో వచ్చి చెప్పాడట." వా.

## ఇష్టలింగం

ఇష్టదేవత.

## ఇష్టాగోష్ఠి

"ఆదివారం అలా రండి, కాసేపు ఇష్టాగోష్ఠిగా మాట్లాడుకోవచ్చు." వా.

చూ. ఇష్టగోష్ఠి.

## ఇష్టాపత్తి

కోరిక తీరుట.

**ఇసడిలక**

విసు గొందక.

"ఇసడిలక మఱిగొయుఁ జని."

భా. రామా. అర. 2.6.

**ఇసిఱింతచూపులు**

కులుకు చూపులు. చిలుకరించు చూపులు.

"ఏ పువ్వుఁబోఁడుల యిసిఱింత చూపుల ఋషులగట్టిమనంబు లిగురు వెట్టు."

కాశీ. 3.169.

"మాపిన్నది యిసిఱింతల, చూపుల నరగంట వెదకుచు న్నినుఁ జూచుఁ."

నైష. 8.61.

**ఇసిఱింతలువాఱు**

చిలుకరించు.

"చిఱునగవు లిసిఱింతలు వాఱ."

హర. 5.152.

"మంతనములుఁ బెదవుల నిసి ఱింతలు వాఱంగ."

విక్ర. 8.87
హర. 5.51.

**ఇసిళ్లపుట్టలు పెట్టు**

విపరీతముగా సంతానం కను.

"పొదలిన పుత్రుల యిసిళ్ల పుట్టలు పెట్టెదము." తాళ్ల. సం. 9.51.

**ఇసుకగరుములు**

అటు యిసుక నేలా కాక, యిటు గరుగు నేలా కాక మధ్యస్థంగా ఉన్న భూమి— పొలమూ.

**ఇసుక చల్లిన రాలనంత**

అత్యధికంగా, చాలమంది.

కాశీ. 1.93.

"ఆ తిరునాళ్లకు ఇసుక వేస్తే రాలనంత జనం వచ్చారు." వా.

**ఇసుక జల్లిన రాలని**

దట్టముగా నున్న.

"మొల్లదీఁగెలనంటి యుడువడి యిసుకఁ, జల్లిన రాలక చల్లఁగాఁ బ్రబలు, నాకుఁ జప్పరఘులయందు."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 493.95.

**ఇసుకతక్కెడ - పేడతక్కెడ**

ఒకరిని మించిన మోసగాడు మరొకడనుట.

జానపదకథపై వచ్చినపలుకుబడి.

"వాళ్లిద్దరూ చేరితే బాగానే ఉంటుంది. ఒకరు ఇసకతక్కెడ, మరొకరు పేడ తక్కెడ." వా.

**ఇసుకత్రాడు పేనగల**

ఇసుకతో త్రాడు పేనగల.

అసాధ్యకార్యములను చేయ గల నేర్పరి అని నిరసనద్యోతకంగా అనుటలో వచ్చిన పలుకుబడి.

పండితా. ప్రథ. పురా. పుట. 359.

**ఇసుకతిన్నె**

ఇసుకదిబ్బ, సైకతస్థలి.

**ఇసుకపాతఱ**

తఱుగు లేనిది.

"అనఘ! వేశ్యావిడంబవర్తనము లెన్న నిసుకపాతఱ యాఁజోలి యేల త్రవ్వ?"

వైజ. విలా.

**ఇసుకరాజనములు**

ఒక రక మైనవడ్లు.

ఇసుకలో నూనె
వట్టిది.
బాల. నీతి. 5.

ఇసుక వేసిన రాలని
అతిదట్టముగానున్న, క్రిక్కి-
సిరి ఉన్న.
"చాల దోయిట నెత్తి చల్లిన నిసుము
రాలని యట్టి యరణ్యాంతరమున."
బసవ. 5. 137 పు.
"అబ్బబ్బ! ఏం జనం. ఇసుక వేస్తే
రాలదు." వా.
"ఇసుకవేస్తే రాలనంత జనం—" వా.
రూ. ఇసుక వేస్తే రాలని.

ఇసుమంత
కొంచెము.
"ఇసుమంత దాన మీఁ గలిగిన."
రుక్మాం. 2.61.

ఇసుమంత తింగణావు
ఇంత లేవు !
"సంగతియె యోయి! యిసుమంత
తింగణావు." ఆము. 4.60.
"ఇంత లేవు! నీ వూ ఆ జ్ఞే పిం చే
వాడివే." వా.

ఇసుము దాగిననీ రగు
అనుభవమునకు దూర మగు.
"ఊహల నా భోగ మెల్ల ఒళ్లఁ బట్టె
నంటా మంటె, దాహముతోడ నిసుము
దాఁగిననీ రాయగా." తాళ్ల. సం.8.41.

ఇసుమున గట్టు దాల్పగల
ఇసుకతో ఏటికి గట్టు కట్టగల.
అసాధ్యకార్యములను చేయ
గల జాణ అను నిరసన
ద్యోతక మైనపలుకుబడి.
కవమా. 8.135.

ఇసుర్రాయి గాలికి పోయినట్లు
తిరిగి రాకుండా అనుట.
విసురురాయి గాలికిపోదు.
పోతే యిక రాదు. ఇది
రాయలసీమలో నేటికీ వాడు
కలో నున్న పలుకుబడి. విసురు
రాయి, ఇసురురాయి అంటే
తిరగలి.
"వాడు ఇసుర్రాయి గాలికి పోయినట్లు
పోయినాడు. అంతూ పొంతూ లేదు.
ఆరునెల్లయింది." వా.

ఇసుళ్ళ పుట్టవంటి
విపరీతంగా జనం ఉన్న.
"తిరునాళ్లకు విపరీతంగా జనం వచ్చారు.
ఆప్రదేశమంతా యిసుళ్ల పుట్టలా గా
ఉంది." వా.

ఇసూ్కలుచీలలు
మరచీలలు.
కాశీయా. 30.

ఇహపరములు
ఈలోకము, పైలోకము.
చనిపోయిన తరువాత పుణ్య
లోకాలకు వెళతారని ఒక
నమ్మకం.
"వారల కెగ్గు సేసినం, జెడు నిహాముం
బరంబు..." భార. ఆది. 1.139.
"ఈ పని చేస్తే యిహపరసాధకంగా
ఉంటుంది." వా.
చూ. ఇహామాశ్శి; పరమాశ్శి

**ఇహమా పరమా ?**

ఈ పని బాగా తృప్తిగా నిష్పత్తియో జనం అనుపట్లు ఉపయోగిస్తారు.

ఇటు ఈలోకంలో వచ్చే లాభం లేదు. కనీసం అటు పుణ్యం వస్తుం దనడానికీ వీలు లే దనుట.

"అట్లాంటి చండాలునికి సహాయం చేస్తే ఇహమా పరమా ?" వా.

చూ. ఇహపరములు.

**ఇహాముత్రఫలము**

ఇహపరసౌఖ్యము.

ఇహాముత్రఫలములను విసర్జించిన యతడే నిజమైనసన్యాసి కాగలడు—అని వేదాంతం.

**ఇహాముత్రఫలభోగవిచారం**

ఇహపరసుఖావాప్తిని గూర్చిన విచారము.

ఇది మోక్షసాధన మని వేదాంతుల నమ్మకం. వేదాంతపరిభాష.

**ఇహాముత్రసౌఖ్యములు**

ఇహపరసౌఖ్యములు.

**ఈంద్రము సేయు**

నిర్బంధించు.

"ఎన్నడు నినుఁ బట్టు మనుచు నీంద్రము సేయన్." భాగ. 8. 565.

**ఈకంటికి ఈరెప్పలు దూరం కావు**

అవి రెండూ సన్నిహితమైనవే అనుపట్లు ఉపయోగిస్తారు.

"ఈ కంటికి ఈరెప్పలు దూరం కావు నాయనా! మీ అన్న నిన్ను చూచు కొంటూనే ఉంటాడు." వా.

**ఈకకు ఈక, తోకకు తోకగా**

దేని కదిగా; విమర్శించినా స్తే సూక్ష్మపరీక్ష కిది నిలువ దను సట్ల అనేమాట.

కోడిపెట్టలలో బలమైనదానికి ఈకా, తోకా తీసివేసినా తగినంత మాంసం ఉంటుంది. దుర్బలమైనదానికి బొచ్చు తీసి వేస్తే మిగిలేది తక్కువ. అందుపై వచ్చిన పలుకుబడి.

"ఈకకు ఈక తోకకు తోక తీసివేస్తే ఇందులో మిగిలేది నా కేమీ కనిపించడం లేదు." వా.

**ఈక తోక లేని**

తలా తోకా లేని; అందని పొందని.

"ఈక తోక లేని యీ కృష్ణమాటలు పొలఁతి నమ్మి నానఁబోసి కొనియె." రాధి. 3.23.

**ఈకొను**

అంగీకరించు.

"మదీయవాక్యముల కీకొనవో." రాధా. 1.91.

చూ. ఇయ్యకొను.

**ఈకోలు**

అంగీకారము.

చూ. ఇయ్యకోలు.

**ఈగకంటనైన పడకుండ**

ఎవరికీ తెలియకుండా.

"ఈగకంటనైనఁ బడకుండునంత రహస్యముగఁ దీసికొని వచ్చితిని." చింతా. 4.44.

**ఈగకు ఇలి పాముకు బలి పెట్టని**

అతిలోభి యైన.

"ఈగకు ఇలి పాముకు బలి పెట్టనివాడతను." వా.

చూ. ఈగకు కాటు పాముకు బలి ఇవ్వని.

**ఈగకు కాటు పాముకు బలి ఇవ్వని**

అతిలోభి యైన.

"ఈ భువిఁ బాముకుం బలియు నీఁగకుఁ గాటును నీక యెంతయున్, లోభపరాయణాత్మకులలోనఁ బ్రసిద్ధుఁ డితండనంగ..." హరి. 4.100.

"ముంచి యీఁగకుఁ గాటు పామునకు బలియు, నొసఁగఁ డని భర్తకై పొక్కునువిద మదిని." పాండు. 4.149.

చూ. ఈగకు నిసురు పాముకుబలిపెట్టని; ఈగకు ఇలి పాముకు బలిపెట్టని.

**ఈగకు తవుడు లేదు**

ఏమాత్రం ధాన్యం లేదు అను పట్ల అనేమాట.

"కటకటా యింత లింగసమర్థుఁడయ్యు, నిట యీఁగకును దవుడింటిలో లేదు." బసవ. 4.97.

**ఈగకు నిసురు పాముకు బలి పెట్టని**

మిక్కిలి లోభి యైన.

"సామీ! పలుమఱు దేవర, కేమని విని పింతు నింక నీఁగకు నిసురుం, బామునకు బలియుఁ బెట్టక, యా మసలిగ రాసు పిసిఁడి యై వర్తించుఁగా." విప్రనా. 3.16.

చూ. ఈగకు ఇలి పాముకు బలిపెట్టని.

**ఈగకు పోక పెట్టినట్టు**

ఆసక్తి లేక ఉండు.

ఈగముందు బెల్లం పెడితే అది ఆసక్తి కనబరుస్తుంది. పోక పెడితే అది తన కేమీ కాబట్టనట్లు ఉంటుంది. అందుపై వచ్చినపలుకుబడి.

"మిన్నకున్నారలిది యేమి మీరు ముగుర, యీఁగకును బోక వెట్టిన యట్టి భంగి, హెచ్చుగుం దింతమాత్ర మిందేని గలదె, మిగులఁ గోపంబు మీకు లేమి యును వోఁచె." క్రీడాభి. 1.246.

**ఈగడ**

జాడ, పోవడి.

"హంసి యీగడ యొక కొంత దొరకునో యంచు." ప్రభా. 4.3.

**ఈగపులి**

ఒకరకమైనసాలెపురుగు. వాడుకలో కూడ దీనికి ఈగపులి అనేపేరు. ఇది ఈగలను పట్టుకుంటూ ఉంటుంది.

**ఈగలు మూగుచుండు**

అపరిశుభ్రముగా ఉండు.

"వాళ్లిల్లు ఎప్పుడూ ఈగలు మూగుతూ ఉంటుంది." వా.

**ఈగ వాలితే జాఱు**

మిక్కిలి నును పైన.

"ఈఁగ పైఁబడజాలు నీ యిందువదన
బా గైనపాపట పై జీలువాఱె."
గౌర. హరి. ప్ర. 1601-1602.
"ఆ గోడలమీద ఈగ వాలితే జాఱి
పోతుం దంటే నమ్మి. అంతా పింగాణి
పూతే." వా.

ఈగ వాలనీయకుండు

ఏమాత్రమూ నొప్పి తగల
నీయకుండా చూచుకొను;
ఒక్క రొక్క మాట అనినా
ఓర్చుకొనక పోవు.
ఇది ఏ ఒకరిమీదనో
"ఈగ..." అనే ఉంటుంది.
"ఆ ఊళ్లో అత నంటే మహాగౌరవం.
ఆతనిమీద ఈగ వాల నీయరు." వా.

ఈగిచేయి

దానము చేయుచేయి; ఎముక
లేనిచేయి.
"ఈగిచేయి మాటికొనఁ డేని."
వసు. 1.34.

ఈగిమ్రాను

కల్పవృక్షము.

ఈగుల కెంపు

చింతామణి.

ఈచవడు

కృశించు, నిస్సార మగు,
ఈడిగిలబడు.
"కా లీచవడఁ జరింపుదు, నీలోకము
నందు." పాండు. 2.204.
"కా లీచవడ నిండ్లకడ కేఁగి."
పాండు. 4.210.

ఈచవోవు

సన్నవడు.
"ఈచవోయినచేతులు."
ఉ. హరి. 2.122.
2. బీటువోవు, పంట పండక
పోవు.
"తటితోడ వి త్తినఁ దఱచుగాఁ బండు
చే, సెపు డైన వి త్తిన నీచవోవు."
నీతిసీస. 83.
చూ. ఈచుకపోవు.

ఈచుక పోవు

సన్నవోవు.
చూ. ఈచవోవు.

ఈచెవిగాడు పాచెవి బోవు

చాలా ఎండగా ఉండు.
వేడిగాడ్పుల విషయంలో ఉప
యోగించేపలుకుబడి.
"ఏచి యీచెవి గాడు పాచెవిఁ బోవంగ
నుబ్బి లింగమువోలె నుండు నెండ."
పాండు. 2.29.
"ఈ అగ్గిలో బయట కెలా పోతాం. ఈ
చెవిలో గాడుపు ఆ చెవిలో దూరి
పోతూంది. రోహిణికార్తి వచ్చింది
మఱి." వా.

ఈ చెవిలో గాలి ఆచెవిలో దూరు

గాలి చాలా విపరీతంగా వీచు.
"అబ్బబ్బ! ఈ చెవిలో గాలి ఆ చెవిలో
దూరుతోంది. ఎలా వెళ్లగలం?" వా.

ఈ చెవిలో మాట ఆ చెవిలో దూరిపోవు

ఏ మంచిమాట చెప్పినా వినక
పోవు; మనసులో ఉంచుకొనక
మఱచు.

"వాడి కేం చెప్పి ఏం లాభం? ఈ చెవిలో మాట ఆ చెవిలో దూరి పోతుంది." వా.

**ఈ చేతితో చేసి ఆ చేతితో అనుభవించు**

చేసినదానికి వెంటనే ఫలితం అనుభవించు.

"వాడు ఈ చేత్తో చేసి ఆ చేత్తో అనుభవిస్తూ ఉన్నాడు. ఇంకా తెలివి రాలేదు." వా.

**ఈటారు**

తడియారు, గంజి యింకు.

"జలము లూటలు గ్రమ్మ శశికాంత పాషాణ, నికరమ్ము లీటాఱి నీరుదివియ." శాకుం. 3. 202.

"అన్నం యింకా స్త యీటారితే బాగుంటుంది." వా.

**ఈటార్చు**

వెంట్రుకలు తడి యార్చు.

"వేణి నీటార్చి సురపొన్న విరులు ముడిచి." హరవి. 2.107.

**ఈటు లేని**

ఈడు లేని; అసమాన మైన.

"ఈటు లేనిశ్రీ వెంకటేశుఁ డితడు." తాళ్ల. సం. 9.120.

చూ. ఈడు లేని.

**ఈటు వోవు**

పంట ఒడుపుకోని వదలిపెట్టి వేయబడు.

"ఆ చేను ఈటు వోయింది." వా.

**ఈటెకాడు**

సైన్యంలో ఈటె ధరించే సైనికుడు.

"కొని మిట్టిపడవైచు కొంతంబుకాని బి, ట్టెడ లిచ్చి పోవైచునీటెకాని." కుమా. 11.40.

చూ. కొంతమువాడు.

**ఈడబడు**

వెనుకపడు, పాతబడు.

"ఏల ఎన్నోతరంబుల నీడబడ్డ, పెద్ద వావులు శోధించి గుద్దలింప." హర. 7.128.

**ఈడబోవు**

వెనుదీయు.

"ఈడం బోక పెనంగిన." భార. విరా. 3.133; 5.63.

"అప్పటి పటుభల్లఖండితకృపాణునిఁ జేసిన నీడఁబోక." భార. కర్ణ. 1.150.

"రాక్షసు డీడఁ బోక...వ్రేసె." నిర్వ. 4.52.

**ఈడవిడుచు**

దిగవిడుచు; ఈటు విడుచు. చేను ఈటు వోయినది, చేను ఈటు విడిచినారు అంటారు. అంటే పంట వడుపుకోని వదలి వేసి రనుట. పశువులకూ వానికీ వదలిపెట్టుట. లక్షణయా గాలికి వదలివేయుట. అదే ఈడవిడుచుట కూడా.

"దనుజుఁ జేకొని దయతో, నెప్పుడు వర, మిచ్చితి నీ వప్పుడ మది నీడవిడిచి తమరుల నెల్లన్." కుమా. 4.19.

"త్రివర్గేచ్ఛ యెవ్వనిచేత నీడ విడువఁబడు." భార. అశ్వ. 1.203.

**ఈడాడు**

పోటీపడు, కలియబడు, పోరాడు.

"వీరభద్రుండు...ఏడు జిహ్వలు వెర్కి.
యీడాడినట్లు."
పండితా. ద్వితీ. మహి. పుట. 9.

"ఓడ కోడక దేవి యుగ్రరాక్షసుని
నీడాడి నీచెఱ నే విడిపింతు."
రంగ. రా. అర. 181. పుట.

**ఈడిగిలబడు**

వెనుకకు కూలబడు.

"వాడు అంతదూరం నడవ లేక ఈడిగిల
బడుతూ ఈడిగిలబడుతూ వచ్చాడు."
వా.

చూ. ఈడిగలు.

**ఈడిగిలు**

"ఆపెనసరి వజ్రాలు మొలవెట్టుచు
నీడిగిలక." జైమి. 2.111.

చూ. ఈడిగిలబడు.

**ఈడిగిల్లు**

చూ. ఈడిగిలు.

**ఈడు కాదు**

సమ ఉజ్జీ కాదు.

"చూచెదరు గాని సభికులు, నీ చిన్ని
కుమారకులకు నీ మల్లురకుఁ, ఓ చెల్ల!
యీడు కా దని, సూచింపరు..."
భాగ. పూర్వ. 10.1351.

ఇది నేటివాడుకలో వివాహ
విషయంలోనే మిగిలినది – ఆ
పిల్ల వీడికి ఈడు కాదు అను
రీతిగా.

"అంత దృఢంగా వున్న పిల్లకు ఈ
జేనెడు వెధవ ఎలా ఈడవుతాడు." వా.

**ఈడు చాలదు**

తగినంత వయసు లే దనుట.

"వాని కివ్వడానికి మాపిల్ల ఈడు కాదే
అనే నా ఆలోచన." వా.

**ఈడు జోడాడు**

ఒకటి నొకటి అతిశయించు;
ఒకరిని మరొకరు మించు.

"అట్లు మామయు నల్లుండు నఖిల
బంధు, సుమతియును నీడు జోడాడి
సంభ్రమింప... రాజశే. 3.190.

"దరస్మిత క్రీడాభరంబు లీడు
జోడాడ." శుక. 1.133.

**ఈడుజోడు**

1. సమానము. జం.

"నీకు లోకములయందు నీడుజోడును
లేదు." దశా. 2.80.

"వసుధఁ బుట్టెడు పెరిఁగెడువారిలోనఁ,
గని విని యెఱుంగ మంతటి ఘనుని
నార, యీడుజోడును సరిసాటి యందు
లే ద,తం డమర్త్యుండు గాక మర్త్యుం డె
తలఁప?" సారం. 155.
పాండు. 1.46.

2. వివాహానికి వధూవరుల
అనురూపత.

"వీ ళ్లిదరికీ పెళ్ళి చేస్తే చక్కని ఈడు
జోడు." వా.

**ఈడుపడు**

సమాన మగు, సరిపడు–కుదురు.
పాండు. 1.46.

దక్షిణాంధ్రంలో నేటికీ విన
వస్తుంది.

"ఆ ఊరికి పోయి చాలా ప్రయత్నం
చేశాను. కానీ ఆపని యీడు పడ
లేదు." వా.

చూ. ఈడ్వడు.

**ఈడుబండాడు**

పరుగెత్తు.

"పందేల్లఁ గన్నట్టి పక్కాలభాతి,

నెందును నిలువక నీడుబండాడు, నింద్రి యంబుల గెల్వ నెవ్వరివశము !"
ప్రభులిం. 13.106.

ఈడు మీఱు

రజస్వల యగు.

"ఈ డెఱుంగని చేడియ యీడు మీఱె." రాధికా. 1.69.

ఈడుముంత

పాలముంత.

గొల్లవాళ్లు దీనిని ఉపయోగిస్తారు.

ఈడువచ్చు

1. సమాన మగు; పోలు.

"దాడిమీఫల బీజాదులు నద్రిజావయవసౌభాగ్యంబుతో నీడు రాఁగలవో లేవో." కాశీ. 1.100.

2. వయసు వచ్చు.

"ఈడు వచ్చినపిల్లను ఇంట్లో ఎన్నాళ్లు పెట్టుకొంటాము." వా.

ఈడువారు

1. సమానులు.

"నా యీడువారు కారు."
వరాహ. 6.33.

2. సమవయస్కులు.

"రాగమంజరియన నొప్పు రాజసుతయుఁ దాను నొక యీడు కాఁగ."
విక్ర. 1.116.

"వాళ్లిద్దరూ ఒక యీడువారు." వా.

ఈడు వెట్టు

సమానము చేయు; పోల్చు.

"చక్కని కన్నుల సూర్యచంద్రులుగాఁ గలవాఁడు, ఎక్కడుగా కిందటిలో నీడు వెట్టెదా ?" తాళ్ల. సం. 9. 56.

ఈడు సేయు

పోల్చు.

"దోసము గాదె యియ్యాలివతోఁ బెఱ త్రొయ్యాలి నీడుసేసినన్."
కవిక. 3.28.

ఈడేరి మొనకు వచ్చు

పెరిగి పెద్ద యగు.

"పుట్టినప్పుడు నిన్ను భూసుర లెల్లఁ బట్టభద్రుం డని పలికిరి గాని ముందర నీడేరి మొనకు రా వనుచు నెందుకోసము నిర్ణయింపలే రెరి."
సారం. ద్వి. 2.517.

ఈడేఱించు

సఫల మగునట్లు చేయు.

"సోమతీర్థ మహేశ్వరుఁ డిట, నా ప్రయాస మీడేఱించెన్." శకుం.4.24.

ఈడేఱు

1. రజస్వల యగు.

"ఇ, ట్లీడేఱి కట్టుదప్పిన, చేడియ కిఁక నైనఁ బెండ్లి సేయం దగదే."
యయాతి. 3.100.

2. సఫల మగు, కృతార్థు డగు.

"నీ కథలు విని విని మే మీడేఱితిమి."
తాళ్ల. సం. 6.161.

ఈడేఱుచు

కడ తేర్చు.

"మమ్ము నొక చొప్పున దుఃస్థితి నొందకుండ నీడేఱుపు మయ్య."
వేంక. పంచ. 1.304.

ఈడేర్చు

1. సఫలము చేయు.

"కోర్కు లీడేర్చు."

2. కడ తేర్చు.

"నన్ను నీదేర్పఁ దలంచి మానవుని
శేవను వచ్చినశంకరుండవో."
సారంగ. 3.185.

**ఈదేర్చుకొను**

సిద్ధింపజేసికొను.

"ఇంత లాఘవుచేసి, ఈదేర్చుకొని రాఁగఁ
దొల్లి యేరి కైనఁ జెల్లెనయ్య."
రామా. 7.7.

**ఈడ్వడు**

సరివచ్చు.

"పనసలం బోలుచుం గలుగుండ్లతోడ
నీడ్వడుపెనుబండ్లు." అముక్త. 1.68.
చూ. ఈడుపడు.

**ఈడ్వబడు**

లాగబడు.

"తలవట్టి యీడ్వంబడి." విరా. 1.313.

**ఈడ్గిలబడు**

చూ. ఈడిగిలబడు.

**ఈడ్గిలు**

చూ. ఈడిగిలు.

**ఈతకాయ**

ఈదుకాయ.

నీళ్లల్లో తేలుటకై సొరకాయ, మునగబెండ్లు మొదలయిన వానిని వీపునకు, నడుమునకు కట్టుకొంటారు. వానిల్లోదే ఈతకాయ.

"తేల్పవె యీతకాయరూపై."
పాండు. 2.57.

**ఈతకు గానిలోతు లేదు**

సమర్థునకు అసాధ్యము లేదనుట.

ఈతకు మించిన లోతు లేదని వాచ్యార్థం. ఈత వచ్చిన వానికి ఎంత లోతుంటే నేమి అనుట.

"పీడనాడకు మాకు విత్తమింతనిన, లోఁగి యీఁతకుఁ గాని లోఁతని జట్టి, వీఁగక... గౌర. హరి. ద్వి.

**ఈతకు మించిన లోతు లేదు**

దాటరాని కష్టాలుండవనుట.

చూ. ఈతకు మిక్కిలి లోతు కల్గునే?

**ఈతకు మిక్కిలి లోతు కల్గునే**

1. కష్టాలకు తల ఒగ్గినతరువాత, అవి ఎన్ని అయితే నేమిటి? అనుట.

ఈదడానికి సిద్ధపడ్డ తర్వాత ఇక ఎంత లోతుంటే నేమి? అని వాచ్యార్థము.

"ఈఁతకు మిక్కిలి లోఁతు గల్గునే."
రుక్మాం. 4.22.

2. చేతనైనవానికి అసాధ్యము లేదనుట.

విజయ. 1.167.

"ఎంతపని అయితే నేమి? చేస్తున్నాం గదా? కానే అవుతుంది. ఈతకు మించినలోతు ఉంటుందా?" వా.
చూ. ఈతకు గాని లోతు లేదు.

**ఈతకు లోఁతు కలదా?**

చూ. ఈతకు మిక్కిలి లోతు కల్గునే.

**ఈతగింజ యిచ్చి తాటిగింజ లాగు**

కొంచె మిచ్చి ఎక్కువ లాగికొను.

"వాడు మంచినీ ళ్లిచ్చాడంటే సంతోషించకు. వాడు ఈతగింజ యిచ్చి తాటిగింజ లాగే రకం. రేపే వచ్చి మీ యింట్లో కాఫీ తాగి వెడతాడు," వా.

**ఈతబంటి**

తలమున్కలగునది; దుస్తరమైనది.

దాట శక్యము కాని దనుట. ఏటికి వరద వచ్చిం దనడానికి పెన్న ఈతలకు పారుతూం దని రాయలసీమలో నేటికీ అంటారు.

"...నాచే బడినజంతువుం గృతాంతు నంతవాని కైన బలవంతంబున విడిపింప నీతబంటి..." జైమి. 7. 211.

"అట్టి భవదీయ చటుల బాహాప్రతాప, విక్రమాటోపమున కంగవించి నిలువఁ, బద్మగర్భాదులకు నీతబంటి యనినఁ, జెక్కు మీటిన వసవల్చుశిశువు లెదురె." జైమి. 6.245.

**ఈతముల్లు విరుగదొక్కే కాలం**

మాంఛి వయసు.

ఈతముల్లును కూడా విరిగిపోవునట్లు తొక్కే వయస్సు అంటే ఏవిధ మైనఆటంకాన్నీ లెక్కించని వయ స్సనుట. ఈతముల్లు తొక్కినా ఏరగదు. అది కాలిలో దిగితే విపరీత మైననొప్పి.

"వాని కేం కన్నూమిన్నూ తెలుస్తుందా? ఈతముల్లు విరుగ దొక్కేకాలం." వా.

**ఈతల**

ఈవల, ఇవతల.

"ఈతల యుగమున." కాళ. 2.93.

"ఆతల నీతల దేశములు." కాళిందీ. 6.223.

**ఈతలకు పారు**

నిండుగా ప్రవహించు.

ఈదుటకు మించి అనుట.

"పెన్న యీతలకు పారుతున్నది." వా.

చూ. ఈతలకు వచ్చు.

**ఈతలకు వచ్చు**

నిండుగా ప్రవహించు.

ఈదుటకు మించి అనుట.

"ఏరు ఈతలకు వచ్చింది." వా.

చూ. ఈతలకు పారు.

**ఈతలాతల**

ఇటూ అటూగా.

"ఒక నిమిష మీతలాతల వస్తాను." వా.

**ఈతలాత లగు**

1. అట్టిట్టగు, తారుమారగు.
2. ఇటూ అటూ అగు.

"దర్పకబాణంబు నీతలాత లైనఁ." వరాహ. 11.55.

"రావడం కాస్త యీతలాత లవుతుంది. నాకోసం కనిపెట్టుకొని ఉండవద్దు." వా.

**ఈతలు పోతలు నగు**

అత్యధిక మగు, పొంగారు.

"లోన నీతలుం బోతలు నైనయట్టి తలపోతలు." శశాం. 3.58.

**ఈతలు మోతలు చేయు**

నానాబాధలు పెట్టు.

"కొంచగాఁ డని యెంచకుఁడు దశాననుని ముంచి మీ కీఁతలు మోఁతలు చేయు."
వర. రా. కిష్కి. 512 పు. పంక్తి. 5.

## ఈతలు మోతలు నగు

ఛిన్నాభిన్న మగు, దుర్భరమై పోవు.

"ప్రాఁత యగు మంత్రి తన కపం, జేతజికము జేసె ననుచు శిక్షించి యొరుల్, లాఁతిం బెట్టిన సీఁతలు, మోఁతలు నై రాజు విడుచుఁ బొందక మూకల్."
పంచ. (నారా) (మి. భే) 290.

## ఈత విడుచు

ఏ సంస్కారమూ లేక వదలి వేయు, గాలికి వదలిపెట్టు. ఈదురు గాలి అని కూడా ఉంది గనుక ఈ అర్థమే ఇక్కడ. ఇదే అర్థంలో ఈటు విడుచు కూడా ఉన్నది.

"ఈత విడిచిన మేదీఁగె యింత నయము, కలిగి యున్నది వాడుక కలిగె నేని, నెంత వరకమై యుండునో."
కుమా. 7.7.

## ఈదా డన్న కోదా డను

ఎతి అంటే ప్రతి అను, ప్రతి మాటకూ వ్యతిరేకించు.

"మీదట్ వియోగసాగర, మీఁదం గలవా లతాంగి! యే మెఱుఁగ వయో!, యీఁదా డన్నను మదనుఁడు, గోఁదా డనువాఁడు బిగువు కొనసాఁగు నొకో!"
విజ. 2.192.

"వానితో ఏపనీ చేయించుకో లేము. ఈదాడంటే కోదా డనేరకం." వా.

## ఈదాడు

నిమగ్న మగు.

"ఇల నాచిత్తము యోగసాధనలయం దీఁ దాడెఁగా" సర్వేశ. 93.

## ఈదాఱు

తడియాఱు.

"నులివాయం గుంజి యీఁదాఱఁ జె,న్నార న్వైచినజాలమో." కాశీ. 4.96.

## ఈదుకొంటూ

కొంత ప్రయాసపై జీవనము చేస్తూ.

"ఈ పిల్లల నందరినీ యెదాన వేసుకొని ఏదో సంసారం యీదుకొంటూ వస్తున్నాను" వా.

## ఈదుగాయ

హంస. 4.182.
చూ. ఈతకాయ.

## ఈదుగొయ్య

హంస. 4.182.
చూ. ఈదుగాయ.

## ఈదురుగాలి

చలిగాలి.

"ఈదురుగాలిలో తిరిగితే జబ్బు చేస్తుంది." వా.

## ఈదురో మను

ఎందుకు పుట్టామురా భగవంతుడా అన్నట్లుండు.

"ఏమిట్రా అలా ఈదురో మని ఉన్నావు." వా.
చూ. ఈసురో మను.

## ఈదులాడు

1. వ్రేలాడు.

"ఈ పెపోటులఁ బడి ప్రేవు లీఁదు లాడ." మను. 4.42.

2. ఈతకొట్టు.

"తడఁబడ నోలలాడుచు హాళాహాళిగాఁ బడి నీఁదులాడెడిన్." జైమి. 1.28.

"పిల్లలు బావిలో ఈదులాడుతుండగా చూచి వాళ్ల నాన్న కోప్పడ్డాడు." వా.

**ఈన గాచి కుక్కలపాలు చేయు**

యామున. విజ. 4.96.

చూ. ఈనగాచి నక్కల పాల్జేసినట్లు.

**ఈనగాచి నక్కల పాల్జేసినట్లు**

సఫల మగునంతదాకా ప్రయత్నించి, ఫలితం కడపట ఎవరికో వదలివేయు.

"వ్యాపారం బాగా స్థిరపడేదాకా పని చేసి ఇప్పుడు వదిలి వేయడ మేమిట్రా? ఈన గాచి నక్కలపాలు చేసినట్టుగా?" వా.

**ఈనరాసి**

తక్కువరకం వడ్లు. బ్రౌను. హీనరాశికి వికృతరూపము కావచ్చును. రాశిని తరము, రకము అనే అర్థంలో ఉపయోగించడం కలదు.

**ఈనా డమ్యోడుకార్యము కానేరదె తేపు**

తొందరపడుట యెందుకు? అనేసందర్భంలో ప్రయుక్త మయ్యే పలుకుబడి. ఈ రోజ య్యేది రేపవుతుంది అని రాయలసీమలో విరివిగా వాడుక.

"ఈ నాఁ డమ్యోడుకార్యము గానేరదె తేపటంచుఁ గడు నెమ్మది న మ్మానఘురంధరుఁడు—" శుక. 1.216.

చూ. ఈరోజయ్యేది రేపవుతుంది.

**ఈనినకడుపు ఇల్లాటదు**

బాలింతకు ఆకలి యెక్కువ అనుట.

"ఈమధ్య కోడలికి తెగ ఆకలేస్తున్నట్టుందిరా ఈనిన కడుపు ఇల్లాట దంటార్లే." వా.

**ఈనినపులివలె**

మహాక్రోధముతో అనుట. ఈనిన పులి మహాకోపంగా ఉంటుంది-ఆ పిల్లల నెవ రెత్తుకొని పోతారో అని. ఆ సమయంలో కనిపిస్తే ఎవరినైనా చంపుతుంది.

"ఏణాక్షీ యది విని యీనిన పులిబోలెఁ బదరి భగ్గున మండిపడియె నొక్క." రాధి. 3.

**ఈనెగట్టు**

వరుసగట్టు.

"తేని పల్లాతులు బట్టబైట నిడ నోపుచు వాతెఱ నీనె గట్టఁగా." శుక. 1.514.

**ఈనెగాజులు**

ఒక పిల్లల ఆట.

శుక. 1.513.
హంస. 3.146.

**ఈనెగుజ్జము**

పిల్లల ఆట.

హంస.

**ఈ నేటికాలము**

ఇప్పటి కాలము.

కాశీ. 1.13.

ఇదే అర్థంలో నేడు 'ఈ రోజులలో' అని వాడటం అలవాటు.

"ఈ రోజుల్లో పెద్దలమాట వినేవాళవరు?" వా.

**ఈ పిల్లి ఈ పాలు తాగుతుందా అన్నట్లు ఉండు.**

అతి అమాయకంగా కనిపించు.

"ఆయన యింట్లో ఉన్నంతసేపూ వీడు ఈ పిల్లి ఈ పాలు తాగుతుందా అన్నట్లు ఉంటాడు. ఇల్లు దాటీదాటడంతోనే ఒకటే అల్లరి. వా.

**ఈపాటి చదువుకో లేదా ?**

ఈమాత్రం తెలియదా ?

"అరయఁ గూఁతుం గవయుట
వారల కదియొప్పవచ్చు వసుమతి నినజుం
డీరీతిఁ జేసెఁ బూర్వము, శారద యీపాటిచదువు చదువదె చెపుమా?"

నలచ. 4.122.

చూ. ఈమాత్రం చదువు చదువుకో లేదా?

**ఈబరిగొట్టు**

నిష్ప్రయోజకుడు.

**ఈమాత్రం ఆమాత్రం మనిషి**

ఇంతటంతటివాడు; సుమారైనవాడు.

"ఈమాత్రం ఆమాత్రం మనిషి వాడి కంటి కాగడం లేదు." వా.

**ఈమాత్రం ఆమాత్రానికే**

అతి స్వల్పవిషయానికే.

"ఈమాత్రం ఆమాత్రానికే మొహం ముడుచుకొని కూర్చుంటే కాపురాలు ఎట్లా అవుతా యమ్మా?" వా.

**ఈమాత్రం చదువు చదువుకో లేదా ?**

చూ. ఈపాటి చదువుకోలేదా?

**ఈయకోలు**

అంగీకారము.

చూ. ఇయ్యకోలు.

**ఈరములు గొట్టు**

దారులు గొట్టు.

ఈరము - పొద. పొదల చాటున దాగి ఉండి దారులు కొట్టుటపై వచ్చినపలుకుబడి.

"బంధులఁ దిట్టి సజ్జనుల బాధలు పెట్టి... ఈరములు గొట్టి." భాగ. 6.107.

**ఈరసపడు**

అసూయపడు, ఈర్ష్యపొందు.

"నా రూపమునకు మదిలో, నీరసపడుచున్న వాఁడు." కాశీ. 4.152.

**ఈరస మాడు**

తిరస్కరించు.

"కుందనపుఁ గాహళంబులు, పొందెఱుఁగక యెన్ని బిరుదములు పలికినఁ ద, మ్మందదుకు లనుచు నాలిక, నిందీవర నయనజంఘ లీరస మాడుఁగా."

వరాహ. 11.49.

**ఈరస మెత్తు**

అసూయపడు; ఈర్ష్య వహించు.

"వారు మ మ్మీరస మెత్తి కీడ్పఱచి."
భార. ఉద్యో. 3.74.
"నీ వీరస మెత్తి నోఁబలికి తేనియుఁ జెప్పుదు సూతనందనా!"
భార. కర్ణ. 2.52.

**ఈరసించు**

ఈర్ష్యపడు.
వేం. పంచ. 1.438.

**ఈరాఱు**

పన్నెండు.
(ఇరు + ఆఱు.)

**ఈరిక లీను**

అంకురించు.

**ఈరిక లెత్తిన కోరికలు సారికలు గొను**

పొడమిన కోరికలు చాయలు గట్టు. కోరికలు విపరీతంగా చెలరేగు.
"అరిజనంబులు మనంబుల ఘనంబులుగ, నీరిక లెత్తినకోరికలు సారికలు గొన."
భాగ. స్క. 3.507.

**ఈరిక లెత్తు**

మొలకెత్తు.
"మనంబున మక్కువ లీరిక లెత్త."
రుక్మాం. 3.126.
చూ. ఈరిక లీను.

**ఈరు దివ్వ పేను వచ్చు**

కొంచెము కదపగా పూర్తిగా కదలు.
తీగ కదిపితే డొంక కదలు అనుట వంటిది.
"మీర లూరకుండ రీరు దివ్వఁగఁ బేను, వచ్చు ననుట వినమె వనితలార!, యాన పెట్టి యడుగ మానరా దిఁకఁ జెప్ప, వలసె మీ రహస్యవర్తనములు."
ప్రభా. 5.78.
"ఇడక పోఁ బోల దిడఁ బోల దీరు దివియఁ, బేను రాకన్నె తైరికల్ పెళుచు లంగ్రడు." పాండు. 4.166.

**ఈరెండ**

లేతయెండ.
శివ. 4.27. హర. 7.139.; ఆము. 6.97.

**ఈరెలుగు**

హీనస్వరము.

**ఈరెలుగుపడు**

డగ్గుత్తికపడు.
"తల వడకంగ నొయ్య నీరెలుఁగు వడుచు." హర. 2.48.

**ఈరేడులోకాలు**

పదునాలుగు లోకములు.
క్రింద యేడు, పైన యేడు లోకాలున్న వని మన పురాణాలు. ఆ లోకా లివి :

| | |
|---|---|
| భూలోకము | అతలము |
| భువర్లోకము | వితలము |
| సువర్లోకము | సుతలము |
| మహర్లోకము | రసాతలము |
| తపోలోకము | తలాతలము |
| తేజోలోకము | మహాతలము |
| సత్యలోకము | పాతాళము |

**ఈర్పెన**

ఈరు తీయుదువ్వెన.
పొడవుగా ఉండి దువ్వెనపండ్లవలె గాక—పొడవుగా కోసిన పండ్లు కలిగిన ఈర్పెనలు

నేటికీ ఉపయోగిస్తారు. వీనిని దువ్వెనవలె వెంట్రుకల పైన పెట్టి కాక, క్రిందినుంచీ వెంట్రుకలలో దూర్చి లాగుతారు.

**ఈర్పేన**

చూ. ఈర్పెన.

**ఈర్వేను**

చూ. ఈర్పెన.

**ఈరోజయ్యేది రేపవుతుంది**

అన్నీ ఏలాగా అవుతుంటే తొందర లెందుకు?

చూ. ఈనా డయ్యెడి కార్యము కా నేరదె రేపు.

**ఈఱతాఱ చూపు**

కొంకెచూపు, వక్రదృష్టి.

"మోఱకుని చందమున నీఱతాఱ చూపు, పాండవేయునిపై దార్చి."
హర. 7.11.

**ఈఱతాఱ తలపులు**

వంకర ఆలోచనలు.

"ఈఱతాఱతలంపులు చీఱువాఱ."
భార. అశ్వ. 1.108.

**ఈఱతాఱయదలుపులు**

వట్టి అదలింపులు.

భార. ద్రోణ. 3.48.

**ఈఱతాఱల నడలు**

అటూ ఇటూ ఊగిసలాడు నడకలు.

"దనుజురథము దిరిగె నీఱతాఱల నడలన్." భాస్క. రా. అర. 2.124.

**ఈఱతాఱ లాడు**

పరుషవాక్యము లాడు.

"ఈఱతాఱ లాడ నెట్లు నోరాడెనో రామ రామ నిరపరాధ సుగుణ."
(కృష్ణ.) శతం. 3.24.

**ఈఱతాఱ లిచ్చు**

వక్రముగా జవా బిచ్చు.

"ఈఱతాఱ సుతు మాట లిచ్చి యుపహసించె." భార. ఉద్యో. 4.76.

**ఈలకఱచు**

గట్టిగా పట్టుకొను.

"వాడు పండ్లు ఈలకఱచుకొని ఉన్నాడు." వా.

చూ. ఇలకఱచు.

**ఈల కఱచుకొని యుండు**

దేనికోసమో ఎదురు చూస్తూ పడి ఉండు.

"వీఁడు నొప్పించి నిలువం దగునెల వగుట, నసను డింపక యీల గఱచుకొని యున్నవాఁడు"
భార. ద్రోణ. 2.104.

చూ. ఇలకఱచుకొని యుండు.

**ఈలకూతలు**

ఒక ఆట.

"ఈలకూఁత లాదిగా శైశవక్రీడ లాడి రచట." వి. పు. 7.203.

**ఈలకూర**

ఉప్పని ఒక కూరాకు.

"ఆలి నొల్లనివాఁడు దా నీలకూర, కుప్పు చాల లే దన్నట్లు." వరాహ. 7.47.

**ఈలకూరలో ఉప్పు లే దన్నట్లు**

అనవసరముగా తప్పు పట్టేపట్ల ఉపయోగించేపలుకుబడి.

అసలు ఈలకూరలోనే ఉప్పుం

టుంది. అది చాలక పోవడ
మంత్రిగా ఉండదు.
"ఆలి నోల్లనివాఁడు హా సీలకూర, కప్ప
చాల లే దన్నట్లు." వరాహ. 7.47.
"ఆలి నోల్లనివాడు ఈలకూరలో ఉప్పు
లే దన్నా డట." వా.

ఈలకొను

ఈలకఱచు.
"ఈలకొన్న యెముకల యింటిలో
కాఁపుర మింతే." తాళ్ల. సం. 9.45.

ఈలగ్రద్ద

ఒక జాతి డేగ; లుబ్ధుడు.
"ఏము నలువురందు నెవ్వాఁడు గాఁజాలు
నిచ్చిపుచ్చుకొన్న యీలగ్రద్ద."
శృం. నైష. 7.107.
వా. ఇచ్చిపుచ్చుకొన్న ఈలగ్రద్ద.

ఈలపురుగు

ఇలకోడి, చిమ్మట. శ. ర.

ఈలవెట్టు

ఈల వేయు.
"పోవ వాఁ డింకు రం డని త్రోవ
యడవిఁ, బెట్టి యొకవాఁగు డిగ నీల
వెట్టుటయును." ఆము. 7.9.

ఈలవేయు

ఈలవెట్టు.
"వాడు ఈల వేసేసరికి వందమంది చేరు
తారు." వా.

ఈలువుగొను

మానభంగము చేయు.
శుక. 2.10.

ఈలువుటాలు

ఇల్లాలు.
"అమరుల యీలువుటాండ్రను కెఱ
వట్టితి." భార. ఆది. 7.61.

ఈలువుడుగు

కులాచారమును వదలు; ఇలు
వరుసను పాటించక పోవు.
"ఈ విధంబున సుకుమారుఁ డీలు వుడిగి
మాలచిగురాకుఁ బోఁడితో మనుపు
మనఁగ." శివరా. 3.117.

ఈల్కఱచు

చూ. ఈలకఱచు.

ఈవరితనము

వదాన్యత.
యయా. 5.1.

ఈవలతగులు

వెట్టచేయు.

ఈవ లవల సేయు

తలక్రిందులు చేయు.
"అష్టదిక్కుల నీవలవల సేసి."
భా. రా. యు. 263.

ఈవలావ లగు

తలక్రిందు లగు.
"లంకయు నీవ లావ లై కదలినభంగి."
భా. రా. యు. 1319.

ఈవికాడు

వదాన్యుఁడు.

ఈవిమ్రాను

కల్పవృక్షము.
చూ. ఈగమ్రాను.

ఈవులకెంపు

చింతామణి.
చూ. ఈగులకెంపు.

ఈవులరతనము

చింతామణి.

ఈశ్వరివేరు

వశీకరణౌషధము, పాగ రడచునది.

ఈశ్వరి వేరును కట్టుకుంటే పాములు తలవంచి వశ మగు నన్న నమ్మకంపై వచ్చిన పలుకుబడి. లక్షణయా వశము చేసుకొనునది.

"నాదగ్గర వేరే ఈశ్వరివేరు ఉంది లే. దాంతో వాడు లొంగిపోతాడు." వా.

ఈషణత్రయము

దారేషణ, ధనేషణ, పుత్రైషణ : భార్యాపుత్ర ధనాలపై ఆశ.

ఈసడ చేయు

ఈసడించు.

ఈస పిట్ట

ఒక జాతిచేప.

ఈసురోమను

కళాకాంతి విహీనముగా నుండు, బలహీనముగా నుండు.

"ఈసురో మని మనుషు లుంటే, దేశ మేగతి బాగుపడునోయ్." గురజాడ.

"లంకంత యింట్లో చాలినంత మను షులు లేక యీసురో మని ఉంది." వా.

చూ. ఈడురో మను.

ఈసువడు

నింద పొందు.

"మోసపోయితిఁ గులమునం దీసు వడితి." శివరా. 3.129.

ఈ సొనరించు

ఈర్ష్యపడు.

"ఇంక వీరితో నీ సొనరించువీరవరు నెవ్వనిఁ గాన." భాస్క. యుద్ధ. 1063.

ఈళ్ళు క్రుక్కు

ఈరు – చిన్న పేలు; వానిని చంపు. పేలను రెండు బొటనవ్రేళ్ళ సందులో నుంచి చిటుక్కు మని నొక్కుచుటయే పేలు క్రుక్కుట. ఈలు క్రుక్కుటా అంతే.

"ఈళ్ళు క్రుక్కి." పాండు. 3.30.

ఉంకుచెండువిధంబున

విసరి వేసిన చెండువలె.

చెండు వేసినప్పుడు నేల తగిలి మరొకతూరి పైకి వెళ్ళి కిందికి పడి మరీ యెగురును. అనగా కమానులు కమానులుగా వెళ్లు ననుట. ఇట్టియెగురు టతో ఇచట సామ్యము.

"ఉంకుచెండువిధంబున, నుత్తరించు తములపాకు నిక్కుడుక్రియ దాఁటు నిట్టి." ఉ. హరి. 4.28.

ఉంకుటుంగరము

వివాహనిశ్చయ సూచకంగా వధూవరులు మార్చుకొనే ఉంగరము.

హంస; శ. ర.

**ఉంగరాలచేతి మొట్టికాయ**

ధనికుని దూషణ; దండన.

అది తిట్టే అయినా ధనికు డన్నా డని సరిపెట్టుకొను వాని విషయంలో ఎత్తిపొడు పుగా అనుమాట.

"నేను ఒకమాటంటే అంత కస్సు మని వచ్చావే? మఱి ఆరంగయ్య అన్ని మాట లంటే నోరు మూసుకొని కూర్చు న్నావుగా. మఱి అది ఉంగరాల చేతి మొట్టికాయగదా. బాగానే ఉంటుంది." వా.

**ఉంగిడిగొనినట్లు**

ఉంగిటిరోగము పొందినట్లు.

ఉంగిడి సామాన్యంగా పశువు నాము తిన్నప్పుడు వచ్చే వ్యాధికే వాడుతారు.

కాశీ. 2.138.

**ఉంగిడిగొను**

ఉంగిడి అను పశువ్యాధి వచ్చు.

"ఉంగిడిగొన్నభంగి." కాశీ. 2.138.

**ఉంగుంగ**

ధ్వన్యనుకరణము.

శిశువు చిన్నప్పుడు అనుమాట.

చూ. ఉంగే ఉంగే.

**ఉంగే ఉంగే**

చూ. ఉంగుంగ.

**ఉంచుకొను**

1. పెట్టుకొను.

"ఉపనిషత్కాంతల నుంచుకొనిరి గాని." పాణి. 5.14.

2. తన అధీనములో ఒక పర స్త్రీని ఉంపుడుకత్తెగా ఉంచు కొను.

"దానిని ఆత డుంచుకొన్నాడు." వా.

**ఉంఛవృత్తి**

పొలాల్లో కళ్లాల్లో రాలిన గింజలను ఏరుకొని, వాటి తోనే జీవించు జీవనము.

**ఉంటకట్టు**

చాలకాల మైనప్పుడు పిండి మొదలయినవి ఉంట కట్టడం అలవాటు.

"ఆ గోధుమపిండి ఉంట కట్టింది." వా.

చూ. ఉండకట్టు.

**ఉంటగాలము**

సీసపుగుండు కట్టిన ఒక రక మయినగాలము.

హంస. 4.184.

**ఉంటాను!**

ఎవరి నైనా సాగనంపుతున్న ప్పుడు నే నిక సెలవు తీసు కొంటా నని గృహస్థు మొద లగువా రనుమాట.

"మఱిక ఉంటాను. వెళ్ళగానే ఉత్తరం వ్రాయండి." వా.

చూ. నిలుస్తాను.

**ఉండకట్టు**

చూ. ఉంటకట్టు.

**ఉండగ్రోవి**

పట్టుకొనుచోట ఉండగా ఉన్న చేతికఱ్ఱ. శ. ర.

**ఉండచీట్లు వేయు**
లాటరీ వేయు.
"వాళ్లిద్దరికీ సమానంగా ఓట్లు వచ్చే సరికి ఉండచీట్లు వేయవలసి వచ్చింది." వా.

**ఉండ బట్టదా ?**
కాలక్షేపం కాలేదా, ఊరకే ఉండ లేవా ?
"ఒక టంకె ఒక టాడి ఉండబట్టదా కాని." తాళ్ల. సం. 3.537.
ఇలాంటి సందర్భంలో ఇది నేటికీ రాయలసీమలో విన వస్తుంది.
"ఏం ఉండబట్టదా పాపోడా! పదే సకం ఆడతావు." వా.

**ఉండబట్ట లేక**
ఊరక ఉండ లేక; అనవసర ముగా అనుట.
"ఉండబట్ట లేక వాళ్లింటి కెళ్లి అన్ని మాటలు అనిపించుకొన్నానుకే" వా.
"ఉండబట్ట లేక ఆ నాటకసమాజం అని పెట్టి వాడు పాడై పోయాడు." వా.
"ఉండబట్ట లేక ఆ మాట అని నెత్తి మీదికి తెచ్చుకొన్నాడు." వా.

**ఉండలక్రోవి**
వడిసెల.

**ఉండవిలు**
వడిసెల.
చిన్న పంగలకట్టకు చర్మపు వారో తాడో కట్టి, దానిలో గట్టిగా ఎండబెట్టిన మట్టి ఉండలు పెట్టి పక్షులు మొదలైన వానిని కొడతారు నేటి దీని రూపం 'ఉండేలు.'
"ఏదు తను వుండవిలు సేసి సెఱకు వేయు, రతివరుఁడు హారగుళికల రాజ హంసు." నైష. 2.97.
"పిల్లకాకి కేం తెలుసు ఉండేలుదెబ్బ." సా.

**ఉండసురియ**
ఒక విధ మైనకత్తి.
"కొండగొఱియల నుండసురియల ... చెండాడుచు." రా. వి. 3.65.

**ఉండుకొను**
ఉండు.
"అవ్వనటఁ దొలంగఁ జేయుటయు, వాస్తవ మై యిటు లుండుకోఁగ..." కాళిందీ. 2.211.
వైదికవృద్ధులలో ఈమాట నేటికీ ఉన్నది,
"వాడా ఊళ్లో ఉండుకొంటూ ఉన్నాడు" "ఉండుకొన్నవాడై." వా.

**ఉండూరు**
స్వగ్రామము.
"వానికి ఉండూళ్లో యిల్లు లేదు. పొరుగూళ్లో పొలము లేదు." వా.

**ఉంపడము**
ఉంపుడు ఉంచుకొనుట; ఉంపుడుకత్తె.
"ఆ పిల్లను వాడు ఉంపడం ఉంచుకొన్నాడు." వా.
"ఇది వాడికి ఉంపడం." వా.
చూ. ఉంపుడుకత్తె.

**ఉంపుడుకత్తె**
ఉంచుకొన్న స్త్రీ.

**ఉక్కడగు**
బలము కోలుపోవు.
"ఉక్కడఁగెన్ మగధేశసైన్యముల్." భార. సభా. 1.213.

**ఉక్కడచు**
చంపు, పొగ రడచు; బలహీన పఱుచు.
"మార్కొను వీరయోధులఁ జెక్కుండ్ర నుక్కడంప." జైమి. 6.132.

**ఉక్కడీడు**
బలశాలి.
"ఉక్కడీఁడయి యేతెంచె నుక్కుమిగిలి...మరుఁడు." నైష. 7.41.

**ఉక్కణగు**
బలము తఱిగిపోవు.
చూ. ఉక్కడగు.

**ఉక్కణచు**
పొగరడచు.
"రక్కసు నాయోధనమున నుక్కణఁచి." రుక్మాం. 575.
చూ. ఉక్కడచు.

**ఉక్కపట్టు**
చెమట పోయు; గాలి లేక వేడి యెక్కువై అనుట.
"ఈరోజు చాలా ఉక్కపడుతూ ఉంది." వా.
"అక్కడ ఉక్కపట్టుతూ ఉండడం చేత ఈ రోజు ఇక్కడ పండుకొన్నాను." వా.
చూ. ఉక్కపెట్టు.

**ఉక్కపెట్టు**
చెమట పట్టు.
"ఈ రోజంతా ఉక్క పెడుతూ ఉన్నది." వా.
చూ. ఉక్కపట్టు.

**ఉక్కపోయు**
చెమటపట్టు.
చూ. ఉక్కపెట్టు.

**ఉక్కబట్టు**
1. ఉగ్గబట్టు; మూసివేయు.
"ఒకవేళ వానల నుపహతి నొందించు నొకవేళ రంధ్రంబు లుక్కబట్టు." భాగ. 7.199.
2. ఆహారాదులను విసర్జించు.
"విడుతుఁ బ్రాణము, నీకై కూడుక్కబట్టి నీలగ్రీవా!" కాశీ. 3.101.
చూ. ఉగ్గబట్టు.

**ఉక్కఱు**
బలహీన పడు.
"ఉక్కఱి యిట్లు మధ్యము మహోగ్ర శరంబులఁ దాఁక నోర్వక." భార. అర. 4.12.

**ఉక్కళ ముండు**
సైన్యము విడిసినచోట, బయటివారి రాకను కనిపెట్టుటకై కావలి యుండు.
"కొండప్రక్కల నుక్కళ ముండు వేల్పు, లండములఁ జెండి యెక్కియక్కొండయందు." దశా. 2. 57.

**ఉక్కిరి బిక్కిరగు**
ఊపిరాడక విలవిలలాడు; తీరిక లేకపోవు.
"ఈ రోజే ఇన్నిపనులూ చేయవలసి

రావడం చేత ఉక్కిరిబిక్కిరై పోయింది."
"ఈ పనితో ఉక్కిరి బిక్కిరి అయి పోతూ ఉంది." వా.

**ఉక్కివ మాడు**

మేల మాడు.

"క్రొమ్మెఱుంగుతో నుక్కివ మాడు మేనిపస." క్రీడా. పు. 87.

**ఉక్కీడు**

మూర్ఖుడు, దుష్టుడు.

"ఉక్కీ లయి నేర్పు లేక." నిర్వ.3.11.
"ఉక్కీ నిమనంబు కీడు పరికించు నె." భార. విరా. 3.7.

**ఉక్కు గరచి చేయు**

ఉక్కుతో చేయు.

అంత కఠిన మైన దనుట.

"కౌసల్యాహృదయ మక్కటా, యుక్కు గరచి చేసినారో ?"
వర. రా. అయో. పు. 420. పంక్తి. 17.

**ఉక్కుతునక**

ఉక్కుముక్కవంటి బలిష్ఠుడు. ఉక్కు చాలా గట్టి లోహ మనుట ప్రసిద్ధము.

చూ. ఉక్కుతునియ.

**ఉక్కుతున్క**

వీరుడు.

"...గాళికా లాపురీభట శిఖామణు లెక్కటి యుక్కుతున్కలు..." విజ. 1.75.

చూ. ఉక్కుతునక.

**ఉక్కుతునియ**

బలశాలి, శూరుడు.

"ద్రౌపదేయుండు నాసుభద్రాసుతుండు నుక్కుతునియలు గారె."
భార. ఉద్యో. 176.

చూ. ఉక్కుతునక.

**ఉక్కున పెనచిన ట్లుండు**

దిట్టముగా ఉండు. ఉక్కు గుండువలె అనుట.

"ఉక్కునఁ బెనచిన ట్లున్నాఁడు వీఁడు." గా. హరి. ద్వితీ. పంక్తి. 1504.

**ఉక్కునీరు**

ఉక్కు కరిగించగా ఏర్పడిన ద్రవము.

"ఉక్కునీరు వోతురు." భాగ. 5.2.

**ఉక్కుపొడి రాల్చు**

నిప్పులు గ్రక్కు వంటిది. క్రోధాతిరేకమును సూచించే పలుకుబడి.

"ఉక్కుపొడి రాల రోషంబు."
విజయ. 3.151.

**ఉక్కు మడగు**

బలము చెడు.

"ఉఱక విరోధి సైన్యముల నుక్కు మడంగఁగ నుల్లసద్గతిం, బఱప..."
భార. విరా. 5.61.

**ఉక్కుమడచు**

ఉక్కుమడగునట్లు చేయు.

**ఉక్కుమడుగు**

పరాక్రమ ముడుగు.

"మడిసియు జడిసియుఁ జిక్కువడియు నుక్కు మడిగియు."
భార. ద్రోణ. 5.92.

**ఉక్కుమిగులు**

1. చేవ గల్గు; అతిశయించు.

"రెండు బలంబుల వారలు, నొండొరుల పులకంబెఁ ... లనుక్కుమిగిలి యొం,

డొండ కడంగుచు నుజ్జ్వల, చండ స్థితి
నొప్పి రపుడు జగతీనాథా."
భార. భీష్మ 1.138.

2. పరాక్రమించు.
"అక్కిరీటి సైన్యంబు లెక్కగొనక
యుక్కుమిగిలి యక్క జంబు గాక,
జక్కువడం బెక్కు నారసంబులు..."
జైమి. 5.20.

ఉక్కుమీఱు
చేవమీఱు.
భాగ. 6. స్కం. 260.
చూ. ఉక్కుమిగులు.

ఉక్కుమెఱయు
"అవ్విభుండు వాని నెల్ల వింటవడిఁ
బాఱఁ జదుపుచు తెక్కు సేయకం డె
నుక్కు మెఱసి."
భాస్కర. అర. 1.228.
చూ. ఉక్కుమీఱు.

ఉక్కు మురిసినట్లు
ఉక్కు కరగినట్లు.
"చిక్కువడి యుక్కు మురిసినట్లు
సమసిన." భార. ద్రోణ. 3.394.

ఉక్కువడు
దుర్బలు డగు; దీను డగు.
"ఉక్కువడి యుండె బహుకాల
మొప్పు దఱిగి, విగతలక్ష్మీవిలాసుఁ డై
వేల్పుఱేఁడు." హర. 6.30.

ఉక్కెక్కు
గట్టిపడు.
"పిక్క లుక్కెక్కఁగఁ ద్రొక్కి
నిల్చి." కాళ. 4.174.

ఉక్కోలుగా
విపరీతంగా.
"విసరె నుక్కోలుగా విషమవాయు
వులు." వర. రా. బా. పు. 229.
పంక్తి. 13.

ఉక్రోషం
ఉడుకుబోతుతనము.
"దాన్ని ఏమనకురా. అది వట్టి
ఉక్రోషంమనిషి." వా.

ఉగాది
సంవత్సరాది.
"ఈ ఉగాదికి కొత్త బట్టలు కొనాలంటే
కూడా డబ్బు లేదు." వా.

ఉగ్గగట్టు
బిగించి కట్టు.
"నెన్నడు ముగ్గఁగట్టి." వి. పు. 7. 135.

ఉగ్గడు వగు
ఎక్కు వగు, అధిక మగు.
"ఉగ్గడు వగు తేజంబున."
భార. ద్రోణ. 5.195.

ఉగ్గబట్టు
ఆహారాదులను విసర్జించు.
"వాడు పదిరోజులుగా కూడూ నీరూ
ఉగ్గబట్టాడు." వా.
చూ. ఉక్కపట్టు.

ఉగ్రము వచ్చు
1. ఒడలు మరిచేటంత
కోపమో ఆవేశమో వచ్చు.
"వానికి ఆ మాట వినేసరికి ఉగ్రం
వచ్చింది." వా.
2. దేవుడో దయ్యమో
ఆవేశించు.
"వాడు పీ రెత్తుకొనేసరికి ఉగ్రం
వస్తుంది." వా.

ఉగ్గుతో పెట్టినవిద్య
చిన్నతనంనుంచీ వచ్చిన

విద్య. ఉగ్గుపెట్టు నాటినుంచీ వచ్చిన దనుట.

"వానికి నయంగా మాట్లాడి బుట్టలో వేసుకోవడం ఉగ్గుతో పెట్టిన విద్య." వా.

నా. వెన్నతో పెట్టినవిద్య.

ఉగ్గుపెట్టు

చంటిపిల్లలకు చిట్టాముదము, చనుబాలు కలిపి రంగరించి అది చిక్కనిపాలవలె కాగా (అదే ఉగ్గు) దానిని పెట్టు.

"వాపోయి వాపోయి వసివాడి యాఁకట, బెగడెఁ గాయని యుగ్గువెట్టి వెట్టి." పాండు. 3.156.

ఉగ్గువడు

క్షీణించు.

"తన ధృతి, యుగ్గువడన్ వేపితామహునికడ కరిగెన్." కళా. 1.209.

ఉచుక్కను

తిరస్కరించు.

"ముఖాబ్జకాంతితోఁ జుక్కలరాజునైనను నుచుక్కనువాఁడు." యామున. విజ. 4.129.

ఉచ్చగిత్త

స్త్రీలోలుడు.

"వాడా వట్టి ఉచ్చగిత్త. చీరకొంగు కనబడితే చాలు వెంటపడతాడు." వా.

ఉచ్చబెలమ

విరక్తి కల్గించుటకై జుగుప్సార్థంలో యోగులూ, జ్ఞానులూ యోనికి పెట్టినపేరు.

"ఉచ్చబెలమ గోరియున్నది జగమెల్ల." వేమన. 1029.

ఉచ్చ దివిటీగా వెలుగు

బాగా మాట సాగు.

వాని మాట కెదురు లేకుండా అధికారం చలాయిస్తున్నాడు అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"ఆ రెడ్డిపే రంటే ఆ జిల్లా అంతా హడలు. వాని ఉచ్చ దివిటీగా వెలుగుతున్న దంటే నమ్ము." వా.

ఉచ్చనీచములు

హెచ్చుతక్కువలు.

"నడుమంజొచ్చును బ్రాహ్మణార్థములు పెక్కుల్ రాజకీయార్థముల్, నడుమంజొచును యాజ్ఞవల్క్యుఁడు ధరణానోచ్చనీచంబులం, జెడ లేక న్నటియించుఁ గాలముకొలందిం బోవు..." తెలుఁగునాడు. పు. 41.

ఉచ్చపోయు

మూత్రవిసర్జన చేయు.

ఉచ్చమల్లి

ఒకతిట్టు; నగ్న స్త్రీ.

"ఉచ్చమల్లి యయ్యెంతితల్లి." శుక. 3.18.

ఉచ్చరతి

రతివిశేషములలో ఒకటి. కుమా. 9.152.

ఉచ్చాటన

స్థానభ్రంశము; తఱిమివేత. మంత్రపరిభాష.

దయ్యాలను, భూతాలను మంత్రాలతో వెడలగొట్టుటపై వచ్చినపలుకుబడి.

"ఆస్తి సొంతదారుడు రాగానే వీనికి ఉచ్చాటన తప్పదు." వా.
"వాళ్లనాన్న రాగానే వీడికి ఆ యింటి నుంచీ ఉచ్చాటన జరుగుతుంది." వా.

**ఉచ్చిపాటు**

దూసికొని పోవు.

"నెఱఁకుల నుచ్చిపాటి." జైమి. 2.87.
"పై నొరఁగి పొంకపుఁ జన్మొన లుచ్చి పాటఁ, గౌఁగిలి దయసేయ రాదొ." ఉ. రా. 4.315.

**ఉచ్చిపోవు**

"ఉరము వడిఁ దాఁకి వీఁపున నుచ్చి పోయె." భార. భీష్మ. 3. ఆ.
చూ. ఉచ్చిపాటు.

**ఉచ్చుచ్చిరే**

కుక్కను పిల్చుటలో ధ్వన్యను కరణమై వినవస్తుంది. నేటి వాడుకలో 'చ్చుచ్చుచ్చో' అని వినబడుతుంది.

"ఉచ్చుచ్చిరే శంకరోచ్ఛిష్టభోగి." బస. 7. 183.

**ఉచ్చులు తెంచుకొను**

నిర్బంధములను తొలగించుకొను.

పరువెత్తుటలో అన్ని నిర్బంధాలనూ సడలించుకొనె నను టలో అలవాటై కడకు తెంచుకొని పరుగెత్తాడు; పాఱిపోయాడు అనే అర్థమాత్రద్యోతక మైంది. ఇలాంటిదే తీగలు తెంచుకొని పరుగెత్తు.

"......పులి మెల్లనె యవలికిఁ జని వెసఁ జం, గున నచ్చటిలతలు త్రెంచికొనుచుం బాఱెన్." శుక. 2. 261.

ఇది అతివేగంగా ముందూ వెనుకా చూడకుండా పరువెత్తేపట్ల ఉపయోగిస్తారు.

"ఉచ్చులు త్రెంచుకొని పరువెత్తాడు" వా.

**ఉచ్చులు పన్ను**

మోసగించుటకై ఎత్తులు వేయు.

"వచ్చే సంవత్సరం ఖాళీ కాబోయే ఉద్యోగానికి నేటినుంచే వాడు ఉచ్చులు పన్నుతున్నాడు." వా.
చూ. ఉచ్చులు వేయు.

**ఉచ్చులు వేయు**

ఎవరినో పట్టుకొనుటకూ, బోల్తా కొట్టించుటకూ మాయలు పన్ను.

"ఆ ఆస్తి నంతా కబళించాలని వాడు ఉచ్చులు వేస్తున్నాడు." వా.
"ఆ బంగారు పిచ్చుకను దొరికించుకోవాలని వాడు ఉచ్చులు వేస్తున్నాడు." వా.
చూ. ఉచ్చులుపన్ను.

**ఉచ్ఛిష్టపు లేమ**

ఒకతిట్టు.

ఉచ్ఛిష్టం నీచం అనే అర్థంలో. ఇలా యేర్పడిన పలుకుబడులు ఉచ్ఛిష్టపు బ్రతుకు లాంటివి మరికొన్ని ఉన్నవి.

"చేతితడార దుచ్ఛిష్టపు లేమ." గౌ. హరి. ద్వి. 890.

ఉజ్జగొను
సరకుసేయు.
ఇదెప్పుడు ఉజ్జగొనడు, సేయడు అన్నట్లు వ్యతిరేకార్థంలోనే వినవస్తుంది.
"లజ్జాభిమానంబు లుజ్జగొనఁడు."
రుక్మాం. 5.146.

ఉజ్జన సేయు
విడిచిపెట్టు.
"సంధ్యాభివందనశ్రద్ధ యుజ్జన సేయ."
కాశీ. 4.81.

ఉజ్జాయింపుగా
దాదాపుగా, రమారమిగా.
"ఆ యిల్లు కట్టడానికి రెండువేలవుతుం దని, ఉజ్జాయింపుగా చెబుతున్నాను." వా.

ఉట్టాడు
ఉబ్బిట్లూగు; ఉత్సుకుడగు.
"హరుబిట్టోడింప నుట్టాడుచున్."
పాండు 1.189.
చూ. ఉబ్బిట్లూగు.

ఉట్టి కట్టుకొని వ్రేలు
తానేదో చేయఁబోనున్నట్లు ఉబ్బిట్లూగు; ఎప్పుడెప్పుడా అని ఉత్సుకుడగు.
"కులధర్మం బెడలించి శ్రీ గురునకుం గోపంబు పుట్టించి మిత్రుల సౌభ్రాత్ర నివాసదేశముల నీతోఁబుట్టులం బాసి నిశ్చలతన్ వ్రేలెద పుట్టి గట్టికొని దుస్సాధ్యంబు సుమ్మీ స్మరజ్వలనజ్వాలిక సోఁక నీక నిలుపన్ జ్ఞానామృతస్యందమున్." పాండు. 5.211.
"నీ పాటేదో పాడిచేస్తానని ఉట్టిగట్టుకొని వ్రేలాడుతున్నావు. కానీ వాడురాగానే నీతోక కోసేస్తాడు జాగ్రత్త!" వా.
చూ. ఉట్టి గట్టుకొని ఊఁగు.

ఉట్టి కెక్కు
మూలబడు. పని అయ్యాక వస్తువులను ఉట్టిపై ఉంచివేస్తారు. అందుపై వచ్చిన పలుకుబడి.
"ఉట్టి కెక్కె నీసిగ్గులు నోబావ."
తాళ్ల. సం. 3.172.
చూ. ఉట్లెక్కు.

ఉట్టి గట్టు
అపహాస్యము చేయు.
తాటాకులు కట్టు వంటిది.
ఉట్టి కట్టుకొని ఊరేగుతున్నాడు; వాణ్ణి ఉట్టి కట్టి ఊరేగిస్తాము అని వాడుక ఉన్నది. ఈ పలుకుబడి వాడుకలో నేడున్నట్లు లేదు.
"...సరకు గొనండు...టక్కరి బలుమోపు మోచు నయగారితనం బది యుట్టి గట్టినన్." ఉత్త. హరి. 4.

ఉట్టి గట్టుక వ్రేలు
"ఉట్టిగట్టుక వ్రేలుచున్నాఁడు."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1758.
చూ. ఉట్టిగట్టుకొని ఊఁగు.

ఉట్టి గట్టుకొని ఊఁగు
ఏదో అత్యాశతో ఉవ్విళ్లూరు.
"గట్టిగాఁ జావుకుఁ గడు తెంపుఁ జేసి, యుట్టి గట్టుక నూఁగుచున్నాఁడు దేవ!"
రంగనా. యుద్ధ. 857. పే.
చూ. ఉట్టి గట్టుకొని ఊఁతేగు.

**ఉట్టి గట్టుకొని ఊరేగు**

ఎందుకోసమో ఉబలాట పడుతూ ఎప్పు డెప్పుడా అని ఉండు. వాడుమాత్రం అను భవించే దేమున్నది అన్న అర్థంలోనూ ఉపయోగించడం కలదు.

"వా డేదో తానే పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు కాగల నని ఉట్టిగట్టుకొని ఊరేగుతున్నాడు. కానీ డిపాజిట్టు కూడా దక్కేట్టు లేదు." వా.

"వా డేమి ఉట్టిగట్టుకొని ఊరేగ బోతాడా?" వా.

చూ. ఉట్టి గట్టుక వ్రేలు.

**ఉట్టి గట్టుకొని వ్రేలు**

దేనికోసమో కాచుకొని ఉవ్విళ్లూరు.

"నిశ్చలతన్ వ్రేలెద వుట్టిగట్టుకొని." పాండు. 5.211.

"ఎప్పుడో తనకు గుఱ్ఱపు పందాలలో తప్పక బహుమతి వస్తుంది అని వాడు ఉట్టిగట్టుకొని వ్రేలాడుతున్నాడు." వా.

చూ. ఉట్టిగట్టుకొని ఊరేగు.

**ఉట్టిచీల**

రెండుప్రక్కలా తల ఉన్న చీల. శ. ర.

**ఉట్టిచేర్లు తెగు**

అధఃపతనము చెందు.

"ఉట్టిచేర్లన్నియుం దెగ నుదిలపడుచుఁ, దొంటి దర్పంపుటుయ్యేలఁ దోఁగఁగ లవో, వ్యసనపర వయి నీవు నీవ యిఁక నాకు, భార్య వగుదువో ప్రార్థించుపనియు లేదు." రామకథా. యుద్ధ. పూ. 4.329.

**ఉట్టిపడు**

పొంగిపొరలు; విస్పష్ట రూపంలో కానవచ్చు.

ఇలాంటి కొన్ని అర్థాలలో వాడుకలో ఉన్నది.

"వాని ముఖంలో బ్రహ్మ వర్చస్సు ఉట్టిపడుతూ ఉంటుంది". "ఆకావ్యంలో రసం ఉట్టిపడుతూ ఉంటుంది. "వీడి మొహం వాళ్ల నాన్న ఉట్టి పడ్డట్టే ఉంది" ఇత్యాదు లూహ్యములు.

"బ్రహ్మతేజం బుట్టి పడునెమ్మొగము లీవి, రాకాశశాంకగౌరవముఁ దెల్ప." పెద్దాడ. శతం. 253.

"ఆ బాలురఁ గృప యుట్టి పడఁగఁ జూచి." కళా. 6.159.

**ఉట్టిపాటుగా**

హఠాత్తుగా.

"ఉట్టిపాటుగా ప్రయాణం కావలసి వచ్చింది." వా.

**ఉట్టిపాటున**

హఠాత్తుగా.

"ఉట్టిపాటున బయలుదేరాను." వా.

**ఉట్టిపై చెరలాటము**

నిప్పుతో చెలగాటము వంటిది. ఉట్టిమీద నిలిచి ఏమాత్రం కదిలినా కింద పడతారు.

తాళ్ల. సం. 11. 3 భా. 5.

**ఉట్టి యుట్టి పడు**

ఎగి రెగిరిపడు.

"ఉదక బిందు కలాప ము ట్టి యుట్టి పడంగ." కాశీ. 4.69.

## ఉట్టిలో పెట్టినగుమ్మడికాయవలె

కదలక మెదలక, దిట్టంగా.

"అమ్మగువ కనుఁగొనియెన్, ముమ్మర ముగఁ బట్టినామములు మే నెల్లం, గ్రమ్మికొన నుట్టఁ బెట్టిన, గుమ్మడికాయ యునుబోలెఁ గూర్చున్నతఱిన్." వైజ. 2.56.

## ఉట్టి పడు

అకస్మాత్తుగా వచ్చు.

"హరి ఉట్టిపడి కావకున్న నొచ్చెను దేహికి హరి." తాళ్ల. సం. 9.80.

## ఉట్రువడియము

చిట్టి వడియము.

ఈ వడియాలతో కూర చేయడం కూడా కలదు.

"గుడి మ్రింగెడువానికి లో నడ రెడు వే ల్పుట్రువడియ మగు." అచ్చ. రామా. సుం. 155.

అన్నమూ, మసాలా దినుసులూ కలిపిన ఒక విధమైన పలావు అని వ్రాను.

దక్షిణాదిన మసాలా దినుసులన్నీ వెల్లుల్లీ, లవంగాలు, గసాలు ఇత్యాదులు కలిపి దంచి ఉండలు చేసి ఆరబెడతారు. వానినే తుంచి తాలింపులలో, తిరగబోతలలో వాడతారు. అవే ఉట్రువడియాలు.

## ఉట్రువడియముగా

ఉన్నపళంగానే, వెంటనే.

"ఇలా ఉట్రువడియంగా రమ్మంటే నే నెలా రాగలను?" వా.

"వాడు ఉట్రువడియంగా వచ్చాడు." వా.

అతి చులాగ్గా, అన్యాయంగా.

"వానిసొమ్ము ఉట్రువడియంగా నోట్లో వేసుకొన్నాడు." వా.

## ఉట్లెక్కు

మూలబడు.

నిత్యం ఉపయోగించని వానిని ఉట్టిపై పెట్టివేయడం అలవాటు. అందుపై వచ్చిన పలుకుబడి.

"ము న్నహింసా పరమో ధర్మ యని పల్కు, చదువు లుట్లెక్కెనా సార్వభౌమ." నలచ. 3.67.

చూ. ఉట్టి కెక్కు.

## ఉడకవేసే దిక్కు లేదు

ఆడదిక్కు లేదు.

"వాళ్ళ తల్లి పోయినప్పటినుంచీ వాళ్ళింట్లో ఉడకేసేదిక్కు లేక మహా అల్లాడి పోతున్నారు." వా.

## ఉడకాడించు

క్షోభ పెట్టు, కలత పెట్టు.

చిత్తూరు ప్రాంతంలో ప్రచురంగా ఉన్నది.

"ఆ పిల్ల అంతా నన్ను ఊరికే ఉడకా డిస్తున్నారు." వా.

చూ. ఉడ్డాడించు.

## ఉడాములమీద వెళ్లు

అంచెలమీద పోవు.

ఉడికించు

ఎత్తిపొడుపులతో నొప్పి కలిగించు; అపహాసించు.

"వాళ్ల బావ నిమిషనిమిషానికీ దాన్ని ఉడికిస్తూ సంతోషిస్తున్నాడు." వా.

చూ. ఉడికిలించు.

ఉడికిన మెతుకు తిని ఉలికిపడు

కలిగింది తిని హాయిగా ఉండక అనవసరంగా బాధపడు.

"వాడి కన్నీ ఉన్నా యెప్పుడూ ఏడుపే. ఉడికిన మెతుకు తిని ఉలికిపడుతూ ఉంటాడు." వా.

ఉడికిలించు

చూ. ఉడికించు.

ఉడిగిపోవు

కాలమైపోయి చెట్టుచేమలు కాయలు కాయడం మాని వేయు; శక్తులుడుగు.

"ఉడిగిపోయిన ప్రమాణసుంబో లెం బండ్లు డుల్లి." కవి. 4.113.

"నే నింకేం చేయగలను ? అన్నీ ఉడిగి పోయినవి." వా.

ఉడిగి మడుగు

కాలం కాదని తగ్గి ఉండు. అణగి మణగు.

"అనిన ధౌమ్యుం డిట్టు లనియె నీవత్సర, మొకండు నెట్టు లయిన నుడిగి మడిగి, సంకటముల కోర్చి..." భార. విరా. 1.142.

"ఉపవసింతుము గాక నేం డుడిగి మడిగి." కాశీ. 7.153.

ఉడిపోవు

తగ్గిపోవు.

"వ్యాధు లుడివోయె నపమృత్యు వడటం గ." రుక్మాం. 1.136.

"ఆసనాదులకు సమర్థమైన ప్రాయ ముడి పోవుటకు వెతపడుచు నుంటి..." కళా. 4.149.

"ఉడు కన్నిటిలోన నుండుటయు లేదు నీ, వుడిపోయి యం దుండ కుండుటయు లేదు." తాళ్ల. సం. 5.173.

ఉడివుచ్చు

పాడు చేయు.

"మునుపటి పతివ్రతలు...మాన ముడి వుచ్చుకొని రటే." హంస. 1.127.

ఉడి వోనిపంట

శాశ్వతమైనది; ఉడిగిపోని దనుట.

"తీరని మోహాల తేందేపలు, ఊరేటి చెలమలు, ఉడివోని పంటలు." తాళ్ల. సం. 11.11.

ఉడివోవు

ఉడిగి పోవు.

"సంపద యుడివోయి."
వర. రా. అయో. పు. 485. పంక్తి. 4.

"పరిమళం బుడివోనివిరులు ముడిచి." పాండు. 2.108.

చూ. ఉడిగిపోవు; ఉడిపోవు.

ఉడుకారు

చల్లారు, చల్లబడు.

"ఉడుకారెడివంత నెంతయున్." జైమి. 2.220.

"ఆ రాముని శ్రీపాదయుగము నూరట గాం జూచి యుడుకారువాండ..."
వర. రా. అయో. పు. 531. పంక్తి. 3.

"ఈ దుస్ససేనుతను వింతలింతలు తుని

యలై...యుడుకా బుంగాక, యలు పాలఁ బానుపడునట్టి చిచ్చే యిది?"
భార. ఉద్యో.

ఉడుకుకొను
ఒకరు ఎత్తిపొడిచి అపహాసింపగా బాధపడు.
"అంత ఉడుకుకొంటున్నా వేరా? ఏదో తమాషా కంటే." వా.

ఉడుకుఘటము
ఘటికుడు, ఉగ్రుడు.
రుద్రమ. 21 పు.
చూ. ఉడుకుపిండము.

ఉడుకుపట్టు
వేడెక్కు.
"బడబాగ్నిఁ బయోధి యుడుకుపట్టెననంగన్." భాస్క. యుద్ధ. 965.
"అన్నం ఉడుకు పట్టింది." వా.
"ఉడుకుపట్టిన తర్వాత గానీ పులుసులో ఉప్పూ పులుసూ వేయరాదు." వా.

ఉడుకుపాలు
యౌవనము, ఉద్రేకము.
"ఉడుకుపాలు చిందునో వెటికూఁతురా." రుద్రమ. పు. 38.
"వాడు మంచివాడే కానీ కాస్త ఉడుకుపాలెక్కువ." వా.

ఉడుకుపిండము
అత్యుగ్రుడనుట.
"వాడా ఉడుకు పిండం. ఒక్క మాటన్నా ఓర్చుకోడు." వా.
చూ. ఉడుకుఘటము.

ఉడుకుబోతు
ఏమన్నా ఉడుకుకొనునట్టి...
"వాడు వట్టి ఉడుకుబోతు. తమాషాకన్నా ఏడ్చి చస్తాడు." వా.

ఉడుకుమోతుతనం
ఏదైనా నవ్వులాటకన్నా నొచ్చుకొనుట.
"అంత ఉడుకుమోతుతనమైతే ఎట్లాగే పిల్లా!" వా.
రూ. ఉడుకుబోతుతనం.

ఉడుగోత
కాపు ఉడిగిన తరువాత మిగిలినవాటిని కోసేకోత.
"ఎప్పుడో ఈటుపోయిన చేలో ఇంకా ఉడుగోత ఏమిటి?" వా.
చూ. ఉడుగోతపిందె.

ఉడుగోతపిందె
కాపు ఉడిగినతరువాత చెదరుగా పుట్టే నిస్సారమైన పిందె.
చూ. ఉడుగోత.

ఉడుతకు ఉడతాభక్తి అన్నట్లు
ఏదో చేత నయినంత.
"ఉడతకు ఉడతాభక్తి అన్నట్లు ఏదో తృణమో పణమో నేనూ ఇస్తాను." వా.
చూ. ఉడుతభక్తిగా.

ఉడుతభక్తిగా
చేత నయినంత.
అతితక్కువైనాసరే ప్రేమతో చేస్తున్నా ననే అర్థంలో ఉపయోగిస్తారు.
సేతునిర్మాణంలో శ్రీరామునికి ఉడుత సాయపడిన కథ సుప్రసిద్ధం. దానిని బట్టి వచ్చినపలుకుబడి.

వాడుకలో 'ఉడతాభక్తిగా.'
"నేనూ ఏదో ఉడతాభక్తిగా నా చేత నైనసాయం చేస్తాను." వా.
చూ. ఉడతాభక్తిగా.

ఉడుదేనె లగు

మధుహీనము లగు; తేనె లుడుగు.
"కడివోవ నళు లానఁగా రేకు లెడలి, ఘుడుధేనె లైన పర్యుషితపుష్ప ములు." పండితా. పురా. 89. పు.

ఉడుపకుక్క

వేటకుక్క.
"ఉడుపకుక్కలు కుంచెళ్ళ నుందరువుల నుడుముల గ్రహింప." మను. 4.51.

ఉడుబోతు

విరక్తుడు.
బ్రౌను.

ఉడుముపట్టు

గట్టిపట్టు.
ఉడుము నేల కరుచుకున్న దంటే గొలుసులువేసి లాగినా రాదు. అందుపై యేర్పడినది.
"వాడిది ఉడుముపట్టు. చచ్చినా వద లడు." వా.
చూ. భల్లూకపుపట్టు.

ఉడ్డతిత్తులు

గచ్చకాయల తిత్తులు.
మూడు గచ్చకాయలను పొయిగుండ్లవలె పెట్టి, వాని మీద ఒక గచ్చకాయ పెట్టి వానిని మరొక గచ్చకాయతో కొట్టడం అలవాటు. ఇదే గచ్చకాయలాట అయినది. లక్షణయా ఉడ్డలు గచ్చకాయ లయినవి. ఆ పెట్టు పద్ధతినిబట్టి వచ్చినదే ఉడ్డ = నాలుగు అన్న అర్థము. ఈ 'ఉడ్డతిత్తుల'కు అడ్డతిత్తు లని ముద్రితప్రతులలో ఇచ్చిన పాఠం సరి కాదు.
"మెత్తఁగ నూఁటినచుట్టుం, గత్తిర మధుకైటభారి కంఠము లలనా, డొత్తిన హత్తిన చెన్నుం, దితుల క్రియఁ దొడల నుడ్డతిత్తులు వ్రేలన్." పాండు. 2.33.
చూ. ఉడ్డపాడలు.

ఉడ్డపల్లంచి

ఆడపిల్లల ఆట.

ఉడ్డపాడలు

గచ్చకాయ తిత్తులు.
"పెరుగు నుడ్డపాడలున్." పాండు. 5.56.
చూ. ఉడ్డతిత్తులు.

ఉడ్డబుగడలు

చెవి పై వేపు రంధ్రం వేసి పెట్టుకొనే ఆభరణం.
నడుమ ఒక గొట్టం, పైనా క్రిందా నాలుగు పూజలను సమానంగా ఉంచి దానిపైన ఒక పూజను ఉంచి అతికి చేస్తారు. ఈ పూజల సంఖ్యను అలా పెంచుకొని పోవడం కూడా కద్దు. అడుగున ఎక్కువ సంఖ్యా, క్రమంగా తగ్గుతూ

వచ్చి ఆఖరున ఒకేపూజ నిలిచి గోపురాకారంగా తయారవుతుంది. వీటిని నేటికీ రాయలసీమ పల్లెపట్టులలో కొందఱు ధరిస్తారు. బుగడ లనే అంటారు. వావిళ్లలో చంపసరులు, నాలుగుపేటలు గల హారవిశేషం అనడం సరి కాదు.

ఉడ్డలవలె పూజలను ఉంచి అతుకుటతో ఉడ్డబుగడ లైనవి.

"ఉడ్డబుగడలు కట్లసరులు."

హంస.

## ఉడ్డాడించు

క్షోభపెట్టు, కలతపెట్టు.

"వాపోచుణ్ తుఘ్ం గుంది చాల గుతు లవ్వా! బువ్వ బువ్వంచు ని, ల్లాపెణ్ జీర్ణపటాపకర్షముల నుడ్డా డింపఁగాఁ జూచి."

మల్ల భూ. వై. 21.

చిత్తూరుప్రాంతంలో ఉడకాడించు అనేరూపంలో విశేషంగా వినవస్తుంది.

"ఈ పిల్లలంతా నన్ను ఊరికే ఉడకాడిస్తున్నారు." వా.

## ఉడ్డాడు

కలగు, క్షోభించు.

చూ. ఉడ్డాడించు.

## ఉడ్డు కుడుచు

కళవళము చెందు.

"ఉదవాసక్లేశంబున నుడ్డుకుడిచి వెలుపటికిం బుట మెగయుచు."

పాండు. 3.150.

రూ. ఉడ్డు గుడుచు.

## ఉడ్డుగుడుచు

ఉక్కిరి బిక్కిరి యగు.

"బేతాళములు నీళ్ళ ద్రేసి త్రొక్కఁగఁ బాసి, యుడు ల్లెల్ల బెడఁబాసి యుడ్డు గుడిచె." దశా. 2.409.

## ఉతికి ఆరవేయు

ఎమటివాని లోపముల నన్ని టినీ యేకరువుపెట్టి విడుచు; చితకతన్ను.

"వాడు రానీ చెప్తా, ఉతికి ఆర వేస్తాను." వా.

"నాలుగు ఉతికి ఆరవేస్తే గానీ వాడు మాట వినడు." వా.

## ఉత్తచేతుల మూరలు వేయు

ఏమీ లేకనే గొప్పలకు పోవు. బట్టలు లేకనే మూరవే యడం, యోగ్యత లేకనే హెచ్చులకు పోవడంగా ఇట సూచన.

"వాడు ఎప్పుడూ ఉత్తచేతులతో మూరలు వేస్తుంటాడు." వా.

## ఉత్తపుణ్యానికి

వృథాగా.

కొత్త. 16.

"ఉత్త పుణ్యానికి పదిరూపాయిలు పోగొట్టుకున్నాను. వాడు జోస్యం చెప్పిందీ లేదు. అది అయ్యిందీ లేదు." వా.

**ఉత్తమరతి**
రతిభేదము.
కుమా. 9.152.

**ఉత్తరకుమారపౌరుషము**
చూ. ఉత్తరకుమారప్రజ్ఞలు.

**ఉత్తరకుమారప్రజ్ఞలు**
వట్టి డంబాలు.
భారతంలో ఉత్తరుడు తానే పశువులను మళ్లించెద నని వెళ్లి, తుదకు కౌరవసేనను చూడగానే వణకిపోయి వెనుకకు పారిపోవ జూచాడు అనుకథపై యేర్పడిన పలుకుబడి.
"ఈ ఉత్తరకుమారప్రజ్ఞల కేం చాలానే చెప్పవచ్చు. అసలు పోలీసులు కనిపించగానే పారిపోయేవాడివి. నీకు సత్యాగ్రహ మేమిట్రా?" వా.

**ఉత్తరక్రియలు**
అపరక్రియలు.
చనిపోయిన తరువాత చేసే కర్మకలాపం.
"అతనంత బాగా బతికాడా! కడకు ఉత్తరక్రియలకు కొడుకు తిరిపె మెత్త వలసి వచ్చింది." వా.

**ఉత్తరజందెము**
చూ. ఉత్తరజన్నిదము.

**ఉత్తరజన్నిదము**
బ్రహ్మచారి మూడుపోగుల తోడి ఒకముడీ, గృహస్థు అలాంటివి రెండూ వేసుకోవా లని విధి. మూడవది ఉత్తరీయార్థం వేసుకుంటారు. అది ఉత్తరజందెం.
"ఇభ కుంభములు లెడసెడఁ గూర్చు గురిపెంద, జమలియుత్తరజన్నిదములు దనర." రావి. 3.34.

**ఉత్తరడొక్కరము**
కుస్త్రీపట్లలో ఒకటి.

**ఉత్తరమీమాంస**
మీమాంసాశాస్త్రం రెండు భాగాలు — పూర్వమీమాంస, ఉత్తరమీమాంస. జైమినికృతమైన పూర్వమీమాంస కర్మజిజ్ఞాసకు చెందినది. వ్యాసకృతమైన ఉత్తరమీమాంస బ్రహ్మజిజ్ఞాసకు చెందినది.

**ఉత్తరవయస్సు**
వృద్ధాప్యం.

**ఉత్తరవస్త్రం**
చూ. ఉత్తరవాసం.

**ఉత్తరవాసం**
పైపంచ, అంగవస్త్రం.
"వెలిపట్టు పుట్ట ముత్తరవాసముగ ధరించి." నైష. 8.103.
చూ. ఉత్తరవస్త్రం.

**ఉత్తరాసంగము**
చూ. ఉత్తరవాసం.

**ఉత్తరాషాఢ పూర్వాషాఢ అగు**
వాంతులు భేదులు అగు, ఎక్కువ భయము కలుగు.

పూర్వం, ఉత్తరం అన్నశబ్ద సామ్యంతో యేర్పడినట్లు కన బడుతుంది. అటూ ఇటూ అనుట.

"వాణ్ణి చూచేసరికి వీనికి ఉత్తరాషాఢ పూర్వాషాఢ అయింది." వా.

**ఉత్తరించు తములపాకు నిక్కెడుక్రియ**

ఆకుతోటలలో, బాటన క్రేవెలి గోటకొక ఇనుపగోటిని తగి లించుకొని తమలపాకులను తకీమని కత్తిరిస్తారు. అప్పు డది యెగసి పడుతుంది.

"ఉత్తరించు తములపాకు నిక్కెడు క్రియ దాఁటె నిట్టి." ఉ. హరి. 4.28.

**ఉత్తరీయము**

పైపంచ, అంగవస్త్రము.

చూ. ఉత్తరవాసం.

**ఉత్తరువు లిచ్చు**

ఆజ్ఞాపించు.

"తరువు లాకసము కుత్తరువు లిచ్చు." యామున. విజ. 4.229.

**ఉత్తరోత్తరా**

ముందుముందుకు, కాల క్రమేణ.

"ఇప్పుడు రాజీ చేసుకోవడంవల్ల ఉత్త రోత్తరా మీకు చాలా లాభాలు ఉన్నవి." చూ. ఉత్తరోత్రా.

**ఉత్తరోత్తరాభివృద్ధి**

క్రమాభివృద్ధి.

"పాత్తమిటు సేయ నీ కుత్తరోత్తరాభి వృద్ధి యౌని..." ఆము. 17.

"ఉత్తరోత్తర మభివృద్ధి నొందు చుండు." కాశీ. 2.52.

**ఉత్తరోత్రా**

వాడుకలో ఈ రూపం కని పిస్తుంది.

చూ. ఉత్తరోత్తరా.

**ఉత్తలపడు**

తహతహపడు.

"చిత్తం బుత్తలపడియెడు." సింహా. 1.62.

**ఉత్సవవిగ్రహము**

అలంకారవిద్యార్థి వంటిది. ఊరేగింపుకు మాత్రం పనికి వచ్చేది; మూలవిరాట్టు కాదు.

"వాడు వట్టి ఉత్సవవిగ్రహం; లోపల సత్తాసార మేం లేదు." వా.

**ఉదకమాడు**

స్నానము చేయు.

"ఒక్కప్రొద్దుండి సెలయేట నుదక మాడి." కాశీ. 3.37.

"మహారయమునఁ గొలన నుదక మాడఁగఁ బోవన్." శా. మా. 3.203.

**ఉదపానమండూకము**

నీటిబిలోని కప్ప.

చూ. కూపస్థమండూకము.

**ఉదయరాగపట్టులు**

వస్త్రభేదము.

ద్వాద. 3.206.

**ఉదరపోషకులు**

పొట్ట నింపుకొనువారు. దూషణలోనే ఉపయుక్తం.

పండితా. ప్రథ. పురా. పుట. 343.

"ఉదరపోషకులా పొరుగున జేరి."
త్యాగయ్య.

ఉదరము మాడు

కడుపు మాడు, క్షుత్పీడ కలుగు.

"బడబాగ్ని ఘనతరజ్వాలలు మండఁగ నుదరంబు మాడె ననఁగ."
కా. మా. 4.63.
చూ. కడుపు కాలు.

ఉదాత్తానుదాత్తస్వరితములు

వేదపఠనంలోని స్వర భేదములు.

"నమస్తే రుద్ర మన్యవ"
ఇక్కడ పై గీతలు ఉదాత్తమును, క్రింది గీతలు అనుదాత్తమును తెలుపును. స్వరితం పైన మఱింత ఆపి పలుకుతారు.
బస. 7.184.

ఉదిరిపడు

అదరిపడు.

ఉదిరిమల

మేరుపర్వతము.

"ఉదిరిమలతోడ నొరయఁగ
వెదిరిన దొర—"
రాజవాహనవిజయము. 2.79.

ఉదిలకొను

అధైర్యపడు, సంభ్రమపడు, వ్యాపించు.

"బెదర వజ్రాయుధు హృదయ, ముదిలకొనఁగఁ ద్రిదశగణము..."
భార. ఆది. 2.21.

"కృష్ణుఁ డొక్కింతవడి కోర్కి నుదిలకొనియె."
హరి. పూ. 3.252.

"వారివాహవ్యూహంబులు కడ లఁడియఁ జదల నుదిలకొనియె."
హర. 6.58.

"మదనవిక్రుతు లంతంతకు నుదిలకొనఁగ."
కేయూర. 4.7.

దీనికి దగ్గఱగా ఉండే అర్థాలలో ఇది ప్రయుక్తమౌతూ ఉంటుంది.

ఉదిలగొను

చూ. ఉదిలకొను.

ఉదుక చాలు

శోషణము చేయగలుగు, పోగొట్ట జాలు.

"మొదలియది పాపముల నెల్ల నుదుకఁ జాలు."
భీమ. 6.17.

ఉదుటారు

త్రుళ్లిపడు.

"...గుబ్బచను జక్కవలు...పైఠిణీ రవికలో నుదుటారఁగ..."
కాళిందీ 2.95.

ఉదుటు సూపు

అతిశయించు.

"తెక్కుహొన్నంచుపక్కెర యుదుటు సూప."
దశా. 2.66.

ఉదుటెక్కు

అతిశయించు.

"దీని చూపుదుటెక్కఁగాని కా సిరి పట్టి, కిని బోర బిరుదు డెక్కంబు గలిగె—"
ఆము. 6.105.

ఉదురుమిడుకు

ఒక తిట్టు. అదిరి అదిరి పడేవాడు, దుర్మార్గుడు.

"ఉద్ధతులు గొంట్లు పలుగాకు లుదురు మిడుకులు." హర. 5.10.
కళ. 5.87.

**ఉద్దండపిండము**

ఘుటికుడు.

"ఊరు వెడలె నంకు రుద్దండపిండంబు నాగనార్యుఁ డెందు డాఁగినాఁడొ." రుద్రమ. 70 పు.

చూ. ఉక్కుపిండము.

**ఉద్దండుడు**

ఘుటికుడు.

"వాడా? అబ్బా! ఉద్దండుడు." వా.

**ఉద్దరకు వచ్చు**

తేరకు వచ్చు.

రాయలసీమలో ప్రచురంగా వినవస్తుంది. ఉధార్ అన్న మాట తెనుగయిన దిక్కిడ.

"ఇదేమి ఉద్దరకు వచ్చిందా? పంచిపెట్ట డానికి." వా.

**ఉద్దిగొను**

జత గూడు.

నేటికీ పిల్లలాడుకొనేఆటలలో ఇద్దరిద్దరు ఒక్కొక్క ఉద్దిగా పరిగణించడం అలవాటుంది. ఇదే ఉజ్జీలు.

"ఇద్దఱు ముద్దియ లుద్దిగొని వీణ లంకు కొని..." భాగ. 10. పూ. 1082.

**ఉద్ది చేయు**

జోడించు, కలుపు.

"యూపములు సూత్రములతోడ నుద్ది చేసి." కాశీ. 7.88.

**ఉద్దియ చేయు**

ఉద్యమించు.

ఈ 'ఉద్దియ' ఉద్యమములో కానవస్తుంది.

**ఉద్ధతము లాడు**

గొప్పలు పలుకు.

"ఈరీతి నతఁడు శస్త్రవిదారితభుజుఁ డయ్యు నుద్ధతము లాడుచు రాఁగా." జైమి. 5.75.

**ఉద్ధరించాడు!**

వ్యంగ్యంగా ఎవరినిగూర్చి అయినా వాడు చేసిం దేముంది అనేఅర్థంలో ఉపయోగించే పలుకుబడి.

"తా నేదో మహా పొడిచేస్తున్నట్లు తీరు బడి లేక రాలే నని వ్రాశాడు. ఉద్ధరించాడు!" వా.

చూ. ఉద్ధారం చేశాడు.

**ఉద్ధరిస్తున్నాడు**

ఉంచుకొన్నాడు.

"వాడు దానిని ఉద్ధరిస్తున్నా డట." వా.

**ఉద్ధారం చేశాడు**

వాడు చేసిం దేమీ లేదు అనే అర్థంలో ఉపయోగించే పలుకుబడి.

"ఇక్కడింత ఉద్ధారం చేశాడు. ఇక అక్కడ ఉద్ధారం చేస్తాడు! చూస్తూనే ఉంటాం గా." వా.

చూ. ఉద్ధరించాడు.

**ఉద్ధారింపు**

తాను చేసిన ఘనకార్యం!

"వాడు చేసిన ఉద్ధారింపు ఏ ముంది?" వా.

చూ. ఉద్ధరించాడు.

## ఉద్యాపన సేయు

విసర్జించు.

వ్రతాదులలోని ఉద్యాపనపై వచ్చిన పలుకుబడి. వ్రతం ముగిశాక ఉద్యాపనం.

"విప్రమార్గ ముద్యాపన సేతురె నిన్ను వంటి బ్రాహ్మణకులజుల్." నిరంకు. 2.130.

## ఉద్యోగరాఘవుడు

కార్యప్రవణుడు.

"ఉద్యోగరాఘవుం డని, పద్యంబుల నూకఁ గేరి పంచలఁ జదువన్, విద్యార్థి కులకు వల్లము, చోద్యంబుగ విడిచి లంజ చూడఁగ నిచ్చున్." బహులా. 5.83. పు.

## ఉద్వాసన అగు

స్థానభ్రంశ మగు.

"వాడు ఆ ఊళ్ళోనూ దురుసుగా ప్రవర్తించా డట. అక్కడా ఉద్వాసన అయిం దని విన్నాను." వా.

"వానికి ఆఫీసునుంచి ఉద్వాసన అయింది." వా.

చూ. ఉద్వాసన చెప్పు.

## ఉద్వాసన చెప్పు

తొలగించు, స్థానభ్రష్ట మొనరించు.

పూజాపునస్కారాలలో కల శాదులను ప్రతిష్ఠించుట, ఆ పని తీరిన వెనుక ఉద్వాసనచేసి వాని నటనుంచి తొలగించుట ఆచారం. ఆ తొలగించుటనే ఉద్వాసనం అంటారు. అందుపై వచ్చినపలుకుబడి.

"ఏడి సంగతి నలుగురికీ తెలిసేసరికి! ఆ ఊరినుంచి ఉద్వాసన చెప్పారు." వా.

చూ. ఉద్వాసన అగు.

## ఉద్వాసన చేయు

చూ. ఉద్వాసన చెప్పు.

## ఉనికిపట్టు

స్థానము.

"విజయంబునకు నీశఁ డునికిపట్టు." ఉ. రా. 5.140; సుదం. 3.194.

రూ. ఉన్కిపట్టు.

## ఉన్కిపట్టు

నెలవు.

పాండు. 1.198.

చూ. ఉనికిపట్టు.

## ఉన్నట్టుండి

హఠాత్తుగా.

"వాడు ఉన్నట్టుండి అక్కడికి వచ్చాడు." వా.

"ఉన్నట్టుండి వానికి జబ్బు చేసింది." వా.

## ఉన్నది పుష్టి

కలిమి మాత్రమే బలము.

"ఉన్నది పుష్టి మానవుల కోయదు భూషణ యాలజాతికిన్, దిన్నది పుష్టి..." పాండవో. 8.

## ఉన్న దున్నట్టుగా

యథాతథముగా.

"వచియించెద మున్నది యున్న రీతిగా." నానా. 18.

**ఉన్నపట్టున ఊరక యుండు**

తనపాటికి తాను ఉండు. ఒకరిజోలికి పోకుండా అనుట. ఇది రాయలసీమలో ఇట్లాగే ఉపయోగిస్తారు. పట్టున 'పాట్న'గా మారుతుంది.

"ఉన్నపట్టున నూరక యుండక వింటి పత్రపాతు లటంచును బల్కఁదగునె?" రాజగో. 2.71.

"ఉన్నపాట్న ఊరికే ఉండకుండా ఊరిసంగతంతా నీ కెందుకోయ్?" వా.

**ఉన్నయునికిన**

ఉన్న దున్నట్లుగా.

"తన యింట రాత్రి నెమ్మది, నునికి గలిగెఁ బిదప నున్నయునికిన నుండఁ గాన్." ఉ. హరి. 6.5.

చూ. ఉన్నయునికెనె.

**ఉన్న యునికెనె**

ఉన్నట్లుగనే. హఠాత్తుగా. ఉన్న పళాన్నే అని నేడు కోస్తా ప్రాంతాలలో; రాయలసీమలో 'ఉన్న దున్నట్టుగా రావలసినదిగా కోరుతున్నాను' అని ఉత్తరాల్లో వ్రాస్తారు. తత్క్షణం అనుట.

"ఉన్నయునికెనె వెలువడ నుత్సహింపఁ, దలఁచి తేనియు నిది తుది దాఁక నెట్లు, నెయిద నేరదు గాన నీ వింద యుండి...సర్వేశుఁ గొలువుము బాల." కుమా. 6.13.

చూ. ఉన్నయునికిన.

**ఉన్నరూపు**

కలరూపు. ఉన్న సంగతి, యథార్థము.

"ఇంక నెన్నండు దయఁ బరమేశ్వరుండు, గన్ను దెఱచునో యని తన కున్నరూపు నెఱయఁ జెప్పిన విని." కుమా. 7.19. కాశీ. 4.100.

చూ. కలరూపు.

**ఉన్నవాడు**

సంపన్నుడు.

"వాడు ఆ ఊళ్లో కాస్త ఉన్నవాడు." వా.

చూ. కలవాడు.

**ఉన్నవాడూ కాదు ఊడినవాడూ కాదు**

నిష్ప్రయోజకుడు. వాడు చచ్చినట్లూ కాక బతికినట్లూ కాక ఉన్నాడు అనుట.

"వాడు ఉన్నవాడూ కాదు ఊడిన వాడూ కాదు. తెచ్చి పెడ్తే తింటాడు. లేకపోతే పైగా తిట్లూ దీవెనలూ." వా.

**ఉన్నారె యనుమాట మాత్రకైన నెడగలదె నీకు**

మా అస్తిత్వాన్నైనా అడిగే సావకాశం ఉన్నదా? లేదనుట. కనీసం ఆ మాత్రమైనా పలుకరించడం లేదని.

"మమ్ము నున్నారె యనుమాట మాత్రకైన, నెడగలదె నీకు మాకొలు విపుడు గాక." కళా. 7.19.

వాడుకలో 'మే మున్నా మని మాట మాత్ర మడిగేందుకు

తీరుబడి ఉందా?' ఇత్యాదిగా మారుతుంది.

"మేము ఉన్నామనైనా నీకు జ్ఞాపకం ఉందా? ఏమప్పా ఎట్లా ఉన్నారు? అని మాటవరుసకైనా అడిగేందుకు నీకు తీరుబాటు కాలేదే? ఇంక నీవు మమ్మల్ని ఏమి ఉద్ధరిస్తావు?" వా.

**ఉపకార మెక్కించు**

ఉపకారము చేయు.

"మీ చేత వెళ్ల నాడించుకొని మీ కుప కారం బెక్కించి విడుచుటకు వచ్చిన దని." ప్రభా. 4.31.

**ఉపగ్రామాలు**

శివారుగ్రామాలు.

"బస్తీ దక్షిణము తిరువల్లిక్కేణి ... మొదలయిన కొన్ని ఉపగ్రామాలు ఉన్నవి." కాశీయా. 372.

**ఉపదర్శన మాచరించు**

పెత్తనము చేయు; ఏదైనా పనిని పర్యవేక్షించు.

"త్రిపురాంతకుఁ బిలిపింపక, యుప దర్శన మాచరించు టుచితమె హరికిన్." కాశీ. 7.58.

**ఉపదేశము చేయు**

మంత్రమును ఉపదేశించు, హితము చెప్పు.

"స్వాములవారు అతనికి బాలాత్రిపుర సుందరీ మంత్రం ఉపదేశం చేశారట!" వా.

"నీ వేం ఉపదేశం చేసి పంపావో? కాస్త ఈ మధ్య నీ అల్లుడు పొదుపుగా ఉంటున్నాడు." వా.

**ఉపనయనము**

వడుగు. పంచదశ సంస్కారాలలో ఒకటి.

**ఉపనయనమునాటి మాట**

యాచన, భిక్ష మెత్తుట. ఉపనయనంలో 'భవతి భిక్షాం దేహి' అని మూడుసార్లు భిక్షం ఎత్తించుటపై యేర్పడిన పలుకుబడి.

"ఎవడూ అన్నం పెట్టక పోతే ఉప నయనమునాటి మాట ఉండనే ఉంది." వా.

**ఉపరిరతి**

రతివిశేషములలో భేదము. పమా. 9.152.

**ఉపవడ మగు**

మేలుకొను.

"పువ్వారుఁబోఁడి మదిలో, నవ్వాఖపడి చూచుచుండ నృపుఁ డుపవడ మై." శుక. 1.313.

**ఉపవాసము చేయు**

ఒక్కప్రొద్దు ఉండు.

"ప్రతి శివరాత్రికీ అతను ఉపవాసం చేస్తాడు." వా.

**ఉపాదాన మెత్తు**

బిచ్చ మెత్తు.

"తలమీఁద మంత్రాక్షతము లుంచి కల కాఁపు, టిండ్ల నుపాదాన మెత్తి యెత్తి." హంస. 2.152. పు.

**ఉపేక్ష చేయు**

ఉదాసీనముగా చూచు.

"ఈ సుకుమారదేహుఁ డిపుడు డీవని నుండ నుపేక్ష చేసినం, దోసము వచ్చు..." శుక. 1.282.

"ఇప్పుడు పిల్లవా డని ఉపేక్ష చేస్తే తర్వాత తర్వాత విచారించవలసి వస్తుంది." వా.

ఉప్పుకు చప్పుకుగా చూచు

అలక్ష్యముగా చూచు, సర్వ సామాన్యంగా చూచు.

"ఒకతెవలె నాడి యాడిం, చుకొనుట నే యిరుగు పొరుగు చూచె నో కో యుప్పుకుఁ జప్పుకుఁ గా ననుఁ జూచుక నడువఁగవలె." నిరంకు. 2.59.

చూ. ఉప్పుచప్పగా ఉండు.

ఉప్పుచప్పగా ఉండు

అంత రుచిగా లేక సర్వసాధారణంగా ఉండు.

పైది వాడుకలో ఉప్పుచప్పగా, ఉప్పన చప్పగా అని మారింది. భావచ్ఛాయ కూడా మారింది.

'ఏదో చాలాసేపు పాడాడు కాని ఉప్పుచప్పగా ఉంది.' అంటే అంత ప్రత్యేకత లేదని భావం.

"ఏదో ఉప్పుచప్పగా ఉంది నాటకం." వా.

ఉప్పుని చప్పుని

రుచి లేని; ఉప్పు చప్పగా ఉన్న.

"ఊరును పేరు లేని యొక యుప్పుని చప్పునికావ్యమ్ములు." బుద్ధ. 1.12.

చూ. ఉప్పుచప్పగా ఉండు.

ఉప్పునపట్టె లాడు, ఆడించు

ఒకరకమైనఆట ఆడు. ఉప్పుపట్టీలు, ఉప్పరపట్టెలు ఇవే.

"పడఁతి! నీచూపు లుప్పునపట్టె లాడించి చెలులవక్త్రములఁ బూజించుఁ గాక." ఉ. హరి. 5.141.

ఉప్పరగుళ్లు

ఒక బాలక్రీడ.

పండితా. ద్వితీ. మహి. పుట. 179.

ఉప్పరపట్టెలు

చూ. ఉప్పునపట్టె లాడు.

ఉప్పరము దాటు

ఆకాశ మంటు; వ్యాపించు.

"అంటినఁ గందునో యను మేని నునుఁ గాంతి, యిరుగెలంకులకు నుప్పరము దాటు." విక్ర. 8.101.

ఉప్పర మెగయు

ముమ్మర మగు; మిన్ను ముట్టు.

"అప్పలుకుల కలుకలు మది నుప్పర మెగయంగ." ఉ. హరి. 5.220.

చూ. ఉప్పరము దాటు.

ఉప్పరవట్టములు

పైన వేసే మేలుకట్లు, చాందినీలు.

అలంకారార్థం పట్టణాలలో దేవాద్యుత్సవాలలో అక్కడక్కడా చతురస్రంగా స్తంభాలు నాటి, వాటిపైన చాందినీలు కట్టి అలంకరిస్తారు.

నగరము నలంకరించుటకు దారి ప్రక్క నెత్తుగా కట్టు

ధ్వజాదిక మని వావిళ్ళనిఘం
టువు.
పండితా. ద్వితీ. మహి. పుట. 179.

**ఉప్పరవీది**

ఆకాశమార్గము.
"తే రుప్పరవీదిఁ దోలుకొని"
భార. భీష్మ. 2.90.

**ఉప్పరా లెగయు**

మీది కెగయు; మిన్నుముట్టు;
అతిశయించు.
"గుప్పెడినిట్టూరుపులఁ గోమలి హారము
లెల్ల, ఉప్పరా లెగయఁ జొచ్చె
నోయమ్మా!" తాళ్ల. సం. 12.327.

**ఉప్పరిపెనమున నీరువలె**

కుతకుతలాడు.
పెనంమీాద నీరు వేడెక్కి కళ
పెళ ఉడికి పోతుంది.
"వనరాసు లేడు నుప్పరి, పెనమున
నీరమును బోలెఁ బెల్లున నుడికెన్
(గన్)..." కుమా. 6.155.

**ఉప్పరిసాహిత్యము**

గొల్లనిసాహిత్యవిద్య వంటిది.
ఆకాలంలో ఉప్పరివాళ్ల కేం
చదువొస్తుంది అనుకునేభావం
పై ఏర్పడింది.

**ఉప్పవడ మగు**

మేలుకొను.
"పవడించి యంతను, ప్పవడ మగుచు."
పరమ. 3.56.
"ఉప్పవడము గావయ్యా ఉయ్యాల
మంచముమీాఁద." తాళ్ల. 1.62.
చూ. ఉపవడ మగు.

**ఉప్పిండి**

ఉప్పుపిండి.
తమిళంలో ఉప్పుమావు.

**ఉప్పిండి ఉపవాస ముండు**

ఉప్పుపిండి మాత్రమే తిని ఉప
వాస ముండు.
"ఓర్పుమై నుప్పిండి యుపవాస
ముండనీ, మగనాలి సరిపోల్పఁ దగదు
విధవ." కాశీ. 2.83.

**ఉప్పిడి**

ఉపవాసము.
ఉప్పిండి ఉపవాసములో ఇది
మాత్రమే మిగిలి ఉపవాసం
అనే అర్థం తెలుపునదిగా
మారినపలుకుబడి.
"పలుతెఱఁగుల నుప్పిడుల్ సలుప
వలదు." అచ్చ. అయో. 54.

**ఉప్పిడిపథ్యం**

ఉప్పులేని పథ్యం.
కొన్ని రోగాలకు, కొన్ని
మందులకు ఉప్పు పులుసు తిన
కూడ దని వైద్యులు పథ్యం
పెడతారు.
ఆయుర్వేదం ద్వారా వచ్చిన
పలుకుబడి.
చూ. చప్పిడిపథ్యం.

**ఉప్పు ఉంటే ఊరగాయ ఉండదు**

బొత్తిగా లేనిసంసారం
అనుట.

"వాళ్లింట్లో ఏముంది? ఉప్పు ఉంటే ఊరగాయ ఉండదు. ఊరగాయ ఉంటే ఉప్పు ఉండదు." వా.

**ఉప్పుకు పత్రికి కాక పోవు**

దేనికీ పనికి రాక పోవు.

"నేను చేసిందంతా ఉప్పుకూ పత్రికీ కాక పోయింది." వా.
"వాడు ఉప్పుకూ పత్రికీ కాకుండా పోయినాడు." వా.

**ఉప్పుకు వస్తుందా ఊరగాయకు వస్తుందా**

దేనికీ పనికి రా దనుట.

"ఈ లేనిపోని మాటలతో లాభ మేముంది? ఉప్పుకొస్తుందా? ఊరగాయ కొస్తుందా?" వా.

**ఉప్పుగండలు**

ఉప్పులో ఊరవేసిన మాంసం ముక్కలు,

"ఉప్పుఁగండ లెండఁబెట్టినవిధమునన్." కుమా. 11.175.

**ఉప్పుగండలు చేయు**

ముక్కలు ముక్కలుగా నఱకు.
ఉప్పులో ఊరవేయుటకై తగినంతచిన్నగా అనుట.

"దుప్పులఁ బడనేసి యుప్పుఁగండలు చేసి, చప్పరించుచు నుండుఁ జవులు మఱచి." వాల్మీ. 2.129.

**ఉప్పుగల్లు వోలె**

ఏకాకిగా; ఉప్పురాయి వలె; లేక లేక ఒకడుగా.

"సుతుల నేడ్వురను గ్రుంగిలివి తోడ్తో నిల్చెఁ, గడపట నొకఁ డుప్పుగల్లువోలె." జైమి. 4.73.

"నా, కుప్పుగలువోలెఁ గలిగిన, యుప్పాపని దీని కేడ యిచ్చితి మెకవన్." వేం. పంచ. 5.25.
రూ. ఉప్పుగలువోలె.

**ఉప్పుగాయ**

ఊరగాయ.

"మీఁగడల్ పెరుగు లుప్పుంగాయలున్" అని. 1.105.

కన్నడం–ఉప్పుగాయి, ఉప్పినగాయి.
తమిళం–ఉప్పిక్కాయ్.

**ఉప్పుగుండాలు**

పిల్లల ఆట.

**ఉప్పు చిదిమి యినుమడి యగు**

పడిపోయి అధిక మగు.
కొంత నష్టమైనట్లు కనిపించినా, దానివల్ల మఱింత లాభము కలుగుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"బ్రాహ్మణ్యంబె కాక భాగవతశ్రీయును గలిగి యుప్పు చిందు యినుమడి యగు చందంబునం..." ఆము. 7.24.
చూ. ఉప్పాలికి ఇమ్మడి అయినట్లు.

**ఉప్పుచేప**

ఉప్పులో ఊరవేసిన చేప. హంస. 4.187.

**ఉప్పుటుండలు**

ఆవిరితో చేసిన పిండివంట. శ్రీ. రం. మా. 6.110.

**ఉప్పుడుబియ్యము**
వడ్లను ఉడకబెట్టి ఆరబోసి దంచినబియ్యము.
"ఉప్పుడుబియ్యం అన్నం త్వరగా జీర్ణమవుతుంది." వా.

**ఉప్పు తిని ముప్పు తలచు**
తిన్నయింటివాసాలు లెక్కించు.
"అలాంటివాణ్ణి మనం చేరదీస్తే యేం లాభం? ఉప్పు తిని ముప్పు తలచే రకం." వా.

**ఉప్పు తిను**
సొత్తు తిను, పోషింపబడు. ఉప్పు భోజనంలో ప్రధానమైనది కనుక అది భోజనానికే ప్రత్యామ్నాయమైనది.
"తొంటిజని వాని యుప్పటు, తింటిఁ జుమీ యింతపాటుఁ దెచ్చుకొనుటకె." శుక. 3.411.
"వాని ఉప్పు తిన్నాము. కష్టసుఖాల్లో వానితోనే ఉండడం న్యాయం." వా.

**ఉప్పుతో తొమ్మిది**
అన్నిపదార్థాలూ.
"ఉప్పుతోఁ దొమ్మిదియును వెట్టి కృపణ రక్షణము గా వి.ం చు నీ గుణ సముద్రుఁడు." రామా. 1.107.
"ఉప్పుతో తొమ్మిదీ వాళ్లింటికి అత్తవారింటినుండి రావలసిందే." వా.

**ఉప్పుపట్టీలు**
చూ. ఉప్పునపట్టె లాడు.

**ఉప్పు పట్టు**
ఉప్పదనము అంతటా వ్యాపించు.
"ముక్కలకు ఉప్పే పట్టలేదే? ఇంకాసేపు ఉంచితే పోయేది." వా.

**ఉప్పు పత్తిరి లేని**
ఎందుకూ పనికి రాని, ఏమీ లేని.
"ఉప్పు పత్తిరి లేని యప్పు డవ్వారి శి, ష్యాపశిష్యులపోల్కె నుండవలయు." గిర. 30.

**ఉప్పు, పత్రి**
ఆడ్డా ఆగీ. జం.
"ఆనోటికి ఉప్పూ పత్రీ లేదు." వా.

**ఉప్పు పెటిక**
ఉప్పుసంచి.
"పోతుమీఁద నడ్డంబువడి యుప్పు, పెటికవోలె వెఱచి పఱచె జముఁడు." కుమా. 2.73.

**ఉప్పున పాతఱ వేయు**
శిక్షించు.
పూర్వం వేసే శిక్షలలో ఉప్పులో ఊర వేయడం కూడా ఒకటి. అందుపై వచ్చినపలుకుబడి.
"చిత్రాంగిని తుదకు ఉప్పున పాతఱ వేశారు" వా.

**ఉప్పుపళ్లు**
చవిటినేల.

**ఉప్పు లేక ముప్పందుము త్రాగు**
వట్టి తిండిపోతురాము డగు. ఉప్పు లేనిదే రుచి యేమాత్రం ఉండదు. దానినే అంత త్రాగినప్పుడు రుచిగా ఉంటే యింక యెంత త్రాగునో!

"అద్దిరా! మీ యొడళ్లు మీ యొద్ద లేవు గదా! ఉప్పు లేక ముప్పందుము త్రాగుచు గద్దెపాంకములు చాల దిద్దఁగలరే?"
ధర్మజ. 46.14.

## ఉప్పూ నిప్పూ

సహజవిరోధ మనుట.

"వాడికీ వీడికీ ఉప్పూ నిప్పూ. వాడూ వీడూ కలవడం ఎలా సాధ్యం?" వా.

## ఉప్పెనబోవు

గంగ గలియు, వరదపా లగు.

"ప్రోల వచ్చినకల్పసాల ముప్పెనఁ బోయె." శా. మా. 4.111.

## ఉప్పెనవలె

హఠాత్తుగా.

వరద హఠాత్తుగా వస్తుంది.

"వాడు ఉప్పెనలా వచ్చాడు." వా.

## ఉప్పొంగు

పొంగు.

"జలరాసు లేడు నుత్సవమున నుప్పొంగ." రుక్మాం. 1.142.

## ఉప్పొలికి ఇమ్మడి అయినట్లు

ఉప్పు క్రింద పోయి రెండింత లయినట్లు.

నష్టము కల్గునట్టి పని జరుగగా, అందువల్ల లాభ మే అగు.

పండి. ప్రథ. పురా. 387 పు.

చూ. ఉప్పు చిదిమి యినుమడి యగు.

## ఉప్పో ఊరగాయో

ఉన్నదానిలో ఏదో ఒకటి.

భోజనవిషయంలోనే ఉపయోగించే పలుకుబడి.

"ఉప్పో ఊరగాయో ఏదో ఒకటి వేసుక తింటే పోతుంది. అంత శ్రమ యెవడు పడతాడు?" వా.

"ఉప్పో ఊరగాయో మాకు కలిగింది లేదనకుండా పెడతాము. తినిపో నాయనా!" వా.

## ఉబలాటపడు

ఒక కార్యమునకై యెక్కువగా ఉత్సహించు.

"వాడు ఆ పిల్లను పెళ్ళి చేసుకోవా లని మహా ఉబలాట పడుతున్నాడు.." వా.

## ఉబుసుపుచ్చు

కాలక్షేపము చేయు.

"అలివ! యెపుడు నుబుసు వుతురు వివిధోపయోగ్యకళల." పారి. 2.93.

## ఉబుసుపోక

కాలక్షేపము, కబురులు చెప్పుకొనుట.

"ఉబుసుపోకకు నైన నొల్లవు చెవిఁ జేర్ప, వైణికవల్లకీవాదనములు."
వరాహ. 2.56.

"జలరుహేక్షణ లుబుసు పోకల వసించి." విప్ర. 2.65.
ఆముక్త 2.74; మను. 4.24.

## ఉబుసుపోవు

కాలక్షేప మగు.

"ఉబుసుపోవంగ శివశర్మ యొయ్యఁ జేరె, నప్సరోలోకము." కాశీ. 3.165.

## ఉబ్బనీయకు

వెలికి తెలియనీయ వద్దు.

"ఈ కథయును నీవు నాతోడు సుమ్మొబ్బనీకు మనియె."
కళా. 1.194.

ఉబ్బనీరు

ఉమ్మి.

ఉబ్బనెత్తు

పైకెత్తు.

"నీటిలో మునిఁగిన నేలచేడియఁ గొమ్ము, కొన నుబ్బనెత్తినఘోణి వీవ." పారి. 1.49.

ఉబ్బర పోవు

సంతోషించు.

ఉబ్బిపోవడ మంటే సంబర పడడ మన్నది నేటికీ అల వాటులో ఉన్నది.

"సూర్యోదయ వేళ ముజ్జగము నుబ్బర పోవఁగ." కాశీ. 6.17.

ఉబ్బరిక చేయు

విజృంభించు, అతిశయించు. భాగ. 10. పు. 1345.

ఉబ్బవేయు

పొగడు.

అది హృదయపూర్వకం కాద న్నధ్వనీ ఇందులో ఉన్నది.

"వాడు వాళ్ల అత్తను ఉబ్బవేసి తన పని గడుపుకొంటున్నాడు." వా.

ఉబ్బసపుచ్చు

ఆయాసపడు.

"నావుడు నుబ్బసపుచ్చుచు." ద్వాద. 2.85.

ఉబ్బి తబ్బిబ్బగు

సంతోషపరవశుడగు.

సంతోషమో, భావోద్రేకమో కలిగినప్పుడు శరీరం ఉబ్బొంగడం కవులు గుర్తించినసత్యం. వీరునికి భుజములు పొంగుట యిలాంటిదే. ఒకప్పుడు ఎత్తిపొడుపుగా కూడా ఈ పలుకుబడి ప్రయుక్తం కావడం కలదు. ఇతరుల పొగడ్తకు ఉబ్బి తబ్బిబ్బవుతాడు అని వ్యవహారం. ఉబ్బవేయు యిలాంటిదే.

"దైవయోగంబువలనఁ బ్రమాదం బని తలంపక రాజసన్మానంబునకు నుబ్బి తబ్బిబ్బుగాఁ బచరించిన." శుక. 1.186.

"ఆయన కావ్యంనుండీ ఒక పద్యం ఉటంకించేసరికి ఉబ్బి తబ్బిబ్బయి పోయినాడు." వా.

ఉబ్బుకుడుము

ఆవిరికుడుము.

ఉబ్బుసగ్గులు

హెచ్చుతగ్గులు. జం.

"ఉబ్బు సగ్గు లేనిచ్చలు బోటు సుబాటు." తాళ్ల. సం. 6.56.

ఉభయం

దైవపూజకు ఒక రోజు ఖర్చు భరించుట.

"ఈ రోజు శివాలయంలో ఉభయం నారాయణసెట్టి గారిది." వా.

ఉభయాలు

భోజనసామగ్రి.

పొయ్యి మీదికీ, పొయ్యి కిందికి పనికి వచ్చునవి.

**ఉభయఖర్చులు**

పెండ్లిలో ఆడపెండ్లివారి, మొగపెండ్లివారి ఖర్చులు రెండూ.

"ఉభయఖర్చులూ మేమే భరిస్తా మని చెప్పాం కదా!" వా.

**ఉమేజువారి పని**

పై తనిఖీ చేయుపని.

"ఉమేజువారీ పని చేయడాని కేం? ఎవరైనా చేస్తారు." వా.

**ఉమ్మాయజగ్గాయలు**

యః కశ్చనలు.

వాడూ, వీడూ; పే రెత్తి చెప్పదగినవారు కారు అనుట.

**ఉమ్మాయముత్యము**

మాయముత్యము.

**ఉమ్మెత్తకాయకు చిలుక పొంచి యున్నట్లు**

అనవసరమైనఆశతో వేచి ఉన్నట్లు.

ఉమ్మెత్త విషఫలం. అది చిలుక తినుట కెలాగూ పనికి రాదు.

"రాతికి సరి వచ్చురా వీని మనసు, కరఁగఁబో దుమ్మెత్తకాయకుఁ జిలుక, పొరసినవిధ మాయెఁ బో తనవలపు." సారం. 1.551.

**ఉమ్మెత్తకాయ తిన్న పొలుపు**

వెఱ్ఱి యెత్తినట్లు.

ఉమ్మెత్తకాయలు తింటే పిచ్చిపట్టుతుం దని మనవారి నమ్మకం.

"కంతుమాయల నుమ్మెత్తకాయ దిన్న, పొలుపు సొరెకుఁ జెల్వు నప్పకవి వేల్పు." శుక. 2.459.

**ఉమ్మెత్తకాయలు తిను**

వెఱ్ఱెత్తు.

ఉమ్మెత్తకాయలు తింటే పిచ్చి పడుతుం దని అంటారు. అందుమీఁద వచ్చిన పలుకుబడి.

"ఉమ్మెత్తకాయలు తిన్నయదియొ, మరులుకొన్నదియొ [illegible], మతి తప్పినదియొ."

పండితా. దీక్షా. ప్రథమ. 115 పు.

**ఉయ్యెల లూఁగు**

సందిగ్ధావస్థలో ఉండు.

"...భీతిచే నుయ్యెల లూఁగుఁ బ్రాణముల నోర్వక చీఁకెద వీటఁ జూచితే..."

హంస. 3.45.

**ఉయ్యాలో జంపాలో**

ఊచునప్పుడు అను ఊతపదం.

"జోలల్ వాడిరి యమృతపు, జాలం జొక్కొట్టఁజాలు సరసపుఁ జూపుల్, డోలాయమానముగ ను, య్యాలో జంపాలో యనుచు నాలోలాక్షుల్."

సారం. 1.48.

**ఉరిగోల**

ఉరివేయు కోల.

**ఉరిగోల పులుగు**

ఉరిలో చిక్కినపక్షి.

బాధ పడునది.

"విలసిల్లు నురిగోల వేదనఁ బొంది
పులుఁగు చందంబునఁ బొరలుచుండి
తిమి." ద్విప. జగ. 210.

**ఉరితీయు**

ఉరివేసి చంపవలె నని శిక్ష వేయు.

చూ. ఉరివేయు.

**ఉరి పెట్టుకొమ్మను**

నిరసనగా 'ఏమైనా చేసుకొమ్మను' అనుపట్ల అనేమాట.

కొత్త. 13.

**ఉరిపోసికొన్నట్లు**

ఎక్కువ యిబ్బందిగా.

"నీతో ఉరిపోసికొన్న ట్లుంది." వా.

**ఉరిపోసుకొను**

చూ. ఉరివోసుకొను.

**ఉరియాడు**

డోలాందోళిత మగు.

"మనం బురియాడన్."
రుక్మాం. 4.134.

**ఉరివేయు**

కొఱతవేయు.

చూ. ఉరితీయు.

**ఉరివోసుకొను**

1. మెడకు త్రాడు వంటి దానిని తగిలించుకొని ఆత్మహత్య చేసికొను.

2. ఉరి పోసుకొన్నంత బాధ పడు.

"ఆ అమ్మాయి ఉరిపోసుకొని చని పోయిం దట." వా.

"వాడితో ఉరి పోసుకొన్నట్లుగా ఉంది." వా.

**ఉరిసినపుండు కోల కెలకు**

బాధ పడుచున్న వానిని మఱింత బాధ పెట్టు.

శకుం. 3.171.

**ఉరిసినపుండుపై ఉప్పు చల్లు**

అసలే బాధ పడుతుండగా మరింత బాధ కలిగించు.

గోరుచుట్టుపై రోకటిపోటు వంటిది.

"ఉరిసిన పుండుపై నుప్పును జల్లి,
కెరలఁ జేసెదవు..."
గౌర. హరి. ద్వి. 1255-1256.

చూ. ఉరిసినపుండ్ల ఉప్పుపెట్టు.

"అరులు మనమీద నురవడి నడుగుదేర
నేను సిడిముడి పడుచుండ నిట్టు లనుట,
మొప్ప నురిసినపుండులఁ నుప్పు వెట్టె,
దరయ దీనికి నిన్ను నే మందుఁ జార."
భార. ద్రో. 5.358.

**ఉరుమనిపిడుగు లగు**

వజ్రప్రాయము లగు.

"ఉరుమని పిడుగులై యొడలు చిల్లులు వోవఁ,బడుమరుకోలలు." రాధి 2.21.

**ఉరురతి**

రతిలో ఒక భేదము.

కుమా. 9.152.

**ఉరువులు**

వస్తువులు, శాల్తీలు.

"మొత్తం ఉరువులు చిన్నవీ పెద్దవీ కలిసి ఇరవై నాలుగు. సరిగ్గా ఉన్నాయో లేవో చూచుకోండి." వా.

ఉఱుమనిపిడుగులు

ఉఱుము లుఱుమకయే పడిన పిడుగులు. అనగా పూర్వ సూచన లేకయే అనుట.

పండితా. ద్వితీ. మహి. పుట. 9.

ఉఱ్ఱుకట్టు

పశువులకు వేయు కాలి బంధము.

ఉఱ్ఱుట లూగు

ఉఱ్ఱూత లూగు,

"సి గుఱ్ఱట లూఁగ,..."

కృష్ణ. శతం. 2.57.

ఉఱ్ఱుట లూచు

ఉఱ్ఱూత లూగునట్లు చేయు.

ఉఱ్ఱుట్లూగు

ఉఱ్ఱూత లూగు.

"బ్రహ్మాండభాండ ముఱ్ఱుట్లూఁగన్."

శశాం. 5.36.

"వాడు పెండ్లి కావా లని ఉఱ్ఱుట్లూగు తున్నాడు." వా.

చూ. ఉఱ్ఱుట లూగు.

ఉఱ్ఱుట్లూచు

చూ. ఉఱ్ఱుట లూచు.

ఉఱ్ఱుతాడు

పశువులు మొదలయినవాని కాళ్ళకు వేసేబంధం.

"కుఱ్ఱలఁ బట్టఁగ నుఱ్ఱుఁద్రాళ్ళు వలదు, కుండ యొడ్డనఁ బాలు నిండఁ గురియు."

మై. రా. 1.57.

ఉఱ్ఱూత లూగు

ఉఱ్ఱుట లూగు.

"కో డెవయసు పాక ముఱ్ఱూఁత లూఁగెడు భార్య మీఁద, ... మనసు చాలించి..."

హంస. 5.115.

ఉఱ్ఱూత లూపు

కదలించు.

"నిర్వక్రరథచక్ర నిష్ఠురగతు లనంతోరగస్వామి నుఱ్ఱూఁత లూఁప."

రాధా. 5.21.

ఉలఉల లాడు

దురద పెట్టు

"దానికి ఎప్పుడూ నోరు ఉలఉల లాడుతూ ఉంటుంది. ఏదో ఒకటి అనకుండా ఉండదు." వా.

ఉలారం గొడ్డు

పొగరెక్కిన గొడ్డు.

ఉలికిపడు

అదరిపడు.

అకస్మాత్తుగా ఏదయినా విని నప్పుడో, కనినప్పుడో సంభ్రాంతి చెందు.

విజయ. 3.62.

ఉలికిపాటు

అదిరిపాటు.

ఉలిపికట్టె

పెడసరపు మనిషి.

"ఊరంతా ఒకదారి అయితే ఉలిపికట్టెది ఇంకో దారి." సా.

ఉలిపిజంగెత

ఉలిపికట్టె వంటిది.

"ఉలిపి, జంగెత నీ వేళ చనుదెంచితిట్లు."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 149.

**ఉలియాడు**

పోగరతో లోహములమీద, కఱ్ఱలమీద చిత్రములు చిత్రించు.

**ఉలివాడు**

కదలు.

"కొమరొందు నవవిలాసముల కన్బొమ లులి,వాడు చూపుడుఁ గోల లగుచుఁ దనర..." కళా. 2.172.

**ఉలివాళుల వాడు**

సుంద్రుకొని పోవు.

"మీసలు గడ్డము, నులివాళులు వాడు చుండు నొందినభీతిన్." కుమా. 10.101.

'మీసాలు కాలిపోతాయి జాగ్రత్త' అని వాడుకలోనూ ఉంది.

**ఉలివెచ్చు**

గోరువెచ్చు.

**ఉలుకబాఱు**

వెలికి ప్రసరించు.

"ఒడలికాంతులు పట్టులే కులుకఁ బాఱు, సన్న వలిపంపుఁ బయ్యెద చాక శించి." భాగ. 8.363.

**ఉలుప నించినకైవడి**

కానుకగా వచ్చిన పదార్థములు ఉంచినట్లు; ప్రదర్శనముంచినట్లు.

"ఒలుపుఁ బప్పు మొదల్గాని తెచ్చి యన్నియుఁ, వేఱుగ నింటిలో నులుప నించినకైవడి నుంచె." శుక. 3.189.

**ఉలుప వట్టు**

కానుక లిడు.

పాండు. 5.238.

**ఉలుపా యొనగూర్చు**

నజరానా పెట్టు; బహుమతులు కానుకలు ఇచ్చు.

"రాజురాక కులుపా యొనఁగూర్చిన యట్లు...." కళా. 6.134.

**ఉలుపా లొనరించు**

కానుక లిచ్చు.

ఉల్ఫా అనే పదంనుండి వచ్చియుండవచ్చును.

"విశేషవస్తు సంభావన లెల్ల నిచ్చి యులుపా లొనరించి పురంబుఁ జేరినన్." శుక. 1.399.

**ఉలువకట్టు**

ఉలవ లుడికించి చేసిన చారు.

"నాలుగు రోజులు నీవు ఉలవకట్టు చేసుకొంటే నీ శైత్యం వదలి పోతుంది." వా.

**ఉల్లకుట్టుమాటలు**

ఎత్తిపొడుపు మాటలు.

"సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన నుల్లకుట్టుమాటలఁ దచ్చి, తమ ఉడికించుచుఁ బాండవ, సమితిం గడఁగించువా రచట నెవ్వ రొకో!" భార. ఉద్యో. 2.242.

"ఈ ఉల్లకుట్టు మాటలతోనే ఆవిడ అందరినీ ద్వేషం చేసుకుంటుంది." వా.

రూ. ఉల్లికుట్టుమాటలు.

**ఉల్లము పల్లవించు**

సంతోషము కలుగు.

"వనరుహనేత్రిఁ దేల్చె యదువల్లభుఁ డుల్లము పల్లవింపఁగన్."
రాజగో. 2.79.

**ఉల్లము జాయి చేసికొను**

కాఠిన్యము వహించు.

చూ. మనసు జాయి చేసికొను.

**ఉల్లల నుడుకు**

గద్గోలము, గంధరగోళము అగు. కుతకుత ఉడుకు. ధ్వన్యనుకరణము.

"తన చిత్తమునఁ, దనుకఁగ నుల్లల నుడుకను, విను శిఖిచోరాది ముఖ్య విషయా పదకున్." భార. శాంతి. 4.34.

"దనుజు లుల్లల నుడుకన్."
కుమా. 12.25.

"ఓషధిప్రస్థ ముల్లల నుడుకుచుండ.
హర. 5.10.

**ఉల్లస మాడు**

పరిహసించు.

"మొల్లల నుల్లసం బాడి యాణిముత్తియంబుల నుత్తరించి...పలువరుసయు."
పాండు. 3.179.

చూ. ఉల్లసము లాడు.

**ఉల్లసము లాడు**

పరిహాస మాడు.

"ఒండొరువుల గరువంబుగ నుల్లసంబు లాడుచును." భార. భీష్మ. 1.112.

**ఉల్లికుట్టుమాటలు**

ఎత్తిపొడుపు మాటలు.

"సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన నుల్లికట్టు మాటలఁ దచ్చి, త్తము లుడికించుచు..."
భార. ఉద్యో. 2.242.

"ప్రతాపభాషణం,బున వెడ నుల్లికట్టులను బొంకుల వానిఁ గలంగఁ జేసి."
భార. శాంతి. 3.20.

రూ. ఉల్లకట్టుమాటలు.

**ఉల్లికోళ్లు**

ఎర్రగడ్డలమీది క్రోవులు. ఇవి కూర చేసుకోవడానికి ఉపయోగిస్తారు. రాయలసీమలో వీటినే ఉల్లికోవు లంటారు.

"ఉల్లికోవుల పులుసు ఎంతో రుచిగా ఉంటుంది." వా.

**ఉల్లిగడ్డములు**

చిన్నగడ్డములు. ఉల్లిగడ్డంతవి అనుట. "ఉల్లిగడ్డంత అన్నం పెట్టు" అని వాడుక.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 315.

**ఉల్లితిన్న కోమటివలె ఉండు**

నోరు మూసుకొని ఉండు. ఉల్లివాసన వస్తుం దేమో నని మిన్నకుండె ననుటపై వచ్చిన పలుకుబడి.

"ఘటిక మ్రింగిన సిద్ధునియటుల నుల్లి, దిన్నకోమటివలె నూరకున్న వాఁడు."
సారం. 3.164.

**ఉల్లిపాయ**

వెల్లుల్లి (తెల్లగడ్డ) లో ఒక భాగము.

"ఉల్లిపాయ తుంచి వాసన చూపితే శాస్త్ర తెలి వొస్తుంది." వా.

**ఉల్లిపాషాణము**
ఒకరకమైన విషము.

**ఉల్లిపొరవంటి**
మిక్కిలి పల్చనైన.
"వా డెప్పుడూ ఉల్లిపొరలాంటి మల్లు పంచలు కడతాడు." వా.

**ఉల్టాసీదా**
పైన ఒకటి, లోపల ఒకటి అనుట.
ఇది గుడ్డనేతద్వారా వచ్చిన పలుకుబడి. నేతలో పైన సున్నగా లోపల గరుకుగా ఉండునట్లు నేసేనేత ప్రసిద్ధము.
"ఈ పని అంతా ఉల్టాసీదాగా ఉంది." వా.
చూ. ఉల్టాసీదామనిషి.

**ఉల్టాసీదా మనిషి**
వంచకుడు.
"వాడు వట్టి ఉల్టాసీదామనిషి. అన్న దంతా నిజ మనుకోకు." వా.
చూ. ఉల్టాసీదా.

**ఉవ్వలపోటి**
బాలక్రీడావిశేషము.

**ఉవ్వెత్తుగ**
1. పూర్తిగా, సులువుగా.
"వను నువ్వెత్తుగఁ బాఱ మీటితివి." వసు. 2.
"అవ యువ్వెత్తుగఁ ద్రావినట్లు." పాండు. 5.
"బలౌఘములఁ జను మాడి వైచె నువ్వెత్తుగ." కళా. 8.57.
2. హఠాత్తుగా, ఒక్కుమ్మడిగా.
"ఉవ్వెత్తుగఁ జుట్టుముట్టుకొని యీఁకెల ద్రొక్కెనలఁ ..." కళా. 8.58.
"కాని యువ్వెత్తుగా పీడఁ గాఁ దరంబె." దేవి. 1.487.

**ఉవ్విళులూరు**
ఉవ్విళ్లూరు.
ఎందుకోసమో ఉత్సుకోత్సుకతతో నుండు.
"ఉవ్విళు లూరెడు నెమ్మనంబులు." విరాట. 5.393.

**ఉవ్విళులూర్చు**
ఉవ్విళు లూరునట్లు చేయు.

**ఉవ్విళ్ళుగొను**
ఉవ్విళ్లూరు.
"కలహాశనమౌని చూడ్కు లువ్విళ్ళు గొనంగఁ జొచ్చె." కవిక. 2.150.

**ఉవ్విళ్ళు గొలుపు**
ఉవ్విళు లూరునట్లు చేయు.
ప్రభా. 3.66.

**ఉవ్విళ్ళూరు**
మిక్కిలి ఆశపడు.
"విను నీ రూపము సూచి మా నృపతి యువ్విళ్లూరు నే నెమ్మెయిన్, బని గొందున్." భార. విరా. 1.321.
"అత డువ్విళ్ళూరెడు." హరి. ఉత్త. 6.116.
"అతఁ డువ్విళ్లూరెడు బలవన్మదోద్ధతి యడఁపన్." హరి. ఉ. 6.116.
పాండు. 5.22.
"వాడు పెళ్లి చేసుకోవా లని మహా ఉవ్విళ్లూరుతున్నాడు." వా.

**ఉవ్విళ్ళూరు**

ఉవ్విళ్లూరునట్లు చేయు.

కాశీ. 4.150.

**ఉసి ఆడు**

వీలు చిక్కు.

"పదిరూపాయ లయినా యీనెలలో యిస్తా మనుకుంటే యేమీగా ఉసి ఆడ్డం లేదు." వా.

చూ. ఉసి చిక్కు, ఉసి దొరకు.

**ఉసి కొల్పు**

కవ్వించు.

కుక్కను ఉసికొల్పుట పై వచ్చినపలుకుబడి.

"ఉసికొల్పి వంచించి దుసుకుల చను దోయి చేసెనంట." రాధికా. 1.124

**ఉసి చిక్కు**

ఏదో వీలు కలుగు.

"ఏమి చేద్దా మన్నా ఆఫీసు పని తో ఉసి చిక్కడం లేదు." వా.

చూ. ఉసి ఆడు.

**ఉసి దొరకు**

చూ. ఉసి చిక్కు.

**ఉసి యిచ్చు**

ప్రోత్సాహ మిచ్చు.

"కాస్త ఉసి యిస్తే వా డెంత పనైనా చేస్తాడు." వా.

**ఉసివోవు**

తప్పిపోవు.

"ఏసినయే టుసివోయెఁ బోయినన్, మానిని నిస్సిరో యనుచు." కవి. 4.57.

**ఉసు రను**

అలసి పడిఉండు.

"ఉండ లేక నీవద్దనే వుసు రంటి గాక." తాళ్ల. సం. 3.29.

**ఉసురసు రను**

ఆపసోపాలు పడు.

"తా నుసురసు రంచు ఖిన్న యయి యొయ్యన." హరి. 4. 113.

**ఉసురుకొను**

కోలుకొను, బలపడు.

కాశీ. 3.23.

**ఉసురు గలిగితే ఉప్పమ్ముక బ్రతుక వచ్చును**

ఊపిరి ఉంటే ఉప్పమ్ముకొని బ్రతుకవచ్చు. సా.

"ఉసురు......పద పదంబ్రా. హేమా. పు. 18.

**ఉసురు తగులు**

ఎవరి నైనా బాధించగా ఆ పాపఫలితము చుట్టుకొను.

"ఆ పిల్లను అంత వేధించాడు. ఆ ఉసురు తగిలే నాశన మై పోయాడు." వా.

చూ. ఉసురు తాకు.

**ఉసురు తాకు**

ఈ మనోవేదనవల్ల, ఆ వేదనకు కారణ మైన వానికి చెరుపు తప్పక కలుగును అను పట్ల ఉపయోగించే పలుకుబడి.

"పొమ్ము కెక్కించి తనప్రక్కఁ బవ్వళింపఁ, గోరి నేఁ జూడ తేలు తాఁ గుడిచి కట్టి, యూరకే యిల్లు వెడలు

నా యుసురు తాఁకి, దీపములు సైత
మల్లాడుఁ దెలివలార!"
శుక. 2.63. పే.

"ఆ భార్యను వాడు నానా బాధా పెట్టి హింసించాడు. ఆవిడ ఉసురు తాకి వీడు పుట్టగతులు లేకుండా పోయాడు."
వా.
చూ. ఉసురు తగులు.

## ఉసురు పెట్టుకొను

వేధించు, బాధించు.

"వాడి ఉసురు ఎందుకురా పెట్టుకొంటావు?"
వా.
చూ. ఉసురు పోసుకొను.

## ఉసురు పోసుకొను

చూ. ఉసురు పెట్టుకొను.

## ఉసురు మను

బాధపడు, దుఃఖించు.

"ఆడది యుసురు మన్నఁ, గొఱగాదు సుమీ."
సా. 2.123.

"ఆడకూతురిని ఉసూరు మనిపిస్తావు దేనికి రా?"
వా.

"వాడు ఉసూరు మంటూ ఈ ఊరు వదిలిపెట్టి పోయాడు."
వా.

"వాడు ఉసూరు మంటూ వచ్చాడు."
వా.
చూ. ఉస్సు రను.
రూ. ఉసూరు మను.

## ఉసుల నిచ్చు

కదల నిచ్చు; ఉసి దొరక నిచ్చు.

"మొదల నీయరు ... వసుల పాతర లై వీరు నుసుల నీయరు." సారం. 2.127.

## ఉసుఱుకొను

కలకలలాడు; కోలుకొను.

"పెసరసుఱుకొనియె." కాశీ. 3.23.

## ఉసుళ్ల విధంబున

అధికముగా.

వాన వచ్చినప్పుడు ఉసుళ్లు విపరీతంగా చెలరేగుటమీాద వచ్చినపలుకుబడి.

"వెల్లి విరిసినచాడ్పున నుసుళ్లవిధంబున మిడుతలగమిలాగున..."
హంస. 3. 29.

ఇది నేటికీ వాడుకలో నున్నది.

"ఉసుళ్ల పుట్ట పగిలినట్లుగా జనం వచ్చారు."
వా.

## ఉస్సు రని యూర్చు

నిట్టూర్చు.

"అడుగులఁ బొప్పాకు లంటి చుఱ్ఱడుచుచో, నుస్సు రని వెస నూర్చి యూర్చి."
కవిక. 3.92.

## ఉస్సు రను

నిట్టూర్పు పుచ్చు-బడలికతో.

"అంతదూరం వచ్చి ఉస్సురు మంటూ కూలబడ్డాడు."
వా.
చూ. ఉసురు మను.

## ఉస్సురస్సురు మను

ఉస్సు రను, ధ్వన్యనుకరణము.

"అతిశయిల్ల నుస్సురస్సు రనుచు."
పరమ. 3.148.

## ఊకదంపు

నిష్ప్రయోజనము.

వట్టి ఊకను (పొట్టు) దంచిన ట్లనుట; తేలే దేమీా ఉండదు కదా.

"వాని దంతా వట్టి ఊకదంపు ఉపన్యాసం."
వా.
చూ. ఊకదంపుపాట.

**ఊకదంపు పాట**

వట్టి వాగాడంబర మనుట.

చూ. ఊకదంపు.

**ఊకబంతి**

చెండుమల్లె (బంతి) జాతిలో ఒక రకం.

**ఊకర లిచ్చు**

ఊకొట్టు.

"పెడ యేడ్చు నంతన యుడుగును గ్గడుగు, నూకర లిచ్చు నాలకించు."

భోజ. 1.176.

చిన్నపిల్లల విషయంలో నే యిది ఉపయోగిస్తారు.

**ఊకరలు గొట్టు**

హుంకరించు.

"ఊకరల్ గొట్టుచు నుత్తలపడుచు."

బస. 7.868.

**ఊకరలు వెట్టు**

చూ. ఊకరలు గొట్టు.

**ఊకర ల్వెట్టు**

హుంకరించు.

"ఊకర ల్వెట్టుచు నుఱవడింపుచును."

బస. 5.139 పు.

(ఎద్దు ఇక్కడ ప్రసక్తం).

చూ. ఊకరలు గొట్టు.

**ఊకొట్టు**

1. అంగీకరించు; అంగీకారము తెలుపు.

"నెమ్మినయుక యూఁకొట్టి మ్రొక్కుచు నున్న."

గౌ. హరి. ప్రథ. పం క్తి. 1325.

"వాడు నే నేం చెప్పినా ఊకొడ తాడు." వా.

2. ఊరక విను.

"వా డేదో చాలా చెప్పుకు వచ్చాడు. నే నేదీ తేల్చి చెప్పకుండా ఊకొట్టి వచ్చాను." వా.

చూ. ఊకొను.

**ఊకొను**

ఊకొట్టు; విను.

ఒకరు కథ చెప్తుంటే వినే వారు ఊకొట్టడం అలవాటు.

"తనువు మఱచితి వేమి యూఁకొన వదేల, యవలికథఁ జెల్పు మనియెడు."

సార్వ. 6.2.

"ఊకొఁ జెప్పఁగ నెంతయేనితడ వా."

కాశీ. 7.173.

"అల్పబుద్ధుల పెడమాట లూఁకొనక."

భార. ఉద్యో. 3.337.

చూ. ఊకొట్టు.

**ఊగాడు**

కదలాడు.

**ఊగియాడు**

చూ. ఊగాడు.

**ఊగులాట**

అటూ ఇటూ తోచని, తేలని స్థితి.

"ఇదంతా చూడబోతే వట్టి ఊగులాటగా ఉంది. ఎంతకూ పోదామా వద్దా అనేదే తేల్చక పోతే ఎలాగ?" వా.

**ఊచకండె**

నూలు చుట్టే కండె.

శుక. 2.423.

ఊచక యాచక

సంకోచింపక. జం.

"తొయ్యలి యూచక యాచక, పయ్యెద గొబ్బున బటాన బయలుగఁ జేసెన్." సారం. 3.16.

చూ. ఊచకాచక.

ఊచకాచక

సంకోచింపక.

"...ఊచకాచక మదిలో." రాధి. 2.57.

చూ. ఊచక యాచక.

ఊచకోత

మొదలంట కోయుకోత.

త్రివేణి. పు. 20.

ఊచపడు

కృశించు.

"సరసిజగంధి పెందొడల సాటికి రానెదురించి పోరుసీ, కరభము లెల్లఁ జేపడఁగఁ గన్గొని యుండియుఁ దజ్జయార్థమై, పొరలఁ బెనంగి యూచపడి పోవుట లింతియ కాక ధాత్రిపై, నరఁటులు పిలపిలతర మైనను సామ్యము పొంద నేర్చునే?" భాను. 2.13.

రూ. ఊచవడు.

ఊచపోవు

సన్నవడు.

భల్లాణ. 4.

"ఆ పిల్లవాడికి పాపం! చిన్నతనంలోనే కాళ్లు ఊచపోయినవి." వా.

చూ. ఊచపడు.

ఊచబియ్యము

పాలకంకులను కోసి చేతితో నులిమి రాల్చినగింజలు. రాయలసీమలో వీటికే పిసుకుళ్లని పేరు.

ఊచముట్టుగా

పూర్తిగా, నిశ్శేషముగా.

"ఊచముట్టుగ గీము లాహుతి గొనంగ." రామా. 6.250.

"ఊచముట్టుగ నిలు దోచి యుణికి చనుట." పాండు. 3.50.

ఊచముట్టుగొను

చంపు.

"నీ తమ్ముఁ గుఱ్ఱల నూచముట్టుగొనియె నే విధి." భార. శల్య. 1.28.

ఊచినకఱ్ఱ వంపని

బలహీనులా లయిన, సుకుమారులా లయిన.

సన్నని కఱ్ఱను కూడా వంచ లేని దనుటపై వచ్చిన పలుకుబడి.

"ఊఁచినకఱ్ఱ వంపనిపయోరుహలోచన మింట మంటలం, బూఁచినబాణజాలమున." ఉ. హరి. 1.163.

ఊటచెలమ

తఱుగనిది; చెలమలో నీరు వినియోగ మయ్యేకొద్దీ తిరిగీ ఊఱుతూనే ఉంటుంది.

తాళ్ల. సం. 11.122.

ఊటాడించు

గట్టిగా కదలించు.

"మదాళిమాలికల నూటాడించు వేణీరుచుల్." విజ. 2.16.

ఊడదన్ను

పోగొట్టు, పోవునట్లు తన్ను.

"పాటు తెంచిన యొడ్డీని పెనులావు లూడఁదన్ని." జైమి. 1.45.
"ముందుపండ్లు నాలుగూ ఊడదన్ని పంపిస్తే పోతుంది." వా.
చూ. పండ్లూడదన్ను.

**ఊడనిబాడు**

ఊరు వదలిపోవు. పాటిపోవు.
"ఒకనాటిరాత్రి పడుపడు, కకఁ జెప్పక యిల్లు వెడలి గాఢతరతమో, నికరము తన తగుతోడుగ, నొకరుఁడు పెరడవి త్రోవ నూడనిబాడెన్."
పాండు. 3.49.
"అకాక్రాంతామణి నెచ్చెలు, లాక్షాక పని పేరు చెప్పి యూడనిబాడన్."
కవిజన. 3.98.
"అయ్యొరగము లెల్ల నద్దెసల నూడని బాడిన." ఉత్త. హరి. 6.239.

**ఊడబొడుచు**

ఉద్ధరించు వంటిది.
వాడు చేసింది మహా యేమిటి అన్న అర్థంలో ఉపయోగిస్తారు.
"వాడు ఊడబొడిచింది ఏముంది యిందులో?" వా.

**ఊడిన నాగ లైన**

మూలబడిన, సరి యైనస్థితిలో లేని.
"ఊడిననాగ లైనపతి కున్నవి లేనివి నచ్చఁబల్కు." రుద్రమ. 19 పు.

**ఊడిపడు**

హఠాత్తుగా వచ్చు.
"వాడు ఎక్కడనుండో ఆవేళకు సరిగ్గా ఊడిపడ్డాడు." వా.

**ఊడుకొన జేయు**

పాటునట్లు చేయు.
"ఊడుకొనఁ జేసి వే ఱొక్క దిక్కు తెరువుగా." భాస్క. అర. 2.126.

**ఊడుగవిత్తనంవంటి**

ఎప్పుడూ వదలని.
ఊడుగువిత్తనా లన్నీ తిరిగీ ఊరుమురిమితే ఊడుగుచెట్టు మొదలును కరుచుకొంటాయి అని ఒక ప్రథ. దానినిబట్టి వచ్చిన పలుకుబడి.

**ఊడ్చి పెట్టు**

ఉన్న దంతా దోచిపెట్టు.
"ఆవిడ పుట్టింటికే ఉన్న దంతా ఊడ్చి పెట్టింది. ఇంక తన కొడుకుల కేం మిగులుతుంది?" వా.

**ఊడ్చిపెట్టుకొని పోవు**

సర్వం పోవు.
"ఉన్న దంతా ఊడ్చిపెట్టుకొని పోయే సరికి వాళ్లు ఆ ఊరు వదిలి వేరే ఊరు పోవలసి వచ్చింది." వా.

**ఊతకోల**

ఆధారము; తోడు; చేయూతను కఱ్ఱ.
"అందునకు నూతకోలగా నకట! యొకని, సైన నిలుపక..."
భార. స్త్రీ. 1.170.

**ఊతగొను**

ఆధారముగా చేసికొను.
"ఒండొరుల కేలుఁ దమ్ముల నూఁత గొనుచు." శాకు. 4.27.

ఊతనీరు

అశాశ్వతము; భంగురము.

ఎత్తిపోయునీరు కొంచెమే ఉంటుంది, త్వరగా ఎండిపోతుంది అనుటపై ఏర్పడినది. అశాశ్వతము అని భావార్థం నిలిచినది.

"ఊఁతనీరు, చెలఁది సేఁత, మూటాయిటి దూది, యెండపసుపు, దొఱ్ఱి యక్కఱంబు మేను." ఆము. 6.62.

ఊత యొసగు

ఊత యిచ్చు.

"రాముని డించి కరం బూఁత యొసఁగి."

వర. రా. అయో. పు. 256. పం. 1.

ఊదజెప్పు

నొక్కి చెప్పు.

"సంస్కృతశబ్ద మూఁదఁ జెప్పిన నవి దర్భముం డ్లనుచుఁ బెట్టరు వీనుల." సింహా. 1.32.

ఊదబడి పోవు

తఱుముబడి పాఱిపోవు.

ఊదుకొనిపోవు ( = తఱుముకొనిపోవు) అన్న రూపంలోనే డీ పలుకుబడి పశ్చిమాంధ్రంలో వినవస్తుంది.

"తలతో నూదఁబడి పోయె ధనదుఁడు కృతి యై." కవిక. 2.122.

ఊదబొడ్డు

పైకి ఉబికి ఉన్న బొడ్డు.

ఊదరగొట్టు

ఏదో ఒకటి చెయ్యమని పోరు, ఊపి రాడనీయకుండా.

"అక్కడికి వెళ్లేసరికి వాడు అదేపనిగా తనగోడ వంతా చెప్పకొని ఊదరకొట్టి వదిలి పెట్టాడు." వా.

ఊదర పెట్టు

పందికొక్కులూ మొదలయినవాని కలుగులలో పొగపెట్టు.

అలా పొగ పెడితే అవి ఊపిరి తిప్పుకో లేక బయటికి వస్తాయి. అప్పుడు వాటిని చంపుతారు. లక్షణయా ఊపిరి తిప్పుకోనీయకుండా వేధించు.

"వాడు పొద్దున్నించీ ఒకటే ఊదరపెడుతున్నాడు ఊరికి పోదామని." వా.

చూ. ఊదరకొట్టు.

ఊదర లిడు

"ఉరుధూమతతుల బట్టూదర లిడిన, పరుసున దొంటలఁ బాములు మడియ." గౌర. హరిశ్చ. పూ. 2238.

చూ. ఊదరపెట్టు.

ఊది పిఱింది త్రాడగు

వెంట నుండు.

వెనుకకు కట్టుకొని యుండు త్రాడు వెంట వచ్చినట్లు.

"ఏదెసఁ దొలంగినను నూది పిఱింది త్రా డై యూదికొని." ఉ. హరి. 4.29.

ఊదుకడ్డీ

సాంబ్రాణివత్తి.

"సాయంకాలం రెండు ఊదుకడ్డీలు ముట్టిస్తే మంచిది." వా.

చూ. ఊదువత్తి.

**ఊదుకు పోవు**

తఱుముకొని పోవు. ఊపుక పోవు.

క్రింది ప్రయోగంలోని శ్లేషలో రెండు అర్థాలూ ఉన్నవి.

"ఊదుకపోవు శంఖము నహో! గళరేఖ." విజయ. 1.134.

"కంచేళ్లను నక్కలు ఊగుకొని పోయినవి." వా.

**ఊదుకొను**

నాటు.

"ఊఁదుకొనఁబడు మధూళిక—" ఆము. 5.137.
హరి. ఉత్త. 9.231.

**ఊదుగ్రోవులు**

బాలక్రీడావిశేషము.

**ఊదువత్తి**

సాంబ్రాణికడ్డీ.
చూ. ఊదుకడ్డీ.

**ఊదువెండి**

పరిశుద్ధమైన వెండి.

వెండిలో ఏదయినా కల్తీ ఉన్నప్పుడు దానితో పాటు సీసం కూడా వేసి, మూసలో వేసి, కుంపట్లో పెట్టి ఒక తిత్తితో ఊదుతారు. కడపటికి మేలిమి వెండి తేలుతుంది. బంగారం పుటం పెట్టినా రన్నట్లే వెండిని ఊదడం అనే అంటారు.

"తగువెండి చాలా ఉంది. ఊదించాలి." వా.

"దీని కేం ఊదువెండి. చొక్కం." వా.

**ఊపాడు**

ఊగాడు.

"చూపుఁ దేటుల పిల్లలూ పాడఁ జొచ్చె." రాజ. చ.

**ఊపరలాడు**

వట్టి దంభోక్తు లాడువాడు.
ఉత్త. హరి. 5.178.

**ఊపిరాడడం లేదు**

పని యెక్కువైన దనుట.

"పొద్దుటినుంచీ ఒకటే పని. ఊపి రాడ్డం లేదు." వా.
చూ. ఊపిరి సలపడం లేదు.

**ఊపిరికుట్టు**

ఊపిరి పీల్చుటకు వీలు లేనట్లు కడుపుకుట్టు పట్టుకొను.

"అబ్బల్లిదు ప్రక్కనొంచిన నపాయపుటూపిరికుట్టు వట్టి మూర్ఛిల్లి." కళా. 2.146.

"పాపం అతనికి ఊపిరి కట్టుపట్టి విలవిలలాడి పోతున్నాడు." వా.

**ఊపిరి ఆడకుండు**

పని తెమలకుండు; నిర్విరామంగా, ఎడతెఱపి లేకుండా ఉండు.

"నీరు వోయువారు నారు నాటెడువారు, ఊపి రాడకుండ నొరసికొనిరి." క్షేత్రలక్ష్మి. 42 పు.

"పొద్దున్నుంచీ వచ్చే చుట్టాలూ పొయ్యే చుట్టాలూ. ఊపి రాడ్డం లేదు. వా.
చూ. ఊపిరి సలపకుండు.

**ఊపిరి తిప్పుకొన లేక పోవు**

ఉక్కిరి బిక్కిరి అగు.

"ఈ పనితో ఊపిరి తిప్పుకొన లేక పోతున్నాను." వా.

చూ. ఊపిరి ఆడకుండు.

**ఊపిరి బిగబట్టు**

కాస్త ఓపిక పట్టు.

"ఈ ఒక్కరోజూ కాస్త ఊపిరి బిగపట్టి ఉండు వదినా! రేపు మేము వెళ్లిపోతాం. అప్పుడు నీయిష్టం వచ్చినట్టు నీపిల్లలను కొట్టుకొందువుగానిలే." వా.

**ఊపిరి మోచు**

బ్రతుకు.

"ఊపిరి మోచిననాడే బట్టికొంటి వాసలెల్ల." తాళ్ల. సం. 8.83.

**ఊపిరి సలపడం లేదు**

పని యెక్కువైన దనుట.

చూ. ఊపిరాడడం లేదు.

**ఊరక పడి యుండు**

మరొక ఆలోచన లేకుండా ఉండిపోవు.

"ఎవ్వారి దాన నిచట నూరక పడియుండ." కళా. 4.110.

"ఏదో ఇంత తిని ఊరికే పడి ఉండరాదా?" వా.

"నా కెందుకు? వాళ్లేమైనా చేసుకోనీ. నేను ఎక్కడో ఒకచోట ఊరికే పడి ఉంటాను." వా.

**ఊరక పోదు**

వ్యర్థము కాదు.

"నాకును బ్రియం బగు టొక్కటి యెక్కుడౌ బ్రియం, బూరక పోదు..." కళా. 5, 195.

"నా వంటివానికి చెరుపు చేస్తే ఊరికే పోదు." వా.

**ఊరగుంత**

రొచ్చుగుంట వంటిది.

తాళ్ల. సం. 12.151.

**ఊరంత బలగము**

ఎక్కువ బలగము.

"ఊరంతబలగంబు." విజయ. 3.133.

"వారి కేమమ్మా. ఊరంత బలగ ముంది. ఏ పని పట్టుకున్నా గబగబా ముగించ గలరు." వా.

**ఊరంతా ఉడుకు**

గగ్గోలగు.

"ఓషధిప్రస్థ ముల్లల నుడుకుచుండ." హర. 5.10.

"పక్కఊళ్లో దొంగలు పడ్డారని తెలిసి ఈ ఊరంతా ఉడికిపోతూ ఉంది." వా.

"వా డాపిల్లను లేవదీసుకు పోయా డని ఊరంతా ఉడికి పోతూ ఉంది." వా.

**ఊరంతా గుప్పు మను**

పొక్కు; ఊరందరికీ తెలియు.

కొత్త. 434.

**ఊరకుక్క**

పనికి మాలినది.

"నూరు ఊరకుక్కలైనా ఒక వేట కుక్కతో సరి పోవు." వా.

**ఊరజోగి**

ఊరూరు తిరిగి భిక్ష మెత్తుకొనువాడు.

"ఉరగకంకణుతోడ నూరజోగులను, సరి చేసి యెన్నినచందాన నీవు," గౌ. హరి. ప్రథ. పం. క్తి. 175-76.

**ఊరడించు**

ఓదార్చు.

"వట్టి ఊరడింపు మాటలతో ఏంలాభం? ఏదో సాయపడాలి గానీ." వా.

**ఊరదైవములు**

చిల్లర దేవతలు.

"ఊరఁడే శిక్షింప రక్షింప ఊరదైవములు నోగి నిలని సరా."

తాళ్ల. సం. 9.240.

చూ. ఊరబసువులు (వివరణము.)

**ఊరపంది**

ఒక తిట్టు; సోమరి; పనికి మాలినవాడు.

"ఊరపందిలా బలిసిపోయాడు." వా.

"వాడు వట్టి ఊరపంది." వా.

**ఊరపిచ్చుక**

ఇండ్లలో తిరుగు పిచ్చుక.

"వైనతేయఖగంబుతో నూరపిచ్చుక, రాజరత్నంబుతో గాజుపూస."

చెన్న.

**ఊర ప్రొద్దు గ్రుంక లేదు**

ఊరు మాటు మణగ లేదు. రాత్రి చాలా పొద్దు పోవలేదు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"నిండినింటిలోన నీ కేల భీతిల్ల, గోల యూరఁ బ్రొద్దు గ్రుంక లేదు."

హంస. 4. 237.

**ఊరబండు**

తేనెలో ఊరవేసినపండు.

**ఊరబసువులు**

ఊరిలోని పశువులు.

ఊరకుక్క, ఊరపందివంటిది. ఇలాంటివాటిలో 'ఊర' వచ్చినప్పుడల్లా కాస్త నీచ మన్న భావము కానవస్తుంది.

"కావించిన యలనామధేనువుల కేవి యూరఁబసు లీడౌనా."

తాళ్ల. సం. 9.61.

చూ. ఊరదైవములు.

**ఊరబ్బ నారబ్బ చేయు**

ఊరూ నాడూ ఏకం చేయు, అల్లరి పెట్టు.

"ముగుడొక్కమా టంటే చాలు. అది ఊరబ్బ నారబ్బ చేస్తుంది." వా.

ఇది రాయలసీమలో బాగా వినబడే మాట.

చూ. ఊరూ నాడూ ఏకము చేయు.

**ఊరళ్లు గొను**

వ్రేలిగణుపులు వాచు. ఊరగా (వానలో తడిసి) ఉబ్బగా, వాయగా.

"క్రిందటను వఱదవారఁగ మీఁద వానయుఁ గురియ...వ్రేళ్లసంధులును నూరళ్లు గొనఁగఁ."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 147.

**ఊరార్చు**

ఓదార్చు.

చూ. ఊరడించు.

**ఊరించు**

1. ఆశ కల్పించు.

నోట నీరూరించుటపై వచ్చినపలుకుబడి.

"మాటిమాటికి వేలు మడిచి యూరించుచు, నూరగా యలఁ దినుచుండు నొక్కఁడు. భాగ. దశ. పూ. 496.

2. ఆకర్షించు.

నా. మా. 73.

"ఆ అబ్బాయి నలా ఊరించడం తప్పితే అది దగ్గర చేరనిచ్చినపాపాన పోలేదు." వా.

**ఊరికి ఊరు**

ఊరంతా.

"ఇటీవల వరద వచ్చి ఊరికి ఊరు కొట్టుక పోయింది." వా.

ఇలాగే 'ఊరు'కు బదులు గ్రామం ఇత్యాదులతో కూడ ఈ పలుకుబడిని ఉపయోగిస్తారు.

"గ్రామానికి గ్రామం దేశానికి దేశం అల్లాడి పోతోంది." వా.

**ఊరికి పోవు**

చూ. ఊరు పోవు.

**ఊరిదారి పట్టు**

వెనుదిరుగు.

"తత్తరమ్మున నూరిదారి పట్టె." శ్రవ. 2.65.

**ఊరిమీద పడు**

పని లేక ఊరంతా తిరుగు.

"ఇంట్లో దండించేదిక్కు లేక వాడు ఊరిమీద పడ్డాడు." వా.

**ఊరిలో ఇల్లు లేదు అడివిలో చేను లేదు**

ఏమీ లేదనుట.

"వాడికి పిల్లనిస్తానంటా వేమిరా? బుద్ధుందా లేదా? వానికి చూడబోతే ఊళ్లో ఇల్లూ లేదు, అడివిలో చేనూ లేదు. వాణ్ణి కట్టుకొని మన పిల్ల ఏం సుఖపడుతుంది?" వా.

**ఊరివారల తలనొప్పి**

ఊరివారికి బాధ కలుగజేయునట్టి.

"వాడకుఁ బగ యూరివారల తలనొప్పి." శుక. 3. 20.

**ఊరు కాచి తిరుగువారు**

గ్రామరక్షకులు, తలవరులు.

"కత్తివాతులతో నూరు గాచి తిరిగి, యాడుమురుపాశెములఁ గాంచె." ఉ. హరి. 1.140.

**ఊరుగాయ**

నిలవ ఉంచుకొనుటకై ఉప్పు, నూనె మొదలయినవాటితో పెట్టిన మామిడికాయ, నిమ్మకాయ మొదలగు ఊరగాయ.

**ఊరు చక్కబెట్టు**

స్వేచ్ఛగా ఊరంతా తిరుగు. వ్యభిచరించు అని సూచన.

"మొగుడు ఊరు వెళ్లేసరికి ఆవిడ ఊరు చక్కబెట్టి వస్తుంది." వా.

**ఊరుపిండి**

పచ్చడి.

రాయలసీమలో పచ్చడిని ఊరుపిండి అనే అంటారు.

రూ. ఊరుబిండి.

**ఊరు పేరు తెలియు**

వివరము తెలియు.

"వేగమే, యూరును బేరునుం దెలిసి యొద్దిక సేయుద మెల్లకార్యముల్." ఉషా. 1.49.

"ఊరూ పేరూ తెలిశాక గానీ ఎవరితోనూ స్నేహం చేయ రాదు." వా.

**ఊరు పేరు లేని**

అనామక మైన.

"ఊరు పేరు లేనివాళ్లంతమంది వస్తే నేం?" వా.

**ఊరుపోక**

ఉబుసుపోక.

"ఒడలుమ్మలించిన నొకపూట వెలుపట నుండుమీ చనుదెంచి యూరుపోక." భోజ. 5.210.

**ఊరుపోవు**

మఱొకయూరికి పోవు.

"ఆ అబ్బాయి ఊరు పోయాట్ట. పది రోజులకు గానీ రాడు." వా.

**ఊరు మెచ్చుపెండిలి**

ఊరివారందఱు మెచ్చదగు వివాహము.

"చికొట్టు వలదు చెలులకుఁ, బెక్కటికి నూరు మెచ్చుపెండిలి గలిగెన్." ఉ. హరి. 5.152.

**ఊరుమేలు తోడుమేలు**

స్వగ్రామము, సహచరుడు—వీరివల్ల కలిగేమేలు.

సదానంద. శత. 61.

**ఊరు లేక పొలిమేర గల్గునా?**

అసలు లేనిది వడ్డీ ఎక్కడిది వంటిది.

ఊరే లేనప్పుడు ఆ ఊరి పొలిమేర ఎలా ఉంటుంది?

"తలఁప నెచ్చట నైన దానూరు లేక, పొలిమేర గల్గునే?"

పండితా. ప్రథ. వాద. పుట. 636.

చూ. పురం లేనిది అంతఃపురమా?

**ఊరు లేనిపొలిమేర**

ఉండ దనుట.

తాళ్ల. సం. 12.55.

**ఊరువాడు చెలమ**

సులభగమ్యము.

తాళ్ల. సం. 3.460.

ఊరందరూ నీళ్లు తెచ్చుకొనే చెలమ అందరికీ అందుబాటులో ఉంటుంది.

**ఊరు వెళ్లు**

చూ. ఊరు పోవు.

**ఊరూ నాడూ ఉడికిపోవు**

ఏదో సంగతిలో ఊరంతా గగ్గోలగు.

"కన్నతండ్రి మరణకారకుఁ డని సైత, మూరు నాడు నేఁటి కుడికిపోవు." నాయకు. 90. పు.

**ఊరూ నాడూ ఏక మగు**

అల్లకల్లోల మగు.

"ఆ ఊళ్లో మొన్న జరిగిన కొట్లాటలో ఊరూ నాడూ ఏక మయింది." వా.

చూ. ఊరూ వాడా ఏక మగు.

**ఊరూ నాడూ ఏకము చేయు**

విపరీత మయిన ఆర్భాటము చేయు.

"తోడికోడలు ఏమో అనిం దని ఆ పిల్ల ఊరూ నాడూ ఏకం చేసింది." వా.

చూ. ఊరవ్వ నారవ్వ చేయు.

ఊరూ పేరూ లేనివాడు
అనామకుడు.
"ఆ ఊరూ పేరూ లేనివాడికి పిల్లను ఎవరిస్తారు?" వా.
రూ. ఊరు పేరు లేని...

ఊరూ వాడా ఏక మగు
చూ. ఊరూ నాడూ ఏక మగు.

ఊరేగించు
మెరవణి చేయు.
వ్యంగ్యార్థంలోనే ఈ పదం ఎక్కువగా ఉపయోగిస్తారు.
"ఆఁ. వీ శ్శేమో ఉల్లిగడ్డలు కట్టి ఊరేగిస్తా రట ఆ ఊరు పోతే." వా.

ఊరేగు
తన గొప్పను ప్రదర్శించుకొను.
వ్యంగ్యంగా,నిరసనగా 'పోవు' అనేఅర్థంలో కూడా ఉపయోగిస్తారు.
"వాడు తా నేదో గొప్ప కవి నని ఊరేగుతున్నాడు." వా.
"వా డెక్కడికి ఊరేగాడో? మన కెక్కడ కనిపిస్తాడు?" వా.

ఊరేటిచెలమ
వట్టిపోనిది.
చెలమ ఎన్నడూ శూన్య మైపోదు.
"తీరని మోహాల తెందేపలు
ఊరేటిచెలమలు ఉడివోనిపంటలు." తాళ్ల. సం. 11.11.

ఊర్గాయ
ఊరుగాయ.
"ఊర్గాయలుఁ వనపర్ణ భోజనములం దొప్పార." బహు. 4.49.
చూ. ఊరుగాయ.

ఊర్జితము చేయు
లాభము కలిగించు.
"వాడు సంసారానికి చాలా ఊర్జితం చేస్తున్నాడు." వా.
"వీ డేదో మహా ఊర్జితం చేస్తున్నట్లు మాట్లాడుతున్నా డేమి?" వా.

ఊర్ధ్వపుండ్రాలు
పట్టెనామాలు

ఊర్బిండి
ఊరుబిండి.

ఊర్బిండివడెము
వడియము.
"గుడి ద్రిమ్మంగువానికి లింగ మూర్బిండీ వడెము." సిం. నార. 36.
చూ. ఉట్రవడియము.

ఊటట బుచ్చు
ఊటడించు.
"లో నుంచక భీతి యంచు వినయోన్నతి నూఱటఁ బుచ్చి యంతటన్." హంస. 3.121.

ఊఱడ బల్కు
ఓదార్చు.
"ఈ పగిదిఁ మురారి హృదయేశ్వరి నూఱడఁ బల్కె." పారి. 4.13.

ఊఱడ ద్రోచు
ఊఱట కలిగించు.
"ఓ యదువీర! వృష్ణిఁ బసి నూఱడఁ ద్రోవవె సప్తరాత్రముల్." ఆము. 4.29.

ఊఱడించు
ఓదార్చు.

**ఊటిఅడిలు**

చూ. ఊటిఅడిల్లు.

**ఊటిఅడిల్లు**

ఓదార్పు చెందు.

చూ. ఊటిఅడిలు.

**ఊలమాలగుడుచు**

కలతపడు, క్షోభ చెందు.

"చిడిముడిఁ బొందుచు సిగ మిట్టి మిట్టి, పడఁగఁ బల్కులు తొట్రుపడ నూల మాల, గుడుచు మ..." నవ. 3 భా.

**ఊలవడు**

శబ్దించు, ఘోరు మను.

"ఊలవడి చూచి కామాక్షి సు తరించె ...అకాలవృష్టి." హర. 2.22.

**ఊలుకొను**

నిలుచు.

**ఊలుకొలుపు**

నిలుచునట్లు చేయు.

**ఊలొక్కను**

చూ. ఊలుకొను.

**ఊలొక్కల్పు**

చూ. ఊలుకొలుపు.

**ఊళ్లు దోచి గుళ్లు కట్టు**

ఒక మంచిపనికై యెక్కువ చెడుపనులు చేసేపట్ల ఉప యోగించే పలుకుబడి.

మదన. శత. 40.

**ఊళ్లూళ్లవారు**

గ్రామ గ్రామంవారు, ఊరూరి వారు.

"తమ యూళ్లూళ్లవారి నెల్ల రావించి." పండితా. ప్రథ. పురా. పుట. 416.

**ఊళ్లోవాళ్ల సొత్తు**

ఇతరుల సొత్తు.

"ఊళ్లోవాళ్ళ సొత్తుకు అందరు అధి కారులే అంటారు!" వా.

**ఊవాడు**

ఊగాడు.

"అలరుం బోడుల లోపల, నలరుం బోడునులు నీకు నగ్గల మవుచుం, దల పూ వాడక యుండుము, తలపూవు ధరించి వికచతామరసాక్షీ !" పారి. 1. ఆ.

**ఊసకాళ్లు**

ఊచపోయిన కాళ్లు.

**ఊసరిల్లు**

చిక్కు, కృశించు.

**ఊసివాసము**

ఈర్ష్య.

శ. ర.

**ఊసు (నీ) కెందుకు ?**

నా (నీ) విషయంలో కల్పించు కోవద్దు అనుపట్ల ఉపయో గించేపలుకుబడి.

"నా ఊసు నీ కెందుకు? నీ సంగతి నీవు చూచుకో." వా.

"నీ ఊసు నా కెందుకు. నా సంగతి నేను చూచుకుంటాను." వా.

**ఊసుపోక**

ఉబుసుపోక.

**ఊసుపోవు**

కాలక్షేప మగు.

ఊసులాడు

కబుర్లు చెప్పుకొను.

"సెలఁతల్ ముచ్చట కూసులాడెదరు."

క్షేత్రలక్ష్మి. 74.

ఊహాగానము చేయు

ఏదో ఒక విషయము పై ఊరికే ఊహించు.

ఊహాపోహాలు కల....

ఊహాపోహాలు కలవాడంటే వివేకి, బుద్ధిమంతుడు.

ఋణము తీర్చుకొను

ఎవరైనా మేలు చేసినప్పుడు ఉపకారమునకు ప్రత్యుపకార మొనరించు.

ఇది రకరకాలుగా ఉపయోగ పడుతుంది.

'నీ ఋణం తీర్చుకోలేను', 'నీకు నేను ఋణపడినాను'. 'నీ కేదో చేసి యీ ఋణం తీర్చుకోవాలి' ఇత్యాదులు.

"నీ ఋణము దీర్పఁగలవాఁడనే యటంచు." హంస. 1.255.

ఋణము తీరు

సంబంధము తెగిపోవు.

"...నీకు నాకును ఋణము దీరె."

శ్రవ. 5.83.

ఋణము పణము

అప్పూ సప్పూ. జం.

"పాలు గాదెడు నీదుకపోలఫలక, మందుఁ గనుఁగొన నిమ్మ నాయకము లేదు, ముద్దు లద్దాలు గిద్దాలు మోటు గావె, ఋణమొ పణమో విచారింత మెప్ప దేని."

కవిమాయ. అం. 2. పు. 28.

ఋణము వడ్డితో నీగు

చేసినపనికి పూర్తిగా ప్రతీకారము చేయు; వడ్డితోపాటు అప్పు తీర్చు.

"ఆ సభలోఁ గొన్నఋణ మంతయు నీఁగఁగఁ గంటి వడ్డితో."

భార. కర్ణ. 3.195.

ఋణానుబంధము తెగు

ఋణము తీరు.

'ఋణానుబంధరూపేణ పశుపత్నీసుతాలయాః' అన్న దానిపై వచ్చినది.

"తప్ప రాదు ఋణాను బంధంబు దెగినఁ, బ్రాణపద మైనవలపును బాసి చనదె." మను. 3.140.

"వానికీ నాకూ ఆనాటితో ఋణాను బంధం తెగిపోయింది." వా.

ఋతుకాలము

రజోదర్శన మయిన పది దినాలవరకూ ఋతుకాల మని కళాశాస్త్రం.

ఋతుమతి యగు

రజస్వల యగు.

ఎం. ఆర్. ఆర్. వై.

మహారాజరాజశ్రీ.

ఈ మాటకు ఇంగ్లీషు పొడి అక్షరాలు. మొన్న మొన్నటి

దాకా అడ్రెసుల్లో ఇలానే వ్రాసేవారు.

"యమ్మార్రాగ్తైగారికి." పాణి. 6.97.

ఎంగిలాకులు నాకు

నీచమునకు పాల్పడు.

"వాడు ఒట్టి ఎంగిలాకులు నాకేవాడు." వా.

ఎంగిలించు

ఎంగిలి చేయు.

"మొన లావులించి వాసన సల్లఁ బసిగొని, లేఁదేఁటిగము లెంగిలింపకుండ." కుమా. 3.108.

"వాడు అన్నం ఎంగిలి చేసినాడు." వా.

ఎంగిలి కాశించు

ఉచ్ఛిష్టమునకు ఆశించు, నీచ కార్యమునకు పాల్పడు.

"నీ విట్లా ఎంగిలి కాశిస్తా వని అనుకోలేదు." వా.

ఎంగిలికూటి కాశించు

పరస్త్రీ కాశించు అనుపట్ల కూడ ఉపయోగిస్తారు.

చూ. ఎంగిలి కాశించు.

ఎంగిలి గావించు

ఎంగిలి చేయు.

స్త్రీ విషయంలో అయినప్పుడు పరస్త్రీని కవయు అని అర్థము.

"అనంగ క్రీడా సంగతి నెంగిలి గావించె." నిర్వ. 6.74.

ఎంగిలి గుడుచు

నీచపుతిండి తిను.

ఎంగిలిచేత కాకి వ్రేయనివాడు

అతిలుబ్ధుడు.

ఎంగిలి చేతితో కాకిని అదిలిస్తే ఆ మెతుకు ఎక్కడ కింద రాలి అది తింటుందో అని భయపడే వాడు అనుట.

"కసరి యెంగిలిచేతఁ గాకి వ్రేయని వాఁడు, సతతాన్నదాన ప్రశస్తుఁడయ్యె." పాండు. 4.210.

ఎంగిలిచేయి విసరని

అతిలోభి యైన

"వాడు ఎంగిలిచేత్తో విసరేవాడు కాదు." వా.

ఎంగిలి చేయు

చూ. ఎంగిలించు.

ఎంగిలిపడు

కొద్దిగా భోజనము చేయు.

నాలుగుమెతుకులు తిను.

"నాకేం ఒంట్లో బాగు లేదు. కాస్త ఎంగిలిపడి లేచాను." వా.

ఎంగిలిమంగలం

అనాచారభరిత మనుట.

"వాళ్లిల్లు అంతా ఎంగిలిమంగలంగా ఉంది." వా.

ఎంగిలిమందు

తేనె.

భస్మాదులు తేనెతో రంగరించి నాకించడం అలవాటు. అందుపై యేర్పడినది.

ఎంగిలిమాట

ఎవరో అన్నమాట.

మాటా. 26.

ఎంగిళ్ళెత్తు

నీచపుపనులకు పాల్పడు.

"ఆ వెధవ వాళ్ళింట్లో వీళ్ళింట్లో ఎంగి ళ్ళెతుకుంటూ బతుకుతున్నాడు." వా.

ఎంచులు పెట్టు

తప్పులు పట్టు.

ఎండకన్ను ఎఱుగని

అసూర్యంపశ్య యైన, ఏమాత్రం కష్టమూ ఎఱుగని, ఇలు వెడలని.

"ఎండకన్నెఱుఁగని యీ రాజచంద్రుఁ, డవని శాత్రవులకు నర్పించి పెక్కు, గానలఁ ద్రిమ్మరి కాయంబు డస్సి." పల్నాటి. 92 పే.

"ఎండకన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు, పలుపంచలను జాలిఁ బడియె నేఁడు." భాగ. 8.469.

"ఎండకన్నెఱుఁగక యేప్రొద్దు నన్ను, నండఁ బాయనివాఁడ వయ్యాయో నేఁడు, ఇంతి యింటికిఁ బోయి యేమంటి వన్న ?" సారం. 2.531.

చూ. ఎండకన్ను నీడకన్ను ఎఱుగని.

ఎండకన్ను నీడకన్ను ఎఱుగని

ఎండమొగం చూడని; కష్ట మెరుగని.

"క్రీడమై నెండకన్నును నీడకన్ను, నెఱుఁగ కన్నలఁ దమ్ముల హితుల సుతులఁ, గూడి సుఖ మున్నవారము కోర్కె లాదవ, సత్యసల్లాప ! యో హరిశ్చంద్రభూప !" హరిశ్చ. 1.212.

చూ. ఎండకన్ను ఎఱుగని.

ఎండకన్నును వానకన్నును ఎఱుగని

కష్ట మెరుగని; ఇలు వెడలని.

"వచ్చి రెండకన్ను నీడకన్నును నెఱుం గనిపురంధ్రులు...." భార. ఆశ్ర. 1. 143.

చూ. ఎండకన్ను నీడకన్ను ఎఱుగని.

ఎండ కెండి వానకు తడియు

అన్నికష్టాలకూ ఓర్చు. తె. జా.

ఎండగట్టు

ఎండలో ఆరవేయు.

"తడిబట్టలు ఎండగట్టుదామంటే దండె మైనా లేదు." వా.

ఎండగొట్టు

వడ దెబ్బ తగులు. రా. వి. 269.

ఎండతాకు

వడ దెబ్బ తగులు.

"చెడిద మగునెండ తాఁకునఁ, దొడిమలు వసివాడి." పారి. 4.19.

ఎండ నుండగ నీడ యెదురు వచ్చు

ఎంతో బాధ పడుతుండగా, తనంతట ఏదో ఒక ఆశ్వాసము సమకూరు.

"ఎండ నుండఁగ నీడ యెదురు వచ్చుట గదా, సుదతి చల్లనిచూపుఁ జూచె నేని." ఉషా. 3.49.

ఎండపసుపు

అశాశ్వతము.

నీరెండ పడి యేర్పడే పసుపు రంగు.

పసుపు ఎండలో పెడితే రంగు మారుతుంది అనుటపై

యేర్పడినా ఏర్పడి ఉండ వచ్చును.

"ఊఁతనీరు చెలఁది నేఁత మాటాయిటే, మూది యెండపసుపు దొత్తి యక్క, రంబు... మేను." ఆము. 6.62.

**ఎండబడు**

ప్రాదైక్యా.

చూ. ఎండపడు.

**ఎండబాఱు**

ఎండిపోవు.

"పండఁబాఱినపాల మెండఁబాఱె." మను. 3.129.

**ఎండబెట్టు**

ఎండలో ఉంచు.

"గోధుమలు ఎండబెట్టుదా మనుకుంటుంటే యింతలో వర్షం ముంచుకొని వచ్చింది." వా.

**ఎండమకువు**

గొంకుకు.

సాంబ.

**ఎండమావుల నీళ్లు**

లేనివి.

ఎండమావులు నీళ్లుగా కనిపించినా అందులో నీళ్లుండవు.

తాళ్ల. సం. 7.34.

**ఎండమావులను పట్టగల**

అసాధ్యకార్యము లొనర్ప గల, ఏమైనా చేయగల. నిరసనార్థకోక్తిగా అనుమాట.

పమా. 8.135.

**ఎండమావులు**

మృగతృష్ణ.

"ఎండమావులట్టుల సంపత్ప్రితతులు." భార. ఆది. 5.159.

"ఎండమావులను దప్పి లేల దీర నోయమ్మ." తాళ్ల. సం. 4.54.

**ఎండమావుల కడగాళ్లు గట్ట నేర్చు**

అసాధ్యకార్యములను చేయగలవారనుటలో నిరసన సూచిస్తూ అనేమాట. ఎండమావులను కాళ్లు కట్టి వేయడం అసాధ్యం కదా!

పండిత. ప్రథ. పురా. పుట. 359.

**ఎండలు నీడ లగు**

సౌభాగ్యము చెడు.

"వండె వండ నట్లుగా వారిఁ జూచి నవ్వేవు, యెండ లెల్లా నీడ లాయె నింక నేటిమాటలు." తాళ్ల. సం. 3.557.

ఇక్కడ ఎండ ఆనందసూచకం. తద్విరుద్ధము నీడ.

**ఎండలు నీడలు కాయు**

మంచిరోజులు పోయి చెడు రోజులు వచ్చు

"ఉండం బాసె నడవిలో నొకతె నేను, ఎండలు నీడలు కాసె నేమి సేతురా!" తాళ్ల. సం. 3.663.

చూ. ఎండలు నీడ లగు.

**ఎండ లేనినాటి నీడ**

ఉండ దనుట.

తాళ్ల. సం. 12.55.

**ఎండలోని నీడ**

శ్రమాపనోదకము.

తాళ్ల. సం. 11.3 భా. 125.

**ఎండవడు**

1. ఎండలో ప్రయాణము చేయు.

2. ఎండ బాగా ఎక్కు.

"ఓ, తెరువరి యింత యెండవడి తేఁగల యట్టి వీఁ కేమిభాగ్యముల్."
గంధ. 66.

"దూరము వోయి యెండవడి దూపిలి వచ్చినప్రాణనాథునిన్, ద్వారకవాట గేహళులదాఁక నెదుర్కొని..."
కాశీ. 2.81.

"బాగా ఎండవడి పోయింది. చల్లబడిం తర్వాత బయలుదేరొచ్చు." వా.

చూ. ఎండపడు.

**ఎండ వాలారునందాక**

పొద్దు వాటాలేవరకూ అని నేటిరూపం.

చల్లబడేవరకూ అనుట.

"ఎండ వాలారునందాఁక నిండుకొలని, తీరమున మఱ్ఱినీడ నిద్రించె నతఁడు."
శివ. 3.27.

చూ. పొద్దు వాటాలు.

**ఎండుగులు**

ఎండబోసిన ధాన్యము.

"కలమపు టెండుగుల్ ద్రవిడకన్యలు ముంగిటఁ గాచి." ఆము. 1.75.

రూ. ఎండువులు.

**ఎండుతెవులు**

క్షయలాంటి వ్యాధి.

శ.ర.

**ఎండువులు**

ఎండబోసిన ధాన్యము.

"ముంగిళ్ళ నెండువులు గానం బడవు."
కేయూ. 3.84.

రూ. ఎండుగులు.

**ఎంత కాదు!**

ఎంతైనా అగు ననుట.

"కాఁకతోడఁ జిత్తమెల్లఁ గరఁగి నీరై మించె, ఏకట నెవ్వరి కైన నెంత గాదు ప్రియము." తాళ్ల. సం. 12.335.

**ఎంతకు దెచ్చెను?**

దీనివల్ల ఎంత అనర్థం కలిగింది అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఎంతకుఁ దెచ్చెనే సరసిజేక్షణ చెయ్దములు?" ఆము. 5.77.

"నువ్వు ఆ రోజు ఏవో తమాషాకు అంటే ఆ మాట ఎంతకు తెచ్చిందో చూడు. అతనికీ నాకూ బద్ధద్వేషం యేర్పడింది." వా.

**ఎంతకు నెత్తుకొంటివి?**

1. ఎంతకు ఎక్కువ పెట్టితివి, ఎంతకు దిగితివి.

ఎంతకు తెగించావు? ఎంతకు సిద్ధమయ్యావు? అన్న అర్థంలో ప్రయుక్తమవుతుంది.

"నా కొప్పని బాస నిచ్చితి వహో యిటు లెంతకు నెత్తుకొంటి విం, కెప్పని కైన నమ్మఁదగునే." శుక. 1. 540.

"దయ యింత లేక యెంతకు నెత్తుకొంటి ర,క్కట మిమ్ముఁ గన్నది గాక తల్లి." శుక. 4. 42.

ఎంతకు దిగితివి అనే నేటి వాడుక.

రాయలసీమలో ఎంతకు వగ దిగితివి అని ఇదేచోట అంటారు.

**ఎంతకు నేరరు ?**

ఎంతకైనా సిద్ధపడతారు అని తాత్పర్యం.

"ఎంతకు నేర రంత తెగియించినవా రది యున్నదే కదా." శుక. 4. 28.

వీడు ఎంతకైనా తగును, ఎంతకైనా మనిషి మొదలయినవాట్లో ఈ పలుకుబడి వినవస్తుంది.

**ఎంతకు లేడు ?**

ఎంతపనికి సిద్ధపడడు? ఎంత పనికైనను సిద్ధపడు ననుట.

"ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ నేను వినఁగా." పారి. 1.80.

**ఎంత కెంత**

ఎక్కడికి కెక్కడ ?

"ఏమి చెప్పవలయు నెంత కెంత ?" పీర. 2.81.

**ఎంతకైనా మనిషి**

ఎంత దుష్కార్యం చేయనైనా సమర్థత గలమనిషి.

"వా డెంతకైనా సమర్థుడు. పొగడ గలడు, తెగడగలడు. వా ణ్ణెవడు నమ్ముతాడు ?" వా.

**ఎంతకైనా తగును**

ఏ చెడుగుకైనా సిద్ధపడును.

"నిన్న తప్పక సాయపడతా నని ఈ రోజు తానే వ్యతిరేకంగా పని చేస్తున్నాడు. అత డెంతకైనా తగును." వా.

**ఎంత గింజుకున్నా**

చూ. ఎంత తన్నుకున్నా.

**ఎంత చెప్పితే అంత**

ఆ మాటకు తిరుగు లేదనుట.

"ఆ పెళ్లాం ఎంత చెప్పితే అంత. వాడికి ఏమాత్రం విచక్షణ లేదు." వా.

**ఎంతటిదవ్వు ?**

చాలా దూరము, మాకూ వానికీ చాలా దూరము- అనుట వంటిది.

"ఈ పరిపాటి సేవ రచియించుటకే తగినట్టివార మెవ్వా, భూపవరేణ్య! యేము పెఱపోఁడుము లెంతటి దవ్వు మాకిఁకన్." కళా. 7.229.

**ఎంత తన్నుకున్నా**

ఎంత అవస్థపడినా, ఏం చేసినా అనే సందర్భంలో ఉపయోగిస్తారు.

"నువ్వెంత గింజుకున్నా ఎంత తన్నుకున్నా వాడిదగ్గర దమ్మిడీ రాలదు." వా.

"ఎంత తన్నుకున్నా వాని కా పద్యంలో ఒక్కపాదం అర్థం కాదు." వా.

**ఎంత తల బద్దలు కొట్టుకొన్నా**

ఎంత విడమరచి చెప్పినా. కొత్త. 78.

**ఎంత తీపు!**

ఎంత ఆసక్తి; ఎంత ఆశ!

"భూమికిఁ గాఁగ ... ఘోర సంగ్రామము సేయుచుండుదురు రాజులు దొల్లియు నెంత దీపొకో."
భార. భీష్మ. 1.15.

**ఎంత దళిగిన మిరియాలు జొన్నల సరిపోవా?**

ఎంత చెడ్డా సత్త్వమున్నవాడు సత్త్వమున్నవాడే అనుట. ఇదే అర్థంలోనే పడుకున్నా ఏనుగు గుఱ్ఱం ఎత్తుంటుంది అన్నలాంటి పలుకుబడులున్నవి. మిరియాలు విలువ గలవి. జొన్నలు చాలా చౌక. ఎంత చెడ్డా మిరియాలు జొన్నల వెల చేయవా అనుట.

"ఎంత దళిగిన మిరియా, లుం జొన్నల సరిపోవే, లంజెతనములందుఁ గోమిరెలన్ గెలువవటే!" ఉ. హరి. 1.75.

**ఎంతదనుకా**

చూ. ఎంతదాకా.

**ఎంతదాకా**

ఎంతసేపూ.

"ఎంతదాకా వాడిమాట వాడిది గానీ ఒకడు చెప్పేది కించిత్తైనా గ్రహించడు." వా.

చూ. ఎంతసేపూ.

**ఎంతపని వచ్చినను**

ఎంత అవసరము ఏర్పడినను.

"ఎంతపని వచ్చినను నిద్ర, చెంత నె యున్నాఁడ భీతిఁ జెందకు మనినన్."
హంస. 3.222.

"ఎంతపని వచ్చినా నేనున్నాను గదా. నీవలా కూచో బావా! ఎందుకు దిగులు పడతావు?" వా.

**ఎంతమాటంటే అంతమాట అను**

నోటికి వచ్చినట్లు దుర్భాషలాడు.

"నీవు సంపన్నుడవైతే కావచ్చు. అంతమాత్రాన నీవు ఎంతమాటంటే అంతమాట అంటూంటే ఊరుకుంటానా ఏమిటి?" వా.

"అదేం కోడలో నమ్మా! వాళ్ళత్తను పట్టుకొని ఎంతమాటంటే అంతమాట అంటుంది." వా.

**ఎంత మీను వచ్చి యెంత మీనును మ్రింగె?**

ఎంత చిన్నవాడు ఎంత పెద్ద పనికి ఒడబడెను అనుపట్ల ఉపయోగించేపలుకుబడి. పెద్ద చేప చిన్న చేపను మ్రింగుట అలవాటు. తద్విరుద్ధస్థితి నిది సూచించును.

"తగరు కొండమీఁదఁ దాఁకఁ గోరిన దారి, నెదురు దన్ను డెలియ కింత పలికె, నెంత మీను వచ్చి యెంత మీనును మ్రింగెఁ, గాన త్రుళ్లి నెత్తి గంత మాయు." రాధి. 3 ఆ.

**ఎంత మీ లెంత మీల ద్రాగు**

ఎంత చేపలు ఎంత చేపలను మ్రింగ సాగెను? పెద్దవి చిన్నవానిని మ్రింగును కాని

చిన్నవే పెద్దవానిపై తిరుగఁ బడెనే అనుట.

"ఉగ్రుపై నట వోయె దకట లగ్గ మేలు మే, లెంత మీ లెంత మీలుఁ ద్రాగు."
కుమా. 4.66.

ఎంతేయిన

చాలా.

"మానవిఖ్యాతి లాభసంపన్నుఁ డగుట, యెంతయిన నొప్పు నట్లు గాదేని హాని." కుక. 1.367 పు.

వాడుకలో అదెంతైనా బాగున్నది అనడం కద్దు.

2. ఏమయినా.

"ఎంతయినా పెద్దవాడుకదా! నీ విలా ఎదిరించ వచ్చునా?" వా

ఎంత లేదన్నా

కనీసం.

"ఇప్పటి కెంత లేదనిన నిర్వదికీఁ బయి నుండు." పాణి. 1.39.

"ఎంత లేదన్నా ఈ పెండ్లికి పదివేలు ఖర్చు పెట్టి ఉంటాడు. వాని కేం? కలవాడు." వా.

ఎంత లే దింతె కద!

అయితే అయింది లే అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"అనుడు నాతండు తత్సంగమానుఁ జేసి, యెంత లే దింతె కద దీని కేల పగవ?" కుక. 3.195.

ఎంత లేదు?

ఎంతో ఉన్నది.

ఇది పోయిన దని దుఃఖ మేల అనుట.

"అని పల్క నత్త కనికర, మున రావే యెంత లేదు..." కుక. 2.581.

ఎంతవారును....

ఎంతవారైనా అని వాడుక రూపం.

ఎంత గొప్పవారైనా అని అర్థం.

"ఎంతవారును దెలియంగ నెంతవారు." కాశీ. 1.104.

"ఎంతవార లైన కాంతదాసులే."
త్యాగరాజ కీర్తనలు.

పై ప్రయోగంలోని రెండవ 'ఎంతవారు' ఈ అర్థాన్నే సూచిస్తుంది.

'ఎంతవాడికీ ఆ పని సాధించడం సాధ్యం కాదు' అని ఏక వచనంలో కూడా ఇది ఉంది.

ఈ ఉచ్చారణలోని కాకువును పురస్కరించుకొని ఈ 'ఎంత' అది అతి సులభము, కించిన్మాత్రము అనే అర్థాలను కూడా స్ఫురింప జేస్తుంది.

"ఇంత పెద్దపని చేయడానికి వా డెంతవాడు?"

"వాడికి ఈ పని యెంత? ఒక్క నిమిషంలో చేసి పారేస్తాడు."

ఎంతవాలు?

ఏం గొప్ప? ఏమి నేర్పు?

వాలూ చాలూ తెలిసినవాడు అన్నప్పుడు నేర్పు, కిటుకులన్న లక్షణార్థం వాలు కున్న దే.

"మాగ్పట్టు నోపనిబ్రాఁకు లేర్చుట యెంత, వాలగు నని వనవహ్ని నవ్వు."
కుమా. 10.159.

## ఎంతసేపూ

ఎల్లప్పుడూ అనుట.

"ఎంతసేపూ వాడికి ఆత్మస్తుతీ, పరనిందా తప్పితే మరొకటి లేదు కదా!"
వా.

చూ. ఎంతదాకా.

## ఎందాక? (ఎంతదనుక)

ఎక్కడికి పోతున్నారు అనుట. ఎక్కడికి అని అడగడం అపశకున మని ఎంతదాక అని అడుగుట అలవాటు.

"పొద్దున్నే బయలుదేరారు. ఎందాకా?"
వా.

## ఎందుకైనా మంచిది

అంత ప్రయోజనం లేక పోయినా ఎంతో కొంత మేలు ఉండక పోదు.

కామేశ్వరి. శత. 85.

"ఆయనను వెళ్ళి ఒకసారి చూడు. ఎందుకైనా మంచిది."
వా.

## ఎందు పెరటిచెట్టు మందు కాదు

సన్నిహితులు చెప్పే హితవు తల కెక్కదు.

'అతిపరిచయా దవజ్ఞా' అన్న సంస్కృతసూక్తిని తెలిపే పలుకుబడి.

పెరటి చెట్టును తేలికగా చూస్తారు కదా!

"తమకు సులభమైన నమృతంబుఁ గైకొన, రెందుఁ బెరటిచెట్టు మందు గాదు."
కళా. 7.39.

## ఎందు లేని

ఎక్కడ లేని

"ఎందు లేనిపలుపోకల మాయలు నీకు వెన్నతోఁ బెట్టినవి."
పారి. 1.127.

ఇది వాడుకలో 'ఎక్కడ లేని' అనేరూపంతోనే కనబడు తుంది.

చూ. ఎక్కడ లేని.

## ఎంబెన్న

యంబ్రహ్మ.

"ఓ అంటే నా రాని యెంబెన్నలదే యీ రోజులలో అధికారంగా ఉంది."
వా.

చూ. యంబ్రహ్మ.

## ఎకసక్కెం మాడు

వేళాకోళము చేయు.

"ఎవ్వారిఁ బాడ గన్న నెకసక్కె మాడుచు."
విప్ర. 5.26.

చూ. ఎకసక్కెము లాడు.

## ఎకసక్కెము చేయు

హాస్యము చేయు.

"నీ విట వచ్చుట పారిజాతవాసనఁ బ్రకటించి నాకు నెకసక్కెము సేయన కాదె చెప్పుమా!"
పారి. 1.128.

## ఎకసక్కెము లాడు

పరిహాస మాడు.

"చక్కెర వింటి వాని నెకసక్కెము లాడఁడె."
నిరంకు. 2.12.
కాశీ. 4.123.

చూ. ఎకసక్కెము చేయు.

**ఏకాయకిగా**

మధ్యలో ఆగకుండా.

"అమ్మకు చాలా జబ్బుగా ఉందని తంతి వచ్చేసరికి ఏకాయెకిగా బయలుదేరి వచ్చాను." వా.

చూ. ఏకాయెకిని.

**ఎక్కడ చూచిన....**

అన్నిచోట్ల.

"ఎక్కడఁ జూచిన నిండ్లపైఁ బసిఁడి కుండలు క్రొత్త మెఱుఁగిడి నిలుపువారు..." కళా. 7.58.

"ఎక్కడ చూచినా తోరణాలే. జెండాలే. ఊరంతా వెలిగిపోతున్నది." వా.

**ఎక్కడను ప్రొద్దుపొడుచు టెఱుగక**

ఏ కష్టమూ తెలియకుండా.

"మ్రొక్కెదము సామి సదయ, యెక్కడనుం బ్రొద్దు పొడుచు టెఱుఁగక నీవే, దిక్కని యందుము దాయలు, గ్రక్కతిలం గడుపుచల్ల కదలక యుండన్." రామాభ్యు. 2.7.

**ఎక్కడ పట్టిన నక్కడ**

ప్రతిచోట.

"ఎక్కడ బట్టినం గళల యిక్కవ లెక్కడ నోరు సోకినన్, జక్కెరలప్పలు." శా. మా. 1.43.

"వాడు ఎక్కడ పడితే అక్కడ అప్పు చేశాడు." వా.

**ఎక్కడ పొడిచితే ప్రొద్దా అను**

ఏ కష్టమూ లేక హాయిగా నుండు.

"...మత్తిల్లి యుమ్మత్కథా బోధం బొందిటి, యెక్కడం బొడిచితే ప్రొద్దా యటంచున్ సుఖ, శ్రీధన్యస్థితి రామరాజ్యమువలెం జే యొమ్మపైఁ జేర్చుచున్." బహులా. 1.115.

**ఎక్కడ లేని....**

విపరీతమైన.

"నాకు ఎక్కడలేని కోపం వచ్చింది." వా.

"ఎక్కడలేని కపటమూ వాడి దగ్గర ఉంది." వా.

"వానికి తన భార్యమీద ఎక్కడ లేని ప్రేమ." వా.

**ఎక్కడి కెక్కడ?**

దానికీ దీనికీ సంబంధము లేదనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"వారి వీరి బలసంపద లెక్కడి కెక్కడా నృప, గ్రామణితోడ..." రుద్రమ. 22 పు.

**ఎక్కడి జగజోలి**

ఇ దెక్కడి పీడ, ఇ దెక్కడి సంతన; ఇదేమి పీకులాట— అనుపలుకుబళ్ల వంటిది.

నా జోలి కాదు, ఊరివారి జోలి అన్న అర్థంలో జగజోలి యిక్కడ ప్రయుక్తమయింది. వావిళ్లలో, సూ. ని.లో కూడ జగజోలి = మిక్కిలి మోసగాడు అన్న అర్థం యిచ్చారు గానీ వా రిచ్చిన ప్రయోగాల లోనే అది అతకదు.

"...తనకార్య మైనయందాఁక విరా, ళి గదింతు రంత నెక్కడి, జగజోలి

యటంచు నెరసి చనఁ జాతురుగా."
శుక. 3.127.

"చాలు చాలు వట్టి జగజోలి మాట
చాలింపుమా యిటి జాడ లేమిటికి?
రంగ. అయో. 94 పా.

"జగజోలిమాటలు మాని..."
పరమ. 4.306.

"ఫలమువారలా కాక పని మాలినట్టి
చలమువారలా వట్టిజగజోలి యేల?"
పరమ. 7.645.

ఎక్కడి జోలి?

ఎక్కడి గొడవ?

"ఎక్కడిజోలి పెండ్లి యగుటెట్లు?..."
శుక. 1.363.

"ఇదెక్కడి గొడవ?" వా.

ఎక్కపెట్టు

1. ఎగసన త్రోయు.

"వా డెక్కపెట్టడంవల్లనే వీ డిలా తయారయ్యాడు." వా.

2. పురి యెక్కించు.

ఎవరిమీదైనా చాడీలు చెప్పి ద్వేషము పుట్టించు.

"పాపం! వాడు మంచివాడే కాని రెడ్డిగారి కెవరో ఎక్కపెట్టి దావా వేసేట్టు చేశారు." వా.

చూ. ఎక్కపొడుచు.

ఎక్కపొడుచు

చూ. ఎక్కపెట్టు.

ఎక్కత్రోచు

ఎక్కుపెట్టు.

"గొనయంబు నెక్కఁ ద్రోచిన, గనయంబున కెక్కకున్న." పారి. 4.72.

ఎక్కత్రోయు

ఎగద్రోయు.

ఎక్కాలు

ఒకట్లు.

"మా వాడికి ఎక్కాలు బొత్తిగా రావు. నాలుగో ఎక్కమే సరిగా చెప్ప లేడు." వా.

ఎక్కి తొక్కి

కావలసినంత; పుష్కలంగా.

"శేరుబియ్యం వేస్తే మా ఇంట్లో అందరికీ ఎక్కి తొక్కి సరిపోతుంది." వా.

ఎక్కివచ్చు

వృద్ధికి వచ్చు

"ఆ వ్యాపారంలో దిగినప్పటినుండీ బాగా యెక్కి వచ్చాడు." వా.

"వాళ్ల సంసారం పాపం ఎక్కి రాలేదు." వా.

ఎక్కుగొఱ్ఱు

భయంకరుడు.

పని పట్టించగలవాడు అని భావం. అపరాధులను కొఱ్ఱు కెక్కించడం, కొఱత వేయడం ఉన్నది. ఆ కొఱత వేసేదే ఎక్కుగొఱ్ఱు.

"భేదవాదుల కెక్కుఁ గొఱ్ఱు."
పండితా. ప్రథ. వాద. పుట. 511.

చూ. వీపుగోల.

ఎక్కుడించు

వింటినుండి నారి తొలగించు. ఎక్కుపెట్టుటకు వ్యతిరేకము. సంధించినబాణమును వింటి నుండి తొలగించు అని అర్థం.

"వి ల్లెక్కుడించి." జైమి. 8.29.

"అంత లతాంతచాపలత యంగభవుం

డపు డెక్కుడించెఁ ద,త్కాంత ప్రభాత మయ్యె నని." శుక. 1.217.

ఎక్కుడుగోద

వాహన మగు ఎద్దు, ఎక్కు ఎద్దు.

"ఎక్కుడు గోద ని న్నెక్కడ వైచి, యెక్కడ వోయె." బస. 3.69.

ఎక్కువ తక్కువ లేకుండు

సమానరూపముతో నుండు.

"ఎక్కువ తక్కువ లింతయు లేకఁ
ఒక్క రూపమున నున్నవి చూడఁ." సుగ్రీ. 241.

ఎక్కువ తక్కువ లేక

సమానముగా, ఒకేతీరుగా.

"ఎక్కువ తక్కువ లెంచు నించుకయుఁ
గ,ల్గక నేరు పాక్కలీలన తనర్చ." కళా. 8.68.

ఎక్కే గుమ్మం దిగే గుమ్మం

ఏదో ఒక పనికై యింటింటికీ పోవుపట్ల అంటారు.

"పొద్దున్నంచీ ఎక్కేగుమ్మం దిగే గుమ్మం. దీంతోనే సరిపోయింది." వా.

ఎగ ఊపిరి దిగ ఊపిరిగా ఉండు

మహా అలసటగా – ఆయాసముగా ఉండు.

"కొండెక్కి దిగేసరికి ఎగ ఊపిరి దిగ ఊపిరిగా ఉంది." వా.

ఎగచేపు

పా లివ్వకుండు (ఆవు మొదలయినవి.)

చేపుట కిది వ్యతిరేకము.

"రాత్రి ఆవు ఎగ చేపింది. పొద్దున్న మజ్జిగనీళ్లు లేకుండా పోయినవి." వా.

ఎగజోపు

పైకెగురునట్లుగా పశ్వాదులను చోపు.

"ఒకవేళ డేగవేఁటకుఁ జని యెగఁ జోపి." కా. మా. 3.47.

"వాటి నిలా ఎగజోపుక రారా. నే నిక్క డుంటాను." వా.

ఎగదట్టు

పైకి పోవు.

అతిశయించు.

పాండు 5.182.

"వాడికి ఊపిరి ఎగదట్టింది." వా.

ఎగదిగ చూచు

దిక్కులు చూచు.

"చిగురుటాకుఁ దగిలి చింతాజలధిఁ బడి, యెగదిగఁ జూడఁ బోతే యెందుక నెక్కనది." తాళ్ల. సం. 9.24.

చూ. ఎగా దిగా.

ఎగవేస్తే బ్రహ్మహత్య దిగదీస్తే గోహత్య

ఎటు పోయినా తప్పే అను పట్ల ఉపయోగించే పలుకుబడి.

ఎగదోయు

పురి ఎక్కించు.

"వాడు ముందే కొడుకుమీద మటమట లాడుతూ ఉంటే వీ డింకాస్త ఎగ దోశాడు." వా.

చూ. ఎగబోయు.

ఎగనామం పెట్టు

మోసగించు; ఇవ్వక పోవు.

"వాడు పది రూపాయలు తీసుకొని ఎగ నామం పెట్టాడు." వా.
చూ. నామం పెట్టు.

ఎగనుబ్బు

ఉప్పొంగు.

"తదీయంబు లగు కృతక తరంగిణీ జాలంబులు కటిదఘ్నంబులుఁ బెండొడలబంటులు నై యెగ నుబ్బి దిబ్బ తీర్థంబు లై పారలి తెర లెత్తి." విప్ర. 2.14.

ఎగబెట్టు

1. ఎగవేయు,

"వా డిస్తాను ఇస్తా నని కడకు ఎగ బెట్టాడు." వా.

2. ఎత్తిపెట్టు.

"కాసేపు ఉండు. సామాను ఎగబెట్టి వస్తాను." వా.

ఈ అర్థంలో రాయలసీమలో ఈ మాట విరివిగా విన వస్తుంది.

ఎగబోయు

పురి ఎక్కించు.

"భూపాలునకు నెగఁబోసి యూర్వశి." సారం. 3.185.

ఎగరాసి దిగరాసి

లెక్కలలో ఏదో తారాతిక్కిచేసి.

"సంవత్సరం కిందట నూరురూపాయలు తీసుకుంటే, ఆ సెట్టి ఎగరాసి దిగరాసి నూటయాభైరూపాయలకు తేల్చాడు." వా.

ఎగవిడుచు

వదలిపెట్టు (ఇతరులకోసమై).

"తెక తేరగ నీ కెగ విడిచి పోయెద నా ప్రాణ నాకాణాచి యైన వలపుల పంటన్." కళా. 3.202.

ఎగవేయు

ఇవ్వవలసింది, చేయవలసింది ఇవ్వక, చేయక—తప్పించుకొను.

"వా డీరోజు పని ఎగవేశాడు." వా.
"నాకు వాడు నూరురూపాయ లివ్వవలసి వుండి ఎగవేశాడు." వా.

ఎగసన త్రోయు

ఎక్కపెట్టు.

ఇది అన్యాయ మన్న సూచనా ఉన్నది.

"వాళ్లూ వీళ్లూ ఎగసన తోయడంతో వాడు అన్నకొడుకును యింటినుండీ తరిమేశాడు." వా.

ఎగా దిగా

పైనుండి క్రిందివరకూ.

చూ. ఎగ దిగ చూచు.

ఎగాదిగ కనుగొను

కోపముతో ఎదిరిని నిలువెల్లా చూచు.

"కన్ను లెఱ్ఱఁగా నెగాదిగఁ గన్గొని, యాడు గఱచి దీని నాఁటదేని...." శుక. 4.39.
రూ. ఎగా దిగా చూచు.

ఎగా దిగా చూచు

తేరిపార జూచు.

"అలా ఎగా దిగా చూస్తున్నా వేమి? గుర్తుపట్టలా?" వా.
చూ. ఎగ దిగ చూచు.

**ఎగిరి గంతు వేయు**

సంతోషపడు.

క్రొత్త. 27.

**ఎగిరిపడు**

చాల కోపించు,

"వాడిప్పే రత్తితే మా నాన్న ఎగిరిపడ తాడు." వా.

**ఎగ్గాడు**

దూషించు.

"ఎగ్గాడి నారసా లేనినారు."

నాయక. పు. 13.

**ఎగ్గుగొను**

తప్పుగా తలచు.

"ఈ విభుఁ డాడినది యెల్ల నెగ్గు గొనక." భార. కర్ణ. 2.83.

**ఎగ్గుతగ్గులు**

హెచ్చుతగ్గులు,

"తగ్గం గాక యీ యెగ్గుత, గ్గులు."

గుంటూ. ఉత్త. 63.

**ఎగ్గు పుట్టు**

హాని కలుగు.

"వీని చేత నెట్టు కౌరవులకు నెగ్గు పుట్టు." భార. అర. 19.4.

**ఎగ్గులాడు**

దూషించు.

"ఇప్పురంధ్రీరత్నంబు నిన్ని యెగ్గు లాడం దగదు." భాస్క. యుద్ధ. 2409.

**ఎగ్గులు పట్టు**

తప్పులు పట్టు.

"ఎగ్గులు పట్టుఁ గుబుద్ధి పెద్దలన్."

సింహా. 1.18.

రూ. ఎగ్గులు వట్టు.

**ఎగ్గులు వట్టు**

తప్పు పట్టు

"నను నెగ్గులు వట్టకుండినం బొం దొనరుఞ్." భార. కర్ణ. 1.255.

రూ. ఎగ్గులు పట్టు.

**ఎగ్గుసిగ్గులు**

సిగ్గు, సంకోచము. జం.

"పోడిమి చెడి యెగ్గుసిగ్గులు లేక."

రాధా. 5.83.

"ఎగ్గూ సిగ్గూ లేని పిల్లలతో ఏం మాట్లాడుతాం?" వా.

**ఎచ్చు కుందు లేక**

హెచ్చుతక్కువలు లేక.

"ఇట్లు ప్రతిబాణముల హంసుఁ డెచ్చుఁ గుందు లేక పోరాడె."

ఉ. హరి. 4. 289.

**ఎటాడ బోగా నెటు వచ్చునో?**

ఏ మంటే ఏమి వస్తుందో?

"పూర్వపు నీ యతనుత్వ ధర్మముఞ్, మానక యేచుచున్న నది మామక భాగ్యము నిన్నెటాడఁ బోఁ, గా నెటు వచ్చునో తడవఁగా వెఱతుఞ్."

ప్రభా. 5.3.

వాడుకలో :

"ఏ మంటే ఏమి వస్తుందో? మన కెందు కని పలకకుండా ఉన్నాడు." వా.

**ఎటు తిరిగీ**

ఏ మైనప్పటికీ; ఎలాగూ.

"ఎటు తిరిగీ వాడిక్కడికి రావల సిందే." వా.

**ఎటు ననరాకుండు**

ఏమనడానికీ వీలు లేకుండు.

"మఱి ప్రధానుల వెట్టి మంతనా లెటు
నన, రానివి పేగులలోని తీఁట..."
కళా. 7.19.

ఎటులైన కమ్ము నీవు
నీవు ఎలా అయినా అయిపో.
"...ఎటు లైనఁ గమ్ము నీవు."
పాండు. 5.229.
ఇది వాడుకలో 'నీ వెట్లా అయినా అయి పో' 'నీ వెట్ల పోతే నాకేమి' – మొదలయిన రూపాలలో నేటికీ వినబడుతుంది.

ఎటువంటి పెద్దవారు?
ఏం పెద్ద మనుష్యులు? అనగా ఇతరులు చేసిన పని సరిగా లేదనునపుడు అను మాట.
"మీ రెటువంటి పెద్దవా రెంచ రోకిం తయుం..." కళా. 3.36.
నేటి వాడుకరూపం:
"ఏం పెద్దమనుష్యు లయ్యా! మీరు? మొన్ననగా వస్తా నని చెప్పి రానే లేదు." వా.

ఎటూ
ఎలాగూ; తప్పక.
"వీనిచేత నెట్టు కౌరవులకు నెగ్గు పుట్టు."
భార. అర. 1.49.
"ఎటూ వెడతాం కనక ఆయన్ను కూడా చూచి వెడదాము." వా.

ఎటొచ్చీ
ఇంతకూ అనుట వంటి ఊత పదం.
మాటా. 29.

ఎట్టిపాటు పఱిచినా
ఎన్నిపాట్లు పెట్టినా, ఎంత బాధ పెట్టినా.
వాడుకలో ఎన్నిపాట్లు పెట్టినా అనే అలవాటు.
పాండు. 4.201.
"ఎంత పాటుపడ్డా వాడికి కడుపు నిండ డమే గగనంగా ఉంది." వా.

ఎట్లు కాదగిన కార్యము లట్లగు
అయ్యేదవుతుంది అనుట.
యద్భావి తద్భవతి అని సంస్కృతం.
"కాంతరో! యెట్లు కాఁదగినకార్యము లట్లగు మన్గళావతీ, కాంతకు మోహ నాంగు నుపకాంతుని..."
శుక. 1.239.

ఎట్లు చూడగలను?
ఎలా చూడగలను?
చూడలే ననుట.
"అపత్యంబులదుఃఖంబు జే నెట్లు నూడ నోపుదు." భార. అర. 1.86.

ఎట్లో ఒక్కచందాన
ఏదో ఒక విధంగా.
అయిష్టంతో అనుట.
"వీడ్కొఁ జాలక చాల కంత మది యెట్లో యొక్కచందాన వీడ్కొ నియెన్." కళా. 7.97.
వాడుకలో:
"ఏదో ఒక విధంగా వెళ్ళి పోక తప్పదు." వా.

ఎట్టైన నగు
ఏమైనా కానీ.

"...యెట్టైన నయ్యె నే నిచటన యుండెద నని యొక్క తొట్టలో నడఁగి యుండె." కళా. 2.170.
"ఏ మయినా కానీ. నేను మాత్రం పోను." వా.

**ఎడ కలుగ చను**

దూరముగా పోవు.
"మణికంధరుండు రహస్యశంక నెడ గలుగఁ జనఁగ నమ్మహాముని కిట్లనియె." కళా. 1.193.

**ఎడ కలుగ నిలుచు**

దూరముగా నిలుచు.
"అతని విడిచి యెడ గలుగ నిలిచి, నా పలుకులు విని మాని పలికిన..." కళా. 3.264.

**ఎడగరపడు**

కష్టపడు.
"నీవు డస్సి, యున్న వాఁడవు నిద్ర యును లేక యున్న నీ, వెడగరపడియె దీయడవిలోన." భార. సౌప్తి. 1.61.

**ఎడగా చను**

దూరంగా పోవు.
"అప్పుడు తద్వనలక్ష్మీవిలోకన కౌతుకంబున నెడగాఁ జనియున్న మణికంధరుం బిలిచి..." కళా. 1.208.

**ఎడ తప్పించి**

ఒకటి విడిచి ఒకటి (గ్రుచ్చు.)
"సాంధ్యరక్తిమమాత్రమునఁ బొసంగఁ గ్రుచ్చి, యెడతప్పనఁ ద్రోచి పిఱుందఁ జేర్చు." పారి. 2.43.

**ఎడ తాకు**

బాధపడు.
"ఎండలకు నీడలకు నెడ తాఁకి వాఁడు." తాళ్ళ. సం. 11.2 భా. 56.

**ఎడపడు**

ఆలస్యమగు. లోపము కలుగు.
"ఏ క్రియలందును నెడపడకుండ, నీ క్రియ హయమేధ మీడేరుటయును." రంగ. రా. బాల. పు. 16.11.

**ఎడప దడప**

అప్పుడప్పుడు.
"ఎడపఁ దడపఁ దనూభవుం డేచట నుండు." కాశీ. 4.85.
"మనిబొట్టు బోనాన నసలు కొల్పిన కన్ను, కొడుపుచేఁ దాటించు నెడపఁ దడప." క్రీడాభి. 1.186.
"ఎడపా దడపా వాడు వస్తూ పోతూ ఉంటాడు." వా.
రూ. అడపదడప.

**ఎడపేర్పు**

దాళి.
నుగ్గులను గుండ్రంగా పేర్చి అందులో నిప్పు వేస్తారు. పాలు కాచడానికి, పప్పు ఉడికించడానికీ ఉపయోగిస్తారు.
"ఒసఁగి యెడపేర్పులోఁ గ్రాఁగుచున్న యావు, పాలు వడ్డించుటయు." పాండు. 4.174.

**ఎడబిడ్డ**

చంటిబిడ్డకంటే పెద్దబిడ్డ.
"ఎడబిడ్డం డోఁకఁ డైన లేఁడో?" క్షేత్రలక్ష్మి. 58.

**ఎడమడుగు**

1. అరమరిక, సంకోచము.
"పాడవునఁ బ్రాయంబునఁ గడుఁ, గడిఁదిబలంబునను జూడఁగా నసదృశు

నీ, కొడుకు కని యీతని సెంతయును, నెడమడుగుగాఁ జూపఁ దెత్తె యిందఱు నగఁగానే." భార. ఆది. 4.99.

2. భేదము, విలంబము.

విరుద్ధము, కుటిలము.

ఇడై మడిక్కై - తమిళం.

వావిళ్ళ.

"ఈ పాలు ద్రావు మెడమడు గేమిటికి?" బసవ. 3.62 పు.

"ఏ యెడమడుగు లేని నెచ్చెలిఁ, బాడ గాంచుట చచ్చి మరలఁ బుట్టుట గాదే." భాగ. 10. స్కం. పు. 202.

"తోడితెం డెడమడు వేల యింక..." హరి. పూ. 9.87.

"తత్సేవన తాత్పర్యంబు తగ సెవం బడియే ప్రొద్దును నెడమడు గగుమదితో ననుసరింపంగా..." హరి. పూ. 1.83.

## ఎడమపిరి వెట్టు

అపసవ్యముగా ప్రవర్తించు.

"ఎడమపిరి వెట్టె నీమూర్ధుఁ డెటుక మాలి." రాధా. 3.48.

చూ. ఎడమపురి వెట్టు.

## ఎడమపురి వెట్టు

పురి విప్పు, అపసవ్యముగా ప్రవర్తించు.

"ఎడమపురి వెట్టె పరహిత వివేకము లోన." తాళ్ల. సం. 11.3. భా. 103.

చూ. ఎడమపిరి వెట్టు.

## ఎడమ వెట్టు

ప్రక్కకు నెట్టు.

ఇది నేటికీ దక్షిణాంధ్ర ప్రాంతంలో బాగా వాడుకలో ఉన్న పదం.

"సామాను లన్నీ తెచ్చాను అవన్నీ ఎడంగా పెట్టు" అంటారు.

"కడువంగ నొల్లక యెడము వెట్టి." హరి. పీఠిక. 14.

"విస్తట్లో అన్నీ వడ్డిస్తే అన్నీ ఎడంగా పెడుతున్నా వేమి?" వా.

## ఎడమొగం పెడమొగం

సరిపడమి.

"వారికీ వీరికీ ఎడమొగం పెడమొగంగా ఉన్నది." వా.

## ఎడ యెడ మాట లేల

ఆమాటలూ యీమాటలూ ఎందుకు?

అవన్నీ అప్రస్తుతం అనుట.

"ఎడ యెడ మాట లేల?" కవిక. 4.146.

## ఎడవాయు

వేఱుపడు

"ఎడవాయని సఖులతో డ సెందున్నాఁడో." నిరంకు. 2.80.

## ఎడ సనక

దూరము పోక; అతి జాగరూకతతో.

"పతివ్రతారత్నము న, న్నెప్పు డెడ సనక కంటికి, ఱెప్పవలెం గాచి తిరుగు కేయుం బవలున్." శుక. 1.389.

## ఎడసిపోవు

తొలగిపోవు.

"బొంకమాట లెడిసిపోయినఁ గాక కొంక యేల మాను." తాళ్ల. సం. 5.62.

ఎడ సేయక

ఆలస్యము చేయక.

"మాయకాఁ డేతెంచి మనలను గల్ల, సేయుచున్నాఁ డెడసేయక వినిఁ. డెగ టాప్పు."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 1853-55.

ఎడసేయు

ఎడబాపు; లోటు కలిగించు.

"చిలుకలకొల్కి! యెవ్వ రెడసే సిరి నీకిటు లేల చింతిలన్." పారి. 1.117.

ఎడసొచ్చు

దిగు.

"దుష్క్రియా, కూరత కిట్టివార లెడ సొచ్చుటఁ గంటిమొ." నిరంకు. 2.13.

ఎడా పెడా

అటూ యిటూ.

"వాడు యెడా పెడా నాలుగు వాయించి పంపించాడు." వా.

ఎద్దక త్తెర నాలుక బెల్లి మగు

లోపల యేమున్నా పైకి ప్రియంగా మాట్లాడు.

పయోముఖ విషకుంభము లాంటిది.

"వికచముఖుఁ డగుచు శాత్రవు, లకు హితు లగునట్టివారలం గని భూపాలకుఁ డెద్దకత్తెరయు నా, లుక బెల్లము నై మనంబులం గనవలయున్."

భార. శాంతి. 3.268.

ఎడ్లు దున్ని గుఱ్ఱముల మేపు

ఒకరు బాధపడి మరొకరిని పోషించుపట్ల ఉపయోగిస్తారు. ముఖ్యంగా బాధపడేవారు మంచివా రనీ, ఇతరులు కా రనీ సూచన కూడ కలదు.

రుద్రమ. 39 పు.

ఎత్తర తత్తర చేయు

ఉక్కిరిబిక్కిరి చేయు.

"ఎల్ల విటాగ్రగణ్యులను ఎత్తరతత్తర చేసినట్టి ...." పాణి. 2.102.

ఎత్తికోలు

ప్రయత్నము, ఆరంభము.

"ధాత మదియెత్తికోల్ తుదిఁ దాఁక కున్నె." నైష. 1.82.

దీనికి దగ్గరగా ఉన్నదే ఎత్తుగడ.

చూ. ఎత్తుగడ.

ఎత్తిచ్చు

ఎదుటివారికి నేర్పు.

"ఎల్లవారికిని ఇదె యెత్తిచ్చె ననవు గదా కల్లరితనమున చీకటిలోని సుద్దులు."

తాళ్ల. సం. 3.650.

"వాణ్ణి నేను అడుగుతున్నాను. వా డేమీ చెప్పక ముందే నువ్వు ఎత్తిస్తా వెందుకు ?" వా.

ఎత్తినకాలు దించకుండా

నిర్విరామంగా.

"కోడి కూసినప్పటినుంచీ ఎత్తినకాలు దించకుండా పని చేస్తూనే ఉన్నాను. ఇంకా తెమల లేదు." వా.

ఎత్తినకే లెత్తినట్లే యుండు

ఉన్న దున్నట్లుగానే.

"దృఢముష్టిం బూని బలత్తి రె, త్తినకే లెత్తిన యట్ల యుండ దివి నుద్వేగంబు నం బోవుచున్." కళా. 3.152.

ఎత్తినకోలగా
ఎత్తినబాణం ఎత్తినట్లుగా.
వెంటనే.
"ఎత్తినకోలగా మదనుఁ డేసిన వే చని వచ్చు నర్ధచంద్రోత్తరబాణమో యనఁగ నొప్పెడుపాపటతో." కళా. 7.126.

ఎత్తినడుగుల నుండు
ఎప్పుడెప్పు డని ఆతురతతో ఉండు.
కాళ్లెత్తి నిల్చి చూస్తున్నారు అనుటపై వచ్చినది,
"గొంతి కోడండ్రు రెల్లను గురువరేణ్య! యెత్తినడుగుల నున్నవారు."
భార. ఆశ్ర. 2.25.

ఎత్తినభీతి
భయముతో.
"వాసవుం, డెత్తినభీతి బ్రహ్మకడ కేఁగి ప్రణామము చేసి ఖేదముం, దత్తఱపాటుఁ జెప్పిన." ఉ. హరి. 2.187.

ఎత్తిపెట్టు
దాచిపెట్టు.
"ఈ డబ్బు ఎత్తిపెట్టు." వా.

ఎత్తి పొడుచు
దెప్పు.
"ఈరా లెఱింగిన నెత్తిపొడుచు."
భాగ. 10. పూ. 978.
"అత్తగా రెప్పుడూ ఏదో ఒకటి ఎత్తి పొడుస్తూనే ఉంటుంది." వా.

ఎత్తిపోతలు
పోషణము.
"అఁ! వాళ్లతల్లి ఉన్నంతవరకూ ఎత్తి పోతల కేం లోపం లేదు." వా.

ఎత్తిపోవు
దండెత్తు.
"తండ్రిబిడ్డ యన్నదమ్ముఁడు నా కెత్తి, పోయి పోటులాడి పుడమిఁ గూండ్రు."
భార. భీష్మ. 1.42.

ఎత్తి వచ్చు
దండెత్తి వచ్చు.
కుమా. 10.167.
"సరగున దుర్గముల్ సాధింపఁ జను వేళ, వైరిభూభుజు లెత్తివచ్చు వేళ."
శుక. 1.235.
"అనికిఁ బలసూదనుఁ డెత్తివచ్చినన్, దీలుపడంగఁ దోలి యిటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్."
పారి. 1.135.

....ఎత్తు
ప్రస్తావించు.
"ఆ సంగతి నా దగ్గఱ యెత్తవద్దు."
వా.
"ఇకమీద ఈ సంభాషణ నీ దగ్గఱ ఎత్తితే ఒట్టు!" వా.

ఎత్తు ఎఱుగక
చాకచక్యము లేక; తెలివి తక్కువై.
చదరంగముద్వారా వచ్చిన పలుకుబడి. ఒక ఎత్తు వేసి నప్పుడు దానికి సరిగా ఎత్తు వేయవలసి ఉంటుంది. ఆ యెత్తు వేయుటకు తెలియక పోయె ననుట.
"అవ్విష్ణుశర్మయు నెత్తెఱుంగక యితెఱంగున మాటలాడి నోటికూటికిఁ జేటు దెచ్చుకొంటిని గదా..."
శుక. 3.364.

**ఎత్తుక వచ్చు**

1. తీసుకొని వచ్చు; 2. లేవదీసుక వచ్చు; 3. దొంగిలించు.

"ఆ సుద్తియకు బుద్ధిఁ జెప్పి యెత్తుకొని వచ్చెదను." ప్రభా. 5.18.

"గొఱ్ఱె యెత్తుకొని బొంకక పల్కుచుక్." విప్ర. 5.15.

"వాడా పిల్లను యెత్తుకపోయాడట." వా.

**ఎత్తుకు పైయెత్తు వేయు**

యుక్తికి ప్రత్యుక్తి పన్ను.

"వీడు కల్లంగడి వానికి పోకుండా పైపాట పాడాడు. వాడేమో యిప్పుడు మద్యపాననిషేధదళంలో చేరి ప్రచారం మొదలుపెట్టాడు. ఎత్తుకు పైయెత్తు వేయడం తప్పితే వాడూ వీడూ యిద్దరూ ఒకటే." వా.

**ఎత్తు కెత్తు బంగారము ఇచ్చి....**

అమూల్యము, విలువ గలది. ఆ వస్తువునకు సరిపడినంత తూకము గల బంగారమును ఇచ్చి తీసికొనుట ఆ వస్తువునకున్న అమూల్యతను సూచించును. బంగారానికి ఇంకే పర్యాయపద మైనా చేరవచ్చును.

"ఎత్తుకెత్తు మెఱుంగు కుందన మిచ్చి తెచ్చితి పూవిరాజులు." శుక. 1.222.

"ఎత్తుకెత్తు బంగార మిచ్చినా ఈ వస్తు విద్వాను." వా.

"ఆ పిల్లకు ఎత్తుకెత్తు బంగార మిచ్చినా తీరదు." వా.

"ఆ పనికి ఎత్తుకెత్తు బంగార మీయ వచ్చు." వా.

**ఎత్తుకొని పోవు**

లేవదీసికొని పోవు.

ఇది యీనాటికీ రాయలసీమలో వాడుకలో ఉన్న పలుకుబడి.

"వాడు ఆ రంగనాయకిని ఎత్తుకొని పోయినాడని ఊరంతా ఒకే అనుకోవడం." వా.

చూ. ఎత్తుక పోవు.

**ఎత్తుకొని తిను**

అడుక్కొని తిను.

"ఉన్నపొలం కాస్తా అమ్ముకొంటే ఎత్తుక తింటావా?" వా.

**ఎత్తుకొను**

పూనుకొను; ఆలోచించు; తలంచు.

"కుల మెల్లఁ జెఱచి నీకును గర్తయైన, యిలపతిఁ బొలియింప నెతుకొన్నావు." పర. రా. అయో. పు. 397. పంక్తి. 15.

"వాడీమధ్య నా విషయమే బొత్తిగా ఎత్తుకోవడం లేదు." వా.

**ఎత్తుగడ**

ఆరంభము.

"ఆ పాట ఎత్తుగడ చాలా బాగా ఉంది గాని రాను రాను తేలిపోయింది." వా.

"పద్యంఎత్తుగడ బాగా ఉంది." వా.

**ఎత్తుదెంచు**

ఎత్తివచ్చు, దండెత్తి వచ్చు. కుమా. 10.125.

**ఎత్తున కెత్తు**

సరికి సరి.

ఆ వస్తువు ఎంత తూకమో అంత తూకము గల మఱి యొకటి ఇచ్చుటపై వచ్చినది.

"ఎత్తున కెత్తు అనఘ మీ కిచ్చెద."
బస. 4.120.

**ఎత్తుపెట్టు**

ప్రోత్సహించు.

"విలసిత మోహ దాహ పరివేదన పామ్మని యెత్తుపెట్టఁగా."
హంస. 1.114.

**ఎత్తుతోళ్లు**

తిట్టుగా స్త్రీల దూషణలో ప్రయుక్తమైనది. ఎత్తుకొన్న తోలులాంటివారని కావచ్చునేమో!

పండితా. ప్రథ. పురా. పుట. 343.

**ఎత్తులిడు**

ప్రోత్సహించు.

"...పలుమాఱు వచ్చిర మ్మనుచు మిగుల నెత్తు లిడియెడు నన్ను నా యింతి చూచి."
కళా. 2.170.

"ఇరువంకఁ జెలు లెత్తులిడుచు లబ్బింపంగఁ జిఱునవ్వులోఁ గొంత సిగ్గు వదలి."
కళా. 7.76.

**ఎత్తులు పెట్టు**

ప్రోత్సహించు.

"పొద్దున్నుంచీ ఎత్తులు పెడితే వాడు బయలుదేరాడు."
వా.

"ఎతులు పెట్టి ఎత్తులు పెట్టి వాణ్ణి పంపించాను."
వా.

**ఎత్తులు వేయు**

తంత్రాలు పన్ను.

"మన ప్రయత్న మంతా భగ్నం చేయాలని వాడు ఎత్తులు వేస్తున్నాడు." వా.

**ఎత్తువడు**

మెత్తబడు; ఎత్తుబడి పోవు అనగా బలహీనపడి పోవు. ఈ క్రింది ప్రయోగంలో శ్లేషలో అర్థాలు రెండూ ఉన్నవి.

"తారాచలము వ్రేకఁదన మెంత వింశతి, బాహునిచే నెత్తువడియె నట్టె."
కుమా. 3.5.

"కంటకాగమభీతి గడచె సుదతభూమి, భృత్కటకం బెల్ల నెత్తువడియె."
మను. పీఠిక. 34.

"ఆ యెద్దు యెత్తుబడింది."
వా.

"అతడు నాలుగునాళ్ల జ్వరంతో ఎత్తుబడి పోయాడు."
వా.

**ఎత్తువారిచేతిబిడ్డ**

ఎవరు కాస్త మంచిమాట మాట్లాడితే వారివైపు ఉండేవాడు.

"ఈతఁ డెత్తువారి చేతిబిడ్డ గాని యొకతెన్నునఁ బోవువాఁడు గాఁడు. ఇట్టివాని కొలువు మిక్కిలి కష్టము."
నీతిచంద్రిక. మిత్రభేదము.

"వాడు ఎత్తువారి చేతిబిడ్డ. ఎక్కడ ఉంటే అక్కడి మాట."
వా.

**ఎత్తు వేయు**

ఉపాయము పన్ను.

"వాడు స్కూలుకు డబ్బిస్తున్నాడంటే యేదో ఎత్తువేశా డన్నమాటే!" వా.

చదరంగంలో ఎత్తులు వేయ డంపై వచ్చినపలుకుబడి.

**ఎత్తు వోవు**

ఓడిపోయి పాఱు

కోడిపందెములలో ఈ మాటను ఇప్పటికీ ఉపయోగిస్తారు. 'ఆ కోడి ఎత్తు పోయింది.'

అలాగే 'కొప్పెత్తు' అను మాట కూడా ఉపయోగిస్తారు.

"అవియును నొకటొకటికి నెత్తు వోవక పెనఁగినఁ గని మధుత్రిపురహరుల్." ఉ. హరి. 6.160.

**ఎత్తు సేయు**

సమాన మగు.

"ఇంద్ర నీలపురంగు నెత్తు సేయఁ గడంగు." రుక్మాం. 2.125.

**ఎద కోఱవి గొని చూడినట్లు**

హృదయాన్ని కొఱివితో క్రుచ్చినట్లు. అంత బాధాకరంగా.

శమా. 10.142.

**ఎదను పెంచు**

హృదయ వైశాల్యము కల్పించు.

నా. మా. 99.

**ఎద నెగ్గు రను**

మనసు బాధపడు.

నెగ్గురను, దిగ్గురను, చివ్వుక్కుమను, భగ్గుమను అనునవి ధ్వన్యనుకరణములుగా ఏర్పడినవి.

"ఒక మోహనాంగకళ్యం, గారునితోడ దీపకళిక ల్వెలుఁగఁగ నిదురించు చున్న యా,నీరజగంధిఁ జూచి యెద నెగ్గురనం గడు విస్మితాత్ముఁడై. శుక. 1.204.

**ఎదబడు**

భయపడు.

రాయలసీమలో ఎక్కువగా వాడుకలో నున్న పలుకుబడి.

"వాడిమాటలకు ఎదబడేవాళ్లు ఎవరూ లేరు." వా.

చూ. ఎదవడు.

**ఎదలో రాయి పడు**

భయము కలుగు.

"పదుగురు గల సభ యన న, న్నెదలో రాయి పడి..."

గుంటూ. ఉత్త. 23.

చూ. గుండెలో రాయి పడు.

**ఎదవడు**

భయపడు.

"పెదవులు దడవుచు భీతిచేఁ జాల నెదవడి."

వర. రా. అర. పు. 112. పంక్తి. 4.

చూ. ఎదబడు.

**ఎదాన కొట్టుకొను**

నెత్తిన వేసికొను అనుట వంటిది.

నిరసనగా అనుమాట.

కొత్త. 97.

**ఎదిరి నిన్ను నెఱుగు**

తనబల మెంతో ఎదుటివారి బల మెంతో తెలియు.

"చిలుత, వెదిరి నిన్ను నెఱుఁగవు." కుమా. 6.10.

## ఎదుగూ పొదుగూ

జంటపదం.

"వా డెంత తిన్నా ఎదుగూ పొదుగూ లేకుండా అలాగే ఉండి పోయాడు." వా.

"ఈ వ్యాపారం ఎన్నాళ్లైనా ఎదుగూ పొదుగూ లేకుండా అలాగే ఉండి పోయింది." వా.

రూ. ఎదుగూ బొదుగూ.

## ఎదుగు పొదుగు లేని

ఏమాత్రం పెరగని.

"ఎదుగూ పొదుగూ లేని ఈ జీతంతో ఎలా సంసారాన్ని నెట్టేదో తెలియడం లేదు." వా.

రూ. ఎదుగు బొదుగు లేని.

## ఎదురాడు

ఎదిరించి మాట్లాడు; ధిక్కరించు.

"పెద్దలకు ఎదురాడ రాదు." వా.

## ఎదురీత

జనాభిప్రాయం ఒకవైపు ఉండగా దానికి భిన్నంగా ప్రవర్తించుట.

ప్రవాహం ఎటువైపు పోతుందో అటువైపు పోవడం సులువు. దానికి ఎదురుగా యీదడం కష్టం.

"కులభేదాలు మతభేదాలు పోవాలంటున్న రోజుల్లో నీ విలా కులం పేర పార్టీ పెట్టడం వట్టి ఎదురీత నాయనా!" వా.

## ఎదురుకట్ల

ఎదురుగా.

"హిమశైలజాజాని యెదురుకట్లకుఁ బోని." సారం. 3.108.

"తమ యింటి యెదురుకట్ల." వి. పు. 7.137.

నేటికీ ఈ మాట యిదే రూపంలో రాయలసీమలో విశేషంగా వినవస్తుంది.

"ఇంత పెద్దవాడైనా నా తమ్ముడు నా యెదురుకట్ల నిలబడడు." వా.

"అన్న యెదురుకట్ల అతను నిలబడి ఎరగడు." వా.

## ఎదురు కెదురు

బదులుకు బదులు.

"ఎదురు కెదు రేల కోపించె నిందు ధరుఁడు." భీమ. 4.12.

## ఎదురుకొను

మార్కొను.

"కావున మన మెదురుకొనం గావలయు." జైమి. 5.164.

## ఎదురుకోలు చేయు

ఎదురేగి వెళ్లు.

"అతఁడు నఖండవైభవంబున, దవ్వుదవ్వులన యెదురుకోలు చేసె." కళా. 7.69.

## ఎదురుకోళ్లు

పెండ్లిలో ఒకవేపు వారు మరొకవేపు వారికి ఎదురేగి వెళ్లుట.

"పెండ్లికొడుకువాళ్ళు వస్తున్నారట. ఎదురుకోళ్ళకు వెళ్ళాలి." వా.

**ఎదురుచుక్క**

ప్రతిస్పర్ధి.

ఇది జ్యోతిశ్శాస్త్రరీత్యా వచ్చిన పలుకుబడి. చుక్క యెదురుగా నున్నప్పుడు ప్రయాణాదులు చేస్తే అశుభం కలుగుతుం దని ప్రతీతి.

"ఎపుడు శాత్రవకోటి కెదురుచుక్క యగుచు." రం. రా. బాల. పు. 9. పం. 15.

"ఏదులకు ... త్తి లేళ్ళకు నెదురు చుక్క." శుక. 2.283.

"ఎదురింటివారల కెదురుచుక్క." శుక. 3.20.

"వాడికీ వీడికీ చుక్కెదురు." వా.

చూ. చుక్కెదురు.

**ఎదురు చూచు**

1. నిరీక్షించు.

"నీ రాక కెదురుచూచు, నయనములు వేయి విరియించి నాకభర్త." శృం. నైష. 4.64.

2. ముఖాముఖి చూచు.

అంటె అంతకు తక్కువవాడు కా డనుట.

"కమనీయ రూపరేఖావిలాసస్ఫూర్తి, నేభర్త శ్రీభర్త నెదురుచూచు." ఆనంద. పీఠి. 46.

చూ. ఎదురులు చూచు.

**ఎదురు తిరుగు**

ధిక్కరించు.

"తండ్రికే ఎదురు తిరిగి మాట్లాడేవాడు మనమాట వింటాడా!" వా.

**ఎదురు తెన్నులు చూచు**

నిరీక్షించు.

"ఆయనకోసం ఎదురు తెన్నులు చూడ్డంతో సరిపోతున్నది." వా.

**ఎదురుత్తర మిచ్చు**

బదులు చెప్పు.

"ఉత్తమనాథుఁ డీతఁ డెదురుత్తర మీఁ డొకనాఁ డదే మకో." కా. మా. 3.44.

**ఎదురుత్రోవలు చూచు**

నిరీక్షించు.

"ఇంద్రదత్తున కభిలాషతో నెదురు త్రోవలు చూచుచు." భోజ. 3.255.

**ఎదురు నడచు**

ఎదురేగు.

గౌరవసూచకంగా కూడా.

"ఇవ్విధంబునఁ బ్రాగ్జ్యోతిషపతి యాయంగపతికి నెదురునడిచి యుద్ధసన్నాహంబు చెన్నుమీఱ." కళా. 8.120.

**ఎదురుపడు**

ఎదురగు; ప్రతిఘటించు.

"జారశేఖరు డా వెలఁదికి నెదురు పడియె." హంస. 2. 117.

"వారికి, నరనందనుఁ డెదుర్పడి గుణధ్వని సెలఁగన్." భార. భీష్మ. 2.313.

**ఎదురు బదురుగా**

ముఖాముఖిగా.

"వారిద్దరూ ఎదురు బదురుగా కూర్చోడం తప్పితే చేసే దే ముంది?" వా.

**ఎదురులు చూచు**

నిరీక్షించు.

"కన్నులు చల్లఁగాఁ గందుమో యనుచు
నెదురులు చూచుచు నుండఁగ."
వర. రా. అయో. పు. 250. పంక్తి. 16.

ఎదురులేదు

అడ్డము లేదు, సాటి లేదు, ప్రతి లేదు.

"మహాంధ్రకవితావిద్యాబలప్రౌఢి నీ,
కెదు రేరీ." పాండు. 1.27.

"వాడిమాటకు ఆ వూళ్ళో ఎదురు
లేదు." వా.

ఎదురు పెట్టు

పెట్టవలసినవారికి కాక ఇతరులకు పెట్టు; తాను పొందవలసి ఉండగా వారికే తాను పెట్టు.

'ఆ పిల్ల (కొత్తకోడలు) ఇంట్లో దంతా ఎదురు పెట్తా ఉంది' అని అత్త ఆడబడుచులలాంటి వా రంటారు.

"ఎల్లసొమ్ములు జారుల కెదురు పెట్ట,
సాఁగె నిచ్ఛావిహారనిశ్చలత మీఱ."
శుక. 3.350.

"ఇటుల నజ్జారశేఖరుఁ డేలఁబట్టి
యింటిలో నున్నవస్తువు లెదురుపెట్టి."
హంస. 2.112.

"ఆ వ్యాపారంలో దిగాను. నేనే పది
వేలు ఎదురుపెట్టవలసి వచ్చింది." వా.

ఎదురు పెట్టి చదరంగ మాడు

ఎదుటివానికి కూడా తానే డబ్బిచ్చి వానితో జూద మాడు.

కొ వ్వెక్కి గాడిదలతో తన్నించుకొనుట వంటిది.

"ఎదురుపెట్టి వేడ్కఁ జదరంగ మాడె
డు, పగిది నీకుఁ గల్గు పడుపుఁ గూట్చి,
సా మ్మొసంగి చేర రమ్మన్నఁ గైకొను,
నట్టివాఁడు ముద్దుపట్టి! వినుము."
చంద్రరేఖా. 2 61.

ఎదురు పేలములు

భీమ. 4.47.

ఎదురెక్కు

ఎదురుగా నేగు.

ఆము. 1.5.

ఎదురెదుర అను

ముఖాముఖి అను.

వాడుకలో 'మొగాన్నే ఏమంటాం?', అన్నరూపంలో ఉంటుంది.

"ఏమెదు రెదుర మి మ్మేమందు
మయ్య" బస. 7. 182.

"ఎదురుగా ఏ మంటాం చెప్పండి!"
వా.

"వెనుక ఎన్ని అనుకున్నా ఎదురుగా
ఏ మంటారు?" వా.

ఎదురెదురుగా

ఎదురుబదురుగా.

"ఎదురెదుర నిచ్చు పువ్వుపోయిలియుఁ
బోలె." కవిక. 4.771.

ఎదురొడ్డు

1. మార్కొను.

"విడిసెఁ బతి సేన కెదురొడ్డి విమత
సేన." కవిక. 2.147.

2. కాచుకొనుటకు ఎదురు దెబ్బ తీయు.

"అతఁ డెదురొడ్డినట్టి శూలాయుధ
మును, హరియురము గాఁడి యూరౌతు
శిరము ప్రెకి...." కళా. 8.99.

ఎదురొమ్ముకుంపటి

"పతి కెదురొమ్ముకుంపటిగఁ బాల్పడ కుండనిలక్ష్మి." శ్రీనివా. 1.74.

చూ. రొమ్ముకుంపటి.

ఎదురొమ్ములో ములుకఱ్ఱ పొడిచినట్లు

కటువుగా, బాధాకరంగా.

ఎదుర్కొను

ఎదురేగు.

"ఎదుర్కొనె నీహారగిరీశ్వరుండు." హర. 4.93.

ఎదుర్కోలు చేయు

ఎదురేతెంచు; గౌరవించు. ఎవరైనా పెద్దలు వచ్చినప్పుడు వారి కెదురేగుట గౌరవసూచకము. దానివిబట్టి యేర్పడిన పలుకుబడి.

"తనచక్రమునకు నాతని దివ్యతేజంబు గురుభావమున నెదుర్కోలు సేయఁ..." కళా. 2.140.

ఎద్దీనిం దంటే గాటిలో కట్టి వేయ మన్నట్లు

అనాలోచితంగా.

'మంచీ చెడ్డా గమనించే ఓపిక యెక్కడిది వాడికి? తన సలహాదార్లు చెప్పితే చాలు – ఎద్దు యీనిం దంటే గాటిలో కట్టి వేయమంటాడు.'

ఎద్దు ఈనడం అసంభవం అన్న ప్రశ్నే అతనికి తోచ లేదనుట.

"అది న్యాయ్య మిది న్యాయ్య మని చూడ కెద్దీనె, నన గాటఁ గట్టు మంచాడు మనిరొ."

త్రిశంకుస్వర్గము. అంక. 2. పే. 15.

ఎద్దీనె ననిన గొంది గట్టుమటన్న చందము

అవునా కాదా అని విచారించక చెప్పగానే తలఊచు పట్ల ఉపయోగించేసామ్యం.

"ఎంతైన నిటువంటి వెద్దీనె ననిన గొందిన గట్టు మటన్న చందములు తగునె."

పండితా. ద్వితీ. మహి. పుట. 145.

వాడుకలో :

"ఎద్దీనిం దంటే గాట్లో కట్టివెయ్యమన్నట్లుంది నీ వనేమాట." వా.

ఎద్దు తన్నే నని గుఱ్ఱము చాటున కేగు

ఒక బాధను తప్పించుకొనుటకై అంతకంటె పెద్ద బాధకు తల యొగ్గు.

తాళ్ల. సం. 11. 3 భా. 74.

ఎద్దునకు అటుకు లరుచి యేమిటి?

'గాడిద కేమి తెలుసు గంద వొడివాసన' వంటిది.

వేంకటేశ. 74.

ఎద్దు పట్టిన సివము

గంతులు వేయించునది.

తాళ్ల. సం. 11. 3 భా. 26.

**ఎద్దుమీద వాన కురిసినట్టు**

ఏమీ పట్టించుకోనకుండా.

"వాడు ఎన్ని అంటే నేమి? ఎద్దుమీద వాన కురిసినట్టుగా ఉంటాడు." వా.

**ఎద్దుమొద్దు**

ఒక తిట్టు.

చదువు సాము రానివారిని వట్టి బలం మాత్రం ఉన్న వారిని అంటారు.

"ముద్ది యనరాదు గ్రుద్దు నయ్యెద్దు మొద్దు." శుక. 3.21.

చూ. ఎద్దుమొద్దుస్వరూపం.

**ఎద్దుమొద్దుస్వరూపం**

స్తబ్ధు, జడుడు అనుట.

"ఎద్దుమొద్దు స్వరూపాయ ఎనుపోతాయ నమోనమః." చాటువు.

"వాడు ఒట్టి ఎద్దుమొద్దు స్వరూపం. వాణ్ణి కట్టుకొని మనం ఏం చేస్తాము." వా.

**ఎద్దులు బండ్లు నేక మైన కొండ మీదికి పోవును**

ఎద్దూ బండీ ఏక మైతే కొండ మీదికి పోగలవు.

కలిసి పనిచేస్తే ఎంత అసాధ్య కార్య మైనా సాధింప వచ్చును అనుపట్ల ఉపయో గించేపలుకుబడి.

"...రెండు నెద్దులు బండియు నేక మైనఁ, గొండమీఁదికిఁ బోవు నోకొమ్మ యనుచు." కళా. 3.70.

**ఎనవచ్చు**

సాటి యగు.

కాశీ 5.283.

**ఎనిమిదవయట్టపు పారాయణము**

బూతులు తిట్టుట.

తె. జా.

**ఎనిమిదో అర్థం**

తిట్టు.

వేదాలలోని భాగాలను అర్థాలు, అష్టకాలు అంటారు. ఎనిమిదో అర్థం బూతుల పురాణం వంటిది.

"వాడికి దక్షిణ సరిగా ముట్టక పోయే సరికి ఎనిమిదోఅర్థం ఆరంభించాడు." వా.

**ఎనిమిదో అర్థం పారాయణ చేయు**

తిట్ల కారంభించు.

**ఎనుపోతుపై వాన**

సోమరి.

దున్నపోతుమీద వాన కురిసినా అది లెక్కచేయదు, కదలదు. అలాటివా డనుట.

"బూమి తుంటరి యెనుపోతు పై వాన." గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1496.

**ఎనుమునకు గీతము**

వ్యర్థము.

అయోగ్యునిదగ్గఱ పాండిత్య ప్రదర్శనము, వ్యర్థ మనుట.

శరభాంక. 8.

**ఎన్నడు లేనిది**

అలవాటు లేనిది; అరుదుగా.

"ఎన్నఁడు లేని యింతకోపపుఁ బలుకిది యేమి పడఁతి యనుచు..."
కళా. 5.58.

"వాడు ఎన్నడూ లేనిది ఈ రోజు మాయింటికి వచ్చాడు." వా.

"అతడు ఎన్నడూ లేనిది తన భార్య మీద కోప్పడ్డాడు." వా.

**ఎన్నరాని**

ఎక్కువైన.

"ఎన్నరాని ప్రేమ వానిచక్కదన మే నేలక కనుగొంటినె."
హేమా. పు. 35.

**ఎన్నాళ్లకో సెల్వుగా**

చాలనాళ్ళకుగా—ఈ రోజు.

"గోనబుతో నెన్నాళ్లకో సెల్వుగా నేటి, కైన నిన్నెనయ నా కబ్బె ననుచు." హంస. 2.169.

వాడుకలో ఇది నెల్లూరు చిత్తూరు ప్రాంతాలలో ఈ నాటికీ వినవస్తుంది.

"వాడు ఈ ఊరికి వచ్చి నెల నాళ్లయింది. ఇన్నాళ్లకు సెలవుగా ఈ రోజు కన్పించాడు." వా.

**ఎన్నిక కెక్కు**

ప్రసిద్ధి చెందు.

"చక్రవాసుఁ డన నెన్నిక కెక్కిన పేరు గల్గి..." హంస. 5.8.

**ఎన్నిక మీఱు**

ప్రసిద్ధి కెక్కు.

"బంధుకోటిలో నెన్నిక మీఱుచుం డెడఁగా." రుక్మాం. 1.148.

**ఎన్నికొను**

పేర్కొను.

"వీని జాడ లీజటివరు లెల్ల నెన్నికొనంగ, వినియుందు."
వర. రా. అర. పు. 143. పంక్తి. 11.

**ఎన్నిగుండెలు !**

"నాతి యిట్లు వేఁడు న న్నాదరింపక, పోవు నిన్ను నింకఁ బురుషుఁ డొక్కఁ, డెవఁడు నేఁ దలంక నేరికి నెన్నిగుం, డియలు గలవు నాదు ప్రియను జేర."
కళాపూ. 6.38.

"వాడలా రాశాడంటే ఎన్ని గుండెలు ?" వా.

చూ. ఎన్ని గుండె లున్నవి ?
ఎన్ని తలలు ?

**ఎన్నిగుండె లున్నవి?**

అంత ధైర్య మెక్కడిది ?
అంత ధైర్య మున్నదా అను పట్టుల ఉపయోగించే పలుకుబడి.

"అంత పండితుణ్ణి పట్టుకొని తప్పు పట్టడానికి వాడికి ఎన్నిగుండె లున్నాయి?" వా.

"నన్ను తిట్టడానికి వాని కెన్ని గుండె లున్నవి ?" వా.

చూ. ఎన్నెదల్ గల్గె ?

**ఎన్నిచాళ్ల పట్టు ?**

ఎంతదూరము.

పొలాన్ని కొలిచేటప్పుడు రైతులు మామూలుగా ఎన్ని చాళ్లు పడేస్థలమో దానినిబట్టి లెక్క వేయడం అలవాటు. ఒకకాడిఎద్దులు దున్నుటకు

పీలయినభూమి కూడా ఒక ప్రమాణంగా తీసుకోవడం అలవాటు.
ఇలాగే పగ్గముపట్టు. ఒక పగ్గం పొడువుగా ఉన్న నేలను పగ్గముపట్టు అంటారు.
పాండు. 278.

**ఎన్ని తలలు?**
ఎన్ని గుండెలు? అంత ధైర్యమా? అంత కు సమర్థుడా అనుట.
"అకట! యీ ప్రాణి యవిదితాత్మకుఁడు గాన, దైవికమున మహావిపత్ప్రాప్తుఁ డయ్యె, ననుచు దయచేయవలయు నిట్టి వారి, యెదుట నిలువంగఁ గ్రోధుని కెన్ని తలలు?"
ప్రబోధ. 4.27.
చూ. ఎన్ని గుండెలు.

**ఎన్ని యెదలు కలవు?**
ఎంత ధైర్యం? ఎన్ని గుండెలు? అని నేటి వాడుక. అంత ధైర్య ముందా వానికి అనిభావం.
"అంగభవుడు నిన్ను నిచ్చ నెఱిఁగి, యొఱిఁగి పైనెత్తి రానెన్ని యెదలు గలవు."
కుమా. 9. 42.
చూ. ఎన్ని గుండెలు?

**ఎన్నియేని**
ఎన్నైనా, చాలా అధికముగా.
భీమ. 1.31.

**ఎన్నెదల్ గల్గె**
ఎన్ని గుండె లున్నవి అని నేటి వాడుక. ఎంత ధైర్యం? అంత ధైర్యం ఉన్నదా? అనుట.
"కన్నంతటను జూడఁ గా దనుతపసి, కెన్నెదల్ గల్గె నీ కిటు గుడ్వ బెట్ట."
బస. 6. 164 పు.
చూ. ఎన్ని గుండె లున్నవి?

**ఎప్పు డెప్పు డని యెదురు చూచు**
ఆతురతతో ఎదురుచూచు.
"ఎప్పు డెప్పు డటంచు నెదురు చూచుచు మదిఁ, గలఁగు చుండెడు నుషాకన్యఁ జేరి."
ఉషా. 2.58.

**ఎమ్ములు చిల్లులు వోవ నాడు**
మర్మభేద మైన మాటలాడు.
"ఎమ్ములు చిల్లులు వోవ నాడినన్."
సారం. 3.67.

**ఎమ్ములు సున్న మగు**
ఎముకలు నుసి యగు.
"ఏడ్చు నమ్మ యెమ్ములు సున్న మయ్యె నేఁడు."
వ్యస. నాట. 33.

**ఎమ్మె లుపచరించు**
వేషములు వేయు, వగలుపోవు.
"మా, చెలి యిదె పుష్పదామకముచే నినుఁ గట్టఁగఁ గంటి మింక నె, మ్మెలు పచరింప రా దనుచు."
పారి. 5.81.

**ఎరలేని గాలము**
పైకి ప్రమాదమని తెలియనీయకుండా ప్రమాదము చేయునది.
రామలిం. 31.

**ఎరవు చేయు**

ఉపేక్షించు.

"ఇంద్రనందనుకేళి నెరవుచేసి."
రుక్మాం. 3.182.

"ఏను మీ చెలి నిం తేల యెరవు సేయ." శకుం. 2.75.

వేఱు చేయు, పరాయిదానిగా భావించు. 'ఎరవలి సొత్తు', 'ఎరవలి తెచ్చుకొను' లలోనూ ఉన్న ఎరవు పరశబ్ద ప్రతీకం కావచ్చును.

"నెఱి లేక నీతోడి నీడ యై నడఁగూడి పరగిన నన్నింత యెరవు సేసి."
కుమా. 5.123.

**ఎరవు లిచ్చు**

ప్రతిఫలాపేక్ష లేక యితరులకు బదులుగా నిచ్చు.

"ప్రాణుల కిల్లను ఎరవు లిచ్చిన చేతులు... తాళ్ల. సం. 5.108.

"ఎరవలిసొమ్ము బరువుల చేటు." సా.

**ఎరసంజె**

సంధ్యారాగము.
క్రీడా. పు. 89.

**ఎరువు చల్లు**

పొలమునకు ఎరువు వేయు.

"ఎరువుఁ జల్లెడు వేళ నెరువుఁ జల్లు..." కళా. 4.79.

**ఎర్రని యేగాని లేదు**

దమ్మిడీ లేదు.

"వాడి చేతిలో ఎర్రని యేగాని లేదు. నా దేం వ్యాపారం చేస్తాడు?" వా.

**ఎఱియ గట్టు**

విఱుగగట్టు

"ఎట్టుకొనిపోయెదరు విప్రు నెఱియఁ గట్టి." శివ. 4.61.

**ఎఱిగినవి నాల్గు నొడువు**

తెలిసిన దేదో కొంతో చెప్పు. నేటికీ యిది వాడుకలో 'ఏవో తెలిసిన నాలుగు మాటలూ చెప్తాను' అనేరకంగా విన వస్తూనే ఉంటుంది.

"ఎఱిఁగినవి నాల్గు నొడువ నే మయిన లెస్స." ఆము. 4.68.

**ఎఱిగి యెఱిగి**

తెలిసి తెలిసీ—నొక్కి చెప్పుటలో పునరావృత్తి.

"శివుఁ బరమాత్ము నెఱిఁగి యెఱిఁగి, దూషింప నీకు నోరెట్లు లాడె."
కుమా. 2.29.

"తెలిసి తెలిసీ వాడు అక్కడికి పోయాడు. అవమానపడ్డాడు."
చూ. చేసి చేసీ.

**ఎఱుగనయ్యెద**

ఎఱుగను.

"అకట! య దేమి యో యెఱుఁగ నయ్యెద." పారి. 1.73.

**ఎఱ్ఱగా బుఱ్ఱగా ఉండు**

కాస్త అందంగా ఉండు.

"ఆ అబ్బాయి కాస్త ఎఱ్ఱగా బుఱ్ఱగా ఉంటాడు." వా.

**ఎఱ్ఱలు ద్రోలు**

ఎఱ్ఱవారు.

"మో మెట్టిలు ద్రోలి నిప్పుము ద్దెనది."
నాయక. 110. పు.

ఎట్టివాలు
ఎట్టబారు.
"ఎట్టివాతి ఘూర్ణిల్లుచు మిన్ను ముట్టి మరుల్లోలంబు లగునుల్లోలంబులును."
విప్ర. 2.14.

ఎలగోలు
"ఎలగోలు ప్రజలను హెచ్చువంటర్ల."
పల. పు. 28.

ఎలయించుకొని పోవు
మఱపించుకొని కొనిపోవు.
"వెంట వెంట వచ్చు నెలయించుకొని పొమ్మ వానికడకు..." కళా. 6.59.

ఎలుగిచ్చు
పలుకు.
"అయ్యా యని పిలిచినవంబికి, నోయని యెలుఁ గీవె తొల్లి యురగాభరణా!"
శివత త్వ. 112.

ఎలుగు లిచ్చు
పిలుచు.
"తెచ్చి యిచ్చుబలియుఁ దెచ్చి యీఁగ నొల్ల కెలుఁగులిచ్చుచున్న వారు."
భార. ఆది. 6.290.
చూ. ఎలుగిచ్చు.

ఎలుగు సేయు
అఱచు.
"బాణహతి నెలుఁగు సేసిన..."
భాస్క. అయో. 330.

ఎలుగెత్తి
గొంతెత్తి.
"ఇవి దైత్యులమాయలు గాని బొంక బొంకని యెలుఁగెత్తి చెప్పఁగ భయం బున నమ్మకపోయె."
భార. భీష్మ. 3.135.
"వాడు ఎలుగెత్తి పిలిచినా పలుక లేదు."
వా.

ఎలుగెత్తి యేడ్చు
గొంతెత్తి యేడ్చు.
"ఎలుఁగెత్తి యేడ్చుఁ దనకుఁ దొలు, సమరత నిక్క మైన దురపిల్లు."
ఉ. హరి. 5.85.

ఎలుక మీద పిల్లి పిల్లి మీద ఎలుక వేయు
టాలాటోలి చేయు.
"వా డేదో ఎలుకమీద పిల్లీ, పిల్లిమీద ఎలుకా వేసి బతుకుతూ ఉంటాడు."
వా.

ఎలుకల కోర్వలేక యింటికి చిచ్చు పెట్టినట్లు
చిన్న బాధను తొలగించుటకై పెద్దనష్టము తెచ్చుకొను.
మానిసీ. 39.

ఎలుకల నడిచినట్లు
యథేచ్ఛగా.
గొడ్డును బాదినట్లు; కుక్క లను కొట్టినట్లు అను నేటి వాడుక ఈ అర్థం లోనిదే.
"తలర సాధులను సదస్యుల మునుల, నెలుకల నడచిన పొలుపున నడవ."
పండితా. ప్రథ. వాద. పుట 693.

ఎలుక వేట కుక్కమతిండి యేల?
ఎలుకను వేటాడుటకు కుక్క కావాలా? అల్ప మైనపనికి

పెద్దప్రయత్న మెందుకు? అనుటలో ఉపయోగించే పలుకుబడి.

కమా. 2.60.

చూ. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం.

**ఎలుగించు**

పిలుచు.

"ఉచ్చుచ్చురే శంకరోచ్ఛిష్టభోగి ... అని యిటు లెలుఁగించునమ్మాత్ర లోన." బస. 7.183.

**ఎలుగుబంటి క్షవరం**

తెగనిది, అసాధ్య మైనది. ఎలుగుబంటికి ఒళ్లంతా వెంట్రుకలే కనక ఎక్కడని క్షవరం చేయడం సాధ్యం? దానిపై వచ్చినపలుకుబడి.

"ఇదంతా తప్పులతడక. దీనిలో సవరణలు ఎలా సాధ్యం? ఎలుగుబంటి క్షవరంగా తయారవుతుంది." వా.

**ఎలుగుబంటి తంటసంపని**

అసాధ్యము.

ఎలుగుబంటిమీద ఉన్న వన్నీ వెంట్రుకలే కనుక తంటసంతో ఒక్కొక్క వెంట్రుక లాగివేయడం అసాధ్యం. అందుపై వచ్చినపలుకుబడి.

చూ. ఎలుగుబంటి క్షవరం.

**ఎల్ల**

ఏడుగడ. సీమాంతం. అంత కంటెగొప్పది, ఆవల లేదనుట.

"ఎల్ల పర్వతముల కెల్ల తీర్థముల కెల్ల యై." పండితా. ద్వితీ. పర్వ. పుట 250.

**ఎల్లచోట తామ యగుచు**

అన్నిచోట్ల తామే అయి. అంతట తిరుగుచు అనుట.

"చూపుదనుక నెల్లచోటఁ దోఁటయందు దామ యగుచు." పారి. 3.51.

**ఎల్లనాడు నేనాడు**

ఎల్లప్పుడు. నొక్కి చెప్పుటకై రెండు రకాలా చెప్పడం.

"నాఁడు నేఁ డన కెల్లనాఁడు నేనాఁడు." పండిత. ద్వితీ. పర్వ. పు. 236.

చూ. నాడు నేడనక.

**ఎల్లి వెంటల**

అన్నివిధాల.

"ఎల్లవెంటలం జెడితిమి." హర.3.15.

**ఎల్లిద మగు**

చులకన అగు.

"నీ కింతభయంబు లేకడుగ నెల్లిద మైతిమె మాట లేటికిన్." మను. 2.41.

**ఎల్లిదము చేయు**

చులకన చేయు.

"వాని కే నిపుడు ప్రేమం బంపినన్ దీని నెల్లిదముం జేసినజాడ దోఁచు నాకా." పారి. 1.54.

**ఎల్లి నేటను**

ఇటీవల, ఇంతలో, ఈ రోజులలో.

ఇది తెలంగాణాలో 'ఇయ్యాల రేపు' (ఈవేళ, రేపు) అనే

రూపంలో రోజూ వినబడే మాట.

రాయలసీమలో దాదాపు ఇదే అర్థంలో 'రేప ఎల్లుండిలో అతను రావాలి మరి' అని తఱుచు వాడుక.

"ఎల్లి నేటన భవదగ్రవీధికి గడారప టుండిటు వచ్చు." పాండు. 4.61.

చూ. నేడెల్లి.

"ఇయ్యాల రేపు హైదరాబాదులో తెలుగు మాట్లాడడం ఎక్కువయింది." వా.

## ఎల్లి నేటిలో

త్వరలో.

"నిర్ణయ మాన్ప పాలునకు నీకును, సంగతి యెల్లి నేటిలో."

నైష. 2.59.

చూ. నేడెల్లి.

వాడుకలో - ఇదే అర్థంలో ఇలా వాడుతారు. "వాడు ఉత్తరం రాశాడు. ఈవాళ రేపట్లో రావాలి మఱి."

## ఎల్లి ప్రొద్దు చనునే యాలంబునం దొట్టులన్

వట్టిమాటలతో కుదరదు.

యుద్ధంలో ఎంత సేపూ ఒట్లు వేసుకోవడంతో బీరాలు పలకడంతో సరిపోతుందా? సరిపో దనుట.

కుమా. 8.139.

## ఎల్లుండి ప్రొద్దున ఏకాదశినాడు

అనిర్దిష్టదినమును పేర్కొను నప్పుడు ఉపయోగించే పలుకుబడి.

"ఎల్లుండి పొద్దున ఏకాదశినాడు వాడు మాయింటికి వస్తాడు." వా.

## ఎవడు పట్టితే వాడు

ప్రతివాడు.

"ఈ పనిని ఎవడు పడితే వాడు చేస్తాడు." వా.

## ఎవరికి వారే యమునాతీరేగా

ఒకరి కొకరికి సంబంధము లేకుండా.

"వాళ్ళింట్లో అంతమంది ఉన్నా ఎవరికి వారే యమునాతీరేగా ఉంటారు." వా.

## ఎవరి ముక్కులో పెడదా మని?

ఎవరికీ చాల దనుట.

"ఇంట్లో పదిమంది ఉంటే అరవీశె వంకాయలు తెచ్చారే. ఎవరిముక్కులో పెడదా మని." వా.

## ఎవరు తిన్నట్టు?

దీనివల్ల ఎవరికీ ప్రయోజనం లేదు అనుపట్ల ఉపయోగిస్తారు.

"ఆకాస్త గడ్డకోసం కోర్టులకు వేలు గుమ్మరించడం ఎందుకో? ఎవరు తిన్నట్టు?" వా.

## ఎవ్వరి కెవ్వరు? దేని కేది?

నీకూ నాకూ సంబంధం లేదు.

నీ వెవరో నే నెవరో అనుట.

"ఏ, నెవ్వతె నీ వెవండ విఁక నెవ్వరి కెవ్వరు దేని కేది..." రాధి. 4.69.

## ఎవ్వరు దిక్కు?

సహాయము ఎవరూ లే రనుట.

"నా కెవ్వ రిcక దిక్కు నలినాయ తాక్షి ?" ద్విప. కల్యా. 138.

ఎవ్వరు ముట్టని ఎముక

నిరుపయోగ మయిన దనుట.

విశ్వనాథ. శత. 13.

ఎసక మెసగు

ఒప్పు.

"వేంకటేశునగరు దాc జేరి యింపె సక మెసcగ." కళా. 2.130.

ఎసపోయు

రెచ్చగొట్టు.

"రాఘవాళీలకో పాగ్ని నెసపోయు పవనుని యెన్నిక." వర. రా. కిష్కిం. పు. 417. పం క్తి 13.

ఎసరుపెట్టు

ఎవరినష్టానికో ఎత్తులు వేయు.

"మామగారికి అప్పుడే అల్లుడు ఎసరు పెట్టాడు." వా.

ఎసరెత్తు

ఎసరుపెట్టు.

"కొసరుచు నాతోc గూటమి సేసే, యెస రెత్తకుమీ యింకాను." తాళ్ల. సం. 12.276.

చూ ఎసరు పెట్టు.

ఎస రెత్తుకొను

ఎసరు పెట్టు.

"ఎసరెత్తుక వెళ్లే వని తోలక, పస దన విధి గలపాటే సుఖము." తాళ్ల. సం. 9.256.

ఏండ్లు పూండ్లు

చాలా కాలం అనుట. జం.

"...ఎఱుకలు గట్టుకొన్న మతి యేండ్లును బూండ్లును బట్టు..." మను. 1.73.

"భోగింపcగ సీమ కేండ్లపూండ్లకుc జాలుcగా." పాంచా. 4.

"నావుడు ముట్టిన జగడం, బీ వేళ నె తీర్పవేని యేండ్లం బూండ్లcగా, నీ వేమి తీర్చె దనుటయు." జైమి. 4.68.

ఏండ్లు పూండ్లు పట్టు

చాల కాలము పట్టు.

చూ. ఏండ్లు పూండ్లు.

ఏం డ్లెగసన బుద్ధి దిగసన

ఏం డ్లొచ్చే కొద్దీ తెలివి తక్కు వవుతున్నది అనుట.

సింహా. నార. 19.

ఏ అంగూ లేదు

ఏ సహాయమూ లేదు.

"వాడికి ఏ అంగూ లేదు. వాడికి పిల్ల నిచ్చి ఏం ప్రయోజనం ?" వా.

ఏకట దీరు

తృప్తి తీరు.

"వేcకపుc దలcపుల వేంకటేశ ! నీ యేcకట దీఱద యింకాను." తాళ్ల. సం. 12.276.

ఏకతాళప్రమాణము

ఒక తాడి యెత్తు.

ఎత్తును, లోతును కొలిచే టప్పుడు మనుష్యప్రమాణ ములతో నిలువు లన్నట్లే తాటిచెట్లతో కూడా లెక్క పెట్టి చెప్పుట అలవాటు.

"మ్రాను మాటుగ నెగయ గోమాయు వవ్వు, దేశతాళ ప్రమాణ మల్లెగసి కూన...." హంస. 1. 193.

**ఏకభుక్తము సేయు**

ఒక్కప్రొద్దుండు. రాత్రి భోజనము మానివేయు.

"దశమినాఁ డేకభుక్తము సేసి యవలి నాఁ డోర్చి." ఆము. 4.50.

**ఏకయి వచ్చి మేకయి బిగియు**

మెత్తగా వచ్చి చేరి తుదకు తానే అధికారిగా ప్రవర్తించు.

"వాడు ఏకయి వచ్చి మేకయి బిగుసుకున్నాడు. ఇప్పుడు ఆ ఊళ్లో వాడి పేరంటే హడలు." వా.

చూ. ఏకు మేకగు.

**ఏకరాత్రవివాహం**

ఒకనాటి పెండ్లి.

పంచరాత్రవివాహం, త్రిరాత్ర వివాహం, ఏకరాత్ర వివాహం – ఇవన్నీ ఆ పెండ్లి జరిగే రోజులనుబట్టి వచ్చిన మాటలు.

"ఈ కరువురోజుల్లో ఏకరాత్రవివాహమే మంచిది." వా.

**ఏకవచనప్రయోగం చేయు**

చులకనగా పిలుచు.

పెద్దలను 'మీరు' అన్నట్లు పలకరించడం మర్యాదగా అలవాటయినది. ఏకవచన ప్రయోగం తద్విరుద్ధముగా యేర్పడినది. కాని పశ్చిమాంధ్రంలోనూ, దక్షిణాంధ్రంలోనూ ఏకవచనప్రయోగం తరుచుగా వినబడుతుంది. అది అక్కడ అవమానసూచకం కాదు.

"ఏకవచనప్రయోగం చేశావంటే మాట దక్కదు." వా.

**ఏకవాక్యముగ**

ఏకగ్రీవంగా.

"అందఱు నేకవాక్యముగ నిట్లనిరి." వర. రా. అయో. పు. 251. పం. 9.

**ఏకశయ్య నుండు**

జతకలిసి యుండు.

"తనర నానృపు కరసలిఁ బట్టి తివియ, నేకశయ్యను వార లిరువురు నుండ." ద్విప. జగ. పు. 200.

**ఏకాంత మాడు**

మంతన మాడు.

"సుగ్రీవుఁ డేల నాతోడ మున్నేకాంత మాడె." వర. రా. సుం. పు. 49. పంక్తి. 14.

**ఏకాంత మిచ్చు**

రహస్యముగా మాటలాడుటకు వీలు కల్పించు.

"ఇట్లు గోవిందుఁ డేకాంత మిచ్చి వినఁగ." ప్రభా. 2.21

**ఏకాక్షరప్రయోగం చేయు**

చులకనగా పిలుచు.

"ఏరా ఊరకన్నా వని ఏకాక్షర ప్రయోగం చేస్తావా? చాలా దూరం వెళ్ళిందే వ్యవహారం." వా.

ఏకాతపవారణముగ

ఏకచ్ఛత్రముగా.

అడ్డు లేక అనుట.

కాశీ. 4.177.

ఏకాధ్వరమాధుకరంగా

చాలీ చాలక.

"ఈ సంసారం ఏకాధ్వరమాధుకరంగా ఉంది." వా.

ఏకాడికి

ఎంతకు, ఏమాత్రానికి.

ఎంతడబ్బుకు అన్నమాట.

కొత్త. 12.

ఏకారిగొట్టు

ఒక దెబ్బ.

ప్రతిదానికోసం వేకారే వాడనుట.

ఏకార్ణవముగా

జలమయముగా; ఎక్కడ చూచినా నీళ్ళుగా.

దీనిని భూమి-దాని పర్యాయ పదాలతో చేర్చి ఉపయోగిస్తారు.

"ఏకార్ణవంబుగా హెచ్చి వర్షించి." పల. పు. 12.

"భూమి అంతా ఏకార్ణవ మయిపోయింది." వా.

"ఎక్కడ చూచినా ఏకార్ణవంగా ఉంది. ఏం వానలు! ఏం వానలు!" వా.

ఏకాహబ్రాహ్మడు

నిరసనగా అనుమాట.

ఏకాహాలలో బ్రాహ్మణార్థం ఉండేవాడు. అది కొంచెం నీచం అనే భావంపై యేర్పడినపలుకుబడి.

ఏకాహం అంటే మృతునకు పదకొండోరోజు చేసే శ్రాద్ధకర్మ.

"ఆ ఏకాహబ్రాహ్మడే దొరికాడూ నీకు?" వా.

చూ. ఏకాహము.

ఏకాహము

మృతులకు పదకొండోరోజు చేసే కర్మ.

చూ. ఏకాహబ్రాహ్మడు.

ఏకి కాకుల కిచ్చు

చించి చెండాడు.

తుత్తుమురు చేసి కాకులకు వేయు అనుట.

"కండలు తనవింట నేకి కాకుల కిచ్చెఁ." కళ. 5.76.

ఏకు మేకగు

మెత్తనివాడే క్రూరుడగు.

సులువుగా తీరునది గండ్ర గొయ్యగా తయారగు.

"కాన వివరించితిని మీఁదికార్యమెట్లు, చక్క చేసెదొ నీయంత నిక్కులాట, మేళగాఁ డెవ్వఁడిది మీఁదుమిక్కిలైనఁ, దీర్పరా దేకు మేకైన దేవదేవ!" వెంకటే. 2.21.

"ఏదో పని నేర్చుకుంటా నని వచ్చినాడు ఏకు మేకై కూర్చున్నాడు. నాకే ఉద్వాసన చెప్పేట్టున్నాడు." వా.

**ఏకులకు వాడి పెట్టు**

శక్తిహీన మైనదానిని అతి శక్తివంత మని చెప్పడం.

ఏకులు అతి మెత్తనివి. వానికి పదును పెట్టడం ఎలాగూ సాధ్యం కాదు.

"నాకు లభీక దానవగణంబులలో సరి పోలువారె వీఁ, డేకుల వాఁడి పెట్టఁ దనయెదురు దాను నిటుండె వీని ము, న్నేకత మంత మజ్జుని ఘుంటికి నంచు..." కకు. 5.45.

**ఏ గాలికి ఆ చాప యెత్తు**

సమయానుకూలముగా ప్రవర్తించు.

"ఏ గాలికి ఆ చాప యెత్తితే అందరూ బాగానే ఉండవచ్చు." వా.

**ఏగుదెంచు**

వచ్చు.

పాండు. 1.179.

**ఏ చెట్ల గట్టితివి**

వాణ్ణి ఎక్కడ వదిలివేశావు అను సందర్భంలో ఉపయోగించేపలుకుబడి.

వాడుకలో "వాణ్ణే చెట్టుకు కట్టేసి వచ్చావే?" అనగా దిగవిడిచితి వనుట.

"అతని నే చెట్ల గట్టితి వీతఁ డెచ్చోట లంకించుకొనియె...." కళా. 3.268.

**ఏట పెంచువాని పూట పెంచు**

అత్యాదరముతో పెంచు.

...ఏడాదిలో పెరగవలసినంత ఒక పూటలోనే పెరుగునట్లు చేయు.

"ఇట్లు తల్లిదండ్రు లెంతయు గారాన, నేటఁ బెంచువానిఁ బూటఁ బెంచి..." సారం. 1.52.

**ఏట వేయు**

భారము వేయు.

ఏట = బలిపిల్ల - మేక అనే అర్థం ఉంది. తద్వారా ఏట వేయు = బలి యిచ్చు = మొక్కుబడి చెల్లించు తొలి అర్థం కావచ్చును.

అర్థ మింకనూ విచార్యము.

"వేగి లేచి సంసారవిధులకే ఒడిగట్టి, యేగతిఁ గొసరి నీపై నేట వేసేము." తాళ్ల. సం. 10.2.

**ఏటావలిగిలిగింతలు**

అలభ్యములు.

ఏటికి అటువే పున్నసంబరాలలో ఎలాగూ పాల్గొనడం అసంభవం. దాటరాని ఆటంకంగా ఏరు ఇక్కడ ప్రసక్తం.

"కలువలు కిలకిల నవ్వేన్, దొలిమల సెలయేటి యవలి తుహినాంశుకరం, బులు గని యిపు డేటావలి, గిలిగింత లటంచు వానికిన్ సరి దాఁకెన్." సారం. 2.161.

**ఏటికి ఎదురీదు**

జనాభిప్రాయానికి వ్యతిరేకముగా నడుచు.

"ఈ కాలంలో కులాలు మతాలు పాటించడం ఏటికి ఎదురీదడమే." వా.

చూ. ఎదురీత.

ఏటికి చంపెదవు

ఎందుకు బాధిస్తావు?

చంపు అన్నమాట వేధించు అనే అర్థంలో విశేషంగా వినవస్తుంది

"ఈ కడమాటల, నను నేటికి చంపెదవు వినన్ రైఁపవు." కళా. 4.73.

"ఎందుకు రా? ఊరికే నన్ను చంపుతావు? నాకు చేత నైతే చెయ్యనూ?" వా.

"ఎక్కడైనా ఉద్యోగం ఇప్పించమని నన్నెందుకు చంపుతావురా?" వా.

"చంపేశాడురా వాడు" వా.

చూ. చంపుక తిను.

ఏటికి నెత్తిగొట్టుకొనగా

ఆవన్నీ యెందుకు అని నిరసనగా అనుట.

"ఏటికి నెత్తిఁ గొట్టుకొనఁగా సన్న్యాసమున్ న్యాసమున్." పాండు. 4.98.

"అవన్నీ ఎందుకు తెచ్చావు? నెత్తిన కొట్టుకోడానికా?" వా.

నేటి వాడుకలో:

"అవెందుకు? నెత్తిన కొట్టుకోనా?"

ఏటికోళ్లు

నమస్కారములు.

"దైవంబుల కేటికోళ్ళు."

భార. ద్రో. 2.347.

"ఏటికోళ్లు సమర్పించి." భీమ. 2.101.

ఏటిదరిమ్రాను

సన్నిహితప్రమాద మయినది. ఏటిగట్టున ఉన్న చెట్టు ఏ నిమిష మైనా పడిపోవచ్చు గదా—ఏరు గట్టును కోసి వేస్తుంది. గనుక.

"నా మాట లెల్ల నయ్యెడ, శ్యామా! చెవుడునకుఁ బట్టు శంఖము లయ్యెన్, నీ మగని రాజ్యవిభవో, ద్దామము దల పోయ నేటిదరిమ్రా నయ్యెన్."

నలచ. 5.142.

ఏటిలోపలి ఊచు

కనబడని ప్రమాదము.

రామలిం. 31.

ఏటిలో పైరు

అశాశ్వతము.

ఎంత బాగా పంట పెట్టినా ఏటిలో పంట ఎప్పుడు ఏరు వచ్చినా కొట్టుకొని పోయేదే కదా!

తాళ్ల. సం. 11.3 భా. 150.

ఏటుపోటుతల

యుద్ధభూమి.

"...ఇవి యేల రిత్తమాట లేటుపోటు తలకు వచ్చి..."

భార. కర్ణ. 3.197.

ఏటుపోటుమాట లను

దెప్పి పొడుచు.

"ఆ ఆడపడుచు అనుక్షణం ఏటిపోటు మాట లంటూ ఉంటే, ఆ కోడలు కాబట్టి ఓర్చుకుంటూ ఉంది." వా.

ఏటుపోటులు

దెబ్బలు.

ఏటులు – పోటులు. జం.

"పాయ ల్వాఁతియు నేటుపోటుల భయభ్రాంతంబు లయ్యున్."

కా. మా. 2.44.

ఏటేట
ప్రతిసంవత్సరము
ఇక్లే 'ఏటా' అని కూడా.
"ఏడనెడ సౌరాష్ట్రి మేఁగి యేఁటేటఁ
గడునర్థితోడ జాగరము సెల్లించు."
బస. 6.168.
"నేఁబోదు మల్లయ్య నేటేటఁ గొలువ."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 374.
"ఏటేటా స్వామికి ఉత్సవం జరుగు
తుంది." వా.

ఏత్రింతరాయబారము
గొప్ప పనికి అల్పుల ప్రయ
త్నము.
ఏత్రింత ఎంత చిన్న పిట్టో
ఏనుగ అంత పెద్దది
చూ. ఏనుగ మైథునానికి ఏత్రింత
రాయబారము. సా.

ఏడ కేడ
నేటిరూపం ఎక్కడి కెక్కడ.
దానికీ దీనికీ సంబంధమే
లే దనుట.
"దాని కేటి వీనితగు లేడకే డంచు."
పాణి. 2.109.
"నువ్వేదో మహా చెప్తావు. వాడికీ వీడికీ
ఎక్కడి కెక్కడ?" వా.

ఏడాకు లెక్కువ చదువు
ఎక్కువ నేర్పరి యనుట.
వానికంటె, దానికంటె అనే
మాటవంటి దేదో ఈ పలుకు
బడికి ముందు ఉంటుంది.
"ఏరాజు వితరణస్మృతిలోనఁ గర్ణున
కవల నేడాకు లెక్కువ పఠించె."
శ్రీనివా. 2.41.

ఏడిపించి ఏడు చెఱువుల నీరు
త్రాగించు
నానాబాధలు పెట్టు.
"వాణ్ణి ఇంతటితో వదులుతానా? ఏడి
పించి ఏడు చెఱువులు నీళ్లు తాగి
సాను." వా.
చూ. ముప్పుతిప్పల బెట్టి మూడు చెరు
వుల నీరు త్రాగించు.

ఏడిపించుకొని యేడు చెఱువుల
నీళ్లు త్రాగించు
ముప్పుతిప్పలు పెట్టు.
"మావాణ్ణి వాడు ఏడిపించుకొని యేడు
చెఱువుల నీళ్లు త్రాగించా డంటే
నమ్మ." వా.

ఏడిపించుకొని తిను
వేధించు.
"ఆ అత్త, కోడల్ని అయినదానికీ కాని
దానికీ యేడిపించుకొని తింటూ
ఉంది." వా.

ఏడ్చి మొగము కడుగుకొనినట్లు
ఈ పని బాగా లేదు అనుపట్ల
ఉపయోగించే పలుకుబడి.
"వాడి సంగీతం యేడ్చి మొహం కడుగు
కొన్నట్లు ఉంది." వా.
ఏడ్చినతరవాత మొహం కడు
క్కున్నా నీటి చారలు
పోవడం తప్పితే నిర్మలం
గానూ అందంగానూ
ఉండ దనుటపై ఏర్పడినది.

ఏడుకట్ల సవారీ
పాడె.

పాడెకు ఏడుకట్లు కడతారు. సవారీ అంటే వాహనం.

తె. జా.

**ఏడుగడ**

దిక్కు. రక్షకుడు.

పరమ. 1.91.
చూ. ఏడ్గడ.

**ఏడుచు**

బాధపడు, అంగలార్చు.

"ఏడు దినంబు లన్నమున కెడ్డము పుట్టిన యంత మాత్రలో, నేడుచుచున్న వాఁడవు." భీమ. 2.116.

"పరీక్ష పోయిం దని ఏడుస్తా వేరా?" వా.

**ఏడుచేట్లను చెఱుచు**

అన్నివిధములా చెఱుచు.

"ఇదె మహీతల మెల్ల నేలునీరాజుఁ, జెదరక యిట్లేడుచేట్లను జెఱచి, పోనీక బంటెలఁ బొరలించి తపసి, దానవుం డై నల్ల ద్రావుచున్నాఁడు."

గౌర. హరి. ద్వి. 447-450.

రూ. ఏడు చెఱువుల నీళ్లు త్రాగించు.

**ఏడు నిలువుల మేడ**

ఎత్తైన మేడ.

ఎత్తును మనుష్య ప్రమాణంతో కొలవడంపై వచ్చినది. ఏడు నిలువు లెత్తున్న మాట. వాడుకలో నేటికీ ఉన్నది.

పండితా. క్షేత్ర. మహి. పుట. 35.

"ఏడు నిలువు లెత్తున్న దా చెట్టు." వా.

"ఏడు నిలువులలో తున్న దాబావి." వా.

**ఏడుపుమూతి పెట్టు**

అసంతృప్తిని వ్యక్తము చేయు; అలుగు.

"వాణ్ణి ఒక్కమాట అంటే చాలు. ఏడుపుమూతి పెడతాడు." వా.

**ఏడుపు వచ్చినంతపని అగు**

కన్నీళ్ళపర్యంత మగు.

దాదాపు ఏడ్చివేసె ననుట.

"నే నామాట అనేసరికి వాడికి ఏడుపు వచ్చినంతపని అయింది." వా.

చూ. కన్నీళ్లపర్యంత మగు.

**ఏడు మల్లెపూల చిన్నది**

అతిసుకుమారురాలు.

జానపద కథలలోనుంచి వచ్చినపలుకుబడి.

ఆమె యేడుమల్లెపూల యెత్తు ఉన్నది. అనగా సుకుమారురాలు అనుట.

"అయ్యో నా బతుకా! నా కోడలు పని చేసేట్టుంటే నాకీ అవస్థేమిటే కూతురా! అది ఏడు మల్లెపూల చిన్నదయి పోయెనే!" వా.

**ఏడు మ్రొక్కులు మ్రొక్కు**

అతిదీనతను కనపఱచు.

"అనఘ ఏడు మ్రొక్కులా బృహస్పతికి మ్రొక్కెద." వా.

భార. ఆశ్వ. 1.75.

**ఏడులుపట్టు**

చాలకాల మగు.

"ఇది పెక్కేడులు పట్టెన్, సదనంబులు గట్ట నాకు." కా. మా. 2.100.

"అదంతా కావాలంటే ఏండ్లు పడుతుంది." వా.

ఏడూడి

చనిపోయిన మొదటి సంవత్సరం పెట్టేతద్దినం.

సాంవత్సరికం.

ఏడేడు పధ్నాలుగు లోకాలలో

సర్వప్రపంచంలో.

"ఏడేడు పధ్నాలుగు లోకాలలో వాణ్ణి తల దన్నేవాడు ఎవడూ లేడు." వా.

"ఏడేడు పధ్నాలుగు లోకాలు గాలించినా అంత రూపసి కనబడదు." వా.

ఏడ్పు ఎదురుచూచు

నిరాశావాది, ఏడుపుగుల్లవాడు అగు.

"వా డెప్పుడూ ఏడుపు ఎదురు చూస్తూ ఉంటాడు. నవ్వుతూ తుళ్లుతూ ఉండే వాళ్లంటే వాడికి పడదు." వా.

ఏడ్పుగొట్టు

ఎప్పుడూ యేడుస్తూ ఉండేవాడు.

సర్వదా అసంతృప్తుడు.

"పొద్దున్నే ఆ యేడుపుగొట్టు మొగం చూచాను. అన్నీ అడ్డంకులే." వా.

ఏణ్ణూరు

ఏడువందలు.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 236.

ఏతన్మాత్రములు

ఇంతవి.

"మెఱవకుండిన నేమి మెఱుంగులపాలపమే, తన్మాత్రము లె శాలి ధళధళములు." పాండు. 4.42.

ఏత మెత్తు

ఏతము త్రొక్కి పైరునకు నీరు పాఱించు.

"బ్రదుకాసన్, దఱచుగ నేతా లెత్తంగс, బఱిపతి యై యతియు మల్లెపడి చెడిపోయెన్." శా. మా. 3.152.

ఏతుల బోవు

హెచ్చులకు పోవు, గర్వపడు.

"చేతులు ద్రిప్పుచుం బ్రభుల చెంతల నూరక దుర్వినీతు లై, యేతులс బోవుచుం దిరుగు నిప్పటి మంత్రులు తంత్రు లిందఱున్." పాండు. 1.78.

ఏతేరు

వచ్చు.

"ఎప్పటి మధుమాస మేతేరనృపుడు." రంగ. రా. బాల. పు. 15. పంక్తి. 18.

ఏ త్రోవ త్రొక్క వలయును?

ఏమి చేయవలెను? ఏ రీతిగా మెలగవలెను?

"తన తప్పс దప్పс జిత్తిని, వనితా యే త్రోవ త్రొక్క వలయుం జెపుమా!" శుక. 2.128.

ఏది దారి?

దిక్కు లేదనుట.

"ఇస్తా మన్నవాళ్లంతా ఎగరేశారు. రాత్రికి ఇంట్లో బియ్యపుగింజ లేదు. ఇం కేందారి రా భగవంతుడా!" వా.

ఏదీ లేక

అనుకొన్నవానిలో ఏ ఒక్కటీ లేక.

"వేవురి ముందర నాడుకొందు,

నీ వేదియు లేక సర్వగుణహీనుఁడ వౌట
యెఱుంగఁ దమ్ముఁడా!"
పాండు. 3.39.

## ఏదుపల్లువోలె

ఒంటరిగా.

ఏదుపందికి ఒకటే పల్లు ఉంటు ననుటపై ఏర్పడినది.

"మఱియు దానవసైన్యంబు మాఱులేక,
యొప్పి తప్పిన నిర్జరయోధవరులఁ
దోలి తొప్పరపెట్టి నిం(గుండు నిలిచె,
బవరమున నొక్కరుఁడు నేఁదుపల్లు
వోలె." ఉ. హరి. 1.43.

## ఏదో పేరు పెప్పి....

ఏదో ఒకరకంగా.

అది అవసరం కాకపోయినా అనుట.

"ఏదో పేరు చెప్పి తనవాళ్లు నలుగురికి
నాలుగురాళ్లు ముట్టేటట్టు చేసుకోవడం
వాడిపని." వా.

## ....ఏదో ఒకటి అయితే

ఏ అనాహూతమో సంభవిస్తే నా గతి దుర్గతి అవుతుంది అనుపట్ల ఉపయోగిస్తారు.

"తోడంబడ నితని కొక్కటి యయ్యె
నేని యే నేమి యగుదాన ననియు విచా
రించితేని..." కళా. 3.264.

"ఈ ముసలావిడ యేదో ఒకటి అయితే
నే నే మవుతాను?" వా.

## ఏ ధనంబులు పాఱ్ఱి పోవు?

ఏమి లాభము?

"వానికి మనలోడి వైరంబుఁ బూని,
పోనాడె నే ధనంబులు పాతు వోవు."
గా. వాసి. ప్రథ. పంక్తి. 719-20.

వాడుకలో రూపం :

"మనతో కొట్లాడితే వాళ్ల కేం లాభం
వస్తుంది?" వా.

## ఏనికకాడు

ఏనుగవాడు. గజసైనికుడు.

కుమా. 11.40.

## ఏనుగ నెక్కించు

గొప్ప చేయు.

"వాణ్ణి ఊరికే పొగిడి పొగిడి ఏనుగు
మీది కెక్కించారు. అంతే. పది వేల
రూపాయల విరాళం ప్రకటించాడు."
వా.

## ఏనుగు నెక్కియు దిడ్డి దూఱ దగునె?

యోగ్యతకు తగినట్టుగా ప్రవర్తించక పోయినప్పుడు ఉపయోగించే పలుకుబడి.

ఏనుగు నెక్కి వచ్చువాడు సరాసరి సింహద్వారంగుండా రాక దొడ్డిదారిగుండా ప్రవేశించుట యెందు కనుట.

"ఇటువలెఁ బల్కఁగాఁ దగునె
యేనుఁగు నెక్కియు దిడ్డి దూఱఁగన్."
రుక్మాం. 5.105.

## ఏనుగుకళ్లు

చిన్న కళ్లు.

## ఏనుగుకాలు

బోదకాలు.

## ఏనుగు గవ్వ మీటినయట్లు

ఏ మాత్రం లక్ష్యం లేనట్లు. గవ్వతో ఏనుగును కొడితే

సహజంగా అది లెక్క చేయదు కదా!

"పసిఁడి దెమ్మనుచు నేఁ బలుమాఱు వేఁడ, మిసుఁగ వేనుఁగు గవ్వ మీటిన యట్లు."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 161.62.

చూ. దున్నపోతుమీద వాన కురిసినట్లు.

## ఏనుగుతో ఏలాటము

అధికులతో చెరలాటము. కూడని దనుట. నిప్పుతో చెరలాటమువంటిది.
వేంకశేశ. 35.

## ఏనుగుదాహము

విపరీత మైనదాహము.

"నాకు ఏనుగుదాహంగా ఉంది." వా.

## ఏనుగు దిన్న వెలగకాయ

బయటికి బాగా కనిపించినా లోపల ఏమీ లేనిది. ఏనుగ వెలగపండు మింగితే లోపలి గుజ్జుమాత్రం అరిగిపోయి, కాయ అలాగే బయటికి వచ్చు నని ప్రతీతి. అందుపై వచ్చినపలుకుబడి.

"ఏనుఁగు దిన్నట్టి వెలంగకాయగతి నుందుర్ లోన లోపై బయల్ సొగసై."
నిరంకు. 3.8.

చూ. కరి మ్రింగిన వెలగపండు.

## ఏనుగునకు సిళ్లు చూపినట్లు

ఎఱ్ఱగుడ్డలు మొదలగునవి చూపి పశువులను బెదరించినట్లు, ఏనుగను బెదరగొట్టితే విజృంభిస్తుంది. బెదిరిన పశువులు విఱుచుకొని పడడం సహజం.

"అపుడు రాధేయుఁ డిమ్మెయి ననుజు పాటుఁ, జూచి యేనుఁగునకు సిళ్లు చూపినట్లు, గవిసి హయముల మత్స్యభూకాంతుతనయు, నేసి పండ్రెండు శరముల నేసె నరుని." భార. విరా. 5.84.

## ఏనుగుపండ్లు పట్టి చూచు

పెద్దవారి తప్పు లెన్ను. ప్రమాదకర మైన ఆత్మవినాశకర మైనపని చేయుపట్టుల చెప్పే సామ్యం.

"తనర నేనుఁగుపండ్లు దాఁ బట్టి చూచు, మనుజుండు బ్రతుకునే మడియు నకాక."
బసవ. 4.97.

చూ. ఏనుగుపల్లు పట్టి చూచు.

## ఏనుగు పన్నగునే గాడిదలకు ?

ఏనుగు దంతం గాడిదకు తగునా? అననురూప మైన దనుటను తెలుపు పలుకుబడి.

"పూని లింగ ప్రసాదానూనసుఖము, మానవులకుఁ బొందఁగా నెట్లు వచ్చు, నేనుంగు పన్నగునే గాడిదలకు..."
బస. 7.198.

## ఏనుగుపల్లు పట్టి చూచు

పెద్దవారి తప్పొప్పుల నెన్ను.

"పురుషుఁడు పాపకర్ముఁ డనఁ బోలదు కాంతయె కాని కాంతకుం, బురుషుఁడు కీడు చేసినను భూషణ మేనుఁగుఁ బల్లు పట్టి చూ, తురె మగవాఁడు చేసె నని తొయ్యలియుం..." వి.క్ర. 7.174.

చూ. ఏనుగుపండ్లు పట్టి చూచు.

**ఏనుగుపాడి**

సమృద్ధి.

"ఇచ్చెనా యేనుగుపాడి."

విజ. పీఠిక. 54.

**ఏనుగు పీను గగు**

బాగా దృఢంగా ఉండినవాడు చాలా చిక్కిపోవు.

"ఆ జ్వరంతో ఏనుగు పీను గయి పోయాడు పాపం!" వా.

**ఏనుగు పురు డోమ గల**

ఏనుగునకు పురుడు పోయగల.

అసాధ్య కార్యములను నెఱవేర్చుజాణ అనుట.

కుమా. 8.153.

**ఏనుగుమీద సున్న మడుగు**

తన శక్తిని మించినదానికై ప్రయత్నించు.

కొవ్వుపట్టి ప్రవర్తించు.

**ఏనుగుమీద సున్నము**

అలభ్యము.

"అతని తాంబూల గంధాస్వాప్తి యేనుఁగు, మీది సున్నం బని మేన యెంచె." కవిరా. 3.

**ఏనుగు మీదివానిని సున్న మడుగు**

అత్యహంకారంతో ప్రవర్తించు.

ఏనుగుమీద ఉన్నవాడేమో అంత ఎత్తులో ఉంటాడు. వానిని ఆకుల్లోకి సున్న మివ్వమనడం వట్టి పొగరు కాక మరేమిటి?

"వాడా అమ్మా! ఏనుగుమీదివానిని సున్న మడిగేరకం." వా.

**ఏనుగ మైథునానికి ఏట్రింత రాయబారము**

పెద్దల పనికి అల్పుల ప్రయత్నము.

చూ. ఏట్రింత రాయబారము.

**ఏనుగుల కొమ్ములు వచ్చినట్లు**

అసలే బలము కలదానికి మఱింత బలము చేకూరినట్లు.

"ఎనసి మనంబునందు సతికిం బతికిన్ వల పంకురించినన్, గొనకొని ధాత్రి నేనుఁగుల కొమ్ములు వచ్చినయట్లు లింకని, ప్పనికిఁ బ్రసూనసాయకుఁడె పెత రువు..." వైజ. 3.10.

**ఏను గెక్కినట్లు**

ఎంతో లాభం కలిగినట్లుగా.

ఎక్కువ సంతోషించు ననుట.

"వాడి కేముంది పాపం! ఒక పూట భోజనం పెడితే చాలు. ఏను గెక్కినట్లుగా సంతోషిస్తాడు." వా.

**ఏనెఱిగిన బ్రతుకే గద**

నీ బ్రతుకు నాకు తెలిసినదే కదా!

నిరసనగా అనుమాట. నేటికీ వాడుకలో ఉన్నది.

"ఏ నెఱిఁగిన బ్రతుకే గద, యీ నడనడి యెట్లు కలిగె నింతటిలోఁగా, తా నిక్షేపముఁ గంటివొ." శుక. 3.262.

"వానిబతుకు నే నెరిగిందే కదా?" వా.

ఏ నెక్కుడ తా నెక్కుడ?
నడుమ తారతమ్య మెక్కువ యనుట.
"ఏ నెక్కుడ తా నెక్కుడ, ఏ నెక్కుడునట్టి పట్ట పేనుఁగు నెక్కుఁ." ఐరావతచరిత్ర.
"నే నెక్కుడ వాడెక్కుడ! నాతో పోటీకి వస్తాడా?" వా.

ఏ నెక్కుడ నీ వెక్కుడ?
మన మధ్య తారతమ్య మెక్కువ యనుట.
"ఏ నెక్కుడ నీ వెక్కుడ, మానవ సామాన్యుఁ డనుచు మదమున నెఱుఁగం,గా నేరక..." హరి. 3.99.
"నే నెక్కుడ నీ వెక్కుడ? నాతో వాదు పెట్టుకొంటావా?" వా.

ఏ నోరు పెట్టుకొని
ఏ ముఖం పెట్టుకొని— మాటలాడగలం? అన్నపట్లనే ఉపయుక్త మవుతుంది.
"....ఇంతలేని సంసారచ్ఛేదంబులు మన యూరి పుణ్యాత్ములవలననే కదా యయ్యె నింక నే నోరు పెట్టుకొని మాటలాడుదు మనువారును...." ఉ. రా. 6.343.

ఏ పనికిని బొడ్డు వంచకుండు
ఏ పనికీ పూనుకొనక పోవు.
"....ఏ పనికైనను బొడ్డు వంప లేదు...." భోజ. 6.142.
"వాడు ఏపనికీ బొడ్డు వంచలేడు. వాడేం పనికి వస్తాడు?" వా.

ఏ పాకము పొందకుండ
పదిలము తప్పకుండ.
"తపస్వి చిత్తం బేపాకంబునుం బొందకుండ." హర. 2.128.
ఈ క్రింది భావచ్ఛాయలలో ఇది అటూ యిటూ మారుతూ ఉంటుంది.
పాకము—పరిపక్వస్థితికి దగ్గఅగా ఉన్నది.
"వాని మనసు ఏపాకాన ఉందో యేమో! నామాట కంగీకరించాడు. నిజానికి వాడు బ్రహ్మ చెప్పినా వినే వాడు కాదు." వా.
"వాడి మనస్సు మంచి పాకాన ఉన్నప్పుడే ఈపని కాస్తా సరి చేసుకో."
"ఏమిటి? అలా కసురుకుంటావు? నీ మనసు ఏ పాకాన ఉం దేమిటి?" వా.

ఏపాటి
(అది) ఎంత?
కాశీ. 7.129.
"వాడికి పదిరూపాయలు విరాళ మివ్వడం ఏపాటి?" వా.

ఏ పాపపువేళ చూచితినో?
ఏ దుర్ముహూర్తంలో చూచానో?
ఏదైనా పని జరిగిన తర్వాత దుష్ఫలిత మేర్పడగా అను మాట. కొన్ని వేళల్లో చేసిన పనికి దుష్ఫలితము తప్ప దన్న జ్యోతిశ్శాస్త్రవిశ్వాసంపై ఏర్పడిన పలుకుబడి.
"నీపై కోరికె మరల్చి నిధిపతిసుతు నే పాపపు వేళను జూచితినో..." కళా. 4.23.
"ఈ పని ఏ పాపపు వేళ మొదలు

పెట్టానో కానీ, ఎంత డబ్బు ఎదురు పెట్టినా పూర్తి కావడం లేదు." వా.

## ఏ పాప మెఱుగని

అమాయక మైన, నిర్దోషి అయిన.

"పాదముల వ్రాలి నే నేమి పాప మెఱుఁగ, నీ మహాదేవు నాన పూర్ణేందు వదన!" శుక. 1.543.

"ఏనాఁటి కేపాప మెఱుఁగని కన్నుల, కిడియెఁ గాటుక రేఖ లేపు గులుక." హంస. 3.75.

## ఏపారు

వర్ధిల్లు; ఒప్పు.

"ఏపారి పర్వీజనుల్." సింహా.12.111.

"భూలోక దేవేంద్రుపగిది నేపారి, యున్నచో." రం. రా. బాల. పు. 4. పం. 2.

## ఏ పుట్టలో ఏ పా ముందో ?

పైకి కనిపించక పోయినా ఎవరిలో ఎంత పాండిత్యం ఉందో? ఎవరిలో ఏం గుణాలు ఉన్నాయో? ఎలా తెలుస్తుంది అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"చూడానికి అమాయకంగానే ఉన్నాడనుకో. అయినా ఏ పుట్టలో ఏ పాముందో?" వా.

## ఏపు మాపు

నశింపజేయు.

రూపు మాపు లాంటిది.

హర. 7.154.

## ఏపుమాపు సేయు

నశింప జేయు.

"మరు బాణముల నేపు మాపు సేయఁగ నోపు." రుక్మాం. 2.125.

## ఏపు మాయించు

గర్వ మడచు,

"పదవిని దండ్రిచే బలిమిని గొన్న, యెదిరిని కంసుని యేపు మాయించి." ద్విప. మధు. 4.

## ఏపు మిగులు

ఎక్కువగు.

"వ్యాఘ్రాదు లైన క్రవ్యాద హింస్ర మృగంబు, లెచ్చోటఁ జూచిన నేపు మిగిలె." కాశీ. 5.268.

## ఏపు మీఱు

ఒప్పు.

"రామాయణ ద్విపద యేపు మీఱంగ, రచియింపుము." వర. రా. బా. పు. 5. పంక్తి. 20.

## ఏపు రేగు

1. విజృంభించు.

"ఏలికలు వెంట వెస నంట నేపు రేఁగి." శుక. 1.259.

2. రెచ్చిపోవు; చెలరేగు.

"ఇటుల మద మెత్తి తమిచేత నేపు రేఁగి." హంస. 2.195.

"ఎగయు ధరఁ ద్రవ్వు బొఱియఁగా నేపు రేగి...పంది మెల్లన రణపరిపంథి యగుచు." భాగ. స్క. 3.637.

"దుష్ట సత్త్వముల్, ధారుణి నేపు రేఁగి బెడిదంబుగ మూఁకలు గట్టి గ్రామముల్, మారి మసంగిన ట్లయి సమస్తముఁ జూర్ణము చేసినప్పుడు." రుక్మాం 3.79.

## ఏ ప్రొద్దు

ఎల్లప్పుడు; ప్రతిదినం.

"అనఁగ నే ప్రొద్దు గుణముల నతిశ యిల్లి." శివ. 1.18.
"జగతిఁ గళావతిసంజ్ఞ నొప్పెడివీణె, తోడ నే ప్రొద్దును దుంబురుండు..." కళా. 2.63.

**ఏ బ్రతికితిని**

ఇక పరవాలేదు అన్న అర్థం లో ఉపయోగించే పలుకుబడి. వాడుకలో 'అబ్బ! బతికి పోయాను (పోతిని)' అని వ్యవహారం.

"అని అనియు ననక మును పే, యనఘా! యే బ్రతికితిని మదన్వయ మిది పావన మయ్యె ననుచు... శుక. 2.165.

ఈ అర్థంలోనే కాక తప్పించు కొని పోతివి అన్న అర్థంలో— నే నా రోజు అక్కడ లేను. నువ్వు బతికిపోయావు — అని కూడా మధ్యమ పురుషలో వ్యవహరిస్తారు.

**ఏబ్రాసి**

వెధవ. ఒక తిట్టు.
చూ. ఏభ్యరాశి.

**ఏభ్యరాశి**

ఏబ్రాసి.

"ఈ క్రూరకర్మున కీ యేభ్యరాశికి." గా. హరి. ద్వితీ. పంక్తి. 828.
చూ. ఏబ్రాసి.

**ఏ మంటే యే మవుతుందో!**

ఏదైనా అనవలసినప్పుడు ఫలి తమునుగూర్చి శంకించుటను తెలుపుపలుకుబడి.

"ఎద్ది యాడఁ బోవంగ నెల్లెనో యనుచుఁ బలికె." కళా. 5.108.
"పెద్దవాళ్లతో పని. ఏ మంటే ఏ మవు తుందో! మా నంగా ఉండడమే మంచిది." వా.

**ఏ మన నో రున్నది?**

నే నేమీ అనలేను. నే నే మనుటకూ ఆస్కారం లే దనుట.

"అన నయ్యంగన నా కేమన నో రున్న యది..." కళా. 3.191.
"వాడు మంచివా డని చెప్పి నే నే పంపించాను. వా డేమో నీకు చెడుపు చేశాడు. నీవు తీసివేశావు. ఏ మనడానికి నాకు నో రుంది?" వా.

**ఏ మని చెప్పుదును?**

వర్ణింప నలవి కా దనుట.

"అమ్మా! ఏమని చెప్పుదు." పారి. 1.75.
"పట్టనం బెంత కృతార్థతం బొరసె, నే మని చెప్పు మదీయభాగ్యముల్." కా. మా. 4.199.

**ఏ మన్నా పడవలసినదే**

తల ఒగ్గి ఉండక తప్ప దనుట.

"మీ కింద నౌకరీ చేసుకోవడానికి వచ్చాను. మీ రేమన్నా పడవలసిందే." వా.

**ఏమఱించు**

మోసగించు.

ఇది నేఁడు దక్షిణాంధ్రసీమలో వాడుకలో ఉన్నది. "వాడు నన్ను ఏమార్చినాడు." అఱవం—ఏమాత్రటం.
పండితా. ద్వితీ. మహి. పుట. 215.

"ఏమతించి కృష్ణుఁ డింట్లలోఁ జొరబడి, యున్నపాలు పెరుఁగు వెన్న నెయ్యి, కొల్లలాడుచుండ..." రాధా. 1.19.

## ఏమి అని అడిగేవాడు లేడు

ఒకరికి సంజాయిషీ యివ్వవల సిన అవసరము లేదు అనుట.

"ఎచట నుండిన నింట నే మనువాడు లే, కింపు సొంపు ఘటిల్లనిల్లు గలిగె." శుక. 3.600.

"ఆ యింట్లో వాడు ఏం చేసినా ఏమి అని అడిగేవాడు లేడు." వా.

అనగా వాడు సర్వస్వాతంత్రు డనుట.

## ఏమి ఒరిగింది?

ఏమి లాభం వచ్చింది ?

"నామీద అంత దుష్ప్రచారం చేశావు కదా? నీ కేం ఒరిగింది?" వా.

"నీకు చెరుపు చేస్తే నాకు ఒరిగే దేముంది?" వా.

## ఏమి కట్టుకొనును?

దీనివల్ల వాని కేమి లాభము వచ్చెను ?

దీనివల్ల వచ్చినలాభ మేమిటి? అనవసరంగా ఇతరులను బాధ పెట్టడం తప్పితే–అను పట్ల ఉపయోగించే పలుకు బడి.

భార. ద్రో. 3.295.

"కైక దీన నేమి కట్టుకొనియె." భాస్క. అయో. 199.

"వాణ్ణి నువ్వంతగా యేడ్పించి కట్టు కొన్న దేముంది?" వా.

"నన్ను చెరిచి నువ్వేం కట్టుకొం టావు?" వా.

"అందర్నీ తిట్టి అదేం కట్టుకొం టుంది?" వా.

## ఏమి కర్మమో !

అదేం ఖర్మో – అదేం దుర దృష్టమో.

"ఆమట పదిట లింగార్చకుం డనెడు, నామంబు వినరాద దేమి కర్మంబొ?" బస. 6.155.

## ఏమి కొంప మునిగింది?

ఏమి పోయింది ?

"వాడు రాకపోతే పోయాడు. ఏం కొంప మునిగింది." వా.

చూ. ఏమి మాడెను?

## ఏమి గహనం ?

అదెంత పని? అదేం మహా ఘనకార్యం?

"నా కిష్టం బైనవరంబు...దివ్యాస్త్ర లాభం బనిన నది యేమి గహనంబు దానిన యిచ్చెద." భార. అర. 1.293.

"అప్పని గైకొని నాకది యేమి గహనం బని."

కుమా. 4.52.

చూ. అదేం గగనం?

## ఏమి చూచి (చూచుకొని)....

ఇలా ప్రవర్తిస్తున్నావు. అంతకు తగినకారణ మేదీ లేదే అనుట.

"ఏమి చూచుకొనో వాడు మహా మిడిసి పడుతున్నాడు." వా.

"ఏమి చూచి వాడికి పిల్ల నిమ్మంటారు?" వా.
"ఏమి చూచి నన్నింత చులకనగా చూస్తావో నాకు బోధపడడం లేదు." వా.

ఏమి చెప్పను?
ఏ మని చెప్పగలను.
అనిర్వర్ణనీయ మనుట.
"...వాని భుజ ప్రతిభా విశేషముల్, మానిని యేమి చెప్ప నసమానము లౌను దదీయవైఖరుల్." హంస. 3.15.

ఏమి చెప్ప పని యున్నది?
చెప్పవలసిం దేముంది?
ఇది అంత స్పష్ట మైనవిషయం అన్నసందర్భంలో ఉపయోగిస్తారు.
"బలభేదన యేమి చెప్పఁ బని యున్న దిఁకన్." నిరంకు. 4.31.

ఏమిటి వారు
ఎవరు?
"సుతవైభవము నీవు చూడంగవలయు, నితరు లందఱుఁ గూడ నేమిటివారు?" వర. రా. బా. పు. 204. పంక్తి. 15.

ఏమి తగవు?
ఏమి న్యాయం? .
"విలయశిఖినేత్రుకడ కగ్ని, దేల పోవుఁ బంపు దేమి తగవు?" కుమా. 9.159.

ఏమి త్రవ్వి తల కెత్తినారు
వారు చేసిన మహా సహాయం ఏమిటి అనే అర్థంలో ఉపయోగిస్తారు. ఏమి అటూ యిటూ కూడా మారవచ్చును. సాధించిన దేమిటి అన్న అర్థమూ కలదు.
"తమకు నేమి త్రవ్వి తలకెత్తి రమరులీ, యుర్వి మనుజు లేమి యొసఁగ రైరి, నింగి వారసతుల నిర్మాతృకలఁ జేసి, పుడమి మాతృభూతముల సృజించె." వైజ. 3.22.
"నువ్వు ఇన్నాళ్లూ ఈ ఊళ్లో ఉండి త్రవ్వి తల కెత్తిం దేమిటి?" వా.

ఏమి దొడ్డు?
ఏమి గొప్ప?
"విఖ్యాతమహాప్రతాపునకు నద్రిగుహాలయ మేమి దొడ్డు?" కా. మా. 3.208.

ఏమి పుట్టునో?
ఏ మవుతుందో—అనగా ఏదో అనర్థం కలుగ నున్న దని సూచించు పలుకుబడి.
"ఈ యెడ నేమి పుట్టునో సహింపఁగ రాదు విచార మంచు నా,థా! యిఁక నేమి..." శుక. 3.150.

ఏమి పెద్ద!
అదేమి గొప్ప.
సామాన్య మనుట.
భార. అర. 3.170.

ఏమి పొయ్యేకాలం?
ఇంత దుర్బుద్ధికి కారణం ఏమి అనుపట్ల ఉపయోగిస్తారు.
"వాడి కేం పొయ్యేకాలం? పెళ్లాన్ని వదిలిపెట్టడానికి?" వా.

ఏమి మాడెను?
ఏమి కొంప మునిగింది?

"జడనిధి చందంబున ని, మ్రాకు వొప్పఁగ నిప్పు డేమి మాడెను నిమ్ముఁ, నడచిపడ రిత్త నెవ్వగ, లుడుగుఁడు మఱి చూచుకొందమెయ్యాన తఱి తోన్." భార. శాంతి. 3 ఆ.

చూ. ఏమి కొంప మునిగింది?

**ఏమి మునిగి పోయినది?**

ఏమి కొంప మునిగింది అనుట వంటిది.

"మునిఁగి పోయిన దేమి యిమ్ముగుద తల్లి...." పాణి. 3.66.

**ఏమి యిచ్చి యైన**

ఎలాగో ఒకలాగ, ఏదో విధంగా ఏదో యిచ్చి.

"ఇది మఱవఁ జేయఁ దగు నేమి యిచ్చి యైన ననుచు..." కళా. 5.138.

**ఏమియు నెఱుగని**

ఏమీ తెలియని, అమాయక మైన.

"ఇల్లాలు గడు సాధ్వి యేమియు నెఱుఁగదు." నైష. 1.108.

"ఏమీ యెఱుగని పిల్ల పాపం! దాన్ని పట్టుకొని యేడిపిస్తా వేమిరా." వా.

దీనినే వ్యంగ్యంగా ప్రశ్నార్థక ధ్వనితో అనుట వాడుకలో ఉన్నది.

"అవును! ఏమీ యెరగదు పాపం! నంగనాచి." వా.

**ఏమి లెక్కను**

లెక్క లేదను.

"ఆదేమి లెక్కగొనన్."

విజయ. 1.102.

**ఏమి వచ్చునో?**

ఏమి కీడు మూడునో.

"...యిట్లు నట్లు పలుక నొప్ప కేమి వచ్చునో చనుఁడు..." కళా. 3.224.

"వాడు ఏమో ఎంత చెప్పినా వినకుండా ఆయన్నిగురించి ఏవేవో అన్నాడు. అది వెళ్ళి వా డెవడో ముట్టించాడు. దీంతో ఏం వస్తుందో ఏమో అని భయంగా ఉంది." వా.

**ఏమీ పట్టనట్లు**

తన కేమీ ప్రమేయం లేనట్లు.

"వా డింటి పెద్దలుడు కదా. ఇంట్లో పెండ్లి జరుగుతూంటే తన కేమీ పట్ట నట్లు పంచటరుగుమీద పడుకుని ఉంటా డేమిటి?" వా.

**ఏమేమ అని**

మేము మేము అని.

ఏ ఒకదానికో జనం ఎగబడి నప్పుడు ఉపయోగించేపలుకు బడి. సంస్కృతంలో అహ మహమిక.

"మేము ముందు మేము ముందు అని జనం అక్కడికి ఎగబడ్డారు." వా.

**ఏ మొగముతో....**

ఎట్లు?

అనగా ఆ పని చేయుటకు ముఖము చెల్లదనుపట్ల ఉప యోగించేపలుకుబడి,

"అదె వచ్చె నిదె వచ్చె నని నా కెదురు చూచు, నీకు నీక్షింతు నే నేమొగమున." కాశీ. 5.324.

"వాడు చెడి యింటికి వస్తే నిర్దాక్షిణ్యంగా ఆ నాడు పొమ్మన్నానా?

ఇప్పుడు పని పడిందని నేనే మొగం తో పోగలను ?" వా.

"కాంతుం డెఱిఁగిన నాతని, పొంతకు నే మొగము తోడఁ బోయెద ను చెప్పుమా." శుక. 2. 73.

"వాని నన్నిమాట లని ఏ మొగంతో తిరిగీ వానిదగ్గరకు వెడతావు ?" వా.

చూ. మొగము చెల్లు, మొగము లేదు.

## ఏ మొగము పెట్టుకొని....

"వాడి కన్ని కష్టాలు తెచ్చిపెట్టావు. ఇప్పుడు ఏ మొగం పెట్టుకొని పోయి వాణ్ణి సాయం చేయమని అడుగుతావు." వా.

చూ. ఏ మొగముతో.

## ఏ యూరి కే త్రోవ ?

దానికీ దీనికీ సంబంధము లేదనుట.

త్రోవ కున్న పర్యాయపదాలన్నీ ఇక్కడ ఉపయుక్తమవుతాయి.

"తరుణీ సంగమ మెక్కడ ?, యిర వగుయోగదశ యెక్క డేయూరికి నే, తెరువు జితేంద్రియుఁ డగుడు, శ్చరితు నియోగంబు దంభసంజ్ఞమ కాదే ?" హరివంశ. పూ. 40 పే. 90.

## ఏయూరి కేది తెరువు

రెంటికీ సంబంధము లేదనుట.

ఏ ఊరికి ఏది దారి అనడం వాడుక.

పాండు. 4.278.

రూ. ఏఊరికి ఏదారి.

(ఇది) ఏ యూరు ? (అది) ఏ యూరు ?

దానికి దీనికి సంబంధ మెక్కడిది అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"మతు లెవ్వ రిలుచూనవేశ్వరులు సతుగా బొంకుట సత్య మెయ్యెడను, జనపతు లేయూరు సత్య మేయూరు ?" హరి. ద్వి. 1 భా. 160. పం.

## ఏ యెండ కా గొడుగు పట్టు

సమయానుకూలముగా ప్రవర్తించు.

ఇది నిరసనలోనే ఉపయోగిస్తారు.

"కుడువం జొచ్చును బ్రాహ్మణార్థములు పెక్కుల్ రాజకీయార్థముల్, నడుపం జూచును యాజ్ఞవల్క్యుఁడు ధరన్ నానోచ్చనీచంబులం, దెడ లేక న్నటియించుఁ గాలము కొలంగిం బోవు నే యెండ కా, గొడుగుం బట్టు ధనార్జనంబునకు నెగ్గున్ బ్రొముగు తె గేమనున్." తెలుఁగునాడు. పే. 41.

## ఏరాలు

సవతి; తోడికోడలు.

"మగువ యేరాలికి మసలె గర్భంబు." పండితా. ద్వితీ. పర్వ. పుట. 155.

కోశములలో తోడికోడ లనే ఉన్నది. కానీ పైన సవతే నని కథాసందర్భం సూచిస్తున్నది.

"ఏరాలిపట్టి బిట్టెత్తి చెక్కిలి నొవ్వఁ, గఱచి వాఁ డేడ్చినఁ గౌఁగిలించు." పాండు. 3.62.

ఏరు గట్టు
పాఱు, ప్రవహించు.
"ఇటుల మది రెండుదెఱఁగు లై యేరు గట్టు." లక్ష. 3.85.

ఏరు గుడిచి కాలువ పొగడు
ఒకదానివల్ల లాభం పొంది మరొకచిన్నదానిని పొగడు.
"గరిమ నేరు గుడిచి కాలువఁ బొగడఁబోతే, యెర వెరవే కాక యిత వయ్యీనా?" తాళ్ల. సం. 8.67.

ఏరు తీసినట్టు
క్రమక్రమంగా కాకుండా ఒక్క ఉదుటున తగ్గిపోవు.
ఒక్క గంటలో ఏరు మహోద్ధృతంగా దరు లొరసి పారుతుంది. అలాగే గబాలున ఒక్కమాటు తీసిపోతుంది.
"వాడి అంత ఆస్తీ సంవత్సరంలోగా ఏరు తీసినట్టు తీసిపోయింది." వా.

ఏరు దాటి తెప్ప కాల్చు
అవసరం గడచిన తర్వాత పోట్లాట్లు.
"దిక్కు లేనప్పుడేమో వాళ్లింట్లో తల దాచుకొన్నాడు. కాస్త ఆసరా చిక్కగానే అటు మొగం చూపడం కూడా మానేశాడు. ఏరు దాటి తెప్ప కాల్చే రకం." వా.

ఏరు దాటి పోవు
తప్పించుకొని పోవు. దొరకక పోవు.
"ఈరసపు సంసార మింగలము దగిలించి, యేరు దాటిపోయె నెంత టి జాణే." తాళ్ల. సం. 5.115.

ఏరు దాటేవరకూ గంగమ్మ - ఏరు దాటింతర్వాత పింగమ్మ
అవసరం గడచేవరకూ పొగడ్తలు, అది తీరాక తెగడుటలు.
"వాని దంతా పని గడచేవరకే యీ ఆశ్రయింపు. ఆ తరువాత నీ యబ్బెవరు నా యబ్బ ఏం కావాలి అంటాడు. ఏరు దాటేవరకూ..." వా.

ఏరు నిద్రించు
అలలు లేక ప్రవహించు.
వేంకటేశ. 68.

ఏరుల కేతము లెత్తు
అసాధ్యకార్యములకు దిగు.
ఏతముతో ఏటిలోని నీరంతా ఎత్తుట సాధ్యము కాదనుటపై ఏర్పడినది.
వేంకటేశ. 60.

ఏరు సాగు
ఏరువాక సాగు.
"చాకుమళ్లునుం గా లలి నేరు సాగి రిలఁ గల్గుపసిం గొని పేదమున్నగఁ." ఆము. 4.124.

ఏర్పఱచు
దిద్ది తీర్చు; వేనిలో నైనా కలిసినవానిని వేఱుగా చేయు.
"ఫాలమునఁ గుంతలంబు లేర్పఱచి నపుడు." హర. 4.85.
"మా నాయనమ్మ మధ్యాహ్నంపూట బియ్యం యేర్పరుస్తూ కూర్చుంటుంది." వా.

"ఆకస తేర్పరిచి కట్ట కట్టాలి." వా.

## ఏఱు గుడిచి కాలువ పొగడు

"ఈశని నెఱుఁగకుండే నిల స్వామి ద్రోహము, ఘాతల నేఱు గుడిచి కాలువ పొగడుట." తాళ్ల. సం. 9.247.

చూ. ఏరు గుడిచి కాలువ పొగడు.

## ఏఱుగొను

వఱదపా లగు; పా ఉగు.

"వలరాజునకు నైన వర్ణింపఁగాఁ దగు తనువిలాసం బేఱుగొనియె నన్న." ఉ. హరి. 4.300.

## ఏలనిబంటు

జీతనాతములు లేని సేవకుడు.

"ఈ తనూవిభవ మెక్కడ యేలని బంటుగా మరుణ్, డక్కఁ గొనంగ రాదె యకటా! నను వీఁడు పరిగ్రహించినన్." మను. 2.35.

## ఏల యొక మాట మాటగ?

వరుసగా ఒక్కొక్కటీ చెప్పడం ఎందుకు?

"ఏల యొకమాట మాటగ నించు విలుతుఁడు..." రాజగో. 2.55.

## ఏలాట మాడు

చెరలాట మాడు.

వేంకటేశ. 35.

## ఏలికతో మేలము

ప్రమాదకారి.

యజమానితో హాస్యం ఎప్పుడో ప్రమాదం కలిగించు ననుట.

వేంకటేశ. 52.

## ఏలికబంటువాసి లేక

సేవ్య సేవక భేదము లేక; వాడూ వీడూ అనక.

అనగా అందఱూ అనుట.

"ఏలికబంటువాసి యొక యించుక లేక కృశించువారు నై, తూలెజనంబు." కా. మా. 3.153.

## ఏలికసాని

యజమానురాలు.

గౌర. హరి. ద్వి. 2250.

## ఏలిదము చేయు

చులకన చేయు.

"ఏలిదము చేసి మెచ్చక, తూలముగాఁ బలికి కడవ దూషించెదు." కమా. 7.45.

## ఏలినవాడు

ప్రభువు.

పాండు. 5.265.

## ఏలినవారు

ప్రభువుల వారు.

"ఓహోహో! ఏలినవారు సిద్ధసంకల్పులు గారా?" హేమా. పు. 78.

## ఏలుకొను

ఏలు; పాలించు.

ఆమెనో, అతనినో పరిగ్రహించు.

ప్రియాప్రియుల. భార్యాభర్తల విషయంలోనే దీనిని ఉపయోగిస్తారు.

"ఏల సందేహ మమరేంద్రు నేలుకొనుము." నైష. 3.126.

వాడుకలో రూపం:
"ఏం తప్పు చేసినా కడుపులో పెట్టు
కొని ఈ అమ్మాయిని నీవు ఏలుకోవల
సింజే."

ఏళ్లు కోళ్లు ఏక మగు

ఏకార్ణవ మగు.
నదులూ కాలువలూ కలిసి
పోయె ననుట. (కోడు =
కాలువ.)

"మొన్నటివర్షాలలో ఏళ్ళూ కోళ్ళూ
ఏక మయినవి." వా.

ఏవెంట

ఏ విధముగా, ఎట్లయినను,
ఏరీతిగా చూచినను.

"కావున నగ్నముఖ్యప్రకారంబు,లే
వెంట నిందయే యిల ?"
పండితా. ప్రథ. వాద. పుట. 687.

ఏవెంట బోయితి వేమి ?

ఏ విధముగా నైనా, ఏదె
ట్లయినా.
ఎలా అయితేనేమి ? అనుట.

"జంటన్ వచ్చిన సారమేయములు నీ
సైన్యంబులున్ మావె యే, వెంటం
బోయితి వేమి ?" ఉ. హరి. 2.140.

ఏసరేగు

విజృంభించు, ఎక్కు వగు.

"ఇట్టు లత్యుగ్ర మగుగ్రీష్మ మేస
రేగి." పాండు. 4.18.

ఏషాగాథా లాడు

అస్తవ్యస్తపుమాట లాడు.
దీని వ్యుత్పత్తి విచార్యము.
తంజావూరు వాఙ్మయంలో
విశేషంగా కానవచ్చే పలుకు
బడి.

ఏష్యములు పలుకు

భవిష్యత్తును చెప్పు.
ఆము. 6.66.

ఏహ్యముగా

అసహ్యంగా, రోతగా.

ఐదు పది సేయు

నమస్కరించు.
రెండుచేతులు కలిసినప్పుడు
అయిదువేళ్లు పదివేళ్లగును.
వెనుకంజ వేసినప్పుడు కాలి
వేళ్లు పది యగు నని కొందఱు.

"ఉరవడిఁ బోరికై కవచ మొల్లరు
మంత్రములందుఁ దక్కు సుస్థిరభుజ
శక్తి నైదు పది సేయరు దత్తిన తక్కు
మంటికై." ఆము. 2.34.
కళా. 8.100.

ఐదువేళ్లూ లోపలికి పోవు

చూ. అయిదువేళ్లూ లోపలికి పోవు.

ఐదువేళ్లూ సమంగా ఉండవు

అందరూ ఒకటిగా ఉండరు—
ఎన్నోరకాలు అనుపట్ల ఉప
యోగించేపలుకుబడి.
ఒక యింటివారు ఒక తల్లి
పిల్లలే అయినా విభిన్నత
లుండు నను పట్ల ఉపయో
గిస్తారు.

"అలాంటి పెద్దమనిషి తమ్ము డింత
మర్యాద్ద డయ్యాడే. అయినా ఐదు
వేళ్లూ సమంగా ఉండవు లే." వా.

ఐనది కాదను కానిది ఔనను

ఉద్దండంగా మాట్లాడు.

"ఐనది కాదని యనఁగా, గానిది యౌనని వచింపఁగాఁ గలమితో."
శ్రవ. 4.54.

ఐనన్ కానిమ్ము

అయితే కానీ.

"ఐనన్ గానిమ్ము భవద్దీనతకై వ్రతము విడిచితిన్." మను. 3.100.

ఒకడు బలవంతము చేయగా అంగీకరించిన సందర్భంలో అనేమాట.

"అయితే కానీ, ఏం చేస్తాం?" వా.

ఐపు అజ

జాడ. జం.

"వాడి ఐపు అజా తెలియడం లేదు." వా.

ఐపు లేడు

ఎక్కడికి పోయినాడో తెలియదనుట.

"వాడు ఐపు లేకుండా పోయినాడు." వా.

ఐసరుబొజ్జ

సెబాసు.

"కాంతలమాట నమ్మకొని కంతునికింగడు లోకువై తదీ,యాంతరభావముల్ దెలియ కైసరు బొజ్జ యటంచు నుబ్బుచుం, బ్రెంత వివేకులైన..."
శ్రవణా. 3.75.

ఐసరు బొజ్జ తోపా

సెబాసు.

చూ. ఐసరుబొజ్జ.

ఒంటని

అహితులైన.

పథ్యముకాని, హితము కాని- అన్న సంస్కృతం మాటల వలెనే 'ఒంటదు' కూడా రోగికి కొన్ని వస్తువులు పథ్యము కావు అన్నట్లే ఉపయోగిస్తారు. 'వానికి వంకాయ ఒంటదు' ఇత్యాదులు. అంపుపై వచ్చిన మాట.

"ఒంటనిరాజుల కప్పము, గొంటి న్నేర్చి..." కళా. 5.116.

ఒంట బట్టు

బలప్రవర్ధక మగు, మనసున కెక్కు, హిత వగు.

ఏదైనా తిన్న ఆహారం జీర్ణమై రక్తరూపంలో ఒంటికి పట్టిన దనుటపై వచ్చిన పలుకుబడి. తర్వాత ఇది ఆంగిక మయిన ప్రోదికే కాక ఇతరములకూ చెల్లినది.

"వాడికి తిన్న ఆహారం ఏదీ ఒంటబట్టడం లేదు." వా.

"వాళ్ల నాన్న ఎంత ప్రయత్నించినా వాడికి చదువు ఒంటబట్ట లేదు." వా.

"ఎన్ని నీతులు చెప్పినా వానికి ఒంటబట్ట లేదు." వా.

"ఈ ఊరినీళ్లు నీకు బాగా ఒంటబట్టినట్టున్నాయే. అప్పుడే కాస్త ఆ సూచనలు కనిపిస్తున్నాయి. ఆ రాజసమూ, ఆకేవీ." వా.

ఇలాటి పట్టుల కాస్త పొగ రెక్కినాడు అన్న వ్యంగ్యార్థం స్ఫురిస్తూ ఉంటుంది.

ఒంటరీలు

అంగరక్షకులుగా నుండు అసహాయశూరులు.

"విభుండు క్రేవలఁ దగ నొంటరీలు గొలువం గరదీపతతుల్ వెలుంగఁగన్." శుక. 1.370.

ఒంటికంబపు మేడ

ఒకే స్తంభంతో రాజస్త్రీని ఉంచుటకై కట్టిన మేడ.

మన జానపదకథ లన్నిటిలోనూ వినబడేమాట.

"పోతుటీఁగకు నైనను బోవరాని, యొంటికంబపు మేడలం దునిచెఁ దత్సు, తద్వయంబును..."

హంస. 5.273.

రూ. ఒంటిస్తంభం మేడ.

ఒంటికిట్లు

ఒక తిట్టు.

ఒంటెత్తు మనుష్యులు అని అర్థం కావచ్చును.

స్త్రీలను గురించి ఇక్కడ ఉపయుక్తమైనది.

"నీ వెఱుంగవె మున్ను నిక్కమంగనలు, ... ఒడప మలుపసంతు లొగి నొంటికిట్లు."

పండితా. ప్రథ. పురా. పుట. 343.

ఒంటికాలిమీద తపస్సు చేయు

గట్టిపట్టుదలతో కోరు.

తపస్సులలో ఒకరకమైన దిది. ఒక పాదంమీదనే నిలబడి తపస్సు చేయుట.

పట్టుదలతో కోరుటలో ఒంటికాలిమీద నిలబడుట అన్న అర్థంలోనే దీనినీ ఉపయోగిస్తారు.

"వాడా పిల్లకోసం ఒంటికాలిమీద తపస్సు చేస్తున్నాడు. ఆ పిల్ల తండ్రి కిష్ట మైనా తల్లేమో తమ్మునికివ్వా లని పట్టు పడుతున్నది." వా.

ఒంటికాలిమీద నిలబడు

ఏదైనా నిర్బంధముగా వెంటనే కావలె నని పట్టుపట్టు.

"ఒంటికాలనె నిల్చి యూర్మి మారుతములన్, జిగురుటెక్కలరేకు లెగయుచుండ." శృం. నైష. 1.98.

"కాసులదండ కావాలని మా అమ్మాయి ఒంటికాలిమీద నిలుచుంది. ఏం చేయడానికీ తోచడం లేదు." వా.

ఒంటికాలిమీద వచ్చు

ఒక్కమాటతో మీదికి వచ్చు.

మీదబడు, పైబడు.

కొత. 121.

"వాడు నే నంటే ఒంటికాలిమీద వస్తాడు. వాడి కేం పొయ్యేకాలమో!" వా.

ఒంటిపాటగు

ఎవరు లేని అవకాశము దొరకు.

"ఇద్ద తీరితి నింటిలోఁ కేఁగినప్పు, డొంటిపా టయ్యె శివదత్తుఁ డింట లేమి." హంస. 3.230.

**ఒంటెత్తుతనం**

ఓర్వలేనితనం.

"అది వట్టి ఒంటెత్తు మనిషి. చెల్లెలి కే దిచ్చినా తనకు కావా లంటుంది." వా.

**ఒంటెత్తురకం**

1. ఓర్వలేని రకం.

"అది వట్టి ఒంటెత్తు రకం. దానెదు రుగా కొత్తచీ రెందుకు తీస్తావే?" వా.

2. వంతులు వేసుకొనే రకం.

"అది వట్టి ఒంటెత్తు రకంరా. తోడి కోడ లేం చేస్తే తానూ అదే చేస్తా నంటుంది. తాను పెద్దకోడలు కదా. ఆమాత్రం సహనం లేదు." వా.

**ఒండాడు**

ఎదురాడు.

వాడుకలో ఇది 'ఒక్కమాట అనకుండా' అనే రూపంలో ఉపయోగిస్తారు.

"ఒక బుద్ధి వినుం డొండా డక సకలా గమమతంబు దక్కఁ దెలిసి మీ, కక టిలమతి నెఱిఁగింతు..."
పాండు. 4.272.

"నేను మావాణ్ణి చదువు మానేసి ఉద్యోగంలో చేరరా అని చెప్పగానే ఒక్కమాట అనకుండా ఒప్పుకు న్నాడు." వా.

"ఏం చెప్పినా ఒక్కటి అనకుండా చేసుకుంటూ పోతుంది. అలాంటి కోడలు దొరకడం ఆ అత్త అదృష్టం." వా.

చూ. ఒక్కమాట అనకుండా.
రూ. ఒక్కటి అనకుండా.

**ఒండు పల్కక**

మాఱు మాటాడక.
బదులు చెప్పకుండా.

"నీ వింకఁ నను నొండు పల్కక."
భార. భీష్మ. 3.450.

**ఒండొకడ వైన**

ఇంకెవ రన్నా అయితే.

వాడుకలో ఇంకొకడు వైతే అన్నరూపంలో వినవస్తుంది.

"ఒండొకఁడ వైన నిపుడ నీ పిండి యిడమె." మను. 4.90.

"నీవు కాబట్టి సరి పోయింది. ఇంకొక డైతే బయటికి గెంటేవాణ్ణి." వా.

**ఒండొక త్రోవ ద్రొక్కు**

వేరుమార్గము పట్టు.

"చేడియ నీ మనంబునకుఁ జింత యొకింత జనించెనేని నేఁ, జూడఁగఁ జాల నీ జనకు చొప్పు దలంప హతుండు గాక తాఁ, గీడు చలంబు మానఁ డనికిం జొర కొండొకత్రోవ ద్రొక్కఁగాఁ, గూడద యేమి సేయుదును ఘోరవిచా రము పుట్టె నాత్మలన్."
ప్రభా. 5.196.

**ఒండొక బుద్ధి సేయు**

అన్యథా భావించు.

"ఏటికి నొండొక బుద్ధి సేసె దే, నవ్వు చుఁ బల్కినన్ ధరణినాథ! యస త్యము గల్గ నేర్చునే?"
భార. ద్రోణ. 1.391.

"స్వా,వీరకులప్రసూతులము వీరుల మే మితరక్షితీశ సా,ధారణబుద్ధి సేయకు ముదాత్తచరిత్రుల మైన మాయెడన్."
భార. అర. 6.182.

**ఒండొకరీతిగా**

ఏదో ఒకవిధముగా.

"రాజవిరహాంబుధి నొండొకరీతిఁ బ్రొద్దు గడపుచున్నంత..."
హంస. 2.2.

**ఒండొరుల మోములు చూచుకొను**

ఏదైనా జరిగినప్పుడు గట్టిగా మాట్లాడు అవకాశము లేక పోగా పరస్పర ముఖభావ ప్రకటనలతోనే తమభావములను సూచించు.

"పుష్పించె నాండ్రెయ్యన దవ్వుగా నరిగి కొండొరుల మోములు చూచి యున్నిరా, యయ్యక నత్రిచాభ్యుదయ మంచు."
కళా. 3.37.

"వాడు అంతమందిలో అసభ్య మయిన మాట అనగానే అక్కడ ఉన్నవా రందరూ ఒకరిమొగాలు ఒకరు చూచు కొన్నారు." వా.

చూ. ఒకరిమొగా లొకరు చూచుకొను.

**ఒక ఊపు ఊపి వదలు**

ఎదుటివాని సత్తా సారమును కదల్చి చూచు.

"ఆ ఊళ్లోకి ఏ పండితుడు వచ్చినా అతను ఒక ఊపు ఊపి గానీ వదలడు." వా.

**ఒకకంచాన తిని ఒకమంచాన పడుకొను**

అన్యోన్యముగా నుండు.

"వాళ్లిద్దరూ చిన్నతనంనుంచీ ఒక కంచాన తిని ఒక మంచాన పడుకొన్న వాళ్లు." వా.

**ఒక కంట కనిపెట్టు**

కొంత ప్రాపుగా రక్షగా ఉండు.

"మీ రేదో ఒక కంట కనిపెట్టి ఉంటా రని కదా యీ ఊరు వచ్చాను." వా.

**ఒక కంట పాలు ఒక కంట నెత్తురు కురియుగతి**

కరుణ, కోపము ఒకదాని వెంట ఒకటి వెల్లివిరియగా.

"కరుణయుఁ గోపముఁ గనుఁగవ, నొర యఁగ నొకకంటఁ బాలు నొక కంటను నె, త్తురుఁ గురియుఁగతి."
ఉ. హరి. 4.59.

**ఒక కంట బెల్లము ఒక కంట సున్నము**

పక్షపాతదృష్టి.

"ఆ అత్తగారి కొక కంట బెల్లం. ఒక కంట సున్నం. చిన్నకోడల్ని నెత్తిన పెట్టుకొని పెద్దదాన్ని రాచి రంపాన పెడుతుంది." వా.

**ఒక కన్ను వేసి వుంచు**

కాస్త కన్ను పెట్టి ఉండు.

"వాడి కేదో కాస్త చెడ్డపే రుంది. ఎందు కైనా మంచిది. కాస్త కన్ను వేసి ఉంచు." వా.

**ఒక కుత్తి కై యుండు**

ఏకాభిప్రాయముతో నుండు.
ఒకటిగా నుండు.

"ఒక కుత్తి కై యుం డెడి మీ, రకటా! చెలియెడల నింత యతిహాహాకమా, పిక మా శుకమా యిఁక మా,నక మానుక మారగాత్రి నాయమె యేఁచఁగ."
అని. 3.35.

**ఒక కుత్తుక యగు**

1. ఏకాభిప్రాయమునకు వచ్చు.

"...కొమరు సెట్టియు బోటియు నొక్క కత్తుకై..." బసవ. 4.156.

2. ఏకకంఠంతో ఉండు.

ఒకే మాట మీద ఉండు అనుట.

"ఆలు మగఁడును నొకకత్తుకై నఁగాక, యిట్టి ధర్మంబు మిన్నక యేల కలుగు ?" హర. 2.60.

## ఒక కొందఱము

ఈ 'ఒక' రకరకాల అర్థచ్ఛాయలలో ప్రయుక్త మవుతుంది.

ఒకొక్కసారి కేవలం వాక్యోపస్కారమే అవుతుంది.

"ఏ మొక కొందఱము మహా, గ్రామ వనాంతరము లెల్లఁ గడచి..." విక్ర. 5.201.

"విశ్వావసుండు మొదలుగ వీణాధరుల మొక కొందఱము తత్పరతయు భక్తియుఁ దలిర్ప..." కళా. 2.71.

"ఒక నలుగురు వస్తే చాలు." వా.

"అదీ ఒక గొప్పే!" వా.

"ఒక కొంత యోచించి" వా.

చూ. ఒక కొందఱు.

## ఒక కొలికికి వచ్చు

ఒక దారికి వచ్చు.

దండలలో కొలికి పూస ఉంటుంది. తద్వారా ఒక వరుసకు వచ్చు అని మారి ఏర్పడినది.

"జలరుహదళములు చిలుకల, కొలికిం గనుఁగొన్న నొక్కకొలికికి వచ్చున్." విప్రనా. 2.44.

"ఏదో ఈ వ్యవహారం ఒక కొలికికి వచ్చాక గాని నేను ఊరు వదల దలచు కోలేదు." వా.

## ఒక కోడి కూయుపల్లె

చిన్న పల్లె.

"తిరమనుచు దేవళంబులఁ, బరఁగఁగ నొక కోడి గూయుపల్లియ నైనన్." విప్రనా. 1.60.

## ఒక గరిడిలో చేసిన సాము

ఒకచోట నేర్చిన విద్యయే.

"ఒకగురుసేత లివేల పద యదే మన మొక్క, గరిడి సేసినసాము కదలతాంగి." చంద్రాం. 6.135.

## ఒకగాడి కట్టు

కూడనివానిని ఒకచోట చేర్చుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"బంధమోక్షము లొక్క గాడి గట్టుట తెలివి గానకే కదా!" తాళ్ల. సం. 11.2. భా. 16.

"గాడిదనూ గుఱ్ఱాన్నీ ఒక గాడిలో కడతా నంటే ఎట్లా? అత నేమో సున్నితమైన మనిషి. వీ డేమో వట్టి మోటువాడు." వా.

## ఒక గుడ్డు మునికిబోయిన నేమి ?

అందరిలో ఒకడు పోతే నేమి? అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"కులమునకు గొప్ప గుద్దలి, ఖలుఁడు కులాంగారకంబు కష్టుఁడు వీనిం, బొలియింపుఁడు ఘనశస్త్రం, బుల వెస నొక గుడ్డు మునికిబో నేమి యగున్." నృసిం. 4.25.

**ఒక గూటిపిల్లలు**
ఒక జాతికి చెందినవి. (వారు)
సింహా. 1.258.

**ఒక చంద మగు**
అనాహూతమో దేనినో అన వలసి వచ్చినప్పుడు ఒక పైతే అని నేటికి కూడా అంటారు.
"అతఁ డొకచంద మైన నేమిగతిఁ బోదు నక్కట!"
భార. భీష్మ. 2.365.
"వా డక్కడి కెళ్లాడు. ఏ దయినా ఒకటి అయితే నాగతి యేం కాను?"
వా.
చూ. ఏదైనా ఒకటి అయితే.

**ఒక చెంప గొడితే పాలు ఒక చెంప గొడితే తేనె**
ఇంకా బాల్యావస్థ వీడ లే దనుట.

**ఒక చెయ్యి చూచు**
కొంత ప్రయత్నించి చూచు.
"...కానిమ్ము. ఒక చేయి చూచి వదలు దము..."
"ఒక చేయి చూచి గానీ వదలడానికి వీల్లేదు. వా డేదో మహా విరగబడుతు న్నాడు."
వా.

**ఒక చోట నిలువ లేక**
నెమ్మది లేక.
"నిదుర గానక యొకచోట నిలువ లేక వీధిఁ గ్రుమ్మరుచుండి యవ్వేళ నటకు."
శుక. 3.562.

**ఒక జాడ బోవు**
ఒక సమాధానమునకు వచ్చు.
"వివేకింప వాఁడొ నే నొక జాడఁ బోయెదము లేదా జీవ మిం కేటికిన్."
కా. మా. 2.123.
రూ. ఒకదారిని పోవు.

**ఒకటి అని ఒకటి అన లేదా?**
అనవలసిన వన్నీ అనె ననుట.
"వాడు ఒకటి అని ఒకటి అనలేదా? అమ్మా! నానామాటలూ అన్నాడు."
వా.

**ఒకటికి పదాఱు కల్పించు**
1. లేనిపోని చాడీలు చెప్పు. ఎవరితో నైనా మరొకరి తప్పులను చెప్పునప్పు డిది ఉపయోగిస్తారు.
"తగునె యక్కట! బుధనుతోదార గుణవి,రాజసన్మార్గవర్తనఁ దేజరిల్లు, పరమసాధువు సారంగధరునిమీఁద, నొకటికిఁ బదాఱు కల్పించి తోలఁ దాఁగి!"
సారం. 3.47.
2. ఉన్నది యెక్కువ చేసి చెప్పు.
"మొగుడు రాగానే ఆ పిల్ల ఒకటికి పదహారు కల్పించి చెప్పి అత్తను తలుపు గొట్టించింది."
వా.

**ఒకటి తప్పకుండ**
అన్నీ, సర్వమూ.
"వారి పేర్లును వారి వర్తనంబు లొక టియుఁ దప్పక యుండ..."
కళా. 5.86.
"బయలుదేరిన దగ్గర్నుంచీ ఇల్లు చేరే దాకా జరిగిన వన్నీ ఒకటి తప్పకుండా వాడు చెప్పాడు."
వా.

**ఒకటి యైన**
మరొకవిధంగా ఏదైనా అనా

హఠాతం సంభవిస్తే అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"అతఁ డొకటి యైన నే నేగతిఁ బోదుం జెపుము." భార. ద్రోణ. 3.287.

"మా మామ ఏదో ఒక టయితే నా గ తేమవుతుందా అని భయపడుతు న్నాను. బావమరదంటే నన్ను చూస్తేనే సరిపడదు." వా.

రూ. ఏదో ఒకటి అయితే.

ఒకటి రెండు పలుకులలో

ఒకటి రెండు మాటలలో.

"నాకుఁ, దెలుపు మొకటి రెండు పలుకుల ముగియఁగా, ననుచు." ప్రభా. 3.31.

ఒకటి రెండు మాటలలో

ముక్తసరిగా.

"ఒకటి రెండు మాటల్లో నీవు పోయిన పని ఏ మయినదో చెప్పు. చేటభారతం వినే ఓపిక లేదు." వా.

ఒకటి వెనుక నొకటి వచ్చు

వరుసగా వచ్చు.

ఆపదలు, దుఃఖాలు మొదలగునవి ఒకటివెంబడిగా ఒకటి వచ్చు ననేసందర్భంలో అను పలుకుబడి.

"వెఱఁ గందితి నొకటి వెనుక నొకటి రాఁ జొచ్చె." కళా. 3.256.

ఒకటీ అరా

ఏ కొంచెమో.

"ఒక్కటి గా దరయుం గా, దక్కట పది గాద యిరువ దైనను గాదే." గుంటూ. పూ. పు. 44.

"ఏదో ఒకటీ అరా అయితే పరవా లేదు. వందరూపాయలకు లెక్క తేలక పోతే ఎట్లా?" వా.

ఒకటీ రెండు రోజులలో

త్వరలోనే.

"అక్కడేం పని లేదు. ఒకటీ రెండు రోజులలో వచ్చేస్తాను." వా.

ఒకట్లు

ఎక్కాలు.

ఒకడు చనిన తెరువున వేఱొకడు చనక

చెల్లాచెదరుగా, దిక్కొక్కడుగా.

"...బృందారకబృందంబులు డెందంబుల నమందంబు లగు భయంబులం బొంది వికలతం బెగడు గుడుచుచు, నొక్కరుండు చనిన తెరవునఁ గదిసి వే ఱొక్కరుండు చనక నలుదిక్కులకుం బఱవం దొడంగిరి." హరి. 1.183.

చూ. ఒకఁడు పోయిన త్రోవ వే ఱొకడు పోక.

ఒకడు పోయిన త్రోవ వేఱొకడు పోక

ఎవరికి వారుగా, చెల్లాచెద రై.

"తిరిగి చూచుచు దప్పిగఁ దీసికొనుచు, దగలుదొట్టి యథాయథ లగుచు విఱిగి, యొకఁడు వోయినత్రోవ వే ఱొకఁడు పోక, చెట్టొకఁడు గాఁగఁ బఱచిరి చెంచు లపుడు." మను. 4.103.

ఒకడు మోచినమో పిందఱు మోచు

అన్యోన్యంగా పరస్పరసహకారంతో మెలగు.

"అతఁడు నరుఁడు నొకఁడు మో, చిన మో పిండజు మోచిన, యనువున నీ తోడఁబడుట యుక్తనికిఁ గీడే."
ఉ. హరి. 5.304.

**ఒక దొకని మొగంబు గానక**
ఎవరికీ వారుగా.
"వికలగతి నున్న రాక్షసు, లొకఁ డొకని మొగంబు గాన కూరక చనిరి..." ఉ. హరి. 4.270.
"ఒకరి మొగం ఒకరు చూచుకోకుండా దేశాని కొకర మయి పొయ్యాము."
వా.

**ఒక తల**
ఒక మొత్తి.
"సకలైశ్వర్యసమృద్ధులు, నొక తల సంతానలాభ మొకతల."
కాశీ. 3.216.

**ఒక తాటిమీద నడచు**
ఏకాభిప్రాయముతో మెలగు.
"మన మంతా ఒక తాటిమీద నడిస్తే మనల్ని ఏ అధికారీ ఏమీ చేయ లేడు."
వా.
చూ. ఒక తాటిమీద నిలుచు.

**ఒక తాటిమీద నిలుచు**
ఏకాభిప్రాయముతో నుండు.
"ఒక తాటిమీద నిలుస్తా మంటే నే నే నిందులో దిగుతాను. లేకపోతే నా పాటికి నేను పోతాను." వా.
చూ. ఒక తాటిమీద నడచు.

**ఒక తెవలె ఆడి ఆడించు కొనుట**
వాళ్లూ వీళ్లూ లాగా ఇతరులను అనడం, ఇతరులతో అనిపించు కోవడం.
"ఒక తెవలె నాడి యాడించుకొనుటకే యిరుగు పొరుగు చూచె నొకో యు ప్పుడుఁ జప్పుడుఁ గా ననుఁ జూచున్."
నిరంకు. 2.59.
"దాని దీనిలాగా నేను నాలు గని అని పించుకోవడం మీ రెప్పుడైనా చూ చారా ?" వా.
"ఒకరివలె అనడం అనిపించుకోవడం నా కలవాటు లేదు." వా.

**ఒకదారికి తెచ్చు**
సరి అయిన మార్గంలో నడచునితికి తెచ్చు.
"ఈ పిల్లను ఒక దారికి తెచ్చేభారం అంతా నీదే అన్నయ్యా! మాకు వేరే దక్షత యే ముంది ?" వా.
"ఈ వ్యాజ్యం ఒకదారికి తెచ్చే బాధ్యత నీది. అస లిందులో నన్ను దింపింది నీవు." వా.

**ఒక దెబ్బ తీయు**
ఒక ఊపు ఊపు.
"ఒక దెబ్బ తీయఁగాఁ జాలుదురు."
విజయ. 1.75.
"తలచుకొంటే మీ అన్నే మీ మామను ఒక దెబ్బ తీయగలడు. నే నేం చేయ గలను ?" వా.

**ఒకని బట్టి పదుగురుగా**
ఆజ్ఞాపింపగనే గుంపులు గుంపులుగా వచ్చు.
"ఉద్దవిడి రమ్మనిన భృత్యు లొకనిఁబట్టి పదుగు రత్తఱి బడిబడిఁ బాఱుతెంచి."
సారం. 1.115.

**ఒక నుడుగు అను**
పాటలో ఒక చరణము పాడు.
"పెండ్లి పందిట్లో ఒకనుడుగు అనరా దషే." హేమా. పు. 81.

ఒక పరిపాటి కాదు

సామాన్యమైనది కాదు. అసాధారణ మనుట.

"నేటి యా క్షేత్ర మొక పరిపాటి గాదు." పాండు. 3.129.

ఒకపాటి....

సుమారైన, కొంచెం ఎదిగిన, తగుమాత్ర మైన – ఇలాటి భావచ్ఛాయలలో ఉపయుక్త మవ్వొపలుకుబడి.

ఇంత, అంత లాగే చేతితో ప్రమాణము చూపుట ద్వారా ఏర్పడినది.

"బూమె లెఱుఁగని దొకపాటి బుడుత యాకు,మమ్మ లందియ..."

హంస. 1.120.

ఇది నేటికీ వాడుకలో ఉన్నది.

"ఒకపాటి మనిషి అయితే దీన్ని ఎత్తగలడు." వా.

"ఒకపాటి మొద్దు తెచ్చి చెక్కితే దీనికి సరిపోతుంది." వా.

ఒకపూట కొకపూటకు

రాను రాను; క్రమక్రమంగా.

"వారకులాచారవాసనాబాల్యంబు లొకపూఁట కొకపూఁట కుడిగిపోవు."

కా. మా. 4.23.

"ఒకపూట కొకపూటకు ఆకలి చచ్చిపోతూ ఉంది." వా.

రూ. పూటపూటకు.

ఒక పెట్టున

ఒక్కుమ్మడిగా.

"ఒకపెట్టునఁ బ్రెల్లి రండ అొగి రాము నిచే." దేవీ. 3.690.

ఒక పెద్దయై

అది ఒక ఘనమా ?

"రౌద్రమూర్తినిక్, ఫాలంబుఁ గాంగఁ జేయు టొక పెద్దయై వారితదేవతారికిన్." కా. మా. 3.208.

"అదొక పెద్దేనా ? అంతె లావుమనిషి ఆమాత్రం కడవ ఎత్త లేడా ?" వా.

ఒకపోకకు గైకొనక

లెక్క చేయక.

"నా పెను మోహ మంతయునుఁ, బొచ్చెము చేసి నన్ను నొక పోకకుఁ గైకొన కివ్విధంబునన్." ఉత్త్మాం. 4.53.

ఒక పోకం తైనా లెక్క చేయక అనుట.

ఒక ప్రసంగమై

ప్రసంగవశాత్తుగా.

"అజుఁడె యొక ప్రసంగమై చెప్పనిం..." ప్రభా. 2.99.

ఒక ప్రొద్దున

చాలా చీకటి ఉండగానే.

"ఒక ప్రొద్దున లేచి చేలోకి పోతే వీడి పశువులు నీదం." వా.

"ఓ పొద్దున లేచి వెళ్ళాడు." వా.

ఒకమాట చెప్పు

సూచించు.

సూచనగా చెప్పు అనుట.

"ఒకమాట నాకుఁ జెప్పక పోయితివి గాక, సకలదైత్యులఁ దున్మి జానకిని దేనె ?" సుగ్రీ. పు. 30.

"నువ్వు ఒకమాట చెప్పి ఉంటే నేను వాడి సంగతి చెప్పి ఉండేవాణ్ణి." వా.

ఒకమాట చేయు

ఒక యేర్పాటు చేయు.

"మానుమీ మోహ మని తెల్పి మాన
వేంద్రు, చిత్త మొగ్గించి యొకమాటఁ
జేసి..." శుక. 1.464.
"ఏదో ఒకమాట చేసుకుంటే, తర్వాత
డబ్బూ దకసం చూసుకో వచ్చు.
ముందు ధర తెగనీయండి." వా.

**ఒక మాత్ర**
ఒక మాదిరిగా.
దాదాపు అనుట.
"భాస్కరు నొకమాత్ర నేలఁ బడఁగా
వెస నేయు." భాస్క. యుద్ధ. 1.783.

**ఒక మూల వేయు**
ఒక వైపు పడవేయు.
"నూలచేకటు లొకమూల వైచి సిరాజి
గనుపుల గళ్లచేకటులఁ దాల్చి."
శుక. 1. 237.
"గుడ్డ లన్నీ ఒకమూల వేసిపోవే." వా.
రూ. ఒక మూల పడవేయు.

**ఒక మోస్తరుగా**
ఇంచుమించుగా.
అంత బాగా లేదను పట్ల
ఖచ్చితంగా చెప్పలేనప్పుడు
ఉపయోగిస్తారు.
"అతని కవిత్వం ఒక మోస్తరుగా
ఉంటుంది." వా.
"ఒక మోస్తరుగా ఆ వ్యవహారం
ముడిపడ్డట్టే." వా.

**ఒక యంచుక యించుక**
ఏకొంచె మయినా.
"ఆడదు గాని మాట లొకయంచుక
యించుక పీను లొగ్గినా, యాడినమాట
లెల్ల విను నర్మిలితోఁ దను నేను జూచి
నం, జూడదు గాని యొండు దెసఁ
జూచినఁ దానను జూచుచుండు..."
శశం. 2.42 పే.

**ఒక యించుక**
కొంచెము.
భార. ఆది. 6.115.

**ఒక యింటివా డగు**
గృహస్థు డగు, వివాహితు
డగు.
"నీ వొక యింటివాడి వయితే చూసి
కన్ను మూస్తాను. అంతకంటే నాకు
కావలసిం దేముం దిక ?" వా.

**ఒక యింటివానిని చేయు**
వివాహితుని చేయు.
"ని న్నొక యింటివాణ్ణి చేయా లని మీ
నాన్న నానా యాతనా పడుతు
న్నాడు." వా.

**ఒక యీడు**
ఒక వయసు.
"వాడూ నేనూ ఒక ఈడువాళ్లం." వా.

**ఒకరిమొగా లొకరు చూచుకొను**
చూ. ఒండొరుల మోములు చూచుకొను.

**ఒకరి మోచేతికింద గంజి తాగు**
ఒకరి క్రింద నీచముగా
బ్రతుకు.
"ఒకరి మోచేతికింద గంజి తాగడం
నా కిష్టం లేదు." వా.

**(ఒకరి) సొమ్ము అగు**
సొంత మగు.
"ఏ కార్యముల్ చేసినం, దనరక్
మంచివె కాని కాని వగునే ధర్మంబు
నీ సొమ్మగున్." ఉషా. 1.42.
'అది వాని సొమ్ము. ఇది నీ

సొమ్ము' ఇలా రూపాంతరాలలో ఉపయుక్త మవుతుంది.

**ఒకరు చదివిన ఆకున ఇంకొకరు చదువు**

అతని వంటివాడే యితడు అనుట.

"వాడు చదివిన ఆకులోనే వీడూ చదివాడు. వాడు నాలుగుకంపెనీలు పెట్టి దివాలా తీసి నాలుగు లక్షలు వెనుక వేస్తే, వీడు రెండు కంపెనీలతోనే పది లక్షలు సంపాయించాడు." వా.

**ఒక లకారం చేత పట్టు**

ఒక లక్ష సంపాదించు.

కొత్త. 325.

**ఒక లాగైన**

అనిర్వర్ణనీయ మైన.

ఇది అని నిశ్చితంగా చెప్పలేని భావాన్ని వివరించుపట్ల ఈ 'ఒక లాగు, ఒక విధం' అనే మాటలను ఉపయోగిస్తూ ఉంటారు. ఈ 'ఒక'తో చేరిన 'లాగు'కు పర్యాయ పదా లన్నీ ఈ భావాన్నే స్ఫురింప జేస్తవి.

"విని యొకింత కనలి మన సొక లాగైన,
నతని నారదుఁ డని యాత్మ నెఱిఁగి..."

కళా. 1.153.

వాడుకలో:

"నా కేమో ఈ దినం ఒంట్లో ఒక మాదిరిగా ఉంది." వా.

"వాడి మొహం ఈ రోజు ఒక రకంగా ఉంది." వా.

"వాణ్ణి చూచేటప్పటికి నా మనస్సు ఒక విధంగా అయి పోయింది." వా.

**ఒకలాగున కానిపించు**

ఏదో ఒకవిధముగా ఉండు. మామూలుగా ఉండకుండు అని చెప్పుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"నీ విదేమి చెపుము నేఁ డొకలాగునఁ,
గానిపించుచున్న దాన వతివ."

కళా. 7.225.

"అత నెప్పుడూ నవ్వుతూ తుళ్ళుతూ ఉండేవాడు. ఏమిటో అత డీ రోజు అదొకలా గున్నాడు." వా.

**ఒక వరుస సొమ్ములు**

ఒకసారి శరీరమం దంతట ధరింపదగు సొమ్ములు.

ఇలాంటివి, కలవారికి ఏడురకాలవి ఉండు ననుటపై వచ్చిన మాట. ఏడువరుసల సొమ్ములు. ఒక్కొక్క వరుసను ఒక్కొక్క వారం ధరించడంమీద ఏడువారాల సొమ్ములు అన్న మాట వచ్చింది. నేటికీ ఒక్కొక్కరోజు ఒక రంగు చీర కట్టుకుంటే ఆ రంగు అలంకరణాలే ఆపాదమస్తకం వేసుకోడం అలవాటు.

మాటకు—ఒక చీర కట్టుకుంటే అదేరంగు జాకెట్టు, అదేరంగు

చెప్పాలూ, అదే రంగు చేతి సంచి ధరిస్తారు.

"ధనముల జాలెలు శతనప్పుఁ, ఒసి తగు నొక వయసమ్ముఁ జనిచిన గణసా, ఘన కీవచ్చుఁ గదా యని..." శుక. 2. 216.

## ఒక విధంగా

చూ. ఒక పెాస్తగా.

## ఒక వెలుగు వెలుగు

కొన్నాళ్లు గొప్పగా బ్రతుకు.

"ఏమయితే నేంకి వాడొక వెలుగు వెలిగాడు కదా!" వా

## ఒక హస్తపు మ్రొక్కు

ఒంటిచేతి నమస్కారము.

"సెన్నొసల్ కరమునం దిడి తీరనిమ్మ యై జలం, బాడఁగఁ బిల్చువారి నొక హస్తప్రమ్రొక్కున నాడుఁ డంచు." మను. 3.86.

## ఒక్క అంగలో

గబాలున.

"తుమ్రుమని యొక్కయంగలో మాటి నాఁడు." మృచ్ఛ. 89.

## ఒక్క కడుపువారు

ఒకే జాతివారు.

ఒక రకమే అనుట.

"కాకవులు గాకవులు నొక్క కడుపు వారె." శ్రవ. 1.10.

## ఒక్కగా నొక్క...

ఏకైకసంతాన మనుట.

"ఉన్న ఒక్కగా నొక్క కొడుకూ చెడిపోతే వాడికి కష్టమే కదా!" వా.

"లేక లేక వాళ్లకు ఒక్కగా నొక్క కొడుకు పుట్టాడు. అంచేతే ఆకొడుకంటే వారి కంత ప్రాణం." వా.

## ఒక్క గోర తిరుగు

ఒకేవిధంగా తిరుగు.

"కరి రయంబున జిఱ్ఱన సారె వోలె నొక్క గోరఁ దిరిగె." కుమా. 10.66

## ఒక్క చిన్న మంత మాట యాడిన

ఏమాత్రం నిందించినా.

"చిన్న నాఁడును బ్రియుఁ డొక్క చిన్న మంత, మాట యాడిన విని తాపమగ్న వగుదు." కళా. 4.134.

## ఒక్కటికి పదాఱు సెల్లించు

గట్టిగా ఎదురుదెబ్బ తీయు.

"ఇంతయు నేల మీకు నెదు రెక్కటికిన్ మునికిం బదాఱు సెల్లింతుఁ బదర్ల త్రాకన వెలింబడ." ఉ. హరి. 3.117.

"ఒకటికి పదహారు వడ్డించిందే తల్లీ నీ కోడలు. ఇంకా ఈ యింట్లో ఉండ మంటావా ఏమి?" వా.

## ఒక్కటి అయితే

ఏకొ ఒకటి అయితే నే నే మగుదునో అనుపట్ల ఉపయుక్త మయ్యే పలుకుబడి.

ఏదైనా ఒక అనాహూతం జరిగితే—అనుట.

"వొడింబడ నితని కొక్కటి యయ్యె నేని..." కళా. 3.264.

"ఈ ముసలాయన కేదో ఒక్కటి అయితే నాగతి యే మవుతుందో?" వా.

చూ. ఒకటి యైన

**ఒక్కతల్లి ప్రజలు**

1. సమానులు.

"స్లలితాశోకపల్లవంబులుఁ బాద, పల్లవంబులు నొక్క తల్లిప్రజలొ."
కుమా. 8.12.

2. ఒక తల్లి పిల్లలు.

'మీరు ఒక తల్లి పిల్లలా?' అని ప్రశ్నించుటూ 'మే మిద్దఱం ఒక్క తల్లి పిల్లలం' అని చెప్పుటా నేటికీ వాడుక.

**ఒక్కని పంప పదుండ్రు వాలు**

ఎవరైనా ఆజ్ఞాపించినప్పుడు వారిమీది గౌరవంకొద్దీ, పని లోని తీవ్రతనుబట్టి ఒకరిని పంపగా పలువురు పోవుట సహజము. అందుపై వచ్చిన పలుకుబడి.

"ఊర్వశిఁ దోడి తెమ్మనుచు నొక్కనిఁ బంపఁ బదుండ్రు వాలి సౌపర్వణసౌధ వీథుల యుపాంతములం దరుగంగ."
ఉ. హరి. 1.54.

"రెడ్డిగారు ఒకణ్ణి పోరా అంటే పది మంది పోతారు." వా.

**ఒక్క పంటికిందికి వచ్చునా?**

బొత్తిగా చాల దనుట.

తిండివిషయంలోనే ఇది ఉప యోగిస్తారు.

"బందెఁ డన్నము నా కొక్క పంటి క్రింది, కైన వచ్చునె?"
పాండ. ప్రవా. 12.

"అరవీసె వంకాయలు వండితే అల్లుడి కొకపంటి కిందికి చాలవు." వా.

**ఒక్క పెట్టున**

ఒక్క ఉదుటున.

"అహంకృతి పెక్కువ నొక్కపెట్ట కలహించుటకుం బిలుచుభంగి."
ప్రభా. 2.105.

"నలువుర నేవుర నలి నుచ్చి పొలఁ, గల లొక్కపెట్టు భూతలముల రాల్చి." ద్విప. కల్యా. 79.

**ఒక్క మొగముగా**

ఏకముఖముగా.

"ఒక్కమొగము గాఁగ నుతికిరి సైనికుల్." విజయ. 3.157.

**ఒక్కమొగి**

ఒక్క మోయిన, ఏక ధాటితో.

"ఒక్కమొగి నలుదిక్కులుఁ బిక్కటిల్ల, మిక్కిలి యెక్కు డగువైభవంబున నగరు వెలువడి..." కళా. 7.69.

"విని కడఁగి యసుర లెనుఁబది, యెని మిదివే లొక్క మొగిన యెత్తిన హరి యున్." ఉ. హరి. 1.147.

"ఒక్కమొగి నసురు లందఱుఁ, బెక్కు తెఱంగుల నిశాతభీకరశరముల్, గ్రిక్కి ఱియ నేయ." కా. మా. 2.55.

'ఒకమోయిన' అని నేటికీ ఈ మాట ఇదే అర్థంలో రాయల సీమలో వినబడుతుంది.

"లేచినప్పటినుండీ ఒక్క మోయిన వాడు తిడుతూ ఉన్నాడు." వా.

**ఒక్క మొగమై**

ఒక్కటై, ఏక మై.

హర. 6.95.

**ఒక్క యుమ్మడి**

ఒక్కసారిగా.

హర. 7.161.

చూ. ఒక్కుమ్మడి.

**ఒక్కరూపగు**

సమాన మగు.

"నీవుఁ బాండుండు విదురుండు నెమ్మి నాకు, నొక్కరూపయినట్లు."

భార. అర. 1.87.

**ఒక్కరేవున నీరు త్రాగించు**

ఏవో సహజవిరుద్ధము లయిన వానిని కలియునట్లు చేయు.

"శైవజైనుల నొక్కరేవునం ద్రావించి పితృవధ పాపనిష్కృతికిఁ దివిరె."

రుద్రమ. 3 పు.

"ఆతగాణ్ణీ ఇతగాణ్ణీ ఒక విందులో కలిపా వంటే గొప్పసంగతే. పులినీ మేకనూ ఒక రేవులో నీరు త్రాగించడం మాటలా?" వా.

**ఒక్కుమ్మడి**

ఒక్క ఉదుటున.

"వార్ధు లొక్కుమ్మడి వారపట్టి."

జైమి. 5.8.

చూ. ఒక్కయుమ్మడి.

**ఒక్కొత్తున**

ఒక్కసారిగా.

ఒకే ఒక ఊపులో అనుట.

ఒకసారి ఉడుగెత్తి వేయుటతో — ఒక ఉంగలో — అనుట కావచ్చును.

"అగాధభవసాగరం బతఁడు దాటు నొక్కొత్తునన్." పాండు. 4.89.

**ఒగరు తీపగు**

బాధలే ప్రియ మగు.

సామాన్యంగా తీపు సుఖానికీ హాయికీ, ఒగరు చేదులు తద్విరుద్ధస్థితికీ ప్రతీకాలు.

"పగటున మామాప్రాణము మా కిఁక నొగరే తీపాయె నుద్ధవుఁడా."

తాళ్ల. సం. 12.56.

**ఒగరులాడు**

ఆశించు.

"బిగిసేవు గాక ప్రియురాండ్రు నిన్ను నొగరులాడెడి వోదెందు గావా."

తాళ్ల. సం. 3.92.

**ఒగుడాకువలె ఉండు**

బాగా సన్నగా, పల్చగా ఉండు.

జొన్నదంటు కున్న ఆకులను ఒగుడాకులు అంటారు. అవి మరీ పల్చగా ఉంటాయి.

"మంచి వయసులో పిల్ల కదా! మరీ ఒగుడాకులాగా ఉం దేమిటి?" వా.

**ఒచ్చిన నోర పలుకు**

నోటికి వచ్చినట్లు అను.

అనగా నొవ్వ బలుకు.

"బంటు నొచ్చిన నోరఁ బలుకండు నెఱ వాది." ఉ. హరి. 5.278.

వాడుకలో నేడు :

"నోటికి వచ్చినట్లు జీతగాణ్ణి కూడా అనేవాడు కాదు పాపం!" వా.

**ఒజ్జబంతి యగు**

ఆదర్శప్రాయ మగు.

దిద్దుకొనుటకై పిల్లలకు ఉపా

ధ్యాయుడు పై పంక్తి వ్రాసి యిస్తాడు. అదే ఒజ్జబంతి, మేలిబంతి. అందుపై ఏర్పడిన పలుకుబడి.

"వైష్ణవాచార, పర్యాయముల కొజ్జ బంతి గాఁగ." పాండు. 1.20.

## ఒజ్జల పుచ్చకాయ

కృత్రిమధర్మప్రవచనము.

గురువుగా రొకరు తన శిష్యులకు పుచ్చకాయ నిషిద్ధమనీ, తినవద్దనీ చెప్పి తాను మాత్రం తినేవారు. అందుపై వచ్చినపలుకుబడి.

ఒజ్జలు = ఉపాధ్యాయులు.

"సంధ్యలఁ బురలక్ష్మి ధర్మవిధులన్నియు నొజ్జల పుచ్చకాయగా, వెలయు." కళా. 1.114.

## ఒజ్జసాని

గురుపత్ని.

గౌర. హరి. ద్వి. 1029.

## ఒట్టికొను

హత్తుకొను.

"ఊపిరి మోచిననాడే ఒట్టికొంటి నాస లెల్ల." తాళ్ల. సం. 8.83.

## ఒట్టిగొడ్డు తాకట్టు

వ్యర్థము.

వట్టిపోయి పాలివ్వని గేదెలాంటివానిని తాకట్టు పెట్టుకొనడంవల్ల వచ్చే దేమీ లే దనుటపై వచ్చినది.

"పట్టయనట్లొ కూర కొకపాతిక తాసులొ యొట్టిగొడ్డు తా, కట్టని తాడనాస్పద కృకాటికి చేటిక కన్నుగీటినన్." బహులా. 5.90.

చూ. వట్టిగొడ్డుతాకట్టు.

## ఒట్టిడిన యట్లు

ఒట్టు పెట్టినట్లుగా.

'ఏదైనా బొత్తిగా జరగ లేదు' 'ఠకీమని ఆగినది' వంటి అర్థాలలో ఇది ఉపయోగిస్తారు.

నీవు పోతే ఒట్టు అని ఎవరో అంటే ఆ ఒట్టును దాట లేక ఆగిపోయినట్లుగా అనుట.

"విడచెం ద్వదంగసంగానుభవేచ్ఛ యొట్టిడినయట్లు తదాదిగ..." కళా. 4.21.

"వాడు మందిచ్చాడు. ఒట్టు పెట్టినట్లుగా జ్వరం ఆగిపోయింది." వా.

"ఒట్టు పెట్టినట్లుగా ఆ పెండ్లికి ఎవరూ పోలేదు." వా.

చూ. ఒట్టుపెట్టినగతి.

## ఒట్టిడుకొను

ఒట్టు పెట్టుకొను, ప్రమాణము చేయు, ప్రతిజ్ఞ చేయు.

"ఇట్టిక నూఁడినవాఁడో, యొట్టిడుకొన్నాఁడో." ఉ. హరి. 1.36.

"ఏం మజ్జిగ తిననని ఒట్టు పెట్టుకున్నావా? వద్దే వద్దంటున్నావు?" వా.

వాడుకలో 'ఇడుకొను' 'పెట్టుకొను'గానే వినవస్తుంది.

## ఒట్టినమంట

భయంకరుడు.

"పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁడున్ రణంబునం, దొట్టిన మంటలు..." భార. ఉద్యో. 2.194.

**ఒట్టు పెట్టిన గతి**

ఎవరో నిషేధించినట్లు.

ఒక్కమాటుగా, బొత్తిగా.

"నీకు వాకట్టునబడి లేదని యనుచున్నంతలో, నొట్టు పెట్టినగతి వాన దొట్టున వెలసిన నదియును లంబోదర మహోదరంబుగా నెంచి..." శుక. 3.258.

"ఒట్టు పెట్టినట్లు ఒక్కడు కూడా ఆ పెండ్లికి వాళ్ళింటినుంచి రాలేదు." వా.

చూ. ఒట్టిడినయట్లు.

**ఒట్టు వేయు**

ప్రమాణము చేయు.

"వాడు తన కేమీ తెలియదని ఒట్టు వేసి చెబుతున్నాడు. మనం నమ్మక పోతే ఎట్లా?" వా.

**ఒట్టు సుమీ!**

తప్పక ఇది జరుగుతుంది. ఇది నిజము అని చెప్పునప్పుడు ఒట్టు వేసికొనుట అలవాటు.

"ఒట్టు సుమీ యన్న నొట్టు సుమీ యంచు..." కళా. 3.207.

వాడుకలో :

'వాడు వస్తే ఒట్టు.' 'తప్పకుండా వస్తాడు. రాకపోతే ఒట్టు' ఇత్యాదు లూహ్యములు.

**ఒడంబడు**

ఒప్పుకొను ; కూడనిదానికి తల యొగ్గు; ఒడంబడిక చేసుకొను.

"మహోశు నీచపలకుత్సితవిప్రుఁడు వచ్చి నోరఁ గ్రొవ్వులు పలుకంగ మీరును చెవుల్ సొరవించు సహించి మాటు మాటలు నొడికట్టి పల్కెద రొడంబడి నట్టులు బ్రహ్మబంధుతోన్."

కుమా. 7.55.

రూ. ఒడబడు.

**ఒడగూర్చు**

సంతరించు.

"యజ్ఞసంభారముల్ వేగ నొడఁగూర్పు మని." జైమి. 5.134.

వాడుకలో :

'ఒనగూర్చు' అన్నట్లు నేడు వినవస్తుంది.

"పెళ్ళి కన్నీ ఒనగూర్చుకొని కదా మిగత సంగతులు మాట్లాడాలి." వా.

**ఒడమలగొడ్డు**

ఆకారపుష్టి తప్పితే పనికి రానిది.

**ఒడ లంటు**

అంగమర్దనము చేయు.

"ఒడ లంటఁ గాళ్లు పిసుకం, గడివెడు చేన్నీళ్ల నీయఁ గంచము వెట్టన్." శుక. 3.341.

**ఒడలు ఓడగు**

శరీరము పాడగు.

కుండ పగిలితే ఓడు అవుతుంది కదా! అట్లే...

"ఒడ లోడు గాఁ జొచ్చు." నిరం. 2.129.

**ఒడలు కాల్చుకొను**

అనవసరజోక్యము కల్పించుకొని నష్టపడు.

"ఇతరుల విషయంలో జోక్యం కల్పించు

కొని ఒళ్ళు కాల్చుకోవడం నాకు ఇష్టం లేదు.'' వా.

చూ. చేతులు కాల్చుకొను.

**ఒడలు గుల్లలతిత్తిగా నుదికి చంపు**

చావ దన్ను.

"ఒడలు గుల్లలతిత్తిగా నుదికి చంపె." భాస్క. యుద్ధ. 681.

**ఒడలు చిదిమిన పాలు వచ్చు**

శైశవావస్థలో నుండు.

పాలు తాగేపసితన మనుట.

"పతి జనించిన గోలెను బరహితైక, లోలమతి యొడల్ సిదిమినఁ బాలు వచ్చు." నిర్వ. రా. 9.22.

**ఒడలు చేయు**

వేషములు వేయు, నటించు.

"మిడికెదు పెదవులు వ్రేళులు, మడిచెదు కనుదోయి మొగిడి మాయొబురఁ గడుఁగ్, వెడ వీక యొడలు చేసెదు." ఉత్త. హ. 4.44.

**ఒడలు జాడించుకొను**

శరీరము విదిలించుకొను.

నేడు కాళ్లు చేతులు ఇత్యాదులు జాడించడం, ఒళ్లు విఱుచుకొనడంగా వాడుకలో నున్నది.

"కుందనంపు గొలుసులు గల్లుగల్లు మనంగ నొడళ్ళు జాడించుకొనుచున్ గొనసాఁగి సోగలై." మను. 4.27.

**ఒడలు దాచు**

పనికి ప్రాలుమాలు.

"ఆహా! నేఁడిదె కేల విల్లుగొని లక్ష్యం చేసి పాంచాలిఁ గొని, బాహుబాత్వ న్నన కిట్టిచో నొడలు డాఁపం జెల్ల దొక్కింతయుఁగ్." పాంచా. 2. ఆ.

"వా డెప్పుడూ తల యెత్తకుండా పని చేస్తాడు. ఒళ్లు దాచుకోవడం వాని కెన్నడూ అలవాటు లేదు. ఆరకం వేరు.'' వా.

రూ. ఒడలు దాచుకొను.

**ఒడలు నెళినెళి యగు**

ధ్వన్యనుకరణము.

శరీరము పటపట విఱుగు.

"యదూద్వహుండు దశముష్టిహతిఁగ్, బిట్టడువ నయిదుముష్టుల, నెట్టు వొడిచె నతఁడు నొడలు నెళినెళి యనఁగన్." ఉ. హరి. 3.72.

**ఒడ లుప్పొంగు**

ఆనందము కలుగు.

ఆనందం కలిగినప్పుడు ఒడలు ఉబుకు ననుటపై యేర్పడినది.

"ఒడ లుప్పొంగు నొయ్యారిఁ జూడ." విజయ. 2.149.

**ఒడలు బలియు**

సోమరితన మేర్పడు.

"వాడికీ మధ్య ఒళ్లు బలిసింది. వాడింకేం పని చేస్తాడు?'' వా.

**ఒడలు మోచు**

దేహధారణము చేయు.

పుట్టు అనుట.

"ఒడలు మోచినయది యొక యపరాధము." తాళ్ల. సం. 7.285.

**ఒడలు వంచి**

కష్టపడి, శ్రమించి.

"పసుల కొడ ల్వంగక కాచుకొను లిద్దఱుఁ గూడి గోళ్లు మీటుచు దాదుల్." శుక. 2.333.

"వాడు ఒళ్లు వంచి పని చేస్తాడు." వా.
"వానికి ఏ పని చేయడానికీ ఒళ్లు వంగదు." వా.

**ఒడ లెల్ల కన్నులుగ చూచు**

ఎక్కువ ఆసక్తితో చూచు.
"...సహస్రదృక్తనూజుని నొడ లెల్లఁ గన్నులుగఁ జూచిరి మానవముల్ గరం గరఁగన్." విజయ.

**ఒడ లెల్ల కాళ్లు**

కాళ్లు నడుచుటకు సాధనాలు. ఒడ లంతా కాళ్లై అనగా గబగబా పరుగు లిడు ననుట.
"పడిఁ బాఱు జలమున కొడ లెల్లఁ గాళ్లు." బస. 2.33.
రూ. తను వెల్ల - ఇత్యాదులు.

**ఒడలెల్ల తలలు**

పరిపూర్తిగా, అంతా అదే యై అనుఅర్థంలో ఒడ లెల్ల.
"వడి వీచుగాడ్పున కొడ లెల్లఁ దలలు." బస. 2.33.
చూ. ఒడ లెల్ల భక్తి.

**ఒడ లెల్ల నోళ్లు**

శరీర మంతా నోరుగా మారిన దనుట. నోరు తినునది.
"వడిఁ గాలుచిచ్చున కొడ లెల్ల నోళ్లు." బస. 2.33.
చూ. ఒడ లెల్ల తలలు.

**ఒడ లెల్ల భక్తి**

పరిపూర్ణమైన, ఏకాగ్రమైన భక్తి.
శరీర మంతా—అత్యధికమైన—భక్తి అనుట.
"పడిఁ జేయుబసవన కొడ లెల్ల భక్తి." బస. 2.33.
రూ. తను వెల్ల శిరము ఇత్యాదులు.

**ఒడ లోము**

1. శరీరరక్షణ చేసుకొను; ఒడలు దాచుకొను.
"ఒడ లోముటలు మోహ ముడుగునం దాక." తాళ్ల. సం. 5.152.
2. జాగ్రత్తగా మెలగు. కృశించు అన్నఅర్థం కొన్ని కోశాలలో ఇచ్చారు. కాని అది సరి కా దనిపిస్తుంది.
"ఒడ లోమి పెద్ద కాలం, బడవులఁ బడి." కుమా. 11.43.

**ఒడ లోముకొను**

ఒళ్లు దాచుకొను.
"ఒడ లోమికొని మీర లున్నచో." వర. రా. కిష్కి. పు. 520. పంక్తి. 22.
చూ. ఒడలు దాచు.

**ఒడలోర్చు**

శ్రమకు తట్టుకొను.
సుమతి. 49.

**ఒడిగట్టు**

1. సిద్ధపడు.
"జీవులం గొట్టు రట్టున కొడిగట్టు వేలుపు." కా. మా. 4.108.
2. పాల్పడు.
ఏదైనా తీసుకొనునప్పుడు ఒడిని పట్టి అందులో తీసుకొనే అలవాటుపైవచ్చినపలుకుబడి. వాడుకలో 'ఎంత పాపానికి ఒడిగట్టినాడువాడు' అంటారు.

ఇ దెప్పుడూ కూడనిదానికి ఒడబడు అన్న అర్థంలోనే ఉపయుక్త మవుతూ ఉంటుంది.

"గడిదేటి జారవిద్యల్, వడిగట్టి దురంత కంతు వనజశరాళిన్ !" హంస. 2.25.

"తిట్టున కొడిగట్టి తిరుగుచున్నాఁడ." హరిశ్చ.

"లోకనింద కొడిగట్టితి గా." సారం.

రూ. వడిగట్టు.

**ఒడిచికొను**

ఒలిచి వేసుకొను.

వాడుకలో ఒడుపుకొను.

"గాండీవ మాదిగాఁ గల యాయుధావళులు...అప్పు డొడిచికొనఁగ మఱచినవాఁ డయ్యె." భార. అర. 1.55.
" " 2.59.

"కనుమలో రంగమ్మను దొంగలు పట్టుకొని, ఆ నాలుగుసొమ్ములూ ఒడుపుకొని పంపించారు." వా.

"చేలో పత్తి ఒడుపుకొని రావాలి." వా.

**ఒడిచి పట్టు**

బలాత్కారముగా, గట్టిగా పట్టు.

"ఎవ్వాలును నొడిచి పట్టంగా నే యెడఁ గానక..." కళా. 6.106.

**ఒడి దప్పినపాము**

వెల్లకిల పడిన పాము.

ఒడుపు తప్పిపోయిన అనుట.

"కడు వెఱఁ గంది మురాంతకుఁ, డొడి దప్పినపామువోలె నుండఁగ." ఉ. హరి. 3.103.

**ఒడి వట్టుకొని**

రొండి పట్టుకొని; నిలవేసి. ఎవరి నైనా నిలవేసేటప్పుడు రొండిలో చెయివేసి – నడుమున కట్టుకున్న పంచెను కట్టుకున్న తావున పట్టుకొని ఆపడంపై వచ్చినది.

"ఒట్టు వెట్టి పోకు మని వొడి వట్టుకొని నిన్నుఁ, దిట్ట యై తెరలోనికి దియ్యగాను." తాళ్ల. సం. 3.140.

**ఒడిసి పట్టు**

గట్టిగా పట్టుకొను.

"పూఁబోడి యొరసికొని చనఁ గాఁ బయ్యెద యొడిసి పట్టఁ గనుగొంటి చెలీ." కళా. 1.142.

"ఆ పిల్ల చెయి ఒడిసి పట్టుకు నేసరికి బారు మని అఱిచింది." వా.

**ఒడిసెల ఆడు**

ఒడిసెలతో రాళ్లు రువ్వు.

"తా నొడిసెల జొన్నల కాడెడి, వడువునఁ బొంగ్రుండు జాల వైచెం బెలుచన్." ఉ. హరి. 3.103.

**ఒడ్డ గెడవుగా**

ఓరగిలినట్లుగా, ఒరగడ్డముగా.

"కాలు కాలు పెనఁగి కాలుబలంబులు, నొడ్డగెడవుగా రథోత్కరంబు, ద్రొంగతిలఁగ." భార. భీష్మ. 3.320.

**ఒడ్డుకు చేర్చు**

గట్టెక్కించు.

కొత. 438.

"వ న్నీకష్టాలనుంచీ ఒడ్డెక్కించే భారం నీది." వా.

**ఒడ్డు పొడ వగు**

ఎత్తు లావు గల.

"ఒడ్డుఁ బొడ వగుగుబ్బ లవయుచుఁ గానరాఁగా." తాళ్ల. సం. 4.30.
"ఆతను చాలా ఒడ్డుపొడ వైనమనిషి." వా.

**ఒడ్డోలగం బై యుండు**
కొలువు తీరి యుండు, సభ చేరి యుండు.
"బసవయ్య మొదలుగా భక్తులుఁ దాను, నసమ మొడ్డోలగం బై యున్న యెడను." బస. 6.169.

**ఒడ్డోలగంగా**
కోలాహలంగా. మహావైభవంగా.
"వాడి కూతురు పెళ్లి ఒడ్డోలగంగా జరిగింది." వా.

**ఒడుదుడుకులుగా ఉండు**
హెచ్చుతగ్గులుగా ఉండు. సరిగా లేదు అనుపట్ల ఉపయోగిస్తారు.
"ఈమధ్య వ్యాపారం అంతా ఒడుదుడుకులుగా ఉంది." వా.
"రాజకీయరంగం నేడు చాలా ఒడుదుడుకులుగా ఉన్నది." వా.

**ఒత్తి గొట్టాన పెట్టు**
బాధించు, వేధించు.
"ఒత్తి గొట్టానఁ బెట్టఁగఁ బని లేదు ఓరి నీచిత్త మింతే కాని." తాళ్ల. సం. 12.77.

**ఒత్తి పండు చేయగలమా?**
బలవంతంతో పని కాదు. ఏదైనా కాయ దానంతట అది పరిపక్వం కావలసిందే కానీ ఒత్తి ఒత్తి మెత్త బరిస్తే అది పండు కాదు. క్రమపరిణతి అవసరము అనుట.
"పలుకం బాఱని కాయలఁ గొలుపం గలఁ డెవఁడు పండ..." గువ్వలచెన్న. 12.
"అదేమో బుద్ధి వచ్చినపిల్ల. వాణ్ణి చేసుకుంటే సుఖంగా ఉంటావే అని నెత్తిన నోరు పెట్టుకుని వాళ్లమ్మ చెప్తూంది. అయినా ఒత్తి పండు చేయగలమా? దానికి తెలియాలి గానీ." వా.

**ఒత్తిలి చీరు**
గట్టిగా పిలుచు.
"చెలికత్తె నొత్తిలి చీర లేనియెలుంగు, సింహనాదంబుచేఁ జెదర వినికి." ఉ. హరి. 1.161.

**ఒత్తిలి పాడు**
నోరార పాడు.
"వాసుదేవ యనుచు నొత్తిలి పాడు నాక్రోశించు నగుఁ జింతనము సేయు నలియొనర్చు." భాగ. స్క. 7.240.

**ఒత్తుకొని వచ్చు**
త్రోసుకొని వచ్చు.
"ఒత్తుకొని వచ్చు కటి కుచోద్వృత్తిఁ జూచి." కవిక. 8.26.
"ఎంతదూరం పోతున్నా అట్లా ఒత్తుకొని వస్తా వేం?" వా.

**ఒత్తు దేరు**
ఒరసికొను; అందుతో ఉబ్బెక్కు.
"ఉరుకుచాగ్రంబు లొండొంటి నొత్తుదేఱ." కుమా. 9.148.

**ఒత్తుబోవు**

ఏదో తనకు వ్యతిరేకంగా జరుగగా భయభ్రాంతి కలుగు.

"పోయినసారి పంటకూడా పోయేసరికి బాగా ఒత్తుబోయినాడు మనిషి." వా.

**ఒబ్బట్ల సంతర్పణ**

పెద్ద సంతర్పణ.

సామాన్యంగా పాయసంతో ముగిస్తారు. అలా కాక ఒబ్బట్లతో చేస్తున్నారంటే పెద్దది కదా మరి!

**ఒదకలి యాడు**

సరసము లాడు. (?)

ఒదకలి అనగా సరస మని వావిళ్ళకోశం. ఇంకా ఆలోచించి తేల్చవలసే ఉన్నది.

"అమరధేనువుల్ ... అభిమతార్థముల్ గురిసె దేవాలిమీఁద, నెలఁతు నొదకలి యాడెడుచెలువవోలె." కుమా. 12.195.

**ఒద్దివడయు**

తోడుపడు.

ఒద్దిక అంటే మైత్రి కదా — అలా వచ్చినది కావచ్చును.

"హోమ ధూమము తావి యొద్దివడయు." కాశీ. 2.56.

**ఒనరని**

తగని.

భీమ. 2.154.

**ఒప్పన గొను**

గ్రహించు.

"కోటానకోటులు కోరికలు చిగిరించేని ...వసము గావు...వీటిని వొప్పన గొనవయ్యా." తాళ్ల. సం. 10.154.

**ఒప్పనము చేయు**

అప్పగించు.

"బాతితో సర్వము నీ కొప్పనము సేసితిమి." తాళ్ల. సం. 9.154.

**ఒప్పన సేయు**

అప్పగించు.

"సీత నొప్పన సేసి సేవచ్చినాడ." వర. రా. అర. పు. 210. పంక్తి. 17.

**ఒప్పితి ననిపించు**

ఒప్పించు; భేష్ అనిపించు.

"వేయు నేల వాని నొప్పితి ననిపించెదన్." పాణి. 2.55.

**ఒప్పు మెఱయు**

ప్రకాశించు.

"సారథిత్వంబు నాకు నొసఁగి భూసుర సహితుఁడై యొప్పు మెఱసె." ఉ. హరి. 2.36.

**ఒయ్యనొయ్యన**

మెల్లమెల్లగా; క్రమక్రమంగా.

"ఒక కొన్ని పయనంబు లొయ్యనొయ్యనఁ బోయి." కా. మా. 3.198.

**ఒరగా లగు**

కాలు కుంటువడు.

"కప్పకు నొరగాలైనను, సప్పమునకు రోగమైన సతి తులువైనన్, ముప్పున దరిద్రుఁడైనను..." సుమతి.

**ఒరగాల నేగు**

కాలు పూర్తిగా మోపకుండా నడచు.

ముల్లులాంటివి క్రుచ్చుకున్నప్పుడు ఆ భాగం ఆనకుండా నడచుటలో ఉపయోగించే పలుకుబడి.

పండితా. ప్రథ. పురా. పుట. 390.

ఒరగోను

ఒరపుపెట్టు.

"అచ్చులు నొరగొనునగనాలి యుండ."

బసవ. పు. 102.

ఒరగోయు

కత్తి కోయు. ధిక్కరించు.

"చలికి నొరగోయ కే లుండు నైరి కుండు."

క్రీడా. పు. 86.

ఒర వచ్చు

సాటి యగు, సమాన మగు.

"అప్పుడు మధ్యందినమున, నొప్పిన యినుతోడఁ జాల నొరవచ్చి గురుం, డప్పాండవబలములపై..."

భార. భీష్మ. 2.381.

"పదార్వన్నెపసిండితోడ నొరవచ్చు."

నైష. 6.50.

బంగారం వన్నె తెలియడానికి ఒరగల్లుపై గీచి చూస్తారు. ఆ ఒర పెట్టినప్పుడు ఏ వన్నె బంగారమో తేలి పోతుంది.

ఒరవెట్టు

నాణ్యము చెప్ప గలుగు.

ఒరపురాయిపై బంగారు వన్నె తెలిసికొనువాడుకపై వచ్చినది.

"పులుఁగురాయని చట్టుపలవన్నె నొరవెట్టు, హొంబట్టు జిలుఁగు కెంబెంబు తోడ."

ఆము. 1.12.

ఒరసి చూచు

పరీక్షించు.

బంగారాన్ని ఒఱపు రాతిపై గీసి చూచుట పరీక్షించుటకే - లక్షణయా పరీక్షించుట అని అర్థం.

"చూపవు నిన్ను న న్నొరసి చూచుదొ నా కిది దప్పుఁ జూచునో."

కుమా. 5.77.

ఒరిగించు

లాభము చేయు.

"వా డేం ఒరిగించా డని అంత పట్టుక దేవుళ్లాడుతున్నావు?"

వా.

ఇది సామాన్యంగా ఏం మహా చేశాడు? అన్న నిరసనలోనే ఉపయోగిస్తారు.

ఒరులు తల లెత్తి చూడగ

ఇతరులు వేలుపెట్టి చూపించునట్లుగా, ఇతరులు చూచి నవ్వి పోగా అని భావము.

"ఒరులు దల లెత్తి చూడఁగఁ,
గరకరి మనలోన వలదు..."

భాస్క. అయో. 173.

ఒరే తరే అను

ఎదుటివానిని నీచముగా సంబోధించు. చూచు.

కుమార. శత. 71.

"కనిపించే వాళ్లా ఒరే తరే అంటుంటే ఎందు కోర్చుకుంటావు?"

వా.

**ఒఱగుబిళ్ళ [ఒరగుబిల్ల]**

ఒరుగుదిండు.

**ఒఱగొడ్డెంబు లాడు**

అడ్డులు చెప్పు.

"ఒఱ్ఱగొడ్డెంబు లాడి." హరి 2.132.

**ఒఱ్ఱదనము**

కారము.

"ఆవపచ్చళ్లు చవి చూచిరి...యొఱ్ఱదనము పొగలు వెడలింప నాసికాపుటములందు." నైష. 6.121.

'ఒఱ్ఱగా ఉంది' అన్నరీతిగా నేడూ ఉన్నది.

**ఒలకపోయు**

వెలార్చు అనుటకే నిరసనగా అనుమాట.

"ఏం ప్రేమ ఒలకబోస్తున్నా డమ్మా వా డీ మధ్య." వా.

**ఒలసీ ఒల్లమి**

అంతగా ఇష్టము లేమి.

"ఒలసీ వొల్లముల నీ వొల్లకుంటె నొల్లవు." తాళ్ళ. సం. 4.117.

"ఒలసీ ఒల్లని కాపురం అంతంత మాత్రంలోనే ఉంటుంది." వా.

**ఒల్లబోవు**

మూర్ఛ చెందు, ఒడలు తెలియక పోవు, నిశ్చేష్ట మగు.

"ఒడల వాలంప పాదినింప నొల్లఁబోక." భార. భీష్మ. 3.23.

"గ్రక్కున నతఁ డొల్లఁ బోయి." భార. విరా. 5.

"గశావతి యొల్లఁబోయి విహ్వాలుఁడయి..." నిర్వ. 4.74.

"ఒల్లం బోయి." నైష. 2.139.

"కలయంగ వేనశోణితము గ్రమ్మ...పగటి పేరెండఁ దాఁకి, యొల్లఁబోయిన లేబొండు మల్లెపొదలు." ఆము. 2.56.

"రామభూవిభుఁ డొల్లంబోవంగ..." చంద్రా. 1.24.

"అప్పటి పరమమోద మెల్లఁ బోనాడి విన్న నై యొల్లఁబోయి." భాస్క. యుద్ధ. 2355.

**ఒలివడు**

సొత్తు దోపిడి చేయబడు. దోపిడికి గుఱి యగు.

"ఒలివడ్డ నెపమునఁ గల లేని సిరి చెప్పి, చుట్టలపై దాడివెట్టు వారు." ఆము. 6.

**ఒలివోవు**

వ్యర్థ మగు; దోపిడి వోవు.

"ఒలివోయి యీలేక యొక పూట వెట్టిడి, తామరచెలిపట్టిఁ దడవ నేల." యయా. 1.29.

**ఒలుకుల బూది**

చితాభస్మం. స్మశానంలోని బూడిద.

కుమా. 7.37.

**ఒలుకుల మిట్ట**

స్మశానము.

స్మశానాన్ని రాయలసీమలో నేటికీ ఒలుకులు అనే అంటారు. 'ఒ' 'వ' గా విన వస్తుంది.

**ఒల్వ్వడు**

ఓడిపోవు; ఓటమి చెందు.

"చిరముగ నొల్వ్వడ్డ నరసింహుని కంటెను బెద్దలేరి?" కుమా. 4.76.

**ఒళ్లంతా తేళ్ళూ జెర్రులూ ప్రాకినట్లు**
మహా బాధగా, ఎట్లెట్లో ఉన్న దనుట.
"ఆ మాట వినేసరికి నాకు ఒళ్ళంతా తేళ్ళూ జెర్రులూ ప్రాకినట్లయింది." వా.

**ఒళ్లు కంపర మెత్తు**
ఎక్కువ భయము కలుగు.
"ఆ మాట వినేసరికి నాకు ఒళ్లు కంపర మెత్తి పోయింది." వా.

**ఒళ్ళు జలపరించు**
ఒళ్ళు జలదరించు.
"నాకు చల్లగా ఏది తగిలినా ఒళ్ళు జలపరిస్తుంది." వా.
చూ. ఒళ్ళు జలదరించు.

**ఒళ్ళు జల్లు మను**
జలదరించు.
"కప్పను చేతితో పట్టుకొంటే కొందరికి ఒళ్లు జల్లు మంటుంది." వా.

**ఒళ్లు తడుపుకొను**
స్నానము చేయు.
"ఎండలో బడి వచ్చావా! కాస్త ఒళ్లు తడుపుకొంటే కానీ యేమీ తోచదు." వా.

**ఒళ్లు దగ్గర పెట్టుకొని**
జాగ్రత్తగా.
కాస్త బెదిరింపుగా అను మాట.
"కాస్త ఒళ్లు దగ్గర పెట్టుకొని మాట్లాడు." వా.

**ఒళ్లు దాచుకొను**
పనికి పాలుమాలు.
"వాడు పాపం ఒళ్లు దాచుకొనేవాడు కాదు. ఎంతపనైనా చేస్తాడు."
చూ. ఒడలు దాచుకొను.

**ఒళ్లు పెంచు**
పనీ పాటా చేయక ఒడలు దాచుకొను.
మదన. శత. 67.
"అట్లా దమ్మిడీ పని చెయ్యకుండా ఒళ్లు పెంచుకుంటే ఏం లాభం రా?" వా.

**ఒళ్లు నీరు విడిచి పోవు**
శీతలము క్రమ్ము, అవసాన దశ సమీపించు.
"ఒళ్లు నీరు విడిచి పోతే! ఇంకా ఆశ యేముంది?" వా.

**ఒళ్లు పెట్టు**
కండ పెట్టు.
"వాడీమధ్య బాగా ఒళ్ళు పెట్టాడు." వా.

**ఒళ్లు పొగ రెక్కు**
మద మెక్కు.
"తిరిపంతిండి తిని వాడికి ఒళ్ళు పొగ రెక్కింది." వా.

**ఒళ్లు భారగించు**
సోమరితనముగా నుండు.

**ఒళ్లు మండు**
కోపము కలుగు.
"వాడి పేరెత్తావంటే ఒళ్ళు మండుతుంది." వా.

**ఒళ్లుమరపు**
మఱపు.
"అంత ఒళ్ళుమరపు అయితే ఎట్లా రా? సాయంత్రం యిచ్చింది పొద్దునకు

ఎక్కడ పెట్టావో తెలియక పోతే ఇంకేం చేస్తావు?" వా.

ఒళ్లు హూన మగు

శ్రమతో అలసిపోవు.

"పొద్దున్నుంచీ తిరిగి తిరిగి ఒళ్లు హూనమై పోయింది." వా.

ఓం అను

అంగీకరించు.

"ఆమెయి రాయబారమున కత్యధిక శ్రద్ధఁ బూని భాస్కరుం, డోమని ధీమనాదరభసోచ్ఛ్రిత ... భేదవాదవా, త్యామయ చక్ర చంక్రమతతంబుగఁ బోరఁగ...."
శంకర. విజ. 5.60.

ఓంకార మాచరించు

అంగీకరించు.

"అభిలషింపంగ నోంకార మాచరించు." నైష. 2.69.

ఓంప్రథమంలో

మొట్టమొదట.

"ఓంప్రథమంలోనే తప్పంటే యింక ఆ పుస్తకం సంగతి చెప్ప నక్కఱ లేదు." వా.

ఓ అంటే ఓ అను

పిలిస్తే పలుకు.

"ఓ యన్న నో యనంగల, యాయమయే యున్న..." వి.

"ఓ అంటే ఓ అనడానికైనా ఎవరో ఉండొద్దా?" వా.

ఓగులవాడు

నాయకుడు, ఆదర్శము.

"పిఱికి, వారి కెల్లను నోగులవాని గాఁగ, నురముపై జీడి నిఱ్ఱి యచ్చొత్తి విడిచె." కుమా. 4.16.

వావిళ్ళలో అధమాధము చిహ్నుడు, మిక్కిలి తక్కువవా డనుగుర్తు గలవాడు అని అర్థం చెప్పి ఈ పద్యమే ఇచ్చారు. మొత్తం పద్యం అర్థ మంతా చెప్తే కుదరదు. 'పిఱికి వారిలో ఓగులవాడుగా' అంటే చాలా చాలా పిఱికి వాఁడు అని అర్థం వస్తుంది. ఓగులవా డంటేనే అధమాధము డైతే పిఱికి వారిలో ఓగులవాడుగా అని ఎందు కనవలసి వస్తుంది ?

ఓ చెల్ల !

అమ్మక చెల్లవలెనే ఆశ్చర్యార్థకం.

"పులిగూడు దిండిగొఱగం, గలిచియు నోచెల్ల! యింత గల్పించెదు శ్రీ, గలవానిఁ దగినపురుషుం, గలిచిన నీకన్ను బొమయె గను డరు దనుమా." కుమా. 7.43.

ఓజకు వచ్చు

దారికి వచ్చు,

"రథ్యము లోజకు వచ్చి మెచ్చఁగా." భాస్క. యుద్ధ. 640.

ఓటకండ

పిఱికికండ, భయము.

"అజశిరోదళనుఁ డన్న దరు లేదేనియుఁ, గాలారి యనునోటకండ లేక...పంచె నట్టియుగ్రుపై నిన్ను." కుమా. 4.61.

ఓటకండ నెడి

భయము లేక.

"ఏమేమీ మది నోటకండ వడి జేవేం ద్రాము లుద్వృత్తులై, నామీదం జనుదెంచిరే." కుమా. 10.138.

**ఓటాణు**

ఓటువడు.

"మెఱుఁగు నారసముల గిజి కొలిపిన నోటాణి." భార. ద్రోణ. 5.133.

**ఓటినోరు**

మాట దాగనినోరు, వాగుడుకాయనోరు.

ఓటికుండలో నీరు కారిపోయినట్లు, చెప్పినమాట బయటికి వచ్చివేయు ననుట.

"వాడితో ఏం చెప్పకండి. వాడిది వట్టి ఓటినోరు. ఎక్కడో అనేస్తాడు." వా.

**ఓటుపఱచు**

ఓడించు; అధఃకరించు.

"కోటచే వలయాద్రి నోటుపఱచు." కవిక. 1.2.

"పోరాట నోటుపఱచి." రాధా. 5.5.

**ఓడకుడు**

భయపడవలదు.

హర. 6.65.

**ఓడ గట్టినమూల మగు**

ఓడకు కట్టినమూలము ఓడను అనుసరించే వెళ్లుచూ పోవునట్లు—తదధీనగతి యగు.

నిరంతరసంబంధము కల దగు.

"ఓడ గట్టిన మూల పై యుండవలయు, మీకు మాకును నైన నైన మైత్రభావము." ఉద్భ. 2.211.

"ఓడ గట్టినదూల మీడు లేనిశుభంబు, చేకొద్దికించ మశేషభూతి." చంద్ర. 1.57.

"ఈ లింగములోఁ బ్రాణము, కాలము గడదాఁక నోడ గట్టినదూలం, బై లంకె నుండఁ జేసితి." కా. మా. 3.80.

చూ. ఓడతో గట్టినయోడవలె.

**ఓడతోగట్టిన యోడవలె**

నిరంతరసంబంధము గలిగి, తదధీనగతి యై.

"నెట్టన ధర్మనందనుడు నిన్నవలంబము సేసి యోడతోఁ, గట్టినయోడవోలె గతగౌరవుఁ డై కడుఁ జూలె." భార. సభా. ద్వితీ.

**ఓడబేరము**

నౌకావ్యాపారము.

"ఒకని పొత్తు గూడి యోడబేరము పోయె, దను సదాన్న దాన ధనము కొఱకు." కళా. 6.99.

**ఓడపై బ్రతుకు**

అపాయకరము.

ఓడలపై పోతుండగా ఏ నిమిష మయినా ప్రమాదము రావచ్చు ననుట.

వేంకటేశ. 36.

**ఓడలు బండ్ల వచ్చు బండ్లోడల వచ్చును**

కాలదేశాదులను బట్టి ఆధారాధేయములు మారు ననుట.

నేలపై ఓడలు బండ్లపై రాక

తప్పదు; నీటిపై బండ్లు ఓడలపై వెళ్ళక తప్పదు.

"సర్వదైవతకులాధిప! యోడలు బండ్ల వచ్చు బం, డ్లోడల వచ్చు నొండొరుల కొక్కొకచో..." ప్రభా. 1.94.

**ఓడ వచ్చు**

ఓడిపోవుటకు సిద్ధమగు.

"నీయాట యోడ వచ్చినది యనియె." కళా. 6.117.

**ఓడ విడిచి వద రిడు కొను**

గట్టిప్రాపును వదలి అనుమానాస్పదమైనప్రాపును పట్టుకొనెడిపట్ల ఉపయోగించే పలుకుబడి.

ఓడను వదలిపెట్టి సొరకాయను పట్టుకొనుట అట్టిదే కదా!

తాళ్ల. సం. 11.3. భా. 38.

**ఓడ విడిచి వదరు పట్టు**

సులభోపాయముండగా తెలిసి తెలిసి అనుమానాస్పదమైనసాధనమును గ్రహించు.

"సురతక్రీడాసౌఖ్యంబు వెడలి క్లిష్టవ్రతచ, ర్యాడంబరములఁ దగులుట, యోడ విడిచి వదరు పట్టు టుర్వీనాథా!" రుక్మాం. 4.65.

"శకనరేంద్ర చంద్ర చరణాబ్జసంసేవ, విడిచి యావిదర్భవిభునిఁ గలసి, వచ్చు టోడ విడిచి వదరు పట్టుట సుమీ, చెప్పఁ దగినమాట చెప్పినాఁడ." విక్ర. 4.64.

వాడుకలో రూపం:

"ఓడను వదలిపెట్టి సొరకాయను పట్టుకొన్నట్లు."

"అంత పెద్దకంపెనీని వదలిపెట్టి వాడేదో పదెక్కువిస్తాడని ఆ చిన్న కొట్టులో చేరడ మేమిట్రా? ఓడ విడిచి వదరు పట్టినట్లు?" వా.

చూ. ఓడ విడిచి వదరిడుకొను.

**ఓడికలు గట్టు**

కాలువలు గట్టు.

"అశ్రుప్రజం బోడికల్, గట్టన్ చూపులు చిమ్ము రేఁగి దివి రోలంబాళిఁ గల్పింపఁగా." మను. 4.68.

**ఓడికవాగు**

ఏదైనా చెఱువుకో, పెద్ద కాలువకో గండిపడి చిన్నగా పాఱువంక—వాగు.

"ఓడిపాఱె వరుణుఁ డులుకుచు నోడిక, వాగుపోలె." కుమా. 2.69.

"సురసింధు తోయములఁ గూడిన యోడికవాఁగుకైవడిన్." జై. 1.99.

**ఓడున పోసినయుదకములు**

ఊఱకే వ్యర్థమై పోవునవి.

ఓటిపాత్రలో పోసిన నీళ్లు.

"ఆడంబరంపు దేవార్చన లెల్ల, నోడునఁ బోసినయుదకంబులట్లు."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 200.

**ఓనమాలు రావు**

ఏమాత్రం చదువు రాదు.

"వాడికే ఓనమాలు రావు. వాడు నీకేం చదువు చెప్తాడు?" వా.

**ఓప ననక**

చేయజాల ననక.

"ఏమి యమరింతు వన్ని నాయింట నిండి, యున్న విప్పుడ యమరింతు నోప ననక." శుక. 3.188.

**ఓపనిది**

భరింపరానిది.

"ఓపనిదానిఁ దాల్పఁగా, నావశో మయ్యె భూరిభువనత్రయదుస్సహభారమమ్మహా, దేవు నవార్యవీర్యము." కుమా. 10.15.

**ఓపిక లేక**

ఓరిమి లేక; త్రాణ లేక.

ఏదైనా పని చేయుటకు తగిన ఓరిమి లేదన్నప్పుడే రాయలసీమలో ఓపిక లేదన్నమాట ఉపయోగిస్తారు.

ఇతరప్రాంతాల్లో త్రాణ లేదు, తగినంత బలం లేదు అన్న అర్థంలో ఓపిక లేదు అంటారు.

ఇక్కడ రెంటికీ సరిపోతుంది.

"నడువ నోపిక లేక నడుమ నడుమ." కా. మా. 3.193.

**ఓపినట్లు**

చేతనయినంతవఱకు

"ఒసఁగి క్రోలిరి మైరేయ మోపినట్లు." శుక. 3.118.

**ఓ (ఒక) ప్రొద్దున లేచు**

అర్ధరాత్రంలో లేచు.

"వాడోపొద్దున లేచి పొలానికి వెడతాడు." వా.

**ఓ మన్యథా యను**

అంగీకారమునూ, వ్యతిరేకతనూ తెలుపు.

"ఓ మన్యథా యంచు నోరయు విద్వాంసుల, గోష్ఠి కెన్నఁడుఁ గడగుఱుతు లేదు." కళా. 7.19.

**ఓ యను**

పిలిచిన పలుకు; సిద్ధమగు.

"ఒక యెలమావిక్రింద మరుఁడో యనఁగా నరుఁ డుండె నయ్యెడన్." విజయ. 1.212.

**ఓ యింత ప్రొద్దు**

చాలసేపు.

"ఓయింతపొద్దు ఏమీ తోచక అట్లా ఉండిపోతిని." వా.

రాయలసీమలో ప్రచురం.

**ఓరంత ప్రొద్దు**

1. ఒకగో జంతా.

"ఓరంత ప్రొద్దున నుపవసించె." కాశీ. 4.133.

"ఓరంతప్రొద్దున నుందు రుద్రుండ నే, నంబ గాన రుద్రదేహాఖ్య యయ్యె." కాశీ. 5.10.

2. కాసేపు.

"రతిసుఖంబులఁ జొక్కి నోరంత ప్రొద్దు." కా. మా. 2.18.

**ఓరచూపు చూచు**

1. అనాదరముగా చూచు.

"ఓరచూపు జూచేది న్యాయమా?" త్యాగరాజు.

2. కడగంటి చూపు చూచు.

శృంగారసూచకము.

"సొగసి సొగయించు వెలఁది యోరచూపు చూచి." హంస. 3.81.

ఓరజాఱు లేక

తొలగి పోక. జం.

తొణకక బెణకక వంటిది.

"ఒక కొంతవడి యోరజాఱు లేక...
(సైన్యములు రెండును పోరెను.)"
సుదక్షి. 5.87.

ఓరపారలు దిద్దు

తప్పొప్పులు సరి చేయు.

"సత్కవీంద్రులు రచియించి చదువు
పద్య, సమితియం దోరపారలు చక్క
దిద్ది." కువల. 2.9.

ఓరమోమిడు

1. మొగము ప్రక్కకు త్రిప్పుకొను.

"హా! శ్రీహరీ!, యంచున్ బ్రాహ్మ
ణుఁ డోరమోమిడి తదీయాంసద్వయం
బంటి పొ, మ్మంచున్ ద్రోచె."
మను. 2.68.

2. అయిష్టతను సూచించు.

"తమకు మ్రొక్కం దారు మ్రొక్క
కొక్కించుక యోరమోమిడి."
ఆము. 4.35.

ఓరలు వాఱ చూచు

ఓరగా చూచు.

"అతని నోరలు వాఱఁగఁ జూచు."
భార. అను. 1.281.

ఓరలు వోనాడు

వంకలు పెట్టి దూషించు.

"పెద్దల భీష్మాదుల ధిక్కరింపఁ దగ
దెతం జాల రీకైదు వోరలు వో
నాడకు." ఉ. హరి. 3.13.

ఓరవోవు

ప్రక్కకు తొలగు.

"గుజ్జంబుల కుఱికి బడలు వడ నటిముఖి
విసరిన నోర వోయిన సురియం జెరివి
యవలీలం గాలుబలంబుల పైఁ బడి."
భార. భీష్మ. 2.71.

ఓలగందము

స్నానము చేయునపుడు పూసుకొనుగంధవాసి.

"ఓల గంధపుఁ బసుపులు నూని
వెలుఁగు." రాధా. 5.210.

ఓలమాసగొను

1. విశ్రాంతి గోరు.

"అతిథి నినుఁ గోరి చేనియు, మతిఁ
గింకిరిపడక యోలమాసగొనక నీ, వతి
నికిఁ బ్రియంబు సల్పుము."
భార. అను. 1.68.

2. ఏకాంతమును నభిలషించు.

"...ఉభియ,బలసుఁ బోటు లాడెఁ జల
మున నొక్కింత, యోల మాస గొనక
యొాలి నార్చి." నిర్వ. 4.60.

"పృథ్వీశతనయ, యవని కాంతిరమున
నోల మాసఁ గొనియె." నైష. 4.97.

ఓలలాడు

తేలియాడు.

"తడఁబడ నోలలాడుచు హాళాహాళిగాఁ
బడి సీదులాడెడిన్." జైమి. 1.28.

ఓలాడు

ఓలలాడు.

"క్రమ్మతావి నోలాడుచు...."
కుమా. 9.102.

ఓసి యన్న నో యనుట కైన

చవా బిచ్చుట కైన.

వాడుకలో – 'పిలిస్తే పలికే
దిక్కు లేదు' మొదలైన

పలుకుబడులలోని భావమే ఇం దున్నది.

"ఒకతె రూపసి గాకున్న నోసి యన్న, నో యనెడుమాత్రమున కైన నుండ వలయు." శుక. 3.342.

**ఓహరిసాహరిగా**

హోరాహోరిగా.

"ఓహరి సాహరి నురస్యాల చేరుగా, పెనుకొంచుఁ బెరలుచుఁ బెనఁగు వెడలు." భార. విరా. 3.165.

"యుద్ధము సేయఁజాలకయ యోహరి సాహరి సెంత చెప్పినన్." శివ. 4.62.

**ఔగాదనక**

ఏమీ అనక.

ఔను, కాదు – అనకుండా.

"భూనాయకుఁ డిది యౌఁ గా దన కీయెడ." సారం. 2.273.

**ఔగా దనక యుండు**

న్యాయాన్యాయ నిర్ణయం చేయక మౌనము వహించి యుండుట.

"నాకు మొగ మోడి యౌఁ గా దనక తపస్వులు." పాండు. 5.243.

"నే నింతసూరం మీతో మొఱపెట్టు కుంటే మీరు ఔను కాదు అని చెప్ప కుండా కూర్చుంటే నే నింక యెక్క డికి పొయ్యేది?" వా.

**ఔగాదను**

అడ్డు చెప్పు; విమర్శించు.

"యాదవసింహ! నా తలఁపు నప్పుడు వారల పాటొకింత యౌఁ, గా దను వాఁక లేదు గలఁకం బడఁ జొచ్చె...." ప్రభా. 1.83.

**ఔగాములు**

మంచిచెడ్డలు; సత్యాసత్యాలు.

"దీని యౌఁగాము లన్నియుఁ దెలిసి శిక్ష...." పరమయోగి. 3. ఆ.

చూ. అవుగాములు.

**ఔడు గఱచు**

కోపముతో పెదవి గఱచు.

కోపము వచ్చినప్పుడు సహజముగా పెదవి బిగించడం, పండ్లు కొఱకడం అలాంటివి చేస్తారు. వానిమీద వచ్చిన పలుకుబడి.

"కన్ను లెఱ్ఱఁగా నెగాదిగఁ గన్గొని యౌడు గఱచి దీని నాటదాని...." శుక. 4.39.

చూ. ఔడుకొట్టు.

**ఔడు మాయు**

ఖండిత మగు.

పెదవి దాటివచ్చు అని వావిళ్లని.

"అగ్ని నాలుక లేదు నౌడు మాసిన యప్పు, డుడురాజు పొట్ట గుజ్జుతికి నపుడు." భీమ. 6.44.

**ఔదల యంటి చూచుకొని**

దెబ్బ తిని.

ఏదైనా శాస్తి జరిగినప్పుడు ఒళ్లు యథాస్థితిలో ఉన్నదా లేదా అని పట్టి చూచుకొన్నాడు అన్న వ్యంగ్యార్థంలో ఉపయోగించే పలుకుబడి.

"సలసల మను కలశజు వె, గ్గలపుం గినుక యను వెసటఁ గలవడి వడి నాఁ,

దల యంటి చూచుకొని యే, యిలు వెడ
లితి నాత్మ నంబ యెత్తినభీతిగా."
పాండు. 5.207.

**ఔదల లూచి మెచ్చు**

సెబా సని మెచ్చు.
మెచ్చుటలో తల ఊపుటపై
ఏర్పడినపలుకుబడి.

"అప్పప్ప యి దౌర యంచు జను
లందఱు నౌఁదల లూఁచి మెచ్చఁగన్."
హంస. 1.34.

**ఔదల వంచుకొను**

అవమానముతో – తల వంచు
కొను.

"శివి నటించెనా దేవలోక పురంభ
నొంచక యౌఁదల వంచుకొనును."
రాధి. పీఠిక. 20.

**ఔదల వంచుకొన జేయు**

అవమానపడజేయు.

"అసురేంద్రుని ముందట మాకు
నౌఁదలల్, వంచుకొనంగఁ జేసితివి."
భాగ. స్క. 7.152.
చూ. తలవంపులు.

**ఔదెంచు**

అగు.

"తడ నౌదెంచెఁ బుళిందరాజ."
హర. 7.59.

**ఔనను**

సెబా సను, మెచ్చుకొను.

"పలికి తుత్ప్రేక్షోపమలు జాతి పెం
పెక్క, రసికు లౌనన మదాలస
చరిత్ర." ఆము. 1.13.

"మృగీమదం, బడరెడు పట్టుచీర సొగ
సౌ ననఁ దాల్చి నృపాలు కేళికిఁ
నడచె వధూలలామ..." హంస. 3.4.

**ఔనౌను!**

ఔనౌను లే; సరే సరే!
నేటికీ వాడుకలో ఉంది.

"ఔనౌ ఏ పోటును జూతము రమ్ము."
కుమా. 12.20.

**ఔరు సౌ రగు**

చెల్లాచెద రగు.

"చీకటి యౌరు సౌరుగా."
కాశీ. 1.125.

**ఔ లెండు!**

సరే.

"ఔ లెం డిటు విమర్శ మార మైన
వాకిట వసించు నెవ్వఁ డన్యారు
నగుచు." ఆము. 4.7.

**కంకణబలము కలిసి వచ్చు**

వివాహమునకు దైవబలము
కలిసి వచ్చు.
వివాహం దైవికం అన్న
భావంలో యేర్పడినపలుకు
బడి.

"మనం ఎన్ని ప్రయత్నాలు చేస్తే నేం?
కంకణబలం కలిసి రావాలి కాని." వా.

**కంకణము కట్టు (కొను)**

ప్రతిజ్ఞ పూను.
శుభకార్యాలలో ఈ కర్త
వ్యాన్ని నెరవేరుస్తా నన్న
దృష్టితో చేతికి కంకణం
కట్టడం అలవాటు. దానిపై
వచ్చిన పలుకుబడి.

"ముఖ్యవ్రతస్ఫూర్తి ముంజి కట్టెడు
నాఁడె, కవులఁ బ్రోచుటకుఁ గంక
ణము కట్టె." పాండు. 1.41.

"కంకణము కట్టుక యుండెదు నిష్పజ్జపుం, కోర! కంకణంబు పెండ్లికొడుకంచు..." పజ. 3.154.

"వాణ్ణి సర్వనాశనం చేస్తా లని వీడు కంకణము కట్టుకొని కూర్చున్నాడు." వా.

"వాణ్ణెలాగైనా పైకి తేవా లని నేను కంకణం కట్టుకొన్నాను." వా.

**కంకణములు కట్టు**

దీక్ష పట్టు.

ఏ వైదిక - శుభ కార్యాని కైనా ముందు దీక్షాకంకణం కట్టుకొనుట ఆచారం. అందుపై ఏర్పడిన పలుకుబడి.

"కట్టుగ్రతతుల కంకణములు గట్టి, ... చౌకు నుక్కడంచు, పెరవ తలంచుచు."

పండితా. ద్వితీ. మహి. పుట. 9.

చూ. కంకణము కట్టు.

**కంకరగాడిద**

కంచరగాడిద.

బరు వైనపనులు చేయునది.

"గాడిదల్ కొడుదన్ను కంకరగాడిదల్." సానం. 2.8.

**కంకురుకుంకలు**

ఒక తిట్టు.

"కంకురుకుంక లైనపలుగాకి కలాపుల తిట్లు." పాణి. 1.173.

**కంకులు పెట్టు**

నిందించు.

బ్రౌను.

**కంగనాడు**

వంచించు, అబద్ధ మాడు.

"బంగారు మెరుగుచాయ పడఁతి నొక్కతె గూడి, కంగనాడేవు నాతో కానియ్యరా." తాళ్ల. సం. 3.51.

**కంగా బింగా**

నలిగీ నలగనట్లుగా, తొందరగా.

'ఆ మిరియాలు కంగాబింగా నమలి మింగు'. 'వాడు కంగా బింగా రెండు మెతుకులు తిని రైలుకు పోయినాడు' వగైరా.

వావిళ్ళ.

**కంగారు పడు**

ఆందోళన చెందు.

"ఉత్తరం వచ్చిం దనగానే అతను చాలా కంగారు పడ్డాడు." వా.

**కంగారెత్తు**

భయసంభ్రాంతి కలుగు.

"ఆ వీధిలో వాళ్ల నాన్న కనిపించే సరికి కంగా రెత్తి పోయాడు." వా.

**కంచంతకాపురము**

మిక్కిలి పెద్దది.

కంచి + అంత కాపురము. కంచి ఆ నాళ్ళలో ఉన్న మహానగరాలలో ఒకటి; పడువాడల ఊరు. దానిమీద వచ్చినపలుకుబడి.

"కాపుఁ గోడలు కంచంత కాఁపురంబు...గాడ్పుఅచి యుతికె."

పాండు. 3.80.

"...............వింటను జొచ్చిన దేమి చెప్పు కం, చంతటికాపురంబు సతు తానసఁ జేసెదు జాతి నీతి..."

తారా. 3.66.

**కంచ మరసి పెట్టు**

కావలసినంత భోజనము పెట్టు—కడుపార అనుట.

"ఓ మగువ యతని కన్నను, ప్రేమంబునఁ గంచ మరసి పెట్టుము దినమున్." శుక. 3.360.

చూ. కడుపు చూచి పెట్టు.

**కంచము కాల దన్ను**

ఆదరముతో పెట్టినదానిని తిరస్కరించు.

"పెంచేటి తల్లిదండ్రులు ప్రియమై వడ్డించగాను, కంచము కాలదన్న సంగతి యా బిడ్డలకు." తాళ్ల. సం. 8.20.

"అతను ఆదరించి పిల్ల నిస్తానంటే తిరస్కరించడం ఏం పనిరా? కంచం కాల దన్నిపోతే కడి పుట్ట దంటారు పెద్దలు." వా.

**కంచముచెంత పిల్లి**

సమయంకోసం వేచి ఉన్నవాడు – వేచి ఉన్నది.

ఎప్పు డింత పడవేస్తారా అని కంచందగ్గర పిల్లి కాచుకొని ఉండుటపై వచ్చినపలుకుబడి.

"అతఁ డది యాది గాఁగ నయ్యాబల మగని, మొఱఁగి చావడిలో నిల్చి మొగము సూపుఁ, జిన్నలకు లోఁగుఁ గంచంబు చెంతపిల్లి, కరణి నెదురింటి వాకిటఁ గాచి యుండు." శుక. 2.181

**కంచము పొత్తు**

సపంక్తిభోజనము.

"కలయ మోవితేనె లాసగు కంచము పొత్తు లెన్నండె." తాళ్ల. సం. 3.597.

"సమానులతో తప్పా కంచంపొత్తూ మంచంపొత్తూ పనికి రాదు." వా.

**కంచములోపలి రాయి**

అనుభవింప నుండగా అడ్డుపడునది.

"చంద్రికాపాయి కంచంబులోపలి రాయి, కౌశికావళికిఁ గన్మానినంత." చమ. 3.39.

**కంచరగాడిద**

ఒక తిట్టు. బల మున్నా పని చేయ లేని పనికి మాలిన వాడు.

"వాడు వట్టి కంచరగాడిద. ఇంకెవరైనా పంపండి. వా డేం చేసుకొస్తాడు?" వా.

**కంచిగరుడసేవ**

దండుగ.

కంచిలో గరుడోత్సవాని కని పోయి జనసమ్మర్దంవల్ల దైవదర్శనం చేసుకోకనే వత్తురనుటపై వచ్చినపలుకుబడి.

"ఊరికే వెళ్ళా మన్న మాటే కాని పనీ కాలేదు పాటూ కాలేదు. వట్టి కంచిగరుడసేవ అయిపోయింది." వా.

**కంచిమేక**

పెద్దపొదుగు గల ఒకరకమైన మేక.

ఎక్కువ పాలిస్తుం దంటారు.

**కంచియే!**

దూరమా!

కంచి ఆంధ్రదేశం సరిహద్దు

లో నున్నది. కావున దూరంగా భావింపబడేది.

కథ కంచికి వెళ్లుట కూడా దానిపై వచ్చినదే.

"కంచియే పడుకిల్లు."

విజయ. 3.200.

**కంచుకాగడా వెలిగించి చూచినా**

ఎంత వెదకినా కనబడ దనే అర్థంలో ఉపయోగించే పలుకుబడి.

కంచుకాగడా ఎక్కువ వెలుగు నిస్తుంది.

"కంచుకాఁగడ వెలిఁగించి కనినఁ గాని, వలపు కన్పట్టునే వారవనితల కును." శ్రవ. 4.51.

"కంచుకాగడా వేసి చూచినా వానిలో దయాదాక్షిణ్యం కనిపించదు." వా.

**కంచుకుత్తుక**

హెచ్చుస్థాయిలో పలికే కంఠము.

కంచు ఖణేలు మంటుంది.

"కంచుఁ గుత్తుకలవారి గానములఁ జొక్కి చొక్కి, కంచుఁజెంచు నాయెఁబో నా కడలేనిగుణము."

తాళ్ల. సం. 5.226.

రూ. కంచుగొంతు.

**కంచుకొమ్ము**

రాజులు – దేవతలు బయలు వెడలినప్పుడు కొమ్ము పట్టుట ఆచారం. ఆ కొమ్మును కంచుతో చేసి ఉంటారు.

"ముందటను గంచుకొమ్ము మిన్నందిమొరయ." వై. జ. 4.78.

**కంచు గీసిన ట్లుండు**

ఖణేలు మను.

"ఆపిల్ల గొంతెత్తితే కంచు గీసినట్లే." వా.

**కంచుపదను**

చాలా పెళుసు.

ఏయింత కయినా విఱిగి పోవు ననుట.

కంచు చాలా పెళుసైన లోహము.

"...ఎం, తని వచియింతుఁ గంచుపద నాచెలి సెమ్మన మెంచ నుదవా!" రాధా. 2.19.

**కంచు పెంచు నగు**

విఱిగిపోవు.

"కంచుఁ గుత్తుకలవారి గానములఁ జొక్కి చొక్కి, కంచుఁ బెంచు నాయెఁబో నా కడలేనిగుణము." తాళ్ల. సం. 5.226.

**కంచు మించగు**

చెల్లాచెద రగు, ముక్కలు ముక్క లగు.

కంచు చాలా పెళుసైన లోహం. కొంచెం దెబ్బ తగిలినా ముక్కలు ముక్కలై పోతుంది.

"కాఁక మించుల వినుమానికం పు జోదు, మంచుగమిఁ గంచుమించు గావించుకరణి..." వసు.

"కంచుమించై పాఱఁ గ్రమ్మఱఁ జేరు." రంగ. అరణ్యా. 172 పు.

**కంచుమించుగ**

చెల్లాచెదరుగా.

"కంచుమించుగ నడవి మెకములఁ గదుము నివిగో బలు సివంగులు." శుక. 1.222.

"కంచుమించుగ ధరణి గ్రక్కదల." సా. 1. 83.

**కంచురాయి**

శబ్దించే ఒకవిధ మైనరాయి. బ్రౌను.

**కంచెకోట**

కంచెగా కట్టినకోట; హద్దు; రక్షకము.

చూ. కంచెగోడ.

**కంచెగోడ**

చూ. కంచెకోట.

**కంజాయింపుగా**

మంచి వసతిగా.

అన్నీ అమరి ఉన్న వనుట.

"వారి యిల్లు మంచి కంజాయింపుగా ఉన్నది." వావిళ్ళ.

**కంటక మగు**

సరిపడని దగు, విరుద్ధ మగు.

"ఇంట భుజించితిం గడఁగి యింటికిఁ జేటుఁ బొనర్చితిం దుదిం, గంటక మైతి నీమదికి గాసి ఘటించితి..." త్రిశంకుస్వర్గం. అం. 7.82 పే.

"నే నంటే వాడికి కంటక మయి పోయింది. ఎందుకో మతి?" వా.

**కంటక మాడు**

పరుషము లాడు.

"అతిమిననుఁ జివురునకు నగునె కంటక మాడ." మను. 3.84.

**కంటకములు పల్కు**

మనసు నొచ్చునట్లు మాట్లాడు, దూషించు.

"కంటకంబులు పల్కఁగా కేమి దీన." గౌ. హరి. ద్వితీ. పంక్తి. 200.

**కంటకురాలు**

క్రూరురాలు.

కంటకము వంటిది.

"ఆ, కంటకురాలు పల్కిన వికారపు మాటలు." నిరంకు. 3.3.

**కంట తడి బెట్టు**

దుఃఖించు.

"వాళ్ల యింటాయనను తలచుకొని తలచుకొని ఆవిడ కంట తడిబెట్టు కొంటుంది." వా.

రూ. కంట తడిబెట్టు.

**కంటద్దాలు**

సులోచనాలు.

"కంటద్దా లుంటేనే గానీ అత నో అక్షరం చదవ లేడు." వా.

**కంటను వత్తి పెట్టుకొని**

అతిశ్రద్ధగా, ఎల్ల వేళల.

"బ్రహ్మ మిత్రుండు శిష్యులకున్ గంటను వత్తిఁ బెట్టుకొని యాయుర్వేద మోరంత ప్రౌఢులఁ జెప్పన్ వినుచుండి." మను. 5.7.

కనులు మూతలు పడు నేమో యని వత్తులు వేసికొని యనుట. వాడుకలో నేటికీ ఉన్నది.

"కంట వత్తి పెట్టుకొని ఆమె ఆ రోగికి సేవ చేసింది" వా.

చూ. కంట వత్తిడుకొని.

**కంటపడిన....**

కనిపించిన ప్రతిదానికీ, ప్రతివానికీ అనువైనట్లు ఉపయోగించే పలుకుబడి.

"ఆత్మజాతకోసంగుఁ డనుచు దేవుం డని, యేకంటఁ బడురాతి కెల్ల మ్రొక్కి." కవల. 3.65.

"కంటపడినవాళ్ళల్లా పలకరిస్తూ ఉంటే మన మీ రోజు ఇల్లు చేరుకున్నట్లే." వా.

**కంటపడు**

1. కనబడు.

"వా డీమధ్య నాకు కంటపడ్డం అపురూపమై పోయింది." వా.

2. కంటికి కాను.

"వాడికి నీవూ నేనూ యిప్పుడు కంట పడతామా?" వా.

**కంట పిడుక బ్రాయు**

మోసగించు, కంట దుమ్ము కొట్టు.

"సంఠకాత్రి, కంటఁ బిడుక బ్రాయి గర్వంబు గిర్వంబు, నుడుప నైతినేని నొట్టు పెట్టు." దశా. 6.69. దశ. 6.54.

చూ. కంటిలో దుమ్ము కొట్టు.

**కంట పిడకలు గట్టు**

నానాబాధలు పెట్టు. మోసగించు.

"అచ్చుగాఁ దీర్చి యాయప్పని కొన్ని, యచ్చిక బుచ్చిక లాడి పత్రములు, గెంటక యిచ్చి యాక్రియ నూఱు వేలు, కంటఁ బిడకలు గట్టి కైకొని పిదప." గౌర. హరి. ద్వితీ. పంక్తి. 638.

చూ. కంట పిడుక బ్రాయు.

**కంట వత్తిడుకొని**

మిక్కిలి శ్రద్ధగా.

"కంట వత్తిడుకొని సైరికప్రభుండు." పాండు. 3.56.

చూ. కంటను వత్తి పెట్టుకొని.

**కంటస పడు**

కోపపడు.

కుమారీ. శత. 38.

**కంటసరి**

మెడలో వేసుకునే ఆభరణము.

కంటెసరి అని నేటివాడుక.

**కంటికసవు**

కంటిలోని నలుసు మెఱమెఱలాడుతూ బాధ కలిగిస్తుంది. అట్లే అనుక్షణబాధాకరుడు, భయంకరుడు అనుట.

"బ్రహ్మవాదుల కంటికసవు." పండితా. ప్రథ. వాద. పుట. 511.

చూ. రొమ్ముగూటము.

**కంటి కాగు**

కంటి కాను; తగుపాటి మనిషిగా కానవచ్చు.

"ఈమాత్రం ఆమాత్రం మనిషి వాడి కంటి కాగేట్టు లేడు." వా.

చూ. కంటి కాను.

**కంటి కాను**

ప్రియము గు.

తగినంత గొప్పగా కనబడు.

"ఆ మాత్ర మైనా లేకపోతే కంటి కానదు." వా.
"మనం కాస్త దెబ్బ తిన్నా మా? ఇప్పుడు వాడికి కంటి కానడం లేదు." వా.

చూ. కంటి కాగు.

**కంటి కింపగు**

ప్రియ మగు.

"అంతకంటెను గంటికి నింపైన వాలు గంటిం గంటిన్." కళా. 5.116.

**కంటి కింపిత మైతే వంటి కింపిత మవుతుంది**

ప్రతిదీ అందంగా ఉండా లనే పట్ల ఉపయోగించేపలుకుబడి.

"ఎన్ని పెడితే నేం? కాస్త ఇల్లూ, పాత్రలూ శుభ్రంగా ఉండక పోతే. కంటి కింపిత మైతేనే వంటి కింపిత మవుతుంది." వా.

**కంటి కింపైన**

మనోహర మైన.

"కంటి కింపైన వన్నీ కావా లంటే ఎక్కడనుంచి వస్తాయి." వా.

**కంటికి కంటకించు**

చూడ లేక పోవు; అసూయ కలుగు.

"...గందవాడిలోపల బూరుగు వట్టి నట్టు లిద్దఱ కొక సౌఖ్య మబ్బినను దైవము కంటికిఁ గంటకించెనో." తారా. 4.58.

**కంటికి కడవెడుగా ఏడ్చు**

విపరీతముగా దుఃఖించు.

"కంటికిఁ గడవెడు గాఁగ నేడ్చుచును." పల. పు. 99

**కంటికి కడవెడునీళ్ళుగా**

ఎక్కువగా దుఃఖించె ననుట.

"పాపం! ఆపిల్ల కంటికి కడివెడు నీళ్లుగా ఏడుస్తూ కూర్చుంది. ఉన్న కాస్త ఆదరువూ పోతే ఏం చేస్తుంది పాపం!" వా.

**కంటికి కమికెడు కావర ముండు**

చాలా పొగరెక్కి యుండు అన్న సందర్భంలో ఉపయోగిస్తారు.

"వాడికి కంటికి కమికెడు కావరం ఉంది. ఒకడు చెబితే వింటాడా?" వా.

**కంటికి దిసింతురె**

లక్ష్య మగుదురా?

దృష్టి + ఉంచు – దిసించు అయి ఉంటుంది.

"కాపు లచ్చెరుపడ నాదుకంటికి దిసింతురె వీరని యాతఁ డుబ్బునన్." శుక. 2.439.

"ఒకింత నవ్వినన్, వెనుక దిసించి చూడ రవనిన్ మగవారల నమ్మ రాదు." శృంగారసావిత్రి.

"కులుకుఁ జెక్కులు పసిఁడియాకుల దిసింపఁడఁ, జన్నికుచములు పోకల చెన్ను మీఱు." ముకుందవిలాసము.

"నీకు వా డొకలక్ష్యమా?" వా.

"నాకంటికి వా రానరు." వా.

"వాడి కంటికి మన మిప్పుడు కనబడ తామా?" వా.

ఇలా వాడుకలో రకరకాల మారే పలుకుబడి రూపాంతరమే యిది.

**కంటికి నిదుర రాదు**

నిద్ర పట్టదు; మనశ్శాంతి లేదు.

"నిముస మైనను నాదుకంటికి నిదుర రాదు." సుగ్రీ. పు. 11.

"వాడు వచ్చే దాకా నా కంటికి నిద్ర రాదు." వా.

**కంటికి నిదుర వచ్చు**

మనశ్శాంతి యేర్పడు.

"నా కంటికి, నిదుర వచ్చు నేడు నీర జాక్ష!" భార. కర్ణ. 3.390.

"ఈ యీడువచ్చినపిల్లకు పెళ్ళయితే నే నాకంటికి నిద్ర వస్తుంది." వా.

**కంటికి పంపెడునీళ్లుగా ఏడ్చు**

ఎక్కువగా ఏడ్చు.

మానినీ. 49.

**కంటికి పుట్టెడుగా ఏడ్చు**

ఎక్కువగా విలపించు.

"ఎన్నాళ్లయినా కొడుకు రాకపోయే సరికి ఆవిడకంటికి పుట్టెడుగా యేడుస్తూ కూర్చుంది." వా.

**కంటికి ప్రియ మగు**

కంటికింపగు. మనోహర మగు.

"పరపురుషభోగాయత్తచిత్త లగుటం గ్రందుకొను సందడిం బడి కంటికిం బ్రియ మైనవానిం గామించియు..." శుక. 2.10.

**కంటికి భార మగు**

చూడ లేక పోవు.

"ఇపుడు విధికంటి కకట! మే మింత భార, మైతిమే మంచుఁ దలపోసి యలమటించు." నలచ. 5.145.

**కంటికి ఱెప్పచందమున**

మిక్కిలి జాగ్రత్తగా కాపాడు పట్ల ఉపయోగించు పలుకుబడి.

కంటిని ఱెప్ప కాపాడినంత జాగరూకతతో అనుట.

చందమునకు బదులు ఉపమార్థకాలు అన్నిటితోనూ ఇది ఉపయుక్త మవుతుంది.

"...పాండురాజసుతు లేవురుఁ గంటికి ఱెప్పచంద మై, హరి తముఁ గావఁగా వెలసి రక్షితదేహవిలాససంపదన్." భార. శల్య. 1.54.

**కంటికి ఱెప్పవలె**

ఇది నేటికీ వాడుకలో ఉన్నది.

"నన్నెప్పు డెడ సనక కంటికి, ఱెప్ప వలెం గాచి తిరుగు రేయిం బవలున్." శుక. 1.389.

"అన్న పోయినప్పటినుంచీ తమ్ముడు ఆ పిల్లలను కంటికి రెప్పలాగా చూచుకుంటూ వస్తున్నాడు." వా.

చూ. కంటికి ఱెప్పచందము.

**కంటికీ మంటికీ ఏకధారగా**

నిరంతరాశ్రుపాతంగా

"కంటికీ మంటికీ నేకధారగా కంటి నీళ్లు కురిపించాను." వి.

**కంటి తడి యార లేదు**

ఇంకా దుఃఖోపశమనము పూర్తిగా కాలేదు.

ఏడువగా చిప్పిల్లిన కంటి నీళ్లింకా ఆరిపోయేంత సావకాశం కూడా లేదనుట.

"మొగుడు పోయి మూడు నెలలు కాలేదు. ఆ కంటి తడి యారక ముందే పిల్లవాడికి జబ్బు చేసింది." వా.

## కంటినొప్పి

పీడ, బాధకము.

కంటిబాధ భరింపరాని దన్న దానిపై వచ్చినపలుకుబడి.

"కాసరంబులపాలిటి కంటినొప్పి." శుక. 2.283.

## కంటి ముంటి పడినా

ఎంత అవస్థ పడినా, ఎంత గింజుకొన్నా.

"తనకును గంటి ముంటి పడినం బడు టింతియ కాని సొమ్ము రా, దని మహి భరణం దెలిపి యంపుము నీవని యంపె నాతఁడున్." పరమయో. 4.148.

## కంటిలో కన్ను పెట్టుకొని చూచు

అతిజాగ్రత్తగా పరిశీలించు-చూచు.

"కంటిలో కన్ను పెట్టుకొని చూచినా అచ్చుతప్పు లేవో మిగిలిపోయినవి." వా.

## కంటిలో కలికానికి లేదు

బొత్తిగా లేదు.

కలికం కంటికి వేసే మిరియాల గింజవంటి వాని గంధం. అది ఏ కాస్త అయినా చాలు. ఆ యింతకు కూడా లే దనుట.

"ఇంట్లో చక్కెర కంటిలో కలికానికి కూడా లేదు. ఇప్పుడు తెస్తే గానీ రేపు కాఫీ ఉండదు." వా.

చూ. మందుకు లేదు.

## కంటిలో కారము చల్లు

మోసగించు.

చూ. కంటిలో మిరపపొడి చల్లు.

## కంటిలో కొరవెండ్రుక

కంటిలో నలుసు.

"కంటిలోఁ గొరవెండ్రుకయు రచ్చ మట్టిని..." హంస. 5.109.

చూ. కంటిలోని నలుసు.

## కంటిలో దూరు

కంటి కాను.

"నీవు ఇప్పుడు చుట్టాలూ పక్కాలూ కంటిలో దూరడం లేదు." వా.

చూ. కంటి కాను.

## కంటిలో నలు సై పోవు

కనబడుట అరు దగు.

"ఈ మధ్య కంట్లో నలు సై పోయా వేం ?" వా.

## కంటిలోని నలుసు (నెరసు)

ఎక్కువ బాధించునది.

"కంటిలోని నలుసు కాలిముల్లు." వేమన.

"వాడా ఊళ్ళో కంటిలోని నలు సై కూర్చున్నాడు." వా.

"వాడు కంటిలోని నలుసుగా తయా రయ్యాడు." వా.

## కంటిలోని నెరసువలె

మెఱ మెఱ లాడుతూ; మిక్కిలి బాధిస్తూ...

"...పుష్కరుచేఁత యుల్లమం, దున్నది కంటిలోన నెర సున్నవిధంబున..." నలచ. 6.260.

చూ. కంటిలోని నలుసు.

**కంటిలో నిప్పులు పోసుకొను**

ఓర్వలేక పోవు, అసూయపడు.

"కాస్త మంచి చీర కట్టుకొంటే ఆవిడ కంట్లో నిప్పులు పోసుకొంటుంది." వా.

**కంటిలో పడు**

తగినంత మంచిస్థితిలో ఉండు, గుర్తింపబడు.

'కంటిలో పడతామా?' 'పడెము' అన్నట్లు వ్యతిరేకార్థంలోనే ప్రచురం.

"మేమంతా నీకెప్పుడు కంట్లో పడతామా? నువ్వేమో పైఅంతస్తులో ఉంటివి. మేమేమో మామూలు మనుషుల మైపోతిమి." వా.

**కంటిలో మిరపపొడి చల్లు**

మోసము చేయు, కన్నుగప్పు.

"నా కంటిలోనే మిరప్పొడి చల్లా లని ప్రయత్నించాడు." వా.

చూ. కంటిలో కారము చల్లు. కంట్లో...

**కంటు గట్టు**

విరోధము పూను, పగ పట్టు.

"వాడు నామీద కంటు గట్టాడు. నన్ను సర్వనాశనం చేసేదాకా వదల డట. అదీ చూదాం." వా.

**కంటువడు**

విరోధము గొను.

"మింట నుండి కంటఁ బడి కంటు వడఁ గరిసున కిట్లనియె."

భాగ. 10. పూ. 153.

వాడుకలో రూపం:

"వాడికి నామీద కంటుగా ఉంది." వా.

ఇందులోని 'కంటు' ఇదే.

**కంటు వాయు**

పగ దీరు

"అరిది శ్రీ వేంకటేశుఁ డలమేలుమంగఁ గూడి, గరుడనిమీఁద నెక్కి కంటు వాయ నేసెను." తాళ్ల. సం. 6.107.

**కంటు పుట్టగ**

కంటకముగా; ద్వేష మేర్పడు నట్లు.

"బంటు నాడినయట్లు పదుగురు వినఁగ కంటు పుట్టఁగఁ బలుకఁగ నోర్వలేక." వర. రా. యు. పు. 64. పంక్తి. 10.

**కంటె బొట్టు వేయు**

తాళి కట్టు, వివాహ మాడు.

బ్రౌను.

**కంట్లో కారం చల్లు**

మోసము చేయు.

"నా కంట్లో కారం చల్లా లని ప్రయత్నం చేశాడు. కానీ నేను ముందుగానే జాగ్రత్త పడడంవల్ల వాడిపాచిక ఏమీ పారలేదు." వా.

"ఆవిడ మొగుడికంట్లో కారం చల్లి ఊరంతా చక్కబెట్టుతూ ఉంది." వా.

చూ. కంటిలో మిరపపొడి చల్లు; కంటిలో కారముచల్లు.

**కంఠంలో ప్రాణ మున్నంత వరకూ**

తుదిదాకా.

ఎప్పటికీ నే నిందుకు అంగీకరించను – పాల్పడను అను పట్టుల ఉపయోగించే పలుకుబడి.

"నా కంఠంలో ప్రాణం ఉన్నంత

వరకూ ఒకరిని దేహీ అని యాచించను.” వా.
రూ. గొంతులో ప్రాణ మున్నంతవరకూ.

### కంఠగతప్రాణంగా
కొన ఊపిరితో.
“వా డిప్పుడు కంఠగతప్రాణంగా ఉన్నాడు.” వా.

### కంఠగతప్రాణ మగు
ప్రాణాపాయస్థితిలో నుండు.
కొనఊపిరితో నుండు.
“ఇట్లు క్షుధాతురత్వంబునఁ గంఠగత ప్రాణంబై నోరం దడి లేక...” హంస. 1.192.

### కంఠపాఠంగా
కంఠోక్తిగా. నోటికిబాగా.
“వాడికి ఆ కావ్య మంతా కంఠ పాఠంగా వచ్చు.” వా.
రూ. కంఠాపాఠం; కంఠోపాఠం.

### కంఠము తడుపుకొను
దాహము తీర్చుకొను.
“తత్కూప తటస్థిత ద్రోణికాగ్రంబున నున్న, యల్పజలంబులం దనకంఠంబు దడిపికొని...” హంస. 1.192.
రూ. గొంతు తడుపుకొను.

### కంఠశోష
చెప్పడం వ్యర్థము.
“వాడికి నీ వెంత చెప్పినా వట్టి కంఠ శోషే కాని ఏమీ లాభం లేదు.” వా.

### కంఠస్థం
కంఠోక్తిగా వచ్చును, నోటికి వచ్చును.
“వాడికి ఆ కావ్య మంతా కంఠస్థం.” వా.

### కంఠస్నానము
తల తడుపుకొనకుండా చేయు స్నానము.
“వైద్యుడు ఈరోజు కంఠస్నానం చేయ మనీ, రెండుమూడు రోజులు తాళి జ్వరం రాకుంటే శిరస్స్నానం చేయ మనీ చెప్పాడు.” వా.
చూ. శిరస్స్నానం.

### కంఠేకాలుడు
ఈశ్వరుడు.
గొంతుపై నలుపున్నవాడు గనుక.

### కంఠోపాఠం
చూ. కంఠపాఠం.

### కండకన్నులవాడు
కండకావరము కలవాడు.
“కండకన్నులవాని నాఁకటను బండ, వెట్ట బేతాళికల సాఁకెఁ దిట్టువాని.” ఆము. 6.20.

### కండకావరము
కండక్రొవ్వు; పొగరు.
“కానిమ్ము నీ కండకావర మ్మడఁతు.” ద్వి. సారం. 1.31.
“వాని కెంత కండకావరమో? నీళ్లకు పోయే పిల్లలపై చిల్లరరాళ్లు వేస్తున్నాడట.” వా.

### కండక్రొవ్వు
కండకావరము; పొగరు.
“కండక్రొవ్వునఁ గన్నుఁ గానక పెక్కు, దుండగంబులు ప్రేలి త్రుళ్లఁ గా కేమి?” ద్వి. జగ. పు. 170.

### కండ గట్టుకొను
బలియు.

"కండ గట్టుకొంటివా వేంకటరమణుఁడ దీన, బండు సేసి తిని నన్ను బాపురా లోకావన."
తాళ్ల. సం. 12.62.

## కండచక్కెర

కలకండ. పటికబెల్లం.

"కలికి నీ కెమ్మోవి కండచక్కెర."
కృష్ణ. శతం. 3.48.

## కండతుండెములుగా

ముక్కలు ముక్కలుగా. జం.

"ఒంటి వచ్చినవాని గొంటి పోవఁగ నీక నఱకుదు కండతుండెములు గాఁగ."
జైమి. 8.94.

## కండపట్టు

లావగు.

ఇది వాడుకలోనూ 'కాస్త ఆపిల్ల కండపట్టింది (పెట్టింది)' అనే రూపంలో వినబడుతుంది.

"ఇవ్విధంబున మెలఁగు నయ్యింతి యొంటి, తిండికతమున నినుమడి కండ పట్టి."
శుక. 3.348.

"ఏమోయ్! ఈ మధ్య కాస్త కండ పట్టావే."
వా.

## కండపెట్టు

బలియు. మదించు.

"వాడికీ మధ్య కాస్త కండపెట్టింది."
వా.

"ఓహో! వాడి కేదో కాస్త కండపెట్టినట్టుందే. ఏదో తెగవాగుతున్నాడట."
వా.

## కండపొదుగు

పాలు లేనిపొదుగు.

"ఎంత పొదుగుంటే నేం? అది వట్టి కండపొదుగు."
వా.

## కండ మెండగు

క్రొవ్వెక్కు.

"బిడపాపలఁ గని పెంచు జడ్డు లేక తిండిచేఁ గండ మెండైనదండికతన."
హంస. 1. 214.

## కండలు కరగునట్లు

ఎక్కువగా కష్టించి...

"వాడు కండలు కరిగేటట్టు పని చేస్తాడు. అయినా కడుపుకు చాలడం లేదు."
వా.

"కండలు కరిగేట్లు పని చేయడం తప్పితే ఒక సుఖమా ఒక యిదా?"
వా.

## కండలు కోసి యైన నిచ్చు

ఎంత త్యాగమునకైనా సిద్ధపడు.

తన సర్వస్వాన్నీ ధారవోయు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"సఖుఁడు సంబంధి శిష్యుండు సవ్యసాచి నాకు నతనికై యేను నరవరేణ్య కూర్మిమై నాతుఁ గండలు గోసి యైన నరయ నాతండు నాయెడ నట్టివాఁడ."
భార. భీష్మ. 3.283.

"అమాయకులైన పల్లెటూరి వాళ్ళు నమ్మితే కండలు కోసైనా ఇవ్వడానికి సిద్ధపడతారు."
వా.

## కండలు పెంచుకొను

సోమరితనముతో నిర్వ్యాపారిగా ఉండు.

"ఆట్లా తిని కండలు పెంచుకోక పోతే కాస్త యింట్లో పనైనా చూచుకుంటే తప్పటరా?"
వా.

**కండ లురలు**

శరీరము నుండి కండ లూడి పడు.

"కండ లురలఁగ గడుగులఁ జెండె నొకడు." శుక. 1.263.

**కండెవట్టు**

ఇలుకుపట్టు; వంచ వీలు కాని దగు.

"బాహానాళంబు కండె వట్టిన." సాంబో. 3.128.

**కండవడము**

కాండపటము, తెర. కనపడకుండా కట్టునది.

"బెదరుచు నంతరంగమున భీతిఁ గండ వడంబు సుట్టి పల్కెదు..." కుమా. 4.58

"ననిచిన కల్పవల్లి మదనాగగతిన్ నడపాడఁ జొచ్చెనో, యనఁ జనుదెంచెఁ గండవడ మల్లన వెల్వడి బాలికాలితో, ఘనపటలంబు వెల్వడువికాసితతారక సంభృతేందులే, ఘనయముఁ గ్రేణి సేయుచు నగప్రియనందన చెన్ను వింత గాన్." కుమా. 9.20.

**కండోలవీణ**

చండాలవల్లకి. ఒక రకమైనవీణ.

**కండ్ల కావరం**

పొగరు.

"వాడికి కండ్లకావరం ఎక్కువయింది. కనిపించినపిల్ల నంతా కన్ను గీటుతున్నాడట." వా.

**కండ్లకు కట్టినట్టు**

1. ప్రస్ఫుటంగా.

"తిరుపతిజాతరలో తెల్లవారుజామున్నే గంగమ్మను తీస్తారు. మైలు దూరం నుంచి చూచినా కండ్లకు కట్టినట్టు కనబడుతుంది." వా.

"వెయ్యి మందిలో ఉన్నా వాడూ, వాడి వేషం కండ్లకు కట్టినట్టు కనిపిస్తాడు." వా.

2. మఱచిపోకుండా.

"ఆనాటి సంబరం ఇంకా కండ్లకు కట్టినట్టుగా ఉంది." వా.

**కండ్లకు పొర లడ్డు వచ్చు**

1. కొవ్వెక్కు.

"వాడికి కండ్లకు పొర లడ్డం వచ్చాయి." వా.

2. ఒక రోగము వచ్చు.

"ముసలితనం వచ్చేసరికి వాని కండ్లకు పొర లడ్డం వచ్చాయి." వా.

**కండ్లు తెరచు**

ప్రపంచజ్ఞానం కొద్దిగా తెలియు; జ్ఞానోదయ మగు.

"వాడు మొన్న పుట్టి నిన్న కండ్లు తెరిచాడు. నన్నేదో తప్పు పట్టబోతాడు." వా.

"వా డిప్పుడిప్పుడే కండ్లు తెరుస్తున్నాడు." వా.

**కండ్లు తెరవని**

వయసు చాలని, అనుభవము లేని.

"వాడు కండ్లు తెరవనివాడు. వాణ్ణి కట్టుకొని మన మేం చెయ్యగలం?" వా.

**కండ్లు తేలవేయు**

ఏమీ చేయ లేనట్లు సూచించు; తెలివి తప్పిపోవు.

"ఏమిరా డబ్బేం చేశావంటే కళ్లు తేలవేశాడు." వా.
"వాణ్ణి పట్టుకొని నాలుగు ఉతికేసరికి కండ్లు తేలవేశాడు." వా.

మూర్ఛ పోవునప్పుడు కండ్లు తెలిపోవుటపై వచ్చినపలుకుబడి.

## కండ్లతో చూడ లేదు

ప్రత్యక్షంగా చూడ లేదు.
"అందరూ అంటున్నమాటే నే నన్నాను. నేనయితే కండ్లతో చూడ లేదు." వా.
"అన్నీం పున్నీం దైవానికెరుక. అందరూ అనడమే కానీ నేనైతే కండ్లతో చూడ లేదు." వా.

## కండ్లతో చూడ లేము!

1. అదేదో అతిమనోహరము.
"మైసూరు రాజభవనం దసరాలో విద్యుద్దీపాలతో ధగధగ మెరిసి పోతుం టుంది. ఆ వైభవం కండ్లతో చూడ లేము!"

2. అదేదో అతిబాధాకరము.
"వాడు కడుపునొప్పితో పడేబాధ కండ్లతో చూడ లేము!" వా.

## కండ్లలో కారం పోసుకొను

అసూయపడు.
"ఎవరు కాస్త పచ్చగా కనబడినా వాడు కండ్లల్లో కారం పోసుకుంటాడు." వా.

## కండ్లలో వత్తులు వేసుకొని

చూ. కంట వత్తి నిడుకొని.

## కందదుంపకు పానకము

వ్యర్థము.

కందను పానకంలో నాన వేయడ మెందుకు?
కుక్కు. 87.

## కందనకాయ

గుండెకాయ.
"సందియ మింత లేదు వెలుచన్ నను మొగ్గల మిట్టకోలలన్, గందనకాయ నేసె సుమకార్ముకుఁ డే మని చెప్ప వాఁడ." రాజశే. 3.146.

## కందవాలు

కందిపోవు.
"లలితముక్తాహారగుళికాకలాపంబు, ప్రాణానిలంబునఁ గందవాలె."
నైష. 2.119.
రూ. కందపాలు.

## కందా కొట్టు

తిరిపపుతిండి మెక్కు.
వివరమునకు చూ. కందాలరాజు.

## కందాలరాజు

సోమరి; తిండిపోతు; తిరిపెపు తిండి మెక్కువాడు.
కందా అనగా రాజబంధువుల భోజనశాల అని బ్రౌను. అక్కడ ఎవరైనా వచ్చి రాజబంధువు పేరుతో తిని తిరుగుతూ ఉండవచ్చును. అలా ఆ పేర తిని తిరుగు తిండిపోతునకు పేరై యేర్పడిన పలుకుబడి.

నందక. 79 పు.

**కందికట్టు**

కందిబేడలు (పప్పు) ఉడికించి వంచుకొన్న నీరు.

"ఈ రోజు మా యింట్లో కందికట్టు చారు పెట్టాను. మా వాడు చాలా బావుం దన్నాడు." వా.

**కంది కుందు**

వాడిపోవు; కందిపోవు.

"రసికశేఖరుఁ డా రాజు రాజవదన, కంది కుందిన నెమ్మోము కళ లెత్తింగి" శుక. 1.305.

**కందిపోవు**

1. వాడిపోవు.

"ఎండలో తిరిగేసరికి వాని మొగం బాగా కంది పోయింది." వా.

2. దెబ్బ తగిలి నల్లపడు.

"బాగా రాయి కొట్టుకున్నట్టుంది. తొడ కందిపోయింది." వా.

**కందు కుందును లేని**

నిష్కళంక మైన.

"కందు కుందును లేనికలువలచెలికాఁడు గెలిగినఁ జెలి మేనికాంక దీటు." రాజగో. 3.62.

**కందువ చేయు**

నివసించు.

"నిష్కపుగతి బుశ్యమూకమునఁ గందువ సేయవె?" భాస్క. కిష్కిం. 477.

**కందువమాటలు**

చాటుమాటలు, చాటూక్తులు.

"కందువమాట లాడి వగకారితనంబులు నూపి సన్న లింపొందఁగ సల్పి చేరికల నుల్లము రంజిలఁజేసి..." హంస. 3.32.

"కాయజు తూపు లమ్ముదురు కందువ మాటలఁ బుష్పలావికల్." విజ. 1.14.

**కందువ సెప్పు**

నిర్ణీత స్థలమును తెలియజేయు.

"కందువ సెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు దాడికిఁ గూర్చువారు."

భార. విరా. 3.127.

**కందు వాపు**

కలత తీర్చు.

"కళాపూర్ణుండు నివ్విధంబున నవ్వనిత డెందంబు కందు వాపి సాంద్రానందంబున నభీమతక్రీడల రమించె."

కళా. 7.237.

**కందువాఱు**

మాసిపోవు, నల్లబడు, వివర్ణమగు.

"కందు వాఱిన మించు కంచుటద్దము వోలె." హర. 7.30.

"వెలవెల బాఱె మేఘ మరవింద విరోధియుఁ గందువాఱె."

నరస. 2.70.

**కందువు మూసె డై**

మోస మెక్కువగా కలిగి.

"కందువు మూసెఁ డై, కత్తిగొంటు అయినయత్తగంతు." కుమా. 8.185.

**కందెన పడు**

లంచ మబ్బు; డబ్బు చేతికి వచ్చు.

"కాస్త కందెన పడితే గాని వాడిచేత పని చేయించుకోవడం కష్టం." వా.

చూ. కందెన వేయు.

**కందెన వేయు**

డబ్బిచ్చు; లంచ మిచ్చు.

కందెన వేస్తే బండిచక్రం గబగబా తిరుగుతుంది అనుటపై నేర్పడినపలుకుబడి.

"కాస్త కందెన వేస్తే ఆ గుమాస్తా మనకు కావలసిన కాగితా లన్నీ ఈ క్షణంలో తెచ్చిస్తాడు." వా.

చూ. కందెనపడు.

## కందెఱ

1. కన్ను తెఱచునది.

"సృష్టి కందెఱ." కాశీ. 1.121.

2. కనుచాటు, తెర.

"మఱునాఁ డంధకవృష్ణిభోజయదుసామంతాగ్రణీ సేన గందెఱగా." ఉ. హ. 2.84.

## కంపకోట

ముండ్లకంచె. కంపతో వేయుకంచె.

"కంపకోట ఘటించుకరణిఁ జుట్టుక యున్న, యీరంపు వెడసందు కేఁగు వెరవు." రాజగో. 1.69.

## కంప గట్టు

కంచె వేయు.

"చెట్టుచేమలు, కానంబడ నటికి కంప గట్టినపిదపన్." విప్ర. 2.19.

## కంపగొట్ట !

ఒక తిట్టు.

"నీ యింటికి కంపగొట్ట." వా.

కంపగొట్టుట పాడుపడుటను సూచిస్తుంది.

## కంపగొట్టు

పాడుపెట్టు.

"వాడెప్పుడో నాన్న పోగానే యింటికి కంపగొట్టి దేశాంతరం పోయాడు." వా.

## కంపతోడు గీడ్చినట్లు

జాడలు ఏర్పడునట్లు అనుట.

"కంపతోడు గీడ్చిన ట్లేదు గానఁ జన్నఁ, దెరు వెఱుంగుచు." మను. 4.54.

## కంపనబడ్డ కాకి అగు

చాలా చిక్కులలో తగులుకొని విలవిల లాడుతున్నా డనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

కాకి కంపమీద పడ్డప్పుడు విదిలించుకొన్నకొద్దీ మరింత ముళ్లల్లో చిక్కుకొంటుంది కదా ?

"వాడిప్పుడు కంపనబడ్డకాకై అవస్థ పడుతున్నాడు." వా.

చూ. కంపలబడ్డ కాకి అగు.

## కంపము పుట్టు

వడకు పుట్టు.

"వెక్కస మగు నెవ్వగ ల్వొడమెఁ గంపము పుట్టె." పారి. 1.100.

## కంపలబడ్డ కాకి అగు

చిక్కులలో తగులుకొన్న వాడగు.

కంపలలో పడినకాకి తప్పించుకొనబోయిన ట్లెల్ల మఱింత చిక్కుకొంటుంది. అందుపై వచ్చినపలుకుబడి. ఇది నేటికీ వాడుకలో ఉన్నది.

"దక్కన విష్ణుభక్తియు దృఢంపు విరక్తియుఁ గల్గు నమ్మరు, ద్భక్కటకం భజించుమతి పుట్టుక కంపలఁబడ శాకి నై." పాండు. 2.184.

చూ. కంపనబడ్డ శాకి అగు.

## కంపవెట్టు

పాడు వెట్టు.

"పొంచి యెంతయుఁ బోడఁ బుట్టిన దానిల్లు, కంప వెట్టిన మహాఘనుఁడు వీఁడు." బిల్హ. 2.65.

చూ కంపగొట్టు.

## కంబళపురీషము

నీచము; కంబళిమీది మలినము – ఒక తిట్టు.

తొలగింపరాని దనుట.

పట్టుకుంటే వదలని అహితవస్తువు.

"మటుమాయలాఁడు కంబళపురీషంబు." గా. హరి. ద్వితీ. పంక్తి. 483.

## కంబళికట్టు

ఒకరకం వంటచెఱకు.

బ్రౌను.

## కంబళిపురుగు

నీచుడు అన్న అర్థంలో దీనిని తిట్టుగా ఉపయోగిస్తారు.

నల్లగా కంబళివలె ఉండు పురుగు.

చెట్ల ఆకులపై ఉంటుంది.

"వాడు వట్టి కంబళి పురుగులా ఉన్నాడు." వా.

## కంబీ తీయు

పాఱిపోవు.

చిత్తూరుజిల్లాలో నేటికీ వినిపించే పలుకుబడి.

"అప్పు సంగతి యెత్తేసరికి వాడు కంబీ తీశాడు." వా.

చూ. కమ్మి తీయు.

## కంసాలి ఉన్నచోట కథ చెప్పరాదు

యుక్తిశాలి ఉన్న చోట వట్టిమాటలు చెప్పరాదనుటకు ఉపయోగించేది.

కంసాలి యుక్తిశాలి అని ప్రతీతి.

ఇది ఒక కథపై యేర్పడినది. ఒకతను కథలు చెప్తున్నాడు: "ఒకచోట ఒక అరటి ఆకూ, ముంటి పెళ్ళా స్నేహితమయ్యాయి. అరిటాకు అన్నది కదా 'వాన వస్తే నేను నీమీద పడి రక్షిస్తాను. గాలి వస్తే నీవు నామీద పడి రక్షించు –' అని." ఇలా అతను చెప్తుండగనే శ్రోతల్లో ఉన్న అతను "అంతానాని రెండూ కలసి వస్తేనో" అన్నాడట. అప్పుడా కథకుడు 'కంసాలి ఉన్నచోట కథ చెప్ప రాదు' అని వెళ్ళిపోయాడట!

## కంసాలిప్రొవ్వులు

దిక్కు కొకరు మొగమై విడివిడిగా ఉన్నా రనుట.

పక మత్స్రా రాహిత్యాన్ని తెలిపే పలుకుబడి.

కంసాలులలో తెగ లెక్కువ. నలుగురు కలిస్తే ఎవ రంతకు వాళ్ళే గొప్ప అనుకొని వేరే వేరే పొయ్యిలు పెట్టుకొని వంట చేసుకునేవారు. అందుమీద వచ్చిన పలుకుబడి.

"ఆ ఊళ్లో ఒకరిని చూస్తే ఒకరికి పడదు. ఏపని వచ్చినా ఊరంతా కంసాలిపొయ్యిలుగా తయారవుతుంది." వా.

**కకపిక లగు**

చెల్లాచెద రగు.

"వికవిక లెలె నిన్నెలు పకపకులు, కక పిక లాయెం దక్కిక పికవాణి." అనుక. 2.115. పు.

చూ. కకవిక లగు.

**కకబికలు**

చిక్కులు; బాధలు.

"వలచి మతంగు కడు మోహము, తలమునుకలు గాగ మునిసి తామర విరితూ, పుల కకబికలవ లోంబడి, మల యుచుం దా వెంట జాలిమాలిం దిరు గన్." హంస. 5.127.

చూ. కకవికలు.

**కకవిక లగు**

తల్లక్రిందు లగు; గందరగోళ మగు.

"ఒకయూరికి నొకకరణము, నొకతీర్పరి యైనం గాక యొగిం దలు పైనన్, కక వికలు గాక యుండునె, సకలంబును..." సుమతి.

చూ. కకపిక లగు.

**కకాపికగా**

చెల్లాచెద రగునట్లుగా.

"కలిసినపాతకంబులు కకాపికగా విడ న్వడి." విప్ర. 2.16.

**కకావిక యగు**

చెదరి పోవు; కలగు.

"ఆత్మ సైనికచయంబు కకావిక లై కలంగి." కళా. 8.58.

"ప్రక్క వేఱొక్క మగం డున్న జాడ తెలిసి...మిట్టిపడి కకావిక యై." శుక. 1.223.

**కక్కరించు**

కస్సు మను.

"కనుగొని డాయవచ్చి శునకంబు క్రోధంబునం గక్కరించి యు, ట్లను." చెన్న. 2.30.

"పిల్లవాడు దగ్గఱకు వస్తే ఆలా కక్క రిస్తావేం?" వా.

**కక్కసపడు**

కోపపడు, బాధపడు.

"ఇంత చిన్నదానికే అంత కక్కసపడ తా వేం ఖర్మం?" వా.

**కక్కసపెట్టు**

కష్టపెట్టు.

"కక్కసులం గక్కసపెట్టి." రామాభ్యు. 8.192.

**కక్కిరి బిక్కిరిగా**

తారుమారుగా; అస్తవ్యస్తంగా. శ. ర.

"అదంతా కక్కిరి బిక్కిరిగా ఉంది." వా.

**కక్కుటాయి**

గఱుకుటాయి.

"కంకలు దుంపలు కక్కుటాళ్లు."
సౌనం. 2.6.

కక్కుటితికాడు
కక్కుర్తి పడువాడు; తొందర పడువాడు; ఎంతకైనా లొంగువాడు.
"కక్కుటితికాఁడు కార్యము, చక్కటి నెఱుగండు." నా. పంచ. 1.320.
చూ. కక్కుర్తిగాడు.

కక్కుటితిపడు
దేనిమీద ఆశతోనో ఎంతకైనా లొంగిపోవు.
"వా డేదో నాలుగుకాసులు వస్తాయని కక్కుర్తిపడి ఆ ఛండాలపు పని చేశాడు." వా.
రూ. కక్కుర్తిపడు.

కక్కుర్తిగాడు
స్వలాభమునకై ఎంత నీచానికైనా ఒడిగట్టువాడు.
"కడఁగి పీనుఁగుమీఁదఁ గంచంబు వెట్టి కుడువఁగాఁ జూచు కక్కుర్తిగాఁ డితఁడు." గౌర. హరి. ద్వి. 451.452.

కక్కుర్తిపఱుచు
కక్కుర్తి పడునట్లు చేయు.
"కక్కుర్తి పఱుపరే గాఢతపోరూఢుఁ, డగుమందకర్ణజు నంతవాని."
చంద్ర. 2.74.

కక్కులికల్లం
ఇనుపగొగ్గు లున్నకళ్లెము.
"ఆ గుఱ్ఱం కక్కులకళ్లెం వేస్తే గానీ మాట వినదు." వా.

కక్కువాయిదగ్గు
కోరింతదగ్గు.
రూ. కక్కాయిదగ్గు.

కక్కు వేయు
తిరగలిపై ఇనుపముక్కతో గఱుకుగా ఉండునట్లు కొట్టు.
"పిండి పడడం లేదు. తిరగలికి కక్కు వేయించాలి." వా.

కక్కూటితిపడు
కక్కుర్తిపడు.
చూ. కక్కుటితిపడు.

కచ్చ బిగించు
గోచి పెట్టు.
"నీలిచేల గడితంబుగఁ గచ్చ బిగించి."
క్రీడా. పు. 92.

కచ్చల్లో కందులు వేయించు
అతికామి యగు.
గోచిలోనే కందులు వేయించగల వేడిమి - కామం-కల ...అనుట.
"అదంతా కచ్చల్లో కందులు వేయించే రకం." వా.

కచ్చ వద లగు
కామోద్రేకము కలుగు.
కచ్చ బిగించుట నిగ్రహాన్ని, అది వదు లగుట తన్నాశాన్ని సూచిస్తుంది.
"కలుకుచు నొకసారి పలుకరించిన నిచ్చ,వాని కైనను గచ్చ వదలిపోవు."
పాణి. 2.71.

కచ్చుకొను
కక్షు పట్టు.

"వేల్పు తేజిం, గచ్చుగొని హసించు వీటఁ గల్గుహాయంబులన్." చరు. 1.30.

**కచ్చుపెట్టు**

పట్టుదల వహించు.

"కచ్చుపెట్టి వినులకుఁ గతలెన్ని విన్నాను అచ్చుతు కీర్తన వీనే యందు సరి రాదు." తాళ్ల. సం. 10.250.

**కచ్చుపెట్టు కలుగు**

బాధ. గాయము. ప్రమాదము కలుగు.

"వొచ్చితి నీకు శరణు సుద్దు లింక నేటికి, కచ్చుపెట్టెవ్వరివల్లా గలిగే దేమీ." తాళ్ల. సం. 6.176.

**కచ్చువిచ్చు**

పురి వీడిపోవు.

"కాలపాశము కచ్చు విచ్చె." రుక్మాం. 2.48.

**కచ్చువెట్టు**

పగపట్టు.

'కచ్చుపట్టినాడు' అనేలాంటి రూపంలో ఈ కచ్చు నేడు కానవస్తుంది.

"అగపడి కచ్చువెట్టు యుతఁ డాడిన మాటలకు." కల్యప. 2.125.

**కచ్చెపోతు**

జగడగొండి; ఈర్ష్యాళువు.

**కచ్ఛశుద్ధి**

బ్రహ్మచర్యం; వ్యభిచార రాహిత్యం.

"వాడు కాస్త కచ్ఛశుద్ధి కలవాడు." వా.

**కజాయము**

నువ్వులూ, బెల్లం కలిపిన పిండి కానీ, కొబ్బరితురుమూ బెల్లం కలిపిన పిండి కానీ లోపల పెట్టి పైన గోధుమ రేకు మడిచి అల్లి చేసే పిండి వంట.

"కజాయంబు లిం దెన్నే నున్నవి." పాండు. 7.279.

చూ. కజ్జాయము.

**కజ్జాకోరు**

కలహశీలుడు.

"వాడు ఒట్టి కజ్జాకోరు. వాడిజోలికి పోవద్దు." వా.

**కజ్జాయము**

కజాయము.

"బలిరె కజ్జాయ మయ్యారె పాయసములు." వి. 2.105.

చూ. కజాయము.

**కజ్జికాయ**

పప్పులపొడి లోన పెట్టి గోధుమరేకుతో అల్లిన ఒక ఫలహారం.

"పదలుం జక్కెర కజ్జికాయలును." రా.మా. 2.115.

**కటకట చేయు**

కస్తీ చేయు.

ఇస్తావా చస్తావా అని నిర్బంధపెట్టు.

"వాడి లెక్క ఫైసలు చేయమని కటకట చేస్తున్నాడు." వా.

కటకటంపడు

బాధపడు.

శివ. 1.87.

చూ. కటకటపడు.

కటకటంబడు

బాధపడు, విచారపడు.

"క్రూరకర్ము లగుకొడుకులం గంటినే యని కటకటం బడి."

కా. మా. 2.25.

"కటకటఁ బడి యూడు గఱచి హుమ్మనుచుఁ, దటము దాఁటించి చిందఱ లేఁగినట్లు."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 1061-62.

చూ. కటకటంపడు.

కటకటపడు

బాధపడు, కలతపడు.

"వెతలం గటకటపడి."

రసిక. 4.9.

"కటకట పడఁ దొడఁగె నపుడు కరము సెమర్చెన్." హర. 7.76.

కటకట మని

ధ్వన్యనుకరణము.

"కటకట మని పండ్లు కొఱికి కసరు విసరుచేఁ." శ్రవ. 3.86.

కటకటాలు

ఇనుప ఊచలతో అడ్డుగా వేసిన ఆవరణము.

"కటకటాల వెనుక కూర్చుని వీథిలో పొయ్యేవారిని పిలవడం వాడి అలవాటు." వా.

ఈపదమే జైళ్లలో ఉన్న కటకటా లన్న విశేషార్థాన్ని పురస్కరించుకొని బందిఖానాకూ. నిర్బంధానికీ సూచకమైనది.

"వాడు కటకటాల వెనుక ఉన్నాడు. ఇప్పుడు మన కేం చేయగలడు? వాడు విడుదల అయింతరువాత మాట చూతాం!" వా.

కటకాముఖము

శాణమును లాగునప్పటి ఒకవిధ మైనహస్తముద్ర.

"క్రమ్మఱఁ బలాశకటకాముఖమునఁ గీరచలితశాఖాప్సుబాణోక్షిశరముఁ గూర్చె." ఆ. ము. 5.141.

కటపయాది సంఖ్య

అక్షరమాలలోని క, ట, ప, యాది అక్షరములను సంఖ్యలకు మారుగా ఉపయోగించు పద్ధతి.

బ్రౌను.

కటపుటలు

అదరిపాటులు; విఱగబాటులు. జం.

"అతం డక్కటపుటలు మాన్పె." కళ. 2.104.

కటపెట

ధ్వన్యనుకరణము.

"కటపెట తొటతొట రాలెడు, పాటపాట చినుకుల ధరిత్రి పొడ నట్టు వడఁగా." వైజ. 2.146.

కటపెటగా ఉండు

చిక్కుగా, ఇబ్బందిగా ఉండు.

"వచ్చేడబ్బు చాలక వాడిపరిస్థితి చాల కటపెటగా ఉంది." వా.

**కటాకటిగా**

దాదాపు; చాలీ చాలక. కొంచెం మించుమించుగా అనుట.

"అర్ధసేరుబియ్యం వేస్తే వాడికి కటాకటిగా సరిపోతుంది." వా.

చూ. ముటీముటాలుగా.

**కటాక్షించు**

దయ చూచు.

"కృతకవిప్ర నగజ కటాక్షించి." కుమా. 7.44.

"ఏదో చేసేవాణ్ణి. మీరు కటాక్షించాలి." వా.

**కటాక్షించుకొను**

అనుగ్రహించు. దయతో చూచు.

"కేవలభక్తితో లేవ వణికస్కులఁ, గేవల నటఁ గటాక్షించుకొనుచు." దశా. 7.188.

**కటాబిటిగా**

నిక్కచ్చిగా.

"అతడు చాలా కటాబిటిగా మాట్లాడతాడు. నాన్చడు." వా.

**కటారువాడు**

ఖడ్గధారి.

"నిజస్థానము నిర్గమించి పగఁ జంపఁగ వచ్చు కటారుకాని చం, దాన మహేశ్వరుం గదిసి." శా. మా. 2.141.

**కటిక ఉపవాసము**

మంచినీళ్లు కూడా పుచ్చుకోకుండా ఉండే ఉపవాసము.

"వైకుంఠ ఏకాదశినాడు కటిక ఉపవాసం చేయడం అతని కలవాటు." వా.

"శుక్రవారంపూట కటిక ఉపవాసం చేయకూడదే ముత్తైదుపిల్లలు!" వా.

**కటికగుండె**

దయావిహీనహృదయము.

"వానిది ఒట్టి కటికగుండె. కన్నతల్లి బ్రతిమాలినా యింటికి రానన్నాడు." వా.

**కటికచీకటి**

చిమ్మచీకటి.

"కని కనుల్ కటికచీఁకటులు గ్రమ్మ." రాధి. 2.20.

"ఈ కటికచీకట్లో ఎక్కడికి పోతావు రా. పురుగూ పుట్రా ఉంటుంది." వా.

**కటికతనము**

కాఠిన్యము.

"కటికతనంబు మాన్చి చటుకారు విడంబము గూర్చి." నైష. 3.54.

**కటికనవ్వు**

వికపునవ్వు.

**కటిక(కి)నీళ్లు**

వట్టినీళ్లు మాత్రమే ననుట.

"వాడు కటికినీళ్లు తాగి పడున్నాడు పొద్దున్నుంచీ." వా.

"ఆ రెడ్డిగారింటికి మజ్జిగకు పోతే ఒట్టి కటికినీళ్లు పోశారు." వా.

**కట్టకడ [పటి]**

ఆఖరు (వాడు–అది.)

"వాళ్లిల్లు ఆ వీధిలో కట్టకడన ఉంది." వా.

"వాడు వాళ్ల అన్నదమ్ముల్లో కట్టకడపటివాడు." వా.

**కట్టడ చేయు**

1. ఏర్పాటు చేయు.

"పురీరక్షణస్థితికిఁ గట్టడ చేసి." జైమి. 3.55.

2. ఆజ్ఞాపించు.

"అంత నయ్యూరిదొర ముత్తియములఁ జూచి, తెమ్మని సువేషు దవ్వల దీవి కేఁగు, మనుచుఁ గట్టడ సేయఁగా నతఁడు వచ్చి." శుక 2.210.

**కట్టడి**

ఏర్పాటు; ఆచారం.

'మా ఊళ్లో రోజా మేకను దేవుని పూజ కివ్వడం కట్టడి' అనడం వాడుక. ఇట్లా ఆలవాలై ఆ యేర్పాటు ప్రకారం ఇచ్చే సొమ్ముకు కూడా తదుపరి పే రయింది. పెళ్లిలో మెట్టెలు చేసి పెట్టినప్పుడు అయిదు రూపాయిలో ఎంతో ఇస్తారు. దానిని కట్టడి అంటారు. రాయలసీమలో ఇది ప్రచురం.

"రోజా ఒకరు దేవునిపూజ కివ్వాలని ఆ వూళ్లో కట్టడి చేసుకున్నారు." వా.

"తాళిబొట్టు చేస్తే ఒక వరహా, బియ్యం, బేడలు కట్టడి." వా.

**కట్టడి కట్ట**

చెలియలి కట్ట.

"కడలిగముల్ కడుం దొనకి కట్టడి కట్టలు దాటిపొఱలఁగా." అచ్చ. యుద్ధ. 162.

**కట్టని కోట**

పెట్టని కోట; సంరక్షకము. దుర్గం కాకున్నా దుర్గప్రాయం అనుట.

"కట్టని కలుకోట—కరివంది అంకె." పల. పు. 7.

**కట్టి బెట్టు**

1. బలవంతముగా అంటగట్టు; వివాహము చేయు.

"ఆ పిల్లను వీడికి కట్టబెట్టి అన్యాయం చేశారు." వా.

2. చీరలు మొదలైనవి ఇచ్చు.

"అమ్మాయిని పిలుచుకొని వస్తే ఏదో ఒక చీర కట్టబెట్టి పంపించాలి కదా!" వా.

**కట్టలుక**

తీవ్రకోపం.

"పాలయలుక గట్టలుక సేసి." కుమా. 8.146.

**కట్టలు కట్టుకొని**

గుంపులు గుంపులు చేరి.

"ఆ అమ్మాయి కొత్త పట్నవాసం దుస్తుల్లో వచ్చేసరికి, పల్లె పల్లే కట్టలు కట్టుకొని చూశారు." వా.

చూ. కట్టలు గొను.

**కట్టలు గొను**

ఒకరిమీఁద ఒకరు ఆనుకొని చేరు.

వాడుకలో: "కట్టలు కట్టి చూస్తున్నారు ఉత్సవాన్ని జనం" అంటారు.

పండితా. ద్వితీ. మహి. పుట. 34.
చూ. కట్టలు కట్టుకొని.

కట్టల్క
క్రోధము, కోపము.
పండితా. ద్వితీ. మహి. పుట. 19.
రూ. కట్టలుక.

కట్టవియు
విరిసిపోవు, ప్రిదిలిపోవు, అవిసి పోవు.
"నీ,రాకిర మెల్లఁ గట్టవిసిన ట్లురులం బఱ తెంచుచున్నవో."
కుమా. 12.61.

కట్ట వెడలు
అధిక మగు, పొంగి పొరలు.
"కట్టవెడలు కన్నీటిచే."
వర. రా. సుం. పు. 103. పంక్తి. 6.

కట్టాణి ముత్యాలు
మేలుజాతి ముత్యాలు.
"కట్టాణిముత్యాల కంఠమాల."
భీమ. 1.116.

కట్టాయము
తప్పక [కట్టాయం = తప్పక తమిళం] కడ్డాయం అనే రూపంలో తెలుగులోనూ రాయలసీమలో ఉన్నది.
"కట్టాయము సేయుచుండుదు."
కుమా. 8.176.
చూ. కడ్డాయము.

కట్టాయితపడు
సిద్ధపడు.
"పట్టుకొని చంప నొంపం, గట్టాయిత పడక."
వేం. పంచ. 3.158.

కట్టాయిత మగు
సిద్ధ మగు.
"కట్టాయితం బై సురాసురులు వి ట్టేచి."
హర. 6.59.
రూ. కట్టాయితం బగు.

కట్టాయితము
యుద్ధమునకు సన్నద్ధ మైన సైన్యము.
"ఆత్మసంభవుని కట్టాయితము."
భాగ. 6.445.

కట్టావి
వేడి ఆవిరి.
"ఎసఁగు కట్టావిక్రియ నావి రెగయ."
ఆము. 2.69.
,, 4.134.

కట్టి కుడుచు
చేసినది అనుభవించు.
"కట్టిడి నీ కిట్లు కాకుండ నగునె, కట్టి కుడ్వక పోదె కర్మబంధంబు."
సారం. 3.172.

కట్టి కుడుపు
తప్పక అనుభవించునట్లు చేయు.
"అట్లగాఁ, బఱచినపాటు కట్టి కుడుపం జనునో చనదో విధాతకున్."
కళా. 1.163.
"వల దన్న మాన కరిగెఁ, జలమునఁ దనపాలి విధి వెసఁ గొనిపోవఁ, దొలి జన్మంబునఁ జేసిన, కొలయును బుణ్యంబు కట్టి కుడుపక యున్నే?"
సారం. 2.32.
"వెన్న దిన్నయట్టి వెకిలితనము, కట్టి కుడిపె నేడు కంజాతనేత్రుని."
త్రిని. 5.86.

కట్టిన ముడుపు

అందు బాటులో నున్న అమూల్యవస్తువు.

కొంగుపసిడివంటిది.

"కట్టినముడుపు వెంకటనిలయుండు." తాళ్ల. సం. 11.55.

కట్టిపెట్టు

1. చాలించు.

"నీ మాటలు కట్టిపెట్టి చనుమా." రసిక. 3.45.

"మీ వారి నడతలు గట్టిపెట్టి ... న్యాయంబు లాడె దౌర." శశాం. 3.81.

"గర్వసంరంభంబు గట్టిపెట్టు." భీమ. 1.62.

"ఆ గంధర్వముపై వాంఛలు గట్టిపెట్టి." జైమి. 4.9.

"నీ కాని తలంపులు గట్టిపెట్టి." జైమి. 1.61. శివ. 2.102.

"నీ డంబా లింక కట్టిపెట్టు - ఎవరికి తెలియవు?" వా.

2. కట్టించి యిచ్చు.

"కలుమరం బొండె నిల్లొండెఁ గట్టిపెట్టి." భీమ. 6.55.

కట్టివేయు

ఆగు; త్రాళ్ళు మొదలగు వానితో బంధించు.

"వానికి నిన్నటినుంచీ మూత్రం కట్టివేసింది." వా.

"రాత్రంతా ఉండిన వాంతులూ, భేదులూ ఒక్క మాత్రతో కట్టివేశాయి." వా.

"యజమాని కాళ్లూ చేతులూ కట్టివేసి దొంగలు పారిపోయారు." వా.

కట్టుకంబము

ఆలానస్తంభము.

ఏనుగులను కట్టునట్టి స్తంభము.

"కట్టుకంబము డుంతి గంధద్విపము నకు." కాశీ. 5.135.

కట్టు కట్టు

1. ఒక మాటపై నిలబడు, సమ్మె చేయు.

"ఆ మిల్లులో కార్మికు లంతా కట్టు కట్టినారు." వా.

2. మంత్రములతో దిగ్బంధనాదులు చేయు.

"ఆ మంత్రగాడు కట్టు కట్టేసరికి పాడుతున్నవా డల్లా అలా ఆగిపోయాడు." వా.

కట్టుకథ

కల్పితకథ; పుకారు. మాటూ. 58.

కట్టు కాపించు

పశ్వాదులను పరిపాలించు.

"కట్టఁ గాపింప దక్షత లేమి నూరూర, బందెలఁ బడిపోయెఁ బశుగణంబు." మను. 3.129.

వాడుకలో రూపం మారుతుంది.

"కట్టేవాడూ కాసేవాడూ లేక పశువులు దిక్కు కొకటి పోతున్నవి." వా.

కట్టుకొంగు

చీర తొలిచుట్టు చుట్టి ముడి వేసుకొను కొంగు.

"ఒక యిసుమంత వీడెం గట్టుం గొంగున్." విజ. 2.178.
దశా. 3.89.

"ఈ చీర కట్టుకొంగుకంటే పైకొంగే బాగా ఉంది." వా.

**కట్టుకొను**

1. వివాహ మాడు.

ఇది పత్రికాంధ్రంలో ఈ అర్థంలో విశేషంగా వాడుకలో ఉన్నది.

"మన పక్కింటి అమ్మాయిని వాడు కట్టుకొన్నాడు." వా.

2. ధరించు.

"ఆవిడ చీర కట్టుకొని వచ్చేసరికి బండి వేళ కాస్తా దాటిపోయింది." వా.

**కట్టుకొమ్మ**

అడ్డుకట్ట, ఆనకట్ట.

**కట్టుకోక**

మామూలుగా రోజువారీ కట్టుకొనే చీర.

"దానికి కట్టుకోకలే లేవు. ఇంక దాపుడు కోకలు ఎక్కడనుంచి వస్తాయి." వా.

చూ. కట్టుచీర; దాపుడుకోక.

**కట్టుగడ**

దాపుడుధనము.

బ్రౌను.

**కట్టుగడ సేయు**

దాచు.

బ్రౌను.

**కట్టుగుండు**

1. రాళ్లను పగులగొట్టుగుండు.

"కొండ గట్టెడుకట్టుగుండ్లరవము." పరమయో. 5.40.
చంద్రా. 4.214.

2. తూనికరాయి.

"ఈ కట్టుగుండేమీ సరిగా ఉన్నట్టు లేదు. తాలూకా కచ్చేరీముద్ర ఉన్నదైతే కానీ నేను ఒప్పుకోను." వా.

**కట్టుగుడ్డలతో**

వస్త్రమాత్ర నిర్విశేషముగా.
దేవీ. 7.512.

**కట్టుగుఱ్ఱము**

కట్టివేసిన గుఱ్ఱము.

బ్రౌను.

**కట్టుగొయ్య**

పశువులు మొదలయినవానిని కట్టివేయుటకై పాతిన కొయ్య.

"కట్టుకొయ్యకుఁ జేరి కామధేనువు దప్పె." కామా. 4.111.

**కట్టుగొట్టు**

కట్టుగొయ్య.

చూ. కట్టుగొయ్య.

**కట్టుగొఱ్ఱె**

చంపుటకై కట్టివేసిన గొఱ్ఱె.
బ్రౌను.

**కట్టుచీర**

రోజువారీ కట్టుకునే మామూలు చీర.

చూ. కట్టుకోక.

**కట్టు చెడు**

కట్టు తప్పు; విచ్చలవిడిగా ప్రవర్తించు.

"అదెంత కట్టు చెడినన్ రాకుందురే?"
పాణి. 4.24.

చూ. కట్టు తప్పు.

## కట్టు చేయు

నియతి యేర్పరచు.

"ఆ గ్రామంలో ఎవరూ కల్లు తీయకూడ దని కట్టు చేసినారు." వా.

## కట్టు తప్పు

ఊడేరి స్వేచ్ఛగా తిరుగు.

"ఇ, ట్లీడేరి కట్టుతప్పిన, చేడియ నిఁక నైనఁ బెండ్లి సేయందగదే?"
యయాతి. 3.100.

"కట్టు తప్పిన పిల్ల నింట్లో పెట్టుకొని ఎన్నాళ్ళు కళ్ళు మూసుకొని ఉంటారు?" వా.

## కట్టుదిట్టము చేయు

తగినఏర్పాట్లు చేయు.

"వాడు ఆ పొలం వ్యవహారం అంతా కట్టుదిట్టం చేసి వెళ్లాడు." వా.

## కట్టుదిట్టములు

కట్టుబాట్లు; అనుజ్ఞలు.

"ఆ పిల్లలు కట్టుదిట్టాలు లేకుండా పెరిగారు." వా.

## కట్టుదొన

కొండలో పారు నీరు ఒకచోట నిలిచినప్పుడు కట్టుదొన అంటారు.

కన్నడంలో కోనేరునే కట్టుకొణె అంటారు.

"తన చరిత్రాంబునకును ముజ్జగమ్ముల, జనుల వీనులు కట్టుదొనలు గాఁగ."
చంద్రా. 5.14.

## కట్టుపకాసి

వీరుడు; ధీరుడు; శూరుడు; క్రూరుడు.

"కట్టుపకాసి దీర్ఘదృఢకాయుఁడు తత్ప్రతిహారపాలకుండు."
హరి. పూ. 8.47.
నిర్వ. 4.54.

"ద్రుపదుండు వచ్చి యా, కట్టుపకాసు లిద్దఱకుఁ గ్రక్కున నడ్డము సొచ్చి."
భార. భీష్మ. 1.260.

"రావుతుల్ గట్టుపకాసులై నరునిఁ గప్పిరి." భార. శల్య. 1.7.

"కట్టుపకాసులై గగనాంగణంబున, మందేహు లింతకు మాఱుకొంద్రు."
నైష. 8.13.
భీమ. 4.47.

## కట్టుపడు

1. బందీ యగు.

"వల్లభుఁ డిట్లు కట్టుపడువార్త చెవిం బడ." దశా. 5.128.

2. ఏమీ చేయలేని స్థితిలో నుండు.

"నేనేదో ఆ పెద్దమనిషి మాటకు కట్టుపడి ఉండిపోవలసి వచ్చింది.".
వా.

3. తక్కు వగు.

"...శూరుఁడు, భూమీదాతకుఁ బ్రభావమునఁ గట్టువడున్." భీమ. 5.65.

## కట్టుపఱచు

ఆటంకపఱచు, అడ్డగించు.

"భానుశశిమార్గములు కట్టు వఱచి."
శాకుం. 2.113.

చూ. కట్టువఱచు.

**కట్టుపాటు**

ఏర్పాటు.

చూ. కట్టుబాటు.

**కట్టుబంట్లు**

వ్యాఘ్రాదులను కట్టుటకై పన్నిన పన్నాగములు. వలలు, ఉరులు వంటివి.

"లోలాక్షిదృగ్రుచులో కట్టుబంట్లో, బాలవీక్షణములో పన్నినవలలో."

పండితా. ప్రథ. పురా. పుట. 333.

**కట్టుబండి**

సరుకు నింపినబండి.

దీనినే బరువుబండి అని కూడా అంటారు.

**కట్టుబడి**

చేను పట్టాదారుకు, కౌలుకు చేసుకున్నవారు ఏటా యింత అని యిచ్చే ధాన్యాదులు.

"ఇరుగుకై జీతంపు లెక్కటీలకు గుజ్జు, పణపు మామిడిఁ గట్టుబడిగఁ జేసి."

చంద్రా. 4.84.

"మా చేను ఈ సారి కట్టుబడికి ఇచ్చాము. కోరుకు ఇచ్చినప్పుడల్లా వాడు సరిగా లెక్క చూపడం లేదు."

వా.

చూ. కట్టుపడు; కట్టువడు.

**కట్టుబడు**

లోబడు – నియమబద్ధుడగు.

"ధర్మానికి కట్టుబడినాడు." వా.

"వాడు మాటకు కట్టుబడి ఉంటాడు."

వా.

చూ. కట్టుపడు, కట్టువడు.

**కట్టుబోతు**

1. స్వేచ్ఛాచారి.

"కట్టుబోతులఁ బాడఁగన్నఁ గౌఁగిలించు." మల్హ. 3.4.

2. మంత్రగాడు.

మంత్రవేత్తలు వాకట్టు. కనుకట్టు మొదలయినవి చేస్తారు. కనుక అట్లా వచ్చిన పలుకుబడి.

**కట్టుమట్టుగా**

నివాసస్థానంగా,

"కావించె నెవ్వఁడు కట్టుమట్టుగ హస్త, తలము సంతతదాతృతాసురభికి."

ఉదయనోదయము. 1.56.

**కట్టుమట్టు చేయు**

ఏర్పాటు చేయు, కట్టుబాటు చేయు.

"సుగ్రీవాజ్ఞ నడవం గట్టుమట్టు చేసి."

రామా. 5.325.

వావిళ్ల ని. లో ఈ మాటకు పసులసాల, ఉనికిపట్టు అన్న అర్థాలు కూడా ఉన్నట్లు ఇచ్చారు.

**కట్టుమాను**

తెప్ప.

(తమి) కట్టుమరం.

**కట్టుమామిడి**

అంటుమామిడి.

విత్తనం వేయకుండా మామిడికొమ్మను నఱికి

వేఱుచోట అంటు కట్టిన మామిడి.
చిలుకలు మొదలైనవి కొట్టకుండా బుట్టలు కట్టిన మామిడిచెట్టని శ. ర. లో చూపిన అర్థం సరి అని తోచదు.

కట్టువడ జేయు
కట్టి పెట్టు – ఆపు.
"భస్మాంగరాగంబు పని కట్టువడఁ జేసి." హర. 5.5.

కట్టువడు
ఆగిపోవు, మూతపడు.
"క్రమము దప్పిన మరణముల్ గట్టువడియె." రుక్మాం. 1.136.
"ఖచరుల త్రోవలు కట్టువడియె." ఉ. రా. 1.285.
"ఆమాట అనేసరికి వాడినోరు కట్టుపడింది." వా.

కట్టు వదలిన క్రేపు
స్వేచ్ఛాచారి.
తాళ్ల. సం. 12.75.

కట్టె గిట్టె
కసవూ గట్రా. జం.

కట్టెగుఱ్ఱము
ఒక పిల్లల ఆట.
ఒక వెదురు కర్రను కాళ్ల సందున పెట్టుకొని దానినే గుఱ్ఱంగా భావించి అదిలిస్తూ పిల్లలు ఆడుకొనే ఆట.

కట్టెదురు
ఎట్టయెదురు.
"ఇందుల లేఁ బెయ్య లీను కట్టెదుర, మందలై యున్నగోమాతృసంఘంబు..."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 240.
(అదే - పుట. 304.)

కట్టెర్ర
ఎఱ్ఱదనము.
"కట్టెర్ర సోకినట్టి." క్రీడా. పు. 20.

కట్టెవంపు పొయి తీరుస్తుంది
ఒక దుర్మార్గునికి ఆ పెద్ద దుర్మార్గుడే సరి అనుపట్ల ఉపయోగించే మాట.
కట్టెలు ఎంత వంకరగా ఉన్నా ఆ వంపు మనకు తీయడం ఎటూ సాధ్యంకాదు. పొయ్యిలో పెడితే అంతా భస్మమై పోతుంది – వంకర ఎలాగూ చక్కనవుతుంది – అన్న వాక్యార్థంపై యేర్పడిన పలుకుబడి.
"వీ డిక్కడ అందరినీ యేడిపించుకుని తింటున్నాడు. ఇప్పుడే మా పొరుగూరి కరణమయ్య తగులుకున్నాడు. ఇక వీడి పని సరి. కట్టెవంపు పొయి తీరుస్తుంది లే." వా.

కట్టె విఱిచి పొయ్యిలో పెట్టినట్లు
పెడసరముగా.
"వా డెప్పుడు మాట్లాడినా కట్టె విఱిచి పొయ్యిలో పెట్టినట్లు మాట్లాడుతాడు." వా.

**కట్టెవిఱుపుమాట**

వెడసరపుమాట; పుల్లవిఱుపు మాట.

"వాడి నోట్లో కట్టెవిఱుపు మాటలు తప్ప మంచిమాట ఒక్కటి రాదు."

వా.

**కట్లజెఱ్ఱి**

ఒళ్లంతా కట్లున్న జెఱ్ఱిపోతు.

"పెద్ద పలువన్నె కట్లజెఱ్ఱి."

ఆము. 4.89.

చూ. కట్లపాము.

**కట్లదండ**

మెడలో వేసుకొను ఒక విధ మైన సరము.

కట్లసరి అని నేడనేది ఇదే కావచ్చును.

శుక. 3.105.

**కట్లపాము**

ఒళ్ళంతా కట్లవంటి చార లున్న పాము.

చూ. కట్లజెఱ్ఱి.

**కట్లపురుగు**

కట్లపాము.

**కట్లబల్లి**

కత్తెరకాట్లున్న బల్లి.

**కట్లమంచం**

ఇనుపకట్లు వేసి బిగించిన మంచం.

**కట్లసంచి**

తూనికరాళ్లూ, త్రాసూ మొదలయిన వన్నీ ఉంచే సంచి.

బంగారంపని చేసేవా రిప్పుడూ దీన్నిలాగే పిలుస్తారు.

చూ. కల్లెసంచి.

**కల్లెసంచి**

చూ. కట్లసంచి.

**కట్లసరి**

ఒకరకమైన దండ.

చూ. కట్లదండ.

**కడకంట నగు**

నవ్వును కనులతో సూచించు.

"అని యార్తులై పల్కు నా పౌర జనులఁ, గని కేల వారించి కడకంట నగుచు."

ద్విప. జగ. 174.

**కడకన్నుల సన్నల చూపు**

క్రీగంటి చూపులతో సైగ చేసి చూపు.

"సత్యభామ కాకలికి తెఱంగు శౌరి కడ కన్నుల సన్నలఁ జూపె."

పారి. 3.20.

**కడకడల నుండు**

దూరదూరముగా నుండు.

"శ్రీ మణిమండనునిఁ బవళింపఁజేసి, కడకడల నుండునంతఁ దత్కటక మేలు..."

శుక. 1.286.

**కడకాల దన్ను**

తిరస్కరించు, త్యజించు.

"నడచె భవాంబుధిఁ గడకాలఁ దన్ని."

పండితా. ప్రథ. పురా. పుట. 275.

చూ. కడకాల ద్రోచు.

**కడకాల మగు**
అవసానకాలము సమీపించు.
"దైవగతిం గడకాల మైన."
ద్వాద. 9.98.

**కడకాలు పట్టు**
పాదాగ్రములను పట్టుకొను.
"ఆ విశ్వవిభు డైన యతఁడు కోపించి, కడఁగి హస్తిపకుని కడకాలుఁ బట్టి."
ద్విప. మధు. పు. 14.

**కడకాళ్ళ ద్రోచు**
తిరస్కరించు.
"అయ్యో! మగనిం గడకాళ్లఁ ద్రోచి."
శుక. 1.154.
చూ. కడకాల దన్ను.

**కడ కొత్తు**
త్రోసి వేయు.
"సన్నప కడకొత్తు హంస మిథున మ్ములు." చంద్రా. 4.143.

**కడకొఱవి**
సగము కాలిన కొఱవి.
పోయిన్లో వంట కాగా మిగిలిన కొఱవులపై నీళ్లు చల్లి ప్రక్కకు తోస్తారు. అందుపై వచ్చిన పేరు.
"జ్ఞాతులు...నీతిం బాసిన వికృతవిభూతిన్ గడకొఱవు లట్లు పొగ యెదు రధిపా!" భార. ఉద్యో. 2.275.

**కడగంటి చూచు**
కటాక్షించు, ప్రీతితో చూచు.
"ననుఁ బ్రీతిం గడకంటఁ జూచి, విజయా! నా చేత నెబ్బంగి నే, పని యైనం గడతేలు." ఉ. హరి. 2.21.

**కడగను**
తీరు, ఒడ్డుచేరు. కడముట్టు.
"కాంక్షితంబు కడగాంచె."
హర. 4.14.

**కడగట్టు**
కట్టిపెట్టు: ఉద్యాపించు; ఏర్పఱచు.
"ఇట్టి కోమలి లతాతనుసేచన మాచరింపఁగా, గరుణ యొకింత లేక కడగట్టు మునీంద్రుఁడు." శృం. శాకుం. 2.62.

**కడగండ్ల మారి**
ఎప్పుడూ కష్టాలు అనుభవించేవాడు.

**కడ గాంచు**
పూర్తి యగు.
కాశీ. 5.258.

**కడగొట్టు**
1. చచ్చు.
"గిట్టెఁ బులుల్ సింగముల్, గడ గొట్టెన్." సారం. 1.107.
2. చివరిది.
"అందఱికం గడగొట్టు చెల్లెలై."
భాగ. 10. పూ. 1685.
"వాడు కడగొట్టు కొడుకు. ఇది కడ గొట్టు కూతురు." వా.

**కడగోర**
కొనగోర.
"కాముక కల్పిత కడగోర దిద్ది."
నవ. 2.

**కడచను**
1. చచ్చు.
"సకలసంశప్తకులు కడచనిరి."
భార. శల్య. 1.9.

2. పూర్తి యగు.
"కడచిన హయమేధమఖము కడచన మిక్." భార. అర. 3.68.
"ఓలిన కడచన నలువది, నాలుగు విద్యలను నేర్చు నైసర్గికమై, వాలిన సుకవులకుం గాక." కుమా. 1.42.

3. నశించు.
"విష్ణుమూర్తులు కడచన్న వేళలందు." శివ. 1.105.

### కడచెడు

దిక్కుమాలు.
"అంతఁ గడచెడి వారమ్ముని కోప భస్మసాత్కృతతను లై పడిరి." జాహ్నవి. 2.82.

### కడ చేయు

వదలిపెట్టు.
"కావున నాసలఁ గడచేసి మరల, దేవ లోకమున కేతెంచితిమి" ద్వి. నల. 2.629.

### కడచేరుచు

కడతేర్చు.
"మముఁ గడచేర్పఁ దగు." భార. ఉద్యో. 4.155.
చూ. కడతేర్చు.

### కడజాతి

హీనుడు, అంత్యజుడు; హీనురాలు; అంత్యజురాలు.
"ఈ కడజాతినాతి కిహిహీ మహీదేవుఁడు చిక్కె." పాండు. 3.94.

### కడతలు వాచు

విసుగెత్తి పోవు.
"వీనితో వేగివేగి కడతలు వాచిపోయినవి. ఇంక నాచేత కాదు." వా.

### కడతలు వాయించు

దండించు.
చెంపలు వాయించు వంటిది.
"వాడిదగ్గిరికి వెళ్ళి యివన్నీ అన్నావంటే కడతలు వాయించి పంపుతాడు. జాగ్రత్త." వా.

### కడ తెగు

అంత మగు.
"కడ తెగక యంత కంతకుఁ, బొడవయ్యెను." మైరా. 2.11.

### కడతేఱు

గట్టెక్కు; చచ్చు.
"అప్పు డాబారిఁ గడతేఱ నగు ప్రయత్న, మెట్లు చింతింపవలయు రాకేందువదన!" శుక. 1.319.
"ఈ కష్టాలనుండీ నన్నెలా ఆ భగవంతుడు కడతేరుస్తాడో ఏమో మరి!" వా.
"దీర్ఘజిహ్వుఁడు గడతేఱిపోయె." అచ్చ. సుం. 123.

### కడతేర్చు

1. పూర్తి చేయు.
"తొడఁగిన పని చలం బెడపక యతి సత్కారం బైనఁ గడతేర్చు ప్రభువు లార." భార. విరా. 3.21.
"కడతేరు మట్లనే కావింపు మఘము." వర. రా. బా. పు. 41. పంక్తి. 7.

2. చంపు.
"దానవు, కపటము గాఁ దెలిసి వానిఁ గడతేర్చుటయున్." జైమి. 5.146.

### కడ నుంచు

వేఱుగా ఉంచు.
కడగా పెట్టు అని రాయలసీమల్లో వాడుక.

సూ. ని. లో పరిత్యజించు అనీ, వావిళ్ళ ని. లో గెంటివేయు అనీ యిచ్చిన అర్థం సరి కాదు.

"అల్లుఁడైన పెండ్లికొడుకు నేచి చూచి యవలీల మెయిం గడ నుంచి యచ్చటన్." శుక. 1.286.

"పంకజాతాసనప్రతిపత్తి కడ నుంచి, మృగరాజపీఠిపై మెట్టించి." కకు. 1.13.

## కడప త్రొక్కు—కొని వచ్చు

ఇంటిలోనికి వచ్చు.

"ఏదో చుట్టం గదా అని నీ కడప తొక్కుకొని వస్తే యింత మాట అంటావా?" వా.

## కడప దాటు !

బయటికి పో.

"ముందు కడప దాటి మాట్లాడు." వా.

## కడపరాని

గొప్పైన; వదలివేయ రాని. కడపుట అనగా ఇక్కడ త్రోసివేయుట. త్రోసివేయ వీలు లేని అనగా అంత గొప్పవాడు అని భావార్థము.

"నీ వొక్కఁడ వయుఁ, గడపరాని యట్టి భటుఁడవే?"
పండితా. ద్వితీ. మహి. పుట. 186.

## కడపల చేరు

అంత మగు.

"చాతకంబుల పిపాసలు కడపలఁ జేర." భాగ. 10. పూ. 753.

## కడపి పుచ్చు

1. పంపు.

"సార్థవాహులం గడపి పుచ్చి." కాశీ. 4.64.

2. ఉదాసీనత వహించు.

"...రక్షింపఁ జాలియుండి, కడపి పుచ్చిన సూర్యలోకగాములు దప్ప." భార. ఉద్యో. 1.161.

3. వాయిదా వేసి తప్పించు కొను.

ఏదో ఒక సాకు చెప్పి తప్పించుకొను అనుట.

"సిద్ధసుతుని సిద్ధున కీక యేఁ, గలాదు నన్యు ననుచుఁ గడపి పుచ్చె." కళా. 5.129.

4. జరపు.

"పుష్టి సమస్తమున్ గడపి పుచ్చి." పాండు. 3.28.

5. దాచు.

"...అవాగేవి యావిర్భవించిన నొసఁగిన కళాపూర్ణ ఛేదన సామ్రాజ్య సంపదను భవావస్థ మానవలాఘవశంక నప్రకాశముగాఁ గడపి పుచ్చుటకు నుపాయంబుఁ జింతించి..." కళా. 5.17.

## కడమ కలుగు

లోపము కలుగు.

"కనకపత్రమున నిచటఁ, గడమ కలదను వ్రాయు లేఖయును లిపియు, మధ్యమును నాదు నయ్యె." శృం. శాకుం. 2.176.

## కడమ పడు

1. తక్కువగు.

"ఒక్కత్రాడు సుట్టిన నది రెం డంగుళంబులు కడమ పడియె." భాగ. 10. పూ. 384.

2. కొఱతపడు.

"విభీషణుని రాజుఁ జేయఁగనుట మీ లావునఁ, గాని నాకుఁ గలిగెఁ గడయు పడక." భాస్క. యుద్ధ. 24.79.

3. మిగిలి పోవు—ప్రాప్తి కాక.

"చెలువు కడమపడియె..."

ఆము. 4.53.

చూ. కడమపడు.

కడమ పెట్టు

మిగుల్చు.

"కడమపెట్ట కంతయును నాకు నెఱిఁగింపు." ప్రభా. 3.148.

కడమ పడు

మిగులు; కొదవపడు.

"అట్లు దీనుల వధియించి యచటఁ గడమ, వడిన పసులు వడిఁ బ్రోచి."

కేయూ. 2.105.

చూ. కడమపడు.

కడమ లెంచు

కొఱతలెన్ను; లోపము లెంచు.

"కని కానని యజ్ఞానజంతు వను, కడమ లెంచ నీక నొలఁ జేదవ్యా."

శాల్వ. సం. 9.206.

కడ ముట్టబడు

దరి చేరు.

"మునుఁగుచును దేలుచును గడముట్టఁ బడని, జనుల కెల్లను..." భీమ. 5.170.

చూ. కడముట్టు.

కడముట్టు

ముగియు; నిర్మూల మగు.

"కం ఫులపా జారము కడముట్టి నాక్కా." కళా. 3.130.

గౌర. హరి. ద్వి. 2454.

"శత్రువు ఋణంబుఁ జిచ్చు నెచ్చరిక తోడఁ, గడమపెట్టక కడముట్ట నడఁప వలయు." ప్రబో. 5.4.

"ఈ పని ఈ రోజు కడముట్టేటట్టు లేదు." వా.

కడయిల్లు

పరలోకము.

ద్విప. భాగ. 4.

కడయింటి పొదువు

పోటుమానిసి.

బసవ.

కడలుకొను

1. వ్యాపించు;

"....మెఱుగులు దిక్కులఁ గడలుకొనఁ, నగ, మించు దంతపు టుయ్యెల మంచము నను, బొలుపు మీఱుచుఁ దనయంతిపురమా పతుల, యూడిగంబులు గైకొంచు నున్న కొరి." కళా. 2.15.

"కమఁగవ నును సోగ కెంపు గడలు కొనంగన్." జైమి. 2.36,

2. అతిశయించు.

"ప్రభువాహనుఁ డధిక సౌభాగ్య ధనము, గడలుకొన." జైమి. 5.157.

"ప్రీతి కడలుకొనంగఁ."

భార. విరా. 5.388.

3. చిప్పిల్లు.

"నుగవఁ గడు నక్రువారి గడలు కొనంగ." భార. విరా. 4.152.

కడలుకొలుపు

కడలుకొనఁ జేయు.

"రతిదేవి నెవ్వఁగు రారాపుఁజన్నులు గడకన్నులకు నింపు గడలు కొలుప." శృం. నైష. 2.41.

**కడలెత్తు**

పొంగు.

"జొటజొట ధారగా వడియుచుఁ గడలెత్తుసుధారసంబు." పాంచా. 4.48.

**కడలొత్తు**

వ్యాపించు.

"శరమూలముల కాంతి కడలొత్తె." హరి. పూ. 8.168.

**కడలొక్కొను**

చూ. కడలుకొను.

**కడవఁబడు**

1. మిగులు.

"ఒకడుం, గడవఁబడకుండఁ గృష్ణుఁడు, పడఁతులకును యమున యాటపటముగఁ జేసెఁ." హరి. పూ. 8.37.

2. ముగియు.

"కడవంబడు నొక్కొ పని యని, కడు వెసఁ జనుదెంచె..." భార. శాంతి. 5.281.

**కడవ బలుకు**

తిట్టు, దూషించు, త్రోసివేసి నట్లు మాటలాడు.

కడవన్ = ప్రక్కకు తొల గించునట్లు, తిరస్కరించునట్లు అని భావార్థం.

"పండితేంద్రునిఁ గడ్వఁ బలికిన పాల, సుండ." పండితా. ద్వితీ. మహి. పుట. 12. చూ. కడ్వ బల్కు.

**కడవ బల్కు**

తిరస్కరించు, తూలనాడు.

"కాంత దన్నెంతయుఁ గడవఁ బల్కెన." బస. 5.127. చూ. కడవ బలుకు.

**కడవ బుచ్చు**

త్రోసిపుచ్చు. తిరస్కరించు. పండితా. ద్వితీ. మహి. పుట. 214.

**కడవ బెట్టు**

తొలఁగించు.

"అపుడఁ గడవంబెట్టఁగ, కోపి..." భార. ఉద్యో. 3.6.

**కడవల నీ రినుము ద్రావుకైవడి**

కాగిన ఇనుము ఎన్ని నీళ్లు పోసినా తాగుతూనే ఉంటుంది. భోగములతో భోగాసక్తమయిన మనస్సు సంతృప్తి చెందదు అన్న భావాన్ని సూచించే ఉపమానం.

"వడిఁగాఁచి కాఁచియుంచన్, గడవల నీ రినుము ద్రావు కైవడిఁ జెప్పె." మను. 3.133.

**కడవాడు**

అస్పృశ్యుడు; చిన్నవాడు.

"గారాపు మీతల్లి కడవాఁడఁ గాని నే, గఱుతింపఁ గడవాఁడఁ గాఁ జుమయ్య." మను. 5.4.

"అడిగిన నే మీ కడవాఁడ నంచు." భార. ఆర. 1.96.

**కడవుట్టు కూతురు**

కడగొట్టు కూతురు. అందరి కంటె చిన్నకూతురు. పండితా. ప్రథ. పురా. పుట. 293. చూ. కడగొట్టు.

**కడవెళ్ళా**

పూర్తిగా.

"వాడు భాగవతం కడవెళ్లా చదివాడు." వా.

**కడవెళ్లు**

కడతేఱు; దాటు.

"విరహవార్ధి సెఁ గడవెళ్ళు తెఱుగు" ప్రభా. 3.124.

**కడవ్రేలు**

చిటికెన వ్రేలు.

**కడసంజ**

సాయంసంధ్య.

కళా. 5.10.

**కడసను**

పేరు పొందు, ప్రఖ్యాత మగు.

"కడసన్న నీదు విఖ్యాపితమహిమ, కడ యెఱింగెద మనఁగా నా తరంబె." బస. 5.129.

రూ. కడచను.

**కడసాపి ముదుసలి**

పండు ముసలిది.

సాపి = కాలము.

కడసాపి = తుదికాలము.

"పసిఁడి గట్టున కొక వింత మిసిమి నించి, నెఱసెఁ గడసాపి ముదుసలి తెలిపియొండ." పారి. 4.43.

**కడసూపు**

కడతేర్చు, ముక్తి నిచ్చు.

"గముయించు వారికిఁ గడసూపు వాఁడు," బస. 6.161.

**కడికంచము**

అన్నము తినుకంచము.

"కలువలరాజు పువ్వు కడికంచము బ్రహ్మకపాలము..." హీర. 2.75.

**కడికండములు చేయు**

ముక్కలు ముక్కలు చేయు.

"తురంగాంగముల్, కడి కండంబులు సేసి." భార. ద్రోణ. 5.114.

**కడికండలుగా**

చిన్న చిన్న ముక్కలుగా.

భోజనమున కనువుగా నఱికిన కండలుగా—అనగా ముక్కలు ముక్కలుగా నఱికిన వనుట.

"పొడుతుఁ గడికండలుగాఁ." కుమా. 11.36.

"ఆకాశభం,టామార్గంబున నుండి కుండఁ గడికండ ల్గాఁగఁ బెల్లేసినన్." కా. మా. 2.60.

**కడికొమ్ము గావించు**

ఆహుతి చేయు.

"వైరిరాజన్యుల వనదుర్గముల నెల్లఁ గడికొమ్ము గావించెఁ గరటిఘటవు." రాజగో. 1.70.

ఇంకనూ అర్థం విచార్యము. ఇట పాఠమే సరి కా దేమో!

**కడిగండము**

పొరపోవుట.

తింటూండగా ఉన్నట్టుండి పొరపోయినప్పుడు ప్రాణాపాయకర మనీ, అలాంటి గండం అన్నదానసుకృతంవల్ల

పరిహార మవుతుం దనీ అంటారు.

వేంకటేశ. 44.

**కడి గడి యగు**

ఆహార మగు.

"విడువక చేతిలో విష్ణుప్రసాదము, గడి గడి యైనది కానీరు గాని."

తాళ్ల. సం. 6.10.

**కడిగినముత్యంలాగా**

నిర్మలంగా, పరిశుభ్రంగా.

"ఆ పిల్ల కేం? కడిగిన ముత్యంలా ఉంటుంది." వా.

చూ. పులుగడిగిన ముత్యము.

**కడిగి (పెట్టి) న సాలగ్రామం లాగా**

బోసిగా, ఏ నగా నాణ్యం లేకుండా.

"వా డెంత సంపాదిస్తే మాత్ర మేం? పెళ్లాం మాత్రం కడిగిన సాలగ్రామం లాగా ఉంటుంది." వా.

**కడిగి పెట్టిన గంగాళంలాగా**

సర్వశూన్యంగా.

"ఆవిడ కడిగి పెట్టిన గంగాళం లాగా ఉంది. ఒక సొత్తా? ఒక చీరా?" వా.

**కడిగి పెట్టిన నిప్పు లాగా**

నల్లగా, బొగ్గులాగా.

వ్యంగ్యంగా అనుమాట.

"ఆ పిల్ల కేం? కడిగిపెట్టిన నిప్పులాగా ఉంటుంది." వా.

**కడిగి వదిలి పెట్టు**

అవమానించు; ఎదుటివాని లోపాలన్నీ బయట పెట్టు.

"వా డీసారి కనబడనీ. కడిగి వదిలి పెడతాను. వాడు చేసిన వెధవపను లన్నీ నాకు తెలియనివా ఏమిటి?" వా.

**కడిగొను**

తిను.

"చిచ్చు కడిగొనంగ వచ్చునే?"

భాగ. 8.246.

**కడిపెడు బిడ్డలు**

అధికసంతానం.

"కాక యున్న మేను కడిపెడు బిడ్డల, వార మెల్లు బ్రతుకవాగ మనుజ!"

భోజ. 6.144.

చూ. కడుపు నిండా పిల్లలు.

**కడి మాడ సేయునట్టి**

అమూల్య మయిన.

భోజనవిషయంలోనే వాడుక.

ఒకొక్క కడి (అన్నం ముద్ద) ఒక మాడ చేస్తుంది అనుట.

"అమృతోపమానంబు లైన యన్నంబులు, కడి మాడ సేయంగ గుడుచు వారు."

విక్ర. 5.124.

**కడియపు చేమీదుగా దివముచేరు**

ముత్తైదువ చావు చచ్చు.

కడియములు సౌభాగ్య చిహ్నములుగా ఇక్కడ భావింపబడినవి. వాడుకలో కూడ నేడు 'ఆమె ముత్తైదువ చావు చచ్చింది. ముత్తైదువగా పోయింది' మొదలైన పలుకుబడు లున్నవి.

ఆయుషునగా స్త్రీ చనిపోవుట

ఎంతో పుణ్యాత్మమని, గొప్ప అని మన సంప్రదాయం.

"అంతట నయ్యంతి పుణ్యాత్మజాతులఁ గాంచి, కడియంపుఁ జేసిరిఁ దుగాఁగ దినము, నేమటయు..." శుక. 3.337.

పెద్దలకిలో ఈ పలుకే బడి నేఁడు మారినది.

"ఏదో ఆ పుణ్యాత్మురాలు ముత్తైదువగా పోయింది. చాలు. ఇంకేం కావాలి?" వా.

**కడియపుబట్టు**

కడియమువలె గుండ్రముగా చేసిన పెట్టు.

"కడియంపుబట్లు వెన్నప్పాలు." కళా. 7.81.

**కడి యెత్తు**

అన్నం తిను.

"పొత్తునఁ గుడువక తాఁ గడి, యెత్తడు..." రాజ. చ. 2.34.

"మీగడ పెరుగు లేనిదే మా వాడు కడి యెత్త లేడమ్మా, ఏం చేస్తాం!" వా.

**కడివోవు**

1. ముక్కిపోవు. కసటువోవు.

"కడివోవ నొడళులు గడిగి." కుమా. 1.98.

2. వాసన పోవు. వాడు.

"కడివోయిన పువ్వులు మఱి, ముడుచునె రసికుఁ డగువాఁడు..." భో. 4.224.

3. బీసువోవు. వ్యర్థమగు, చెడిపోవు.

"తాల్మి కడి వోయిన నించుక లజ్జలావు నన్." ఉత్త. హరి. 5.202.

"సంతతము గడి వోనివాసనలు గలుగు, పారిజాతమహీజపుష్పములు ముడిచి." వి. పు. 8.122.

**కడి సేయు**

భుజించు.

"యుగము గాల్చిన చేదు జగము గెల్చిన జోదు, గడిసేయఁ బడిసేయఁ గలుగఁ డేని." రుక్మాం. 5.71.

**కడిసేసి పెట్టు**

వంట చేసి పెట్టు.

"మృడుండు గాడవచేతఁ గుడిచినభంగి, గుడిచెనే విధులచేఁ గడి సేసి పెట్ట?" పండితా. ప్రథ. దీక్షా. పుట. 172.

నేఁటి వాడుకరూపం :

"కడి చేసి పెట్టేదిక్కు కూడా లేరు పాపం! ముసలాయనకు." వా.

**కడు గైనా తవు డైనా**

ఏదో యింత అనుట. జం. కక్క. 18.

**కడుదుర్లు కుట్టినకరణి**

కందిరీగలు కుట్టినట్లుగా. పొడిచినట్లు, చురుకు చురుకను బాధను తెలుపుమాట.

"కడుఁదుర్లు గుట్టినకరణి మేను పెరియ, నొడలు పెన్నొత్తును లోలక నయ్యెదుగు." ద్విప. కల్యా. 148.

**కడుపగు**

గర్భమగు.

ఇది నిరసనలోనే వినవస్తుంది.

"ఆ బాలవిధవ కడుపయింది అని ఊరంతా ఒకే గోల!" వా.

చూ. కడుపు వచ్చు.

**కడుపా కళ్లేపల్లి చెరువా?**

వాడంత తింటున్నా డేమిటి!

వట్టి తిండిపోతే అనే భావచ్ఛాయలో ఉపయోగించే పలుకుబడి.

"అన్నిపూరీలూ మింగించాడు. ఆదేం కడుపా కల్లేపల్లి చెరువా?" వా.

చూ. కడుపా కల్లేపల్లి చెరువా?

కడుపా ఖండవల్లి మడుగా?

చూ. కడుపా చెరువా?

కడుపా కొల్లేరుమడుగా

చూ. కడుపా చెరువా?

కడుపా చెరువా!

అంత తినడం సాధ్యమా; అంత తిండిపోతేమిటి అనుట.

"ఇన్ని వడ్డిస్తే నేనేం చేస్తాను? నాదేం కడుపా చెరువా!" వా.

"అన్ని రకాల పిండివంటలు చేసినా ఒక్కటి వదలకుండా తినేశాడు. వానిదేం కడుపా చెరువా!" వా.

ఇదే స్థానికమైన చెరువుల పేళ్లతో చేరిన రూపాలతో వినవస్తుంది.

చూ. కడుపా కల్లేపల్లిచెరువా?; కడుపా ఖండవల్లిమడుగా?; కడుపా కొల్లేరు మడుగా?

కడుపాత్రంవాడు

కడుపు కక్కుర్తివాడు, తిండిపోతు.

మాటా. 129.

కడుపార

1. కడుపు నిండా.

"ఆరగించె కడ్పార." బస. 7.203.

2. గర్భము ఫలింపగా—కనులార. చేతులార వంటిదే కడుపార కూడా.

"పాసియుంబుల్ కడుపారం ద్రావె." వెం. పంచ. 3.363.

"తన కడుపార సతీదేవి కూతురై జన్మించక." కుమా. 3.22.

కడుపు అంటుకొని పోవు

1. చిక్కిపోవు.

"వెంటవొగ్గళ్లలోం గడుపంటి శ్మశ్రు, చలనములం గ్రుక్కిజీర్ణోతువుల..." అము. 6.13.

2. క్షుద్బాధ కలుగు.

"పాపం! ఎప్పుడు తిన్నాడో యేమో! కడుపు అంటుకొని పోయింది." వా.

కడుపు అగు

గర్భమగు.

చూ. కడుపగు.

కడుపు ఆరసి పెట్టు

కడుపు చూచి పెట్టు.

అనగా ఆకలి యెంతో గుర్తెరిగి ఆదరముతో అన్నము పెట్టు.

"హరహర! యెవ్వరింకం గడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్." శివ. 3.19.

చూ కడుపు చూచి పెట్టు.

కడుపు కందపెర డగు

చూ. కడుపు కందవి త్తగు.

కడుపు కందవి త్తగు

సంతానాభివృద్ధి యగు.

కంద విపరీతంగా పెరుగుతూపోతుంది అనుటపై వచ్చినది.

"అడుగంగవలసిన యది యే, నడుగుదు విశదముగ మొదల నాచిలుక యడ్డెక్క

డిచి యిట దేక యేటికి, విడిచితి నీ
కడుపు కందవిత్తుగ హంసీ!"
ప్రభా. 4.41.
చూ. కడుపు కందవెరడగు.

**కడుపు కక్కుర్తి**

తిండికోసమై ఏమిటికైనా లోబడుట.

"తడవులఁ బట్టి యేము సతతంబును బోదుము వాని పీటికిన్, గడు మతి చాలమిం గడుపుకక్కురితిన్ సురలోక నాథ!..."
ప్రభా.

"కడుపు కక్కుర్తితో వాడా నీచపు పనికి పాల్పడ్డాడు." వా.

**కడుపు కట్టు**

చూ. కడుపుగట్టు.

**కడుపు కరగు**

కొంత కష్టపడుటతో పూర్వమున్న కండ తగ్గినది అనుపట్ల ఉపయోగిస్తారు.

"రెండో పెళ్లాం వచ్చేసరికి అయ్యగారికి కాస్త కడుపు కరిగింది." వా.
చూ. బొజ్జ కరగు.

**కడుపు కాల!**

ఒక తిట్టు.

"దాని కడుపు కాలా! పిల్లాణ్ణి ఎంత దెబ్బ వేసిం దమ్మా?" వా.

**కడుపు కాలు**

సంతాననష్టమగు.

"పాపం! మీ అక్క పిల్లాడు పోయాడు రా నాయనా! కడుపుకాలిన పిల్లను పిలుచుకొని వచ్చి కడుపు చల్ల చేసి పంపడం మన ధర్మం." వా.

**కడుపుకట్టు**

1. కడుపు ఈడ్చి పట్టుకొను ఒక విధమైనశూల.

"తలనొప్పి కడుపుకట్టుం, బలుగులుపుం గాళ్లతీపు పాటించుచు."
శుక. 2.205.

"ఆపిల్ల పెళ్లి అయినప్పటినుండీ కడుపుకట్టుతో బాధపడుతూ ఉంది." వా.

2. ఓర్వలేమి.

"కడుపుకట్టుకొద్దీ వాడే వేవో చెప్తే అవన్నీ నమ్మవద్దు." వా.

**కడుపు కూడు పెట్టు**

భోజనము పెట్టు.

"ఏమగట్టివాలు దాన నాకెవ్వరు, కడుపుకూడు వెట్టి కట్టఁ జీర, యిచ్చి సాకతమున నేలుదురట్టివా, రలకు పనులు సేసి..." భార. విరా. 1.298.

**కడుపుకూటికి**

కేవలం తిండికోసం.

"దేవా! యిట్లని యానతి, యీవల దేఁ గడుపుఁగూటికిట రాన్." ఆము.4.67.

"కడుపు కూటికి తప్పితే వీళ్లందరినీ ప్రాధేయపడాల్సినపని యేముంది?" వా.

"ఏదో జనంమీద ప్రేమతో తప్పా, కడుపు కూటి కైతే వైద్యమే చెయ్యాలా?" వా.

**కడుపుకొఱకు**

పొట్టకూటికి.

"పేద యై కడుపుకొఱకు పాత్రకములు చేసి రౌరవమునఁ గూలు."
కేయూ. 3.293.
చూ. కడుపుకోసం.

**కడుపుకోసం**

పొట్టకూటికి.

"కడుపుకోసం ఎన్నవస్థ లైనా పడాలి మరి!" వా.

చూ. కడుపుకొఱకు.

## కడుపు గట్టి కాలు గట్టి

తా నేమాత్రం అనుభవించకుండా. జం.

తిండైనా తినకుండా అనుట.

"వీళ్ల నాన్న పోయినప్పటినుంచీ కడుపు గట్టీ కాలు గట్టీ యీ పిల్లలను సాకుతున్నాను." వా.

## కడుపు గట్టు

మరొకరికోసమై అన్నము కూడా తినకుండు.

కడుపులు గట్టిగా బిగించుకొని ఆకలి కనబడకుండా చేసికొను టనుబట్టి వచ్చిన పలుకుబడి.

"మగవాఁడ ననుచు నున్నా, నగు నగు నేఁ గడుపు గట్టి యప్పులు మిగులఁగ, దెగిచి..." శుక. 3.276.

"కడుపు గట్టి కాళ్లు గట్టి అంత సొత్తు సంపాదించి వీళ్ల కిచ్చాను." వా.

చూ. కడుపు కట్టు.

## కడుపు గడచు

జీవనము గడచు, తిండికి జరుగు.

"కడుపు గడవడమే కష్టంగా ఉంది. ఇంక వాడు పిల్ల కేం పెళ్ళి చేస్తాడు?" వా.

## కడుపు గొట్టు

జీవనాధారము పడగొట్టు.

"ఎవరెవరి కడుపులు గొట్టో వాడు సంపాదించాడు. అది కాస్తా దొంగలు దోచుక పోయారు." వా.

## కడుపుచల్ల కదలకుండా

ఏ మాత్రం శ్రమ పడకుండా; హాయిగా.

"నీ దయ, నెక్కుడనుం బ్రొద్దు పొడుచు టెఱుఁగక నిద్రవే, దిక్కని యుండుము దాయలు, గ్రక్కతిలఁగ కడుపుచల్ల కదలక యుండఁగ." రామా. 2.7.

## కడుపు చల్లగ పలుకు

మనసు కుదుట పడుమాట చెప్పు.

"ఏ మెఱుంగ మె యాత్రికుఁ గడుపు చల్లంగఁ బలికి కరుణ చేసితే..." ఆము. 7.50.

## కడుపు చల్ల చేసి పంపు

సంతానవతి యైన ప్పుడు ఆమెను పుట్టినింటివాళ్లు తీసుకొనిపోయి ఆదరించి బట్ట లిచ్చి పంపడం ఒక ఆచారం. ఆ సందర్భంలో అలా చేయు టనే కడుపు చల్ల చేసి పంపుట అంటారు.

"పాపం! మీ అక్క పిల్లాడు పోయాడు రా నాయనా! కడుపు కాలిన పిల్లను పిలుచుకొని వచ్చి కడుపు చల్లచేసి పంపడం మన ధర్మం." వా.

## కడుపు చల్లని తల్లి

1. బహుసంతానవతి.

"ఆవిడ కేం? కడుపు చల్లనితల్లి. ఇంటి నిండా పిల్లలే." వా.

2. వాత్సల్యపూర్ణురాలు.

"ఆవిడదగ్గ రుండడాని కేమిరా! కడుపు చల్లనితల్లి." వా.

**కడుపు చించి చూపితే గారడి విద్య**

ఎంత తన కష్టసుఖాలు చెప్పుకొన్నా గమనించక పోయినప్పుడు అనేమాట.

నిజంగా కడుపు కోసి చూపినా ఇదంతా ఇంద్రజాలము లే అనుటపై వచ్చిన పలుకుబడి.

"నేను అప్పుల్లో మునిగిపోయాను మొర్రో అన్నా, వాడు సరేమరా నమ్మడు. ఏం చేస్తాం? కడుపు చించి చూపితే గారడీవిద్య అన్నట్లుంది."

వా.

**కడుపు చించుకొంటే కాళ్ళమీద పడుతుంది**

తనవారి తప్పులను తాను బైట పెట్టకూడదు అనేపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఏం చెప్పనో నమ్మా! వాడు మరీ బరి తెగి తిరుగుతున్నాడు. కడుపు చించు కొంటే కాళ్లమీద పడుతుంది." వా.

**కడుపుచిచ్చు**

ఆకలి.

"...కనికరం బుడిగి కడుపుఁజిచ్చునకు మ్రింగం దఱుముకొని వచ్చి..."

మను. 5.27.

**కడుపు చుమ్మలు చుట్టు**

కడుపులో కలుగు విపరీతమైన బాధను తెలుపుటలో ఉపయోగించునది.

కడుపు తఱుగుకొనిపోవు వంటి పలుకుబడి.

ఇది ఆంగికమయిన బాధనే కాక, మానసిక బాధను కూడా తెలియజేస్తుంది.

"కడుపు చుమ్మలు చుట్టఁగాఁ గన్న కన్నె, చిలుక నెడఁబాసి యేరీతి నిలువవాఁడ."

శుక. 1.462.

"కడుపుచుమ్మలు చుట్ట."

పాండు. 3.24.

**కడుపు చుఱుక్కను**

కడుపు మండిపోవు.

"కడుపుఁ జుఱుక్కనుఁ గన్నవారికిని."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 929.

నేటి రూపము కడుపు భగ్గుమను.

"మా అబ్బాయి ఊరునించి చిక్కి సగమయి వచ్చాడు. వాణ్ణి చూస్తే కడుపు భగ్గుమంటుంది."

వా.

**కడుపు చూచి పెట్టు**

ఆకలి గుర్తెఱిగి అన్నము పెట్టు.

"మా అమ్మ పోయింతర్వాత నాకు కడుపు చూచి అన్నం పెట్టేదిక్కు లేదు." వా.

చూ. కడుపారసి పెట్టు.

**కడుపుచూపి కాసులొత్తి జీవించు**

నీచముగా బ్రతుకు.

రామచం. 30.

**కడుపు చెక్కలగునట్లు**

గట్టిగా, కడుపుబ్బగా.

"వాడి గంగిరెద్దువేషం చూస్తే కడుపు చెక్కలయేట్లు నవ్వు వస్తుంది." వా.

కడుపు చెరు వగు

దుఃఖాతిరేకము కలుగు.

"ఆ పిల్ల పడేబాధను చూస్తే కడుపు చెరు వై పోతుంది." వా.

కడుపుచేటు

వ్యర్థజన్మ మనుట.

"కలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు." జాహ్నవి. 1.49.

కడుపు చేత పట్టుకొని

జీవనార్థమై, జీవనాధారంకోస మని.

"వాళ్ళ సంసారం అంతా చితికి పోయింది. పాపం! ఆవిడ కడుపు చేత పట్టుకొని పట్నానికి వెళ్ళిపోయింది." వా.

"దిక్కూ మొక్కూ లేక కడుపు చేత పట్టుకొని యింత దూరాభారం రావలసి వచ్చింది." వా.

కడుపు చేయు

గర్భము చేయు.

కొంత నిరసనలో నే యీ మాట వినవస్తుంది.

"అవ్వసిష్ఠుఁడు, మదయుంతికిఁ గడుపు చేసె మదనక్రీడన్." భాగ. 9.250.

"వాడు వాళ్లింట్లో ఉన్నట్లే ఉండి ఆ పిల్లకు కడుపు చేసి పారిపోయాడు." వా.

"వాడు దాన్ని నమ్మించి వేలు పెట్టి వంచించి కడుపుచేసి వదిలిపెట్టాడు." వా.

(నీ) కడుపు తఱుగ

ఒక తిట్టు.

కడుపు తఱుగుకొని పోవు

తీవ్రమైన ఆవేదనకు గుఱి యగు.

"దిక్కు లేని ఆ పిల్లలను చూచేసరికి నా కడుపు తఱుగుకొని పోయిం దంటే నమ్ము." వా.

కడుపుతీపు

సంతానముమీఁది ప్రేమ.

"పాపం ఆవిడ కడుపుతీపికొద్దీ అంతగా చెప్తున్నది గాని తనకోసం కాదు రా బాబూ." వా.

కడుపు తీయించుకొను

గర్భస్రావము చేయించుకొను.

"ఆసకేశి రామేశ్వరయాత్రకు పోలేదూ, ఏమీ లేదు. ఎక్కడకో వెళ్లి కడుపు తీయించుకొని వచ్చిం దట." వా.

చూ. కడుపు దించుకొను.

కడుపు తెచ్చుకొను

గర్భ మగు.

"జారు తెలిఁ బొంది కటా!, కడు పేల తెచ్చుకొంటి." భాగ. 9.378.

కడుపుతో ఉండు

గర్భిణి యై యుండు.

"మా పిల్ల యిప్పుడు కడుపుతో ఉంది. రోజూ కాసిని పూలు తెచ్చి పెడుతూ ఉండవే నాగమ్మా!" వా.

కడుపు దిగు

గర్భస్రావ మగు.

"కడుపు దిగ నంచుఁ బొరులు గలఁగఁ బడఁగ." భాగ. 10.62.

కడుపు దించుకొను

గర్భస్రావము చేయించు కొను.

"అది సంవత్సరానికి ఒకసారి కడుపు దించుకొంటూ ఉంటుంది. దానికేం? సీతా? జాతా?"

చూ. కడుపు తీయించుకొను.

కడుపున ఒక కాయ కాచు

సంతానము కలుగు.

"నా కోడలి కడుపున ఒక కాయ కాస్తే చూచి పోదా మని ఉంది. ఆ ఆశ కాస్తా తీర్చు నాయనా! ఇప్పుడీ సంబంధం కా దనక."  వా.

కడుపునకు పెట్టు

తిండి పెట్టు

ఐంద. 2.15.

కడుపున చిచ్చిడు

గర్భశోకము కలిగించు.

"కొడుకులార! నాదు కడుపునఁ జిచ్చిడి."  జైమి. 6.801.

కడుపున పుట్టిన కొడుకు

సొంత కొడుకు. ఔరసుడు.

అత్యాదరమును స్ఫురింపజేసే పట్టుల ఉపయోగించే మాట.

"కడుపునఁ బుట్టిన కూరిమి కొడుకుఁ."

హర. 2.75.

"తనకడుపునఁ బుట్టినకొడుకు లట్టె."

భార. ఆశ్ర. 2.163.

"వాడు పరాయివా డయినా ఇతను కడుపున పుట్టిన కొడుకులాగా చూచుకున్నాడు."  వా.

కడుపున బెట్టుకొను

వాత వేసుకొను.

"ఓరీ! చక్కనిమ్మగనును, గోరికఁ గడుపునను బెట్టుకొంటివి నా డే."

షట్చక్ర. 2.143.

"అన్ని కోళ్ళనూ ఆ దొంగరాముడే కడుపున బెట్టుకొన్నాడు."  వా.

చూ. పొట్ట బెట్టుకొను.

కడుపు నిక్కు

గర్భ మగు.

"పోలిరెడ్డికి మగపోఁడిమి లేదుగా, గాది కేలాగునఁ గడుపు నిక్కె."

శుక. 2.423.

చూ. కడుపు వచ్చు, కడుపు అగు.

కడుపునిండా కూడు - వంటినిండా బట్ట

ఆమాత్రం ఉంటే చాలును అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"నా కేం కావాలి? ఇంత కడుపునిండా కూడు-వంటినిండా బట్ట ఉంటే చాలు. కొడుకూ కోడలూ వాళ్ళిష్టం వచ్చినట్టు సంసారం నడుపుకోనీ. నే నేమాత్రం కల్పించుకోను."  వా.

కడుపునిండా పిల్లలు

కావలసినంత సంతానం ఉన్న దనుట.

"ఆమె కేం అమ్మా! అదృష్టవంతురాలు. కడుపునిండా పిల్ల లున్నారు."

వా.

కడుపునిండిన బేరము

అనవసరము కనుక అంత ఆసక్తి లే దనుట.

"నీ కేమయ్యా! కడుపునిండిన బేరం. నేను నీలాగా బెట్టు చేస్తే కుదురుతుందా?"  వా.

**కడుపు నిండిపోవు**

చాలా సంతృప్తి కలుగు.

వ్యంగ్యంగా అనుమాట.

"వచ్చీ రాక ముందే నువ్వు అనవలసిన మాట లన్నీ అన్నావు. దాంతోనే కడుపు నిండిపోయింది! ఇంక భోజనం కూడా ఎందుకు?" వా.

**కడుపునొప్పి వచ్చినప్పుడు అటుకులు తిన్నట్లు ఉంటుందా?**

పరిణామంలో గాని చెడుపని వలని ఫలితం తెలియదనుట.

"అడుకులు దిన్నట్లగునే, కడుపునఁ గుట్టెత్తినపుడు."

భార. క్రో. 4.

"కడుపు నొప్పి వచ్చినప్పుడు అటుకులు తిన్నప్పుడున్నట్లుండదు రా తమ్ముడూ." వా.

"అటుకులు రుచిగా ఉన్నాయని తింటే కడుపుకట్టు వచ్చినప్పుడు బాధ పడవలసి వస్తుంది." వా.

**కడుపుడక!**

ఒక తిట్టు.

"వాని కడుపుడకా! ఎంత రంపు చేశాడే." వా.

**కడుపుపంట**

సంతానము.

"కలుములవెలంది గారాపుఁ గడుపు పంట." శ్రవ. 1.6.

**కడుపు పండు**

సంతానవతి యగు.

"కాస్త మా కోడలి కడుపు పండిందంటే చాలు. మా కింకేం కావాలమ్మా?" వా.

**కడుపు పగులగా**

కడుపు చెరువగునట్లుగా.

శోకాతిరేకము కలుగునట్లుగా.

"కడుపు పగులంగఁ గన్నులఁ, గడుఁ గొల్పితి నీ రిదేమి?"

బుద్ధ. 1.99.

**కడుపు పగులు**

భరింపరాని శోకము పాలగు.

"దిగులుచే నేమియుఁ దెలియక, కడుపు పగిలి చెమర్చి."

వర. రా. బా. పు. 93. పంక్తి. 22.

**కడుపు పోవు**

గర్భస్రావ మగు.

"ఆవిడ కీ మధ్య కడుపు పోయిందట." వా.

"పాపం! ఆ పిల్లకు నాలుగు నెలల్లోనే కడుపు పోయిందట. దానితో సగం తీసికోయింది." వా.

**కడుపుబ్బ నవ్వు పుట్టించు**

మనసారా నవ్వునట్లు చేయు.

"కన్యాశుల్కం చదువుతుంటే కొన్ని ఘట్టాలు కడుపుబ్బ నవ్వు పుట్టిస్తాయి." వా.

**కడుపుబ్బు**

1. ఏదైనా రహస్యమును దాచలేక పోవుట.

"కడఁగి చెప్పినఁ గాని కడుపుబ్బు దిగదు."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1035.

"ఎవరిని గురించి యే చెడు విన్నా ఊరంతా టాంటాం వేయందే వదలడు. వాడి కడుపుబ్బు ఇంతా అంతా అని చెప్పలేం." వా.

2. అసూయ.

"వాడికి నేనంటే చాలా కడుపుబ్బు." వా.

### కడుపు ద్రోయు

పొట్ట పోసికొను.

"ఎచ్చోటఁ గడుపుఁ ద్రోతునో యను చుణ్ణ." భార. విరా. 1.268.

### కడుపుమంట

అసూయ.

"నేనంటే వాడికి కడుపుమంట." వా.

### కడుపుమంట పుచ్చుకొను

కడుపును మండించు అనగా బాధ పెట్టు.

"మక్కువ లేక నా కడుపుమంటయుఁ బుచ్చికొనంగఁ బూని యీ, చక్కెర వంటిపండ్లు తినసాఁగి రటంచు..." శుక. 3.376.

చూ. కడుపు మంట పెట్టుకొను, కడుపు మంట పోసుకొను.

### కడుపు మంట పెట్టుకొను

కడుపును మండించు; బాధించు.

"వాడు ఊరికే వేధిస్తూ నా కడుపు మంట పెట్టుకుంటున్నాడు." వా.

చూ. కడుపుమంట పుచ్చుకొను, కడుపుమంట పోసుకొను.

### కడుపుమంట పోసుకొను

వేధించు; సాధించు.

"అది నే నొకటి చేస్తే ఒకటి చేస్తూ నాకడుపుమంట పోసుకొంటూ ఉంది." వా.

చూ. కడుపుమంట పుచ్చుకొను, కడుపుమంట పెట్టుకొను.

### కడుపు మసి యగు

సంతానము వ్యర్థ మగు. పుత్రశోకము కలుగు.

"ఈతనిఁ గనదేని కన్నతల్లి, కడుపు మసి గాదె దయ్యుమ! కరుణ లేదె." ఉ. హర. 5.278.

### కడుపుమీద కొట్టు

బ్రతుకు చెడగొట్టు; జీవనాధారము పడగొట్టు.

"ఆ యజమానితో ఏవేవో తంటాలు చెప్పి వాడు నా కడుపు మీద కొట్టాడు." వా.

### కడుపులో ఆవాలు పోసినట్లగు

ఎక్కువ సంకటంగా ఉండు; ఆవేదనగా ఉన్న దనుట.

"ఆ విషయం వినేసరికి నాకు కడుపులో ఆవాలు పోసిన ట్లయింది." వా.

### కడుపులో కెలికినట్లగు

సంకటముగా ఉండు.

"ఆ బండికింద పడి చితికిపోయిన శరీరం చూసేసరికి నాకు కడుపులో కెలికినట్లు అయింది." వా.

### కడుపులో చల్ల కదలకుండా

ఏమాత్రం శ్రమ లేకుండ — హాయిగా.

"కడుపులోఁ జల్ల గదలక కలికి పెరుగు." హంస. 4.60.

"వాడి కేం? కడుపులో చల్ల కదలకుండా కూర్చున్నా జరిగి పోతుంది." వా.

**కడుపులో చెయి పెట్టి కలచిన ట్లగు**

విపరీత మయిన సంకటము కలుగు

విచారముతో వికారము కలిగిన దనుట.

"కడుపులోఁ జెయి పెట్టి కలఁచిన ట్లైన."

గా. హరి. ద్వితీ. పంక్తి. 1723.

"ఆమాట వినేసరికి నా కడుపులో చెయ్యి పెట్టి కలచిన ట్లయింది." వా.

చూ. కడుపులో చెయిపెట్టి తిప్పిన ట్లగు.

**కడుపులో చెయిపెట్టి తిప్పినట్లగు**

"శావురు మంటూ ఉన్న యీ యిల్లును చూచినప్పు డల్లా కడుపులో చెయి పెట్టి తిప్పినట్లు అవుతుంది." వా.

**కడుపులో దేవిన ట్లగు**

చూ. కడుపులో చెయి పెట్టి కలచినట్లగు.

**కడుపులోపలి పుండు**

పైకి కనిపించనిబాధ.

తాళ్ల. సం. 11.3 భా. 38.

చూ. పేగులోపలి తీట.

**కడుపులో పెట్టుకొను**

తప్పులను మన్నించు.

"ఏమీ ఎరగనిపిల్లవాడు. ఏం తప్పు చేసినా మీరు కడుపులో పెట్టుకొని కాపాడండి." వా.

"వా డేం చేసినా నేను కడుపులో పెట్టుకొంటూ వచ్చాను." వా.

**కడుపులో ప్రేవు లరుచు**

ఆకలగు.

"నా కడుపులో ప్రేవు లరుస్తున్నవి. కాస్త యేమైనా పడేంచేది ఉందా? లేదా?" వా.

**కడుపులో మంట పడు**

చూ. కడుపులో మంట మండు.

**కడుపులో మంట మండు**

అసూయ కలుగు.

"దు, ర్మార్గుల కడుపులో మంట మండె." శతా. 115.

**కడుపు వచ్చు**

గర్భ మగు.

"ఆపిల్లకు చిన్నతనంలోనే మొగుడు పోయాడు. పాపం! ఏం చేస్తుంది. ఎక్కడ ఎవరు మోసం చేశాడో యేమో! కడుపు వచ్చింది. ఇప్పుడు నలుగురిలో తల యెత్తుకో లేక పోతున్నది." వా.

**కడుపు సాగు**

తిండి లేకుండు.

కడుపు నిండా తిన్నప్పుడు కడుపు ఉబ్బి పొడవు తక్కువవుతుంది. అది లేనప్పుడు పొడ వెక్కు వవుతుంది.

"అంతగా వాని కడుపు సాగిన దేమిటి?" వా.

**కడుపుసుత్తు**

గర్భశోకము.

"కడుపు సుత్తు తెల్పఁగరాని గాసి పెట్ట." దేవీ. 9.98.

చూ. గర్భశోకము,

**కడుపూచు**

కడుపుట్టు.

చూ. కడుపుబ్బు.

**కడుపెడు కుమాళ్ల**

కడుపు నిండా సంతానం.

"కడుపెండ దేసి కొమాళ్లఁ గూఁతులఁ దగం గన్నట్టియిల్లాండ్రకున్." కళా. 7.123.

చూ. కడుపు నిండా పిల్లలు.

**కడుపే కైలాసము**

తిండే సర్వస్వము.

తన కడుపు నించుకోవడం తప్ప మరొకటి కాబట్ట దనుట.

స్వార్థపూరితు డనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"అంతముగఁ జూడఁ డంత వేదాంత విద్య, కడుపు కైలాస మరయ నక్కృష్ణ యతికి." పంచ. (వేం) 2.91.

"ఎవ రెట్లా పాడైపోతే యేం? వాడికి కడుపే కైలాసం." వా.

**కడ్డాయముగా**

నిర్బంధంగా—తప్పకుండా చేయమనునట్లుగా—(తమిళం-కట్టాయం = తప్పక)

రాయలసీమలో వాడుక :

"అంత కడ్డాయంగా మాట్లాడితే ఎట్లనప్పా! కొంచెం వ్యవధి ఇవ్వు—నిల్చిపోయి ఉన్నా నిప్పుడు." వా.

"వాడు నన్ను బాకీ తీర్చి తీరా లని కడ్డాయం చేస్తున్నాడు." వా.

**కణక బోసి వోవకుండ**

ఒక్క ముక్క విడనకుండా—పూర్తిగా అనుట. కణిక = ఉండలేక ఉంట అనే అర్థంలో అలవాటులో ఉన్నదే.

"చాముండిదేవి గరము గణక, బోసి వోవకుండ రాక్షసుల నెల్ల, మ్రింగి." కుమా. 12.111.

**కతకారి**

మాటకారి.

"నెఱ లైనపెద్దలు నేరనియట్టి, కలుపులు గఱచె నీకతకారి బిడ్డ." అష్టమ. క. 1.32.

చూ. కతలకారి.

**కతకు కాళ్లు, ముంతకు చెవులు ఉండవు**

అసంభవము లనుపట్ల ఉపయోగించు పలుకుబడి.

"కొడుకుపయి నీకుఁ గడుఁ బ్రేమ,ముడి గావునఁ గతకుఁ గాళ్లు ముంతకుఁ జెవులీ,వడిగదవు రాజ..." సారం. 3.18.

రూ. కథకు...

**కతపత్ర మిచ్చు**

గట్టిగా చెప్పవచ్చు; ప్రమాణపత్ర మివ్వవచ్చు.

"కతపత్ర మిడవచ్చుఁ గల గాంచునప్పుడైనఁ, గోరికఁ బరకాంతఁ గోరఁ డనుచు." పాండు. 1.163.

**కతపత్రము**

ప్రమాణపత్రము వ్రాసి ఇవ్వవచ్చు ననుట.

"కతపత్ర మిడ వచ్చు." పాండు. 1.63.

**కతలకారి**

చూ. కతకారి.

**కతల పుట్ట**

కథల కాణాచి.

పుట్ట అనునది నిధానము, కాణాచి అన్న అర్థంలో ఎన్నో పదాలతో చేరి విన వస్తుంది.

"అన విని హేమావతి మో, మున నవ్వు జనింపఁ గతలమునిపుట్ట సుమీ, కన నీదు కడుపు బ్రహ్మాప..."
హంస. 2.71.

చూ. అబద్ధాల పుట్ట.

**కత్తరించినట్లు**

తుంచినట్లు, సరిగ్గా.

అట్లునకు బదులు చందము, కైవడి వగ్గైరా ఉపమాన వాచకా లన్నిటితోనూ ఇది ఉపయుక్త మవుతుంది.

"కత్తరించిన చందంబునఁ బందెంబు సఱచినవిధంబున." ఉ. హరి. 3.123.

**కత్తరి గలయు**

సంకర మగు.

కత్తెరలో అటుది ఇటూ, ఇటుది అటూ కలగలసి పోవు టపై వచ్చినపలుకుబడి.

"వర్ణములు నాశ్రమంబులు వసుమతీశ !, కలియుగంబునఁ గత్తరిఁ గలసిపోవు."
హరి. ఉ. 9.37.

"పెరుగును వడ్లును కలిపిన, కరణిగా వర్ణాశ్రమములు కత్తరిఁ గలయున్."
జైమి. 3.213.

**కత్తరిల్లు**

కదలు,

కత్తెర ఆడినట్లాడు అనుటపై ఏర్పడినది కావచ్చును.

"కటిగఁ బ్రముఖంగ [illegible] కత్తరిల్ల."
నైష. 7.46.

**కత్తి కట్టు**

విరోధము పూను; పగ బట్టు. కత్తి, పోరాటానికీ పగకూ సూచకము.

"వాడు నామీద కత్తి కట్టి ఉన్నాడు." వా.

"వీడు నామీద కత్తి కట్టితే ఏం లాభం? అసలువాడు వేరే ఉన్నాడు." వా.

చూ. కత్తి గట్టు.

**కత్తికి ఎదురు లేదు**

వాని మాటను కాదనేవాడు ఎవడూ లేడు. వాడు చెప్పి నట్లూ జరుగుతుంది అనుట.

"ఈ పది పల్లెలోనూ ఆ రెడ్డిగారి కత్తికి ఎదురు లేదు." వా.

కత్తి ఇట పరాక్రమప్రాభవ సూచకము.

**కత్తికి ఒడ్డుకొను**

కత్తిదెబ్బ కాచుకొను.

"ప్రేటునఁ కత్తినట్ల ప్రతిపిరుని కత్తికి నొడ్డుకొంట యొప్పటను గలినట్టిది."
కళా. 8.72.

**కత్తికోత**

విపరీత మైనపోరు.

తాళ్ల. సం. 3.181.

"ఈ కత్తికోత పడలేకనే ఆ కోడలు పాపం ఈ ఇంట్లోనుండీ వెళ్ళి పోయింది." వా.

**కత్తిగంటము**

ఒకవైపు తాటాకులు కోసి కొనుటకు ఉపయోగించు కత్తిగా, ఒకవైపు వ్రాయుటకు గంటముగా ఉపయోగించునది.

"మురుక తలపాగయును బాహుమూల మంగుc, గవిసె చర్మపుటొరలోని కత్తి గంట, మలతి నీర్కావి దోవతి యమర గ్రామ, కరణ మేతెంచి రెడ్డిచెంగట వసించె." శుక. 2.416.

**కత్తిగొంటులు**

జాచి రంపాన పెట్టువారు.

"కత్తిగొంటు లైనయత్తగంతు." కుమా. 8.135.

**కత్తిపీట**

కూరలు తఱుగుకొను కత్తిగల పీట.

"ఆ కత్తిపీట యిలా తీసుకు వచ్చి కూరలు తరుగు. నాకు చెయ్యి తీరడం లేదు." వా.

**కత్తిమీది సాము**

కష్టసాధ్యము; అసిధారా వ్రతము.

అసలు సాము చేయుటే కష్టం. ఇక కత్తిమీద సామైతే ఏ క్షణంలో నైనా తెగిపోవచ్చు ననుటపై వచ్చినపలుకుబడి.

"పరికింపరు దొరతనపున్, సరవుల్ మఱి కత్తిమీఁది సాములు సుమ్మీ!" కువల. 4.82.

"వాడిలో వ్యవహారం కత్తిమీది సాము. ఏకాస్త పొరబాటొచ్చినా తగులుకుంటాడు." వా.

**కత్తి రాతికి పాసినగొంటు**

మొండిపెధవ. ఒక తిట్టు. కత్తితో నఱికినా, రాతితో మోదినా చావని గొంటు వెధవ అనుటపై వచ్చినదేమో.

"పలుగత్తి రాతికిఁ బాసినగొంటు." గౌర. హరి. ద్వి. 651.

**కత్తిరించు**

కొంగలించు; ఖండించు.

"కత్తిఁ గుత్తుకను బిటానఁ గత్తిరించి." చంద్రా. 2.88.

"వాడిచేతి కేది యిచ్చినా కాస్త కత్తిరించుకోని గానీ యియ్యడు." వా.

చూ. జేబులు కత్తిరించు.

**కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు**

వెలవెలపోయెను అనే అర్థంలో ఉపయోగిస్తారు. కత్తితో కొట్టినా రక్తం చిమ్మని స్థితిలో లే దనుట. 'ముఖంలో'అన్నట్లుముందేదో ఉండి తీరాలి. క్రింది పలుకుబడిలోనూ అంతే.

"వాడు చేసిన వెధవపను లన్నీ నేను వరసపెట్టి చెప్పేసరికి, వాడి మొహాన కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు." వా.

చూ. కత్తి వేస్తే...

**కత్తి వేస్తే నెత్తురుచుక్క లేదు**

వెలవెలపోయె ననుట.

"నన్నన్ని అన్నాడా! అకస్మాత్తుగా అక్కడ నేను కనిపించేసరికి వాని మొగాన కత్తి వేస్తే నెత్తురుచుక్క లేదు." వా.

చూ. కత్తివాటుకు...

**కత్తు కలుపు**

ఏకీభావము చెందు: జత కలుపు.

"వాడా ఊరికి వెళ్ళగానే రెడ్డిగారితో కత్తు కలుపుకొన్నాడు. ఇంకేంకి?" వా.

**కత్తుల పచ్చడిగా చేయు**

కైమాకు వలె ముక్కలు ముక్కలుగా నఱుకు.

"కత్తుల పచ్చడిగాఁ జేసి నట్లు, తుత్తుము రై రూపు దోఁపక కలసి."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 517-18.

**కత్తుల బోను**

అటూ యిటూ కదలనీని ఆటంకము.

అతితర మైన బాధను కలిగించునది. అటూ ఇటూ మసల నీయనిది.

కత్తులబోనులో మనిషి దూరి నప్పుడు ఎటు మసలినా కత్తి గుచ్చుకొంటుంది. పులులూ మొదలయిన క్రూర మృగాలను ఇలాటి కత్తులబోనులో పెడతారు. అందుపై వచ్చిన పలుకుబడి.

"అత్తయు మామయు మగఁడును, గత్తులబోను లయి యిటుసు గావలె నెపుడున్." జైమి. 3.38.

"...ఏమిట నెంచి చూచినన్, గత్తుల బోను కాఁపురము కామిని నీతలఁ బొప్పకుండుటన్." చెన్న. 4.277.

"ఆ పిల్లకు అత్తవారిల్లు ఒక కత్తుల బోనులాగా తయారయింది." వా.

**కత్తులు గట్టు**

పగ పూను.

"కత్తులు గట్టి కోలం గొట్టిన తెలుంగున." హర. 2.28.

చూ. కత్తిగట్టు.

**కత్తులు నూరు**

పగ గొను. పోరాటమునకు సిద్ధపడు.

ఆ నాడు యుద్ధసన్నద్ధ మగుటలో కత్తులకు పదును పెట్టుట ఒక భాగం కదా.

"............ముంతలోఁ, దప్పని పంటవాఁ డెక్కె రోషం బడి కత్తులు నూర జేటికెక్కి" రాజశే. 3.103.

"కాయజుఁ డాకెపై వరిసి కత్తులు నూఱుచు నుండు నంతటన్." కళాపూ. 7.35.

"అతడు తనకు చేసినదానికి ఏమీ చేయలేదని ప్రతీకారం సాధించాలని కత్తులు నూరుతున్నాడు." వా.

**కత్తులు కటారులు నూఱు**

పగ గొను; తగాదాకు సిద్ధపడు.

"ఆ వ్యాజ్యం వేశానని నామీద వాళ్ళు కత్తులూ కటారులూ నూఱుతున్నారు." వా.

చూ. కత్తులు నూరు.

**కత్తెరకాలు**

మరకాలు.

శ. ర.

**కత్తెరగాయము**

ఒక విధమైన కిటుకు.

"పురిచుట్టుకొని నిశరుండు సారణుండు నుకొ భోజాంధకుల్ గూడి కత్తెర

గాయంబుల గండముంగిలుల ... నిరం
తరముగ శోధనదీవె లెత్తి.''
ఉ. హరి. 2.94.

కత్తెరదొంగ

జేబులు, సొమ్ములు మొద
లగునవి కత్తిరించుకొని పోవు
దొంగ.

''రద్దీగా ఉన్న తావుల్లో మదరా
సంతా కత్తెర దొంగలు ఎక్కువై
పోయినారు.'' వా.

కత్తెరబావిలీ

గూబకు పెట్టుకొను ఆడవాళ్ల
ఆభరణము.

ఇదే గూబబావిలీ; బావిరీ
అని కూడా నేడు దీనిని
అంటారు.

రూ. కత్తెరబావిలీ.

కత్తెరయెండలు

మండుటెండలు.

కత్తెర అంటే కృత్తిక. కృత్తి
కా నక్షత్రంలో సూర్యుడు
ఉండేకాలాన్ని దక్షిణాం
ధ్రంలో 'కత్తెర' అంటారు.
అప్పుడటువైపు ఎండలు విప
రీతంగా ఉంటాయి. అట్లే ఉత్త
రాదిలో నేమో రోహిణి
కార్తిలో ఎండలు ఎక్కువగా
ఉంటాయి.

''అప్పుడే కత్తెరయెండ లారంభ మయి
నవి. ఇక మధ్యాహ్నం బయటికి
వెళ్ళడం సాధ్యం కాదు.'' వా.

కథ కట్టిపెట్టు

ఈ, ఆ ప్రసంగం చాలించు.

''నీ కథ కట్టిపెట్టి ఆప నేదో చూడు.''
వా.

కథకు కాళ్లు ముంతకు చెవులు కల్పించు

అసంభవములను సంభవము
లనునట్లు చెప్పు.

''కడమ వన్నియు నిఁక నేల కథకుఁ
గాళ్లు, ముంతకుఁ జెవులు గల్పింప ముజ్జ
గముల.'' సుదక్షి. 4.25.

కథకు కాళ్లు లేవు ముంతకు చెవులు లేవు

కల్పితకథలలో వాస్తవి
కతకు, ప్రత్యక్షప్రమాణాదు
లకు తావు లేదు అనుట.

''మీాట నొక్కితే సారంగాలూ,
మాళిగలూ ఈ నవలల్లో. కథకు కాళ్లు
లేవు, ముంతకు చెవులు లేవు కదా.''

కథ చాలదూరము వెళ్లు

మించి పోవు.

ఆ వ్యవహారం చాలా నడి
చింది అనుపట్ల ఉపయో
గిస్తారు. చేయి దాటి పో
యింది, ఇక మనం చేసే దే
ముంటుంది అన్న ఛాయలు
కూడా యిందులో ఉన్నవి.

''కథ చాలా దూరం వెళ్ళిం దన్న
మాట. వీడు పిలవడం వాడు రావడం
కూడా నాకు తెలీకనే జరిగిందీ ?''
వా.

**కథ తెలిసి వచ్చు**

బండారము బయట పడు.

"ఏమీ తెలియని రైతులను ఏడిపించు కొని తినినట్టు కాదు. కరణమయ్యతో కంటు కట్టుకుంటే నీ కథ తెలిసొస్తుంది." వా.

"వాని కథ ఈనాటికా_నీ నీకు తెలిసి రాలేదు. నే నెప్పు డనగా చెప్పాను. వాడు పట్టి దగుల్బాజీ అని!" వా.

**కథల కామరాజు**

కథల పుట్ట.

"వాణ్ణి పలకరిస్తే ఒక కథ చెప్తాడు. ఆ కథలకామరాజుతో పెట్టుకుంటే మన మీనాడు కొంప చేరుకున్నట్టే!" వా.

**కథలు పన్ను**

కల్పించు, ఏవో కల్పనలు చేసి మోసగించు.

"కటకట! యిది యేల కథలు పన్నె దవు."

బసవ. 4.104.

రూ. కథలుపన్ను.

**కథలు, నీతులు, కారణాలు**

కథలూ అవీ. జం.

"కథలును నీతులుఁ గారణంబులును." పండితా. ప్రథ. దీక్షా. పుట. 152.

వాడుకలో రూపం :

కథలూ కారణాలూ.

**కథలూ కారణాలూ**

కథలూ అవీ. జం.

"ఏదో మధ్యాహ్నం పూట కథలూ కారణాలూ చెప్తూ ఉంటుంది మా బామ్మ." వా.

చూ. కథలూ కారుణ్యాలూ.

**కథలూ కారుణ్యాలూ**

కథలూ అవీ. జం.

చూ. కథలూ కారణాలూ.

**కథా కమామీషూ**

పుట్టు పూర్వోత్తరాలు. జం.

"దాని కథా కమామీషూ చెబుతాను విను." వా.

**కథానాయకుడు**

ముఖ్యుడు.

"ఈ వ్యాజ్యంలో కథానాయకుడు మీ మామే." వా.

**కథాశేష దశ**

చనిపోవు.

చూ. కీర్తిశేషు డగు.

**కదలారతి పళ్లెరము**

వధూవరాదులు గృహప్రవేశం చేసేటప్పుడు హారతి యిచ్చు పళ్లెము.

"జాళువా కదలారతి పళ్లెరంబు సొంపున." చంద్రి. 4.68.

**కదలించి చూచు**

సూచనగా అభిప్రాయం తెలుసుకొను.

"పోనీ. మీ మామ ఏమంటాడో కాస్త కదలించు చూడు. తర్వాత సంగతి చూతాం." వా.

చూ. కదిలించి చూచు.

**కదలించు**

అనవసరముగా రెచ్చగొట్టు.

"కదలింపకుము నన్నుఁ గన్న మాయయ్య." పల. పుట. 48.

"నన్ననవసరంగా కదిలించకు. తర్వాత విచారిస్తావు." వా.

కదియబడు

కలబడు; పోరులో ఎదు ర్కొను.

"అత్తఱి మాళవుండు గదియంబడి." దశ. 12.65.

కదిలించి చూచు

ప్రస్తావవశంగా ఇంగితము తెలుసుకొను.

"ఆతణ్ణి కదిలించి చూస్తాను. అతి డేమంటాడో చూచి ఆ తరవాత ఈ విషయంలో ఏదో ఒకటి నిర్ణయించుకొందాను." వా.

"వాడెవో పిలిస్తే తప్పకుండా వస్తాడు అని నువ్వు అంటున్నావు; రాడు అని నా నమ్మకం. అయినా కదిలించి చూడు. పోయే దేముంది?" వా.

చూ. కదలించి చూచు.

కదుపు గట్టు [కొను]

గుంపు కూడు.

"పులుల కూనలు జింకపిల్లలు మృగేంద్ర, పోతకంబులు నాల క్రేపులును గదుపు, గట్టుకొని కూడి మాడ." శృం. శాకుం. 2.49.

కదుము గట్టు

దెబ్బ తగిలి వాచు.

"నా మోకాలికి ఆ వాకిలి కొట్టుకొని కదుము కట్టింది." వా.

కనకతప్పెట

బంగారు తప్పెట.

వాద్యవిశేషము.

కనకన

కణకణ (మండు)

"కనకన వెలుఁగుచు." దశా. 1.182.

"పొయ్యిలో నిప్పులు కనకన మండుతున్నాయి." వా.

కనకన మను

కణకణ మండు.

"కనకన మను నిప్పుఁదునుక లనఁగ." యయా. 2.76.

చూ. కనకన.

కనకనలాడు

చూ. కనకన మను.

కనకస్నాన మాడించు

బంగారునీట ముంచు; అనగా అంత పచ్చగా అనుట.

"మేపూఁత, డంబుతోడ వచ్చెఁ దుంబురుండు, కడలవారిని గనకస్నాన మాడించు, పదకమును సునేత్ర పట ముఁదాల్చి." కళా. 2.82.

కన నోపునె నుదుట కన్ను గలవా డైనన్

ఫాలాక్షు డయినా కన్నెత్తి చూడ లేడు అని అర్థం.

ఎంత గొప్పవా డైనా దానిని కన్నెత్తి చూడజాల డనుట.

"మత్కాంతారముఁ, గన నోపునె నుదుటఁ గన్ను గలవాఁ డైనన్." శుక. 1.280.

నేటిరూపం :

'ఫాలాక్షు డయినా సరే నేను జంకను.' ఇత్యాది...

కనరువోవు

కాటు వోవు.

మంట సరిగా లేక వంట చెడి

నప్పుడు వేసే వాసనను
కనరూ, కాటూ అంటారు.
"కనరు వో ఘండడఁ గాచిన యాన
వాలతో." శృం. శాకుం. 1.135.

కనరెక్కు
కాటు పోయి వాసన వచ్చు.
"ఈ కూర కన రెక్కి పోయింది.
తిన లేనంటే తిన లేను." వా.

కనాకష్టం
కనీసం.
"ఆ తిరనాళ్ళకు పోవాలంటే కనా
కష్టం చేతిలో పదిరూపాయలన్నా
ఉండవలె గదా!" వా.

కనాకష్టమైన
అతినీచమయిన
కొత్త. 253.

కనాతి గోడ
బట్టతో కట్టిన అడ్డు. హద్దు.
వావిళ్ళ ని.

కని గుడ్డి - విని చెవుడు
కండ్లుండి కానలేక వీను లుండి
వినలేక పోవుట.
"కని గుడ్డును నదె విని చెవుడును నిజ."
తాళ్ల. సం. 8.185.
"కని గ్రుడ్డియు విని చెవుడును, జనవర!
నీ మాయ కిఁక నసాధ్యము గలదే?"
కవిక.
"మీ లాంటివారి కేవరేం చెప్తారు?
కని గుడ్డీ విని చెవుడూ." వా.

కనినది గాదు విన్నదియు గాదు
అపూర్వం; అసంభవం.
"..............నేఁ, గనినది కాదు
విన్నదియుఁ గాదది తెల్పినఁ డెల్పు
లేక యుం, డిన మతి యూరకుండె
దవు..." శుక. 2.226.
వాడుకలో నేటిరూపం:
కన్నదీ విన్నదీ కాదు.

కనిపట్టు
కనిపెట్టు.
చూ. కనిపెట్టు.

కనిపెట్టు
ఏదో తెలుసుకొను.
"ఇందులోని అంతర్యం కనిపెట్టి చెప్పా
వంటే కృతజ్ఞుణ్ణి." వా.
చూ. కనిపట్టు.

కనిపెట్టుకొను
నిరీక్షించు.
"నీ, కొనర నిత్తు నేను గనిపెట్టుకొని
వచ్చి." కళా. 5.197.
"నీ కోసం నేను పొద్దున్నించీ కని
పెట్టుకొని ఉన్నాను." వా.

కని పెంచు వయసు
పిల్లలను కని పెంచవలసిన
వయసు అనగా యౌవనము.
దశా. 6.45.
వాడుకలో రూపం: కనీ
పెంచే వయసు.

కని యెత్తి పెంచు జోలి లేదు
కని పెంచే బాధ్యత లేదు.
నేటి వాడుకలోనూ 'దానికి
కని పెంచే బాధ లేదు'
అన్నట్లు వినవస్తుంది.
"బిడ్డ పాపలఁ గని యెత్తి పెంచు
జోలి, లేదు." హంస 3.131.

**కనీ పెంచే వయసు**

యౌవనం; ప్రాయము.

ఆడవారి విషయంలోనే దీనిని ఉపయోగిస్తారు.

"కనీ పెంచేవయసులో ఈ మలేరియా పట్టుకున్న దేమిటే నీకు?" వా.

**కనీసపక్షము**

అధమపక్షము; అంతకు తక్కువ కాకుండా.

"జయపురపాలనం బొసఁగి సాకినదాత కనీసపక్ష మా." నానా. 248.

"కనీసపక్షం ఆసభకు యాభై వేలమంది జనం వచ్చి ఉంటారు." వా.

**కనుకట్టు**

1. మోసగించు.

కన్నులు మూయు. లక్షణ యా వంచించు, కానకుండ చేయు అని కూడా అర్థం.

"కనుకట్టి గాంగేయగర్భు డాఁగురు మూఁత, లాడించె వస్త్రాపహరణవేళ." పాండు. 3.178.

2. ఇంద్రజాలము.

మంత్రముతో – ఉన్నది కనబడకుండానో, మరొకవిధంగా కనబడునట్లుగానో చేయుట.

"కనుకట్టోనర్చిన ఘాత లిడిన." ప్రబంధ. 7.38.

**కనుకట్టు విద్య**

ఇంద్రజాలము.

**కనుకని**

వేగముగా, సంభ్రమముతో. తత్తరపాటుతో, పట్టుదలతో. భార. అర. 6.231.

"కాందిశీకులై కనుకనిం జని." కుమా. 2.76.

"క్రతురక్షకులఁ దాకి కనుకనిఁ బోఁద్రోలి." కుమా. 2.66.

"ఎదిరిరిపుల్, గాలుదురు వీనిఁ గనుకని, దూలుదు రెందేని నర్కతూలము వోలెన్." అదే. 4.17.

"కనుకనిఁ దొల్లి దానిదెసఁ గన్నులఁ జూచినవాని నేయు నా, మనసిజుఁడు." అదే. 8.153.

**కనుకని బాఱు**

వేగముగా పాఱు.

"కపులు వెనుదగులఁ గనుకనిం బాఱి." భాస్క. యుద్ధ. 650.

**కనుకలి**

చూడగా కలిగిన ప్రేమ.

ఇలాంటిదే – వినుకలి.

"కర మర్థి నినుఁ జూచి కనుకలిఁ గలిచిన, పడఁతుల కల్పు నిష్ఫలము గాఁగ." కుమా. 5.74.

"ఇన్నాతి చెలువంబు గన్న శచీప్రియుం, డైనను గనుకలి నవయకున్నె." భార. విరా. 2.27.

"ఈశ్వరుఁ జూచి, కనుకలి నింద్రియ స్ఖలనంబు గాఁగ." పండితా. ప్రథ. వాద. పుట. 683.

"కనుకలి వినుకలి గలిగినట్టి పాపము." భాగ. 6. స్కం. 46.

దృష్టి, చూపు అని వావిళ్ల ని. అది సరి అని పై ప్రయోగాలు సూచించుట లేదు.

**కను కల్గి**

సావధానతతో.

"కనుకల్గి తత్పాద కంజాతములకు సాఁగిలి మ్రొక్కి."
వర. రా. బా. పు 195. పంక్తి. 24.

"ఈ విషయంలో కాస్త కనుకలిగి ప్రవర్తించక పోతే ప్రమాదం తప్ప దనుకుంటాను." వా.

చూ. కను గలిగి...

## కనుకుట్టు

పగదాయి; అసూయ.

"కలువకనుకుట్టు." సాంబో. 2.145.

"వాడికి నన్ను చూస్తే కనుకుట్టు." వా.

## కనుకుట్టుతనము

అసూయ; ఓర్వలేనితనము.

"కనుకుట్టుతనంబున నతని ధర్మంబునకు విఘ్నంబు గావింపఁ దలఁచి."
భోజ. 6.125.

## కనుకూర్కు

నిద్రించు.

"జరఠ యొకర్తు ... కను కూర్కుచుండ." రమా. 2.97.

## కనుకూలి

గింజల కూలి.

బ్రౌను.

## కనుకోనలు

కండ్ల లోతులు.

"వాడికి కనుగోనలలో ఎక్కడో కాస్త ఊపిరి టకటక లాడుతూ ఉంది." వా.

## కనుగంట చూచు

కన్నులార చూచు.

## కనుగట్టు

కనులు కానకుండా చేయు, మఱపించు, మోసగించు.

"నీకాను శాస్త్రముల్ బిడ్డ, కనట్టి కాళ్ళను గట్టింప నెట్లు, విచ్చేయు."
పండితా. ప్రథ. పురా. పుట. 362.

"కనుగట్టి గాంగేయగర్భు డాఁ గురుమూఁత, లాడించె వస్త్రాపహరణవేళ."
పాండు. 3.178.

"సారిది నిందఱి కనుగట్టి సున్నఁ బెట్టి." రాధి. 4.81.

రూ. కనుకట్టు.

## కను గలిగి యరయు

జాగ్రత్తగా పరిశీలించు.

"కను గలిగి యరసినను దేటపడియెడు." భార. శాంతి. 2.366.

## కను గలిగి మెలగు

జాగ్రత్తగా మెలగు.

"పెనిమిటియు నత్త వదినెలు, కనుఁగలిగి మెలంగ వెడలఁగా నెడలేమిన్ ..." శుక 2. 508.

## కను గల్గి యుండు

జాగ్రత్తతో నుండు.

"తనకు మృత్యువుచేరఁ దఱి యయ్యెఁ గాన, కనుఁగల్గి యుండ వేగమె పల్కుఁ డరిగి."
వర. రా. సుం. పు.89. పంక్తి. 17.

## కనుగవ కోరగించు

కను లెఱ్ఱ నగు.

"అచ్చట నెత్తురు గ్రక్కెనో యనం, గనుఁగవ గోరగింపఁ బొడకట్టె సముజ్జ్వల సాంధ్యరాగముల్." పారి. 2.32.

## కనుగవ నెఱసంజ వొడము

కన్నెఱ్ఱజేయు అనగా కోపించు.

"చయ్యన వచ్చి యొక్క నెచ్చెలి, కనుఁ

గవ నెఱసంజ వొడమఁగా నిట్లని
యెఱ్ఱ." పారి. 1.74.

**కనుగానమి**

గర్వము.

**కనుగాపు**

కనుసైగను గ్రహించి పని చేయుసేవకుడు.

కనిపెట్టుకొని యుండువాడు.

"కనుగాపు లట్లము వ్వెట్టియుఁ జేసి
చేసియును వేసరి." హర. 3.11.

**కనుగిట్టు**

కను గీటు.

"కనుగిట్టి చూపువార్రును..."
కమా. 2.82.

**కనుగిఱపు**

కనుసన్న చేయు.

"విప్రస్త్రాలిత్యము బైలు సేసి కనుగిఱపు
సభన్." అము. 4.47.

**కను గీటు**

కనుసైగ చేయు.

"గౌతముఁ డత్రికిఁ గను గీఁటె."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 125.

**కనుగొనల నిప్పు లురలు**

కోపించు.

కోపము వచ్చినప్పుడు కన్ను లెఱ్ఱబడుట ద్వారా వచ్చిన పలుకుబడి.

"అని తెంపు చేసి కనకనఁ, గనుఁగొనల
న్నిప్పు లురలఁగా వాలము..."
శుక. 2.252.

చూ. కన్నెఱ్ఱ, కన్నెఱ్ఱ చేయు.

**కనుగొను**

కన్ను గలుగు, చూచు.

"ఈ తటినిం, గనుఁ గొను పుణ్యుఁడు
మిక్కిలి, కనుగొను నెన్నదుట."
దశా. 1.123.

**కనుగొలుపు**

సైగ చేయు.

"తనప్రోలం, గనుపట్టు ననుంగుపట్టి
కనుగొలుపుటయున్." నీలా. 1.84.

రూ. కనుగిలుపు.

**కనుచాటు**

1. రహస్యము.

"కన్నయాత్మజునిఁ గను చాటు గా
నుండఁగను జాటు వెట్టె."
రంగ. ఉత్త. 92.

2. కనుమఱుగు.

"చని నూతిలోపల గుభు, ల్లన నొకగుం
డెత్తి వైచి యల్లనఁ గనుచా, టున
నిలువఁ బడియె..." శుక. 2.135.

**కనుచాటు చేయు**

అదృశ్యము చేయు.

"రాఘవామోఘాస్త్రమేను, కను
చాటు చేసి యేగతి నైనఁ దొలఁగి,
చంపి వచ్చెద."
వర. రా. యు. పు. 45. పంక్తి. 12.

**కనుచాటుతిండి**

దొంగతిండి.

ఒకరికి తెలియకుండా అనుభవించుట అన్న అర్థంమీాద లక్షణయా వ్యభిచారం అన్న అర్థంలో కూడా యిది ప్రయుక్తం.

"కనుచాటుతిండి నడిపిన, పసులం గండలును జెరిఁగి బసతండ్రి హిడింబుని కొడుకు..." శుక. 2.207.

కనుచాటు మెలకువ

రహస్యప్రవర్తనలు – దొంగచాటు వ్యవహారాలు.

"సతి కొడిగట్ట లేనికనుచాటు మెలంకువ తీఁగబోండ్లకున్, గడుపులు దించ..." శుక. 2.24.

కనుచీకటి

మునిమాపు చీకటి.

అప్పుడప్పుడే చీకటి వ్యాపిస్తున్న సమయము.

"అప్పుడే కనుచీకటి పడింది. త్వరగా ఊరు చేరుకోవడం మంచిది." వా.

కనుచూపు

దృష్టి.

"వాడికీ మధ్య కనుచూపు తక్కువయింది. అద్దాలు పెట్టుకోవాలో ఏమో?" వా.

"వాడికి ఈ మధ్యే కనుచూపు కొంచెం మధ్యస్థమయింది." వా.

కనుచూఱ యొసగు

కనువిందు కూర్చు.

కను చెదరు

అజాగ్రత్తగా నుండు.

"కార్యవేళల నిట్లు కను చెదరుదురె."

వర. రా. యు. పు. 182. పం. 10.

కనుదోయి నీరు చిలుకు

కన్నీరు చిందు.

"కర్ణికారకుసుమ రింఖన్మరందంబుతో, నిడువాలుఁ గనుదోయి నీరు చిలుక." శుక. 1.486.

కనుదోయి పదివేల్ వలయు

అంత దర్శనీయము అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

చూచుటకు పదివేల కండ్లు కావలె ననుట.

ఈ సంఖ్య అటూ యిటూ ఎక్కువవుతూ, తగ్గుతూ ఉంటుంది.

"నరు నత్యద్భుతవిక్రమ,పరిణతి నూడఁ గనుదోయి పదివేల్వలయున్." భార. కర్ణ. 2.283.

చూ. రెండు కండ్లు చాలవు.

కనుపట్టు

కనబడు.

"నవాంబుదంబు కనుపట్టె." రుక్మాం. 3.82.

కనుపాటు

1. దృష్టిదోషము.

"సుదతి నీమోఁ జక్కఁ జూచుట కోడెదఁ, గనుపాటు వొరయునో యని తలంచి." భార. విరా. 2.47.

2. దృష్టి.

"శివుని కనుపాటు దాఁకని చిత్తభవుఁడో." విక్ర. 8.52.

కనుపాప వలె

అత్యాదరంతో అపురూపంగా – చూచుకొనవలసిన దనుట.

కనుపాప వంటిది అనుటపై వచ్చిన పలుకుబడి.

"లేక లేక కలిగిన ఆ పసిపాపను వాళ్లు కనుపాపలాగా చూచుకొంటారు." వా.

కనుపుగొట్టు

1. పశువులను కొట్టినట్లు కొట్టు, పాలు వేటాడి కొట్టు. తఱిమి తఱిమి కొట్టు అనుట. కనుముపండుగలో పాలువేట ఒకభాగము. కనుము పైనే వచ్చినది కనుప. (కనుపు+ కొట్టు.)

"కర్ణనందనుఁ డిట్లత్యుదీర్ణ భంగిఁ, బాండురాజతనూజుల బలము సెల్లఁ, గనుపుగొట్టంగఁ జొచ్చిన..."
భార. ద్రో. 1.196.

"ఇవ్విధంబునం గురుసేనం గనుపుకొట్టి నవ్వుచున్న కవ్వడిం గనుఁగొని."
భార. ద్రో. 3.159.

"వేదండకాండంబులు తండతండంబులై పఱుంబడం బడలు వడం గనుపు కొట్టినయప్పట్టున."
జైమి. 2.75.

2. క్షోభ పెట్టు.

"అతండు ప్రీతుండై కశ్యపాదులం గనుపుగొట్టుమని పనిచిన."
భార. అను. 3.220.

3. నశింపజేయు.

"అమ్మహాభాగుఁ డద్రిజాప్రాణనాథ, కథలదురితంబు లన్నియుఁ గనుపు గొట్టె."
ఉద్భ. 1.8.

"అందు మందాకినీ నందనుం డమంద పరాక్రమ క్రీడం గాంతేయబలంబు గనుపుగొట్టె."
భార. భీష్మ. 2.

కనుబడి యగు

ఆదాయము వచ్చు.
లాభము కనిపించు.
కాశీయా. 228.

కనుబాటగు

దృష్టిదోషము తగులు.

"కనుబాటు గాకుండ వనిత చన్దోయికి."
భాస్క. కిష్కిం. 60.

కనుబేటము

1. విరాళి.

"ఒకచెంగట నుండెం దెలియరానికను బేట మనగ."
సింహ. 12.30.

2. ప్రేమ; దృష్టిజనిత ప్రేమ.
కుమా. 5.44.

కనుబొమ్మలు

కనుసోగలు.

"వాని కనుబొమ్మ లెంతో అందంగా ఉన్నవి."
వా.

కనుబ్రాము

మోసగించు.
వర. రా. యు. పు. 182. పంక్తి. 10.

కనుమబ్బు

కనుచీకటి.
వేం. పంచ. 1.246.

కనుమఱి చెడు

బయట పడిపోవు, చాటు తప్పు.

"కనుగీటి చూపువారును, గనుమఱిచెడి పట్టుఁ జూపఁ గడఁగెడివారున్."
కుమా. 2.82.

కనుమఱువడు

కనుమఱుగు చెందు, దాచి పెట్టుకొను, దాగుకొను.

"కనుగిట్టి చూపువారును, గను మఱి

చెడిపట్టు జూపఁ గడఁ గెడువారల్, గని
కడపి పుచ్చువారును, గనుముఱుపడు
వారుఁ బరుల గనుఁగొనువారల్."
కుమా. 2.82.

## కనుమాటు

మోసగించు, కను మొఱగు.

"ఒరులు తెలియక యుండఁగ, గను
మాటి తిరుగుచుందురు." రాధా. 1.99.

## కనుమాయ

ఇంద్రజాలము.

"కనుమాయకరణి యయ్యె."
హరి. పూ. 9.142.

## కనుమారిపడు (ఉఱుకు)

కొండమీదినుండి దుమికి ప్రాణములు తీసుకొను.

మరుప్రపాత మని సంస్కృతంలో దీనికి పేరు.

శిక్షగానూ, లేక తన పాపములకు ప్రాయశ్చిత్తము గానూ దీనిని కొందరు పూర్వం ఆచరించేవారు.

"కల్లు ద్రావినపాతకంబు ... కనుమారి
నుఱుకంగఁ బాయు."
భార. శాంతి. 1.307.

"పాయఁ దగు మిమ్ముఁ గనుమారిఁ
బడఁ బొసంగు, విషము ద్రావుట
యోగ్యంబు."
ఉత్త. 4.56.

## కనుముక్కుతీరు

అంగసౌష్ఠవం.

"ఆ అమ్మాయి కనుముక్కు తీరుగల
మనిషి." వా.

"ఆ పిల్ల కనుముక్కు తీరు ఎంతో బావుం
టుంది." వా.

## కను మూయు

1. నిద్రించు.

"విషాదవేదనన్, ముప్పిరిగొన్న చింతఁ
గనుమూయ నెఱుంగక నెమ్మనమ్ములో,
నెప్పుడు తెల్లవాఱును..."
కా. మా. 2.137.

"కనుమూయ నెఱుఁగక."
కవిక. 2.132.

2. మోసగించు.

"కపురంపుబలు కంచుఁ గనుమూసి
కటకటా!, బూది గప్పిన నిప్పుఁ బాదు
కొల్పి." చంద్రా. 4.167.

## కనుమూసిగంత

దాగిలిమూతలాట.

"కనుమూసిగంత నలుకంబాలాట...."
కళా. 6.202.

## కనుమోడ్చు

నిద్రించు.

"నడురాత్రి యరుదెంచె నరలోకనాథ,
కడు డస్సినాఁ డవు కనుమోడ్తు గాక."
రంగ. రా. బాల. పు. 39. పంక్తి 15.

## కనుమోసము

ఎట్టయెదుటే చేయుమోసము.

"కను, మోసము లే కొక్క మొగిన
ముసరఁగ వలయున్."
భార. విరా. 4.230.

## కనుఱెప్ప వెట్టని

కన్ను మూయని.

"కనుఱెప్ప వెట్టని తనవేయి కన్నుల."
భాస్క. అరణ్య. 43.

## కనుఱెప్పలు తేలవైచు

తెలివి తప్పిపోవు.

శోష వచ్చి పడిపోవుపరిస్థితిలో కనులు తేలవేయడం అల వాటు.

"కనుఱెప్పలు దేల వైచి కడు సోలు టయున్." కళా. 6.250.

కనుఱెప్ప వేయక చూచు

తేఱి చూచు.

కాశీ. 4.99.

కనులకు గంతలు కట్టు

మోసగించు.

"అది మొగుడికండ్లకు గంతలు కట్టి ఊరంతా సటారిస్తూ ఉంటుంది." వా.

కనులార్చు

కనుసైగ చేయు; కనుఱెప్పలు పదేపదే అల్లార్చు.

"పొరుగింటి బ్రాహ్మణిం బుణ్యగేహిని నేల, యపహరించితి కనులార్చి యార్చి." కాశీ. 7.256.

"కండ్లార్పేవాడు ఇండ్లార్పుతాడు." సా.

కనులు చింతనిప్పు లగు

కోపము కలుగు.

"సభలో అత నేదో తప్పు పట్టేసరికి శాస్త్రుర్లవారి కళ్లు చింతనిప్పు లయ్యాయి." వా.

కనులు చెమర్చు

దుఃఖము కలుగు.

"అతనిని చూడగానే ఆవిడ కన్నులు చెమర్చినవి. ఎంత సుఖముగా నున్న వాడు ఏ స్థితికి వచ్చినాడు!" వా.

కనులు తీసుకొని చూచు

కను లింత చేసికొని నిరీక్షించు.

"అని కనులు దీసికొని యా,తని రాకకు నెదురు చూచు..." శ్రవ. 4.62.

కను లెఱ్ఱ చేయు

కోపించు.

"కలుషించి అనపోతు కను లెఱ్ఱ చేసి." పల. పు. 48.

కనువిం దగు

నేత్రపర్వ మగు.

శుక. 1.507.

చూ. కన్నులపండువగు.

కను విచ్చి చూచు

కండ్లు తెఱచి చూచు.

"అంతఁ గను విచ్చి చూచె నన్నాతఁ డేను, బ్రణతిఁ జేసితి..." కళా. 4.154.

కను విచ్చు

కనులు తెఱచు.

"కను విచ్చి ననుం జూచు." భార. ద్రోణ. 1.40.

కనువి ప్పగు

తెలిసి వచ్చు

"వాను చెప్పిం దంతా వినేసరికి నాకు కనువి ప్పయింది." వా.

కనువెలుగు

దారి చూపువాడు.

"కనువెలుఁగు నీవు గా నీ, వెనుక భవన్మతిను యూఁది వీరలు నేనుం, జను చెంచెదము..." భార. ద్రోణ. 1.66.

కనువేదుఱు

విరహము.

"చూపులన్, విన్నదనంబు దోపఁ గను వేఁదుఱునన్ బయిగాలి సోకినన్, వెన్న వలెం గరంగు..." మను. 2.57.

**కనువేదు ఎత్తు**

చక్షూరాగము కలుగు.

"కసిగాటు పెనఁకువ కనువేఁదు ఎత్తె."
వర. రా. బా. పు. 50. పంక్తి. 6.

**కనువేయు**

మోహించు.

"ఏ డా పని పిల్లమీద కనువేసినట్టున్నాడే!" వా.

చూ. కనువైచు.

**కనువైచు**

కన్ను వేయు.

"ఒక్కమగవానిపయిఁ గనువైచితేము?" కువ. 3.107.

వాడుకలో రూపం: కన్ను వేయు.

చూ. కనువేయు; కన్ను వేయు.

**కనుసన్న**

సైగ

"అన్యసతుల, యునికి గనుసన్నఁ జూచె నా యుత్పలాక్షి." కళా. 6.124.

**కనుసన్న మెలగు**

ఆజ్ఞానువర్తి యగు.

"నీ కనుసన్నన మెలఁగెద, నేకార్యంబైన నడపు మీవ తగంగన్."
భార. విరా. 2.124.

**కనుసోగ**

కనుబొమ్మ.

చూ. కన్సోగ.

**కన్నకడుపు**

కన్నతల్లి

"కన్నకడుపు గానఁ గాంతు మిక్కుటము." పల. పు. 52.

**కన్నకూళ్లు కుడుచు**

అన్ని నీచాలకు పాల్పడు.

"వాడు కన్నకూళ్ళు కుడిచి అంత బావుకున్న దేమిటో తెలీదు." వా.

చూ. కన్నగడ్డి కఱచు.

**కన్నకొడుకు**

ఔరసుడు.

ప్రేమాతిశయాన్ని తెలియజేయవలసినపట్ల దీనిని ఎక్కువగా ఉపయోగిస్తారు.

"వాణ్ణి చిన్నతనంనుంచీ కన్నకొడుకుగా చూచుకుంటూ వచ్చాను." వా.

**కన్నగడ్డి కఱచు**

ఎంత నీచానికైనా పాల్పడు.

"కన్నగడ్డి కఱిచేవాడు ఎంతైనా సంపాయించవచ్చు. దాని కేం?" వా.

చూ. కన్నకూళ్లు కుడుచు.

**కన్నగడ్డి తిను**

చూ. కన్నగడ్డి కఱచు.

**కన్నగాడు**

దొంగ.

ఇండ్లకు కన్నము వేసేవాడగుటవల్ల వచ్చినది.

"నా దగు తారకా రుచిధనంబు హరించినకన్నగాఁడు." విప్ర. 3.22.

**కన్నడసేయు**

తిరస్కరించు, ఉపేక్షించు.

"సేవకునింట శివార్చనంబు మే, ల్గదుర నొనర్పఁగా వలయుఁ గన్నడ సేయక మీర లన్న..." చెన్న. 4.333.

**కన్నడుగుచేయు**

అగుడు పెట్టు.

"......నీవే, కన్నడుగు చేసి తేముని, విన్నప మొనరింతు..."
వాల్మీ. 3.33.

ఇది కన్నగుడు కావచ్చును.

### కన్నతండ్రి

1. ఆదరంతో చేయుసంబోధన.

"ఎన్నఁ డభ్య్ర్యాసి మాయురా కన్న తండ్రి." నిరంకు. 2.83.

2. తండ్రి.

### కన్నతల్లి

తల్లి; కన్నతల్లివలె అతి వాత్సల్యంతో చూచుకొను ఇల్లాలు.

"నన్నుఁ గన్నతల్లి యన్నపూర్ణా మహాదేవి." భీమ. 3.9.

### కన్నదిక్కున జాఱు

దిక్కులుపట్టి పరుగెత్తు.

"కలఁగి కన్నవారు కన్నదిక్కునఁ బాఱి, పోయిరి." ఉ. హరి. 4.66.

ఈ 'కన్న' అన్నది 'నానా' అన్న అర్థంలో మనకు బాగా అలవాటు.

"వాడు కన్నవాళ్ల కాళ్లు పట్టు కొన్నాడు." వా.

ఇత్యాదు లూహ్యాములు.

### కన్నది గతిగా

ఎటు పడితే అటుగా

"కన్నది గతి గాఁగఁ గిన్నరు లరిగిరి." పారి. 5.37.

### కన్నదే గాతిగా

దొరకినదే చాలు నని.

"తండ్రీ! సారెకు దువ్వు నాగ్రహము మీఁదం గన్నదే గాతిగా, గుండ్రాలం గొని దాయ గాక..." వరాహ. 59.3.

### కన్నపుదొంగ

గజదొంగ.

కన్నము వేసి దొంగతనము చేయువాఁడు.

"సిరిమనోధనము ముచ్చిలినకన్నపు దొంగ." నిరంకు 1.2.

### కన్నపెట్టు

1. దొంగిలించుటకై కన్నము వేయు.

"యామికావళికన్నుఁ బ్రామి యంతః పురాంగణము లైనను జొచ్చి కన్న పెట్టి..." శుక. 2.502. క్రింద.

2. దొంగతనము చేయు.

"ప్రజల యిండ్లఁ గన్న పెట్టని దొక్కటే కాని కొదవ." నిరంకు. 2.26.

"మాపీటం గన్న పెట్టి..." దశ. 4.24.

చూ. కన్న మిడు.

### కన్నమరులు

పితృమాతృవాత్సల్యము.

"కన్నమరులు కన్నా పెంచిన మరు లెక్కువ." సా.

### కన్న మిడు

కన్నము వేయు.

"ఒకనాఁడే గురు దొంగలు...కన్న మిడువాంఛన్ వచ్చి."
ద్వాదశ. 10.115.

చూ. కన్న పెట్టు.

### కన్నము పెట్టు

కన్నము వేయు

"రాత్రి సెట్టిగారిల్లు కన్నంపెట్టి సొత్తుల
న్నెత్తె దొంగిలించారట." వా.

మా. కన్నపెట్టు.

## కన్నపోవు

దొంగతనము పోవు.

పరమ. 5.15.

## కన్నయ్య

1. కన్నతండ్రి.

"అని యామిటారి చిగురుకటారి
రాయల కన్నయ్యతో మఱియు నే
మనుచున్నది:—" హేమా పు. 51.

2. కృష్ణుడు.

శ. ర.

## కన్నఱ

చూచుటకు దుర్భరమైన
విచారము.

తమి. కన్నావి.

"తలిదండ్రులు వారెట నున్నవారో
యీ, కన్నఱఁ జూడఁ బాలయితి."

రామా. 2.41.

## కన్నఱి

కన్నఱ కలవాడు, దుఃఖితుడు.

"కిన్నరులు గన్నఱులుగా భూతంబులు
భీతంబులుగా." ఉ. హరి. 6.28.

చూ. కన్నఱ.

## కన్నవస్థా పడి

నానాబాధ పడి.

"కన్నవస్థాపడి ఆ ఉద్యోగం ఇప్పిస్తే
మీవాడు రాజీనామా పెట్టి వచ్చాడు."

వా.

## కన్నవస్థా పడి కంచిలో చేయి కడిగి

ఎన్నో బాధలు పడి.

"చేతిలో దమ్మిడీ లేకుండా బయలు
దేరాను. కన్నవస్థా పడి కంచిలో
చెయ్యి కడిగి ఎలాగైతే నేం పట్నం
చేరుకున్నాను." వా.

## కన్నవాడు

తండ్రి.

మా. కన్నాడు.

## కన్నవారు

ప్రతివాదు.

"క్రోధాగ్ని వెండియుఁ గన్నవారలను
సంక్షోభింపకే క్రమ్మెక్కె."

కా. మా. 2.89.

"ఉన్నక్షేత్రము లందఱుఁ గన్నవారు,
కన్నదిక్కులఁ బోయి సాగరములోన,
నడఁగిరి." ఉ. హరి. 4.240.

## కన్నవిటి

గ్రుడ్డివాడు.

"చెవిటికి శంఖధ్వని గన్నవిటికి
దీపంబు...వృథ యగున్." భల్లాణ. 4.

## కన్నవిన్నయది కాదు

వింత.

"ఎన్నకొన్న లోకమునను గన్నవిన్న
యది గాదది కొంత నిజంబు కొంత
స్వప్నము నని..." ప్రభా. 122.

## కన్నపెట్టు

దొంగిలించు.

"వన్నెమాటల వలతువా నీవు నా
మనసు, కన్నపెట్టంగఁ గదా కడు జేల
నైతి." తాళ్ళ. సం. 3.281.

చూ. కన్నపెట్టు.

## కన్నళవి సేయు

గొడవ పెట్టు; ఉపేక్షించు.

"కన్నళవి సేయక కరుణ మీఱఁగా."

హేమా. పు. 51.

కన్నళవు చేయు

అగుడు పెట్టు; గోడవ పెట్టు.

"కన్నళవు సేయుఁ గచ్ఛపాకారగరిను గరిమరాళికయాన నీ చరణయుగము."

అరవంలో ఎళువు – ఏసుపు. నేటికీ దక్షిణాంధ్రంలో అల్లరి. అగుడు అనే అర్థాలలో ఈ మాటను ఉపయోగిస్తారు.

"ఏమిట్రా ఈ యెళువు?" వా.

కన్నాకు

ప్రధానము, ముఖ్యము. ముఖ్యుడు, శ్రేష్ఠుడు.

తమలపాకులకట్టలో పైన పెట్టేఆకు మంచిది చూచి పెడతారు. అదే కన్నాకు. తద్వారా వచ్చిన పలుకుబడి.

"కన్నాకు మనకు భీష్ముఁడు."

భీష్మ. 1.76.

"మంత్రులు పన్నిద్దఱకును...గన్నాకుగాఁ బెద్ద గద్దియ నునిచి."

బస. 2.27.

కన్నాగు (కన్ను+ఆగు)

కన్ను మూయు; మూర్ఛిల్లు.

"నేడు రణశయ్యన్ భూవిభుం డుండఁగాఁ, గన్నాఁగం దగు నయ్య నీ నిదురకుం గాలం బయోధ్యం గదా!"

భాస్క. యుద్ధ. 5.83.

కన్నాడు

తండ్రి.

"నిన్నుఁ గన్నాని రప్పింతుక."

ఉద్భ. 3.28.

చూ. కన్నవాడు.

కన్నార చూచు

1. కనులు తెఱచి చూచు.

"కన్నుఁ దానందబాష్పంబులఁ జేసి, కన్నారఁ జూచు వీక్షణములు మునుఁగ."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 221.

2. ప్రత్యక్షంగా చూచు.

వాడుకలో ఇది కండ్లారా అన్నట్లుంటుంది.

"కండ్లారా చూచినసంగతి చెప్పడానికి భయ మేమిటి?" వా.

కన్నాస

కనుపండు వైనది. కంటికి ఆశ గొలుపునది.

"అది విటాళుల కన్నాస యై నెలంగు."

హంస. 5.215.

కన్నిగట్టు

త్రాడు కట్టు; బంధించు; నిర్బంధించు.

పశువులకు దూడలకు మెడకు తగిలించి కట్టేత్రాడును కన్నిత్రా డని అంటారు.

"మున్ను దినియెడిదూడ ... కన్నిగట్టియెందాకఁ గాయవచ్చును."

తాళ్ల. సం. 11.3. భా. 79.

కన్నిచ్చకు వచ్చు

కంటి కింపగు, కంటికి ప్రియమగు.

"మృగంబులుం దెగఁ జూచి యేచి కన్నిచ్చకు వచ్చు పెక్కునంజుడులు చేవ డించక కావడించి..."

పాండు. 3.89.

చూ. కన్నిచ్చ వచ్చు.

**కన్నిచ్చు వచ్చు**

ప్రియ మగు; దృష్టి నాకర్షించు.

"కనుఁగొని పాఱినఁ గన్నిచ్చవచ్చు, తనుపారుచీరలు ధరియించి శౌరి."
ద్విప. మధు. 5.

చూ. కన్నిచ్చకు వచ్చు.

**కన్నిడి యుండు**

గమనించి యుండు.

"అన్నిటఁ ధరణిపాలుఁడు గన్నిడి యున్నఁ బెం పగున్."
భార. శాంతి. 2.283.

చూ. కన్ను పెట్టి ఉండు.

**కన్నిడు**

1. కన్ను వేయు.

"రుచిమీఁదన్ గన్నిడి యా శచీవిభుఁడు దిరుగు..." భార. అను. 2.189.

2. చూపు పెట్టు, దృష్టి సారించు.

"వసంతకుఁడు దమపైఁ గన్నిడ్డఁ గారాక గెం,దలిరా కయ్యేనో నా."
కుమా. 4.85.

**కన్నియ మెఱుగు**

క్రొక్కారు మెఱపు.

తొలకరి వానలలో మెఱిసే తొలి మెఱుపు.

"తళుకు తళుకున నింగిఁ దాటించెఁ బలుమాఱు, నీరాళ్లగొందిఁ గన్నియ మెఱుంగు."
పాండు 4.21.

**కన్నీరు**

అశ్రువులు.

దుఃఖము కల్గినప్పుడు కండ్లలో వెడలునీరు.

"కన్నీ రొలుకఁగ నేడ్చిన, నన్నరపతు లెల్ల నేడ్చిరి..." భార. ద్రోణ. 1.29.

"వాడు కన్నీరు కారుస్తూ కూర్చున్నాడు."
వా.

**కన్నీరు కాలువలు కట్టు**

అధికముగా విలపించు.

"ఆమె కన్నీరు కాలువలు కట్టేటట్లు ఏడుస్తుంటే చూడలేక పోయాను."
వా.

**కన్నీరు గ్రుక్కుకొను**

దుఃఖోద్వేగ మాపుకొను.

**కన్నీరు గోట మీటు**

కన్నీరు గోటితో తుడిచి వేసికొను.

"కెందలిరుపాన్పునం దను వొందక లేచి కూర్చుండి కన్నీరు గోట మీటుచు బోటితో వరూధిని యి ట్లనియె."
మను. 3.28.

**కన్నీరు మున్నీరుగా (ఏడ్చు)**

ఎక్కువగా (దుఃఖించు.)

"అబ్బాయి కారుకింద పడ్డాడని వినగానే ఆవిడ కన్నీరు మున్నీరుగా యేడుస్తూ కూర్చుంది."
వా.

**కన్నీళ్లు తుడుచు**

తాత్కాలికంగా ఏవో మాటలు చెప్పి ఓదార్చు.

"మమ్ముఁ గన్నీళ్లు తుడిచి వే పొమ్మనియెను."
నందక. 43 పు.

"ఏవో నాలుగు మాటలు చెప్పి కన్నీళ్లు తుడిచి పంపించాడు గానీ, ఈ పిల్లలకేమైనా సాయం చేద్దా మనుకున్నాడా వాళ్ళ చిన్నాన్న?"
వా.

**కన్నీళ్లు తుడుచుమాటలు**
శుష్కప్రియాలు; పై పై ఓదార్పుమాటలు.
"ఈ కన్నీళ్లు తుడిచేమాటలతో ఏం లాభం? కొంప మునిగిపోయి చస్తుంటే." వా.
చూ. కళ్లు తుడుపు మాటలు.

**కన్నీళ్లు నడచుకొను**
కన్నీళ్లు గ్రుక్కుకొను, దుఃఖమును సమాళించుకొను.
"ఇందాక సెలుంగకే నేను యంటినో మిమ్ముల్, ననుచుఁ గన్నీళ్లు రా నడచుకొనుచు..." కళా. 4.171.
చూ. కన్నీళ్లు గ్రుక్కుకొను.

**కన్ను**
రీతి, జాడ.
"నాకడనుంచి, యేగినక న్నెల సెలుంగ నైతి." శుమా. 6.160.

**కన్నుండ కనుపాప తీయు**
అతి నేర్పరితనము సూపు. కొంత నిరసనగా అనుమాట. కనుపాపను తీస్తే కన్ను పోవాలి; కానీ అలా కాకనే తీయగల దంటే ఎంత నేర్పరి అని!
"విను వల్లభ! కన్నుండం, గనుపాపం దివియ నేర్పు గల సునిమ చ్చీ, వనిత..." కళా. 3.199.
"అమ్మా! ఆవిడా? కన్నుండగానే కనుపాప తీసేరకం." వా.
చూ. కన్నుండ కనుపాప కొన్నట్లు.

**కన్నుండ కనుపాప కొన్నట్లు**
అతినేర్పుగా.
"కన్నుండఁ గంటిపాపం, గొన్నట్లు మొఱంగి బాలుఁ గొనిపోవుటకున్, అన్నిచు బంధుయుతముగ, మన్నిగొనక యున్న నేటిమాటలు మనకున్?" ఉ. హరి. 5.288.
"కన్నుండఁగఁ గనుపాపను, గొన్న విధంబునను సతులఁ గూడకయును దాఁ, గన్న సుడి మనోధనములు, గ్రన్ననఁ గొనిపోవుఁ గన్నకాఁడుంబోలెన్." విక్ర. 8.9.
"కన్నుండగానే కనుపాపను తీసినట్లుగా, ఆ పిల్ల తనేమీ ఎఱుగనట్లూ, అతడే అంతా తప్పన్నట్లూ మగనికి చెప్పి ఒప్పించిం దంటే నమ్మే." వా.
చూ. కన్నుండ కనుపాప తీయు.

**కన్నుండ గంటిపాపను గొను**
మోసము చేయు, అతి చాకచక్యముతో ప్రవర్తించు.
నేడు వాడుకలో దీని రూపం:
"వాడా అమ్మా! కన్నుండగానే కంటిపాపను తీసేరకం." వా.

**కన్నుకట్టు**
ఒక పిల్లల ఆట.
"వెన్నెలకుప్పలు కన్నుకట్టు." ప్రబంధ. 6.13.
కన్నులకు బట్టకట్టి తోడివారిని తెలుసుకొనే ఆట కావచ్చును.
2. మోసగించు.
"నే నెవరి కన్ను కట్టీ ఈ డబ్బు తేలేదు. కష్టార్జితం." వా.

**కన్ను కన్నూ కనిపించని చీకటి**

కటిక చీకటి.

కంటికి కన్నే కనిపించనంత చిమ్మచీకటి అనుట.

**కన్ను కానక**

గర్వముతో - పొగ రెక్కి.

"వనితా! యెట్లోర్వవచ్చు వలవని గర్వం,బునఁ గన్ను గాన కాడెడి, యనుచితవాక్యంబు లేరి కైనఁ దలం పన్." కళా. 1.175.

**కన్ను కానక పోవు**

గర్వించు.

చూ. కన్ను కానక.

**కన్ను కానమి**

గర్వము.

చూ. కన్ను కానకపోవు.

**కన్నుకుట్టు**

1. అసూయ.

"వాడికి నన్ను చూస్తే కన్నుకుట్టు." వా.

2. అసూయపడు.

"వానిసిరిం జూచి కన్నుకుట్టినది." ధర్మజ.

"ఆపిల్ల కాస్త తల దువ్వుకుంటే ఆ ముసలిమొగుడికి కన్ను కుడుతుంది." వా.

3. కండ్లకలకరోగము వచ్చు.

"వాడు గాలిలో తిరిగేటప్పటికి కండ్లు కుట్టాయి. కండ్లు తెరవకుండా బాధపడి పోతున్నాడు." వా.

ఇందులోనుండే పై రెండు పలుకుబళ్లూ వచ్చినవి.

**కన్నుకొట్టు**

సైగ చేయు.

కామమోహాదుల విషయం లోనే దీనిని ఉపయోగిస్తారు.

"వాడు ఆ పిల్లను చూచి కన్ను కొట్టే సరికి అది వాళ్లవాళ్లకు చెప్పడం, వాళ్లు ఇంటిమీదికి రావడం గొడవో గొడవ అయి పోయింది." వా.

**కన్నుకొదమలు**

ఉత్తమనేత్రములు.

సింగపుగొదమ అనుచోట తరుణవయసి అయినా 'కొదమ' యువతను. ఉత్కృష్టతను. ఉత్తమ తను సూచించును.

"శంభు వికసితాంబకస,ముదితంబు లగు కన్నుకొదములో యనఁగ." పండితా. ద్వితీ మహి. పుట 100.

చూ. కొదమగుబ్బలు.

**కన్ను గానక**

పొగ రెక్కి.

"జనకకన్య జగన్మాతఁ జెనక వచ్చి కన్నుఁ గానక చెరఁ బలుగాకి కాకి." రామాభ్యు. 5.70.

చూ. కన్ను కానక.

**కన్ను గిలుపు**

కనుసైగ చేయు.

చూ. కన్నుకొట్టు.

**కన్ను గీటినంతలో**

అతిశీఘ్రముగా, రెప్పపాటులో, ఒక నిమిషములో.

"...అఖిలాన్నంబుల్, కను గీటినంత

లోనఁనె, యనుజునకుఁ దద గ్రజాత యమ రించి...'' పాండు. 3.26.

**కన్ను గూర్కు**

నిద్రించు.

''కన్ను గూర్కెడునంత నగ్రహనభాగ, మేలు బేతాళుఁ డతి దుర్నిరీక్ష్యుఁ డగుచు.'' శుక. 1.279.

చూ. కనుగూర్కు.

**కన్ను చెదరు**

మిఱుమిట్లు గొలుపు.

''ఆ అమ్మాయి రవ్వలకమ్మలు చూస్తే కన్ను చెదరుతుంది.'' వా.

**కన్ను దనియగా**

కనులు నిండుగా. నేత్ర పర్వముగా.

''కన్ను దనియఁగఁ బదపదార్థములును... వడ్డింప...''

పండితా. ప్రథ. దీక్షా. పుట. 119.

**కన్ను దనియు**

కనులకు తృప్తి చేకూర్చు.

''మొలపించె బహురూపములఁ గన్ను దనియ.''

వర. రా. బా. పు. 161. పంక్తి. 21.

**కన్ను దెఱచు**

కటాక్షించు, అనుగ్రహించు, గుర్తించు.

''ఇంక నెన్నండు దయఁ బరమేశ్వరుండు, గన్ను దెఱచునో యని.''

కుమా. 7.19.

''ఆ దేవు డెప్పుడు కన్ను తెరుస్తాడో గాని అంతదాకా నేనిలా అఘోరించవలసిందే.'' వా.

**కన్నునీరు**

కన్నీరు.

''కన్నునీరు గొ, బ్బున వెడలంగ.''

భోజ. 4.167.

**కన్నుపడు**

ఆసక్తి కలుగు.

ఇందులో ఈ ఆసక్తి అత్యాశతో, దురాశతో అన్నధ్వని కూడా ఉన్నది.

''వానికి ఆ ఉద్యోగంమీద కన్ను పడింది.'' వా.

''వానికి ఆ యింటిమీద కన్ను పడింది.'' వా.

**కన్ను పెట్టు**

కనిపెట్టు.

''ఆ వ్యవహారంమీద కాస్త కన్నుపెట్టి ఉండక పోతే లాభం లేదు.'' వా.

**కన్ను పొడుచు**

అపకారము చేయు.

''కన్ను పొడిచి కంటిలో నీ రెండు కంటే ఏం లాభం?'' వా.

**కన్ను పొడుచుకొన్నా కనుపించని**

ఏమాత్రం కనపడని.

''కన్ను పొడుచుకున్నా కనిపించని చీకట్లో వెళ్ళాడు పాపం!'' వా.

''ఆ కొంపలో కన్ను పొడుచుకొన్నా ఏదీ కనిపించదు.'' వా.

**కన్ను పొడుచునట్లు**

ఎదుటివారికి బుద్ధి వచ్చునట్లు.

ఎదుటివారి కన్ను కుట్టునట్లు.

''నానాటఁ గృశియించు ననుఁ జూచి కనుగీటు, పువ్వుబోడులఁ గన్ను పొడిచినట్లు.'' రాధికా. 2.63.

"నే నిందుకొ౦అకె, నవ్వ స,హా నోడఁడు వట్టి నింద లందితి నయ్యో, యైన దీక నాయె నందుకె, పూ ను ద మ ౦ ద అక్షు గన్ను పొడిచినరీతిన్."

రాధామా. 1.46.

## కన్ను మూతపడు

నిద్ర వచ్చు.

"రాత్రంతా కన్ను మూతపడ లేదు."

వా.

"అదేం కర్మమో! కాస్త కన్ను మూత పడేసరికి కలలు వస్తాయి." వా.

## కన్ను మూయు

చనిపోవు.

"అని ప్రలాపించి కనుమూసె నా క్షణంబ."

శుక. 1.396.

"ఈ పిల్లలను నా చేతుల్లో పెట్టి ఆయన కాస్తా కన్ను మూశాడు." వా.

"వాడు కన్ను మూసి మూడు నెల లయిందో కాలేదో? వాడికొడుకు ఆస్తి నంతా ధ్వంసం చేశాడు." వా.

## కన్ను మూసి తెరచేలోగా

వెంటనే; ఒక్క త్రుటిలో.

"కన్ను మూసి తెరచేలోగా అంతా అయి పోయింది." వా.

## కన్ను మూసే అవకాశం లేదు

ఏమాత్రం వ్యవధి లేదు.

"కను మూయు నెడయు లేదు."

బస. 3.64.

"కన్ను మూసే వీలు లేదమ్మా! ఈ కొంపలో పొద్దస్తం చాకిరీ అలా చేస్తూ ఉండ వలసిందే!" వా.

## కన్ను మూసే తీరిక లేదు

వ్యవధి లేదు అనుట.

"నాకు కన్ను మూసే తీరిక ఉంటే ఎంతో చదవాలని ఉంది. ఏదీ ఈ వెధవ చాకిరీతోనే సరిపోతుంది గా." వా.

## కన్ను మొగడు

కన్ను మూయు; నిద్రించు.

"ఇన్నాలుగు తెఱఁగులందు నెయ్యది యైనన్, గన్ను మొగుడ నీ దకె."

భార. సౌప్తి. 1.67.

## కన్ను మొగము ఏర్పడు

రూపేర్పడు; ఒక స్వరూప మునకు వచ్చు.

"అల్లనల్లన మూఁడేడు లయ్యె నకట, కన్ను మొగ మేరుపడకు నా గర్భము నకు." పద్య. బసవ. 1.96.

రూ. ముక్కు మొగ మేర్పడు.

## కన్ను మొగుచు

కన్ను మూయు, నిద్రించు.

"ఒయ్యనొయ్యనం గదలు తూఁగు టుయ్యేలలం గన్ను మొగిచియున్న విలాసినీవిలాసులునుం గలిగె."

పారి. 2.53.

"గవని మొగసాల యరుగుపైఁ భైర వుండు, గన్ను మొగిచె." కాశీ. 3.23.

## కన్ను మొఱగు

మోసగించు.

"అంతఃపురాంగనలన్ గన్ను మొఱంగి." భీమ. 1.111.

చూ. కను మొఱగు.

## కన్ను మోడ్చు

నిద్ర పోవు.

"ఏ నింత కన్ను మోడ్చు, తత్తిని గల లోన." రా. వి. 1.15.

రూ. కను మోడ్చు.

**కన్నుమోడ్పు**
నిద్ర.
"ఇంచుకసేపు కన్నుమోడ్పు నెఱపి." హంస. 2.53.

**కన్నుల కచ్చి**
ఒక బాలక్రీడ.
"కన్నుల కచ్చి గుడుగుడుగుంచాలు కుందనగిఱి." హంస. 3.146.

**కన్నుల కద్దుకొను**
అత్యాదరముతో చూచు, అభిమానించు,
"పేదవాని కన్నం పెడితే కన్నుల కద్దుకొని తింటాడు." వా.

**కన్నుల కరవు దీరగా**
కండ్లార; తృప్తిగా.
"ఇమ్మహీభుజు నిప్పు డోకొమ్మలార!, కంటిమి గదమ్మ కన్నుల కఱవు దీఱ." విజ. 1.72.
"కంచిలో వరదరాజస్వామిని కన్నుల కరువు దీరా చూశా మమ్మా ఈనాడు. జనసమ్మర్దం లేదు కదా." వా.

**కన్నుల గట్టినట్టు**
ప్రత్యక్షముగా ఉన్నట్లు.
బాత్తిగా ఒక సంఘటననో మనిషినో మఱచి పోలేకున్నామనుపట్ల ఉపయోగించే పలుకుబడి.
"మలయుచూడ్కులు గల మంచి నీ మోముఁ, గన్నులఁ గట్టిన కైవడిఁ దోఁచు." హరి. 2. భా. 1879.
"మా కోడలు ఊరికి పోయి నెలనాళ్లయింది. మనమడు కన్నులకు కట్టినట్టుగా ఉన్నాడు. వెళ్ళయినా చూచి రావాలి." వా.

**కన్నుల గప్పుకొను**
కన్నుల నద్దుకొను; ఆదరముతో అభిమానించు.
"కన్నియ నన్ను వల్లభుఁడు గన్నుల గప్పుకొనంగ నుండి." పారి. 1.88.
"గరిమ నందుఁడు గన్నులఁ గప్పుకొనఁగ." రాధికా. 1.56.
"ఆ కాంతలు గొల్వ నన్ను సముఖంబునఁ గన్నులఁ గప్పుకొంచు." రాజగో. 1.36.

**కన్నుల గెంపొదవు**
కోపము కలుగు.
"విని కన్నులఁ గెంపొదవఁగ." జైమి. 7.192.

**కన్నుల నద్దుకొను**
గౌరవప్రేమ సూచకంగా ఒకవస్తువును కన్నులకు అద్దుకొనడం అలవాటు. గౌరవప్రేమలను సూచించుట భావార్థము.
"శిరంబున మోపుకొని కన్నుల నద్దుకొని తిరుగ నతని చేతికి యిచ్చి." కళా. 4.60.
"నువ్వేమో అంత సంకోచిస్తున్నావు. ఇదే ఇంకొకరైతే కండ్ల కద్దుకొని తీసుకొంటారు." వా.
చూ. కన్నుల కద్దుకొను.

**కన్నుల నవ్వు**
హాసన్ముఖుడగు, ప్రసన్నముఖుడగు.
బస. 1.9.

**కన్నుల నిప్పులు డుల్లు**

కోపించు. కన్నెఱ్ఱ చేయు.

"క్రోపాటోపశిఖులు, నిండారి కన్నుల నిప్పులు డుల్లి."

పండితా. ద్వితీ. మహి. పుట. 15.

చూ. కన్నుల నిప్పులు రాలు.

**కన్నుల నిప్పులు రాలు**

ఆగ్రహోదగ్రత కలుగు.

కన్ను లెఱ్ఱవడు.

"కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల..."

భార. విరా. 2.133.

"కనుఁగొని కౌశికుం డలిగి కన్నుల నిప్పులు రాల ని ట్లనున్."

మార్కం. 1.228.

"అప్పుడు విశ్వామిత్రుఁడు, ముప్పిరి గొనునట్టి కోపమునఁ గన్గొనలన్, నిప్పులు రాలఁగ నమ్ముని, దప్పక వీక్షించి పలికె దారుణభంగిన్."

హరి. 1.150.

"వా డేదో తూస్కారంగా మాట్లాడ గానే రెడ్డిగారి కండ్లలో నిప్పులు రాలా యంటే నమ్మ." వా.

చూ. కన్నుల నిప్పులు డుల్లు.

**కన్నుల నిప్పు లొల్కు**

అతిక్రోధంతో కన్ను లెఱ్ఱ నగు.

కోపాన్ని నిప్పులతో పోల్చుట అలవాటు.

"అల్కతోఁ, గన్నుల నిప్పు లొల్క-హుటుకాదిలి దక్షునిఁ జూచి యి ట్లనున్."

కుమా. 2.82.

చూ. కన్నుల నిప్పులు రాలు.

**కన్నుల నీలాలు గారు**

ఏడ్చు. కన్నీరు రాలు.

"ఏడిస్తె నీ కండ్ల నీలాలు గారు."

పాతపాట.

చూ. కన్నుల ముత్యాలు గారు.

**కన్నుల నీళ్ల కుత్తుక వట్టు**

డగ్గుత్తిక పడు.

"గొనకొని కన్నుల నీళ్లు గుత్తుక వట్టెడిని." తాళ్ల. సం. 12.290.

**కన్నుల నూపిరి పెట్టుకొను**

ప్రాణావసానదశలో నుండు.

"ఎం డనక వా ననక యరక కొయ్యకొట్టుకొని కనుల నూపిరి పెట్టుకొని యున్న చోఁ జేటుపాటు మీకుఁ దెలియ కుండునా?" ధర్మజ. 47 పు. 2 పం.

తెను. జాతీ.

**కన్నులనె ప్రాణము నిల్పు**

ప్రాణావసానదశలో నుండు.

ప్రాణం పోవునప్పుడు ఆఖరున కనులలో నుండి పోవు నను టపై యేర్పడినది.

"...శకుంతల ప్రాణనాయక, ధ్యానము తోడఁ గన్నులనె ప్రాణము నిల్పి శరీర మాత్ర యై." శృం. శా. 3.74.

"వాడు కళ్లల్లో ప్రాణం నిలుపుకొని ఉన్నాడు." వా.

**కన్నుల నొత్తుకొను**

కన్నుల కద్దుకొను.

ఇది ప్రేమాదరసూచకము.

"పొలఁతి నీ చిఱునవ్వుఁ బువ్వు లాతఁడు గోసి, పలికి కన్నుల నొత్తుకొనంగాను." తాళ్ల. సం. 3.279.

చూ. కన్నుల నద్దుకొను; కన్నుల కద్దుకొను.

కన్నుల పండువు(గా)
నేత్రపర్వము. మనోజ్ఞము, మనోహరము.
"సుందరాకృతులు గన్నులపండువు." కుమా. 7.123.
"ఆ అమ్మాయి నడుస్తుంటే కన్నుల పండువుగా ఉంటుంది." వా.

కన్నుల బడు
కానవచ్చు.
కువ. 3.59.

కన్నుల ముంచి క్రోలు
ఆసక్తితో చూచు.
"నీ వన్నెల్ కన్నుల ముంచి క్రోలుటలు." నారా శత. 46.
వాడుకలోనూ : "కళ్ళతో త్రాగి వేస్తున్నాడా అమ్మాయిని" వంటి రూపాలలో ఇది వినవస్తుంది.

కన్నుల ముత్యాలు గారు
ఏడ్చు.
"ఎన్నఁడు నెండకన్నెఱుఁగనిశిశువు కన్నుల ముత్యాలు గాఱ నేడ్చెడిని." హరిశ్చ. 2.924.
చూ. కన్నుల నీలాలు గారు.

కన్నుల ముసు గిడు
కన్నులు గప్పు.
"కన్నుల ముసుగిడ్డ కంతుని మాయాంధతమసపటము..." రాధా. 2.199.

కన్నులమ్రాను
చెఱకు.

కన్నులలో నిప్పులు పోసికొను
ఓర్వలేక పోవు.
"మనము నేర్చుచున్న విద్యను గాంచి తాను గన్నులలో నిప్పులు పోసికొనుచున్నాఁడు." సాక్షి. 47. పు.

కన్నుల సన్న నుసుచు
ఆజ్ఞానువర్తులనుగా చేయు, కనుసన్న మెలగునట్లొనర్చు.
"దిగధీశ్వరుల నోలి, మన్నించి కన్నుల సన్న నునిచె." కుమా. 7.155.

కన్ను లాకలి తీర్చు
కన్నులు తనియించు; కండ్లారా చూడ నిచ్చు.
"ఎన్నఁడు వచ్చునో యిందిరావిభుఁడు, కన్ను లాఁకలి తీర్పఁ గలుగునో యనుచు." ద్విప. మధు. పు. 33.

కన్నులార
కనులకు సంతృప్తిగా, బాగా, ప్రత్యక్షంగా.
"కన్నులారఁ జూచుచును."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 155.
"కన్నులారా అందరు చూస్తుండగా దొంగ పారిపోయాడు." వా.

కన్ను లార్చు
వంచించు.
"...వనితకుఁ గన్ను లార్ప నిటు వచ్చిన వాఁడవె..." రుక్మాం. 5.22.

కన్నులు కట్టు
మోసగించు; కన్నుకొట్టు.
"నన్ను నమ్మించి తెచ్చి, కాననంబులోఁ గన్నులు కట్టి కాడు, పఱచి నీ కిట్లు పోఁజన్నె భావజన్మ!" కుమా. 5.65.
చూ. కన్నులు గట్టు.

కన్నులు కానని
అంధులయిన. చూపు లేని.

"తల్లి మదేకపుత్రక పెద్దకన్నులు, గాన దిప్పుడు మూఁడుకాళ్ల ముసలి."
శృం. నైష. 1.108.

## కన్నులు గలవే! (చూడగా)

కన్నులు చాల వనుట, అతి దర్శనీయము.

"శృంగారించిన నిన్నుఁ జూడఁ గన్నులు గలవే?" భాస్క. సుంద. 189.
చూ. రెండుకన్నులు చాలవు.

## కన్నులు గట్టు

మోసగించు.

"పాంద్రవిభు కన్నులు గట్టి ప్రలంబ వైరికిఁ, సేవ యొనర్చి."
ఉ. హరి. 2.98.
చూ. కన్నులు కట్టు.

## కన్నులు గప్పు

మోసగించు.

"తలిదండ్రుల కనులు గప్పి వాడలా చెడుతిరుగుళ్లు తిరుగుతున్నాడు."
వా.

## కన్నులు చల్లగా

తృప్తిగా - నేత్రపర్వముగా.

"కన్నులు చల్లఁగాఁ గనుగొందు నేను మి, మ్మరుపుర దేవి దేవరను బోలె."
శృం. నైష. 2.86.

"మా అమ్మాయి పిల్లవాణ్ణెత్తుకొని యింట్లో తిరుగుతుంటే కన్నులు చల్లగా చూడా లని ఉంది." వా.

## కన్నులు చల్ల నగు

సంతోషము కలుగు; సంతృప్తి కలుగు.

"జమునిఁ జూడఁగఁ గన్నులు చల్ల నయ్యె." కాశీ. 3.147.

"నిన్ను చూడగానే కన్నులు చల్ల నయ్యాయి నాయనా! అంతే చాలు."
వా.

## కన్నులు చెదరి పోవు

మిఱుమిట్లు గొలుపు.

"చీకట్లో నుంచి వెలుతురులోకి వస్తే కండ్లు చెదిరిపోతాయి." వా.

## కన్నులు చెమర్చు

చూ. కన్నులు చెమ్మగిల్లు.

## కన్నులు చెమ్మగిల్లు

దుఃఖము కలుగు.

"హరిశ్చంద్ర నాటకంలో చంద్రమతి యేడుస్తుంటే ప్రేక్షకు లందరి కండ్లూ చెమ్మగిల్లినవి." వా.
రూ. కనులు చెమర్చు.

## కన్నులు జేవురించు

కన్ను లెఱ్ఱ నగు - కోపము కలుగు.

"క, న్గానఁడు యాదవుం డను చుఁ గన్నులు వేయును జేవురింప."
పారి. 4.63.

## కన్నులు తల కెక్కు

పొగ రెక్కు.

వినయవంతుడు క్రిందికి చూస్తాడు. అట్లే పొగరుబోతు ఆకాశంలోకి చూస్తూ నడుస్తాడు అనుటపై ఏర్పడిన పలుకుబడి. ఇలాంటివే కన్నులు నెత్తికెక్కు, కన్నులు నెత్తికి వచ్చు ఇత్యాదులు.
చింతా. 6 అం. 59 పు.

"వాడికీమధ్య కన్నులు తల కెక్కినట్లు

న్నా యి లే. అందు కే అలా వాగు
తున్నాడు.'' వా.

చూ. కన్నులు నెత్తి కెక్కు.

**కన్నులు దనియు**

కన్నులు చల్లనగు.

"అ,గ్గలిక మెఱసె నట్ల మీకుఁ గన్నులు
దనియన్.'' భార. ద్రోణ. 1.33.

**కన్నులు నీరుబుగ్గ లగు**

కన్నులనుండి కన్నీరు ఏక
ధారగా కారు.

నీటి బుగ్గలలో నేల చీల్చు
కొని నీరు పైకుబుకుతుంది.
ఏకధారగా ఇలా వస్తూనే
ఉంటుంది. అలాగే కన్నుల
నుండి కన్నీరు అపరిమితంగా
వస్తున్నదని తెలుపు
పలుకుబడి.

"మతి వెతఁ జెంద బేడిసల మార్కొను
కన్నులు నీరుబుగ్గ లై, పొదలఁగ.''
శుక. 1. 188.

**కన్నులు నెత్తికి వచ్చు**

పొగ రెక్కు.

"అయ్యో! రామా! వాడు మనతో
మాట్లాడుతాడా ఇప్పుడు? కన్నులు
నెత్తికి వచ్చాయే.'' వా.

**కన్నులు నెత్తి కెక్కు**

గర్వించు, పొగ రెక్కు.

"ఏమిట్రోయ్! కన్నులు నెత్తి కెక్కా
యేమిటి? అలా తోసుకొని
పోతున్నావు.'' వా.

**కన్నులు పైకి వచ్చు**

పొగ రెక్కు.

చూ. కన్నులు నెత్తికి వచ్చు.

**కన్నులు మూసి చరించు**

మోసగించి తిరుగు.

ఒకరి కంట పడకుండా రహ
స్యముగా వర్తించుటపై వచ్చి
నది.

"...నెప్పు వగమాటలు నేరని తప్పు
పాటలుం, గనఁబడ నవ్వఘాటి పతి
కన్నులు మూసి చరించు నిచ్చలున్.''
శుక. 3.109.

చూ. కన్నులు గప్పు.

**కన్నులు వాచు**

1. అత్యాసక్తితో ఎదురు
చూచు.

"కన్నులు వాచు నీ మొగము గానక
యెప్పుడుఁ జూడకున్న.'' యయా. 2.

చూ. మొగము వాచు.

2. ఏడ్చి యేడ్చి కను లుబ్బు.

"నీరు చైదములకు వాచెఁ గన్నులు.''
శ్రీవ. 5.37.

**కన్నులు విచ్చి చూచు**

కనులారా చూచు.

"కన్నులు విచ్చి చూచి పురఘస్మరు
దిక్పరిపూర్ణదీప్తిసం, పన్నతకుఙ్
ఘయూకలితపద్మనిరీక్షణుఁడై.''
కా. మా. 1.77.

**కన్నువఱపు**

చూచు; దృష్టి సారించు.

"అయ్యింటిలోఁ గన్ను వఱపి.''
భార. అను. 1.76.

**కన్ను వేయు**

1. మోహించు; కాముక
తతో ఆశించు.

"అయ్యబలమీఁద నలిననాభుండు కను
వేసినాఁడు."
వరాహ. 11.52.

"కల నైన నన్యకాంతకుఁ గానికాపును,
గనువేసి విటునిఁ జేసినగయాళి."
బహులా. 5.87.

"........ఏ వధూటిపైఁ దమిఁ గను
వేసితో... విప్రనా. 4.37.

"వాఁడా పిల్లమీద కన్ను వేశాడు."
వా.

"వాఁడెప్పుడూ ఆ సందులోనే తిరుగు
తుంటాడు. ఆ పిల్లమీద కన్ను వేశాడా
యేమిటి?" వా.

2. చూచు; దృష్టి సారించు.

"గుబ్బ పాలిండ్ల గ్రేవఁ గ్రక్కున
మురారి, కన్ను వేయుటఁ గని లజ్జ
గదుర..." ఆము. 6.133.

చూ. కనువేయు.

## కన్ను వొందకుండు

కనుమూత పడక పోవు; నిద్ర
పట్టక పోవు.

"కడుపునిండఁ గుడువఁ గానమి చే
యెల్లఁ, గన్ను వొందకున్నఁ గరము
డస్సి, యున్నవాఁడ."
భార. ఆది. 6.289.

"సౌఖ్య మొదవ నాకుఁ గన్ను వొంద
కుండు."
ఈదురుపల్లి భవానీశంకరకవి. ధర్మ
ఖండము. 1.237.

కన్ను వొందు అన్నట్లు కాక
ఇలా తద్విరుద్ధస్థితి సూచక
మూ పంలోనే ఇది కాన
వస్తుంది.

## కన్ను వైచు

కన్ను వేయు.

"సితభానుఁ డాచార్య చికురాకుఁ
బోఁడిపైఁ, గన్ను వైచిన కన్నె కలుపు
మరులు." నైష. 7.151.

చూ. కనువైచు.

## కన్నుసన్న మెలగు

ఆజ్ఞానువర్తి యగు.

"ఎయ్యది పనిచిన నొయ్యనఁ జేయు
చుఁ, గనుసన్న మెలఁగు భూజనులఁ
దలఁచి." విక్ర. 6.59.

చూ. కనుసన్న మెలగు.

## కన్నుసన్నల ద్రిమ్మరు

ఆజ్ఞానువర్తి యగు.

"ఇందఱిలో నల సత్యభామ కన్,సన్న
లఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యన
వింకుఁ గాని." పారి. 1.65.

## కన్నుసిమి

కన్ను భ్రామి, మోసగించి.

"చంపక నన్నుఁ గన్నుసిమి."
పాండు. 5.224.

## కన్నూ మిన్నూ కానక పోవు

పొగరెక్కి మెలగు; ఎవడే
మిటి లెక్క అన్నట్లు ప్రవ
ర్తించు.

"వాడికీ మధ్య కాస్త డబ్బు రాగానే
కన్నూ మిన్నూ కానక పోతున్నాడు."
వా.

## కన్నూ మిన్నూ కానరాక పోవు

హెచ్చు తక్కువలు తెలి
యక పోవు; పొగరెక్కి
తిరుగు.

"నాడి దిప్పుడు కన్నూ మిన్నూ కాన
రాని వయస్సు." వా.

"వాని కీమధ్య డబ్బున్న స్నేహితుడు చిక్కాడ్ళ్ళే. అందు కని కన్నూ మిన్నూ కానరావడం లేదు." వా.

## కన్నెకయ్యము

తొలిపోరు.

"కన్నెకయ్యం బిది కనిపెట్టి పోరు." పల. పు. 107.

## కన్నెకలుపు

తొలి కూటమి, ప్రథమ సంగమము.

"సితభానుఁ డాచార్యచికురాకు బోఁడిపైఁ, గన్ను వైచిన కన్నెకలుపు మరులు." శృం. నైష. 7.151.

## కన్నెకూర్మి

తొలివలపు.

"జనవిభుండు, కన్నెకూర్మి ప్రకాశంబు గాక యుండ." శృం. నైష. 1.84.

## కన్నెగోరుకోత

కన్నెలకు గోళ్లు తీసే ఒక సంస్కారము.

బ్రౌను

## కన్నెబావి

చిన్నబావి.

నిర్జలకూప మని బ్రౌను.

## కన్నెముత్తైదువ

కన్య.

"ఎవ రైనా కన్నెముత్తైదువుకు చీరా రవికా, పసుపు, కుంకుం మా ఆవిడ శే పివ్వాలట." వా.

## కన్నెటీకము పెట్టు

తొలిసారిగా యుక్తవయస్కురా లయిన వేశ్యను పొందుటకై ఒకానొక సంస్కారము జరుపు.

"ధనదత్తుఁ డపుడు తన చెలికానిన్, బని చెను పుష్పసుగంధికి, నొనరఁగఁ గన్నె టీకమునకు నొడఁబఱపింపన్." మల్హ. 2.3.

## కన్నెఱుగు

విధము తెలియు, జాడ తెలియు.

"పరమేశ్వరుండు...సుప్రసన్నుం డైన కన్నెఱింగి గౌరి." కుమా. 5.25.

"తమ యందఱకు వగఁ గల్గిన కన్నె ఱింగి." కుమా. 6.29.

"త న్నెర్గకున్న కన్నెఱిఁగి."
పండితా. ప్రథ. పురా. పుట. 351.

"కరితురంగ, రథ పదాతిచయము రావించుచున్న యా, క న్నెఱింగి కోప కలితుఁ డగుచు." వి. పు. 7.413.

2. భావ మెఱుగు, ఇంగిత మెఱుగు.

"నిజ జీవితేశ్వరి కన్నెఱింగి దానికి సమ్మతించిన..." కుమా. 1.102.

కన్ను జాడ, తీరు, లక్షణయా భావము అను అర్థములలో విరివిగా ప్రయుక్తం.

చూ. కన్నెర్గు.

## కన్నెఱ్ఱ చేయు

కోపించు.

"చేడెపైఁ గన్నెఱ్ఱ చేసె దేమి?" రసిక. 5.164.

**కన్నెర్గు**

కన్నెఱుగు, జాడ తెలియు.

"విన్నవింపఁగ నున్నకన్నెర్గి." బస. 1.6.

చూ. కన్నెఱుగు.

**కన్నేచు**

కనుకుట్టు; ఒకరిని చూచి ఓర్వ లేక పోవు.

"కన్నేచినయట్టు, జైనులకన్ను లీక్షణ ములోఁ జెఱచి."

పండితా. ద్వితీ. మహి. పుట. 114.

చూ. కన్నుకుట్టు.

**కన్నోట**

సంకోచము.

"మున్ను పలికినట్ల కన్నోట లేక ప, ల్కుటయు." భార. శాంతి. 4.392.

**కన్పండువు**

చూ. కనుపండువు.

**కన్గిలుపు**

కన్ను గీటు.

విజయ. 3.28.

**కన్పెట్టు**

చూ. కనుపెట్టు.

**కన్మొఱగు**

వంచించు, మోసగించు.

"శ్రీకాంతామణిఁ గన్మొఱంగి." పాండు. 1.1.

చూ. కనుమొఱగు.

**కన్వెలుగు**

చూ. కనువెలుగు.

**కన్వోగిన వెనుక**

చీకటి విచ్చగనే.

కనుచీకటి అనగా కనుల కంతగా కనిపించని వేళ. కను వేగుట అనగా కనులకు కొంత కనిపించు సమయము.

"ఒనరఁగ నిట బొండకొయ్య నుంచిరి కన్వోగినవెనుకఁ దెలిసికొని య, చ్చని నముఁ బొమ్మందురు..." శుక. 3.204.

**కన్వోగు**

తెల్లవారుజాము అగు.

"కన్వోగినవెనుకఁ దెలిసికొని." శుక. 3 204.

**కన్సోగ**

కనుబొమ్మ.

రూ. కనుసోగ.

**కపటధర్మకంచుకము**

పైకి ధర్మముగా కనబడుతూ లోన పాపభూయిష్ఠ మైనది.

"ఇది పాపశీలంబు, కపటధర్మకంచు కంబు సువ్వె." భార. శాంతి. 3.65.

**కపురపుబాగాలు**

కర్పూర ఖండములతో కూడి విశేషము; అందులో చేర్చు సుగంధద్రవ్యములు.

"తుఱుములోపల నరవిరిసరులు దుఱిమి, వేడ్కఁ గపురపు బాగాలు వేసి కొనుచు." హంస. 5.254.

"పండుటాకులుఁ గపురంపు బాగము లును, బరఁగఁ జేపట్టిరి." రాజ...

"కట్టెడు తెల్లనాకులును గప్పురబాగలు సిచ్చు నిచ్చలున్." తారా. 2.

"కర్పూరంబుతోడి బాగా, లీరాదో యాకు మడిచి యీరాదొ చెలీ!" కళా. 4.

కప్పుకాటు

అసంభవము.

కప్ప కఱవదు గనుక.

"బాపనపోటు కప్పకాటుం గలదే?

రుక్మాం. 5.28.
వేంకటేశ. 72.

కప్పకుఱుపు

బొబ్బ. శ. ర.

కప్పచిప్ప

ఆలిచిప్ప.

కప్పడి కంబళి

కప్పుకోను కంబళి.

"గద్దెకంబళ్లు గప్పడి కంబళ్లు."

పండితా. పర్వ. 346.

కప్పతాళము

తాళం కప్ప.

"వాళ్ళింటికి పెద్ద కప్పతాళం తగిలించి పోయారు. అయినా దొంగలు విడిచి పెట్టారా?" వా.

కప్పదాటులు వేయు

మధ్యలో మధ్యలో వదలిపెట్టి అక్కడ ఒకటీ యిక్కడ ఒకటీ చెప్పి—వ్రాసి సరి పుచ్చు.

"ఏది వ్రాసినా సక్రమంగా సంపూర్ణంగా వ్రాయాలి గాని, ఇలా కప్ప దాటులు వేయడం నాకు సరిపడదు." వా.

కప్ప నాగు(వు)రు

చిఱుకప్ప కాటుచే పశువులకు కలిగెడు రోగవిశేషము.

హరి. పూ. 6.45.

కప్పయెలుగు పాము

పైకి సాధువుగా కనిపించే క్రూరవ్యక్తి.

గోముఖవ్యాఘ్రము వంటిది.

ధ్వని కప్పదే కాని అసలు పాముట.

"...మన మటు గాన నెప్పుడును మా దెసఁ గప్పయెలుంగుపాము వై, యునికి యెఱుంగ వచ్చె నెటు లూరటగా వర మిచ్చినాఁడవో!"

భార. ద్రోణ. 3.101.

కప్పరపడు

సంభ్రమము చెందు; అబ్బుర పడు.

"వాల్మీకి వచ్చి సీతాసుతులఁ, గప్పర పడి చూచి..." జైమి. 6.89.

"చెప్పిన నంతయు విని నే,నప్పుడు తల యూఁచి యమ్మహాదేవి మొగం, బొప్పారఁ జూచి నవ్వినఁ, గప్పరపడి నన్నుఁ బలికె..."

విష్ణు. నా. 1.206.

"ఉప్పొంగి మానసంబునఁ, గప్పరపడి భూతములు జిఘాంసాపేక్షన్."

5.193.

చూ. కప్పరపాటు.

కప్పరపాటు

సంభ్రమము.

"కప్పరపాటుతో నతనిఁ గన్గొని..."

రంగా. 1.70.

చూ. కప్పరపడు.

కప్పల తక్కెడగా

ఒకటి సరిపడితే మరొకటి చెడి పోతున్నప్పుడు అనే మాట.

కప్పలను తక్కెడలో పెట్టి

సరిగా తూచవలె నంటే అసాధ్యం. ఒకటి వేస్తే మఱొకటి ఎగిరిపోతూ ఉంటుంది. అందుపై వచ్చిన పలుకుబడి.

"ఈ వ్యవహార మంతా కప్పల తక్కెడగా తేలింది. వీడు దారికి వస్తే వాడు దారికి రాడు; వాడు దారికి వస్తే వీడు దారికి రాడు." వా.

**కప్పవలె నోరు తెఱచుకొను**

తెలివి తక్కువను కనబరుస్తున్నా డనుపట్ల ఉపయోగిస్తారు. నోరు తెరచుకొనుట బుద్ధిమాంద్యసూచకము.

"ఆవెధ వేవో కారుకూతలు కూస్తుంటే వీడు కప్పలాగా నోరు తెరుచుకొని వింటున్నాడు." వా.

**కప్పారు**

నల్లపడు.

"ఘనాగ్రతలంబులతోన యూరు గప్పారె." కుమా. 3.24.

"కప్పారు రేణువు కమలాప్తబింబంబు, రాహుమండలమున రమణఁ గప్ప." భార. భీష్మ. 1.242.

**కప్పిడు**

కప్పి పుచ్చు.

"కప్పిడఁగ నేల యొప్పమి, నిప్పుడ యొఱఁగింపు కలిగ నేని మహాత్మా!" శేష. 4.38.

**కప్పినకన్ను**

మూసుకుపోయిన కన్ను.

పండితా. ద్వితీ. మహి. పుట. 108.

**కప్పి పల్కు**

దాచి మాట్లాడు, ప్రచ్ఛన్నంగా పలుకు.

"అని కప్పి పల్కం బోయి బయల్పడఁ బల్కి వెలవెలఁబాఱుచు..." కుమా. 5.126.

**కప్పిపుచ్చు**

దాచు.

"కల్లతనములు పలుమాఱుఁ గప్పి పుచ్చు." కాశీ. 4.90.

"వాడు చేసిన దంతా కప్పిపుచ్చాలని నీ వెంత తాపత్రయపడుతున్నావో నాకు తెలుసు. కానీ ఏం లాభం! ఆ వెధవ పనులు దాచితే దాగేవి కావు." వా.

చూ. కప్పిడు.

**కప్పుకొను**

1. దాచుకొను.

"కప్పుకో నేల బంగారమా పువుబంతు, లవి సువర్ణలతోదయములు సుమ్ము." కవిరా. 1.31.

2. క్రమ్ము.

"ఒప్పనితమకము చిత్తము, గప్పుకొనుట నుత్తలంబు గదురఁగ." భార. విరా. 2.36.

**కప్పుదెంచు**

క్రమ్ము.

"అతనిఁ గప్పుదెంచు విలయాభ్రము చాడ్పున." భార. ద్రోణ. 1.89.

**కప్పుదేరు**

నల్ల నగు.

"కప్పుదేరు తెగబారెడు నిద్దపు సోగ వెండ్రుకల్," విజయ. 3.89.

కప్పురగంది

స్త్రీ.

"కప్పురగంది రాధ యనుకన్నియ."

రాధా. 1.12.

కప్పురభోగాలు

ధాన్యవిశేషం.

"కప్పురభోగి వంటకము."

క్రీడా. పు. 54.

కప్పురము పెట్టి యుప్పు గొను

అమూల్య మయినదానికి బదులుగా పనికిమాలినదానిని తీసికొను.

కర్పూరం అమూల్య మనీ ఉప్పు కాదనీ అన్న అభ్యూహపై ఏర్పడినది.

"మేను...దీనిరహిఁ బుణ్య మమ్ముట, కప్పురంబు వెట్టి యుప్పు గొనుట."

ఆము. 6.62.

కప్పురముల క్రోవి

సౌందర్యరాశి

పచ్చకర్పూరమూ, పునుగు, జవ్వాజి మొదలైనవి సౌందర్యప్రవర్ధకాలుగా మనవారు భావిస్తారు. అందుపై వచ్చినపలుకుబడి.

"కప్పురంబుల క్రోవి యక్కాంత మోవి."

హంస. 2.20.

కప్పు వెట్టు

పోరాడుటలో దెబ్బ తీయుటకై పొంచి నిలుచు.

"కప్పు వెట్టి వెన్ను కందమ్ము సముఖుగాఁ, బొదవి."

మను. 4.23.

క్రపంపుదిమ్మ

అందమైనది.

కర్పూరపుదిమ్మవంటి దనుట.

మదన. శత. 72.

కబంధహస్తాలు

దూరంలో ఉన్నవాటి నన్నిటినీ పట్టుకొని బంధించేవి అనే పట్ల ఉపయోగిస్తారు.

రామాయణంలోని కబంధుని కథపై వచ్చిన పలుకుబడి.

"ఈ జిల్లాలో ఎవ రెక్కడ దావా పడవేసినా మా ఊరి కరణంగారి కబంధహస్తాలకు దొరకి పోవలసిందే." వా.

కబోది (పక్షి)

గుడ్డి.

"కండ్లు లేని కబోదిని తల్లీ! కాస్త భిక్షం వేయి." వా.

చూ. కళ్ళు లేని కబోది.

కబ్బము కరాటము

పుస్తకము, మందుల సంచి.

జం.

వైద్యులు వెంట కొనిపోవునవిగా ఉపయోగించే మాట.

నారా. శత. 6.

కమరులు వోవు

ఎండిపోవు.

కుమా. 5.169.

కమలించు

కమలి పోవు.

వాడుకలో కొంత మారి 'ఆవేడికి పువ్వు కమలి

పోయింది.' 'ఆ మంటలలో వానిశరీరం కమలి పోయింది.' అన్న ట్లుంటుంది.

"...రాతి...పలిం దలంచి కమ లించి." కుమా. 5.98.

కమలి పోవు

వాడిపోవు.

"పాపం ఎండకు పిల్లమొగం కమ (మి) లి పోయింది." వా.

కమాను వెళ్లు

కాంపు వెళ్లు.

ఇది యిప్పుడు జైళ్లలో విశేషంగా వినవస్తుంది. ఉద్యోగస్థులలో దాదాపు మాసి పోయినట్లు కనబడుతుంది.

"దొరగారు మొన్న కమాను వెళ్లారు. రేపటికి గానీ రారు." వా.

కమామీసు

వ్యవహారదక్షత; కాలము. బ్రౌను.

కథా కమామిూషూ అన్న చోట నేడిది జంటపదంలోని భాగంగా వినవస్తుంది.

కమిచికొను

నోటితో పట్టుకొను, కఱచికొను.

"...నేలఁ బడ్డవనజగర్భుఁ, గమిచికొని మరాళకము వాఱెఁ జెందమ్మి, గఱచి కొని రయమునఁ బఱచినట్లు." కుమా. 2.70.

కమియార

పూర్తిగా, సంతృప్తిగా.

కమియు అనగా పూర్ణముగా. ఈ అర్థంలో చాలా తావుల ప్రయుక్తం: కమియార పండు ఇత్యాదులు.

"కాంతాజనంబులు కమియార నిడుదురే, పురములోఁ దత్కాలపుణ్యభిక్ష." భీమ. 3.7.

కమ్మకట్టు

చేసుకొన్న ఒడంబడికనుబట్టి ఇతరరాజులు పంపుసైన్యము.

"కోయిలవజీరులఁ దుమ్మెద కమ్మకట్టుమూ, కల గొరవంకరాదొరల." చంద్రి. 2.82.

కమ్మగుట్టు

అతిరహస్యం.

"అదంతా కమ్మగుట్టు. చచ్చినా బయటికి తెలియదు." వా.

కమ్మచుట్ట

జాబు.

తాటాకుతో వ్రాసి గొట్టంలో పెట్టి పంపే అలవాటుపై వచ్చినమాట.

"శుభవార్తల బంగరు కమ్మచుట్ట నా, దినకరమండలంబు...." విజయ. 3.92.

కమ్మనూనె

వాసననూనె.

కమ్మచ్చు

బంగారు వెండి కమ్ములుగా తీసే

ఒక అచ్చు. ఇనుప పలకలో రకరకాల పరిమాణాలలో రంధ్రాలు వేసి ఉంటాయి.

"వెండి తీగలు నిగిడించు, చదలు కమ్మచ్చు బెజ్జము లనంగ." పారి.2.39.

"దీన్ని సాగ్గొట్టి కమ్మచ్చులో లాగరా." వా.

రూ. కమ్మెచ్చు.

**కమ్మటాకు**

ఒక ఆభరణం.

ద్వార. 4.140.

**కమ్మనీరు**

1. తేనె.

"మున్నీ గైనలా కమ్మనీరు రహిన్ గూడిన నేర్పరించు గము లై రోలంబ కాదంబముల్." ఆము. 5.121.

2. పన్నీరు.

"...ఒక పంకజలోచన వ్రాసె... గుబ్బవలిచన్నులపై మకరీకలాపముల్, వావిరిఁ గమ్మనీరు మృగనాభి రసంబున మేళవించి." శృం. నైష. 3.102.

**కమ్మపంజు**

కమ్మలోని రాళ్ళు పొదిగిన భాగం.

**కమ్మపిల్లి**

పునుగుపిల్లి.

శృంగా. శాకుం. 1.98.

**కమ్మపూత**

గంధపు పూత.

**కమ్మ యగు**

శుచికరముగా నుండు.

"కాలెనో చలి గావో కమ్మగావో నీకున్." కా. మా. 3.88.

**కమ్మవడ**

ఒక భక్ష్యము.

పాంచా. 4.59.

**కమ్మిచీర**

కమ్ములు పోసి నేసినచీర.

**కమ్మితీయు**

1. చిక్కిపోవు.

"బాల్యంబు కమ్మితీసె." పార్వ. 2.24.

2. చల్లగా జారుకొనిపోవు. దక్షిణాంధ్రంలో ఇది ఈ అర్థంలో ఎక్కువగా విన వస్తుంది.

"వాడు మేం మాట్లాడుతూ మాట్లాడుతూ ఉండగానే చల్లగా కమ్మితీశాడు." వా.

చూ. కంబి తీయు.

**కమ్మిసూకు**

కమ్మచ్చున బెట్టి తీగగా తీయు.

"కమ్మి సూకిన నూత్నకలధౌతమును బోలె." భీమ. 4.130.

**కమ్మిపెట్టు**

కప్పిపెట్టు.

కొత్త. 340.

**కమ్మీ చేయు**

నేరము దాచు.

**కమ్మెరాకు**

తమలపాకులలో ఒక విధం. అవి రెండు రకాలు. కారపాకులు, కమ్మెరాకులు.

**కయికాన్క చేయు**

బహుమతు లిచ్చు.

"విశేషభూషణో,ద్భాసిత చిత్రచేలము లపారముగాఁ గయికాన్క చేసి..."
శుక. 4.80.
చూ. కైకాన్క.

**కయిచూఱగా**

కొల్లగా.

"హయగజరథములు నావు లెద్దులును, గయిచూఱగా మాకుఁ గలిగినకొలఁది."
ద్వి. భల్లాణ. 1.19.

**కయిదండ**

చేయూత.

"ఇకఁ గయిదండ గొమ్ము."
ఉ. రా. 6.66.
చూ. కైదండ.

**కయిదండ బట్టు**

చేయూత నిచ్చు.

"చెలికత్తె ల్గయిదండఁ బట్టఁగ సురస్త్రీ లెంద ఱైన న్గెలం, కల సేవింపఁగ."
కా. మా. 2.6.

**కయిలకట్ట**

కవిలకట్ట.

కుక్కు. 31.
చూ. కవిలకట్ట.

**కయిలాగు**

చేయూత.

"చెట్లు వెంబడిఁ గయిలా గొసంగ."
శివ. 2.47.

**కయివారము**

స్తోత్రపాఠము.

రాజులు మొదలగు వారు వెడలునప్పుడూ, కొలువు తీరినప్పుడూ చేసే స్తోత్రపాఠాలనే కైవారము లంటారు.
బస. 2.26.
చూ. కైవారము.

**కయివ్రాలు**

వంగు.

"క్రిందికిఁ గయివ్రాలు తత్సలిలనిర్మలధార."
ఆము. 4.21.

"కయివ్రాలక వాడక తావి వోక."
విప్ర. 2.29.
చూ. కైవ్రాలు.

**కయిసేయు**

అలంకరించు.

"చెలువ చాల నిట్లు గయిసేయఁగ."
వసు. 5.123.
హర. 2.108.
చూ. కైసేయు.

**కయ్యపుగ్రచ్చు**

జగడగొండి.

"గొడవగొట్టులు మడివిడుపులు చాల, గడసరుల్ కయ్యంపుఁ గ్రచ్చులు ... వారవనితలు."
పండి. పురా. 115.

**కయ్య మిచ్చు**

యుద్ధము చేయు.

"కయ్య మి మ్మని...పిల్చుటయు."
హరి. ఉత్త. 4.16.

**కయ్యమునకు కాలు దాచు**

యుద్ధానికి పిలుచు.

"...దివ్యమానీంద్ర! నా, కమ్రగీనేత్రల మీఁదఁ గయ్యమునకుం గాల్ దాచులా గొప్పెడున్."
కళాపూ. 1.147.
చూ. కయ్యమునకు కాలు ద్రవ్వు.

కయ్యమునకు కాలు ద్రవ్వు

జగడమున కీడ్చు.

"కయ్యమునకు వలదు కాల్ద్రివ్వ."

భార. శాంతి. 2.282.

మా. కయ్యమునకు కాలు దాచు.

కయ్యము పొడుచు

యుద్ధము చేయు.

"అధిప! నీ తనయుండు కయ్యంబు వొడుచు, తెంపు వదలక విభవంబు పెంపు మెఱసి." భీష్మ. 1.142.

మా. కయ్యము వొడుచు.

కయ్యము లిడు

కలహములు పెట్టు.

"...కయ్యంబు లిడ నెందు గతిగలుగునో యని, వెదకుచు..." కళా. 2.6.

కయ్యము వొడుచు

కలహించు, యుద్ధము చేయు.

రూ. కయ్యము పొడుచు.

కయ్యము సెల్లు

యుద్ధమగు.

"పిదప సెల్లు గయ్యము సెల్లెన్."

భార. కర్ణ. 2.215.

కయ్యము సేయు

యుద్ధము చేయు.

"కయ్యము సేయుట కప్పుడిమ్మగున్."

భార. విరా. 4.207.

కయ్యాలద్రచ్చు

జగడగొండి.

"కయ్యాలద్రచ్చులై కడఁగి యీవచ్చు, దయ్యాలముక్కులు దఱిఁగి ఖండింతు."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 1981.82.

పాండు. 4.210.

కయ్యాలమేకము

నక్క.

వావిళ్ళ.

కరకర

ధ్వన్యనుకరణము.

"వాడు కరకర నమిలి మ్రింగాలని చూస్తున్నాడు." వా.

కరకర ఆకలి అగు

బాగా ఆకలి వేయు.

"జబ్బుపడి లేచావు. కరకర ఆకలి అయ్యేదాకా యేమీ తినకు." వా.

"ఈ మందు నాలుగు రోజులు పడుకో బోయే ముందు వేసుకున్నా వంటే కరకరా ఆకలి వేస్తుంది." వా.

కరకర పడు

కోపపడు.

"పటు రోషమునన్, గరకరపడుచును సెదిరిన, ఖరకరవంశజుఁడు ద్రుంచె ఖరుని శిరంబున్."

మొల్ల. రామా. అర. 15.

కరకర ప్రొద్దు పొడుచు

అప్పుడప్పుడే సూర్యోదయమగు.

"పూర్వదిశయందుఁ గరకరఁ బ్రొద్దు పొడిచె." హర. 7.139.

"కరకర పొద్దు పొడిచే వేళకు మన మా ఊరు చేరుకుంటే, మనపను లన్నీ ముగించుకొని సాయంకాలానికి ఇల్లు చేర వచ్చు." వా.

కరకరించు

కొట్లాడు.

"మఱియొకఁడు వానిపైఁ గరకరించి."

పార్వ. 6.70.

కరకరి పుట్టు

ద్వేషము కలుగు. గుఱ్ఱు పుట్టు.

"కరకరి పుట్టఁగాఁ గలదు కాముని! నీ వలి చన్నుదోయికిన్."

శృం. నైష. 5.132.

కరకస

పగ.

బ్రౌను.

కరగి పోవు

నీ రగు.

"గానంబు వినిపింపఁ బూనెనా యా మహా, గిరిరాజ మైనను గరఁగిపోవు."

రాధ. పీఠి. 20.

కరగుపడు

క్షీణించు.

మను. 6.9.

కరగ్రహవంతురాలి చేయు

పెండ్లి చేయు.

"ఇంత నాఁడు కరగ్రహవంతురాలిఁ జేసి తోడ్కొని వచ్చితి."

నిరం. 2.58.

కరజంభలముగతి

సుస్పష్టముగా అని భావము. జంభల మనగా నిమ్మకాయ. అరచేతిలోని నిమ్మకాయ అన్నివైపులా కానవచ్చును. దానివలె అతిస్పష్ట మనుట.

ఈ అర్థంలో తఱుచుగా విన వచ్చే మాట కరతలామల కము.

"సచ్చిదానందసంపద చేతం గరజంభ లంబుగతిఁ గన్పట్టున్ ధరాధీశ..."

హంస. 1.51.

చూ. కరతలామలక మగు.

కరటకదమనకులు

ఎడబాయక ఉన్న వంచకులు.

"ఆ ఊరికి వాళ్లిద్దరూ కరటక దమ నకులు. ఏ వ్యవహారం వచ్చినా దాని వెనక వీళ్లు ఉన్నా రన్నమాటే."

వా.

కరడు కట్టిన మనసు

గట్టి మనసు; కఠినహృదయం.

"ఆ పిల్ల అంతగా ఏడ్చినా వాని కరడు గట్టినమనసు ఏమాత్రం కరగ లేదు."

వా.

కరణకమ్మలు

బ్రాహ్మణులలో ఒక జాతి.

కరణికము

చూ. కరణీకము.

కరణీకము

కరణపువృత్తి.

"వాళ్లకు ఆ ఊళ్లో కరణీకం ఉంది."

వా.

చూ. కరణికము.

కరతలామలక మగు

అతిస్పష్ట మగు. చేతిలోని ఉసిరికకాయవలె పూర్తిగా తెలియవచ్చునది అనుట.

"ఆ వీరుని యక్కజ మగు, లావు వెరవుఁ గరతలామలక మై తోఁచెన్."

భార. ద్రోణ. 3.154.

చూ. కరజంభలముగతి.

**కరతిత్తి**
చేతిసంచి; చర్మపుసంచి.
"ముష్టిఁ, బరసిన కరతిత్తి పత్రాల సంచి." గౌర. హరి. ఉ. 503.
"కావళ్ళఁ, గరతిత్తులను నుదకంబును గొనుచు."
పండితా. పర్వ. 354.

**కరదివ్వె**
కరదీపము; దివిటీ.
గౌర. హరి. పూ. 1856.
చూ. కరదీపిక.

**కరదీపిక**
దివిటీ.
చూ. కరదివ్వె.

**కరన్యాసం**
కొన్ని కర్మలలో చేతిలోని ఒక్కొక్క వ్రేలినీ తాకుతూ కొన్ని మంత్రాలు పఠించడం అలవాటు. దీనిని కరన్యాసం అంటారు. ఇది ఒక్కొక్క మంత్రానికి ఒక్కొక్క అక్షరక్రమంతో ఉంటుంది. ఇలాంటిదే అంగన్యాసం.

**కరపత్రము**
చీటి, ప్రకటనపత్రము.
ఇది హాండ్ బిల్, పాంఫ్లెట్ అను ఆంగ్లపదాల ద్వారా వచ్చినది.
"ఎన్నికలలో ఇరుపక్షాలవాళ్లూ కరపత్రాలు పంచి పెట్టారు." వా.

**కరపీడనము**
పాణిగ్రహణము; పెండ్లి.

**కరములు మొగుచు**
నమస్కరించు.
"అన్నకుఁ గరములు మొగిచి."
జైమి. 3.6.

**కరములు మోడ్చు**
నమస్కరించు.
"సమర్చనములు చేసి కరంబులు మోడ్చి తిరంబుగఁ గన్నని." రుక్మాం. 1.82.
పాండు. 2.155.

**కరవట్టు**
చేతిగుడ్డ; కరాటము.
"తడి యొత్తు కరవట్టు దడిసి యున్నదియొ."
పండితా. ప్రథ. పురా. పుట. 452.

**కరవట్నాలు**
అర్థము విచార్యము.
"కాంతల మాన మనేటి కరవట్నాలకు దిగె, మంతనాన జీవుఁ డనే మంచి మరకాఁడు." తాళ్ల. సం. 9.99.

**కరవాడి**
అధికతీక్ష్ణత.
"కరవాడి బిట్టెండఁ గాయుచుండ."
భీమ. 3.88.

**కరవాడిచూపులు**
అందమైన చూపులు.
కరవాడి ఒకరకమైన చేప. 'వాలుగ చూపులు' వంటి మాట యిది. చూపులను చేపలతో పోల్చుట పరిపాటి.
"ఔర! కరవాఁడి చూపుల యాఘకంబు." పాండు. 1.117.

**కరవు దీర**

తనివి తీర.

"కరవు తీరా చూశాడు." వా.

"కరవు తీరా మాట్లాడుకొన్నాము." వా.

**కరసాన పట్టు**

సాన పట్టు.

**కరామలకము**

కరతలామలకము; అతిస్పష్టము.

"సర్వము నీ కరామలక మై యుండుం గదా!" భాగ. స్క. 2.73.

చూ. కరతలామలకమగు.

**కరారావుడి చుట్టు**

సున్న చుట్టు.

ప్రకారవడి వాడుకలో కరారావుడిగా మారిపోయింది. ఆ వత్తు ఆకారసామ్యంతో యేర్పడిన పలుకుబడి.

"వాడు ఇస్తాను ఇస్తా నని ఆఖరికి కరారావుడి చుట్టాడు." వా.

**కరారావుడు**

ద్రావిడి.

తక్కువచూపుతో నిరసనగా అనుమాట.

బ్రాహ్మణులలో ఒక తెగ ద్రావిడులు. అందులో ఆరామద్రావిడులు, పేరూరు ద్రావిడులు ఇత్యాదిగా చాలా రకా లున్నవి.

"వాడు వట్టి కరారావుడు గాడు." వా.

**కరికరి పడు**

పగగొను; కోపపడు.

"పంకరుహాక్షుఁ, గరికరిపడి సూషించిన, నరు లేగుదు రుగ్ర మైననరకంబు నకున్." పద్మ. ఉత్త. 2.28.

చూ. కరకర పడు.

**కరికోత పెట్టు**

వేధించు, బాధించు.

"హరిమధ్య యెవ్వతె కరికోఁతఁ బెట్టునో, యదలించి మత్తేభయాన లార!" రాధి. 3.69.

**కరిజకాయ**

చూ. కజ్జకాయ.

**కరి మ్రింగిన వెలగపండు**

చడీ చప్పుడూ లేకుండా లోని సారం పోయినది.

"సిరి దాఁ బోయినఁ బోవును, కరి మ్రింగినవెలగపండుకరణిని సుమతీ!" సుమతి.

చూ. ఏనుగ తిన్న వెలగకాయ.

**కరుకు కరుక్కన**

న అనుకటలోని ధ్వన్యను కరణము.

"కరుకు కరుక్కన నటికి పట్టి." రాధి. 3.130.

**కరుడు కట్టిన....**

సారభూత మైన.

ఇది శ్రేష్ఠతను, ఉత్తమతను సూచించును.

"సాక్షాత్కరించిన శాంతరసంబు నాఁ, గరుడు గట్టినతపోగరిమ యనఁగ..." కళా. 3.13.

**కరుడు గట్టు**

గట్టిపడు.

"కలలమై విప్పవారుచుఁ గరుడుగట్టి.."
శకుం. 2.144

**కరుణ గలుగు**

కరుణ కలవాఁడగు.

"కరుణ గలిగి యునికి యిది యకారణము సుమీ." పారి. 1.

**కరువు గట్టు**

పోతపోయుటకై దిమ్మను తయారు చేయు.

"ఇరువురు సౌఖ్యరసముల గరువు గట్టి, పోసి చేసిన రూపుల పోల్కి నెరి."
నిర్వ. 8.70.

**కరువున పోయు**

పోత పోయు; విగ్రహముగా నొనరించు.

"...గరువునఁ బోసిన పరమసత్యంబునా, రాశియై యున్న వైరాగ్య మనఁగ..." కళా. 3.13.

**కరువులో అధికమాసము**

ఉన్న కష్టాలు చాలక మఱొక పెద్ద కష్టం వచ్చిన దనుట. కరువుకాలంలో అధికమాసం కూడా వస్తే మరొక నెల పెరిగినట్లుగా భావించి అనేమాట.

"కరువులో అధికమాస మని, ఇంట్లో బియ్యం లేక ఛస్తూంటే యిప్పుడే మా మామగారు సకుటుంబంగా వేంచేపు చేశారు." వా.

**కర్కటిగర్భము**

ఆత్మవినాశకము. ఎండ్రకాయ (పీత) పిల్లలను పెట్టి తాను చనిపోతుంది అని ప్రతీతి. తేళ్ల విషయంలో కూడా యిలాగే అంటారు.

"కర్కటిగర్భమట్లు నను గాసిలి వెట్టెడు..." బసవ. 1.97.

"కర్కటి గర్భము కరణి గాత్రము వచ్చె." భార. భీష్మ. 3.405.

**కర్కోటకుడు**

క్రూరుడు.

"వాడు వట్టి కర్కోటకుడు. వాని దగ్గరికి ఎవరు పోతారు !" వా.

**కర్తరిపాణి**

ఒక చేయిని మఱొక భుజం పైకి వచ్చునట్లు చేతులను కత్తెరవలె కట్టుకొనుట.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 514.

**కర్ణములు అదిమికొను**

చెవులు మూసుకొను... ఆ వినుమాట ఏదో విన రాని దనుటను ఈ చేష్ట సూచించును.

"చేతులఁ గర్ణంబు లదిమికొనుచు."
కాశీ. 7.239.

చూ. చెవులు మూసికొను.

**కర్ణశృంగఖ్యాతి గనుపట్టు**

ముందు వచ్చిన చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములు వాడి యనుమాట నిజ మగు.

"కర్ణశృంగఖ్యాతి గనుపట్టెనని..."
ఉత్త. 3.94.

**కర్ణాంజలి పుటము లొగ్గు**

చెవి యొగ్గు; మాటను శ్రద్ధగా విను.

"నిజమధుర వచన సుధాసారంబునకుఁ గర్ణాంజలి పుటంబు లొగ్గ నక్కంజ నయన యి ట్లనియె." శుక. 3.474.

చూ. చెవి యొగ్గు.

**కర్ణాకర్ణికగా**

గాలివార్తగా, జనశ్రుతిగా.

"అచ్చెలువ నెచ్చెలుల ముచ్చటలవలనఁ గర్ణాకర్ణిక నవ్వార్త మధురలాలస చెలి కత్తెలు విని." కళా. 7.237.

చూ. కర్ణాకర్ణిగా.

**కర్ణాకర్ణిగా**

జనశ్రుతిగా.

ఎవరో ఒకరికి చెప్తే, మరొకరికి వారు చెప్తే, అలా ప్రాకినట్టి వార్తల పట్ల ఉపయోగించే మాట.

"...తచ్చరిత్రములు నాచేఁ గ్రొత్తగా నేల కర్ణాకర్ణిం గథలందు మున్న వినమే నానాప్రకారంబులన్." ఉ. హరి. 5.296.

"కర్ణాకర్ణిన్ గథలందు మున్న వినమే." ఉత్త. హరి. 4.296.

"ఆ విషయం నేను కర్ణాకర్ణిగా విన్నాను." వా.

చూ. కర్ణాకర్ణికగా.

**కర్ణామృతముగా**

వీనుల విందుగా.

"విమలవాగ్భంగిఁ గర్ణామృతములు గాను." రుక్మా. 1.51.

**కర్ణుడు లేని భారతము**

అసలు సున్నా అయినది.

ముఖ్య మయినదే లోపించినది—అనుట.

"నీవే రాకపోతే నీ పెత్తనానికి మేం వెళ్ళడ మేమిటి? కర్ణుడు లేని భారతమా?" వా.

**కర్ణునితల భారతము**

దీని కంతా ప్రధానుడివి నువ్వే అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

కర్ణుని తలమీదనే భారతకథ అంతా నిలిచి ఉన్న దనుటపై యేర్పడినది.

"నువ్వే యిలా అంటే యెలాగు రా? కర్ణుని తల భారతం అన్నారు." వా.

**కర్ణేజపుడు**

చెవి కొరుకువాడు.

ఒకరిపై చాడీలు చెప్పేవాడు.

**కర్మ (ం) కాలి**

దురదృష్టవశాత్తూ.

"నా కర్మం కాలి వా డక్కడ కు వస్తే...ఇంక నా పని అయినట్టే." వా.

"వాడి కర్మ కాలి వీనిముందుకే ఆ కాగితం వెళ్ళాలా?" వా.

**కర్మ కాలిపోవగా**

విసుగు వేసటలను తెలిపే ఊతపదం.

"లంజముండలం, దుత్సుకతాభరమ్ము గొను టొప్పునె కర్మము కాలిపోవఁ గన్." పాణి. 4.45.

**కర్మచండాలుడు**

చండాలుడు కాకపోయినా పనులచే చండాలు డయిన వాడు.

"చక్కన ముచ్చట్లు జరపంగ నేల, యిక్కర్మచండాలు రెంతటివారు." బస. 7.183.

"వాడు జన్మతః పెద్ద వంశంవాడే. అయితే నేం కర్మచండాలుడు." వా.

**కర్మ చాలక**

దురదృష్టవశాత్తు.

"కర్మ చాలక అక్కడికి వెళ్లాను. అన్ని మాటలు తిన్నాను." వా.

**కఱకరి (టి) పెట్టు**

నిర్బంధపెట్టు.

"కఱకటి పెట్టి సొమ్ముడుగు." ఆము. 5.61.

**కఱకుట్లు, చంకలో పొత్తములు**

అంది పొందని నడవడి; కపట వర్తనము అనుపట్ల ఉపయోగించే సామ్యము.

మాంసపు ముక్కలనూ, పుస్తకాలనూ చంకలో పెట్టుకోవడం ఎలా కుదురుతుంది?

"...తగునే కఱకుట్లును జంకఁ బొత్తముల్." ఉ. హరి. 2.137.

**కఱకుమాటలు**

కఠినోక్తులు.

శృం. నైష. 7.93.

**కఱకు లాడు**

కఠినోక్తు లాడు.

**కఱకొను**

గట్టిపడు; నిలుచు.

"గుఱుకొని చేసినయఘములు, కఱకొని దృఢవజ్రలేపకం బగుఁ దరుణీ." పద్మ. 3.88.

**కఱగొఱ**

అఱుకొఱ; అవమానము.

"కడిందిగఁ జూడకు నీకు నేమియుం, గఱగొఱ గాదు." భార. ద్రోణ. 3.223.

"చాలమి దెచ్చుకొన్న నా, కఱగొఱ దీని గాక." కవి. 5.34.

**కఱతలయోగి**

పరమపదము నందుకొన్న యోగి.

కఱ – తీరము. (తమి)

ఆఖరుమెట్టు చేరినవా డనుట.

"కఱతలయోగిని కర్మ మంటునా!" తాళ్ల. సం. 7.211.

**కఱతలాడు**

ప్రాజ్ఞుడు నేర్పరి.

"ఉపనిషత్ప్రపంచంబు, గడదాఁక నెఱిఁగిన కఱతలానిఁ ...గాంచి." కాశీ. 2.160.

చూ. కఱతలయోగి.

**కఱదూపము**

పొయినుండి వచ్చే నల్లని పొగ.

'విరహపరితాప వేదన వేఁగుచున్న, చక్రవాకాంగనల కటాక్షముల యగ్గి, నావహిల్లిన కఱదూప మనఁగ నొప్పు, నుడుగణాధీశబింబంబు నడిమిమచ్చ." భీమ. 2.45.

**కఱపడు**

కొఱతపడు.

"యత్న మేమియున్, గఱపడకుండ." వేం. పంచ. 5.58.

**కఱ వగు**

లేకపోవు, అరుదగు.

"కఱవు గఱ వయ్యె." రుక్మాం. 1.136.

"వాని దర్శన మే ఇటీవల కఱ వయిపోయిం దమ్మా! ఏం చేస్తాం? పెద్దవాడయ్యాడు." వా.

**కఱవవచ్చు**

1. కసురుకొను.

"వాణ్ణి పలకరిస్తే కఱవ వస్తాడు." వా.

2. మీఁదికి వచ్చు. నా. మా. 39.

**కఱవు**

అరుదు, అపురూపము.

కఱ వేర్పడినప్పుడు ఆహార ధాన్యాదులు కఱ వగును. తద్ద్వారా వచ్చిన పలుకుబడి.

"కలియుగంబున ధర్మంబు కఱవుగాన." భీమ. 5.152.

"ఈ ఊళ్ళో ఇంగువకే కఱవా? ఎక్కడికి వెళ్ళి అడిగానో ఏమో? లేదంటూ వచ్చావు." వా.

**కఱవునకు తోడు అవ పంట కలిగినట్లు**

బాధలో మఱింత బాధ కలిగినట్లు.

కఱవు మూలంగా కడుపు మండిపోతుండగా అవాలు పండినా, అవి కాచి తాగితే మరింత మంట యెక్కువవుతుందే కాని తగ్గదు. నిప్పునకు గాలి తోడైనట్లు అనుట వంటిది.

"పరుసైన యెండ మెండున, నరవర లైహాయి లేక యలజడి పడఁగా, సురగాలి యేచెఁ బ్రజలం, గఱవుకుఁదో డావపంట గలిగినకరణిన్." శుక. 1.101.

**కఱవున పడినట్టు**

దొరికిందే చాలు నని ఎగబడి.

కరువో కాలమో అని వాడుక. అన్నం కనిపించగానే వాడు కరువో కాలమో అని తినడం మొదలు పెట్టినాడు ఇత్యాది మాటలలో వినవస్తుంది.

"తెచ్చుకొని యిచ్చలోపలి హెచ్చు కోర్కె, లెన్ని గల వన్నియును దీఱ నెనసి చతుర, రతుల కఱవునఁ బడినట్టు లతుల సౌఖ్య, వారినిధిఁ దేలుచుండిరి..." శుక. 2.344.

**కఱవో కాలమో అని**

దొరికిందే తడవుగా దాని ననుభవించుటకై ఎగబడి.

"ఆ ఊళ్ళోకి నిమ్మకాయలు రాగానే కఱవో కాలమో అని అమ్మలక్కలంతా చుట్టుకున్నారు." వా.

**కఱిగొను**

మాడిపో జేసికొను.

పాడు చేసికొను అనుట.

"ఈ మట్టికుండల, నిచ్చ వండి పెట్ట మెచ్చు రాదు, వంటఁ జేసి మొదలి వంట నే కఱి గొన్న, దానఁ దొలుత వంట దగుట యెట్లు." సింహా. 2.30.

కఱుదుల పూప

నేర్పరి.

నేర్పు లన్న అర్థంలో కఱుదులు చాల చోట్ల కాన వస్తుంది.

"కఱుదులపూప వై మునులు గానని యట్టి కతల్ వచింపఁగా..." కళా. 6.183.

కఱుదులాడు

నేర్పరి.

"కఱుదులాఁ డగుచక్రి కపటంపు టను వునఁ, దను మోసపుచ్చిన." హరి. ఉత్త. 7.30.

క్రియగా నేర్పులు పల్కు అని అర్థ మిస్తుంది.

కఱ్ఱతేనె

వెదురు తేనె.

"తిన్నఁ డిచ్చిన కఱ్ఱ తేనియఁ ద్రావునే." రుక్మాం. 3.231.

కఱ్ఱపెత్తనము

పని యేమీ చేయకుండా అజమాయిషీ చేస్తున్నట్టు—అటూ ఇటూ తిరుగుతూ, అదిలిస్తూ నటించుట.

"వా డేం పని చేస్తాడు. కఱ్ఱపెత్తనం చేస్తాడు. అంతే." వా.

కలకంఠము

మనోహర మైన కంఠస్వరము.

"వాడు కలకంఠం విప్పితే పాములు నాట్యం చేస్తా యనుకో." వా.

కలకండ(ము)

పటిక బెల్లము.

"కలకండ పానకం చేసి తాగితే నీ వేడంతా క్షణంలో పోతుంది." వా.

కలక దేఱు

నిర్మల మగు, తేఱు.

"ఏఱులందుఁ గలకఁ దేఱఁ దొడఁగఁ." కుమా. 6.115.

కలకపడు

కలతపడు.

కలకపాటు

చూ. కలతపాటు.

కలకబారు

కలత చెందు.

"కాంచి తల వంచి సిగ్గుచేఁ గలఁక బారు." రాధి. 1.107.

కలకబాఱు

కలత చెందు, ఎఱ్ఱవడు.

"కలకంబాఱి మఱంది చెల్లెలి నుదగ్ర క్రోధుఁ డై పట్టి." భాగ. 10. పూ. 44.

కలకల (నవ్వు)

ధ్వన్యనుకరణము.

"తాఁ గల కల నవ్వుచున్న పరిఖావల యంబువిధంబుఁ జూచితే." కళా. 5.109.

కలకలము

సద్దు, సందడి, జనసమ్మర్దం.

"కలకలంబులకు డగ్గఱిక హర్మ్యాగ్ర, తలముల పైనుండి దర్శించువారు." బస. 2.26.

కలకల లాడుతూ

ఎంతో సంతోషంగా; సుంద రంగా.

"పిల్లా జెల్లాతో ఆ యిల్లు కల కల లాడుతూ ఉంటుంది." వా.

కలకలు తేర్చు

కలత పోగొట్టు.

"తాఁకియుం దలఁచెడు వారు లే రని మనంబుగలంకలు దేర్చి." పారి. 2.52.

కలకాలము

ఎల్లప్పుడు.

"ఈ పని కలకాలం నిలిచేది గనుక నిన్నింతగా పురికొల్పుతున్నాను. ఈ పాఠశాల ఎలాగో నీవే కట్టించాలి." వా.

కలగంప

కలగూరగంప.

కలగంప కడుపు

సంతానసమృద్ధి కలది.

"వారి కలగంప కడుపుల నేరుపరుల, నరిదిబిడ్డలఁ బడసినబిరుదుసతుల." భాగ. 10.255.

కలగంప వలపు

అమ్మజూపు వలపు; విలువ లేని ప్రేమ అనుట.

"కలగంప వల పాయె కాదా మాఁకీ." తాళ్ల. సం. 3.620.

కల గన్నయట్టులు

అస్పష్టముగా.

"ఎలమిం దద్రాజకన్య నేలాగ నన్, కలఁ గన్నయట్టు లాకనాఁ, డలనోకం జూచి మన్మథాజ్ఞావశుఁ డై." శుక. 1.544.

కలగబడు

కలతపడు; ఛిన్నాభిన్న మగు.

"సాత్యకి కో, త్తల కోర్వక నీ బలము గలంగంబడియెన్." భార. ద్రో. 4.5.

"శరసుల వేగంబున గద, పరుసఁ దనంబునను గలఁగఁబడి చేద్పడ నా, కరులం దోలెను భీముఁడు..." భార. భీష్మ. 2.215.

కలగబాఱు

క్షోభపడు; చెల్లాచెద రగు; కలత చెందు.

"......ధారణీపాల సభలఁ, గలఁగఁ బాఱక సుకవులు మెలఁగు టెట్లు." చంద్రా. 1.16.

"కలఁగం బాఱి తొలంగె వారణ బలౌఘంబుల్." హరి. 8.272.

"శాంతి సంపద నొకయంతయుక్ గలఁగఁ బాఱక యుండెఁ డె నిర్వి కారుఁ డై." భార. శాం. 6.202.

కలగలుపు చేయు

కలుపు.

"వీరి వారిఁ గలగలుపు చేయున న్నన వలయుఁ గాక." రాధికా. 3.45.

కలగల్పు

1. కలిసి మెలసి పోవుట.

"కలగల్పుచూపుల, రాకపోకల బయల్ ప్రాకఁజేయు." పాండు. 3.62.

2. కలుసుకూర.

ఇ దీనాడు కలుసుకూర అన్న

పేరనే దక్షిణాంధ్రంలో విశే
షంగా వినవస్తుంది. ఏవో
కూరగాయల ముక్కలతో
పప్పు కలిపి చేసిన పొడి
కూర.

"ఒక కొన్ని కలగల్పు లొక కొన్ని బజ్జులు." పాండు. 4.184.

3. కల్తీ పదార్థం.

"ఇదంతా కలగలుపు నెయ్యిగా ఉంది. వడ్డించకండి." వా.

చూ. కలగలుపు చేయు.

## కలగాపులగం

గందరగోళము; నానా
సంకీర్ణము.

"ఇందులో పద్యాలూ, పాటలూ అన్నీ కలగాపులగంగా ఉన్నాయి."

"పప్పు లన్నీ కలగాపులగంగా కలిసి పోయాయి. ఏర్పరించాలి." వా.

## కలగుండు గొను

కలత చెందు.

భార. ద్రో. 1.293.

## కలగుండు చేయు

కలత పఱుచు.

"భీకరవనీకిటి యొక్కటి పక్కణంబులో, మదమునఁ జొచ్చి యందుఁ గల మానవులన్ గలగుండు చేయుచున్." చెన్న. 2.77.

## కలగుండు వడు

కలత చెందు.

"కలగుండువడి హల్లకల్లోల మై చాలఁ గలఁగె వాహినులు." జైమి. 2.33.

"కలగుండు వడ రొప్పి గవినుండి తప్పించు, పులి గుండె లవియంగఁ బొడిచె నొకఁడు." శుక. 1.263.

"గుప్పునఁగూర చొచ్చెఁ గలగుండు వడె న్మది యింక నెట్లొకో!" రాధా. 2.21.

## కలగుండు వెట్టు

కలత పెట్టు.

"కురుసైన్యంబులఁ గలగుండు వెట్టు." భార. భీష్మ. 3.64.

## కలగూర

నానావిధము లైన ఆకు
కూరలు.

"కూలికి నూనె లంటి కలగూరల కై పొల మెల్లఁ జుట్టి." శుక. 2.363.

## కలగూరగంప

అన్నీ కలిసి ఉన్నది.

"ఇదంతా కలగూరగంపగా ఉంది. కావ్యమో, నాటకమో, నవలో చెప్ప డానికి వీల్లేదు." వా.

## కలగూరగంప చేయు

సంకర మొనర్చు.

"శాస్త్రసాహిత్యములు మాకె చాల జీత, మంచుఁ గలగూరగంప సేయ కుము..." బహు. 1.110.

## కలగొన బాఱు

కలత చెందు.

"కలగొనఁ బాఱుచున్ సతులు కన్నుల నశ్రుజలంబు లొల్కన్." భార. శల్య. 2.19.

## కలగొను

కలత చెందు.

"కలవిహంగమంబులు గలగొన నఱచు తెఱఁగు దోఁచె." భార. సౌప్తి. 2.6.

**కలచి యాడు**

సంక్షోభింప చేయు.

**కల నిక్కల యగు**

కల నిజ మగు.

"కలయు నిక్కల మైన కరణి వట్రిల్లె."

పండితా. ద్వితీ. మహి. పుట. 62.

**కలని నక్క**

ఎప్పుడు ఎవరు పోతారా, ఎవరికి ఆపద వస్తుందా, మనం దాన్ని స్వార్థానికి ఉపయోగించుకుందామా అని ఎదురు చూచేవాడు.

"కలనిన క్కనయధికారి గలనృపతికి, నేడుదీవులు గొన్న సమృద్ధి లేదు."

ఆము. 4.237.

నేటి వాడుకరూపం :

గుంతకాడి (కడ) నక్క.

గుంతకాడి నక్క అంటే శ్మశానంలో నక్క. అదెప్పుడూ ఎప్పుడు పీనుగ వస్తుందా అని ఉంటుంది. 'కలనినక్క' యుద్ధభూమిలోది. అది ఎప్పుడు ఎవరు యుద్ధం చేస్తారా అని కాచుకొని ఉంటుంది.

"వాడు గుంతకాడి నక్కలా కాచుకొని ఉంటాడు. వానిమాట నమ్మి అన్నదమ్ములు కాట్లాడకండి." వా.

**కలను చెప్పు**

యుద్ధము జరుగు నని, యుద్ధానికి రావలసిన దని చెప్పు. నేడు వాడుకలో 'భోజనానికి చెప్పడం' ఇత్యాదుల వంటిదే ఇది.

"హిమవంతంబు నుత్తరంబునం, గలను చెప్పి." కుమా. 10.177.

"కలను చెప్పి మొనలఁ దీర్చి కదిసిన సమయంబున." దశ. 2.10.

"తద్రాజడింభకుల యెదురఁ బలికి కలను చెప్పి రమ్మని వీడుకొల్పిన."

ఉ. హరి. 4.170.

చూ. యుద్ధము చెప్పు.

**కల నైన**

ఎన్నడూ అలా జరగదు అను సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

వాస్తవంలోనే కాదు భావనలో కూడా అనుట.

"కలలోన నైన నవ్వుల కైన నా మాట జవదాట వెఱచునో చంద్రవదన."

పారి. 1.

వాడుకలో రూపం: కలలో నైనా; కలలో కూడా.

"కలలో నైనా అతను అబద్ధ మాడడని గట్టిగా చెప్పగలను." వా.

"అతను కలలో కూడా ఒకరికి చెడుగు తలపెట్టేవాడు కాదు." వా.

చూ. కలలో నైన; కలలో కూడ.

**కలపనగంప**

అభూతకల్పనలు చేయువాడు.

"కలపనగంప యీతపసి కాలును నోరును బాదు గాన కె, వ్వలనఁ బరిభ్రమించుచు..."

హరివం. పూ. 5,110.

**కలపనపిండి యగు**

అతలకుతల మగు, క్షోభపడు.

"కలసెదఁ బతి నతఁ డిచ్చుట, మెలఁగుట మా తండ్రి విన్న మే లగునే ప్రేవులలోన సురియఁ ద్రిప్పిన, కలపనఁ బిండైనఁ జెలిమికత్తెలు నగరే."
ఉ. హ. 5.163.

ఇందులో పాఠం 'కలపనపిండైన'=యుక్తి, కాయ అయిన అనగా చెడిపోయిన అని అర్థం చెప్పి - వావిళ్ల ని. పాఠాంతరం ద్వారా అర్థం సాధించింది.

శ. ర. లో 'కలపనఁబిండి'= అని ఉన్నది. సూ.ని. కూడా అంతే. పాఠం తెలితే కానీ ఏమీ నిర్ధారణగా చెప్ప లేము.

**కలబడు**

చేతులు కలుపు; కొట్లాడు.

"ఇరువాగు జగడమునఁ గలబడియెన్."
చంద్రా. 6.74.

"మాటా మాటా వచ్చి వాడు వీడితో కలబడ్డాడు." వా.

**కలయంపి చల్లు**

ఇంటి ముంగిట పేడ కలిపిన నీళ్లను చల్లు.

"కస్తురి కలయంపులు చల్లి."
యయా. 4.152.

చూ. కళ్ళాపు చల్లు.

**కలయబడు**

కలబడు.

"కలయఁబడి పోరఁ దొడఁగిరి..."
భాస్క. రా. యు. 755.

ఇందుకు దగ్గరగా ఉన్న కలిసిపోవు, అన్యోన్యం తాకు వగైరా చ్ఛాయలలోనూ ఇది ప్రయుక్తం.

చూ. కలబడు.

**కల యర్థము**

ఉన్న సంగతి.

"ఏమనఁ గలదానఁ గలయర్థముఁ దెల్పుమటన్న..."
శుక. 1.320.

చూ. కలరూపు.

**కలలో కలిమి**

అస్థిరము.

సుమతి. 102.

**కలలో కూడ**

బొత్తిగా అనుట.

"కలలోన నైన నవ్వుల కైన నా మాట జవదాట వెఱచు నో చంద్రవదన."
పారి. 1.94.

"వా డిట్లా చేస్తా డని కలలో కూడా అనుకో లేదు." వా.

సామాన్యంగా కలల్లో జరిగే సంఘటనలకు మన ఇష్టానిష్టాలతో నిమిత్తం ఉండదు. అటువంటప్పుడు కూడా అనుట.

చూ. కల నైన.

**కలలోని కాన్పు**

అసంభవము.

కలలోని వన్నె ఆయింతసేపే.

అవి యథార్థం కావు అనుటపై వచ్చినది.

"అది కలలోని కాను పయి యాంటిక యానతి మున్నె కలి..." హరి. ఉత్త. 7.174.

చూ. కలలోని వార్త.

## కలలోని వార్త

అసంభవము.

"మించు ననబోడిచందంబు మేలు కనిన, వాడు తలపోయు గలలోని వార్త యయ్యె." పాండు. 4.238.

చూ. కలలోని కాన్పు.

## కలలో నైనా

కలలో కూడా, ఎన్నడూ, బొత్తిగా అలాంటిది లేదనుట.

చూ. కలలో కూడ.

## కలలో లేని

అసంభవ మైన.

చూ. ఇలలో లేని.

## కలవంటకము

రకరకాల వంటలు.

రకరకాల పదార్థాలు కలిపి చేసినవంటలు.

"పెడిమాలాలి వేవిళ్ళ వాయు దోట కలిమిచెలిపెట్టు కలవంటకంబు లనగ." యయా. 4.9.

## కలవరపడు

కలతపడు; కంగారుపడు

"అప్పులవాడే వచ్చాడేమో అని నీవు తలుపు తట్టగానే కలవరపడ్డాను." వా.

## కలవాడు

ధనవంతుడు; ఉన్నవాడు.

"ఆరకూటకలాప మర్హమే కలవాని కిని." శృం. నైష. 4.68. కాశీ. 3.47.

"పేరు గలవాడు కలవాడు పెద్ద వాడు." హంస. 1.57.

2. అయినవాడు, ఆప్తుడు.

"శాంతనవుండు సర్వకురుసంతతికిం గలవాడు కాడె." భార. ఉద్యో. 2.165.

## కలవు (వలపు)

కలవాడవు.

"నాతోడి వలపు గల వేని." బస. 3.49.

## కలశము లెత్తు

ప్రకటనము చేయు.

తాళ్ల. సం. 4.133.

## కలసికట్టుగ

ఒకమాట మీద, ఏకీభావముతో.

"కలసికట్టుగ నుండము గాక యున్న, జాలుకదన మగు జుమ్ము..." వేంకటే. 3.216.

"వారంతా ఏమైనా చాలా కలసి కట్టుగా పనిచేస్తారు. అందువల్లే పనులూ సానుకూల మవుతవి." వా.

## కలసి మెలసి

అన్యోన్యముగా.

"ఒండొంటిం గలసి మెలసి విలసిల్లు తులసియు." విప్ర. 2.25.

"ఆ యిద్దరు అన్నదమ్ములూ ఎప్పుడూ కలసి మెలసి ఉంటారు." వా.

రూ. కలిసి మెలిసి.

## కలహమునకు కాలు ద్రవ్వు

జగడమున కీడ్చు.

"స్వర్గ మర్త్యవధూటుల చక్కఁదనము, తుచ్ఛ మని నాగకన్యలతోడి కలహ,మునకుఁ గాల్ ద్రవ్వెదవో లేక బొటనవ్రేలఁ, బుడమి వ్రాసెద విది యేల పువ్వుఁబోడి!"

దశా. కూర్మ. 82.

చూ. కయ్యమునకు కాలు ద్రవ్వు.

**కలహమె కల్యాణముగ నెంచు**

కలహశీలు డగు.

"పలుదెఱఁగు ముళ్ళమాటలఁ, గలహమె కల్యాణ మని జగంబులవెంటన్..."

పారి. 1.85.

**కలాపస పొసగు**

కల్లోలము రేగు.

కాశీయా. 371.

**కలికమున కైన....**

ఏ మాత్ర మూ.

బొత్తిగా దొరకదు అనుపట్ల ఉపయోగిస్తారు.

ఏ మిరియాల గింజ వంటి దానినో నూరి కండ్లకు కలికం వేస్తారు. ఆ కలికానికి ఏ ఆవం తైనా చాలు. దానికి కూడా లేదనుట.

"ఆ ఊళ్లో మజ్జిగ కలికానికైనా దొరకదు." వా.

"వాడిదగ్గర తెలివితేటలు కలికానికి కూడా లేవు." వా.

**కలికితురాయి**

శిరోవేష్టనముపై రాజులు మొదలగువారు చెక్కుకొను తురాయి.

"కలికితురాయి మెఱయ."

వేం. మా. 1.134.

**కలిగినంతలో**

ఉన్నంతలో.

"కలిగినయంతలో సుఖముగా."

పాణి. 4.18.

"కలిగినంతలో అతనూ తన కుటుంబం హాయిగా ఉంటున్నారు." వా.

**కలిగినది**

ఏదుంటే అది.

"ఉప్పో ఊరగాయో మా యింట్లో కలిగింది లేదనకుండా పెడతాము. తిని పోతూండు నాయనా!" వా.

**కలిగినప్పుడు**

సంపద ఉన్నప్పుడు.

"కలిగినప్పు డెల్లఁ జెలువుని చెంగట, నడఁగి మడఁగి యుండు టరిది గాదు."

శుక. 2.866.

చూ. ఉన్నవాడు, కలవాడు.

**కలిగిన యంత చెప్పు**

ఉన్న దంతా, సర్వమూ చెప్పు.

"కలిగిన యంతయు, నిక్కముగఁ జెప్పు డనుటయు వారల్."

కళా. 6.161.

**కలిగినవాడు**

సంపన్నుడు.

పాండు. 2.71.

**కలి ద్రచ్చి వెన్న గొనగల**

అసాధ్యకార్యములను నెఱవేర్చగల – జాణ అనుటలో నిరసనగా అనుమాట.

జొన్న-బియ్యం కడిగిన నీళ్లను చిలికి వెన్న తీయగలగడం అసాధ్యం కదా.

చూ. కలి ద్రచ్చి వెన్న దీయు.

**కలిని ద్రచ్చి వెన్న దీయు**

అసాధ్యకార్యము చేయు.

"...కలియుఁ ద్రచ్చి వెన్న గొనఁగఁ, గడవ నేర్పు గలిగి కందువు మానెఁ దై, కత్తిగొంటు లయినయత్తగంతు."
కుమార. 8.135.

చూ. కలి ద్రచ్చి వెన్న గొనగల.

**కలి, నూనె కలిసినట్లు**

వేరువేరుగా ఉండు.

కడుగునీళ్ళలో నూనె కలిసి పోయినట్లు,

పూర్తిగా కలవక వేరు వేరుగానే ఉండుదు రనుపట్ల ఉపయోగించే సామ్యం.

"కలియు నూనెయు రెండుఁ గలిసిన యట్లు."
పండితా. ప్రథ. పురా. పుట. 3.48.

**కలి పోసిన వెనుక ఉట్టి కను గొనుమాడ్కి**

కావలసిన దేదో అయి పోయిన తరువాత అందుకై విచారించి లాభ మేమి అను పట్ల ఉపయోగించే పలుకుబడి.

"కలవె యిఁక నేటి యాసలు, కలి బోసిన వెనుక నుట్టి కనుఁగొను మాడ్కిన్." రాధి. 3.

చూ. కలి పోసినవెనుక ఉట్లు కను గొనుట.

**కలి పోసిన వెనుక ఉట్లు కను గొనుట**

నిష్ప్రయోజనము.

కుండలోని కలి అంతా పోసిన తరువాత, ఇంక ఉట్టి మీద చూపు లెందుకు అనుట.

"అలయింపఁ గలంతయును న, న్నలయించితి చాలు మందరాద్రికిఁ జని య, మ్మలహరుఁ గొలిచెద నేలా, కలి పోసిన వెనుక నుట్లు గనుఁగొనఁగ నృపా!" రుక్మాం. 4.75.

**కలిమిదండుగ**

ధనికులతో రాజులు వసూలు చేయుదండుగ.

"తెల్లబట్టలఁ గట్టి తిరుగులాడెడివారి బిగియించి కలిమిదండుగలు పెట్టి."
పార్వ. 2.94.

**కలి మెడు చల్లితే తూమెడు పండే....**

తక్కువ పండునట్టి.

విత్తనాలకంటే పంట తక్కువగునట్టి అనుట.

కాశీయా. 115.

**కలివిడి**

1. కలుపుగోలుతనము కల.

"కలివిడిమాటలఁ బ్రియముల, నలయింపక యావులందు నాదరణమునన్."
రుక్మాం. 3.64.

"ఆ అమ్మాయి చాలా కలివిడిగా మాట్లాడుతుంది." వా.

2. తెలివివచ్చి; స్పృహకలిగి.

"......కలివిడి వడి నాఁ, దలయంటి

పాంచుకొని యే, నిలు వెడలితి నాతు
ణంబ యొత్తినఖీతిఁ.''
పాండు. 5.207.

## కలియగలపు

కలవేసుకొను.

## కలి వెన్న బుచ్చ నేర్చు

జొన్నలో బియ్యమో కడిగిన నీళ్ళను కలి అంటారు. కలిలో వెన్న తీయగల జాణ.

అసాధ్యకార్యములను చేయగల దనుటలో వచ్చిన నిరసన సూచక మైనపలుకుబడి.

పండితా. ప్రథ. పురా. పుట. 359.

చూ. కలి ద్రచ్చి వెన్న దీయు.

## కలిసి మెలిసి

ఒకటిగా, అన్యోన్యంగా.

''కపట మెఱుఁగనిమమతలఁ గలసి మెలసి.'' పారి. 1.94.

''వా రెంతో కలిసి మెలిసి ఉంటారు.'' వా.

రూ. కలసి మెలసి.

## కలిసి వచ్చు

అన్నీ సమకూరి వచ్చు.

మన ప్రయత్నానికి తోడు దైవబలం కలిసి వచ్చింది అనే అర్థంలో ఉపయోగించే మాట.

''వాడు ఆవ్యాపారం అభివృద్ధి చేయడానికి ఎన్నోవిధాల ప్రయత్నం చేసిన మాట వాస్తవమే. అయితే అంతకంటే యెక్కువ పెట్టినవాళ్లూ ఉన్నారు. వాళ్లు అంతంత మాత్రం లోనే ఉండగా వీ డేమో పైకి ఎక్కిపోతూనే ఉన్నాడు. కలిసివచ్చింది గనక.'' వా.

''ఏదైనా కలిసి రావాలి. తొందర పడితే లాభం యే ముంది?'' వా.

''పాపం అహోరాత్రస్యం కష్టపడ్డాడు. కానీ కలిసి రాలేదు. ఏం చేస్తాడు?'' వా.

రూ. కలసి వచ్చు.

## కలిసివచ్చే రోజులు

అదృష్టకాలము.

''కలిసివచ్చేరోజులు కనక వా డేం చేసినా లాభంగానే ఉంది.'' వా.

## కలుకోడి

రాత్రికోడి.

నీటికోడి వంటి మాట.

ఒరయూరులో రాత్రికోడి కూస్తుం దనీ, కలుపోన్న పూస్తుం దనీ ప్రతీతి.

దీని విశిష్ట తేమిటో తెలియుట లేదు.

కలుకోడిధ్వని వినాశసూచక మని వ్రాశారు కాని అది యిక్కడ కుదరదు.

''కలుపొన్న విరులఁ బెరుఁగఁ, గలుకోడిరవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగఁ.'' కుమా. 1.5.

## కలుగజేసికొను

జోక్యము కల్పించుకొను.

''నే నిందులో కలుగజేసుకో దలచుకో లేదు.'' వా.

**కలుగు బెట్టు**

కొద్దికొద్దిగా ఖర్చు పెట్టు.
బొక్క పెట్టు.

"తులసిపోగులు మొదలుగాఁ గలుగు బెట్టి." నిరం. 2.116.

**కలుగోట త్రోవలు**

తప్పుదారి నడిచేవారు కావచ్చును.
దూషణలో ప్రయుక్తం.

"కులహీను లధములు గులజు లుత్తములు, దొలఁగనికలుగోటత్రోవలు."
పండితా. ప్రథ. పురా. పుట. 345.

**కలుచపడు**

కలత చెందు.

**కలుపుగోలుతనము**

నలుగురితో కలిసి మెలిసి ఉండునేర్పు.

"ఆ అమ్మాయి చాలా కలుపుగోలుతనంగా ఉంటుంది." వా.

**కలో అంబలో**

ఏదో యింత – కడుపు నించుకొనుటకు – అనే సందర్భంలో ఉపయోగిస్తారు.

"ఏదో రాక రాక వచ్చావు. మాకు కలిగింది యేదో కలో అంబలో తీసుకొని వెడితే మాకు సంతోషం." వా.

**కలో గంజో**

చూ. కలో అంబలో.

**కల్లగుట్టు**

తెచ్చికోలు ధైర్యము.
తన సత్తా సారం తెలియనీయకుండా మెలగుట.

"దద్విరహదశావికలిత ధైర్యం డయ్యు, నుల్లంబునం గల్లగుట్టు నెట్టుకొలిపి." కళా. 5.20.
ఆము. 2.58.

'లేని ధైర్యం తెచ్చుకొని' వంటి పలుకుబడుల వంటిది.

**కల్ల గుల్ల**

లొట్టు.
ఒంటి. శత. 17.

**కల్లనిజములు**

సత్యాసత్యములు.

"వేగిరించక నీవ భావించుకొమ్ము, కల్లనిజములు క్రమమునఁ గానవచ్చు."
కళా. 8.195.

**కల్ల పెనుపులు పెనచు**

దొంగలెక్కలు వేసి అప్పు మొత్తమును అధికము చేయు.

"పెట్టవచ్చిన కల్లపెనుపులు పెనఁచి."
గా. హరి. ద్వితీ. పంక్తి. 481.

**కల్లబొల్లికబురులు**

మాయమాటలు.

**కల్లబొల్లిమాటలు**

మాయమాటలు.

**కల్లలు పెనచు**

అబద్ధాలు సృష్టించు.

"కైలాటములఁ జేసి కల్లలు పెనచి."
ద్విప. కల్యా. 129.

కల్ల వచ్చు

కీడు కలుగు.

"...ఘనులఁ, గదిసినప్పుడ మీకుఁ గల్ల వచ్చు." 3.161.

కల్ల వాపు

నొప్పి గాని, కుఱుపు గాని లేక కనిపించే వాపు.

అలా వచ్చినవాపు దానంతట దే తగ్గిపోతూ ఉంటుంది.

కల్ల సేయు

మోసము చేయు.

"మాయకాఁ డేతెంచి మనలను గల్ల, సేయుచున్నాఁ డెర సేయక వీనిఁ, దెగ టార్పు."

గౌర. హరి. ప్ర. 1853.55.

కల్లాకపటములు లేని

అమాయక మైన, నిర్మల మైన.

"వా డేమాత్రం కల్లాకపటం లేని వాడు." వా.

కల్లుపాక

కల్లంగడి.

కల్లుపూసిన యద్దమువలె

మసక మసకగా.

"చందనంబు గలయ సఖి బల్మి పూసిన, పాలఁతి వదనలీల పాలిచె దెరలు,వుచ్చి బెరయఁ గల్లు పూసినయద్దంబు, భంగి వోలె నిజవిభాతి దఱఁకి."

కుమా. 9.64.

కల్లుపెంట

కల్లంగడి.

కల్లువడు

శిలాకృతి తాల్చు, నిశ్చేష్టు డగు.

"బసుమంబు సల్ల గుండె జల్లు మని కల్లు వడి..." మను. 5.19.

కల్పతరువు కింద గచ్చుచెట్టున్నట్లు

సత్పురుషుని దగ్గర చెడ్డవారు ఉన్నా రనుటవంటి సందర్భాలలో ఉపయోగించే పలుకుబడి.

వేమన. 57.

కల్పవృక్షము

అన్ని కోరికలను తీర్చువాడు. కల్పవృక్షము వంటివా డనుటకు కల్పవృక్షము అని వ్యవహారం.

"సంసార మర్త్యారిజనమనస్సంతాప, కార్పణ్యము లడంపఁ గల్పశాఖి."

శుక. 1.366.

వీని పర్యాయపదాలను కూడా ఈ అర్థంలో ప్రయోగిస్తారు: కల్పతరువు, కల్పలత, కల్పశాఖ ఇత్యాదులు.

చూ. చింతామణి, కామధేనువు.

కల్వడగలు

వీరధ్వజములు.

"సితలోచనద్యుతుల్ సెదరి దిక్కుల యందుఁ, బొలయుకల్వడగల పోలుపు గాఁగ." కుమా. 12.205.

**కవకవ నవ్వు**

కిలకిల నవ్వు.

ధ్వన్యనుకరణము.
క్రీడా. పు. 69.

"కవకవ నవ్వరే త్రిదశకాంతలు వింతలు సేయు నా పనిన్."
ఉ. హరి. 1.80.

చూ. కహాకహ నవ్వు.

**కవ గూడు**

జత గూడు, సంగమించు.

"ఎడ లేక కవ గూడి యే ప్రొద్దు రతి సల్పు." హంస. 3.205.

**కవగూర్చు**

జత చేయు.

"విధి దిట్టు నినుం గవ గూర్ప లేమి కిన్." శ్రీరాధా. 3.147.

**కవడు వాయు**

బాధానివర్తి యగు.

"ఇవల శ్రీ వెంకటేశుఁ డింతలో దిక్కయి కాచె, కవడు వాసె జీవుఁడు కన్నవారిచేతను." తాళ్ల. సం. 8.64.

**కవలుకొను**

తప్పిపోవు.

వేదపఠనంలో పొరబాట్లు వచ్చు.

"కమలజుని వేదపఠనంబు కవలు కొనియె." విక్ర. 4.51.

**కవలువోవు**

తప్పిపోవు.

"పాఠ మొనరించుతతిఁ బోడుపడు గురు నకుఁ, గవలు వోకుండఁ బుత్రుఁ డో కలువకంటి." పాండు. 2.19.

చూ. కవలుకొను.

**కవిలసంచి**

పాత పుస్తకాల కట్ట లుంచుకొనే సంచి; తూకం రాళ్లు వగైరా లుంచుకునే సంచి.

చూ. కయిలకట్ట.

**కవిలెకట్ట**

పాత కాగితాలకట్ట; జాబితా.

**కవిలె కెక్కు**

జాబితాలోనికి చేరు. (వారి) శ్రేణిలో చేరు.

"ఖ్యాతిగాఁ బ్రమథుల కవిలియ కెక్కెఁ బో తనూజుం డని పొంగుచు."
పండితా. ప్రథ. పురా. పుట. 471.

రూ. కవిలియ కెక్కు.

**కవిలె పట్టు**

లెక్కలు అవీ వ్రాసిన పాత కాగితాల కట్ట.

"అని పల్కి చిత్రగుప్తుం, డనుపమముగఁ గవిలెపట్టుటాకులు గేలం, గొని..."
సానం. 2.59.

**కవుగిట నోలలార్చు**

కౌగిట దేల్చు.

"చెక్కిలి నొక్కి చుంబనము చేసి కవుంగిట నోలలార్చి." కళా. 7.162.

**కవుకున**

తటాలున.

ధ్వన్యనుకరణము.

"అనుచుఁ గవుకునఁ బట్టరా దరయ వలయు." శుక. 2.249.

**కశ్చన్నగాళ్లు**

ఊరూ పేరూ లేనివారు.

సంస్కృతంలో యః కశ్చన

అంటే ఫలానా అని కూడా చెప్పడానికి వీలుపడని యెవడో ఒకడు అని అర్థం. అదే వైదికుల మాటలలో కశ్శనగాళ్లుగా మారింది.

కశ్చిత్కాంతా కాచిత్కాంతా అను
మాట పూర్తి కాక ముందే అనవసరంగా వాదానికి దిగు.

మేఘదూతంలోని మొదటి శ్లోకం 'కశ్చిత్కాంతా' అని గురువు ఆరంభించగానే శిష్యుడు 'కశ్చిత్కాంతా ఎలా ఉవుతుంది. కాచిత్కాంతా కావాలి గదా' అన్నాడన్న కథపై యేర్పడినది. కశ్చిత్ అన్నది కాంతా అన్నదానికి విశేషణం కాదు అన్న సంగతి ఒక పాదం పూర్తి వింటే చాలు. తెలిసి పోయేదే. ఆ ఓపిక కూడా లేక వాదానికి దిగాడన్నది కథ.

"నేను చెప్పేది పూర్తిగా వినవయ్యా స్వామీ! కశ్చిత్కాంతా కాచిత్కాంతా అని ప్రారంభంలోనే తగులుకొంటే యెలా?" వా.

కష్టపడు
శ్రమించు, బాధపడు.

"వైరులచే నేను గష్టపడితి." భార. భీష్మ. 3.137.

కష్టపాటు
చెఱుపు, బాధ.

"వ్రజనాథుఁ, డపుడు చేసిన కష్టపాట బ్జనాభ, యిపుడు తలపునఁ బాటిన హృదయమునను, నధికతర మైనపరితాప మావహిల్లు." ప్రభా. 1.73.

చూ. కష్టపుపాటు.

కష్టపుచావు
దుర్మరణము.

"కౌరవవంశజాతుఁడవు గష్టపుఁ జచ్చుట దెచ్చుకొంటి నీ, పేరును బెంపు మాలి." భార. శల్య. 2.55.

కష్టపుపాటు
"కౌరవకోటిచేత మన కష్టపుఁ బాటు దలంపు వచ్చినన్." భార. ఉద్యో. 4.90.

చూ. కష్టపాటు.

కష్టముపాటు
"ఎంతయుఁ గష్టముపాటు వచ్చినన్." భార. ఉద్యో. 2.129.

చూ. కష్టపాటు.

కసకోల
చెలకోల, ఎద్దులను తోలు కొరడా వంటిది.

"పృథుజవాశ్వములు వేదములు, పగ్గములు చతుస్స్వరములు, ప్రణవంబు గసగోల, బ్రహ్మ సూతుఁడు..." కుమా. 2.25.

కసపిస
ధ్వన్యనుకరణము.

"కసపిస నములు." వా.

కస బెస (నూఱు)
ధ్వన్యనుకరణము.

కలియునట్లుగా.

నవ. 5.

చూ. కసపిస.

## కసమస

త్వొందర, తొ్రటుపాటు.

## కసరికొట్టు

కసరుకొను; చీదరించుకొను.

"కసరికొట్ట నొకింత విసువఁ డయ్యె."

పాణి. 3.32.

## కసరుకాయ

పచ్చికాయ.

"రస రసాన్నములను మెసవెడువాఁడు, కసరుగాయలఁ బ్రొద్దు గడపుచున్నాఁడు."

గంగ. రామా. అయో. 137.

## కసరుకొను

చూ. కసరికొట్టు.

## కసరు చూపు

కోపించు.

"పసుల గోడలు నాన్పి వసుధ పైఁ గూల్పని, ముసురు వానలమీఁదఁ గసరుఁ జూపు."

శుక. 2.505.

## కసరెత్తు

విజృంభించు, ఉప్పొంగు.

"మబ్బునఁ గసరెత్తి యుబ్బి యంతం తవ."

కా. మా. 4.60.

## కసవు కట్టెలు నీళ్లు మోయించు

నానాచాకిరీ చేయించు.

"నీలశైలాబ్జములు బ్రోల నిలిచినపుడె, కసవు కట్టెలు నీళ్లనుఁ గడఁగి మోయఁ, జేసె నే మనవచ్చు." హంస. 2.186.

శ్లేషలో ఈ భావము స్ఫురించుటే కవి ఉద్దేశము.

"కులగోత్రములవారి నిలిపి కట్టెలు నీళ్లు, మోయించుచుండెడు ములుచఁదనము."

హంస. 2.236.

## కసవు గట్ర

చెత్తా చెదారం.

జం.

"...పసిండినాగటం గసవు గట్రం జిక్కకుండం బెక్కుచాళ్లు దున్ని ములకవిత్తులు వెదపెట్టువిధంబున."

బసవ. 7.334.

## కసవు గఱచు

గడ్డి కఱచు.

చూ. పూరి గఱచు.
గడ్డి కఱచు.

## కసవు నూకు

కసవు తుడుచు, ఊడ్చు. రాయలసీమలో నేటికీ వాడుకలో ఉన్న పలుకుబడి.

"శ్వసనుండు నట మున్న కసవులు నూక." పండితా. పర్వ. ద్వితీ. పు 464.

"ఇల్లు కసవు నూకవే ఇంకైనా. పాడ్దెక్కి పోయింది." వా.

## కసికాటు

1. అపరిణతానుభవము. పరిపూర్తిగా అనుభవించనిది. పైపై కాటు అని వాచ్యార్థము. దీనికి వ్యతిరేకమయినదే నమిలి మ్రింగుట.

"మోసపోయితిఁ గసికాటు ముచ్చటలసె..."

ప్రబంధ. 7.50.

పాండు. 3.72.

2. దంతక్షతము.
"కామిని నీదుమోవి కసుగాటుల చెక్కుల గోటినొక్కులన్."
సురా. 128.

### కసిగాటుగా
కొద్దిగా.
"అగ్గలం బయినచింత వలసి యొల్లమి నతండు, సాగటులను బోయి కసిగాటులుగ భుజించి." విజయ. 3.4.
"కొంత గొంత కసిగాటులుగా భుజియించి." శృం. శాకుం. 2.167.

### కసిగాటులు సేయు
చిఱుకొఱుకులు కొఱుకు.
"తేనియల్, చిలికెడు మోవి పల్మొనలచేఁ గసిగాటులు సేసి పీనులన్..."
రాజగో. 4.25.

### కసిడికోత
పోరు; అంపపుకోత.
పోరి పోరి బాధపెట్టుట అని భావార్థము.
"కసిడికోఁతకు నోర్చిలో వినిగికొనక ధాత మూరక తండ్రిసేఁతకు వగవక."
పాండు. 4.145.
"కసిండికోత వలదా మీకున్ విచారింపఁగన్." వరా. 5.93.
"అటువంటి మగనితోడఁ, గాఁపురము సేయు సతి దొడ్డగరిత యగుచుఁ, గసిఁడికోఁతల నోర్చి." పాండు. 4.157.
చూ. కసినికోతలు.

### కసిదీఱ
1. ఆశ తీరా; మనసార.
భావాతిరేకము తీరునట్లుగా.
"వా, తెఱమొన పంటికొద్ది కసిదీఱఁ జుఱుకన నొక్కినొక్కి యీ, కరణిఁ బరస్పరంబు..."
హంస. 2.52.
2. పగ తీరా.
"కసి తీరా చెంపమీద తీసికొట్టాడు."
వా.

### కసినికోతలు
ఇంటిలోవారి పోరు.
"ఇంటివారల కసినికోఁ తెల్ల నుడిపి."
శుక. 3.297.
చూ. కసిడికోత.

### కసిబిసి యగు
నలిగిపోవు.
ధ్వన్యనుకరణము.
"ముసలంబుల మోదులఁ గసిబిసి యగువారును."
భాస్క. రామా. యుద్ధ. 14.32.

### కసివోని వలపు
తనివి తీరనివలపు.
కామపరమావధి ఇక్కడి కసి.
"ఎంతయుఁ గసివోని వలపు హెచ్చిన కతనన్." శుక. 1.301.

### కసుకందకుండు
వాడకుండు.
"పార్వతీ చరణ పుష్కరము లధినాశ్మ ఘట్టనం,బునఁ గసుగంద కుండ...." కా. మా. 1.99.
చూ. కసుగాయ.

### కసుగంద నిచ్చు
కందునట్లు చేయు.
"సతి నిట్లు ... కసుగంద నీక."
రాధి. 1,62.

## కసుగందు

1. పసిపాప.

"కావు కా వంచు నేర్పుల్ దలిర్పఁగ
గసుంగంద వై." పారి. 3.38.

"ఈ కసుగందును కట్టుకొని నే నేం
చేయగలను?" వా.

2. క్రియగా వాడిపోవు అనే
అర్థంలో ఇది ప్రయుక్త మై
కనబడుతుంది.

"కసుగందినబాహులతతో." ఉత్త. 4.221.

## కసుగందులు కందు

బాగా వాడిపోవు.

"కసుగందులు గందినవవ, కుసుమలతిక
వోలె మిగులఁ గోమలి యొప్పెన్." కళా. 4.106.

## కసుగాయ

పచ్చికాయ.

## కసుమాలము దేవు

కశ్మలమును చేతులతో తీసి
వేయు.

"దేవా! యీ కసుమాలము, దేవెదు
కేల్దోయి నీదుదేహం బంటన్..." కా. మా. 3.97.

## కసురుకొను

కోపించు.

"వాడి దగ్గిరికి పోతే అనవసరంగా
కసురుకొంటాడు." వా.

## కసువు గట్రా

గడ్డిగాదము. జం.
బస. 3.65.

## కస్తిపడు

ఇబ్బందిపడు.

"మానసికవ్యథల్ రుజలు మాన్పఁగ
నోపినపుణ్యరాశి గం, గానదిఁ జేరి
యుండియును గస్తిపడం దగు నయ్య." ఉత్త. రామా. 6.251.

## కస్తి పెట్టు

కస్తీ పెట్టు, నిర్బంధించు.

"చిత్తంబు వచ్చినచో మానుదు గాని
నిన్నిపుడు కస్తిం బెట్ట నా కేటికిన్." కా. మా. 3.72.

"రూకలకు నిండా కస్తీ పెడు
తున్నాడు. అంత కస్తీ చేస్తే ఎట్లా?" వా.

## కస్తీ చేయు

డబ్బు మొదలయిన వాని
కోసమై నిర్బంధించు.

"ఈ నెల లోనే బాకీ ఫైసలు చేయ
మని వాడు చాలా కస్తీ చేస్తున్నాడు." వా.

## కస్తీపఱుచు

నిర్బంధించు.

"కామమోహిత యగునింతిఁ గస్తి
పఱుప, ననుజుఁ బురికొల్పి తిది నీకుఁ
జనునె రామ!" శృం. నైష. 8.130.

దీనికి దుఃఖ పెట్టు అని
వావిళ్లలో చూపినఅర్థం సరి
కాదు.

చూ. కస్తీ చేయు.

## కహకహ నవ్వు

ధ్వన్యనుకరణము.

"కహ కహ నవ్వి దంష్ట్రికలఁ గల్ల
మెఱుంగులు భానుదీప్తిసం, గ్రహముఁ
దిరస్కరింప..." కాశీ. 7.29.

## కళపట్టు

చూ. కళవట్టు.

**కళపెళ**

ధ్వన్యనుకరణము.

"కళపెళ నుడుకు చక్కని గూని యలు." నీలా. 3.161.

"అన్నం కళపెళా ఉడుకుతున్నది." వా.

**కళ లంటు**

కళాస్థానములను తాకు.

స్త్రీ శరీరములో కామో ద్రేకము కలిగించు స్థలములు కొన్ని కలవని కామశా స్త్రము.

వాని నంటు—అని అర్థం

"ఎలమిఁ గళ లంటి యాలరించి యల వరించి." శుక. 1.299.

"కళ లంటి కరఁచి తన చెయ్యాలఁ జొక్కెడు తపసి మది చివుక్కురు మనఁగా..." కళా. 3.52.

**కళల గరగించు**

రతిపారవశ్యము గలిగించు.

"కళలఁ గరఁగించి సంధించి కౌఁగి లించి." హంస. 3.102.

చూ. కళ లంటు.

**కళవట్టు**

మూర్ఛపడు.

"కళవట్టిన భీముఁడు, దెలిసెన్ హరి కరుణ." దశా. 9.160.

**కళవళపడు**

కలవరము చెందు, కలత చెందు.

"ఆత్మలోనఁ గళవళపడుచున్." జైమి. 6.151.

"తెలియ శోధింపక కళవళపడ రా దటంచు నవ్విటుని నేపారఁ బిలిచి." సానం. 5.14.

**కళవళపాటు**

కలత.

"కళవళపాటుతోఁ జెలిమికత్తెల మూలుచు." నీలా. 3.14.

"ఏం జరిగిం దనిరాళ్ అన్నిటికీ అంత కళవళపాటయితే ఎట్లాళ్?" వా.

**కళవళ మగు**

కలతపడు.

"...గునుల మనంబుల్, గళవళ మగ్యాం దదీయగర్వోద్ధతికిన్." నృసిం. 4.139.

**కళ్ల జూచు**

1. సంపాదించు.

మూపాయల విషయంలోనే ఈ ధ్యాయ కానవస్తుంది.

"నెలకు వెయ్యిదాకా కళ్ల జూస్తు న్నాడు." కొత్త. 262.

2. చూచు.

"నా కొడుకును ఎప్పుడు కళ్ల జూస్తానో ఏమో ళ్?" వా.

**కళ్లతుడుపు మాటలు**

చూ. కళ్లనీళ్లు తుడుచుమాటలు.

**కళ్లనీళ్లపర్యంత మగు**

దాదాపు ఏడుపు వచ్చు పరిస్థితి ఏర్పడు.

"నే నామాట అనేసరికి వాడికి కళ్లనీళ్ల పర్యంతం అయింది." వా.

**కళ్లప్పగించి**

దిగాలుపడి, దిగ్భ్రాంతు డై.

"ఏమిటలా కళ్ళప్పగించి చూస్తా వేం ళ్?" వా.

**కళ్లలో కారం చల్లు**
మోసగించు.
చూ. కళ్లలో దుమ్ము కొట్టు.

**కళ్లలో కారం పోసుకొను**
అసూయపడు.
కొత్త. 185.

**కళ్లలో దుమ్ము కొట్టు**
మోసము చేయు.
"నా కళ్లలో దుమ్ము కొట్టాలని మాత్రం ఎప్పుడూ ప్రయత్నం చేయవద్దు. నే నలా టోపీ పడేవాణ్ణి కాను." వా.
చూ. కళ్లలో కారం చల్లు.

**కళ్లు తిరుగు**
1. పైత్యోద్రేకముతో తన చుట్టూ ఉన్న వన్నీ తిరుగు తున్నట్లుగా కనిపించు.
"పైత్యం చేసిందో యేమో! కళ్లు తిరుగుతున్నాయి." వా.
2. పొగ రెక్కు.
"ఏం కళ్ళు తిరుగుతున్నాయా? నోటి కొచ్చిందల్లా అంటున్నావు." వా.

**కళ్లు తెఱచు**
జరుగుతున్న విషయము తెలుసుకొను.
"ఇది యెన్నాళ్లనుంచో జరుగుతున్నా వా డిప్పుడే కళ్ళు తెరిచాడు." వా.

**కళ్లు దించుక పోవు**
కను లీడ్చుకొని పోవు.
"ఎన్నాళ్ళయిందేమిటి అన్నం తిని? కళ్ళు దించుకుపొయ్యా యేం?" వా.

**కళ్లు నిప్పులు క్రక్కు**
క్రోధోద్దీపితు డగు.
"వాడి కళ్లు నిప్పులు కక్కుతున్నాయి." వా.

**కళ్లు నెత్తికి వచ్చు**
పొగ రెక్కు.
"వాడికి నాలుగురాళ్లు చేరగానే కళ్లు నెత్తికి వచ్చాయి." వా.

**కళ్లు పచ్చలు గ్రమ్ము**
తల దిరిగిపోవు; కళ్లు తిరుగు.
"పొద్దున్నించీ అన్నం తినక పోయే సరికి కళ్ళు పచ్చలు కమ్మినవి." వా.

**కళ్లు పొరలు కమ్ము**
పొగ రెక్కు.
"వాడి కీమధ్య కళ్లు పొరలు కమ్మినవి. మనమాట యెందుకు వింటాడు?" వా.

**కళ్లు మూసుకొని ఉండు**
కాసంత ఓపిక పట్టి ఉండు.
"ఈ ఒక్క రోజూ కాస్త కళ్లు మూసుకొని ఉండవే. మనఊరు వెళ్లాక నీ యిష్టం వచ్చినంత గోల చేద్దువుగాని." వా.

**కళ్లు లేని కబోది**
గుడ్డివాడు, గుడ్డిది.
"కళ్లు లేని కబోదిని తల్లీ! కాస్త కబళం వేయండి." వా.

**కాంక్ష చను**
కోరిక తీరు; ఆశ తీరు.
"కావ్యములు పెక్కు సెప్పి యుం గాంక్ష సనక." భీమ. 1.17.

**కాంతాళపడు**
1. బెంగపడు.
"తాళవృంతానిలోత్తాల వేదన కోడి తాళక మిగులం గాంతాళపడుచు," చంద్రా. 4.275.

2. కోపపడు.
"పిల్లలమీాద అంత కాంతాళపడితే ఎలా ?" వా.

కాందారి మాందారి ప్రొద్దు
అర్ధరాత్రి.
కానిదారి మానిదారి ప్రొద్దు అనుటపై యేర్పడినది. అంటే దారి తెలియని వేళ, చెట్టేదో గుట్టేదో కూడా తెలియని చీకటిసమయం అని అర్థం.
"పూని కాందారి మాందారి ప్రొద్దు కడను, సెందు పోయెదు తలిదండ్రు లెవ్వ రనిన." యయా. 2.
చూ. కాదారి మాదారి ప్రొద్దు.

కాందారి మాందారి వేళ
అర్ధరాత్రి.
"శివశివా కాశీపతీ యంచు...కాందారి మాందారి వేళను ధన్యు ల్విహరిం తురు." మల్లవె. 85.
చూ. కాందారి మాందారి ప్రొద్దు.

కాకః కాకః, పికః పికః
సమయం వచ్చినప్పుడు చేసి నిజరూపు దానిదే అను పట్ల ఉపయోగించే పలుకుబడి.
'వసంతకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః' అను శ్లోకభాగంలోని భావము.
కాకీ, కోయిలా చూడ్డానికి నల్లగా ఒక విధంగానే ఉన్నా వసంతం రాగానే కోయిల కూస్తుంది. కాకి అరుస్తుంది. అప్పుడు అవి ఏ జాతికి చెంది నవో స్పష్టంగా తెలిసి పోవును అని అర్థం.
"ఆ కామిని యటు నే నిటు, కాకః కాకః పికః పిక యటన్నవిధం బై, ...కవఁ బాయఁగ వలసె..." రాధా. 2.20.

కాకతాళీయముగా
ఆనుషంగికముగా, యాదృచ్ఛికసంఘటనగా.
కాకి తాటిచెట్టుమీాద కూర్చో వడం, తాటిపండు కింద రాలడం ఒకేసారి జరిగినా — కాకి కూర్చున్నందువల్ల తాటి పండు పడ లేదు. అది కేవలం ఆనుషంగికం అనుటపై వచ్చిన పలుకుబడి.
"నేను పనిమీాద ఆ ఊరు వెళ్లాను. అత నెక్కడికో పోతూ కాకతాళీయంగా తటస్థపడ్డాడు." వా.

కాకదంతపరీక్ష
పనికిరాని పరిశీలన.
'కాకస్య కతివా దంతాః మేషస్యాండం కియత్ పలం' అన్న చాటువుపై ఏర్పడినది. కాకికి ఎన్ని పండ్లున్నవి ? మొదలయినవి అనవసర ప్రశ్నలు గదా.
"వాని నే మడిగె దెవ్వఁడు గాక నీ కేమి, యిది కాకదంతపరీక్ష సుమ్ము." కళా. 3.272.

**కాకదేఱు**

తప్తమగు; ఆరితేరు.

"నిగమఘోటలలాటనేత్రానలజ్వాలఁ గాఁక దేఱిన కాముకాండమునుఁ."

కవిరా. 3.110.

**కాకపక్షం**

పిల్లజుట్టు.

**కాకపడు**

కోపపడు.

"ఎందుకయ్యా! అంత కాక పడుతున్నావ్?"

క్రొత్త. 25.

**కాకమ్మ కథ**

పిట్టకథ.

ప్రామాణికమైనది కాదనుట.

"ఈ కాకమ్మ కథల కేమి లే. గట్టి నిదర్శన మేదైనా ఉంటే చెప్పు." వా.

**కాకమ్మ సువ్వమ్మ కథలు**

పిట్టకథలు

వాస్తవిక మయినవి కావు

అన్న భావం ఇందులో

ఇమిడి ఉంది.

"ఈ కాకమ్మ సువ్వమ్మ కథల కేమి లే." వా.

**కాకరకాయరీతిగా గగుర్పొడుచు**

ముళ్లుముళ్లు లేచి ఒడలంతా

గగుర్పాటు కలుగు.

కాకరకాయపై ముళ్లు

తేలినందుపై వచ్చిన పలుకు

బడి.

"ఓ రసికశిఖావతంస! యదురత్నమ! కాకరకాయరీతిగాఁ, గిసలయపాణి చన్నుఁగవ క్రేవ గగుర్పొడిచెం బొరింబొరిన్."

ప్రభా. 4.75.

**కాకరపువ్వొవత్తి**

ఒక విధమైన బాణసంచా.

చూ. కాకరవత్తి.

**కాకరవత్తి**

బాణసంచాలో ఒకవిధం.

"పిల్లలకు కాకర వత్తులు తెస్తే పోతుంది. పెద్దవైతే ప్రమాదం."

వా.

**కాకరిచేతలు**

చిల్లరచేష్టలు.

"ఈ కాకరిచేఁతలకు లోకము వారు నగరా!" తాళ్ల. సం. 12.341.

**కాకఱపులు**

1. కారుకూతలు, వ్యర్థప్రలాపాలు.

"లేకులు లోకుల కాకఱపులకు, చాకిచాకని యేల సందడించెదవు."

బస. 4.89.

2. వట్టి బెదిరింపులు.

"ఈ కాకఱపులకు భయపడి పారిపోయేవా రెవరూ లేరు." వా.

**కాకలు పుట్టు**

ద్వేష మేర్పడు; కోపతాపాలు పొడము.

"అతులు... కాకలు పుట్టుఁ బిదప."

విజయ. 1.44.

**కాక వడు**

తప్తమగు.

"కర్బశేషణ వహ్నికణముల చేతఁ,
గసుబంతములు పెక్కు కాఁక వడఁగ."
గంధ. 20.

కాకి ఎంగిలి

పైపై ఎంగిలి.
పిల్లలు వాడే మాట. ఎవరైనా తింటున్నది అడిగితే కాకెంగిలి చేశామంటూ బట్టపైన వేసి కొరికి ఇస్తారు. అది ఎంగిలికింద లెక్క కాదు.
"కాకెంగిలి చేసి ఇవ్వరా కాస్త." వా.
చూ. చిలుకకొట్టుడు.

కాకికి మెతుకు విదిలించని

అతిలోభి అయిన.
"వాడు కాకికి మెతుకు విదిలించనిరకం. వానిదగ్గరికి పోతే విరాళం ఇస్తాడా?" వా.

కాకికూడు

పిండం.
కాకులకు కర్మలలో, తద్దినాలలో పిండాలను వేస్తారు. అందుపై వచ్చినది.
"ఈ కాకికూడెవరి క్కావాలే? నేనే అడుక్కునైనా తింటా కాని నీవు విదిలించి వేసిన మెతుకుల కాశిస్తానా?"
వా.

కాకిగోల

విపరీతమైన గోల.
కాకులు పది చేరితే విపరీతంగా గోల చేస్తాయి. అందుపై యేర్పడినది.
"కాసేపు శాంతంగా చదువుకుందాం అంటే యిదేమిట్రా యీ కాకిగోల?"
వా.

కాకిచావు

నీచపుచావు; దిక్కులేని చావు.
"అన్నాళ్లు అంతగా బతికి కడకు వాడు కాకిచావు చచ్చాడు." వా.

కాకిచిప్ప

శంబూకం.
నీటిగుల్ల.
యయా. 3.29.

కాకిచెఱకు

ఒక రకమైన గడ్డి.

కాకితీపు

ఒక విధమైన మూర్ఛరోగం.
శ. ర.
చూ. కాకిసొమ్మ.

కాకితెలుపు

అసంభవము.
'తెల్లని కాకులును లేవు' అన్న ప్రథపై యేర్పడినది.
రాధి. 4.79.

కాకిదొండ

ఒక రకమైన దొండ.

కాకినలుపు

కారునలుపు.
"ఆ పిల్ల వట్టి కాకినలుపు. దాని నెవరు చేసుకుంటారు?" వా.

కాకిపగ

తీరని పగ.
కాకి పగపడితే ఒకసారైనా

కాళ్ళతో తన్నిపోతుం దన్న ప్రతీతిపై ఏర్పడినది.
"వాడిది ఒట్టి కాకిపగ. కాటికి పోయినా వదలడు." వా.

కాకిపెసర
ఒక రకమైన పెసర.
దీనినే పిల్లపెసర అంటారు.

కాకిబంగారం
పసుపుపచ్చని అభ్రకం.
"బంగారం కాకపోతే కాకిబంగారం వేసుకోవచ్చు లేవోయ్ బావా!" వా.

కాకిబేగడ
అభ్రకం.
"నెల్లూరుజిల్లాలో కాకిబేగడ చాలా దొరుకుతుంది." వా.
"వేషాల కిరీటాలకు కాస్త కాకిబేగడ అంటిస్తే దీపాలవెలుగులో ధగ ధగ లాడుతాయి." వా.

కాకిబ్రతుకు
నీచపు బ్రతుకు.
కాకి, యెంగిలి తిని బతుకుతుం దనుటపై వచ్చిన పలుకుబడి.
"వాడిది వట్టి కాకి బ్రతుకు. అలా బతకడంకంటే చావడం మేలు కదా." వా.

కాకిముక్కుకు దొండపండు
అననురూప మైనది.
"ఆ పిల్లను ఆ ముసలాడి కివ్వడం కాకి ముక్కుకు దొండపండును కట్టినట్టు." వా.
చూ. కాకిముక్కు పగడం.

కాకిముక్కు పగడం
అననురూప మైనది.
కాకి ముక్కు నల్లగా ఉండడం, పగడం ఎఱ్ఱగా ఉండడంపై వచ్చినపలుకు బడి.
"అంత అంద మైనపిల్లను ఆ అనాకారి కెధవకు ఇచ్చారు. అది కాకిముక్కు పగడం అయిపోయింది." వా.
చూ. కాకిముక్కుకు దొండ పండు.

కాకి ముట్టిన కుండ
చెడిపోయినది; మైల పడినది.
"ఆ పిల్ల ఏదో యెప్పుడో చేసిం దని వాళ్లంతా ఆవిడని కాకి ముట్టిన కుండ లాగా చూస్తున్నారు." వా.

కాకిమూక
అల్లరిమూక.
"వాళ్ళ దంతా వట్టి కాకి మూక. వాళ్ళల్లో పడితే అయినట్టే." వా.

కాకివ్రాతల వలె
కోడిగీతలవలె కలగాపుల గంగా అటూ ఇటూ గీసిన అర్థరహిత మైన గీతలవలె.
"తిలకంబు నిడుబొట్టు దిరుమన్ను భూతి వలదెఁ వారికెఁ గాకివ్రాఁతలపగిది."
పండితా. ప్రథ. వాద. పుట. 645.

కాకిసంగీతం
కర్ణకఠోర మైన అరపు.
ఇది కాకిగోలవంటి మాట.
"అఁ. వాడి దేం సంగీతం, కాకి సంగీతం." వా.
చూ. కాకిగోల.

కాకిసొమ్మ
మూర్ఛరోగం.
చూ. కాకిసోమాలు.

**కాకిసోమాలు**

మూర్ఛరోగం.

"ఆ పిల్లకు కాకిసోమాలు ఉందిట. ఎలా చేసుకుంటాం." వా.

చూ. కాకిసొమ్మ.

**....కాకుండా చేయు**

సరిపడకుండ చేయు.

"ఆ పిల్ల వచ్చి మాకూ వాడికీ కాకుండా చేసింది." వా.

**....కాకుండా పోవు**

సరిపడక పోవు; ద్వేష మేర్పడు.

"ఆ వ్యాజ్యం వచ్చినప్పటినుంచీ వాళ్లకూ మాకూ కాకుండా పోయింది." వా.

"ఈ పిల్లను చేసుకున్న నాటినుంచీ మా మేనమామకూ మాకూ కాకుండా పోయింది." వా.

**కాకు చేయు**

చూ. కాకు సేయు.

**కాకులకు గాని ముసిడి పండిన నేమి, యెండిన నేమి?**

పనికి రానిది ఏమయితే నేమి?

ముష్టి పండు విషం. ఏ పక్షులు తినుటకూ పనికి రాదు.

"అందుఁ బోతవు కాకులకుఁ గాని ముసిఁడి, పండిన నెండిన ఫల మేమి కోరి!" పారం. 1.649.

**కాకులతెఱగున చను**

చెల్లాచెదరుగా పారిపోవు.

ఉష్ అంటే కాకులు దిక్కు-కొకటిగ పారిపోతాయి.

"అడవుల పాలై, కాకుల తెఱఁగునఁ జని రేకాకు లగుచు." కా. మా. 4.104.

**కాకులను కొట్టి గద్దలకు వేయు**

ఒకరిని పీడించి మరొకరికి సాయపడు.

"వారి భూమి తీసి వీరికి పంచిపెడితే ఏం చేసినట్టు? కాకులను గొట్టి గద్దలకు వేయడమే గా?" వా.

**కాకులబడి**

గంపరగోళము.

కాకులను బడిలాగా చేరిస్తే ఒకే గోలగా ఉంటుంది కదా.

"అదంతా కాకులబడిగా ఉంది." వా.

చూ. కాకిగోల.

**కాకులు దూరని కారడవి**

కీకారణ్యము.

కాకులు దూరని కారడవీ, చీమలు దూరని చిట్టడవీ అంటూ జానపదకథల్లో విపరీతంగా వినవస్తుంది.

"ఆ రాజకుమారిని కాకులు దూరని కారడవిలో వదిలేశారు." వా.

**కాకులు పొడిచినట్లు**

మనిషి కొకమాట అని వేధించుపట్ల అంటారు.

"ఆ పిల్ల అమ్మగారింటినుంచీ ఏమీ తేలేదని అత్తారింటివారంతా కాకులు పొడిచినట్లు పొడిచారట." వా.

**కాకు సేయు**

1. చీకాకు పఱుచు.

"కాదంబనికురుంబకలిత యై ప్రవహించు, కాళింది గర్వంబుఁ గాకు సేసి." మను. 3.19.

2. బాధించు.

"కగ్గు లేనివారి నేల కాకు సేసె నిపుడు." తాళ్ల. సం. 3.110.

3. వ్యర్థపుచ్చు.

"అతఁడు జమునిలావుఁ, జేవయును బొల్లుగాఁ గాకుఁజేసి విడిచె." హరి. పూ. 4.155.

"ఒక టిచ్చి తోన వేఱొకటి గోరినయట్టి కానీనుగర్వంబుఁ గాకు చేసి." చంద్రాం. 1.21.

4. అవమానించు.

"కలికి పైఁ బడి తద్దఁ గరఁగించు నిన్నుఁ, గాకున్న నెన్నైనఁ గల్లలు గూర్చి, కాకు సేయును రాజుగారితోఁ జెప్పి." ద్వి. తి. సా.

5. మాట తీసివేయు, తిరస్కరించు.

"నిను వేఁడుకార్యముఁ గాకు చేయక చేయుమీ." మైరా. 1.72.

"గంధర్వసౌఖ్యంబు కాకు సేయఁడు గదా." రుక్మాం. 5.55.

చూ. కాకుచేయు.

## కాగలకార్యము గంధర్వులు తీర్తురు

మనం చేయవలసిన పని దానంతట దే మరొకరితో నెఱవేరుతుంది.

భారతంలో గంధర్వులు దుర్యోధనుని బంధించినప్పుడు పాండవమధ్యములను మాటపై వచ్చినది.

"వానిసంగ తేదో ఆ రెడ్డిగారే చూచేట్టున్నారు. మన మేం చేయ నక్కర లేదు. కాగలపని గంధర్వులే తీరుస్తారు." వా.

## కాగి చల్లారిన పాలభంగి

శాంతపడినట్లు; పొంగు చల్లారిన—అనుట.

"నందనుఁ డొప్పుగఁ గ్రాఁగి చల్లనా,రి వెలయు పాలభంగి నొకరీతిని వచ్చెడు దన్క." పాణి. 4.104.

## కాచి పోయు

వంట చేసి పెట్టు.

ముఖ్యంగా గంజి కాచి పోయుటపై యేర్పడిన పలుకుబడి.

"ఎంత ముసలివాడైనా కాచి పోసే దిక్కు లేక మళ్లీపెళ్లి చేసుకుంటానంటున్నాడు." వా.

"ఎంతుంటే నేం? వేళ కింత కాచి పోసేదిక్కు లేక అతను నానాబాధా పడుతున్నాడు." వా.

## కాచి విడుచు

చంపక వదలిపెట్టు.

"దయఁ గాచి విడిచె." విజయ. 1.58.

## కా చేసుకొను

ముగించు.

కాశీయా. 272.

"ఆ పని కాస్తా కాచేసుకొని గానీ నేను ఊరికి వెళ్ల దలచుకో లేదు." వా.

## కాజేయు

1. ముగించు.

"వారి, కింత విష మిడి కాఁ జేసి యెల్ల వేళ." దేవీ. 11.114.

2. అపహరించు.

"వదినగారి ఆస్తి కాస్తా వీడు కాజే శాడు." వా.

3. కలిగించు.

"ఎక్కి తలంచిన నీ రూప మైన, గ్రక్కున నవ్వాడు కాఁజేయుగిరులు." బస. 3. ఆ.

**కాట గలియు**

నశించు.

కాడు = స్మశానము; అడవి.

"కటకటా! యెట్లు తన బుద్ధి కాటఁ గలియ, నిసువుఁ జంపంగ నెంచెనో నీ మగండు." హరవి. 2.99.

**కాటాకట్టు**

తూనికకు అమర్పు.

కొత్త. 13.

**కాటికాపలా**

వ్యర్థము.

"పంటంతా పశువులు మేసిపోయాయి. ఈ కాటికాపలా యెందు కని వచ్చే శాను." వా.

చూ. శవజాగారం.

**కాటికి కాళ్లు చాచు**

మరణమునకు సిద్ధముగా నుండు.

"కటకటా! కాటికిఁ గాళ్లు సాఁచియును విటతనంబులజాడ విడువఁ డీశుఁడును."

గౌర. హరి. ద్వి. 1056,1057.

**కాటికి కాళ్లు చాచుకొని యుండు**

చావ సిద్ధముగా నుండు; ముదుసలి యగు.

"నే నింకేం చేస్తాను నాయనా! కాటికి కాళ్లు చాచుకొని ఉన్నాను." వా.

**కాటిపాపడు**

గొల్లవాడు.

శైవులలో జంగాలవంటి వారు భిక్షాటనం చేస్తుంటారు. గొఱగయ్యల లాగే కాటి పాప లనీ ఉన్నారు.

బస. 4. ఆ.

**కాటుకకన్నులు**

నల్లకన్నులు.

"ఆ యెఱ్ఱటి పిల్లకు కాటుక కన్ను లెంతో అందంగా ఉంటాయి." వా.

"కాటుక కండ్లవాణ్ణి నమ్మకూడ దంటారు పెద్దలు." వా.

**కాటుక తీర్చు**

కాటుక పెట్టు.

"కడలరేఖ లమర్చి కాటుక తీర్చె వా, ల్గన్నుల కొకవింత కాంతి మెఱయ."

శుక. 1.226.
పాండు. 3.74.

**కాటుక పట్టు**

నల్లబడు.

"బహుళజలప్లవమాన, ద్రుహిణాం డము చెమ్మ యుఱికి రూక్షార్క నిభా, రహితతఁ గాటుక పట్టెను, రహి చెడి యన నంధతమసరాసులు బెరసెన్." మను. 3.28.

**కాటుక పేటు లెత్తు**

కాటుక యెండి పెట్లిపోవు.

"తొలఁచిన యట్లు వోయెడుఁ గనుం గవ కాటుక బేటు లెత్తు." పారి. 3.12.

**కాటులాడు**

కొట్లాడు.

సింహా. 9.103.
రూ. కాట్లాడు.

**కాటువడు**

గాయపడు.

"తలలుఁ జీరలును గంపలు కట్టుకొని, గాసిగా ప్రమగ్గుటడవులఁ గాటు వడియు." నిర్వ. 4.76.

**కాడికి తెచ్చు**

విధేయముగా నొనర్చు.

గిత్తలను కాడికి కట్టి మాట విసునట్లు చేయుటపై వచ్చిన పలుకుబడి.

"వాణ్ణి కాడికి తేగలిగా వంటే చాలా గొప్పవాడివి అన్నమాటే." వా.

**కాడి పారవేయు**

బాధ్యతను వదలివేయు.

ఎద్దులను కట్టిన కాడి బాధ్యతాస్వీకారానికి గుర్తుగా వాడడం కలదు. అందుపై వచ్చినపలుకుబడి.

"వాడు నట్టనడియేట్లో కాడి పార వేశాడు. ఎలాగూ యిన్ని యేర్పాట్లు చేసుకున్నాక ఎలా మానడం?" వా.

**కాడిపాఱు**

గరు సెక్కు.

"కాఁడి పాఱిన మేని గరులు బ్రహ్మాండంబు, కణఁప పూబంతి కక్కజము దోఁప." శివ. 1.61.

**కాడుచేయు**

గాడ్పఱచు, పాడు చేయు.

"ఒక్క నదిపొంత గార్హ్వస్థ్య యుక్తమైన, పుణ్యతప మాచరించుచుఁ బుణ్యజనులు, తారు బంధులుఁ దామరతంపరగుచుఁ, గూడి యుండంగ నెంతయుఁ గాడు చేసి." భీమ. 4.180.

**కాడుపడు**

పాడగు; చెడిపోవు.

"ఇరు లన్న నో యనియెడు తమిస్రఁ గాడుపడి పొలంబు లెల్లఁ దిరిగి." ఆము. 6.12.

"కటకటా! మీ వివేకంబు కాడు పడఁగ." భీమ. 4.53.

**కాడుపఱచు**

దిక్కుమాలునట్లు చేయు; పాడు చేయు.

"అబలఁ గడు నెండ మెఱుఁగని యాఁట దాన, మెలుత నతిభీత నన్ను నమ్మించి తెచ్చి, కాననంబులోఁ గన్నులు కట్టి కాడు, పఱచి నీ కిట్లు పోఁజన్నె భావ జన్మ!" కుమా. 5.65.

**కాడ్పఱచు**

పాడు చేయు.

"పాలవంటి కులంబు గాడ్పఱచి చనియె." పాండు. 3.80.

**కాడ్పాటు**

పాడువడుట.

"ఆ నిసి బలియును నొండొక, మాని సియుం బడఁడు దృష్టిమార్గంబున న, ల్లేనును గాడ్పాటునఁ జనఁ,గా." వేం. పంచ. 1.482.

**కాడువారు**

పాడగు.

"పాడరి జాడరి కాడువారియున్." బొబ్బిలి. 1.53.

**కాణాచి కాపు**

కావలివాడు.

"కామక్రోధములకుఁ గాణాచి కాపను." తాళ్ల. సం. 7.246.

**కాదనిపించుకొను**

నడత మంచిది కాదనిపించుకొను; చేసినపని సరి కాదనిపించుకొను.

"ఎల్లవారిచేఁ గాదనిపించుకో ఫలము గలుగునె." విప్ర. 5.56.

"పదిమందిలో కాదనిపించుకొంటే నీ కేమి వస్తుంది?" వా.

**కాదారి మాదారి ప్రొద్దు**

అర్ధరాత్రి.

"వడివడిం జని పట్టి యో వాలుఁగంటి, నీదుపే రేమి యెవ్వఁడు నీదు మగఁడు, పూని కాఁదారి మాఁదారి ప్రొద్దుకడను, సెందు వోయెదు తలిదండ్రు లెవ్వరనిన." యయా. 2.89.

చూ. కాందారి మాందారి ప్రొద్దు.

**కాదు**

సరిపడదు.

"వాడికీ వీడికీ కాదు. అంచేత నువ్వు జాగ్రత్తగా మసులుకో." వా.

**కాదు అను**

1. తిరస్కరించు.

"గంగాదితీర్థమహిమ మ్మహిం గాదను తీర్థ మెద్ది." పాండు. 2.214.

"నీ మాట ఎవడు కాదంటాడు." వా.

2. లెక్కించక పోవు.

"వాణ్ణి కాదని ఆ ఊళ్లో ఒక్కరూ ఈ విషయంలో ముందుకు రారు." వా.

**కాదు అవును అని యెఱుగక పోవు**

లోకజ్ఞత లేకపోవు.

"కడుఁ బసిబిడ్డ వీఁ డొకట్ కాదవునా నెఱుఁగండు." భార.విరా.2.213.

**కాదు కూడ దంటే**

బలవంతం చేస్తే. నిర్బంధిస్తే.

"నా కేం అంత ఒంట్లో బాగా లేదు. బయటికి ఎక్కడికి పోకుండా పడుకుందా మని ఉంది. అంత మీరు కాదూ కూడ దంటే రాక తప్పుతుందా!" వా.

**కాదు కూడ దను**

1. వద్దను.

"ఈ రామారత్నము కాదు కూడ దనినన్ రాఁజాల నీ చోటికిన్." హర. 2.58.

"ఒక్కరుడును గాదు గూడ దనఁ గల్గెనె?" భార. విరా. 2.257.

2. నిర్బంధించు.

"నాకు ఉన్న యిబ్బందు లన్నీ నీకు చెప్పాను. నే నొక్కనిమిషం లేకపోతే యిక్కడ జరగదు. ఇంత చెప్పినా, నీవు కాదు కూడ దని నన్ను లాక్కెళుతున్నావు." వా.

**కాదు పొమ్మను**

తిరస్కరించు.

"ననుఁ గాదు పొమ్మని నాతిఁ జేరిన వాని." రాధి. 4.35.

**కాదు పోదు**

ఇదయ్యేపని కాదు.

"ఊరికే వానిచుట్టూ తిరిగీ లాభం లేదు. కాదు పోదు. వృథాగా ఈ లంపటంతా దేనికి?" వా.

కానక కన్న సంతానము

లేక లేక పుట్టిన బిడ్డ.

"కానక కన్న సంతానంబు శిశువులు, జీవనస్థితి కేన తావలంబు."

శృం. నైష. 1.108.

కానగ వచ్చు

కనబడు.

"కలకంఠికిఁ బాడవు దోఁచి కానఁగ వచ్చెన్." రుక్మాం. 1.141.

కానగాబడు

కనబడు.

"అంభోరుహాప్తుఁడు గానఁగాఁబడె."

రుక్మాం. 5.44.

కాననివాడు

అంధుడు.

"కానని వాని నూఁతఁ గొని కాననివాఁడు విశిష్టవస్తువుల్, కాననిభంగి."

భాగ. 7.182.

కానబట్టు

కనబడు.

"భూ, నాకం బప్పర మే కొలంత యును గానంబట్ట చెప్పట్టునన్."

భాస్క. రా. యు. 15.

కానబడయు

చూడ గలుగు.

"కన్నులారఁగ మిమ్ముఁ గానఁ బడసి."

హర. 4.59.

కానబడు

కనబడు.

"స్వానుభవంబునఁ దథ్యము కానం బడు." కా. మా. 1.80.

కానికల

దుఃస్వప్నము.

"వామహస్తము నురముపై నైచి నిదురఁ, జెందుతఱిఁ గానికల గందు రందు రెందు." శుక. 4.126.

కానికి గైకొనక

లక్ష్యపెట్టక.

ఒక కానీకి కూడా పనికి వచ్చు నని భావింపక.

"......తేజోనిధిక్, మానిం గానికి నైనఁ గైకొనక..."

వరాహ. 5.19.

చూ. కానికి గొనక.

కానికి గొనక

లక్ష్యపెట్టక.

"మముఁ, గానికిఁ గొన వప్పు డిపుడు గాడిద వైతే." భార. శాంతి. 4.389.

చూ. కానికి గైకొనక.

కానిచ్చు

1. జరుగ నిచ్చు.

"అట్లే కానిమ్ము లె మ్మనిన."

ఆము. 6.66.

2. పూర్తి చేయు.

"ఆపని కానిస్తే ముందు, తర్వాత మిగతవి చూచుకో వచ్చు." వా.

కానితెఱగులు

అపమార్గములు.

పాండు. 5.69.

కానికి నైన గొనక

ఏమాత్రం లక్ష్యపెట్టక.

"ఆ నీలుండు వరూధినీపరివృతుం డై పోయి తేజోనిధిక్, మానిం గానికి నైనఁ గైకొనక..." వరాహ. 5.19.

కానితనము

దుర్మార్గము; దాష్ట్యము.

"మారుఁ డదే కానితన మూని పోరెఁ."
రాధికా. 4.51.

కాని తిరుగులు తిరుగు

చెడుతిరుగుళ్లు తిరుగు.

"వా డీ మధ్య కాని తిరుగుళ్లు తిరుగుతున్నాడు. కాస్త అదుపులో ఉంచితే తప్ప లాభం లేదు." వా.

కానిది

కూడనిది.

"కానివాని మానఁ జెప్పి."
భార. అను. 1.278.

కాని పేరిది

అయిష్టమైనది; సరిపడనిది.

"పలుమాఱుం దలవాకిట మెలఁగుట యసతీజనైకమిత్రత ... నా కుఁ గాని పేరివి మగువా." భార. అర. 5.302.

కాని పోని

లేనిపోని; జరగని. జం.

"అరుంధతివి కానక నీపయిఁ గాని పోని యీ, వింత ఘటించినట్టియవివేకుల కోటికి శాస్తి చేసి..."
శుక. 4.54.

"ఈ కానిపోని మాటలతో ఏం గానీ! అయ్యేపని చూడండి." వా.
చూ. లేని పోని.

కానివలను

కానికార్యము; తగనిపని.

"వట్టి ప్రయాసంబు కానివలను దలంపక." కళా. 8.164.

కానివాడు

1. అనర్హుడు.

"కానివాని, కీడు మావిద్య పాత్రదానైకనిరత." భార. శాంతి. 6.65.

2. పరాయివాడు.

"నీవు కానివాఁడ పోలెం దొలంగియున్నాఁడవు?"
భార. ఆరణ్య. 7.416.

3. అనిష్టుడు, శత్రువు.

"నన్నెందుకు ఈ పనిలో దింపి మావాళ్లకు కానివాణ్ణి చేస్తావు?"
"ఇన్నాళ్లు పెట్టి పోసి ఇంతా చేస్తే వానికి నే నిప్పుడు కానివాణ్ణి అయిపోయాను." వా.

కానివావి

1. విరోధము.

వివాహాదులలో వరుస చూచి పిల్ల నివ్వడం అలవాటు. వావి కుదిరిన దనగా సంబంధము నకు తగు నన్నమాట.
దానికి వ్యతిరేకముగా ఇక్కడ 'కానివావి' కి భావార్థము - పొసగక పోవుట.

"గడ్డి వేయఁడు కరణంబు కానివావి."
శుక. 3.405.

2. తగనిపని.

"బొంకు నాలుకకుఁ జేర్చుట కానివావి."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 235.
చూ. తగనివావి.

కానుక పట్టు

బహుమతి యొసగు.

"ఆశీర్వాద పూర్వకంబుగా నా రాజునకుఁ గానుక వట్టుటయు..."
కళా. 5.2.

కాన్పించు

కనబడు.

"కృప దలిర్పంగఁ గాన్పించెఁ గేశ
వుండు." కళా. 2.98.

### కాన్పించుకొను

చూచు.

ఇది రాయలసీమలో నేటికీ వినవస్తుంది.

"పాణిపాద ప్రక్షాళ నాచమనా
నంతరంబ యతనిం గాన్పించుకొని."
ఆను. 4.199.

"ఆ ఊరికి ఎటూ పోతున్నావు.
కొంచెం ఆ రెడ్డిగారిని కనిపించుకొని
రా." వా.

### కాన్పు కెక్కు

పేరు కెక్కు.

"మరుమర్లుదీగెలో మంజుసౌదామనీ
ఖండంబులో యనఁ గాన్పు కెక్కె."
శ్రీరాధా. 4.151.

### కాన్పు చేయు

ప్రసవసమయమున సాయపడు.

"కాన్పు చేయడానికి మా అమ్మను
రమ్మని ఉత్తరం రాశి ఉన్నాము."
వా.

"ఆ మంత్రసాని ఎన్నివందల కాన్పులు
చేసిందో ఏమో? ఇప్పుడు చేయ లేక
పోతుందా?" వా.

### కాన్పు నడుపు

కాన్పు చేయు.

"చెల్వగ బిడ్డ కాన్పు నడిపెన్
వామాక్షి బాలింత యై."
కా. మా. 410.

### కాపిడు

కాపుదల పెట్టు; కావలి పెట్టు.

"పవ లెల్ల లోపలఁ జొరకుండఁ
గాపిడి."

పండితా. ప్రథ. పురా. పుట. 380.

### కాపుండు

కాపుర ముండు.

"ఇప్పురంబునఁ గాపుండ కితర మైన,
పురమునం దేల నిల్చె నిర్జరవిభుండు."
హర. 7.177.

"అల పన్నిద్దఱు సూరులందును
సముద్యల్లీలఁ గాపున్న వె, గ్గలపుం
దాపముఁ బాప నా..." ఆను. 1.10.

### కాపురము నారడి పుచ్చు

కాపురము చెడగొట్టు.

"అక్కట! భర్తఁ గాపురము నారడి
పుచ్చి నృపాలమౌళితో..."
హంస. 1.124.

### కాపురములు కూల్చు

కొంప లార్చు.

"జార! యెన్ని, కాఁపురంబులు
గూల్చితో కద యటంచుఁ, బలుక నా
వంటి వాఁ డిందుఁ గలిగె ననుచు."
శుక. 3.201.

"వాడీసరికి ఎన్ని కాపురాలు
కూల్చాడో? వీళ్లింటికి ఎసరు పెట్టాడు."
వా.

### కాపురము సేయు

నివసించు.

"ఆ పురమునందుఁ జేయుం గాపు
రము." నిరంకు. 1.556.

### కాపుర మెత్తిపోవు

కాపురము పాడగు.

ఇది నేడూ రాయలసీమలో వ్యవహారంలో ఉన్న పలుకుబడి:—

'ఆ సంసారి ఎత్తిపోయినాడు'— ఇదే అర్థంలోనే ఎత్తుబడు అన్నక్రియ కూడా ఉన్నది. జబ్బులో కావచ్చు. లేక మరొక విధంగా కావచ్చు లేవలేని పరిస్థితిలో ఉన్నాడు— అన్న అర్థంలో ఇది ఉపయుక్త మవుతుంది: 'పశువు ఎత్తుబడింది.'

"శరీర మొక్క మ్రబ్బిన ననూనదుఃఖ మెనయం దన కాఁపుర మెత్తి పోవదే." శుక. 2.133.

"వారి సంసారం పూర్వం బాగా ఉండేదే కాని ఇప్పుడు ఎత్తి పోయింది." వా.

## కాపురుషులు

చెడ్డవారు.

"కాపురుషుల వలన నిట్టి కాఱియ పుట్టెన్." భార. విరా. 4.140.

## కాపులు పోవు

వలస పోవు.

"సర్వత్ర నిలింపకామినుల వాడకఁ గాఁపులు వోయి..." ఆము. 1.37.

## కాపెట్టుకొను

కాచుకొను.

"రతి సేన మందిరమున గాపెట్టుకొని యుండుమోహాను కలిగెన్." హంస. 5.133.

## కాబట్టదు

ఇష్టం లేదు,

"వాడికి సంసారం అంటే కాబట్టదు. మరెవరు చూచుకొంటూ రనుకున్నాడో!" వా.

## కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు

అరిషడ్వర్గాలు.

## కామధేనువు

కోరిక లిచ్చే దేవతల ఆవు. తద్వారా మనోరథాలు నెఱవేర్చేవాడు, అది.

"అతను ఆశ్రితుల పాలిటి కామ ధేనువు." వా.

## కామవరపు జీడి

తగులుకొంటే వదలనిది. జీడిరంగు తగిలితే అది యింక వదలదు. కామవరం అనే ఊరిజీడి మరింత ప్రసిద్ధి కావచ్చును.

"వాడు కనిపించాడా? ఇక వెళ్లినట్లే. కామవరపుజీడిలా పట్టుకుంటాడు." వా.

రూ. కామారపు జీడి.

## కామాటపుపని

ఇంటిపని.

"భానుపుత్రాదులకా, వినుమీ చంపక పట్టి తెచ్చి దినమున్ నీ యింటి కామాటపుం,బనికిం జొచ్చెద మన్న దాఁక నిజ చెంపల్ వైతు మత్యుద్ధతిన్." రామా. 8.185.

కామాట మంటే ఇంటిలోని సామగ్రి, పరికరాలు అని వావిళ్ళ. ని.

## కామినీఘాతము

ఘాతాలలో ఒకటి. అతి కాముకి.

ఇలాంటి అతికాముక స్త్రీలను కామినీభూతము లంటారు.

భూత విశేషాలు—కామిని. శాకిని, ఢాకిని, ప్రేంఖిణి ఇత్యాదులు.

"కంటికిఁ బ్రియ మగువానిన్, గెంటని తమకమునఁ గామినీభూత మనన్, వెంటఁబడి..." శుక. 2.106.

## కాముకుని లజ్జ

అసంభవము.

'కామాతురాణాం న భయం న లజ్జా' అనుటపై యేర్పడి నది.

రాధి. 4.79.

## కాయకము

1. కష్టం, శ్రమ అనుఅర్థాల పై వచ్చి లాక్షణికంగా వృత్తి, జీవనం అని మారినది.

"మతి యెందు గాయకం బెఱుఁగమిఁ జేసి." బస. 4.118.

2. సేవ; శరీరశ్రమ.

ఇందుమూలంగానే పని అని కూడా అర్థ మేర్పడినది.

"చేయు కాయకమును శివభక్తితతికిఁ, బాయకట్టుల సమర్పణ సేయుటయును."
పండితా. ప్రథ. పురా. పుట. 477.

"పాయక తనచేయు కాయకం బట్ల, చేయుచు..." అదే. 479 పుట.

## కాయకల్పము

ముదుసళ్ళకు జవ్వనం ప్రసాదించే ఆయుర్వేదప్రక్రియ.

"ఆ ముసలాయన కాయకల్పచికిత్స చేసుకొని ముప్పైయేళ్ల వా డయ్యాడు."
వా.

చూ. కాయసిద్ధి.

## కాయకష్టము చేయు

శ్రమించు.

నా. మా. 97.

"ఏదో కాయకష్టం చేసుకొని ఆ పిల్లలను వాడు పోషించుకుంటున్నాడు."
వా.

## కాయక్లేశము

శరీరశ్రమ.

"కాయక్లేశ మేమీ లేకుండా పనులు కావా లంటే ఎలా?" వా.

## కాయగసరులు

కాయలూ కసురులూ. జం.

"జడలు ధరియించి యడవుల, నిడుమలఁ బడి కాయగసురలే మెసవెదు వెన్..." రామాభ్యు. 6.152.

## కాయ గాచు

1. సంతానము కలుగు.

"ఇతఁ డొక కాయ గాచి సుతుని ల్లని పించె మునీంద్ర!" కకుత్స. 2.64.

"నాలుగేళ్, కాయలు గాయ వచ్చెలువ గర్భమునం బెటువంటి పాపమో."
వేం. పంచ. 1.583.

"ఏదో మా పిల్లకడుపున ఒక కాయ కాస్తే చూచి వెళ్ళిపోతాను." వా.

2. పని సేయుట మొదలయిన వాని ద్వారా చేతులు మొదలయిన వాటిపై చర్మం గట్టిపడి కాయవలె ఏర్పడు.

"కట్టెలు కొట్టి కొట్టి చేతులు కాయలు కాచిపోయాయి." వా.

కాయగూరలు

కాయలు కూరలు. జం.

మొత్తంగా కాయలకూ కూరలకూ కూడా ఉపయోగిస్తారు.

కమా. 11.43.

"ఏవైనా కాయగూరలు పట్టుకరారా." వా.

కాయము కొట్టు

బాలింతలకు వేడిని కలిగించుట కని, శీత వాతాది దోషములు పోవుట కని కొన్ని దినుసులను దంచి పొడి చేయు.

మదన. శత. 6.

కాయముతో కైలాసమునకు పోవు

బొందితో కైలాసమున కేగు. సశరీరముక్తి చెందు.

పండితా. ప్రథ. పురా. పుట 406.

కాయశుద్ధి చేయు

శాస్తి చేయు, తన్ని వదలిపెట్టు.

"ఇలానే ప్రవర్తించావంటే ఆ ఊళ్లో కాయశుద్ధి చేసి పంపిస్తారు. జాగ్రత్త." వా.

చూ. దేహశుద్ధి చేయు.

కాయసిద్ధి

నిత్యయౌవనము.

దీనిని సాధించుటకు చెప్పిన ఔషధాది ప్రక్రియలను 'కాయకల్పం' అంటారు.

"వీరిబగిసికి మఱి గారవించి హరుఁడు, కాయసిద్ధి యొసంగునే కల్లగాక." శుక. 3.94.

చూ. కాయకల్పము.

కాయా పండా ?

పని అయిందా కాలేదా అను పట్ల ఉపయోగించే పలుకుబడి.

"వివరా లన్నీ తరవాత చెబుదువు గానీ ముందు కాయా పండా చెప్పు." వా.

కారణజన్ముడు

ఏదో ఒక పనికి పుట్టినవాడు.

"కారణజన్ము లై తనువికారము వచ్చినఁ బెంపు తప్పునే." భార. విరా. 4.22.

కారము నూరు

కోపించు.

"దానిపైఁ, గారము నూరుఁ గాని తగు గారవముకా బచరించి యేలునే?" పాణి. 5.15.

చూ. కారాలు మిరియాలు నూరు.

కారము లేని విడెము

నిస్సార మైనది.

వేంక టేశ. 64.

కారాకు మేపి చంపు

నానాబాధలూ పెట్టి చంపు.

"కృప, చాలు న్గారాకు మేపి చంపకు ప్రజలకా." ఆము. 3.32.

కారాకులు దుల్లినట్లు

గబగబా.

సులువుగా పడిపోవుపట్ల ఉప యోగించే పలుకుబడి.

"వైరమున నులిచి త్రెంపక, కారాకులు ద్రుల్లినట్లు కర్మము లెల్లం, దానె పెడఁ బాయ వలయుట."

భార. భీష్మ. 1.104.

కారాకూర మగు

అల్లరిపడు. క్షోభపడు.

"సారెకుఁ గేకలు వేయుచుఁ, గారాకూర మయి మనసు కళవళపడఁ గన్..." సారం.

"కారాకూరంబులై రాక్షసులవ్యాదయముల్ గాడ్పడఁగ్.

ఉ. రా. 1.176.

కారాకూరము చేయు

క్షోభపెట్టు, బాధపెట్టు.

"......మీ పలెకం బొండు కారాకూరంబులు చేసినం గదలి సేరా నిచ్చటన్."

కా. మా. 3.82.

"మారదశఁగ వేగడుకాంత నింత పెను గారాకూరముల్ చేసె."

పరమ. 3.275.

కారాని

కూడని.

"కారానితలంపుఁ బుట్టించె."

హర. 3.95.

"కారాని చోటికి పోతే రారానిమాటలు వస్తాయి." సా.

కారాలు మిరియాలు నూరు

కోపించు; ద్వేషించు.

"డబ్బంతా ఖర్చు చేశా వని తెలిసి మీ నాన్న కారాలు మిరియాలు నూరుతున్నాడు." వా.

కారుకమ్మగా వండు

కరకర మనునట్లు – కమ్మగా వండు.

"పెక్కు చందములఁ జిన్నక పెద్దక కారుకమ్మఁగా వండుదురు."

కా. మా. 3.66.

కారుకూతలు కూయు

ప్రేలు.

కా త. 84.

కారుకొను

వ్యాపించు.

క్రమ్ము; అతిశయించు.

"...మెఱుంగుటారు... గాటమై పూట పూటకుఁ గారుకొనియె." రసిక. 6.99.

కారు గ్రమ్ము

నలు పెక్కు.

"నిగిడి యాగులకెంపు సెలకట్టు కలచోటఁ, గల్పకాపరి కారు గ్రమ్ము చోట." పాండు. 3.158.

కారుచిచ్చు

దావాగ్ని.

కారుచిచ్చునకు గాడ్పులు తోడగు చందమున

మఱింత ప్రోత్సాహ మబ్బినట్లు.

నిప్పునకు గాలి తోడయి నపుడు మరింత ప్రబలును కదా.

"ఉదారసారరణకోవిదబాహులు లోకపాలకుల్, గలసిరి కారుచిచ్చునకు గాడ్పులు దోడగు చంద మొందఁ గన్." ఉ. హరి. 1.22.

**కారుణ్యము సేయు**

దయచేయు ; ఇచ్చు.

"అమ్మదాలస గారుణ్యము సేయు మీతనికి." మార్క. 3. 8.

**కారుబారు చేయు**

పెత్తనము చేయు.

"తా నెత్తి పెంచఁగాఁ దగు నిళాసతి మీఁద, వడి నేల బలు కారుబారు చేసి." రాధి. 1.49.

నేటికీ రాయలసీమలో 'వాని కారు భారు జోరుగా సాగుతూ ఉంది' అని అంటారు.

**కారె మెత్తు**

నీళ్ళు తాటిదోనెతో తోడు.

"బడలినవార లిందనుకఁ బాదులు త్రవ్వియుఁ గారె మెత్తియున్." విప్ర. 3. 84.

**కార్కొను**

దట్ట మగు.

"పుడమి నెల్లెడల నిండి మెండుకొని జగదండఖండంబునఁ గార్కొని." విప్ర. 2.14. కవిక. 2.67.

**కార్చిచ్చులోపలి మిడ్త లట్లు**

చిచ్చులో ఉరికిన మిడత నిమిషంలో మాడి పోతుంది. కానీ అగ్గిలోకి ఉరుకుతూనే ఉంటుంది. అలా ప్రమాదంలో తమంత దుముకు వారివిషయ మనుమాట.

"వలచె కార్చిచ్చులోపలి మిడ్త లట్లు, పొలసి పోవనె కాక నిలువఁగఁగలరె?" బస. 7. ఆ. పుట. 187.

**కార్యకర్మములు నడుపు**

పనులు నెఱవేర్చు.

"ఫలములయెడ బ్రహ్మార్పణ, కలన పరం డగుచుఁ గార్యకర్మము నడపన్, వలయున్." భార. శాంతి. 1.69.

**కార్యకాఁడు**

పని నెఱవేర్చుకొనగలవాడు. ఆము. 4.263.

**కార్యఖడ్గములు**

సామదండోపాయములు. జం.

"కార్య ఖడ్గము లనుచరుల్ గానఁ బలుక, వలయు." ఆము. 4.259.

**కార్యభారము**

బాధ్యత.

కార్యనిర్వహణలోని బరువు. బరువుతోడి ఉపమానస్ఫూర్తివల్లనే కార్యభారము వహించు అని కూడా వ్యవహారం యేర్పడింది. కడకు కార్యభార మప్పగించుట అనే దానిలో ఆబరువును మోయుట కూడా కలిసిపోయినది.

"చొక్కి బహువత్సరము లచ్చో వసించి, పిదపఁ బ్రభు కార్య భారము మదిఁ దలంచి." శుక. 1.196.

**కార్య మరయు**

పని చూచు.

"ఒకవేళ రిపు నృపాలకజాలసాల దుర్గమదుర్గహరణైక కార్య మరయు." శుక. 1.355.

**కార్యము చేయు**

నిషేకము చేయు.

"మా అమ్మాయికి కార్యం చేయాలి ఈ నెలలో." వా.

**కార్యము తప్పు**

కార్యనాశము చెందు.

"ఇక నిట్టటు, దడసినఁ గార్యము దప్పు ననుచు." కళా. 6.71.

"అప్పుడు మంత్రులు కార్యము దప్పెఁ గదా యనుచు." నిరంకు. 4.68.

**కార్యము తెగు**

పని ముగియు.

"తెగుఁ గార్య మనువార్త." విజయ. 1.41.

**కార్యము పాకము తప్పు**

పని చెడిపోవు.

"మతిఁ దలపోసి యీపలుకు మానుఁడు పాకము దప్పెఁ గార్యముల్..." భార. భీష్మ. 1.18.

చూ. పని పాకము తప్పు.

**కార్యవాది**

అనవసరంగా వాదాలతో పని చెఱచుకోనక పని అయ్యేటట్లు చూచుకొనేవాడు.

"లేనిపోనివానికి వెళ్లేవాడు కా డతను. కార్యవాది." వా.

**కాఱియపెట్టు**

బాధపెట్టు

"దుర్భాషా, ఘనశరములు మనము నాఁటి కాఱియఁ బెట్టన్." భాగ. స్క. 4.221.

**కాఱియపడు**

కష్టపడు, బాధపడు.

"జూదమాడి ధర్మసూనుండు రాజ్యంబు, ననుజులను బ్రియాంగనను బణంబు, గాఁగ నొడ్డి యాడి కాఱియపడఁడె." భార. విరా. 5.245.

**కాఱియ వెట్టు**

కష్టపెట్టు.

"మా ఱెందు లేక నిరతముఁ, గాఱియ వెట్టంగ బెగడి." రుక్మాం. 3.4.

**కాఱుకూతలు**

దుర్భాషలు.

"కన్ను లెఱ్ఱచేసి యన్నులఁ గని కాఱు, కూఁత లఱచె దేల కోకిలంబ!" రసిక. 4.170.

**కాఱు లఱచు**

1. దుర్భాష లాడు.

"కతలు సెప్పెదు విను మంచుఁ గాఱు లఱచు, నేర్పు గలుగుట." రుక్మాం. 5.86.

2. కాఱుకూతలు కూయు.

"కంటే బ్రాహ్మణుఁ డెన్ని కాఱు లఱచెఁ గర్వించి వీ రెల్ల నా,కంటెన్ బాత్రులె." మను. 5.14.

**కాఱులాడు**

వ్యర్థప్రలాపాలు పల్కు.

"ఇవము సూడు కొల పుచేలికల్ము స్నెంముఁ, గాఱు లాడి రసికత యొఱుంగ." అచ్చ. అయో. 30.

**కాఱులు చెప్పు**

కారుకూతలు కూయు.

"ఏమి కాఱులు చెప్పె దీమఱి నాకు?" ద్విప. జగ. 158.

**కాఱోడెకాడు**

దుర్భాషి.

శేష. 3.269,

**కాలం ఇట్లే ఉండదు**

ఇట్లాగే ఎప్పుడూ ఉండదు.

"నే నేదో యిప్పుడు తక్కువస్థితిలో ఉన్నాను. అంతమాత్రంతో నువ్వు తిరస్కరించ నక్కఱ లేదు. కాలం ఇట్లాగే ఉండదు." వా.

**కాలం కర్మం కూడి వచ్చు**

కాలము కలిసి వచ్చు అనుట వంటిది. అయితే ఏదో చెడు రావలసి వచ్చు అన్న సూచన ఉన్నది.

"కాలం కర్మం కూడివచ్చే వాడు ఆ ఊరికి వెళ్లాడు. దివాలా తీశాడు." వా.

**కాలకూటజ్వాలను కబళించు**

అసాధ్యకార్యము చేయు.

"కాలకూటజ్వాలఁ గబళింప నగుఁ గాని, యతివలతోడ మాటాడ నగునె?" శుక. 1.364.

**కాలక్షేప మగు**

హాయిగా కాలము గడచు.

"ఏవో నాలుగు నవల లుంటే కాలక్షేప మవుతుంది." వా.

**కాలక్షేపము చేయు**

పని చేయక గడపు.

"అనవసరంగా ఇదో అదో అని కాలక్షేపం చేస్తున్నా డతను. ఊరికే నమ్ముకొని ఉంటే ఏం లాభం?" వా.

**కాలగర్భములో కలిసిపోయిన**

ఎన్నడో నశించిన.

పాతకాలపునాటి మాట అనుట.

మాటా. 39.

**కాలగోచరు డగు**

చనిపోవు.

"...అయ్యాలువది వేవురు నతిదర్పితులై యేకకాలంబునఁ గాలగోచరు లగుదు రనియు..."

భార. అర. 3.51.

**కాల చేత తన్ను**

చితక తన్ను.

"ఇదే, మడరెఁ బరపురుష వాసన, చెడుగా నాడుదు మని కాలఁ జేతం దన్నెన్." శుక. 2.195.

"వానిని కాలా చేతా తన్ని వదిలి పెట్టినారు." వా.

రూ. కాలా చేతా తన్ను.

**కాల చేత పొడుచు**

చితుక తన్ను.

"ను తెదువ నటంచుఁ బత్తిబొట్టు వహింపఁ, జెన్నెలా యని కాలఁ జేతఁ బొడుచు." శుక. 2.115.

చూ. కాల చేత తన్ను.

**కాలదోషము పట్టు**

ప్రామిసరీ నోట్లు మొదలగు వానికి మూడేండ్లలోగా చెల్లు వేయక పోతే అవి చెల్లవు. అప్పుడే కాలదోషము పట్టిన దంటారు.

అలాగే కొన్నికొన్నిటికి ఏదో కాలనిర్ణయం ఉంటుంది. అది దాటితే కాలదోషం పడుతుంది.

"నోటుకు కాలదోష మని."

గుంటూ. ఉత్త. పు. 2.

**కాల ద్రొక్కు**
ధ్వంసము చేయు.
"పాపముల గమిఁ గాలం, ద్రొక్కెదవు ..వ." పారి. 1.50.

**కాలధర్మము చెందు**
మరణించు.
రూ. కాలధర్మము పొందు.

**కాలనేమిజపము**
దొంగజపము.
కాలనేమి ఒక రాక్షసుడు. లక్ష్మణుని మూర్ఛ తీర్చుటకు హనుమంతుడు సంజీవకరణి తెచ్చుటకు పోవుచుండగా దారిలో మునివేషమున నుండి మోసము చేయదలచినవాడు. అందుపై యేర్పడిన పలుకుబడి.

**కాల మగు**
వేళ యగు.
"కాలం బగుటయు నృపులకు, నాలము సమకూరె." భార. భీష్మ. 1.6.

**కాల మయి పోవు**
చనిపోవు.
"వాళ్ల నాన్న కాల మయి పోయి అప్పుడే సంవత్సరం అయిపోయింది." వా.

**కాలము చేయు**
మరణించు.
"మాయ గోవు పడుచుం, గనుగ్రుడ్లం దిరుగ వేసి కాలము చేసెన్." వరాహ. 10.40.
"ఆయన కాలం చేసి అప్పుడే నాలుగయిదేండ్లయింది." వా.

**కాలము చేరు**
అంత్యకాలము సమీపించు.
"ఇందఱకు నేర్పడఁ గాలము చేరె నావుడున్." భాస్క. సుంద. 357.

**కాలము చేరు వగు**
కాలము దాపురించు; మరణమాసన్న మగు.
"తథ్యంబుగా వ్రజనా, థునకుం గాలము చేరు వౌట యిది నీ బుద్ధిన్ వివేకింపుమా?" ప్రభా. 1.127.
రూ. కాలము దగ్గఱకు వచ్చు.

**కాలాంతకుడు**
అసాధ్యుడు.
"వాడు కాలాంతకుడు. వాడితో తగాదా పడితే మనం ఏం గెలుస్తాం?" వా.

**కాలాగు**
కొంతకాలం ఆగు; నిలుచు.
"తిమురు మధ్యాహ్న మయ్యెను దేవ! యిచట, నేడు కాలాఁగి మా మంద పాడిచూచి, గోరసముఁ బాయసంబులు నారగించి, నిగ్రహం బైన మమ్ము మన్నింపవలయు." శకుం. 1.123.

**కాలాడునపుడు**
అనగా ఇంకా శరీరములో ఏకొద్దో బల మున్నప్పుడు.
"కాలాడినపుడ, నడవవలెఁ గాక కైలాస నగముఁ జూడ." కా. మా. 3.177.
"కాలుచేతులు ఆడుతున్నప్పుడే అంతంతమాత్రం. ఇక అవీ పడిపోయాయంటే ఇక నా దిక్కు చూచేవాళ్లెవరు తల్లీ!" వా.

కాలాతీత మగు

వేళ మీఱు.

"ఇప్పటికే కాలాతీత మయింది. నాలుగు ముక్కల్లో నా ఉపన్యాసం ముగి స్తాను." వా.

కాలాదిపెఱచు

జోడు తీయించు.

గుఱ్ఱంమీఁద కూర్చున్నప్పుడు దానిని అదిలించుటకు కాళ్లను దాని డొక్కలకు తాకి పరు వెత్తు మని సంజ్ఞ చేయుట అలవాటు. అందుపై వచ్చిన పలుకుబడి.

పలుకుబడి కేనుక నే ఏనుగ విషయంలో ఇది అసాధ్య మయినా భావార్థంలో ఉపయుక్త మైంది.

"ఐరావతంబుఁ గాలాది పఱప."

నిరంకు. 3.36.

కాలార్చు

కాలాడించు.

"తోలుచు నెత్తురు తొంపిలో మునిఁగి, కాలార్ప నేరనికరితురంగములు."

ద్విప. కల్యా. పు. 79.

కాలావసరములు

కాలకృత్యములు.

ఏ కాలమునందు అవసర మైన పనులు, పూజలు ఆ కాలమున తీర్చుట కాలావసరములు తీర్చుట.

"కాలావసరములు గడలు వెట్టితివో."

పండి. పురా. ప్రథమ. 452.

కాలికంచము

ఒక పిల్లల ఆట.

"కాలికంచంబును గట్టెగుఱ్ఱము."

హంస. 3.146.

కాలికింద బలాదూరు

దాని కిది తీసికట్టే అనుట.

దానిముందు ఇది ఏమాత్రం పనికి రాదు అనుపట్ల ఉప యోగిస్తారు.

"కలకత్తా మేడలతో పోలిస్తే మద రాసు కాలికింద బలాదూ రనుకో."

వా.

కాలికి బందాలు వేయు

ఆకట్టుకొను.

"వాడికేదో ఉద్యోగం ఇస్తా నని ఓక్షణంలో కాలికి బందం వేశేశాడు. ఇక వాడు మన మాట వినడు." వా.

కాలికి బలపం కట్టుకొని తిరుగు

అదే పనిగా ఎక్కువగా తిరుగు.

బలపం వ్రాస్తుంది. అరిగి పోతుంది. అందుపై కాళ్లరిగి పోవునట్లుగా, కాళ్లజాడలు శాశ్వతంగా ముద్రిత మై పోవు నట్లుగా అన్నట్లుగా వచ్చిన పలుకుబడి.

"కూతురు సంబంధంకోసం అతను ఆరు నెల్లనుంచీ కాలికి బలపం కట్టుకొని తిరుగుతున్నాడు." వా.

కాలికి బుద్ధి చెప్పు

పాఱిపోవు.

"నలుగురూ చేరేసరికి ఆ దొంగ కాలికి బుద్ధి చెప్పాడు." వా.

**కాలికి ముల్లు గ్రుచ్చుకొనదు**

ఏమాత్రం అపాయం కలగదు.

"కాలు ములు గాఁడునే సదా మేలె గాక, వెఱపు వలదు." ప్రబోధ. 4.56.

**కాలికి వేస్తే మెడకు, మెడకు వేస్తే కాలికి వేయు**

ఏదో విధంగా వాదంలో తికమకలు పెట్టు.

"వానితో మనం వాదించ లేం. కాలికి వేస్తే మెడకూ, మెడకు వేస్తే కాలికీ వేస్తూ కూర్చుంటాడు. ఏదీ తెగనివ్వడు; ఎందుకూ అంగీకరించడు." వా.

**కాలికి వేస్తే మెడకు వేయు**

ఒకదానికి సమాధానమివ్వగా మరొక తగాదా లేవదీయు.

"వాడితో సమాధానపడడం సాధ్యం కాదు. కాలికి వేస్తే మెడకు వేస్తుంటాడు." వా.

**కాలికి వేస్తే వేలికి, వేలికి వేస్తే కాలికి**

చూ. కాలికి వేస్తే మెడకు మెడకు వేస్తే కాలికి.

**కాలి క్రింది కసవుగా చూచు**

హీనముగా చూచు.

ఇక్కడ కసవు గడ్డి అనే అర్థంలో ప్రయుక్తమైనది.

"పరభయంకరబిరుదవిస్ఫురితుఁడైన, కాంతు నయ్యిందుముఖి తన కాలిక్రింది, కసవుగా నెంచు వెడమాయ గప్పి చోర,ధవుల మాటలు వడఁకి యాఁదల ధరించు." శుక. 3.128.

పొరక, పూచిక, గడ్డిపుల్లలను హీనతాసూచకములుగా ఉపయోగించిన పలుకుబడులు మనకు చాలా ఉన్నవి.

"వాడు నన్ను పొరకపుల్లకంటే హీనంగా చూస్తాడు." వా.

"ఆ పని వాడికి పూచికపుల్లతో సమానం." వా.

"వాడు నాకు గడ్డిపరకతో సమానం." వా.

**కాలికొద్దీ పరుగెత్తు**

ఎంత శక్తి ఉన్నదో అంత శక్తినీ ఉపయోగించి పరుగెత్తు.

"నలుగురూ చుట్టుకొనేసరికి ఆ దొంగ కాలికొద్దీ పరుగెత్తాడు." వా.

**కాలికొద్దీ పరువెత్తు**

వేగముగా పరుగెత్తు.

"కుక్క తరుముకు వచ్చేటప్పటికి వాడు కాలికొద్దీ పరువెత్తాడు." వా.

**కాలికొలది**

కాలిదాకా.

"కొదమతట్టువగుంపు కాలికొలందికి వ్రేలు లాలు కుంచెలు." ఆము. 4.35.

**కాలి గోటికి దీటు రాదు**

ఏమాత్రం సరిపోలదు.

"రంభ కూడా దాని కాలిగోటికి దీటు రాదంటే ఇక ఊహించుకో! ఎంత అందమైన పిల్లో." వా.

కాలి గోరున పోలకుండు

ఏమాత్రమూ సరిరా కుండు.

"వారల యగణ్యరూపలావణ్యతతులు, బాల! నీ కాలి గోరునఁ బోల వరయ."
రామాభ్యు. 5.179.

కాలి జోడు

పాదరక్షలు.

"నా కాలి జోడు వాళ్ల యింట్లో మరిచి పోయి వచ్చాను." వా.

కాలి జోళ్ళు తెగేదాకా

ఎక్కువగా (తిరుగు. కొట్టు).

"వాడి కొంప చుట్టూ కాలిజోళ్లు తెగేదాకా తిరిగాను." వా.

"వాడు ఆ సందు మొనలో ఒంటిగా చిక్కగానే కాలిజోడు తెగేదాకా కొట్టాను." వా.

కాలిడ నిచ్చు

ప్రవేశింప నిచ్చు.

"...దృష్టికిఁ గన్పడెఁ గొన్ని రూపముల్, కనుపడి మమ్ము నీ మగఁడు కాలిడ నీయఁడు మా స్థలంబులం, దుని మెదను..." హంస. 3.114.

వాడుకలో రూపం: కాలు పెట్ట నిచ్చు.

"వా ణ్ణిక ఈ యింట్లో కాలు పెట్ట నిస్తానా?" వా.

కాలిడి నిల్చు

ధైర్యంగా నిలబడు.

"భీషణవేషముఁ జూచి నేలపైఁ, గాలిడి నిల్చరే." కుమా. 10.144.

కాలిడు

ప్రవేశించు; గృహప్రవేశము చేయు.

"నృపాలు సాగెలఁ గాలిడ నెందును జోటు లేక..." భోజ. 7.130.

"నీ, యనుజయు నేనుఁ గా లిడుదుము." వేం పంచ. 1.86.

వాడుకలో రూపం: కాలు పెట్టు.

కాలి తెరువు

కాలిబాట.

కాలిత్రోవ

కాలిబాట.

"ఒక్క నాఁటి పయనంబున నది మార్గంబు దప్పి కాలిత్రోవం బడి..." శుక. 2.245.

చూ. కాలిబాట.

కాలి దాటగు

కీడు తగులు.

పీడానివారణార్థం మాంత్రికులు ఏవో దిగదుడిచి నాలుగువీధులు కలిసినచోట పారవేయడం అలవాటు. వాని నెంకెవరైనా దాటి నపుడు ఆ కీడు వారికి సోకుతుం దని నమ్మకం. అందుపై వచ్చిన పలుకుబడి.

"వాని కెక్కడో కాలిదాటై ఒళ్లు తెలియకుండా జ్వరం వచ్చింది. వా.

కాలినడక

బండీ బడకా లేకుండా నడిచి పోవుట.

"ఆ పల్లె వెళ్లా లంటే కాలినడక తప్ప మార్గం లేదు." వా.

**కాలినపుండ్లలో ఉప్పులు చల్లు**

ఎక్కువ బాధ కలిగించు.

గోరుచుట్టుపై రోకటిపోటు వంటిది.

తాళ్ల. సం. 12.33.

చూ. కాలినపుండుమీద కారం చల్లు.

**కాలినపుండ్లమీద కారం చల్లు**

ఎక్కువ బాధ పెట్టు.

అసలే పుండు నొప్పి. దాని మీద కారం చల్లితే మరింత బాధ.

**కాలిబాట**

దగ్గరదారి.

బండ్లు కాకుండా మనుష్యులు మాత్రమే పోవుటకు వీలయిన దారి.

"బండ్లబాటమీద పోతే పది మైళ్లుంటుంది. కాని కాలిబాటన పోతే రెండు పరుపులు ముటీముటాలుగా ఉంటుంది." వా.

చూ. కాలిత్రోవ.

**కాలిమట్టులు**

కాలిత్రొక్కిళ్లు.

"బలని కాయము కాలిమట్టుల నెయడఁచు." పారి. 1.23.

**కాలిమానిసి**

కాల్బలము ; పదాతి.

"కరి తురంగంబులు కాలిమానుసులు" పల. పు. 22.

చూ. కాలుమానిసి.

**కాలిమీద కాలు తీయకుండా**

ఏమాత్రం పని చేయకుండా, హాయిగా సాగుననుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"వాడి కేం? కాలుమీద కాలు తీయకుండా జరిగిపోతుంది." వా.

**కాలిమీద కాలు వేలిమీద రాయి వేసుకొని**

అట్టహాసంగా - పనీ పాటా లేకుండా.

"వాని కేం? తండ్రి పెట్టిపోయిన ఆస్తి ఉంది. కాలిమీద కాలు వేలిమీద రాయి వేసుకొని బతుకుతాడు." వా.

**కాలిముల్లు**

బాధ పెట్టునది.

"గాలి కాలిముల్లు వభృత్ పాలి పాలి పిడుగు రావణుఁడు డించె." ఉత్త. రామా. 1.149.

"కంటిలోని నలుసు కాలిముల్లు." వేమన.

**కాలియాఱు**

కాలిపోవు.

"అంగజన్మ నీ, విలసితచారురూపతను విభ్రమసంపద లీక్షణంబులోఁ, బొలుపఱఁ గాలియాఱె నహిభూషణకోప దవానలాహతిన్." కుమా. 5.72.

**కాలీచవడగా**

కాళ్ళు అరిగిపోవునట్టుగా అనుట వంటిది.

తిరిగి తిరిగి కాళ్ళు చిక్కిపోగా అనుట.

"కాలీఁచవడఁ జరింపుదు, నీ లోకము నందు నెల్ల..." పాండు. 2.204.

**కాలుకంబము**

ద్వారబంధపు ప్రక్క స్తంభం.

"మరుఁడు శృంగారవీథు లేర్పఱచి తనదు, పేర నొక పేటఁ గట్టి సంప్రీతి దోర, ణాల నుంచిన కాలుకంబాల నంగఁ, గలికి యూరులు చెలఁగుఁ బెం గాంచి మెఱయ." బిల్హ. 2.115.

**కాలుకడ**

కాళ్ళవైపు.

"కాల్కడ యొద్ద కల్లఁ, జని వినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి." ఉద్యో. 1.65.

**కాలు కింద పెట్టకుండా**

ఏమాత్రం పని చేయకుండా.

"వాని కేం? కాలు కింద పెట్టకుండా జరుగుతుంది. మనకు రెక్కాడితే గానీ డొక్కాడదు." వా.

**కాలు కింద పెట్టనీయకుండా**

ఏమాత్రం పని చేయనీయకుండా.

"ఆ పిల్లను కాలు కింద పెట్టనీయకుండా చూచుకొంటున్నాడు." వా.

**కాలు కొను (కొననిచ్చు)**

కాలు నిల్పు.

"కాలు కొనక లీలోద్యానంబున కేకాంతంబునఁ జని." కుమా. 5.116.

"అంత కంతకు నెక్కుచు సంతమసముఁ, గాలుకొననీక చంద్రుండు గ్రాలె నధిప!" భార. ద్రో. 5.275.

**కాలుగాలిన పిల్లి వలె**

ఆలస్యమున కోర్వ లేక. ఒకచోట నిలువక. ఉత్కంఠాందోళితస్థితిని తెలిపే పలుకుబడి.

"కాలు గాలిన పిల్లికరణి నీ వెంట, నేల నీబంట నై యెల్లందుఁ దిరుగ." గౌర. హరి. 2. భా. 1243.

"ఎంత సేపటికీ భార్య రాకపోయేసరికి వాడు కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతున్నాడు." వా.

**కాలు గీరు**

సైగ చేయు.

"వాడు నేను మాట్లాడుతుండగా ఎక్కడ వాళ్ళ మాటకు ఒప్పుకుంటానో అని కాలు గీరాడు. తరువాత వస్తా మని చెప్పి లేచి వచ్చాను." వా.

**కాలు గోకు**

చూ. కాలు గీరు.

**కాలు చాపు**

1. విశ్రాంతి తీసుకొను.

"కాస్త కాళ్ళు చాపే అవకాశం కూడా లేదు. ఎన్నాళ్ళని మీద వేసుకుని చేస్తాం?" వా.

2. పని చేయుట మానివేయు.

"వాడు నా చేత కాదని మధ్యలో కాళ్ళు చాపేశాడు." వా.

3. త్వరగా నడుచు.

"సాయంకాలం కావచ్చింది. ఇంక పరువుదాకా ఉంది పల్లె. కాస్త కాలు చాపితే కాని చీకటి పడేలోగా చేరుకో లేం." వా.

4. ఆశించు.

అఱ్ఱులు చాపు వంటిది.

"కోమలాంగుళిదళహస్త తామరసము, కర్ణపూరత్వలీలకై కాలు సాప." శివ. 2.18.

**కాలుచ్చు**

పక్షులు మొదలగువాని కాళ్లకు చుట్టుకొనే వల. ఉరి.

"మిడిబోనుల గాలుచ్చులఁ, బడఁ దోలియు బోఁగులోను పఱచియు లేళ్లఁ, వడిగల జింకల నెల్లన్, బాడి చెరి..." యయా. 2.19.

**కాలు జారు**

తప్పుదారి త్రొక్కు.

వ్యభిచరించు.

"ఆ పిల్ల ఎప్పుడో చిన్నతనంలో కాలు జారిందని అంత నీచంగా చూడడం ఏం బాగ లేదు." వా.

"ఒకసారి కాలు జారితే ఇక ఆపుకోవటం కష్టం." వా.

**కాలు తీసి పెట్టకుండా**

చూ. కాలు క్రింద పెట్టకుండా.

**కాలు త్రొక్కి కంకణం కట్టు**

విధివిహితంగా పెండ్లి చేసుకొను.

వివాహంలోని ఆచారంపై వచ్చిన పలుకుబడి.

"అంత నిర్బంధం చేయడానికి నీ వేం కాలు తొక్కి కంకణం కట్టావా? నా యిష్టం వచ్చినచోటికి నేను పోతాను." వా.

చూ. కాలు ద్రొక్కు.

**కాలు త్రొక్కికొని వచ్చు**

వెన్నంటి వచ్చు.

"మీకును మాకును నీ వైరం బెక్కడ నుండి కాలు త్రొక్కికొని వచ్చెనో యెఱుంగ." ధర్మజ. 59.17.

**కాలు త్రొక్కికొను**

తొందరపడు.

"కాలు త్రొక్కికొనుచుఁ గళవళపడు చున్న, నెన్నొ యట్టిసేతులు మున్ను కన్న, వారలాట నా యొయ్యారులు వాడక, పదిలపఱిచి సరగ స్వాంతము లను." భద్రావత్య. 2.

"ఏదో చేయాలి గానీ ఊరికే కాళ్లు త్రొక్కుకుంటూ కూచుంటే ఏం లాభం?" వా.

**కాలు దన్ను**

కాలూని నిలుచు.

"అచటికి వేగంబ యరుగక యిచటఁ గాలన్ని యుండెడు నట్టి ధైర్య మెందుఁ గలదు. భార. మౌస. 97.

"ఇట్లు వెఱచఱచి యవిసినకలంబు జనంబులు దీవి సేరినయట్లు కర్ణుం జేరి కాలు దన్ని నిలిచె.". భార. కర్ణ. 3.165.

**కాలుదివిటీ మర్యాద**

రాచమర్యాదలలో ఒకటి.

"ఆయనగారు కాలుదివిటీ మర్యాదలతో తీసుకొని వస్తే గానీ వచ్చేట్టు లేదు." వా.

చూ. కాలుదివియ.

**కాలుదివియ**

రాజులూ మొదలయినవారు పోతుండగా దివిటీలను వంగి పట్టుకొని ముందు నడుస్తుంటారు. అదొక రాచమర్యాద. అలా పట్టుకొనే దివిటీలను కాలుదివియలంటారు. దీనినే కాలుదివిటీ

మర్యాద అనుట కూడా
కలదు.

"వారు సంభ్రమించి వడిఁ గాలు దివి యలు, గొనుచు ... నృత్త శాలఁ జొచ్చిరి." భార. విరా. 3.4.

కాలు దూయు

పాఱిపోవు.

"ఆలు కాలు దూసిన నాఁటఁ గోలెఁ బవలు, రాతి రనఁ బోక దాసరి రామ లక్ష్మి..." భద్రావత్యు. 2.

కాలు ద్రవ్వు

కలహమునకు పిలుచు.

తిరస్కరించు.

"కరికుంభములమీఁదఁ గాలు ద్రవ్వుట గాక, జక్కవకవతోడ వక్కరించు." విక్ర. 8. 44.

"శేషదర్పము చివ్వి శీతాంశురుచి నవ్వి, పాలమున్నీటిపైఁ గాలు ద్రవ్వు." కళా. 1.76.

కాలు ద్రొక్కు

1. వివాహ మాడు.

"నాకాలు ద్రొక్కితి నన్ను మన్నించి, నాకోర్కి దీర్చుట న్యాయంబు నీకు." ద్విప. మధు. 8.

చూ. కాలు త్రొక్కి కంకణం కట్టు.

2. ప్రవేశించు.

"పూసపాటి మహాస్థానభూమియందు, గాలు ద్రొక్కక నోడుఁ జండాలుఁ డైన." సూరకవిచాటువు. వావిళ్ల.

కాలు నిలువదు

స్థిరంగా ఒక చోట ఉండ లేడు (దు) అనుట.

"వాడికి ఒక చోట కాలు నిలువదు. వా డేం పని చేస్తాడు?" వా.

కాలు నేల గీరుతూ

సిగ్గుతో అనుట.

"వాళ్ల బావ రాగానే ఆ అమ్మాయి కాలు నేల గీరుతూ నిల్చున్నది." వా.

కాలు నేల దింపకుండా

హాయిగా.

"లీల మెయిఁ బల్లకీలోని కాలు నేలఁ, బెట్టక చెలంగుసంపద...." శ్రవ. 1.37.

కాలు పురుగు తొలుచు

ప్రయాణేచ్ఛ విపరీతంగా కలుగు.

"వాడు ఒక చోటని నిలబడతాడా? వాడికా ఎప్పుడూ పురుగు తొలుస్తూనే ఉంటుంది." వా.

కాలు పెట్టిన వేళ

కాపురానికి వచ్చిన వేళ.

ఒక్కొక్కసమయాన్ని బట్టి బాగోగులు కలుగుతాయన్న జ్యోతిశ్శాస్త్రసంప్రదాయంపై యేర్పడిన పలుకుబడి.

"ఆ పిల్ల కాలుపెట్టినవేళ ఇంటికి పదిళ్లయ్యాయి. మన పిల్ల కాలు పెట్టినవేళ యెలాంటిదో కాని ఇల్లు గుల్లయి పోయింది." వా.

కాలు పెట్టే సందిస్తే....

ఏ కొంచెం అవకాశం ఇచ్చినా.

"వాడికి కాలు పెట్టే సందిస్తే ఇక మన అని ఇక్కడ ఉండనీయడు." వా.

కాలు పొడుచు

కాలూను.

"ఒక్కయెడం గాలు వొడిచి..." పాండు. 4.237.

**కాలు బట్టి తీయు**

క్రింద పడద్రోయు.

"ఓరి! మిమ్ము నా కాలు బట్టి తీతునో." హేమ. పు. 84.

**కాలుబలము**

పదాతిబలము.

"చదిసెఁ గాలుబలము." భార. భీష్మ. 2.165.

రూ. కాల్బలము.

**కాలు బైట పెట్టకుండా**

ఏమాత్రం శ్రమ పడకుండా.

"వాడి కేం? కాలు బైట పెట్టకుండా జరుగుతుంది." వా.

చూ. కాలు కింద పెట్టకుండా.

**కాలుమడి**

చూ. కాల్మడి.

**కాలు మడుచు**

మూత్రవిసర్జనము చేయు.

ఇది కొన్ని వర్గాలలో నేటికీ వాడుకలో ఉన్నది.

"కాలు మడిచి కాళ్లు కడుక్కొని వస్తా ఉండండి." వా.

**కాలు రాపడ తిరుగు**

కాళ్లు అరిగిపోవునట్లు తిరుగు.

"చోరనిబిలంబులున్ వెడలఁ జూడని క్రంతలుఁ గాలు రాపడం, దిరుగని త్రోవలున్." ఉ. హరి. 1.131.

వాడుకలో రూపం: కాళ్ళు అరిగేట్టు తిరుగు.

"నెలనుంచీ కాళ్లు అరిగేట్టు వాళ్లింటికి తిరుగుతున్నాను. కానీ యిప్పటికీ ఆ పుస్తకం అతడు తిరిగీ యివ్వడు." వా.

**కాలువ క్రంత**

సొరుప్రా డొంకా. జం.

"తోట దొడ్డి యనెడు మాట లేకుండంగ, గాలువ క్రంతలక్రందడంగ." సుదక్షి. 4.69.

**కాలువకు పోవు**

బహిర్భూమికి వెళ్లు.

ఇది ఒక్కొక్క చోట ఒక్కొక్క రూపంలో ఉంటుంది. కాలువ ఉన్న ప్రాంతాల్లో కాలువ కనీ, యేరున్న ప్రాంతాల్లో యేటి కనీ, వంక కనీ, దొడ్లున్న చోట దొడ్డి కనీ, ఏమీ లేని చోట చెంబు పట్టుకొని అనీ, బహిర్భూమికనీ, యిలా రకరకాలుగా యీ పలుకుబడి మారుతూ ఉంటుంది.

**కాలువలు గట్టు**

ప్రవహించు; ఏకధారగా వెడలు.

"ఇట్లు మధుసూదనుం డేయు సాయకంబులు గాలువలు గట్టి మెయిమఱువులు సించియు." ఉ. హరి. 1.148.

**కాలు సాచు**

ఆశించు; సిద్ధమగు.

"ఎవ్వండు నీచిత్త మెఱిఁగించుచున్నాఁడు, కైవల్యపదమున కై కాలు సాఁచి." హర. 3.43.

"ఆ ముసలాయన కాటికి కాళ్లు చాచుకొని ఉన్నాడు." వా.

కాలుసేతులు కట్టించి తెచ్చు

నిర్బంధముగా కొనివచ్చు.

వాడుకలోనూ: 'నీవు రాక పోతే కాళ్లు చేతులు కట్టించి తీసుకు పోతాను' అంటారు.

"శిష్యులచేఁ గాలుసేతులు గట్టించి, తెచ్చి పద్యముఁ జెప్పఁ దెమలకుండి."
హంస. 3.141.

కాలూదు

స్థిరముగా నిలుచు.

"...అందు నల్దిక్కులం, గనుపింప స్వేద గుండెకాయ లదరం గాలూఁద లేకస్నెడన్." శుక. 2.268.

కాలెత్తు

వ్యభిచరించు.

సురతక్రీడాసూచకంగా కాలెత్తుట ప్రయుక్తం.

"కన్నవాడికీ కాలెత్తే పాడుబుద్ధి దానిది." వా.

కాల్గజ్జ గొను

పాదధూళి తీసుకొను.

"కలకంఠు భక్తులఁ గన్నంత నవ్వు, సఖణారి సఖణారి సఖణారి యనుచుఁ, గర మర్థి వారిచేఁ గాల్గజ్జ గొనుచు."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 118.

కాల్గజ్జ లంటే పాదుక లని పూర్వకోశాలు. కానీ కాల్గజ్జ కొను అన్న ప్పుడు అర్థం తప్పని తెలుస్తూనే ఉంది. సందర్భాన్నిబట్టి కూడా పాద ధూళి తీసుకొను అనుట సరి అనిపిస్తున్నది.

కాల్చనా?

ఎందుకు? వ్యర్థ మనుట.
నా. మా. 13.

కాల్చువడు

దెబ్బ తిను, ఓడిపోవు.

"పెనుం, గరిగొన గాల్చువడజము కంటెను బెద్దలె?" కమా. 4.76.

కాల్బలం

పదాతిసైన్యం.

"కాల్బలముల గీటడంచి."
మార్కం. 8.104.
చూ. కాలుబలము.

కాల్మడి

మూత్రము.

"కాళ్ళుచేతులు నెన్నఁడుఁ గడుగు కొనఁడు, విడుచుఁ గాల్మడి నిలుచుండి నడచి నడచి." మల్హ. 3.6.
హరి. పూ. 6.5.
రూ. కాలుమడి.

కాల్వీరు

కాల్బలం, పదాతిదళం.

"ఎదురం గాల్కొని నిల్వ నుక్కణఁగి వెన్నిఁ గాల్వీరు." కమా. 11.35.

కాల్కొని నిల్చు

గట్టిగా ఎదిరించి నిలబడు, కాలూని నిలుచు.

"ఎదురం గాల్కొని నిల్వ నుక్కణఁగి." కమా. 11.35.

కాల్దోమి కడుగు

కాళ్లు బాగా రుద్దుకొని కడుగుకొను.

పండితా. ప్రథ. పురా. పుట. 298.

**కావడించు**

కావడివలె కాళ్లు చేతులు కట్టి కట్టి కటూ ఇటూ వ్రేలాడ దీసి కట్టు కావడివలె చేయు.

"కాలుఁ జేయుఁ బడియుఁ గావడించి." కుమా. 2.86.

**కావడిపాటు పడు**

నీళ్లు మోయు.

"ఉదర,పోషణంబునకై యూరిస్వాంత దోస,లోఁటఁ గావించెఁ గావడిపాటు పడుచు." శుక. 3.373.

2. క్రింద మీద పడు.

కావడికుండలు స్థిరముగా ఒకటిగా ఉండక, కిందికీ మీదికీ వాలుటనుబట్టి వచ్చిన పలుకుబడి.

**కావరము పట్టు**

పొగ రెక్కు-

"సురతకేళుల నలరింప సుఖము మరిగి, తిరిగెఁ దనయ త్తకన్నుఁ గావరముపట్టి." హంస. 5.176.

"వాడి కెంత కావరం పట్టిం దని. పిలిస్తే తలెత్తైనా చూడ డే?" వా.

**కావలసినంత (మంది)**

సమృద్ధిగా.

"వాడిదగ్గఱ కావలసినంత డబ్బుంది. వాడి కేం లోటు?" వా.

"నీవు కాస్త సాయం చేస్తే కావలసినంత పని చేయవచ్చు" వా.

"ఈ ఊళ్లో కూలి కేం? కావలసినంత మంది వస్తారు." వా.

**కావలసినదే**

వాడి కా శాస్తి జరగవలసినదే.

"వానికి మొన్న గుఱ్ఱప్పందేలలో పది వేలు పోయా యట. కావలసిందే వెధవకు." వా.

**కావలసినవాడు**

ఆప్తుడు, ఇష్టుడు.

"మనకు ఇతను చాలా కావలసినవాడు. ఏదో పనిమీద మీ దగ్గరకు వచ్చాడు. అది కాస్తా చేసి పెట్టండి." వా.

చూ. అయినవాడు.

**కావలి పెట్టుకొని యుండు**

రక్షణకు ఏర్పాటు చేసి యుండు.

"మణిపర్వతంబునం బురంబు చేసి కావలి పెట్టుకొని యుండె." ఉ. హరి. 1.84.

**కావించి చెప్పు**

లేనిపోనివి కల్పించి చెప్పు; చాడీలు చెప్పు.

"అది నామీద ఏవేవో కావించి చెప్పి నా మొగునికీ నాకూ కాకుండా చేసింది." వా.

**కావు కావని యేడ్చు**

ధ్వన్యనుకరణము.

పిల్లలవిషయంలో నేడు ఉపయోగిస్తారు. 'కావు కావుమని యేడుస్తున్నాడు.'

"నీ వంతలోఁ గావు కావంచు నేడ్పులఁ దలిర్పన్." పాణి. 3.37.

"ఎఱుక చెడి కావు కావున నేడ్చు బ్రాణి." కవిక. 5.103.

**కావు పట్టు**

మాగవేయు అనగా లక్షణయూ బాగా చితక తన్ను. మాగగొట్టు అని ఇదే అర్థంలో నేటికీ అంటూరు.

"కావరంబునఁ గన్ను గానవు జనుఁడు, కావు పట్టక నినుఁ గానఁడు సుమ్ము." నవ. 1.48. పు. 25.

**కావు వచ్చు**

మాగి పండ్లకు నుంచి రంగు వచ్చు.

"మొన్న కావు వేసిన పండ్లప్పుడే కావు వచ్చినవి." వా. వావిళ్ళ.

**కావు వేయు**

పండుటకై కాయలపై గడ్డి కప్పు.

"నిన్న వేము మామిడికాయలు కావు వేసినాము." వావిళ్ళ.

**కావేరిగుజ్జములు**

ఉత్తమాశ్వములు.

"తేరు లన్నియు గూరాటితేరులుగను గుజ్జముల నెల్లఁ గావేరి గుజ్జములుగ..." మొల్ల. సుం. 172.

**కాసావాడు**

జమీందార్ల, రాజుల దగ్గర ఉండే దాసీపుత్రుడు.

**కాసింత**

కొంచెము.

"సున్నం వుంటే కాసింత పెట్టు." వా.

**కాసు కప్పర**

కాసు వీసం. జం.

"అంగడి యంగడిం దిరుగులాడుటకుం బలువిత్తు విష్టతిం, బొంగుచుఁ గాసు కప్పరకుఁ బోవుచుఁ బెక్కు పదార్థముల్ గ్రహిం, పంగొఱ గాక..." బహులా. 1.11.

**కాసుకు కాక పోవు**

పనికి రాక పోవు.

"కపురంపు జిగి మించు కరి సెక్కి యూరేగు, క్రమ మెక్కఁ గాసుకుఁ గాక పోయె." వ్యాఖ్యా. చాటు-తె. జా.

**కాసుకు గొనక**

లక్ష్యపెట్టక.

"సురుఁగక చొచ్చి కాసుకు నన్నుఁ గొనక." గౌ. హరి. ప్రథ. పంక్తి. 1104.

కాసు పూర్వకాలంలో చాలా చిన్న నాణెం. ఆ మాత్రం విలువ కూడా యివ్వక అనుట. అందుపై వచ్చిన పలుకుబడి.

**కాసు చేయని**

పనికి రాని.

"కాసు సేయనిపనికిఁ గాపిఁ బడెఁ బ్రాణి." తాళ్ల. సం. 5.101.

**కాసును గీసు దూసికొను**

ధనమో పణమో సంపాదించుకొను.

ఇలాంటి అర్థంలోనే కాసో వీసమో రాల్చుకొను వంటివి ఉన్నవి.

"......తనుమర్దన మాచరించుచుఁ, గాసును గీసు దూసికొనుఁ గాని విడం డతఁ డేమి చెప్పఁదుఁ?" శుక. 2.362.

కాసువీసములు

ఏ కొంతో డబ్బు. జం.

"ఎన్నఁడుఁ గాసువీస మొక టిచ్చిన వాఁడవు గావు." విప్ర. 4.27.

కాసె నిలుకడ

మల్ల బంధములలో ఒకటి.

హంస. 1.206.

కాసె యులి

ఒక రకమైన ఉలి.

వావిళ్ళ.

కాసె వోయు

గోచిగా కట్టు.

"ఆవిడ కాసె వోసి చీర కడుతుంది." వా.

కాస్తా కూస్తా

కొంచెమో నంచెమో ? జం.

"కాస్తా కూస్తా? పదివేల రూపాయలు పోతే యెవరికి మాత్రం కష్టంగా ఉండదు?" వా.

కాహళలు పట్టించు

బాకా లూదు

"తూర్యంబులు గొట్టించియుఁ గాహళులు పట్టించియు." మను. 4.37.

కాళల దోవతి యగు

అడ్డ మగు.

నడచునప్పుడు అడ్డపడుతుంది కాబట్టే దోవతిని ఎగ జెక్కు కోవడం అలవాటు కదా!

"కావిరి వావిరిం దగిలి కాళుల దోవతి యయ్యె." పాండు. 2.217.

కాళ్ల(క)కాడ బ్రదుకు

ఆశ్రయము.

"మా దేముంది నాయనా! మీ కాళ్ల కాడ బ్రతుకు. మీరు కాదంటే మేము ఎక్కడికి పోతాం?" వా.

కాళ్లకింద గోతులు తీయు

మంచిగానే ఉండి ద్రోహము చేయు.

"వాడు పైకి మంచిగానే కనిపించినా కాళ్లకింద గోతులు తీసే రకం. జాగ్రత్త." వా.

కాళ్లకు నీళ్లిచ్చు

అతిథిసత్కారము చేయు.

ఎవరైనా వచ్చినప్పుడు ముందు కాళ్లకు నీళ్లివ్వడం, కూర్చొన్న తర్వాత దాహం ఇవ్వడం మన ఆచారం.

"ఎవరైనా యింటికి వచ్చినప్పుడు కాళ్లకు నీళ్లయినా యివ్వక పోతే యెట్లా?" వా.

కాళ్లకు పసుపు రాయు

శుభకార్యములలో సత్కారము చేయు.

"వాళ్లింటికి పెండ్లికి పోతే ఏమైనా పెద్ద ముత్తైదువును కదా కాళ్ళకు కాస్త పసుపైనా రాయ లేదు." వా.

కాళ్లకు బలపాలు కట్టుకొని తిరుగు

కాళ్ళరిగేట్టు తిరుగు.

చూ. కాలికి బలపం కట్టుకొని తిరుగు.

**కాళ్ల జెట్టి**

కాళ్ళు చాలా ఉండే జెట్టి.

"ఈ మధ్య ఎక్కడ బట్టినా కాళ్ళ జెట్టులు కనిపిస్తున్నాయి. కాస్త జాగ్రత్త రా బాబూ! అవి చెవిలో దూరుతాయట." వా.

**కాళ్ల పెనగు**

కాళ్ళమీద పడు.

"కలికి నెఱి వేణి చెలువంబు గాళ్లఁ బెనఁగ." విజయ. 2.116.

**కాళ్ల బేరమునకు వచ్చు**

లొంగి వచ్చు.

కాళ్లు పట్టుకొనుటకు సిద్ధపడు.

"గట్టిగా నిలబడితే వాడే కాళ్ల బేరానికి వస్తాడు." వా.

**కాళ్ల మీద గంజి పోసికొను**

వెంటనే తొందరగా పోవాలని త్వరపడు.

"వీడు ఎప్పుడు వచ్చినా కాళ్లమీద గంజి పోసుకొని వస్తాడు." వా.

**కాళ్ల మీద పడు**

ఆశ్రయించు, ప్రాధేయపడు.

"వాడు ఎలాగైనా యాచిక్కు తప్పించవలసిం దని నా కాళ్ళమీద పడ్డాడు. ఏం చేస్తాం?" వా.

**కాళ్ల రిగిపోవు**

ఎక్కువ తిరుగుటను సూచించేపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఆ పుస్తకంకోసం వాడిచుట్టూ తిరిగి కాళ్లరిగి పోయాయి." వా.

"ఆ పుస్తకంకోస మని వాళ్లింటిచుట్టూ కాళ్లరిగి పోయేటట్టు తిరిగాను." వా.

**కాళ్లాడ లేదు**

1. ఏమీ తోచ లేదు.

"ఉన్నట్లుండి ఈ మాట తెలిసేసరికి నాకు కాళ్ళాడ లేదు." వా.

2. పోవుటకు మన సొప్ప లేదు.

"ఈ అమ్మాయిని వదిలిపెట్టి పోవడానికి నాకు కాళ్లాడడం లేదు. పసిపిల్ల. కొత్తావు." వా.

**కాళ్లా వేళ్లా పడు**

బ్రతిమలాడు.

"నే నెంత కాళ్లా వేళ్లా పడినా వాడు సాయంత్రందాకా ఉండ మన్నా ఉన్నాడు కాదు." వా.

**కాళ్లు అరిగేటట్టు తిరుగు**

ఎక్కువగా తిరుగు.

"కాళ్ళరిగేటట్టు తిరిగినా ఒక్క కవళం కూడా దొరక లేదు." వా.

**కాళ్లు కట్టివేయు**

ఏమీ చేయనీయక పోవు.

"వాడు నన్ను కాళ్లు కట్టివేసి మూల్లో కూర్చో పెట్టాడు." వా.

**కాళ్లు కట్టివేసినట్లుగా**

నిర్బంధములో ఉన్నట్లుగా.

"అక్కడ పొలాల్లో చెడతిరిగేవాణ్ణి. ఈ పట్నానికి వస్తే కాళ్లు కట్టివేసినట్లుగా ఉంది." వా.

**కాళ్లు కడిగి నీళ్ళు తాగు**

ఎంతో భక్తిగౌరవాలతో చూచుకొంటాను అను సంద

ర్భంలో ఉపయోగించే పలుకుబడి.

"వా డేమీ చేయ నక్కర లేదు. కాస యింటిముందు కూర్చుంటే చాలు. కాళ్లు కడిగి నీళ్లు తాగుతా. కాని వాడు వింటేనా. దేశాల వెంబడి తిరుగుతా నంటాడు." వా.

**కాళ్లు కడిగి కన్యాదానం చేయు**

విధివిహితంగా పిల్ల నిచ్చు. వివాహంలో అల్లుని కాళ్లు కడిగి మామ పిల్ల నిస్తా నని చెప్పడం, అట్లా ఇవ్వడం ఆచారం.

"వాణ్ణి ఇంట్లో పెట్టుకొని కాళ్లు కడిగి కన్యాదానం చేస్తే వా డిట్లా చేయ వచ్చునా?" వా.

**కాళ్లు కడుపులు పట్టుకొను**

బ్రతిమలాడు.

"ఏదో నలుగురి కాళ్లూ కడుపులూ పట్టుకొని కొడుకును చదివించుకొని బ్రతుకుతున్నాను." వా.

**కాళ్లు కాయలు కాచు**

ఎక్కువ నడచినప్పుడు కాళ్లకు కాయలు కాయడం సహజం. అలాంటిపట్ల ఉపయోగిస్తారు.

"ఊరంతా తిరిగి తిరిగి కాళ్లు కాయలు కాచినవి గానీ వా దేమో కనిపించ లేదు." వా.

**కాళ్లు కొట్టుకొంటూ**

చాలా కష్టపడి నడుచుకొంటూ.

"వాడు పొరుగూరు వెళ్ళా డనే సరికి ఆ నాలుగు మైళ్ళూ కాళ్లు కొట్టుకొంటూ వెళ్లవలసి వచ్చింది." వా.

**కాళ్లు గట్టు**

కాళ్ళను కదలకుండా చేయు; విడిచిపోకుండా చేయు.

"నీ కామశా(స్త్ర)ముల్ బిడ్డ. కనట్టి కాళ్ళను గట్టింప నెట్లు, విచ్చేయు." పండితా. ప్రథ. పురా. పుట. 362.

**కాళ్లు చల్లబడు**

నిరాశ కలుగు. శీతం ముంచుకొన్నంత పని అయిన దనుట.

"వాడు ఆ మాట చెప్పేసరికి నాకు కాళ్లు చల్లబడ్డాయి. వా డేదో ఇస్తాడు కదా అని అంత ఆశతో వెళ్లాను." వా.

**కాళ్లు చాచుకొని కూర్చుండు**

పనీ పాటా లేక కూర్చుండు.

"చేయవలసిన పని యింత ఉంటే నువ్వేమో కాళ్లు చాపుకొని కూర్చున్నావు." వా.

**కాళ్లుతీపులు**

కాళ్లనొప్పులు.

"తల నొప్పి కడుపు కుట్టుం, బలు గురుపుం గాళ్లు తీపు పాటించుచు నె,చ్చెలి." శుక. 2.205.

కాళ్లు, చేతుల విషయంలోనే కాళ్ల తీపులు, చేతుల తీపులు అని వాడుక. కాళ్లు తీపు అన్న రూపంలో మాత్రం నేడు వాడుకలో లేదు.

చూ. చేతులతీపులు.

**కాళ్లు తేలిపోవు**

నీరసించి పోవు; నీళ్లలో అడుగంటక కాళ్లు పైకి లేచి పోవు.

"పొద్దున్నుంచీ తిండి లేక నడవాలంటే కాళ్లు తేలిపోతున్నాయి." వా.

"ఏదో తక్కువ పీస్లున్నా యని నడవబోతే కాళ్లు తేలిపోయాయి." వా.

**కాళ్లు నిలవవు**

స్థిరత్వము లేదు అనుట.

"వానికి ఒక్కచోట కూడా కాళ్లు నిలవవు. ఎప్పు డెక్కడ ఉంటాడో దేవునికే తెలియాలి." వా.

**కాళ్లు పట్టుకొను**

ప్రాధేయపడు.

"ముట్టకు చాలుఁ జాలుఁ గడు మోహపు దేవుల కాళ్లు పట్టుకో, నెట్టును జెల్లుఁ గాక." కళా. 7.231.

"నీ కాళ్లు పట్టుకొంటాను నాయనా! మావాణ్ణి ఎలాగైనా ఈ ఆపదలోనుంచి తప్పించు." వా.

**కాళ్లు పడిపోవు**

1. ఎక్కువ నడచుట వగైరాలతో కాళ్ళు నొప్పి పెట్టు.

"పొద్దున్నుంచీ తిరిగి తిరిగి కాళ్లు పడిపోయాయి. ఇంక నే నెక్కడికీ రాలేను." వా.

2. పక్షవాతము తగిలి కాళ్ళు స్వాధీనము తప్పు.

"వాడికి పక్షవాతం వచ్చి కాళ్ళు పడిపోయినాయి." వా.

**కాళ్లు పార జాపు**

ఇక నాతో కా దని చేతులు వెల్లకిల వేయు.

చూ. కాలు చాపు.

**కాళ్లు మొగములు వాచి**

వానికై విపరీతమైన ఆసపడి. గర్భిణీస్త్రీలకు కోరి కే దైనా ఉంటే, కాళ్లు మొగము దద్దరించు నని వాడుక. తర్వాత అది సర్వత్రా ఉపయోగించే పలుకుబడి అయినది.

"నీవరవు శైల...దొంటి రాజాన్నముల్ దలఁచి, వడిఁ గాళ్లు మొగములుఁ వాచి వచ్చుడును..."

పండితా. ప్రథ. పురా. పుట 287.

చూ. కాళ్ళూ మొగం వాచు.

**కాళ్లు రాక పోవు**

కాళ్లాడక పోవు.

"చాలక భీతుఁడై జలజాప్తసుతుఁడు, వడి చెడి పాతిపోవను గాళ్లు రాక."

సుగ్రీ. పు. 28.

"ఆ కిరాతకుల ఇంట్లో పిల్లను వదలి రావా లంటే నాకు కాళ్లు రాలేదు." వా.

**కాళ్లు రెండూ ఒక చోట పెట్ట లేదు**

ఏమాత్రం విశ్రాంతి తీసుకో లేదు.

"పొద్దున్నుంచీ ఒకే పని. కాళ్లు రెండూ ఒక చోట పెట్ట లేదు." వా.

**కాళ్లు వచ్చు**

1. వయసు వచ్చు.

కాస్త అటూ ఇటూ పారాడే
వయసు వచ్చిన దనుట.

"వా డేదో నాకు ముసలితనంలో ఆదరువుగా ఉంటా డని చాకి సంతరించాను. కాస్త కాళ్లు రాగానే వాకు ఊడాయించాడు." వా.

2. నడక వచ్చు.

"మా వాడికి సంవత్సరం కూడా నిండక ముందే కాళ్ళు వచ్చాయి." వా.

## కాళ్లు విఱుగ గొట్టుకొను

తొందరపడు.

"ఎప్పటి కయ్యేది అప్పటి కవుతుంది. ఊరికే కాళ్లు విఱగగొట్టుకుంటే పను లవుతాయా?" వా.

## కాళ్లూ చేతులూ ఆడడం లేదు

ఏమి చేయుటకూ తోచుట లేదు.

ఏమి చేయుట కైనా కాళ్లూ చేతులూ ఆడితేనే కదా! అవి ఆడక పోవుట ఏమీ చేయ లేక పోవుటగా ఏర్పడినది.

"ఉన్నట్టుండి ఆ అమ్మాయి పడక వేసే సరికి నాకు కాళ్లూ చేతులూ ఆడడం లేదు." వా.

## కాళ్లూ మొగం వాచు

ఎంతో ఆశపడు.

గర్భిణీస్త్రీలకు ఏవేవో ఆశ లుంటాయని. ఆ ఆశలు తీరక పోతే కాళ్లూ మొహం వాస్తుం దని ఒక ప్రతీతి. అందుపై వచ్చిన పలుకుబడి.

"నే నేం కాళ్లూ మొగం వాచి ఉన్నా ననుకొన్నావా?" వా.

చూ. కాళ్లు మొగములు వాచి.

## కింకర అగు

ఏదో పీడ తగులు.

ముఖ్యంగా చంటి పిల్లలకు జబ్బు చేసినప్పు డంటారు.

"ఈ పిల్లవాడికి ఏవో కింకర అయిన ట్టుంది. పీరాచారి దగ్గర యంత్రం కట్టించే పని చూడాలి." వా.

## కింకిరి చేయు

మలవిసర్జన మొనర్చు.

"అప్పుడు నందనుం డా యోగివరుని, చీరపైఁ గింకిరి చేయ." నవ. 4.

## కింకిరిపడు

విసుగుకొను; అసహ్యంచుకొను.

"అతిథి నినుఁ గోరె నేనియు, మఱిఁ గింకిరి పడక యోల మాసగొనక నీ, వతనికిఁ బ్రియంబు సల్పుము..." భార. అను. 1.68.

"అడరుదుర్గంధాన కణుమాత్ర మైనఁ, గింకిరిపడక శంకింపక ధైర్య, మింకక చండాలు నింటికి నేఁగి." గౌర. హరి. ఉ. 1584.

## కింకిరిపాటు

అసహ్యం, కోపం.

"నగుమొగంబులఁ గాని నాతి నీదెస నెప్డుఁ, బతులకుఁ గింకిరిపాటు లేదు." భార. అర. 5.291.

## కించపడు

సంకోచించు.

"న న్నన్నిమాట లన్నాడా? నే నిం

దులో సాయం చేశా నని తెలిసి అతను చాలా కించపడ్డాడు.'' వా.

**కింద పడినా పైచేయి నాదే**

ఎంత దెబ్బ తిన్నా పౌరుషాలు నరికేవారి విషయంలో ఉప యోగించే పలుకుబడి.

''వాణ్ణి నానామాటలూ అని పంపించారు. అయినా వీడికి పొగరు తగ్గలేదు. కింద పడినా పై చేయి నాదే అనే రకం.'' వా.

చూ. కిందపడినా మీసం మన్ను కాలేదు అన్నట్లు.

**కిందపడినా మీసం మన్ను కాలేదు అన్నట్లు**

తాను దెబ్బ తిన్నా - ఓడిపోయినా ఒప్పుకోనక పోయే వాని విషయంలో అనుమాట. కుస్తీలో ఓడినా మన్ను వీపుకే అయింది కానీ మీసాలకు కాలేదు కదా అని సంతృప్తి పడేరకం అనుట.

చూ. కింద పడినా పైచేయి నాదే.

**కిందాకు మీదాకు వాసి యగు**

ఏదో కాస్త ఇంచుమించుగా అగు.

''చచ్చిపోయిన వారికై చాల వగల, దుఃఖపడుదురు మఱునాఁడు దొడరి చనరొ, తాము బ్రదుకుట కేది తథ్యంబు తడవ, వనిత కింఁదాకు మీఁదాకు వాసి గాదె.'' కచే. 1.80.

ఆకులు రాలిపోవునప్పుడు మీదాకు ముందు రాలిపోయినా కిందాకు వెను వెంటనే మీదాకై రాలిపోవలసినదే కదా!

**కిందా మీదా పడు**

ఏదో అవస్థపడు.

ఒకప్పుడు తగ్గిపోతూ బాధపడుతూ, మరొకప్పుడు తేరుకొని పైకి లేస్తూ అనుట.

''ఆ యింత ఆస్తిలోనే వాడు కిందా మీదా పడి కొడుకును బి. ఏ. దాకా చదివించాడు.'' వా.

**కిందుపడు**

ప్రాఁథేయపడు; లొంగు.

''ఏల కిందుపడి మొక్కేవేమి భాతినే నీవు.'' తాళ్ల. సం. 4.168.

**కింవదంతి**

జనశ్రుతి; పుకారు.

''త్వరలోనే ఈ పల్లెకు పోస్టాఫీసు వస్తుం దని కింవదంతిగా ఉంది.'' వా.

**కికాకిక నగు**

ధ్వన్యనుకరణము.

''మిగుల రొదగాఁ గికాకిక నగుచు రతుల, యామములు పోక నెద్దియే నాడుకొనుచు.'' కళా. 1.147.
కళా. 8.177.

రూ. కికకిక నగు.

**కికురు పొడుచు**

త్రోసివేయు.

''త్రుళ్లుచుఁ గికురుపొడుచు.'' భాగ. 8.208.

చూ. కికురు వొడుచు.

**కికురువెట్టు**

1. మోసగించు.

''అతని చేత నున్న యమృతకలశము

సూచి, కెరలు వొడిచి సురలఁ గికురు వెట్టి, ప్రుచ్చుకొనిరి..." భాగ. 8.295.

2. త్రోసి పుచ్చు.

"ఏ నొక బ్రాహ్మణకన్యక, నై నరపతిఁ గికురు వెట్టి..." దశ. 9.62.

"కికురు వెట్టి సుమంతుఁ బాయుకలు గొంచు." సారం. 3.134.

## కికురు వొడుచు

మోసగించు.

భాగ. 10. స్క. 431.

చూ. కికురుపొడుచు.

## కిక్కు మనకుండ

ఏ మనకుండ.

"కిక్కు మనకుండ నేరికిఁ జిక్కు వడక." రాధా. 4.89.

"పెండ్లాం ఏమన్నా వాడు కిక్కు మన కుండా ఉంటాడు. మన మంటేనే ఇంత రాద్ధాంతం చేస్తాడు." వా.

## కిక్కు ముక్కురు మనక

నోరెత్తక.

బ్రౌన్.

చూ. కిక్కురు మనక.

## కిక్కురు మనక

నోరెత్తక ; ఏమాత్రం వ్యతిరేకించక.

ఇది లా 'అనక' అన్న వ్యతిరేకార్థంలోనే కాని కిక్కురు మను అన్నట్లుండదు. ఇలా కొన్ని పూర్వకోశా లిచ్చిన రూపం సరి కాదు.

"కిక్కురు మన కమృతంబుం, గ్రుక్కలు వెట్టుదురు సురలు..." హరి. 6.122.

## కిక్కురువెట్టు

వంచించు.

"శూలిక, గిక్కురువెట్టి పోయె లతికా స్తోమాంతరాళంబులన్." విష్ణు. నా. 4.253.

## కిచకొట్టు

1. కిచకిచ నవ్వు.

ధ్వన్యనుకరణము.

"పూవు గుత్తుల వంటి పూపచన్నులు గోళ్ల, నదిమినఁ గిచకొట్టునట్టి వేళ." శుక. 1.300.

2. కిచకిచలాడు.

"కిచకొట్టు ఒకదారి కివకివల్ చెవిఁ గుల్కు, కుదురుగుబ్బ లురంబుఁ గదియఁ జేర్చి." శుక. 1.303.

## కిటకిటని

జవజవలాడు.

"కిటకిటనికా నొకింత చలింపన్." విజయ. 3. 79.

## కిటకిట పండ్లు కొఱుకు

పండ్లు కొఱుకుటలో ధ్వన్యనుకరణము.

"జటిలుండు గిటకిటం బండ్లు గొఱికి హుమ్మని కటమ్ము లదుర ముకుఁబుటమ్ములు నటింప." మను. 5.19.

## కిటకిట మను

కిటకిట ధ్వని చేయు.

"కిటకిట మన రదనపంక్తిఁ గీటుచుఁ బలికెన్." పార్వ. 4.124.

## కిటకిటలాడు

క్రిక్కిరియు.

"వీధంతా జనం కిటకిట లాడుతున్నారు." వా.

కిటుకగు

వివాద మేర్పడు.

"తా ము స్నేసితి నటంచుఁ దమలోఁ గిటు కై." కా.మా. 4.184.

కిటుకులు పెట్టు

కష్టపెట్టు, చిక్కులు పెట్టు.

"కపటనాటకుఁ డైనకౌశికుఁ డాత్మఁ, గృప మాలి నినుఁ బట్టి కిటుకులు పెట్టి." హరిశ్చ. పు. 177.

కిటుకు పట్టు

తప్పు పట్టు.

"ఏ నటు పెఱుము అనుచు నించుక కోపము తాలేమి నాపై నొకలాగునం గిటుకు పట్టిన దోసము గాదు." విప్ర. 4.72.

కితా బిచ్చు

బిరుదిచ్చు, మెచ్చుకొను.

అస లర్థం బిరు దిచ్చు అయినా తర్వాత మెచ్చుకో లయినది.

"మెచ్చి పాచ్ఛా కితా బిచ్చుటచే వజా, రత విజయానంద రంగరాయ, లనఁగఁ బౌరుష నామధేయముల వెలసి." ఆనంద. పీఠి. 68.

"ఆ పోనిద్దూ. అతగాడు కితా బిస్తాడా? అంత ఒదిగి ఉండడానికి." వా.

కినుక చల్లారు

కోపము లెగ్గు.

కినుక అగ్నివంటి దనీ, అది యింకా ఆఱ లేదనీ ధ్వని.

"గుండియలు గ్రుళ్లఁ దన్నిన గ్రుక్కుఁ బెక్కు, రనక యాతని కినుక చల్లాఱ నిచ్చు." శుక. 3.627.

చూ. కోపము చల్లారు.

కినువడు

కోపపడు.

"అధిపతి నిన్ను నే, జన్నియ విడిచె రణముతఱి, మున్నక కినువడక పొమ్ము మీ గృహమునకున్." భార. విరా. 4.218.

కిన్నరకంఠి

మంచి కంఠస్వరముగల స్త్రీ.

"మేల్కిన్నరఁ జెంతఁ జేరి యొక కిన్నరకంఠి యొసంగ......" చంద్రికా. 2.95.

కిన్నెరవీణె

ఒక విధమైన వీణె.

"పసిఁడి కిన్నెరవీణెఁ బలికించు నెల నాఁగ." భీమ. 1.4.

కిమన్నాస్తి

ఏమీ లేదు.

హాటా. 97.

కిమ్మనకుండా

ఏమి అని ప్రశ్నించకుండా.

"అన్ని మాట లా పెండ్లాం అంటుంటే మా అన్న కిమ్మనకుండా కూర్చు న్నాడు." వా.

కిమ్మన నీదు

నోరు మెదప నీదు.

"ఇందుబింబమున్, గిమ్మన నీదు మోము గిరి కేపులు మూపులు కొను గాన రా, దమ్మక చెల్ల!" మను. 3.6.

వాడుకలో : వాడు కిమ్మనకుండా కూర్చున్నాడు. సంస్కృతంలో కిం అంటే ఏమి అని

ప్రశ్నార్థకం. ఏమి అనకుండ అనుట.

చూ. కిమ్మనకుండా.

**కిరాణాకొట్టు**

చిల్లరదినుసుల అంగడి.

**కిరీటం పెట్టు**

ఎక్కువ గౌరవించు, శ్లాఘము చేకూర్చు.

"అఁ! వా డేదో దారిలో కనబడితే మాట్లాడ్డం తప్పితే నాకు పెట్టినకిరీటం ఏముంది?" వా.

**కిరీటిపచ్చ**

గరుడపచ్చ.

విజ. 3.26.

**కిఱుకుచెప్పులు**

కిఱ్ఱుచెప్పులు.

చూ. కిఱుచెప్పులు.

**కిఱుచెప్పులు**

కిఱ్ఱు కిఱ్ఱు మని శబ్దం చేసే చెప్పులు.

"కిఱుచెప్పులు పిల్లవగ్రోవి యమరఁ బాలము దిరుగుచున్." చెన్న. 3.31.

**కిఱుదుకట్టు**

కుండలమీద చేసే ఒక విధమైన నగిషీపని.

హం. 5.13.

**కిఱ్ఱుచెప్పులు**

కిఱ్ఱు కిఱ్ఱు మని ధ్వనించే చెప్పులు.

"పాందవు కిఱ్ఱుచెప్పులును బొల్పెసఁగన్ ధనదత్తుఁ డెంతయున్." హంస. 1.172.

**కిఱ్ఱుబాగాలు**

కిఱ్ఱు పావుకోళ్ళు.

వైజ. 2. 45.

**కిలకిల ధ్వనులు**

ధ్వన్యనుకరణము.

"తరు లెక్కి కిలకిల ధ్వనులు సేయుచును." ద్విప. జగ. 177.

**కిలకిల నవ్వు**

ధ్వన్యనుకరణము.

"కిలకిల నవ్వుమోవి పలుగెంటుల దీఁటుఁ గుచంబు లోరఁగా." హంస. 1.217.

**కిలకిల లాడు**

కిలకిల మను.

"నారె సారెకున్, గిలకిలలాడుచున్ మిగులఁ గెకలు కొట్టుదు రంతె కాని." నీలా. 2.81.

**కిలాకిల నవ్వు**

కిలకిల నవ్వు.

ధ్వన్యనుకరణము.

"రంభ నగున్ గిలాకిలన్." కువల. 1. 85.

**కిలాడి**

నంగనాచి, మాయలమారి—ఇత్యాది ఛాయలలో స్త్రీ పుం భేదం లేకుండా ఉపయోగించే పలుకుబడి.

"వాడమ్మా కిలాడీ. నమ్మితే మసం నాశనం కావలసిందే" వా.

"అది వట్టి కిలాడీ. దాన్ని యింటికి రానిస్తే యిక అయినట్టే." వా.

రూ. కిల్లాడి.

కిలాదారు

ఖిల్లాదార్, దుర్గాధిపతి.

ఆనంద. పీఠి. 112.

కిల్కొడుకొను

గీచుకొని తీసుకొని పోవు, దొంగిలించుకొని పోవు.

"ఆ బాల యవయవముల, చెలువు గిల్కొడుకొనిరి గావలయు నేడు."

కుమా. 5.121.

కిల్లాకు

చీటి; ఫర్మానా.

ఖిల్లా అంటే కోట. తద్వారా రాజాజ్ఞాపత్రం అన్నట్లు ఏర్పడినది.

"ముల్లోకంబుల నేలుదు, బల్లిదుఁడను గింకరులు సుపర్వులు నాకుం, గిల్లాకు పంపు సేయం, బల్లవలవకృద్విలాస పద పద కమలా!" రామాభ్యు. 5.177.

"ఇదియు నూగక యుంటిఁ గాకేల నీకు, మాకతల్ విన బంటు కిల్లాకు పోవఁ, దొత్తుకొడుకులు వోలెఁ దోడ్తో దిగంత, భూమిపతు లంపుచున్నారు కామితములు." కళాపూ. 7.267.

"తనవచోదోషము క్షమింపు మనెడు వాఁడె, యే మనిన లేని వాతప్పు లెంచ సాఁగె, వినుము మహికాంత కొండంత పనికి నైనఁ, బలుకు లేటికి కిల్లాకు పనుప సాఁగె." కువల. 2.24.

కిల్లాడి

చూ. కిలాడి.

కిసరు తగులు

దృష్టి తగులు.

నేటికీ దృష్టి దోషం తగిలి జబ్బుపడితే కిసరు తగిలిం దనే రాయలసీమలో విశేషంగా అంటూరు.

"పిల్లకు కిసరు తగిలిన ట్లుందమ్మా. నాలుగు ఉప్పురాళ్లు చుట్టి వెయ్యి."

వా.

కిసరుపడు

దృష్టిదోషమునకు అగ్గమగు. వావిళ్ళ ని. కోపపడు అని అర్థం చెప్పింది. కాని కిసరు కున్న సహజార్థమే ప్రయోగంలో సరిపడుతున్నది.

"...పసిమి గలకిసలయమ్ములు కొసఁగ మెసంగి, కిసరు పడక కసగు సెడిఁ... మించి కరాళించు కోయిలల మొత్తంబులును." భాగ. 8.447.

కిసుక్కున తుమ్ము

తుమ్ముటలో ధ్వన్యనుకరణము.

పండితా. ప్రథ. పురా. పుట. 496.

కిసురు తీయు

పిల్లల పీడానివారణార్థం మంత్రతంత్రాదులతో దిగ దీయు.

"నెలసందు. కిసరు తగిలినట్లుంది. ముసెమ్మను పిలిచి కిసురు తీసివేయించండి."

వా.

కిస్తీ బంది

వాయిదాల ఏర్పాటు.

వావిళ్ళ. ని.

కిష్కింధంగా ఉండు

ఇరుకుగా ఉండు.

"ఆ యింట్లో అన్నీ ఉన్నా మరీ కిష్కింధంగా ఉంటుంది. ఇంతమందీ యెలా ఉండగలం." వా.

**కిష్కింధాపురవాసులు**

కోతులలాంటి వారు.

"ఆ కిష్కింధాపురవాసుల్లో పడితే మన మేం బయటికొస్తాం? నానా కంగాళీ పట్టించి పంపిస్తారు." వా.

**కీచుబిళ్ల**

దిండు; తలగడ.

శ. ర.

చూ. కీచుబుఱ్ఱ.

**కీచుబుఱ్ఱ**

1. దిండు, తలగడ.

"గిలకల మంచమున్ విరులు నించిన సెజ్జయుఁ గీఁచు బుఱ్ఱయున్." రాధికా. 1.10.

చూ. కీచుబిళ్ల.

2. బాలక్రీడావిశేషం. హంస. 3.

**కీచు మని పోవు**

చిక్కిపోవు.

"వాడీమధ్య మలేరియా వచ్చి మరీ కీచు మని పోయాడు." వా.

**కీజుపోరు**

ఊరక పోరు.

"కీలుగంటిది యేల పోలఁగా నును గొప్పు, గీల్కొప్పు కొమ్మంచుఁ గీజు పోరు." శుక. 2.457.

**కీటడగించు**

పొగ రణఁచు.

కుమా. 11.151.

**కీడాడు**

దుర్భాష లాడు; నిందించు.

"నను...నీ విట్టులు కీడాడంగ నర్హుం డవే." భార. కర్ణ. 3.86.

**కీడుపఱుచు**

చెఱుచు.

"ధర్మంబు గీడుపఱిచి." భార. భీష్మ. 1.60.

**కీడు పుట్టు**

1. హాని కలుగు.

"దానఁ గీ డెంత పుట్టినఁ దగిలె నాకు, ననుభవింపక పోవునే." ఉ. హరి. 4.54.

2. చెడు కలుగు.

"లావున రాక వేఱొక తలంపున వచ్చినఁ గీడు పుట్టదే." ఉ. హరి. 1.67.

**కీడ్పఱుచు**

అధఃకరించు, క్రిందుపఱుచు.

"బయలు దామరలఁ గీడ్పఱుచుపాదములు." గౌ. హరి. ప్రథ. పంక్తి. 805.

**కీర్తిముఖము**

ముఖాన నుదుటిపై కట్టుకునే తెల్లటి రేకు.

ఇప్పటికీ రాయలసీమ వీధి నాటకాల వేషాలలో ఇది కట్టుకుంటారు. కీర్తిముఖ మనే అంటారు. కోశాలలోని కిది ఎక్కినట్లు లేదు.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 312.

**కీర్తిశేషు డగు**

చనిపోవు.

"శ్రీవారు కీర్తిశేషు లయిరి."

**కీర్తి సేయు**

కీర్తించు, పొగడు, స్తుతించు.

పండితా. ప్రథ. పురా. పుట. 123.

**కీలన చేయు**

కీలించు, తగిలించుకొను.

"చిలుకపోగులను ప్రేల్చెవులఁ గీలన చేసి." హంస. 5.55.

**కీలరము సేయు**

మంద వేయు.

"సురధేనుసమితిఁ గీలరము సేసె."

కుమా. 4.11.

**కీలరువాడు**

గొల్ల.

**కీలారితనము**

పశుపాలన.

భార. విరా. 1.100.

**కీలుకొను**

ఉండు, నిలుచు.

"కృత్తికాతారకంబులఁ గీలుకొన్న."

భీమ. 6.85.

"మెఱుఁగుందూపులు ... కీలుకొనం జేసి." శివ. 1.86.

**కీలుకొప్పు**

వెంట్రుకలు దువ్వుకొని కొనాన మాత్రం ముడి వేసుకున్న విధం.

కీలుముడి అని నేటి వాడుక.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 317.

"తలకు పోసుకున్నావు. చిక్కు దీసుకొని కీలుముడి వేసుకోవే." వా.

**కీలుకొలుపు**

ఉంచు.

"కీలుకొలుపుదు నొసలిపైఁ గేలుదోయి." భీమ. 1.7.

**కీలుకొల్పు**

చేర్చు.

"కేలుదోయి ఫాలంబునఁ గీలుకొల్పి." హర. 2.101.

**కీలుగంటు**

కీలుముడి.

"కేశపాశము తడియొత్తుకొంచుఁ గటిసంధి నటింపఁగఁ గీలుగంటు లంద్రమగ నటింప." కాశీ. 4.118.

చూ. కీలుకొప్పు.

**కీలు గలిగిన**

కీలకము తెలిసిన.

"కీలు గల్గిన యొక నీలనీలవేణి."

పాండు. 5.304.

**కీలుజడ**

వదులు వదులుగా వేసుకున్న జడ.

శుక. 2.232.

**కీలు ప్రిదిలు**

రెంటికీ అనుసంధించిన అతుకు వదలిపోవు.

"కీలు ప్రిదిలి తటిల్లత నేలఁ బడినఁ, బరవసంబున." కుమా. 5.57.

**కీలుబొమ్మ**

1. చేతులూ కాళ్ళూ ఆడించగల బొమ్మ.

"కులుకుశృంగారరసములు చిలుకఁ గీలు, బొమ్మవలె నీటు గలదాన వమ్మ నీవు."

హంస. 1.91.

2. చెప్పినట్లాడువాడు.

నేటివాడుకలో కీలు గల బొమ్మ అన్న అర్థంపై వాడి చేతిలో కీలుబొమ్మ అనగా చెప్పినట్లు ఆడువాడు అన్న అర్థంలోనే ఎక్కువగా వినవస్తుంది.

"ఆ సరుకంతా రెడ్డిగారిచేతిలో కీలుబొమ్మలే. అందుకే అత నేదన్నా సరే అంటారు." వా.

**కీలు మలగు**

వెనుకకు తిరుగు.

సాంబో. 3.29.

**కీలుముడి**

కీలుకొప్పు.

చూ. కీలుకొప్పు.

**కీలుసంకెళ్లు**

బేడీలు.

"కీలుసంకెలఁ నేలఁ గీలించి వీఁపు, వ్రీలంగఁ గొట్టుచు..."

గౌర. హరి. ద్వి. 884.885.

**కీలూడగా తన్ను**

కీళ్లు ఊడునట్లు కొట్టు.

"బండి రాకానిఁ గీలూడఁగాఁ దన్నియుఁ గా." పారి. 3.37.

ఇచ్చట శ్లేష.

**కీ లెడలిన జంత్రము**

బిస చెడిన యంత్రము.

కవిక. 2.197.

**కీలెఱుగు**

కిటుకు తెలియు.

"లోకంబున నాకీటం, బాకైటభవైరి యెల్ల యాత్మలన నభీ, ష్టాకాంక్ష యొక్క చందము,యీకీ లెఱుఁగఁగ వలదె హృదయములోనన్."

శృం. నైష. 3.

**కీలొక్కొనఁజేయు**

లగ్నము చేయు.

"హనుమంతు మాట యందుఁ గీలొక్కొనఁ జేయు."

వర. రా. కిష్కి. పు. 476. పం. 5.

**కీలొక్కొలుపు**

లగ్నము చేయు.

"పాదపద్మముల్ మనముల యందుఁ గీలొక్కొలిపి." భాగ. స్క. 3.542.

రూ. కీలొక్కొల్పు.

**కీల్గంటు**

చూ. కీలుగంటు.

**కీల్బొమ్మ**

చూ. కీలుబొమ్మ.

**కీల్బొమ్మరము**

మరతో తిరిగే బంగరము.

**కీల్ముడి**

చూ. కీలుముడి.

**కీ. శే.**

చనిపోయిన అన్న అర్థంలో మృతులైనవారి పేరు నుదహరించే ముందు వ్రాసే పొడి అక్షరాలు.

కీర్తిశేషు లను మాటకు సంక్షిప్తసంకేతరూపం.

"కీ. శే. రామమూర్తిగారు..." వా.

కుంకముండ

పిల్లముండ; బాలవిధవ.

"కన్నవారివంక వారిఁ గానఁ బ్రాణనాథుడున్, మున్నె చచ్చె నేను గుంకముండ నెట్టు లేగుదున్."

వేంక. పంచ. 4.44.

కుంచములతో మంచు కొలుచు

అసాధ్య కార్యములను నిర్వర్తించు.

బసవ.

చూ. మంచు కుంచములతో కొలుచు.

కుంచెకోత

దొంగతనముగా పొలములోని పైరు కోసుకొని పోవుట.

కుంచెకోల

లోపలిగడియను తీయుటకై కొనలో వంపుగా ఉన్న యినుపకోల.

దేవాలయాదుల్లో నేటికీ తలుపుగడియ తీయుటకు వీనినే ఉపయోగిస్తారు.

"కొడవలనెడుకుంచెకోలచే వక్షఃక, వాట మిపుడు తెఱచి..."

చెన్న. 3.436.

కుంచెడునీళ్లు కుమ్మరించు

నిరుత్సాహపఱచు.

"ఏదో ఆశ్క గదా! అంత ఆశతో వస్తే కుంచెడునీళ్ళు కుమ్మరించి పంపించింది."

వా.

కుంచెడు మానెడుగా

ఉన్నది కొంచెమైనా ఎక్కువగా కనబరచునట్లుగా.

"వలికెద నేటికే చెలియ! కుంచెడు మానెడుగాను నెల్లవా, రలు వినినారలే విజయరాఘవరాయఁడు నిన్నుఁ గూడుటల్..."

కుంటికుదుపు

కుంటివాడు.

"కుంటికుదుపు లశక్తులు కుష్ఠరోగులు."

భీమ. 5.21.

కుంటిసమర్థన

అందీపొందని సమర్థన.

మాటా. 10.

కుంటిసాకు

నిజంగా అది కారణం కాకపోయినా ఏదో ఒక కారణం–హేతువాదానికి నిలువనిది చెప్పినప్పుడు దానిని కుంటిసాకు అంటారు.

"నీ వుండ వేమో అని రాలేక పోయానంటా వేమిట్రా? ఆదివారం నే నెక్కడికీ వెళ్ల నని నీకు స్పష్టంగా తెలుసు. ఇష్టం లేదు రాలే దనరాదూ? ఈ కుంటిసాకు లన్నీ యెందుకు?"

వా.

కుంటిసుంకరిపూనిక

శక్తి లేకున్నను అది కనబడనీక, ఉన్నట్లుగా నటించి, ఎదిరిని బెదిరించి పని సాధించుకొనుట.

ఒక పిట్టకథపై వచ్చిన పలుకుబడి.

పూర్వము ఒక రాజ్యంలో నుండి మరొక రాజ్యంలోకి

వచ్చు వస్తువులపై సుంకము వసూలు చేయుటకు నేటి 'కస్టమ్సు' అధికారి వలెనే సుంకరి ఉండేవాడు. అలాంటి వాడే కుంటివాడయినాడు. అయినా వచ్చుపోవు వారిని లేచి వత్తును సుమా అని బెదిరించి సుంకాలు వసూలు చేస్తూ ఉండేవాడు. నిజానికి బాటసారులు సుంక మీయక వెళ్లిపోతే వీడు చేయగల దేమీ లేదు కదా!

"కానీవే నగరం జెప్పి కారించెద ని, న్నే నంచుఁ గుంటిసుంకరి, పూనిక బెదరించుఁ బోలఁతి బాముముడి వెట్టన్."
శుక. 3.353.

## కుంటుపడజేయు

విఘాతము కలిగించు, విఘ్నము చేయు.

"నిర్భాగ్యుర్వాల పవిత్రం బగు పూర్వణంబు నవలీలం బెంటపై వైచి కుంటుపడం జేసితి శ్రాద్ధకర్మము."
జైమి. 4. 101.

## కుంటుపఱచు

చెఱచు.

"పెనుగొండ సాధించెఁ, గోటల నెల్లూరు గుంటు పఱిచె."
వరాహ. 1.30.

"కుముదుని మున్నాటఁ గుంటుపఱచి."
జైమి. 6.216.

## కుంటువడు

చెడు, మందగించు.

"నరవర! సద్ధర్మవర్తనము గుంటువడున్."
భార. అను. 4.285.

## కుంటువాఱు

నీరసపడు,
అచ్చ. బాల. 68.

## కుంటెనకత్తె

తార్పుడుకత్తె.

## కుంటెనకాడు

తార్పుకాడు.

"సిగ్గింతయును లేక చెల్లెలికై తాను, గుంటెనకాఁడైనకూళ యితఁడు."
కలు. శ. 83.

## కుంటెనకుచ్చులు

ఒకరకమైన సొమ్ములు.
శ. ర.

## కుంటెన నడచు

తార్చు.

"భక్తి, నంబికిఁ గుంటెన నడచినావు."
నిరం. 3.29.

## కుంటెన పంపు

దౌత్యము పంపు.
ప్రేయసీ ప్రియుల దౌత్య విషయముననే దీని నుపయోగిస్తారు.

"నీచుపాత్తునన్, బ్రాఁతి మెసంగి తీవు మును భర్తృఁడు కుంటెనఁ బంపఁబోతి."
కా. మా. 3.100.

చూ. కుంటెనకత్తె. కుంటెనపోవు. కుంటెన నడపు.

## కుంటెన పోవు

తార్చుటకై పోవు.

"నిను సావాకిలి గావు మంటినా మరు

స్నీలాలకభ్రాంతిఁ గుంటెన పొమ్మం
టినొ." కాళ. శ. 16.
చూ. కుంటెనలు వహించు.

**కుంటెన ముడి**
తాటాకుల కట్ట కట్టే తాటి ముడి.
శ. ర.

**కుంటెనలు వహించు**
తార్చు.
ఒక నాయికదగ్గఱకు గానీ, ఒక నాయకునిదగ్గఱకు గానీ అందులో ఒకరి పక్షంగా వెళ్ళి దౌత్యము నడుపు.
"తనసరి బాలెత ల్తనకు దాపుగ వారల కెల్లఁ దాను గుంటెనలు వహించు కొంచు నెఱపెక్కులు నింతు."
శుక. 3.109.
చూ. కుంటెనకత్తె.

**కుంటెన వుచ్చు**
తార్చుటకై పంపు.
పండితా. మహిమ.

**కుండ కర్ర చేతి కిచ్చు**
చిప్ప చేతి కిచ్చు వంటిది.
"కలుషము ఘటించుఁ గుండయుఁ గర్రయుఁ దన, చేతి కొనఁగూర్చు నది గానఁ జెప్ప నగునె." శ్రవ. 2.54.

**కుండకూల్చిన భంగి**
కుంభవృష్టిగా, కుండపోతగా.
"కుండగూల్చినభంగి, వారక వర్షంబు వఱుగొని కురియ."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 146.
చూ. కుండపోత, కుంభవృష్టి, తాడి పోత.

**కుండగోకరి**
వంటవాడు; కుండలు కడిగే వాడు.
"కుండగోఁకరి జేసి కువలయేశులకు, వండి పెట్టఁగఁ జేసి వాని నీరీతి, చీకాకుపడ మాయ సేయక యున్న, నాకేల! వినుము నే నలునికి బంట."
నలచ. 2.700.

**కుండజల జనించు**
ఆర్ద్రిత కలుగు; నీరూరు.
"మనసు దీరఁగ నొక్క మాఱు మాఁ విన గండశిలల కైనను గుండజల జనించు." పాణి. 2.71.

**కుండ పగుల గొట్టినట్లు**
ఖరాఖండిగా.
"వా డేం మాట్లాడినా కుండ పగల గొట్టినట్లు మాట్లాడతాడు." వా.
చూ. కుండ పగుల వేసినట్లు.

**కుండ పగుల వేసినట్లు**
వాడుకలో ఇది కుండ పగలేసినట్లు అన్నట్లు వినబడుతుంది.
చూ. కుండ పగుల గొట్టినట్లు.

**కుండ పట్టే వాళ్లు**
కర్మ చేసే వాళ్లు.
'తల కొరివి పెట్టే దిక్కు', 'కొరివి పెట్టేవాళ్లు ఇత్యాదుల' వంటిది. అంత్యక్రియలలో పీనుగుతో పాటు ఒక కొత్త కుండలో నిప్పులు వేసుకుని

పెద్ద కొడుకో, మరొక కర్మాధికారో కూడా వెళ్లడం అలవాటు. అందుపై యేర్పడినది.

"అంత సంపాయించి యేం లాభం? ఆఖరికి కుండ పట్టేవా ళ్లయినా లేరు." వా.

## కుండపోతగా

ఎక్కువగా.

వానవిషయంలోనే దీన్ని ఉపయోగిస్తారు.

"రెండు రోజులనుండీ మా ఊళ్లో కుండపోతగా వర్షం కురుస్తూ ఉంది. ఇంకా వెలియ లేదు. వా.

చూ. కుంభవృష్టి.

## కుండమార్పు

ఒకటిచ్చి మరొకటి తీసుకొనుట.

"చండాంశు సుతుపోల్కి గుండ మార్పులు గాక." నరసభూ. 5.

తె. జా.

## కుండలలో గుజ్జాలు తోలు

పని లేక పోవు, పనికి మాలిన పని చేయు.

నిష్ప్రయోజనమైనపని చేయుటపై వచ్చినపలుకుబడి.

"వాడు చేసే దేముంది? కుండలలో గుజ్జాలు తోలుతూ కూర్చుంటాడు." వా.

## కుండలలో దేవుకొని తిను

నీచపుతిండికి పాల్పడు.

కుండలు ఖాళీ చేసి నీళ్లు పోయగా అందులో మెతుకుల కోసం దేవుకొనడం నీచ మనుటపై యేర్పడినది.

"వాని కేం? కుండలలో దేవుకుని తినే రకం. వీలాగో బతుకుతాడు." వా.

## కుండలు గోకు

అర్థమైనపని చేయక నీచమైన పనికి పాల్పడు; పనిమాలి యుండు.

"వాడంత చదువూ చదువుకొని కుండలు గోకుతూ కూర్చున్నాడు." వా.

## కుండలు తొంగుంటాయి

తిండికి లేకపోతుంది.

కుండలలో ఏమీ లేకపోవడం తిండికి లేకపోవడం. ఇది కొన్ని వర్గాలలోనే వినిపించే పలుకుబడి.

"పొద్దున పనికి పోక పోతే కుండలు తొంగుంటాయి." వా.

## కుండలు నాకు

నీచానికి పాల్పడు.

"వాడి కేం? పనా పాటా? కుండలు నాకుతూ బతుకుతున్నాడు." వా.

## కుంతలము లొత్తు

వెంట్రుకలను సరి చేసుకొను.

"తరుణి నుదుటఁ బైకొన్న కుంతలము లొత్తి." ఉ. హరి. 1.170.

## కుందనపుకమ్మి దిగిచిన యందమున

కమ్మి తీసినట్లు; మనోజ్ఞరూపంతో.

సమానత మొదట అర్థమై

తరువాత మనోజ్ఞతకు కూడా పర్యాయమైనది.
బంగారు కమ్మిని కమ్మెచ్చులో తీసినపుడు తొలి నుంచీ తుదిదాకా ఒకే తీరులో ఉంటుంది. దాని మీాద వచ్చిన పలుకుబడి.

"కుందనపుఁ గమ్మి దిగిచిన, యందమున." కళా 2. 33.
చూ. కమ్మెచ్చున తీసినట్లు.

కుందార్చు

దుఃఖము తీర్చు.
"ఆరసి దుఃఖాక్రాంత యైనరుక్మిణిని, గర మరిఁ గుందార్చెఁ గమలలోచనుఁడు." ద్విప. కల్యా. 130.

కుందికట్టు

ఒక పిల్లల ఆట.
యయా. 3.55.

కుంది కుట్టాడు

ఉన్న చోటు వదలక పడి ఉండు.
"ఇంటిలోనే రాత్రింబవళ్ళు కుంది కుట్టాడు దేనికి?" తె. జా.

కుందెటికొమ్ము

అసంభవమైనది.
కుందేలుకు కొమ్ముండదు గనుక అలా ఏర్పడినది.
"వసుధఁ గుందెటికొమ్ము తెచ్చుకొనఁగా వచ్చుఁ బ్రయత్నంబునన్." మల్లభూ. నీతి. 5.
చూ. కుందేటికొమ్ము.

కుందెనగిటి

పిల్లల ఆట.

కుందెనగుడి

ఒక పిల్లల ఆట.
కాశీ. 3.33.

కుందేటికొమ్ము

అసంభవము, అసత్యము.
కుందేటికి కొమ్ము లుండవు కనుక. సంస్కృతంలో దీనినే శశవిషాణం అంటారు. వంధ్యాపుత్రుడు, గగన పుష్పము ఇత్యాదుల వంటిది.
"తిరిగి కుందేటికొమ్ము సాధింప వచ్చుఁ, జేరి మూర్ఖునిమనసు రంజింప రాదు." భర్తృ. సు. నీతి.
చూ. కుందెటికొమ్ము.

కుంపటి పెట్టు

తగాదా పెట్టు, ఏదో ఒక అనాహూతము తెచ్చి పెట్టు.
"వా ణ్ణేదో మాటసామెతకు ఇంటికి రమ్మంటే నే నక్కడ చేసిన వన్నీ నా భార్యతో చెప్పి కుంపటి పెట్టి పోయాడు." వా.

కుంపటిలో తామర మొలిచినట్లు

తగనితావున ఉన్న మంచి వస్తువు పట్ల అనే పలుకుబడి.
కుంపటిలో పెట్టిన మొక్కలకు బాగా నీరు పోసి ఎరువు వేసి పెంచుతారు. అందుకే అవి చాలా ఏపుగా

పెరుగుతాయి. కానీ తామర నీళ్ళలోనే తప్ప కుంపట్లో మొలవదు.

అందుపై ఏర్పడినది.

ఈ 'అట్లు'కు బదులు ఏ ఉపమా వాచకం అయినా ప్రయుక్తం కావచ్చును.

"నీ మగని తేజమున ను, ద్దామశమ సమగ్రుఁడనఁగఁ దగి కుంపటి లోఁ, దామర మొలచిన క్రియఁ ద, న్వీ! ముని విభుఁ డైనసుతుఁడు నీ కుదయించున్."

నృసిం. 3.127.

"కలిగెఁ గదా కుంపటిలో,పలఁ దామర వోలె నిట్టి పాషండపురిఁ, జలజాక్షు ప్రతిమ భాగ్యము, గలవారికి నెచట నైనఁ గల వభిమతముల్."

పరమ. 5.84.

కాశీయా. 43.

చూ. కుంపటిలో తామరలవలె.

## కుంపటిలో తామరలవలె

అనర్హస్థానంలో ఉన్న ఉత్తమవస్తువువలె.

ఈ 'వలె' కు బదులు ఏ ఉపమావాచకంతో నయినా ఇది ఉపయుక్త మవుతుంది.

"సామంతున కిడిన చలువచప్పరములు తస్సైప మేదినిఁ గుంపటిలోఁ, దామర లుంబోలె నట్టితతి నొప్పారెన్."

ఆము. 2.69.

చూ. కుంపటిలో తామర మొలిచినట్లు.

## కుంభకర్ణనిద్ర

మొద్దునిద్ర.

కుంభకర్ణుడు ఏటా ఆరు నెలలు నిద్రపోయేవా డన్నకథపై వచ్చిన పలుకుబడి.

"వాడిది కుంభకర్ణనిద్ర. ఏనుగులు తొక్కినా లేవడు." వా.

## కుంభకోణం

మోసం.

"ఇందులో యేదో కుంభకోణం ఉందని నా అనుమానం. నే నిందులో దిగను."

వా.

## కుంభద్రోణముగా

కుండపోతగా (వాన కురియు.)

"కుంభద్రోణముగాఁ గురిసెన్."

విప్ర. 3.61.

## కుంభముమీది పొట్టేలువలె

క్రొవ్వెక్కి.

జాతర్లలో ఉన్నం వండి అమ్మ వారిముందు రాశి పోస్తారు. దాన్ని కుంభం అంటారు. అక్కడ దేవతకై వదిలిపెట్టి ఉండిన పొట్టేలును బలి యివ్వ డానికి నిల్పుతారు. ఆ పొట్టేలు బాగా తిని క్రొవ్వి ఉంటుంది. అందుపై వచ్చిన దేవరపోతు లాంటి పలుకు బడి. అది తనకు కలుగ నున్న ఆపదను (బలి యివ్వ నున్నా రన్న) గమనించక నిర్విచా రంగా ఉంటుంది. దానివలె ననుట.

"లెగిచి యిటు వండి పెట్టినఁ, బాగులవు కుంభంబుమీఁది పొట్టేలుక్రియన్."

శుక. 3,276.

ఇట వలెకు బదులు ఏ ఉపమా వాచక మయినా ప్రయుక్తం కావచ్చును.

**కుంభవర్షము**

కుండపోతవాన.

కుండలతో గుమ్మరించినట్లు - ఎక్కువగా కురియు వాన.

"కుంభవర్షం బయ్యెఁ గుంభినియందు." పల. పు. 14.

చూ. కుండపోత.

**కుక్కకాటుకు చెప్పుదెబ్బ**

చెడుగుకు బదులు చెడుగే చేయాలి అనుపట్ల అంటారు.

"వాడన్నదానికి సరీగా బదులు చెప్పావు. కుక్కకాటుకు చెప్పుదెబ్బ." వా.

చూ. కుక్కకాటు చెప్పుపేటు.

**కుక్కకాటు చెప్పుపేటు**

చూ. కుక్కకాటుకు చెప్పుదెబ్బ.

తాళ్ల. సం. 11.3 భా. 77.

**కుక్కకు గతుకునీళ్లే**

వాడి అనుభవం అంతే అనే నిరసనార్థంలో ఉపయోగిస్తారు.

నీళ్లు ఎక్కువ ఉన్నా తక్కువ ఉన్నా కుక్క నాలుకతో అద్ది గతుకుతూనే తాగుతుంది. అందుపై వచ్చిన పలుకుబడి.

"వాడు ఎంత సంపాదిస్తే నేం? ఎంత చేస్తే నేం? మిరపప్పొడీ మెతుకులు తప్ప ఇంకేం తినడు. ఎన్ని వానలు వచ్చినా కుక్కకు గతుకునీళ్లే." వా.

**కుక్కకు నైవేద్యమా**

నిష్ప్రయోజనము, అనర్హము అనుట. వేంకటేశ. 74.

**కుక్కకూతురా!**

ఒక తిట్టు.

"కుక్క కూఁతుర మెడఁ గోసి పోఁ గలవు." గా. హరి. ద్వితీ. పంక్తి. 881.

"కుక్కకూఁతుర వల దంచు వెక్కిరించు." శుక. 2.458.

చూ. గాడిదకొడుకు.

**కుక్కగొడుగులు**

పుట్టగొడుగులు.

క్షుణికములు.

ఎక్కువగా పుట్టుకొని వచ్చునవి అనే అర్థంలో ఉపయోగించే పలుకుబడి.

వాన వచ్చినప్పుడు ఈ పుట్టగొడుగులు విపరీతంగా మొలుస్తాయి. త్వరలో పోతాయి కూడ. అందుపై వచ్చిన పలుకుబడి.

"ఈ కుక్కగొడుగుల పార్టీల కేమి లే. లక్ష పుడతాయి. పోతాయి." వా.

**కుక్కచ్చు వేయు**

శిక్షించు.

అపరాధులకు తత్సూచకంగా రాజులు కుక్కముద్ర వేసి విడిచేవారు; ఇదొక శిక్ష.

"తల గొఱిగి పృదంపడి కుక్కచ్చు వేసి దండింపఁ దగున్." విజ్ఞానే. ప్రా. కాండ. 64.

చూ. కుక్కయచ్చు.

**కుక్కజట్టీలు**
పెనగులాటలు.

**కుక్కతోక**
వక్ర మైనది.
ఆ వక్రాన్ని తీర్చుటకు వీలు లేనిది.
ఎంత చక్కగా నిలుపుదామని ప్రయత్నించినా కుక్కతోక వంకర పోతూనే ఉండటం అలవాటు. దానిపై వచ్చినపలుకుబడి.
"వాడి బుద్ధి ఒట్టి కుక్కతోక లాంటిది. ఎంత చెప్పి ఎంత చేసినా మరీ అంతే." వా.

**కుక్కతోకను గొట్టము చేర్చు**
అసాధ్యకార్యమునకు పూనుకొను.
గొట్టములో పెట్టినప్పుడు చక్కగా కనిపించినా, అది తీయగానే యథాప్రకారం వంకరగా తిరుగుతుంది.

**కుక్కను కొట్టినట్లు**
చావదన్ని అనుట.
"వెట్టి,కుక్క లోఁబడఁ బట్టి కొట్టిన రీతి." గౌర. హరి. ద్వి. 1111.

**కుక్కనోటి ప్రాత**
భ్రష్ట మయినది.
సంపంగిమన్న. 22.

**కుక్కనోట్లో కట్టె పెట్టినట్లు**
అనవసరంగా కోపపడి కసురుకొంటాడు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.
ముందే నోటిదుడుసు కలవాణ్ణి అనవసరంగా గిల్లుకొని రెచ్చగొట్టిన ట్లనుట.
కుక్కనోట్లో కట్టె పెడితే 'బౌ' మంటుంది.
"వాడితో వాదించడం కుక్కనోట్లో కట్టె పెట్టినట్లే." వా.
"వాడు ఏం మాట్లాడినా కుక్కనోట్లో కట్టె పెట్టినట్లుగా మాట్లాడతాడు." వా.
"వాడితో మాట్లాడితే కుక్క నోట్లో కట్టె పెట్టినట్లే." వా.

**కుక్కబుద్ధి**
నీచబుద్ధి.
"నీ కుక్కబుద్ధి నువ్వు మానవు కదా." వా.

**కుక్క ముట్టిన కుండ**
మైల పడినది.
కుక్క ముట్టితే ఆ కుండ ఇక వంటకు పనికి రా దనీ పార వేయవలె ననీ అంటారు.
"...వాయుసూనుని సుతుఁ డింత సేయకున్న, పొలఁతి శశిరేఖ వ్యర్థ మై పోవు నమ్మ, కుక్క ముట్టినకుండ యై కుందరదన." శశి. (అప్ప) 4.75.
"ఆ కుక్క ముట్టినకుండలాంటి పిల్ల నెవరు చేసుకుంటార్రా ?" వా.

**కుక్కమురికి సంతానము**
కుచేలసంతానము.
నారాయణదాసు సావిత్రీచరిత్ర.

**కుక్కమూతి పిందెలు**

చెట్టు కాపు ఉడిగినప్పుడు ఏవో చిన్న చిన్న పిందెలు పుడతాయి. వాటినే కుక్కమూతిపిందె లంటారు. అవి పుడితే ఇక కాపుడిగిం దన్నమాటే.

"చెట్టు చెడుకాలానికి కుక్కమూతి పిందెలు." సా.

**కుక్క యచ్చు**

చూ. కుక్కచ్చు.

**కుక్క యిల్లు చొచ్చినట్లు**

దొంగగా.

"ఎఱుఁగకుండఁగఁ గుక్క యిలుఁ జొచ్చినట్లు, ఘనుల నిక్కడఁ దెచ్చి కవ్వించినావు." సైరా. పు. 66.

**కుక్కల కట్టు**

దొంగసాధనాలలో ఒకటి.

"కత్తియు నీలిచీరయును ... కుక్కల కట్టును." చెన్న. 3.294.

**కుక్కలవలె కాటులాడు**

నీచముగా కీచులాడు.

వాడుకలో కాటులాడు కాట్లాడుగా మారినది.

"కుక్కలభంగిఁ దమలోనఁ గాటులాడి." భార. శాంతి. 1.45.

**కుక్కలే శునకాలు కుండలే భాండములు**

ఎంత మరుగుగా చెప్పినా ఆ నీచమైనది నీచమైనదే అను పట్ల ఉపయోగిస్తారు. శునక మని అర్థం కాని సంస్కృతం పేరు చెప్పినా అది కుక్కే కదా అనుట.

"నీ వెంత సర్ది ఎన్ని చెప్పినా వాని దుర్మార్గాల నేమాత్రం దాచ లేవు. కాదన లేవు. దుర్మార్గుడు దుర్మార్గుడే. కుక్క లే శునకాలు కుండలే భాండములు - అన్నారు." వా.

**కుక్క సంతకు వెళ్ళినట్లు**

నిష్ప్రయోజన మైన పని చేసినప్పుడు ఉపయోగించే పలుకుబడి.

కుక్క సంతకు పోయి తూనిక కట్టెల దెబ్బలు తిని వచ్చిన దన్న సామెతపై వచ్చిన సామ్యం.

"ఏదో ఆ ఊరికి వెళ్లాను కానీ నా ప్రయాణం అంతా కుక్క సంతకు వెళ్లినట్లు అయింది." వా.

**కుక్కిన పేనులాగ**

గుక్కు మిక్కు మనకుండా.

పేనును కుక్కితే అదలా చప్పున చచ్చి ఊరుకుంటుంది.

"వాడు వచ్చా డంటే వీడు కుక్కిన పేనులాగా పడి ఉంటాడు." వా.

**కుక్కిమంచము**

నులక వదులై గుంత పడిపోయిన పాత నులకమంచము.

"ఆ మూల కుక్కిమంచంలో ఉంటుందా ముసలవ్వ." వా.

**కుక్కివడు**

మంచం కుక్కి అయిపోవు

"కుక్కి వడిన మిగులఁ గొంగోడు వోయినఁ, గుఱుచ యైన ... నుల్క మంచ మెప్పు దంద్రడు."

వి. పు. 4.215.

చూ. కుక్కిమంచము.

కుక్కురో కుఱ్ఱను

కోడి అరుచుటలో ధ్వన్యను కరణము.

"కుక్కురో కుఱని కూసెఁ గల్కోడి."

పండితా. మహిమ. 197. పు.

కుక్షింభరుడు

1. తన పొట్ట నింపుకొనుటే లక్ష్యముగా కలవాడు - స్వార్థపరుడు.

"వాడు వట్టి కుక్షింభరుడు. ఏది ఏమయినా తన పొట్ట గడిస్తే చాలు."

వా.

2. కడుపులో ఉంచుకొను వాడు.

"రక్షార్థంబు భరింప రాదె యభవుఁ ద్రైలోక్యకుక్షింభరున్." భీమ. 4.105.

కుక్షి ద్రోచుకొను

పొట్ట పోసుకొను.

"ఎందైనఁ గా,నీ క్షేత్రంబునఁ గుక్షిఁ ద్రోచుకొని దీనిం దీర్చి నే వత్తు."

శా. మా. 3.165.

వాడుకలో: 'వాడు కూలో నాలో చేసుకొని పొట్ట పోసు కొంటున్నాడు.'

జనంలో ఉన్న దిదే. దీనిని పర్యాయపదాలతో ధూర్జటి మార్చినాడు.

చూ. పొట్ట పోసుకొను.

కుచ్చలి గంత

యోగుల బొంత.

రాజ. చ. 2.94.

కుచ్చలి బొంత

పరమ. 1.185.

చూ. కుచ్చలి గంత.

కుచ్చిటప్పాలు

డంబాచారపు మాటలు, జోల్లుకబుర్లు.

"పొద్దున్నుంచీ సాయంత్రం వరకూ కుచ్చిటప్పాలు తప్పితే వాడు చేసే దేముంది?"

వా.

కుచ్చుమీసములు

కడపట ఒత్తుగా ఉండే మీసాలు.

"ఆ తలపాగా, ఆ కుచ్చు మీసాలు, ఆ పెద్ద కన్నులూ. మనిషి బహుగంభీరంగా ఉంటాడు."

వా.

కుచ్చెళ్ళలో పాము

అతిప్రమాదకారి, దాపుననే ఉన్న ఆపద.

చీర కుచ్చెళ్ళలోనో, పంచె కుచ్చెళ్ళలోనో ఉన్న పాము ఏ నిమిష మైనా కాటు వేయ వచ్చును కదా.

"కుతుకం బంతయుఁ గూలఁద్రోసెదవు గా కుచ్చెళ్లలోఁ బాము వై."

పాండ. విజ. 79.

కుచేలసంతానము

గంపెడుపిల్లలు.

ఇందులో పేదతనంలో చాక

లేనంత మంది పిల్లలున్నారనీ సూచన ఉన్నది.

"వాడు ముసలితనంలో ఉద్యోగం లేక ఆ కుచేలసంతానంతో నానా బాధా పడుతున్నాడు." వా.

కుటిలత్వము కూడుగా కుడుచు

కౌటిల్యమే ప్రధాన మగు. అతికుటిలు రనుట.

"అటు గాన నెన్ని భంగులఁ, గుటిలత్వము కూడు గాఁగఁ గుడుతురు మగవా, రిటువంటివారి మదిలో, నెటుగా నమ్మెదురు సతులు హితు లని పతులన్." విక్ర. 7.131.

చూ... కూడుగా కుడుచు.

కుటిలపఱచు

కౌటిల్యమునకు పాత్రముగా చేయు, కుటిలత్వము చూపు, నేఱుపు.

"కుండు పెట్టక యేన్నాళ్ళు కుటిల పఱచి." భీమ. 4.12.

కుట్టి చూచుటకు దోసకాయలా?

తెలుసుకోలేము వాని ఆంతర్యం అనుపట్ల అంటారు.

"...ఎదిరి కోర్కి యెఱుంగుట యెట్టు కుట్టియా, చూడఁగ దోసకాయలె? విశుద్ధయశోధన యన్యచిత్తముల్." హార. 2.63.

కుట్టితే తేలు కుట్టకుంటే కుమ్మర పురుగు

తన శక్తి చూపినప్పుడే సమర్థుడనీ, లేనిపట్ల చేత కాని వాడనీ అంటారు అన్న భావాన్ని తెలియజేసే పలుకుబడి. ఇదే గ్రాంథిక రూపంలో—

"కుట్టఁ దేలు కుట్టకున్నఁ గుమ్మర బూచి, తోసిరా జటంచుఁ దోఁచెఁ జెలియ, దాని వ్రేలు దీసి దాని కన్నుఁ బొడిచి, నటుల సేయకున్న నగుసె పలుక" రాధ. 3.

"వాడన్ని రకాలుగా వేధిస్తుంటే శాంతంగానే నూరకుంటే నన్నేదో చేత గానివా డనుకుంటారు. కుట్టితే తేలు కుట్టకుంటే కుమ్మరపురుగు!" వా.

కుట్టుకాడ

కుట్టుపోగు.

శ. ర.

కుట్టుచేడు

తప్పుపనులకు ప్రేరేచువాడు.

"గురుసతిఁ గూడురట్టునకు గొంకని మోడు వియోగినీసము, త్కరముల కీడు చూచుటకు దర్పకు రేపెడు కుట్టుచేడు."

వరాహ. 4.24.

క్రొరడా అని సూ. ని; దుర్మార్గుడు అని వావిళ్ళ ని.—రెండూ సందిగ్ధ మనే వ్రాసినవి.

పై అర్థం సందర్భాన్ని బట్టి వ్రాసినదే. ప్రయోగాంతరాలున్నట్లు లేవు.

కుట్టుటాకు

విస్తరి.

విడియాకులు కుట్టగా ఏర్పడినది.

**కుట్టుతేలు**
దుష్టుడు.
ఆం. భా.

**కుట్టుపోగులు**
మొదట చెవి కుట్టినప్పుడు వేసే వట్టి బంగారుకాడతో చేసిన పోగులు.

**కుట్టుపోయు**
కుట్టు వేయు.

**కుట్రపువాడు**
దర్జీ.
బ్రౌన్.

**కుడిచి కూర్చుండు**
1. అందుకనే కాచుకొని యుండు.
'అందుకు' అనునప్పుడు ఏదో ఒక చెడుపనికై అని కూడా.
2. తన కేమీ అవసరం లేక పోయినా కల్పించుకొను.

"కుడిచి కూర్చుండి మీ కేల కొఱంత యైన, కుమ్మ లాడెద రోయన్న దమ్ములార!" భీష్మ. 4.53.

"కుడిచి కూర్చుండి రాజ్యంబు విడిచి పోవ." జైమి. 2.108.

"కుడిచి కూర్చుండి వెతఁ దెచ్చుకొంటి మొకటి." ప్రభా. 4.16.

"కుడిచి కూర్చుండి యేఁ గ్రొవ్వి, యిద్వే షంబుఁ బూనిన యవివేకము నకుఁ దోడు..." విప్ర. 3.56.

"వాడు కుడిచి కూర్చొని ఊళ్లో వాళ్లం దరిమీదా లేనిపోని అపవాదులు వేస్తుం టాడు." వా.

"కుడిచి కూర్చొని ఇదేం పనిరా?" వా.

తిని ఉండబట్టలేక అన్న పలుకుబడివంటిదే ఇది.

"తిని కుడిచి తిమ్మణ్ణి పాడెను." సా.

**కుడితిలో పడ్డ యెలుక**
అతి సంకటావస్థలో పడిన వ్యక్తి.
చూ. కుడితిలో బల్లి.

**కుడితిలో పిల్లి**
చూ. కుడితిలో బల్లి.

**కుడితిలో బల్లి**
అతిసంకటావస్థలో తగులు కొన్న సందర్భంలో ఉపయో గించే పలుకుబడి.

"వాడు కుడితిలో బల్లిలాగా నానా అవస్థా పడుతున్నాడు." వా.

**కుడినీరు**
మంచినీరు.

"పడమటి పన్నీటి కుడినీరు రాయంచ, గిండులు చెంగటఁ గీలుకొల్పి." దశా. 7.1.

**కుడిబుజము**
ప్రధానమైన అండ.

"కుడిబుజ మై రమ్ము గొబ్బున నెనుఁ బోతు, కానుక సేతు నూకాలు తల్లి." కవిచకోర.

"వాడు రెడ్డికీ కరణానికీ కుడిభుజం. వాడు లేందే ఏం జరుగుతుంది?" వా.

**కుడిమివాడు**
విషవైద్యుడు.
బ్రౌన్.

**కుడిముట్టు**

అన్నం తినే - నీళ్ళు త్రాగే - పాత్ర.

"తొడవులు చివికిన యెమ్ములు, గుడి ముట్టు కపాల మిల్లు గుడి ముడి యెద్దె, కుక్కడు గట్టువలువు దో లగు, బడరున కై నవయ నేమి ప్రళయము వచ్చెన్?" కుమా. 7.39.

**కుడియెడమగా**

కొద్దిపాటి భేదముతో.

"ఆ ప్రాచీనవిగ్రహానికి ఇతను కుడి యెడమగా ప్రతిరూపం చేశా డంటే నమ్మి." వా.

"కాస్త కుడి యెడంగా ఉంటా రా అన్నదమ్ములు." వా.

**కుడి యెడమ యెఱుగని**

మంచీ చెడ్డా తెలియని.

"జడివాన కురిసినట్లే, విడువక వాదింతు రాత్మవేత్తల మనుచున్, కుడి యెడ మెఱుఁగని మాటల, జడమతు లగు కొంద అన్న సంపగిమన్నా!" సంపగిమ. శ. 56.

"వాడికి కుడీ యెడమా తెలీదు. అంద రినీ అలాగే కసురుకుంటాడు." వా.

**కుడియెడమల దిరుగు**

అటు ఇటు తిరుగు.

"ఎడనెడఁ దలవడుచో వడి,గుడి యెడ మలఁ దిరుగునేనుఁగులపిఱుఁదులు నే, ర్పడునట్టి క్షణములోనన." కళా. 8.86.

**కుడి యెడమ లేక**

అటూ యిటూ కూడా అనుట.

ఇటు వేయాలి అటు కాదు అన్న భేదం లేకుండా ఎటు పడితే అటు. ముందూ వెనుకా చూడకుండా అనుట వంటిది.

"వెడవిలుఁడు శిరముల బా,రిడి ననుఁ గుడి యెడమ లేక యేయం దొడఁ గెన్." శ్రవ. 3.45.

**కుడుపకూటి ప్రాయమువాడు**

బాలుడు.

అన్నము పెట్టి తినిపించవలసిన వయసులో ఉన్నవాడు అనుట.

తక్కువ అన్నం తినేవా డని కూడా భావార్థం.

"ఇసుమంత గాని లేఁడీ, పసిబాలుఁడు కుడుపకూటి ప్రాయమువాఁడు." పాండు. 4.180.

**కుడుపు దక్కు**

ఒక్కప్రొద్దుండు, ఆహారం లేకుండు.

"కుల్యయందుఁ ద్రిరాత్రంబు గుడుపు దక్కి, శౌచి యై యఘమర్షణజపము చేసి, యశ్వమేధఫలము నందు ననఘ వరుఁడు." భార. అను. 2.87.

**కుడుపు వెట్టు**

భోజనము పెట్టు - నైవేద్యము పెట్టు.

"చమురు చిప్పిలం గాల్చినకమ్మకఱ కుట్లం జత్రాటి పయిఁ గాత్రేనికిం గుడుపు వెట్టి."

**కుడుముల త్రేట్లాటలు కావు**

సులభకార్యములు కావు.

"కుడుముల ప్రేట్లాటలు గా, వుడు రాజానన రణంబు లూహించిన..."
ప్రభా 5.195.

కుడువ గట్టను దొడుగను ముడువ కలదు

అనుభవించుటకు తగిన వన్నీ ఉన్నవి.

వాడుకలో : తినడానికీ, కుడవడానికీ – తినడానికీ, తొడగడానికీ – ఉం దని అంటారు.

"కుడువఁ గట్టను దొడుగను ముడువఁ బుడమి, నెంత గలిగిన..."
హంస. 3.206.

కుడువ గూడును గట్టుకో గోక లేక

తిన తిండి, కట్ట బట్ట లేక అని వాడుక.

"కుడువఁ గూడును గట్టుకోఁ గోక లేక, యితని కిల్లాలి నై యుండ నేల యనుచు." శుక. 2.365.

కుడువ నిచ్చు

భోజనం పెట్టుటకు ఒప్పుకొను.

"...తనబానసంబు వానిం బిలిచి యే నొక్క బ్రాహ్మణునకుం గుడువ నిచ్చి మఱచి యుండితిం జెచ్చెఱ నవ్విప్రునకు మాంసంబుతోఁ గుడువం బెట్టుమని పంచిన." భార. ఆది. 7.115.

కుడువబెట్టి కంచ మాఱడి గొను

నోటిముందరి అన్నము తీయు. అన్నం పెట్టి కంచం తీసి వేయుట అంతే కదా.

"అతఁడు మంత్రశక్తి నసిఁబోయెఁ గాక కా,కున్న మృత్యుబాధ నొంద కున్నె, కానఁ గుడువఁబెట్టి కంచ మాఱడిఁ గొను, కంటె మిగులఁ బాతకంబు లేదు." భోజ. 6.182.

కుడువబెట్టు

విం దిచ్చు.

"అవ్విప్రునకు మాంసముతోఁ గుడువఁ బెట్టుమని పంచిన."
భార. ఆది. 7.115.

కుతకుతలాడు

1. ఉడుకు.

"అన్నం కుతకుతలాడుతూ ఉంది."
వా.

2. కోపించు.

"అత నేమలా కుతకుతలాడుతున్నాడు?" వా.

3. కళవళపడు.

"నా మనసు కుతకుతలాడుతూ ఉంది" వా.

కుతికంటు

కంటె.

"కుతికంటు సరిపెణ గుండ్లపేరు."
హంస. 2.190.

కుతికిలపడు

కూలబడు.

మను. 4.27.

కుతిల కుడుచు

కుతిలపడు; దుఃఖపడు.

"కొండల తిమ్మనిఁ జూచి లోలో కుతిల కుడువ నేటికే."
తాళ్ల. సం. 12.82.

"ఊళ్ళవెంబడి దేవర, గుళ్ళకుంచలఁ జేరి గుతిల కుడిచి." హరి. 4.191.

కుతిలగొను

బాధపడు.

"దైత్యరాజతనయ, దొడరి దేవయాని ద్రోపించె వలువీక, క్రుంగి నూతిలోనఁ గుతిలగొనఁగ."

భాగ. 9 స్కం. 523.

కుతిలపడు

దుఃఖపడు.

"కష్టామయంబునఁ గుతిలపడఁగ."

శివ. 4.78.

"కుతిలపడు నతండు గువ్వకుత్తుక తోడన్."

పాండు. 3.20.

కుతిలపఱుచు

ఇక్కట్టు పెట్టు; బాధపెట్టు.

"కుతిలపఱుపరె నృపుబంట్లు గుడెల వారు."

కాశీ. 5.289.

కుతిలపాటు

బాధ.

కుతిలపెట్టు

బాధపెట్టు.

"...అరాజకత్వ, దోషజాత మైన దురితబాహుళ్యంబు, కుతిలపెట్టి భూమి యతలమునకుఁ, బోవ."

భార. శాం. 2.89.

రూ. కుతిలవెట్టు.

కుత్తుకంటు

కంటె.

రా. వి. 1.62.

కుత్తుకబంటి నీరు

కుత్తుక మునుగు దాక ఉన్న నీరు. నీటిలోతు చెప్పటలో —మోకాలి బంటి (లోతు) మొలబంటి(లోతు) అంటారు.

"నిండు మనంబుతో విజితనీరధి కుత్తుకబంటి నీటితో, నుండి."

శా. మా. 1.131.

కుత్తుక విసము, నాలుక బెల్లము

గోముఖవ్యాఘ్రము లాంటి పలుకుబడి.

"కైరవాప్తకళంకంబు పేర విషము, లోన జీర్ణించి యుండఁ బైపై చంద్రి, కలు వెలింగించెదవు కుత్తుకను విసంబు, నాలుకను బెల్లమును గాదె పాలసు నకు."

కవిరా. 3.

కుత్స సేయు

అసహ్యించుకొను; నిందించు.

"జీవితేశ్వరుఁడు డించిన యోగిరంబులు కుత్స సేయక భుక్తి గొనుట తగవు."

కాశీ. 2.75.

కుదికిలబడు

చదికిల బడు.

కుదిమట్టంగా

లావుకు తగినయెత్తు కలిగి.

"ఆ పిల్ల అంత పొడుగూ కాదు. అంత పొట్టీ కాదు. కుదిమట్టంగా ఉంటుంది."

వా.

చూ. కుఱుమట్టము.

కుదియ గట్టు

ఒకటిగా కట్టు

"కూటశాల్మలులందుఁ గుదియఁ గట్టఁగ లేదు."

రుక్మాం. 2.22.

కుదియ బట్టు

గట్టిగా పట్టు; వెనుకకు లాగి పట్టు.

"వాహకుల్, పరిపరిలాగులం గుదియఁ బట్టుచు రా."

జైమి. 2.15.

"పగ్గముల్ కుదియఁబట్టి." జైమి.3.111.

### కుదియబడు

వెనుకంజ వేయు; కృశించు.

"చిందముల కోలాహలములకుఁ గుదియఁబడక." భార. విరా. 4.62.

"దేహంబు...కుదియఁబడఁగ." దశా. 2.139.

### కుదిలపడు

చూ. కతిలపడు.

### కుదిలపఱుచు

బాధ పెట్టు, నొప్పించు.

"కూలికై నన్నిట్లు కుదిలపఱుచుచున్నారు." పరమ. 5.48.

### కుదుకనగోలు గ్రైకొను

చెల్లు వేసికొను.

"ఇఁక నైన,కుదుకనగోలు గ్రైకొనక నాథనము, వదలుము."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1285.

వంచించు అని వావిళ్ళ. ని.

### కుదుటపడు

ఊరట చెందు; ఒక స్థిమితమునకు వచ్చు.

"ఎన్ని కష్టాలు పడ్డా వాళ్ల కుటుంబం ఈనాటికి కొంత కుదుటపడింది." వా.

### కుదురుకొను

1. నెలకొను.

కవిక. 2.61.

2. స్థిరపడు.

"శివుఁడు చటులవిషాగ్నిం, గుదురుకొనఁ గంఠబిలమునఁ, బదిలంబుగ నిలిపె." భాగ. 8.245.

"ఆ ఊళ్లో వాడింకా కుదురుకో లేదు." వా.

### కుదురుకొల్పు

నెలకొల్పు.

"...గుబ్బచన్నుల మీఁదఁ గుదురు కొల్పి." క్రీడా. పు. 45.

స్థిరముగా నిలుపు.

"కురుకులంబున సత్కీర్తి గుదురు కొల్పు." జైమి. 1.61.

ఇది 'పాదుకొలుపు' వంటిది.

కుదురు – పాదు.

### కుదురుగా కూర్చుండు

స్థిరముగా కూర్చొను.

"నిశ్చలతం,గడుఁ గుదురై కూర్చుండుట, పుడమిన్ వీరాసనాఖ్యఁ బొలుచు మహాత్మా!" కళా. 5.162.

### కుదురు చేయు

పాది చేయు, ఆలవాలమును ఒనర్చు.

"తాన కుదురు చేసి, వలయుబీజము లెల్ల మొలవఁబెట్టి..." కుమా. 7.19.

### కుదురుపట్టు

పంటికుదుళ్లు.

"కుదురుపట్టెడలి లివలివం గదలురదనపంక్తులును." కవిక. 5.110.

### కుదురుపడు

నెలకొను; స్థిరపడు; నిలుచు.

"మత్పాదభక్తి యాత్మను జనించిన మాత్ర జ్ఞానంబు గుదురుపడును." దశా. 1.222.

### కుదురు పఱుచు

కుదురుపడునట్లు చేయు.

"కీలుగొప్పునఁ బైఁడి గేదంగిరేకులు, గొనలు గానంగ రాఁ గుదురుపఱచి." శృం. నైష. 8.112.

కుదురుపాటు

స్థిరత.

"వాని తండ్రికిం, బట్టము గట్టి యా కుదురుపా టవునంతకు నిల్చి."
రాధ. 3.52.

కుదువ పెట్టు

తాకట్టు పెట్టు.

ఇది రాయలసీమలో నేటికీ వినవచ్చే పలుకుబడి.

"విత్తంబు చాలని విభవంబు కొఱగాదు, కుదువపెట్టఁగ రాదు కుందనంబు."
రామలిం. 46.

"అప్పటి కప్పుడు అల్లు డొచ్చా డని కంటె కుదవబెట్టి ఇరవై రూపాయలు తెసిసి."
వా.

కునికిపాట్లు పడు

తూగు, పని లేక ఉండు.

"ఆఫీసులో కూర్చునే వాడు కునికిపాట్లు పడుతూంటాడు."
వా.

కునుకు పట్టు

నిద్ర పట్టు.

"కునుకు పట్టినఁ జుట్టుకొను దవాగ్ని."
రామలిం.

"రాత్రంతా దోమలతో కునుకు పట్ట లేదు."
వా.

కుప్ప కూలు

కుప్పగా కూలిపోవు.

"నిలువున కుప్ప లై కూలినపట్లును."
కవిక. 2.197.

కుప్పకోలుగొను

ఎక్కు వగు.

"అత్తరవంబులు కుప్ప కోలుకొన."
హరి. 3.61.
బ్రౌన్.

కుప్పగూరగా

1. ఛిన్నాభిన్నముగా.

"ఎడగని యబ్బలంబు గడు నేడై లగిట్టి మహాస్త్రశస్త్రముల్, గడు వడిఁ గుప్పఁగూరగఁ జలంబునఁ బైఁ దొరఁగింప..."
భార. ద్రోణ. 3.152.

2. కుప్పలుకుప్పలుగా.

"మదీయబాణంబులఁ గుప్పఁగూరఁ బఱపి."
భార. భీష్మ. 3.335.
భోజ. 7.

రూ. కుప్పనగూరలుగా.

కుప్పగూరగా పడు

కుప్ప గూలబడు.

"కోపించినన్ గుప్పగూరఁగాఁ బడియె, నా పాపమతి భస్మ మై."
వర. రా. అర. పు. 38. పం క్తి. 9.

కుప్ప గూల్చు

కుప్పలుగా పడగొట్టు.

"కుప్ప గూల్చె నిశాచర కోటి నపుడు."
భాస్క. రా. యు. 1965.

కుప్ప చిచ్చిడి పేలాలు కొఱకు

కొద్దిపాటి స్వలాభం కోసం ఇతరులకు అనంతంగా నష్టము కలిగించు.

తనకు కావలసినవి నాలుగు పేలాల గింజలు. వానికోసమై ధాన్యం కుప్పకే నిప్పు పెట్టేవాడనుట.

పరమనీచు డనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

పేలాలకోసమని వామికే నిప్పు పెట్టేవా డంతే కదా!

"తలఁచు బ్రహ్మస్వదేవస్వములకు సెగ్గు, కుప్పఁ జిచ్చిడి పేలాలు కొలుకఁ దివురు, గ్రహణకాలంబునందు మున్నఁడు జల ముల, సెబ్బ చెంచడ మా బ్రాహ్మణ బ్రువుండు." పాండు. 4.196.

చూ. గడ్డం కాలుతూంటే చుట్ట ముట్టించు కొన్నట్టు.

## కుప్ప తెప్పలుగా

సమృద్ధిగా, ధారాళంగా.

"కప్పురపు గంది వనిలోనఁ గలయ మెలఁగుఁ, గప్పురపు టింటి బోదెల నుప్పతిల్లి, కుప్ప తెప్పలుగా రాలు కప్పురంబు." మృ. వి. 2.15.

"ఆ ఊళ్లో వంకాయలు కుప్ప తెప్పలుగా దొరుకుతాయి." వా.

చూ. కుప్పలు తెప్పలుగా.

రూ. కుప్పతిప్పలుగా.

## కుప్పనగూర

చూ. కుప్పగూరగా.

## కుప్పన గూరు

కుప్పగా కూలు.

ధ్వన్యనుకరణము.

"కయిసేయు తెఱం గయథాతథం బుగాఁ, గుప్పనఁ గూరి యొండొరులఁ గూడక." పారి. 3.11.

## కుప్పనూర్పులు

మహాసూలు; పంట రాల్చు కునే కాలం.

"కుప్పనూర్పిళ్ల కాలంలో కూలీలకు మహా గిరాకీ." వా.

## కుప్పలు గట్టు

కుప్పలు పడు.

"కుండల చారు మస్తములు కుప్పలు గట్టె పురంబువీథులన్." కేయూర. 2.116.

## కుప్పలుగా గురియు

ఎక్కువగా కురియు.

"హృదయము జిల్లని కుప్పలుగాఁ గురిసీఁ జెమ్మటా." తాళ్ల. సం. 4.179.

## కుప్పలు గొను

కుప్పలు పడు.

"కుప్పలు గొనఁ జల్లు పుప్పొడి యొరు వుగాఁ, బొరిఁబొరి విరహాగ్నిఁ బొగులఁ జొచ్చె." ద్వాద. 5.130.

"కుప్పలు గొను విక్రమార్కు గుణ ములకొఱకై." సింహా. 1.31.

## కుప్పలు తెప్పలుగా

చూ. కుప్ప తెప్పలుగా.

## కుప్పలు వడు

గుంపులుగా చేరు; కుప్పలుగా పడు.

"ఏమిటికి నిఁక నిచటన్, గుప్పలు వడి నిలువఁగ." వరాహ. 10.34.

## కుప్పలో మాణిక్యము

చెడు పరిసరాల్లో ఉన్న మంచి వస్తువునో, మనిషినో గూర్చి చెప్పేటప్పుడు అనే మాట.

"ఆ పాడుకొంపలో అంతా రాక్షసులే. కుప్పలో మాణిక్యంలా ఆ పిల్ల ఒకటీ పుట్టింది." వా.

## కుప్పవడు

కూలబడు; రాసులు పడు.

"కాళ్ళు కుప్పవడఁగఁ గదలఁ జాలక." దశా. 4.45.

"ధరఁ బ్రేగులు గుప్పవడఁగ." చంద్రా. 2.94.

**కుప్పిగంతులు**

చిన్న చిన్న గంతులు.

"ఇది తగుఁ దగ దనక కళా, విదులకు నీసమ్ముఖమున విద్యల యెఱుకం, బొద వెట్టుట హనుమంతుని, యెదుర వెసం గుప్పిగంతు లెగయుట చుమ్మీ!"

ద్వా. 2.49.

**కుప్పెకోల**

ఒక రకమైన బాణము.

భార. భీష్మ. 2.393.

**కుబుసములో చేమగుడ్డు చందమున**

జేబులో నుండి డబ్బు తీసుకొన్నట్టుగా.

మీ రెప్పుడైనా నా బాకీని వసూలు చేసుకోవచ్చు ననుట.

"కుబుసంబులోఁ జేమగుడ్డుచందమున, నచ్చుగాఁ దీర్థు మీ యప్పని కొన్ని, యచ్చిక బుచ్చిక లాడి."

గౌ. హరి. ద్వితీ. పంక్తి 634-36.

'మీ జేబులో ఉన్నట్లే అనుకోండి' అనడం నేటి వాడుక.

**కుమ్మక్కు చేయు**

ప్రోత్సహించు; వత్తాసివచ్చు.

"ఆ దొంగకు వీడు కుమ్మక్కు చేస్తేనే ఇంత పని అయింది." వా.

రూ. కుమ్మకు...

**కుమ్మరావమున రాగి ముంత లేరు**

లేని చోట ఆ వస్తువుకై వెదకు. వ్యర్థశ్రమ అనుట.

"మీ వంశమందుఁ దాఁ గోర్వఁ జాలు, వారిఁ జూపుము కుమ్మరావమున రాగి, ముంత లేఱంగఁ గలవె."

ఉ. హరి. 3.48.

**కుమ్మరి కొకయేడు గుది కొక పెట్టు**

నిర్మించుటకు పట్టినంత కాలము ధ్వంసము చేయుటకు పట్టదు—అనుట

"ఇది పెక్కేఁడులు పట్టెన్, సదనంబులు గట్టి నాకు శంభునికొఱకున్, దుదిఁ గుమ్మరి కొక యేడును, గుది కొక పెట్టన్నమాటకున్ సరి వచ్చెన్."

కా. మా. 2.100.

**కుమ్మరిగుంట**

బురదగుంట.

సుమతి. 12.

**కుమ్మరిసారె యగు**

గిరగిర తిరుగు.

"... చేతము కుమ్మరిసారె యయ్యెడున్." ముద్రా. 67.

**కుమ్మఱించు**

నీరు పారబోసినట్లు, తొలగించి వేయు—తెగనాడు, విడనాడు అని భావార్థం.

"గురుభక్తదేవుని గ్రుమ్మఱించితివా."

పండితా. ద్వితీ. మహి. పుట. 215.

**కుమ్మి కూరాకు సేయు**

నురుమాడు.

పట్టి పాలార్చు వంటిది.

కూరాకు (కూర) వలె మెత్తగా మెదుపు.

కూర అనే అర్థంలో 'కూరాకు' అనడం రాయల సీమలో నేటికీ కొన్నివర్గాలలో విశేషంగా వినవస్తుంది.

"పులుల జట్టలు చీరి కుప్పలుగ వేశ్లి, నేకలమ్ములఁ గుమ్మి కూరాకు సేసి, యమరఁ జమరులఁ బట్టి పాలార్చు మిపుడు, సామి! చూడుము నీ బంట్ల సత్తు వనుచు." సారం. 1.90.

**కుమ్ము గాచు**

పిడకల మంటలో చలి కాచుకొను.

"అత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము, గాఁచు చోటికి మకర సంక్రాంతివేళ." శివరా. 4.27.

**కుమ్ము నెత్తిమీదికి తెచ్చుకొను**

అనవసరంగా కొట్లాట తెచ్చుకొను.

"అనవసరంగా దానిలో సాక్ష్యం వేసి ఆ కుమ్మును నెత్తిమీదికి తెచ్చుకొన్నాను." వా.

**కుమ్ములాడు**

కలహించు, వాదించు.

ఎద్దులు క్రుమ్ములాడుట పై వచ్చిన పలుకుబడి.

సంఘర్షణపడు అని తాత్పర్యం.

"...క్రమ్మఱం, గ్రమ్మఱ మాయా మన్మథవికారము ధైర్యముఁ గ్రుమ్ములాడఁగన్." కళా. 2.22.

**కుమ్ముసుద్ది**

గుట్టు.

బ్రౌన్.

**కుమ్ముసుద్దులకు దిగు**

వారిమీదా వీరిమీదా ఏవో కబుర్లు చెప్పుకొను.

"తునితగవుకు వారితోడను మతేమి, కుమ్ముసుద్దుల దిగక యీకొమ్ము పొమ్ము." నందక. 71. పు.

**కుమ్మెలు వోవు**

గంట్లుపడు, నలుగు.

"కుమ్మెలువోవ నొక్కి చెలి క్రోలిన తేనియ కావిమోవితో." తారా. 4.169.

"బిగువు కౌఁగిళ్ళచేఁ బ్రియు బాహుపురు లొత్తి, కుమ్మెలు వోయినకుచ తటములు." ప్రభా. 5.62.

**కుయిపోవు**

ఆర్తరక్షణకై పోవు.

కుయ్యి ఇడగా పోవు అనుట.

"పసులకై కుయి వోయి." రుక్మాం. 2.101.

"కురునాథుండు ... ఉత్తరంబునం బసులం బట్టిన నతండు బృహన్నల సారథిగాఁ గైకొని యొక్కరుండ కుయి వోవుట విని..." భార. విరా. 5.233.

రూ. కుయివోవు.

**కుయి రేగు**

అఱచు, గుంపు కూడు.

"సెలకొన సురియలు గొని చని, పొలియునో? యూరఁ గుయి రేఁగి పొడుచునో? చెపుమా!" ఆము. 3.43.

**కుయివెట్టు**

మొఱపెట్టు.

"కుయి వెట్టక వెళ్లు కూన్యోరుకూప వితానం బన." ఆము. 2.48.

చూ. కుయ్యిడు.

కుయి వోవు

ఆర్తరక్షణకై పోవు; విడిపింప బోవు.

"చేరి తమ వూరి వారి చెఱపట్టుకొని పోతే, కోరి కుయివోయి తెచ్చుకొన్నట్టు." తాళ్ల. సం. 6.5.

చూ. కుయిపోవు.

కుయ్యిడు

మొఱ లిడు.

చూ. కుయిపెట్టు.

కుయ్యో మొఱ్ఱో అను

మొఱపెట్టు, కొట్టుకొను.

"ఇయ్యసురులచేఁ జిక్కితి, మెయ్యది తెరు వెందుఁ జొత్తు మిటు వోలయఁ గదే, ఆయ్యా దేవ జనార్దన, కుయ్యో మొఱ్ఱో యటంచుఁ గుయ్యిడి రమరుల్." భాగ. 8.338.

కురుక్షేత్ర మగు

రణరంగ మగు; కలహరంగ మగు.

"వాడూ వీడూ చేరగానే ఆ యిల్లు కురుక్షేత్ర మయి పోయింది." వా.

కురులు కూకటి తోడ కూడని ప్రాయము

బాల్యము.

"కురులు కూఁకటితోడం గూడియుఁ గూడని చిన్నారి పొన్నారి ప్రాయంబు వన్." రాజగో. 1.13.

వెండ్రుకలు ముడి వేసుకొనుటకో, జడ వేసుకొనుటకో తగినంత పెరగని వయ స్సనుట.

కురులు కూడనినాడు

చిన్నతనములో.

"కురులు గూడనినాఁడె మరులుకొన్నదాని, సరగ కౌగిటఁ జేర్చి చొక్కారమోవి యాని." హేమా. పు. 51.

కురులు తీర్చు

తల దువ్వుకొని ముడి వేసుకొను; జడ వేసుకొను.

"కమ్మనూనియ మెఱుఁ గెక్కఁ గలయ దువ్వి, కురులు దీర్పకయును గచభరము లింత, సొలుచునే." కుమా. 6.52.

కురువులు వారు

క్రేళ్లుఱుకు.

"...గొరి ముందరన్, గురువులు వారు వేఁగడుపు కుఱ్ఱఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్." వీర. 1.5.

కుఱకుఱ....

చిన్న చిన్న.

"కుఱకుఱ వేలుపుఁదెఱవలఁ, జెఱవట్టిన యటులె." అచ్చ. సుం. 5.0.

"పఱతెంచి వనము వెఱుకుట, కుఱకుఱ రక్కసుల నొక్క కొందఱఁ గెలక్, విఱుచుట." రామా. 6.284.

కుఱుకుఱు గొను

ప్రోగగు.

"గొడుగుల పఱియలు గుఱుకుఱు గొనుటన్." భార. స్త్రీ. 2.3.

కుఱుకులు గట్టు

రాశిపడు (?)

"కుఱుకుల్ గట్టె భటాంగముల్ ..." భార. ద్రో. 4.83.

కుఱుచ భావించు

కించపఱచు.

"ఏంతే యీబుడు తెంత నన్గుఱుచ
గావింపం దను స్మృత్తురే?"
ఆము. 7.45.

**కుఱుచ చేయు**

అవమానించు; కించపఱచు.
"నను( గుఱుచగఁ జేసె నరనాథుఁ
డనిన." రంగ. రా. ఉత్త. 132 పు.

**కుఱుచ పఱుచు**

చిన్నబఱచు, తక్కువ చేయు.
"బుధోక్తిఁ గుఱుచపఱిచెడే."
కాళిం. 6.93.
చూ. కొంచెపఱచు.

**కుఱుచలు ద్రొక్కు-**

చలించు, ఆడు.
"హారముల్, గుఱుచలు ద్రొక్క ముం
గురులు క్రొంజెమటన్ బద నెక్క
వేలుపుం, దెఱవ యొకర్తు..."
వసు. 5.75.

**కుఱుచ సేయు**

కించపఱచు.
"నీవును నా పలుకులు కుఱుచ
సేయక..." భార. విరా. 4.29.
చూ. కుఱుచ కావించు.

**కుఱుబోడతల**

ఆక్కడక్కడ వెంట్రుక లుండి
మిగతభాగం నున్నగా ఉన్న
బట్టతల.
"పెఁ, బుతపుత మంచు నున్న కుఱు
బోడతలన్ ధరియింప నోడియున్"
పాండు. 2.64.
చూ. కుఱుమాసిన గడ్డం.
కుఱుమాపు చేల.

**కుఱుమట్టము**

కుదిమట్టమూ.
"కుఱుమట్టం బైనలోకం గాని..."
వరాహ. 12.32.
కుదిమట్టమనే నేటి వాడుకలో
రూపం. చూ. కుదిమట్టము.

**కుఱుమాపు**

కొంచెముగా మాసినది.
కుఱుమాపు చేల, కుఱు
మాపు గడ్డము ఇత్యాదులు
దీనిమీద ఏర్పడినవే.
"మాసిన దీర్ఘ వేణి కుఱుమాపిన చేల
చెఱం గలంక్రియా, వాసము గాని
మేను వసివాడిన ముద్దుమొగంబుఁ
గాంచి." శుక. 1.214.
"కుఱుమాపు దడిమంపుఁ గోకలోఁ
దోలఁకెడు, కంపమాననితంబ కాంతి
సొంపు." కళా. 4.108.
చూ. కుఱుమాపుడు.

కుట్టై-తమి.
కుఱుచ-తెలుఁగు.

**కుఱుమాపుడు**

కొద్దిగా మాసినది.
"కుఱుమాపుడు పుట్టం బలవడఁ గట్టి."
భార. విరా. 1.291.
నైష. 7.141.
చూ. కుఱుమాపు.

**కుల కుల కూయు**

గోడు గోడున నేడ్చు.
ధ్వన్యనుకరణము.
"కుల కుల కూసిరి కుతిలపడిరి."
హర. 3.10.

**కులకులలాడు**

పురుగులు వగైరా నిండుగా
ఉండు.

"చేలు కుల కులలాడుతున్నవి."
వావిళ్ళ ని.

## కులతప్పు

కులాచారవిరుద్ధ మైనపని.
అందుకై విధించిన శిక్ష.

"వాళ్లింటికి కులతప్పు వేశారు. అందు కని కులస్థు లెవ్వరూ వెళ్లడం లేదు."
వా.

## కులపతి

ఆశ్రమవాసి యై శిష్యులకు తానే తిండి పెట్టి చదువు నేర్పే ఋషి. ఆ శిష్యులు పదివేలమంది ఉండవలెను.

## కులపర్వతం

ఏడు ప్రధానపర్వతా లున్న వని పురాణాలు. అవే కుల పర్వతాలు.

## కులముకట్టు

కులాచారనిబంధనలు.

"ఎతికలవాళ్లకు కులంకట్టు చాలా ముఖ్యం."
వా.

## కులము లేని

కులము గోల్పోయిన; చెడిన.

"వాడంతమంచి కులంలో పుట్టి ఆ కులం లేనిదాన్ని పెళ్లి చేసుకొని పాడయి పోయాడు."
వా.

## కులవిద్య

అనూచానంగా వస్తున్న కుల వృత్తి.

"కులవిద్యకు దీటు లేదు గువ్వల చెన్నా!"
గువ్వలచెన్న. 10.

## కులస్థులు

ఒక కులానికి చెందినవారు.

"నలుగురు కులస్థులు ఉన్న ఊళ్లో ఉంటే శుభ మైనా అశుభ మైనా బాధ ఉండదు."
వా.

## కులిరుగొను

చల్లపడు.
కన్నడం : కుళిర్.

"కొలవేళులు సెలఁ దూడులుఁ, దలిరులు నీహారవారిఁ దడిపి నయమునన్, గులిరుగొన మేన నొత్తిరి, లలనలు పార్వతికి శీతలక్రియ లలరన్."
కుమా. 5.149.

## కులుకుప్రాయము

యౌవనము.

"కులుకుఁ బ్రాయంపు నూనూఁగు గొదమయొండ."
కాశీ. 1.123.

"అమ్మకు కులుకుప్రాయము, అయ్యకు వణుకుప్రాయము."
సా.

## కులుకులాడి

వగలాడి.

"వలపు గులికెడు సింగార మొలుక ముద్దుఁ, జిలుకకడ నిల్చెఁ గోమటి కులుకులాడి."
శుక. 1.237.
రూ. కుల్కులాడి.

## కువలువడు

కుప్ప కూలు.

"వా, సవి వాని రథంబు రథ్యసారథుల మహిన్, గువలుపడ జేసె."
భార. ఆది. 6.83.

## కుసంది

ఇటుకు.
కాశీయా. పు. 25.

**కుసిగుంపు ఒనరించు**

బాధించు. (?)

"కుసివంటి దాన వన్నీ, కుసిగుం పొన రించి యేమి గుడిచెదు."

వేం. పంచ. 1.252.

**కుసిగుంపు నడకలు**

వగల నడకలు.

"కుసిగుంపు నడకల కోడె బాఁప తలు, అసమానగతి వచ్చి..."

అమ. క. 5.232 పుట.

**కుసుమ వెట్టు**

ఎఱ్ఱపడ జేయు.

"కాదమ తుమ్మెద కడతెక్కఁ గుసుమ వెట్టి." శృం. నైష. 8.5.

కుసుంభమీఁద వచ్చినకుసుమ.

**కుళ్లు కువాడము**

కౌటిల్యము.

"వాడేమాత్రం కుళ్ళూ కువాడం లేని మనిషి." వా.

రూ. కుళ్ళూ కువ్వాడం.

**కుళ్లుకొను**

ఒకరి మేలు చూచి ఏడ్చు.

"నీ వేదో బాగున్నా వని వాడు కుళ్ళు కుంటున్నాడు." వా.

**కుళ్లుబోతు**

అసూయాపరుడు.

"ఆ కుళ్లుబోతు వెధవ ఎవరి కేం మేలు కలిగినా చూడ లేడు." వా.

దుఃఖశీలుడు అని...

బ్రౌన్; శ. ర.

**కూకటిదుంపలతో**

సమూలముగా.

"నీ, కుమురు నశింపఁ జేయుఁ జుమి కూకటిదుంపలతోడ మూర్ఖుఁడా!"

శతా. 40.

చూ. కూకటివేళ్లతో పెఱుకు.

**కూకటివేరు**

ఆధారభూతము.

చెట్లకు పొడుగాటిపెద్ద వేరు కాక, చిన్న చిన్న వేరులు కుచ్చుగా ఉంటాయి. కూకటి (వెంట్రుకలు) వలె ఉండు టనుబట్టి, ఆ పేరు పెట్టి రి కావచ్చును. కూకటివేళ్ళతో పెళ్ళగించు అన్నప్పుడు పూర్తిగా అని అర్థం.

"...వసుప్రసన్నత యాలవాలం బనంగఁ, బొనరు పర్వత పూర్వపుణ్య దేహంబు...కూకటి వేరుగాఁగ."

పండితా. ద్వితీ. పర్వ. పుట 236.

"కూకటి,వే ళ్లండన్ ముసిఁడికొనలు విఱుచుట గాదే." ప్రబోధ. 4.3.

**కూకటివేళ్లతో పెఱుకు**

సమూలముగా నిర్మూలించు.

"కాఁక నెదిర్చి సంగర ముఖంబున వచ్చిన రాజవంశమున్, గూకటి వేళ్లతోఁ బెఱికి." జైమి. 1.64.

చూ. కూకటిదుంపలతో.

**కూకటుల్ కొలుచు**

ఈడు జోడు చూచు.

"యౌవనమందుయజ్వయు ధనాఢ్యుఁడు నై కమనీయకౌతుక, శ్రీవిధిఁ గూక టుల్ గొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ సౌఖ్యావహ యై భజింప..."

మను. 1.53.

కూక పెట్టు
కూతవేటుదూరం.
"దాని, చెట్టులకు నెల్ల నర గూఁక పెట్టు పొడువు." వరాహ. 10.126.

కూక లిడు
1. తిట్టు.
"పాంథజనులఁ, గూక లిడె ననఁ గోకిలల్ కూఁత లిడియె." శ్రవ. 2.64.
2. కూత వేయు.
"తలిరుఁబోఁడుల డెందముల్ తల్లడిల్లఁ, గూఁక లిడుకొంచు నంతయుఁ గోఁటఁ లేక, యాగడంబునఁ బురి విచ్చి యాడె దేమి." నీలా. 3.27.
3. అల్లరి చేయు.
"నా కొడుకును నా కోడలు, నేక తమునఁ బెనఁగఁ బాము నీతఁడు వైవం, గోక లెఱుంగక పాఱినఁ, గూఁక లిడెన్ నీ సుతుండు గుణమె గుణాఢ్యా!" భాగ. స్కం. 10. పూ. 325.

కూకలు పెట్టు
కూత వేయు.

కూకలు వేయు
అఱచు; తిట్టు, దండించు.
"ఆఁ! వా డన్నదానికి ఇంత గొడ వెందుకు? నేను పిలిచి కూకలు వేసి పంపిస్తాను." వా.

కూకవెట్టు
ఒకరకమైన పాము.
వావిళ్ళ ని.

కూకులు వత్తులు నగు
నలిగి నల్లేరగు.
ఎక్కువ కలత చెందు అనుట.
"అక్కొండొక బ్రహ్మచారి మదిఁ గూకులు వత్తులు నై యసద్గతిన్." పాండు. 5.244.
"గోమపుంగు స్తైలఁ బార్శ్వభూజనులు కూకులువత్తులు గా." వేం. పంచ. 2.105.
"చిలువదళి వాయు లప్పుడు...కూ, కులువత్తులు నై మొనతల, నిలువక శేషాహికడకు నెఱి చెడి పాఱున్." జైమి. 7.102.
కూకుమువత్తులు అని బ్రౌను గ్రహించి గాలిలో తేలియాడు సాలెపురుగు నేసిన దారాలు అన్న అర్థం చెప్పి అతి తేలిక యగు అన్న భావార్థం చెప్పాడు. ఇది యింకా ఏ మూల నైనా వాడుకలో ఉన్న దేమో పరిశీలించవలసి ఉన్నది. ఏమయినా 'వాడి వత్తలగు' లాంటి పద మని భావార్థం చెప్పుకోవడం కంటె యిలాంటి పద మొకటి ఉండనే ఉంటే మెఱుగని వేఱే చెప్ప నవసరం లేదు.

కూగెంట
కూతవేటు దూరమున నొక చోట.
"కూగెంట నొక్కొక్క కూటంబు గలదు." పండితా. ద్వితీ. పర్వ. పుట. 480.
చూ. చేతెంట.

కూచి సేయు
దండెత్తు.

"కూచి సేయింపఁగాఁ జూచె నందమొ
యేల, చైద్యుఁ డెఱుంగఁ డే శార్ఙ్గ
తిలక." చంద్ర. 5.125.

కూచీ చేయు

దండెత్తు.

"ఆ రాజు కూఁచీ చేయించి సమంచి
తాత్మ బలవత్సేనా సమేతంబుగా."
రంగా. 2.59.

కూటసాక్ష్యం

తప్పుడుసాక్ష్యం.

"కూట సాక్ష్యాలు చెప్తే అందరూ
అలాగే బతకొచ్చు." వా.

కూటికుండల పేటు

తిండిచేటు.

నా. మా. 87.

కూటిచవి తేల్చు

అన్నము పెట్టు, అన్నము
రుచి చూపు.

"తరిగొండ వెన్నుపైఁ దాల్చి పేల్పులఁ
గూటి, చవిఁ దేల్చినట్టి కచ్ఛపమ
వీవ." పారి. 1.49.

కూటినీళ్లు

అన్నం కొద్దిగా వేసి ఉంచిన
నీళ్లు.

"కూటినీళ్లు తాగి వెడితే మధ్యాహ్నం
దాకా కూలీలు పని చేస్తారు." వా.

కూటిపేద

నిఱుపేద. కూటికి లేనివాడు.

"పడమర పెట్టు నయ్యోడుకు ప్రాశన
మొల్లక కూటి పేద పై, బడలిక
నుండు...." ఆము. 2.49.

కూటిపేద తోడు తప్పినట్లు

కూటిపేద మఱొక పేదవాని
తోడును సహించ లేడు.
యాచకునికి యాచకుడు శత్రు
వు కదా! అలా జత వదలినట్లు.

"అనుడు నొకింత నవ్వి ధరణీశ్వరుఁడు,
కువలయాక్షి! చాల్పులఁ గూటిపేద,
తోడు దప్పినజాడ సిగ్గుంచు చనినఁ,
గానఁ గాచినవెన్నెల గాదె బ్రదుకు."
సుదక్షి. 2.74.

కూటిప్రొద్దు

భోజనవేళ.
ఇట్లా యేర్పడినవే ఒంబటి
ప్రొద్దు, పంబళ్ల ప్రొద్దు -
ఇది మధ్యాహ్నభోజనవేళకే
వర్తిస్తుంది.

"దిటమున రెడ్డి పాటుపడి తెచ్చి యిడం
గను గూటిప్రొద్దు సంకటి తఱి వెన్న
మజ్జిగలు కంకటిపైఁ బవలింటి నిద్ర
లున్..." శుక. 2.333.

కూటిప్రొద్దు సంకటి

వేళకు భోజనం.

"దిటమున రెడ్డి పాటుపడి తెచ్చి యిడం
గను గూటిప్రొద్దు సంకటి..."
శుక. 2.333.

వాడుకలో. వేళకు భోజనం
అన్నరూపంలో ఉంటుంది.

"వాని కేం? అత్తవారి పుణ్యమా అని
వేళకు భోజనం అమరుతూ ఉంది."
చూ. వేళకు భోజనం.

కూటిబీద

నిఱుపేద.

కూటికి కూడ లేనివాఁ డనుట.

"జారో, పాంతములఁ జేర్ప నాతఁడ, నంతవ్యథఁ గూటిబీదయై యెవ్వ గలన్." శుక. 3.352.

దరిద్రుడు, అన్నాతురుడు.

పాండు. 4.158.

చూ. కూటిపేద.

## కూటిలో మట్టి పోయు

జీవనాధారము పోగొట్టు.

కూడు ప్రధానం గనుక అదే జీవనానికి సంకేత మయినది. అందులో మన్ను పోయడం అనుభవదూరం చేయడమే.

"నా కూటిలో మట్టి పోస్తే నీ కేం వస్తుంది? లేనిపోని వన్నీ కల్పించి నా మీద అధికార్లతో చెబుతున్నా వని విని నీ దగ్గిరికి వచ్చాను." వా.

## కూటివెచ్చము

తిండిఖర్చు.

"కూడినధన మెల్లఁ గూటివెచ్చంబు."

గౌర. హరి. ప్రథ. పంక్తి. 1499.

## కూటువమూక కూర్చు

వీరులను ఏరి కాక దొరికిన వారి నందరినీ సైన్యముగా ప్రోగు చేయు.

మందవేయు అనుట వంటిది.

"అడవులఁ గొండలం బడి మహాపద రూపఱి చన్నవారి నిప్పుడు కొనివచ్చి కృష్ణుఁ డొకప్రోవుగఁ గూటువమూఁకఁ గూర్చినన్..."

భార. ఉద్యో. 2.

## కూటువలు గూడు

గుంపు గూడు.

రసిక. 6.198.

చూ. కూటువలు గొను.

## కూటువలు గొను

గుంపు కూడు.

"పీటఁ గలచేడె లెల్లను ... కూటువలు గొనుచుఁ జూచిరి."

భాగ. 10. పూ. 1248.

## కూటువసరులు

మాయముత్యాలు వగైరాల హారము.

"కాటుక చెదరఁ గన్నవ నీరు జాఱఁ, గూటువ సరులఁ జిక్కువడ హార ములు." పద్మ. 3.21.

బ్రౌన్.

## కూడగట్టుకొను

తనతో వచ్చునట్లు చేసుకొను.

"ఊరిలోని పెద్ద లందఱినీ కూడగట్టు కుంటే కానీ, ఈ సత్రం మనం కట్టడం సాధ్యం కాదు." వా.

చూ. కూడదీసుకొను.

## కూడదీసుకొను

తమ కనుకూలముగా చేసుకొను.

చూ. కూడగట్టుకొను.

## కూడ దెచ్చుకొను

కూడదీసుకొను; కుదుట పరచుకొను.

"వెండియున్, జిత్తము గూడఁ దెచ్చుకొనుఁ జెప్పక పోదని నిర్ణయించి డగ్గుత్తిక వెట్టి లక్ష్మణుఁడు..."

నిర్వ. 7.12.

**కూడ పోయు**

కూడబెట్టు; రాశి పోయు.

"గోవిందనామ మొకటి కూడ పోసెఁ బుణ్యములు." తాళ్ల. సం. 9.8.

**కూడబడు**

కలిసికొను.

"ఏకాంత స్థలంబునఁ దాఁ రేవురును ద్రౌపదియును గూడఁబడునట్టి తెఱంగు సంఘటించి..." భార. విరా. 5.305.

"తైజసస్పృష్టికిఁ, బరమాణుచయంబు గూడఁబడుచందమునన్." పాండు. 4.30.

**కూడ బలుకుకొను**

ఒక్క మాటకు వచ్చు.

"వీా రిద్దరూ కూడబలుకుకొని వచ్చారా యేమిటి? ఒకే మాట మాట్లాడుతున్నారు." వా.

**కూడబాఱు**

కూడు.

**కూడ బెట్టు**

1. దాచు; ధనం కూడబెట్టు.

"కట్టక కుడువక యొరులకుఁ, బెట్టక తమ తండ్రి కూడఁబెట్టిన సిరి..." విక్ర. 2.163.

2. కలుపు.

"అని తనవంగడం బగుధరాధిపమంత్రి పదాతివర్గముం, బనివడిఁ గూడఁబెట్టు." ఉత్త. హరి. 3.5.

"ఈలువు మాటవాసియుం, జుట్టఱికంబుఁ బుణ్యమును సున్నగ మిన్నలఁ గూడఁ బెట్టుచో." విప్ర. 3.13.

**కూడ ముట్టు**

వెన్నంటు.

"తఱగని తూణముల్ ధనువుఁ దాల్చి వరాహముఁ గూడ ముట్టి." కా. మా. 4.180.

**కూడలిదారి**

చౌకు. బ్రౌన్.

**కూడలిపట్టు**

రచ్చపట్టు. బ్రౌన్.

**కూడలితాయి**

హద్దురాయి. శ. ర.

**కూడలివాయి**

రెండు పంచలు కలిసిన మూలలో ఏర్పరచినట్టి దారి. శ. ర.

**కూడా మాడా**

కలిసి మెలిసి.

చూ. కూడి మాడి.

**కూడి మాడి**

కలసి మెలసి. జం.

"కొలిచెదము నిన్ను మే మెల్లఁ గూడి మాడి." హర. 2.139.

నేటికీ వాడుకలో: వాడూ నేనూ కూడా మాడా కలిసి తిరిగినాము అంటారు.

"తాను గుమార జంగమ సుధాకర మౌళియుఁ గూడి మాడి యుం, పైన రతి ప్రసంగముల." కా. మా. 1.42.

"ఇంట్లో ఎదిగినపిల్ల ఉంటే కూడా మాడా పని చేస్తుంది." వా.

**కూడిమాడి మెలగు**

కలసి మెలసి తిరుగు.

"ఇన్నాళ్లు గూడిమాడి మెలంగక." విప్ర. 4.68.

**కూడి యాడు**

కలసి మెలసి తిరుగు.

"మందుల తాయెత్తులు గట్టినఁ శబర పుత్రుల్ గూడి యాడఁ బురిన్." కా. మా. 3.32.

**కూడి వచ్చు**

కలిసి వచ్చు.

"వాడు నాతో కూడి రాడు."

"పదివేలదాకా ఆ కంట్రాక్టులో వానికి కూడి వచ్చినవి." వావిళ్ళ ని.

**కూడుకొను**

కలిసికొను; సంభోగించు.

"విహీనులఁ గూడుకొంట...వలదు పతికి." ఆము. 4.252.

**....కూడుగా కుడుచు**

అదే తిండిగా జీవించు.

ఇందులోని 'అది' పాపము, కౌటిల్యము ఇత్యాదులే వయినా కావచ్చును.

"అటు గాన సెన్నిభంగులఁ, గుటిలత్వమ కూడు గాఁగఁ గుడుతురు మగవా, రిటువంటివారి మదిలో, నెటుగా నమ్ముదురు సతులు హితు లని పతులన్." విక్ర. 7.181.

"ఉడుగక కపటమె కూడుఁగ, గుడువం దొడరి యునికిఁ గలుషలు మగలు నెదం, జెడి విశ్వాస మ్మొరు లూరు, లెడ స్వైరవిహారసరణికే డిగిరి హరీ!" అశ్వినమా. 1. ఆ.

**కూడు గుడుచు**

నీచస్థితిని అనుభవించు.

"బిడ్డలకు బుద్ది సెప్పని, గ్రుడ్డికిఁ బిండంబు వండి కొని పొండిదె పైఁ, బడ్డాఁ డని భీముం డొఱ, గొడ్డెము లాడంగఁ గూడు గుడిచెద వధిపా!" భాగ. 1. స్కం.

**కూడు గుడ్డకు రాని**

ఎందుకూ పనికి రాని.

రామచం. 69.

**కూడు గుడ్డకు కొదవ లేదు**

బాగానే ఉన్నవా డనుట.

"వాని కేం? లక్షణంగా ఉన్నాడు. కూడు గుడ్డకు కొదవ లేదు. పిల్ల నిస్తే సుఖపడుతుంది." వా.

**కూడుగూటిప్రాయము**

చిన్నతనము.

"ఇసుమంత గాని లేఁడీ, పసిబాలుఁడు కూడుగూటిప్రాయమువాఁడీ, వైసరి బహుభక్ష్యరాసులు, మెసఁగెడి విసువఁడు ప్రతుష్టి మేకొనఁడు గదే." పాండు 4.180.

పాఠాంతరం: చూ. కుడువకూటి...

**కూడు గోకయును లేక**

తిండికీ బట్టకూ లేక.

"ఇట్లు వర్తించియును నాతఁ డేమియందుఁ, గళవళముఁ జెందఁ గూడుఁ గోకయును లేక." శుక. 3.372.

**కూడుగోకలు**

అన్నవస్త్రాలు.

"కఱవు కాలంబున మఱపు సొచ్చిన వార్కి, కూడుగోక లొసంగినాఁడి తండు." సానం. 1.152.

కూడుగట్టు

అన్నము తినక ఉపవాసము లుండుట.

"లేకున్న విడుతుఁ బ్రాణము, నీ కై కూడుఁ గట్టి నిలుగ్రీవా!" కా. మా. 3.101.

కూడు చీర యిచ్చు

తిండీ బట్టా పెట్టి పోషించు.

"...కూడుం జీర నిడి సాకతంబు సేసి నఁ జాలున్." భార. విరా. 1.219.

చూ. కూడు సీరకు.

కూడునీరు

కూటినీళ్లు; గంజి.

శుక. 3.103.

కూడును బాడి

'పాడి పంట' వంటిపదం. జం. క్రీడా. పు. 83.

కూడు సీరకు

పోషణకు; తిండికీ బట్టకూ అనుట.

"వినుము గుణవంతుఁ డొకరుఁడు, ధన వంతుం డైన యొక్క ధరణీనాథుం, దనకూడు సీరకై కాం, చన మడిగి." భార. శాం. 3.165.

కూతవేటు దూరము

కొంచెము దగ్గఱలో.

కూత వేస్తే వినబడునంత దూరము.

దూరాన్ని కొలవడానికి యిలాంటివేవో పూర్వం కొన్ని ఉండేవి. ధనుః ప్రమాణము, రాతివేటు దూరము, పగ్గపట్టు మొదలయినవి యిలాంటివే.

"విను మిప్పటికిఁ గూఁతవేటు దూరం బునఁ, గల దొక్క ప్రాదము నిర్మలము జలము." హరిశ్చం. 3.65.

చూ. కూకపట్టు.

కూతుం గతులు పడు

కూతు నడుగుటకై వెళ్లి, పెత్తనము పోవు.

"హిమవంతంబునకు గూఁతుంగతులు సనినమునిగణంబు." కుమా. 8.2.

(కూతంగతులు అన్న పాఠం సరి కాదు.)

కూనగుంత

ఏతము బావిదగ్గర మాను నిలుచుటకు పాతిన కంబానికి వెనుక ఉన్నగుంత.

"మ్రాను మీటుగ నెగయ గోమాయు వప్పు, డేకతాళప్రమాణ మ ట్లెగసి కూన, గుంతలోఁ బడి గ్రుడ్లు వెల్కు ఱుక నాల్క, నడుము కఱచుక నఱచుచు బెడిసి మడిసె." హంస. 1.193.

కూనరాగము

చిన్న రాగము; కూని రాగము.

"వాడు కూనరాగాలు తీస్తున్నాడు." వా.

కూనరోగము

కంటి రోగము.

కళ్ళలో కూనలు – దుర్మాంసం – పెరిగినప్పు డంటారు.

కూనలమ్మ చీర

పాతకాలంలో చీరల రకా లలో ఒకటి.

శుక. 2.411.

కూనలమ్మ పటము

చూ. కూనలమ్మ చీర.

కూనలమ్మ పాటలు

కూనిరాగాలు.

చూ. కూనలమ్మ సంకీర్తనలు.

కూనలమ్మ సంకీర్తనలు

కూనిరాగాలు.

"నేరని గురుబోధలు సం,సారను లై కూనలమ్మ సంకీర్తన లై, దూరము నై ము క్తికి ని,స్సారము లై పోవు నన్న సంపగిమన్నా!" సంపగిమ. శ. 34.

చూ. కూనలమ్మ పాటలు.

కూనిరాగాలు

చూ. కూనరాగం.

కూపకూర్మము వలె

ప్రపంచజ్ఞానం లేక తనకు తెలిసినదే లోక మను కుంటూ.

గిర. 12.

చూ. కూపస్థమండూకము వలె.

కూపమండూకము వలె

కూపకూర్మము వలె.

"బోధ మల్పంబు గర్వ మభ్యున్న తంబు, శాంతి నిష్పచ్చరంబు మచ్చరము ఘనము, కూపమండూకములు బోలెఁ గొంచె మెఱిఁగి, పండితమ్మన్యు లైన వైతండికులకు." భీమ. 1.13.

"సర్వదోచ్ఛిష్టపంక సంచయనము లగు, కూపమండూకముల కెట్లు కోర వచ్చు, భట్టపాదకుమారిల పండితేంద్ర, వాగ్ఘరీ జృంభణవిలాసవైభవంబు."

శంకరవిజ. 1.65.

చూ. కూపస్థమండూకము వలె.

కూపస్థమండూకము వలె

తా నున్నదే సర్వమూ అను కొను అజ్ఞానభావం కలవారి పట్ల ఉపయోగించే పలుకు బడి.

బావిలో పుట్టి అక్కడే పెరి గిన కప్ప అదే లోక మని భావిస్తుంది అనుటపై యేర్ప డినది.

"...ఈ నాలుగింట నొక్కఁడే నెవ్వా నికి లేకుండు, వాఁడు కూపస మండూ కంబుబోలె దనునుక్కనకఁ జక్కటి మీఁదిదె యాకాశంబు తన గొందియ లోకం బని యెంచి...."

నీతి చం. పే. 55. పం. 13.

చూ. కూపకూర్మము వలె; కూప మండూకము వలె.

కూపెట్టు

పిలుచు, కూతపెట్టు; కుయ్యో మొఱ్ఱో అను.

"తలుపు సడలింపు మనుచుం, గుల భామను మాంత్రికుండు కూ పెట్టి నచో." హంస. 3.105.

"కూపెట్టంగ మహీసుపర్వుల మెడల్ గోసెన్." వరాహ. 2.98.

"విపన్నులో కూపెట్టిన విని తీర్పుము." ఆము. 4.204.

కూయిగా

రక్షకుడుగా.

"అసమున మీఁ దెఱుంగక మహాగ్రహ
వృత్తిఁ గడంగి చెచ్చెరం, బసులకుఁ
గూయిగాఁ జనియె బాపఁడు."
భార. విరా. 5.234.

### కూయి చెప్పు

ఎవరి నైనా సాయమునకు ఎలు
గెత్తి పిలుచు.

"ఇక్కడఁ గూయి చెప్పుటకు నెంతయు
దూరపుఁజోప్పు మార్చి పో."
కా. మా. 4.66.

### కూయిడు

పిలుచు.

దూరంలో ఉన్నవారిని పిలు
చుటలో కూత వేయు అలవా
టుపై వచ్చినపలుకుబడి.

"వా యెత్తి యఱచుచు వారివారికిని,
గూయిడుచును."
పండితా. ద్వితీ. మహి. పుట. 14.

"ఆ యెడ సఖు లాకఁ డొక్కఁడు,
కూయిడి జతగూడ కెడసి..."
హంస. 4.222.

### కూయి వచ్చు

పిలుపు వచ్చు.

"కూయి వచ్చినన్, నీ వటు దండకో అ
గుచు నిల్చినఁ జాలు."
జైమి. 1.100.

### కూరకా ఉప్పుకా ?

నిష్ప్రయోజన మనుట.

"...ఒసంగినను గూరకా యుప్పుకా?"
పండిత. 6.

చూ. ఉప్పుకు వస్తుందా ఊరగాయకు
వస్తుందా?

### కూరగాయ కవిత్వము

స్వల్పలాభానికై పొగడుతూ
చెప్పే కవిత్వం.

"ఘన మగునుతి గనక కూరగాయ
కవిత్వం, బనక కృపామతిఁ గైకొను."
సంపగిమ. శ. 3.

### కూరగాయకవులు

కూరగాయ కవిత్వం చెప్పే
వారు.

"...ప్రోఁత లెల్లం గనుకూరగాయ
కవులఁ సర కించుక, సేతురే కవుల్?"
బహులా. 1.11.

చూ. కూరగాయ కవిత్వము.

### కూరగాయవైద్యము

చిల్లర వైద్యము, నాటు
వైద్యము.

కాస్త నిరసనగా అనుమాట.

పల్లెలో నాటు వైద్యులు
వంకాయలకూ, బెంకాయ
లకూ చేసేవైద్యము అను
టపై వచ్చినది.

"ఈ కూరగాయవైద్య మెవరి క్కావా
లోయ్? సూది వేస్తేగానీ నా జబ్బు
తగ్గదు." వా.

### కూరనార

కూరగాయలు; శాకపాకా
దులు. జం.

"ఆ ఊళ్లో కూరానారా బాగా దొరుకు
తుందా?" వా.

### కూరముక్కు

చేపలలో ఒక రకం.

"మోరపక్కెర దొంతును గూర

ముక్కు ... అది యగు మీ లం బట్టు నతఁడు." హంస. 4.187.

కూరలు నారలు

శాకపాకాదులు. జం.

"కూరలు నారలు చాలవె, పూరింపక మృష్ట మేల పొట్టకు..." పంచ. (వేం) 2 ఆ.

కూర వండి కస వేర గోరు

సిద్ధాన్న ముండగా గడ్డికోసం వేకారు.

తగనిపని అనుట.

తాళ్ల. సం. 8.175.

కూరా కగు

కుమిలి పోవు; కూరవలె ఉడికి పోవు.

"ఈరీతిఁ గడుపునొప్పిం, గూరా కై ...యుడికెక్." వేం. పంచ. 4.260.

కూరాకు కోసి తిను

ఆకూ అలమూ తిను.

"అడవులకుక్, మరలం బోయెద నచటం, దిరిగాదఁ గూరాకు గోసి తిని యెద." భార. భీష్మ. 2.8.

కూరాకు చేయు

నలిపి వేయు, బాధించు.

పప్పుకూర మెదిపినట్లు మెదుపు అనుటపై వచ్చిన పలుకుబడి.

"గుదిగుది గావించి కూరాకు చేసి."

గౌర. హరి. ద్వి. 1263.

చూ. కూరా కగు.

కూర్కిడు

నిద్రించు.

"కూర్కిడు నంతలోపలక్ ... ఒక కల గంటి." బిల్హ. 2.36-37.

కూర్కుపాటు

తూగుట.

"కూర్కుపాటులఁ దూఁగి కూఱు వారు." వరాహ. 11.126.

కూర్కొని కూర్కొని చెవుల బోయు

సూటిపోయు.

"......ఏను శంతనుసుతుండు, గురుఁ డును విదురుండు గూర్కొని కూర్కొని, చెవులఁ బోయు మె సవిశేష కార్య..." భార. స్త్రీ. 1.142.

కూర్చుంటే తప్పు, లేస్తే తప్పు

అనవసరంగా తప్పు పట్టువారి పట్ల ఉపయోగించే పలుకు బడి.

"అతని దగ్గర మనం పని చేయ లేము. కూర్చుంటే తప్పు లేస్తే తప్పు." వా.

కూర్చుకొను

సమకూర్చుకొను.

"తద్బలంబులన్, శ్రీ విలసిల్లఁ గూర్చు కొని." రుక్మాం. 3.212.

కూర్చుగుమ్మలు

కూర్చు స్త్రీలు, అనగా తనపై కూర్మి గలవారు - మిత్రులు.

"చెలువ దనచెల్మికత్తెలఁ బిలిచి నాకుఁ, గూర్చుగుమ్మ లెవ్వార లీ కొమ్మ లంచు." కుమా. 6.27.

ఈ కూర్చు 'ఇష్టమైన' 'ప్రియ

మైన' అనే అర్థంలో ఏ పదం
తో నైనా కలుస్తుంది.
"కూర్చు మనుమండు."
భార. ద్రో. 2.236.
చూ. కూర్చుచుట్టము.

**కూర్చుచుట్టము**
ప్రియబంధువు.
"కూర్చుచుట్టంబుగా భావించి."
పాండు. 3.68.

**కూర్చొని కుంప ట్లమ్ము**
తాను కదలకనే వారికీ వీరికీ
తగాదాలు పెట్టు.
"దాని కింకప నేముంది? కూర్చొని కుంప ట్లమ్ముతూ ఉంటుంది." వా.

**కూలంకష మైన**
సమగ్ర మైన.
నది బాగా నిండినప్పుడే కూలములను (ఒడ్డులను) ఒరసుకొంటూ పారుతుంది. అందుపై వచ్చిన పలుకుబడి.
"ఆయనకు ఆ భాషలో కూలంకష మైన పాండిత్యం ఉంది." వా.

**కూలబడు**
చతికిలబడు.
చూ. చదికిలబడు.

**కూలికి**
అయిష్టముగా.
కేవలం డబ్బు వస్తుం దని మాత్రమే.
"కూలికి నూనె లంటి." శుక. 2. 363.
"వాడు కూలికి చేస్తున్నాడు." వా.
"కూలికి ఏడ్చేవాళ్లతో ఏం పని అవుతుంది?" వా.

**కూలి నాలి**
కూలిపని.
జం.
"కూలినాలికిన్ వ్యయ మొనరించి."
గుంటూ. పూ. పు. 14.
"కూలికీ నాలికీ పోయి ఆవిడ బతుకుతూ ఉంది." వా.

**కూలిపాటు**
కూలిపని.
"ఈ, యమునల కెట్లు జీవనము లందలి వారల నాశ్రయించి నిత్యము గను గూలిపాటుఁ బడి తారు చరించె దరు..." పార్వ. 2.93.

**కూలి పుట్టు**
పని దొరకు.
"ఈ ఊళ్లో కూలి పుట్టడం లేదు. అందుకనే పడమటికి వెళ్లిపోతున్నాను." వా.

**కూలియాలు**
వేశ్య, వెలయాలు, డబ్బునకు వచ్చు ఆడది.
"క్రొక్కారు మీఁ గలుగువాఁడె మనోజ్ఞుఁడు గూలియాలికిన్."
కుమా. 8.143.

**కూళతనము**
కర్కశత్వం; దైన్యం.
"ప్రాఁతబట్టకై, కూళతనంబునం బ్రభులకుం దనుమర్దన మాచరించియున్." శుక. 2.363.

**కూళమారి**
కూళ; దుష్టుడు.

"కూళమారి విధాత చేకూర్చె నిటుల."
ప్రబంధ. 655.

కృతపడు

1. కడచు.

"కృతపడినకార్యంబు గ్రమ్మఱం బొడముసే..." భార. కర్ణ. 1.226.

2. మరణించు.

"పనిచి కృతపడిన గాంగేయునిదెస."
భార. ద్రోణ. 1.6.

3. వే అగు.

"సురకరి యీగుద్రిఁ జరియించు సేనిక, కొదమలఁ గృతపడ్డకొదమ యొక్క."
మార్క. 1.97.

కృతపడ్డ తప్పు కాచు

వెనకటి తప్పులను మాఫీ చేయు - మన్నించు.

"కృతపడ్డ తప్పు గాచితి నేఁడు."
జైమి. 8.94.

కృతపఱుచు

గడపు.

"...దినంబులు కడంద్రోచి...ఋతువులు కృతపఱచి..." సాంబో. 1.173.

కృత మెఱుగు

చేసిన మేలు జ్ఞప్తి కుంచుకొను.

"కృత మెఱుఁగుదు రుపకార,వ్రతమున వర్తింతురు..." భార. విరా. 3.61.

కృతయుగపుమాటలు

సత్యకాలపు మాటలు, తాతలనాటి సంగతులు.

"...కృతయుగపు మాట లిపు డేల."
నందక. 29.

కృతి యిచ్చు

గ్రంథం అంకిత మిచ్చు.

"కృతు లిచ్చినసుకవుల."
రుక్మాం. 3.66.

కృత్యాద్యవస్థ పడు

మిక్కిలి కష్టముతో కూడినట్టి. ప్రారంభ దశలోని ఇబ్బందులు పడు.

కావ్యరచనలో ప్రారంభం చాలా క్లిష్టం అనుటపై ఏర్పడిన పలుకుబడి.

"ఉత్త గాడు వేలమీద పెట్టుబడి పెట్టాడు. ఎప్పుడో బాగానే వస్తుంది. ఇప్పుడేదో కృత్యాద్యవస్థ పడుతున్నా డంతే." వా.

కృప ఉట్టిపడగా

దయారసము వెల్లివిరియగా.

"ఆ బాలురఁ గృప, యుట్టి పడఁగఁ జూచి నృపతి యొయ్యన నగుచున్."
కళా. 6.160.

కృప చేయు

అనుగ్రహించి యిచ్చు.

"నీవు కృప చేసిన వీ రథచాపతూణముల్." జైమి. 4.25.

కృపవాడు

అనుగ్రహపాత్రుడు.

"ఎవ్వఁడు తేజరిల్లు నతఁ డెప్పుడు నీ కృప వాఁడు భార్గవీ!" వి. పు. 1.203.

కృప సేయు

అనుగ్రహించు; ఇచ్చు.

"వివేకపరిపాటియునుం గృప సేసె."
హార. పీఠిక. 30.

**కృష్టపచ్యము**

దున్నిన నేలలో విత్తి పండించే ధాన్యం.

ధాన్యం రెండు రకాలు—కృష్ట పచ్యము; అకృష్టపచ్యము= తానంతట పండే గడ్డిగింజల వంటివి.

**కృష్ణా అనుకొను**

చచ్చిపోవు.

"ఆ ముసలిది కాస్తా కృష్ణా అనుకొంటే ఆ ఆస్తి అంతా వీడిదే." వా.

**కృష్ణార్పణ మగు**

తనది కాకుండా ఇతరులకు దత్తమై పోవు.

ఏ దయినా దానంగా యిచ్చినప్పుడు కృష్ణార్పణం అనీ, రామార్పణం అనీ దైవ ప్రీతిగా యిచ్చే అలవాటు కలదు. అందుపై వచ్చిన పలుకుబడి.

"వాడు చదివి తెచ్చిస్తాను అంటే పుస్తకం ఇచ్చాను. అది కృష్ణార్పణం అయి పోయింది." వా.

**కృష్ణాష్టమి**

శ్రావణ బహుళ అష్టమి. ఇదే గోకులాష్టమి. కృష్ణుడు పుట్టిన రోజు.

"కృష్ణాష్టమినాడు గౌడీయమఠలో బ్రహ్మాండంగా చేస్తారు." వా.

**క్లప్తంగా**

సంక్షిప్తంగా.

"మీరు చెప్పే దేదో క్లప్తంగా చెప్తే మంచిది" వా.

**కెంపగు**

ఎఱ్ఱ నయిన.

అనగా క్రోధోద్రిక్త మయిన.

"కెంపగు కన్నుదోయితో." జైమి. 2.53.

**కెంపగుచూడ్కి**

క్రోధదృష్టి.

"జనపరంపర కెంపగుచూడ్కిఁ జూచి." పాండు. 3.95.

**కెంపు దేఱు**

ఎఱుపెక్కు.

"కన్నుదోయి, తుదిఁ గెంపుదేఱు నిద్దుర మంపుతోడ." వర. రా. సుం. పు. 67. పంక్తి. 8.

**కెంబసుపు**

కుంకుమ.

"నునుపుగా దువ్వి తీర్చిన కెంపు బొాలేందు, పస మీఱు నొసటి కెంబసుపు బొట్టు." శుక. 2.425.

**కెక్కరలు కొట్టు**

ఆశ్చర్యమును ప్రకటించు.

'గెగ్గరలు కొట్టు' అని నేడు వినబడదు.

ధ్వన్యనుకరణము.

కుక్క. 52.

"ఆ పిల్ల అత్తనలా అన్నిమాట లంటుంటే అంతా కెక్కరలు కొడుతూ విన్నారు." వా.

కెక్కరించి

కోడిలా అటూ ఇటూ చెలికి.

"వాడు కోడి కెక్కరించినట్టు కెక్కరించి రెండు మెతుకులు తిన్నాడు." వావిళ్ల ని.

కెడగూడు

1. గుమికూడు.

కాశీ. 3.138.

2. కలిసి యుండు.

"నెఱి లేక నీతోడనీడ యై గెడగూడి, పరఁగినన న్నింత."

3. భోగించు.

"మగనికి వెఱవక యింటికిఁ, దగఁ దానే కర్త యగుచుఁ దత్పరవృత్తిన్, వగకల దై వెలిఁ దిరిగెడు, మగువం గెడగూడువాడు మదనుఁడు గాఁడే." మల్ల. 2.173.

కెడ్బెరయు

అడ్డదిడ్డముగా పడి యుండు, కలగాపులగ మగు.

"మృగంబుల యెలుంగుల తోడం గెడ్బెరసి." కాశీ. 1.93.

"సొంపు మిగులంగ జోదుల యంప పొదుల, దీప్తులును లేఁతనవ్వుల దీధితులును, హారిరశ్ములుఁ గెడ్బెర సగుచు వెలుఁగఁ, దేరు లరిగె నుద్దామతఁ గౌరవేంద్ర!" భార. శల్య. 1.104.

చూ. కెడ్బెర సగు.

కెడ్బెరసు అగు

అటూ ఇటూ చెల్లా చెద రుగా అడ్డదిడ్డంగా పడు.

"కె, డ్బెర సై పీనుఁగులు పడువుఁ బ్రేక కయుఁ బడియెన్." కుమా. 11.127.

కెరలి పడు

త్వరపడు.

"కెరలిపడి జనని దూఱుట, ధరణీపతి ననుట వెఱ్ఱితనము." సారం. 3.32.

కెరలి యాడు

ఆనందముతో తాండవించు.

"బాణాసురుండు దనుజసుందరీసహితుఁ డై ... కెరలి యాడుచు మధుపానకేళిఁ దేలి." ఉ త్త. హరి. 5.47.

కెరలుకొను

తేరుకొను; ఏపుగా పెరుగు.

"వాడక వ్రాలక తెవులుఁ, గూడక తగ నల్ల గెరలుకొని నవకము లై ... వీడెన్ సస్యంబు లిడుమ వీడెన్ బ్రజకున్." భాగ. 10. పూ. 757.

కెరలు వొడుచు

కెరలుకొను.

"అతని చేత నున్న యమృతకుంభము నూఁచి, కెరలువొడిచి సురలఁ గినుక పెట్టి, పుచ్చుకొనిరి యసురపుంగవు లెల్లను." భాగ. 8.295.

కెరలెత్తు

చూ. కెరలుకొను.

కెర్లుకొను

కలవరించు; కేకలు వేయు.

"పిల్లవాడు నిద్రలో కెర్లుకొని లేచాడు." వా.

"మేలును దెల్పుచుఁ గేక లిడుచు గెర్లుకొనుచును వచ్చె......డు బుడక్కివాఁడు."

హంస. 2.27.

కెలవాడి

కిలాడి, టక్కరి.

"రసికుఁ డగు కెలవాడి, అప్పఁ డగు కెలవాడి." తాళ్ల. సం. 12.14.

**కెల్లు రేగు**

విజృంభించు.

"కెల్లు రేఁగ దేహ మంజే కిమ్ముల చుట్టరి." తాళ్ల. సం. 7.256.

**కేకట కెమ్మట లాడు**

పరిహాసము లాడు.

కేకే యని అఱచుచు పరి యాచకము లాడు అని వావిళ్ళ ని.

"గిరిజేశుఁ గ్రేకటఁ గెమ్మట లాడి, యును సరసము సేసియును గేలి సేసి, యును."

పండితా. ద్వితీ. మహి. పుట. 111.

**కేకలు వేయు**

కోపించు.

"చేకొని యొనరుతు మనుచున్, గేకలు వేసెడిని సమరకేళీరతి యై."

దేవీ. 12.138.

**కేకసలాడు**

నవ్వుతూ చప్పట్లు కొట్టు.

చూ. కేకిసలు కొట్టు.

**కేకిసలు కొట్టు**

కేరింతలు కొట్టు.

ధ్వన్యనుకరణము.

"నాట గెలిచి పోనీక పట్టుచుఁ గేకిసలు గొట్టుచు నొకరొకరిఁ జీరుచు..."

కళా. 6.225.

"చేకొని హరిఁ జూచెఁ గేకిసలు గొట్టుచు బోటులు దాని నవ్వఁగన్."

పారి. 3.16.

చూ. కేకసలాడు.

**కేడీలాడు**

చాడీలు చెప్పు.

రమా. 13.

**కేరడము లాడు**

వక్రోక్తు లాడు; హాస్యమాడు.

"కేరడము లాడుసతి మధ్య ధీర."

నరస. 2.29.

"కేరడము లాడుచుండిరేనిఁ, గవియు పాండవబాణాగ్నిఁ గాదు సువ్వె,తమ్ము తమ లోభ మనుచిచ్చు దరికొనంగఁ, దెగినవా రయి పోదు రింతియ తలంప."

భార. ఉద్యో. 1.353.

**కేరియలు వాఱు**

కెక్కర్లు కొట్టు.

"జీజీక కల్లు ద్రావి మదసింధురగా మిను లన్ని కేఱియల్, వారుచు గాడు గీతములు వాడుచు. కుమా. 6.45.

**కేల కపోలము లూదు**

చెక్కిట చేయి చేర్చు.

చింతాసూచకమైన అంగ విక్రియ.

"ఎన్నిభవంబులన్ గలుగు నిత్యశరా సనసాయకవ్యథా, ఖిన్నత వాడివత్తలయి కేలఁ గపోలము లూఁది."

మను. 2.57.

**కేల నోరు మూసికొను**

ఏదైనా అలా చేయతగదు సుమా అని చెప్పునప్పుడు ఆడ వాళ్ళు నోరు మూసుకొను టపై వచ్చిన పలుకుబడి.

"అనుచు నొయ్యఁ బలుకుచును జూపెఁ బ్రియు నొక్క, ముగుద కేల నోరు మూసికొనుచు." కళా. 7.146.

కే లుట్టిపడు

చేతు లదరు.

ఒకపని చేయుటక్కై తహతహ పడుటను సూచించు అంగ విక్రియ.

"...రాజసుతుఁడు చరమాంబునిధిన్, మునుఁగ రవి నెఱయు చీఁకటి, గనుఁ గొని కే లుట్టిపడఁగఁ గట్టాయిత మై."

శుక. 2.219.

కేలుదండ

చేదండ, చేయూఁత.

దశా. 7.28.

కేలు మోడ్చు

నమస్కరించు.

కేలు మోడ్పు

నమస్కారము.

కేలు విడుచు

చేయి ఊపి ఆరంభించు డని సూచించు.

"పోర నొండొకంటిఁ బొడుచుట కవనీశ, విబుధరిపులు కేలు విడుచుట యును."

కవిక. 2.151.

కేలు సాచు

చేయి సాచు; అర్థించు.

"శ్రీకాంత దా నయ్యుఁ బ్రియు నిరోధింపదు, క్రిం దై విరోధికిఁ గేలు సాపదు."

వసు. 1.65.

కేలొసగు

నమస్కరించు.

"వ్యాఘ్రపురస్థలియందు మహాబాహు స్వామికిఁ గేలొసఁగ దహితముగ."

హంస. 4.213.

కేల్కేల దట్టించు

చేయి పట్టుకొను; చప్పట్లు కొట్టు.

"కేవల్ కన్పడఁజేయు నెచ్చెలియతోఁ గేల్కేల దట్టించి వా, చా వైచిత్రిని ముచ్చటాడునకే..."

హంస. 1.32.

కేలోడ్చు

చూ. కేలు మోడ్చు.

కేశాకేశి

జుట్లు జుట్లు పట్టుకొని.

"కేశాకేశిఁ బెనంగుచు."

కుమా. 12.168.

కేళిక సేయు

పొగడు, స్తుతించు; ఒకానొక కవిత్వము సేయు.

బొమ్మలాటలలో నేటికీ కేళిక చేస్తారు. ఎవరో బహుమతి ఇస్తే ఆ మాట చెప్పి వారిని పొగుడుతారు.

ఇట్లే— కేళిక యొనర్చు, కేళిక సలుపు మొ.

"...సెంబళి కోల, నలి దూసికొని కేళికలు సేయువారు."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 160.

"వటులుచు బాలుని వామపాదంబు, గిఱగిట గాఁబట్టి కేళికల్ సేయు."

పండితా. ప్రథ. పురా. పుట. 481.

"జక్కణిరవండి మేళములఁ గేళిక సల్పిరి."

రామా.

"కేళికఁ జోకయు లీల నటింప."

బస. 7.154.

**కైంకర్యము చేయు**

కాజేయు; సేవ చేయు.

సేవ చేయు అసలు అర్థం అయినా వ్యంగ్యంగా కాజేయు అనే అర్థంలోనే ఉపయోగిస్తారు. వైష్ణవులలో మాత్రం మంచి అర్థంలోనే ఇది అలవాటులో ఉంది.

"వాడు ఇంట్లో ఉన్నట్టే ఉండి, పెట్టెలో నాలుగు రూపాయలూ కైంకర్యం చేశాడు." వా.

**కైకానుక చేయు**

కానుక లిచ్చు.

"జవాదిపిల్లులు మొదల్గాఁ గానలో వాని గుంపులుఁ గైకానుక చేసి..." యయా. 1.104.

చూ. కైకాన్క సేయు.

**కైకాన్క సేయు**

బహుమతి యిచ్చు.

"గుండ్ల పేరును కైకాన్క కోరి సేతు." హంస. 2.37.

చూ. కైకానుక చేయు.

**కైకూలి వడు**

దినకూలి చేసుకొని బ్రతుకు; కూలి నాలి చేసుకొను.

"కొడవలి గడియించుకొనుచుఁ గై కూలి, వడి రాజనములకు నోడఁబాటు చేసి." బస. 4.117.

**కైకొను**

1. గ్రహించు.

"జగత్త్రియంబు గావం బ్రోవం, గైకొన్న నీవు." ఉత్త. హరి. 4.96.

2. లక్ష్యపెట్టు.

"కైకోఁ డతండు సురల." హర. 3.8.

3. పెండ్లి చేసుకొను.

"జయలక్ష్మీసతితో నసంగవతి నిచ్చం గైకొనం గోరి..." విక్ర. 4.54.

4. పట్టు. అనుసరించు.

"చరమాశాంతరవీథి గైకొని." విక్ర. 2.115.

ఇలాంటి ఇతర ఛాయల లోనూ ప్రయుక్తం. అవన్నీ వీనిలోనే చేరనూ చేరును.

**కైకొలుపు**

ఒప్పించు; ధైర్యము గొల్పు.

**కైకొల్పు**

పురికొల్పు.

భాగ. 10. ఉ. 300.

**కైకోలు**

ప్రతిజ్ఞ; సమ్మతి; అనుమతి.

"నా కైకోలిది రెండాడఁగ నా, నాలుక మీకులము వారి నాలుక లటులే?" సింహా. 5.198.

**కైచాపు**

నమస్కరించు.

**కైచేఱ యిచ్చు**

తనంత పట్టుబడు, వశమగు.

"ఏచిన తన నిడువాలు వి,లోచనముల చెలువమునకు లొంగి జలజముల్, కైచేఱ యిచ్చె ననంగే, లీచాలితనలిన మా కలికి ధరియించున్." వరాహ. 11.50.

**కైజా చేయు**

గుఱ్ఱం కళ్ళెం బిగించు.

"విభుండు హయము డిగి మసా, గై
కైజా చేసి మహా, నోకమాతలమున
నిలిచి."

చంద్రా. 2.111.

**కైజీతగాడు**

జీతాని కున్న సైనికుడు.

భార. ఆశ్ర. 1.73.

**కైజీతములవారు**

కైజీతగాండ్రు.

కవ. 2.143.

చూ. కైజీతగాడు.

**కైతప్పుగా పడు**

చేయి జాఱి పడిపోవు ; తప్పి
పోవు.

"కంగు కంగునఁ నేలఁ గైతప్పుగాఁ
బడు, వేఁటమ్ము లేఱక దాఁటి దాఁటి."

మను. 4.103.

"దేవ నిన్న కై తప్పునఁ జేరె నీ
హయము."

జైమి. 5.168.

**కైదండ యొసగు**

చేయూత నిచ్చు.

"అవిక కట్టడపు దోరపు నిగ్గుజంటీలు,
తనులతాద్యుతికిఁ గైదండ యొసఁగ."

శుక. 1.289.

"ఆదరమున శతమన్యుఁడు, కైదండ
యొసంగ."

పారి. 3.23.

**కైదువు పెట్టినవాడు**

ఆయుధమును వదలినవాడు.

"జోడు వుచ్చినవానిని గైదువుఁ బెట్టిన
వానిని."

భార. భీష్మ. 3.303.

**కైపదము**

సమస్య.

"కైపద మిచ్చువారలును గ్రక్కునఁ
బద్యము చెప్పువారలున్."

భోజ. 2.50.

**కై పెక్కు**

పొగ రెక్కు ; మత్తెక్కి
పోలు.

**కైపు మిగులు**

కై పెక్కు.

**కైమోడుపు**

నమస్కారము.

**కైలా గిచ్చు**

చేయూత నిచ్చు.

"తన పాణిపల్లవము కైలా గిచ్చి."

విప్ర. 4.86.

"పరి, జనములు కైలా గొసంగ స్నానో
న్ముఖుఁ డై."

విజయ. 1.55.

**కైలా గొసగు**

చేయూత నిచ్చు.

"చిగురాకు వంటి కెంగేలు, గారము
మీఱంగఁ గైలా గొసంగి."

వర. రా. అయో. పు. 286. పంక్తి. 15.

**కైవశముగా నుంచు**

అధీనములో నుంచు.

"రఘుపతి తనచేతి విల్లు, వరుణుని
యందుఁ గైవశముగా నుంచి."

వర. రా. బా. పు. 237. పంక్తి. 10.

**కైవస మగు**

లోబడు, వశ మగు.

"దానవైఖరిన్, హేమనగేంద్ర మొ

క్కనిక యిత్తురు కైవస మై చెలంగి
నన్." విప్ర. 2.10.

### కైవ్రాల బండు

వాలిపోవునట్లు నిండుగా పండు.

"కైవ్రాలఁ బండె కలమవనంబుల్." కుమా. 6.119.

### కైవ్రాలు

వాలిపోవు; పడు.

వాలడం మీాది పొద్దు వాలినట్లుగా అన్న అర్థంలో వయసును పోల్చుట అలవాటు కూడా ఉన్నది. 'నేను పెద్ద వాణ్ణయి పోయాను. సాయంత్రం కావచ్చింది.'

"ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాల కుండ." కాశీ. 1.7.

### కైసేయు

అలంకరించు, అర్చించు.

"ఆ సమయమునఁ గుమారిం గైసేసి..." విక్ర. 4.192.

"ఏ, మును పూజించితిఁ బిమ్మటన్ హరియు నంభోజాతగర్భుండునున్, గని కైసేసిరి." భీమ. 4.203.

### కొంకనక్క

ఒకరకమైన నక్క.

"చీమలు గాకులుం గ్రిములు జింకలు నక్కలుఁ గొంకనక్కలున్." భార. అశ్వ. 2.117.

### కొంకరలు పోవు

చలితో సొట్టలు పోవు.

"కొంకరలు పోయిన నీ మెయి చక్క నొక్క." రామా. 7.258.

"అబ్బ! ఈ చలితో వేళ్ళు కొంకరలు పోతున్నవి." వా.

### కొంకి కొంకక

జంకు కొంకులు లేక.

"వల చంగునను దాఁటివడి నేఁగు నొక లేటిఁ, గొంకి కొంకక ద్రొక్కి కూల్చె నొకఁడు." శుక. 1.263.

చూ. కొంకికొను.

### కొంకికొను

సంకోచించు.

"అనుమానముతో నొక కొంత కొంకి కొంచు." హంస. 1.89.

### కొంకి తెంచి ముడి గొంతే కుఱుచ

చెడిపోయి, సరి చేసికొంటూ కూర్చుంటె ఉన్నది తక్కువై పోతుంది అనుట.

దారాన్ని తెంచి తెంచి ముడి వేసిన ట్లిల్ల కురుచై పోతుంది కదా!

తాళ్ల. సం. 8.175.

### కొంకు కొసరు

సంకోచము. జం.

"త్రాడలపై నిద్ర వోయెడు దుష్ట మృగము, గొంకు కొసరు లే కిటు లేలఁ గూలఁ ద్రోవు." విక్ర. 3.97.

"కొంకు కొస రించుకయు లేక కూలఁ దాచె." విరా. 2.128.

### కొంకుపడు

సంకోచించు. బ్రౌన్.

కొంకుపాటు

సంకోచము.

కొంకు పెట్టు

సంకోచించు.

"కొంకు పెట్టక పెనుగద బెట్టు వ్రేయ." భార. సౌప్తి. 1.169.

కొంకు వోవు

కొంకరలు వోవు.

"ఆపదం, బారయక యుండఁ జేయుము ప్రభూతపు సీతునఁ గొంకు వోయె దుస్." భార. శాం. 3.313.

కొంగకాళ్లు

పొడుగాటికాళ్ళున్న మను ష్యులను వెక్కిరింపుగా అనే మాట.

"ఆ కొంగకాళ్లకు పిల్ల నెవ్వ రిస్తారు రా?" వా.

కొంగజపం

బకధ్యానం.

పైకి మహాసాధువుగా నటిస్తూ లోన కుట్రలు పన్నువారి యెడ ఉపయోగిస్తారు.

పంచతంత్రంలోని కొంగ - చేపల కథపై యేర్పడిన పలు కుబడి.

"వాడి దంతా కొంగజపం. ఆ యింట్లో కాస్త చనువు చిక్కితే ఆ పిల్ల నెప్పుడో లేపుకొని పోతాడు." వా.

కొంగని బొడిచి వంగని వ్రాలంగ దివియు

గొప్పవానిని తగ్గించి తక్కువ వాని నెక్కువ చేయు అని కావచ్చు నేమో? సరిగా తేల లేదు.

"పొలంగఁ గొంగనిఁ బొడిచి వంగనిని, వ్రాలంగ దిగిచితి రేల బింకంబు." బస. 7.185.

కొంగమెడ

పొడవైన మెడ.

కాస్త నిరసనగానే అంటారు.

"అఁ! ఏ మందం? ఆ కొంగమెడా అదీ!" వా.

కొంగల మల్లయ్య

పట్టి డాబు మనిషి.

కొంగవాలు

ఒక రకమైన కత్తి.

కొంగవాల్నఅకులు

కత్తితో పడిన గాయములు.

కొంగవా లనగా ఒక రకమైన కత్తి.

"కొంగ వాల్న అకు లంగుళులఁ బట్టుచు జబ్బ, లంటఁ గుట్టిడ వెజ్జు నరయు వారు." ఆము. 7.21.

కొంగు ఈడ్చు

బట్ట పట్టి నిలవేయు.

ఒంటిమిట్ట. 84.

కొంగు జారు

పైట జారు.

తాళ్ల. సం. 6.156.

కొంగుధనము

కొంగుబంగారము వంటిమాట.

"కోరి భజించు వారలకుఁ గొంగు ధనం బయి." పాండు. 2.93.

కొంగున కట్టుకొని తిరుగు

తన వశవర్తినిగా, తన వెంటనే ఉంచుకొను.

ఇది సామాన్యంగా భార్యాభర్తల విషయంలో ప్రయుక్తమవుతుంది.

"ఆ పిల్ల మొగుణ్ణి కొంగున కట్టుకొని తిరుగుతూ ఉంటుంది. వాడు బయటి కేం వస్తాడు?" వా.

కొంగున నగ్ని దాచినట్లు

దాచగూడని దానిని దాచగూడని చోట దాచినట్లు.

ఆత్మవ్యాఘాతక మొనర్చుకొనే పనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"మమ్ము నందఱ నెవ్వని మహితశక్తి, యెక్కుడై సంగరంబునఁ జిక్కు పఱిచె, నట్టి కర్ణునిఁ గొంగున నగ్ని దాఁచి, నట్టు లెమ్మెయి దాఁచితో యమ్మ చెపుమ!" భార. స్త్రీ. 2.178.

కొంగున నున్న చిచ్చు

వినాశకారి.

ఒడిలోని అగ్ని కాల్చి తీరును కదా!

"సురలకు గుండెతల్లడము, సూరుల డెందములోని కొఱ్ఱు, ఖేచరతతి కంటిలో నలుసు, సాధ్యుల కొంగున నున్న చిచ్చు, భూసురులకు నెల్లవాఁడు మెడఁ జుట్టినపాము...." భాస్క. యుద్ధ.

కొంగున ముడిచిన మణి

అందుబాటులో నుండు అపూర్వప్రాప్త వస్తువు; మనోరథ పూరకము.

"[illegible] పడయుటకు మగనికై, [illegible] [illegible], జడిసి ఫలియించు కొంగున ముడిచిన మణి గాదె భక్తముఖ్యుం డెల్లన్." పాండు. 2.48.

చూ. కొంగుబంగారము.

కొంగు పట్టు

దేహీ అను.

"ఎవ రెంత మాట వానిచ్చిరేని కొంగు వట్టితి మునిశ్రేష్ఠులార!" పాండవో. 51.

"నే నెన్ని కష్టాలు వచ్చినా ఒకరిముందు కొంగుపట్టి యెరగను నమ్మా తల్లీ." వా.

కొంగు పట్టుకొని తిరుగు

విధేయుడై ఆజ్ఞానువర్తియై యుండు.

"వా డెప్పుడూ పెళ్లాం కొంగు పట్టుకొని తిరుగుతూ ఉంటాడు." వా.

కొంగు పట్టుకొని నిలుచు

భిక్ష అడుగు; యాచించు.

"ఆవిడ ఒకరిముందు ఎన్నడూ కొంగు పట్టుకొని నిలిచి యెరుగదు. ముసలితనంలో యాచిస్తూ ఉంది." వా.

కొంగు పఱచికొని

కోపమును, దుఃఖమును సూచిస్తూ పైట క్రింద పఱచికొని (పరుండు.)

పడక వేసుకోనకుండా పైట చెఱగునే పఱచుకొనుట సహజంగా కోపాన్ని సూచిస్తుంది.

"గుబ్బకవమీఁది పయ్యెదకొంగు పఱచి, నేలఁ బవళించు మగువ కన్నీరు వారఁగ."
శుక. 3.483.

## కొంగు పఱచు

1. వ్యభిచరించు.

దొంగచాటుగా వ్యభిచరించు వారు సామాన్యంగా ఎక్కడో ఒకచోట మంచాలూ, పరుపులూ లేకుండా కొంగునే పరుచుకొని పడుకొంటూ రను టపై వచ్చిన పలుకుబడి.

"వార లెల్లను బంగారువంటి నిన్నుఁ, బాసి పలుగాకులకుఁ గొంగుపఱచు చెలుల, నంటి..."
శుక. 2.120.

చూ. కాలెత్తు.

2. కొంగు పట్టు.

ఏదైనా భిక్షకు పాత్రకు బదులు కొంగు పట్టుట కూడా అలవాటు. అందుపై వచ్చిన అర్థం.

"కొంగు పఱచిరి నృపతు లాకూటి కొఱకు."
రామలి. 23.

ఈ అర్థంలో ఈ మాట వాడుకలో లేదు. వాడుకలో దీని రూపం కొంగు పట్టు.

చూ. కొంగు పట్టు.

## కొంగుపసిడి

అందుబాటులో ఉన్న అమూల్య వస్తువు; సులభ లభ్యము.

"కోప మొకింత లేదు బుధకోటికిఁ గొంగుఁబసిండి."
విజ. 1.88.

చూ. కొంగుబంగారము.

## కొంగుపైడి

అందుబాటు లోనిది, కొంగు బంగారము.

"కోరి నుతించినవారి కొంగుపైఁడి."
తాళ్ల. సం. 6.173.

"కొలిచినవారల కొంగుపైఁ డితఁడు."
తాళ్ల. సం. 9.130.

## కొంగుపైడి యగు

అందుబాటులోని దగు.

"కోరినవరాలే కొంగుపైఁడి గాదా."
తాళ్ల. సం. 7.233.

## కొంగుబంగార మగు

సులభలభ్య మగు.

అందుబాటులో నుండి ఎప్పుడు పడితే అప్పుడు ఉపయోగించు కొన వీలయిన ధనము వంటి దగు.

కొంగునందు కట్టుకొన్న బంగారము అంతే కదా.

"రామానుజయ్య దాన, ప్రామాణిక ముద్ర కొంగుబంగార మగున్."
పాండు. 1.65.

చూ. కొంగుపసిడి; కొంగుపైడి.

## కొంగుబత్తెము

కూలి గింజలు.

సామాన్యంగా కూలి గింజ లను కూలీలు కొంగులో

పోసుకునే ఇళ్ళకు వెడతారు.

అందుపై వచ్చినది.

"నిలిచిన కుప్ప కావలికిఁ బిల్వఁదు రప్పరిఁ గొంగు బత్తెపుం, గొలువున కీయకొల్పి హాలికుల్ బికిరంబు పోసఁగ వేలుపున్." చంద్రా. 1.25.

## కొంగు మాయు

ముట్టగు.

ప్రా.

చూ. చెఱగు మాయు.

## కొంగుముడి

1. వశవర్తిని అయినది.

"అంగన నాకుఁ గొంగుముడి యై తగు నీ విపు డిచ్చునీవి..." రామా. 4.162.

2. ఇష్టమైనది.

అందుబాటులో నుండునది.

".........శుభప్రసంగ మంగనకు నొసంగఁ గొంగుముడి గాదె భవద్వచనంబు..." వసు. 3.43.

## కొంగుముడి వేసికొను

తప్పక అవుతుంది అన్న నమ్మకంతో ఉండు.

"మది తహతహ విడిచి యిఁకన్, ముదమున సతులార! కొంగుముడి వేసికొనుం, డిదె నేఁటి మాపటికిఁ గూర్చెద వాలాయముగ నేను బ్రియులను మిమ్మున్." ప్రభా. 5.85.

## కొంగుముడులు

పుణ్యతీర్థాలలో స్నానాదులు నిర్వర్తించేటప్పుడు భార్యాభర్తలు కొంగుముళ్లు వేసుకోవడం ఆచారం. అతని పంచకొనకూ, ఆమెడ చీరకొంగుకూ వేసే ముడులు కొంగుముడులు.

ఇ దెప్పుడూ బహువచనం లోనే ఉంటుంది.

"తిరుమల కంచి పుష్పగిరి తీర్థములుం జని కొంగుముళ్లతో, వరములుఁ దంపతుల్ వడయ..." హంస. 2.85.

## కొంగురొక్కము

ధనము; ఈవలసిన డబ్బు.

మామూలుగా పూర్వం డబ్బును కొంగున కట్టుకొనేవారు. అందుపై వచ్చినది.

"కొలఁది పుణ్యపాపాలే కొంగురొక్కములు వెట్టి, వెల దెంచి బేరమాడ వేగిరమె రాకో!" తాళ్ల. సం. 8. 170.

## కొంగొంగు రను

కొంగలు అలా అఱచు.

ధ్వన్యనుకరణము.

"కొంగలు చెలఁగి కొంగొంగు రనఁగ" హర. 5.16.

## కొంగొడ్డు

కొంగు పఱచు; సంభోగ సుఖ మిచ్చు.

ఇది కాలెత్తు అన్నట్లు నీచమునకు లోబడు అనే అర్థంలోనే ఉపయుక్త మవుతుంది.

"ఆఁడుపుట్టువు లోకంబునందుఁ గష్టమ్ముండుఁ గాసువీసములకై యబ్బినట్టి, పురుషులకు నెల్లఁ గొంగొడ్డి పొట్ట పోసి, కొనెడి వెలయాలి బ్రదు కిట్టి దనఁగ నేల?" పరమ. 3.207.

చూ. కొంగుపఱచు.

**కొంగోడు వడు**

ఒఱిగిపోవు. ఒడ్డిగిల్లు.

"కులపర్వతంబులు కొంగోడు వడియె"
మైరా. 2.33.

**కొంగోడు వోవు**

ఒక మంచంకోడు వదలినదగు; ఒఱిగి పోవు.

"కుక్కి వడిన మిగులఁ గొంగోడు వోయిన...నుల్కి మంచ మొప్పదంద్రము"
వి. పు. 3.215.

**కొంచపడు**

అల్పత చెందు; న్యూనపడు.

"కొంచపడితి నొక కొన్నాళ్లు, ఇంచుకంచు కిపు డెఱిఁగితినే."
తాళ్ల. సం. 11.2. భా. 17.
చూ. కొంచెపడు.

**కొంచపఱుచు**

కించపఱచు.

"తనుఁ గొంచ పఱతురె తరుణుల లోన."
వర. రా. కిష్కి. పు. 357. పం. 17.
చూ. కొంచెపఱచు.

**కొంచపాఱు**

సంశయించు.

బ్రౌన్.

**కొంచియము చేయు**

కించపఱచు, న్యూనతపఱచు; తక్కువ పఱచు.

"శ్యామోదయము కొంచియము చేయ నేతెంచి, శ్యామోదయము హెచ్చఁగఁ దనర్చె."
చంద్రి. 4.45.

**కొంచుబోవు**

తీసికొని పోవు.

"కూర్మినందన నింటికిఁ గొంచు బోయె."
హర. 3.83.

వైదికులలో – ముఖ్యంగా పెద్దవారిలో ఈ రూపం నేటికీ అలవాటులో ఉంది.

అయితే ఈ 'చు' 'చ' గా మారడం కద్దు.

"వారసీ, మంతిని కీయనో వెలకు నూర్చనో యేటికిఁ గొంచుఁ బోయె ద, త్యంతరయాన..."
హంస. 5.233.

"ఈ అర్ఘ్యపాత్ర కొంచబోరా." వా.

**కొంచెకత్తె**

సామాన్యురాలు.

"ఉవిద నీ వెంత కొంచెకత్తెవె జయంతు, గాపుఁ జేసినగరితవు కావె నీవు."
కువల. 4.173.

ఇదే అర్థంలో నేడు 'నీ వేం తక్కువ దానివా ?—'నీ వేం సామాన్యురాలివా' అంటారు. శ. ర. చెప్పిన 'సామాన్యురాలు' సరికాదని వావిళ్ల ని. అమాయకురాలనుట సరి కాదు.

**కొంచెకాడు**

సామాన్యుడు.

"కొంచెకాఁడవె, యన్నన్న నఖాగ్రనిర్జితారివి గాదె."
శుక. 3.285.

వాడుకలో రూపం :

"నీ వేం సామాన్యుడవా ? దేశాలు జయించినవాడివి."
వా.

"వా డేం తక్కువవాడా? దేశం తిరిగిన వాడు." వా.

చూ. కొంచెకత్తె.

## కొంచెపడు

1. కిందపడు, న్యూనపడు.

"ఒరు నొద్ద కేగి హైన్యము, పరికింపఁగ వేడి కొంచెపడియెడుకన్నన్, మరణం బుత్కృష్టము..." శివధ. 5.94.

2. అసంపూర్ణ మగు.

"తరుణి నీచేత మదనతంత్రంబు లెఱుఁగఁ, గోరి యున్నాఁడునాయాస కొంచె పడక, యుండ సురతసుఖాంబుధి నోల లార్చి, యింపు సొంపార నన్ను మన్నింప వలయు." వి. పు. 2.217.

3. తక్కువ వగు.

"తండ్రీ నీ ప్రాసాదంబున నన్నియు సమకూరెడుం గాక కొంచెపడి యెడునే." భోజ. 6.191.

## కొంచెపఱుచు

న్యూనపఱచు.

"వాసి గను మమ్మ కులశీలవర్తనములు, కొంచెపఱుపక..."

వరాహ. 2.124.

## కొంచెపు కవులు

కుకవులు. అల్పు లనుట.

"వంచకు లగు కొంచెపుంగవుల రవళి యదలించి." పాండు. 1.16.

## కొంచెపునరుడు

అల్పుడు.

సుమతి. 40.

## కొంచెపువాడు

అల్పుడు.

"పరిమార్తుఁ గొంచెపువాఁడ నై యున్నె డన..." భార. ఉద్యో. 1.14.

## కొంచె మగు

తక్కువ వగు.

"దిక్కీమాగోళము నంతకంత కును గొంచెం బయ్యె లేఁజీఁకటిన్." జైమి. 5.155.

## కొంచెమా

సామాన్యమా.

"అమ్మానినిగో పొందు కొంచెమా." శుక. 4.16.

## కొంచెమా నంచెమా ?

అదేం తక్కువా ? జం.

"పాతే పోయిందను కోడాని కదేం కొంచెమా నంచెమా? పదివేల రూపా యలే!" వా.

చూ. కొంచెం నంచెమా?

## కొంచెము గొప్ప

ఏ కొంచెమో.

"కొంచెము గొప్ప సంతసము గొల్పిన." పాణి. 1.15.

చూ. కొంచెమో గొప్పో.

## కొంచెమో గొప్పో

ఏ కొంచెమో.

"కొంచెమో గొప్పో ఒకరికి సాయపడితే వారూ మనకు సాయం చేస్తారు." వా.

చూ. కొంచెము గొప్ప.

## కొంటెకోణంగి

కొంటెవాడు.

"వాడు ఒట్టి కొంటెకోణంగి." వా.

చూ. కొంటెకోణాలు.

## కొంటెకోణాలు

చూ. కొంటెకోణంగి.

## కొంటెపాడి కట్ట

ఘోరత్తము, దుష్టుడు. బ్రౌన్.

కొంటెభాగోతులు

కొంటెకోణంగులు.

కన్యా. 22.

కొండ!

అదే గొప్ప, ఘనకార్యం.

"రండల కొడుకులు యాచక, తండం
బుల కేమి త్రవ్వి తల కెత్తేరా, రెం
డాకు లొక్క పోకయుఁ, గొండ
సుమీ దానశర్వ కోమటి గుర్వా!"

—చాటువు.

"కొండ ధరించుట నా కొక కొండా?"

హరి. పూ. 7.179.

కొండంత....

ఎక్కువైన; గొప్ప అయిన.

"కొడుకు పుట్టెడు నని కొండంత
యాసతో, నుండంగఁ దుదిఁ గూఁతు
రుద్భవించె." భోజ. 3.140.

కొండంత కనకము పోకకు వెలా

అసంభవ మనుట. పోక కంత వెలా?

తాళ్ల. సం. 9.285.

కొండంతటి దేవర

గొప్ప దైవము.

సారం. 1.16.

కొండంత దేవరకు కొండంత పత్రి పెట్టగలమా?

గొప్పవారిని అంత గొప్పగానూ గౌరవించలే మను పట్ల ఉపయోగించే పలుకుబడి.

"కొండికలము మన కెంతటి, దండి
గలుగు నధికవస్తుతతి హరి కొసఁగన్,
గొండంత దేవునకు మఱి, కొండం
తయుఁ బత్రి యిడెదు కళలు
గలరే?" కుచే. 1.110.

కొండంత పని

పెద్దపని.

"అకట! మోసంబు లేదు కొండంత
పనికి, నైన బతిమాలి నీవు పొమ్మన్న
నెడలి." శుక. 2.376.

కొండంత అన్నది గొప్ప అనే అర్థంలో చాలా రూపాలలో కానవస్తుంది.

సా. "కొండంత దేవుడికి కొండంత
పత్రి పెట్టగలమా? సా.

"కొండంత రెడ్డి వచ్చి కొంగు పట్టు
కొంటే ఊ అనగుడీనా (గూడునా?)
ఆ అనగుడీనా? (గూడునా?)" సా.

కొండకోతి

1. కొంటె కోణంగి.

"దానితో నేం లే. అది వట్టి కొండ
కోతి. అలాగే వెక్కిరిస్తుంది." వా.

2. ఒక పిల్లల ఆట.

"దాఁగిలిమూఁతలు...గురిగింజ కొండ
కోఁతి"' హంస. 3.146.

* * *

ఇలా కొండతో చేరి అక్కడి—కొండలోని—అనే అర్థంలో చాలా పదా లున్నవి. కొండకంది, కొండకాకి, కొండగుమ్ముడు, కొండగొఱ్ఱె... ఇత్యాదులు. ప్రత్యేకించి విశేషార్థ మున్నవే ఇట ఉట్టంకి

తాలు. మిగతవి ఊహ్యా
ములు.

* * *

కొండగా గను

గొప్పగా భావించు.

"అణుమాత్ర మైన యొక కానుక
దెచ్చినఁ గొండగాఁ గనుక."
విజయ. 1.33.

"ఆ కొడుకునే కొండగా చూసు
కుంటూ బతుకుతున్న దా తల్లి." వా.

కొండగా తలచు

గొప్పగా భావించు.

"తా నెఱింగియు నీ జాతి గాని దాని,
మాట లెల్లను గొండగా మదిఁ
దలంచి." విప్ర. 4.77.

కొండ చేయు

గొప్ప చేయు.

"గట్టి చన్నవ చేత ముట్టి చూచెద మన్నఁ
జెలి యది యొక కొండఁ జేసుకొనెదు."
సారంగ. 2.224.

"ఈ కొండమణి కాంచనాకారరుచిఁ
గాంచెఁ, గొండ లెల్లను దనుఁ గొండ
చేయ." విక్ర. 2.15.

కొండ దాకు

అధిక మగు.

"నిండువేడుక మిన్నంది కొండ
దాఁకె." విజయ. 2.20.

కొండదాసరి

దాసరులలో ఒకభేదం.
తర్వాత దాసరికంటె తక్కు
వైన నీచభిక్షుకుడుగా మారి
నది.

చూ. కొండదాసరితనము.

కొండదాసరితనము

నీచభిక్షావృత్తి.

"తనదు చెల్లెలి దొడ్డభూధవున కిచ్చి,
యతనివలనను సిరి గాంచు నంతకంటె,
సార మై తోఁచుఁ గొండదాసరిత
నంబు." రామలిం. 78.

వివరం. చూ. కొండదాసరి.

కొండనాలుక

చిఱునాలుక కిఱునాలుక.

"ఎచ్చోట ముచ్చిచ్చునే దేని
నాల్కలు, కొండనాల్కల దాఁకఁ
గోఁతవడియె." భీమ. 3.37.

కొండను తగరు ఢీకొన్నట్లు

అల్పుడు అధికునిపై విజృం
భించేపట్ల ఉపయోగించే
పలుకుబడి.

పొట్టేలు కొండను ఢీకొన్న
ట్లనుట.

"గాండీవధన్వు నాహవ, పాండిత్యము
దలఁప నతని ఖండనము నమా,
ర్కొండు నని యొకఁడు గడఁగుట,
కొండం గని తగరుఁ దాఁకఁ గోరుట
గాదే." భార. ఉద్యో. 1.237.

కొండను తవ్వి యెలుకను పట్టు

ఎంతో పని చేసి స్వల్ప
లాభము పొందు.

"ఎంత దవ్వులనుండియో యేఁగుదెంచి,
కడెదు మెతుకులకె యింత కష్టపడెను,
కటకటా! యమ్మహీసురాగ్రణి
విధంబు, కొండ ద్రవ్వియు నెలుకను
గొనుట యయ్యె." కుచే. 2.112.

కొండ పట్టు

దేశాంతరగతుఁ డగు.

"గద్దియ డిగ్గి కాశికుఁడు గాఁగల సూనుఁడు కొండ పట్టినన్."
కాశీ. 6.21.

చూ. కొండలు పట్టు.

కొండ పిండి గావించు

కొండలను పిండి కొట్టు; అసాధ్య కార్యాలు నిర్వర్తించు.

"పిండి గావింతుమో వెండికొండ."
కా. మా. 2.21.

ఎట్టి దుష్కరకార్య మైనను చేయుటకు మేము సిద్ధ మను టను సూచించును.

ఇది కొన్ని భిన్నరూపాలలో కనబడుతుంది.

"కొండ లన్ని పిండి గొట్ట వచ్చు."
వేమన.

కొండపిండి కూరు

ఒకానొక చెట్టుప్రాత దూదికి బదులు పరుపుల్లో దిండ్లలో పెడతారు. ఆ పని చేయు.

"బూరుగుదూది కాదు కొండపిండి దిండ్లలో కూరారు." వా.

కొండపోడవు

అత్యధికముగా; రాసులుగా.

"కొండపోడవు దెచ్చి వైచిరి."
విజయ. 2.90.

కొండమంగలి క్షౌరం

సగం సగం చేసిన పని; ఎగుడు దిగుడుగా చేసినపని.

తిరుపతికొండ – తిరుమల పై వెంట్రుక లిచ్చేవా రెక్కువ. అక్కడి మంగళ్ళు క్షేరం పోకుండా ఒకొకరికి కొంచెం కొంచెం క్షౌరం చేసి కూర్చుండ పెడతా రని ఒక ప్రతీతి. ఆ జనం ఎక్కువ గనుక ఎగుడు దిగుడుగా నాలుగు బొచ్చులు బరికి వదిలి పెడతా రన్నది మరొకటి. ఇలాంటి వానిపై ఏర్పడిన పలుకుబడి.

కొండమనిషి

అనాగరకుడు.

"[illegible] నేం కొండమనిషిలా ఆడాళ్ళు కనబడితే అలా నోరు తెరుచుకొని చూస్తా వేం?" వా.

కొండమల్లయ్య

శ్రీశైలమల్లికార్జునుడు.

"కొండమల్లయ్యచే నుండు నందురు గాని, జంకను గాన మే వంక నైన."
యయా. 1.105.

కొండమీద కోతి దిగి వచ్చు

ఎలాంటి దైనా అందుబాటు లోనికి వచ్చు.

"చేతిలో డబ్బు ఉంటే కొండమీద కోతి దిగి వస్తుంది." వా.

కొండముచ్చు

కొండముచ్చువలె మూతి ముడుచుకొని ఏమీ అన కుండా ఉండేవారి నంటారు.

"ఆపిల్ల కొండముచ్చులా కూచుంటుంది." వా.

**కొండముసవ**

మూతి ముసుచుకొని ఏమీ తెలియనట్లు నటించే మనిషి.
"అదా అమ్మా కొండముసవ. లోపల కావలసినన్ని బుద్ధు లున్నాయి గానీ." వా.

**కొండ యెంత వజ్ర మెంత?**

చురుకైనది చిన్నదైనా చాలును అనుట.
కొండ పెద్దదైనా వజ్రం చిన్నదైనా భేదిస్తుంది.
నారాయణదాసు భీష్మచరిత్ర.

**కొండ యెక్కు**

1. గొప్పకు పోవు; విఱ్ఱవీగు.
"కొండ యెక్కాదు బతిమాలుకొనిన కొలంది" సిం. నార. 17.
"వానిదగ్గరికి పదే పదే వెళ్ళి అడిగామంటే కొండెక్కుతాడు." వా.
రూ. కొండెక్కు.

2. దీపం ఆరిపోవు.
"దీపం కొండ యెక్కుతూందిరా. కాస్త ఎగదొయ్యి." వా.

**కొండల కేగు**

అడవుల బట్టు; అనాథ మగు.
"కొండల కేఁగెను సత్యము." తాళ్ల. సం. 5.63.
చూ. అడవుల బట్టు.

**కొండల నునుపులు**

పైపై మెఱుగులు.
తాళ్ల. సం. 5.24.

**కొండలు కోటలు చేసి చెప్పు**

గోరంతలు కొండంతలు చేసి చెప్పు. తక్కువ వానిని ఎక్కువ చేసి చెప్పు.
"......నీ యుపకారకృత్యముల్, గుఱిగడవం బ్రియంబుతమిఁ గొండలు కోటలు చేసి చెప్పితిన్."
పంచ. (వేం) 4.147.

**కొండలు దొంతి పేర్చు నేర్చు**

కొండలను ఒకటిపై ఒకటి పేర్చ నేర్చు.
అసాధ్యకార్యములను చేయగల నేర్పరు లని నిరసనగా అనుటలో ఏర్పడిన పలుకుబడి.
పండితా. ప్రథ. పురా. పుట. 359.

**కొండలు పట్టు**

దిక్కు కొకరై చెదరిపోవు. దేశాలపా లయి పోవు.
"ఆ అధ్యుడు కాస్తా పోయేసరికి సావత్ కుటుంబమూ కొండలు పట్టిపోయింది." వా.
చూ. కొండపట్టు.

**కొండలు పెరుగు**

ఎక్కు వగు; కొండలుగా పెరుగు.
"కోరేటి కోర్కెలు కొండలు పెరుగు." తాళ్ల. సం. 8.50.

**కొండ లేర్లు పండు**

ఎక్కువగా పండు.
కొండలూ, ఏర్లూ పంటకు అనువు గానివి కనుక అవి కూడా పండుట సహజంగా సర్వసిద్ధిసూచకం కదా!

"కోరిన సస్యముల్ కొండలేర్లను బండు." రుక్మాం. 1.136.

ముద్రిత పాఠమున 'కొండ వేలును బండు' అని యున్నది. అది సరియయిన దనిపించదు.

**కొండవీటి చేంతాడు**

సుదీర్ఘ మని యెత్తి పొడు పుగా అనుమాట.

"ఈ ఉపన్యాసం కొండవీటి చేంతాడులా ఉంది. తొమ్మిదైనా ముగిసేట్లు లేదు." వా.

నీళ్లు దొరకని ఊళ్ళలో బావులు లోతుగా ఉండడం. సహజంగా అక్కడి చేంతాళ్లు పొడవుగా ఉండడం పురస్కరించుకొని కొండవీటికి బదులు అక్కడక్కడి వారు ఆ యా ఊళ్లను చేర్చి ఈ చేంతాడు నుపయోగించడం కూడా ఆ యా ప్రాంతాలలో కాన వస్తుంది.

రామలింగాయపల్లె చేంతాడు; కొల్లేటి చేంతాడు.

**కొండవేలును పండు**

సమృద్ధిగా పండు.

"కోరిన సస్యముల్ కొండవేలును బండు, నెల్లకాలము ఫలియించుచుఁ దరులు." రుక్మాం. 1.14.

ఈ పాఠం సరికా దనిపిస్తుంది. అర్థం ఎలా వచ్చిందో కుదరదు. వివరానికి...

చూ. కొండ లేర్లు పండు.

**కొండాటముగా**

ప్రోత్సాహకముగా.

"గండారక మదసార ఘంటు నకు బింకం బెక్కఁ బ్రోధాగ్నికిన్, గొండాటంబుగ దానసంపదకు నా ఘోషంబుగా..." కుమా. 1.86.

కొండాట, కొండాటము= స్తుతి, వ్యాసంగము, కలహము, కలహశీలము అను అర్థములలో కోశములు ప్రయోగము లిచ్చినవి. ఇక్కడ ఇది విభిన్నార్థద్యోతకమై పైన యిచ్చిన తీరున ఉన్నది.

**కొండాటము సేయు**

పొగడు.

"కుచ్చితకాం డ్రన్నఁ గొండాటములు సేయు." మల్హ. 3.4.

**కొండాడు**

గొప్పగా స్తుతించు.

'కొండ అని ఆడు' అనురీతిగా ఏర్పడి ఉండవచ్చును.

"చేడియ యీ నృపాలకులశేఖరు ... కొండాడఁగ వేయినోళ్లు వలె..." రాజ. చ. 3.132.

**కొండికవాడు**

చిన్నవాడు, బాలుడు.

"ఇప్పు డీ, కొండికవాని నమ్మి పగ గోలిది కార్యమె?" కుమా. 10.162.

**కొండుకవాడు**

చిన్నవాడు.

"వానికిం గొండుకవాని విచిత్రవీర్యు రాజ్యాభిషిక్తుం జేసి..."
భార. ఆది. 4.113.

"పరశురాముడు ... దండితాహితుండు గొండుక యయ్యును, దద్ద గుణము లందుఁ బెద్ద యయ్యె."
భాగ. ఆది. 3.70.

**కొండెకత్తె**

కొండెములు చెప్పునది.

**కొండెకాడు**

కొండెములు చెప్పేవాడు.

**కొండెకు నీ రెక్కు**

పొగ రెక్కు.

"వీడి కీ ఊరు నీళ్లు తాగేటప్పటికి కొండెకు నీ రెక్కింది. వీ డింక మన మాట వింటాడా?" వా.

**కొండెక్కి కూర్చుండు**

కలిసి రాక ఉండు.

గర్వించి పైన కూర్చొను.

"ఏదో నలుగురం కలిసి ఈ వ్యవహారం పరిష్కరించి వేద్దా మనుకుంటే వాడు కొండెక్కి కూర్చుంటున్నాడు." వా.

"పిల్ల నిస్తా మని మనం వెళ్లే కొద్దీ వాళ్లు కొండెక్కి కూర్చుంటున్నారు." వా.

చూ. కొమ్మెక్కి కూర్చుండు; కొండ యెక్కు; కొండెక్కు.

**కొండెక్కు**

తా నేదో మరీ గొప్పవాని వలె పై కెక్కి కూర్చొను.

"కొండ యెక్కెదు బ్రతిమాలుకొనిన కొలఁది." సింహాద్రి. శత. 17.

"వాని వెనకబడేకొద్దీ వాడు కొండెక్కుతున్నాడు." వా.

చూ. కొండ యెక్కు.

**కొండెము లల్లు**

చాడీలు చెప్పు.

"వాడిమీదా వీడిమీదా కొండేలు అల్లుతూ ఉండడమే వీడిపని." వా.

**కొండెములు చెప్పు**

చాడీలు చెప్పు.

"కొండెముల్ చెప్పక యుండ విరాట భూవరుని వాకిటి చనవరుల కిచ్చి."
శుక. 4.111.

**కొండొక**

ఒకానొక; చిన్నని... కాస్త...

కొండొకడు, కొండొక ప్రొద్దు, కొండొక తొలంగి... ఇత్యాదుల్లో విభిన్నచ్ఛాయలలో ఈ మాట కలిసి వినిపిస్తుంది. ఆ యా సందర్భాల బట్టి ఊహించుకొనవలెను.

**కొండొక నవ్వు**

చిఱునవ్వు అని నిఘంటువులు. ఒకనొక విలక్షణమైన నవ్వు కావచ్చును.

"అనినఁ గొండొక నవ్వొలయంగఁ జూచి."
భార. విరా. 5.114.

**కొండొక ప్రొద్దు**

కాసేపు; కొంత సేపు.
బసు. 5.127.

**కొండొకవాడు**

చిన్నవాడు.

"వీఁడు కొండొకవాఁడుఁ విపినభూము
లకుఁ, గనికరింపక పంపఁగా నెట్లు
వచ్చు శి?"
గౌర. హరి. ఉ. భా. పం.
1861-862 పం.

## కొండ్ర చేయు

వ్యవసాయము చేయు.
బ్రౌన్.

## కొండ్రపోతు

ఎలుగుబంటి.
బ్రౌన్.

## కొంతముకాడు

బల్లెం ధరించిన యుద్ధంలోని
సైనికుడు.
కమా. 11.40.
చూ. సవడికాడు.

## కొందలపడు

కలత చెందు.
"మనంబు గొందలపడఁగా."
భార. ద్రో. 2.292.

## కొందలపఱచు

కలత చెందించు.
"ఇట్లను వగలు మిగిలి కొందలపఱు
పన్."
భార. విరా. 1.97.

## కొందలపాటు

కలత.

## కొందల పెట్టు

కలత పెట్టు.
"దైత్యుఁడు మమ్ము నింక నే, కొలఁదుల
నైఁచునే కరము కొందల పెట్టక."
హరి. 4.22.

## కొంపకు నిప్పు పెట్టు

కొంప ముట్టించు.
"వాడు ఉన్నన్ని నాళ్లూ ఉండి ఆ
కొంపకు నిప్పు పెట్టి పోయాడు. మగని
మీద పెండ్లానికీ, పెండ్లాంమీద మగ
నికీ నూరి పోశాడు వెధవ!" వా.
చూ. కొంపలు ముట్టించు.

## కొంప కూల్చు

కొంప ముంచు, పాడు చేయు.
"...నీవగ లెల్లఁ గంటి మిటు నేర్చితివా
యతివా కుమారుఁడున్, నీవును గొంప
గూల్చితిరి నేర్చ రి కూఁత లు చాలుఁ
జాలు..." సానందో. 5.179. పు.
చూ. కొంప చెఱచు.

## కొంప గుండ మగు

కొంప గుల్ల యగు; సర్వస్వం
నాశ మగు.
"తినఁగాఁ గొంపయు గుండ మై
దొసగు ప్రాప్తించెం గదే జూదమా శి?"
వ్యస. నాట. 29.

## కొంప గుల్ల చేయు

కొంప కూల్చు.
"ఎన్ని కొంపలో, గుల్లలు చేసి..."
పాణి. 2.19.
చూ. ఇల్లు గుల్ల చేయు.

## కొంప చెఱచు

సర్వనాశనము చేయు.
"అని వారు తన్నుఁ దునుమం, బనుచుట
యును వారికొంప చెఱచుటకై దేవుని
వెనుక నుండి..." శుక. 3.95.
"ఆవిడ డబ్బంతా ఆ కంపెనీలో
పెట్టించి వాడు కొంప చెఱిచాడు." వా.
చూ. కొంప కూల్చు, కొంప లార్పు,
**కొంప తీయు.**

**కొంపచెఱుపు**

ఘాతుకుడు, దుష్టుడు.

"కొంపె కసుమాలమును మాజ కొంప చెఱుపు." హంస. 5.113.

**కొంప తీయు**

పాడు చేయు.

"ఆవిధి యేమి సేయును మహా ముని ముఖ్యుల మంచుఁ గొందఱీ, జీవుల కొంప దీయఁగ నడుఁ జిక్కఁగ వ్రాసిరి..." కవిమాయ. 4.73.

"తియ్యగా మాటలు చెప్పి నమ్మించి ఆ పిల్ల కొంప తీశాడా వెధవ." వా.

చూ. కొంపలు తీయు.

**కొంప దీసి....!**

ఒకవేళ అలాంటి అనాహూతం జరగ లేదు కదా! అనుపట్ల ఉపస్కారక పదంగా వినవచ్చే పలుకుబడి.

"మనం అన్న మాటలు కొంపదీసి వాడు వినలేదు కదా!" వా.

**కొంప నట్టేటిలో గట్టు**

కూడనిపని చేయు.

వ్యసన. నాట. 4.

**కొంపమీద పడి తిను**

ఒకరి యింట చేరి వారి తిండితో బతుకు.

అలా తినుటకు అధికారం లేనివారి యెడనే ఉపయోగిస్తారు.

"వాళ్లంతా ఆ పిల్ల కొంపమీద పడి తింటున్నారు. ఇంక ఆ దేం ముందు కొస్తుంది?" వా.

**కొంప ముంచు**

సర్వనాశనం చేయు.

"అన్న కదా అని ఆవిడ ఆస్తి అంతా తీసుకవస్తే, వీడు ఆవిడ కొంప ముంచాడు." వా.

చూ. కొంప తీయు.

**కొంప మునిగిపోవు**

అనిష్టము సంప్రాప్త మగు.

"ఇం కేముంది? కొంప మునిగిపోయింది. మనవాడు వెళ్లి వాళ్లపక్షాన సాక్ష్య మిస్తా నన్నాట్ట." వా.

**కొంప మునుగు**

అనిష్టము సంప్రాప్తించు.

"ఏదో కొంప మునిగినట్లు అర్ధరాత్రి పరుగెత్తు కొచ్చాడు. చేబదులు కావాలట చేబదులు!" వా.

**కొంపముక్కొను**

ఉన్న ఆస్తి పాస్తులను పాడు చేసుకొను.

"సుందరిని గూడి కొంపముక్కొనఁగ లేదా." శ్రవ. 2.60.

వాడుకలో రూపం: 'కొంపముక్కొని పోయాడు' అన్నట్లు ఆత్మనేపదంగానే ఈ క్రియ వినవస్తుంది.

**కొంప లంటుకొను**

అనాహూతము దాపురించు.

విపరీత మైన నష్టమో, ఆపదో వచ్చిన దని చెప్పే పట్ల ఉపయోగించే పలుకుబడి.

"నీవు ఏమో ఒకమాట అని వచ్చావు. అక్కడ కొంపలు అంటుకొన్నాయి." వా.

"ఇంత అర్ధరాత్రిలో వెళ్లడం ఎందుకురా? ఏం కొంప లంటుకొన్నా యని?" వా.

"వాణ్ణి అలా స్వేచ్ఛగా వదిలేశా వంటే కొంప లంటుకుంటాయి. జాగ్రత్త." వా.

**కొంప లార్చు**

కొంపలు తీయు; ఇతరులను నమ్మించి వారిని పాడు చేయు.

"వాడు వట్టి కొంపలార్చే రకం. అట్లా వానితో నీవు స్నేహం ఏమిటి?" వా.

చూ. కొంప తీయు; కొంప చెఱుచు.

**కొంపలు కాల్చు**

చూ. కొంప లార్చు.

**కొంపలు తీయు**

కొంపలు నాశనము చేయు.

"వాడు ఇప్పటికి ఎన్ని కొంపలు తీశాడో? ఇప్పుడు ఈ యిల్లు చేరాడు." వా.

చూ. కొంప లార్చు.

**కొంపలు ముంచు**

ఇతరులను నమ్మించి సర్వ నాశనం చేయు.

"వాడు ఈపాటికి ఎన్ని కొంపలు ముంచాడో? ఇక్కడ తయారయ్యాడు." వా.

చూ. కొంపలు తీయు, కొంప లార్చు.

**కొంపలు ముట్టించే కొఱివి**

తగాదాలు పెట్టే రకం.

"అది ఒట్టి కొంపలు ముట్టించే కొఱివి. ఆ అన్నదమ్ము లిద్దరూ వేఱయి పోవడానికి ఇదే కారణం." వా.

**కొంపా గోడీ లేదు**

ఆస్తిపాస్తు ల్లేవు. జం.

ఈ గోడీ గోరీ కావచ్చును. బతికినప్పుడు కొంప ఎలాగో, చచ్చినప్పుడు గోరీ అలాగు. అది కూడా లే దనుట.

"వాడికి కొంపా గోడీ లేదు. ఏమి చూచి పిల్ల నివ్వ మంటావో తెలీదు." వా.

**కొంపోవు**

తీసికొనిపోవు.

"చయ్యనఁ గొంపోయి." రుక్మాం. 5.80.

"చంపినను జంపు నన్నటు, గొంపోకుండినను జాలు." ప్రభా. 3.143.

**కొకిబికి**

కొక్కిరి బిక్కిరి.

"కొకిబికి యంగమున." రాధా. 5.108.

**కొక్కిరి బిక్కిరి**

అస్తవ్యస్త మయిన.

"చెప్పఁగాఁ దొడఁగెఁ గొక్కిరి బిక్కిరి పద్యపుంజముల్." గుంటూ. పూ. పు. 17.

**కొక్కురోకో అను**

కోడి కూయు.

ధ్వన్యనుకరణము.

"అప్సర స్త్రీనికేతనాభ్యంతరములఁ, గొక్కురోకో యటంచును గోళ్ళు కూసె." హర. 7.137.

**కొక్కొక్కొ అను**

కోడి కూయు.

ధ్వన్యనుకరణము.

"కొక్కొ-కొక్కొ- యనుచుఁ గోడి కూయఁ దొడంగెన్." వరాహ. 4.164.

కొక్కొరొకో అను

కోడి కూయు.

ధ్వన్యనుకరణము.

"కొక్కొరొకో యని కుక్కుటంబులు కూసె." కాశీ. 3.235.

కొక్కొరోకో యను

కోడి కూయు.

ధ్వన్యనుకరణము.

"కొక్కొరో, కో యని కూయఁ దే యతఁడు." నైష. 8.79.

కొకోక్కో

కోడి కూయు.

ధ్వన్యనుకరణము.

"కొక్కోకో యని కుక్కుటచ్ఛట లెలుంగుల్ రెచ్చ నల్దిక్కులన్." బహు. 3.94.

కొట్టకొన

చిట్టచివర.

"ఆ చెట్టు కొట్టకొనాన ఒక పండు వేలాడుతూ ఉంది." వా.

కొట్టరువు

ధాన్య ముంచుకునే కొట్టు.

"కొట్టరువునఁ బళ్ళు గొలిపించుచుండ." బస. 6.168 పు.

కొట్టికత్తె

పనికత్తె.

"గుత్తులయెడ చిగుళ్లు...కొట్టికత్తెలు పిడికెన..." కేయూర. 4.50.

కొట్టికాడు

పనివాడు, నౌకరు.

"హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడు నగుచు నతని నెల వగునడ విన్, జొరఁ గొట్టికాండ్రు డెక్కొముఁ, బరికించి యెఱింగి కలయఁబడి కూఁతలిడన్." ఆము. 3.26.

రూ. కొటికాడు.

కొట్టి కోలాహలంగా

ఎక్కు తొక్కు; పూర్తిగా, బాగా.

ఎట్లైనా చాలును అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"శేరు బియ్యం అయితే మన అందరికీ కొట్టి కోలాహలంగా సరిపోతుంది." వా.

"మూడుసేర్ల బియ్యం వేస్తే వారందరికీ కొట్టి కోలాహలంగా సరిపోతుంది." వా.

కొట్టి కోలాహలము చేయు

పాడు చేయు.

"కొట్టి కోలాహలము చేసి కూలఁ గ్రుమ్మి, చెండి చెకపికలాడమా యుండె నేని." సారం. 1.74.

కొట్టినపిండి

బాగా తెలియును.

"కోమలి నాకు సెట్టి యెడఁ గొట్టిన పిండి సమస్తలోకముల్..." కళా. 6.37.

వాడుకలో కూడా ఉంది :

"వాడికి వ్యాకరణశాస్త్రం కొట్టిన పిండి." వా.

కొట్టివేయు

1. దొంగిలించు.

"వాడు నా పుస్తకం కొట్టివేసినాడు." వా.

2. త్రోసివేయు.
"కోర్టులో వాడి కేసును కొట్టివేశారు. ఆనాటినుండీ వాడు మనిషి మనిషిగా ఉండడం లేదు." వా.

3. లెఖ్ఖ తీసివేయు.
"ఈ డబ్బు తీసుకొని నా లెఖ్ఖ కొట్టివేయండి." వా.

4. పడగొట్టించు.
"దళవాయితోడ గోడకు, వెలుపటి యిల్లిల్లు గొట్టివేయించి." కువలా. 3.3.

**కొట్టుకాడు**

1. కొట్టుకొను,
"ఇట్టటు బెట్టుగఁ గొట్టుకాడుచున్." రాధి. 2.89.

2. కొట్టునట్టివాడు.
"ఉలుకును గొట్టుకాడు నగు." రాధి. 1.128.

**కొట్టుకొను**

తన్నుకొను; ఏడ్చు; గట్టిగా చెప్పు.
"కడుపునొప్పితో వాడు కొట్టుకుంటున్నాడు." వా.
"పిల్లడు పోయాడని ఆమె కొట్టుకొంటూ ఉంది." వా.
"వద్దో ఆ వ్యాపారం అని కొట్టుకున్నాను. విన్నాడు కాదు." వా.

**కొట్టు చీకుడు గుడ్డలు**

అంగట్లో నిల్వ వుండిపోయి చీకు పట్టిపోయిన గుడ్డలు.
త్రొత్త. 20.

**కొట్టుడుబిళ్ళలు**

గోలీకాయలు.
బ్రౌన్.

**కొట్టుపడు**

దెబ్బ తిను.
"కొట్టువడి యటకు మునుపే, తిట్టుంబడి." మను. 4.86.
రూ. కొట్టువడు.
ఇందుకు దగ్గతి భావచ్ఛాయలన్నీ ఈ అర్థంతోనే సరిపెట్టుకొనవచ్చును.

**కొట్టు మిట్టాడు**

చెలరేగు, కలతపడు, తన్నుకొను.
"రక్కసులు వేడబంబుల, మిక్కిలి నాముకొని కొట్టుమిట్టాడంగా..." యయాతి. 2.
"నట్టడవిలోన నన్నిట్టునట్టు పఱచి, కొట్టుమిట్టాడ నేటికిఁ బట్టభద్ర, పుట్టునపుడున్న లేమకు బొట్టుగట్టి, చెట్టవట్టుట కొకరుండు పుట్టెఁ జూవె." శకుం. (కృష్ణ) 2.74.

**కొట్టిమిట్టిపడు**

ఎగిరి పడు.

**కొట్టము దంచు**

ధాన్యము దంచు.
"అప్పుడమివేల్పు జవరాండ్రు కట్టంబులకై కొట్టంబు దంచుచు నమ్మహోత్సవాలయాంగణంబున..." హేమా. పు. 81.

**కొట్నాలు దంచు**

ధాన్యము దంచు.
"కూరిమి విషయముల కొట్నాలు దంచేము." తాళ్ల. సం. 9.198.

**కొట్లాడు**

జగడమాడు, పోట్లాడు.

"చుట్టములతోడ నొప్పమి పుట్టినప్పు, డడ్డపడి వారితోడఁ గొట్లాడి యైన, దాని నుడుపంగఁ జొరకున్న వానిఁ గ్రూర,కర్ముఁ డని చెప్పఁదురు కర్మ కాండవిదులు." భార. ఉద్యో. 3.242.

**కొడి గట్టు**

దీపం వత్తి కాలి నల్లపడు.

"దీపం కొడిగట్టి వెలుగు తగ్గింది." వా.

**కొడిదిపూస**

మొలతాడులో బిళ్ల.

వేం. పంచ. 1.598.

**కొడిమెలాడు**

నిందలు మోపువాడు.

**కొడిమెలు గట్టు**

అపనిందలు మోపు.

"జడముడి జాహ్నవీతటని శాకర పోతముఁ జూచి యెవ్వరీ, కొడిమెలు గట్టి పెండ్లికొడుకున్ గడియారము మోవఁ జేసిరి." జైమి. 1.2.

**కొడివడు**

కదలు.

"పన్ని నిలిచెఁ గాయ్యుతో దానవ, కుల బలంబు నేల కొడివడంగ."

కుమా. 11.79.

**కొడివాలు**

దీపం కొనసాగు.

"శ్రీకమల గృహాము మోము వి, లోకింపఁగ దీపకళికలు కనుంగవ యా, నా కొడి వాలిన సన్నపు,రేకలు నాసికలు సుందరికిఁ జెలువొందున్."

శకుం. 2.179.

**కొడి సాగు**

కొనలు తేరు.

"ఉడుగని వెలుపటి యుద్యోగము వలె కొడి సాగెడి మతి కోరికలు"

తాళ్ల. సం. 11.78.

**కొడి స్తంభము**

ధ్వజ స్తంభము.

బ్రౌన్.

**కొడుకులు కొమ్మలు**

సంతానము. జం.

"కొడుకులఁ గొమ్మలం బడసి కొండొక కాలము ధాత్రి యేలి." బుద్ధ. 2.28.

"వాని కేం కొడుకులా కొమ్మలా? అదంతా ఎవరికో పోవలసిందే." వా.

**కొడుకైనా కూతురైనా**

ఉన్న దల్లా ఆ పిల్లే అనుట.

"కొడుకైనా కూతురైనా నా కున్న దల్లా ఆ పిల్లే. ఈ అవస్థంతా దాని కోసం కాకపోతే ఇం కెందుకు?" వా.

**కొడుగురు వోవు**

చలితో కొంకెర్లు వోవు.

"సీతునం, గొడుగురు వోయి యున్న సఖుఁ గ్రోతిఁ గనుంగొని."

కేయూర. 3.270.

**కొడ్దిపూస**

కొడిదిపూస

చూ. కొడిదిపూస.

**కొణుజెక్కు**

పిడుదులు పశువులకు పట్టు.

"ఎరువు తిప్పలు గొని యెల్ల మందలు గొణుజెక్కు." హరి. పూ. 6.5.

**కొతుకుపడు**

జంకు-గొంకులతో సంకోచించు.

"లేమిం గొతుకుపడినభర్తను."
కాశీ. 2.79.

**కొత్తగా మాట్లాడు**

నీ మాటలు మామూలుగా లేవు అనుపట్ల 'ఏమిటే! కొత్తగా మాట్లాడుతున్నావే' అంటారు. ఈ ధోరణి యేమిటి? కొత్తగా ఉందే అని భావము.

"ఏ నీ కెపుడుఁ బ్రసన్నుఁడ, గానే తరళాక్షీ! క్రొత్తగా నిటు పలుకం,గా నేల?" మార్కం. 5.205.

**కొత్తనీరు వచ్చి పాత నీరు కొట్టుకొని పోయినట్లు**

ఎవరో - ఏదో - వచ్చి, ఉన్న వారిని - వానిని - తొలగించు పట్ల ఉపయోగించే పలుకుబడి.

కొత్తవానితో పాతవి వెనుకబడి పోయినప్పుడు దీనిని ఉపయోగిస్తారు.

"కొత్తనీరు వచ్చి పాతనీరు కొట్టుకుపోయినట్లుగా యీ ఇంగ్లీషు చదువులు వచ్చి వేదాలు శాస్త్రాలు మన చదువులన్నీ మూల బడ్డాయి." వా.

**కొత్తా పాతా లేదు**

చాలా కలగలుపు మనిషి.

"ఆ అమ్మాయికి కొత్తా పాతా లేదు. అందరితోనూ చాలా హాయిగా కాలం గడుపుతుంది." వా.

**కొత్తిమీద కూడు**

(?)

**కొత్తెమ్మసాని**

యోగిని.

విప్ర. 2.14.

**కొడల పొందని**

అపార మయిన, కొఱత లేని అనుట.

"కొదలం బొందనిబహుసంపదలన్." నిరంకు. 2.85.

**కొదలు పడు**

కొఱతపడు.

**కొదల్పడు**

కొఱతపడు.

"నా, తమ్ముని ముద్దుమాటలు గొదల్పడఁ బల్కెడుచిల్కబోద." నిర్వ. 5.105.

**కొదవ కార్యము చూచికొనగ వచ్చు**

తక్కిన పని నెఱవేర్చుకో వచ్చు.

"కడప కడ్డము గాఁగఁ బడి సివమాడుము, కొదవకార్యము చూచికొనఁగ వచ్చు." శుక. 2.350.

వాడుకలో రూపం :

"నీ వక్కడకి వెళ్లు. మిగతా పని నేను చూచుకొంటాను." వా.

"నీ పతనికి కనబడి రా. మిగతపని నేను చూచుకొంటాను." వా.

**కొదవ చేయు**

తక్కువపఱచు, కించపఱచు.

"హితంబుఁ, గోరిక నన్నింత కొదవ చేసితివి!" వర. రా. అర. పు. 215. పం. 15.

"పంపఁ దగ దంపినచో మఱి నిన్నుఁ
గొదవ సేసినతెఱఁ గగు."
విప్ర. 4.73.

"నీ కేం కొదవ చేసినా నని అలా మూతి
ముడుచు కూర్చున్నావే కోడలా?"
వా.

కొదవడు

ఆగిపోవు. పని కాక మిగిలి
పోవు; తగ్గు.

"యాగము కొదవడకుండఁగ, సాగిం
పుఁడు." శకుం. 3.106.

"జనసత్త్వము ంచుఁ గొదవడుఁ
జూపుల్." సుద. 2.136.

కొదవపడు

తక్కువగు, లోపము జరుగు.

"ఏమైనఁ గొదవ పడెనో."
విప్ర. 4.38.

"కొదవపడియెఁ బని యనుచుఁ."
వేం. పంచ. 1.96.

కొదవపఱచు

తగ్గించు.

"ఎవ్వనియశంబు జగ మెల్ల నెనసి చుట్టు,
కొండ యవ్వలి తమ మెల్లఁ గొదవ
పఱచు." కాళిం. 1.35.

కొదవలు తడవు

లోపము లెన్ను.

"నేను మీదాన నగుట మీ గానకథలు,
వడిన నవ్వేళఁ గొదవలు దడవ రేమొ."
కళా. 2.45.

కొదవ లేదు

సమృద్ధిగా ఉన్న దనుట.
లోటు లేదు.

"ముదిత! మేలు మేలు కొదవ లే
దెందు." కళా. 2.35.

నేటికీ వాడుకలో :

"వా ళ్లింట్లో పెట్టుపోతల కేమీ కొదవ
లేదు." వా.

"నీవు మంచి యింట్లో పడ్డావు. నీ కేం
కొదవమ్మా కూతురా!" వా.

"వాడికి కొడుకులు చేతి కెదిగి వచ్చారు.
వాడి కేం కొదవ?" వా.

కొదుకుకొను

భయపడు ; జంకు.

"గోలయును బోలె నొదుగుచుఁ గొదికి
కొనుచు." విప్ర. 3.3.

కొద్దిపడు

కొంచెపడు.

కొద్దిపఱచు

హీనపఱచు.

"తిట్టెనేనిఁ గొట్టెనేనిఁ గొట్టినఁ
గొట్టును, గొట్టెనేని యముడు కొద్ది
పఱచు." వేమన.

కొన కెక్కు

పరాకాష్ఠ నందు.

"గోవిందుఁడు మన్నించితే కొంచెము
దొడ్డున్నదా, కోవరపుసిరు లంది కొన
కెక్కఁ గాక." తాళ్ల. సం. 9.134.

కొనకొన కోడి

నీటికోడి.

క్రీడా. 52.

కొనగోర దిద్దు

గోటితో వెంట్రుకలను సవ
రించుకొను.

"చెలు వెడఁగోఁ జన్న నిలువుటద్దముఁ
జూచి, కొనగోర నటు దిద్దుఁ గురులు
విరులు." కళా. 7.102.

**కొన మునిగించు**

పూర్తిగా ముంచు.

"కినిసి పల్కితి వారిఁ బిశాచులార
పొం,డని యిటు లన్నమాత్రనె మహా
శనిపాతమువోలె వారలం, గొన ముని
గించె నాపలుకు కుత్సితరూపులు గాఁగఁ
జేయుచున్." ఉద్ధ. 1.188.

**కొనల కెక్కు**

పై కెక్కు; ఉన్నతి నందు.
వస. రా. అయో. పు. 269. పం. 4.

**కొనలు నిగుడు**

పెరుగు, వర్ధిల్లు.

"కుశల మడిగి ప్రియము కొనలు నిగుడ."
భార. అర. 5.29.
చూ. కొనలు సాగు.

**కొనలు వాఱు**

వర్ధిల్లు.
ప్రభా. 2.105.

**కొనలు సాగు**

వృద్ధి చెందు.
ఇది తీగలు మొదలగునవి
పెరుగుటలో కొనలు సాగు
టను బట్టి వచ్చిన పలుకుబడి.
ఇలాంటివే కొనలు నిగుడు,
తీగ సాగు ఇత్యాదులు.

"అనవుడుఁ గనుంగొనల గొనలు సాగు,
కనలున..." కా. మా. 1.57.

"శబరకాంతాఘన స్తనశాతకుంభ,కుంభ
యుగములఁ గరకరి కొనలు సాఁగె."
కా. మా. 3.12.

"లోన దండెమ్ముల లోమలు చుట్టుగాఁ,
జెనఁగొని మీఁదికిఁ గొనలు సాఁగి."
రాజగో. 1.96.

**కొనలొత్తు**

వర్ధిలు.

"వేడ్కలు కొనలొత్తునపుడు."
రంగ. రా. బాల. 25 పుట.

**కొనసాగు**

1. వర్ధిల్లు.

"ఇంకఁ గొనసాఁగుఁ జామీ కుశలంబు
మాదెసన్."
పాండు. 4.53.

"రాజీవనయనకు రాగంబు కొన
సాఁగె." రాధా. 1.128.

2. బాగా జరుగు.

"శర్వుల చిత్తవృత్తి కొనసాఁగుచు
నుండుట."
హంగ. 4.45.

"ఈ విధంగానే ఎన్నాళ్లు కొనసాగు
తుం దనుకుంటున్నావు!" వా.

**కొనాకులు మేయు**

పైపైన రుచి చూచు.
సమగ్రము, కూలంకషము
కాని దనుపట్ల ఉపయోగించే
పలుకుబడి.

"...నేను మాత్రము భావికార్యము
నెడ కొనాకులు మేయఁబోను..."
ధర్మజ. 65పు. 8పం.
తె. జా.

**కొనితెచ్చి పెట్టుకొన్న తద్దినం**

అనవసరంగా కల్పించుకొన్న
చిక్కు.

"వాణ్ణేదో బుద్ధి చాలక ఇంట్లో ఉండ
మన్నాను. వాడింత పని చేశాడు.
ఇదంతా కొని తెచ్చిపెట్టుకొన్న
తద్దినంలాగా తయారయింది." వా.

**కొని తెచ్చుకొను**

బుద్ధిపూర్వకముగా చిక్కులను తెచ్చి పెట్టుకొను.

"అనవసరంగా వాణ్ణి మాట్లాడించి తగాదా కొని తెచ్చుకొన్న ట్లయింది." వా.

**కొనియాడు**

1. పొగడు.

"హరుఁ జెడనాడి వీరిఁ గొనియాడెదు." కుమా. 2.31.

2. గౌరవించు.

"కుంతీమహాదేవి కోడండ్రలోపల, నగ్గలంబుగఁ గొనియాడఁ బరఁగి." భార. విరా. 2.216.

3. స్తుతించు.

"కొనియాడిన నాపై కోప మేలఁ?" త్యాగయ్య.

4. ప్రోచు.

"అతని పుత్రకులు దాని, నెంగిళులు వెట్టి కొనియాడ నెలమిఁ బెరిఁగి." భార. కర్ణ. 2.54.

5. పెద్దగా ఎంచుకొను.

"విధివశమున వచ్చిన కీ, డధములు గొనియాడి ప్రేగులై విపులభవాం,బుధి మునుఁగుదురు." భార. అను. 1.9.

**కొనుకొను**

వెలకు పుచ్చుకొను.

"బ్రదుకు గలిగె, నేని యాగంబు లీరాని విచ్చి యైనఁ, బొందు గొనుకొందు నెట్లరవిందనయన." ఉద్భ. 2.168.

**కొనుగోలు**

అమ్మకం.

"ఆ భూమి వాని కప్పుడే కొనుగోలయి పోయిం దట." వా.

**కొనుబడి**

విక్రయం.

**కొనుమొదలు**

సంచకరువు (?)

కొనుట కిచ్చిన సొమ్ము అని... బ్రౌ: శ. ర.

**కొన్న అంగడిలోనే మారు బేరమా**

కూడనిపని అనుట.

"నిన్నుం దేమానిసి యే, ని న్నేలిం జేయఁ బూనె నెలఁత బలాకే, కొన్నంగడి లోపలనే, యన్నవలా మారుబేరమగునే చెలియా?" రాధి. 3.

**కొప్పు పట్టి ఈడ్చు**

ఆడవాళ్లను శిక్షించుటలో కొప్పు పట్టి లాగుట ఒకటి.

"నా యిగుముఁబోడి కొప్పు పట్టి తివంబోవ..." కళా. 3.127.

**కొప్పువల**

తలవెండ్రుకల బంధించు ముత్యాలసరము. బ్రౌ.

**కొప్పెక్కించు**

పై కెత్తు, గౌరవించు.

"లలిఁ గొప్పెక్కించితి మధు, పులకులను నడుగుపఱచి పుష్పాస్త్రి!" చంద్రా. 5.91.

ఇక్కడ కొప్పు ఇంటికొప్పు.

**కొప్పెత్తు**

పరాజితమై పాఱిపోవనుంకించు.

కోడి పందెములలో ఓడి పోయిన కోడి కొప్పెత్తడం, అలా వెత్తినవెంటనే పారి పోవడం కనబడుతుంది. మెడ మీది ఈకలు పైకి లేవడాన్ని కొప్పెత్తడ మంటారు. అందుపై వచ్చిన పలుకుబడి.

"ఆదేమిట్రా? అన్ని మాట్లాడి అతను రాగానే కొప్పెత్తావు." వా.

"ఆ కోడి కొప్పెత్తింది." వా.

"నా కోడికి కత్తి కట్టగానే నీ కోడి కొప్పెత్తుతుందో లేదో చూడు." వా.

చూ. ఎత్తి పోవు.

## కొమరాలు

1. యువతి.

"కొమరాలి సిబ్బెంపు గుబ్బ పొందమ్మి మొగ్గలు." శకుం. 2.87.

2. సుందరి.

"అట్టి కొమరాలు భాగ్యోదయమున, వచ్చి కామింప నొల్లని వాఁడు గలఁడె." భాగ. 3.787.

3. ఆకుది.

"తమ్మి కొమరాలు పద్మనేత్రములు ముడిచె." వేం. పంచ. 4.234.

## కొమరునాడు

యౌవనం.

"కొమరునాఁడే చెల్లె మాపైఖరుల్." కళా. 4.26.

## కొమరుబాయము

యౌవనము.

కళా. 4.46.

## కొమరు మిగులు

అంద మగు.

"కువలయానందకరలక్ష్మిఁ గొమరు మిగిలి." జైమి. 1.27.

"ఫుల్లుఁగుల గమికాఁడు పలు దెఱంగుల దాఁటు, గుజ్జంబు బంటు నై కొమరు మిగులు." రుక్మాం. 1.125.

## కొమరు మెఱయు

అందముగా నుండు.

పాండు. 3.32.

## కొమరేఱు

స్వామిపుష్కరిణి.

"కొమరేఱు కల్యాణకమలషండంబుల." భీమ. 2.62.

## కొమరొందు

అంద మగు.

"కొండిక మచ్చయంను బోలెఁ గొమరొందు." పాండు. 2.60.

## కొమ్మ నాటు

చెట్లు వేయు.

కొన్ని మొక్కలను విత్తనం అవసరం లేకుండా కొమ్మలు తెగ నఱికి నాటితే చెట్లవు తాయి. అందుపై వచ్చిన పలుకుబడి.

"కొమ్మ నాఁటంగ దగునెడఁ గొమ్మ నాఁటు..." కళా. 4.79.

## కొమ్మలు వోవు

కొనలు దేరు, వరిల్లు.

"రతి కోర్కులు కొమ్మలు వోవ." నిర్వ. 8.73.

## కొమ్ము కాచు

సహాయముగా ఉండు.

నీపక్షం నే నుంటాను లే అను పట్ల ఉపయోగిస్తారు.

"నీ కెందుకు? నువ్వు ముందు నడు. నేను కొమ్ము కాస్తాను." వా.

## కొమ్ము కొట్టే గుణం

ఇతరులను వెనుక అవహేళన చేసేగుణము.

ఎద్దులు కొన్నిటికి కొమ్ము కొట్టే గుణం ఉంటుంది. రాత్రిలో తడవ తడవకూ కొమ్ము గాడిపాటి రాతికో కంబానికో వేసి కొట్టుకుం టుంటాయి. అందుపై వచ్చిన పలుకుబడి.

"వా డంతా మంచివాడే కాని వెనకల ఎత్తివేస్తూ ఉంటాడు. ఆ కొమ్ము కొట్టే గుణం ఒకటీ లేకపోతే..." వా.

## కొమ్ముతీరు

పశువుల విషయంలో గణించ వలసిన లక్షణం.

కొమ్ముతీరూ, నడక తీరూ చూచి ఎద్దును కొనా లంటారు.

"ఈ కోడెవ కొమ్ము తీరు బాగా ఉంది." వా.

*  *  *

కొమ్ము పూర్వపదంగా కొమ్ము కాకర, కొమ్ముచేప, కొమ్ముటుడుము, కొమ్ము ఏనుగు, కొమ్ముతేజి, కొమ్ము పెసర - ఇలాంటి పదాలు చాలా చాలా ఉన్నవి. కాని విశేషార్థస్ఫూర్తి, విభిన్నార్థ స్ఫూర్తి ఉన్న కొన్నే ఇట ఇవ్వబడినవి. మిగతవి ఊహ్యాములు.

*  *  *

## కొమ్ము మాచకమ్మ

స్తనా లున్న మాచకమ్మ. బ్రౌన్.

మాచకమ్మ అంటే సమర్త కాకుండా ఉండే స్త్రీ.

"మాచికమ్మ సమర్త మఖై తే నేం పుబ్బ అయితే నేం?" సా.

## కొమ్ములాడు

పంది ; కొమ్ముల వాడు.

"లాంచి తప్పిన జాగిలము రొట్టు కొట్టునఁ, గూడినపిడిఁ గూల్చెఁ గొమ్ము లాఁడు." కకు. 4.77.

## కొమ్ములు చివ్వు

పౌరుషము లెక్కించు.

"పరుల,కొమ్ములు చివ్వినఁ గొంక నేరు తుసె." వర. రా. యు. 59 పు. పం.7.

## కొమ్ములు చూపి గేదె బేర మాడు

విషయం అంతటినీ బయట పెట్టకనే వ్యవహారం సాగించ డానికి పూనుకొన్నప్పుడు అనే మాట.

"అసలు నువ్వేం రాశావో యేమిటో చూపకుండా నే పత్రికలో వేసు కుంటారా లేదా అంటే యేం చెప్పను? నీ వ్యవహారం చూస్తే కొమ్ములు చూపి గేదె బేర మాడినట్లుగా ఉంది." వా.

## కొమ్ములు తిరిగిన

గొప్పపేరు గడించిన.

"ప్రపంచమునఁ గొమ్ములు తిరిగిన విద్వాంసు లున్నారు."
సాక్షి. 320.

చూ. కొమ్ములు మొలుచు; కొమ్ములు వచ్చు.

## కొమ్ములు మొలుచు

అంత గొప్పవాడా?
కొమ్ములు వచ్చినవా? అనుట.

"వాడి కేం కొమ్ములు మొలిచాయా? వాడు తప్ప మరెవడూ పనికి రాడంటావు?" వా.

చూ. కొమ్ములు వచ్చు; కొమ్ములు తిరుగు.

## కొమ్ములు వచ్చు

గొప్పవాడగు; ఆధిక్యం కలుగు.
సాక్షి. 47.

"పోసీ. వాడే రాసీ. వాని కేం కొమ్ము లొచ్చాయా?" వా.

చూ. కొమ్ములు మొలుచు.

## కొమ్ములు సూపు

బెదరించు.
ఆధిక్యము కనబఱచు.
ఇక్కడ శ్లేషలో ఈ అర్థం ఉన్నది.

"అబల నీయెలుఁగు పికారావ మని నీకుఁ, జూతమ్ముఁ గొమ్ములు సూప వెఱచు." కుమా. 5.165.

"కంభోదకముఁ బోసి యంభోజముఖి పెంపఁ, జూతంబు కొమ్ములు సూపఁ దొడఁగె." విక్ర. 1.156.

## కొమ్మెక్కి కూర్చుండు

ప్రాధేయపడు కొలది బిగువు చూపు.

"అగ్గాన్నీ మీరు చెప్పినట్లే చేస్తా మని మనం లొంగేకొద్దీ అతను మరీ కొమ్మెక్కి కూర్చుంటున్నాడు."
వా.

చూ. కొట్టెక్కి కూర్చుండు.

## కొయ్య

నిరసుడు, సరసుడు కాని వాడు.

"ఇల్లుఁబిడ్డ లేని యట్టి త్రిమ్మరి యగు, కొయ్య గాక కుదుట గూడు వెట్టి, కుడుచువార లిట్టి క్రొవ్విదంబులు సేయఁ, జొచ్చు టిచ్చగించి చూతు రయ్య." భార. ఉద్యో. 2.9.

## కొయ్యకాటుక

ఒక రకమైన కాటుక.
వివరం తెలియదు.
'దళముగా నలఁదిన కాటుక.'
అని వావిళ్ళ ని.

"కటిలంపుఁ జూపులుఁ గొయ్యకాటుకలు." పండితా. పర్వ. 341 పు.

## కొయ్యకాలు

సజ్జ జొన్న వరి ఇలాంటి పైరు కోయగా నేలపై మిగిలిన ముక్క.

"చేలపంటల కొయ్యకాలె తెలుపు."
రామలిం.

నేడు 'కొయ్య' లనే వీని నంటారు.

**కొయ్యకూర**

తోటకూర.

**కొయ్యతోటకూర**

ఒక విధమైన కూర.

**కొయ్యతనములు**

1. దుష్కృత్యములు

"నీవు దర్పమునం జేయు కొయ్యతనములు వీక్షించి."

కాశీ. 4.94.

2. శఠత్వం.

"కొయ్యతనమునం గోపించుం గొంత తడవు." వరాహ. 11.76.

3. పారుష్యం.

"సురశాఖ యయ్యుం, గొయ్యతనమున వర్తింపం గోరం డెచట."

ఉద్ధ. 3.333.

**కొయ్యనగాడు**

మూర్ఖుడు; దుష్టుడు.

"కొలగాని జలఖులం గొయ్యనగాండ్ర, గొలియుల వార్తలు గూడునే త్రవ్వ."

బస. 5.91.

**కొయ్య పొడ్వనా**

ఎందుకు? కాల్చనా? అనే అర్థంలోనే ఉన్న నుడికారం.

"...భక్తి విహీనుల బ్రదుకు, గొయ్య బొడ్వన దానిం గొసిపోయి గాల్ప."

పండి. పర్వ. ద్వితీ. 418. పు.

**కొయ్యల గోపి**

కోతివెధవ.

"వాడు ఒట్టి కొయ్యల గోపి. వాడి దగ్గరికి వెళ్లావంటే నీపని అసలు కాదు." వా.

**కొరకచ్చు**

కొరివి కట్టె. ఒక తిట్టు.

"అగ్గిరాములు కొరకచ్చు లక్క పక్షులు." ప్రభా. నాట. 5.

**కొరకరాని కొయ్య**

1. ఏమాత్రం ఎవరిమాటా వినని మనిషి.

"వాడా? కొరకరానికొయ్య. ఎవ డేం చెప్పినా వినడు." వా.

2. అవగాహనకు అతీత మయినది.

"నైషధం కొరుకరాని కొయ్య. అర్థం కావడం కష్టం." వా.

**కొర కొర మను**

చెలరేగు.

"అందుల కసూయ గొరకొర మంచు ముగుల." సారం. 3.127.

**కొర కొర లాడు**

కోపముతో చిరచిరలాడు.

"ఆ పిల్ల పొద్దున్నుంచీ యేమో కొర కొర లాడుతూ ఉంది. ఏ మంటే యేమో అని నేనూ నోరు మూసుకొని కూర్చున్నాను." వా.

**కొరగాని**

పనికి రాని; అల్పము లైన.

"పాప నీ రెన నీర్బలి ప్రాచిపురువు, లాది కొరగానిజంతువు లన్ని విడిచి."

హంస. 4.186.

**కొరమాలు**

పనికి మాలు.

"విరసపుం బాపముల వినికిచే దీను లెల్లా, గొఱమాలె." తాళ్ల. సం. 6.61.

**కొఱకరాని కొయ్య**
దుస్సాధ్యుడు.
"వాడు కొఱకరాని కొయ్య. వాడి దగ్గరికి ఎవరూ పోలేరు." వా.

**కొఱక వచ్చు**
కసురుకొను.
"వాడు మాట్లాడితే నాలు కొఱక వస్తాడు."
చూ. కఱవ వచ్చు.

**కొఱకుల తెరువుల పట్టించు**
అడవులపాలు చేయు, తఱిమి వేయు; కొఱకు = బీడు. పచ్చికబీళ్లు పట్టించు – దిక్కులు పట్టించె ననుట వంటిదే.
"పురములు గైకొని కొఱఁకుల, తెరువులఁ బట్టించె నన్ను దిక్పాలకులన్." ఉ. హరి. 1.129.

**కొఱకొఱ చూచు**
కోపముతో చూచు.
"వా డెందుకో ఈ మధ్య నే నంటే కొఱకొఱ చూస్తున్నాడు." వా.

**కొఱకొఱలాడు**
రుసరుసలాడు.
రసిక. 5.163.

**కొఱ గల**
పనికి వచ్చునట్టి.
"తతి చనుదేర నాతని కుక్షివలనఁ, గొఱ గల యొక మంచి కొడుకు జనించె." ద్వి. భాగ. 8. శ. ర.

**కొఱగాడు**
పనికి రాడు, సరిపడని వాడు.
"ఏలినవానిన్, గొఱగాఁ డని కైకొన కిం,దఱఁ దెచ్చితి వీర లీశుదాసులు గారొకొ?" కుమా. 2.25.
వాడుకలో: సరిపడని వా డనుటలో ఎక్కువగా ఉన్నది. రెండవది లేక పోలేదు.
"వానికి నన్ను చూస్తే కొఱగాదు." వా.
"వాడు దమ్మిడీకి కొఱగాడు." వా.

**కొఱగాని**
పనికి రాని, సరిపడని.
"పతి నే మేనియు నాడుట, సతికిం గొఱ గాదు." రుక్మాం. 4.27.

**కొఱగామి**
చెడుగు.
"పాపుఁడు తండ్రి బిడ్డలం, గలిపిన మేల కాక కొఱగామియుఁ గీడును నెద్ది పేర్కొనన్." జైమి. 1.93.

**కొఱడు కొట్రి**
కట్టా కంపా. జం.
బస. 3.65.

**కొఱడుపాలు**
కొయ్యబాఱు.
బ్రౌ.

**కొఱడువడు**
కొయ్యబాఱు.
అప్ప. 2.196.

**కొఱత పడు**
న్యూనత పడు, లోపించు.
"కొంత దివ్యులలోపలఁ గొఱఁత పడఁగఁ." నిరంకు. 4.37.

**కొఱత పల్కు**
నీచముగా మాటలాడు, ఉదాసీనముగా మాటలాడు.

"పందనుం గొఱంత పల్కఁడు శూరతఁ
దాను మించియుక్." అను. 2.40.

**కొఱత పెట్టు**

దాచు, వదలు, మిగుల్చు.

"వజ్రనాభు రాజ్యావసాన సామి
ష్యంబు స్వామికి నేమియుం గొఱంత
పెట్టక విన్నవింపుము."
ప్రభా. 1.117.

**కొఱ తలచు**

చెడు తలచు, తప్పు ని
భావించు.

"నిరపరాధులమీఁద గొఱ తలంచి..."
సానం. 2.86.

**కొఱతవడు**

లోపము కలుగు ; మిగులు.

"...గురువులు శిక్షింపఁ గొఱత
వడునె." భాగ. 8.647.

"తద్వృత్త మొకటి కొఱంతపడకుండఁ
బ్రత్యక్షపరిచితం బైనది గాదె."
హరి. పూ. 1.48.

**కొఱత వెట్టు**

చూ. కొఱత పెట్టు.

**కొఱత వేయించు**

ఉరి తీయించు.

శిక్షగా—

"కొఱంత వేయింతుఁ గను దీనికొఱకు
దాని." నిరంకు. 4.37.

**కొఱత వోవు**

తక్కువగు.

శుక. 2.166.

**కొఱనవ్వు**

చిఱునవ్వు.

**కొఱనెల**

క్రొన్నెల, బాలచంద్రుడు.

"కొఱనెల సుధారసంబునఁ, గఱ
వోఁగఁ గొఱసి కడిగి..."

కుమా. 3.63.

**కొఱప్రాణముతో తన్నుకొను**

అవసానదశలో ఉండు.

"ఊర్వుల్, పఱవ మిడిగ్రుడ్ల వణఁ
కుచుఁ, గొఱప్రాణముతోడఁ దన్ను
కొనునమ్మెదవుక్." అను. 3.23.

**కొఱమాలు**

పనికి మాలు.

"మనచేతఁ, గొఱమాలి చెవులు
ముక్కను బోవనాడు, జంత."
వర. రా. అర. పు. 224. పం. 23.

**కొఱముట్టు**

పనిముట్టు

**కొఱలుకొను**

ఒప్పు.

**కొఱవి**

కఠినుడు, కలహశీలుడు.

"వాడు ఒట్టి కొరివి. ఎక్కడికి
పోయినా ఏదో తగాదా తెస్తాడు."
వా.

**కొఱవి చేత పట్టుకొని వచ్చు**

మండుతూ వచ్చు.

"కొఱవి చేతఁ బట్టుకొని చంద్రుఁ డడ
వచ్చె." కళా. 6.269.

**కొఱవితో తల గోకుకొన్నట్లు**

బాధోపశమనార్థ మై పోయి
మరింత బాధ తెచ్చు
కొన్నట్లు అనుట.

తల నవ్వ పెట్టినప్పుడు చేతితో కాక కొఱవితో గోక్కుంటే నవ్వమాట దేవు డెఱుగును ముందు తల కాలి పోతుంది కదా!

"కొఱవి గొని వెత్తినే తల గోకి కొనఁగ" భార. అర. 5.

"ఎఱిఁగి యెఱిఁగి తన యాఁదల, కొఱ విం గొని గోకఁ దివురు కుమతియుఁ గలఁడే." పాండు. 5.254.

"ఇట్టి చలపాది నాట న న్నెఱిఁగి యెఱిఁగి, యెట్లు గైకొనె దమయంతి నీ నలుండు, కొఱవి చేఁ బూని తల గోకు కొనఁ దలంచెఁ, గటకటా గర్వమున మీఁదు గానఁ డయ్యె." నలచ. 4.252.

**కొఱవిదయ్యము**

బగ్గుబగ్గు మని మండుతూ చీకటిలో కనిపించే నేలమీది మంట లాంటిది.

అది దయ్యం కాకున్నా దయ్య మని పాతనమ్మకం.

**కొఱవి వీచినభంగి**

కొఱవి త్రిప్పినట్లు.

గిరగిర తిరుగుతూ మిఱుమిట్లు గొల్పుతూ అనుట.

"అంగుళీయకఖచితో,ర్వను సమవర రత్నోజ్జ్వల, వినుతద్యుతు లెసఁగఁ గొఱవి వీచినభంగిన్." కుమా. 12.158.

**కొఱసంది**

ఆయువుపట్టు.

"పఱతెంచి కరిమదము నే, డ్రెఱ ద్రొండం బెత్తి వ్రేయ దెప్పఱికమునన్, గొఱసంది దాకి నేలకు, నొఱిగిన..." నిర్వ. 10.29.

**కొఱుకుకు పోవ బడిగల్లు వడు**

ఆశపడి పోగా అనర్థము కలుగు అని భావము.

మేతకు పోగా కాలికి బండ తగులుకొన్నట్లు.

దొంగమేత మరిగిన పశువులకు మెడకు మెడకొయ్య వేయడం, కాలికి ఒక గుదిబండను గొలుసుతో కట్టి వేయడం అలవాటు. అది మరీ తిరగకుండా ఉండుటకై ఈ శిక్ష.

"చింత యుఱుఁగక యేఁగుదెంచితిఁ గొఱుకుడుఁ, బోవ బడిగల్లు వడియె నో పొలతి యనియె." కళా. 3.105.

**కొఱుకుడు పడని**

అవగాహన కాని, అతిగహన మైన.

"అధివాస్తవికకవిత్వం అందరికీ కొఱుకుడు పడదు." వా.

**కొఱుకునకు లేక**

తిండికి లేక.

"కొఱుకునకు లేక మూషికకోటి చేర, కనికి మార్గాలజాల మాతని నికాయ, సీమ వీక్షింపఁగా..." శుక. 3.242.

చూ. పంటి కిందికి లేదు, చాలదు.

**కొఱుత నుఱుకు**

ఎంత సాహస మైనా చేయు.

"కొఱత నుఱుకుఁ గాని కోడు కెన్నఁడును గార్య, తంత్రమునకుఁ జొరఁడు." భార. స్త్రీ. 1.17.

2. క్రూరుడు, దుష్టుడు.

"చెలువ మగని దిక్కు చేసన్నఁ జూపి యీ, కొఱత నుఱుకు ముక్కు గోసె ననియె." విక్ర. 7.160.

"వారలు (కౌరవులు) కదా మీఁదెఱుంగక కొఱత నుఱుకు లై చెడు తెరువునం బోయెడువారు."

భార. ఉద్యో. 1.343.

3. సాహసి.

"చుఱుకు చూపునఁ గాలిన కొఱత నుఱుకు." కాశీ. 3.71.

**కొఱ్ఱు ఇంటికంబము సేయు**

చిన్నదానిని పెద్ద కార్యమునకు ఉపయోగించు.

కంబమువలె కొఱ్ఱు ఇంటికి ఆధారము కా జాలదు కదా!

"విన మింతకు ము న్నెన్నఁడుఁ, గని కని కొఱ్ఱెవ్వఁ డింటికంబము సేసెన్." ఉ. హరి. 1.94.

**కొఱ్ఱుల బెట్టు**

కొఱత వేయు

పూర్వం శిక్షలలో ఒకటి - ఒక యినుప కొఱ్ఱు నాటి కొఱత వేసేవారు.

"వివేకశూన్యులను గొఱ్ఱులఁ బెట్టఁగ లేదు." రుక్మాం. 2.29.

రూ. కొఱ్ఱుల విడు.

**కొఱ్ఱెక్కి కూర్చొను**

అడిగిన కొలదీ దిగి రాక మరింత పైకి పోవు.

"ఏదో పిల్ల నిస్తాను చేసుకోరా అని బతిమాలేకొద్దీ వాడు కొఱ్ఱెక్కి కూర్చొంటున్నాడు." వా.

**కోలకుండ**

1. కొలుచునట్టి కుండ.

ధాన్యాదులను కానలతో - కాగులతో కొలవడం నేటికీ ఉన్నది.

2. నేల తవ్వుతున్నప్పుడు ఇంత లోతు తవ్వినామని తెలియడానికై కొంత భాగం నడుమ తవ్వకుండా వదిలి పెడతారు. క్రింది ప్రయోగంలో ఈ అర్థం సరిపడుతుంది.

కోలకొండ్ర అనగా కొలతకై వదిలివేసిన కొండ్ర = నేల - కోలకుండ అయినది.

"కుతలంబు నడుమనఁ గోలకుండ గా నిల్పి, శరనిధిఁ గ్రొచ్చిరి సగరసుతులు." కుమా. 1.52.

**కోలకోల కూయు**

కల కల మని ధ్వని చేయు.

ధ్వన్యనుకరణము.

"కోలకోలఁ గూయుఁ బై నొఱగుఁ గుతుకఁ గుతుకఁ జుట్టుఁ బాఱు చిల్వల క్రియ." మను. 3.62.

**కోలకోల మని**

బిలబిల మని.

ధ్వన్యనుకరణము.

"కోలకోల మంచు మేఁతలకు గూఁడులు వెల్వడు పక్షిరావముల్, కలప్పృదు వాక్యవైఖరులుగా."

పారి. 2.70.

**కొలకొల మను**

కలకలము చేయు.

ధ్వన్యనుకరణము.

"సందడించుచు దశాస్యాహినీ సైన్యంబు, లనిశంబుఁ గొలకొల మనుచు నుండు." జైమి. 1.84.

**కొలక్రోల**

కొలత కఱ్ఱ.

"ఈ వారి విస్తార మింత యనా నని నల్వ, కొల్చి తివ్వని కొలక్రోల యనఁగ..." సుద. 1.102.

**కొల గట్టుకొను**

హత్యాపాతకమును కట్టుకొను.

"కొలగట్టుకొనె వియోగుల వేచి మరుఁడు."

వర. రా. కిష్కి. పు. 395. పం. 18.

**కొలగాడు**

ధాన్యాదులు కొల్చువాడు.

శ. ర.

**కొలగారము**

ధాన్యం కొలిచినందుకు ఇచ్చే కూలి.

బ్రౌన్.

**కొలదికి మించు**

అపరిమిత మగు.

"కొలఁదికి మించు కెంజిగురు గుత్తుల మొగ్గలఁ బుష్పగుచ్ఛకంబులఁ బువుఁ దేనెఁ బుప్పొడుల..." కళా. 1.118.

**కొలదికి మీఱు**

అధిక మగు.

"తలఁపు గొలఁదికి మీఱెన్."

భార. ద్రోణ. 2.229.

**కొలది గడచు**

గడువు ముగించు.

"తలఁపఁగ రిపులకు నిమ్మగు, కొలఁదిఁ గడచి వచ్చితిమి." భార. విరా. 4.93.

**కొలది మిగులు**

అపరిమిత మగు; అధికాధిక మగు.

"జగము లెల్ల నిచ్చు సాలక మల్లడి, గొనియె గుహబలంబు గొలఁది మిగిలి." కుమా. 11.12.

**కొలది మీఱు**

అపరిమిత మగు.

"కొలఁది మీఱు కడుపుఁ గుడువ మియఁగను." భార. అను. 5.263.

**కొలది యిడరాని**

అపరిమితమైన.

"కొలఁది యిడ రాని యొక వింత చెలువు గలిగి." పారి. 1.78.

**కొలది వెట్టు**

1. ఇంతా అని చెప్పు.

"...జలనిధులుం, బరఁగిన దీవులు వర్షము, లరయంగాఁ గొలఁది వెట్ట నలవియె?" భాగ. 5.211.

2. క్రిందుపఱచు.

"పాండవుల నడి సన్న యొడళుల టెక్కియ, మ్ముల పెంపు గగనంబుఁ గొలఁది వెట్టె." భార. విరా. 3.167.

**కొలదివేరు**

వట్టివేరు.

కుమా. 5.139.

**కొలనాడు**

స్నానము చేయు.

"కై సేసి కొలనాడఁ గదలుభంగి."
కాశీ. 2.86.

కొలనికి కాపుండు
నిష్ప్రయోజన మగుకార్యము చేయు.
గువ్వలచెన్న. 13.

కొలపగ
కులవిరోధం.
"తీరని కొలపగయుంబలె, నీ రమణికి నాకు నెనయదు."
వేం. పంచ. 3.195.

కొలపగతురు
జాతివైరులు.
"కొలపగతురు గారె యాచకులు లోభులకున్."
వేం. పంచ. 2.141.

కొల పెట్టు
కొలుచు.
వరాహ. 12.43.

కొలముసాములు
కులస్థులు, ఒకే జాతివారు. అనగా చుట్టము లనుట.
"కొలము సాము లటంచుఁ గూడి రాకుండను, బాదాంగదమ్ములఁ బరిహరింపు."
రాజగో. 2.14.

కొల యొనర్చు
హత్య చేయు.
కొలై –(తమి) కొలె (కన్న) హత్య అని అర్థము.
"నీ వేము కొల యొనర్చితి, వీవగ నది సోక డగుచు నేచఁ దొడంగెన్."
శుక. 1.324.

కొలవేరు
వట్టివేరు.
సమా. 5.149.

కొలసామి
జాతిపెద్ద.
కేయూర. 3.150

కొలారుబండి
పై కప్పున్న బండి.
శుక. 1.271.
చూ. కొల్లారుబండి.

కొలికికి వచ్చు
ఒక రూపమునకు వచ్చు.
"కార్యంబును గొలికికి వచ్చినది."
వీర. 3.54.
"చిలుకల కొలికిం గనుఁగొన్న నొక్క కొలికికి వచ్చున్."
విప్ర. 2.44.
"వాడి మేనమామ వచ్చిన తరవాత గాని యీ వ్యవహారం ఒక కొలికికి రాదు."
వా.
ఇట్లే : కొలికికి తెచ్చు.

కొలికిపూస
ప్రధాన మైనది, ముఖ్యము.
"ఇందులో ఈ పద్యం కొలికిపూస."
రూ. కొల్కిపూస.

కొలు వగు
కొలువు తీరు.
"ధవళాక్షుల్ భజియింప నిండు కొలు వై."
పాండు. 1.21.

కొలు విచ్చు
దర్శన మిచ్చు.
"కొలు విమ్ము రాజన్యకోటికి నెల్ల."
వర. రా. అయో. పు. 307. పం. 20.

**కొలువుండు**

కొలువు తీరు.

"ఆస్థానమ్మునఁ గొలువుండి." హైమ. 3.5.

**కొలువుగొను**

కొలుచు.

"నన్నుం గొలువు గొని నీ రిందు నిలుచుట." దశ. 11.58.

2. కొలువు తీర్చు.

"ప్రజ గొలువుగొనన్." సాంబో. 2.37.

**కొలువు చాలించు**

సభ చాలించు.

"కొలువు చాలించి శచీకాంతుఁ డంతఃపురంబున కరిగె." నిరంకు. 4.48.

**కొలువు పట్టు**

సేవించు.

"వలదు సీత నిచ్చి నలినాప్తకులనాథు, కొలువు పట్టి యిల్లు నిలుపుకొనుము." రామా. 7.74.

**కొలువు సింగార మగు**

సభకు తగిన యలంకరణము చేసికొను.

"ఈదారి రాజగోపాల శౌరి చెలువు పొంగార కొలువు సింగార మై పదారు వన్నె బంగారు కొలువుకూటంబునకు వచ్చి..." హేమా. పు. 5.

**కొలువు సింగారము చేసికొను**

సభకు వెళ్ళుటకు తగినట్లుగా అలంకరించుకొను.

ఒక్కొక్క సమయానికి తగిన వేషధారణము సహజము. సమయములో రాజాస్థానాలకు వెళ్ళినప్పుడు ప్రత్యేకమైనది - శిష్టమైనవేషం ఉంటుంది.

"కలభాషిణియు... వేగంబ కొలువు సింగారంబు సంఘటించుకొని కృష్ణ నగరి కరిగె." కళా. 1.208.

**కొలువు సేయు**

సభ చేయు.

సాంకు. 1.181.

**కొలువు సేసికొను**

నౌకరీ సంపాదించుకొను.

"కని కొలువు సేసికొని మా, లిని నాఁ జని..." భార. విరా. 1.106.

**కొలు వొసఁగు**

దర్శన మిచ్చు.

"ఒకవేళ యవన చోళ కళింగ శక వంగ, గూర్జరుల్ గొలువంగఁ గొలు వొసంగు." శుక. 1.355.

**కొల్పొడు చేతులు**

నమస్కారములు.

హంస. 4.212.

**కొల్ల కొల్ల**

చాలినంత.

"...నుడువు లపుడు, చెల్ల వో యేమి చెప్పుదుఁ గొల్ల కొల్ల." రాధ. 2.140.

"పది రూపాయ లయితే సంత ఖర్చుకు మనకు కొల్ల కొల్ల." వా.

**కొల్ల పెట్టు**

1. కొల్లగొట్టు.

కాశీయా. 244.

2. కొల్లగొను.

"అఖిల తీర్థంబులును నాడి యవని
సురుఁడు, కోర్కెమైఁ బుణ్యాలత్తుల్లఁ
గొల్లవెట్టె." కాశీ. 3.91.

3. ముఖ్యంగా రాయల
సీమలో దీనినే పాడు చేయు
అనే అర్థంలో ఉపయో
గిస్తారు.

"ఇంట్లో ఆస్తంతా కొల్లపెట్టినాడు." వా.

"కోడలు అత్త చచ్చిన నాలుగునాళ్లకే
తనవాళ్లకంతా ఇల్లు కొల్ల పెట్టింది." వా.

3. ఏదో ఏప్పు.
విసుగూ, అసంతృప్తిని
సూచిస్తూ వంట ఏం చేయాలి
అని కోడలు అడిగినప్పుడు
అత్త అంటుంది.

"ఏదో ఒకటి కొల్లపెట్టమ్మా! న
న్నెందుకు చంపుతావు?" వా.

**కొల్లబోవు**

పాడగు.

"నా తపము భక్తిం బాడు గాకున్నె
యేఁల విచారింపఁగ నెల్లయుఁ బ్రతము
కొల్లంబోయినం జూచెదన్."

**కొల్ల లాడించు**

కొల్ల గొట్టించు.

"గోవిందు బీరంబుఁ గొల్ల లాడింతు."
గౌర. హరి. ప్రథ. పంక్తి. 1146.

**కొల్లలాడు**

కొల్ల గొట్టు.

"భావజుపత్తు నై మిగుల బాలిక తాలిమిఁ
గొల్లలాడెడిన్." కళా. 6.248.

"పరిజనంబులు పరిపక్వఫల సుగంధ,
కుసుమరసపల్లవంబులఁ గొల్లలాడి."
శుక. 1.375.

**కొల్ల లిడు**

కొల్ల పెట్టు.

బ్రౌన్.

**కొల్లలు కొమ్ములు పోవు**

ఎక్కువ యగు.

"...ఐహిక భూరి సుఖంబు గొల్లలుం,
గొమ్ములు వోవఁగాఁ బనిచె గోమినిశక్తి
కుమారుఁ డర్థితోన్."
దశకు. 10.111.

**కొల్లలు మీఱు**

ఎక్కువగు.

"కురవకమునఁ గలుగఁ జేసెఁ గొల్లలు
మీఱన్." రుక్మాం. 3.129.

**కొల్ల వట్టు**

కొల్ల గొట్టు.

"గుట్టునఁ గోరిక లెల్లం గొల్ల వట్టె."
తాళ్ల. సం. 3.256.

**కొల్ల విడుచు**

చూఱ విడుచు, విస్తారముగా
నొసగు.

"కమ్మరావంబు కడవలు కొల్ల
విడుచు." శివ. 2.40.

"ఉన్న ధనముఁ, గొల్లవిడిచిన
బ్రాహ్మణు లెల్లఁ దనిసి." జైమి. 1.73.
చూ. చూఱ విడుచు.

**కొల్ల వెట్టు**

దోచుకొను.

"వేల్పు లుద్ధతిఁ బాఱి రాజనివాసముం
గొల్లపెట్టి సమస్తవిత్తముఁ గ్రూరతం
గొని పోవఁగా." భాగ. 7.225.

**కొల్లాడు**
కొల్లగొట్టు, తనివి దీర అనుభవించు.
"కొ, ల్లాడిరి కైవల్యలక్ష్మి నమరులు మునులున్."
కాశీ. 2.37.

**కొల్లాయ (యి) గుడ్డ**
షష్టి పంచ, చిన్న పలుచని తుండు.

**కొల్లాయ (యి) పంచ**
చూ. కొల్లాయగుడ్డ.

**కొల్లారుబండి**
కప్పున్న బండి.
"పావలటు మీటి కొల్లారు బండి యెక్కి, దురదురన రంభ యింటికి నరిగె."
కవల. 4.213.
రూ. కొల్లార్బండి.

**కొల్లేటి చేంతాడు**
సుదీర్ఘమైనది.
చూ. కొండవీటి చేంతాడు.

**కొల్లేటి మడుగు**
పెద్దది, అంతము లేనిది.

**కొల్లేటి వ్యవసాయం**
లాభము లేనిది, వ్యర్థము.
"అదంతా కొల్లేటి వ్యవసాయం. దాని వల్ల లాభం యేముంది?" వా.

**కొల్చిపోయు**
వెచ్చించు.
"కాలగతులను, బోరి నాయుష్యముఁ గొల్చి పోయుచున్నా రయ్యా!"
తాళ్ల. సం. 7.33.

**కొల్వుండు**
కొలువు దీఱు, సభ తీరి యుండు.
"ఉభయ వాదులను గొల్వుండి పిల్పించి."
పండితా. ద్వితీ. మహి. పుట. 128.
నిరంకు. 1.7.
రూ. కొలువుండు.

**కొల్వు విచ్చు**
సభ చాలించు.
"గుండె జల్లనఁ జేతికలితంబు వైచి, పంపఁగ బొమ్మని దేవపతి గొల్వు విచ్చె." గౌ. హరి. ప్రథ. సం 318-19.

**'క్వొశ్చన్ మార్కు' మొగం పెట్టు**
ప్రశ్నార్థకంగా చూచు.
చాలా ఇటీవలి పలుకుబడి.

**కొఖ్ఖు కొఖ్ఖున దగ్గు**
ధ్వన్యనుకరణము.
"కొఖ్ఖు కొఖ్ఖున దగ్గుచో..."
విప్ర. 4.19.

**కోక చాకియింట వేసి కొక్కెరాలివెంట పోవు**
ఒకచోట పడవేసి మరొక చోట వెదకు.
స్వార్థప్రయత్న మనుట.
తాళ్ల. సం. 8.175.

**కోక వాక**
బట్ట, పాత. జం.
"మునుమున్న సెలిసి యీమూది వరాటము నక్కె, కొంచురా లే సైతిఁ గోక వాక."
నిరం. 2.123.
రూ. కోకా వాకా.

**కోకా వాకా**

జం.

బట్టా బాతా.

రూ. కోకవాక.

**కోచవాఱు**

భయపడు.

"వేల్పు, రాచవారలు నా కత్తిఁ
గోఁచ వాఱు, నితఁ డనఁగ నెంత."

చంద్రా. 3.33.

నేటికీ రాయలసీమలో 'కోచ
నాయాలు' పిఱికిపంద అనే
అర్థంలో ఉపయోగిస్తారు.

**కోటకొమ్మ**

దుర్గప్రాకారం పైభాగము.

ఆము. 2.5.

**కోట బలసికొను**

కోట కావలి కాయు, దుర్గ
సంరక్షణ చేయు.

"లెక్కకు నెక్కుడగుచు విక్రమాట్టో
పంబునఁ గోట బలసికొనుటయు..."

కళా. 8.75.

**కోటరము చేయు**

అత్తవారింట కాపురము
చేయు.

కోడంట్రికము చేయు.

"అరయమిఁ జేసె నమ్మహా, పురుషుని
పాలికిన్ బతులు వోవఁగ వీరలతోన
యేను జె, చ్చెరఁ జని కోటరంబు దగఁ
జేయుదునో."

భార. ఉద్యో. 3.112.

**కోటలో కొల్ల వంకదారలో పోయినట్లు**

ఒకచోట వచ్చిన లాభం
మఱొక చోట పోవుపట్ల
ఉపయోగించే పలుకుబడి.

కోటలో కష్టపడి దొంగతనం
చేసి తెచ్చిన సొమ్మంతా
వంకలో కొట్టుకొని పోయి
నట్లు.

"ఇంత చెప్పినచో దమయంతి నిచ్చు,
టెంత ఘన మిఁకఁ జెప్పఁగా నేల నీతి,
కళలతను జూడుఁ గోటలోఁ గొల్ల
వంక, దారలోఁ బోయినట్టి విధంబు
గాదె."

నలచ. 4.68.

**కోటలో పాగా వేయు**

రాజానుగ్రహము సంపా
దించు; కార్యానుకూలతను
సాధించు.

ఏదైనా విశిష్టమైన కార్యం
నిర్వహించినప్పుడు రాజాస్థా
నాల్లో పండితులకు శాలువా
వలె పాగా నొకదానిని ఇచ్చే
వారనీ, దానిని పాగా
వేయుట అనడం కల దనీ,
ఇలాంటి అలవాటు మొన్న
మొన్నటిదాకా బొబ్బిలి
ఆస్థానంలో ఉండే దనీ
అక్కడి మిత్రు లొకరు చెప్పి
నారు.

శత్రులు కోట లగ్గపట్టినప్పుడు
ఉడుముతోకకు పాగా కట్టి

కోటపైకి ఓసరి వేసి ఆ పాగాను పట్టుకొని పైకి వెళ్ళి పోవుట కలదు. దానిద్వారా వచ్చిన పలుకుబడి అయినా కావచ్చును.

"వాడు కోటలో పాగా వేశాడు. ఇంక వాడి ప్రభ వెలుగుతుంది అన్న మాటే." వా.

కోటానకోట్లు

1. విపరీతముగా, అసంఖ్యాకముగా.

"లక్షోపలక్షలు శాఖోపశాఖలుఁ గోటానకోటులు సంఖ్యాతిసంఖ్యలుగా నడుచుసమయంబున."

హంస. 3.29.

"... పూతాతిథి శ్రోత్రంబులగు బ్రాహ్మణ గృహవాటికలు దాఁటి కోటానగోటులైె కోటకొమ్మల యందు..." కళా. 2.150.

కోటా పేటాగా ఉండు

అనుకొని, కలిసి ఉండు.

పూర్వం కోటలు, వాని ప్రక్కనే పౌరులుండే పేటలూ ఉండేవి.

"సికింద్రాబాదూ హైదరాబాదూ కోటా పేటాగా ఉంటాయి." వా.

కోటికి పడగెత్తి టాటాలు గుణించు

కోటిని కోటానుకోట్లుగా చేయు.

"కోటికిఁ బడగెత్తి టాటాలు గుణియింప, నే నేర్తు." విప్ర. 4.28.

కోటికి పడగెత్తినవాడు

కోటీశ్వరుడు.

కోటి సంపాదించగనే తచ్చిహ్నంగా ఒక ధ్వజమెత్తు ఆచారం ఉండేది ఉంటుంది.

అట్లా వచ్చిన పలుకుబడి.

"కోటికి పడగెత్తిన వానిఁ, బదివేల కాపవై బ్రదుకు సున్నట్టు."

బస. 1.5.

"ఆన నిట్టి పలువయిఁఖవ్రుల, కను గోటికిఁ బడగ యెత్తి గుణి యగు పెద్దన్, నిను నమ్మరాదు గాక, ట్లొనరించితే యిట్టి లంచ మొసఁగనె నీకున్."

కళా. 7.27.

కోటి కొండలుగ

ఎక్కువగా; అత్యధికంగా.

"నృపుల పదహాలరేఖల కెల్ల మాఖ, జాగ్రహాలరేఖలే మాల మనుచుఁ గోటి, కొండలుగ ధాన్యరాసులు పండ వీట, సుజనభజనైకవిఖ్యాతి శూద్రజాతి."

ఆము. 2.27.

కోటిపడగలు

కోటిధనం ఉన్నవా రెల్లా ఒక ధ్వజం కట్టేవాడు పూర్వం. అదే కోటికి పడ గెత్తుట. ఆ ధ్వజాలే కోటి పడగలు.

"నలిఁ గోటి కోటిపడగలు, గలిగొనఁ గట్టినను వానిఁ గాదని మదిలోఁ, దలఁప రసంఖ్యార్థ ధ్వజములు గట్టినవారు వైశ్యముఖ్యులసేపల్."

కుమా. 7.118.

కోటి సేయు

అమూల్యమగు.

"సాటి లేనినగళ్లు కోటి సేయ."
విజయ. 1.23.

**కోటేరుముక్కు**

చక్కని ముక్కు.

సేద్యంలో కోటేరు వేసి నప్పుడు ఎప్పుడూ చాలు తిన్నగా ఉంటుంది. అందుపై వచ్చిన పలుకుబడి.

"ఆవిడ చాలా అంద మైనది. చేరెడు కండ్లు, కోటేరు ముక్కు, నిమ్మపండు రంగు." వా.

**కోటేరు వెట్టు ముక్కు**

చక్కని ముక్కు.

"కోటేరు వెట్టు చెన్ను మీటిన ముక్కు."
వర. రా. అయో. పు. 252. పం కి. 3.
చూ. కోటేరు ముక్కు.

**కోట్యంతరాలుగా**

కోట్లకొలదిగా.

కాశీయా. 276.

**కోడంగి యాటలు**

కోణంగిఆటలు.

ఆనందోత్సాహంతో ఎటు పడితే అటు ఆడుతూ ఎగు రుతూ ఉన్నా రనుట ఇట ప్రస్తుతము:
పండితా. ద్వితీ. పర్వ. పుట. 434.

**కోడాడు**

కుమ్మి కోరాడు.

"అమ్త్రాని శూలంబు చే, గొని నారాయణప్రాణముల్ రణములోఁ గోడాడఁ జూడన్."
ఉత్త. హరి. 6.45.

"అ శ్వేదండంబులు...కోడాడు చుండ." నృసిం. 4.47.

**కోడికునుకు**

ఆరనిద్ర.

కోడి సగం కండ్లు మూసి నిద్రిస్తుంది.

"వాడిది కోడికునుకు. ఎప్పుడు పడితే అప్పుడే మేలుకుంటాడు." వా.
చూ. కోడినిద్ర.

**కోడి కూసినదాక**

తెల్లవారేదాక.

"కోడి కూసిన దాకా నిద్ర పట్టలేదు." వా.

**కోడి కూసే పల్లె**

ప్రతి పల్లె.

"అంగరంగ వైభవములు నుం, దిర మగును దేవళంబులఁ, బరఁగఁగ నొక కోడి గూయుపల్లియ నైనన్."
విప్ర. 1.60.

"కోడి గూసేపల్లె ఉం దంటే కోమటి ఉన్నా డన్నమాటే." సా.

**కోడి గ్రుడ్డంత**

కొంచెము.

"కోడిగ్రుడ్డంత యన్నమ్ము కొసరి నొసఁడు." గుంటూ. ఉత్త. 15.

**కోడిగ్రుడ్డుకు తంటసమా**

ఈ మాత్రానికి అంత అవస్థ పడవలెనా?

కోడిగుడ్డు పట్టుకొనుటకు తంటసము కావలెనా అనుట.

తంటసము అంటే ముక్కులోని వెంట్రుకలు లాగుటకై

మంగలి ఉపయోగించే పని ముట్టు. వెంట్రుకవంటి అతి సూక్ష్మ మయినదానిని పట్టు కొనుటకే తంటసం కావాలి కానీ ఇంత లావాటిదానికి ఎందుకు?

కోడినిద్ర
అరగన్ను మూతతో నిద్రించే నిద్ర.
"వాడి దెప్పుడూ కోడి నిద్ర. కండ్లు చూస్తే నిద్ర పోతున్నాడో మేలు కున్నాడో తెలీదు." వా.
ఎప్పటికప్పుడు మేలుకొంటూ జాగ్రత్తగా ఉంటాడనే సందర్భంలో కూడా ఉప యోగిస్తారు.
మా. కోడికునుకు.

కోడిఱెప్ప పెరుగు
కనుఱెప్పపై దుర్మాంసం పెరిగే నేత్రరోగము వచ్చు.
బస. 3.74. పుట.

కోడెకాడు
యువకుడు.

కోడెగాడ్పు
మందమారుతము.

కోడెత్రాచు
వయసులో ఉన్న త్రాచు పాము.
"కోడెత్రాచును ముద్దులాడినట్లు." వేమ.

కోడె లమ్మెడు పాటి పరికరము కలదా?
ఆ మాత్రం పశుసంపద కలదా? అనుట. ఆ రోజు లలో పశువులు కూడా ప్రధాన మైన ధనమే.
"పరికరము కోడె లమ్మెడు పాటి గలదె." ఉ. హరి. 4.308.

కోడెవయసు
పడుచుప్రాయము.
"...కోడెవయసు, పాక ముజ్జూలే లూగాడు భార్యమీఁద, మనసు చాలించి..." హంస. 5.115.

కోడెవిటులు
పడుచు విటులు.
హంస. 1.212.

కోడెవెధవ
పడుచు వితంతువు.
"కామాంధల్ వెలనాటి కోడెవిధ వల్." క్రీడా. 209.

కోణంగిచేష్టలు
కోతిచేష్టలు.

కోణంగి యాట లాడు
కోతి చేష్టలు చేయు, కొంటె చేష్టలు చేయు.
"నటులు చూపిన విద్య నటులఁ గా దంచుఁ దా, నడ్డమై కోణంగియాట లాడు." రాజగో. 5.45.
కోణంగి—వీధి భాగవతా లలో హాస్యగాడు. దాని మీఁద వచ్చిన పలుకుబడి.

**కోణాలగొంది**

ఒక మూల.

"మతాంతరాళ విశాల వేదులయందుఁ
గోణాలగొంగిఁ దపంబు సల్పుజనంబు."
పాండు. 5.296.

**కోత కోయు**

చీట్లాటలో మిగతవారు వేసిన రంగుముక్క లేనప్పుడు తన దగ్గర ఉన్న తురుపుముక్క వేస్తే అది కోత కోయడం అవుతుంది. ఆ పట్టు వానికే పోతుంది.

చూ. పైకోత కోయు.

**కోతలరాయడు**

డంబాచారి.

మాటా. 65.

**కోతలు కోయు**

డంబాచారములు పలుకు, గొప్పలు చెప్పుకొను.

సాక్షి. 13 పు.

**కోతికి కొబ్బరికాయ అబ్బినట్లు**

ఎంత అమూల్యమైనా ఉపయోగించుకునే యోగ్యత లేనప్పుడు దొరికీ ఏం లాభం? - అనుపట్ల ఉపయోగిస్తారు.

"ఆ ఆడంగుల వెధవను అంత అందమైన పిల్లనిచ్చి చేశారు. కోతికి కొబ్బరికాయ అబ్బినట్లుగా ఉంది వాడి పని."
వా.

చూ. కోతిచేతి కొబ్బరికాయ.

**కోతికి కొబ్బరికాయ చిక్కినట్లు**

అనుపభోగ్య మనుట.

కోతికి కొబ్బరికాయ దొరికినా అది అనుభవించ లేదు కదా! అది యెట్లా పగలకొట్టి తినాలో దాని కేం తెలుసు?

చూ: కోతికి కొబ్బరికాయ అబ్బినట్లు.

**కోతికి స్త్రీవేషము**

అతకనిది.

కోతి వికారమైనది. దానికెంత స్త్రీవేషం వేసినా కుదరదు అనుట.

గువ్వలచెన్న. 75.

**కోతికుళ్లాయి**

చలి తగలకుండా వేసుకొనే ఉన్ని తలటోపీ.

**కోతికొమ్మచ్చు లాడు**

పెద్ద వారితో పరియాచకమాడు; ఒక ఆట ఆడు.

కోతి కొమ్మచ్చు లనేది ఒక విధమైన పిల్లలాడుకొనే ఆట. చెట్లమీదనే దొంగకు అందకుండా తప్పించుకొంటూ చెట్టు మొదలు పట్టుకోవాలి. వేసవికాలంలో నేటికీ యీ ఆట పల్లెలలో పిల్లలాడుతూ ఉంటారు.

"నీ అంత పైక్కడ? నా అంత పైక్కడ? నాతో కోతికొమ్మచ్చు లాడుతున్నా వేమిటిరా?"
వా.

కోతిచేతి అద్దము

చూ. కోతిచేతి కొబ్బరికాయ.

కోతిచేతి కొబ్బరికాయ

ఉపయోగించుకో లేనివానికి అమూల్యవస్తువు లభించి నష్టమగు అనే మాట.

కోతికి కొబ్బరికాయ దొరికితే దాన్ని పగలగొట్టి తినడం తెలియదు కదా!

"ఆ వెధవకు అంత మంచి పిల్ల దొరికి మాత్రం ఏం లాభం? కోతిచేతి కొబ్బరికాయ." వా.

కోతిచేతి పూలమాల

ఉపయోగం తెలియని వారికి చిక్కిన అమూల్యవస్తువు.

"కటకటా! మూర్ఖ మర్కటకరతలస్థ, కల్పతరు సూనమాలికా కల్పుఁ డగుము." శుక. 1.364.

చూ. కోతిచేతి కొబ్బరికాయ, కోతి చేతి అద్దము.

కోతిచేష్టలు

పిచ్చిచేష్టలు.

"ఏమిట్రా! ఆ కోతిచేష్టలు. ఇంత పెద్ద వాడవైనా యింకా మట్టూ మర్యాదా తెలియక పోతే యెలా?" వా.

కోతిని బ్రహ్మరాక్షసుని చేయు

అల్పులను అధికులుగా పొగడు.

"వీరధర్మ మిట్లు విడిచి విభీషణు, రాజు సెదుట దాశరథులఁ బొగడఁ, బాడి గాగునె కోఁతి బ్రహ్మరాక్షసుఁ జేయ, వచ్చినాఁడ వెంతవారు వారు." భాస్క. యుద్ధ. 119.

కోతిపుండు బ్రహ్మరాక్షసి

చిన్న దానిని అనవసరంగా పెద్ద దగునట్లు చేయు పట్ల ఉపయోగించే పలుకుబడి.

పుండును గోకుక కోతికి కోతులు పెద్దవి చేసుకుంటూ యని ప్రతీతి.

"ఆ చిన్న వాగ్వాదం కాస్తా కోతి పుండు బ్రహ్మరాక్షసి పోకొట్టు దాకా వెళ్లింది." వా.

కోతిపుల్లలు

సుగంధ సారాలను మీదికి సాగిలించే పుల్లలు.

బ్రౌన్.

కోసకావలి

వ్యర్థము.

కోసకు కావలి కాయడం ఎందుకు అనుటపై వచ్చినది. శివజాగరణం లాంటిది.

కోసచీకటి

చిమ్మచీకటి.

"కోసచీకటిలోని కొనరఁ జొచ్చి." కళా. 4.121.

కోసకిస్కా

ఏం చెవడు? యః కశ్చన.

"క్రుద్ధుం డగు భీష్ముముందు కోన్కిస్క గజశ్రద్ధుండు కర్ణుఁ డే నుగు." గిర. గురు. 45.

చూ. కశ్చనగాళ్ళు.

**కోపకత్తె**

కోపిష్ఠి.

"సుక్షత్రియ కులంబు నిక్షత్రముఁగఁ జేయు, కొడుకుఁ గాంచినయట్టి కోపకత్తె." క్రీడా. 129.

**కోపగాడు**

కోపిష్ఠి.

"అన్న మీ తండ్రి కోపగాఁ డౌనా కాదా." కాశీ. 4.90.

**కోపదారి**

కోపిష్ఠి.

"బావ ప్రతికూలుఁడు నాథుఁడు కోపదారి." చెన్న. బస. 4.277.

"మా తమ్ముడు చాలా కోపదారి. నాతో ఏమన్నా అందువు గానీ ఈ మాట వానితో అనేవు. భద్రం!" వా.

కోపధారి అను పాఠము సరి కాదు.

**కోపము ఆఱు**

కోపము తీఱు.

కోపమును అగ్నితో సమానముగా భావించుటచేత వచ్చిన పలుకుబడి.

"దీని గ్రమింగక వృథా వసియించినఁ గోప మాఱునే." కా. మా. 2.101.

చూ. కోపము చల్లాఱు.

**కోపము చేసుకొను**

కోపించు.

"వాడు నామీద చాలా కోపం చేసుకున్నాడు." వా.

**కోపము పట్టలేక పోవు**

కోపమును అణుచుకొనలేక పోవు.

"ఎంత వద్దన్నా కోపం పట్టలేక వాడు నాలుగూ అనేశాడు." వా.

**కోపము పుట్టు**

కోపము కలుగు.

"పురభేదికిఁ గోపము పుట్టి వీఁడు నన్నెంచుకయేనియుం దెలియఁడు..." కా. మా. 4.186.

**కోప మెత్తు**

కోపించు, కోపము వహించు.

"కారవులు సేయు నవమతికారణముగఁ, గోప మెత్తు." భార. శాంతి. 1.13.

"పెండ్లివారలఁ జూడ నా పిన్నతనము, గూల నింతటిలో వట్టి కోప మెత్తి, తలుపు బిగియించె మగఁడు." శుక. 2.131.

**కోపమే కూడుగా కుడుచు**

అతికోపిష్ఠి యగు.

"కోపమే కూడుగాఁ గుడిచిన యీ బుద్ధి, కోపము విడువు మంటే గుణ మేల మాను." తాళ్ల. సం. 10.18.

**కోపిష్ఠి**

చూ. కోపదారి.

**కోపుదారుడు**

సరుకు బైటనుండి తెచ్చి అమ్మువాడు. శ. ర.

**కోపు మీఱు**

ముందంజ వేయు.

"ఏలికలు వెంట వెస నంట నేపు రేఁగి, కోపు మీఱి జవోద్వృత్తిఁ గూడఁ బఱచి." శుక. 1.259.

**కోపులు కల్పించుకొను**

రకరకాల అంగభంగిమలు చూపు.

"నట్టువకాని యందము గాక వింతగాఁ,
గోపులు గల్పించుకొనుచు నాడు."
శుక. 3.14.

### కోపు లెత్తు

దండెత్తు.

"భటరోషశిఖిశిఖప్రభల గ్రమింగి బలారి,
కులిశధారలమీఁదఁ గోపు లెత్త."
సాంబో. 5.203.

### కోమటినిజము

అసంభవము. వ్యాపారస్తుడు నిజం చెప్పడం ఎలా సంభవ మనుట పై వచ్చినది.

చూ. కోమటిసత్యము.

### కోమటిమాటలు

అటూ యిటూ తేల్చకుండా మాట్లాడే మాటలు.

"నువ్వు యిస్తావా లేదా? స్పష్టంగా చెప్పు. ఈ కోమటి మాట లన్నీ యెందుకు?" వా.

### కోమటిమైత్రి

నమ్మరానిది.
వ్యాపారి ఎప్పుడూ తనలాభం చూచుకుంటా డనుటపై వచ్చినది.

గువ్వలచెన్న. 67.

### కోమటిరహస్యం

వాడు రహస్యం అనుకున్నా ఇతరులకు స్పష్టంగా తెలియు నది.
'కొండమీద కోట్లాట ఏమిటిరా అంటే కోమట్లు రహస్యం మాట్లాడుకొం టున్నారు అన్నా డట.' సా.

"నీ వేదో రహస్యం రహస్యం అని చెప్పావు. నేను వెళ్లేసరికి ఊరంతా అదే చెప్పుకుంటున్నారు. ఇదంతా కోమటిరహస్యంగా ఉందే." వా.

### కోమటివిశ్వాసము

నమ్మరానిది.

చూ. కోమటిమైత్రి.

### కోమటిసత్యము

అసంభవము.
కోమటి వర్తకంలో సత్యంగా యిది యింతే నని చెప్పినా అది నిజమై ఉండదు.

రాధి. 4.79.

చూ. కోమటినిజము.

### కోమటిసాక్ష్యం

అటూ యిటూ కాకుండా చెప్పే సాక్ష్యం.
ఒక గుఱ్ఱం ఎవరిది అన్న తగాదా వచ్చి యిద్దరు రాజుగారి దగ్గరకు వెళ్లారు. అందులో సాక్ష్యంగా వచ్చిన ఒక వైశ్యుడు ముందువైపు చూస్తే రంగన్నది వలెనే ఉన్న దనీ, వెనకవైపు చూస్తే రామన్నది లాగే ఉన్న దనీ చెప్పా డని ఒక కథ. అలా వచ్చిన పలుకుబడి.

"నీవు ఏదో ఒకటి తెగ జెప్తా వని వస్తే కోమటిసాక్ష్యం చెప్తా వేమిటి?"
వా.

కో యని యార్చు

1. కూత వేయు.

ధ్వన్యనుకరణము.

"కో యని యార్చినం జెసలఁ గుంజర ములఁ్ సెదరెన్." కా. మా. 2.35.

2. అఱచు.

"గురుతర లీల పద్మ మది కో యని యార్చుచు నుండె."

గుంటూ. ఉత్త. 30.

అఱచుటలో ధ్వన్యనుకరణము.

"నింగి కయి కుంచె యెత్తి వెసం కో యని యార్వ." మను. 4.59.

కోరకొండె

వంపుగా ముడివేసిన సిగ.

శ. ర.

కోరకొప్పు

ముడి వేసి ఒక ప్రక్కగా వెంట్రుకలలో దూర్చి ఓరగా పెట్టిన కొప్పు.

కుమా. 8.143.

కోరకొమ్ము

వంపుగా వాడిగా ఉన్న కొమ్ము.

"హోమకుండముల పై కుతికి కొంకర, కోరకొమ్ములఁ గోరాడుఁ గొంత తడవు." వరాహ. 11.76.

కోరగోను

కొంకరలు పోవు.

"కాళ్లు నేలపైఁ ద్రొక్కఁగ రాక కోర గోని తొట్రుపడంగ."

పద్మ. 3.79.

కోరచూపు

క్రూర మైన చూపు.

"కోరచూపుల యెఱ్ఱ చేర గ్రుడ్డుల వాఁడు." వరాహ. 2.45.

కోరదౌడ

చప్పిదౌడ.

భార. మా. 25.

కోరపాగ

వాలుగా చుట్టిన పాగా.

కోరమీస

చూ. కోరమీసములు.

కోరమీసము

చూ. కోరమీసములు.

కోరమీసములు

పొడుగాటి మీసాలు.

"మనుజ రక్త సిక్త తనువును గోరమీ, సములు..." భార. అశ్వ. 3.87.

కోరలు తీసిన పాము

ఏమీ చేయ లేని వాడు – లేనిది – తన శక్తిని చూపగల సాధనమును కోలుపోయిన వారి పట్ల ఉపయోగించే సామ్యం.

"వెడగొడ్డుఁ బులి నాకి విడచిన శైవ, జడిసి తొల్లిటి తన జంజాట మెల్ల, నుడిగి కోఱలు లేనియురగంబుఁ బోలె, వడి చెడి..." గౌ. హరి. 2. భా. 973.

"ఉద్యోగం ఉన్నన్నినాళ్లూ మహా విజృంభించాడు. అది పోయే సరికి కోరలు తీసిన పాములాగా మూల బడి ఉన్నాడు." వా.

**కోరలు పెఱికి వేయు**

పొగ రణచు.

కోరలు పీకివేస్తే పాము ఏం చేయగల దనుటపై వచ్చినది.

మాటా. 52.

**కోరలు లేని ఉరగము**

ఏమీ చేయలేని దనుట.

గౌ. హరి. ద్వి. 975.

చూ. కోరలు లేని పాము.

**కోరవాఱు**

క్రూర మగు.

వరాహ. 3.20.

**కోరవోవు**

కొంకరవోవు.

పక్షవాతంతో పడిపోవు.

హరి. పూ. 7.171.

**కోరసిగ**

ఓరగా వేసుకొన్నముడి.

"కోరసిగ వేయుచోటనే కొమ్మ పుట్టి." రామా. 2.110.

**కోరాబంగారు**

తగ్గుబంగారు.

**కోరిక లిగురొత్తు**

కోరికలు కలుగు.

"నారదుండు పుణ్యకవ్రత, మారూఢిగ నాలుంగఁ జెప్ప నవహితమతి యై, కోరిక లిగురొత్తఁగ." పారి. 5.63.

**కోరిక లీడేరు**

కోరికలు తీరు.

"నా కోరిక లీడేరఁగఁ, గైకొనవలె నీవు." కా. మా. 2.14.

**కోరిక లీరిక లెత్తు**

కోరికలు కలుగు.

"ఎలమితోఁ గోరిక లీరిక లెత్తిన, సరణి మేఁ బులకలు జాదుకొనఁగ."

విక్ర. 1.122.

చూ. కోరికలు గంతులు వేయు.

**కోరికలు గంతులు వేయు**

కోరిక లధిక మగు.

".....మనంబులోపలం, గంతులు గోరి కోరికలు గంతులు వైవఁ గృషీవలాజ్ఞ..." శుక. 2.455.

చూ. కోరిక లీరిక లెత్తు.

**కోరికిపడు**

మోజుపడు.

"విని వీక్షించినదాఁక ముచ్చటపడున్ వీక్షించి గాఢోపగూహనలాభం బగుదాఁకఁ గోరికిపడున్."

మల్లభూ. శృ. 22.

**కోరువెట్టు**

బలి యిచ్చు.

"అరులకుఁ గోరు వెట్టితి కదా నినుఁ దమ్ముఁడ..."

రామా. 8.38.

**కోర్కుల నంద గసు**

మనోరథము నీడేర్చుకొనగలుగు.

"పారిజాతంబు నాప్రోలఁ బండియుండ, నందఁ గంటి నాకోర్కుల నందఁ గంటి." ఉ. హరి. 2.176.

**కోర్కుల పంట**

మనోరథసిద్ధి.

"ముం, గొంగుపసిండి భక్తులకుఁ గోర్కుల పంట, జగంబులందు మా..." అని. 1.42.

**కోర్కులు నిండించు**

కోరికలు తీర్చు.

"కోర్కులు నిండించు కూరిమి తన యుండు." గౌ. హరి. ప్రథ. పం. 61.

**కోర్టు కీడ్చు**

రచ్చ కీడ్చు; వ్యాజ్యం వేయు.

"కోర్టు కీడ్చుతా యేమొ నా కొంప దీసి." గుంటూ. ఉత్త. 119.

"పాపం దేవుడా అని పూల ఉన్న వాణ్ణి వాడు కోర్టు కీడ్చాడు." వా.

**కోర్టు కెక్కు**

వ్యాజ్యాలపా లగు

"వాళ్ల నాన్న చనిపోయి యింకా రెండు నెల్లయినా అయిందో లేదో ఆ అన్నదమ్ము లంతా కోర్టుకెక్కారు." వా.

**కోఅకొమ్ము**

వాడి గల కొమ్ము.

**కోఅడ మాడు**

హాస్య మాడు.

శుమా. 6.45.

**కోఅపల్లు**

కోఅ.

**కోఅలు తీసిన పాము**

చూ. కోరలు తీసిన పాము.

**కోఅలు దీటు**

పండ్లు కొఱుకు.

పాండు. 4.294.

**కోలం గొట్టిన తెఱగున**

అతి సంభ్రమంతో.

ఎవరో వెనుక కట్టను తీసుకొని తఱుముకొని వస్తున్నట్లు.

"కత్తులు గట్టి కోలం గొట్టిన తెఱంగున...తత్ప్రదేశంబు వెడలి..." హర. 2.28.

"నిల్వక వెల్వడెఁ గ్రక్కున సైన్యమెల్లఁ గోలఁ గొట్టినభంగిన్." జైమి. 4.108.

**కోలకు తెచ్చు**

విధేయముగా నొనర్చు.

కోలకు – కోపుకు తెచ్చుట అనగా ఎద్దులు మొదలయిన వానిని కాడి కట్టి విధేయముగా నొనర్చుట.

"కడలిఁ గోలకుఁ దెచ్చినగబ్బి వీవ." పారి. 1.49.

చూ. కాడికి తెచ్చు.

**కోలక్రోతులు**

కోతి కొమ్మచ్చి.

ఒక పిల్లల ఆట.

**కోలగగ్గెర ద్రోయు**

కూలద్రోయు.

"అసియుఁ జాత్రయుఁ జేఁ బంచి యాంత్రవల్లిఁ, గోలగగ్గర ద్రోయఁ దత్కుజముతోడ, నొరగి." ఆము. 6.27.

**కోలదివియ**

దివిటీకి మారుగా కాల్చి పట్టుకొనే వెలుతురు కట్టెల కట్ట. ఈ వెలుతురుకట్టెనే కొరిమిపాల అంటారు.

"కోల దివియల వెలుఁగు దిక్కులకు నిగిడి." దశ. 5.90.

"తలవరులు, కోలదివ్వెలవారుఁ గొంచు నవ్వీధి."
గౌర. హరి. ఉ. 2319.

"ఆలీలఁ గొరవి దయ్యంబులు దివ్వె, గోలలవారుఁగాఁ గొని గస్తు దిరిగి."
గౌ. హరి. ఉ. 1668.

## కోల మెఱుపు

నిలువు మెఱుపు.

"శివు దిక్కునందు వేకువఁ గోల మెఱుఁగులు, మెఱసె..."
హరి. పూ. 7.160.

## కోలలవారు

వేత్రహస్తులు.

## కోలాట గొడియలు

కోలాట మాడు కఱ్ఱలు, చిన్నచిన్న కఱ్ఱలకు బచ్చెన పూసి కోలాటంలో ఉపయోగిస్తారు.
పండితా. ప్రథ. వాద. పుట. 703.
చూ. కోలాటము.

## కోలాటము

కోలాట మనే ఆట.
చూ. కోలాటలు.

## కోలాటలు

చిన్న కోలాటం కఱ్ఱలతో చుట్టూ నిలిచి ఆడే ఆట. కోలాటం పాటలు కూడా మనకు చాలా ఉన్నవి.
చూ. కోలాటము.
పండితా. ద్వితీ. మహి. పుట. 179.

## కోలాస

ఉల్లాసము; పేరాస.

"కోలాస లేల చెప్ప కోసరఁ గుంచంబు, గొలఁబడ్డట్లగు."
బస. 7.198.

## కోలాసక్తి

మరాళి గలది.

"పుట్టినప్పుడు నేర్పు ముగ్గుల పోక, కోలాసక్తియు."
పండితా. పురా. పు. 122.

## కోలుకాడు

కాపలివాడు; బంటు.
విక్ర. 8.25.
హంస. 2.48.

## కోలుకొను

1. తేఱుకొను.

"కోల్కొన నీ, కనిశముఁ బోఁద్రోలు చుండు నమరగణంబుల్."
కుమా. 4.13.

"నరసూను నపుడు కర్ణుఁ, డిరు మూఁడు శిలీముఖంబు లెద నించిన నొచ్చి రయం బునఁ గోల్కొని రా,నరదముఁ దునిమెఁ బకేతుహయసూతముగన్."
జైమి. 7.

"దీప మడఁగఁ జీకటియును, గోప మడఁగ శాంతిగుణముఁ గోల్కొను క్రియ."
పాండు. 4.

ఇక్కడ వర్ధిల్లు అని అర్థం చెప్పినారు కోశకారులు.
శ. ర.

కాని అవసరం లేదు. తేఱుకొను అనుటే చాలు.

2. జబ్బుపడి గాని, మరే దెబ్బతిని గాని తిరిగి తొలి స్థితికి వచ్చు.

"కొంత మాత్రపు టీవిగా కింతలేసి, తలము తప్పిన యావులు తగనె యియ్యా, నిచ్చి మఱి కోలుకొన లేక యేపుదఱిఁగి,పోవఁ దెగడరె జనులు దుర్బుద్ధి యనుచు."

హరివ. 4.83.

"వ్యాపారంలో బాగా నష్టపోయి ఇప్పుడిప్పుడే ఆతను కోలుకొంటు న్నాడు." వా.

3. ఉత్సాహించు.

"వధించుటకుఁ గోల్కొన్న సన్నద్ధబుద్ధి." భార. ఉద్యో. 4.

కోలుకొలుపు

పురి కొల్పు, ప్రేరేపించు, ప్రోత్సాహపఱుచు. ఒప్పించు.

"రవిఁ దెత్తుమే నీకు రమణుండుగా నల,కూబరుఁ దెత్తుమే కోలుకొలిపి."

కమా. 6.17.

కోలుకోలన్నలు

కోలాటం.—ఒక ఆట.

హంస. 5.155.

కోలుతల సేయు

యుద్ధసన్నాహము చేయు. యుద్ధమునకు ప్రోత్సహించు.

"తనకెలంకులఁ గోలుతల సేసి తఱు మంగ." భార. భీష్మ. 1.268.

"ఉన్నచోటన కదలక యున్న ద్రోణ, భీష్ములును గోలుతల సేయఁ బెరిఁగి సేన, చంద్రుఁ డుదయింపఁ బెరిఁగిన శరధి యట్లు, తోడుతోడుతఁ బొంగారి మూడ నొప్పె."

భార. భీష్మ. 2.117.

కోలుపడు

1. పొంగలపాలగు.

"హరి భార్యలు బోయలచేఁ, బరిభవము బొంది కోలుపడిరి."

వి. పు. 8.283.

2. పోగొట్టుకొను.

"తమ సగపాలుఁ గోలుపడి దానిన యిప్పుడు గోరువారికిన్, సముచిత వృత్తి నిచ్చి." భార. ఉద్యో. 1.19.

కోలుపాటు

కోలుపోవుట.

కోలు పుచ్చు

కోలుపోవునట్లు చేయు.

కోలుపులి

పెద్ద పులి.

కోలుపోవు

పోగొట్టుకొను.

భీమ. 4.99.

కోలుమసగు

1. విజృంభించు.

"కోపనశాపనవ్యశిఖి గోల్మసఁగంగ నుగంది." పాండు. 2.57.

"కపిత యుగాంత రుద్రుగతిఁ గోలు మసంగినవాఁడు భీష్ముఁడు."

భార. భీష్మ. 1.138.

"కోలుమసంగాడు కోర్కుల వెను వెంట." భార. విరా. 2.315.

2. సంహరించు.
"తండ్రి యధ్వర విఘాతకు బారి సమ
రిన కొడుకు శంఖనఖాఖ్యుఁ గోలు
మసఁగి."
కకు. 2.118.

## కోలు ముందు

మొట్టమొదట.
మునుముందు.
"అయ్యబలమీఁద, నలిననాభుండు
కను వేసినాఁడు గానఁ, గోలు ముందుగ
నీవ చేకొనఁగ వలయు."
వరాహ. 11.52.

## కోలువడు

కోల్పోవు, పోగొట్టుకొను.
"దక్షప్రజాపతి దలఁ గోలువడఁ డె."
పండితా. ప్రథ. వాద. పుట. 685.

## కోలెముక

వెన్నెముక.

## కోలెమ్ము

వెన్నెముక.

## కోలెమ్ముక

వెన్నెముక.

## కోల్కొను

తేఱుకొను.
చూ. కోలుకొను.

## కోల్తల సేయు

చూ. కోలుతల సేయు.

## కోల్పడిపోవు

పోగొట్టుకొను.
"నిన్ను నమ్మి నాఁగుట్టును దేజమున్
మిగులఁ గోల్పడి పోయితి."
పారి. 1.127.

## కోల్పడు

చూ. కోలుపడు.

## కోల్మసగు

చూ. కోలుమసగు.

## కోల్మ్రుడుచు

ఇనుపపుల్లకు చెక్కు.
మాంసం ముక్కలను ఇనుప
ముక్కలకు చెక్కు- తారు -
కెఱుకు ట్లంటు రు వానినే.
కుమా. 11.193.

## కోపయు వడ వ్రాయు

అందముగా వ్రాయు.
ముత్యముల కోవవలె అనుట.
అంటుగూపె సచ్చిన పలుకుబడి.
"కోవలు వడ వ్రాసి చిత్రగుప్తుఁడు
దాఁచెఁ." పాండు. 5.74.

## కోవుర ముండు

కావలి యుండు.
"ఉదయగిరిమీఁదఁ గోపురం బుండి
నిగుడు, నహితరవిరశ్మి చే బదుఁ
డగుచు...." మను. 3.54.

## కోసకోడి

ఓడ పాఱిపోయే కోడి.
కోడి పందెములలో వాడక
మున్న మాట.
"నా జన్మలో కోసకోడి పట్టింది
లేదు." వా.

## కోసి కుప్పలు పెట్టు

కోయు.
"తలలు కోసి కుప్పలు పెట్టుచు."
వీర. 4.206.

**కోసుక తిను**

గట్టిగా దండించు.

కోపోద్రిక్తుడైనప్పుడు ఉపయోగించే పలుకుబడి.

"సం, త్రాసము చెంద నీగళము రాట్నమునం బిగియించి యొంతునో, కోసుక తిందునో యనినc గోమలి నిశ్చలధైర్యధుర్య యై." శుక. 2.373.

**కోసెత్తు**

గోడుపోవు; దాసోహ మను.

ఓడిపోయి పారిపోయే కోడిని కోడి పందెములలో కోస కోడి అంటారు.

"దేశంబు కోసెత్తెనే?" గిర. విగ్ర. 15.

**కౌగిట గ్రుచ్చి యెత్తు**

బిగియార కౌగిలించుకొను.

"పొలcతుల్ గౌcగిటc గ్రుచ్చి యెత్తి తలcబ్రా లొవ్వియించునవ్వేళ." పారి. 1.2.

**కౌగిట చేర్చు**

కౌగిలించు.

"నీరజనాభుcడు నిండుc గౌcగిటం జేరిచి బుజ్జగించి." పారి. 1.134.

**కౌగిట తేలుచు**

కౌగిలింతచే సంతోషపెట్టు.

"నీలశిరోజనేత్రముల నీళ్లనె కాళులcc గడ్గి కౌcగిటం, దేలిచి యింటిలోపలికిc దిన్నగc దోడ్కొని వచ్చె." హంస. 3.106.

**కౌగిట బిగించు**

గాఢంగా కౌగిలించుకొను.

"సతి నతc డపుడు విడక కౌcగిట బిగించె." కళా. 4.104.

**కౌగి లిచ్చు**

ఆలింగనసౌఖ్యము నందించు.

"భూసుపర్వున కొకనాcడు పోయి కౌcగి, లిచ్చి రమ్మని పంపినాc డింతె కాని." నిరం. 4.24.

**కౌచుముచ్చు**

మాంసాహారి; రాక్షసుడు.

బ్రౌన్.

**కౌడు పెట్టు**

మోసగించు; కపటంతో ప్రవర్తించు.

"అతిమత్సరతన్, బెనcగాడు వారలను గాడు పెట్టి పఱచి కై, కొనియెద నీ వస్తువుల..." షోడ. 2.40.

**కౌడు లేని మనిషి**

నిష్కపటి, కుళ్ళూ కువ్యాడం లేని వ్యక్తి.

"అత నేమాత్రం కౌడు లేని మనిషి. ఏమన్నా మన మంచికే అంటాడు." వా.

**కౌపీనసంరక్షణార్థం....**

అంత చిన్నదానికై ఇంత లంపటమా.

పుట్టగోచికోసం సంసారమే కట్టుకున్న సన్యాసి కథపై వచ్చినది.

**క్రందుకయ్యము**

దొమ్మియుద్ధం.

**క్రందుకొను**

వ్యాపించు.

ఇది ప్రకటిత మగు, ఎక్కువగు, పూర్ణ మగు అన్నట్టి. అందుకు దగ్గరగా నున్నట్టి చాలా అర్థాలలో కూడ వస్తుంది.

"మంగళ భూషణద్యుతుల్, క్రందుకొనంగ." జైమి. 4.120.

**క్రందుపడు**

పైన పడు, గుంపుకట్టు.

భాస్క. రా. అర. 1.248; మార్కం. 1.225.

**క్రందుపఱచు**

క్రందుపడ జేయు.

**క్రందుపాటు**

క్రందుపడుట.

**క్రక్కువడు**

చిక్కువడు.

"ఆక్రోశపరి దేవనా క్షర వ్రాతంబు, కంఠగద్గదికచేఁ గ్రక్కుపడఁగ." హరి. 3.92.

**....క్రక్కించు**

ప్రతీకారము చేయుపట్ల, ఎదుటివాడు దేనిని అపహరించెనో దానిని క్రక్కింతును అని అంటారు.

"కలఁచి నా యల్లునిఁ గ్రక్కింతు ననుచు." ద్విప. మధు. పు. 53.

"నా చేతికి దొరకనీ వాడు. ఆ నూరు రూపాయలూ కక్కించి వదలి పెడతాను." వా.

**క్రగ్గుపడు**

వెల్వాడ లేక పోవు, క్రుంగి పోవు.

"కంఠగద్గదికచేఁ గ్రగ్గుపడఁగ." హర. 3.92.

**క్రచ్చుకొను**

డగ్గఱు.

"చెలుఁడుఁ గ్రచ్చుకొని యడుగ నిట్లను నచ్చేడియ." వసు. 4.

**క్రమ్ముకొను**

క్రమ్ము.

ప్రభా. 2.41.

**క్రమ్మదెంచు**

క్రమ్ము, పొంగు, ప్రవహించు.

**క్రమ్మువడు**

మూతపడు.

"ఘనుఁడు గృహమేధి పెరటిలోఁ గ్రంతఁ జూచి, క్రమ్మువడ మంచి దొకరేఁగుకొమ్మ వేయు, మనుచు భృత్యునిఁ బలుకంగ." గంధ. 66.

**క్రయపెట్టు**

అమ్ము.

"పారుగూళ్లఁ గలమాన్య భూములు ధాన్యంబు, గ్రయపెట్టి విడుచుఁ బరకృతంబు." నిరంకు. 2.26.

**క్రయ్యబడు**

బలాత్కరించు.

"కన్యకఁ, గ్రయ్యంబడి చేసికొనిన రాక్షస మయ్యెక్." విజ్ఞా. ఆచా. 100.

2. కలియు, కలియుబడు.

"వెయ్యేం డ్లయ్యెను నీతోఁ, గ్రయ్యం బడియున్నవాఁడఁ గామసుఖములన్." భాగ. 9.577.

### క్రయ్యబాఱు

కలిసి పారు.

### క్రల్లవడు

పాడగు, దగ్ధమగు.

"తరు లెల్లఁ గ్రల్లవడఁగా, విరళము లై వీను లున్నవిధ మొప్పె నహా, స్ఫురరుచులతోడఁ దలపడి, యరుదుగఁ బోరాడి తుమురు లై పడినక్రియన్." హరి. పూర్వ. 6.37.

### క్రాగిపోవు

నీళ్లవలె క్రాగి ఆవిరయి పోవు అనగా నశించి పోవు.

"కంధరకు నోడి యెచటనో క్రాఁగి పోవ." పాండు. 4.40.

### క్రాలుకన్ను

వంకరకన్ను; వాలుకన్ను.

పండితా. ద్వితీ. మహి. పుట. 108. వరాహ. 4.8.

### క్రాలుకొను

నెలకొను.

కవిక. 2.61.

### క్రాసి యుమియు

కారి ఉమ్మివేయు అని నేటి వాడుక.

"కౌముదీచ్ఛాయలఁ గ్రాసి యుమియ." కాశీ. 4.269.

### క్రింగొడ ఝ్యారుచు

శరీరమును కుంచించుకొను.

"తొడ లూఁదికొనుచును ద్రోపు ద్రొక్కుళ్ళు, వాఱుచు క్రింగొడఝ్యారుచు." పండితా. ద్వితీ. పర్వ. పుట. 362.

### క్రిందట గాలిగా కేడించు

గాలివేగముతో నడిపించు, గాలి క్రిందగునట్లు అనుట.

"ఆప్పెడి మృగము, మనసు లోఁబడు నట్టి మతముఁ జింతించి, క్రిందట గాలిగాఁ గేడించి రథము, నందు పాటుగఁ దోలు మనుచు." గౌ. హరి. ప్రథ. పం. 599-602.

### క్రింద మీద పెట్టు

ఎలాగో ఒకలాగు తగాదా పెట్టు.

"...ఎవ్వరికేని మీఁదికిం గ్రిందికిఁ బెట్టి పోరు పొసగింపన చూచెద..." పాండవో. 50.

### క్రిందు చేయు

అధఃకరించు.

"సమస్తముఁ గ్రిందు చేసి మించినబలు వేల్పు." పాండు. 1.152.

రూ. క్రిందు సేయు.

### క్రిందుపడు

1. తక్కువ యగు.

"పెనఁకువ నెందున్, గ్రిందు పడకుండ." హర. 7.179.

2. ఓడిపోవు.

"పాండునృపకుమారునకుఁ గ్రిందు పడినావు." నిరంకు. 3.29.

3. అధఃకృత మగు.

"...పక్షిపతి...తగ్గియు, చ్చరణము లంది క్రిందుపడె సమ్మతి నెప్పుడు వీఁపుఁ జూపుచున్." రాధి. 2.46.

**క్రిందు పఱుచు**

తక్కువపఱుచు.

"నునుకందు పైఁ జెందు నని యించురుచి
గ్రిందు, పఱుపఁగాఁ జాలు నబ్బాల
మోము."

హంస. 2.20.

**క్రిందు మీ దగు**

తలక్రిందు లగు.

"నాతిమృదుగతి చపలేక్షణముల కలికి,
క్రిందుమీఁ దయ్యెఁ గాదె పూర్ణేందు
వదన." హంస. 2.141.

"కొండలు క్రిందు మీఁదుగను
గూల..." హంస. 4.20.

**క్రిక్కించు**

గిలిగింతతో నవ్వునట్లు చేయు.

ధ్వన్యనుకరణము.

కిచకిచ నవ్వు మొదలైన
వానిలో వలెనే.

"క్రిక్కించుఁ జక్కిలి గిలగిలయనుచు."
పండితా. ప్రథ. పురా. పుట. 457.

**క్రిక్కిరియు**

1. గుంపుగా చేరు.

"క్రిక్కిరిసి తేఁటిగము లక్కమలరాజి
పయి." రాజశే. 1.141.

2. నిండు.

"గుత్తుల్ క్రిక్కిరియఁ జేసి."
రుక్మాం. 3.129.

"జనం క్రిక్కిరిసి ఉన్నారు." వా.

**క్రిక్కిఱియు**

దట్టముగా ఒకదానిపై
నొకటి పడు.

"క్రిక్కిఱిసినశవములలో."
శమా. 11.177.

**క్రియగొను**

కార్యరూపము చెందు.

"ఉడుగక మే మహితముఁ బలికెడి
వారము నీవు హితవు క్రియగొనఁగాఁ
బల్కెడువాఁడవు."

భార. ఆది. 8.40.

**క్రియలో....**

కార్యరూపంలో.

"వాడు మాటల్లో దానపరుడే కానీ
క్రియలో మాత్రం కాదు." వా.

"ప్రేమంటే మాటల్లో కాదు.
క్రియలో కనిపించాలి." వా.

**క్రియలో మాట**

అసలు కీలకం, అసలు మాట.

"ఇంత కథ అంతా యెందుకు?
క్రియలో మా టేమిటి? వా.

చూ. క్రియలో ముక్క.

**క్రియలో ముక్క**

చూ. క్రియలో మాట.

**క్రియ్యూట**

చిన్న ఊట.

కొండలలో అక్కడక్కడా
నీరు ఊటగా బయలుదేరి
పారుతూ ఉంటుంది. అదే
క్రియ్యూట.

"ఇందలి క్రియ్యూట లీప్సితార్థంబు,
లందించు రసరసాయన సుధా
ధారలు."

పండితా. పర్వ. ద్వితీ. 241 పు.

**క్రీగంట చూచు**

కటాక్షించు; ఓరగా చూచు.

"మమ్మల్ని కాస్త క్రీగంట చూస్తూ
ఉండు." వా.

**క్రీగడుపు**
పొత్తికడుపు.
క్రిందిది అనుట.

**క్రీగాడ్పు**
అపానవాయువు.

**క్రీగోరు**
కాలిగోరు.

**క్రీదొడ**
తొడ క్రిందిభాగము.

**క్రీనీరు నేల**
ఊటతో చెమ్మగిల్లిన నేల.

**క్రీయూట**
చూ. క్రియ్యూట.

**క్రుంకువెట్టు**
మునుగు, నిమగ్నుడగు.
"విపులాంభోనిధిఁ గ్రుంకవెట్టి."
నిరంకు. 3.49.

**క్రుంగబడు**
క్రుంగిపోవు.
"ధర గ్రుంగఁబడఁగ."
భాస్క. రా. కిష్కి. 431.

**క్రుంగిల బడు**
క్రుంగిపోవు.
"పాన్పుమీఁదటఁ గ్రుంగిలఁబడఁగఁ దిగిచి, ప్రథమసురతంబు గావించు ప్రౌఢ శౌర." రాజగో. 56.

**క్రుచ్చి యెత్తు**
కౌగిలించు.
"పే, రక్కునఁ గ్రుచ్చి యెత్తుకొని."
కవిక. 3.167.

**క్రుమ్మి కూరాకు సేయు**
చిందర వందర చేయు.
"పులుల జట్టలు చీరి దుప్పులను లేళ్ల, నేకలమ్ములఁ గ్రుమ్మి కూరాకు సేసి, యమరఁ జమరులఁ బట్టి పాలార్తు మిపుడు, సామి! చూడుము నీ బంట్ల సత్తు వనుచు. సారం. 1.90.

**క్రుమ్ములాడు**
పోట్లాడు; దెబ్బలాడు.
పశువులు కొమ్ములతో క్రుమ్ములాడుటపై వచ్చినది.
"వీనిఁ బడవైచె నాతఁడా వీరుఁ డనుచుఁ, గా దనుచుఁ గ్రుమ్ములాడు నక్తంచరాళి."
కువల. 2.151.

**క్రుమ్మెసలాడు**
పోట్లాడు.
రంగా. 3.218.

**క్రుయ్యక డయ్యక**
చులాగ్గా.
"అయ్యంగరాజుతోడం, గయ్యము సేయుచును దుర్ముఖప్రాణంబుల్, సయ్యనఁ దొమ్మిది యమ్ములఁ, గ్రుయ్యక డయ్యక యతండు గొనియె నరేంద్రా!" భార. ద్రో. 4.198.

**క్రుయ్యబాఱు**
కృశించు.

**క్రుళ్లి గుల్లగు**
కుళ్లి కృశించు.
"...కవులు చెడనాడ వగచి, గ్రుళ్లి తనలోనె గుల్లై, పెల్లుగ శంఖంబు మొఱపెట్టుచు నుండుచో."
రాధా. 1.154.

**క్రుళ్లుపోతు**
కుళ్లుబోతు.
"వాడు వట్టి కుళ్లుబోతు వెధవ. ఎవరు పచ్చగా ఉన్నా చూడ లేడు." వా.

**క్రేగాలి**
చిఱుగాలి.

**క్రేటుకొను**
గొంతు సవరించుకొను.

**క్రేడి సేయు**
అపహసించు.

**క్రేణి వట్టు**
సంపాదించు.
కాశీ. 3.90.

**క్రేణి సేయు**
పరిహసించు.
"ఆ సమయంబు బభ్యర్ణ పూర్ణ చంద్రోదయ ఘూర్ణమానార్ణవంబునుం గ్రేణి సేయుచుండె."
పారి. 5.75.

**క్రేదొట్టు**
గట్టు లొరయు.

**క్రేళ్లు చూచు**
చిలిపిగా చూచు.

**క్రేళ్లు చూపు**
చిలిపిచూపు.

**క్రేళ్లు త్రుళ్లు**
ఎగిరి పడు.
కువల. 4.81.

**క్రేళ్లు దాటు**
గంతులు వేయు.
"అడంబు నిడుపు నాపడ్డలగతి మనుఁ, ఛీళ్లు డొంకలనుండి క్రేళ్లు దాఁట."
మను. 2.7.
2. ఎగిరెగిరి పడు.
"చే వెడ దోఁపుచుం బలికెఁ జెంచొవ చూపులు క్రేళ్లు దాఁటగన్."
పారి. 4.58.
"మొఱఁగులు పైకెఁ గ్రేళ్లతికెడు గబ్బి గుబ్బలమీఁద." విప్ర. 3.3.
చూ. క్రేళ్లుఱుకు.

**క్రేళ్లు దోలు**
పరువు లెత్తించు.
"తేర క్రేళ్ళు దోలి పాంచాలబలంబులపై నడగె." భార. భీష్మ. 3.368.

**క్రేళ్లు ద్రిప్పు**
చూ. క్రేళ్ళు దోలు.

**క్రేళ్లుబ్బు**
ఉబుకు.
నరస. 5.102.

**క్రేళ్లు మలగు**
వెనుదీయు.

**క్రేళ్లు మసలు**
చలించు.

**క్రేళ్లుఱుకు**
ఎగిరి పడు.

**క్రేళ్ళొగయు**
క్రేళ్ళు సను.

**క్రేళ్లు వాఱు**
గంతులు వేయు.

**క్రేళ్లు సను**
ఎగిరి పడు.

**క్రొత్త**
వింత.
"క్రొత్త దాని వృత్తం బెల్లన్."
పాండు. 2.142.

వాడుకలో—
'ఆ విషయం నాకు కొత్త.'
'దాని ప్రవర్తన అంతా చాలా కొత్తగా ఉంటుంది.'
'ఏమిటోయ్! ఈ రోజు కొత్తగా మాట్లాడుతున్నావు.'
'ఇన్నిరోజులు లేదు. ఈ రోజేదో నువ్వు కొత్తగా చెప్తున్నావు.'
ఇలాంటి దగ్గరి భావచ్ఛాయలలో మరికొన్ని తావుల కూడా కనబడుతుంది.

**క్రొత్త చేయు**
నూతనత్వము కల్పించు.
"సత్యభామ మేనఁ గుసుమ శృంగారముల కెల్లఁ గ్రొత్త సేయ."
ఉ. హరి. 1.151.
2. పునరుపస్థితము చేయు.
"సమంత్రక ముష్టిక స్థానక విజ్ఞానంబు గాఁ గ్రొత్త సేసికొనుట మేలు."
భార. ద్రోణ. 2.361.

**క్రొత్తముట్టు**
నూలిపోగు.

**క్రొత్త వఱుచు**
మెఱు గెక్కించు.
భార. భీష్మ. 1.105.

**క్రొవ్వడగించు**
పొగ రడగించు.
"నీదు క్రొవ్వడఁగింతున్."
కళా. 6.23.

**క్రొవ్వుగొను**
కొవ్వెక్కు.
"పరువంపుఁ జినుకుల పస గ్రొవ్వుగొని తేల, గిలఁ బడువానకోయిలల యొప్పు."
హరి. పూ. 9.72.

**క్రొవ్వుపట్టు**
పొగ రెక్కు.

**క్రొవ్వులు పలుకు**
దుర్భాష లాడు.
"ఈ చపలకుత్సిత విప్రుఁడు వచ్చి నోరఁ గ్రొవ్వులు వలుకంగ మీరును చెవుల్ సార వించు సహించి..."
కుమా. 7.55.

**క్రొవ్వెక్కు**
కొవ్వు పట్టు.
"క్రిక్కిఱిసి చన్నుదోయి యిరుక్రేవల కాంతియుఁ బంచబాణుఁ గ్రొవ్వెక్కఁగఁ జేయ." నైష. 7.194.

**క్రొవ్వెద**
కొప్పు.
"చెం, గలువలు క్రొవ్వెదకు వేఱొకర్తు ఘటించెన్." ఆము. 6.129.

**క్లేశపడు**
కష్టపడు,
"అత నా కరువులో పిల్లలతో చాలా క్లేశపడ్డాడు." వా.

**క్షణభంగురము**
అనిత్యము.

నీటిబుడగవంటి దను పలుకు
బడి. 'ఈ దేహం క్షణభంగు
రము' అని నేటికీ వాడుక.
పండితా. ప్రథ. వాద. పుట. 550.

**క్షణ మే డగు**
కాలము త్వరగా సాగక
పోవు.
"రాఁ డయ్యెఁ హృదయేశుఁ డీ
హృదయభారం బెట్లు సైతుఁ క్షణం,
బే డై యున్నది." ప్రభా. 4.146.

**క్షణియించు**
పూజించు, అర్చించు.
"కల్లరి లోకుల క్షణియించఁ దగునె."
బస. 7.204.

**క్షితిని నహి ప్రతిల్లె**
లోకంలో లేదు. అపూర్వ
మనుట.
"క్షితిని నహి ప్రతిల్లె యని చెప్పుదు
రాతనిభాగ్య మెట్టిదో?"
శ్రవ. 1.75.

**క్షీరోదకన్యాయము**
పాలును నీళ్లును కలిసినట్లు
కలగలసి పోయిన దనుట.
పెరుగును వడ్లును కలిసిన
ట్లనునది దీనికి వ్యతిరేకము.
పండితా. ప్రథ. పురా. పుట. 278.

**క్షుణ్ణంగా**
కూలంకషంగా.
"వాడు శాస్త్రాంతం క్షుణ్ణంగా చదువు
కొన్నాడు. వానితో తగాదా పడితే
ఏం లాభం?" వా.

**క్షూణత పరచు**
న్యూనపరచు, కించపరచు.
"చుట్టం మాపుల కని వాళ్లింటికి పోతే
క్షూణతపరిచి పంపించాడు." వా.

**క్షేత్రపాలుడు**
క్షేత్రాధిదేవత.
సింహా. 4.35.

**క్షేమతండులములు**
ప్రయాణమై పోతూ వట్టి
చేతులతో పోక ఏవో యిన్ని
బియ్యం కట్టుకొని పోవా లని
ఆచారం. ఆ బియ్యం—
"శాలి క్షేమతండులములు."
ఆను. 2.97.

**క్షేమలాభములు**
జంటపదం.
దీని మీద వచ్చిన దే -
క్షేమంగా పోయి లాభంగా
రా - అన్న పలుకుబడి.
ప్రయాణమై పోవునప్పుడు
పెద్దలు చేసే దీవన యిది.
"......నాకు శో,భనములు గోరఁగాఁ
గద యుపాయము చెందక క్షేమలాభ
ములఁ, గని యిలు చేరు టంచును..."
శుక. 2.234.
చూ. యోగక్షేమములు.

**క్షేమలాభా లడుగు**
కుశలప్రశ్న చేయు.

**ఖంగు ఖంగు మను**
శబ్దించు.
ధ్వన్యనుకరణము.

ఖంగురింగులు

ధ్వన్యనుకరణము.

ఖండితంగా

తప్పక.

"ఈ రోజు వాడు ఖండితంగా వస్తా నన్నాడు. మ రేమయిందో యేమో!" వా.

ఖండిపు చేయు

(బేరం) ఫైసలా చేయు.

ఖచిక్కున

కొఱుకుట వంటి వానిలో ధ్వన్యనుకరణము.

"ఖచిక్కున ముక్కునఁ బక్వదాడిమీ, ఫలయుగళంబు నొక్క." శకుం. 2.33.

ఖడ్గాఖడ్గి వాదించు

కత్తులతో పోరాడు.

"కలు ద్రావం బని పూని యాదవులు ఖడ్గాఖడ్గి వాదింతురే." ఉ. హరి. 4.132.

ఖణీలున అంకె వేయు

ధ్వన్యనుకరణము.

"ఖణీలున అంకె వేయ కెలుఁగన్ సమకూడదు." కా. మా. 4.153.

ఖతం చేయు

ముగించు, చంపు.

మాటా. 85.

ఖరాఖండిగా

కుండ బద్దలు కొట్టినట్లుగా.

"వాడు చాలా ఖరాఖండిగా మాట్లాడే మనిషి." వా.

ఖరాబు చేయు

పాడు చేయు.

"కాగితాలు ఖరాబు చేయడం తప్పితే కొన్ని రాతలవల్ల యే మైనా లాభం ఉందా?" వా.

ఖరారు చేయు

ఏర్పాటు చేయు.

"నెలకు పదిరూపాయ లివ్వా లని ఖరారు చేసి పెద్దమనుష్యులు వెళ్ళారు." వా.

ఖరారునామా

ఒప్పందం.

"వా ళ్లిద్దరూ భాగపరిష్కారాలు చేసుకొని ఖరారునామా వ్రాసుకొన్నారు." వా.

ఖరారు మదారు

ఒడంబడిక.

కాశీయా. 62.

ఖరీదు కట్టు

వెల కట్టు.

"ఘర్మజలానికి, ఖరీదు కట్టే షరాబు లేడోయ్." మహా. ప్ర.

ఖరీదు చేయు

కొను.

"ఆ ఊళ్లో నాలుగు పుట్ల ధాన్యం ఖరీదు చేసి వచ్చాను." వా.

ఖసూచిగాడు

ఎప్పు డేది అడిగినా ఆకాశం చూచేవాడు.

అంటే లౌక్యం, బుద్ధి లే దను టను సూచించేమాట.

"వాడి కేం తెలుసు? పట్టి ఖసూచి గాడు." వా.

**ఖాతరు చేయు**
లెక్క చేయు.
"వాడు బ్రహ్మదేవుణ్ణి కూడా ఖాతరు చేసేవాడు కాదు." వా.

**ఖాయ మగు**
పర్మనెంటు అగు; నిశ్చయ మగు.
"వాని ఉద్యోగం ఖాయ మయింది." వా.
"వాడు వచ్చేది ఖాయ మయినట్లే." వా.

**ఖాయిదా చేయు.**
కట్టుదిట్టము చేయు.
"అడవిలోకి పశువులు వెళ్లకూడ దని పంచాయతీ ప్రెసిడెంటు ఖాయిదా చేశాడు." వా.

**ఖావ(మ)ందు**
యజమాని.

**గంగడోలు**
ఎద్దులకూ ఆవులకూ మెడ క్రింద వ్రేలేభాగం.

**గంగనమ్మ**
గ్రామదేవత.

**గంగనురుగులు**
ఒక పిండివంట.

**గంగపాలగు**
నశించు.
"నేను చేసినదే అంతా గంగపా అయిపోయింది." వా.

**గంగమయిలావు**
నల్లనిది. బ్రౌ.
నలుపు పసుపు కలిసిన రంగుది. శ. ర.

**గంగ ముట్టు**
నీరు త్రాగు.
"నీ విన్నమాట లన్నావు. నీ యింట్లో ఇక గంగ ముట్టను?" వా.

**గంగలో కలుపు**
వ్యర్థము చేయు, పాడు చేయు.
"అట్లు కావున నీ కార్య మనఁగ నెంత, నీదు ప్రాపున నవ్విప్రు నియతి మాన్పి, దిటను దప్పించి యజ్ఞటి దేవు తపము, గంగలోఁ గల్పెదను నొక్క గడియ లోన." వేంకటే. 2.29.

**గంగలో దిగు**
నీ యిష్టం వచ్చినట్లు పో, నా కేమీ సంబంధం లేదు అని విసుగుతో అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.
"వాణ్ణి వెళ్లి గంగలో దిగ మను. నా కక్కఱ లేదు. నాకు కొడుకు లే డను కొంటాను." వా.

**గంగలో దోలు**
వదలి వేయు.
"వాడు ఆచారం గీచారం ఎప్పుడో గంగలో దోలి వేశాడు." వా.

**గంగవెఱ్ఱు లెత్తు**
అత్యావేశపూరితు డగు.

"అత డభూతకల్పన లన్నీ ఏవో చెప్తూంటే మన మే మైనా అన్నామా ఇక గంగ వెఱ్ఱు లెత్తి పోతాడు." వా.

**గంగాధరుడు**

నీళ్లు మోయువాడు.

నారాయణదాసు రుక్మిణీకళ్యాణము.

**గంగాభాగీరథీ సమానురాలు**

వితంతువులను ప్రస్తావించు పట్ల, వారికి ఉత్తరాలు వ్రాయుపట్ల పేరుకు ముందు ఉపయోగించే పలుకుబడి.

గంగవలె పవిత్రురా లనుట.

"గంగా భాగీరథీసమానురా లయిన సుబ్బమ్మత్తగారికి మీ అల్లుడు..." వా.

**గంగిగోవు**

పవిత్ర మైన ఆవు; సాధువు.

"అతనా! గంగిగోవు." వా.

**గంగిగోవు వంటి సాదు**

గోవు సాధు వైన మృగముగా మన యెన్నిక.

"గంగిగోవు వంటి సాదుబాపనిన్ నినుం జనులె పలువ యనంగ." కళా. 7.30.

**గంగిరెద్దు**

చూ. గంగెద్దు.

**గంగిరెద్దు వేషము**

ఆడంబర మైన వేషము.

"ఇదేమిటి? ఈ గంగిరెద్దు వేషం. కొత్త మనుషులు చూస్తే పల్లెటూరి గబ్బిలాయి అనుకుంటారు." వా.

**గంగిరెద్దు సొమ్ములు**

ఆడంబరసూచకములు.

కుక్క. 59.

**గంగెద్దు**

అన్నిటికీ తల ఊచేవాడు, పల్లెటూరిమనిషి, పట్టివేషాడంబరం కలవాడు.

"వాడు ఒట్టి గంగెద్దు. వాళ్లమామ చెప్పినదే వేదం." వా.

"వాడు ఒట్టి గంగెద్దు లాగా ఉన్నాడు. ఈ పట్నంలో ఎలా నెట్టుకు వస్తాడు?" వా.

"ఏమిట్రా! ఆ గంగెద్దువేషం." వా.

**గంజిగుల్ల**

బొబ్బ.

**గంజితరక**

గంజిమీది మీగడవంటి పదార్థం.

బ్రౌన్.

**గంజి త్రాగేవాడికి మీసాలు ఎగబెట్టేవా డొకడా!**

ఈ చిన్నపనికి మరొకరిసాయం కూడా యెందుకు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"నువ్వు చేసే యీ ఘనకార్యానికి యింత మంది యెందుకురా? గంజి త్రాగేవానికి మీసాలు ఎగబెట్టేవా డొకడా?" వా.

**గంజిలోకి ఉప్పు లేదు**

నిరుపేద అనుట.

"వాడికి గంజిలోకి ఉప్పు లేదు. ఇక మీ కిచ్చేదే ముంది?" వా.

**గంజో అంబలో**

"వేళకు ఏదయితే నేం? గంజో అంబలో?" వా.

చూ. కలో అంబలో.

**గంట కొట్టు**

ముగియు.

చనిపోయినప్పుడు గంట కొట్టుట, శంఖం పూరించుట దక్షిణాదిలో నేటికీ అలవాటు. దానిపై వచ్చిన పలుకుబడి.

"వాడిపని గంట కొట్టినది. ఇక వాడు చేసేదే ముంది?" వా.

**గంట వాయించు**

గంట కొట్టు.

"పటుఫలాదులు వోయి బలిమాలువారికే, మీయక గంట వాయించి రహహ." సింహాద్రి. నార. శ. 27.

**గంట ద్రేయు**

గంటలు కొట్టు.

"రెండవజాము గంట ద్రేయం బడె." కాశీ. 5.307. కాశీ. 4.102.

**గంటిపడు**

కాటుపడు.

**గంటిపఱుచు**

గంటు పడునట్లు చేయు.

చూ. గంటివేయు.

**గంటివెట్టు**

చూ. గంటిపఱుచు.

**గంటి సేయు**

కాటు పడునట్లు చేయు.

"నాథుని, యధరబింబము గంటి సేయంగ నెంచు." దశా. 3.17.

**గండం గడిచి పిండం బయట పడితే....**

ఈ ఆపద తప్పితే అనుట.

పూర్వం కాన్పు అతి భయంకరంగానూ, ప్రాణాపాయకరంగానూ ఉండినది. అందుపై వచ్చిన పలుకుబడి.

"ఈ గండం గడిచి పిండం బయట పడితే తరువాత చూద్దాం." వా.

**గండకట్టెలు**

వంట చెఱకులు.

బ్రౌన్.

**గండకత్తెర**

గొంతుక నుత్తరించు ఆయుధ విశేషము.

"శీలము దొరఁగిన పిమ్మట, నేలా కాయంబు దీని నెడ సేయుటయే, మేలని హృదయాబ్జంబునఁ, గాలాంతకు నిల్పి గండకత్తెర గొనఁగాన్." చెన్న. 4.217. కళా. 3.10.

తద్ద్వారా అడకత్తిలో చిక్కుకొన్నట్టు వలెనే గండకత్తెరలో తగులుకొనుట సంకటావస్థాసూచకమయినది.

"పిల్లదరిమధ్యా పడ లేక నేను గండకత్తెరలో చిక్కుకొన్నాను." వా.

**గండడగించు**

పొగరు అణచు.

"...తోమరశక్తిప్రముఖంబు లగు వివిధాయుధంబులఁ నొండొరుల గండడంగించుగనుయంబున."

ఉ. హరి. 1.27.

## గండదీప మెత్తు

మ్రొక్కుబడి చెల్లించుటకై గోధుమపిండితో గానీ పిన్నముతో గానీ ప్రమ్మిదలె చేసి, అందులో గుంత చేసి, నెయ్యి పోసి, వత్తిని వెలిగించి, ఆ దీపము నెత్తుకొని దేవుని దగ్గఱకు పోతారు. దీనినే గండదీప మెత్తుట అంటారు.

"ఆ నాతిఁ జూచి తలవరు, లేనెలఁతయు గండదీప మెత్తఁగ వచ్చెన్."

శుక. 2.496.

చూ. మూపుగండ లిచ్చు.

## గండపాళిక కెంగేలు కదియ జేర్చు

చెక్కిట చేయి జేర్చు.

చింతించు.

"గండపాళికఁ గెంగేలు గదియఁ జేర్చి."

శివ. 2.26.

చూ. చెక్కిట చేయి జేర్చు.

## గండపెండరము

1. వీరులు, కవులు, పండితులు మొదలగువారు కాలిలో వేసుకునే బిరుదుటందె.

"డాకాల గండపెండర మమర్చి."

అచ్చ. యు. 203.

2. ఒక ఆభరణము.

పై దానినే ఆభరణంగానూ ధరించేవారు కావచ్చును.

"పెద్ద పీతాంబరము గండపెండగంపుఁ, గటక కటిసూత్ర కేయూర కంకణాది, దివ్యభూషణజాలంబు..."

దశా. 7. ఆవ. 1.248.

## గండపెండారము

చూ. గండపెండరము.

## గండపెండెము

చూ. గండపెండరము.

## గండపెండెరము

చూ. గండపెండరము.

## గండపెండేరము

చూ. గండపెండరము.

## గండబేటము

ప్రేమ.

పురుషునికి పురుషునిపై గల్గు మోహము అని టీకాకారు లన్నారు. కాని ఎందుకో చెప్ప లేదు.

"మగలు గరము ప్రీతి దగిలి గండబేటంబుగొని..."

కమా. 4.36.

## గండమాల

గొంతు చుట్టూ గడ్డలు లేచే రోగము.

"మును గండమాలవిూఁద ను, మొనకు అుపుం బుట్టె నన్న మోసం బాయెన్."

ద్వా. 10.54.

చూ. గండమాలము.

## గండమృగము

ఖడ్గమృగము.

గండామృగం అని తమిళులు నేటికీ అంటారు.

"గండ మృగములు భేరుండతండములు." బస. 3.83. పుట.

**గండము గడుచు**

తాత్కాలికమైన ఆపద తొలగిపోవు.

"ఇప్పటికి ఈ గండం గడిస్తే తరవాత చూచుకో వచ్చు." వా.

**గండము దప్పు**

ప్రాణాపాయము తప్పు.

"అప్పటప్పటికి మ మ్మరసి గండములు, దప్పించి రక్షించె దానవారాతి."
ద్విప. మధు. పు. 32.

**గండముపై పిండకం**

ముందే గండం, అందులో ప్రసవసమయం.
అనగా అతి ప్రమాదకారి అనుట.
ముద్రా. 79.
జనంలో 'గండంలో పిండం' అని వినవస్తుంది.

**గండరగండడు**

ఒక బిరుదు.
గొప్ప వీరుడు.
రాజులకు బిరుదుగా శాసనాదుల్లో కానవస్తుంది.
కన్నడంలో గండ అనగా మగడు. మగటిమి కలవాడు.
గండలకు గండడు = మేటి మగడు అనుట.

**గండరించు**

మలుచు; రాయి వంటి వానిలో రూపమును చెక్కు.

"పండితలోచనాబ్జంబులయందు, గండరించిన యట్టి గతి..."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 174.

**గండాగొండి చేయు**

తగాదా పెట్టు; మొండి తగాదా పెట్టు.

"గండాగొండి యొనర్తు నేమి యని."
వ్యస. నాట. 13.

**గండాగొండితనము**

మొండితనము.
రూ. గండాగుండితనము.
చూ. గండాగొండి చేయు.

**గండాడు**

కలియు, సంగమించు.

"చండాలితో ద్విజుం డొగి, గండాడిన వక్షమున భగము వ్రాసి తగఁ, దండువు గొని దేశంబున, నుండక యుండంగ నడచు టుచితము పలికిన్."
విజ్ఞా. ప్రా. 126.

**గండాన వచ్చు**

ప్రమాదకర మగు.

"వాడేక సుగ్రీవుమేలు వాలికి గండాన వచ్చు." తాళ్ల. 6.8.

**గండారపు బొమ్మ**

రాతిలో చెక్కిన బొమ్మ; గండరించిన బొమ్మ అనుట.

"అచ్చెరువకంబమున గదిసి చిత్తరువో కరువో యనంగ గండారపు బొమ్మ పోలె నచటం గదలించుక లేక యుండఁగన్." ఉత్త. హరి. 1.6.

గండికా డగు

నేర్పరి యగు; దొంగ యగు.

"గండికాఁ డై తనమాయ గాన నీఁడు గాక." తాళ్ల. సం. 9.283.

గండిదొంగ

కన్నపుదొంగ.

గండు మిగులు

విజృంభించు.

"మొగరంబులు రెండును గండు మిగిలి తలపడియె." భార. భీష్మ. 2.351.

గండుతాయి

వజ్రము.

ఉత్త. హరిశ్చ. 3.131.

గండోలిగాడు

హాస్యగాడు.

బొమ్మలాటల్లో వీని నిప్పుడు గంధోలిగా డంటారు.

గండ్రచీమ

పెద్ద నల్లచీమ.

గండ్రపురి

బాగా పెట్టినపురి.

గండ్రలు సేయు

ముక్కలు చేయు.

"ఛేదించి గండ్రలు సేయుచు తతిని." పండితా. ప్రథ. పురా. పుట. 323.

గంతకు తగిన బొంత

దేనికి తగినటి అది అనుట.

"గంతకుఁ దగినట్టి బొంత లోకము నందుఁ, గల్పించె మొదటనే కమల భవుఁడు." శశి. (అప్ప.) 2.27 పు.

"మావాడికీ గంతకు తగిన బొంత ఏదో ఉండనే ఉంటుంది. మీ పిల్లే కావాలా లే." వా.

గంతు గొను

హాముకు; చచ్చు.

గందపట్టియ

ద్వారబంధము పైనున్న పట్టె.

గందపట్టె

గందపట్టియ.

గందరగోళ మగు

చాలా అల్లరి అగు.

"పక్క ఊళ్లో కలరా వచ్చిం దనే సరికి ఊరంతా గందరగోళం అయి పోయింది." వా.

గందవాడిలో బూరుగు పట్టినట్లు

మంచిలో చెడు జరిగినట్లు.

"సరసనయాను భావమునఁ జక్కని చక్కెరబొమ్మలాగు గా, దొరకె నటంచు నమ్మితిని దోడన యింటిమగం డనూయఁ బ, ల్గాలుకుచు వచ్చె గంద వాడిలోపల బూరుగు పట్టినట్టు లీ, దఱి కొక సౌఖ్య మబ్బినను దైవముకంటికిఁ గంటగించెనో." తారా. 4.58.

గంధము చిటులు

తడియారిన పిదప గంధము పేటులు రేగు.

"చిటిలినగంధముం దళుకుచెంపను ద్రేలు రుమాలు జాఱుదు,ప్పటియును." శుక. 1.515.

గంధర్వనగరం

వట్టిది; మిథ్య. ఎండమావుల వంటి మాట.

వావిళ్ళ ని. లో గంధర్వుల పట్టణం అని ఒకటో అర్థం చెప్పి భాగవతంలో ప్రయోగమే ఇచ్చారు. అక్కడ మాయ, మిథ్య అన్నదే సరిపోతుంది.

"మఱియు నీ గృహస్థపూర్వంబునం దెల్ల, విషయములను బొందిన విశ్వ మెల్లఁ, గడఁకతోడ నిట్టు గంధర్వనగరంబు, గాఁదలంచి మిగుల మోద మందు." భాగ. 5.1.166.

**గంధామలకము పెట్టు**

స్నానం చేయుటకు ముందు ఉసిరికకాయలను దంచి తల మీద పెడతారు. అది ఉష్ణ నివారక మని ప్రసిద్ధి.

"తెలిగొజ్జఁగినీ రెడఁ జల్లి చల్లి గంధా మలకంబు వెట్టె నొక యంగన కాళియనాగభేదికిన్." పారి. 2.10.

**గంధోళిగాడు**

చవట, వెఱ్ఱివాడు, మూఢుడు, హాస్యపాత్రుడు ఇత్యాదులఛాయ లన్నీ కలమాట. బొమ్మలాటలో హాస్యంకోసమని సృష్టించిన 'గంధోళిగాడు' అన్నపాత్రపై యేర్పడిన పలుకుబడి. వీనినే కొన్ని ప్రాంతాల్లో జుట్టుపోలిగాడు అంటారు.

"వాం డేమంటే మన కేమిట్రా. వాడు వట్టి గంధోళిగాడు." వా.

చూ. గండోళిగాడు; జుట్టుపోలిగాడు.

**గంపంత బలగము**

ఊరంత బలగము.

ఎడ్వ. నాట. 32.

"వాళ్లకేం! గంపంత బలగం ఉంది." వా.

**గంపకొప్పు**

లావాటి కొప్పు.

"చెంపల లప్పలు నిండం బెరిఁగిన, కప్పురపుం గంపకొప్పుల సతుల ఘనుం డాతండు." తాళ్ల. సం. 3.5.

**గంపచాకిరి**

అపచాకిరీ; లాభం లేని చాకిరీ.

"ఈ గంపచాకిరీతోనే సరిపోయింది." వా.

**గంపతిరుగుడు**

డొంకతిరుగుడు.

తె. జా.

మహాభారత రహస్య విమర్శనము.

**గంప నమ్మ**

బయలుపెట్టు. రట్టు చేయు.

"చంప వచ్చిన కర్మసంగ్రహం బగు బుద్ధి, గంప నమ్మక తిన్నఁ గాచెనా." తాళ్ల. సం. 5.129.

**గంప మోపు కోరికల కాలము**

యౌవనము.

"గంప మోపు కోరికల కాలము." తాళ్ల. సం. 8.32.

**గంపల నమ్మ వచ్చు**

డబ్బిచ్చినవారి కల్లా అమ్ము.

"వలపు గంపల నమ్మ వచ్చితినా నేను." తాళ్ల. సం. 3.515.

## గంపెడాశ

ఎక్కువ ఆశ.

"మా అల్లుడు పండగకు వస్తాడు గదా అని గంపెడాశతో ఉంటే సెలవు దొరక లేదని రాశాడు. మా అమ్మాయి మొహం ముడుచుకొని కూర్చుంది." వా.

## గంపెడు పిల్లలు

ఎక్కువమంది సంతానం.

పుట్టెడు దుఃఖం వంటిదే ఇది.

"గంపెడు పిల్లలతో ఈ మండిపోయే ధరల్లో ఎలా బ్రతకాలో తోచకుండా ఉంది." వా.

## గగనంబు చించులీల

ప్రయాణ సంరంభాన్ని సూచిస్తూ వారి కోలాహలం, ఆకాశాన్ని కూడా తూట్లు పడ జేయుచున్నది అనగా అత్యధికముగా ఉన్నది అన్న అర్థంలో ప్రయుక్త మయ్యే పలుకుబడి. ఇలా యేర్పడిన మాటలు – మిన్ను ముట్టు, ఆకస మంటు గగనము పగుల నార్చు, ఆకసము చీల్చు ఇత్యాదులు.

"తలవరు లింత నంత వెడదాటులతో గగనంబు చించులీలల విలసిల్లి వెంటఁ బదిలంబుగ రా..." శుక. 2.220.

## గగనకుసుమము

శూన్యము; అసంభవము.

"ఎన్నంగ నీవు సముఖుడవు, క్రొన్నెల పొడ వయ్యె గగనకుసుమం బయ్యెన్." రాధా. 1.7. పు.

## గగనప్రసూనవాదము

శూన్యవాదము.

"గగనప్రసూనవాదము, జగతిం బ్రత్యక్షమునకు సరి యనఁ దగునే?" కాశ. 3.169.

## గగన మగు

ఎంతో కష్ట మగు.

"వాణ్ణి పెండ్లికి ఒప్పించేసరికి గగన మయింది." వా.

## గగనమా ?

అరుదా ? అబ్బురమా ? అసాధ్యమా ?

"వాడి కా పుస్తకం రాయడం ఏం గగనమా ?" వా.

"వానితో మాట్లాడ్డం ఏం గగనమా ? అన్నిసార్లు చెప్పకొంటున్నాడు." వా.

## గగనము చేసికొను

గొప్ప చేసుకొను.

"పసిగాను పిడికిటఁ బట్టి చూచెద నన్నఁ, జెలి యది గగనంబు చేసికొనెడు." సారం. 2.224.

చూ. గగనమా ?

## గగనానికీ యిలకు....

చాలా దూర మనుట.

'గగనానికీ యిలకూ బహు దూరం బనినారు' అన్న త్యాగరాజు కీర్తన భాగంపై వచ్చిన పలుకుబడి.

"వాల్మీకిరామాయణానికీ యీ రామాయణానికీ పోలిక యేమిటి? గగనానికీ యిలకూ..."

**గగురు పొడుచు**
జలదరించు.
కాశీ. 5.130.

**గగ్గులకా డగు**
చెల్లాచెద రగు; కలతపడు.
"గుట్టంపుపౌజు గగ్గులకా డై చెద రంగ." కా. మా. 2.41.

**గగ్గులకాడు చేయు**
పాడు చేయు.
"కలంచి తెరలించి గగ్గులకాడు సేసి, సకలబలముల దెసలకు సరఁగఁ బెచ్చె." శ్రీరాధా. 5.70.

**గగ్గులకాడున గలుపు**
పాడు చేయు.
"డగ్గఱి యెవ్వఁడో కటకటా శివ లింగము మీఁది రత్నముల్, గగ్గులకాటఁ గల్పి ములుకంపలు తీవలు వెట్టె నేఁడు." కాశీ. 2.110.

**గగ్గోడుపడు**
కలగి పోవు.
హర. 6.47.

**గగ్గోలగు**
గందరగోళ మగు; గోల అగు.
రసిక. 1.108.

**గగ్గోలుపడు**
గందరగోళ మగు.

**గగ్గోలు పుట్టు**
గోల అగు.
"గొల్లవాడల నెల్ల గగ్గోలు పుట్టు." శీలా. 3.55.

**గచ్చకాయల కుండ**
వాగుడుకాయ, గయ్యాళి.
కుండలో గచ్చకాయలు పోసి నప్పుడు కదిలిస్తే విపరీతంగా శబ్దం చేస్తాయి.
"ఆ గచ్చకాయలకుండ జోలికి ఎందుకు పోయావు రా? ఇక మూడు రాత్రులూ మూడు పగళ్ళూ విడిచి పెట్టదు." వా.

**గచ్చకాయలు**
గోలీలాటవలె గచ్చకాయ లాట.
"గచ్చకాయలు కెట్టుగానుగ త్రిప్పళ్లు." హంస. 3.146.

**గచ్చులాడి**
మాయలాడి; విలాసిని.
"ఇటు వచ్చిన యచ్చర గచ్చులాం డ్రలో, నేరుచిరాంగి చక్కనిది." అహ. 1.72.

**గచ్చు విచ్చగు**
చెల్లాచెద రగు.
"చెదరి బెదరి కలంగి కన్ బెదరి తొలఁగి, గచ్చువి చ్చయ్యెఁ బారశీక వ్రజంబు." కృష్ణరా. 3.59.
జ్ఞానప్రసూనాంబికా. 20.

**గచ్ఛంతి చెప్పు**
పోవు.
వైదికుల పరిభాష.
"మేమింక గచ్ఛంతి చెప్తాము." వా.

**గజకర్ణములు**
చంచలములు.
ఏనుగు చెవులు ఒక క్షణం ఆగకుండా ఎప్పుడూ అటూ

యిటూ ఆడుతుంటాయి.
దానిపై వచ్చిన పలుకుబడి.
చూ. గతాగతద్విరదకర్ణములు.

గజగజలాడు
భయపడి పోవు.
"వాడు తండ్రికి గజగజ లాడుతాడు." వా.

గజనిమీలిక
నిద్ర పోతున్నట్లు కనిపించినా అతిజాగరూకతతో నుండుట. ఏనుగ నిద్ర అలా ఉంటుం దనుటపై ఏర్పడినది.

గజబొంకు బొంకు
పచ్చిఅబద్ధ మాడు.
"చేరిక వీరబాహుని భజించుటచే గజ బొంకు బొంకుటన్, సారము దూలెమున్నని..." సాంబో. 1.19.

గజ యీతగాడు
గొప్ప యీతగాడు.

గజరు గజరులు పోవు
గగుర్పాటు చెందు.
"జవరా లగుకాపాలిని, కవుఁగిటఁ దన మేను గజరు గజరులు వోఁగా." ప్రబోధ. 3.46.

గజశ్రద్ధు
మందకొడి.
"శ్రద్ధుండగు భీష్ము ముందు 'శోన్కిస్క' గజశ్రద్ధుండు కర్ణుఁడే మగు." గీర. గురు. 45.

గజస్నానము
వ్యర్థము.
ఏనుగు బాగా నీళ్లలో మునిగినా పైకి వచ్చి తిరిగి దుమ్ము ఒళ్లంతా చల్లు కొంటుంది. అందుపై యేర్పడిన పలుకుబడి.
'ఉదకము నళినీ పత్రము, గది సియు నెర వైనయట్లు కలయవు నీమా, హృదయములు గజస్నానము, తుది మఱి నీ తోడిపొందు దుష్టచరిత్రా!' భాస్క. యుద్ధ. 138.

గజిబిజి యగు
కలవరపడు.
"గజిబిజి యైరి సభాస్థలిఁ, బ్రజ లెల్లను బొట్టి వడుగు బాఁపని రాకన్." భాగ. 8. స్కంధము. 534.

గజిబిజి చేయు
గందరగోళము చేయు.
కాశీ. 6.179.

గజిబిజి పడు
కలగు.
"గుజగుజలు వోవు వారును, గజిబిజి పడువారు." భాగ. 8. స్కం. 534.

గజిబిజి పుట్టు
గందరగోళ మగు.
"కల్యాణమున భక్తి గజిబిజి పుట్టు." పండితా. ద్వితీ. మహి. పుట. 198.

గజ్జి పట్టు
గజ్జి కురుపులు లేచు.
"ఈ పక్కన గజ్జి పట్టింది. దగ్గఱకు రానీకండి." వా.

గజ్జు గెలయు
పొగరు పట్టు.

"ఓలుక జవరాలు తని గజ్జె గెలని మరుని, మరల్చ మద్దాటనము సేసి మలయుచోట." సాంబో. 1.177.

**గజ్జు పట్టు**

పొగరు పట్టు.

ప్రభులిం 4.135. పుట.

**గజ్జలాడు**

గర్విష్ఠి.

**గజ్జు రేగు**

విజృంభించు.

"కాలకంధరవాహంబు గజ్జు రేగ." పాండు. 4.37.

**గజ్జెకట్టు**

సభలో నిలబడు.

పూర్వం దేవదాసీలు సభలో గజ్జెకట్టి నాట్యం చేయడం ద్వారా యేర్పడినపలుకుబడి.

"నే నీరోజు భాషాసమితిలో గజ్జె కట్టాలి." వా.

**గట్టిగా**

దృఢంగా.

"వాడు రాడని గట్టిగా చెప్పగలను." వా.

**గట్టి చేయు**

దృఢపఱుచు.

బ్రౌన్.

**గట్టిపాఱు**

గట్టిపడు.

"కాకలను దేఱి గడిమీఱి గట్టి పాఱి." హంస. 5.110.

**గట్టి పెట్టు**

పూర్వం కఱ్ఱపలకకు పసరుంగో కొన్నిటిని మెదిపి పట్టించేవారు. దానిపై వ్రాసేవారు. ఆ పట్టించుటే గట్టి పెట్టుట.

"అనువుగ మిన్ను నుంగడితపాళె దమంబున గట్టిపెట్టి శో, భనతరచంద్ర దీధితుల పంక్తి జయాఖ్యసుధల్ గణించి..." హంస. 1.142.

**గట్టిముడి**

సులభంగా విడువకుండా రెండుసార్లు వేయు ముడి.

దీనికి వ్యతిరేకం 'పాంముడి.'

"గట్టి ముడి వేశాక ఇక యిది విప్పడం ఆలస్యం కాకేమవుతుంది?" వా.

**గట్టి యిడు**

గట్టి పెట్టు.

"ఇక్కడితంబు గట్టి యిడినట్టుల యున్నది కప్పు దేఱుచున్." పాండు. 5.80.

చూ. గట్టిపెట్టు.

**గట్టివరహాలు**

నగదు, రొఖ్ఖం.

"కుమార్తె వివాహంలో చదివించిన పదివేల గట్టి వరహాలు." వా.

**గట్టివా**

మాటకారి, ధూర్తురాలు.

**గట్టివాడు**

బాగా ఎఱిగిన వాడు; లోబడని వాడు.

"వాడు వ్యాకరణశాస్త్రంలో గట్టి వాడు." వా.

"వాడలా మాటలకు బెదిరిపోయేవాడు కాదు - గట్టివాడు మఱి." వా.

**గట్టివాయి**
గయ్యాళి.

**గట్టివాలు**
సైరంధ్రి. ఇతరుల ఇళ్ళలో గంధ పుష్పాద్యలంకారా దులు చూచే స్త్రీ; గంధ పుష్పాదు లమ్మే స్త్రీ.

**గట్టి వైసు**
ప్రౌఢవయస్సు.

**గట్టు చేరినంత పుట్టివానికి బొమ్మ గట్టినట్టు**
'అక్కఱ తీరినతర్వాత అక్క మొగుడు కుక్క' వంటి పలుకుబడి.

"గట్టు చేరినంతఁ బుట్టివానికి బొమ్మ, గట్టుసామ్య మాయెఁ గదవె చెలియ!"
రాధి. 3.

**గట్టెక్కు**
కష్టమునుండి బయటపడు.

"సమరంబున నరి నేలపట్టి కార్యంబు గట్టెక్కించు కొనువాఁడను."
ధర్మజ. 53. పు.

**గడ కట్టు**
తెగించి కూర్చుండు.
పదుగురిలో పడుటకు సంకో చించక పోవు.
బొమ్మరిది గడకట్టి దాని మీద నిలిచి ఆడడంపై వచ్చిన పలుకుబడి.

**గడకు గట్టిన పాత**
చంచలము.
తాళ్ల. సం. 11. 3. భా. 125.

**గడగట్టి**
గట్టిగా; బాహాటంగా.
"రామమూర్తికిన్, రెంటవసాటి దైవ మిఁక లేఁ డనుచున్ గడగట్టి...చాటె దను."
దాశ. శత. 34.

**గడగడ పడు**
భయపడు.

**గడగడ పఱచు**
భయపెట్టు.

**గడగడలాడు**
భయపడు.
"వాని పేరెత్తితే ఊరంతా గడగడ లాడి పోతారు."
వా.

**గడప తొక్కు**
ఇంటికి వచ్చు.
"ఇకమీద నీ గడప తొక్కితే న న్నడుగు."
వా.

**గడప దాటు**
ఇల్లు దాటి బయటికి వెళ్ళు.
"పదేళ్లయింది కాపరానికి వచ్చి. ఆవిడ గడప దాటి యెఱగదు."
వా.

**గడప దిగి....**
ముందు బయటికి వెళ్లి – తర వాత మాట్లాడు అనే అర్థంలో కోపావేశంతో అనుమాట.
"ముందు గడప దిగి మాట్లాడు." వా.

**గడపలో కాలు పెట్టు**
ఇంటిలో అడుగు పెట్టు, గృహ

ప్రవేశము చేయు, కాపురమునకు వచ్చు.

"ఆ పిల్ల యేవేళప్పుడు గడపలో కాలు పెట్టిందో యేమో! అన్నీ కష్టాలే. అన్నీ నష్టాలే." వా.

గడబడ

అల్లరి.

గడబిడ

అల్లరి.

గడబిడ అగు

గందరగోళ మగు.

"దొంగలు పడ్డా రని ఊరంతా గడబిడ అయింది." వా.

చూ. గడబిడ చేయు.

గడబిడ చేయు

అల్లరి చేయు.

"పోలీసులు దిగి ఆ ఊరంతా గడబిడ చేసి పోయారు." వా.

గడవ నీద వశమె ?

దాట సాధ్యమా ?

"...బీము గడవ నీద వశమె." భార. ఉద్యో. 2.190.

అతనిని మించి పోగలమా ? అనుట.

గడి కట్టు

తెగించి బజారున పడు.

దొమ్మర గడిమీద నిలబడి సాము చేయుట సిగ్గుమాలి తెగించుటగా భావిత మై తద్ద్వారా యేర్పడిన పలుకుబడి.

"గడి కట్టి కూర్చుంది రా అది. దానితో టికి పోతే మన మాన మే పోతుంది." వా.

గడిచీటి యిచ్చు

విడుదలపత్ర మిచ్చు.

"కర్మపు కోట్లకు గడిచీటిచ్చెను, నిర్మలమతులకు నేఁ డిపుడే."

తాళ్ల. సం. 11.2 భా. 43.

గడికాళ్ళు వేయు

పశువుల కాళ్ళకు బందాలు వేయు.

శ. ర.

గడితపడు

గట్టిపడు.

గడితలవాడు

ఒకవిధ మైన ఆయుధం ధరించిన సైనికుడు.

కుమా. 11.40.

చూ. ఈటెకాడు.

గడిదేఱు

ఆఱితేరు.

"వెడవెడ దుర్వ్యవహారపు, నడవడి గడిదేఱి..."

పాండు. 3.14.

"అశ్రాంతుని మన్ననలవలన గడిదేఱి వెసన్." శుక. 1.301.

"మిక్కిలిన్, జెగువరి కంతుకేళి గడిదేఱినజాణ." నిరం. 2.35.

గడిపోతు

ఆబోతు; దున్నపోతు.

"గడిపోతువలె మేనికండలు పెంచి." గౌర. హరి. ద్వి. 556.

**గడిమీఱు**

గడిసాములు చేసి తయారగుట పై వచ్చిన పలుకుబడి. ఆరితేరిన అనుట.

"శాకలను దేఱి గడిమీఱి గట్టిపారి." హంస. 5.110.

చూ. గడిదేరు.

**గడియకుడుక**

గడియలు తెలిసేందుకై చిల్లి పొడిచి నీళ్ళబానలో ఉంచిన గిన్నె. అది ఒక్కసారి మునగగా ఒక గడియ అని లెక్క కట్టేవారు.

"గడియకుడుక మునుంగుట గని గురుండు, తెల్లవాఱెడు నని పఱతెంచి పలుక." కువల. 2.125.

చూ. గడెకుడుక.

**గడియదూరము వెడల్పు (నది)**

దాటుటకు ఒక గడియ కాలము పట్టు వెడల్పు గల (నది).

కాశీయా. పు. 7.

**గడియ యొక్కయుగముగా తోచు**

క్షణ మొక యేడుగా తోచు. మనసులోని ఆ వేదనను తెలిపే పలుకుబడి.

"తుంట విల్తుఁడు వాఁడితూపుల నేయంగ, గడియ యొక్కయుగంబు గాఁగఁ దోఁచె." ఉషా. 1.67.

**గడియారము**

గంటలు తెలిపే యంత్రం.

"ఆనలినాయతాక్షు గడియారమునం దభిసారికాజిఘాం, సానిరత ప్రసూన శరచాపగుడధ్వనులో యనంగ ఘం,టానినదంబు లయ్యెడ వినంబడియెన్." పారి. 2.50.

**గడిరాజు**

వీరుడు.

తాళ్ల. సం. 11.3 భా. 125.

**గడుసరి**

గడుసైనవాడు, గడుసైనది.

**గడుసువడు**

మొండి కెత్తు, గట్టిపడు, బాడబాఱు.

"గురుజనము శిక్షింపక, గడుసువడి." పాండు. 3.14.

**గడుసుపిండం**

చాలా గడుసరి.

"'వాడెక్కడ? గడుసుపిండం. నీలాంటివాళ్ల చేతికి దొరుకుతాడా?" వా.

**గడుసుబుఱ్ఱ**

మంచి తెలివైన.

**గడుసురాలు**

గట్టి ఆడుది.

**గడెకుడుక**

గడియను కొలుచు గిన్నె. పూర్వం గడియారపుబానలో నీళ్లు పోసి ఉంచేవారు. గడియలు కొలుచుటకు చిల్లిగిన్నెను అందులో ఉంచేవారు. నీ రందులో నిండి

అది మునిగి పోగానే ఒక గడియ అయిన దన్నమాట.

"అంచల సూర్యచంద్రులనే గడె కుడుకల, మంచి కొలిచి పోసీని మను కొని కాలము."
తాళ్ల. సం. 6.172.
చూ. గడియకుడుక.

## గడె గడెకు

మాటిమాటికి, గడియ గడియకు.

"గడెగడెకును జెట్టై నిడియున్న గడి తంపుగ, జలువలు గట్టును జెలువు దనర." హంస. 3.77.

## గడేకారితనము

నోటి పెద్దతనము.

"ఔర! ధీరులరై గడేకారిపదవి, కాస చేసితిరే మందు మయ్యా మిమ్ము." గీర. 101.

## గడ్డం కింద చెయి పెట్టుకొను

విచారమును సూచించు చేష్ట.

"ఏమిటోయి! గడ్డంకింద చెయి పెట్టుకొని కూర్చున్నావు? మీ ఆవిడ ఇప్పుడప్పుడే రానని రాసిం దేమిటి?" వా.

## గడ్డం గోకుకొను

సంధిగ్ధావస్థలో పడు.

"వా డేమీ తోచక గడ్డం గోక్కుంటూ కూర్చున్నాడు." వా.

## గడ్డతీరు తీయు

మాగాణిలో ఎత్తుగా ఉన్న నేలను త్రవ్వి నీరు పారుటకు వీలుగా చేయు.

## గడ్డపాఱ మ్రింగినట్లు ఉండు

బిఱ్ఱబిగుసుకొని ఉండు.

గడ్డపాఱను మ్రింగినప్పుడు అది వంగదు కనుక బిఱ్ఱబిగుసుకొని కూర్చుండు నను ట్లపై నేర్పడినది.

"గడ్డపాఱయు మ్రింగిన గతిని బిఱ్ఱ, బిగిసి కూర్చుండుటలు లేక పెద్దమనము, కలఁగ." కళా. 7.29.

## గడ్డపొయ్యి

గడ్డలతో ఏర్పఱచిన పొయ్యి.
శ. ర.

## గడ్డము పట్టుకొను

ప్రాధేయపడు; బ్రతిమాలు.

"తన కంఠంబును గౌఁగిలించి యొక చేతన్ గడ్డముం బట్టి..."
కళా. 5.67.

## గడ్డము మాయు

గడ్డము పెరుగు.

"గడ్డం మాసింది. ఈరోజైనా క్షవరం చేసుకోవాలి." వా.

## గడ్డి కఱచు

చూ. గడ్డి తిను.

## గడ్డి తిను

నీచమునకు లోబడు.

"వాడు ఏమిటికైనా గడ్డి తినేరకం."
చూ. గడ్డి కఱచు

## గడ్డి పరకవంటి

అల్పమైన.

"వాడు కేవలం గడ్డిపరక వంటివాడు."
వా

**గడ్డి పెట్టు**

బుద్ధి చెప్పు.

"వాడికి నీవయినా కాస్త గడ్డి పెట్టు." వా.

"నీ వీపని చేసి అక్కడికి వెళ్లావంటే గడ్డి పెట్టి పంపిస్తారు." వా.

**గడ్డిపోచతో సమానము**

లెక్క లేదనుట.

"వాడికి నేనంటే గడ్డిపోచతో సమానం." వా.

రూ. గడ్డిపరకతో సమానం.

**గడ్డిబొద్దు**

వరిగడ్డితో చుట్టిన చుట్ట కుదురు; గడ్డిమోపు.

"గడ్డిబొద్దునువలె మేను గానిపింప." చంద్ర. వి. 1.69.

**గడ్డుకొను**

ఎక్కువగు; అతిశయించు.

**గడ్డుగా**

క్లిష్టముగా.

"ఈ జ్వరం ఏమిటో గడ్డుగా తయారయింది. నాలుగునెల లయినా సెమ్మదించడం లేదు." వా.

**గడ్డుమడు**

ఎగురు

"హృదయంబుల చలువలం ద్రోవ యడ్డగించి గడ్డుమటికి యాక్రమించెనో." ప్రభా. 5.57.

**గడ్డురోజులు**

గడచుట కష్టమైన రోజులు.

"ఈ గడ్డురోజుల్లో పనిమందిని పెట్టుకొని మనమేం పోషిస్తాం?" వా.

**గడ్డుసమస్య**

కఠినసమస్య.

"ధరలను అదుపులో పెట్టడం ఈరోజు ఒక గడ్డుసమస్యగా తయారయింది." వా.

**గణన కెక్కు**

ప్రసిద్ధి చెందు.

"కల్పభూజవిభూతి గణన కెక్కు." రుక్మాం. 1.16.

**గణపతి పూజ**

ప్రారంభము, అంకురార్పణము.

ప్రతీ కార్యాన్నీ తొలుత గణపతిపూజ చేసి ఆరంభించుట వైదికాచారము. అది ప్రారంభమునకు ప్రత్యామ్నాయంగా పలుకుబడి అయినది.

"తిరుగం గలహమునకు గణపతి పూజ నారంభించుచుంటివా?" సాక్షి. 240. పు.

**గణవర్ణన పదములు**

ప్రమథాది గణములను వర్ణించే పాటలు. గేయవాఙ్మయంలో ఇది ఆనాడొక నిర్దిష్టశాఖ అయి ఉంటుంది.

పండితా. ప్రథ. వాద. పుట. 513.

**గణానాం త్వా చేయు**

గంట కొట్టు.

వైదిక పరిభాష.

'గణానాం త్వా గణపతిగ్ం

హాహామహే' అని ఘుంటూ నాదం చేయుట అలవాటు. దానిమీద వచ్చిన పలుకుబడి.

## గణికు లొప్పిన గవ్వలు

చెల్లుబడి గలవి.

గవ్వలు ఒకప్పుడు నాణ్యాలుగా ఉండేవి. అయితే గణికులు ఒప్పినవాటికే మారకపు విలువ.

శంఖంలో పోసింది తీర్థం అనుట వంటిది.

వేమన. 49.

## గతజలసేతుబంధనము

వ్యర్థము.

"ఇంక నమ్మాట లాడుట గతజల సేతుబంధనంబు. దానిం జాలింపుము."

భార. భీష్మ. 3.84.

చూ. గతోదకబంధనము.

## గత పడు

కడచు; మరణించు.

"హతశేషు లగురాక్షసావలి చెప్ప, గతపడ్డ యమ్మహాకాయునిఁ దలఁచి."

రంగ. రా. యు. 378.

## గత మగు

చనిపోవు.

"ఖరదూషణాదులు గత మైనచోట."

పల. పు. 19.

## గతము సేయు

చంపు.

పండితా. పర్వ. 521. పు.

## గతాగతద్విరదకర్ణములు

చపలములు, నిలకడ లేనివి. ఏనుగ చెవులు ఎప్పుడూ అటూ ఇటూ అల్లాడుతూ నిలకడగా ఉండ వనుటపై వచ్చినది.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 418.

## గతానుగతికము

గొర్రెదాటుగా పోవునది.

"తిర్యక్కతి తా గతానుగతికం బౌఁగా కుశాగ్రీ హరీ!" ఆము. 4.25.

## గతానుగతికో లోకః....

జనం గొర్రెదాటు రకం.

"గతానుగతికో లోకో, న లోకః పారమార్థికః." నీత్యుక్తి.

## గతి చెడ్డ చెడుగు

గతి మాలినవాడు.

"గతి చెడ్డ చెడుగు తెక్కలి బొక్కలాఁడు."

గౌ. హరి. ద్వితీ. పం. 2034.

పై ప్రయోగములో శ్లేష గుఱుతింప దగును.

## గతి పడు

ప్రాప్త మగు.

## గతిమాలిన

దిక్కుమాలిన.

"ఎక్కడి గతి మాలినపిశాచికవో నీ మాటల్." కళా. 3.204.

## గతిమాలిన చేతలు

దిక్కుమాలిన పనులు.

"గతిమాలిన చేతలు." సింహా. 7.3.

## గతి మాలు

దిక్కు మాలు.

"తిరువేంకటేశుఁ జేరక ... మిగుల గతి

మాలెఁ బ్రాణి." తాళ్ల. సం. 5.101.

**గతి లేక**

మఱొక మార్గము లేక.

"గతి లేక పోయి రాఘవు మఱుఁగుఁ జొచ్చె రవి, సుతుఁడు నా కేమిటికి సుదతి యీరోఁత." సుగ్రీ. పు. 27.

"గతి లేక నీ కొంపకు వచ్చాను." వా.

**గతి సేయు**

కాపాడు.

ద్వా. 5.76.

**గతోదకబంధనము**

వ్యర్థము.

"ఇంక నీ వేమి పల్కిన నృపవరేణ్య! పనికి రాదు గతోదకబంధనంబు."

హరి. 4.134.

చూ. గతోదకసేతువు, గతజలసేతుబంధనము.

**గతోదకసేతువు**

గలజలసేతుబంధనము.

పారిన నీటికి అడ్డు వేయుట వంటి నిష్ప్రయోజన మైన పని.

"ఎచటనుండి వచ్చు నీగతోదకసేతు, వులఁ బ్రయోజనంబు గలదె తండ్రి."

భోజ. 5.64.

చూ. గతోదకబంధనము.

**గత్తరపడు**

బెదరిపోవు.

బ్రౌన్.

**గదుముకొని పోవు**

తరుముకొని పోవు.

**గదురుకొను**

తిట్టు; కసుఱుకొను.

**గద్దగోరు**

వొంగల సాధనాలలో ఒకటి.

**గద్దముక్కు**

గద్దముక్కువంటి ముక్కు.

వాడి గలది, వంక రైనది అనుట.

"ఆ గద్దముక్కు ఆసామీని చూచేసరికి నాకు ఎక్కడ లేని భయం వేస్తుంది."

వా.

చూ. గరుడముక్కు.

**గద్దఱికాడు**

దిట్టతనము కలవాడు.

**గద్దెపొంకము చెప్పు**

పెద్ద సుద్దులాడు.

"కలవి లేనివి కొన్ని కొలువునఁ గూర్చుండి, గద్దెపొంకము చెప్పఁ గలరు గాక." చంద్రా. 2.49.

**గద్దె యెక్కి కూర్చొను**

గొప్పలకు పోవు.

కొత్త. 181.

**గనగన మండు**

గసగన లాడు.

ధ్వన్యనుకరణము.

**గనగన లాడు**

మండు.

**గనికట్టు**

గడ్డకట్టు.

**గనికె కుంద**

ఒక ఆట.

**గన్నెఱు కాదారి ప్రొద్దు**

నిశీథము.

"...అప్పురమునం, గన్నేరుకాండారి ప్రొద్దున భీమేశుండు సానివాడం దిరుగున్ ధూర్తప్రకారంబునన్." భీమ. 1.111.

**గప్పాలు కొట్టు**

డంబాలు పలుకు; ఊసుకోలు కబుర్లు చెప్పు.

**గబగబా**

త్వరగా.

"ఎంత గబగబా నడిచి వచ్చినా సమయానికి చేరుకో లేక పోయినాను." వా.

**గబ్బిదేలు**

అతిశయించు.

గబ్బిగుబ్బలలోని గబ్బివంటిది ఇక్కడి గబ్బి.

"మెఱుపులై మిట్టలై మిక్కిలి బిటువులై, క్రాలుకన్నుల చెన్ను గబ్బిదేఱ." పాండు. 2.91.

**గమగమలాడు**

పరిమళములు వెదచల్లు.

**గమికత్తె**

చెలికత్తె

**గమ గమ వలచు**

గమ గమ వాసన వేయు.

"కసటు వో బీఱెండం గరంగి కత్తూరినంటి, గమ గమ వలచు చొక్కపుజవాజి." మను. 2.55.

**గమికాడు**

అధిపతి

**గమి గూడు**

గుంపు గూడు.

"సాంధ్యరాగధారాళరుచుల్, గమిగూడె." నిరంకు. 2.108.

**గములు గట్టు**

గుంపులు గట్టు, గుములు కట్టు, గుమి గూడు.

"నానాదేశముల కప్పడీలు......, గముల్ గట్టి యేతేర." పండితా. ద్వితీ. పర్వ. పుట. 374.

**గములు గూడు**

గుంపులుగా చేరు.

"పాడుచు నొసంగులు వీసుచు గములు, గూడుచు నలిరేంగి యాడుచు." పండితా. ద్వితీ. మహి. పుట. 33.

**గమ్మత్తు చిమ్మ**

వేడుక కల్పించు.

"గమ్మత్తు చిమ్మ నొక కథం, గ్రమ్మఱం దెల్పెదను..." హంస. 2.6.

దీనికి దగ్గరిగా ఉన్న అనేకార్థములలో ఈ పదం వాడుకలో కనిపిస్తుంది.

"ఆ పాట బలే గమ్మత్తుగా ఉంది." వా.

"అక్కడో గమ్మత్తు జరిగింది." వా.

**గయ్యాల గచ్చులు**

గయ్యాళిగంపలు.

పండితా. ప్రథ. పురా. పుట. 343.

చూ. గయ్యాళిగంప.

**గయ్యాళిగంప**

నోటిదురుసు కలది, జగడాలమారి.

"ఆ గయ్యాళిగంప నోటి కెవరు పోతారు?" వా.

**గయ్యాళిభూమి**

సేద్యానికి పనికి రాక బీడుగా ఉన్న భూమి.

దీనినే 'గయాళు' అన్న రూపంలో శ. ర. బ్రౌను పేర్కొన్నవి, నేడు వ్యవహారంలో 'గయ్యాళి' అన్న రూపంలో వినబడుతుంది.

**గరగడ**

గళాయి. నూనె లాంటి వానిని వేరే పాత్రలోనికి వంచేప్పుడు పెట్టే పెద్దమూతి చిన్నగ్రోవి గలది.

**గరగరగా కడుగుకొను**

శుభ్రముగా కడుగుకొను.

మామూలుగా చేతులు కడుగుకొనునప్పుడు, ఇతరులు చేతులమీద నీళ్లు పోస్తుండగా రెండు చేతులనూ ఒకదానితో నొకటి కలిపి రుద్దుకొనునప్పుడు, గరగర మని శబ్ద మగుట యీపలుకుబడికి మూలము కావచ్చును. పాండు. 3.31.

**గరగర నగు**

ఇష్టపడు; మనసులో ఉత్సాహం చిప్పిల్లు.

"మగువలు గరగర నై తగు, మగవానిం జూచి వీఁడు మగఁ డెనఁ గదా, తెగు దుఃఖం బనుకొంచున్." శుక. 3.516.

"మిక్కిలి, గరగర నగు నేఱు ప్రాలకలమాన్నంబుల్." జైమి. 8.198.

**గరగర లాడు**

క్రొత్త దైన.

కొత్తబట్టలు గరగర లాడుట సహజము.

ధ్వన్యనుకరణము.

"గరగర లాడుగాఁగర..." బుద్ధ. 2.47.

**గరవడు**

గడ్డకట్టు.

**గరిగొను**

అతిశయించు.

**గరిడి కెక్కు**

ఆరితేఱు.

"హారనిభ కల యాజ్ఞ శిరమునఁ దాల్చి, గరిడి కెక్కినయంక కాఁడునుబోలె." పండితా. వాద. 176.

**గరిడి ముచ్చుదనముతో**

ఆరితేరిన నంగనాచితనంతో.

"సంయమియు ...... గానకళ లెల్ల గరిడిముచ్చుఁ, దనముతో నేర్చితి వి గద! యనుచు బలికె." కళా. 2.47.

**గరివడు**

నిలిచిపోవు; గడ్డకట్టు.

"తెలిసియుఁ దెలియను తెగ దీచి క్కిమిటూ!, కలకాల మిందునే గరివడె బ్రదుకు." తాళ్ల. సం. 9.109.

**గరివడెము**

ఒకరకమైన వడియము.

గరిసెబావి

త్రవ్విన గరిసె టంచిన చిన్న బావి.

గరుపారు

గరు కెక్కు.

"చన్నుగ్రేవలు గరుపార." రాధా. 4.56.

గరుపాఱు

గగుర్పాటు చెందు.

"గరుపాఱఁగ మేను ప్రకంపమునఁ నన్." భార. స్త్రీ. 1.45.

గరుడముక్కు

పొడువుగా ఉండి వంగిన ముక్కు.

"వాడి గరుడముక్కు చూస్తేనే కోపిష్ఠి అనిపిస్తుంది." వా.

గరుదాల్చు

గగుర్పాటు చెందు. శివ. 4.20.

గర్రన త్రేన్చు

త్రేన్పులో ధ్వన్యనుకరణము. రాధా. 5.125.

గర్భగుడి

చూ. గర్భాలయము.

గర్భగృహము

చూ. గర్భగుడి.

గర్భయాచకులు

గర్భదరిద్రులు.

"వెన్నడితిమి గర్భయాచకులభంగి." హర. 3.15.

గర్భాలయము

దేవాలయంలో మూలవిరాట్టుండే గది.

గర్వగ్రంథి

చాలా గర్విష్ఠి.

"వాడు వట్టి గర్వగ్రంథి. ఎవణ్ణీ లెక్క పెట్టడు." వా.

గఱి గట్టు

అరివర్గము.

గఱు వ్రాల్చు

గగురుపాటు చెందు. కాశీ. 2.149.

గలగల మ్రోయు

ధ్వన్యనుకరణము.

"గలగల మ్రోయునందెలును..." కళా. 6.200.

గలిబిలి చేయు

అల్లరి పెట్టు.

"గలిబిలి చేసి రవ్వ లిడఁగా." రాధి. 4.15.

గవిచికొను

కప్పుకొను.

"పచ్చని కంబళి గవిచి కొన్న విధంబున." కుమా. 6.100.

గవిసెన పుచ్చు

ముసుగు తీసివేయు.

పీణె, కుంచె, ఇలాంటివానికి తిత్తి కుట్టి అందులో వాని నుంచుతారు. నేడు గౌసెన అని పీణెలాంటివానిపై తిత్తు

లకు ముసుగులకు వాడు
తారు.
"గవిసెన వుచ్చిన, కుసుమబాణునీలి
కుంచి వోలె." కుమా. 7.78.

## గవుదలగంగమ్మ
గవుదలు వాచే ఒక వ్యాధి.

## గవ్వకు చేయి సాచు
నీచానికి పాల్పడు.
"క్రమముగ నాఁడునాఁటికిని గవ్వకు
నేనియుఁ జేయి సాచు రా..."
శతా. 82.

## గస్తు దిరుగు
గస్తీ తిరుగు.
"కోలలవారిగాఁ గొని గస్తు దిరిగి."
గా. హరి. ద్వితీ. పం. 1665.

## గళస్థ కంఠస్థగా ఉండు
పేచీ యేర్పడు.
"వాడితో గళస్థ కంఠస్థగా ఉంది."
వా.
"వీడికీ నాకూ గళస్థ కంఠస్థగా
ఉంది." వా.

## గళ్లు బాళ్లు చిక్కు
పూర్తిగా చిక్కు.
"ఆకర్ణింపుము మత్స్యమాగమనకార్యం
బష్టదిక్పాలకీ, లోకంబుల్ విదళించి
వచ్చితివి గళ్లుంబాళ్లు చిక్కఁగ నా,
లోకంబుల్ మనుపోలె నుండ..."
వరాహ. 3.67.

## గాండ్రు గాండ్రు మను
పులి అఱచు.
ధ్వన్యనుకరణము.

## గాండ్రు పెట్టు
గాండ్రు మని అఱచు.
"మండ్రాటముగ నిత్తీ మాంసంబు
మెసవి, గాండ్రుపెట్టెడు పెద్ద గండు
మెకాలు." ద్విప. సారం. 2.30. పు.

## గాజు గడపినట్లు దినము గడుపు
మిక్కిలి జాగ్రత్తగా దినము
గడుపు.
గాజువస్తువులను జాగ్రత్తగా
పట్టుకొనక పోతే కింద పడి
పగిలిపోతాయికదా! దానిపై
వచ్చిన పలుకుబడి.
"పరనారీజనుల కవిఱ్ఱ యాతఁడు, గాజు
గడపినట్లు దినము గడపుచునుండెన్."
శుక. 3.243.

## గాజుపడు
భిన్నాభిన్నమగు.
"ఆజగదేకవీరుఁ డగునర్జునుఁడు...పదు
నార్వుర నొక్కపెట్టునం, గాజు
పడంగఁ గూల్చె." చిత్రభా. 3.121.

## గాజుపాఱు
1. రంగు మాఱు.
"కందవు గాజుపాఱవు వికారము
నొందవు...జంతుదేహముల్."
కాశీ. 3.105.
"నెఱయు నర్మిలి నెనయు నీ నెమ్మొ
గంబు, ఘనభుజంగవిషవ్యాప్తి గాజు
వాఱి." మార్క. 1.254.
హరిశ్చ. 4.39.

2. ఎఱ్ఱబడు.
"పదతలంబులు గాజువాఱవు నిప్పఁ
జెద లంటునే."
గా. హరి. ద్వితీ. పంక్తి. 1831.
చూ. గాజువాఱు.

**గాజుపూసకు బంగారు పోఁగు**
అయోగ్యుని గౌరవించు.
అది తగ దనుట.
బాలనీతి. 57.

**గాజుబన్నరులు**
గాజుబొమ్మలు.
"తరుణులు చిల్క బొమ్మలును దంతపు బొమ్మలు మేలి గాజు బన్నరులును బ్రాణిచొప్పికలు నల్గడ నొలిన పేర్చి." కుమా. 3.36.

**గాజులను తొడవుగా కల్పించు**
పౌరుషహీనులను చేసి ఇంట కూర్చుండబెట్టు; గాజులు తొడుగు.
"కలరా యింతకు మున్ను యాదవులచేఁ గప్పంబు చెప్పింపఁగాఁ, గల రారాజులు గాజులం దొడవుగాఁ గల్పించి రా కాకులం, గలకంఠంబులఁ జేసినా?" ఉ. హరి. 4.157.

**గాజుల పేర్లు రోకలి దాకినట్లు**
శక్తిహీనులు శక్తిమంతుని ఎదుర్కొనుటలో సామ్యం; తగరు కొండను తాకినట్లు వంటిమాట.
"గాజుల పేర్లు రోఁకలి దాఁకఁగతి దోఁప, ముంజేత నంగముల్ మోఁది మోఁది." భాస్క. యుద్ధ. 675.

**గాజులలంక దున్న**
సోమరి; స్వేచ్ఛాచారి.

**గాజులవాని మర్యాద**
తనకు తానే చేసుకొను మర్యాద.
గాజులవాఁడు ఎక్కడికి వెళ్ళినా కంబళి కూడా తీసుకొని వెడతాడు. అది వేసుకొని కానీ తాను కూర్చోడు.
"ఇదేమిటోయ్ బావా! నిన్ను నీవే పొగుడుకుంటున్నావ్ - గాజులవాని మర్యాదగా ఉంది." వా.

**గాజులు తొడుగు**
పౌరుషహీనుని చేయు.
మగవాని విషయంలో ఉపయోగించే మాట.
"వాళ్ళందరూ కలిసి వీణ్ణి గాజులు తొడిగి కూర్చో బెట్టారు." వా.

**గాజులు తొడుగుకొని కూర్చుండు**
ఏమీ చేతకాక మూల కూర్చుండు. పౌరుషహీనముగా ఉండు.
మగవానివిషయంలోనే దీన్ని ఉపయోగిస్తారు.
"వాళ్ళంతా నానా హంగామా చేస్తుంటే నువ్వు గాజులు తొడుగుకొని కూర్చుంటే లాభమేముంది?"
"ఇక్కడ ఎవరూ గాజులు తొడుగుకొని కూర్చో లేదు." వా.

**గాడి కట్టు**
పాడుకొను.
"కాంతకు నీకు వలపు గాడి గట్టెని." తాళ్ల. సం. 8.139.

**గాడిదకు గంత గట్టినట్లు**
అనర్హునికి అప్పగించిన పని యెడల ఉపయోగించే సామ్యం.

గాడిద గుఱ్ఱమువలె సవారికి పనికి రాదు గదా!

"వీడికి ఆ స్కూలుపని అప్పగించడం గాడిదకు గంత గట్టినట్లే." వా.

ఇక్కడ గంత=జీను.

## గాడిదగత్తర

1. గందరగోళము.

"గాడిదగత్తర వ్రాతలు."
గుంటూ. పూ. పు. 43.

2. అల్లరి.

"...ఇంత మాదిగమంచ మగునప్పుడు శ్లోకము కీర్తనము గాక సెంత గాడిద గత్తర యగునో శ్లోకములోని శబ్దములకు..." సాక్షి. 285 పు. 20.

## గాడిదగుడ్డు

వట్టిది.

"...కోటలో నే మున్నదిరా గాడిద గుడ్డు. నోటిలో నుండవలయునురా..."
సాక్షి. 176. పు.

## గాడిదచాకిరి

ఎక్కువ చాకిరి.

"వాడు వాళ్లింట్లో గాడిద చాకిరీ చేయ లేక ఛస్తున్నాడు." వా.

## గాడిదచావు చచ్చు

దిక్కు లేనంత చాకిరీ చేసి దిక్కుమాలిన చావు చచ్చు.

"వాళ్లింట్లో పనంతా నెత్తిన వేసుకొని చేశాడు. కడకు ఒక మంచి మాట లేకుండా గాడిదచావు చచ్చాడు."
వా.

చూ. కుక్కచావు చచ్చు.

## గాడిదపిల్ల కోమలికం

త్వరలోనే మాసిపోవు కోమలత్వం.

"ఆ యింటి పిల్లల దంతా గాడిదపిల్ల కోమలికం. ఈడు వచ్చేసరికి దిమ్మిడీకి పనికి రాకుండా తయా రవుతారు."
వా.

రూ. గాడిదపిల్ల కోమలం.

## గాడిపొయ్యి

ఎక్కువ పాత్రలలో వంట చేయుటకు వీలుగా నేలపై ఒక గాడిని త్రవ్వి యేర్పరచిన పొయ్యి.

పెండ్లిండ్లు వగైరాలలో నేటికీ గాడిపొయ్యిలు త్రవ్వడం ఆలవా టున్నది.

"ఇంతమందికీ భోజనా లమరా లంటే యింకో గాడిపొయ్యి తవ్వాలిసిందే."
వా.

## గాతు గావించు

త్రేల్చు.

"...పిరంగు, లొక్క మొగి గాతు గావింప నుక్కు మెఱసి, గుండ్ల గుంపులు జడివాన గురిసినట్లు." రంగా. 3.66.

## గాదములోని కాయవలె

మాటుపడి, నిక్షేపంలా.

"గాదమున మాటు వడియున్న కాయ వోలె." విక్ర. 4.60.

## గాదములోని దోసకాయవలె

మాటుపడి, నిరుపద్రవంగా.

"అలఘుబలాఢ్యుఁ డయ్యును దయాళువు గావున శాంతచిత్తుఁ డై, నిలిచిన

తంద్రి కాలమున నెన్మది గాదనులోని దోసకా,యలువలె నున్నరాజులు...''
వరా. 3.24.

## గాదియ కొలుచు

ఇంటిగాదెలో నున్న ధాన్యం వలె అందుబాటులో నుండు నది.

"గాదియ కొలుచౌనా నీ దొరతనము.''
పండితా. ప్రథ. పురా. పుట. 360.

## గాదెల కొలుచు

అందు బాటులో నున్న అపూర్వభాగ్యం.

కొంగుబంగారం వంటిమాట.

"అమృతమథను మహి మద మాగాదెల కొలుచు.'' తాళ్ల. సం 10.51.

చూ. గాదియ కొలుచు.

## గాదెల బోయు

కూడబెట్టు.

"తిన్నని కర్మములు గాదెలఁ బోసే రయ్యా.'' తాళ్ల. సం. 7.32.

## గానరస మాను

పాట విని ఆనందించు.

"రసికులు మీగానరస మాన వచ్చిరి, పాడరే శివభక్తి పాడుగాను.''
శా. మా. 4.35.

## గానుగ ఎద్దు

ఇతర ప్రపంచం తెలియకుండా అందులోనే పడి కొట్టుకొనువాడు.

"వాడు గానుగెద్దులా ఆ సంసారంలో పడి తన్నుకుంటున్నాడు.'' వా.

గానుగెద్దు గానుగు చుట్టూనే ఎప్పుడూ చుట్టి చుట్టి తిరగడంపై వచ్చిన పలుకుబడి.

## గానుగమొద్దు

ఎద్దు మొద్దు స్వరూపం అనుట వంటిది.

శరభాంక. 45.

## గానుగాడు

సూనె తీయు.

"నువ్వులు రేపు గానుగాడించాలి.'' వా.

## గానుపున బెట్టి యార్చు

శిక్షించు.

గానుగలో పెట్టి తిప్పి నులిమి వేయు.

"అతని వంశం బెల్లన్, గానుపునఁ బెట్టి యార్చిన నేనియుఁ జాలను.''
కుమా. 2.96.

## గాభరా పడిపోవు

భయభ్రాంతి యేర్పడు.

"జేబు తడివి చూచుకొంటే పర్సు కనిపించక పోయేసరికి గాభరా పడిపోయాను.'' వా.

## గామిడికత్తె

దుష్టురాలు.

## గామిడికాడు

దుష్టుడు.

## గాముల మోచిన గంప

ప్రమాదకరము.

తాళ్ల. సం. 4.122.

## గాములువారు

చీకటిపడు, కాలహరణమగు.

"గాములు వారెడి పొద్దు కావలి కాంగ్లాల (ర)" శాశ్ల. సం. 10.166.

**గారడీసంసారము**

ఏమీ లేకున్నా, ఉన్నట్లు ఆడంబరంగా కనిపించే సంసారము.

రామరామ శత. 12.

**గార ద్రావిన మీనువలె**

ఆలీ జాలితో.

ఆవాలు నూరి త్రాగినట్లు అనుట వంటిది.

"గార ద్రావిన మీను సంగతి మనోజ, వేదన నతండు పొరల..."

వైజ. 2.140.

**గారము చేయు**

బుజ్జగించు; సరస మాడు.

"సకియ నీ యింటికి సారంగధరుఁడు, ఒక పావురము వెంట నుతికి రాలేదె, రాఁగానె నీవు గారము చేయ లేదె."

ద్విప. సారం. 3.104. పు.

**గాలము వేయు**

ఎత్తు వేయు; ఎక్కు పెట్టు.

"వా డప్పుడే ఆ ఆస్తికి గాలం వేస్తున్నాడు. పిన్నమ్మను విడిచి ఒక క్షణం ఉండడం లేదు." వా.

**గాలికబుర్లు**

వట్టి మాటలు,

"అఁ, ఈ గాలికబుర్ల కేం లే. అసలు సంగతి ఎవరికీ తెలియదు." వా.

**గాలికి**

1. వట్టినే, అనవసరంగా.

"గాలికి వాడి మాట విని వెయ్యి రూపాయలు పోగొట్టుకొన్నాను." వా.

2. స్వేచ్ఛగా; అప్రయత్నంగా.

"వాడు గాలికి తిరుగుతున్నాడు." వా.

"వాడి కేపో గాలికి ఆ ఆస్తి వచ్చి పడింది." వా.

**గాలికి పుట్టు**

నిందార్థంలో ఎవడికి పుట్టెనో తెలియదు అనుపట్ల ఉపయోగిస్తారు.

"వా డేపో గాలికి పుట్టి గాలికి పెరిగాడు. వాడికి నీతులూ నియమాలూ ఎట్లా వస్తాయి?" వా.

**గాలికి పెరుగు**

ఇతరుల పోషణ లేకయే పెరుగు.

"వాడికి పాపం ఎవరున్నారు? గాలికి పెరిగాడు." వా.

**గాలికి పోయిన పేలపిండి కృష్ణార్పణం**

ఎలాగూ తనకు రాని దని తెలిసి, తన కిష్టం లేక వదలి వేసినట్లుగా నటించినప్పుడు ఉపయోగించే పలుకుబడి.

"ఆ ఉద్యోగం కోసం వాడు నానా యాతినా పడ్డాడా? అది రాకపోయే సరికి ఇప్పుడు అందులో ఏ మంచి అవకాశమూ లే దంటూ మొదలెట్టాడు. పైగా తన వాడికే దొరికిం దని సంతోషంగా ఉం దంటాడు. గాలికి పోయే పిండి కృష్ణార్పణం." వా.

**గాలికి పోయే ఒగుడాకు వలె**

మరీ పల్చగా ఉన్నా రనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"గాలిఁ బోయెడి యొగుడాకు గతి."

కుచేలో. 2.7.

"ఆ పిల్లేమమ్మా అలా గాలికి పోయే ఒగుడాకులా ఉంది?" వా.

ఒగుడాకు అంటే జొన్న సజ్జ వగైరా దంట్లపై నున్న ఆకు.

**గాలికుంటు**

పశువులకు గిట్టలు పుండు పడే వ్యాధి.

**గాలికొమ్ము**

వాద్యవిశేషం.

**గాలి కైనా చొరగూడని చోటు**

దుష్కరప్రవేశమైన స్థలము.

"తిరిగితిమి గాలి కైనం, జొరఁగూడని చోటు లెల్ల సూర్యమరీచుల్..."

ఉ. హరి. 5.313.

చూ. పోతుటీగకు చొరరాని.

**గాలిగంగమ్మవలె తిరుగు**

స్వేచ్ఛగా నిష్ప్రయోజనంగా తిరుగు.

"వాడికి పొద్దున్నుంచీ గాలిగంగమ్మలాగా తిరగడంతోనే సరిపోతుంది."

వా.

"వాడు పెళ్లీ పెటాకులూ లేక గాలి గంగమ్మలా తిరుగుతున్నాడు. వా.

**గాలిగంగలు**

గాలిగంగమ్మలు, క్షుద్ర దేవతలు.

గాలిగంగమ్మ ఒక దేవత.

"జాతర సాటించె ... గాలిగంగల కెల్లన్."

పాండు. 3.73.

**గాలిగంటి (టు+ఇ) దగల**

గాలిని మూట గట్టగల-అసాధ్యకార్యములను చేయగల-ఏమైనా చేయగల జాణ అను నిరసనార్థంలో.

కుమా. 8.135.

**గాలిగుడి**

సూర్యచంద్రుల చుట్టూ ఏర్పడే పరివేషం.

**గాలిగొను**

ఎండిపోవు.

"తిగ్గొలిచి గాలి గొన వైచిన కుక్కకలిమింబు గనుంగొని."

భార. శాం. 3.285.

**గాలిగోపురము**

చాలా ఎత్తైన దేవాలయముల ముందుండే గోపురం.

**గాలిగ్రుడ్డు**

చెడిన గ్రుడ్డు.

తె. జా.

**గాలిచీర**

తెఱచాప.

**గాలి తిరుగు**

మునుపటి స్థితి మారిపోవు.

"మూడు నెలలుగా నానా అవస్థా పడి పోయాను. ఈ రోజే ఒక మంచి వార్త విన్నాను. గాలి తిరిగింది కదా అని కొంచెం ఉత్సాహంగా ఉంది."

"వాడేదో యీ మధ్య శాస్త్రప్రసన్నంగా కనిపిస్తున్నాడు. గాలి తిరక్కముందే మన పని చేసుకోవడం మంచిది." వా.

గాలిదుమారము రేగు

వాదప్రతివాదాలు చెలరేగు.

"ఆ రోజుల్లో వ్యావహారికభాష పనికి రా దని పెద్ద గాలిదుమారం రేగింది." వా.

గాలిపంట

గట్టిగా వస్తుందో రాదో చెప్పలేనిపంట. శ. ర.

గాలిపటము

చూ. గాలిపడగ.

గాలిపడగ

గాలిపటము, ధ్వజము.

"పటుగతిఁ జను గాలిపడగలతోడన, కడువేగమున పెందగడియ లెగసె." కుమా. 11.51.

గాలిపాట

శాస్త్రీయంగా నేర్చుకొనక విని అనుకరించే సంగీతం. శ్రుతపాండిత్యం వంటిది.

"వాడి దేవో గాలిపాట తప్పితే నేర్చుకొన్న సంగీతం కాదు." వా.

గాలిపిశాచము

దయ్యము.

గాలి పోయు

పశువులకు పాడుడురోగము వచ్చు.

"ఊళ్లో పశువు లన్నిటికీ గాలి పోస్తూ ఉంది. మన గిత్తలను అక్కగారి ఊరికి తోలిస్తేనే మంచిది." వా.

గాలిబిళ్లలు

గవుదలు వాచు వ్యాధి.

గాలిబుచ్చు

వ్యర్థం చేయు.

"ఏకాంత మిక్కానలో, గాలిం బుచ్చెడు పౌరుషం బిది." దశ. 6.6.

గాలి బోవు

వ్యర్థ మగు. తొలగు.

"కలిగినవుడ మెల్ల గాలిఁబోయిని కల శితి విడ." తాళ్ల. 3.34.

"ఎలమి గరుడధ్వజుపై నెక్కినా విష ములు, కరగి నీరై పారి గాలిఁ బోవుఁ గాక." తాళ్ల. సం. 8.1.

గాలిమందలు

స్వేచ్ఛగా తిరిగి మేయు పశువుల మందలు. కాశీయా. 358. పు.

గాలిమాట

వట్టిమాట, జనశ్రుతి.

"మలయమారుత మైన మెలఁత దెచ్చు నటన్నఁ, గానరా దదియును గాలి మాట." తపతీ. 2.79.

గాలి ముడి గట్టు

గాలి మూట గట్టు.

"గాలి ముడి గట్టినట్టు కాయము మోచి తిమి." తాళ్ల. సం. 9.267.

గాలిమూట చిక్కు

శరీరధారి యగు.

శరీరాన్ని గాలి మూట అని వేదాంతు లంటారు.

"గాలిమూటఁ జిక్కితిమి కన్నచోటే తొక్కితిమి." తాళ్ల. సం. 9.243.

గాలిమెకము

లేడి.

**గాలిమేడలు కట్టుకొను**

మంచిని ఊహించుకొని సంతోషించు.

"వాస్తవదృష్టితో చూడాలి గాని వట్టి గాలిమేడలు కట్టుకొని సంతోషిస్తే లాభ మేముంది?" వా.

**గాలిమేతకు పోవు**

వాహ్యాళి వెడలు.

**గాలి మేసి రావడానికి**

షికారుకు.

ఇటీవల ఉరుదూ ద్వారా వచ్చిన పలుకుబడి.

"అలా గాలి మేసి రావడానికి పోయి వద్దాం. రారాదా?" వా.

**గాలిలో దీపము పెట్టి దేవుడా నీమహిమ అను**

దుష్ఫలితము తప్ప దని తెలిసి కూడా ఆ పని చేసి దేవుని మీద వేయు.

అది నిష్ప్రయోజన మనుట.

"గాలిలో, దీపము బెట్టి నీ మహిమ దేవుఁడ! యంచ న." మానిని. 6.

**గాలిలో పెట్టిన దీపము**

ప్రమాదపరిస్థితిలో ఉన్నది.

గాలిలో పెట్టినదీపం ఆరిపోక తప్ప దనుటపై యేర్పడిన పలుకుబడి.

"వాడి బతుకు గాలిలో పెట్టిన దీపం లాగా ఉంది." వా.

**గాలివార్త**

కింవదంతి.

"ఈ కలెక్టరు మారిపోతా డని యేదో గాలివార్తగా తెలిసింది." వా.

**గాలిసవారీ పోవు**

అనవసరంగా తిరుగు.

"ఆ. వాడి కేం పని? గాలి సవారీ పోవడం తప్పిస్తే." వా.

**గాలి సోకు**

దయ్యము పట్టు.

భూత ప్రేత పిశాచాదులు శరీరము లేనివిగా భావించి వానిని గాలి అనుట అలవాటయినది.

"...దాని పిలుందం, జని వీరుఁ డతని గూర్కృతిఁ, గని క్రోషం గాలి సోఁకెఁ గావలె ననుచున్." శుక. 2.540.

"ఆవిడ కేదో గాలి సోకినట్లుగా ఉంది. ఎన్ని మందు లిచ్చినా రోగం కుదర లేదు." వా.

**గావుకేక పెట్టు**

పొలికేక పెట్టు.

"గావుకేక పెట్టి ఆవిడ కింద పడిపోయింది." వా.

**గావుగొను**

బలిగొను.

పీఠి. 41.

**గావు పట్టు**

1. చంపు.

"హోమకుండములు నిర్ధూమధామంబులు, గావించి పశువుల గావు పట్టి." వరా. 5.115.

2. నాశము చేయు.

"పాదవెడు పురుషార్థముల గావు పట్టి,"

మదము మాత్సర్యంబు మట్టి మల్లాడి.”
విష్ణు. పూ. 3.

గావు వెట్టు

బలి యిచ్చు.

“గొప్ప చింబోతు కదుపులఁ గూర్చి నీకు, గావు వెట్టింతుఁ జుమ్మ యోగంగ నమ్మ!” నీలా. 1.113.

గాసట బీసట

సంస్కారము పొందనిది.

“గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వ తెనుంగువారికిన్.” నృసింహ. 1.9.

గాసర కూస రగు

గాసట బీసట యగు.

“గాసర కూస రయ్యె నని గాని వచింపరు మేలిమాట.” గీర. 28.

గాసి చేయు

బాధ పెట్టు.

“నఖంబుల గీఱుచు గాసి సేయుచు.”
భాగ. స్క. 5.106.
రూ. గాసి సేయు.

గాసిపఱచు

కష్టపెట్టు.

గాసిపఱుచు

చూ. గాసిపఱచు.

గాసి బెట్టు

కష్టపెట్టు.

“దేశాధిపోదగ్రులన్, గాసిం బెట్టి విశాపుఁ జేసె నృగునిం గంసారి సామాన్యుఁడే.” ఉ. హరి. 2.65.

గాసిపెట్టు

కష్టపెట్టు.

“గాథయౌవనమున గాసి పెట్టుటెకాక.” నిరంకు. 2.33.

గాళు చేయు

పాడు చేయు.

“ఆట తిప్పలు వుచ్చి పాట బండులు గూల్చి, కట్టువ లన్నియు గాళు చేసి.”
అచ్చ. రా. సుం. 95.

గింజ గిట్ర

ధాన్యము. జం.

“కొంచము గొంచు రం డతనిఁ గొల్చి భుజించెను గింజగిట్రలున్.”
(పద్య) బసవ. పు. 2.21.

గింజుకొను

తన్నుకొను.

తదనుగత అర్థచ్ఛాయల లోనూ కానవస్తుంది.

గిజ గిజ కుడుచు

కలవరపడు.

“కదలించి యెత్తఁగాఁ గడు నళకుఁదయి, గిజ గిజ కుడిచె నక్కోకయుండు.”

గిజగిజ తన్నుకొను

విలవిల లాడు.

“గిజగిజం దన్నుకొనుచు ధరణిం బడి పొరలువారును.” రాధా. 5.88.

గిజగిజ పడు

కలవరపడు.

గిజగిజ లాడు

తన్నుకొను.

“వాడు వానిచేతిలో దొరికి గిజగిజ లాడుతున్నాడు.” వా.

గిజిగిజి యగు

గిజగిజ లాడు, తన్నుకొను.

"క్రిందటి కూర్మము గిజిగిజి గాఁగ."
బస. 3.68.
చూ. గిజగిజ లాడు.

### గిజిబిజిగా
నమలుటలో ధ్వన్యనుకరణము.
"గిజిబిజిఁ బిప్పిగా నమలు గిత్త..."
కళా. 5.72.

### గిటకకాయ
పొట్టివాడు.

### గిటగిటన
పొట్టిది.
"హోమకూటంబు గిటగిటన."
కాశీ. 1.100.
'గిటకకాయ' అన్న రూపం పొట్టివాడు అన్న అర్థంలో వాడుకలో ఉంది.

### గిటగిట నగు
దుర్బలముగా నుండు.
"గిటగిట నైన యీ కీరవాణికిని."
గౌ. హరి. ద్వితీ. పం. 917.

### గిటగిట మను
కదలు; చలించు.
"చనుఁగవ వ్రేఁగున గిట గిట మను నెన్నడుము."
ప్రభా. 2.83.

### గిట్ట కఱచు
పళ్లు తీయ వీలు లేక కఱచుకొని పోవు.

### గిట్టిపట్టు
గట్టిగా పట్టుకొను.
శుమా. 1.102.

### గిట్టుబాటగు
లాభము వచ్చు.
"ఈ సూత్రం అమ్మితే పది రూపాయలు గిట్టుబాటవుతుంది." వా.

### గిడసబారు
పొట్టిగానే ఉండిపోవు.
"ఏడేమిటిలా గిడసబారిపోతున్నాడు." వా.
"పొట్లకాయలన్నీ గిడసబారినవి." వా.

### గిన్నెబొట్టు
మంగళసూత్రము.
తాళిబొట్లు రెండు రకాలు. ఒకటి మగడు కట్టేది. అది గుండ్రముగా కాసువలె ఉండి, మధ్యలో చిన్న ఉబ్బు ఉంటుంది. గిన్నెబొట్టు గిన్నెవలె గుండ్రంగా ఉంటుంది. ఇదే చిట్టిబొట్టు కావచ్చు. ఇది పుట్టింటివాళ్లు ఇస్తారు.

### గిరవుంచు
కుదువ ఉంచు.
ఫ్రాటుగా నుంచు.
"భవనాభ్యంతర శేషిత రత్నగతుక, భ్రగ తనుసంతతిం బ్రహ్మభార్యఁ బురికి గిరవుంచె వార్ధి నాఁగ."
ఆము. 1.54.

### గిరవు పెట్టు
1. కుదువ పెట్టు.
"గిరికుచము లివిగో కృష్ణరాయా, గిరవు పెట్టకుం డాన కృష్ణరాయా."
తాళ్ల. సం. 8.174.

"కనుదోయి మెఱుఁగులు కంతుతూపుల కడ,గిరవుగాఁ బెట్టితే హరిణనయన."
విక్ర. 7.62.

2. కానుక యిచ్చు.
వరాహ. 2.113.

## గిరికీలు కొట్టు

పల్టీలు కొట్టు.

## గిరికొను

వ్యాప్త మగు.

"తఱచుగఁ గూలినకరులున్, గిఱికొని యెన్ సమరమేదినీతల మెల్లన్."
భార. భీష్మ. 2.136.

## గిరుక్కున (మరలు)

ధ్వన్యనుకరణము.

"హేమావతి వినోదకేళిగతి గిరుక్కున మరలి వచ్చి యాకథ వినియెద..."
హంస. 1.200.

చూ. గిరుక్కున మళ్లు.

## గిరుక్కున మళ్లు

గిర్రున వెనుతిరుగు.

"అటు గిరుక్కున మళ్లి..."
రాధి. 1.124.

## గిరుల తాతలు

కొండలకంటె పెద్దవి.

"తత్పరిసరవర్తులై గిరులతాత లనం గపియూథనాథులు..."
భాస్క. యుద్ధ. 319.

## గిఱికొను

1. క్రమ్ముకొను.

"గిఱికొన్న మనోజవికారవేదనన్."
జైమి. 4.119.

2. నిలుచు.
కాశీ. 5.284.

ఇందుకు దగ్గఱగా ఉన్న భావచ్ఛాయలలో ఇది ఉపయుక్త మవుతుంది.

## గిఱికొలుపు

పాదుకొనునట్లు చేయు.

"మఱియును శరశతకము మెయి, గిఱికొలిపిన వృష్ణివరుఁడు గినియఁగ లేక..."
భార. ద్రోణ. 3.271.

## గిఱిగొను

కుదురుకొను.

"అఱిగ్రమ్మి మఱియు నిట్లనిరి నరేంద్ర, గిఱిగొన్న ప్రేమ భోగినులఁ గామంబుఁ."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 966.

## గిఱిపిల్లాడి

పిల్లెండ్లు.

శ. ర.

ఆడవాళ్లు కాలిలో చిటికెన వ్రేలి ప్రక్కవేలికి వేసుకునే మెట్టెలవంటి వానిని పిల్లెండ్లు పిల్లాండ్లు అని నే డంటారు.

## గిఱ్ఱున

తిరుగుటలో ధ్వన్యనుకరణము.

## గిఱ్ఱుపురుగు

చెట్లలో గిఱ్ఱు మని అరుస్తూ ఉండే పురుగు.

శ. ర.

## గిలకకు నీరెక్కు

చూ. కొండెకు నీ రెక్కు.

## గిలకొట్టు

1. చేతితో చిలుకు.

జిలకొట్టు – గిలకరించు అని కూడా వాడుక. పెరుగు విషయంలో దీన్ని బాగా ఉపయోగిస్తారు.

"కరలించి యమృతంబు గిలకొట్టఁగా రాదె, ముద్దు మాపెడి వీరిమావులందు."
పాండు. 1.117.

2. ముద్దుగా పుణుకు.

"గిలకొట్టి యట్టె చక్కిలిగిలి గాని పెట్టి..."
చంద్రా. 2.5.

3. గిలగిల ధ్వనించు.

"గళదసర్గళగళ దళిగుదళ ధ్వాను, ల్గిల కొట్టి మందాకవులు చెలంగ."
శుక. 1.276.

## గిలగిల లాడు

బాధపడు, తన్నుకొను.

"అతను కడుపునొప్పితో గిలగిల లాడుతున్నాడు." వా.

రూ. గిలగిల లాడిపోవు.

## గిలవకాయ

ఒకానొక ధమని.

## గిలిగింతలు

చక్కిలిగిలి.
పాండు. 2.38.

## గిలిగింతలు పెట్టు

చక్కిలిగింత పెట్టు.

ఒకరిని నవ్వించుటకై చక్కిలిగిలి పెడతారు.

"కేరఁగ రాదు నవ్వ గిలిగింతలు పెట్టఁగ రాదు చెక్కులం, జీరఁగ రాదు."
హంస. 1.94.

## గిలిగింత వోవు

చక్కిలిగిలి పెట్టిన ట్లగు.

"ఎదుట జలకేళి గావింపఁ పదఋలాంగ, ములు నిరీక్షించి గిలిగింత వోవు మనసు, నిలుపలేని కతంబున నిగ్రహించెఁ, జరమ ధాతువు శైలనిగ్రహముపోలె."
వరా. 11.81.

రూ. గిలిగిలి వోవు.

## గిలిగిలింతలు పుచ్చు

చక్కిలిగిలి పెట్టు.
హరి. పూ. 5.190.

## గిలిగిళ్లు

చక్కిలిగింతలు.

## గిలుక్కుమను

ధ్వన్యనుకరణము.

## గిలుపాడు

1. కొద్దికొద్దిగా అపహరించు.

బంగారము లాంటివానిని కొద్ది కొద్దిగా గీచి రాచి తీసుకొనుటపై వచ్చినపలుకుబడి.

"గిలుబాడు తల్లిపైఁ గలపసిండి."
పాండు. 3.16.

2. వంచించు.

"తన ప్రాణనాథుఁ దోడ్తేర, వనజాతి యొక్కటె మనసుఁ బంపుదును... తను గిలుపాడెఁ గదా మనం బనుచు..."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 226.

## గిలుబుకొను

కౌఁగిలించు.
మను. 3.84.

గిలుబు చేయు

"తలిదండ్రులకు సమ్మతంబుగా నతిథి సత్క్రియ యటంచు నొకింత గిలుబు సేయ." నిరం. 2.26.

చూ. గిలుబాడు.

గిల్కు షను

ధ్వన్యనుకరణము.

గిలింత

గిలిగింత.

గిల్బాడు

చూ. గిలుబాడు.

గిల్లకన్ను

మెల్లకన్ను.

కాశీ. 2.80.

గిల్లచూపు

మెల్లచూపు.

గిల్లికజ్జా పెట్టుకొను

ఊరికే ఉన్నవానిని కలహానికి లాగు.

గిల్లి పెట్టి కయ్యము నకు లాగుట అన్న వాచ్యార్థముపై వచ్చిన పలుకుబడి.

స్వల్ప విషయాలపై తగాదా రేపుట కూడా యిందులో సూచితము.

"వాడికి గిల్లికజ్జా పెట్టుకోవడ మంటే మహా సరదా." వా.

గిల్లిన పాలు కారు

1. మిక్కిలి సుకుమారమయిన.

శ్రవ. 3.61.

2. శైశవావస్థలో నున్న.

"గిల్లినను బాలు గారెడుపల్లవోష్ఠి." లక్ష. 3.80.

గీజుపోరు

ఒకే వేధింపు వేధించు, పోరు.

"కీలుగం టిడి యేల పోఁగా నునుఁ గొప్పు, గీల్కొల్పుకొ మ్మంచు గీజు పోరు." శుక. 2.456

"శిశువులు...చిఱుతిండి గని యిడి తె మ్మటంచు, గీజుపోరుట కెద పెల్లగిల్లఁ బొగిలి, పొలఁతి యూరార్పనతఁడు కాఁపురము సేయఁ."

శుక. 3.244.

చూ. గిదుపోరు.

గీటడగించు

చంపు.

"బావిలోఁ, గడపితి వట్టి నిన్నపుడు గీటడఁగింపక పోవ నిత్తునే."

జైమి. 3.109.

రూ. గీటణగించు.

గీటడచు

రూపుమాపు.

"సోదరయుతు దశాస్యుని గీటడంచి." రంగ. రా. బాల. పు. 19. పంక్తి. 11.

రూ. గీటణచు.

గీటున బుచ్చు

1. కొట్టివేయు.

ఏదైనా వ్రాసినప్పుడు వ్రాసినదానిలో దేని నైనా తొలగించి వేయ దలచుకొంటే దానిమీద గీత పెట్టడం అలవాటు. దానిపై వచ్చిన పలుకుబడి. గీత, గీటు ఒకటే.

"...అని తలంచుచుఁ గీచకుని మాటలు గీటునం బుచ్చి యొండుపలుకులు జర పిన." భార. విరా. 2.42.

2. వ్యర్థపఱచు; తిరస్కరించు.
"వీఁడు సంయమి వనుమాట గీటునం బుచ్చి తన వలసినయట్లు చేయువాఁ డయ్యె." భార. శా. 2.
"విని వినసివాని చందం,బున గీటునఁ బుచ్చి." జైమి. 8.39.

గీట్లబ్రద్ద
రూళ్ళ కర్ర.

గీతకట్టె
వడ్రంగులు గీతలు గీసేందుకు ఉపయోగించే పనిముట్టు.

గీతకత్తి
కల్లు గీసే కత్తి.

గీత బయటపడు
అదృష్టము కలుగు.
కొత్త. 319.

గీదు పోరు
ఒకే వేధింపు వేధించు.
విప్ర. 3.14.
చూ. గీజుపోరు.

గీపెట్టు
1. శబ్దించు.
"అదుకు వడక గీపెట్టక, పదను దివిసి రాగిజేరి పలుకక యున్నన్." పాండు. 3.182.

2. అఱచు.
"వా డెంత గీపెట్టినా వీడు ఆ వస్తువును పసేమిరా యివ్వ నన్నాడు." వా.

గీర
గర్వము, పొగరు.
"వాడికి కాస్త గీర యెక్కువ." వా.

గీరనగింజలు
ఒకరకమైన పిల్లల ఆట.
కళా. 6.202.

గీర్వాణం
గర్వము, అతిశయం.
"దానికి మహా గీర్వాణం లే." వా.

గీలుగాజులు
ఒక రకమైన గాజులు.

గీలునామము
నొసటిలో గీటువలె పెట్టుకొనే బొట్టు.

గీలుబొట్టు
గీలునామము.
రూ. గీర్బొట్టు.

గీవెత్తు
దిమ్మ తిరుగు.
"ఎండ తగిలి తల గీవెత్తినది." వా.
వావిళ్ళ.

గుంజా లేదు గూటము లేదు
ఏమీ లే దనుట.
రైతుల ద్వారా వచ్చిన పలుకుబడి. పశువులు కట్టివేయుటకు గుంజ, పత్తిగింజలు దంచుటకు గూటము కూడా లే దనుట.
"వాడింట్లో గుంజా లేదు గూటమూ లేదు." వా.

గుంజిలి పెట్టు
గుంజిళ్ళు పెట్టు; చెప్పిన పను లన్నీ చేయు.

వాపిళ్ళ ని. లో దాచు అని అర్థమిచ్చి ఇచ్చిన ప్రయోగం ఇది.

"కావర మెత్తి యిట్టు తను గాఁజియ పెట్టుచునున్న దాని నిచ్ఛావతిఁ జూచి లేచి రభసంబున గడ్డన పల్కె నోసి నీ, చేవ యెఱింగి కాచె మును చెప్పక గుంజిలి పెట్టి యున్కి నీ, వే వల దన్న వేఁడుకొన వే మఱి యే నయి చెప్పినాఁడనే."
వెంక. పంచ. 4.469.

గుంజిళ్ళు తీయు
గుంజిళ్ళు పెట్టు.

గుంజిళ్ళు పెట్టు
గుంజిళ్ళు తీయు.

గుంజుకొను
లాగుకొను – బలవంతంగా.
రాయలసీమలో బాగా వాడుకలో ఉన్న మాట.

గుంజు గునుకు
హాస్యం చేయు.
బ్రౌన్.

గుంటక గుజ్జులు
గుంటకకు ఉన్న గుజ్జు లనే భాగాలు.

గుంటక పాయు
గుంటకతో పొలం దున్ను.

గుంటక్రోవ
ఒక రకమైన ఫిరంగి.
రూ. గుంటక్రోవి.

గుంట గూలు
కూలిపోవు.

"కొంత గుజ్జు మెక్కితే నే గుంటఁ గూలిపోదురు." తాళ్ల. సం. 8.186.

గుంట గూల్చు
నాశనము చేయు.
ఈ పలుకుబడి నేటికీ రాయలసీమలో నున్నది. 'వాణ్ణి నమ్మితే వాడు నన్ను గుంట గూల్చాడు.' గుంటలో పడవేయు యని యాగికార్థం.

"ఎవ్వండు వీర మాహేశ్వరాహితుల, క్రొవ్వడంగఁగ గుంట గూల్పంగ నోపు."
పండితా. ద్వితీ. మహి. పుట. 208.

గుంటచాళ్ళు
ఒక రకమైన పిల్లల ఆట.

గుంటచిక్కులు
అనంతంగా మధ్యలో వచ్చే చిక్కులు.

"ధనసంపాదనమునందలి గుంటచిక్కు లెక్కువగఁ దెలిసినవాఁడు."
నందక. 116.
సాక్షి. 406.

గుంటచిక్కులు పెట్టు
నానారకా లయిన చిక్కులు పెట్టు.

"తీసుకున్న పది రూపాయలూ యివ్వ డానికి వాడెన్నో గుంటచిక్కులు పెడుతున్నాడు." వా.

గుంటదూలము
'గృహ విశేషములయందు కడయొత్తుల మీద నుండి

గుజ్జుల నడిమికి జొప్పించేసి
చిన్నదూలము.'
శ. ర.

## గుంటనక్క

కపటి; కుయుక్తిశాలి.
కుతంత్రాలు పన్నువాడు.
"వాడు గుంటనక్క. వాణ్ణి నమ్ముకొని మాత్రం ఈ వ్యవహారంలో దిగొద్దు."
వా.

## గుంట బెట్టి గంట వాయించు

మోసగించు; పాడు చేయు.
"ఔరార! వారల నిసర్గాభినయ ప్రభావ మెట్టిదియొ కాని మార్గగుల నట్టె కాలు గట్టి నిలువఁబెట్టి పయనంబును నడి గుంటఁ బెట్టి గంట వాయించు నట్టుల గనుకట్టు చేయఁగలరా."
ధర్మజ. 49.3.
తె. జా.

## గుంట బెట్టు

రూపు మాపు.
"తొంటి చాకచక్యం బెల్ల గుంటఁ బెట్టె." నందక. 17 పు.

## గుంట యోనమాలు

తొలి అక్షరాలు.
నేలమీద కానీ, చెక్కమీద కానీ అక్షరక్రమాన్ని తొలిచి ఉంచేవారు.
పిల్లలు తొలుత వానిలోనే వ్రేలు రుద్దుకొని నేర్చుకొనేవారు.
"తాను సర్వవిద్యా పారంగతుం డై యుండియు మనకు గుంట యోనమాలైన నేర్పినాఁడా." సాక్షి. 47 పు.

## గుంటుకాడు

యుద్ధసైనికులలో ఒక విధమైన ఆయుధం ధరించేవాడు.
కమా. 11.40.
మా. కుంతంబువాడు.

## గుండగొయ్య

దుర్మార్గుడు; మూర్ఖుడు.
బ్రౌన్; శ. ర.

## గుండాడు

నులిచి వేయు.
"గుండగంబునఁ బూల గుండాడ వికలిత, వృత్తిఁ గల్పకవాటి వీటిఁబోయె."
వరాహ. 10.15.

## గుండాన పడిపోవు

గంగలో కలియు వంటి పలుకుబడి.
కొత్త. 142.

## గుండా పిండి యగు

ధ్వంస మగు.
పిండిపిండి యగు అనుట.

## గుండియ గూడు వట్టు

హృదయము చిక్కబట్టుకొను, నిబ్బరముతో ననుట.
"ఏవగ నుండినాఁడో హృదయేశుఁడు గుండియ గూడు వట్టి తా, దేవుఁడు గానఁ గొంత కడతేఱె మనోభవుఢాక కన్యఁడే..." బహులా. 4.60.

## గుండియ యదురు

భయపడు.
"అన విని గుండియ యదరన్, మనుజేశ్వరుఁ డాప్తులైన మంత్రులతోని, ట్లను." శుక. 1.458.

గుండియలు ప్రుళ్ల దన్ను
బాగుగా తన్ను.
"గుండియలు గ్రుళ్ళc దన్నిన గ్రుక్కి మిక్కి, రనక యాతని కినుక చల్లా నిచ్చి." శుక. 3.627.
వాడు కలో—గుండెలు కుళ్లేట్లు తంతాను.

గుండుకొను
గుంపు కట్టు
"గుండుకొని చూచుమానిసి, తండముc దొలcగంగc ద్రోచి తత్క్రిరివెస నా, చండాలుc దెచ్చి తత్క్రి..." వాసి. 4.103.

గుండుగల్లు దాచిన పెండ్లి చెడునె
వివాహ సందర్భంలో నే సన్నికల్లు త్రొక్కిస్తారు. ఒక వేళ ఆ గుండ్రాయి దాచి పెట్టినంతమాత్రంతో పెండ్లి ఆగుతుందా? ఆగ దనుట. ఇలాంటిదే "అయ్యవారు లేక పోతే అమావాస్య నిలుస్తుందా?"
"మ ఏ గుండుగల్లు డాcచినc బెండ్లి చెడునె, చెనసి ఒచ్చమ్మ మాన్చిన భక్తి చెడునె."
పండితా. ప్రథ. పురా. పుట. 383.
చూ. గుండ్రా డాచిన...

గుండుగిలు
చాపచుట్టగా పడు.

గుండుగుత్త
సర్వహక్కులతో ఇచ్చేగుత్త. బ్రౌన్.

గుండు గూడు
గుంపు కట్టు; కలిసి ప్రయత్నించు.

గుండు గూలగ గొట్టు
పొడిపొడి చేయు.
రుక్మాం. 3.10.

గుండుజల్ల
పెద్ద జల్ల.

గుండులు నీరుగా
రాళ్లు కరిగేటట్లు.
"చాండాలికన్ మీటు చున్, గుండుల్ నీరుగ నెండ గాలి పని తాకుం జూడ శాప్రాణ్ణముఙ్." ఆము. 6.7.

గుండు వేయు
ఫిరంగో, తుపాకో పేల్చు.

గుండు వేస్తే అందకుండా వెళ్ళు
కనిపించకుండా పోవు.
"గుండు వేస్తే అందకుండా వెళ్ళావు—ఏ మయ్యావు రా ఇన్నాళ్లు." వా.

గుండుసున్న అగు
పని చెడిపోవు.

గుండుసూది
తలపై పూజగా ఉన్న సూది.

గుండె ఆగి పోయింది
అత్యాందోళనను తెలిపే పలుకుబడి.
"అతను వస్తాడు వస్తా డని ఆరునెల్ల నుంచీ కాచిపెట్టుకొని ఉన్నానా? రా నని తంతి వచ్చేసరికి నా గుండె ఆగి పోయింది." వా.

**గుండెకు రోమాలు మొలిచిన వాడు**

ధైర్యశాలి, ధీరుడు.

"ఈ ఊళ్లో గుండెకు రోమాలు మొలిచినవాడు ఒక్కడు ఉన్నట్టు లేడు." వా.

**గుండె గతుక్కు మను**

భీతి కలుగు.

"అకస్మాత్తుగా ఆవిడ పోయిం దనే సరికి గుండె గతుక్కు మన్నది." వా.

**గుండె గుబ్బు మను**

గుండె జల్లు మను.

ధ్వన్యనుకరణము.

"దానిన గుండె గుబ్బు మన దాసెరియన్ విడిచెన్." కళా. 4.21.

**గుండె గూడు దిగు**

గుండెమీంది బరువు తొలగి పోవు. దిగులు తీరు.

అనగా నిర్భయస్థితి యేర్పడు.

"నదులకు గుండెగూడు దిగ నాగకులంబులు నిద్ర వోయె నిర్జరులును మిన్నుదన్నిరి..." కాశీ. 2.61.

**గుండె గూడు పట్టు**

ఎంత బాధ లున్నా గుండె బిగ బట్టుకొను, బాధ కోర్చుకొను.

"...యేవగ నుండినాఁడో హృదయేశుఁడు గుండియ గూడు వట్టి తా, దేవుఁడు. గానఁ గొంత కడతేఱె మనోభవుబాకను..." బహులా. 4.60.

"...చూడ దాడ దొక సుద్దియు గుండియ గూడు పట్టినాఁ, డెట్టు భరించినాఁడొ హృదయేశ్వరుఁ డవ్వలరా హళాహళిన్." పాంచా. 3.

రూ. గుండియ గూడు పట్టు.

**గుండె గొంతుకలో కొట్లాడు**

మాట పెగలనీయనంత భావోద్రేకము కలుగు.

"గుండె గొంతుకలోన కొట్లాడుతాది, కూకుండ నీదు రా కూసింతసేపు." ఎంకిపాటలు.

**గుండె చిక్కబట్టుకొను**

గుండెనిబ్బరము కల్పించుకొను.

"పాపం! ఆవిడ ఎన్ని అవస్థ లొచ్చినా గుండె చిక్కబట్టుకొని ఎలానో కొడుకును చదివిస్తూంది." వా.

**గుండె చెక్క లగు**

హృదయవిదారక మగు.

"ఆవిడ గుండె చెక్క లయ్యేటట్లుగా యేడ్చింది." వా.

**గుండె చెదరు**

"ఆ పిల్లను ఆ స్థితిలో చూచేసరికి గుండె చెదిరి పోయింది." వా.

**గుండె చెఱువు చేసికొను**

భయపడు.

"ఆ గొల్ల కుఱ్ఱడు కాసంత కనుసెఱ్ఱ చేసినంతన యింతగా బెండువడి గుండె చెఱువు చేసికొనవచ్చునా?" ధర్మజ. 76. పుట. 16.

**గుండె జల్లు మను**

భయపడు.

ధ్వన్యనుకరణము.

"వసుధ వసియింపు మని బసుమంబు సల్ల గుండె జల్లు మని కల్లువడి..." మను. 5.19.

"త్రోలుదొల్ల వానిఁ గన్నులఁ గాంచి నప్పుడ, పల్లవాధర గుండె జల్లు మనియె." మను. 3.91.

**గుండె ఝల్లను**

బెదరు, బెంగగొను, దిగులు పడు.

ధ్వన్యనుకరణము.

"ఝల్లన గుండె గుభుల్లన నవసి." పండితా. ప్రథ. పురా. పుట. 467.

**గుండెతల**

వక్షస్స్థలము.

"గుండెతల బిట్టు దన్నినఁ గూలుట యును." దశ. 6.153.

**గుండెతల్లడము**

భయకారణము.

"శోకములకు గుండెతల్లడము కైరవ మిత్రుఁడు దోఁచెఁ దూర్పునన్." పారి. 2.41.

**గుండెదిగులు**

భయంకరము; విరోధి.

రూ. గుండెదివులు.

**గుండెదివులు**

భయంకరము.

"భరతంపుటయ్యగారి గుండెదివులు." శుక. 3.20.

చూ. గుండెదిగులు.

**గుండెధైర్యము**

ధైర్యము.

"వాడికి గుండెధైర్యం లేదు." వా.

**గుండె నీరగు**

భయభ్రాంతి కలుగు.

"చారులచే గాండీవి మహారథికుల తోడ వచ్చె నని విని గుండెల్, నీరై సైంధవతనయుఁడు, పేరోలగ ముండి బిట్టు పిఱువడి చచ్చెన్." జైమి. 8.156.

**గుండె పగుల బొడుచు**

గట్టిగా చావుపోటు పొడుచు.

"ఉరువడి పోరాడి యొగి కైటభారి, భల్లూకపతి గుండెఁ బగులంగఁ బొడువ." ద్విప. కల్యా. పు. 97.

**గుండె పగులు**

భయము కలుగు.

"నవమాసంబులు నిండె గుండె వగిలెక నా కంతలోఁ గొంత లో,క వినోదంబుల కీ ఫలంబు చవి దక్కం జేసి రక్షింపవే." ఉ. హరి. 2.15.

"వాడు వచ్చాడనేటప్పటికి నా గుండె పగిలి పోయింది." వా.

**గుండె పటుక్కునన్**

ధ్వన్యనుకరణము.

"గుండె పటుక్కున వచ్చె వి,భుం డీక నెట్లనుచు మల్లపుంగవుఁ బథికుం...." శుక. 3.215.

**గుండె పట్టుకొను**

1. గుండెనొప్పి కలుగు.

"ఉన్నట్టుండి మంచినీళ్లు తాగేసరికి గుండె పట్టుకొనింది." వా.

2. ధైర్యము తెచ్చుకొను.

ప్రబోధ. 3.40.

**గుండెపై చేయిడి నిద్ర పోవు**

అదమఱచి నిద్రపోవు.

"మా అమ్మ ఉన్నంతదాకా నా కేం భయం లేదు. గుండెమీద చేయి వేసు కొని నిద్ర పోవచ్చు." వా.

## గుండెబలం

ధైర్యం, స్థైర్యం.

"వాడికి గుండెబలం ఎక్కువ. కాబట్టే యెన్ని వచ్చినా తొణకకుండా బెణకకుండా ఉండగలుగుతున్నాడు." వా.

## గుండెబెదురు

హృదయశల్యం వంటిది. ఆ పేరెత్తితే హడలు పుట్టిస్తుందను పలుకుబడి వంటిదే.

"కర్మవాదుల గుండెబెదురు."
పండితా. ప్రథ. వాద. పుట. 511.
చూ. హృదయశల్యం.

## గుండె భగ్గు మను

దిగులు కలుగు.

"గుండె భగ్గు మని తల్లడపాటొదవంగ." సారం. 2.270.

## గుండె భగ్గు రను

"గుండె భగ్గు రనుచు నుండ దెట్లు."
కవిక. 4.112.

## గుండె రాయి చేసుకొను

ఏదో విధంగా – అతి కష్టంపై గుండెదిటవు కల్పించుకొను.

"నువ్వెన్ని కష్టాలు పడుతున్నా పిల్లలను చూసైనా గుండె రాయి చేసుకొని తిరగాడాలి." వా.

## గుండెలపై కుంపటి

అతి సన్నిహిత మై... యెల్ల...వేళలా వేచు దిగులు – భారము.

"చిన్నతనంలోనే పసుపు కుంకుమ నోచుకోని యీ పిల్లను ఎదాన వేసుకొని యెలా యీడ్చుకొస్తున్నానో దైవానికి తెలుసు. ఈ గుండెలపై కుంపటిని ఎన్నాళ్లు మోసుకొని తిరగాలో? ఎప్పుడు ఆ దైవం పిలుస్తాడో?" వా.

## గుండెలపై బండగా తయారగు

భారంగా, బాధాకరంగా పరిణమించు.

"ఏదో సహాయంగా ఉంటాడని వీణ్ణి యింట్లో ఉంచుకుంటే గుండెలమీద బండగా తయారయ్యాడు. పోయిన చోటంతా రంపులు తెస్తున్నాడు."
వా.

## గుండెలమీద బరువు దించు

దిగులును తగ్గించు.

ఇలా అనే పట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఎలాగో మా అమ్మాయికి కాస్త మంచి సంబంధం ఒకటి చూచిపెట్టి నా గుండెలమీద బరువు దించండి. మిమ్మల్నెప్పుడూ తలచుకొంటూ ఉంటాను." వా.

## గుండెలు కొట్టుకొను

భయం కలుగు.

భయాందోళనలను సూచించే పలుకుబడి.

"ఆవిడ పేరు చెప్పితే నాకు గుండెలు కొట్టుకొంటాయి. గయ్యాళిగంప ఆవిడ." వా.

## గుండెలు ప్రుళ్ళు

దిగులుపడు.

"అయ్యున్కిఁ గనుఁగొని గుండె ల్లెల్లఁ, గుళ్లుచుండంగ వదిసెలు కుంది కుంది."
భోజ. 6.

## గుండెలు జారిపోవు

ధైర్యము సడలు; దిగులు కలుగు.

"ఆ పిల్లను ఆ స్థితిలో చూచేసరికి గుండెలు జారిపోయాయి." వా.

## గుండెలు తీసిన బంటు

ధీరుడు.

గుండె ఉంటే భయపడే అవకాశ మైనా ఉంటుంది. అది కూడా లే దనుట.

"వాడు గుండెలు తీసిన బంటు. ఇరవై మంది కాదు. ముప్పై మంది వచ్చినా ఆప గలడు." వా.

"వాడు గుండెలు తీసిన బంటు. ఎన్ని కష్టాలు వచ్చినా ధైర్యంగా నిలబడ గలడు." వా.

"వాడు గుండెలు తీసిన బంటు. పది మంది వచ్చినా జవాబు చెప్పగలడు." వా.

## గుండెలు పగిలిపోవు

ఎక్కువ భయాందోళనలు కలుగు.

"నేను స్నేహితులతో చీట్లపేక ఆడుతున్నానా. అప్పుడు మా నాన్న వచ్చాడని నా స్నేహితు డొకడు వచ్చి చెప్పేసరికి నా గుండెలు పగిలిపోయాయంటే నమ్ము." వా.

## గుండెలు బాదుకొను

దుఃఖావేశమును తెలుపు చేష్ట.

"ఆ ఉత్తరం వచ్చేసరికి ఆవిడ గుండెలు బాదుకొంటూ బయలుదేరింది." వా.

## గుండె లేనివాడు

భీరువు.

"వా డేమాత్రం గుండె లేనివాడు." వా.

## గుండెలో గాలము

హృదయశల్యము, భయ కారణము.

"అనిమిషుల గుండెలో గాల మఖిల లోక, నేత్రమున నాటి వేధించు నెరసు గాలి." ఉ. రా. 1.149.

## గుండెలో రాయి పడు

నిరాశ కలుగు.

"వస్తుంది వస్తుంది అని ఆ ఉద్యోగం కోసం కాచుకు కూర్చున్నాను. అది కాస్తా వాడు తన్నుకు పోయా డనేసరికి నాకు గుండెల్లో రాయి పడింది." వా.

## గుండెల్లో రైళ్లు పరుగెత్తు

అత్యాకుల మనస్కత ను సూచించు పలుకుబడి.

ఇది ఇటీవల విపరీతంగా కథలలో కానవస్తుంది.

"తా నెంతగానో ప్రేమించినవాని పెండ్లిపత్రిక వచ్చే సరికి ఆవిడకి గుండెల్లో రైళ్లు పరుగెత్తినాయి." వా.

## గుండా, చెరువా?

అంత ధైర్యమా? అంత సాహసమా? అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"మిమ్మలిని అంత మాట అనడానికి వాని కేం గుండా? చెరువా?" వా.

## గుండ్రా డాచిన పెండ్లి యాగునా?

స్వల్ప మైనది లేకున్నంత

మాత్రాన పని ఆగిపోవునా అనుటలో వాడు పలుకుబడి.
పెండ్లిలో వంట వార్పులకు ఏ కొంతో ఉపయోగపడే గుండ్రాతిని దాచిపెట్టినంత మాత్రంతో పెండ్లి ఆగుతుందా?
పెండ్లిలో సన్నికల్లును పెండ్లి కూతురిచేత త్రొక్కించుట అలవాటు. కనుక ఈ గుండ్రాయికి సన్నికల్లు అని కొందఱు అర్థం చెబుతారు. కాని అది కూడా వివాహకర్మలో విడదీయరాని ఒక భాగం. అది లేక వివాహం ఆగినా ఆగవచ్చును కనుక ఇక్కడ గుండ్రాయి గుండ్రాయే. సన్నికల్లు కాదేమో?
"గుండ్రా డాఁచినఁ బెండ్లి యేమిటికిఁ జిక్కున్ గట్టుముట్టింపచా!" మను. 5.17.

## గుండ్లు గూల్చిన భంగిన్

(పై నుండి) గుండ్లు దొరలించినట్లు.
"కురిసె మహావృష్టి గుండ్లు గూల్చిన భంగిన్." కుమా. 6.105.

## గుండ్లు తేలి బెండ్లు మునిగినట్లు

అస్తవ్యస్త మయినట్లు.
పరిస్థితి తలక్రిందు లయినప్పుడు ఉపయోగించే పలుకుబడి.
"పొంగిలిన యగ్గురు ప్రాపున భవదీయ సైనికులు గొంద ఱాక్రోష్టులం జేరి పరాక్రమించుట గుండ్లు దేలి బెండ్లు మునింగిన ట్లయ్యె." భార. ద్రో. 3.67.
చూ. బెండ్లు మునిగి గుండ్లు తేలు.

## గుండ్లు దేలి బెండ్లు మునుగు

చూ. గుండ్లు తేలి బెండ్లు మునిగినట్లు.

## గుండ్లు బెండ్లాడు

కదలించివేయు.
"వాయువు లూగి లోకపంక్తు లన్నియు గుండ్లు బెండ్లాడఁగఁ దొణఁగె." రంగ. రా. ఉత్త. 11. పుట.

## గుంతకండ్లు

లోతుకండ్లు.
"ఆ గుంతకండ్ల పిల్లను ఎవడు చేసుకుంటాడుళ్ళి?" వా.

## గుంపిడు

గుంపు గట్టు, గుంపుగా చేరు.
"గుంపిడి జనులు..." పండితా. ప్రథ. పురా. పుట. 444.

## గుంపు గూడు

గుంపు చేరు.
"తదీయ నగరావనలో,విదు లగు ననేక పావకు లదరి, బెదరి గుంపు గూడి యందఱుఁ దమలోన్." ఉషా. 4.29.
"తండోపతండము లై గుంపు గూడి." రాధా. 4.108.

## గుంపు దీర్చు

వెంట్రుకలు మొదలైనవానిని చేర్చి సవరించు.
"పెన్నెఱుల్, మెల్లన గుంపు దీర్చి." కాళిందీ. 2.63.

**గుంపులు కట్టు**

గుంపు గూడు.

"అక్కడ నిక్కడన్ నిలిచి రత్తతి గుంపులు గట్టి వానరుల్."

భా. రా. యు. 919.

**గుంపులో గోవింద**

ఏదో గందరగోళం జరగగా ఆ సందున తన ప్రయోజనము సాధించుకోను.

చూ. సందట్లో సమారాధన.

**గుంపెనలాడు**

గునిసి యాడు.

"ఊరకుండవుగా ఓసి మాయ నిన్నుఁ జేరఁ బిలువను గుంపెన లాడేవు."

తాళ్ల. సం. 11. 3. భా. 41.

**గుంపెఱుగు**

విజృంభణము తెలియు, రీతి నెఱుగు. (సరిగా చెప్ప వీలు లేకున్నది.)

"తారకాసురుండు...మహా యుద్ధంబు సేయుచున్నం గని వాని గుంపెఱింగి నగుచున్."

కుమా. 12.178.

**గుక్క పట్టు**

ఊపిరి తిరగకుండా బిగపట్టు. ఇది యేడ్పుటలో ముఖ్యంగా వినవస్తుంది.

కుమాగ. శత. 27.

**గుక్కు మిక్కనక**

పలుకక, నోరెత్తకుండ.

"ఆడరుభయమున గుక్కు మిక్కనక వెనుక, వెనుక కొదిగెడు తన ప్రాణ విభునిఁ జేరి."

శుక. 3.275.

**గుక్కుమిక్కను**

ఆకలిచే నకనకలాడు.

"అంత నొక్క బక్క నక్క గుక్కు మిక్కనుచు డొక్కం బిక్కటిల్లిన క్షుధానలంబున దందహ్యమానం బై డస్సి..."

హంస. 1.188.

**గుక్కుమిక్కు మనకుండా**

కా దనకుండా.

"అది ఏం తిట్టినా వాడు గుక్కుమిక్కు మనకుండా వెళ్లిపోతాడు."

వా.

**గుజ గుంపులు**

హడావిడి; గుసగుసలు.

**గుజగుజ యగు**

గిజగిజ లాడు.

"గజము మద ముడిగి తిరుగుచు, గుజగుజయై గేఁక వెట్ట."

భాగ. 5. స్కం. 407.

**గుజగుజరేకులు**

ఒక పిల్లల ఆట.

**గుజగుజలాడు**

గుసగుసలాడు; గోప్యముగా, మెల్లగా మాటలాడు.

"నిఖిలసన్మునులు, గుజగుజలాడఁ గన్గొని సభవారి."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 131.

**గుజగుజలు వోవు**

రహస్యముగా మాటలాడు.

"పెక్కువిధంబులం దలపోసి గుజగుజలు వోవుచుండుదురు."

భార. విరా. 2.201.

"వారివారికి నెఱింగి గుజగుజ వోవుచు."

హర. 5.57.

గుజరాను పఱచు

అర్పించు; కానుక యిచ్చు.

"...హెదయుజంగు గాంచి నజరు గుజ రాను పఱచి." రంగా. 2.85.

గుజ్జుబ్రాలు

ధాన్యవిశేషం.

బ్రౌన్.

గుజ్జుమామిడి

ఒక రకమైన మామిడి.

గుజ్జెనగూళ్లు

పిల్లలు బొమ్మలాట ఆడుకొనే టప్పుడు చిన్న గురిగెలలో వండుకొను అన్నము.

ఒక విధమైన పిల్లల ఆట.

గుటకలు మ్రింగు

ఏదో ఒకదానిని ఆశించి, అది యెప్పుడు మనకు వస్తుందా అని వేచి యుండు.

"...పటుతయుఁ దోఁప మ్రొక్కి నిజ వాస్తవమున్ స్తవమాదిగా నసెన్, గుట కలు మ్రింగుచుం ద్రిదశకోటిగతుం డిటు తాటకాంతకా?"

రామకథా. ఉ. భా. 6.219.

గుటకలు వేయు

ఎంతో ఆశించు.

"వీధిలో పొయ్యే అమ్మాయిలను వీడు గుటకలు వేస్తూ చూస్తుంటాడు." వా.

చూ. గుటకలు మ్రింగు.

గుటకాయ స్వాహా చేయు

అపహరించు.

కొత్త. 435.

గుటగుట మను

సంకోచము కలుగు.

"మనమున గుటగుట మను."

శ్రవ. 3.86.

గుటగుట యను

ధ్వన్యనుకరణము.

"ఉల్ల మగలంగ నయ్యుగ్రభల్లుకంబు, గుట గుట యటంచు గొప్పి యుక్కు టిలుఁ గదిసె." శుక. 1.500.

గుటిక మ్రింగిన సిద్ధు డగు

నిశ్చలుడై యుండు.

"గుటిక మ్రింగినసిద్ధుఁ డగుచుఁ దర లేఁడు."

వర. రా. అయో. పు. 330. పంక్తి. 23.

గుటుక మనుచు మ్రింగు

గుటుక్కున మ్రింగు.

ధ్వన్యనుకరణము.

"క్రోఁతిమూఁకల మ్రింగెద గుటుక మనుచు." బాల. 159.

గుటుక్కను

చచ్చు.

గుటుక్కు మను

చనిపోవు.

"వాడు కాస్తా గుటుక్కు మంటే అప్పుడు తెలుస్తుంది అయ్యసంగతి."

వా.

గుట్టీక

మనసులోని బాధ నితరులకు తెలియ నీక.

"గుట్టీక నలంగియు నత్తమామల చిత్తంబు వచ్చునట్లు భక్తి శక్తులు మెఱసి పాటులంబడుమఱందలి."

పాండు. 3.24.

గుట్టుకీడు
రహస్యశత్రువు.
ఆము. 4.250.

గుట్టు కోల్పడు
బయట పడిపోవు, కొంచె పడు.
"నిన్ను నమ్మి నా, గుట్టును రేజము న్మి గులఁ గోల్పడి పోయితి నేమి సేయుదున్." పారి. 1.127.

గుట్టు గలయది
రహస్యమును మనసులోనే పెట్టుకొనగలది - పెట్టుకొనగలవాడు, మర్మిష్టి.
"మండోదరితో, నంతయును దెలిపి క్రమ్మఱి, శాంతునికడ నుండె గుట్టు గలయది వోలెన్." శుక. 3.273.

గుట్టు గైకొను
రహస్యము నెఱుగు.
"ఎట్టకేలకు నాదు గుట్టు గైకొని." పాణి. 3.32.

గుట్టు చప్పుడు కాకుండా
రహస్యముగా, ఎవరికీ తెలియకుండా.
"వాడు ఊళ్లో నలుగురిదగ్గరా అప్పులు చేసి, గుట్టు చప్పుడు కాకుండా లేచి పోయినాడు." వా.

గుట్టు చెడు
రహస్యభంగ మగు.
"ఎట్టకేలకు గుట్టు చెడి." శ్రవ. 1.85.

గుట్టున పోనిచ్చు
ఊరకే అల్లరి లేకుండా వదలి పెట్టు.
"మానసుఁ దాల్చిన గుట్టునఁ బోనీఁడు నిరంకుశుండు." నిరం. 3.15.

గుట్టుపట్టు
గుండె.
వావిళ్ళ.

గుట్టు బిట్టాడు
క్రక్కదలు.
"చిందరవందరయి గుట్టుబిట్టాడంగన్." సారం. 3.15.

గుట్టు మట్టు
రహస్యము, ఆంతర్యము.
జం.
"మీ బండాలను కొండల కెగఁబ్రాకుచున్నను మీ లోని గుట్టుమట్టు నే గట్టిగాఁ గనిపెట్టినాఁడను." ధర్మజ. 63. పు. 11. పం.

గుట్టు వీడు
బయల్పడు.
మనసులో నున్నది వెలనాడు.
"చెలఁగన్ మున్నుగ గుట్టు వీడుటకునై చింతింతు రన్యోన్యమున్." రాజగో. 2.68.

గుట్టు సాకిరి
'వాది తన వ్యవహారము గెల్చుటకొఱకు రప్పింపగా వచ్చి దాగియుండి ప్రతివాది యొక్క మాట లన్నియు జక్కగా విన్న సాక్షి.'
శ. ర.

గుడగుడ
ధ్వన్యనుకరణము.
"గుడగుడ నుడికెడి యుదకము." సింహా. 8.188.

**గుడార మెత్తు**

వెళ్లిపోవు.

"వాఁడా ఊరునుండి గుడార మెత్తేసి చాలాకాల మయింది." వా.

**గుడి కట్టు**

గ్రామం ఎల్లల యేర్పాటు.

బ్రౌన్.

**గుడికి ముద్ర వేసుకొను**

దేవదాసీత్వము నవలంబించు(స్త్రీ) పెళ్లి లేకుండా ఉండిపోవు.

"గుడికి ముద్ర వేసికొని కులమున వన్నె, వాసిఁ గాంచి మాట వాసిఁ బెరిఁగి, సాని మగువలందు జాణ వై నుగవాలి, పాటు కోర్చి తెట్లు పద్మనయన!"

ప్రబంధరాజ. 654.

చూ. గుడిముద్ర వైచికొను.

**గుడికొను**

జొత్తిల్లు.

"గుడికొనుకన్నీరు గ్రుక్కుకొనుచున్."

సారం. 3.163.

**గుడి గుండ మనక**

ఇదీ అదీ అనకుండా ఎల్ల చోట్లులా అనుట.

"గుడి గుండ మనక పల్లియ, పడుసర నా కరయుఁ జెఱచి పఱచిన శిష్యున్."

పంచ. వేం. 1.25.

**గుడిగుడి కన్నీరు**

జిటజిట రాలు కన్నీరు.

**గుడి గుడి గుంజంబులాట**

ఒక బాల్యక్రీడ. 'గుడి గుడి గుంజం గుంటానాదం పాం పట్టుకో పక్కచెన్' అంటూ ఆడుతారు.

పండితా. ప్రథ. పురా. పుట. 460.

**గుడి గుడీ**

హుక్కా.

**గుడిగొను**

వ్యాపించు.

"గుడిగొన్నయే తెంత కొంకర వంకర లైనా, పుడమికి లోఁ గొనక పోవు నటయ్యా!"

తాళ్ల. సం. 7. 273.

**గుడిచాటుకాడు**

పని చేయనివాడు.

గుడినీడ చల్లగా ఉంటుం దని అక్కడే పడిఉండు వాడు. సోమరి అనుట.

"కలపుల గుడిచాటుకాఁడ వై యిట్లు."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1706.7.

**గుడిచుట్టు**

గిరున తిరుగు; పరివేషము.

**గుడి త్రిప్పు**

గుడి తిరుగు.

**గుడి దిరుగు**

ప్రదక్షిణము చేయు.

"ఒకమా, టకటటిలమతి గుడిఁ దిరిగిన."

భీమ. 3.169.

చూ. గుడి దిరుగుకొను.

**గుడినుండి గుడిగ్రాళ్లు గోయు**

ఒకరి ఆశ్రయంలో ఉంటూ వారికే అపకారం తలపెట్టు.

"గుడినుండియె గుడిగ్రాళ్లు, శక్కడుగాఁ గోయుట సగోత్రగుణములు సుమ్మీ." పాంచా. 4.

చూ. గుడినుండి గుడిరాళ్లు తీయు.

**గుడి నుండి గుడిరాళ్లు తీయు**

కృతఘ్నుడగు.

ఉపకారికే ద్రోహము చేయు.

తిన్నయింటి వాసాలు లెక్క పెట్టటవంటి పలుకుబడి.

"గుడి నుండి గుడిరాళ్లు తీయుకరణి." పాండు. 3.68.

**గుడి, పాడు చిక్కు**

సర్వశూన్యమగు, పాడయి పోవు.

"అంగళ్లయందు మిట్టాడ మానిసి లేక, గుడియుఁ బాడును జిక్కఁ జెడియె..." కాశీ. 5.267.

**గుడి మింగువానికి నంది పిండి వడియము**

అంత పెద్దపనే చేసేవానికి మిగతపని ఒక లెక్కా అను పట్ల ఉపయోగించే సామ్యము.

"అంతలేసి మహాత్ముల నింత సేయు, మాకు నిను సంహరించుట మాత్ర మెంత, యెందు గుడి మ్రింగువారికి నంది పిండి, వడియ మనుప లెక్కలుం గవే పుడమిలోన." విక్ర. 2.238.

చూ. గుడి మ్రింగువానికి తలుపు లప్పడములు.

**గుడి మింగేవానికి లింగ మెంత?**

చూ. గుడి మింగువానికి నంది పిండి వడియము.

**గుడిముద్ర వైచికొను**

దేవదాసిగా నుండు, బసివిగా నుండు.

వైష్ణవంలోనూ, శైవంలో కూడా కొందఱు ఆడపిల్లలను దేవునికి సమర్పించేవారు. వైష్ణవంలో దేవదాసీ లనీ, శైవంలో బసువులు లేక బసువురాండ్రు అనీ వీరికి పేరు. వీరు అలా బ్రహ్మచారిణులుగా ఉండేవారు. కడకు వీరే వేశ్య లయినారు. ఏదో ఒక ఆలయానికి వీరిని సమర్పించేవారు గనుక ఆ గుడిముద్ర వీరిపై పడినట్లు. అట్లే దేవునికి వదలిన ఆబోతులను – అచ్చుపోసిన ఆబోతు లని అంటారు.

"జననము నందినం బురుషజన్మము కావలెఁ గాక యాఁడు దైనను గుడి ముద్ర వైచికొనినం దగు లేక కులాంగనాస్థితిన్..." శుక. 2.507.

చూ. గుడికి ముద్ర వేసుకొను.

**గుడి మేళము కాదు నగిరి మేళము**

ఇది కొంత కష్టసాధ్య మనుట.

పూర్వం దేవదాసీలు నాట్యం చేసేవారు. గుడిలో నాట్యం చేయడం సులభం. కాని రాచనగరిలో మేళం కట్టి మెప్పించడం కష్టం అనుట పై వచ్చిన పలుకుబడి.

"కరణమయ్యాతో కంటు కట్టుకుంటే నీ కథ తెలిసొస్తుంది. గుడిమేళం కాదు. ఇది నగిరిమేళం." వా.

ఏమీ తెలియని రైతులను ఏడిపించినట్టు కాదు అనుట.

**గుడి మ్రింగువానికి తలుపు లప్పడములు**

ఘోరమైన పని చేయగల వానికి అల్పాపకారములు చేయుట ఒక లెక్కలోనిది కా దనుట.

మొత్తం గుడినే మ్రింగే వానికి తలుపులు అప్పడాలతో సమానం కదా!

"అలమి గుడి మ్రింగువానికిఁ దలుపు లప్పడములు గాకుండునే."

పాండు. 5.229.

చూ. గుడి మ్రింగువానికి నంది పిండి వడియము.

**గుడి వడు**

గుండ్ర మగు.

**గుడిసెవాటు**

గుడిచేటు.

**గుడిసెవేటు**

గుడిచేటుది; కులట.

చూ. గుడిసెవాటు.

**గుడిసె వైచు**

వ్యభిచారము చేయు. తక్కువ రకము కులటలు గుడిసె వేసికొని ఉంటారు. దానిమీద వచ్చిన పలుకుబడి. ఇప్పటికీ రాయలసీమలో హాస్యంగా 'నీ బిడ్డకేం గుడిసె వేస్తావా? పెండ్లి చేయకుండా' అంటారు. దీనిమీద వచ్చినదే గుడిసె వేటు – గుడిసేటు, గుడిశేటిది.

"నీ వపుడు వీఁడు వాఁ డని, భావింపక గుడిసె వైచి పదులం బొందన్."

శుక. 2.46.

**గుడుగుడుక్కున మ్రింగు**

గ్రుక్కిళ్ళు మ్రింగుటలో ధ్వన్యనుకరణము.

"గుడుగుడుక్కున మ్రింగు గ్రుక్కిళ్ళతోడ." ద్విప. నల. 5.101 పం.

**గుడు గుడు గుంచము లాడు**

పిల్లల ఆటపై వచ్చిన పలుకుబడి.

అక్కడక్కడే తిరుగు.

"ఒకభార్య నంట గట్టుకొని లాడీ తెడు సంసారములో గుడుగుడు గుంచంబు లాడుట కిష్టపడక బ్రహ్మ

చారి యై లోకమునిూఁద విఱుచుకొని పడి...'' సాక్షి. 109.

గుడుగుడు ప్రాణంగా

వచ్చే పొయ్యే ప్రాణంగా.

''వాడిపరిస్థితి గుడు గుడు ప్రాణంగా ఉంది.'' వా.

గుడుగుడు మని నడచు

గునగున నడచు.

''అడుగులు పుడమిని వడి నిడి, గుడు గుడు మని నడచి.'' పార్వ. 4.163.

గుడుసు పఱచు

తక్కువ చేయు; హీనము చేయు.

గుడుసువడు

శూన్య మగు; హీన మగు.

''గుడుసువడెఁ జగువు.''

తాళ్ల. సం. 11.3 భా. 103.

గుడ్డవృత్తులు

ఇనాము భూములు.

గుడ్డము – ఊరవాకిలి, ఊర గవిని.

పశ్చిమాంధ్ర ప్రాంతంలో నేటికీ ఊరగవిని అనే అర్థంలో 'గుడ్డం' అని ఉపయోగిస్తారు. గూడెమునకు ఈ గుడ్డమునకు సంబంధం ఉన్నట్లు కనిపి స్తుంది. గుడ్డవృత్తు లనగా గ్రామం సమష్టిమీద ఆయ గాళ్ళు మొదలగువారికి ఇచ్చే యినాము భూములు కావ చ్చును.

''గుడ్డవృత్తులు వృత్తులు గొలుచు గుత్తేలు...''

పాండు. 3.16.

గుడ్డిగవ్వ చేయదు—(డు)

బొత్తిగా పనికి రానిది, విలువ లేనిది.

ఒకానొక కాలంలో గవ్వలు అతి తక్కువైన కనీసపు నాణ్యాలు గా ఉండేవి. అందులో గుడ్డిగవ్వ మరింత తక్కువ.

''వాడి పాండిత్య మంతా ఆ ఊళ్లో గుడ్డిగవ్వ చేయదు.'' వా.

''వాణ్ణి తిప్పి తిప్పి వేలం వేసినా గుడ్డిగవ్వ చేయడు.'' వా.

గుడ్డిగా

విచక్షణ లేక, ముందుచూపు లేక.

''ఆ వైధవసావాసం పట్టాడు. అప్పటి నుండీ గుడ్డిగా వాడు చెప్పిన ట్లల్లా వినడం తప్ప స్వబుద్ధితో ఏమీ చేయడం లేదు.'' వా.

గుడ్డి గుఱ్ఱపు తాపు

తాకితే తాకుతుంది, తప్పితే తప్పుతుంది.

గట్టిగా తగులు నని కూడ.

నారాయణదాసు రుక్మిణీకల్యాణము.

గుడ్డిదర్బారు

విచక్షణ లేని పెత్తనం.

''వాడి దంతా గుడ్డి దర్బారు. మంచి అంటే మంచి. చెడ్డ అంటే చెడ్డ.'' వా.

**గుడ్డిదీపం**

ఎక్కువ ప్రకాశం లేని దీపం.

"ఆ గుడ్డిదీపం వెలుగులో ఏమీ కనపడ లేదు." వా.

**గుడ్డినమ్మకం**

అంధవిశ్వాసం.

"శకునా లన్నా, గాలి శాస్త్రం అన్నా వాడికి గుడ్డినమ్మకం." వా.

**గుడ్డిలో మెల్ల**

కొంత మేలు.

"వాళ్లంతా వట్టి కఠినులు. ఈ అబ్బాయే వాళ్లల్లో కల్లా కాస్త గుడ్డిలో మెల్ల." వా.

**గుడ్డివడు**

అంధకారబంధుర మగు.

"కొన్ని దేశంబు తిమిరలచే గుడ్డివడియె." కాశీ. 1.137.

**గుడ్డెద్దు చేలో బడినట్లు**

ఇష్టం వచ్చినట్లు, చాలూ మూలా లేకుండా.

గుడ్డెద్దు కేదీ కనబడదు కనుక దొరికిందల్లా తింటూ, ఎటు పడితే అటు తొక్కుతూ నానాబీభత్సం చేస్తుంది అనుటపై వచ్చిన పలుకుబడి.

"గుడ్డెద్దు చేలో బడ్డట్లు పోలీసు లా నాడు జనంలో పడి దొరికినవాళ్ల నల్లా బాదారు." వా.

**గుడ్లగూబ చూచినట్లు చూచు**

క్రూరముగా, వికారముగా చూచు.

"వాడు చూడు. గుడ్లగూబ చూచినట్లు చూస్తున్నాడు." వా.

**గుడ్లలో కూన**

ఎత్తిపొడుపుగా మరీ చిన్నవాడు లేక [illegible] అనే మాట.

"అవును పాపం! నీ కొడుకు గుడ్లలో కూన. ఏమీ తెలీదు." వా.

యా. గ్రుడ్లలోపలి చిన్న కూన.

**గుడ్లు అప్పగించి**

ఏమీ చేయ లేక.

"నలుగురూ చేరి వాణ్ణి నలగ దంచుతూ ఉంటే వీడు గుడ్లు అప్పగించి నిలుచున్నాడు. వీ డేం మనిషి?" వా.

**గుడ్లు తేలవేయు**

ఏమీ చేయ లేక తన పని ముగిసినట్లు తెలియజేయు.

ప్రాణం పోవునప్పుడూ, మూర్ఛ పోవునప్పుడూ గుడ్లు తేలవేయుటపై వచ్చిన పలుకుబడి.

"తీరా వ్యవహారం వచ్చేసరికి వాడు గుడ్లు తేలవేశాడు." వా.

**గుడ్లు వెళ్లుక వచ్చు**

చనిపోవు.

కనుగ్రుడ్లు బయటికి వచ్చు. చంపినప్పుడు, చస్తున్నపుడు అలా జరుగుతుంది.

**గుణ మిచ్చు**

పని చేసి మేలు కలిగించు.

"ఆ మందు వేయగానే గుణ మిచ్చింది." వా.

గుణము చేయు

గుణ మిచ్చు.

"ఆ మందుతో గుణం చేసింది." వా.

గుణము సారించు

ధనుష్టంకారము చేయు.

"శంఖంబు పూరించి గుణంబు సారించి." భార. ద్రోణ. 2.60.

గుణమొలనూలు

మొలత్రాడు.

గుత్తకాడు

గుత్తకు తీసుకున్నవాడు.

శ. ర.

గుత్తకు తీసుకొన్నట్లు

ఇది అంతా నాదే నన్నట్లు.

"ఊరంతా గుత్తకు తీసుకొన్నట్లు మాట్లాడుతున్నావేమి?" వా.

గుత్తగట్టు

గుత్త కిచ్చు.

నీలా. 1.118.

గుత్తగా ఉంచుకొను

స్వంతంగా పెట్టుకొను. వేశ్యలు ప్రబలంగా ఉన్న రోజుల్లో, వారు ఎవరికీ చెందిన వారు కాక పోయినా, ఎవడో కొంత ధన మిచ్చి తన అధీనంలో ఉంచుకొనేవాడు.

"రంగసానిని రామయ్య గుత్తగా ఉంచుకొన్నాడు." వా.

చూ. గుత్తగొను.

గుత్తగొను

సొంతము చేసికొను. భూముల విషయంలో గుత్తకు తీసుకొనడం అలవాటు. తద్వారా వచ్చిన పలుకుబడి.

"...ఇక్కలికి గుత్తగొనుం బో, తక్కక దివి నిమిష మున్న దైవతవిటులన్." కళా. 3.79.

"గోపికావళిన్, బొక్కఁగఁజేసి తద్రుచిరభోగము గుత్తగ నీవ కైకొనన్." ఆము. 5.68.

చూ. గుత్తగా ఉంచుకొను.

గుత్తచేలు

సంవత్సరానికి ఇంత డబ్బు అన్న ఒప్పందంపై సాగుకు తీసుకొన్న భూములు. పండిన ధాన్యంలో భాగానికి ఒప్పందం చేసుకుంటే అవి కోరు భూములు.

"గుడ్డవృత్తులు వృత్తులు గొలుచు గుత్తచేలు." పాండు. 3.16.

గుత్తపుదాసి

ఉంపుడుకత్తె.

"...గుత్తపుదాసి దా రవికకట్టు పుటుక్కన విచ్చె రంభకున్." శశాం. పీ. 80.

గుత్తపట్టు

గుత్తగొను.

"పచ్చిట్టితోల్బట్టె చుచ్చాలమెట్లండి, కొను దాన యూరెల్ల గుత్తపట్టు." ఆము. 6.69.

గుత్తికవ్వము

కవ్వము.

గుత్తివడు

కష్టపడు.

"శాన్ని దేశంబు లిరులచే గుత్తి
వడియె." కాశీ. 1.137.

## గుత్తుగుత్తను

ప్రాణం బితబిత మను. భయ
భ్రాంతి కలుగు.

"ప్రాణములు గుత్తుగుత్తనంగ."
హరి. పూ. 9.132.

## గుదగుదలు

అనుమానాలు.

## గుదగుద మను

దిగులు కలుగు; మనసు
ఎలాగో అగు.

"గుడి కేఁగ రానిని గుదగుద మనుచుఁ,
గుడువక..." బస. 6.180. పు.

## గుదగుద లాడు

దగ్గుత్తికతో నేడ్చు.
బ్రౌన్.

## గుదికఱ్ఱ

జంజాటము.

పశువుల మెడలకు గుదికఱ్ఱ కడ
తారు. అందుపై ఏర్పడినది.

"వృద్ధునకుఁ దన కీ గుదికఱ్ఱ యెందు
లకో." సుకన్య. 10.

## గుదికాలు

మడమ.

## గుదికుచ్చు

పేర్చు, కూర్చు.

## గుదిగుంజలు

పసులదొడ్డి వాకిట పాతిన
గుంజలు.
బ్రౌన్.

## గుదిగుంపులు చేయు

కలతి పెట్టు

"దివిజవేశ్యల, సదనంబుల నున్న మాని
సంతతి తలఁగుల్, గుదిగుంపులు చేసి
మథం,పదె." నిరంకు. 2.32.

## గుదిగోను

ఎక్కువగు. చిక్కనగు
ఇత్యాది భావచ్ఛాయలలో
వినిపించే మాట.

## గుది గ్రుచ్చి

మనసు పెట్టి.

"ముదిలంజవిధమున ము న్నిట్టికథలు,
గుది గ్రుచ్చుకొని చెప్పికొని పోవ
వలదు." ప్రభులిం. 7.60.

## గుదిగ్రుచ్చు

1. ఒకచోట చేర్చు.

"గురుతర ద్రుమములు గుదిగ్రుచ్చు
నట్లుగ."
కళా. 6.68.

2. ఒకగుదెకు—సూదికి
గ్రుచ్చు.

"గుదిగ్రుచ్చెఁ గొందరఁ గూల్చెఁ గొంద
రిని." పల. పు. 113.

"ఆ పూల నన్నిటినీ గుదిగుచ్చి మాల
కట్టు." వా.

## గుదిత్రాడు

దూడకాలికి కట్టే త్రాడు.
బ్రౌన్.

## గుదిత్రోయు

గుదికట్టి త్రోయు.

## గుదియకట్టులు

గుదికట్టులు.

**గుదివడు**

కట్టుబడు.

కాశీ. 2.141.

**గుదివెట్టు**

గుదికట్టు.

**గుదులుకొను**

నాటు; కూలబడు.

**గుదులుపట్టు**

తిమ్మిరి పట్టు.

**గుదెలవాడు**

రక్షకుడు.

**....ద్ద చుట్టూరా అప్పులు**

ఎటు చూచినా అప్పులే.

**గుద్దలిగొను**

కుళ్ళగించు, పెళ్ళగించు.

"హలమున కెల్లను గుద్దలి గొనియె."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 125.

**గునగున నడుచు**

గునుకుపరువులతో నడచు.

**గునిసి నడుచు**

కులుకుచు నడుచు.

"నేల జీరక యుండఁ గేలఁ గుచ్చెలఁ బూను,కొని యూడిగపుఁజెలు లునిసి నడువ." శుక. 3.314.

**గునిసియాడు**

చిందులు తొక్కుతూ ఆడు.

కుణుసు (కన్న.)

"నిలువ కేతెంచి వేఁటకుక్కలు కుమార!, చుట్టుక గునిసి యాడంగఁ జూడ వేమి." కా. మా. 3.75.

**గునుకుపరువున వచ్చు**

గునగున పరుగెత్తుకొని వచ్చు.

"మనవుల కని చెలుల్ గునుకు పర్వున వచ్చి, మొగతెంట కట్టుతో ముచ్చటాడ." హంస. 5.85.

**గునుకెత్తు**

పరువెత్తు.

"గును కెత్తుచున్న గాడిద, గనుఁగొని."

వేంక. పంచ. 4.521.

**గున్నగచ్చకాయల కరణి**

బాగా తిని నునుపుదేరిన యెడ అను సామ్యం.

"...దాదుల్ దినదినము మిసిమి యిడఁగాఁ, గనుపింతురు గున్న గచ్చకాయల కరణిన్." శుక. 2.333.

**గున్నేనుగు**

పొట్టిగా లావుగా ఉన్న వాళ్లను వెక్కిరింపుగా అను మాట.

"వాడు ఒక గున్నేనుగు. వాడేం కొండెక్కుతాడు." వా.

**గుప్పిట్లో పెట్టుకొను**

తన వశములో ఉంచుకొను.

"ఆవిడ మొగుణ్ణి తన గుప్పిట్లో పెట్టుకుంది. ఎంత చెప్తే అంతే." వా.

**గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకొను**

ప్రాణభీతితో నుండు.

"ఈ దుర్మార్గుని కొంపలో గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకొని బతుకుతున్నాను." వా.

**గుప్పుగుప్పను**

ధ్వన్యనుకరణము.

కుమా. 11.155.

**గుప్పుగుప్పున వైచు**
ధ్వన్యనుకరణము.
"గుప్పుగుప్పున మోచికొని యున్న వల లతోc, బలలంపుc బొత్తరల్ పొంచి వైచి." మను. 4.103.

**గుప్పుతెప్పున**
గబగబ.
"అప్పుడు తద్వఘూటి చలితాధర యై వరు గుప్పుతెప్పునం, జప్పుడుగా నదల్చి..." శుక. 1.540.

**గుప్పు మను**
వాసన కొట్టు.
"గుప్పు గుప్పు మని యజ్ఞుల కేనియుc గొట్టు వాసనల్." గుంటూ. పూర్వ. 105.

**గుబగుబ**
ధ్వన్యనుకరణము.

**గుబాదెబ**
ధ్వన్యనుకరణము.
"వెల్పటికి హంసారునం జని గుబాదెబ వీధులవెంట జంట లై." హంస.5.160.

**గుబారు చేయు**
కుట్ర పన్ను; లేనిపోనివి కల్పించు; కలత పెట్టు.
"మనలను జాడ లేక నడుమంత్రపు వారు గుబారు చేసి గొబ్బున నినువంటి దాని కెగcబోసిరి నాతలc బొప్పకుండcగన్." రాధా. 3.78.

**గుబాలున**
ధ్వన్యనుకరణము.
"గుబాలునc గురిసెన్, నభమున సుమనో వర్షము." విజయ. 3.229.

**గుబులుకొను**
వాసన లెగయు.

**గుబ్బటిలు**
గుబ్బతిల్లు.

**గుబ్బతిలు**
ఉబుకుకొని వచ్చు.
"గుబ్బ మెఱుంగుc జనవ గుర్వొడువన్ మదిలోనc గోరికల్, గుబ్బతిలంగc జూచె." మను. 2.28.

ఇది నీటివిషయంలో సామాన్యస్థానా. లక్షణాయా మిగత వాటికీ ఉపయోగిస్తారు.

**గుబ్బతిల్లు**
చూ. గుబ్బతిలు.

**గుబ్బలాడి**
యువతి.

**గుబ్బసరము**
ఒకరకమైన హారము.

**గుబ్బుగుబ్బు రను**
ఘూర్ణిల్లు.
"పారి నంభోనిధ గుబ్బుగుబ్బు రనుచున్." వీర. 3.223.

**గుభగుభలు**
గడబిడలు.
"అంతరాయపుంగుభగుభ లేర్పడెన్." గుంటూ. పూ. పు. 32.

**గుభా లను**
ధ్వన్యనుకరణము.

**గుభులన వ్రేయించు**
ధ్వన్యనుకరణము.
"డిండిమదుందుభుల్ గుభు లనన్ వ్రేయించి సైన్యంబు." ఉ. హరి. 4.212.

**గుభు ల్లను**
ధ్వన్యనుకరణము.
సారం. 3.28.

**గుభులు గుభు లను**
ధ్వన్యనుకరణము.
"గుభులు గుభు ల్లను నాదండాల."
వీర. 3.226.

**గుభేలు**
ధ్వన్యనుకరణము.

**గుభేలుదస్త్రం**
పెద్ద కాగితాలకట్ట.
కొంచెం వ్యంగ్యంగా అను మాట.
"ఈ గుభేలుదస్త్రం యేమిట్రా?" వా.

**గుమగుమ వాసించు**
గుబాళించు.
విజయ. 3.122.

**గుమి గూడు**
గుంపు గూడు.
"క్రొక్కారు మెఱుఁగు లన్నియు, నొక్కెడ గుమి గూడి పిల్చియున్న విధముగా."
వేంకటాచల మాహాత్మ్యము." 1.131.
"దైవనమస్కారంబులు దూరంబు చేసి పదుగు రైదుగురు గుమి గూడుకొని..."
శుక. 2.10.
గుమి గూడుఁకొను అని ఆత్మనే పదములో కూడ నిది ప్రయుక్తము. ఒకటిగా చేరు అని అర్థము.

**గుమిగొను**
గుమి గూడు.

**గుమురుకట్టు**
గుంపు కట్టు.

**గుమురుకొను**
దట్టమగు.
"కఱుచ లై గుమురు లై గొనబు లై లేఁబాప, కొమ్మఁ జుట్టిన జడల్ గుమురుకొనఁగ." పాండు. 2.91.

**గుముర్లు గట్టు**
గుములు కట్టు.

**గుములు గట్టు**
గుంపులు కట్టు.

**గుములు గూడు**
గుములు కట్టు.

**గుమ్మటంగా**
1. గుంభనగా, గోప్యంగా.
"తింటారో తినరో గానీ వాళ్లింట్లో గుమ్మటంగా బతుకుతున్నారు." వా.
2. దిట్టంగా.
"వాడు గుమ్మటంగా ఉన్నాడు."
వా.

**గుమ్మడికాయంత**
పెద్దది.
"గుమ్మడికాయ యంత యగు ముత్తెం బై మనం బేర్చ." ఆము. 4.213.

**గుమ్మడికాయంత ముత్తెము**
పెద్దముత్తెము.
తాళ్ల. సం. 3.181.

**గుమ్మడికాయల దొంగ**
ఎవరో ఏదో అనగా అది తనను గూర్చే అని భావించు

వారియెడ ఉపయోగించే పలుకుబడి.

ఒక పిట్టకథ దీనికి మూలం. ఒక చోట గుమ్మిడికాయల దొంగతనం జరిగిందట. అందరినీ చేర్చి రాజుగారు దొంగతనాలు చేస్తే చేశారు. బుజాలమీదే పెట్టుకోవాలా అన్నాడట. అనగానే అసలు దొంగతనం చేసినవాడు బుజాలు తడిమి చూచుకున్నాడట.

"ఏదో మాటవరసకి నేనంటే నువ్వులికి పడతావేం? గుమ్మిడికాయల దొంగలాగా." వా.

"గుమ్మిడికాయలదొంగ అంటే బుజాలు తడివి చూచుకున్నాడట." సా.

చూ. బుజాలు తడిమి చూచుకొను.

## గుమ్మడికాయ లన్న బుజాలు పట్టి చూచుకొను

తాళ్ల. సం. 3.519.

చూ. గుమ్మడి.

## గుమ్మడికాయలో ఆవగింజంత

ఏ కొద్దికూడా కాలేదను పట్ల ఉపయోగించే పలుకుబడి.

అత్యల్పము.

"శ్రీ లందిమీఁదఁ బెద్ద గుమ్మడి కాయలో, నావగింజ యంత యైనఁ గలదె?" పాం. 2.26.

"చేయవలసిన పని చాలా ఉంది. గుమ్మడికాయలో ఆవగింజంతైనా కాలేదు." వా.

## గుమ్మడిగింజ నామము

గుమ్మడిగింజ ఆకారంతో పెట్టే బొట్టు.

## గుమ్మడిమూట గట్టు

గుమ్మడికాయవలె ముడుచుకొని పోవునట్లు చేయు.

"ఇరుచంబడ గుమ్మడిమూట గట్టి వీపు, పెక్కు గువాళి చేసి చలి యిక్కడ నక్కడఁ బెట్టు వేసవన్." క్రీడా. పు. 15.

## గుమ్మడివిత్తు నామము

గుమ్మడిగింజ ఆకారంలో ఉన్న బొట్టు.

ప్రభా. 4.137.

## గుమ్మపడు

కుప్పగూలు.

## గుమ్మ గుమ్మను

1. చెవులు దిమ్మ వేసుకొనుట లోని ధ్వన్యనుకరణము.

"గుమ్మగుమ్మని చెవుల్ దిమ్ముపడఁగ." రాధి. 2.20.

2. చిలుకుటలో ధ్వన్యనుకరణము.

"కవ్వపుఁగొండ వార్ధిలోఁ, దేలుచు గుమ్మగుమ్మనఁగ ద్రిప్పఁగఁ జొచ్చిరి." హర. 6.74.

## గుమ్మెతకాడు

గుమ్మెత అనే వాద్యం – ఘట

వాద్యం వంటిది - వాయించు వాడు.

హంస. 5.136.

## గురగుర మను

ధ్వన్యనుకరణము.

"పంది గురుగురు మంటుంది." వా.

"ప్రాణం గురగుర మంటున్నది." వా.

## గురికట్లు నిలుచు

కట్టుబాటు నిలుచు.

"వాదు గురికట్లు నిలుచునా నళిన నయన." రాధి. 1.113.

## గురిగింజ సరి తూగు

చిన్న దగు.

తాళ్ల. సం. 3.585.

## గురు డేకాదశమం దుండు

ఉచ్చస్థితిలో నుండు.

జాతకచక్రంలో గురువు ఏకాదశస్థానంలో అనగా లాభంలో ఉంటే బాగా సాగు నని జ్యోతిషం.

"అబ్బో! శూరకుల కిప్పుడు గురుఁ డేకాదశమం దున్నాఁడు. ఎక్కడఁ జూచిన మామిడాకు తోరణములు, మంగళ్లపీరణములు." సాక్షి. 245 పు.

## గురుపరంపర

వంశ పరంపరవలెనే గురువునకు గురువు, శిష్యునికి శిష్యుడు. ఇలా ఉన్న వరుస.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 522.

## గురులువాఱు

గిరగిర త్రిప్పు.

"గురులు వాఱెడు పెద్ద కొఱవిదయ్యములు."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1642.

## గురువుకు పంగనామాలు పెట్టు

గౌరవింప దగినవానినే మోసగించు.

"వాడా! కిరాతకుడు. గురువుకు పంగనామాలు పెడతాడు." వా.

## గురువుతో గుటగుటలు

గురువుతోనే వాగ్వాదము.

"...కుటిలాత్మా! అటమట మ్మైన విద్య గొనుటయుం గాక గుటగుటలు గురువుతోనా యని కటకటంబడి..."

మను. 5.19.

## గురువుదేఱు

చిప్పిలు, నురువులు గట్టు.

"త్రెవ్వెడు గంటులన్ గురువుదేఱుచు నెత్తురు రాక మున్న."

భాస్క. రా. యు. 2.145.

## గురువునకు బొమ్మ పెట్టు

గురువునే అపహసించు.

"...ఇంతి కియ్యెడన్, గురువుకు బొమ్మ వెట్టితిరి క్రూరవిచారమ కీరవారమా!"

కవిరా. 3.

## గురువును మించిన శిష్యుడు

వాడికి మించిన చెడ్డ వాడనుపట్లనే వాడుక.

ఎత్తిపొడుపుగానే దీనిని ఉపయోగిస్తారు.

## గురువులు వాఱు

1. ఉబుకు లెత్తు.

"గురుగభీరుం డయ్యు గురువులు

“వాఱుచు, నట్టిట్టుఁ బాతర లాడువాని.”
భాగ. స్క. 10 (పూ) 544.

2. ఎక్కు వగు.

“పెనఁగు పెద్క ఉల్లంబులలో, గుసవులు వాఱఁగ నిలిచిరి.”
భార. ద్రోణ. 1.135.

3. క్రొవ్వు పట్టు.

“విరుల గుత్తుల మీఁద గురువులు వాఱుచు, ముద్దిచ్చు లేటుల మొరపము లెస.” మార్కం. 5.

**గుఱక పెట్టు**

చూ. గుఱక లిడు.

**గుఱకపోతు**

నిద్రపోతు.

**గుఱక లిడు**

గుఱక పెట్టు.
నిద్ర పోవు అని భావార్థము.
నిద్రించునపుడు నోరు తెరిస్తే, నోటినుండి గాలి వచ్చి గుఱ్ఱు మని శబ్దమగును.
ధ్వన్యనుకరణము.

“సెలవుల వనదంశములు మూఁగి సెఱ పెట్టఁ, గోల్పులుల్ పాదరిండ్ల గుఱక లిడఁగ.” మను. 2.7.

**గుఱగుఱ యగు**

దురద యగు, దురద కలది యగు.
వరాహ. 10.58.

**గురి కట్టు**

కట్టుబాటు.

“మానుసామునఁ జల పోరి పోరువేళ, నాడు గురికట్లు నిలుచునా.”
రాధికా. 1.113.

**గురికాడు**

గురి తప్పకుండా కొట్టేవాడు.

**గురికి బారెడుగా**

కచ్చితంగా కాక — ఏదో ఉజ్జాయింపుగా.
గురి చూచి కొట్టవలసిన చోట గురి పెట్టిన తావుకు బారెడు దూరంలో తగులు నట్లు అనుటపై వచ్చినది.

“అతడు చెప్పే అర్థం అంతా గురికి బారెడుగా ఉంటుంది.” వా.

**గురి కుదురు**

గౌరవ మేర్పడు.

“ఆ వైద్యుడంటే వాళ్లకు గురి కుదిరింది. అందరూ అక్కడికే పోతారు.”
వా.

**గురికొండి**

1. ఆయము పాటు, మర్మస్థానము.
2. త్రాళ్ళు.
3. గుర్తు.

“అనర్ఘ రత్నసం, కలితపుఁ గుప్పె చామరను గాంచుటయే గురి కొండి యంచు న,బ్బలువగలాఁడు.”
కాళిందీ. 6.58.

**గురికొను**

లక్ష్యీకరించు.

**గుఱి చేయు**

లక్ష్యీకరించు.

"మనుజనాయకుని మర్మంబులు గుఱి చేసి." గుర్మాం. 3.147.

రూ. గుఱి సేయు.

**గుఱి పడు**

పేరు పడు.

"శ్లాకోక్రమునఁ జాల గుఱి పడ్డ రాతు, చక్కెర ఖాణంపు సామ్రాణి నెక్కె." రఘునా. 18 పుట.

**గుఱి పఱచుకొను**

ఏర్పాటు చేసుకొను.

**గుఱిపెట్టు**

బాణము మొదలగునవి గురి పెట్టు.

"వాడు గురి పెట్టి కాల్చాడంటే ఆకాశంలో ఎగిరిపోయే పక్షి అయినా కింద పడవలసిందే." వా.

**గుఱి యగు**

సమర్థమగు.

"సంసారాబ్ధికిన్ నావయ్యె, దరిఁ జేర్పన్ గుఱి యైనవాఁడు." కుచేల. 2.51.

**గుఱి వేయు**

గుఱి చూచి కొట్టు; తన వశము చేసుకొను.

"పురుషుని నెచటికిఁ బోవంగ నీయక, యింతచేఁతల గుఱి వేయ వలయు." మల్హణ. 2.22.

**గుఱి వ్రాయు**

గిరి గీయు.

'పోవనీ, కంగజుఁ డానపెట్టి కదియక్ గుఱి వ్రాసె ననంగ జాతి సా, రంగ మదంబు లేఁ జెమటఁ గ్రమ్మె." మను. 2.32.

**గుఱుతుపడు**

గుర్తు తెలియు.

"క్రొత్త డాలు సెలంగ గుఱుతు పడక." నిరంకు. 1.43.

**గుఱుతుమాట**

మంచిమాట.

నానుడి.

"ఎలుక పిడికెడు ధన మన్న గుఱుతు మాట, తథ్య మౌఁ గాదె." కుచేల. 1.46.

**గుఱుతు వెట్టు**

గణించు.

"కుంభినీరేణు కణములు గుఱుతు వెట్టు, వాఁడు నేరఁడు తక్కినవారి వశమె." భాగ. 8.687.

**గుఱుతెఱుగు**

ఆనవాలు పట్టు.

"తుములమునను గుఱు తెఱుఁగక డా,సిన నీపెనిమిటిఁ దునిమితి." ఉత్త. రా. 4.104.

**గుఱు పొడుచు**

గుఱ్ఱు పెట్టు.

"వీచులతాకున నేచునర్ణవరవ మడఁగి పోవఁగ గుఱుపొడుచువారు..." భాస్క. యుద్ధ. 276.

**గుఱువెట్టు**

గుఱక పెట్టు.

"నిద్రించుచున్, గుఱు వెట్టఁ దొడఁగెన్." భాగ. స్క. 8.713.

**గుఱ్ఱం దిగకుండా**

అత్యవసరంగా వెడుతున్నా

నను నట్లుగా ప్రవర్తించే మనిషినిగురించి అనేమాట.

"వాడు గుఱ్ఱం దిగకుండానే సున్నం అడుగుతాడు." వా.

"వా డెప్పుడు వచ్చినా గుఱ్ఱం దిగకుండా వెళ్లి పోతా నంటాడు." వా.

## గుఱ్ఱ మెక్కు

1. గర్వించు.

"కొంత గుఱ్ఱ మెక్కితే నే గుంటఁ గూలి పోదురు." తాళ్ల. సం. 8.186.

2. నేటవాడుకలో తాగి మైకంలో ఉన్నాడు అనే అర్థంలో కొన్ని ప్రాంతాల్లో వినవస్తుంది.

"వాడు సాయంత్రం గుఱ్ఱ మెక్కి ఉంటాడు. కాస్త జాగ్రత్తగా మాట్లాడు." వా.

## గుఱ్ఱుగా ఉండు

కోపంగా ఉండు.

"వా డీమధ్య నా మీద గుఱ్ఱుగా ఉన్నాడు." వా.

## గులకరములు గొను

అంకుర మెత్తు.

"సునుఁజెమటం దడంబడి గులకరములుఁ గొన." భాగ. 8 స్కం. 396.

## గులగుల నగు

1. సళ్ళు వడు.

"గులగుల యయ్యె గబ్బి సునుగుబ్బలు ముద్దుమొగంబు వాడె." శుక. 1.304.

2. పొడిపొడి యగు.

"స్థైర్యంబు హాటకాహార్యంబు నదలింప, గులగుల గాక న్నె కులధరములు." రాజగో. 1.64.

## గులగుల లగు

ముక్కలు ముక్క లగు. లక్షుగాఁగూ నలిగిపోవు.

పాండు. 4.279.

## గులగుల లయి పోవు

పొడిపొడి యగు.

"గ్రుగ్గున గోత్రాచలంబుల్ గులగుల లయి పోఁ గోతముల్ గ్రుద్దులీలన్." మను. 4.8.

## గుల గులలుగా నగల్చు

పిండి పిండి చేయు.

"నిజభుజాపరిఘంబున వజ్రకఠినంబగుతద్వక్షంబు గులగులలుగా నగల్చి గర్జించి..." ఉషా. 4.62.

## గుల్లకావి

కొంచెము నీలి రంగైన ఎఱుపు.

బహు. 4.141.

## గుల్లకాసు

చిన్న కాసు.

"ఇటమటించినఁ గుంచెఁ డంతసాదము గాక, కాదేని యొక గుల్లకాసు గాక." విప్ర. 5.19.

## గుల్లగట్టి తిను

కరగ దిను.

"కలిగిన సొమ్మెల్ల గుల్లగట్టి తినం గన్." విప్ర. 4.26.

వాడుకలో గుల్ల చేయు, కరగ దిను అను మాటలు వినవస్తాయి.

**గుల్లగుట్టగ తిను**

కరగ దిను; పూర్తిగా ఖర్చు పెట్టు.

"మెల్లమెల్లన దాని చేతిసొమ్ముల్ల నిట్లు గుల్లగుట్టంగఁ దిని తల్లడిల్లఁ జేసు."
నిరం. 2.115.

**గుల్లపఱుచు**

నాశనము చేయు.

"నిను నేఁడు ముఖమున నెత్తురుఁ గ్రాయింతుని గుల్లపఱుపక కొలికికి రావు."
హరిశ్చ. 2 భా. 165.

**గుల్లపుటిక**

చిన్న పుటిక.

శ. ర.

**గుల్లయగు**

నాశమగు, పాడగు.

"ఇల్లాలు మెలఁగకున్నను, గుల్లే సౌఖ్యంబు."
శేష. 1.139.

**గుల్లసున్నము**

గవ్వసున్నము.

**గువ్వకరిగా**

విడవకుండా ధ్వని చేస్తూ.

విజృంభణ మని వావిళ్లాది కోశాలు. సరి అనిపించదు.

"ని,ర్భరగతి వ్రాలు నమ్మధుకరమ్ములు గువ్వకరిన్ నటింపఁగన్."
భోజసుతా. 3.26.

చూ. గువ్వకరి గొని తిట్టు.

**గువ్వకరి గొని తిట్టు**

ఒక్కొక్క రొక్క మాటగా తిట్టు, గలగల మని తిట్టు.

గువ్వలగుంపు చేరినప్పుడు కిచకిచ మని ఆపకుండా అరుచు చుండును. అందుపై వచ్చిన పలుకుబడి.

అతిశయించు అని వావిళ్లాదులు. గుఱికి బారెడుగా చెప్పిన అర్థ మనిపిస్తుంది.

"పుణ్యవాహిని నిటు వా,గ్రుచ్చితి వని పడి నందఱు, గ్రచ్చ కదలినట్లు గువ్వకరిగొని తిట్టన్."
జైమి. 4.72.

చూ. గువ్వకరి.

**గువ్వకుత్తుకతో**

డగ్గుత్తికతో – ఎండిపోయిన గొంతుతో. నోరెండి అనుట.

గువ్వ అన్నది దుర్బల మయినది, నీరసించి పోయినది అనే భావాల్లో ఉపయుక్త మవుతుంది! "వాడు గువ్వలా అయి పోయాడు."

"కతిలపడు నతండు గువ్వకుత్తుకతోడన్."
పాండు. 3.20.

**గువ్వకుత్తుక పడు**

నోరెండిపోవు – నీరసపడు.

"నెవ్వగఁ గుందుచు నీరసాన్నములఁ, గ్రొవ్వి బల్తురె గువ్వకుత్తుక పడక."
గౌర. హరి. ఉ. 1280. పంక్తి.

**గువ్వకొను**

మంతనా లాడు, చేరు – గుమిగూడు.

**గువ్వకోలుగొను**

మంతనము లాడు; పంకరించు.

"ఎక్కడి వివేకమున మంత్రు లెల్లఁ గదిసి, కువలయేంద్రునితో గువ్వకోలు గొనుచు." శుక. 1.462.

"దివిజకామినుల లీలఁ దిరుగువారికి, గువ్వకో ల్గొనంచుఁ దనలోన నవ్వు కొంచు." మను. 3.109.

**గువ్వలు డేగ నెదిర్చినట్లు**

అసాధ్యము. అసంభవము అయిన పనికి పూనుకొను. గువ్వలనే డేగలు కొట్టి తినుట అలవాటు. అవి డేగనే యెదిర్చినట్లు అనగా అసాధ్యమనుట.

"గువ్వల్ డేగ నెదిర్చి పేర్చినగతిన్." కా. మా. 2.54.

**గుసగుసల బోవు**

గుసగుస లాడు.

"గుసగుసల బోయి రచ్చర లెల్లన్." విజయ. 3.106.

**గుసగుస లాడు**

మంతనా లాడు, రహస్యంగా సంభాషించు.

**గుసగుసలు వోవు**

గుసగుస లాడు.

**గుసిగుంపులు**

కుసిలింపులు.

"కొసరు వగమాట లలుకలుఁ, గుసి గుంపులు తిట్లు మోరికొట్టులు జారుం, డసుసుఖంబుగఁ గైకొను." శుక. 1.530.

**గూట దీపం పెట్టేదిక్కు**

ఔరసులు, వారసులు.

"వారికి ఎన్ని ఉంటే నేం! గూట్లో దీపం పెట్టే దిక్కు లేక పొయ్యాక." వా.

**గూటము కొట్టుకొని కూర్చుంటావా ?**

నీ వేమి శాశ్వతంగా ఉండి పోగలవా అని యెత్తిపొడుపుగా అనుమాట.

"అంత ఆస్తి అంటే పడి చస్తున్నావు. నువ్వేమి గూటం కొట్టుకొని కూర్చుంటావా ?" వా.

**గూట వేయు**

కనుసూటపఱచు.

"హోరి యంతలో గురుఁడు గూట వేసె మనసు." తాళ్ల. సం. 11.40.

**గూటిగువ్వ**

ఈకలు రాల్చిన పక్షి.

**గూటిపఱచు**

దాచు.

"ఆ కీలుకను గూఁటిపఱచి గయ్యాళి తపసి." చంద్ర. 1.134.

**గూడకట్టు**

గోచి పెట్టకుండా పంచ చుట్టుకొనుట; అడ్డకట్టు అనీ అంటారు.

"కౌపీనములు మీఁద గూడకట్టులు గానుపింప." పండితా. ద్వితీ. పర్వ. పుట. 308.

"గూడకట్టు కట్టుకున్నా వేరా అరవాడి లాగా?" వా.

గూడకొంగ
ఒక రకమైన కొంగ.
బ్రౌన్.

గూడబాతు
బాతుల్లో ఒక రకం.

గూడ వేయు
చేనికి గూడలలో నీరు పెట్టు.
బ్రౌన్.

గూడుపుఠాణీ
కుతంత్రం, మోసం.
"ఇందులో యేదో గూడుపుఠాణీ ఉంది." వా.

గూడుపుఠాణీ చేయు
కుట్ర పన్ను.
కాత. 190.

గూఢరతి
సంభోగములో ఒక భేదము.
కమా. 9.152.

గూను గిల్లబడు
వంగి పోవు.

గూను వోవు
గూని వడు.
"అనిశంబు వీఁడు వాఁడనక యెక్కుఁగ వేల్పు, పేనుఁగునకు...గూను వోయె." వరాహ. 10.15.

గూబకండ్లు
భయంకర మైన, వికార మైన కండ్లు.
"దాని గూబకండ్లు చూస్తేనే నాకు భయం వేస్తుంది." వా.

గూబజంకెలు
వట్టి బెదరింపులు.
గుడ్లగూబ కూత యేపిశాచం అరచినట్లో భయంకరంగానే ఉంటుంది. కాని అది మనుష్యులను చేయగల దేమీ లేదు. అందుపై వచ్చిన పలుకుబడి.
"నీ గూబజంకెలకు నుద్వేగపడన్." నిరంకు. 3.

గూబ లదరగొట్టు
బెదరించు, దండించు.
'గూబ లదరగొట్టి వాడిదగ్గర ఉన్న నాలుగు కాసులూ లాక్కున్నాడు వీడు' అని వ్యవహారం.
'గూబ లదరగొడతాను' అని ఒకతిట్టుగా కూడా వ్యవహారంలో ఉంది.
"నీవు అదీ యిదీ అన్నా వంటే నీగూబ లదరగొడతాను. జాగ్రత్త." వా.

గూబలు నల్పి వసూలు చేయు
బలాత్కారంగా వసూలు చేయు.
చెవి నులిమి వసూలు చేయు.
"కోరటువార లప్పు నొగి గూబలు నల్పి వసూలు చేతు రె, వ్వారు." గీర. 33.

గూబలో పురుగు
నిరంతరము పోరునది.
ఘదన. శత. 23.

**గృహకృత్యములు దీర్చు**

ఇంటిపనులు నెఱవేర్చు.

"తనదు గృహకృత్యములు దీర్చుకొనుచు నుండె." హంస. 5.365.

**గృహచ్ఛిద్రాలు**

ఇంటి యిబ్బందులు.

"ఈమధ్య చాలా గృహచ్ఛిద్రాలు వచ్చాయి. వాటితో నా మనస్సు ఏమీ బాగుండ లేదు." వా.

**గెంటన మాడు**

హాస్య మాడు.

న్యూనత పఱచుచు మాట లాడు.

"బ్రహ్మవారువముల, గెంటనం బాడు నడ గల్గుకిసలయోష్ఠి." పాండు. 3.193.

**గెంటు గుంటును లేక**

గంటు గణుపు లేక.

అనగా నవురుగా సవురుగా.

స్తంభాలకూ వానికీ ఉపయోగించే కఱ్ఱలో గంటూ గణుపులూ లేకుండా ఉన్నప్పుడే అది స్థిరంగా శాశ్వతంగా ఉంటుంది.

"భవనఘటనకు మొదలికంబమును బోలె...సెట్టుకొనియె గెంటు గుంటును లేక." పాండు. 2.55.

**గెంటు గొంటును లేక**

నవురుగా సవురుగా.

"నిట్ట నిలుచున్కి చే గాదె సెట్టుకొనియె, గెంటు గొంటును లేక లక్ష్మికళత్ర!" పాండు. 2.55.

ఇదో పాఠాంతరం.

**గెంటుపడు**

తప్పిపోవు, వైతొలగు.

చూ. గెంటువడు.

**గెంటువడు**

తప్పించుకొను.

గెంటినప్పుడు మనిషి ఆవలి వైపుకు పోవును కనుక గెంటువడుట అనగా తప్పించుకొనుటగా మారినది.

"గదాహతి నొకఁడున్, గెంటు వడకుండఁ బీనుఁగుఁ, బెంటలు గావించె." జైమి. 3.105.

**గెడకత్తియ**

ఆటది; తోటెది.

గామ్మరివాడు గెడకట్టె ఆడటం ప్రసిద్ధం. గెడసాని కూడా ఇలా వచ్చిందే.

"తమతోడ నాడు గెడకత్తియ కాఁగయిసేసి రామనిన్." కుమా. 9.108.

రూ. గెడకత్తె.

**గెడగూడు**

కలగూడు.

"గెడగూడ దీని నతని యొదలిపయిం బెట్టి కాల్చు టుచితంబు." భార. విరా. 3.12.

2. కలియు — రత్యర్థమై.

"ఉష్ణ శీతాన్న కబళము లొకఁడు నూపఁ, బవలు రాత్రియు గెడగూడ నవసర మని, దాని కత్తగ మొకలతాతన్వి యిచ్చె, నధరబింబము విడిచి సంధ్యాగమ మని." సైమ. 9.187.

గెడగూడి పాఱు

పరువెత్తు – జతగా – పందెం వేసుకొని. . .

"మిన్ను దలఁబాఱె ఖగపతి, యన్నది యును బాఱఁదొడఁగె నవని యగ్రుచు నే, మున్నో తా మున్నో యని, పన్ని దమునకు గెడగూడి పాఱినభంగిన్."

భోజ. 7.42.

గెడసేయు

కలుపు; జత చేయు.

"గెడసేయుము నన్నుఁ గార్తికేయుని తోడన్." ఉత్త. హరి. 5.15.

గెర గట్టుకొను

కుదురు కట్టుకొను.

"గెర గట్టుకొని పుట్టు నెర పూప చనులతో." రాధి. 1.53.

గెఱగొను

సూపొందు.

"క్రీగంటిచూపున గెఱగొన్న సన్న గేదంగి, తేకుల కన్నదమ్మ లగుచు."

ఉత్త. హరి. 1.131.

గెలుపుకంబము

విజయస్తంభము.

వరాహ. 1.20.

గెలుపుకాడు

విజేత.

గెలుపుకొను

జయించు.

విక్ర. 6.26.

గెలుపోటములు

జయాపజయములు.

శృంగా. శాకుం. 1.164.

గెల్లువడు

విజృంభించు.

పద్మ. 7.238.

గేదగితేనె నాకించు

నోరు తీపు చేయు, కాస్త తడి చేయు.

"సానితల్లికి తిక్క చనుదెంచి నపు డెల్ల, గేదఁగితేనె నాకించవలయు."

చింతా. 5.47.

గేనము లేక

ప్రజ్ఞ లేక, మై మఱచి.

"గాంగేయుఁడుఁ దారకాసురుఁడు గేనము లేకని సేసిరి." కుమా. 12.144.

వాడుక – "వంటిమీద ప్రజ్ఞ లేకుండా గుంపులో జొర బడ్డాడు."

కేనము అంటే కన్నడంలో సంకోచము అని కూడా అర్థం. ఎట్టి సంకోచము లేక అని కూడా దీనికి అర్థం చెప్ప వచ్చును; కానీ సుదూరార్థం.

గేలికొట్టు

పరిహాసించు.

పరమ. 1.15. పుట.

గేలిగొను

గేలి సేయు.

భార. శల్య. 2.215.

గేలి చేయు

హాస్యము చేయు.

గేలి పెట్టు

గేలి చేయు.

గేలి సేయు
గేలి చేయు.

గొంజెగొడుగు
ఆతపత్రము.
"గొంజెగొడుగులే కొం డెల్లా."
తాళ్ల. సం. 11. 3 భా. 53.

గొండ్లికొను
నాట్య మాడు.
సుద. 3.34.

గొంతు ఆరిపోవు
అఱపువల్ల గొంతు తడి ఆరు.
"అరగంట మాట్లాడేసరికి నా గొంతు ఆరిపోయింది." వా.

గొంతుక తడుపుకొను
దప్పి తీర్చుకొను, కడుపు నించుకొను.
గువ్వలచెన్న. 3.

గొంతుకు ఉరి యగు
బాధాకరముగా పరిణమించు.
"వీడు నాకు గొంతుకు ఉరి అయి కూర్చున్నాడు." వా.

గొంతు కూచుండు
పట్టు పట్టు.
"వాడు ఈపని చేస్తేకాని అన్నం తిన నంటూ గొంతు కూచున్నాడు." వా.

గొంతు కూర్చొను
మోకాళ్లపై గొంతు మోయునట్లుగా కూర్చుండు.
"భోజనందగ్గర గొంతు కూర్చుంటా వేమిట్రా!" వా.

గొంతు కొను
గొంతు కూర్చుండు.

గొంతు కోయు
ద్రోహము చేయు.
నా. మా. 28.

గొంతు కోసినా....
ఏమి చేసినా అనుట.
"వాడు గొంతు కోసినా నిజం చెప్పేనా?" వా.

గొంతు చించుకొను
అఱచు.
నిరసనగా మాట్లాడేటప్పుడు ఉపయోగించే పలుకుబడి.
"ఎందుకు అంత గొంతు చించుకుంటావు రా? పిల్లవాళ్లు అల్లరి చేయక పోతే మనం చేస్తామా?" వా.

గొంతు చిదుము పని
మెడ నులిమి చంపుట.
"కులుచవగ చిక్కటూరిం, బరికింపక గొంతు చిదుముపనిఁ దలఁచి..."
శుక. 1.318.
చూ. గొంతు పిసుకు, మెడ నులుము, తల దఱుగు ఇత్యాదులు.

గొంతు చేసికొను
అఱచు.
"ఇంతీ! యెవ్వరు లే రని, గొంతేటికిఁ జేసె దెవరు గొనిపోయెద రే?"
హంస. 3.222.

గొంతున బడు
గొంతు లో తగుల్కొను, (మింగునపుడు) మింగుడు పడక పోవు.
"వెన్నె అముద్ద భుజింపఁ బోయి గొం,తునఁ బడ వేసికొన్న హిమతోయ మొసంగిరి." నిరంకు. 2.104.

**గొంతు నొక్కు**

నోరు నొక్కు,

నా. మా. 12.

**గొంతు పట్టుకొను**

1. గొంతుమీదికి వచ్చు.

"అప్పు డేదో అన్నాను. ఇప్పు డది గొంతు పట్టుకొంది." వా.

2. గొంతున కడ్డము వచ్చు.

"గొంతు పట్టుకొం దేమో! మంచినీళ్లు తాగ రా! అంత యెక్కిళ్లు పెడు తున్నావు." వా.

**గొంతు పెగలకుండు**

నోట మాట రాకపోవు.

"వా డింట్లో తెగ వాగుతాడు గానీ నలుగురిలోకి వస్తే గొంతు పెగలదు." వా.

**గొంతుపోక**

గొంతుముడి.

చూ. గొంతుముడి.

**గొంతు బొంగురు పోవు**

1. గద్గద మగు.

"వాళ్లమ్మ కనిపించగానే భావాతిరేకం పట్ట లేక పోయాడు. వాని గొంతు బొంగురు పోయింది." వా.

2. గొంతు రాచి పోవు.

"పురాణం చదివి చదివి వాడిగొంతు బొంగురు పోయింది." వా.

**గొంతుమీద కూర్చొను**

ఏదైనా యిప్పుడే కావా లని నిర్బంధించుపట్ల ఉపయో గించే పలుకుబడి.

"ఇప్పుడే సొమ్మంతా కావా లని వాడు గొంతుమీద కూర్చున్నాడు." వా.

**గొంతుమీదికి వచ్చు**

ప్రమాదస్థితి ఏర్పడు; ప్రాణాలమీదికి వచ్చు.

"ఆ విషయం యిలా గొంతుమీదికి వస్తుం దని నే ననుకో లేదు." వా.

"అక్కడా యిక్కడా అన్నమాటలే యీ రోజు గొంతుమీదికి వచ్చాయి. గమనించావా?" వా.

చూ. మెడమీదికి వచ్చు.

**గొంతుముడి**

గొంతు ముందు కాయగా కనిపించే ఎముక.

చూ. గొంతుపోక.

**గొంతు మూగవోవు**

స్వరవిహీన మగు.

"నా గొంతు మూగవోయింది." వా.

రూ. గొంతుమూగపోవు.

**గొంతులో గురక పుట్టు**

అవసానదశ సమీపించు. చనిపోవునప్పుడు గొంతులో కఫం క్రమ్ముకొని రావడంతో గురగుర మనుటపై వచ్చిన పలుకుబడి.

"ఆవిడకు గొంతులో గురక పుట్టింది. ఇక ఏం జరిగినా గంటలే." వా.

**గొంతులో నీళ్లు దిగడం లేదు**

చాలా జబ్బులో ఉన్నాడు. ఏ మాత్రం త్రాణ లేదు అనుట.

"వాడికి రెండురోజులుగా గొంతులో నీళ్లు దిగడం లే దట." వా.

**గొంతులో నీళ్లు పోసే దిక్కు**
దగ్గరివాళ్లు, ముఖ్యంగా రక్త బంధువులు.
"వాడికి గొంతులో నీళ్లు పోసే దిక్కు కూడా లేదు. పాపం! జబ్బుతో నానా బాధా పడుతున్నాడు." వా.

**గొంతులో పచ్చి వెలగకాయ పడినట్లగు**
ఏమీ అనలేక పోయే చిక్కు పరిస్థితి యేర్పడు.
చూ. గొంతులో వెలగకాయ పడినట్లు.

**గొంతులో ప్రాణ మున్నంత వఱకూ**
ఎంతవఱకైనా ఏమైనా అనుట.
చూ. కంఠంలో ప్రాణం ఉన్నంత వఱకూ.

**గొంతులో వెలగకాయ పడినట్లు అగు**
ఎటూ తప్పుకొన వీలు లేని స్థితిలో పడు.
"వాడికీ వీడికీ తగాదాలు పెడుతూ వీడు తిరుగుతుండేవాడు. ఇద్దరూ ఎదట బడేసరికి వీడికి గొంతులో వెలగకాయ పడ్డట్లు అయింది." వా.

**గొంతు విచ్చి**
గొంతెత్తి.
"అతను గొంతు విచ్చి పాడితేనే బాగుంటుంది." వా.
చూ. గొంతెత్తి.

**గొంతెత్తి**
బిగ్గరగా.
"అవిడ గొంతెత్తి పిలిస్తే కానీ పలకదు." వా.

**గొంతెమకోరికలు**
ఏవేవో అసాధ్యమైన కోర్కెలు.
"చాలకుండిన నగుఁ జెట్టబాలుఁ డితఁడు, కొసరి గొంతెమ కోరికల్ గోరెనేని, యిడక పోఁబోల దిడఁ బోలదు..." పాండు. 4.166.
"వాడి వన్నీ వట్టి గొంతెమ్మ కోరికలు. తీరేవా? పెట్టేవా?" వా.
రూ. గొంతెమ్మకోరిక.

**గొందిపెట్టు**
దాచు.

**గొందులపెట్టు**
దాచు.
ప్రాన్.

**గొజ్జగనీరు**
పన్నీరు.

**గొజ్జగమంచు**
పన్నీరు.

**గొజ్జుబ్రాలు**
ఒక ధాన్యం.
హంస. 4.128.

**గొజ్జెగనీరు**
పన్నీరు.

**గొటగొట మను**
ధ్వన్యనుకరణము.
"గొట గొట మని రొప్పు బలుసింగములనైన. సారం. 1.68.

**గొట్టికంటి**
ఒక రకం తినే గడ్డ.

గొట్టు సేయు

1. బాధ పెట్టు.

"ఇట్టు లారాచపట్టినిఁ బట్టి చాల, గొట్టు సేయుచు." సారం. 2.108.

2. బహిరంగ పఱచు.

"గొట్టు సేయక వీనిఁ జూపెట్టుకొనుచు, నిచ్చటికిఁ దెచ్చితిమి." శుక. 3.586.

గొడవగొంట్లు

కలహశీలురు.

తిట్టుగా ప్రయుక్తం (స్త్రీల విషయంలో.)

పండితా. ప్రథ. పురా. పుట. 343.

గొడుగుక్రింది రూపు

రాజు.

భూచక్రగొడుగు అనే రాజ లాంఛన మైనఆతపత్రంక్రింద రాజే ఉంటాడు కదా.

"గొడుగు క్రింది రూపుఁ బొడిచి జయంబు నీ, కిత్తు నధిప నన్ను నింత నమ్ము." కుమా. 11.37.

గొడుగు బల్ల

తలుపుమీది కుసుం తిరిగే పట్టె.

శ. ర.

గొడుగు మెట్టెలు

ఉబ్బు మెట్టెలు.

గొడ్డలిపెట్టు

వ్యాఘాతము కలిగించునది.

"ఆనాడు ఉప్పుసత్యాగ్రహం బ్రిటిషు ప్రభుత్వానికి గొడ్డలిపెట్టుగా పని చేసింది." వా.

గొడ్డ వెట్టు

నిరోధించు, అడ్డగించు.

"గొడ్డ వెట్టకుఁ డంచుఁ గొఱ తేమి యంచు."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 289.

గొడ్డు

అజ్ఞాని; మూర్ఖుడు.

తిట్టుగా, దూషణగా ఉప యోగించే మాట.

గువ్వలచెన్న. 44.
నా. మా. 35.

గొడ్డుకారం

వట్టి కారం.

"గొడ్డు కారంతోనే వాడు పావు బియ్యమన్నం తింటాడు." వా.

గొడ్డు పోయిందా? (కులం)

ఇం కెవరూ లేరా అనుట.

ఈ కులానికి బదులుగా ఊరు, దేశం, లోకం ఇత్యాదులు ఉపయోగించుట కలదు.

"ఆ పిల్లే కావా లని యేమిటి? కులం గొడ్డు పోయిందా?" వా.

గొడ్డు పోలేదు

నిస్సంతు కాలేదు.

మరొకరు ఎవరూ ఇలాంటి వారు లేరా అనుపట్టున ఉప యోగించు పలుకుబడి.

"వీడే నని యేమిటి? లోక మేమీ గొడ్డు పోలేదు." వా.

"ఈ పిల్లే నని యేమిటి? కులం గొడ్డు పోలేదు." వా.

**గొడ్డుటోతుకు కాయము కొట్టు**

వ్యర్థప్రయత్నము చేయు.
బాలింతలకు పెట్టే కాగాన్ని కాయం అంటారు. అలాంటిది గొడ్రాలి కెందుకు? అనుటపై వచ్చినది.
మదన. శత. 6.

**గొడ్డు వీగి కన్నబిడ్డ**

ప్రథమసంతానము.
వానిమీద ప్రేమ యెక్కువ అనుట.
లేక లేక కలిగిన కొడుకు, తొలి కడుపు పంట, గొడ్రాలి తనం పోగొట్టి కలిగిన కుమారుడు.
"గొడ్డు వీఁగి కన్నబిడ్డండు గావున." కాశీ. 4.87.
"గొడ్డు వీఁగి కనిన కొడుకుగా రాము." పండితా. ద్వితీ. మహి. పుట. 167.

**గొడ్డు వీగు**

సంతానవతి యగు.
"గొడ్డు వీఁగిన యట్టి కొమ్మల కెల్ల, బిడలు లే రను పెను చింత గాని." వర. రా. అయో. పు. 336. పంక్తి. 18.

**గొడ్డు వోవు**

వ్యర్థ మగు.
"కొంత కాలంబు శూన్య మై గొడు వోయె." శివ. 1.51.

**గొడ్డే రగు**

వ్యర్థ మగు.
గొడ్డు+ఏరు.
"ఏలా బిడ్డలు లేని యీ ప్రబదుకు గొడ్డే రయ్యెఁ జింతింపఁగన్." కవిక.

**గొడ్డేరి తెచ్చు**

ఒక నిర్దిష్ట లక్ష్యము తో తెచ్చు.
"బాడ్డునఁ బుట్టిన పాప నికే నిన్ను గొడ్డేరి తెస్తినే కోడలా!" తాళ్ల. సం. 12.312.

**గొడ్డేటు**

1. గొడ్డునడు.
"ఒడ్డారించి విషంబున, కడను చను దెంచి కావ నధిపులు లేమిఁ, గొడ్డేటి ప్రమందిరి." భాగ. స్క. 8.217.

2. గుత్తకు తీసుకొను.
"బాడ్డుపల్లెను గొడ్డేటి మోసపోతి." శ్రీనాథుని చాటువు.

**గొడ్డేటుగ**

వ్యర్థముగా.
"నీ పడ్డపాటు గొడ్డేటుగ జిడ్డు పటుపం గలవార మె ళ్ళి?" హర. 2.132.

**గొడ్రాలు**

బిడ్డ పాప లేనిది.
పాండు. 3.128.
"గొడ్రాలి కేం తెలుసు బిడ్డకట్లు?" సా.

**గొద గొద**

వైరము.
"ఆ రెంటి కేల గొదగొద వొడ మెన్." వేం. పంచ. 3.99.

**గొద గొను**

విజృంభించు, త్వరపడు ఇత్యాది

భావచ్ఛాయలలో ప్రయుక్తం.

గొనకొను

నెలకొను.

వెడలు ఇత్యాదులలో ప్రయుక్తం. కొన్నిట ఉపస్కారకంగా వినవస్తుంది.

"గొనకొన్న ప్రేమమై కొలువు చాలించి." రంగ. రా. అర. 170. పు.

"గొనకొని వీడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు."

భార. అర. 4.105.

"వేటనెపమున గొనకొని కణ్వాశ్రమమునకున్ వచ్చి." భార. ఆది. 4.74.

గొనకొల్పు

పురికొల్పు.

గొణగొణలాడు

గొణుగు.

ధ్వన్యనుకరణము.

గొప్ప చేయు

1. పెద్ద చేయు.

"వాళ్ల యింటికి వెళ్లినప్పుడు అతడు నన్నెంతో గొప్ప చేసి గౌరవించాడు."

వా.

2. పెంచు.

"కోయకు జీతంబు గొప్ప చేయు."

పార్వ. 1.62.

గొప్ప చేసుకొను

స్వోత్కర్ష చెప్పుకొను.

"వాడేమో మహా గొప్ప చేసుకొంటున్నాడు. వాడి సంగతి ఎవడికి తెలియదు?"

వా.

గొప్ప మనసు చేసికొను

ఎక్కువ ఔదార్యమును చూపు.

"నేనూ అంత ఉన్నవాణ్ణి కాదు. నా చేతనయిన మర్యాద లన్నీ చేశాను. మీ రేదో గొప్ప మనసు చేసుకొని యీ మూడుముళ్లూ పడనిస్తే జన్మజన్మాలకూ మీ మేలు మరిచి పోను."

వా.

గొప్పు తవ్వి గొయ్యి తవ్వి సంపాదించు

నానా బాధపడి సంపాదించు.

"వాడేదో గొప్పు తవ్వి గొయ్యి తవ్వి నాలుగురాళ్లు సంపాయించుకొంటే కొడుకు అది కాస్తా కాజేస్తున్నాడు."

వా.

గొబ్బిపదములు

గొబ్బి తట్టుతూ పాడుకునే పాటలు.

పండితా. ప్రథ. వాద. పుట. 513.

చూ. ప్రభాతపదములు.

గొర్లపాలు సేయు

పారద్రోలు - గొఱ్ఱెలను వోలె తోలు.

"నిశితఖడ్గాయుధాన్వితహస్తుఁ డగుచుఁ, బకువరించుచు గొర్లపాలు సేయుచును."

బస. 6.155.

గొర్లమంద

అమాయకులూ, అజ్ఞానులూ అనుట.

"ఆ ఊళ్లో వాడు చెప్పింది వేదం. ఆ జనమంతా గొర్లమంద కాబట్టి సరిపోయింది. లేకంటే వీడి ఆట సాగేదా?"

వా.

గొటక వేయు

ధ్వని చేయు.

"ఒక్కఁ డదుగతి గొఱక పేగుమును డాచి, నట్టరిగి తెంకిఁ గని..."
మను. 4.48.

## గొఱగయ్య (డు)

ఈశ్వరుడు.

శైవులలో నేటికీ ఒక వర్గం గొఱగయ్యలని జంగాలవలెనే ఉంటారు. వారి వేషం చిత్రంగా ఉంటుంది. వీరు జంగాలవలెనే తిరుగుతూ భిక్షు చేస్తారు.
కుమా. 7.38.

## గొఱిగించు

1. ఖర్చు పెట్టించు.

"ఆ దత్తపుత్రుణ్ణి గొఱిగిస్తూ వీడు మహా అట్టహాసంగా వెలిగి పోతున్నాడు."
వా.

2. క్షౌరము చేయించు.

"తల గొఱిగింపఁ బంచె."
కాళ. 1.48.

## గొఱుగులు వడు

గొఱగబడు.

"గొఱుగులు వడ్డ వెండ్రుకలు..."
పద్మ. 2.191.

## గొఱుపడము

నల్లకంబళి.

గొఱ్ఱె చర్మముపై వచ్చి, నల్లకంబళి అన్న అర్థంలో నిలిచింది.

"సెలి వెన్నిమాలులు నీళ్లలోపలను, గొఱుపడం బుదికిన మఱి తెల్లనగునె?"
బస. 7.207.

## గొఱ్ఱె

ఒక తిట్టు.

చెనటి. అజ్ఞాని అనుట.

"వాడు ఒట్టి గొఱ్ఱె. వాడికి ఏం చెప్పితే ఏం లాభం?"
వా.

## గొఱ్ఱెతోకగా ఉండు

ఎదగనిదిగా ఉండు.

'గొఱ్ఱెతోక బెత్తెడే' అన్న సామెతపై వచ్చిన పలుకుబడి. ఎదుగుబొదుగులు లేనిది. గొఱ్ఱెతోక పుట్టినప్పుడెంతో తరువాత కూడా ఎదుగుబొదుగులు లేకుండా అలాగే ఉండి పోతుంది.

"ఎంత చేసినా ఆ పని గొఱ్ఱెతోకగానే ఉంది."
వా.

## గొఱ్ఱెదాటు

ఒకరిని గుడ్డిగా అనుసరించి పదిమంది పోవుట.

ముందున్న గొఱ్ఱె ఎటు పోతే మిగత మందంతా అటే పోతుం దనుటపై వచ్చిన పలుకుబడి.

"రెడ్డికొడుకు తెల్లజుబ్బాలు వేయడం మొదలెట్టేసరికి ఊరంతా అదే మొదలు పెట్టారు. అంతా గొఱ్ఱెదాటు."
వా.

## గొఱ్ఱెవలె వెఱ్ఱికూతలు కూయు

అజ్ఞానభాషితము లాడు.

"ఓరి! నైరృత! గొఱ్ఱెవలె యేల వెఱ్ఱి కూతలు కూశేవురా."
హేమా. 29 పు.

**గోలగోల లాడు**

గోల చేయు.

"చిలుకలు గోరవంకలు గోయిల లరి
చలు నెమలిగములు నెడపక యెప్పు
డున్, గోల గోల లాడుచు విరహుల,
నిలువఁగ నిచ్చునె వనంబు నీకెం
గొలయే." శివలీ. 2.76.

**గొలుసుకట్టు**

విడివిడిగా కాక కలిసికట్టుగా
వ్రాసే వ్రాత.

చూ. గొలుసుమోడి, గొలుసువ్రాత.

**గొలుసు కొను**

ఒకదానితో నొకటి అంటి
యుండు.

కావ్యా. 6.21.

**గొలుసు దప్పిన కోతి**

పట్టుకొనుట కసాధ్య మయిన
వాడు; కట్టు తప్పిన కోతివంటి
వా డనుట.

"దక్కిపోయిన వెంటఁ దగుల నా
వశమె?......గొలుసు దప్పిన యట్టి
క్రోఁతిచందమున."

గౌర. హరి. ద్వి. 1506.

**గొలుసుమోడి**

గొలుసుకట్టువ్రాత

చూ. గొలుసుకట్టు; గొలుసువ్రాత.

**గొలుసువ్రాత**

ఒక అక్షరంలో ఇంకొక
అక్షరం కలిసిపోవునట్లుగా
వ్రాయువ్రాత.

పాతకాలం పత్రా లన్నీ
గొలుసువ్రాతతో ఉంటాయి
ఆ లవాటున్న వాడు కానీ
చదవలేరు.

చూ. జలుగురాత.

**గొల్లభామ**

ఆకులలో ఉండి ఎగిరిపడే
పురుగు. ఆకులో మిడత.

**గొల్లని సాహిత్యవిద్య**

అసంభవం.

గొల్లలకు చదువు రాదు
అను పాతకాలపు ప్రథపై
వచ్చినమాట.

సాతాని సామవేదం వంటి
పలుకుబడి.

"అల్లని మంచితనంబును, గొల్లని
సాహిత్యవిద్య... లేవు." సుమతి.

**గొల్లసివాలు**

గొల్లపాటలు.

"గొల్లసివాలు పాడుకొనుచు."

కువల. 2.115.

**గొల్లసుద్దులు**

ఒక రకమైన పాటలు.

గొల్లవాళ్లు వారి వారి కుల
పెద్దలను గురించి కీర్తించే
పాటలు.

"గ్రుక్కలు మింగుచున్ వెడగు
గొల్లలసుద్దుల నెంత పాడినన్."

గుంటూ. ఉత్త. 12.

**గొల్లున కూయు**

ధ్వన్యనుకరణము.

**గొల్లున నవ్వు**
గట్టిగా నవ్వు.
ధ్వన్యనుకరణము.

**గొల్లు మను**
దుఃఖించు; ఏడ్చు.
ధ్వన్యనుకరణము.
మాటా. 127.

**గొల్లెనబండి**
గూటిబండి.
వావిళ్ల. ని.

**గోవరువోవు**
కమిలి పోవు
"కొన్ని దేశంబు లెండచే గోవరు వోయె." కాశీ. 1.177.

**గోహారు చేయు**
తపింప జేయు.
"మంట మాని శంబరారిఁ గూడినన్, గోహారు సేయ నేల సారెకుం జలంబు నన్." పాండు. 2.180.

**గోండ్రలు పెట్టు**
గర్జించు.
చాటు. 2. భా.

**గోండ్రు పెట్టు**
గర్జించు, అంకె వేయు.
బ్రౌన్.

**గోకుడుపాఱ**
దోకుడుపార.

**గోచారము**
గ్రహసంచార ఫలితము.
తత్ఫలితంగా జీవితంలో ఫలితం చెప్పుట జ్యోతిశ్శాస్త్ర ప్రక్రియ. ఫలితానికే పేరయినది.
"గోచారం బాగు లేదు - జాతకం ప్రకారం బాగుందే అనుకో." వా.

**గోచికట్టు**
బ్రహ్మచారి.
పాండు. 5.238.

**గోచికా డగు**
ఉన్న దంతా పోగొట్టుకొను.
"గోఁచికాఁడై దానిఁ గొనుచు నేతెంచి."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1050.

**గోచికాడు**
బ్రహ్మచారి.

**గోచి గట్టిన నాటగోలె**
చిన్నప్పటినుండి.
"గోఁచి గట్టిననాఁటఁ గోలెఁ బీనుఁగుల, మోచి గడించినమూలధనంబు."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 886.87.

**గోచిగాని చేయు**
గోచి మిగులునట్లు చేయు.
"పాయక పై నున్న బట్టఁ బోఁజేసి, గారించి యిల గోచిగానిఁ గావించి."
నలచ. ద్వి. 2.693 పం.
చూ. గోచి చేతి కిచ్చు.

**గోచి చేతి కిచ్చు**
నిరుపేదనుగా చేయు.
చిప్ప చేతి కిచ్చు వంటిది.
"నీ చేతి రాజ్యంబు నీదు పట్టంబు, గోఁచి చేతికి నిచ్చి కోరి కైకొనియె."
వర. రా. అయో. పు. 378. పంక్తి. 14,

"ఏచి వల్లము దోఁచి గోచి చేతికి నిచ్చి, చిటులతసన్యాసిఁ జేసినపిసాళి."
(తె. జా.)

## గోచిపాతరాయడు

సన్యాసి, దరిద్రుడు.

చింతా. 2.13.

"వాని కేముంది? వట్టి గోచిపాత రాయడు." వా.

## గోచిపాతరాయడు దొంగల మిండ డనుమాట

లేనివాడు దొంగలకు భయ పడవలసిన పని లేదను మాట.

"రమణి గోచిపాఁతరాయఁడు దొంగల, మిండఁ డనెడుమాట మేలు దెలిసి."
కచే. 3.47.

## గోచి పెట్టక ముందునుంచే

చాలా చిన్నతనంనుంచే అనుట.

"వాడు సరిగా గోచి పెట్టక ముందు నుంచే నాకు తెలుసు."

## గోచి పెట్టిన నాటినుంచీ

చిన్నతనంనుంచీ, బాల్యం నుంచీ.

"వాణ్ణి గోచి పెట్టిన నాటినుంచీ నాకు తెలుసు. నాకేం అతడు కొత్త గనక నా?" వా.

రూ. గోచి పెట్టడం రాక ముందు నుంచే.

## గోజాడు

పీడించి అడుగు.

బ్రౌన్.

## గోజులాడు

చూ. గోజాడు.

## గోటితో పోవు పనికి గొడ్డలి యెందుకు ?

సులువుగా నెరవేరుపనికి విశ్వ ప్రయత్న మెందుకు? ముందే జాగ్రత్త పడితే సులువుగా అయ్యేపనికి ఆలస్యం చేస్తే మహాప్రయత్నం కావలసి వస్తుంది – అని కూడ.

ఏ చిన్న మొక్కగానో ఉండగా గోటితో తుంచి వేస్తే పోతుంది. అప్పుడు ఆపని చేయక మానుగా పెరగనిస్తే, గొడ్డలితో గానీ నరక డానికి వీ లుండదు. ఈ సత్యాన్ని తెలిపే పలుకుబడి.

"గొనకొన గోట నాపనికి గొడ్డలి యేటి కటంచుఁ బల్కి." తారా. 4.160.

## గోడకాలు

కరగోడ.

"కమ్మ తేనియ నీళ్ళు గట్టి పుప్పొడి మట్టి, గోడ కాల్దీర్చినప్రోడతనము."
రా. వి. 3.81.

## గోడకు చెవు లుంటాయి

ఎవరైనా వినగలరు జాగ్రత్త అనుపట్ల ఉపయోగించే మాట.

"కాస్త మెల్లిగా మాట్లాడు. గోడకు చెవు లుంటాయి." వా.

**గోడకుర్చీ వేయించు**

బడిలో పిల్లవానిని గోడ కానుకొని కుర్చీలో కూర్చున్నట్లుగా అడుగున ఏ ఆధారం లేకుండగా కూర్చుండబెట్టి ఉపాధ్యాయుడు శిక్షించు.

పూర్వం వీధిబళ్లలో యిది అనుదినం కనిపించేది.

**గోడ గడుగ పోతే కొనదాకా రొంపే**

అసులుతోనే కట్టినగోడను ఎంత కడిగినా అసులే అవుతుంది.

గొంగడిలో వెంట్రుకలు ఏరినట్టు వంటి మాట.

తాళ్ల. సం. 9.279.

**గోడగించు**

1. పాట పాడు.

"మగతుమ్మెద ప్రోడలు గోడగించు ఝుం, కారము కారమయ్యె."

కవిక. 3.87.

2. మించు, పోటీపడు.

"ముందు వేసవినాఁటి మార్తాండ బింబంబు, గోడగించు పసిండి గుబ్బ తోడ."

కాశి. 4.294.

**గోడచేర్పు**

ఎప్పుడూ గోడకు చేర్లబడి ఉండేవాడు – సోమరి అనుట.

"మొండరి చల్లచప్పుడు గోడచేర్పు, చండిపో తనుదట్టి జాడ నున్నాఁడు."

గౌ. హరి. ద్వితీ. పం క్తి. 1497-98.

**గోడచేర్పు ప్రతిమ**

పనికి రానివాడు.

ఉత్సవవిగ్రహం వంటివాడనుట.

తాళ్ల. సం. 3.640.

**గోడ దుమికే వయసు**

యౌవనము.

గోడ దుముకుట వ్యభిచార సూచకము. దానిపై వచ్చిన పలుకుబడి.

"వాడిప్పుడు గోడ దుమికే వయస్సులో ఉన్నాడు. అలా చేయక ఎలా చేస్తాడు?"

వా.

చూ. గోడలు దుముకు.

**గోడనబోవు**

మొఱబెట్టుకొన బోవు.

"కుబేరుఁ డేఁగెన, దనుజాల నింత చేసిన విధాతకు గోడనఁ బోవుచాడ్పునన్."

ఉ. హరి. 1.42.

**గోడ నిక్కి చూచు**

కుతూహలంతో దారిని పోవువారిని దొంగచూపులు చూచు.

"గోడ నిక్కి చూచుఁ గొప్పు దీర్చు... బంధకీవధూటి." జైమి. 3.29.

**గోడపురువు**

నల్లి.

**గోడపెట్టు, చెంపపెట్టు**

రెండువైపులా దెబ్బ తగులు.

"తలఁప నెదురుఁ దమ్ము డెలియని
వానికిఁ, జేరి గోడపెట్టు పెంపపెట్టు."
హరిశ్చం. (వీర) 3.76. పే.

## గోడపై సున్నము

అశాశ్వతము.

తాళ్ల. సం. 3.546.

## గోడబారు

అందు బాటులోనిది.

గోడకు చేరగిలబడుటకై పొడవుగా గుండ్రముగా కట్టి యుంచిన దిండు.

"ముష్కరత్వము వాని ముంగొంగు బంగారు, కూహకత్వము వాని గోడ బారు." రామలిం. 12.

## గోడమీద పిల్లి

ఎటు గాలి వీచితే అటు తిరిగే రకం.

"వాడు గోడమీది పిల్లి. ఏ వైపు ఎప్పుడు మొగ్గుతాడో నమ్మడానికి వీలు లేదు." వా.

## గోడమీది సున్నము

ఉపయోగించుకొన వీలు లేనిది.

తాళ్ల. సం. 7.34.
చూ. గోడపై సున్నము.

## గోడలు దుముకు

వ్యభిచరించు, కట్టు తప్పి ప్రవర్తించు.

"మావాడి పెండ్లి ఏం తొందర వచ్చిం దయ్యా! అప్పుడే. గోడలు దుముకు తున్నాడా? తడకలు తోస్తున్నాడా?
వా.

## గోడలు పైడి సేయు

ఎంతైనా సంపాదించ గలుగు. గోడలు కూడా బంగారువి కట్టించగలం అనుట.

ఇప్పటికీ వాడుకలో 'నేనూ ఆవిధంగానే సంపాదించి ఉంటే యీపాటికి బంగారు గోడలు కట్టించి ఉండనా?' – అని అనడం కలదు.

"ఊర నీవు నే, నును గడియింపఁ జొచ్చినఁ దనూభవ! గోడలు పైఁడి సేయమే?" శుక. 3.76.

"నీవూ నేనూ సంపాదిస్తే బంగారు గోడలు కట్టించ లేమా?" వా.

## గోడా గొట్టా లేకుండా మాట్లాడు

యథేచ్ఛగా మాట్లాడు.

## గోడాడు

బాధ పడు, విలపించు.

"తలపోఁత బ్రాఁతె తలఁపులకుఁ దమకొలఁ దెఱుంగని మతి గోడాడఁగా." తాళ్ల. 5.41.

"ఆడపిల్ల నిట్లా గోడాడించడం మంచిది కాదు." వా.

## గోడిపట్టెలు

ఒక పిల్లల ఆట.

"గుళ్లు దాగిలిముచ్చులు గోడి పట్టెలు..." వి. పు. 7.202.

## గోడివడు

ఒరగడ్డంగా వాలు.

"గోగణము ముంగలిగ నేల గోడి వడఁగ, నడచు కౌరవరాజసైన్యంబుఁ గనియె." భార. విరా. 4.250.

**గోడి వెట్టు**

ఏటవాలుగా పెట్టు.

శ. ర.

**గోడు కుడుచు**

గోడు పెట్టుకొను.

"జలుకు పుట్టించి నీ సకలరాజ్యంబు, గోడు గుడువఁ బుచ్చుకొని."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 1774-75.

"క్రేపునిదల్లు, లాస్థఁ దన్నంగ నమ్మహా వస చేత, గోడి గ్రొ పుట్టియును గోడు కుడువ వలసె." హంస. 4.32.

చూ. గోడు పెట్టుకొను.

రూ. గోడు గుడుచు.

**గోడు కుడుపు**

కష్టపెట్టు.

కాశీ. 7.95.

**గోడు గోడున నేడ్చు**

ఎక్కువగా ఏడ్చు.

ధ్వన్యనుకరణము.

"ఆ మాయలాఁడి యపు డా, కోమలి మొగము గని గోడుగోడున నేడ్వం,గా మఱియు వెరపు దోఁపఁగ..."

శుక. 2.42.

రూ. గోలు గోలున నేడ్చు.

**గోడు పెట్టుకొను**

వేధించు, బాధించు.

"వాడు నా గోడు పెట్టుకొంటు న్నాడు." వా.

చూ. గోడు పోసుకొను.

**గోడు పోసుకొను**

బాధించు, వేధించు.

"వా డెప్పుడూ ఊళ్లోవాళ్ల గోడు పోసుకొంటూ ఉంటాడు." వా.

చూ. గోడు పెట్టుకొను.

**గోడు సేయు**

ఓడగొట్టు.

"కోటిచంద్రుల డాలు గోడు సేయఁగఁ జాలు, మొగము కుంకుమచుక్క సొగసు గుల్క." వీధి. 9.

**గోద్రెప్ప కన్ను**

రెప్పలు వాచిన కన్ను.

పండితా. ద్వితీ. మహి. పు. 108.

**గోతులు తీయు**

1. ద్రోహము తలచు.

"వాని కెప్పుడూ ఒకరిక్రింద గోతులు తీయడం అలవాటు." వా.

2. శాస్తి చేయుటకు సిద్ధముగా ఉండు.

"తీసియె యుంచినార లటఁ దీరని గోతులు." గీర. లోకా. 17.

"మీకోసం గోతులు తీసే ఉంచారు. వెళ్లండి." వా.

**గోదావరి గలుపు**

పరిత్యజించు, పాడు చేయు.

'గంగలో గలుపు' వంటిది.

"కులము గోదావరిఁ గలిపి వేశ్యాసంగ, మాసచేఁ గావించితే సుపుత్ర."

నిరంకు. 2.83.

చూ. గంగ కలుపు.

**గోనె బట్టిన బంక**

వదలనిది.

తాళ్ల. సం. 11.3. భా. 125.

**గోపాల మెత్తు**

భిక్షు మెత్తు.

'అమ్మా గోపాలం' 'తాయీ కవళం' అంటూ బిచ్చ మెత్తు

టపై వచ్చినది. మాడాకవళ్ళ మన్నల్లే సందగోపాల మనుటా అలవాటు.

"గోపాల మనుచు, వీధి నెవ్వారు నుడి విన వెక్కిరించు."

విప్ర. 3.15.

## గోపిచందనం

ఒకజాతి మృద్దమన్ను. పచ్చగా ఉంటుంది. వైష్ణవులు బొట్టుగా ఉపయోగిస్తారు.

## గోప్రవేశము

సాయంవేళ, గోధూళివేళ.

## గోముఖవ్యాఘ్రము

పైకి మంచిగా ఉంటూ లోపల చెడుగుణము కల వాడు.

"తనకు నేల యమృత ధామాఖ్య గోముఖ, వ్యాఘ్ర మనఁగ నిట్టివాఁడె సుమ్ము."

కళా. 6.268.

## గోరం గడతేరుపనికి గొడ్డలి యేల?

చిన్నదానికి పెద్ద ప్రయత్న మెందుకు?

"నేరుపు లేటికిఁ జూపను, గోరం గడ తేరుపనికి గొడ్డలి యేలా?"

రుక్మాం. 2.127.

చూ. గోటితో పోవుపనికి గొడ్డలి...

## గోరంత

కాసంత.

"వాడికి గోరంతైనా కనికరం లేదు."

వా.

## గోరంత ప్రొద్దు

1. కాసేపు.

"వారును దాను నవారితశక్తి, గోరంత ప్రొద్దు మేకొని కట్టు బిగిచి."

బసవ. 3.65.

2. కొద్దిగా ప్రొద్దున్న దనుట.

"గోరంత పొద్దైనా లేదు. మనం పోవల సినదూరం చాలా ఉంది."

వా.

## గోరంతలాట

ఒక బాలక్రీడ.

పండితా. ప్రథ. పురా. పుట. 460.

## గోరం జీరు

గోటితో గీరి సైగ చేయు.

"కంటికిం బ్రియం బైనవానిం గామిం చియు గోరం జీరియుఁ గొంత యాస తీర్చుకొని."

శుక. 2.10.

## గోరంతలు కొండంతలు చేయు

చిన్నదానిని పెద్దగా చేయు.

"ఎంతకుఁ దెచ్చెనే సరసిజేక్షణ చెయము లిందుమీఁద జ్యోన్మాంతరవర్ణనంబు హృదయంబున కిత్తతి నెచ్చరించి గోరంతలు కొండ లంత లగునట్లుగఁ జేసితి మంచుఁ జేటికావాంత సతాళ వృంత మృదువాతహిమాంబుకణాళిఁ జేర్చినన్."

ఆము. 5.77.

"వాని కెప్పుడూ గోరంతలు కొండం తలు చేసి చెప్పడం అలవాటు. వా డేదో మాటవరసకు పలకరిస్తే తనేదో మిత్రు డంటున్నా డేమిటి?"

వా.

## గోర దివియగా నే ప్రైపాలు

కొంచెము కల్పించుకొను

టతో విపరీతముగా పరిణ
మించు.
గోటితో గిల్లినంత మాత్రాన
ఏ త్రై పాయినంతటి ప్రవా
హము వచ్చిన దనుట వాచ్యా
ర్థము.
"ఇల నిట్టలి గోరఁ దివియ నే త్రై
పాయున్." కళా. 5.63.

## గోరపడు

ఆశపడు.
"గోరపడి గడించేవి కోట్లకొలఁదులు,
తారి తూరి నోటికిఁ దగంత గాగు."
తాళ్ల. సం. 9.249.

## గోర బోవుటకు గొడ్డలి

తాళ్ల. సం. 9.285.
చూ. గోటితో పోవుపనికి గొడ్డలి
యెందుకు?

## గోర బోవుపనికి గొడ్డలి యేల?

స్వల్పశ్రమతో సరిపడు
దానికై పెద్ద ప్రయత్నము
చేయు టెందుకు?
కళా. 7.267.
చూ. గోటితో పోవుపనికి గొడ్డలి
యెందుకు?

## గోరవోవు

మొక్కపోవు.
"నోరి మాటకుఁ దన కేమి గోర
వోయె." భాగ. స్క. 4.42.
వాడుకలో మొక్కపోవు
అనుటే నేటి అలవాటు.
"ఏ మయిందేం? అదామాటంటే నీ కేం
మొక్కపోయిందా?" వా.

## గోరింపు బంతులు

ఒక పిల్లల ఆట.

## గోరింపు లాడు

గోరాడు – క్రొట్టి కోరాడు.
"గోలి వేలుపుల మూక దురములో
గోరింపు, లాడి తాండవ మాడునట్లు
గాదు." నిరం. 3.9.

## గోరిడు

గిల్లు.
"నుడిచి యందిచ్చునపుడు గో రిడుదుఁ
గేల." నైష. 8.84.

## గోరీ కట్టించు

రూపు మాపు.
"గోరీ కట్టింపను కాక విప్రతతి కర్థ
నేదు హేలాపురిఁ." నానా. 148.

## గోరు గల్లు

గోళ్ళు తీసే మంగలిసాధనం.
"పదను గోరుగండ్లఁ బదరక కొందఱు,
కండ్లు వెతికి." సానందో. 3.108.
రూ. గోరుగోలు.

## గోరు గాలము

గోరులాంటి కొన గల
గాలము.

## గోరుగొండి

మొన వాడిగా పలుచగా
తట్టి చేసిన ఇనుప కడ్డీ.
నేడీ మాట గోళ్లు తీయుట
కుపయోగించే మంగలి కొటి
ముట్టునకే ఉపయుక్త మవు
తున్నది.

"గోరుగొండ్లును యామికలు కొని తేర."

పండితా. ద్వితీ. మహి. పుట. 22.

చూ. గోరుగోలు.

## గోరుచిక్కుడు

ఒకొక ప్రాంతంలో ఒకొక పేర పిలువబడు చిక్కుడులో ఒక జాతి.

మొటిక్కాయ, గోరు చిక్కుడు, సౌళేకాయ అని దీనికే పేళ్ళు.

## గోరు చీరణము

ఒక రకమైన ఉలి.

శ. ర.

## గోరుచుట్టు

గోటి క్రింద వ్రేలికొనన లేచే కురుపు.

## గోరుచుట్టుపై రోకటిపోటువలె

ముందే బాధ భరింప లేక ఉండగా దానిపై మరింత బాధ యేర్పడుపట్ల ఉపయోగించే సామ్యం. వలెకు బదులు ఉపమా వాచకా లన్నీ ప్రయుక్త మవుతాయి.

"కాఁక నెదిర్చి సంగరముఖంబున నొచ్చిన రాజవంశమున్, గూఁకటి వ్రేళ్లతోఁ జెఱికి గోత్రవధంబును జేసినట్టి యా, వ్రేఁకపుఁ గీడు గాక ప్రజ వేచఁ దలంచిన గోరుచుట్టుపై, రోఁకటి పోటుచందముగ రోసి జనుల్ ననుఁ జూచి తిట్టరే?"

జైమి. 1.64.

చూ. గోరుచుట్టుమీద...

## గోరుచుట్టుమీద రోకటిపోటు

రాధా. 2.175.

చూ. గోరుచుట్టుపై...

## గోరుపడము

నల్ల కంబళి.

## గోరుపు లాడు

బంతి యాడు.

"గురుకుచ గుబ్బచన్నుఁగవ గోరుపు లాడును బుట్టచెండ్ల..."

చంద్రా. 2.122.

## గోరుముద్దలు

చిన్నపిల్లలను మరిపించి తినిపించు ముద్దలు, తల్లి పిల్లనికి పెట్టే ముద్దలు.

## గోరుముష్టి

గోజాడి అడుగుకొని తినుట.

గోరు మునిగేదాకా పెట్ట మని పిల్లలు తోడిపిల్లలవద్ద ఉన్న తినుబండారాలను కొసరి కొసరి తీసికొనుటపై వచ్చినది.

చూ. గోర్ముష్టి.

## గోరు మోపేంత స్థలం కూడా

చాలా కొద్ది స్థల మైనా (లేదు).

"వాళ్లింట్లో గోరు మోపేంత స్థలం కూడా లేదు. బంధుబలగం అంతా వచ్చి వాలింది."

వా.

## గోరు రాజనాలు

ఒక రకమైన ధాన్యం.

## గోరువెచ్చ

నులివెచ్చ.

గోటికి వెచ్చగా కనిపించేంత అనుట.

కవోష్ణం.

"గోరువెచ్చ నీళ్లలో స్నానం చేయడం మంచిది." వా.

## గోరొత్తులు

నఖక్షతములు.

"నెమ్మోవి పీడఁ జింతిలు పరాకునఁ బోలె, గోరొత్తులకుఁ జనుగుబ్బ లొసఁగి." కళా. 7.166.

## గోర్గాండి

గోరుగల్లు.

"వాడి గోర్గాండిఁ గన్నులు దోడి యైన." భీమ. 6.100.

చూ. గోరుగాండి.

## గోర్విశ్శార్చు

చెండువలె ఎగుర జేయు.

రామా. 6.206.

## గోర్ముష్టి

గోరుముష్టి.

"ధీ, యుతు లౌవారికి సైతమున్ గట కటా! యూరూర గోర్ముష్టి యే, గతి." నానా. 75.

చూ. గోరుముష్టి.

## గోలతనము

అమాయకత్వము.

"పెన్, గోలతనంబునన్ మగఁడు కొట్టిన." పాండు. 4.144.

## గోవతనము

దుర్మార్గము.

"మీపీటిప్రముచ్చు లేవురు, మాపీటం గన్నపెట్టి మణిభూషణముల్, గోవతనంబునఁ దెచ్చిరి, నీ వీటు సేయించు టెల్ల నేరము గాదే." దశ. 4.24.

## గోప మొలత్రాడు

మొలత్రాడు.

మగవారి మొలత్రాడని శ. ర. ఆడవాళ్ళకు మొలత్రాడు వేసుకునే ఆచారం అరుదు గాబట్టి!

## గోవాళ్ళు (శరలు)

గోపకులు. విటులు.

"తిమిరంపు వయసు గుబ్బల, కోమ గాలపు నీకుఁ దగినగోవాళ్ళ మహిన్, సమకొ గనగాద ముజెసిన, మముఁ జెనకిన నేమి గలదు మదనోమిటికిన్?" మను. 4.83.

## గోవాపుల కోడెలు

పోట్లమారి కోడెకాడలు.

గోవాపు లనగా దుష్ట మగు గోవు లని వావిళ్ల. ని.

"కలపోఁతల్ దలలెత్తెఁ దాల్మి సడలెం దాపంబు దీపించెఁ జేఁ,తలు డిందెన్ ధృతి వీడుకోలు గొనియెన్ దైవాఱెఁ గన్నీరు కోర్కులు గోవాపుల కోడెలై నిగిడె సిగ్గుల్ దూర మై పోయె." విక్ర. 4.154.

## గోవింద కొట్టు

నిరసనగా చనిపోయె ననుపట్ల ఉపయోగించే మాట.

"తన మామ తన కేదో యిస్తా డని వీడు ఆదరా బాదరా పరిగెత్తాడు. ఈ లోగా వాడు గోవింద కొట్టాడు. సరి పోయింది." వా.

"వాడు గోవిందకొట్టాడట. నీకు తెలుసా?" వా.

## గోవిందా అనిపించు

ఇక చాలు రా అనిపించు.

"గో,విందా యనిపించుకవులు వేవేలు సుమీ." గీర. గురు. 20.

## గోవువెంట తగులు కోడెభంగి

ఎప్పుడూ విడువక – వెన్నంటి అనుట.

శాస్త్ర విద్యావంతులు సంభాషించుకొనునప్పుడు ఉపయోగించే పలుకుబడి.

ఇది భాగవతంలోని ఒకానొక పద్య భాగం.

"వా డెప్పుడూ ఆ అమ్మాయి చెరుగు వదిలేట్టు లేదు. గోవువెంట దగులుకో డెభంగి అన్నట్లుగా ఉంది వీడి వ్యవహారం." వా.

## గోసడచు

నిందించు.

"మనలన్ ధూర్జటితోడ గోసడఁచి శామధ్వంసి పట్టీక పొం,డని చక్రాంకునిఁ జూపి..." నిర్వ. 2.93.

## గోసన వుచ్చు

చాటించు, ఘోషణ చేయించు, ఘోషించు.

"గోసనంబులు వుచ్చి సర్వస్వదానులగుచుండిరి." కుమా. 11.59.

"దాసియున్, గొఱగొఱ వీట నెల్లెడల గోసన పుచ్చిన." దశ. 10.126.

"తనదుర్వారతరప్రతాపమునఁ జిత్తస్నేహముల్ గట్టి సే,యు నితం డెట్టి విదగ్ధుఁడో దలఁప నోహో యంచు లోకంబు గో,సనపుచ్చన్." దశ. 1.7.

రూ. గోసన పుచ్చు.

## గోస నాస ఉదయించు

ఘోషణ బయలుదేరు.

ఊరంతా గుప్పు మను.

"శాఖోపశాఖల సాఁగుచున్నది రట్టు, గుఱి లేక యుదయించె గోస నాస." శివ. 3.71.

## గోళ్ల కుతికంటు

ఒకనగ.

"...గోళ్ల కుతికంటు నునిచె నొకతె." రాధి. 1.93.

## గోళ్లు గిల్లుకొను

ఏ పనీ పాటా లేక ఉండు.

"వాడు పొద్దస్తమానం గోళ్లు గిల్లుకుంటూ కూర్చుంటే ఆవిడ మాత్రం ఏం చేస్తుంది?" వా.

## గోళ్లు మీటు

గోళ్లు గిల్లుకొను.

నిర్వ్యాపారిగా ఉండు.

"పనుల కొడల్వ్యంగకశా,మిను లిద్దఱుఁ గూడి గోళ్లు మీటుచు దాదుల్..." శుక. 2.333.

"వాడు పని లేక గోళ్లు గిల్లుకొంటూ కూర్చున్నాడు." వా.

## గోళ్లు రాచు

కలబడు, రాపాడు.

"ఆ యెల ప్రాయమున్ భవదుదంచితకీర్తియు గోళ్లు రాచఁగాఁ, గాయజుఁ డాకపై నలిగి కత్తులు నూఱుచు..." కళా. 7.35.

**గౌడుగీతములు**

ఒక విధమైన జానపదగీతములు.

నాడివి పాణిలో ఒకవిధమైన నిర్దిష్టవిభేదం కావచ్చును.

"గౌడుగీతములు వాడుచు."

శమా. 6.45.

**గౌతముని గోవు**

తగిలితే చాలు పడి చచ్చి పాపము చుట్టుకొనునట్లు చేయునది. ఒక కథపై వచ్చిన పలుకుబడి.

"ఒండొకఁడ వైన నిపుడు నీపిండి యిడమె, బ్రాహ్మణుఁడ నోట మా చేత బ్రదుకఁగంటి, తడవఁ బని లేదు నిన్ను గౌతముని గోవ, వనుచు వాదించి విడిచిన నాగ్రహించి." మను. 4.90.

**గౌదకట్టు**

అట్లు కట్టిన కట్టు.

ఆము. 6.81.

**గౌరి కుంకుమలు**

ఒక రకమైన ధాన్యం.

హంస. 4.128.

**గౌరుకాకి**

బొంతకాకి.

బ్రౌన్.

**గౌళి పలుకు**

బల్లి శకునం.

ఫలానా వారం ఫలానా దిక్కున పలికితే ఫలానా ఫలమని చెప్పే ఒక శకున శాస్త్రం.

**గ్రక్కఁదలు**

కదలి పోవు.

**గ్రక్కిలువడు**

సడలి పోవు.

**గ్రక్కుమి క్కనక**

కిమ్మనకుండా - ధ్వన్యనుకరణమై ఉంటుంది. ఇలాంటి విందాం - కయ్ కుయ్ అనకుండా - కిమ్మనకుండా - ఆ ఊ అనకుండా - కిక్కురుమనకుండా...

"కదలక మెదలక గ్రక్కుమిక్కనక."

పండితా. ప్రథ. పురా. పుట. 308.

**గ్రక్కు మిక్కన లేక**

ఏమీ అన లేక, కిక్కురుమనకుండా.

ధ్వన్యనుకరణము.

"అక్కుళ్ళు వడి గ్రక్కు మిక్కన లేక, యున్నవారలఁ జూచి."

బస. 6.179.

**గ్రగ్గులకా డగు**

భిన్నాభిన్నత నొందినవాడగు.

"తలలు వీడంగ విద్యాధరుల్ పఱచిరి, గ్రగ్గులకాం డైరి ఖచరవరులు."

పారి. 5.37.

**గ్రచ్చ కదలినట్లు**

గ్రచ్చపొద కదిలించినట్లు. గలగల మని.

గ్రచ్చపొద కదిలించినప్పుడు గలగల మని గచ్చకాయలు రాలును. అందుపై వచ్చిన పలుకుబడి.

"పుణ్యవాహిని నిటు వా, గ్రచ్చితి వని వడి నందఱు, గ్రచ్చ కదలినట్లు గువ్వ కరిగొని తిట్టన్." జైమి. 4.72.

## గ్రచ్చపొద కదలించినట్లు

గలగల మని.

"కుచ్చితురా లైన యచ్చపలలోచనం జూచి పౌరు లందఱు గచ్చుకొని గ్రచ్చ పొద గదలించినకైవడి విచ్చలవిడి నోరికి వచ్చినట్లు వెచ్చానికి వచ్చువారును." సారం. 3.217.

చూ. గ్రచ్చ కదలినట్లు.

## గ్రద్దగోరు

దొంగల పనిముట్లలో ఒకటి.

## గ్రహచారము

దురదృష్టము.

గ్రహబలము సరిగా లేదనుట.

గ్రహసంచారం బట్టి జీవితంలోని ఎగుడు దిగుడు లుంటాయన్న జ్యోతిశ్శాస్త్రంపై ఏర్పడినది. కాని చెడుగా ఉన్న దన్న అర్థంలోనే గ్రహచారం ఉపయుక్తం కావడం విశేషం.

"వాడి గ్రహచారం అలా ఉంది. అందుకే పాడయి పోయాడు." వా.

## గ్రహచారము చాలని

గ్రహబలము చక్కగా లేని. దురదృష్టపుదినా లనుట.

జ్యోతిశ్శాస్త్ర రీత్యా వచ్చిన పలుకుబడి.

వీరనారాయణ శత. 20.

"గ్రహచారం చాలనప్పుడు ఏం చేసినా వ్యతిరిక్తమే అవుతుంది." వా.

## గ్రామాశ్వము

గాడిద.

## గ్రామ్యకర్మము

మైథునము.

## గ్రామ్యధర్మము

మైథునము.

"...ప్రాయంపు టింతులకును గ్రామ్యధర్మంబు లేకున్నఁ గలుగు దుఃఖమెం తని వచింప వచ్చునో." హంస. 3.206.

చూ. గ్రామ్యసుఖము.

## గ్రామ్యసుఖము

మైథునము.

చూ. గ్రామ్యధర్మము.

## గ్రాసవాసములు

తిండీ, బట్టా.

"వచ్చు నాదాయములు గ్రాసవాసము లకుఁ, గాఁగ దినములు గడపె..." హంస. 2.152.

## గ్రాసవాసోదైన్యం

తిండికీ బట్టకూ లేక పోవుట.

## గ్రుక్కగొను

త్రాగి వేయు.

"అక్కజంబుగ నబ్ధి నాపోశనముగ,
గ్రుక్క గొన్నట్టి యా కుంభజుండు
డుండ." హరివ. పూర్వ. 302. పం.

గ్రుక్కలు పెట్టు

త్రాగు.

"కిక్కురు మన కమ్మతింబును,
గ్రుక్కలు పెట్టుదురు సురలు."
హర. 6.122.

గ్రుక్కలు మ్రింగు

గ్రుక్కిళ్లు మ్రింగు.

"గ్రుక్కలు మ్రింగుచు వెడగు
గొల్లల సుగుల నెంత పాడినన్."
గుంటూ. ఉత్త. 12.

గ్రుక్కిళ్లవియు

ఊపిరి యాడక పోవు.

"గ్రుక్కిళ్లవియంగఁ జొచ్చె రవికిన్."
కవిక. 2.150.

గ్రుక్కిళ్లు మ్రింగు

1. గుటకలు మ్రింగు.

"గ్రుక్కిళ్ మ్రింగఁగఁ గ్రొత్త నెత్తురుల
వాగు ల్పాఱఁ గ్రవ్యాదులున్."
శా. మా. 2.52.

"గ్రుక్కిళ్లు మ్రింగుచు."
రాధా. 4.105.

2. ఆశతో—గుటకలు వేయు.

"నాకబలి సంవిధానంబు లాచరించు
వారలఁ గనుంగొని గ్రుక్కిళ్లు
మ్రింగియు..." శుక. 2.160.

"కోకిలవ్రాతంబు గ్రుక్కిళ్లు మ్రిం
గించు." హర. 3.38.

గ్రుక్కుమిక్కనక

ఒక్క మాట పలుకక.

"నిర్జీవులుం బోలె గ్రుక్కు మిక్కనక
మక్కరిలు పడఁ ద్రోచుకొనియును."
పారి. 5.13.

గ్రుక్కుమిక్కు రనక

ఒక్క మాట అనకుండ.

"గుండియలు గ్రుళ్లఁ దన్నిన గ్రుక్కు
మిక్కు, రనక యాతని కినుక చల్లా
నిచ్చి." శుక. 3.627.

గ్రుచ్చి కౌగిలించుకొను

గట్టిగా కౌగిలించుకొను.

"నీకంట మోహంపుదేవు లెవ్వ రంచు
సలిపి గ్రుచ్చి కౌఁగిలించుకొని యొత్తి
యుక్కన...." కళా. 7.235.

గ్రుచ్చి గ్రుచ్చి యడుగు

చెప్పు చెప్పు మని బలవం
తము చేసి అడుగు

"..ఇంతన ము న్నిది యెన్నండును
విన్న యది గా దిప్పు డెప్పగిది నొదవెఁ
జెప్పు మని గ్రుచ్చి గ్రుచ్చి యడుగ..."
కళా. 1.202.

గ్రుచ్చెత్తు

అద్ది యెత్తు, ముంచు.

"గొజ్జంగినీరున గ్రుచ్చెత్తి కపురాన,
రంగు మీఱ లోన రంగు వైచి."
చమ. 1.88.

గ్రుడ్డింగిలాయి

ఒక రకమైన చేప.

శ. ర.

గ్రుడ్డికన్ను పాదుషా

కుబేరుడు.

గ్రుడ్డికామంచి

గొడుగుగడ్డి.

శ. ర.

**గ్రుడ్డికాసు**
మారని కాసు.
చిల్లిగవ్వ వంటిమాట.
మల్లభూ. వైరా. 3.

**గ్రుడ్డి కొక్కిరాయి**
గుడ్డికొంగ.

**గ్రుడ్డిగవ్వ**
గుడ్డికాసు.

**గ్రుడ్డిదీపము**
వెలుగు లేని చిన్నదీపము.

**గ్రుడ్డిదొరతనము**
గుడ్డిదర్బారు.
చూ. గుడ్డిదర్బారు.

**గ్రుడ్డిబేరము**
తెలివితక్కువ బేరము.
బ్రౌ.

**గ్రుడ్డివడు**
చీకటిపడు.
"కొన్నిదేశంబు లిరులచే గ్రుడ్డివడియె." కాశీ. 1.137.

**గ్రుడ్డివాటుగా**
కాకతాళీయంగా.
గుడ్డివాని చేతి రాయి వలె ఏదో తగిలిన దనుపట్ల అను సామ్యం.

**గ్రుడ్డివెన్నెల**
మసకవెన్నెల.

**గ్రుడ్డులోపలి చిన్నకూన**
పసిపాప.
"అడ్డపట్టులపాప యవు నఁటే లేక, గ్రుడ్డు లోపలి చిన్ని కూనయో యమ్మ!" సారం. 2.305.

**గ్రుడ్డెఱ్ఱ**
కన్నెఱ్ఱ, కోపము.
కోపం వచ్చినప్పుడు కను గ్రుడ్డు ఎఱ్ఱవడును కావున వచ్చిన పలుకుబడి.
"అకట! గ్రుడ్డెఱ్ఱ బాదరాయణుని మీఁద." భీమ. 4.12.

**గ్రుడ్లకొలదిగ కన్నీరు గ్రుక్కొను**
కండ్లనిండా నీళ్లు పెట్టుకొను.
"కెస్స తెఱువాటు గొట్టితి లెమ్మటంచు, గ్రుడ్లకొలఁదిగఁ గన్నీరు గ్రుక్కొనుచు." శుక. 3.197.
చూ. గ్రుడ్లనిండా నీళ్లు పెట్టుకొను. కళ్లనిండా నీళ్లు పెట్టుకొను.

**గ్రుడ్లు తినుటయె గాక గూ డెక్కి కూయు**
చెడ్డపని చేసి దానిని బాహాటముగా చెప్పుకొను.
"ఏమేమీ! గ్రుడ్లు దింటయుం గాక గూ డెక్కి కూసెద వీవేశ్యయుం దాసియు నీ కన్నుల కెంత ప్రియ మైన నయిరి గాక నీకు సరతుగా నిట్లు పలుక నెట్లు నోరాడె." భోజ. 7.171.

**గ్రుడ్లు మిడికించు**
గుడ్లు మిటమిట లాడించు.
క్రీడా. పు. 78.

**గ్రుడ్లు మెఱము**
గ్రుడ్లుఱిమి చూచు

"గవిలో బెబ్బులి డాఁగి గ్రుడ్లు మెఱ మంగాఁ గాంచి రా జేసె నేఁయ వడిన్ బాణము వెంట నే."
మను. 4.46.

గ్రుడ్లు వెలి కుఱుక నొక్కు
బాగుగా నొక్కు.
"మెడ యొడిసి పట్టి గ్రుడ్లు వెలి కుఱుక నొక్కుచు..." కళా. 3.278.
"గుడ్లు బయటికి వచ్చేటట్లుగా మెడ నొక్కినాడు." వా.

గ్రుడ్లు వెల్కుఱుకు
గ్రుడ్లు బయటికి వచ్చు.
గొంతు బిగుసుకొన్నప్పుడూ, ప్రాణాపాయ స్థితిలో ఉన్న దని చెప్పటానికున్నూ వాడు కలో గుడ్లు బయటికి వచ్చి నవి అంటారు.
"గుంతలోఁ బడ గ్రుడ్లు వెల్కుఱక నాల్క, నడుము గఱచుక నఱచుచు బెడిసి మడిసె." హంస. 1.193.

గ్రుడ్డులాడు
కొట్లాడు.
పశ్చిమాంధ్రంలో అతిప్రచు రంగా వాడుకలో ఉన్నది.

గ్రొచ్చి కోరాడు
త్రవ్వు.
"ప్రాభవంబున దోర్దండబలము మెఱసి, గ్రొచ్చి కోరాడి త్రవ్వి రి కతల మెల్ల." భాగ. 9.205.

ఘంటాపథము
1. రాజమార్గము.
"కలువడంబులు గట్టి ఘంటాపథము లందుఁ, బావివుగా నునుఁబట్టుపడగ లెత్తి." రుక్మాం. 1.118.
2. రాచబాట వంటిది.
కొట్టినపిండి అనుట.
"వేదశాస్త్ర పురాణాది విద్య లెల్లఁ, దరుణి నీ నూన ఘంటాపథంబు మాకు." నైష. 2.49.

ఘంటాపథముగా
నిశ్చయముగా.
ముక్కకంఠంతో అనుట.
రాచబాటలో నడచినట్లు నిరాఘాటముగా అనుట పై మాఱుమాఱి వచ్చిన పలుకు బడి.
"నిగురమబ్బున నున్న నెన్నెఱిని నెఱను, బారడుఁబోక ఘంటాపథమ్ముగ నిగమములు." వ్యాఖ్యా. చాటు. తె. జా.

ఘటదాసుని చేయు
నౌకరుగా చేయు.
"......నే మనంబునం, దలఁచిన రుద్రు నైన ఘటదాసునిఁ జేయుదుఁ గామునింటికిన్." మార్కం. 1.21.

ఘటన
దైవఘటన.
చూ. దైవఘటన.

ఘటన చేయు
సంఘటిల్ల జేయు.
"కలిమి యంగంబు లెల్లను ఘటన చేసి." పార్వ. 6.93.

ఘటనపడు
సంఘటిల్లు.

"సకలలక్షణగ్రంథవిస్తారసార, పటిమ లన్నియు నొకటిగా ఘటనపఱచి, లక్షణగ్రంథ మొనరింతు." ఆనంద. 1.2.

**ఘటాఘటీలు**

హేమాహేమీలు

"ఓహో! భేదము లేదు నిండుసభలో నొక్కింతమాత్రంబు హేమాహేమీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాళు లీసాము లే, లా? హీనాధిక భావముల్..." వరాహ. 10.8.

**ఘట్టకుటీప్రభాతము**

దేనినుండి తప్పించుకొనవలెనని అంత అవస్థపడ్డాడో దానివాతే పడవలసి వచ్చినది అనుపట్ల అనే ఒక న్యాయము.

సుంకము చెల్లించు పాకను తప్పించుకొనవలెనని ఒక బండివాడు రాత్రంతా ప్రయాణం చేశాడు. కాని తుదకేమో తెల్లవారు నప్పటికి ఎదుట ఆ తావే కనిపించినట్లు తెలుసుకున్నాడు.

"ఘట్టకటీప్రభాత మనఁగా నిదివో పఠికించి చూడఁగన్." కళా. 6.249.

**ఘణంఘణలు**

ఘణఘణలు.

ధ్వన్యనుకరణము.

**ఘణిల్లున రంకె వైచు**

ధ్వన్యనుకరణము.

"ఘణి ఘణిల్లున వైచు ఘన మైన రంకెల." వీర. 3.105.

**ఘనం పఱచు**

ఉగ్గడించు, గొప్ప సేయు, కొండాడు.

"అని నెనరు మట్టం బూనిన కుసుమాయుధు పూనికి వజ్రాయుధుండు ఘనం పఱచి." కుమా. 4.47.

**ఘనము చేయు**

గొప్ప చేయు.

"నెఱిగొప్ప కొనగోర నివిరి చూచెద నన్నఁ, జెలి నీ వది ఘనంబు చేసి కొనెదు." సారంగ. 2.226.

**ఘనాంతస్వాధ్యాయి**

చూ. ఘనాపాఠీ.

**ఘనాపాఠీ**

ఘనాంతం వేదం చదువుకొన్నవాడు.

వేదంలో ప్రతి మంత్రానికీ పదము, జట, ఘనము అనేవి ఉంటాయి. ఘనం ఆఖరుది కనుక కూలంకషంగా చదువుకొన్నవాడు అనుట.

**ఘుమ్మను**

గుమ్మని వాసించు.

**ఘుల్లుఘల్లను**

ధ్వన్యనుకరణము. రాధి. 1.99.

**ఘుల్లురను**

ధ్వన్యనుకరణము. సారం. 3.28.

ఘుళుకు ఘుళుకు మను

శబ్దించు.

ధ్వన్యనుకరణము.

ఘుటిక మ్రింగిన సిద్ధునివలె

రససిద్ధుడు రస ఘుటికను మ్రింగినట్లు — మౌనంగా; కిమ్మనకుండా.

సారం. 3.164.

ఘుణాక్షరన్యాయముగా

బుద్ధిపూర్వకంగా కాక యాదృచ్ఛికంగా యేర్పడినది. ఒక పురుగు కర్రను తొలిచినప్పుడు అందులో అక్షరాకారసామ్యం యేర్పడినట్లు అనుట.

"ప్రతిపద్యముఁ జోద్యముగాఁ, గృతిఁ జెప్పిన నొప్పుఁ గాక కృతి నొకపద్యం, బతిమూఢుఁ డైనఁ జిత్రతఁ, బ్రతిపాదింపఁడె ఘుణాక్షరన్యాయమునన్." విక్ర. 1.17.

గ్రుడ్డివాటుగా అనుట.

ఘుమ ఘుమ మ్రోయు

1. శబ్దించు.

ధ్వన్యనుకరణము.

"ఖగేశ్వర పత్త్ర జనిత వాతాం, కుర పూర్తిని శంఖ మపుడు ఘుమఘుమ మ్రోసెన్." పారి. 2.78.

2. పరిమళించు.

"మల్లెపూలు ఘుమఘుమ లాడుతున్నవి." వా.

ఘుమ్మను

పరిమళించు, శబ్దించు.

"ఘుమ్మను కపురంపు జగతి కూర్చుండి తగఁ." వాల్మీ. 3.101.

"ఆపిఘ్మట విరచ్చరీపాణి వల్లకీగుంఫ స్వరఘుమ్మలు ఘుమ్మ రనియె." వసు. 5.3.

ఘోటక బ్రహ్మచర్యము

వీలు చిక్కక బ్రహ్మచర్యం నెరపుట.

గుఱ్ఱము ఆడుగుఱ్ఱం కనబడే దాకా బ్రహ్మచర్యం అవలంబిస్తుంది. అందుపై వచ్చిన పలుకుబడి.

"కదిసి చూండ ఘోటక బ్రహ్మచర్యంబు, పింగళాజపంబు పిల్లిశీల, భుజగ రోపవాస మల బకధ్యానంబు, నక్కవినయ మిట్టి నయము లెల్ల." వైజ. 2.19.

చంకకఱ్ఱలు

కుంటివారు నడచుటకు చంకల క్రింద ఆధారంగా పెట్టుకునే కఱ్ఱలు.

చంక కాళ్ళు

చూ. చంకకఱ్ఱలు.

చంక కెక్కు

ఎక్కువచనవు తీసుకొను.

నిరసనగా అనుమాట.

"రెండు సార్లు పలకరిస్తే చాలు. వాడు చంక కెక్కి కూర్చుంటాడు." వా.

చంక చేతులు కట్టుకొని

చేతులు కట్టుకొని వినయముతో.

"వాళ్లన్నయ్య దగ్గర ఎప్పుడూ వాడు చంక చేతులు కట్టుకొని నిలబడ తాడు." వా.

## చంక జేతులు వెట్టుక

చేతులు కట్టుకొని.

"నిలుచుండి చంకఁ జేతులు వెట్టుక కిరీటములు గలరాజులు కొలువు సేయ."

## చంక జేతులు వెట్టుకొని

వినయముతో.

సారం. 1.62.

"నిలుచుండి చంకఁ జేతులు కట్టుకొను వాఁడె, కొలువ రా రే మంచుఁ గెలియ సాఁగ." కవలి. 24.

## చంకటివాడు

చంటివాడు, చంకలోని బిడ్డ.

"వాపోవు చంకటివానిఁ బో వైచి."

గౌర. హరి. ద్వి. 1055.

## చంకతాళి

చంకలో తగిలించుకొను మూట.

శ. ర.

## చంక దుడ్డు, శరణార్థి

అననురూపప్రవర్తన.

పైకేమో అభయం కోరుతూ వచ్చినట్టు నటిస్తున్నా, కొట్టుటకు కర్ర తీసుకొని వచ్చినట్లు.

"శరచాపధారణంబున్, బరమ మన శ్శాంతి దాంతి పరిపాకంబున్, బరికింపఁ జంక దుడ్డును, శరణార్థియు ననెడునట్టి చందము దోఁచెన్."

హరవి. 7.17.

"ధరణీశ! చంక దుడ్డును, శరణార్థియు ననెడు మాట సరి వచ్చె మునీ, శ్వర బాధక మగు నీదు, శ్చరితము పరికింప మిగుల సాహసి వరయన్."

హరి. 2.149.

## చంక నాకి పోవు

చెడిపోవు.

"ఆ కేసు కొత్తవకీలుకు ఇచ్చాను. అది కాస్తా చంక నాకి పోయింది." వా.

"నామాట వినక పోతే నీవే చంక నాకి పోతావు." వా.

## చంక బిడ్డ లూడిపడునట్లు మాటలాడు

చమత్కారముగా, హాస్యముగా, గడుసరిగా మాటలాడు,

"......మన మాదట వేఁడిన మాఱు వల్కఁగాఁ, గొంకెడు నంచు మీ రిపుడు గోలని చూడకు రమ్మ సేయ్చఁ బో, చంకల బిడ్డ లూడిపడ సారస లోచన మాటలాడఁగన్."

విజ. 3.34.

## చంకలబంటిగా మెసవు

కుత్తుకబంటిగా తిను.

"చంకల బంటిగా మెసవి."

క్రీడా. పు. 56.

## చంకలు ఎగుర వేయు

సంతోషించు, సంబరపడు.

"పరీక్షలో ప్యాసయ్యా నని వాడు చంకలు ఎగర వేసుకొంటూ వచ్చాడు." వా.

రూ. చంక లెగుర వేయు.

చంకలు కొట్టుకొను

సంబరపడు.

"ఆc. మనపిల్ల నిస్తామంటే వాడు చంకలు కొట్టుకొంటూ వస్తాడు." వా.

చూ. చంకలు ఎగుర వేయు.

చంకలు గుద్దుకొను

చూ. చంకలు కొట్టుకొను.

చంకలు గొట్టుకొను

సంతోషించు.

"కలిగొట్టు చూచి చంకలు గొట్టుకొనుదమే, పొలంతి గైకొను సుఖ పొన్న కల్ల."

సల ప. 3.230.

"వానికా ఆస్తి వస్తుందని తెలియగానే భార్య చంకలు గొట్టుకొన్నది." వా.

చూ. చంకలు తట్టుకొను.

చంకలు తట్టుకొను

సంబరపడు.

"తన పతుతల్లికి జబ్బు చేసిందనే సరికి వాడు చంకలు తట్టుకొంటూ బయలుదేరాడు." వా.

చూ. చంకలు కొట్టుకొను.

చంకలు తాటించు

సంతోషించు.

చంకలు కొట్టుకొను అని వాడుకలో ఇది కనబడు తుంది.

"బళిరా తేరకుc దేరc దక్కె నీక నీ బంగారకుం డంచుc జం,కలు దాటించుచు..." పాండు. 3.67.

"వాళ్ల తాత చచ్చిపోయాడని నిన్న ఉత్తరం వచ్చిందండి. వాడు చంకలు కొట్టుకొంటూ వెంటనే బయలుదేరి పోయాడు. ఎలాగూ ఆ ఆస్తి వీడికి దక్కవలసిందే గా." వా.

చూ. చంకలు కొట్టుకొను.

చంకలు వైచుకొను

చంకలు కొట్టుకొను, సంబర పడు.

"కానున్న పనికి చంకలు వైచుకొన రాదు, గడచిన వెత దుఃఖపడcగ రాదు..." రామలిం.

చంకలో పెట్టుకొని పోవు

సంగ్రహించుకొని పోవు.

"కాస్త అజాగ్రత్తగా ఉన్నామంటే వాడు దొరికిందాన్ని చంకలో పెట్టుకొని పోతాడు." వా.

చూ. చంకను పెట్టుకొని పోవు.

చంక వైచుకొను

చంకలు కొట్టుకొను.

ఇది సంతోషసూచకము.

"సంతసమును నాపలేcజాలక చంక వైచు, కొనుచు నొక దాటు గొని."

ప్రభా. 3.134.

చంగున....

దుముకు ఇత్యాదులలో.

ధ్వన్యనుకరణము.

కళా. 8.89.

చంటిక్రిం దిటికి

కొంగుచాటున నుంచి.

అనగా వెంట వెంట తిరు గునట్లుచేసి అనుట.

"ఈరీతిc జంటిక్రిం దిటికి నాతొత్తు."

గా. హరి. ద్వితీ. పం క్తి?

చంటిపాప

పసిపాప.

చంటివాడు

పాలు తాగే పసివాడు.

చండశాసనుడు

నిర్దాక్షిణ్యంగా తప్పును శిక్షించువాడు.

"అతనా చండశాసనుడు! నీ సిఫారసు లేవీ పని చెయ్యవక్కడ." వా.

చండాలవాటిలో బ్రాహ్మణ గృహము వెదకు

వ్యర్థప్రయత్నము చేయు.

మాలగూడెంలో బాపన యింటికోసం వెదకడం వ్యర్థమే కదా!

"వసుధ నెంతైనఁ జండాల వాటి లోన, బ్రాహ్మణగృహంబు వెదకుట భ్రాంతి గాదె." ప్రభా. 4.160.

చండిపోతు

మొండివాడు.

"మొండరి చల్లచప్పుడు గోడచేర్పు, చండిపో తనుపట్టిజాడ నున్నాఁడు."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1497-98.

చండి వడు

మొండి కెత్తు.

"మజ్జనక్రీడాపరాయణంబై చండి వడి కదలమిన్." పారి. 5.13.

చండి సేయు

మొండికి వేయు, కోపించు.

"చండి సేసి యడిగినఁ జక్క మాకుం జెప్పదు." తాళ్ల. సం. 3.626.

చంద్రనిప్పులు

భగభగ లాడు నిప్పులు.

చంద్రకఱ్ఱ కాల్చిన నిప్పులు చాలా వేడి అనుటపై ఏర్పడి నది.

"చంద్రనిప్పులకంటె వేంద్రంబు లగు నట్టి, కన్నులఁ గోపాగ్ని కణము లురల." హరిశ్చ. 3.91.

చంద్రమల్లెలు

చంద్రనిప్పుల మంటలు.

"రవరవ మండు నెర్రని చంద్రమల్లెల." క్రీడా. పు. 48.

చంద్రలాటలు

ఒక పిల్లల ఆట.

హంస. 3.146.

చందనకావులు

ఒక రకమైన బట్టలు.

పండితా. పర్వ. 307. పుట.

చందన మలదు

గంధము పూయు.

"అలఁదెఁ జందన మొక ధవళాయ తాక్షి." పారి. 2.12.

చందమామ కొండనాలిక

చందమామ చిటునాలిక వంటిది.

అనగా తెల్లనిది, మృదువైనది, సన్ననిది అనుట. చంద మామే లలితం. అంతకంటె లలితాతిలలితం.

"చందమామ కొండనాలిక యగు నొక్క గొమలిరేక." క్రీడా. పు. 57.

చందమామ గుటకలు

దొరకనిదానికై ఆశపడి

నోరూర్చుకొనుట. వట్టి ఆశ.

"అందనిపంటి కేమిటికి నట్టు నిగిడ్చెదు విష్ణుఁ డున్న యా, కంగువ చందమామ గుటకల్ విను మీ పని గట్టిపెట్టి..."
వి. పు. 2.51.

చూ. చందమామ ఘుటిక.
చందమామ గ్రుక్కిళ్ళు.

## చందమామ గ్రుక్కిళ్ళు

దొరకనిదానికై వట్టి ఆశతో గుటకలు మ్రింగుట.

"ఎలమి సుధాంశు గతుండను పెరగుతు నంతఁ, బ్రేమ మది మీఱఁ గాఁ జంద మామ చెలులు, కెంపు బావుల సుధను గ్రుక్కిళ్ళు మ్రింగ, తీలిఁ గలిగె జంద మామ గ్రుక్కిళ్ళు నాఁడు."
శేషాం. 5.137.

చూ. చందమామ గుటకలు.
చందమామ ఘుటిక.

## చందమామ ఘుటిక

వట్టి ఆశ. ఎదురుగా ఉన్నదని దొరకనిదాని నాశించుట.

చందమామను చూచి గుటకలు వేసినట్లు. ఎలాగూ దొరకదు.

పిల్లలకు చందమామను చూపుతూ వట్టి చేతులతో తినిపించగా తినునట్లు వారు నటింతు రని సూ. ని. సరి యని తోచదు. గుటకలు వేయుటయే ఇక్కడ.

"మనకు నిజ మయ్యె నల చందమామ ఘుటిక."
భీమ. 2.135.

చూ. చందమామ గుటకలు.

## చందమామ పక్కి

ఒక రకమైన చేప. బ్రౌన్.

## చందమామ పురుగు

ఆరుద్రపురుగు. బ్రౌన్.

## చందమామ పులుగు

చకోరపక్షి.

## చందా కెంపు

ఒక జాతి కెంపు.

"మీనఁ జందాకెంపు మించుటొడ్డాణంబు."
సమీర. 2.67.

## చందాదారు

చందా కట్టువాడు.

## చందుచట్టు

చంద్రకాంతం.

## చందురకావి

లేత కావి రంగు.

"విశద సుగంధదామ రశనఁ జందుర కావి, కలికపు వలువపై నలవరించి."
మను. 6.5.

చూ. చంద్రకావి.

## చందురజ్యోతి

ఒక రకం బాణసంచా.
శ. ర.

## చందురుపూనలు

నఖక్షతాలు.

## చందురువంకలు

నఖక్షతాలు.

## చంద్రకావి

లేత కావిరంగు.

రాధి. 1.99.

చంద్రగోళి

చంద్రపు గిన్నె.

అంచు లేని గుండ్రమైన గిన్నె. పక్షులు నీరు త్రాగుటకూ, మనం చేతులు కడుగుకొనుటకూ ఇత్యాదులకు అందులో నీరు ఉంచుతారు.

గోళెము అన్నది కొంచెం వెడల్పాటి అంచు లేని గిన్నెకే నేడు కూడా రూఢము.

"క్షాళనోచిత-చంద్రగోళి యనఁగ."

పాండు. 5.24.

చూ. చంద్రపుగిన్నె.

చంద్రపుగిన్నె

అంచు లేని గుండ్రమైన గిన్నె.

"చక్రవాకములకుఁ జల్లఁగా మంచు ద్రాగించిన చంద్రంపు గిన్నెవోలె."

ఉత్త. హ. 3.86.

చూ. చంద్రగోళి.

చంద్రవంక

ఆభరణము.

చంద్రవంకలు

ఒక రకమైన ధాన్యం.

చంద్రుని కొంక నూలిపోగు

తగినంత కాకపోయినా యెంతో కొంత ఆరాధన. చేతనైన కానుక.

చంద్రదర్శనం చేసుకొన్నప్పుడు – ముఖ్యంగా విదియనాడు – ఉత్తరీయంలోని నూలిపోగు తీసివేసి నమస్కరించుట ఆచారం. దానిపై వచ్చిన పలుకుబడి.

"కావున సమస్తసామ్రాజ్యకర్త యైన, యిందిరాధీశునకుఁ గాను కీయవలయుఁ, జంద్రునకు నూలుపో గన్నసామెతగను, గాననే మైన మనశక్తి గలకొలంది."

కుచే. 1.109.

"మీరు చేసేది గొప్ప సత్కార్యం. వేలమీదా లక్షలమీదా కావలసిన పని. చంద్రుని కొక నూలిపోగు లాగా నేనూ ఒక పదిరూపాయలు యిచ్చుకుంటాను." వా.

చంపి పుట్టు

వారికంటె మించినవాడగు.

"వాడు వాళ్ల నాన్నను చంపి పుట్టాడు." వా.

"రావణాసురుణ్ణి చంపి పుట్టినాడు వీడు." వా.

అనగా అతనికంటె మించినవాడని అర్థం.

నిరసన సూచించు పట్టులనే యిది యెక్కువగా ఉపయోగిస్తారు.

చంపుక తిను

వేధించు, బాధించు.

"పదిరూపాయలు అప్పు ఇమ్మని వాడు నాలుగు రోజులనుంచీ నన్ను చంపుక తింటున్నాడు." వా.

రూ. ఏటికి చంపెదరు?

చంపుకు తిన్నట్టు

రూ. నను చంపుకొన్నట్టు.

**చంపుడు గట్టు**

వధ్యశిల.

"చంపుడుగట్టు యగు శిలాపట్టంబు మెట్టి." కాశీ. 5.169.

**చంపుడు గట్టు**

చూ. చంపుడు గట్టు.

**చంపుడు ముంపుడు**

చచ్చు పుచ్చు; చెఱుచునట్టి. ఇదేదో విశేషణంగానే ఉపయోగిస్తారు.

"చంపుడు ముంపుడు బోధ గాథలన్." పాండు. 5.224.

చూ. చచ్చు పుచ్చు.

**చకచకా**

గబగబా.

"అతను ఏ పనైనా చకచకా చేసుకొని పోతాడు." వా.

**చకారపు గుడులు**

చీవాట్లు, చీకొట్టుటలు.

"వాడి దగ్గరికి వెళ్లా మంటే చకారపు గుడులకు తక్కువుండవు." వా.

**చక్క జూచు**

1. బాగుగా చూచుకొను, ఆదరించు.

"సొగబడి మ్రొక్కి యిల్లాలిఁ జక్కఁ జూడఁ, గావు మని బాస లీయఁగాఁ గంటి నేను." శుక. 1.526.

2. సరిగా చూచు, బాగా చూచు.

"కడుకొనక తప్పఁ జూచినఁ, జెడు లోకము లనుట యిది ప్రసిద్ధము జగతిన్, ఇప్పుడు నీవు చక్కఁ జూచిన, జెడియు మనోభవుఁడు నిది విచిత్రము గాదే." కుమా. 9.44.

శ్లేష ఇక్కడ.

**చక్క జేయు**

1. సరిపఱచు.

"విరస మయ్యెనేని వెర వెద్ది మఱి చక్కఁజేయ నీవ చింత చేసి చూడు." ప్రభా. 5.19.

2. సంస్కరించు.

"స్నానంబు గావించి తనుదెంచు నంతలోన్, జపవేదిఁ దగురీతిఁ జక్కఁ జేయుము." ఉత్త. రా. 1.199.

3. పూర్తి చేయు.

"పోయి వచ్చి నీ, పని మఱి చక్కఁ జేసెద నెపంబు సహింపుము." భాస్క. రా. సుం. 83.

4. చంపు, కూల్చు.

"గంగానందనుఁ గూల్చి ద్రోణుపని చక్కంజేసి కౌరవ్యవీరాంగన్ముల్ నుఱుమాడి." భార. భీష్మ. 2.153.

"జలరాశి గర్వంబుఁ జక్కఁజేసి." భాగ. 6.306.

**చక్క జేర్చు**

సవరించు.

"తమ్మి పూమొగ్గల నేలు పూపచను ముక్కలఁ బయ్యెదఁ జక్కఁ జేర్చుచున్." శుక. 1.293.

**చక్కటులు దిద్దు**

చక్క దిద్దు.

"......జక్కవకవం జక్కట్లు దిద్దుగ గుచాహంకారంబు మదాళిమాలికలు నూటాడించు వేణీరుచుల్." విజ. 2.16.

చూ. చక్కట్లు దిద్దు.

చక్కట్లు దిద్దు
సరి దిద్దు.
"జక్కవకవ జక్కట్లు దిద్దఁగ గుచా హంకారంబు." విజయ. 2.16.
రూ. చక్కటులు దిద్దు.

చక్కడచు
సంహరించు.
"చక్కడఁతు నిన్ను విష్ణునిఁ, జెక్కలు ప్రేలెదవు." భాగ. స్క. 7.272.

చక్క నగు
సరిపడు, నెఱవేఱు – ఇత్యాది - భావచ్ఛాయలలో కనిపించు మాట.
"కలికి భుజంగసంగతిఁ గన్న కేతకి, సాధ్వి చెంత వసింపఁ జక్క నౌనె."
ఇందు. 3.72.

చక్కనయ్య
మన్మథుడు.

చక్కని కొమ్మ
అంద మైన స్త్రీ.
"మనవమ్మా నన్నో చక్కని కొమ్మా మెచ్చుకొమ్మ కథ విని పొమ్మా!"
హంస. 1.149.

చక్కనిమిన్ను
గగనమధ్యం.
"సవితృండు చక్కని మింటికిం జను దెంచె." భాగ. భీష్మ. 3.346.

చక్కనివారిలో మిగుల చక్కనిది (వాడు)
అతి సౌందర్యవంతురాలు(డు) ఇట్టి పలుకుబడులు మనకు చాలా ఉన్నవి. ధనవంతులలో ధనవంతుడు – ఇత్యాది.
"చక్కనివారిలో మిగులఁ జక్కని దానవటంచు వేడ్కతోఁ, జొక్కఁగఁ జెప్పి రందు లకుఁ జూచినయందుకు..." హంస. 1.84.

చక్కబడు
సరిపడు; నెఱవేరు.
"ఈ పని ఇంతలో చక్కబడేట్టు లేదు." వా.

చక్కబఱచు
సవరించు.
"శయ్య విడలించి పైచీర చక్కఁ బఱచి."
రుక్మాం. 4.82.

చక్కబెట్టు
1. చాలించు, కట్టిపెట్టు.
"జపహోమతంత్రముల్ చక్కఁ బెట్టి." రుక్మాం. 4.102.
2. సరిచేయు, చక్కదిద్దు.
"........మీ రొక్కొక్క వేళ...... చక్కఁ బెట్టువాడు."
పాండు. 5.218.
3. దొంగిలించు.
"వాడు అందరూ నిద్ర పోతూండడం చూచి ఆరవేసిన నాలుగు పంచలూ చీరలూ చక్కబెట్టుకొని పోయాడు." వా.
4. లోబరచుకొను.
"వాళ్లయింటికి అప్పుడప్పుడూ పోతూ వస్తూనే ఉండి, వాడు ఆ పిల్లను కాస్తా చక్క బెట్టినాడు."

5. బియ్యం సరిచేయు.

"బియ్యం చక్కబెట్టి ఆ తరవాత ఎసట్లో పోయవే." వా.

ఇదే వాడుకలో పశ్చిమ ప్రాంతాలలో 'సగబెట్టు' అనే రూపంలో విరివిగా వినవస్తుంది.

"ఆ పోరక, చేట అంతా సగబెట్టి కసువు నూకు." వా.

చూ. సగబెట్టు.

## చక్కబోవు

సరాసరిగా వెడలిపోవు.

"ఈసారి చని వేడ నేమనునో యని, సంకోచమునఁ గొక్కి చక్కఁబోవు." హంస. 3.155.

"వాడు నేను పిలుస్తూండగానే చక్కాపోయాడు." వా.

## చక్క సగము

సరిగ్గా సగం.

"ఒడలిలోఁ జక్క సగము నా కొసఁగు మనుడు." ఉత్త. హరి. 5.56.

చూ. చక్క సమము.

## చక్క సమము

సరిగ్గా సగం.

"పంచి పెట్టెదం, జక్క సమంబుగాఁ గనిది సమ్మతమా? గద మీకు వారి కిన్." దశా. 2.343.

చూ. చక్క సగము.

## చక్కాడు

1. సంహరించు.

"తక్కిన రాక్షసదళముల నొకటఁ, జక్కాడె మానవశరమహత్త్వమున." రంగ. రా. బాల. పు. 35. పంక్తి. 23.

2. నుఱుమాడు, తెగగొట్టు.

"ఖడ్గ మెత్తినఁ జక్కాడెఁ గంబుకంఠి." కాశీ. 6.245.

## చక్కిలిగింత

సంతోషప్రకారం; చక్కిలిగిలి.

"అమరుల బోనపుట్టిక సహస్రమయూఖుని జోడుజోడై సంతతమును వేరు విత్తు పరువాదంబుల చక్కిలిగింత పుంశ్చలీ, సమితికిఁ జక్కవాలు." పారి. 2.41.

"చక్కిలిగింత పెడితే నాకు బాగుండదు." వా.

## చక్కిలిగిలిగింత

చక్కిలిగింత.

"చొక్కెడు మగు రాధహృదయము, చక్కిలి గిలిగింత గొనియె శంబరరిపుచేతన్." రాధా. 4.71.

## చక్కిలి గిలిగిలి

గిలిగింతలు పెట్టుటలో అను మాట. చక్కిలిగిలిగిలీ అంటూ నవ్వునట్లు అరికాళ్లలోనూ చంకలలోనూ వ్రేళ్లతో తాకుతారు. నవ్వు వస్తుంది.

"క్రిక్కించుఁ జక్కిలి గిలిగిలియనుచు." పండితా. ప్రథ. పురా. పుట. 457.

## చక్కిలింతలు పుచ్చు

గిలిగింతలు పెట్టు.

పండితా. ప్రథ. పురా. పుట. 457.

చూ. చక్కిలి గిలిగిలి పెట్టు.

చక్కీ పంచదార

శుద్ధి చేసిన చక్కెర. బ్రౌన్.
గడ్డ కట్టిన చక్కెర.

వావిళ్ళ ని.

చక్కీ మంచము

పేము మొదలగువానితో
నేసిన చట్టం గల మంచం.

చక్కుగా జేయు

చక్కు సేయు.

"పాలుపారు సౌధగోపురములతోడఁ,
గాశీపురము చక్కుగాఁ జేసి కాల్చి."

ద్విప. జగ. 175.

చూ. చక్కు చేయు.

చక్కు చేయు

1. తుత్తుమురు చేయు.

"తుందుడు కాఱ శాత్రవుల దోర్బల
సంపదఁ జక్కు చేసి." నిరంకు. 4.80.

చూ. చక్కాడు.

2. నిర్మూలించు.

"శర మేర్చి యిపుడె, చంద్రసూర్యా
గ్నులఁ జక్కుఁ జేసెదను."

వర. రా. అర. పు. 231. పం. 3.

రూ. చక్కుసేయు.

చక్కుపగడ

ఏదో సంఖ్య.

వేంక. మాన.

చక్కుముక్కు చేయు

చిందరవందర చేయు.

"ఎక్కడి పగ యొకో యింద్రియాలు
నన్నుఁ బట్టి, చక్కుముక్కుల చేసి
యొంచి సాధించేని."

తాళ్ల. సం. 6.105.

చక్కువడు

ముక్కలు ముక్క లగు.

"అక్కిరీటి సైన్యంబు లెక్క గొనక,
యుక్కు మిగిలి యక్కజంబుగాఁ,
జక్కువడం బెక్కు నారసంబులు."

జైమి. 5.20.

చక్కెర తిన్ననోర వేపాకు మేసినవిధము

మంచిపని చేసినపిదప చెడు
పని చేయ రా దనుపట్ల
ఉపయోగించే పలుకుబడి.

"తీపారుచక్కెరఁ దిన్న యానోర,
వేపాకు మేసినవిధమున నీవు, చేసి
నంతయు మేలు చేసి మ తేల, చేసితి
విట్టి కుచ్చితము..."

గౌర. హరి. ద్వి. 1281-'84.

చక్కెర పెట్టు

తీపి తినుబండము పెట్టు.

"కనకపంజరశారికలకుఁ జక్కెర వెట్టి,
చదివింప రేలొకో సకియ లిపుడు."

పారి. 1.106.

చక్కెర బుగడ

ఒక రకమైన పిండివంట.

చక్కెర బెట్టి లాలించు

ప్రేమతో పెంచు.

"ప్రేమతోఁ జక్కెర వెట్టి లాలించిన,
చిలుకకే వెగటుగాఁ బలుక సాఁగె."

ఉషా. 2.47.

చక్కెరబొమ్మ

అందగత్తె.

"అప్పు డా, చక్కెర బొమ్మ సూర్మ్క లయయు చైవులకట విభుం డులసెలు చూఁ." శుక. 1.362.

చూ. బంగారుబొమ్మ.

చక్కెర ముద్దుగుమ్మ

అందగత్తె.

"ఈ, చక్కెర ముద్దుగుమ్మకు రసప్రియ భావల నిం పొనర్చెడిన్." వేంక. పంచ. 3.288.

చక్కెరలప్పలు

శర్కరఖండములు.

"ఎక్కడ గోరు సోకనన్, జక్కెర అప్పలు." కా. మా. 1.43.

చక్కెర లొల్కు

మధుర మైన.

"చక్కెర లొల్కెడు చక్కని యూతని, కెమ్మోవిఁ జాడుము కీర వాణి!" ఉషా. 3.3.

చక్కెరవంటి (పండ్లు)

మధుర మైన.

"ఈ, చక్కెరవంటి పండ్లు తిన సాఁగి రటంచుఁ గృశించు నెంతయున్." శుక. 3.376.

చచ్చుదరము

చచ్చౌకము; నలుచదరము.

చూ. చచ్చవుకము.

చచ్చవుకము

నలువైపులా చదరము గా నున్నది.

"ఇక్కడి గుడి నన్నారు అడుగుల చచ్చవుకములో." కాశియా. 304.

చూ. చచ్చౌకము.

చచ్చి కడుపున పుట్టు

కృతజ్ఞతను తెలియజేయు సందర్భములో ఉపయోగించే పలుకుబడి.

"నీవు మావానికి కాస్త ఆశ్రయం చూపించావంటే చచ్చి నీ కడుపున పుడతాను." వా.

చచ్చి చావని వాడు

అతిగా యిటిగా కానివాడు.

"చచ్చి చావని వాని బల్ హెచ్చు నగును." దేవీ. 3.401.

చచ్చి చెడి

నానా శ్రమపడి.

"చచ్చి చెడి యింత దూరం వస్తే నువ్వు లేదు పొమ్మంటే ఎట్లా?" వా.

చచ్చి చెడి చాయంగల విన్నపా లగు

నానా శ్రమపడు అనుట.

మాటా. 33.

చచ్చి చెడి సున్న మగు

నానా శ్రమపడు.

"శ్రీశైలం చేరేసరికి చచ్చి చెడి సున్న మయ్యాము." వా.

చూ. చచ్చి సున్న మగు.

చచ్చిన చావు అగు

అత్యంతబాధకు లోనగు.

"చచ్చినచావు గాదె, దైతేయవిభుని సోదరుఁ డీల్గె ననిన." హర. రా. యు. పు. 297. పంక్తి. 20...

"పీడితో వేగ లేక చచ్చినచావుగా ఉంది." వా.

**చచ్చిన చావుగా**
నానా బాధగా.
"చచ్చిన చావుగా జనలోకనాథుఁ, డచ్చోట నాత్మలో నడలుచు నుండె." నంచ. ద్వి. 5.61.
"పీడితో నాకు చచ్చిన చావుగా ఉంది." వా.

**చచ్చినపామును చంపు**
అసలే దెబ్బ తిన్నవానిని బాధించు.
"వాడసలే చితికి పోయి ఉన్నాడు. మళ్లీ వాడిమీద ఎందుకు వ్యాజ్యం వేస్తావు? చచ్చినపామును చంపడం ఎందుకు." వా.

**చచ్చినవానికండ్లు చేరెడేసి**
గతించినది చాలా గొప్పగా కనబడుట సహజము అను పట్ల వినవచ్చే పలుకుబడి.
"ఎప్పుడో అలా బతికాము ఇలా బతికాము అంటే లాభ మేముంది? ఇప్పటి సంగతి చెప్పు. చచ్చిన వానికండ్లు చేరడేసి." వా.

**చచ్చినవానిని చదువ వేయు**
శక్తిహీనునికి బరువైన పనిని అప్పగించు.
"వాడసలే అర్భకుడు. వాడినెత్తిన ఇంత పని పెడే ఏం లాభం? చచ్చిన వాణ్ణి చదవ వేసినట్లు." వా.

**చచ్చి పుట్ట నేర్చు**
అసాధ్యములను చేయగల జగజంత అని నిరసించుటలో వచ్చిన పలుకుబడి.
పండితా. ప్రథ. పురా. పుట. 360.

"అమ్మో అదా! ఎంత నెఱజాణ. చచ్చి పుట్ట గలదు." వా.

**చచ్చి బ్రతుకు**
చావవలసినంత ప్రమాదానికి గుఱి అయి ఎలాగో బతికి బయట పడు.
"ప్రాల్గల రతిదేవి భాగ్యసంపదఁ గదా, ప్రసవసాయక! చచ్చి బ్రతికి తీవు." నైష. 2.138.
ఇక్కడ శ్లేషలో జాతీయం నిక్షిప్తమై యున్నది.
"వాడికీ మధ్య చాలా జబ్బు చేసింది. ఎలాగో చచ్చి బతికాడు."
"ఆ విమానప్రమాదంలో వాడు తగులుకొని చచ్చి బతికాడు."

**చచ్చియు చావడు**
చచ్చినవాడూ కాదు, బతికిన వాడూ కాదు.
"ఎంత బల్లిదు నైన నెదిరింప వచ్చుఁ, జచ్చియుఁ జావఁ డీ చపలరాక్షసుఁడు." మైరా. పు. 65.

**చచ్చి సగ మగు**
నానా బాధా పడు.
"ఈ పనితో వాడు చచ్చి సగమయ్యాడు. ఇం కేమి చేస్తాడు?" వా.

**చచ్చి సాధించు**
చనిపోయి కూడా పగ తీర్చుకొను.
ఒక కథపై వచ్చిన పలుకుబడి.
కరణం బతికున్నంతకాలం రెడ్డిమీద పగ తీర్చుకొన

లేక పోయాడు. చావాసన్నమౌతుండగా రెడ్డి వచ్చి యింకా పగ ఎందు కని పలుకరించాడు. అప్పు డతను రెడ్డిగారి గడ్డికి దక్షిణాన తన్ను కాల్చమని కడపటి కోరికగా కోరాడు. పాపం! కడపటి కోరిక గదా అని రెడ్డిగారు అలాగే చేశారు. గాలి కాంకాష్ఠంలో అగ్గి రెడ్డిగారి గడ్డిలో పడి వాములన్నీ కాలి పోయాయి. 'చచ్చి సాధించాడురా ముండకొడుకు' అన్నా డట రెడ్డి.

**చచ్చి సున్న మగు**

విపరీతముగా శ్రమించు.

"వీడికి చదువు చెప్ప లేక చచ్చి సున్న మవుతున్నాను." వా.

చూ. చచ్చి చెడి సున్న మగు.

**చచ్చుదద్దమ్మ**

చూ. చచ్చుపెద్దమ్మ.

**చచ్చునాగమ్మ**

చూ. చచ్చుదద్దమ్మ.

**చచ్చుపీనుగ**

1. వెధవ. ఒక తిట్టు.

శాత్ర. 271.

2. ఏమీ చేత కానివాడు.

మదన. 30.

**చచ్చుపుచ్చు**

పనికి రాని.

"ఈ చచ్చుపుచ్చు కబుర్లన్నీ నా దగ్గర పనికి రావు." వా.

"వీడు తెచ్చిన వన్నీ చచ్చుపుచ్చు వంకాయలే." వా.

**చచ్చుపెద్దమ్మ**

దద్దమ్మ.

"వాండు వట్టి చచ్చుపెద్దమ్మ. ఎవరే మన్నా పడతాడు." వా.

**చచ్చౌకము**

చచ్చదరము.

నాలుగువైపుల చదరముగా నున్నది.

"చచ్చౌక మేర్పడి సరసంపుభువిని." పల. పు. 38.

చూ. చచ్చవుకము.

**చటులపడు**

ముడగబడు, కుంటుపడు.

"ఆకాశవాహిని సైకతంబుల ఖురాం, చల టంకములు గ్రుంగఁ జటుల పడిన." కాశీ. 3.12.

**చట్టలు చీరు**

చంపు.

రామా. 7.265.

**చట్టలు దూయు**

చంపు.

వరాహ. 6.22.

**చట్టలు ద్రుంచు**

చంపు.

**చట్టలు పట్టుకొను**

ఒకరిచేతు లొకరు పరస్పరం పట్టుకొను.

"పాదుకలు మెట్టి చట్టలు పట్టుకొ నుచు." భీమ. 2.197.

చూ. చెట్టాపట్టాలు.

**చట్టలు పడిపోవు**

'చట్ట' అంటే పిఱుదుకు కింద నున్న వెలుపలి భాగం.

"పొద్దున్నుంచీ నిలబడి నిలబడి చట్టలు పడిపోయాయి." వా.

**చట్టలు వాపు**

నాశము చేయు.

ఉత్త. హరి. 4.87.

**చట్టి చుయ్యను నా దాలిని**

చట్టిమీద చుయ్యను శబ్దము ఇంకా ఆఱిపోని.

అనగా అప్పుడప్పుడే చేసిన వేడివేడి పదార్థ మనుట.

"పునుఁగుందావి నవోదనంబు మిరియం పుంబాల్లతోఁ జట్టి చుయ్యనునా దాలిని కూరగుంపు..."

ఆము. 1.82.

**చట్టితో చట్టి పగుల గొట్టు**

ఇంటిలో కుండలు పగుల గొట్టు.

ఇది కోపసూచకముగా ఆడు వారు చేయుపని.

"చట్టితోఁ జట్టి పగులంగఁ గొట్టి తనదు, పదరులకు నింట బలుకుక్క లదరి కూయ."

శుక. 3.275.

**చట్టుపడు**

నశించు – త్యక్త మగు.

**చట్టుపై పోక లగు**

చెల్లాచెదరు లగు.

రాతిపై పడిన పోకలవలె చెల్లాచెద రై పోయి రనుట.

"చట్టుపై పోక లై చనిరి గంధర్వులు, గరుడులు పంచబంగాళ మైరి."

పారి. 5.37.

**చట్టుబండ లగు**

పాడగు.

కొత్త. 365.

**చట్టు మోపు**

రాయిని మోసే శిక్షను వేయు.

దశా. 2.190.

**చట్రాతిపై క్రుంగగల**

రాతిలో మునుగగల.

అసాధ్యకార్యము లొనర్చు నెఱజాణ అనుటలో...

కుమా. 8.135.

**చట్రాతిపై గ్రుంక నేర్చు**

రాతిలో మునిగిపోగల్గు, అసాధ్యకార్యములను చేయ గలవా రనుటలో నిరసన ద్యోతక మైన పలుకుబడి.

పండితా. ప్రథ. పురా. పుట. 359.

**చట్రాళ్లు**

కటికవారు, కఠినులు.

"ఇచ్చటి జగజంతలు మగలకన్నఁ జట్రాళ్లు సుమీ!"

శుక. 3.184.

చడిజాడలు

దారితెన్నులు. జం.

"పడంతి వెడలిన చడిజాడ లడుగఁ బోడఁగ." వేం. మాహా. 2.130.

చడి సను

పేరందు, ప్రఖ్యాతి వహించు.

"లింగదేవునకు నమ్ముంగుబసవఁడు, జంగమకోటికి సడి సన్నదాసి."
బస. 1.5.

"చడి సన్న లింగప్రసాదులు భువిని, అసమశాపానుగ్రహసమర్థులు..."
పండితా. ప్రథ. దీక్ష. పుట. 103.

చడి సప్పు లేకుండ

ఎవరికీ తెలియకుండా, గప్పు చిప్పు మని.
కాశీ. 5.289.

"వాడు చడీ చప్పుడూ లేకుండా పెళ్లి చేసుకున్నాడు." వా.

చడీ చప్పుడూ

సవ్వడి. జం.
చూ. చడి సప్పు లేకుండ.

చతికిలబడు

కూలబడు.
భీమ. 5.15.

చతుర్థసంపద

మోక్షము.

పురుషార్థములు నాలుగింటిలో నాలుగవది మోక్షము గనుక.

ధర్మార్థ కామ మోక్షములు చతుర్విధ పురుషార్థములు.
పాండు. 4.61.

"చరితార్థుఁడ వీవు చతుర్థసంపదకు."

చతుర్వేది

నాలుగు వేదములును చదువు కొన్నవాడు. ఇలా చదువు కొన్నవా రెవ్వరో ఉండగా, ఆవంశానికా పేరు వచ్చి తర్వాత నేడు ఇంటి పేరు కూడా అయినది.

"మూఁడ్గనఁ జతుర్వేది గాఁడె."
సండిల్. ప్రప. పురా. పుట. 466.

చత్తు సరిపోదు సను

చచ్చెద నని బెదరించు.
జం.

"చేరి వరు వేఁడు నిమ్మాటఁ జెప్ప కున్నఁ, జత్తు సరిపోదు ననుము నిస్సంశయముగ." శుక. 3.267.

చత్వారం వచ్చు

సలభై యేండ్లు పైబడిన తర్వాత కండ్ల చూపు తగ్గు.

"కండ్లకుఁ జత్వార మొదవెఁ గాయము ముదిసెన్." చంద్ర. వి. 2.21.

"నా కీమధ్య చత్వారం వచ్చింది. అద్దాలు వేసుకోవాలి." వా.

చదలు మోయు

మిన్నంటు.

"చదలు మోచిన శృంగచయముల చేత."
వర. రా. కిష్కి. పు. 465. పం. 17.

చదికిల ద్రెళ్లు

చదికిల బడు.

"తేరిపైఁ జదికిలఁ ద్రెళ్లి నిశ్చైతన్య, గతి నున్న దశసాయకముల సూతు."
ఉ. హరి. 3.53.

## చదికిల బడు

1. కూలబడు.
"వేగంగా పరుగెత్తుకొంటూ పోయి వా డక్కడ చదికిలబడ్డాడు." వా.

2. డీలా పడిపోవు.
"వాడు వ్యాపారంలో బాగా దెబ్బ తిని చదికిలబడి పోయాడు." వా.

## చదియగొట్టు

ఉతుకు.
"కూటశాల్మలులందుఁ గుదియఁ గట్టి, చక్రాలిపై మేను చదియఁ గొట్టి."
రుక్మాం. 5.82.

## చదివించు

బహూకరించు.

పెండ్లిండ్లలో వధూవరుల కిచ్చు బహుమతులను చదివింపు లనుట, ఆ యిచ్చుటను చదివించుట అనుట నేటికీ అలవాటు.

మొదట ఏ శ్లోకమో, పద్యమో వధూవరుల నాశీర్వదిస్తూ వ్రాసి చదువుట ఆచారమై, అదే తరువాత బహుమతిప్రదానమునకు ప్రత్యామ్నాయంగా పరిణమించి ఉండ వచ్చును.

"చీరలున్ హార విభూషణావళియు సమ్మోదనంబునకున్ బ్రియంబుతో, నారదమౌనిచేత నదనన్ జదివించెఁ గుబేరు పేరుగాన్." మను. 5.96.

"వాళ్ళ మామ పెండ్లికూతురికి ఒక పట్టు చీర, పది రూపాయలు చదివించాడు." వా.

## చదుకు పడు

చప్పిడి బడు; ఊడు.
"మురిసి మురిసి రాలె ముని వ్రేళ్ళ నడుముక్క, చదుకు పడియె."
వరాహ. 9.78.

## చదు కెక్కు

రాలు.
"కెంజిగురాకుడాలు దులకించిన ధాతుపటంబు చాయఁ జే, యం జదు కెక్కు పుష్పాదుల నంటిన తేఁటులు."
పాండు. 4.14.

## చదు రడచు

హాస్య మాడు.
"చదు రడచిన మనసుపొందు చక్కం బడునే." భార: ఉద్యో. 1.312.

## చదురుం బదురు

సల్లాపాలు. జం.
"చదురుం బదురు నొక్క సమ్మతాన." తాళ్ల. సం. 3.582.

## చదురు మీఱు

చతురత మీఱు.
"చదురుల్ మీఱు భవత్ప్రబంధ మిల నిచ్చల్ దక్షిణద్వారకా, సదనాస్థాన కథానుషంగములచే..."
రాజగో. 1.32.

## చదురులాడు

నేర్పరి.
"జగములఁ గలిగించుచదురులాఁడు."
భోజసుతా. 1.25.

## చదువ బెట్టు

1. చదివించు.

"చదువం బెట్టినఁ బట్టు వాత్త్రల."

కా. మా. 4.22.

2. కుదువ బెట్టు.

"అత్తవారిచ్చిన యపరంజి గంటీలు, సంశయింపక వేగఁ జదువఁ బెట్టె."

నిరం. 2.116.

"ఏమని చెప్పవచ్చు నప్పు డింతుల సొమ్ములు చెల్లిపోవఁ ద, త్ప్రియము సెక్కడం జదువఁ బెట్టెనొ శ్రీ"

కళా. 6.97.

ఇలాగే 'నీ తెలివిని ఎక్కడో చదవ బెట్టినావు.' 'చదువ వేసినాడు' అన్నట్టు కూడా వాడుక.

దక్షిణాంధ్రంలో నేటికీ ప్రచురంగా, ఈ అర్థంలో వాడుకలో ఉన్న పలుకుబడి.

పోగొట్టు అని పూర్వకోశాలు చెప్పిన అర్థం సరి కాదు.

చూ. చదువ వేయు.

## చదువయ్య

పండితుడు.

"ఇది యెఱుఁగరు చదువయ్యలు, మది ముక్తికి నాస్పదంబు మహిలో వేమా!"

వేమన.

## చదువ వేస్తే ఉన్నమతి పోయి నట్లు

తెలివి ఎక్కువగుటకై ప్రయత్నింపగా తక్కువయ్యె ననుట.

"ఇనాన్నళ్లు సేవ చేయుచు, నున్నదియుం బోయె నేఁ డపరాకౌఁగిలి యిమ్మన్న తఱిఁ జదువఁ బెట్టఁగ, నున్న మతియుఁ బోయె నను టబద్ధ నిజముయ్యెస."

విజ. 3.10.

## చదువు అంటు

చదువు వచ్చు.

"వాడికి కన్నాళ్లయినా చదువు అంట లేదు."

వా.

## చదువు చట్టుబండలు

చదువుసంధ్యలు. జం.

"నాడికి సేం చదువా చట్టుబండలా? వాళ్ళతో వీళ్ళతో ఆడిపోసుకుంటూ కూర్చుంటాడు."

వా.

## చదువు లొట్టల కొట్టిగించు

చదువు నశించిపోవు.

"వంచనామతిఁ బ్రాడ్వివాకులై వటువు లొట్టలు కొట్టిగించిరి చదువు లెల్ల."

మను. 3.129.

## చదువు సంత

చదువుసంధ్యలు.

జం.

"చదువు సంత సాగించి నడపించుచు నిజానుజు దుర్వ్యసనంబువలన గాసిం బొందని రాజానుగ్రహలబ్ధంబు లగు ననేకభోగగ్రామంబులు..."

పాండు. 3.24.

## చదువుసంధ్యలు

చదువుసాములు. జం.

"పాడము నీమొదలియూడ్పుల నేర్పులన కదా, చదువు సంధ్యలు గల్గి జగము మనుట."

పాండు. 2.55.

చూ. చదువుసంతలు.

**చదువుసాములు**

చదువుసంతలు.

జం.

"పురిఁ బాలుతురు చదువుసాముల."

విజయ. 1.69.

**చద్దికి వేడికి వచ్చు**

పొద్దునా మధ్యాహ్నమూ వచ్చు.

చద్ది తినే ప్రొద్దు ఉదయము.

వేడి అన్నం తినే ప్రొద్దు మధ్యాహ్నము.

"చద్దికి వేఁడికి వచ్చి సనకాదులు పాడేరు." తాళ్ల. సం. 11.3 భా. 99.

**చద్ది అన్నము**

చద్దిబువ్వ.

**చద్ది బువ్వ**

చద్దన్నము.

**చద్దిమూట యగు**

అనుభవింపక తప్పని దగు.

అవసరమునకు పనికి వచ్చు.

"బద్దసే పెక్కుగాలము ఊనిన పురాకృతము, చద్దిమూటై యనుభవించఁగఁజేసే మానదు." తాళ్ల. సం. 8.216.

**చద్ది వడు**

ఆలస్యమై మూల పడు.

"ఏ పనైనా వేడిమీదే అయిపోవాలి. చద్దివడితే ఇక సాగదు." వా.

**చద్దివలపు బేరము**

వేడి తగ్గిపోయిన ప్రేమ.

తాళ్ల. సం. 12.145.

**చన విచ్చు**

1. ప్రేమతో గూడిన స్వేచ్ఛ నిచ్చు.

"చన విచ్చి పుచ్చుకొన్నను, మన వచ్చునె యింక నేటి మాటలు చెలియా!" పారి. 1.97.

"ఇది సరికాదని అతనితో చెప్పగలను. ఈ మాత్రం నాకు చనువు ఇచ్చాడు." వా.

2. అలుసిచ్చు.

"పిల్లలకు చను విస్తే నెత్తి కెక్కి కూర్చుంటారు." వా.

**చనవు చెల్లించు**

ప్రియ మొనగూర్చు.

"......మా యెడఁ జనవు చెల్లించి, త్రోచిపోవక యున్న తోయమాత్రంబు."

వర. రా. బా. పు. 161. పంక్తి. 9.

**చనవు చెల్లు**

ప్రేమతోడి స్వాతంత్ర్యము సాగు.

"ననుఁ బిలిపింప వైతి తగునా చన వింతకు నాకుఁ జెల్లదే."

ఉ. హరి. 1.69.

ఈ పద్యంలోని అర్థంలోనే వాడుకలో – 'ఆ మాత్రం చనువు నాకు లేదా?' 'నా విషయంలో ఆ మాత్రం చనువు చూపవద్దా?' అంటారు.

**చనవు తీరు**

కోరిక తీరు.

"సమర మొనరించి వచ్చి నీ చనవు దీర్తు."
జైమి. 4.117.

**చనవు లిచ్చు**

చన విచ్చు.

"దేవకీదేవి మన్నించు నీవు నాకుఁ, జనవు లిచ్చుటఁజేసి." పారి. 1.130.

చూ. చన విచ్చు.

**చన వెఱిఁగి**

సమయ మెఱిఁగి.

"చన వెఱిఁగి నడవ వలయును, వినయోచితవృత్తిసంధివిగ్రహాయానా, సన సంశ్రయణద్వైధులు." కుమా. 10.182.

**చనుగప్పు**

పైట.

**చనుగొయ్య**

బండి చట్రానికి ఇరువేపులా నాటే కొయ్య.

కుమా. 4.83.

**చనుదెంచు**

వచ్చు.

(చను=పోవు, తెంచు = వచ్చు.)

**చనుబాలు**

స్తన్యము.

**చను మనుచు త్రోయ విస్తరి చినిగెడు నన్నట్లు**

అసలే అన్నము పెట్టం పో పొమ్మంటే విస్తరి చినిగి పోతుంది జాగ్రత్త అన్నట్లు.

"చను మనుచుఁ ద్రోయ విస్తరి, చినిఁగెడు నన్నట్లు వలపు చెడ్డది సుమ్మా!" శుక. 2.476.

'ఎంటే రావద్దంటే ఎత్తుకో మన్నట్లు'—అన్నది దీనికి దగ్గఱగా ఉన్న నేటి సామెత.

**చనుమఱి**

స్తనం చుట్టూ పైన ఉండే నల్లని చోటు.

నిష్ఠీవలము.

**చనుమానము**

చనవు.

"చనుమా చనుమానముతోడ నావుడున్."

సారం. 2.63.

**చనుముక్కు**

స్తనాంచుకము.

"ఇఁకఁ జూడఁ గప్పితి నిదె యంచుఁ జనుముక్కు, సతిఁడు పాణుల నంట నలఁగి యలఁగి."

కళా. 7.165.

**చనుమొన**

చనుముక్కు.

**చనుమోము**

చను మొన.

**చనువాడు**

మాట చెల్లుబడి గలవాడు.

"కడుఁ జనువాఁడు నై పురుషకారుఁడు దక్షుఁడు నైనమంత్రి."

భార. సభా. 1.31.

**చన్న మన్నవారు**

అందఱూ అనుట.

చనినవారు మనినవారు.

"ఎన్నఁగ సంసారధర్మ మిది వో
పొత్తును చూప, చన్నమున్నవారి కెల్లా
సాధనము గాదు."

తాళ్ల. సం. 8.205.

చన్నవారు

గతించినవారు.

"వారక మును చన్నవారిలో."

గా. హరి. ప్రథ. పం. 115.

చన్నవియు

ఆవులు మొదలయినవాని
చన్నులు చేపు.

"ధేనువులు చన్నవిసి పిండు."

శకుం. 1.13.

చన్నిడు

తల్లి పాలిచ్చు.

"విలపించు బిడ్డలకు నొయ్యనఁ జన్నిడి
నిద్ర పుచ్చఁ బోఁగా వలెనో..."

హంస. 4.150.

చన్నిచ్చు

తల్లి పాలిచ్చు.

"కడుపు నిండఁగఁ జన్నిచ్చి."

హరి. పూ. 5.156.

చన్నా చంకా ఉన్న ఆడది

కాస్త ఆకారం కలస్త్రీమాత్రు
రాలు.

"వాడికి కాస్త చన్నా చంకా ఉన్న
ఆడదైతే చాలు. వెంట బడతాడు."

వా.

చపచపగా

ఊరకే.

చపచప చేయు

సఫా చేయు, చంపు.

"కపులను దెచ్చి లెక్కఁగ నెంచి
మమ్ముఁ జపచపఁ జేసి."

వర. రా. యు. పు. 30. పం. 2.

చపచప నగు

వ్యర్థ మగు.

"పలా, శిపతుల ముక్కులుం జెవులుఁ
జక్కఁగ జెక్కఁగ వచ్చి యుండఁగాఁ,
జప జప నైన తద్వ్యథవిచారవిశేషముతోఁ
గకుత్స్థుఁడున్." కళా. 5.162.

చప్పట లగు

అణగు.

"ఒదవెడు జవ్వనంబు వెలి కొత్తఁగఁ
బయ్యెద సిగ్గుఁ గూడి చిట్టదుముఁగ లేఁత
లౌట దిగనీకను మీఱను లేక పక్షపుం,
జనువునఁ బ్రక్కల న్మొఱసి చప్పట లై
మఱి లావుఁ గూడఁ బైఁ, బొదలె
ననంగ..." ఆము. 5.21.

చప్పట లిడు

చప్పట్లు కొట్టు.

"సరసంబు లాడుచుఁ జప్పట లిడుచు."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 440.

కరతాళ ధ్వనులు చేయు
టగా నేడు అలవాటు.

"అధ్యక్షుని ఉపన్యాసం ముగియగానే
సభ్యులు కరతాళధ్వనులు చేసిరి."

వా.

రూ. చప్పట్లు కొట్టు.

చప్పట్లు వెట్టు

చప్పట్లు కొట్టు, చప్పట్లు
చఱచు, కరతాళధ్వనులు
చేయు.

"చిందులు వాడుచుఁ జెలఁగి యాడు
చును, జప్పట్లు వెట్టుచు."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 304.

**చప్పని**
నిస్సారమైన.
సుమతి. 108.

**చప్పరమంచము**
పందిరిమంచము.
శ. ర.

**చప్పరించు**
1. నోటితో చప్పరించు– తిను, ఆస్వాదించు.
2. ఆ ఁ ఏమిటి లే అని నిర్లక్ష్యత కనబఱచు.
"జపతపంబులు తలఁచినఁ జప్పరించు."
మహిమ. 3.3.
"వాని కెంత గొప్పవిశేషం చెప్పినా చప్పరించి వేస్తాడు." వా.

**చప్పలించు**
చప్పరించు.

**చప్పి చప్పి**
చప్పరించి చప్పరించి.
"చప్పి నంగేఁడువుల్ చప్పి చప్పి."
కా. మా. 4.137.

**చప్పిడి**
ఉప్పు లేని, కారం లేని.
"చప్పిడి పథ్యంతో ఈ మందు తినాలి." వా.

**చప్పిడిముక్కు**
అణగిపోయిన ముక్కు.

**చబుకు సేయు**
కొరడాతో కొట్టు.
"సైంధవంబుల ధే యని చబుకు సేయు."
జైమి. 6.53.

**చమడా లూడగొట్టు**
చర్మం ఒలిచి వేయు.
తిట్టుగానే అలవాటు.
"ఇంకోసారి ఆమాట అన్నావంటే చమడా లూడగొడతాను." వా.
చూ. చమడా లెక్కగొట్టు.

**చమడా లెక్కగొట్టు**
చూ. చమడా లూడగొట్టు.

**చమురుకాళ్ల పెద్దమ్మ**
దురదృష్టసంకేతము, చేతకాని వాడు, సోమరి.
"ఆ చమురుకాళ్ల పెద్దమ్మను పట్టుకొని ఏం చేస్తాము?" వా.

**చమురు చల్లిన మంటలకైవడి**
విజృంభించి.
మంటలలో నూనె పోస్తే మరింత మండుతుంది.
"చమురు చల్లిన మంటల కైవడిఁ, బ్రజ్వరిల్లి తాల్చినవచువున."
ఉ. హరి. 3.71.

**చమురు దీసిన దివ్వె**
ఆరిపోవునది, చంచలము.
చమురుంటేనే దీపం వెలుగుతుంది కదా.
"చమురు దీసినదివ్వె సంసారము."
తాళ్ల. సం. 11. 3. భా. 71.

**చమ్మెట వ్రేయు**
సమ్మెటతో కొట్టు.
"ఈ, వీరులు నిన్నుఁ జమ్మెటచే వ్రేయుదు రాయుదుఁ బోర కౌరికిన్."
ఉ. హరి. 4.206.

**చరచర**

ధ్వన్యనుకరణము.

"చరచర పోతున్నాడు." వా.

**చరలాడు**

ఆటలాడు.

**చర్మం తీసి చెప్పులు కుట్టించు**

అతి కృతజ్ఞతను చూపు.

"మీ రీకార్యం సహాయం చేశా రంటే నా చర్మం తీసి చెప్పులు కుట్టించి యిస్తాను." వా.

**చర్లాట మాడు**

ఆడుకొను.

భార. శాంతి. 3.245.

**చఱపు పిడక**

గోడకు తట్టిన పిడక – నుగ్గు.

**చలచల కారు**

బాగా కారు.

ధ్వన్యనుకరణము.

**చలచల నగు**

ప్రవహాస నగు.

"చలచల నై పిదపిద నై, కలలం బై కరుడు గట్టి." భాగ. 7.493.

**చలపకారి**

పట్టుదల మనిషి.

కాశీ. 6.9.

**చలపట్టు**

పగ పూను.

"చలపట్టి బొంకింపఁ జాలక యున్న."
గౌ. హరి. ప్రథ. పం. 294.

"నీకు నై చలపట్టి నిర్వహించితిని."
వర. రా. అయో. పు. 582. పంక్తి. 24.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 517.

'ఆ పాము చలం పట్టింది' అని వాడుకలోనూ వినవస్తుంది.

**చలపాదము**

గర్వము.

"చదివితి ననియెడి చలపాద మింతే కాని, అదన నందులోని యర్థ మెఱుఁగ." తాళ్ల. సం. 7.217.

**చలపొడుచు**

చలపట్టు.

దుష్ట నుగు అని వావిళ్ల ని. సరి అనిపించదు.

"చలపొడిచి ఱంకె లిడుచును, బలుమఱు మంగాళ్లఁ ద్రవ్వి." నీలా. 2.56.

**చలపోరు**

చలపట్టు.

"ఈ కుముదబాంధవుఁడు చలపోరి గలిచె." తాళ్ల. 3.36.

"వారుసాములఁ జలపోరి పోరువేళ."
రాధి. 1.113.

**చలముకొను**

చలపట్టు; పట్టు పట్టు.

"చలముకొని యొరుల నుడుపుట, బలియుం డై తెంపు సేసి."
భార. భీష్మ. 1.102.

**చలము గొను**

పగ పూను.

కాశీ. 6.172.

**చలాచలి**

కలత.

"ద్రావనవుఁ డొకఁ డేగుదెంచె సవనంబున భాగము లాహరింప నన్న విని చలాచలిఁ విబుధనాథులు దక్షుని తోడఁ జెప్పినన్." వరాహ. 5,111.

"డోలీ చప్పుడు చేఁగఁ దుప్పులు చలా చలి బొందఁగ దాడివెట్టి."
వరాహ. 11.60.

చలికప్పడము
దుప్పటి.
హంస. 5.356.

చలికాల దన్ను
రక్షించు, కాపాడు.
ఏవిధంగా చూచైనా సరే—ఏ విధమైన పనులు చెప్పైనా సరే – ఏ విధంగా దండించైనా సరే రక్షించు అనుట.
"చల్లి మదీయ మైత్రి వ, ర్తిల్లెడు నీచుట్టు పట్టు గృహవనముఖ్యం, బెల్లను మీ సొమ్మేక మమఁ, జల్లఁగఁ జలి గాలఁ దన్ని సాకం డనియెన్."
కళా. 6.138.
చూ. చలికాల ద్రోయు.

చలికాల ద్రోయు
రక్షించు.
"కావరే దీవన బ్రోవరే తప్పు, ద్రోవరే చలిగాలఁ ద్రోవరే యింక." బసవ. 7.
"చలికాలఁ ద్రోచి విడువుము, చెలి మిక్కిలి మనసు పేద శీతలపాచా!"
విజ. 3.50.
చూ. చలికాల దన్ను.

చలికి జడిసి కుంప లెత్తుకొను
చిన్న బాధ తొలగించుకొనుటకై మఱింత పెద్ద బాధను నెత్తిన వేసికొను.
కాశీ. శత. 80.

చలికూటిపై నిడిన వెన్నవలె కరగకుండా.
వేడి అన్నంలో వెన్న వేస్తే కరుగుతుంది. రుచిగానూ ఉంటుంది.
"...మోహము నెమ్మనంబునన్, దవిలిపు డెంత లెమ్మనుచుఁ దా బలిమాలి నయం గరుంగఁ డీ, భువిఁ జలికూటిపై నిడినఁ బోఁ దఱరా రెడు వెన్న కైవడిన్."
రాజశే. వి. 3.180.

చలికూడు
చద్దన్నము.
కుక్కు. 16.

చలిగరువు
లోపల ఇసుక, గులకరాళ్ళు ఉన్న నల్లమట్టి నేల.
బ్రౌన్.

చలి గొట్టు
చల్లని యీదురుగాలి వీచు; అందువలన చలి వేయు.
"కోపము చెడ్డ యొట్టు చలి గొట్టినచో కవనంబు కల్ల..."
హంస. 4.41.
చూ. చలి వేయు, చలి పెట్టు.

చలిచీమ నైనను చంపుటకు శంకించు
ఎవరికీ ఏ అపకారం చేయకుండు.
ఏ మాత్రమూ ఇతరులకు బాధ కల్పింపనివానిపట్ల ఉపయోగించే పలుకుబడి.
"చలిచీమ నేనియుఁ జాఁ ద్రొక్క శంకించుఁ, బలుకఁ డెన్నఁడు మృషాభాషణములు."
పాండు. 2.6.

**చలిదిమూట**

ఎప్పుడు పడితే అప్పుడు ఉపయోగింప వీ లయినది.

"నువ్వు చేసిన పుణ్యం నీకు చలిది మూటగా పనికి వస్తుంది." వా.

దీనినే రాయలసీమలో సద్ది మూట అని ఉపయోగిస్తారు.

**చలి దీఱు**

సంకోచము తొలగిపోవు.

సామాన్యంగా చల్ల నీళ్లలో స్నానం చేయడానికి దిగినప్పుడు మొదటిసారి చాలా చలిగా ఉంటుంది. ఒక్క మునకతో ఆ చలి తీరిపోతుంది. ఆ తరవాత యింకెన్ని సార్లు మునిగినా చలి ఉండదు. దీనిపై వచ్చిన పలుకుబడి.

"ఇవ్విధంబునఁ జలి దీఱి యింటిపనులు,
నూఱు నటు వెట్టి వల్లభు నోరు గొట్టి."
శుక. 3.350.

చూ. చలి విడుచు.

**చలిపండ్లు పడు**

చల్లనివస్తువులో, పుల్లనివో తిన్నప్పుడు పండ్లు పులిసిపోవు.

"ఇలఁ బడ వానిఁ దిన్నయపుడే చలి పండ్లు వడంగ నేటికిన్."
ఆము. 4.116.

**చలిపందిరి**

ప్రప; నీళ్ళిచ్చుటకై బాటలలో అక్కడక్కడా పందిరి వేసి అందులో శానలలో నీ రుంచి ఎవరో ఒక రండి బాటసారులకిస్తుంటారు. వీనినే సంస్కృతంలో ప్రపలు అంటారు. వాడుకలో చలివెందర.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 352.

చూ. చలివెందర; చలిపందిలి.

**చలిపందిలి పెట్టు**

ఉపకారము చేయు.

"ఇదియ పదివే లింకన్, జలిపందిలి వెట్టుట కద, వల బో మొత్తమియె మాకు వనజారాతీ!"
ప్రభా. 4.152.

**చలిపట్టు**

చలివేయు.

"వలపుచెమ్మట లింకఁ జలిపట్టు నందురు,
చలువగొజ్జఁగినీట జవర రమ్మ."
రాధికా. 2.7.

**చలిపనులు**

శీతలోపచారము.

"చలిపనుల్ గావింపఁజాలి మానుట లేక."
యయా. 5.77.

**చలిపిడుగు**

మంట లేని పిడుగు. వజ్రాయుధం.

"చలిపిడుగునుబోలె శాపంబు దాఁకి."
రంగ. రా. యు. 398. పుట.

**చలిబిండి**

1. చలిమిడి.
2. ఒకచెట్టు.

**చలిమంట**

చలి తగ్గుటకై పుల్లలతో వేసిన మంట.

**చలిమందు**

శీతలోపచారము.

"నాకీ చలిమందు లేమిటికి?" కావ్యా. 2.79.

**చలిమిడిముద్దవలె**

గుండుగా, నున్నగా, నల్లగా—చమురు కారుతూ.

"ఈ పిల్ల యెక్కడ దొరికింది రా నీకు? చలిమిడి ముద్దలాగా ఉంది. అందమా చందమా?" వా.

**చలిమిరి**

ఈమిరి, చల్లగాలి, ఈగు గాలి.

"మలయానిలుం డింత చలిమిరితోఁ గ్రాలి, నడపాదునోజ యొన్నండో పడసె..." కుమా. 5.121.

**చలివంద్రి**

చూ. చలివెందర.

**చలి వాపు**

సిగ్గు సంకోచములను తొలగించు.

"చలి వాపి ఆపె నిడ సరిబేసు లాడుకొంటూ, కలిసితి విటు నన్ను కాదా మరి." తాళ్ల. సం. 3.620.

**చలివిందల**

చూ. చలివెందర.

**చలి విడుచు**

జంకు తీరు,

"చలి విడిచి నాఁడునాఁటికి జగమోలుంగ." నిరంకు. 2.17.

చూ. చలి దీఱు.

**చలివెందర**

బాటసారులకోసమై అక్కడక్కడా దారిలో దాహం తీసికొని విశ్రమించుటకై యేర్పరిచిన పందిరి. దీనికే సంస్కృతంలో 'ప్రప' అని పేరు. రాయలసీమలో దీనినే 'చలివెందర' అంటారు. చలిపందిరి అని కూడా కొందరంటారు.

"చలివెందరలు పెట్టి యధ్వనీనుల దప్పి యూర్చి..." కాశీ. 4.66.

చూ. చలిపందిరి.

**చలివెంద్ర**

చలిపందిలి.

"చల్లఁగా నీడ గ్రు చలివెంద్రవోలె." గౌర. హరి. ఉత్త. 1774.

**చలివేందల**

చలిపందిరి.

బ్రౌన్.

**చలివేంద్ర**

చలిపందిరి. బ్రౌన్.

**చలువగుట్టము**

గాజిద.

సాంబ. నిఘం.

**చలువ చేయు**

గుడ్డలు చౌడు వేసి ఉడికించి ఉదుకు,

"బట్టలు చలువ చేసి తీసుక రారా."
వా.

చలువజోడు

చలవద్దాల కళ్లజోడు.

చలువ దీర్చు

చలువ చేయు.

"చలువ దీర్చిన సన్న వలిపె దోవతి మీఁద." నిరంకు. 2.74.

చూ. చలువ చేయు.

చలువపట్టు

చలువ చేయు, ఉతుకు.

"చల్లడ మామీఁదఁ జలువపట్టిన దట్టి, దలిమంపు దుప్పటి దానిమీఁద." నిరం. 2.20.

2. చల్లనితావు.

"చలువపట్టు విడిసె సాఁ తెల్ల ననుచు." పండిత. పర్వ. 290.

చలువమందు

శైత్యోపచారం.

"నయ మొకించుక యైనఁ గానంగ రాదు, చలువమందుల శైత్యంబు సంభ విలక." శృం. శకుం. 3.44.

చలువమజ్జిగ

నిమ్మరసం పిండిన నీటిమజ్జిగ.

చలువ మిరియాలు

ఒకరక మైన మిరియాలు.

చలువలు చేయు

శీతలోపచారములు చేయు.

"విభ్రాంత యై యున్న హేమాబ్జ నాయికాకాంత చెంత జేరి యాచెలు వలు చలువలు జేసి రట యెటువలెను." హేమా. పు. 40.

చల్లకు వచ్చి ముంత దాచ నేల

అడగడానికై వచ్చి బిడియ పడడం ఎందుకు అనేపట్ల ఉపయోగించే పలుకుబడి.

"తెలియఁగ జెప్పు మింక భవదీయ సమాగమనప్రసంగముల్, జలజ దళాక్షి! యేమిటికిఁ జల్లకు వచ్చియు ముంత దాచఁగన్." విక్ర. 7.38.

"సమయ మై యున్నది చల్లకు వచ్చి, ముంత దాఁపఁగ నేల మోమోట మునకు." సారం. ద్వి. 1.56.

చల్లగా గను

కన్నులు చల్లపడగా చూచు.

అనగా చూచుటలో కన్నులు చల్లబడిన వనుట.

"నేఁటి కీపాటి నీవు నాత్రాటిమహిమ, నింటి కేతేరఁ జల్లఁగాఁ గంటి నింక." శుక. 2.84.

చల్లగా నుండుము

సుఖ సౌభాగ్యాలతో వర్ధిల్లుము.

నేటికీ వాడుకలో-వెయ్యేండ్లు చల్లగా ఉండు తల్లీ! అంటారు.

"నామాటఁ జూడర నా బంగా రయ్యా నీవు చల్లఁగా నుండు మింకన్." శుక. 2.71.

చల్లచప్పుడు

పట్టిమాటలు తప్ప చేతలు లేనివాడు.

"ముందఱి చల్లచప్పుడు గోడచేర్పు,
చండిపో తనునట్టి జాడ నున్నాఁడు."
గౌ. హరి. ద్వితీ. పంక్తి 1497.98.

**చల్లజంపులు**

చల్లగా గొంతు కోసేవారు.
క్రూరు లనుట.
తడిగుడ్డతో కుత్తుక కోసే
వాడు అనుటవంటిది.

"చల్లఁజంపులు జోగి జంగమంబులు."
హర. 2.52.

**చల్ల జేయు**

చల్లార్చు.

"దక్షకన్యామనోజసంతాపభరము, నె
య్యమునఁ జల్లఁ జేయుచు పన్నీటి
కొలఁకు."
కవిరా. 2.3.

2. మనసున కూరట
కల్పించు.

"పద్మాయతాక్షి నీ పలుకులు చాలవే,
సరసుల హృదయంబుఁ జల్లఁ జేయు."
మల్హా. 2.75.

**చల్ల నారు**

చల్లారు.

"పక్వాన్నములు శాకపాకాదికంబులు,
చల్లనారినయేని జవులు దప్పు."
కాశీ. 4.105.

**చల్లనికడుపు**

సంతానవతి యనుట.

"ఘనుశీల! చల్లని కడుపుదానవు
నీవు."
శుకస. 1.5.

"ఆమెది చాలా చల్లని కడుపు. కొడు
కులూ, బిడ్డలూ, మనమలూ, మనమ
రాండ్రూ కావలసినంతమంది." వా.

**చల్లనిచూపు చూచు**

ఆదరముతో చూచు, అను
గ్రహించు.

"ఎండ నుండఁగ నీడ యెదురు వచ్చుట
గదా, సుదతి చల్లనిచూపుఁ జూచె
నేని."
ఉషా. 3.49.

**చల్లనివేళ తలప దగు**

మంచివార్లైన అనుట.
మంచివారిని గూర్చి, మంచి
విషయాలను గూర్చి, చల్లని
ప్రొద్దున తలచుకొనవలె నను
టపై నేర్పడిన పలుకుబడి.
శ్రవ. 5.43.

**చల్లపడు (ప్రొద్దు)**

సాయంత్ర మగు.
చంద్రా. 5.39.

**చల్లపడు వేళ**

సాయంకాలం.

"కొంతవడి నిలిచి వారల, పంతంబులు
వినుచుఁ జల్లపడువేళ న, క్కాంతా
రమునం గల మృగ, సంతతి వధి
యించి."
వరాహ. 4.87.

**చల్ల పెట్టు**

నిరాదరము చేయు.
చల్లవడ జేయుట పరిగ్రహిం
పక వదలి వేయుటకు – నిరా
దరముగా చూచుటకు సూచ
కము.

"హృల్లీలభావంబు సల్ల పెట్టి."
పాండు. 2.11.

**చల్లబడు**

1. ఎండతీవ్రత తగ్గు.

"శాస్త్ర చల్లబడింతర్వాత బయలు దేరుదామని అనుకుంటున్నాను." వా.

2. చల్ల నగు.

"వాడి ఒళ్లంతా చల్లబడింది. శాస్త్రం చేడి ఎక్కిస్తే కానీ లాభం లేదు." వా.

## చల్లమ్మి చవకమ్మి

అమ్మి అర్చి.

ఏదో అవస్థపడి అనుట.

కుక్క. 32.

"పాపం ఆ యిల్లాలు మొగుడు పోయిన తర్వాత చల్లమ్మి చవకమ్మి పిల్లవాణ్ణి చదివిస్తూంది." వా.

## చల్లవడియము

ఒక రకమైన వడియము.

శ. ర.

## చల్ల పేయు

1. చల్లపరుచు; ఆనంద మిచ్చు.

"అందఱకు నన్నివగల నానంద మిచ్చి, చల్ల సేయఁగ నింటింటఁ జంద్రుఁ డగుచు." రాధికా. 1.55.

2. మజ్జిగ చిలుకు.

## చల్లు పోరాడు

1. వెదజల్లు.

"ముదము మీఱఁ జల్లుఁ బోరాడి చించి చీరెద." భాస్క. యుద్ధ. 14.82.

2. జలక్రీడ లాడు.

"వారిఁ జల్లు పోరాడిరి మోల లాడిరి లతాంగులు రాగరసైకమగ్నలై." రామా. 1.206.

## చల్లుపోరు

జలక్రీడ.

## చల్లు లాడు

చల్లుకొను; జలక్రీడ లాడు.

## చల్లు వలపు బేరము

మాటలతో మాత్రమే ఆగి పోవు ప్రేమ.

తాళ్ల. సం. 12.145.

## చల్లు వెదచల్లు

విత్తనాలు చల్లు.

"నైపుణిఁ జందనాద్రి గగనద్రుమ సార భవీచిఁ దామ్రపర్ణి పరిలబ్ధ మౌక్తికమణి ప్రకరంబులు దోఁచి దక్షిణా, శాప వనుండు సల్లు వెదజల్ల జనించెన కాక..." అను. 5.114.

## చల్లు వెదలాడు

వెదజల్లు; విత్తు.

"చాటు వైనవరములు చల్లు వెద లాడుచు."

తాళ్ల. సం. 11.2 భా. 69.

## చవి గొను

రుచి చూచు; అనుభవించు.

చూ. చవి చూచు.

## చవి గొన్న కూరలకు మేలుం గీడు కొనియాడు

తినిన కూడును గూర్చి చింతించుట వ్యర్థ మనుట.

"చాలుఁ జాలు నాఁడే చవిగొన్న కూర లకు, మేలుం గీడు గొనియాడ మీఁద మీఁదను." తాళ్ల. 3.33.

## చవి చదువులు

శృంగారవిద్యలు.

"చవిచదువులు గఱపుఁ గీరశాబంబుల కన్." కావ్యా. 1.106.

## చవి చూచు

రుచి చూచు.

"తవిలి ఖండింపుచుఁ బాఁ జవి చూచి,
చవి యున్న లెస్స మాంసము దోస్పఁ
బెట్టి." బస. 3.694.
"అక్క గుక్కఁ డించ యక్షాక్షి చవి
చూడు, మనుచు." రుక్మాం. 3.230.
"చక్కెర కెమ్మోవి చవి చూడ
నీయరా!" రాజగో. 1.109.
చూ. చవిగొను.

## చవితిచందురుడు

చూడ కూడనిది (వాడు.)
చవితినాడు చంద్రుణ్ణి చూడడం అపవాదహేతువు కనుక మనవారి దృష్టిలో అది నిషిద్ధము.
పాండు. 3.11.

## చవి దేల్చు

ఆనందమగ్నులను చేయు.
"సంగీతమాధురి చవి దేల్చు."
నిరంకు. 4.74.

## చవి మరగు

రుచి మరగు.
"చలి విడిచి జారశేఖరు, కలయిక చవి
మరగి తెరువు కాపెట్టుక..."
హంస. 2.110.
"లవణంబు చవి మరిగి మునుఁగకుండ."
శా. మా. 2.63.

## చవి యగు

1. తగు.
"నగినవారితో మారునగం బాడి యెవ్వరికి, జగడించే వారితోడ చవి గాదు గాని." తాళ్ల. సం. 3.156.
2. రుచి యగు.
"కాలెనో చవి గావో కమ్మ గావో నీకున్." శా. మా. 3.88.

"ఈ వలనిబంధులు మా చవి గావు."
పారి. 1.126.

## చవిలె పోవు

కృశించు.
బ్రౌన్.

## చవి సూపు

రుచి చూపు.
"సోరచి ఏకను జవి సూపఁగలను."
విప్ర. 3.19.

## చవుకగా నెంచు

చులకన చేయు.
"సజ్జనులు అందఱు నన్ను చవుకగా నెంచి, యవమానవాక్యంబు లాడుచునుండ."
వర. రా. అయో. పు. 337. పంక్తి. 3.

## చవుకట్లు

ముత్యాలు నాలుగు ఉంచి చేసిన చెవుల పోగులు.
"చెవుల కమ్మల పట్ల జవుకట్లు."
వైజ. 2.47.

## చవుకపడు

న్యూన మగు.

## చవుకపఱచు

కించపఱుచు.

## చవుక సేయు

న్యూనపఱచు.
"సరివారలలో చవుకఁ జేసి."
త్యాగయ్య.

## చవుకాడి గుదియ

నాలుగు ప్రక్కలు తీరిన యినుపదండము.
శ. ర.

చవుకాలి పీట

నాలుగుకాళ్ళ పీట

చవుల మరగు

రుచి మరుగు, రుచికి అలవాటుగు.

"పీటఁ గల కోడెకాండ్రెల్ల వింత రతులఁ, జవుల మరగించి భయము లజ్జయును దీర్ప."

శుక. 2.101.

చవు లిచ్చు

ఇష్టము కలిగించు.

"అలమేలుమంగ నీ వభినవరూపము, జలజాక్షు (క్షు) కన్నులకు చవు లిచ్చె నమ్మా."

తాళ్ల. సం. 3.658.

చవులు గొను

రుచి చూచు.

"మాంసఖండముల్ కర్పూరశకల సంచయమును జవులు గొనుచు."

రుక్మాం. 3.230.

చవు వంచ

అయిదు.

చవువీధి

చౌకు; శృంగాటకము.

చవ్వంచ

అయిదు.

శ. ర.

చాంగు బళా

భళిరే, సెబాసు.

"చాంగు బళా యనిన మంగళధ్వని నిండారి పాలు."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 191.

చాంగు రే

చాంగు బళా.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 246.

చాంద్రాయణము

ఒక వ్రతము.

చంద్రుని వృద్ధి క్షయాల ననుసరించి ఒక్కొక్క కబళం శుక్లపక్షంలో హెచ్చిస్తూ, కృష్ణపక్షంలో తగ్గిస్తూ తిను వ్రతము.

చా !

ఛీ ఛీ అని చీకొట్టుటలో అనుమాట.

ఛీ అన్నట్టే ఛా అనుటా వాడుకలో నేటికీ ఉన్నది. అయితే అది ఒత్తి పలుకుతారు.

"చా కాలు లే మని చదువుచున్నారు, మీ కొలఁదియె మమ్మ మీ తీపల్కంగ."

బస. 7.186.

"ఛా వెధవా! అవాచ్యాలు అంటా వెందుకు రా?" వా.

చాకచక్యము

నేర్పు.

"ఏం చాకచక్య మమ్మా దీనిది." వా.

చాకలిపిట్ట

భారద్వాజపక్షి

చాకలివానికి జలుబు

చాకలివానికి జలుబు చేసినా

చేయక పోయినా నీళ్ళలో ఉండాలి.
మొసలిపడిశము వంటిది.
చాకలివాడు ఎప్పుడూ నీళ్ల లోనే ఉంటాడనుట పై వచ్చిన పలుకుబడి.
కృష్ణనీ. 72.

**చాకిబాన**
చాకలి బట్టలుతికే బాన; ఒక పిల్లల ఆట.

**చాకిమూట**
చాకలివాని మైల బట్టల మూట.

**చాకిమణుగులు**
అస్థిరములు.
తాళ్ల. సం. 11.3 భా. 116.
చలువ చేసి మడత పెట్టిన వస్త్రాలు కాసేపటికి మడతలు చెరిగిపోయి మామూలు అయి తీరును కదా!

**చాకిరేవు పెట్టు**
ఒకరిలోపాలను ఎత్తిచూపు వారి గుట్టుమట్టులు కడిగి వేయు.

**చాగబడు**
సాగిలపడు, సాష్టాంగపడు.
"పుడమి నంతటఁ జాఁగఁ బడి మ్రొక్కి."
పండితా. ప్రథ. పురా. పుట. 802.

**చాగలి గొను**
చంపు.
"నాగ రథాశ్వ భటావలిం గదన్, జాఁగలి గొన్నఁ జక్కఁగ."
ఉత్త. హరి. 6.68.

**చాగి మ్రొక్కు**
సాష్టాంగ నమస్కార మొనర్చు.
పండితా. ప్రథ. పురా. పుట. 455.
చూ. చాగిలి మ్రొక్కు.

**చాగిల బడు**
సాష్టాంగపడు.

**చాగిలి మ్రొక్కు**
సాష్టాంగ నమస్కారం చేయు.
"సంతాపమునఁ జిక్కి చాఁగిలి మ్రొక్కి."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 102.
"వినయంబునఁ జాఁగిలి మ్రొక్కి యిట్లనున్."
జైమి. 4.81.
"యలఘువ్రతుఁడా బాలిక, కిలఁ జాగిలి మ్రొక్కి లేచి..."
కళా. 5.76.
చూ. చాగి మ్రొక్కు.

**చాగుబడికెలు**
సాష్టాంగనమస్కారాలు.
బ్రౌన్.

**చాచి కొట్టు**
చేతికొలది చెంపపెట్టు పెట్టు.
"చాచి కొట్టేసరికి చెంప బురబురా వాచి పోయింది." వా.

**చాచు**

చేయి చాచి అడుగు, అర్థించు.

దాశ. 96.

**చాట బంచు**

చాటింపు వేయించు.

"సకలజనులకుఁ బయనంబు చాటఁ బంచి." జైమి. 2.106.

**చాటభారతము**

అనంత మైన ప్రసంగము. తొలిరోజులలో పెద్దసైజులో భారతం వగైరాలు అచ్చు వేసేవారు. అవి చేటవలె పెద్దవి కనుక చేటభారతములు అని అలవాటయినవి. అవి పెద్దవి కూడా కనుక యెక్కువ అన్న అర్థంలో పలుకుబడి అయినది.

"నీ చాటభారత మంతయు వినుటకు నాకు దెఱపి లేదు. గాని ముచ్చి మూడు మాటలలోఁ జెప్పఁ గలిగితివా చెప్పుము." వా.

చింతా. 7. అం. 68. పు.

చాటుభారత మని మార్చి కొందఱు అర్థం చెప్పుట సరికా దనిపించును.

**చాటు చేయు**

మఱుగుపఱచు.

"చాటు చేసిన నేమి చక్రవాకులఁ బోలు, పాలిండ్ల మెఱుఁగులు బయలు పడియె." క్రీడా. 95.

**చాటుపడు**

మఱుగుపడు.

**చాటు మాటున**

చాటున.

"...అడంగెఁ జీఁకటుల్, గొందుల సందులన్ గుహల గుట్టలఁ బుట్టల చాటు మాటునన్." అని. 3.85.

**చాటు మాటు లేక**

గుట్టు గోప్యము లేక – బహిరంగంగా.

"చాటు మాటు లేక తేటతెల్లంబుగా, నబ్బోటితోఁ జాటం దొడంగె." చంద్రరేఖా. 2.8.

**చాటువడు**

మఱుగుపడు.

"తురగములు నీరుగొను నవసరము నేతెంచె మనము చాటువడుదము." జైమి. 29.

**చాడికత్తె**

చాడీలు చెప్పునది.

**చాడికాడు**

చాడీలు చెప్పువాడు.

**చాడి చెప్పు**

ఒకరిపై కొండెములు చెప్పు.

"చాడి చెప్పిన మనవిగా సంగ్రహించు." రాజగో. 3.17.

"వాడికి వాళ్లమీదా వీళ్లమీదా చాడీలు చెప్పడమే పని." వా.

చూ. చాడీకోరు.

**చాడీకోరు**

చాడీలు చెప్పువాడు.

చాడీగొట్టు

చాడీకోరు.

చాతుర్మాస్యము

ఒక వ్రతము.

నాలుగునెలలు చేసే యజ్ఞము; వ్రతము.

చానపి పట్లల్కు

పట్టెలు తీర్చి పేపనీళ్ళలో అలుకు.

"సరసర బసవయ్య సను దేహ మున్న, కర సుభిషేకంబు గావింతె మనుచుఁ, జానపి పట్లల్కు సద్భక్తి యుట్టు, గానక చాపల కాళ్లు గద్దుటయు."
బస. 7.204. పుట.

చాపకట్టుగ

కుప్పగా.

"చాపకట్టుగఁ గూలె సకలబలంబు."
పల. పు. 114.

"చాఁపకట్టుగఁ బడ్డ సైంధవములు."
జైమి. 2.78.

చాపకట్టుగా కూలు

కుప్ప గూలు.

"చాపకట్టు పడం గూలిన."
కాశీ. 6.227.

చాప కట్టు వడ గొట్టు

కుప్ప గూలునట్లు కొట్టు.

"మూకల గిట్టివడిన్ జాఁపకట్టు వడం గొట్టి."
జైమి. 2.31.

చాపకట్టు వడు

చాప వలె వరుసగా కింద పడిపోవు.

"తిరుగ వచ్చినం జూచ్చి చక్కడఁ చుటయుం జాఁపకట్టు వడిన ఘోట కంబుల క్రింద మిల మిల మెలంగెడు రావుతులును."
ఉ. హరి. 3.27.

చాపకింది నీరు

తెలియకనే ఆపద తెచ్చు నది.

మెల్లగా అంతటా అలము కొనునది.

చాపకింద నీళ్లు పోస్తే పైకి కనపించవు కానీ చల్లగా అంతటా అలుముకొనును.

"పాపము బుణ్యము పైపైఁ గూడు కొని, చాపకిందినీరు సంసారము."
తాళ్ల. సం. 8.105.

చాప చదరగు

నానాటికి సిగజారు.

చాప పెద్దది చినిగి చినిగి చద రగా మిగులు.

"చాప య్యె, చద రయి నిల్చి యిప్ప టికి..."
గీర. విక్ర. 38.

చాపచుట్టగ చుట్టు

చాపను చుట్టినట్లు చుట్టు.

"జగ మెల్లఁ జాపచుట్టుగఁ జుట్టి ఘన శక్తి, నెసఁగు హిరణ్యాక్షుఁ డేమి యయ్యె..."
కళా. 6.20.

చాపచుట్టగా

చదరముగా.

చాప పఱచిన ట్లనుట.

"...బడల్పడియె ననఁగఁ జాపచుట్టఁగఁ బడె నని తోఁచఁబడును."
ఆంధ్రభా. 3.104.

"ఆ గాలివానకు చెట్లన్నీ చాపచుట్టగా పడి పోయాయి."
వా.

చాపట్లు
పలచగా దోసెవలె చేసిన పిండివంట.
దోసెపిండి ముందురాత్రి రుబ్బి పులియ బెడతారు. చాపట్లకలా కాక అప్పుడే రుబ్బి ఉప్పూ కారం వేసి పోస్తారు. ఇవి నేటికీ రాయలసీమలో బాగా వాడుకలో ఉన్నవి.
చాపవలె చదరంగా పోయునవి కావున చాపట్లు అయినవి కావచ్చును.
(చాప + అట్లు.)

చాపట్లు వోయు
దోసెల వంటి వానిని పోయు, చేయు.
దోసెలను చాపట్టు అనడం నేటికీ రాయలసీమలో వినబడుతుంది.
పులియ బెట్టిన పిండితో కాక అప్పుడప్పుడే రుబ్బినపిండితో చేసిన వాటిని చాపట్టులు అంటారు.

"పాలిచె మాపటఁ బండువెన్నెల చకోర, పోతవితతికిఁ జాఁపట్లు వోసి నట్టు." ఆము. 2.60.

చాపన్నలు
చవటలు.
ఇంకా అర్థ మాలోచించవలసిన పదం.

"జినునికి గినునికిఁ జేతు లెత్తుదు నె, చాపన్నలార సాష్టాంగ మూర్తిఁ, జూపెద రండంచు లోపలి కేఁగి .." బస. 6.163.

చాపరువు వాఱు
చావుపరుగు తీయు.
చచ్చుటకు సిద్ధపడి తెగించి పరువెత్తు.

"అది యుక్కు-అఁ గాఁడి డుస్సి పాఱిన నఱిముఱిఁ జాపరువు వాఱి యల్లటు వడియెఁ." మను. 4.45.

"చావుపరువు లంకించుకొన్నాడు." వా.

రూ. చావుపరువు.

చాపి పుచ్చు
చాచి కొట్టు, చెంపపై చాపి కొట్టు.
వాడుకలో ఆత్మనేపదంగానే కానవస్తుంది.

"చేనుల్చి చాఁపి, పుచ్చుచు నటు ద్విజుఁ జొమ్మని త్రోవ." పండితా. ద్వితీ. మహి. పు. 126.

చూ. చాపి పుచ్చుకొను. రూ. చాచి పుచ్చుకొను.

చాపి పుచ్చుకొను
చాచి లెంపకాయ కొట్టు, చేతికొద్దీ కొట్టు.

"నాలుగు చాచి పుచ్చుకుంటే సరి. బుద్ధి వస్తుంది." వా.

చాపి కాక. చాచి అనే వాడుకలో ఎక్కువగా వినవస్తుంది.

చామర లిడు
ఛింజామరలతో వీచు,

"చామరల్ కవ లిడన్."
భార. శాంతి. 1.149.

చామనచాయ

కొద్ది నలుపు.

"నీలమేఘము డాలు డీలు సేయఁగఁ జాలు, మెఱుఁగుఁ జామనచాయ మేని తోడ." మను. 6.102.

"అంత మఱీ నలుపు కాదు. తెలుపూ కాదు. నీ కోడలు చామనచాయ లేవే పిన్నీ." వా.

చామరలు వెట్టు

వింజామరలతో వీచు.
కుమా. 9.21.

చాయ....

విధము, తీరు.

తండ్రి చాయ, తల్లిచాయ ఇత్యాదులలోని మాట. 'చాలు' అని ఇదే తల్లిచాలు ఇత్యాదులలో వినవస్తుంది.

"నిక్కమ్ముగఁ దండ్రిచాయ కల కన్యలు ధన్యలు గా వసుంధరన్." వసు. 3.113.

చాయగోసు

చిఱుతపులి.
హర. 7.38.

చాయకు వచ్చు

దారికి వచ్చు, మాట విను.

"రామునిచేఁ గాని రాక్షసు లితర, సామాన్యనృపులచేఁ జాయకు రారు." వర. రా. బా. పు. 76. పం. 18.

చాయల బల్కు

సైగలు చేయు.

"నాముగో! సురపొన్నలకు నీచాయఁ జాయలఁ బల్క నేటికి." పారి. 4.16.

చాయవాటులు

సైగలు మొదలైన అన్యాప దేశాలు.

"చాయవాటులు సన్నలు గాయక ములు." కాశీ. 4.39.

చాయవారు

నీలంగా తోచు.

ఛాయామాత్రరూపముగా తోచు.

"సందేహములు పెక్కు చాయవారె." శివ. 3.71.

"చాయ వాఱుటయు." నైష. 3.42.

దీనినే వాడుకలో నీడగా అని వాడుతారు.

"వాడి రూప మేదో నీడగా నాకు గుర్తు." వా.

చాయవెన్నెల

పండువెన్నెల.
పాండు. 1.15.

చారెడు బియ్యం

కొంచెం బియ్యం–చేరనిండా.

"బిచ్చగాడు అంతగా అరుస్తున్నాడు. ఓ. చారెడుబియ్యం వేసి పంపించు." వా.

దోసెడులో సగం చా (చే) రెడు.

చార్వాకము చేయు

పిడివాదము చేయు.

"దేవునితోడ నేల చార్వాక మొనర్చితిన్." శా. మా. 3.174.

చార్వాకుడు అంతవరకూ ఉన్న ఆధ్యాత్మిక వాదాన్ని

కా దని భౌతికవాదాన్ని నెల
కొల్పినవాడు. సహజంగా
అతని వాదం ఆస్తికుల
దృష్టిలో పిడివాదమే.

చాఅకంద
ఒక గడ్డ.

చాఅపప్పు
ప్రియాలపు పప్పు.

చాఅబియ్యము
వెదురు ఇత్యాదులలోని
బియ్యము.
చాఅపప్పు అని వావిళ్ళ ని.

చాఅమామిడి
చాఅకంద.
బ్రౌన్.

చాఅమీను
ఒక రకమైన చేప.

చాఅలమెకము
పెద్దపులి.

చాఅల వన్నె మెకము
పెద్దపులి.

చా లగు
విసుగుదల కలుగు.
అంతదాకా వచ్చిన దనుపట్ల
అనేమాట.
"అదవదఁ బొంద చా లయితి నక్కట." హరి. ఉ. 8.199.
"నాకు ఈ పిల్లలతో వేగ లేక చాల యింది." వా.
"ఈ సంసారం చా లయింది." వా.
ఇదే 'చా లయి పోయింది'
అని కూడా వినవస్తుంది.
"ఈ కష్టాలూ, బాధలూ, పిల్లలూ, ఈ దరిద్రం అబ్బా! చా లయి పోయింది. ఎక్కడో దేశంమీద పోదా మని ఉంది." వా.
చూ. చాలయి పోవు.

చాలయి పోవు
విసుగుదల కలుగు.
చూ. చా లగు.

చాలు
సమర్థు డగు. (ఏదైనా
చేయుటకు.)
"మీ మొగంబులు నాలుగు నీ మాడ్కి నుర్విళు లూరిన నేశాస్య నొకతె నేను జాలుదునే యిది చాలించెదరో మఱి యే మైనఁ గలదో..." కళా. 5.18.

చాలుకొను
వరుసగా ఏర్పడు.
"చాలుకొని యున్నవనమాలికలు." ముకుంద. 2.132.

చాలు చాలు!
చాల్బాలు.
ఇది నిరసనసూచకంగా నీ
మాట లిక కట్టిపెట్టు అన్న
అర్థంలో ఉపయోగిస్తారు.
"...నే నిటువంటి వెఱుంగఁ జాలు చాల్, దినమును రాజుఁ జేరఁ జనఁ దీరక నీ కథ వించు నుందునే." శుక. 2.226.
వాడుకలో 'చాలు చాలు
లే వయ్యా!...బలే పెద్దమని
షివి.' రూ. చాలు జాలు.

చాలు జాలు

ఇక కట్టిపెట్టు.

ఏదైనా అయిష్టంగా మాట్లాడుతున్నప్పుడు వారి నిక కట్టిపెట్టు అన్నట్లు అనుకునే వాడుక మాట.

"వల్లవీ, కింకర! చాలుఁ జాలు బలికిం పకు నింపకు లేనికూరుముల్." సారి. 1.126.

"చాలు చాలు. నోరు ముయ్యి." వా.

"చాలు లేవయ్యా. మహా చెప్పొచ్చావు." వా.

రూ. చాలు చాలు.

చాలు పట్టు

దున్ను.

చాళ్లు దున్నుటనుబట్టి వచ్చిన పలుకుబడి.

"వైరిభుజాంతరాళజాం, గళమహీఁ జాలు పట్టి." పాండు. 2.59.

రూ. చాలు పట్టు.

చాలు! పదివేలు వచ్చె!

ఇంతవఱకే చాలు. ఇదే పదివేలు.

"బాగాయె నీకెఁ జాలుఁ బదివేలు వచ్చె." సారం. ద్వి. 1.621.

"చాలుఁ బదివేలు వచ్చెఁ బాంచాలి దొరకె,నట్టె కద..." పాంచా. 2. ఆ.

"నీవు వచ్చిందే పదివేలు నాయనా— ఏం తెస్తే నేం తేకపోతే నేం ?" వా.

చాలుబడి

శక్తి.

శ. ర.

చాలుమానిసి

1. సమర్థుడు.

భార. విరా. 4.221.

2. ముఖ్యుడు.

దశా. 7.1.225.

చాలువాడు

సమర్థుడు.

"ఇప్పటిఁ గొక చాలువాని బలు తీర్పనఁ గాక పోసంగ నేర్చునే?" భార. ఉద్యో. 4.143.

చాలువాఱు

చాళ్ళు కట్టు; సమృద్ధి చెందు.

"మొలచి తల లెత్తి నిక్కుచు, సలలితగతిఁ జాలువాఱె సస్యము లధిపా!" భాగ 10. పూ. 755.

చాలూ మూలా

పేరూ, తెన్నూ. జం.

"దానికి దాని చాలూ మూలా తెలియదు." వా.

"వాని ఉపన్యాసానికి చాలూ మూలా లేదు." వా.

చాలెడువాడు

సమర్థుడు.

హరి. పూ. 9.157.

చాల్పడు

చాళ్ళుగా పడు; చాపకట్టుగా పడు.

భార. ఆది. 6.207.

రూ. చాల్వడు.

చావక నోవక

ఏమాత్రం కష్టపడక.

"ఉన్నటు లుండఁగానె సిరు లూరక చావక నోవ కబ్బునే?" అము. 3.57.

చావగొట్టి చెవులు మూయు

బాగా శాస్తి చేయు అను పట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఆ ఊళ్లో వెళ్లి వాడిమీద ఏమన్నా అన్నావంటే చావగొట్టి చెవులు మూసి పంపిస్తారు. జాగ్రత్త." వా.

చావ గొట్టు

చిదుక గొట్టు.

"సకలదనుజులను జావంగఁ గొట్టు."
మైరా. పు. 19.

చావ జూచు

చంపు.

"నిను ధార్తరాష్ట్రి లాండె, నీవు వారల నొండెను జావఁ జూడ, వలయు టప్పు డెఱుంగవే."
భార. శాంతి. 1.120.

చావడిమాటలు

బజారుమాటలు. బ్రౌన్.

చావు

దురవస్థ.

"చాకలి మంగలిం దనుపుచావునకున్ దుది కల్గఁ జేయుచున్."
పాణి. 2.13.

"పీడితో వేగలేక చావు వచ్చింది."
వా.

చూ. చావు వచ్చు.

చావుగా ఉండు

అతి కష్టంగా ఉండు.

"ఈ యింట్లో నీళ్లు సరిగా రాక చావుగా ఉంది." వా.

చావుతల

అవసానసమయం.

"చావుతల నైన నించుక సత్యవాక్య, మ్ముగ్గడింపర."
భోజ. 5.315

చావుతెలివి

అంతా అయిపోయిన తర్వాత కలిగే పరిజ్ఞానము.

చనిపోయేముందు అంతదాకా స్మారకం తప్పి ఉన్నా తెలివి వస్తుం దనుటపై యేర్పడిన పలుకుబడి.

"ఈ చావుతెలివితో ఏం లాభం? మొదటే ఆ పరిజ్ఞానం ఉండవలసింది."
వా.

చావు దప్పి కన్ను లొట్టపోయినట్లు

ఎక్కువ నష్టం కావలసి ఉండగా ఏదో కొద్దినష్టంతో బయటపడినపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఆ కంపెనీ దివాలా తీయడంతో డబ్బంతా పోయినా జైలు తప్పింది. చావు దప్పి కన్ను లొట్టపోయి అతను బయట పడ్డాడు." వా.

చావునకు తప్పితివి పొమ్మా!

బతికి పోయావు పో!

"పుష్కర సరోవరంబునను రమ్మా, చావునకుం దప్పితివి పొమ్మనుటయుం గనలి కలకల నవ్వి."
ఉ. హరి. 4.211.

చావుపిట్ట

తీతువుపక్షి, సీతవ.

బ్రౌన్.

చావుబిడ్డ
కడుపులోనే చచ్చి పుట్టిన బిడ్డ.
బ్రౌ.

చావుబ్రతుకులలో నుండు
1. మరణావస్థలో ఉండు.
"వాడు ఈరోజు చావుబ్రతుకులలో ఉన్నాడు." వా.
2. అతి క్లిష్టదశలో ఉండు.
"ఈ వ్యవహారం ఇప్పుడు చావు బతుకుల్లో ఉంది. అటో యిటో తేల్చుకోవాలి." వా.

చావు లేదు
ఢోకా లేదు.
తగ్గదు.
"ఒక్క—కతానకుఁ జావు లేదు." గిర. గురు. 22.

చావు వచ్చు
దుస్థితి వచ్చు.
అనాహూతత మేర్పడు.
"వచ్చెఁ జా వనుచు." బస. 6.164.
"అబ్బ! వీడితో చావు వచ్చింది." వా.
"ఏం చావు వచ్చిం దమ్మా! ఇప్పుడంతగా వగుస్తావు..." వా.
చూ. చావు.

చాళియం బిప్పించు
అలంకరింప బనుచు, సాలెలు వేయించుటకు నియమించు.
"పురం బఖిరమ్యముగను, సెల్లెడఁ జాళియం బిప్పించి రంగ,వల్లులు పెట్టించి."
పండితా. ద్వితీ. మహి. పుట. 179.

వందనాద్యుపచారము అని కొన్ని మార్కులతో.
వావిళ్ల ని.

చాళెములు ద్రిప్పు
గిరగిర త్రిప్పు.
ఒక విధమైన నాట్యములో ఎలా తిరుగుతూ గద త్రిప్పు.
"చలితాస్య క్రూర దంతక్షత రదరసనక్షిర కీలాల వేల్ల,జ్జ్వలన జ్వాలాభ జిహ్వాంచలుఁ డగుచు గదన్ జాళెముల్ ద్రిప్పుకొంచున్." మను. 4.95.

చింకలిక్క—
ఎట్టిమూతి కోతి.
శ. ర.

చింగులువాలుగా
చుంగులు వ్రేలు.
"బంగరు చెఱఁగు పట్టంచు దట్టి, చింగులు వాలంగఁ జెలువుగాఁ గట్టి." ద్విప. భళ్ళా. 2.

చించి చెండలు రేగు
చించి చెండాడు.
"చేల కావలివారిఁ జించి చెండలు రేఁగి." రుక్మాం. 3.10.

చించు
నశింపఁజేయు.
"చించెన్ గాళి వియోగదుఃఖము." భీమ. 2.65.
"తమముం జించుచున్." పాండు. 4.126.

చింతకాయకజ్జము
ఉపయోగించుకొన వీలు లేనిది.
తాళ్ల. సం. 7.34.

**చింతగుల్ల**

బెరడుతో ఉన్న చింతపండు.

**చింతచే సగ మగు**

విచారముతో చిక్కిపోవు.

"తెల్వి సగము మఱపు, సగము నయి చింతచే సగ మగుచు నరిగె, నవ్వరూధిని యంతికోద్యానమునకు." మను. 3.66.

"ఈమధ్య వాళ్ళ నాన్న పోయి వాడు చింతతో సగ మయ్యాడు పాపం!" వా.

**చింతనాగు**

ఒక రకమైన పాము. బ్రౌ.

**చింతనిప్పులు రాలు (కన్నులు)**

క్రోధారుణితము లగు.

"చింత నిప్పులు రాలు చిఱుతకన్నుల డాలు, దావకీలలకుఁ గైదండ లొసఁగ." రాజగో. 5.36.

చింత మొద్దులు కాల్చిన నిప్పులు చాల వేడిగానూ, నిలిచి మండునవిగానూ ఉండును. చంద్ర నిప్పుల వంటివే యివి.

**చింతపూవు**

ఒకరకమైన పిల్లల ఆట. భోజసుతా. 2.9.

**చింత యిడు**

ఆలోచన చేయు.

"సకలసురాసురసంఘంబు బుద్ధి, నొక చింత యిడి." వర. రా. బా. పు. 141. పం. 16.

**చింతల వంతల చివుకు**

చింతతో క్రుంగిపోవు.

"ఏ నమర్త్యనై, చింతల వంతలం జివికి సిగ్గటితిన్." మను. 3.8.

**చింత వంత బడు**

బాధపడు.

"దురంతకంతుకుం,తనిహతిఁ జింత వంతఁ బడి, తాంతలతాంతముచంద మొందె." శుక. 1.519.

**చింతాకంత**

కొంచెము.

"చింతాకంతయు వెన్కఁ దియ్యక." పాండు. 5.39.

"చింతా కంతయుఁ జింత నిల్పఁడు గదా." కాళ. శ. 3.

**చింతాకు**

ఒక పిల్లల ఆట, హంస. 4.136.

**చింతాకు ముడుగుతఱి**

సాయంకాలము.

"చింతాకు ముడుఁగుతఱిఁ ద,త్కాంతం గొని తెచ్చి మేరుకార్ముక గేహా..." శుక. 1.533.

**చింతించిన చింత**

ధ్యానించిన ధ్యానము.

"తిరముగ నినుఁ జింతించిన చింతే, నిరతము ముక్తికి నిధి గాదా." తాళ్ల. 1. సం. పు. 20.

**చిందగు**

పాడగు.

"సికతాసేతువు నిమ్నగారయముచేఁ జిందైనచందాన సాత్యకిచేతన్." ఉ. హరి. 4.127.

**చిందఱకొట్టు**

చెలరేగు.

"గోడలు వడసూఁకి కొమ్ముల నేలఁ, గ్రోడాడి తోఁకెత్తుకొని పంచితిలుచుఁ, గడిదిఁ జిందఱకొట్టి కడిమి క్రేళ్లుతికె..." అ. మ. క. 2.117. పు.

**చిందఱగొను**

1. చెలరేగు.

"ఆడపంగ వచ్చిన నదటునఁ జిందఱ, గొని యెట్టి బలియురఁ గానక కలియు." హరి. పూ. 6.126.

2. పాడగు, కలత చెందు.

"చప్పుడు నిండె నజాండము, సెప్పెడి దేమజాని చెవులు సిందఱ గొనియెన్." భాగ. 8.209.

**చిందఱ రేగు**

చెలరేగు, వెఱ్ఱి యెత్తు.

చిందఱ=చీదఱ.

"కటకటఁ బడి యాడు గఱచి హుమ్మనుచు, దటము దాఁటించి చిందఱ రేఁగినట్లు."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 1061-62.

**చిందఱ లాడు**

ఛిన్నాభిన్న మొనర్చు.

"మాపుతుల నిర్జితులఁ జేసెయుఁ, గుధరంబుల చిందఱ లాడెయు."

వరాహ. 2.29.

**చిందఱ వందఱ అగు**

ఛిన్నాభిన్నము అగు.

"రూపు చెడి తిరుగుడుపడి వాహినులు చిక్కువడి చిందఱ వందలై మతి చెడి మ్లానుడై యై."

ఉ. హరి. 1.148.

**చిందఱ వందఱ చేయు**

ఛిన్నాభిన్నము చేయు.

"స్యందనంబులఁ జిందఱ వందఱఁ జేసియు." జైమి. 3.101.

**చిందఱవందఱ లాడు**

ఛిన్నాభిన్న మొనర్చు.

భాస్క. యు. 847.

**చిందఱ వోవు**

కలగు; చెల్లాచెదురవు.

"చెవులు చిందఱ వోవఁ జెలఁగు కపీంద్రుల, పోరంటిమా శనివారపు జడి." కళా. 7.19.

**చిందాడు**

చిందులాడు.

"పెదవిమీఁదను లేనగ వంకరించి, చిందాడఁగ." హంస. 2.28.

**చిందిలి పడు**

కళవళపడు.

కాశీ. 2.159.

**చిందిలిపాటు**

కళవళపాటు.

**చిందిలి మందిలి యగు**

ఛిన్నాభిన్న మగు.

"నీ రీతిఁ బూని యీ క్రమము మేకొని చేసిన దివ్యరాజ్యల, క్ష్మీరమణీయ వైభవము చిందిలి మందిలి గాక తప్ప." నృసిం. 2.53.

**చిందుగొను**

చిందులాడు, నర్తిల్లు.

**చిందుతప్పెట**

చిందు త్రొక్కునప్పుడు ఒకానొక లయలో కొట్టే డప్పు.

**చిందు త్రొక్కు**

ఒక రకమైన నృత్యము చేయు.

చిందు అనునది ఒక రకమైన నృత్యం. తప్పెట కొడుతుండగా చిందు త్రొక్కడం నేటికీ ఉన్నది.

చూ. చిందులు పాడు.

**చిందుపరువు**

ఒకానొక పిల్లల ఆట.

**చిందులు పాడు**

చిందుపాటలు పాడు.

చిందువారనే ఒక తెగవారున్నారు. వారు చిందు త్రొక్కుతూ పాడే పాటలు. వారూ శైవులే. విశ్వబ్రాహ్మల నాశ్రయించి తిరుగుతుండే తెగ చిందువారు.

పండితా. ద్వితీ. పర్వ. పు. 304.

**చిందులు వాఱు**

చిందు త్రొక్కు.

**చిందు వందగు**

చిందర వందర యగు.

ధ్వన్యనుకరణము.

"కెందువడి డెందంబు గంది తాలిమి చిందువందై కెందలిరుపాన్పునం దను వొందక లేచి." మను. 3.28.

**చిందువందు చేయు**

పాడు చేయు; ఖర్చు చేయు.

"వడ్డి లెక్కలఁ జిందువందుఁ జేసి." నిరంకు. 2.116.

**చికమకల బెట్టు**

తికమకల బెట్టు.

"...యో, పికమాలి యెందుఁ గుందెనో, చికమకలం బెట్టె కిపుడు చెపుమా నాకుఁ." రసిక. 6.

**చికాకు పడు**

కలత చెందు.

**చికిబికి**

చీకిరిబాకిరి.

"చికిబికి వెంట్రుకల కొప్పు." రాధా. 5.108.

**చికిలికాడు**

అందగాడు, షోకీలా.

"చికిలి నెఱవన్నె కాండ్రకు సివము లెత్త, నెనసి చరియించు నావీట హేమరేఖ." హంస. 1.220.

**చికిలి చేయు**

సానబట్టు.

"చికిలి చేసిన యడిదంబు చేతఁ దాల్చి." శివ. 4.74.

**చికిలిసాన**

మెఱుగుపెట్టు సాన.

**చిక్కంటు**

వెంట్రుకలు చిక్కు దీసికొను దువ్వెన.

మామూలు దువ్వెనవలె కాక పెద్దపండ్లు గలిగి పొడవుగా ఉంటుంది.

**చిక్కక స్రుక్కక**

వెనుకంజ వేయక. జం.

**చిక్కదనము**

1. ధైర్యము, గుండె చిక్కన. నిర్వ. 9.89.

2. అరుచి.

ఇది కేవలం సందర్భాన్నిబట్టి కోశాలు చెప్పిన అర్థం. ఎందుకిలా కావాలో బోధపడదు. ఇంకను విచారణీయము.

"ఒకని సొమ్ము వేఱొక్కని సొమ్మమి, చక్కెర కనుఁగనే చిక్కఁదనము, లోకులు గన నేమి తొఁగనుం గొన నేమి, వెన్నెల వూనునే విన్నఁదనము." రాధా. 3.147.

**చిక్క నగు**

గాటనగు.

"చెక్కు చెమట పెక్కు వలెనే చిక్క నైనచెలిమి." శాశ్వ. సం. 5.29.

**చిక్కనా బిళ్ళ**

ఒక పిల్లల ఆట.

**చిక్కనిడెందము**

కఠిన హృదయము, గట్టి మనసు.

"ఆడువారు సిక్కని డెందంబువారు జగతి." కుమా. 5.93.

**చిక్క నై నిలుచు**

ధైర్యంగా నిలబడు, స్థిరంగా ఉండు.

"మా యొత్తి వచ్చు నంతకుం జిక్క నై నిలు మనుము." కుమా. 10.177.

**చిక్కపట్టు**

నిర్ణయము. శ. ర.

**చిక్కములో చిక్కిన పిట్టవలె**

తప్పించుకొనుటకు వీలు లేక.

"చిక్కంబులోఁ బిట్ట చిక్కినరీతి, దిక్కు లాలించుచు దీనుఁడై పలికె." సారం. ద్వి. 2.117.

**చిక్కి పోవు**

కృశించు.

"అతను బాగా చిక్కి పోయాడు. తటాలున చూస్తే గుర్తు పట్టలేక పోయాను." వా.

చిక్కుటనే 'చిక్కుడు' అని కొన్ని జిల్లాలలో అంటారు.

**చిక్కి సగ మగు**

కృశించి పోవు.

"ధరణి స్థితిం బెంగు దొరక దాయెనె చిక్కి, సగ మైతి విది యేల చంద్రముఖి." దశా. 2.75.

**చిక్కు చీలు చేయు**

చిందర వందర చేయు.

"...నలంగు నట్లుగాఁ బదంబులం ద్రొక్కి చిక్కు చీలునుం జేసి చెల్లా చెదరుగాఁ బాఱఁ జల్లిన..." విష్ణు. 1.139.

**చిక్కు జీరుగా**

తుత్తుమురుగా, చిందర వందరగా, చిక్కుగా,

"జడ లూడి యహులకై వడిఁ జిక్కుఁ జీరుగా, నవనిపైఁ బడి పొరలాడువారు." శృం. శాకుం. 3.61.

"చింతా పరంపరఁ జిక్కుఁజీరయ్యెడు." ప్రబోధ. 5.32.

**చిక్కు జీరు పడు**

చిందరవందరగు; చిక్కగు.

"చిక్కుజీరువడు తురంగమ్ములును."
హరి. ఉ. 3.130.
"నాయికయును నాయకుండును దమ యిద్దఱ యంగములు న్విమిశ్రభావకలనఁ జిక్కు జీరు వడ వైచిన..."
ప్రభా. 5.49.

## చిక్కుతాళము

కొత్తవారికి రాని తాళము.
బ్రౌణ్.
చూ. చిక్కుబీగము.

## చిక్కు దీర్చు

చిక్కు తీయు.
"కలుకంజన్నులమీఁది హారములు చిక్కుల్ దీర్చునందంబునన్."
రాజగో. 1.103.

## చిక్కు పడు

1. చిక్కు అగు.
"వెంట్రుకలు చిక్కుపడినవి." వా.
2. చిక్కులో తగులుకొను.
"చిక్కియుఁ జిక్కువడక యక్కజపు జవధరంబునన నరంబులతోడం బెకలించుకొని..." కళా. 8.112.
3. ఏమీ చేయ లేక చిక్కులో పడు.
"కాలంబుకొలఁది లెక్కలు పెట్టనేరక, చిత్రగుప్తాదులు చిక్కుపడిరి."
కాశీ. 1.137.

## చిక్కు పఱచు

1. బాధించు.
"విశిఖపుంజంబులం జిక్కు పఱచి."
జైమి. 8.22.
2. పట్టుపడ జేయు, చిక్కుకొనునట్లు చేయు.
పాండు. 5.304.

## చిక్కుపాటు

ఇబ్బంది పడుట, మెలికలు పడుట.

## చిక్కుపురువు

ఒకరకమైన పురుగు.
ప్రబంధ. 130.

## చిక్కువఱచు

చిక్కుపఱచు.
చూ. చిక్కుపఱచు.

## చిక్కుబాకీలు

గొంతుమీదికి వచ్చిన బాకీలు; తగాదాలో పడినవి.
"చిక్కుబాకీలు పిదప నిశ్శేషపఱిచె."
రుక్మా. 2.116.

## చిక్కుబీగములు

కొత్తవారు సులువుగా తీయుటకు వీలులేని తాళములు.
"విం తగు చిక్కు బీగములు వేసిన యట్లనె యున్న విప్పుడున్."
ఉషా. 3.106.
చూ. చిక్కుతాళము.

## చిక్కురాత

జిలుగువ్రాత.

## చిక్కురొక్కరుగా

చిందరవందరగా.
కొత్త. 11.

## చిక్కులమారి

చిక్కులు పెట్టువాడు.
"చిక్కులమారి యా బలిజసెట్టి వయాళులఁ గట్టి బర్వ్వలఙ్, ప్రసుక్కెడలంగఁ గొట్టి..." హంస. 5.48.

## చిక్కులు గొను

చిక్కువడు.

"చెదరిన పత్త్రిభంగములఁ జిక్కులు గొన్నమణీసరంబులన్."

పారి. 4.18.

## చిక్కులు వాపు

చిక్కు తీయు.

"కొనగోళ్ల నెఱులు సిక్కులు వాపి."

పారి. 2.12.

"అంకపీఠముం జేరిచి సోగవెండ్రుకలఁ జిక్కులు వాపి."

పారి. 4.8.

## చిక్కువడు

చిక్కు కొను.

"చిక్కువడియును మదిఁ జేవ చెడక తండు."

జై. మి. 5.12.

"శోకమోహాంబుల నుడిఁ జిక్కువడక."

వర. రా. కిష్కి. పు. 353. పంక్తి. 16.

## చిక్కువర్చు

చిక్కులలో పెట్టు.

"వాడు నన్ను చాలా చిక్కుపరచినాడు."

వా.

"చిక్కయ్య లింగయ్యఁ జిక్కువర్చితివొ."

పండితా. ద్వితీ. మహి. పు. 214.

ఇక్కడ కించపరుచు, చిన్న చూపు చూచు అనే అర్థంగా కానవస్తుంది.

## చిక్కు సీరై పోవు

చెదరి పోవు.

"చిన్నైన యాట లెల్ల సిక్కు సీరై పోవు."

తాళ్ల. సం. 3.15.

## చిక్కె గుమ్మడు

సరికాదు లే అబ్బాయి! అనుట వంటిది.

"చిక్కె గుమ్మఁ డటంచు నలరి."

వర. రా. బా. పు. 51. పంక్తి. 7.

## చికొట్టు

చీకొట్టు.

"ఇక్కన్యకు సాగఁడే యితఁ, డక్కట యీ సుగుని కేటి గగా లిది యనుచుం, జికొట్టు వలను..."

ఉత్త. హరి. 5.147.

## చిగురుగోరు

అర్థం విచార్యం.

'జుట్టుముడి బిగించుట కుప యోగించు సాధన విశేష' మని వావిళ్ల ని.

"చిగురుగోళ్లను జాఱు సిగ నిక్కఁగా చేసి, కదలి పూ రేకులు గానఁ జెరివి."

మల్హ. 3.9.

## చిగిరింతపదవి

అల్పకాలభోగ్యము.

"...క్రూరకృత్యంబునకు నొడి గట్టినచో నొడి గట్టుటంబట్టి వాని పదవి చిగిరింతపదవి గాక మానదు."

ధర్మజ. 32.10.

తె. జా.

## చిగిరింతయైశ్వర్యము

అల్పకాలభోగ్యమైన భాగ్యము.

"ఈ చిగిరింత యైశ్వర్యముకై యింత పొంగ నేల."

ధర్మజ.

తె. జా.

**చిగురాకుమఱుగునం బోడము మొగ్గయుం బోలె**

ఆకుమఱుగు పిందెవలె.

"తన ముఖం బెత్తి చిగురాకుమఱుగునం బోడముమొగ్గయుంబోలె."
శుక. 1.538.

చూ. ఆకుమఱుగుపిందె.

**చిగురుకొను**

చిగిరించు ; పోడము.

**చిగురు గొలుపు**

చిగు రెత్తించు, చిగుర్ప జేయు.

**చిగురుజొంపము**

చిగురుటాకుల మొత్తము.

"శ్రీ రమణీకుచశిఖరాగ్రముల నేలి, చిగురుజొంపంబు లై జిగి చెలంగు."
రాధి. పీఠిక. ప. 16.

**చిగురు లొత్తు**

చిగురించు.

"సీమంతినికిఁ గోర్కి చిగురు లొత్తె."
రాధా. 1.128.

**చిగురులో చేగ యగు**

మొలకలోనే చేవ దేరు, సారవంత మగు.

చెట్టు ముదిరిన పిల్ల చేవ దేరుతుంది. అలా కాక చిగురులోనే చేవ గల దైన దనుట.

"చేవ దేరి చిగురులో చేఁగ యెయ్యుండెను." తాళ్ల. సం. 8.165.

**చిగురెక్కు**

వాసి కెక్కు.

"ఎడపక జంగమం బే వస్తు వైన, నడుగ కుండిన నొట్టు నడిగిన లేదు, అనినచో నా యొట్టు నఖిలంబు వినఁగఁ, దన కని గర్వించి దండితో గంట, మొగసాలఁ గట్టించి మ్రోయించుకొనుచుఁ, జిగు రెక్కి యున్నాఁడు."
ద్వి. భల్లా. 2.24.

**చిగురొత్తు**

1. చిగిరించు.

"చెప్ప వే కరుణాలత చిగురొత్త."
భార. శాం. 5.542.

2. పోడము.

"కయ్యపు వేడుక చిగురొత్త."
భార. ద్రో. 1.55.

3. అనురాగపూరిత మగు.

"మలయపుగాలి రాకలను మానసముల్ చిగురొత్త దంపతుల్."
ఇందు. 3.102.

**చిగుర్కొను**

చిగురుకొను.

**చిచ్చరకోల**

అగ్ని బాణము.

"సాడింథమునిఁ గన్న నాతిపై నేయును, నలరుఁ జిచ్చరకోల నంగభవుఁడు." క్రీడా. పు. 68.

**చిచ్చుఱపిడుగు**

అగ్గిపిడుగు.

"...దందడిఁ దార్కొని మండుచుండెఁ జిచ్చుఱ పిడుగుల్ వడిం దొరఁగు చాడ్పున నంబరవీధి నుగ్రమై."
భార. విరా. 5.

"వచ్చెఁ గద విటులపాలిటి, చిచ్చుఱ పిడు గింక నేమి సేయుదు."
నిరంకు. 2.122.

చిచ్చికొట్టు

జోకొట్టు.

"కాస్త ఆ పిల్లను చిచ్చికొట్టి నిద్ర పుచ్చవే తల్లీ." వా.

చిచ్చీ యను

చీకొట్టు.

"ఇచ్చన మెఱుంగనికవులను, ఛిచ్చీ యని సుకవివరులు చేపట్టగు గా." కవిజ. అవతారిక.

చిచ్చును గాడ్పును గూడినట్టు

అగ్గికి గాలి తోడయి నట్లు – అనగా మరింత విజృం భించు అనుట.

"మేద్పడి రాజ్యగర్వమున నీ్దు తలంపవు గాక చిచ్చునుం, గాడ్పును గూడినట్టు." ఉ. హరి. 4.198.

చిచ్చుపిడుగు

అగ్గిపిడుగు.

చిచ్చుఱపిడుగు

చిచ్చుపిడుగు.

హమా. 5.70.

రూ. చిచ్చఱపిడుగు.

చిచ్చు లేక చిముడు

కారణము లేకయే త్రుళ్లి పడు; మండిపడు.

అగ్గి లేకయే ఉడికిపోవు వా డని వాచ్యార్థము.

అతి కోపిష్ఠి అనుట.

"చిచ్చు లేక చిమురు మచ్చరీఁ డీ సుద్ది, వజ్రనాభుఁ డోర్చువాఁడె యకట!" ప్రభా. 1.184.

చిచ్చుఱురు

1. అగ్నిప్రవేశము చేయు.

కాశీ. 2.86.

2. సహగమనము చేయు.

"చిచ్చుఱికిన సతి కనుగొన వచ్చు విమానములు." రుక్మాం. 4.94.

చిచ్చులో నెయ్యి పోసిన భంగి

అగ్నిలో ఆజ్యము పోసినట్లు. మఱింత గోహ దము గు ననుట.

"ఇచ్చగుము మనుకులవిభుఁ జూచి సీరి, చిచ్చులో నెయ్యిఁ బోసిన భంగి మండి." ద్విప. జగ. 183.

చిచ్చు సింగార మెంచదు

ఏ విచక్షణ లేనివానిపట్ల ఉప యోగించే పలుకుబడి.

అగ్నికి అందమైన దైనా కాని దైనా ఒకటే. అన్ని టినీ కాల్చి వేస్తుంది.

వేంకటేశ. 75.

చిటమట మను

మండి పడు, చిటచిట లాడు.

చిటచిట లాడు

1. చిడిముడిపాటు చెందు; కోపగించు.

"హరి సర్వమయుం డటె యంచుఁ బట్టితోఁ జిటచిటలాడి." పారి. 3.32.

2. చిట చిట శబ్దము చేయు.

ధ్వన్యనుకరణము.

చిటపెట

ధ్వన్యనుకరణము.

ంటపొట వోవు

చిటపట లాడు.

క్రీడా. పు. 80.

ంటబొట మని

చినుకులు పడుటలో–

ధ్వన్యనుకరణము.

'అట మున్ను మొగులు బలియుచుఁ, ంట పొట మని పొట పొట చినుకులు ఁడఁ జొచ్చుట యాది గాఁగఁ...''

కళా. 4.90.

ంటికలపందిరి వేయు

మాటలతో మభ్యపెట్టు.

చిన్న చిన్న పుల్లలతో పందిరి వేస్తే చూడ్డానికి అందంగానే ఉంటుంది. కాని కాస్త చెయ్యి తగిలితే కింద పడి పోతుంది. దానిమీద వచ్చిన పలుకుబడి.

''వాడి పన్నీ పట్టి కోతలు. అ చిటికెల పందిరి నమ్ముకొని ఆ వ్యవహారంలోకి దిగితిమా మనమే నవ్వుల పా అవుతాం.''

వా.

చిటికలో

క్షణంలో.

కొత్త. 53.

చిటిక వేయు

బొటనవ్రేలూ, నడిమివ్రేలూ చేర్చి, జార్చి, చిటుక్కని శబ్దము కలిగించు.

''కొక్కరయఁగఁ జూచి పందియపు బెంకవ దిద్దుచుఁ జిట్కె వేసి నవ్వెరి.''

హంస. 3.216.

చిటికెనవ్రేలి కెక్కు

ప్రథమగణ్యు డగు.

లెక్కించునప్పుడు మొట్ట మొదట చిటికెన వ్రేలిని మడిచి చెప్పుట పై యేర్ప డిన పలుకుబడి.

''ఉత్తమమతిని మరుతుండును జిటికెన వ్రేలి కెక్కి సకలభూచక్రంబును సక్రమంబుగ నేలెరి.'' ధర్మజ. 32.5.

తె. జా.

చిటిచాప

మెత్తని చిఱుచాప.

''బాలీసు రతనంపు గీలు బొమ్మలు చిటి,చాపలు పెడఁదవింజామరలును.''

రసిక. 1.61.

చిటితాళము

చిన్న తాళము.

''చిటి తాళములు చంక పుటిక నొక్కొక మాటు, గతి రయంబునఁ దాఁకి కలసి మొఱయ.''

ఆము. 6.6.

చిటిపొటి

1. చిలిపి తగాదా.

''ఇటు మీ లోపల నూరక – చిటి పొటి వలదు.'' సింహా. 8.80.

2. అల్పాల్ప మైన.

''చిటిపొటి సొమ్ములు పెట్టుక, పుట పుటగా వీధివెంటఁ బొరుగిండ్లబడిన్.''

హంస. 5.25.

చిటిబొట్టు

ముత్తైదువలు మంగళకరంగా ధరించే చిన్నబొట్టు.

"కాశ్మీర తిలక రేఖామధ్యమున యందుఁ, బుణ్యంబుఁ జిటిబొట్టు పొందు పఱచి." శాకుం. 3.212.

చూ. చిటిబొట్టు.

**చిటిముడి**

దొంగయెత్తు; మోసము.

వావిళ్ళ ని.

**చిటిముత్తెములు**

ధాన్యవిశేషం.

శ. ర.

**చిటిలిపడు**

చెదరిపడు; ఎగిరిపడు.

**చిటిప్రేలు**

చిటికెన ప్రేలు.

ఆము. 6.80.

**చిటు కను**

శబ్దించు.

ధ్వన్యనుకరణము.

**చిటుకు పొటుకు**

వాన వెలిసినా చెట్టు మీది నుండి పడే నీటిబొట్లు.

**చిటుకు పొటుకు మనక**

ఉలకక పలకక.

శ. ర.

**చిటుకులాడి**

మిటుకులాడి; వగలాడి.

**చిట్టంటుసేతలు**

శృంగారచేష్టలు.

"వరుని చిట్టంటు సేతలఁ గరలు ప్రేమ, మెఱపువోలెఁ దళుక్కన మెఱచుఁ గాని." కళా. 7.159.

**చిట్టంట్లు**

చిలిపి చేష్టలు; నఖక్షతాదులు.

"ఈ చిట్టంట్లు నీ వెంచక చిత్తగించరావోరి." తాళ్ల. సం. 3.11.

**చిట్టకపుదసము**

పరిహాసము.

వావిళ్ళ ని.
రామా. 4.167.

**చిట్టచిపర**

కట్టకడపట.

**చిట్టడవి**

కాఱడవి.

**చిట్ట మిడిచినంతలో**

చిటికె వేసినంతలో — త్వరలో అనుట.

"...ఏ పదార్థంబును సంపాదింప రాని యిట్టి నట్టడవిలోనం జిట్ట మిడిచిన మాత్రంబున విచిత్రంబుగా నానావిధ పదార్థంబులు..." వరాహ. 5.12.

**చిట్టాముదము**

చిన్న ఆముదపుగింజల చమురు.

"చిట్టాముదమ్మున శిర సంటి." ఇందు. 2.15.

"చిట్టాముదం తాగితే వేడీ వాతం తగ్గుతుంది." వా.

**చిట్టితాళము**

చిన్నతాళము (కొట్టునది).

"అట్టిద శాకంచు నప్పుడు నంబి, చిట్టి

తాళము వేసి చేయెత్తి మ్రొక్కె."
పండితా. మహిమ. 289. పు.
చూ. చిటితాళము.

**చిట్టిపొట్టి**
1. చిల్లరసొమ్ములు.
"నింబప్రవాళ మాల్యంబులు వైచిరి, చిట్టిపొట్టి ధరించి రిట్టు నట్టు."
పాండు. 3.74.
2. చిన్న చిన్న.
"చిట్టిపొట్టి మాటలతో అత డెంతో అందంగా రాస్తాడు." వా.

**చిట్టిబొట్టు**
ముఖంలో పెద్దగా పెట్టుకొనే బొట్టుకింద పెట్టుకొనే చిన్న బొట్టు.
"నింబప్రసూనమాల్యంబులు వైచిరి, చిటిబొట్టు ధరించిరి..."
పాండు. 3.74.
రూ. చిటిబొట్టు.

**చిట్టిమట్ట**
చిన్న తాటిమొక్క.

**చిట్టివెదుళుల కదుపు**
పొట్టి వెదుళ్లు (పదార్థ పట్టిక) చిటచిటలాడు వెదురులూ కావచ్చును.
"ఉగ్రభటులు సిట్టి వెదుళుల కదుపుగా." కుమా. 12.121.

**చిట్టాడు**
చెలరేగు.
"చిట్టాడుసిగ్గుతోఁ జేపట్టి పెనఁగు ఛందము." సారం. 3.148.

**చిట్టీత**
చిన్న కాయలు కాసే యీత చెట్టు.

**చిట్టీదు**
చిట్టీత చెట్టు.
"వెలివాడకుఁ గడుఁజేరువ, సెలయేటికిఁ బారువుతాళ్లఁ జిట్టీఁదులునా, వల దలుచు భద్రకాళీ, నిలయంబు."
శివరా. 3.100.

**చిట్టుడుకు**
కవోష్ణమైన, కొద్దిగా ఉడికిన.

**చిట్టుడుకు నీళ్లు**
బియ్యం ఉడుకుచుండగా పైనున్న నీళ్లు,
"చిట్టుడుకు నీళ్లు త్రాగితే మంచి దంటారు." వా.

**చిట్టుడుకు పట్టు**
కొద్దిగా ఉడుకు.
"ఉరము గంధంబు చిట్టుడుకు పట్టిన బొంగి, యందు దుమార మై యావు లెగసె."
శృం. శాకుం. 3.174.

**చిట్టుముల బయకలు**
గర్భిణీస్త్రీ తొలి నెలలలో చేసుకొను వాంతులు. ఇవి రెండూ (చిట్టుములు, బయకలు) ఒకే అర్థంలో ప్రయోగింపబడేవే అయినా ఇచ్చట రెండూ కలిసి ఉండుట విశేషం. (చిఱు+ఉమ్మి+లు.)

"ఇట్లు వర్తింప నాతని యింతి గర్భ,
కలిత యై చిట్టుముల బయకలు మునగ
మునఁ, దెలుపు గనిపింప..."
శుక. 2.146.

## చిట్టుములు

బయకలు.

"చిట్టుము లుల్లసిల్లెఁ దలు ప్తె నోడ్డఁ
గురంగాక్షికిన్." మను. 3.120.

"చిట్టుములు పుట్టెఁ దాఁ గను, సటికి."
దశా. 3.106.

"నెల మసలె నంతఁ గాంతకు...చిట్టు
ముల్ తలచు మీఱె." విజ. 3.228.

చూ. చిట్టుముల బయకలు.

## చిట్టూట చోటు

నీరూరు తావు.

"గ్రామ నికటంబు గాక దూరంబు
గాక, చౌటి పార గాక చిట్టూట చోటు
గాక వెల్లితల గాక క్రేఁ జెదల్ పేరు
పురువు, రాలిపోట్లును లేని బారాది
నేల." విప్ర. 2.18.

## చిట్టూడి

ఒకరకమైన కూరాకు.

బ్రౌ.

## చిట్టెడుపంట

రెండవపంట.

## చిట్టెడుపొట్ట

చిన్నపొట్ట.

శరభాంక. 95.

## చిట్టెడు వేస్తే పుట్టెడగు

ముఖం మటమట లాడు.

ముఖం పెనంలాగా కాలిపో
తున్న దనుట.

చిట్టెడు గింజలు వేస్తే పుట్టెడు
కాపడం అప్పుడే సంభవం.

"వాడి ముఖాం నాను. చిట్టెడు వేస్తే
పుట్టెడు అవుతుంది." వా.

## చిట్టెలుక

చిన్నజాతి ఎలుక.

## చిట్లపొట్టులు

ఒకరకమైన బాలక్రీడ.

భోజసుతా. 2.9.

చూ. చిట్లపొట్లాలు.

## చిట్లపొట్లకాయ

ఒక బాలక్రీడ.

ప్రబంధ. 613.

చూ. చిట్లపొట్టులు.

## చిట్లపొట్లాలు

ఒక బాలక్రీడ.

'చిట్లపొట్లకాయ సీమరేణి
కాయ...' అంటూ పాడడం
పిల్లల ఆటలలో ఉంది.

పండితా. ప్రథ. పురా. పు. 460.

## చిట్లపొట్లాకాయ

శాశ. 3.33.

చూ. చిట్లపొట్లకాయ.

## చిట్లి సున్న మగు

పెటిలి పొడి యగు.

"......తారహారంబులు సాబ గల్లఁ
జెడి చిట్లి సున్న మయ్యె."
శాధి. 3.76.

## చిట్లుకట్టె

అతి కోపిష్ఠి.

శ. ర.

చిట్లుకొలివి

పీడాకారి, సంతాపకారి.

"పంచశరుం డొక ప్రళయకాలయ ముండు, చిన్న పెంపుడు చిల్క చిట్లు కొలివి." కలు. శ. 55.

చిట్లుగొను

చిటపట చిట్లు.

పేలాలు వేయించగా చిట్లు తాయి. గింజలు చిట్లిన వని నేటి వాడుకలోనూ ఉంది.

"మంగళమున బ్రేలలు సిట్లుగొన్న పొలుపున." బస. 7.199. పు.

చితాను చెల్లు వ్రాయు

లెక్కలో జమకట్టు.

"...అయ్య దన రాక యున్నలోపంబు దీర నేఁడో నృపాల!, యెలమిఁ జితాను జెల్లు వ్రాయింపు మయ్య!" నానా. 244.

నేటి రూపం చిత్తా.

చిడిముడి పడు

చీకాకు పడు, కోపించు.

"చిత్తంబు జల్లనఁ జిడిముడి పడుచు." గౌ. హరి. ద్వితీ. పం. 1079.

రూ. చిడిముడి వడు.

చిడిముడిపాటు

తొట్రుపాటు; కలత; కోపము.

చిడిముడి వడు

1. ముఖము మటమట లాడించు; అసంతృప్తి వెలి బుచ్చు.

"చెదరక యుదరక చిడిముడి వడక." షండితా. ప్రథ. దీక్షా. పు. 178.

2. కుతూహలము చెందు.

"చిత్రము లనిఁ జూచువేడ్కఁ జిడి ముడి వడఁగా." భార. భీష్మ. 1.151.

చిడుగుడు పరువులు

ఒక ఆట: చెడుగుడు, చిడు గుడు.

చిత్తం!

ఎవరైనా పెద్దవారు, గౌరవ నీయులు చెప్తున్నప్పుడు వినుటలో అను ఉపస్కారక పదం.

"వెళ్ళి రామయ్యను పిల్చుక రారా!"
"చిత్తం." వా.

అలాగే 'ఔను' అనుటలోనూ కలదు.

"నిన్ననే వచ్చారా?"
"చిత్తం." వా.

ఇత్యాదు లూహ్యాములు.

చిత్తకార్తిలో కుక్కలలాగా

కామోద్రేకంతో.

ఆ కార్తిలో కుక్కలకు కామోద్రేకం ఎక్కువ వను టపై ఏర్పడినది.

చిత్తగించు

1. తలచు.

"శ్రీహర్షు నాత్మలోఁ జిత్తగించి." రుక్మాంగ. 1.13.

వాడుకలో—

"నా మనవి చిత్తగించండి." వా.

2. ఏకాగ్రతతో.

"చిత్తగించి వినుము."
భాగ. 5. స్కం. 7.16.

3. దయచేసి.

"చెప్పవే వ్యాసనందన చిత్తగించి."
భాగ. స్కం. 9.

4. విను.

"విన్నవించినార మిన్ని యాకర్ణించి, కొంచె మనక చిత్తగించవలయు."
కృష్ణ. 2.139.

5. ఆలోచించు.

"స్త్రీలకు బుద్ధులు ప్రళయముల్ చిత్తగింప."
కుచేల. 1.115.

**చిత్తజల్లుగ**

అధికముగా; అత్యుద్ధృతంతో.

చిత్తకార్తిలోని వానవలె.

చిత్తకార్తివాన గబగబా వచ్చి ఆగుతుంది.

"పాండుతనూజుఁడు చిత్తజల్లుగాఁ, గురియుపయోధరంబు క్రియ."
జైమి. 7.39.

"ఇనుప గునపంబులో యనఁ దనరి కురిసె, నెంతయును జిత్తజల్లుగ నేదు ముండ్లు."
కళా. 5.8.

**చిత్తపరితాపము సేయు**

మనఃఖేదము కల్గించు.

"నీవు దపంబు సేయఁ బోఁ దలఁపకు మమ్మ, చిత్తపరితాపము సేయకు మమ్మ."
కుమా. 6.7.

**చిత్తము కరగు**

హృదయము ద్రవీభూత మగు

"ఆ వైకుంఠము...సభామండప, శ్రీవిస్ఫూర్తికతంబున న్నిగుల నాచిత్తంబు నానందము, ద్రావై చిత్రి గరంచుచున్నయది..."
కళా. 2.12.

"భామ తనమీఁద నెనర్గైన బాగుఁ జూచి, చిత్తము గరంగి శుభభద్రశేఖ గుండు."
హంస. 2.65.

**చిత్తము కైపు**

మానసోద్రేకము, ఆవేశము.

"పడం బాడిచి చంపక చిత్తము కైఁపు వోవ్వనే."
కుమా. 11.49.

**చిత్తము చీకటి గొల్పు**

కలత పఱుచు.

"చీఁకటి గొల్పె బ్రాహ్మణుని చిత్తము పెన్నతి సోగవెంద్రుకల్."
శివ. 3.44.

**చిత్తము తప్పు జేసికొను**

అయిష్టమునకు పాల్పడు.

"హరియుధిష్ఠిరుల చిత్తము తప్పఁ జేసికొంటి."
జైమి. 7.34.

**చిత్తము తెలియు**

అభిప్రాయ మెఱుగు.

"కేవర చిత్తంబు దెలియమి నట్లు సేయఁగ నేమి దోఁచునో యనుచు వెఱతు...."
కళా. 1.192.

**చిత్తమునకు వచ్చు**

ఇష్టపడు; మనసుపడు; నచ్చు.

"నీ చిత్తమునకు వచ్చినవానిం గారుణ్యంబునఁ గైకొని."
భార. కర్ణ. 1.285.

"వనిత! నీ చిత్తమున కేసు వత్తు నేని."
శివ. 3.68.

**చిత్తమున కెక్కు**
మనసునకు వచ్చు, నచ్చు.
"అకట! యొరు చిత్తమున కెక్కనట్లు గాఁగ, మెఱఁగి యేమివిధంబునఁ గొలుచువాఁడు."
భార. విరా. 1.74.

**చిత్తము నీరగు**
గుండె నీరగు; భయభ్రాంతి జనించు.
"అక్కటా!, నిక్కము మాకుఁ జిత్తములు నీ రగుచున్నవి."
ఉ. హరి. 2.132.

**చిత్తము వచ్చినట్లు**
స్వేచ్ఛగా, యథేచ్ఛగా.
"నీచిత్తం వచ్చినట్టు నీవు తిరుగుతుంటే ఇంటిసంగ తెవరు చూస్తారు?" వా.

**చిత్తము వచ్చు**
ఇష్టపడు.
"చిత్తంబు వచ్చినచో మానుదు గాని నిన్నిపుడు కత్తిం బెట్ట నా కేటికిన్."
కాశీ. 3.72.

**చిత్తము విడుచు**
మన సొప్పకుండు.
"చేరి యచ్చట నిల్వఁ జిత్తంబు విడిచి."
పల. పు. 8.

**చిత్తయి పోవు**
బాగా దెబ్బ తిను, నిర్వీర్యుడగు.
"అయిపోయా డయ్యా! ఈ దెబ్బతో చిత్తయి పోయాడు."
కొత్త. 180.

**చిత్తరించు**
చిత్రించు.
"పండితమల్లుచక్షులను, చిత్తరించిన మాడ్కి."
పండితా. ప్రథ. దీక్షా. పు. 175.

**చిత్తరువులోని ప్రతిమవలె**
కదలక మెదలక, నిశ్చలంగా.
వాడుకలో – 'వాడు అప్పుడు రాసిన బొమ్మలాగా నిల్చుండి పోయాడు.'
"అచట నున్నవార లెల్లఁ జిత్తరువున వ్రాసినట్టి......తడవుగను."
కళా. 5.6.

**చిత్తరు వొత్తు**
ముద్రిత మగు.
"చిత్తంబులో నీదు చెలువు వైనమూర్తి, చిత్తరు వొత్తినచెలువంబు దోఁప."
ద్విప. కల్యా. పు. 66.

**చిత్తవాన**
చిత్తజల్లు.
చిత్తకార్తిలో వాన ఉధృతంగా గబగబా వస్తుంది.
"చిత్తవాన గురియు." విప్ర. 4.19.
"చిత్తవానలా వచ్చి పడ్డాయి రాళ్ళు." వా.
చూ. చిత్తజల్లుగా.

**చిత్తాన బెట్టు**
మనసులో పెట్టుకొను.
"చిత్తానఁ బెట్టకు మీమాట శ్రీరమణ మరవకు." తాళ్ల. సం. 7.103.

**చిత్తారిపని**
బచ్చెన పని; కత్రతో

బొమ్మలూ అవీ చేసి వానికి రంగు వేసే పని.

ఈ వృత్తి చేయువారిని చిత్తారివాండ్రు అంటారు.

**చిత్తుప్రతి**

సాఫు వ్రాయక ముందు వ్రాసుకున్న ప్రతి.

**చిత్తుళిపని**

చిత్తారిపని.

కఱ్ఱబొమ్మలు మొదలగు వానిపై రంగులు వేయుపని. జీనిగర – చిత్తారి – వాండ్లు అని ఆ పని చేసేవారి నంటారు.

కాశీయా. 304.

చూ. చిత్తారిపని.

**చిత్రరతి**

సంభోగములో భేదము.

కుమా. 9.152.

**చిదంబరరహస్యము**

అగోచరము – అనవగతము. చిదంబరంలోని శివలింగాన్ని ఆకాశలింగం అంటారు. దర్శనానికి వచ్చిన భక్తాదులను, తెర తొలగించి, దర్శనం అయిందా అంటారు. వీరు అయింది అంటారు గానీ యెవరికీ యేమీ కనబడదు. ఆకాశలింగం కనుక కనబడదని ప్రతీతి. అందుపై యేర్పడిన పలుకుబడి.

"అంత సరిపడనివాడు ఈ గోజు ఉద్యోగం ఇస్తానన్నాడంటే యిందులో యేదో చిదంబరరహస్యం ఉంది." వా.

**చిడిగొడలు**

గృహకలహము.

ప్రా.

స్వల్పకలహాలు.

వాసిష్ఠ్య ని.

"ముదల నుపాయుం బెన్నుట, పిడప నుపాయుంబు లెక్క పెట్టుట తగునే, చిడిగొడలు గాదు ముసన్నక, ముది కొక్కెర యనగుసుతుల ముంగిస కిచ్చెన్." వేంక. పంచ. 1.738.

**చిడిమిడిగా**

సలుగునట్లుగా; కసిబిసిగా.

**చిదిమి దీపము పెట్టవచ్చు**

ఎంతో ప్రకాశవంతంగా ఉన్న దనుపట్ల అనే పలుకుబడి.

"ఆ పిల్లను చిదిమి దీపం పెట్టవచ్చు." వా.

**చిదిమి పెట్టిన**

1. సారము పిసిన.

చిలికి తీసిన – ఆరితేరినగా మారినది.

"ఆ, భీలశరాతనుల్ చిదిమి పెట్టిన బంటులు." విజయ.

2. రూపొందించిన.

"బిడ్డయొ పాపయో చిదిమి పెట్టిన కైవడి నున్ననిన్ను." శుక. 1.527.

**చిదిమి పెట్టు**

పంచు.

"మృతులైనవీరు లందఱు, నతివీరులు

నీరి కెల్ల నడుగిడ నసురా, వలెఁ బట్టు లేదు వరసుర, సతు లందఱుఁ జిదిమి పెట్టఁ జాలరు నసురా."

కుమా. 11.180.

మా. బుగ్గ చిదిమి దీపము పెట్టు.

## చిదిమి వైచు

భిన్నాభిన్నము చేయు.

"చిన్నాభిన్నముల్గల చిదిమి వైచెదవె?"

పర. రా. ఆర. పు. 237. పం. 1.

## చిన్న కన్నుపడు

కను లరమూసినట్లు చెందు.

"చిన్న కన్నువడి గుప్పలు దప్పడు గాక యుండు." సాంబో. 2.188.

## చిన్నకారు

బాల్యము.

బ్రౌన్.

## చిన్నకూతురు

చిన్నది.

"ఎన్ని నాళ్ళనఁ జిన్న కూఁతురవు గావు నీవె తొడఁగి పతికిఁ, దగిన సేవ సేయ కగునె..." కళా. 4.68.

## చిన్నక్క పెద్దక్క చేయు

మోసగించు.

వర్తకంలో చిన్న శేరు పెద్ద శేరు వాడే వారను, చిన్నక్కా శేరు తేవే అంటే చిన్న శేరు తేవాలనీ, పెద్దక్కా శేరు తేవే అంటే పెద్ద శేరు తెమ్మనీ గుర్తు పెట్టి వ్యాపారం నడిపేవారట. ఆ మోసంపై వచ్చిన పలుకుబడి.

## చిన్నగ బోవు

చిన్నబోవు.

శివ. 2.19.

మా. చిన్నబోవు.

## చిన్నచూపు చూచు

చులకన చేయు.

"మామీద అంత చిన్నచూపు చూస్తే ఎలాగు చెప్పండి." వా.

## చిన్నటనాడు

చిన్ననాడు. బాల్యం.

"చిన్నటనాఁట నుండియును జెల్వకుఁ గూర్చినదాన నౌట."

వసు. 4.106.

## చిన్నతన మగు

అవమాన మగు.

"తప్పు తెన్ను ను చిన్నతన మగు నాకు." పల. పు. 62.

వాడుకలో – 'అందఱు సంపన్నులలో ఈ మాసినబట్టలతో తిరగడం నాకు చాలా చిన్నతనంగా ఉంది.'

## చిన్ననవ్వు

చిఱునవ్వు.

"చిప్ప కూఁకటివానిఁ జిన్న నవ్వుల వాని." పాండు. 1.213.

## చిన్ననాటి కతలు

గతచరిత్ర.

"ఎలదోఁట తీఁగె యయ్యెల, కలకంఠికిఁ జిన్ననాఁటి కత లై తోఁచెన్." శివరా. 2.46.

## చిన్ననాడు

బాల్యం.

**చిన్నపడుచు**

బాలిక.

**చిన్నబుచ్చు**

అవమానించు.

"నన్ను చిన్నబుచ్చినకంబు పెద్ద సేయుంగ." కవిక. 2.164.

"నడుమంత్రమున వచ్చి ననుఁ జిన్న బుచ్చి."

వర. రా. అయో. 2.533. పం. 2.

చూ. మొగ మింత చేసికొను, మొగము చిన్న చేసికొను, మనసు చిన్నబుచ్చుకొను.

**చిన్నబోవు**

1. అవమానముతో మొగము చిన్న చేసికొను.

"ఏఁగుదెంచిన నృపు లెల్ల నిండ్ల కరుగఁ, జేరి యధికారు లెల్లను జిన్నఁ బోవ." శుక. 2.12.

2. విఘాత మగు.

"చేతనా హానికార్యంబు చిన్న బోయె." నైష. 4.96.

3. కళావిహీన మగు.

"సంపద లెన్ని గల్గిన నరేంద్రా యింద్ర సంకాశ నందనుఁ డొక్కండును లేమి నీ నగరు చిన్నంబోయె."

వరాహ. 2.92.

"పిల్ల లందరూ ఊరి కెళ్ళేసరికి ఇల్లు చిన్నబోయింది." వా.

**చిన్నమంత మాట ఆడు**

ఏ కించిత్తైనా దండించు, ఒక మాట అను.

చిన్నం పూర్వపు తూకపు రాళ్లలో అతిచిన్నది.

"చిన్నవాఁడును బ్రియుం డొక చిన్న మంత, మాట యాడిన విని తాపమగ్న వగుదు." కళా. 4.128.

**చిన్నమ్మవారు**

మశూచికములో ఒక భేదము.

పెద్దమ్మ, చిన్నమ్మ, బొబ్బ లమ్మ, ఆటలమ్మ, తట్టమ్మ ఇత్యాదులు మశూచికంలో భేదములు.

**చిన్నము చిదరా**

జం.

అల్పమైనవి.

"చిన్నముఁ జిదరయుఁ బుట్టక, మిన్నక గావలసె మగుడి మీ గున్నాఁడవన్." పంచ. మి. భే. 522.

పూర్వం తూకంలో చిన్నము అతి చిన్నది.

**చిన్న మెత్తు పని లేదు**

ఏ పనీ లేదు.

ఇది వ్యతిరేకార్థంలోనే ఉప యోగిస్తారు.

"వాడికి చిన్నమెత్తు పని లేదు."

"పొద్దున్నుండీ చిన్నమెత్తు పని కాలేదు." వా.

**చిన్నమెత్తు మాట అనకుండు**

ఒక్క మాటైనా వ్యతిరే కంగా అనక పోవు.

పల్లెత్తుమాట అనకుండు.

"నేను చిన్నమెత్తు మాటయినా అన

లేదు. అయినా వాడికి కోపం వచ్చింది.''
వా.
చూ. మా రెత్తు మాట.
చిన్న మెత్తు పనిలేదు.

## చిన్నవాడు

బాలుడు.

''ననుఁ జిన్నవాఁ డని గడుప కిపు డుపన్యసింపుము.''
చెన్న. 1.32.

## చిన్న వోవు

అవమానముతో క్రుంగు.

''పోరు బాలుండు యదువృష్ణిభోజ బలముఁ, జిన్న వోయెను జూడ వచ్చిన జనంబు.'' ఉ. హరి. 2.28.

''చిన్ని మలగానిలంబులుఁ జిన్న వోయె.'' హర. 3.89.

వాడుకలో – 'నే నీమాట అన గానే వాడి మొహం చిన్న బోయింది'—అన్న విధంగా వినవస్తుంది.

''వాడు ఈ రోజు చాలా చిన్నబోయి నట్టు కనబడుతున్నాడు.'' వా.
చూ. చిన్నబోవు.

## చిన్నా పెద్దా తారతమ్యం

చిన్న పెద్ద అంతరువు.

''వాడికి చిన్నా పెద్దా తారతమ్యం తెలియదు.'' వా.

## చిన్నారి

చిన్న దైన.

''చిన్నారి పేనిగోడ.'' రాధి. 1.53.

## చిన్నారి పొన్నారి

ము ద్దయిన. జం.
హర. 5.56.

## చిన్నారి పొన్నారి ప్రాయము

బాల్యము.

''మరులు కూఁకటితోడఁ గూడియుఁ గూడని, చిన్నారి పొన్నారి ప్రాయము...'' రాజగో. 1.13.

## చిన్నిపువ్వు

1. తలలో ధరించు ఒకవిధ మైన యాభరణము.

''మటిలాలకములమీఁదఁ జిన్నిపువు గుస్తరించు నచ్చుగ మణికర్ణిక.''
కాశీ. 6.

''అలికలభినులు ప్రేంక దులతెంచు తని రేమ, లలకలఁ జిన్నిపువ్వై వెలుంగ.''
కుమా. 9.126.

2. నమస్కార విశేషం.
హంస. 4.213.

## చిన్నిపూజేరు

భూషణవిశేషం.

## చిన్నెలాడి

విలాసిని.

## చిన్నెలాడు

విలాసి.

## చిప్పంటు నీరంటు లేకుండు

ఏమీ లేక పోవు.

చిప్పలో ఏదయినా వేసి నప్పుడు, కొంతయినా తగులు కొని ఉండడం, నీరు కుమ్మ రించినా కొంత నీరయినా అంటుకొని ఉండడం మామూలు. అది కూడా లే దనుట.

అంటూ సొంటూ లేకుండా.

**చిప్ప ఎత్తుకొని పోవు**

ఉన్న దంతా పోగొట్టుకొని దిక్కుమాలినవా డగు.

అడుక్కు తింటూ పోవు.

"వాడిలాగే ఖర్చు పెట్టుకుంటూ వస్తే ఆఖరుకు చిప్ప ఎత్తుకొని పోతాడు. ఇప్పుడు గాని తెలియదు." వా.

**చిప్పకత్తి**

చెట్లకొమ్మలు నరికే సాధనము కత్తి.

**చిప్పకసవు**

చిప్పగడ్డి.

**చిప్పకూకటి**

చిన్నతనమున పెట్టుకునే చిన్న జుట్టు.

"చిప్పకూఁకటుల నా శ్రీరామచంద్రుఁ, డొప్పనే పట్టి దైత్యులఁ గూలఁద్రోయ."

వర. రా. బా. పు. 77. పం. 52.

**చిప్పగడ్డి**

చిప్పకసవు.

**చిప్పగుద్దలి**

ఒకరకమైన గొడ్డలి.

**చిప్పగొడ్డలి**

చూ. చిప్పగుద్దలి.

**చిప్ప చేతికి వచ్చు**

ఉన్నది పోగొట్టుకొని నిరాధారు డగు.

"ఏదో పేరు రావాలని రెండుచేతులా ఖర్చు పెట్టాడు. చివరికి చిప్ప చేతికి వచ్చింది." వా.

**చిప్పయిత్తెము**

మూయుటకుపాత్రము.

**చిప్పయూతి**

చిప్పవలె ఉండే ముఖము.

శ. ర.

**చిప్పయుమ్ము**

ఒకరకమైన చిప్పవంటి బాణము.

"క్రౌంచాం చిప్పయుమ్ముల నది ... విజయుండా." భా. అశ్వ. 4.8.

**చిప్పలు వాలు నొగ్గు**

ప్రాధేయపడు.

"చిప్పలు వాలి నొగ్గుటలుం జెల్లగ."

భాస్క. యుద్ధ. 712.

**చిప్పా దొప్పా సిద్ధము చేయు**

సన్న్యాసమునకు సిద్ధపడు.

"ఆ పిల్ల కోడలుగా వస్తే నేను చిప్పా దొప్పా సిద్ధం చేసుకో వలసిందే." వా.

**చిప్పెణక**

ఇంటిపార్శ్వముల కప్పు.

బ్రౌ.

**చిప్పెవాడు**

దర్జీ.

అం. భా. ద్వి. 282.

**చిమచిమ అను**

పుండు, గాయము లాంటివి మంట పెట్టు.

"మెునపంట మెునసి నొక్కిన నొక్కుచే గెంపు,టధరంబు చిమచిమ యనినయట్లు." అని. 2.71.

"ఏమిటో కష్టం-చీమ కరిచింది కామోసు? చిమ-చిమ లాడుతూగా వుంది వ్రేలు." వా.

**చిమచిమ లాడు**

గాయము పుండు గానుండి సలిపి మంటపెట్టు.

చూ. చిమచిమ అను.

**చిముడ బెట్టు**

1. ఉపేక్షించు; కలతపెట్టు.

"చింతచే నీ మనసు చిముడఁ బెట్టేవు." తాళ్ల. సం. 3.271.

2. అన్నము ముద్దబడిపోవు నట్లు చేయు.

"ఏమిటే అన్నమిలా చిముడ బెట్టేవు? దీనికంటే సంగటి నయం." వా.

**చిమిడిపడు**

ఉడుకు, బాధపడు.

ద్వా. 5.142.

**చిమ్మచీకటి**

కటిక చీకటి.

కాశీ. 5.101.

"కమ్మ విల్తుని యాల రమ్ములం జిమ్మ చీకట్లు గ్రమ్ముటం జేసి." శా. మా. 2.25.

"చిమ్మ జీఁకటన్." నైష. 3.150.

రూ. చిమ్మజీకటి.

**చిమ్మట జిట్టుసగా**

ఏ మాత్రము శబ్దము లేకుండా.

"చీమ చిటుక్కు మన్న వినఁ జిమ్మట జిట్టిన సేఁగునంతలో." హంస. 3.40.

**చిమ్మటతార**

ఒక సుషిరవాద్యము.

**చిమ్మదిరుగు**

గిరగిర తిరుగు.

"చిమ్మ దిరుగుచు నిలువక శిరము వ్రాల." భాగ. 10. పూ. 225.

**చిమ్మనగ్రోవి**

1. నీళ్ళు చిమ్ము గొట్టము. వసంతం అనే ఆటలో ఉపయోగిస్తారు. పిచికారు.

2. ఒక పిల్లల ఆట.

**చిమ్మన చిల్లలు**

పిల్లల ఆటలో ఆడే కర్ర ముక్కలు. చిల్ల, కట్టె ఆటల్లో నేటికీ వినిపించే మాటలు.

**చిమ్మసపుగ్రోవి**

ప్రభా. 2.81.

చూ. చిమ్మనగ్రోవి.

**చిమ్మిరేగు**

చెలరేగు, విజృంభించు ఇత్యాది భావచ్ఛాయలలో.

"చిందులాడుదమని చిమ్మిరేగుటయు."

వర. రా. సుం. పు. 87. పంక్తి. 15.

**చిమ్మిరేచు**

చెలరేగునట్లు చేయు.

"సిగ్గరి కాంతల నింత చిమ్మిరేతురా." తాళ్ల. సం. 3.110.

**చిమ్ముబిల్లలు**

చూ. చిమ్మనబిల్లలు.

**చిమ్ముతాయి**

ఒక పిల్లల ఆట.

చిమ్మలాట

నీళ్ళు చల్లుకునే ఆట.

చిమ్మలాడు

నీళ్ళు చల్లుకొను.

చిరంజీవి....

పిల్లలయెడ, చిన్నవారియెడ పెద్ద లుపయోగించే మాట.

"చిరంజీవి కుమారుడు." వా.

ఉత్తరాల్లో చిన్నవారి పేరు ముందుకూడా వ్రాస్తారు.

"చిరంజీవి సుబ్బరావుకు." వా.

చిరతవాలుగా

చిఱుతప్రాయంలో వలె.

కాశీయా. 307.

చిరమరలు

భేదాలు.

"చెలిమి వేర్పాటను చిరమరలకుఁ జొరక."

భార. శాంతి. 1.58.

చిరాకుపడు

విసుగుకొను.

చిరుతలు కవియు

మిరుమిట్లు గొను.

చిరుతలు క్రమ్ము

మిరుమిట్లు గొలుపు.

చిరుతలు వాఱు

మిరుమిట్లు గొలుపు.

చిరునామా

జాబులమీద వ్రాసే విలాసం.

చూ. పై విలాసము.

చిరుపదముల పాకము

చిన్న చిన్న ఉండలుగా గోధుమపిండితో చేసి పాకం లో వేసిన పిండివంట.

హైమ. 6.113.

చిర్నవ్వు

చిఱునవ్వు.

చిఱ్ఱుబుఱ్ఱులు

విసుగు వేసటలు; కోప తాపాలు. జం.

"విసపు రాద యీ చిఱ్ఱుంబుఱ్ఱు లిఁ కేల." గీర. 27.

చిఱ్ఱు ముఱ్ఱాడు

ముందు వెనుక లాడు.

"అరిది సిగ్గులు చిఱ్ఱుముఱ్ఱాడు నోర, చూపుగొనలను..." రాధా. 4.68.

చిఱచిఱలాడు

కోపించు, మండిపడు.

మృ. వి. 3.53.

"పొద్దున్నుంచీ అత్తగారు చిఱచిఱ లాడుతూ ఉంది నాయనా." వా.

చిఱులు వోడుచు

బుసకొట్టు.

పశువులు మొదలగునవి చెల రేగి గంతులు వేయు.

"చిఱుపెండ వెట్టుచుఁ జిఱులు వోద్చు చును." బసవ. పు. 160.

చిఱిగినవి స్తరి

నానాబీభత్సమై పోయినట్టిది.

"వాళ్ళ అమ్మా నాన్నా పోయినప్పటి నుండీ ఆ పిల్లబ్రతుకు చిఱిగిన విస్తరి అయిపోయింది." వా.

**చిటిగోరు**

ఒక రకమైన దుంప.

**చిఱుగాలి**

మందమారుతము.

**చిఱుగూబ**

పైడికంటి అనే పక్షి.

శ. ర.

**చిఱుతగండు**

చిఱుతపులి.

సుగంధి చిఱుత అని కొన్ని కోశాలున్నా వాడుకలో చిఱు తలను చిఱుతగండ్లని సర్వసామాన్యంగా అంటారు.

**చిఱుతనవ్వు**

చిన్ననవ్వు.

**చిఱుతనాడు**

చిన్ననాడు.

**చిఱుతపఱచు**

చిన్నవిగా చేయు.

"అభ్రంకషము లైన యానశిరశ్శృంగ, శృంగాటకము లిట్లు చిఱుతపఱచి."

కాశీ. 2.163.

**చిఱుతపోవు**

1. చిన్నపోవు.

"తఱి దప్పె నైన నిత్తఱి నన్ను నడిగి, చిఱుత పోవుదు వేని."

వర. రా. అయో. పుట. 387. పం. 8.

2. మొక్కపోవు, చిన్నదగు.

"చిఱుత వోయిన మూఁకపటి చెలువుఁ దాల్చి." కాశీ. 1.188.

**చిఱుతిండి**

తినుబండారము. పైతిండి.

**చిఱుతొడ**

పిక్క.

**చిఱునవ్వు**

చిన్ననవ్వు.

**చిఱునాలుక**

కొండనాలుక.

**చిఱుపాలు**

మీగడ.

"చే సురు,క్కను నేయుం జిఱుపాలు వెల్లువుగ నాహారం బిడఁగ."

ఆము. 1.82.

**చిఱుపులి**

చిఱుతపులి.

**చిఱుబంతి పసుపు**

చాయపసుపు.

**చిఱువాడు**

మిగిలిన చిల్లరడబ్బులు.

శుక. 3.117

**చిఱుసాన**

పదును పెట్టే సాన.

**చిఱ్ఱిగొట్టు**

కోపిష్ఠి.

**చిఱ్ఱి చిఱ్ఱి**

తొందర.

**చిఱ్ఱిలు వోడుచు**

తొందరపడు.

**చిఱ్ఱిపట్టె**

ఒక పిల్లల ఆట.

**చిట్టుది**

జత.

**చిట్టు బుట్టు మను**

బుసకొట్టు, కోపించు.

"కట్టిన పులితోలు కడకొంగు సోకక యాc, బోతుతత్తడి చిట్టుబుట్టు మనcగ." హర. 5.16.

**చిట్టు బుస్సను**

కోపపడు – కసరుకొను.

కోపపడుటలోని ధ్వన్యనుకరణము.

"ఆ మండోదరి చిట్టు బుస్సను చుసుగా యాశ్రాంతిగు పోయి యేమేమో వేcడెడు బిడ్డలం గదిసి..." శుక. 3.274.

**చిట్టు మను**

కోపించు.

**చిట్టు ముట్టాడు**

1. చిందఱ వందఱ చేయు.

"క్రొవ్విరు లెక్క చిట్టు ముట్టాడుచు." కుమా. 9.102.

2. పెనగులాడు.

"అనుచుc గొందలపడు కోర్కు లగ్గలించి, చిట్టు ముట్టాడుచుండ నచ్చెలువ చెలువు." భార. విరా. 2.85.

3. చీల్చి చెండాడు.

"చేకొని శవములc జిట్టు ముట్టాడు, కాకఘూకానేకకంకగృధ్రములు." రంగ. రామా. యుద్ధ.

**చిట్టు ముట్టు మను**

కోపించు...

"ఏ నాడు చిట్టుముట్టును లేనుపు నించుక కోపము తాళి లేదు."

విప్రనా. 2.71.

చూ. చిట్టు ముట్టాడు.

**చిలచిల మను**

ధ్వన్యనుకరణము.

గిలగిలపుష్పాలు ఎండిన పేట్లు

వేగునప్పుడు సగు ధ్వని

సూచిస్తుంది – ఇక్కడ:

"సిరి నందప్పుటను లోకంత చిల చిల మని వేగిరము వలువట్టుగొనc గడుc, బాగలెడి తరలంత్తే లేపనుం గని కలcకక." కళా. 6.255.

**చిలపలు పలపలు చేయు**

ఒకరికొకరు నగుబాటు కల్పించు.

"కోడలు ఏదో అన్నదని చిలపలు పలపలు చేసి వాళ్ళత్త కొడుకుతో కొట్టించింది." వా.

**చిలివిలివోవు**

1. ఎక్కువగు, సుళ్ళుతిరుగు.

"చిలివిలివోవు మచ్చికలు పిచ్చిల్ల." పండితా. ద్వితీ. మహి. పుట. 133.

"చిలివిలివోవు కోరికలు చిత్తమునం దల లెత్త." విక్ర. 4.224.

2. బలపడు; దట్టమగు.

"మానితభక్తి సామ్రాజ్యసంపదలు, సిలివిలి వోవ." బస. ప్రథ. పుట. 2.

"శివభక్తి సంపదల్ సిలివిలి వోవ." బస. 7.196.

**చిలివిసము**

పనికిమాలిన పని.

"చిలివిసంబులు కొన్ని చేయుచున్నాcడు." ద్వి. పరమ. 5.361.

**చిలుకకొట్టు**

చిలుక కొట్టిన. లోపలి సారము పీల్చి వేయబడిన కాయ.

"ఈ చిలుకకొట్టు తిట్లను మండిగల వైచి యాతండు గాడిద్రొక్కుపై వేయించును."

సాక్షి. 267. పు. 3. పం.

"ఈసారి మాయింట్లో సగం కాయలు చిలుకకొట్టులే." వా.

**చిలుకకొట్టుడు**

పిల్లలు ఏదైనా తింటున్నది మరొకరికి పంచి పెట్టేటప్పుడు, ఎంగిలి కాకుండా పైన, ఏ బట్టో ముక్కుకుపైన బట్ట వేసి కొరికి, ఆ ముక్క ఇస్తారు. దానిని చిలుకకొట్టుడు, చిలుక కొరుకుడు అంటారు.

చూ. కాకియెంగిలి.

**చిలుకకొయ్య**

బట్టలు తగిలించుట కైన కఱ్ఱ ముక్క.

**చిలుకగోణము**

అతుకులగోచి.

బ్రౌ.

**చిలుక, గోరువంకవలె నుండు**

అన్యోన్యంగా ఉండు.

ముఖ్యంగా దంపతుల విషయంలో ఉపయోగిస్తారు.

"వాళ్లిద్దరూ చిలకా గోరువంకల్లాగా కాపరం చేస్తుంటే చూడ ముచ్చటవుతుంది." వా.

**చిలుకచదువు**

చెప్పిన మాట మాత్రమే చెప్పుట. స్వబుద్ధి రాహిత్యమును తెలుపు పలుకుబడి.

"చిలుకచదు వనుట చదివిన ములుచక..." కళా. 6.270.

చూ. చిలుకపలుకులు.

**చిలుకతాళి**

ఒకరకమైన పతకము.

**చిలుక నక్కున బెట్ట చెక్కు సెమర్చు**

సుకుమార మయిన.

చిలుకను కూడ నోయ లేనిదనుట.

"చిలుక నక్కునఁ బెట్టఁ జెక్కు సెమర్చు, నెలనాఁగ నందను నెల్లి తెచ్చె." గౌర. హరి. ప్ర. 1597-98.

**చిలుకపలుకులు**

విన్నమాటలు.

స్వాలోచనా రహితము లనుట.

"వాడి వన్నీ వట్టి చిలక పలుకులు. వాళ్లమామ ఏది చెప్తే అదే." వా.

**చిలుక పోయిన పంజరము**

వ్యర్థము.

చిలుకే లేనప్పుడు పంజర మెందుకు అనుటపై వచ్చిన పలుకుబడి.

"చిత్త మెల్లం జెడి యుండ రిత్త యొడలం జవి చేరునె చిల్క పోయినం, బంజర మేమి సేయు." ఉ. హరి. 1.72.

చిలుకముక్కు
1. చిలుక ముక్కు వంటి ముక్కు.
2. ధాన్యవిశేషం.
3. ఒక చెట్టు.

చిలుక మెట్టని ఫలములు
చిలుక కొట్టని పండ్లు.
"చిలుక మెట్టని ఫలంబులు కోసికొని వచ్చి, పరికించి యారగింపఁ బెట్ట... వేడ్క యర్యుడు." శివ. 3.55.

చిలుకయారె
చెప్పులు కుట్టే సూది.

చిలుకలకొలికి
సుందరి.
నైష. 8.50.

చిలుకలకొల్కి
అందగత్తె.
"చిలుకలకొల్కి కల్కి యొక చేడియ నాటకసాల మేడపై." మను. 5.68.

చిలుకుటమ్ము
ఒకరకమైన బాణము.

చిలుకుడు గుంజ
పెరుగు చిలుకునప్పుడు కవ్వం కట్టే గుంజ.

చిలుప చిలుపను
చిలచిల మను.
ధ్వన్యనుకరణము.
"చిలుప చిలుపని నేతులు జిడ్డు దేఱు, నేమి చెప్పుదుఁ గ్రొవ్విన యేకలములు." మను. 4.17.

చిలుపచిలుపగా (నెత్తురులు)
బొళబొళ మని
ధ్వన్యనుకరణము.
"పంతంబులు వదలించితుఁ జిలుప చిలుప నెతురుల జొత్తిల్లిన నేలం గాలూఁద నేరక జీలువాతియు." ఉ. హరి. 43.27.

చిలువానపుమిద్దె
ఉగ్రాణంకొట్టిడీ, చిల్లర వంట సామానుంచే గది.
"వంటకొట్టము చిలువాన నుంచిన మిద్దె." శుక. 3.48.

చిలువాయనము
చిల్లర — క్షుద్రము.
పాండు. 2.85.

చిలువాల పాయసము
పాల పరమాన్నం.
చంద్ర. 4. 77.

చిల్కకు చక్కెర వెట్టు
చిలుకకు ఆహార మిచ్చు.
"లలనా! చక్కెర వెట్టవే యనుచుఁ జిల్కల్ సారెకుం బల్కఁగా." రాజగో. 2.10.

చిల్కలకొల్కి
అందగత్తె.
"అనుచుం జిల్కలకొల్కి పల్క విని యత్యానంద మిం పొంద ని, టని యొకా." శుక. 1.493.
చూ. చిలుకలకొల్కి.

చిల్కల చదువులు
అర్థం తెలియని చదువులు.
"చదువు లివి యెల్లఁ జిల్కల చదువు లనుచు." పాండు. 3.36.

**చిల్లకట్టె**

ఒక పిల్లల ఆట. నేటి రూపం చిల్లాకట్టె.

**చిల్లకోల**

ఒక ఆయుధం – బాణము.

**చిల్లతర్కములు**

చిల్లరవాదనములు.

కుతర్కములు, వ్యర్థవాగ్వాదములు.

కుమా. 8.136.

**చిల్లపెంకు మాత్రము**

విలువ లేనిది.

"నా కనఁగాఁ గనకము భామా! కనుఁగొనఁ జిల్లపెంకు మాత్రము దానిన్..." శుక. 1.520.

చూ. గవ్వ చేయనిది.

గుడ్డిగవ్వ చేయనిది.

**చిల్ల పెంచాదిగా**

పూర్తిగా.

చిల్లపెంకు కూడా వదలకుండా అనుట.

"తన యింటి యావత్తు ధనమును మున్న, సంచితం బగువస్తుసమితియుఁ జిల్ల, పెంచాదిగా మట్టగించి తెప్పించి." బసవ. 3.64.

**చిల్లమడ్డి**

ధూపద్రవ్యము.

**చిల్లరకాడు**

సామాన్యుడు.

శ. ర.

**చిల్లరపబ్బములు**

చిన్న చిన్న శుభ కార్యములు.

"చెలియలి పెండ్లి చేసితిరి చిల్లర పబ్బము లెన్ని యైన శోభిలె నను నెన్నఁ డైనఁ బిలిపించితిరే?" శుక. 2.521.

**చిల్లరవారు**

అల్పులు. తక్కువ కులాలవారని పూర్వం అలవాటు.

భాస్కర. 75.

**చిల్లరవెచ్చములు**

పప్పు బియ్యము మొదలయినవి.

చిల్లర సామాను అని రాయలసీమలో వాడుక.

"ఎల్లుండి సమారాధన, చిల్లర వెచ్చములు గొనఁగ శీఘ్రమె యిదె యీ, పల్లియ సంతను..." శుక. 2.183.

**చిల్లు పొల్లు సేయు**

ధ్వంస మొనర్చు.

కృష్ణ. 3.30.

**చిల్లులు పుచ్చు**

బెజ్జాలు పెట్టు.

**చిల్లులు వోవు**

రంధ్రములు పడు.

"చిటిలిన విస్ఫులింగములఁ జిల్లులు వోయె నభఃస్థలంబు." శివ. 1.90.

**చివ చివగా**

గబగబా.

"చివచివన్ రెం డడుగు లెదు రక్కి." కళా. 8.95.

**చివచివ లాడవు**
అరపసరిక లేర్పడు.
రాధ. 4.102.

**చివు కంతయు బోయిన చేవ చిక్కు సమ్మతి**
సారము సింగిలినట్లు.
తాలు పోగా గట్టిగింజలు తేలునట్లు అనుటవంటిది. మాను మధ్యలో చేవ ఉంటుంది. పైభాగమును చిప్ప వేయుగా పసు పోటు చివుకు. అది పోగా చేవే మిగులుతుంది.
"అయ్యతనుని చేతికత్తి చివుకంతయుఁ బోయినఁ జేవ చిక్కుసమ్మతి..."
హంస. 2.138.

**చివుక పిట్ట**
ఒక జాతి గబ్బిలం.
శ. ర.

**చివుకపిల్లి**
ఒక రకమైన పిల్లి.
శ. ర.

**చివుకు చివుక్కను**
మనసు చివుక్కను.
రాధి. 4.102.

**చివుకు చెదార మైన**
బాగా శిథిల మైన.
"చివుకు చెదారపుం ధనువుఁ జీల్చుట కింత మదింప నేటికిన్."
చం. రా. 3.146.

**చివుచుక్కన దాటు**
దాటుటలోని ధ్వన్యనుకరణము.
"...దరిని చివుచుక్కన దాటు వాడులు."
కవిక. 2.70.

**చివుచుక్కన నెక్కు**
ధ్వన్యనుకరణము.
"చక్కను త్రుంకలుకున నంగిసన్రమాని పికిఁ జివుచుక్కన నెక్కి. యబ్బకక్క సక్క..."
హంస. 1.192.

**చిప్పిలు చే సాచు**
కొమ్మెక్కినిది కాలు సాచు.
"చిప్పిలు చే సాఁప వలదు."
కాశీ. 1.109.
కాశీ. 6.180.

**చీ అనే పనులు**
అసహ్యపుపనులు.
ఛీ కొట్టించుకొను స్థితికి తెచ్చే నీచపు పనులు.
మదన. శత. 67.

**చీకటికండ్లు**
వెలుతురు చూడగనే కుంచించుకొని పోవు కన్నులు.
"ఆ చీకటికండ్లవాడికి పిల్ల నెవరిస్తారు?"
వా.
చూ. చీకిరికండ్లు.

**చీకటి చెట్టు**
తమాలవృక్షం.

**చీకటితప్పు**
వ్యభిచారము.
"గౌతమఋషి కులాంగన నహల్యాదేవిఁ, జీకటితప్పు జేసిన దురాత్మ."
వరాహ. 2.156.

"చీఁకటితప్పు చేసిన సరోరుహనేత్ర, గూబ గ్రమ్మ వసియించుఁ గోటరమున."
కాశీ. 2.80.

"అసురవల్లభుఁ డా గౌతమునుమూర్తి యిల్లాలిఁ, జీఁకటితప్పు సేసినవిధంబు."
నైష. 7.151.

## చీకటి త్రవ్వు

1. వ్యర్థప్రయత్నము చేయు.
చీకటిలో సాదవుటాలు [illegible]దే కదా.

"జీవులు నిస్త్రీలుంగక చీఁకటి దవ్వఁగ నేల."
తాళ్ల. సం. 6.182.

2. వ్యర్థాలోచనలు చేయు.

"చీఁకటి ద్రవ్వెద వేలె? గీఱనఁ బలుక వదేలె?"
తాళ్ల. సం. 4.53.

## చీకటిదోసగు

చీకటితప్పు.

"...చీఁకటిం దోసంగులై లలిఁ గగూఢా రయిన గొబ్బునఁ గాంత్రు విరక్తి ముక్తి..."
భాగవతమాహాత్మ్యము.

చూ. చీకటితప్పు.

## చీకటి నెత్తిన వేసుకు వెళ్లు

చీకటిలో వెళ్లు.
కొత్త. 345.

## చీకటి పడు

1. శూన్య మగు, నిస్తేజ మగు.

"చిత్తము చీఁకటి వడెను."
తాళ్ల. సం. 8.50.

2. సాయంత్ర మగు.

"అప్పుడే చీకటి పడింది. ఇంటికి వెళ్ళాలి."
వా.

## చీకటిపాలగు

వ్యర్థ మగు, పాడగు.

"చింద రాని నా బుద్ధి చీఁకటిపాలాయె."
తాళ్ల. సం. 8.30.

## చీకటి మొటికెళ్లు

చీకటి మొట్టికాయలు.
ఒక రకమైన పిల్లల ఆట.

"చీకటి మొటికెళ్లు చిమ్మబిల్లలు."
విష్ణు. 7.202.

చూ. చీకటి మొట్టికాయలు.

## చీకటి మొట్టికాయలు

ఒక పిల్లల ఆట.
తలమీద బట్ట కప్పి మొట్టికాయ మొట్టి, ఎవరు మొట్టిరో తెలుసుకొను మను ఆట.

చూ. చీకటి మొటికెళ్లు.

## చీకటియీగ

చిన్న యీగ.

రూ. చీకటీగ.

## చీకటులు త్రవ్వించు

అనవసరముగా శ్రమపడ జేయు.

"నే, నెవ్వాఁడం బరమాత్మ గాక పిసవెఱ్ఱి! విప్ర! యీ చీఁకటుల్, ద్రవ్వింపం బని లేదు సుమ్ము మము బోంట్లన్ వీరి వారింబలెన్."
వరాహ. 2.18.

చూ. చీకటి త్రవ్వు.

## చీకట్లుకొను

చీకటి పడు.

"గరము భూనభోంతరము చీఁకట్లుగొనియె."
కళా. 4.89.

**చీకట్లు గొలుపు**

అంధకారబంధుర మగు.

"కదన మంతయును జీఁకట్లు గొలుప." జైమి. 2.70.

**చీకాకు చేయు**

చిక్కు పెట్టు; కలత పెట్టు.

"పై మిన్ను ప్రాలినఁ బడదని ధైర్యంబుఁ, గటకటా కలఁచి చీకాకు చేసె." చంద్రా. 4.96.
శుక. 1.170.

**చీకాకు పడు**

1. గందరగోళ పడు.

"ఆశ లే వంకఁ జీకాకు పడెనొ." విప్ర. 3.67.

2. కలత చెందు. శివ. 1.58.

**చీకాకు పఱచు**

కలత పెట్టు; చిక్కు పెట్టు.

"అహితసేనల నెల్లఁ జీకాకు పఱచి." జైమి. 2.28.

**చీకిరికండ్లు**

చూ. చీకటికండ్లు.

**చీకిలిమాకిలిగా**

అడ్డదిడ్డముగా.

"...మదిన్ విచారింపకు చీకిలి మాకిలిగా వల్లిన, చెలఁది తెరల్ నూఁచి సంతసించుట లేదే?" సారం. 1.15.

**చీకుకొక్కెర**

ఒక జాతి కొంగ. శ. ర.

**చీకు పర్వు**

అంధకారబంధుర మగు.

"నభి మంతయుఁ జేకొని చీఁకు పర్వ న, క్రందిన చిహ్నముల్ మఱవఁగా." సింహా. 3.98.

**చీకుబండ**

జాఱుడు బండ.

నిరం. 2.69.

**చీకురాయి**

ఒక జాతి గబ్బిలము; ఇలకోడి.

చూ. చీకురువాయి.

**చీకురువాయి**

చూ. చీకురాయి.

**చీకు లావుకం ద్రొక్కినయట్లు**

కాకతాళీయముగా.

గ్రుడ్డివాడు లావుకను త్రొక్కినట్లు. అనగా యాదృచ్ఛికంగా అనుట.

అంధలావుకన్యాయం అని సంస్కృతంలోనికి ఎక్కినది.

నేటికీ రాయలసీమలో వాడుకలో 'గుడ్డోడు యఱ్ఱెలకను టొక్కినట్టు వాడెట్లెట్లో ఈ ఒక్కసారి గెల్చాడు పందెం' అను రీతిగా ఈ పలుకుబడి వినవస్తుంది.

'ఎఱ్ఱెలక'ను అన్నట్లే 'ఎర్లావుక'ను అనీ అంటారు. కన్నడంలో 'కురుడం లావు గెయుం మెట్టిదంతె' అని సామెత.

“అక్కజమై మహోగ్ర నివహంబు సదుక్తులు మెచ్చఁ జూచినన్, గ్రుక్కఁడమైన సత్కృతి యసిర్భగుఁగా కిలఁ జీకు లాఘవకం, ద్రాక్కిన యట్లు నాటి కాలఁగుల్ పురికొల్పఁగ నంగులోన నో, కొక్కఁడు సత్కవినఁ కృతియుం గృతి యంగుగ వాని మెత్తురే.” కుమా. 1.38.

## చీకు వట్టిన కోల

గ్రుడ్డివాని చేతికఱ్ఱ. ఒకరి సాయము లేనిది నడిపినది.

“భావదేవర! చీఁకు వట్టిన కోల, ఏ వస్తువిధ మొట్టు లింక మందఱికి.” పండితా. ద్వితీ. మహి. పుట. 112.

## చీకువాలు

చీకటి.

“నీలి గుడిపిన క్రియఁ జీకువాలు గవిసె.” కుమా. 8.94.

## చీకొట్టు

చీ-చీ యని దూషించు, తిట్టు.

“చీకొట్టుగు రందములను గుచేలుం డైనన్.” కుచే. 2.32.

## చీటికి మాటికి

1. మాటిమాటికి.

“చీటికి మాటికిన్ నిఖిలజీవులునుం బొనరించుపాపముల్.”

శృం. నైష. 7.76.

2. ప్రతి చిన్నదానికి, అల్ప విషయాలకు.

“అత్తల మామలన్ మగల నన్నలఁ దమ్ములఁ దల్లిదండ్రులన్, బిడ్డల గుడ్డు బెట్టుచును జీటికి మాటికి నన్ను చేరఁగా, వత్తురు మేలు కర్జములు వంతుల కిత్తురు నిండుకౌఁగిటం, గ్రుత్తురు మారుకేళి నను గూడుచు మెత్తురు మత్తచిత్తలై.” దశావ. బల. 328. పు.

“చీటికి మాటికిఁ జెడుదురే బుధులు.”

రంగ. రామా. అర. 155. పు.

“ఆవిడ చీటికి మాటికి తగువుకు వస్తుంది.” వా.

“వాఁడు చీటికి మాటికి అమ్మదగ్గిరికి వెళ్లి ఫిర్యాదు చేస్తాడు.” వా.

## చీటి ప్రాయు

ఎదుటివానికంటె ఉన్నతుఁడగు; మించు.

ఉత్తర ప్రత్యుత్తరములు నడుపు అనే వాచ్యార్థంపై ఉత్తరువు లివ్వగలుగు గా సాగినమాట.

“సంభ్రమంబున నాకారసౌష్ఠవమున, వాఁడు కందర్పునకుఁ జీటి ప్రాయఁ గలఁడు.” హంస. 5.204.

“సాత్త్వికో వచ్చు నీ వంటి యందగాని, కన్న దొకచోట నొక మంచి యొఱపు లాఁడి, దాని కిలికించితమ్మునఁ దగిలి నట్టి, వాఁడు దేవేంద్రునకుఁ జీటి ప్రాయఁ గలఁడు.” శుక. 4.179.

## చీడకు చింత గోడకు కోపము

ఇరువైపులా బాధే అనుట.

కృష్ణని. 74.

## చీడపురుగు

1. పంటను పాడుచేసే పురుగు.

“ఈసారి చీడపట్టి పంట పాడయినది.” వా.

2. చేరుపురుగు వంటివాడు.

“ఆ చీడపురుగును నీ వ్యాపారంలో చేర్చుకున్నావా పాడయి పోతావు.”

వా.

**చీడుదబ్బ**

వెదురుబద్దలతో గుమ్మటంలా కట్టిన నేసేవారి పనిముట్టు.
హంస. 2.10.

**చీదకన్నిడు**

శీతకన్ను వేయు, నిర్లక్ష్యము చేయు.
"బహువిధంబులఁ బలుకు నా పలుకు లెల్లఁ, జీదకన్నిడి తన పెడచెవులఁ బెట్టి." భార. ఉద్యో. 4.76.

**చీదర చెందు**

చికాకుపడు.
"ఇందీవరభ్రాంతిచే, మొలఁగం జేరలఁ గప్పుకో నలవి గామిం జీదరం జెందె."
పారి. 4.14.

**చీదఱలు గొలుపు**

చీకాకు పెట్టు.
"శంఖభేరీరావములు దిగ్దంతుల చెవులు చీఁదఱలు గొలుప."
జైమి. 5.3.

**చీదఱ వాపు**

దుఃఖము తీర్చు; చికాకు, కలత తొలగించు.
కుమా. 8.159.

**చీది వేయు**

ఏడ్చు.
"ఏమిట్రా! మీ అక్క చీది వేస్తూ కూర్చుంది?" వా.

**చీనకర్పూరము**

ఒక విధమైన కర్పూరం.

**చీనాచక్కెర**

ఒక రకమైన చక్కెర.

**చీనాపంచదార**

ఒక రకమైన చక్కెర.

**చీనిచక్కెర**

ఒకరకమైన పంచదార.
"ఒక్కొక్కయెడఁ జీని చక్కెర పానకం, బానిన ట్రాగ్లాద మావతీంల."
రాజగో. 1.18.
రూ. చీనాచక్కెర.

**చీనిపావడా**

మంచి పావడా.
చీనాంబరం లాంటిదే. చీనా దేశంనుంచి వచ్చే బట్ట ఆ నాడు సున్నితమై వచ్చిన మాట లిపి.
"కోడవులు ఫుచ్చి నిగ్గరవఘంటులు చేలుపు మాని చీని పావడలు ధరించి." పారి. 4.24.

**చీనిపిష్టము**

సింధూరము.

**చీనీలు**

ఒక రకమైన బట్టలు.
ప్రబంధ. 615.

**చీపురుకట్ట తిరుగ వేయు**

దండించు; అవమానించు – ముఖ్యంగా స్త్రీ.
"ఆ పిల్లను అదీ యిదీ అన్నావంటే చీపురుకట్ట తిరగ వేస్తుంది." వా.

**చీపురుకట్ట సరసం**

మోటుసరసం.
"వాళ్ల దంతా చీపురుకట్ట సరసం లే." వా.

**చీమంత**

కొంచెము. కాసంత.

చీమ అన్నిటికన్న చిన్నది కదా - అంత అనుట.

"చీమంత గ్గున వంచింపని బాస."

బస. 2.28. పు.

నా. కాసంత, చింతాకంత.

**చీమంతపు (కై కొనదు)**

కొంచెము కూడా (లెక్క-పెట్టడు.)

"చీమంతకుఁ గైకొనఁ డసుర, భటాంతకవిక్రాంతి." కుమా. 11.89.

**చీమకండ్లు**

చిన్నకండ్లు.

**చీమ కుట్టినట్టైన లేదు**

ఏకొంచెము బాధ కూడా లేదు.

ఏ కొంచెము లెక్క- లే దనుట.

"దీని గూర్చి మనము నిర్లక్ష్యముగఁ జూచుచున్నారము. మన కేమో చీమ కుట్టినట్టైన లేకుండ నున్నది."

సాక్షి. 60. పు.

వాడుకలో రూపం - చీమ కుట్టినట్టైనా లేదు.

"వాడికి ఇంతమంది యిన్ని మాటలంటుంటే చీమ కుట్టినట్టయినా లేదు." వా.

**చీమగంగాయాత్ర**

అసంభవము.

తెగనిది, నెఱవేఱనిది.

**చీమచింత**

ఒక రకమైన చెట్టు.

**చీమ చిటు కనకుండ**

ఏమాత్రం శబ్దము కాకుండ.

"చీమ చిటు కనకుండఁగఁ జిత్రపటము, వెంటఁ గళ దేల్పకై వడి......"

సుదక్షి. 4.117.

**చీమ చిటు కన్నను**

ఏమాత్రం అలికిడి అయినా.

"ఆలు బిడ్డ లే, కరయని రేలుఁ జీమ చిటు కన్నను విప్పనిమూఁకలున్."

ఉ. హరి. 1.131.

వాడుకలో కూడా ఉంది.

"చీమ చిటుక్కు- మన్నప్పు డల్లా వాడు వస్తున్నా డేమో నని చూచాను." వా.

**చీమ చిటుక్కు- మన్న, చిమ్మట జిట్టన్న**

ఏమాత్రం అలికిడి అయినా.

"చీమ చిటుక్కు- మన్న వినుఁ జిమ్మట జిట్టిన నేఁగునంతలో."

హంస. 3.40.

**చీమ చిటుక్కు- మన్న చిమ్మట బుట్టన్న**

ఏమాత్రం అలికిడి అయినా.

"చీమ చిటుకు మన్న చిమ్మెట బుట్టన్న, నెదుర మూషికములు మొదలుకొనిన."

పంచ. వేం. 4.168. పు.

**చీమచిప్పర**

ఒక రకమైన గడ్డి.

**చీమపరి లాగా**

చీమల బారు వలె (చుట్టుముట్టు.)

"రయ సముద్ధూత ధూళి ధూసరిత ధారాధర పథం బగుచు నొక్క-

పరియు చీమపరి యనన్ గవిసె నంగు."
మను. 4.110.

**చీమల గామల వలె**

ఇంటినిండుగా.

చీమలు గామలు. జం.

"మా యింటి ముందటను, గలగాని చీమల గామలవలెను, జెలఁగుచు ముందర శిశువు లాడఁగను."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1890-91.

**చీమలబారు వలె**

అల్పముగా.

"ఆతని మదికిన్ భవద్బలవితానము చీమలబారుఁ బోలె నై, కనఁబడు."
శుక. 3.387.

**చీమలు దూరని**

దట్టమైన.
అతి చిన్నదైన.
చీమ పట్టుటకైనా వీలు లేనంత దట్టమైన దనుట.
చీమలు దూరని చిట్టడవి కాకులు దూరని కారడవి – జానపదగాథలలో సామాన్యంగా వచ్చే పలుకుబడి.

"చీమలు దూఱని చీఁకటి కాన, సర సునఁ గొనిపోయి సారంగధరుని."
సారం. ద్వి. 2.88.

**చీమవలె కూడబెట్టు**

మిక్కిలి జాగ్రత్తగా దమ్మిడీ దమ్మిడీ కూడబెట్టు. ప్రతి చిన్నదానినీ సంపాదించి చీమ కూడబెట్టు నను టపై వచ్చినది.

"బిడ్డల కోసఁగక పెండ్లాము కిడక, వట్టి కద్భుతముఁ జీమవలెఁ గూడఁ బెట్టి."
గౌర. హరి. 2.1661.

**చీము నెత్తురు ఉంటే**

పౌరుషం ఉంటే – స్వాభిమానం ఉంటే.

"నా డబ్బు మాట అంటగా ఉంటే చీమూ నెత్తురూ ఉన్నవాడయితే బయటికి రాకుండా ఇంట్లో దూరు కొంటాడా?"
వా.

**చీము నెత్తురు ధారపోయు**

త్యాగము చేయు, ఎన్ని శ్రమలకైనా ఓర్చు.

"ఆ సంసారం కోసం వాడు తన చీమూ నెత్తురూ ధారపోశాడంటే నమ్ము."
వా.

**చీము నెత్తురు లేని....**

ఏ మాత్రం స్వాభిమానం, ఆత్మగౌరవం లేని.

"వాణ్ణన్ని ఏం లాభం? చీము నెత్తురు లేని వాడు. ఏమన్నా పడతాడు."
వా.

**చీము పట్టు**

కురుపులు మొదలైనవానిలో చీము చేరు.

"కొబ్బెరా పప్పూ తినకురా. చీము పడుతుంది."
వా.

**చీము పోయు**

చీము పట్టు.

"చీము పోసి కురుపు నొప్పి చేసింది."
వా.

**చీములు గట్టు**

బాధ చెందు.

ముఖ్యంగా విసనగూడని వి
వినుటవల్ల.
"పుడమి జనంబు లెల్ల నినుc బ్రువ్వగc
దిట్టcగ వించు నుక్క నా, చ్చెదు మది
రోయస్పుడున్ చెవులు చీములు గట్టెడు."
భార. ద్రో. 2.10.

చీమూ నెత్తురు ఉన్న శరీరం
కామ క్రోధాదుల లకుంపటు
మానవసహజ లక్షణాలకు లోప్పు దను
పట్ల అనే మాట.
"పాపం సముద్రం కాక ముందు నుండ
మోసిన పిల్ల. అది మాత్రం ఏం
చేస్తుంది? చీమూ నెత్తురూ ఉన్న
శరీరం..." వా.

చీరచాప
తెరచాప.
బ్రౌన్.

చీరచింపు
ఒక రకం చేప.

చీర చిక్కు
గర్భము ధరించు.
నెలలు అయినకొలదీ కడుపు
పెరగడం, ఫలస్వరూపంగా చీర
తక్కువపడడం మీద ఏర్పడిన
పలుకుబడి.
"చీట్లుముట్ల్, రాముడు సంభవించె నఖి
రామతరంబుగc జీర చిక్కనన్."
హంస. 2.93.
"పాయనిసంద నుండి యడపా దడపా
చనుదెంచు భోగునిం, భోగునc జీర
చిక్క దcట పుణ్యము లేదని మాన
సంబునన్."
పంచ. (వెం.) 1.56. పు.

"నెలగర్భాలనc జీర చిక్కc ద్రిజగ
న్నిర్మాత యిల్లాలికిన్."
కా. మా. 2.80.

చీరపిట్ట
చీరపేను.
బ్రౌ.

చీర పెట్టు
ఒక చీరను కానుకగా ఇచ్చు.
"తన భార్య తద్దినానికి ఏటా ఎవరో
ఒక ముత్తైదువకు చీర పెట్టడం అతనికి
అలవాటు." వా.

చీరపేను
తెల్లని పేను.
ఈ పేలు పట్టడం దరిద్ర మని
అంటారు.
భార. అను. 5.54.
"ఆ చీరపేలు పడిన వెధవను లోపలి
కెందుకు రానిచ్చార్రా." వా.
చూ. చీరపోతు.

చీరపోతు
చీరపేను.
వాడుకలో—
చీరపోతు అనే రూపం ఎక్కు
వగా వినవస్తుంది.
బ్రౌ.
చూ. చీర పేను.

చీర వేయు
మగడు చనిపోయినప్పుడు
పుట్టింటివారు రేవులో విధవకు
కొత్తచీరను ఇచ్చు.
"అంతమంది అన్నదమ్ములుండీ
ఆ విడకు చీర వేసేదిక్కయినా లేక
పోయారు." వా.

చీరా రవికా పెట్టు

చీర, రవిక కానుకగా ఇచ్చు.

"పెండ్లికి వచ్చిన ముత్తైదువ లందరికీ చీరా రవికా పెట్టారు." వా.

చీ రావిగొను

కంటికి దెబ్బ తగులగా బట్టను మడిచి నోటిలో ఆవిరిపట్టి కంటిని కాపు.

"చీ రావిగొని కంటఁ జేర్చి పొత్తించి."
బస. 3.84. పు.

చీరికి గైకొను

లక్ష్యపెట్టు.
శివ. 4.61.

చీరికి గొను

లెక్కించు, లక్ష్యపెట్టు.

"నృపాలుండు భరకేతరుం డయిన శత్రుల్ చీరికిం గొండు రే."
ఉత్త. రా. 7.69.

"కాముం జీరికిఁ గోక."
హర. 5.38.
చూ. చీరికి గైకొను.

చీరువాఱు

పిలుచు; జీరాడు.

అర్థ మింకనూ విచార్యము.

"సిగ్గుముఱుంగునఁ జీరువాఱు."
శ్రీరాధా. 5.147.

చీలమండ

పాదంపైన పిక్క క్రింద ఉండే గుల్ఫము.

చీలమన్ను పూయు

పుటం పెట్టేటప్పుడు రెండు మూకుళ్ళు మూసి నడుమ [illegible] గుడ్డచుట్టి మన్ను పూస్తారు.

[illegible]

తీసిని ఉపయోగిస్తారు.

చీలిగాడు

పిల్లి.

చీవాట్లమారి

చీవాట్లు తినువాడు. [illegible].

"ధర్మవిదుఁడైన రాజు నా స్థానమునను, జేసు [illegible] చీవాట్లమారి నంత."
హంస. 5.113.

చీవాట్లు తిను

తిట్లు తిను.

చీవాట్లు పడు

తిట్లు తిను.

చీవాట్లు పెట్టు

తిట్టు, దండించు.

"ఆయనదగ్గరికి వెడితే నాలుగు చీవాట్లు పెట్టి పంపిస్తాడు. వెళ్ళు." వా.

చీశితవెట్టు

తొలగించు, రాల్చు.

"నాలుగ డాలు వాని దళవాయి వసంతుఁడు శైత్రయాత్రకై, సాలములందు జీర్ణదళసంఘము చీశితవెట్టి క్రొత్తగా, మేలిదళంబులన్ నిలిపి."
తారా. శ. 2.112.

చుంగులువాఱు

కొంగులు, అంచులు వ్రేలాడు.

"చందనపు టంచు దుప్పటి, సుందరి యొక్కర్తు గట్టి చుంగులువాఱన్."
చంద్రా. 6.15.

**చుంచురుట్టి**
చిన్నవాడు.
"ఇల్లాకపట్టునం గడచి యేఁగగ నేరని చుంచుకుట్టిలన్."
అప్ప. రా. బా. 104.

**చుంచుమిద్దె**
ముందుకు చూరులు వచ్చునట్లుగా కట్టిన మిద్దె.

**చుంచుపాయి**
మిద్దె కైన పలకపాయి.
బ్రౌ.

**చుంచెలుక**
చుంచు.
చూ. మండెలుక.

**చుంద్రాళ్ళు**
ఒక పిల్లల ఆట.

**చుక్కకాడ**
నూరగాణిలో వెలిచే ఒక ముక్క.
బ్రౌ.

**చుక్కచేరు**
నుదుట ప్రేలాడగా తలపై ఉంచే నగ.

**చుక్క తెగి పడినట్లు**
అకస్మాత్తుగా.
"...అంతం జుక్క తెగి పడిన వడువున నెక్కడ నుండియో యాకస్మికంబుగ నింటికిం జలిఁది వంటకంబుఁ గుడువం జనుదెంచి."
పాండు. 3.24.

**చుక్కబొట్టు**
చుక్క.

**చుక్కయెదురు**
ప్రతికూలము; చెడు కలిగించునది.
జ్యోతిశ్శాస్త్ర రీత్యా వచ్చిన పలుకుబడి.
శుక్రుడు ఎదురుగా ఉండగా ప్రయాణాదులు చేయరాదని శాస్త్ర విధి. తద్వారా ప్రతికూల మనుటగా మారినది.
"దైత్యావరోధ నదయితాధరములతోఁ, సొబగుపిడెములకుఁ జుక్కయెదురు."
ఉ. హరి. 3.147.
చూ. ఎదురుచుక్క, చుక్కెదురు.

**చుక్కలను జూచి కుక్కలు మొరిగినట్లు**
గొప్పవారిని చూచి నీచులు ఆడిపోసుకొన్నా, దూషించినా లెక్కేమిటి అనుట.
శరభాంక. 47.

**చుక్కలు గోరాడు**
మిన్నంటు.
"చుక్కలు గోరాడుచున్న పుమేడలు."
వర. రా. అయో. పు. 328. పంక్తి. 6.

**చుక్కల్లోకి చూచు**
గర్వమును ప్రదర్శించు.
కాత్త. 14.

**చుక్కవాలు**
ఎదురుచుక్క.
విరోధ అనుట.

"అమరగుల భోనపుత్రికి సహస్ర మయూఖుని జోడు కోడె సంతమసము వేరువిత్తు కుముదంబుల పక్కి లిగింత పుంశ్చలీ, సమితికిఁ జక్కిపాలు నవసారస లక్ష్మి కొలంగుగాఁగ [illegible] ములకు గుండెతల్లడము సేగవ మిత్రుఁడు దోఁచెఁ దూర్పునన్."
పారి. 2.41.

**చుక్కెదురు**
ప్రతికూలము.
"పాపములకను చుక్కెదురు కాశి."
కాశీ. 7.215.
చూ. చుక్కయెదురు; ఎదురుచుక్క.

**చుచ్చులు కైస**
మిక్కిలి తక్కువ మోసు.
"చుచ్చులుకు పలుకులు."
రామా. 5.199.

**చుటుక్కు మను**
ధ్వన్యనుకరణము.

**చుట్టకుదురు**
కుండలు బిందెలు ఉంచే కుదురు.
భీమ. 4.49.

**చుట్టగు**
దూర మగు.
ముఖ్యంగా దారి విషయంలో ఉపయోగిస్తారు.
"ఎంచఁగ నా గమనమునకు, నించుక చుట్టయిన నయ్యె నిది." కళా. 2.4.
వాడుకలో——
"కాశీకి బెజవాడనుండీ కలకత్తామీద పోతే చాలా చుట్టవుతుంది. ఇటార్సీ మీద పోతే చాలా దగ్గఱ." వా.

"ఆ గని చుట్టు దారి. ఈ దారిలో పోవద్దు." వా.
చూ. చుట్టుదారి.

**చుట్టపక్కాయిలు**
బంధుమిత్రులు. జం.
"[illegible]"
అం. రా. 3.85.
చూ. చుట్టపక్కాలు.

**చుట్టపక్కాలు**
బంధుమిత్రులు.
"చుట్టపక్కాలకు శుభపత్రికలు వ్రాసె." గాథ. 1.70.
చూ. చుట్టపక్కములు.

**చుట్టపు చూపుగా**
బంధుమాత్రంగా.
ఏదో చూచి పోవాలని.
"వా డేదో చుట్టపుచూపుగా వస్తే నీవు పని చేయిస్తున్నా వేమిట్రా ?" వా.

**చుట్టపుదనము**
బంధుత్వము.
భార. స్త్రీ. 2.108.

**చుట్టపుబగలు**
సొంతశత్రువులు.
తాళ్ల. సం. 12.198.

**చుట్టపు మేలము**
బంధురీత్యా చేసే హాస్యము.
"అట్టి సురతమువు తెలుఁగక, చుట్టపు మేలమునఁ గొంచు సురిఁగెడువాడి."
పారి. 4.57.

**చుట్టపువాడు**

బంధువు.

**చుట్టము పక్కము**

బంధువర్గము. జా.

"నీవ చుట్టంబుఁ బక్కంబు నీవ చెలియు." భాగ. శాం. 1.

"తనకుఁ జుట్టంబు పక్కంబు తల్లి దండ్రు, లన్నదమ్ములు మనుమలు నాలు బిడ్డ, లెల్లనల్లుండ్రు నిల్లండ్రు మల్లసెల్ల, వనితయుఁ గుబేరసంపద నతిశయిల్లు." బహు. 5.64. సీ.

"వానికొక చుట్టము పక్కము లేడు." వా.

**చుట్టముల సురభి**

బంధుప్రియుఁడు.

చుట్టాల [illegible] వాఁడు.

"చుట్టముల సురభి నీవని, భట్టికిఁ దగఁ బ్రియము చెప్పి పంకజనయనా, పట్టాంశుకసుశోభా హా, ఘటజహయ గంధసింధురంబుల నొసఁగెన్." విక్ర. 4.191.

చూ. చుట్టాల సురభి.

**చుట్టలపై దాడి వెట్టు**

బంధువుల యిండ్లపై పడు.

వారి యిండ్లలో తిష్ఠ వేయు.

"ఒలఁబడ్డ నెనరునఁ గల లేని సిరిఁ జెప్పి, చుట్టలపై దాడి వెట్టువారు." ఆను. 7.21.

**చుట్టలు గొను**

చుట్టుకొను.

ద్వాద. 5.74.

**చుట్టాలసురభి**

బంధుప్రీతి కలవాడు.

"బంటు నొచ్చిన నోరఁ బలుకండు నెఱ వాది, సుఖభోగి చుట్టాల సురభి...." ఉ. హరి. 5.278.

"చుట్టాల సురభియై సొబఁగు నొందదె నా కాని." పాండు. 1.67.

"చుట్టాలసురభికి సుందరీమణికి." గౌ. హరి. ప్ర. పంక్తి. 40.

చూ. చుట్టముల సురభి.

**చుట్టాలు పక్కాలు**

బంధువర్గము.

"చుట్టాలఁ బక్కాల జోడని కడకు... రప్పింప." పండితా. ప్రథ. పురా. పుట. 288.

'ఒక చుట్టమూ పక్కమూ వాని కెవరున్నారు' అని విడిగా కూడా వాడుకలో నున్నది.

**చుట్టిల్లు**

గుండ్రంగా నడుమ నిట్రాడు నాటి కట్టిన యిల్లు. శ. ర.

**చుట్టి వచ్చు**

చుట్టుకొని వచ్చు.

ప్రదక్షిణం చేయు.

**చుట్టుకొను**

1. కాకిక్రింద జమ పెట్టుకొను.

"జూదమాడిన పైఁడి చుట్టుకొనిన." కాశీ. 4.99.

2. కౌఁగిలించు.

"వాడు ఇంట్లో నాలుగు రోజులు చుట్టపు చూపుగా ఉండి చేతి కందిన వస్తువులను చుట్టుకొని పోయినాడు." వా.

3. క్రమ్ము, వ్యాపించు; పొలబడు.

"విధాత్ర మఘమహాస్థలం జుట్టుకొన్న యజ్ఞానతిమిరంబు." కాశీ. 5.100.

"ఇల్లంతా పొగ చుట్టుకొన్నది." వా.

"వీళ్ల నాన్న నాగుబామును చంపాడట. పాపం వీణ్ణి చుట్టుకొంది. అంచేతే వీడికి సంతానం కలుగ లేదు." వా.

**చుట్టు కొల్లారము**
చుట్టు బవంతి.

**చుట్టుగత్తి**
చక్రము.

"చుట్టుం, గత్తిన్ మధుకైటభాగు కంఠము లలనాఁ, డొత్తిన." పాండు. 2.33.

చూ. చుట్టుకదువు.

**చుట్టుగుల్ల**
శంఖం.

బ్రౌన్.

**చుట్టు గొల్లారము**
నడుమ ఖాళీ, చుట్టూ కట్టడం గల యిల్లు.

**చుట్టు చవికె**
చుట్టిల్లు.

**చుట్టుదారి**
దూరం దారి.

"అలా వెడితే ఎలా. చుట్టు దారి అది." వా.

చూ. చుట్టగు.

**చుట్టుపట్టు**
సమీపప్రాంతం, వాడుకలో రూపం— చుట్టుపట్లు.

"చుట్టు పట్టున సెట్టి పెట్టిదంబు సింగంబులుం జన వెఱచు." కాశీ. 3.82.

**చుట్టుపట్ల**
సమీపప్రాంతంలో.

"ఈ చుట్టుపట్ల అంత ధనవంతు లెవరూ లేరు." వా.

**చుట్టుబవంతి**
చూ. చుట్టిల్లు.

**చుట్టుమాలె**
చుట్టు బవంతి.

**చుట్టుముట్టు**
చుట్టుకొను. చుట్టుకొని పట్టుకొను.

"సుడివడ్డ చాములఁ జుట్టుముట్టి." జైమి. 1.45.

**చుట్టు ముట్టుకొను**
ముట్టడించు.

"ఈ, స్వేతుగఁ జుట్టు ముట్టుకొని యీఁటెల డొంకెనలం గట్టిన్ల బిల్కతుల నత్తలంబులను." కళా. 8.58.

**చుట్టు వడు**
పెనగొను.

**చుట్టువారుకొను**
క్రమ్ముకొను.

సారం. 3.28.

**చుట్టువాఱు**
చుట్టుకొను, ముట్టడించు.

**చుట్టెంట**
(చుట్టు + వెంట) తిరిగిన చోటెల్లా.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 460.

**చుట్లబెట్టు**

తిరుగు. ప్రదక్షిణము చేయు; తిప్పలు పెట్టు.

"విభవ మానసపడి గిరిని, నీ వంత చుట్లఁ బెట్టినఁ, బోవునె పాపంబు." సిగంధ. 4.111.

"పాలచేగలు వట్టి పాలింప బలిసి నీ,డ్పుకొని కొండలఁ దూఱి చుట్ల బెట్టు." మను. 4.42.

వాడుకలో—

చుట్టబెట్టు అనే వినవస్తుంది.

"వాడు ఊరంతా చుట్టబెడు తున్నాడు." వా.

"మా గుళ్లు చుట్టబెడితే యేం లాభం? అక్కడికి వెళ్లి నేను చెప్పినట్లు చేయి." వా.

రూ. చుట్టబెట్టు.

**చుట్లు వెట్టు**

పరిభ్రమించు.

దూరముగా పోక, అక్కడక్కడనే తిరుగు.

"వీటి వాకిటిచోటనే విడువ కెప్పుడు, సుట్లు వెట్టుచు నుందురు సోమరవులు." ఆము. 2.10.

**చుప్పనాతి**

చూ. చుప్పనాతి, శూర్పణఖ.

**చుప్పనాతి శూర్పణఖ**

పైకి అమాయకురాలుగా కనబడినా మాయలాడి.

చుప్పనాతి అన్నా శూర్పణఖ అన్నా ఒక్కటే.

"ఆ చుప్పనాతి శూర్పణఖ మెల్ల మెల్లగానే వాణ్ణి మాట కాకుండా చేసింది." వా.

**చుబ్బనచూలి యగు**

సంతృప్తికర మగు.

"లీల నా ముందట నాలేమ వ్రాలనిసినఁ, జూడ్కికిఁ జుబ్బనచూలి గాదె." భార. విరా. 2.86.

**చుబ్బనచూలి లాడు**

కొల్లగొను, తనివి తీరా అనుభవించు.

రామా. 1.45.

**చుమ్మచుట్టు**

కడుపునొప్పి.

**చుమ్మలు చుట్టు**

కడుపులో ప్రేవులు తోడినట్లగు.

విజ. 3.135.

**చుమ్మలువాఱు**

చూ. చుమ్మలు చుట్టు.

**చుయికొట్టు**

చుయ్యి మను.

ధ్వన్యనుకరణము.

**చురక తగిలించు**

నొప్పి తగులునట్లు అను, శాస్తి చేయు.

కొత్త. 15.

**చురకత్తి**

చిన్నకత్తి.

**చురచుర చూచు**

కోపముతో చూచు.

"చురచురం గనుఁగొని."

కవిక. 2.127.

శకుం. 3.143.

**చురచుర వోవు**

మండు.

"అరదము...చురచుర వోయిన."

భార. శల్య. 2.335.

**చురియకాఁడు**

కత్తి పట్టిన సైనికుఁడు.

కుమా. 11.40.

**చుఱచుఱ మను**

చుఱుకు చుఱుక్కు- మను.

"గఱి గఱి నంట తుంట విలుకాని శరంబులు నాఁటుచుండఁగన్, చుఱచుఱఁ గాడ నీవు దయఁ జూడక...."

రాజగో. 1.100.

చుఱ చుఱ చూచు, నాలుక చుఱ చుఱ మను ఇత్యాదులలో రకరకాలుగా ఇది ఉపయుక్త మవుతూ ఉంది.

**చుఱవుచ్చు**

కాల్చు.

**చుఱవుచ్చు**

కాల్చు.

**చుఱ్ఱడచు**

చురుక్కు- మను.

"అడుగులఁ బుష్పాడు లంటి చుఱ్ఱడుచుచో."

కవిక. 3.92.

**చుఱుకు చూపు**

బాధించు, కాల్చు.

"ఈ చొప్పున సేవకుం జుఱుకుఁ జూపుదురే."

జైమి. 4.25.

**చురుకు మను**

ముల్లులాగ గుచ్చుకొనగా బాధ కలుగు.

**చురుకైన**

తెలివి గల, వేగవంతమైన, పదునైన.

**చురుక్కున**

[illegible]

[illegible]

రాధ. 4.102.

**చురుక్కు- మను**

చురుకు కను.

**చురుచూపులు చూచు**

బాగా కాల్చు.

**చురు మను**

నొప్పిపడు.

"మనసు చుఱ్ఱు మనంగన్."

విష్ణుపు. 77.

**చుఱ్ఱువుచ్చు**

బాధించు.

"సామిచ్చి నీ శత్రుఁ జుఱువుచ్చు నను చు."

ద్వి. జగ. పు. 173.

**చులుకగా పలుకు**

చులకన చేసి మాట్లాడు, కించపఱచు.

"చులుకగా నీయయ్యఁ బలుకదు మనుడు."

పండితా. ప్రథ. పురా. పుట. 412.

**చులుకఁ జూచు**

కించపఱుచు, తక్కు-వగా చూచు.

**చులక చేయు**
ఎగురకొట్టు.
"కేతుదండంబులు నఱికి చులుకం జేయుచు రథకసారథిసహితంబుగా."
భార. భీష్మ. 2.71.

**చులకదనము వచ్చు**
అగౌరవం కలుగు.
"కాలగతి సంతివారికి, వాలాయము చులుకదనము వచ్చుట యరుదా."
వేమన.

**చులక నగు**
తేలిక అగు. గౌరవహీన మగు.

**చులకపడు**
సుల్యాసతో కలుగు.

**చులకపాటు**
చులకన, సుల్యాసతో.

**చుల్క నగు**
చులకన అగు.
చులకన వచ్చునప్పుడల్లా చుల్కన అని కూడా అన వచ్చును.

**చుల్కబారు**
తేలిక యగు.
"మానస ముండొక చుల్కబారు."
పాణి. 3.100.

**చుల్లర వెట్టు**
బాధ పెట్టు.
సాంబో. 1.88.

**చువ్వన**
శీఘ్రముగా.

**చువ్వున**
శీఘ్రముగా.

**చూకరుపడు**
దుఃఖించు.

**చూచాయగా**
సూచనాప్రాయముగా.
"ఆ చిన్నెలు పసపసవగాఁ, జూచాయగ విని......" రాధా. 1.6.
"అతను నీసారి యెన్నికలలో నిలబడతాడని చూచాయగా తెలుస్తూ ఉంది."
వా.

**చూచి చూచి**
తెలిసి తెలిసీ, ఉండి ఉండీ...
"ఎట్టు చూచి చూచి యిది పాప మనక యు,య్యాసురవాతఁ ద్రోతు నదయ వృత్తి." భార. ఆది. 6.249.
"చూచి చూచి ఆ ముసలాడికి రత్నం లాంటి పిల్ల నెలా యిచ్చావయ్యా."
వా.

**చూచినట్లు**
స్వయంగా చూచినరీతిగా.
చూడక పోయినా అనుట.
"తావక గుణంబులు చూచినయట్లు గట్టిగఁ." కళా. 4.132.

**చూచుకొను**
గమనించు.
"నిను విచారించవు నినుఁ జూచుకొనవు." ద్విప. మధు. 5.
"ముందూ వెనుకా చూచుకొని నడవాలయ్యా." వా.

**చూచుకో....**
చూస్తువు గాని లే. బెదిరింపు.
"చూచుకో, నిన్నేం చేస్తానో!" వా.

**చూచెదము**

చూతాము లే.

వాడుకలో—

"వా డెట్లా ఇవ్వక పోతాడో చూ తాము." వా.

"వా డేం చేస్తాడో చూస్తాంగా." వా.

**చూడ గను**

దర్శనభాగ్యము పొందు.

"వైకుంఠుండు భూభేదన, క్రీడాలం పటుఁ డయ్యు మీపదము వీక్షింపంగ లేఁ డయ్యె నేఁ, జూడం గంటి." కా. మా. 1.132.

**చూడగల వాడు**

అందమైన వాడు.

"చూడఁగల వాఁడు మే లైనసొబగు వాఁడు." విజ. 2.164.

**చూడగా చూడగా**

చూస్తూ ఉండగనే.

"రవికరతాప మాఱెఁ, జూడఁ జూడంగఁ దారకస్ఫురణ దాఁటె." మను. 3.23.

**చూడ జూడ**

చూడగా చూడగా.

"చూడఁ జూడఁ బై నెలమెడు వల్ల కోసులును......" కుమా. 6.130.

పరిశీలించినకొద్దీ అనే అర్థంలో నేటికీ వాడుకలో ఉంది.

"చూడగా చూడగా ఇతగాడు కొంప ముంచేట్టు తోస్తుంది." వా.

**చూడ దొడ్డ మంచముకోడు**

పై ఆటోపమే కాని లోపల యేమీ లే దనుట.

"చూడ దొడ్డను మంచముకోడు గాని, యేమి సంపద పార్వతీశ్వరునకు." దశా. వరాహా. 105. పే.

**చూడ నోడు**

చూచుటకు సిగ్గుపడు.

"ఇనుఁడిసుఁ జూడ నోడి తల లెత్తక నీటఁ దడఁబడిబిందుసుం, గని." సారం. 2.31.

**చూడబోయినతీవ కాళ్ళ దగులు**

వెదకబోయినదే ఎదురుపడు దొరుకుట వంటిది.

సుద. 2.64.

**చూడ ముచ్చటగు**

కనువిందగు నగు. దర్శనీయ మగు.

"ఆ అన్నదమ్ము లిద్దరూ కలిసి మెలిసి తిరుగుతుంటే చూడ ముచ్చటవు తుంది." వా.

**చూడు నా దెబ్బ!**

నే నేం చేస్తానో చూచుకో.

పో. చూడు నా ప్రతాపము; చూచుకో.

**చూడు నా ప్రతాపము**

నేను నీకు చెప్పు చేయ గలను అని ప్రకటించుటలో ఉపయోగించు మాట.

వాడుకలోనూ — చూడు నా ప్రతాపం, చూడు నా దెబ్బ — అంటారు.

"సొమ్ము మీఁదట నీకీయఁ జూడు నా ప్రతాప మని పల్కి యుత్సాహచాప మమున." శుక. 3.77.

**చూడు మఱి**

చూడుమా ...; చూడుమువు గాని లే.

"నీ బుద్ధికోలఁది చూడు మఱి." సారం. 3.204.

**చూడు వట్టు లాడు**

నిష్ఠురముట్టించిన కల్లలను పట్టుకొని ఆడు.

"ధర హిమవేగు సుందర సుఖ గిరుల, భరగణంబులు చూడు వట్టు లాడు దురు." పండితా. ప్రథ. వాద. పు. 678.

**చూడ్కి కందు**

కనబడు.

"సూక్ష్మదృష్టి వీక్షించినఁ జూడ్కి కందు." కాశీ. 4.130.

**చూడ్కికి ప్రే గగు**

కష్టదర్శన మగు.

"తెగియుఁ జూడ్కికిఁ జాల ప్రేఁ గగుచుఁ బొలిచె." భార. ద్రోణ. 2.126.

**చూడ్కిపండువు**

నేత్రపర్వము.

విప్ర. 2.14.

**చూడ్కిపండువు అగు**

కనుల పండు వగు.

"అమ్మరు సెలగోలు, సొఁబు లనఁగఁ జూడ్కిపండు వగుచు." పారి. 3.51.

చూ. కన్నులపండువు.

**చూడ్కుల ద్రావు**

అతిప్రేమతో, అత్యాకాంక్షతో చూచు.

"లలితాంగి యవయవములు సూచి మది దని వోవక చూడ్కులఁ ద్రావఁ దలఁచు." కుమా. 5.45.

చూ. కనులతో త్రావు.

**చూడ్కుల పండువు**

కనులపండువు.

"ఆత్మవక్షోమణివేదిఁ బొల్చె సంగఁ జూడ్కుల పండువు సేయు వేంకట, స్వామి కృతార్థుఁ జేయు." పారి. 1.1.

**చూతము గా**

చూస్తాము గా చూస్తాము లే అని నేటివాడుక.

ఒక విధమైన ఉదాసీనభావాన్ని, అసమ్మతినీ సూచించే పలుకుబడి.

'త్రి వాదము సేసి శివమతంబు జయింపఁగా వచ్చెనో? చూతము గా రావింపుము." ఆము. 4.55.

"ఎవడొస్తాడో చూస్తాం గా నిన్ను రక్షించడానికి." వా.

**చూప చెప్ప గలుగు**

వాక్చక్షుగోచరు డగు.

"చూపఁ జెప్పఁ గలభక్తసుజనుఁడవు మాకు." తాళ్ల. సం. 6.60.

**చూపట్టు గలది**

సుందరి.

దర్శనీయురాలు.

"చూపట్టంగల దాన నొంటిమెయి నిచ్చోఁ బోవరా దంచు." శుక. 3.151.

**చూపట్టు**

1. కనబడు.

"అమలమూర్తు లై మీరు మది౯ం జూపట్టెద రేటికి." కై ము. 8.19.

"ప్రసూనంబులుం దమ్మిలనూలుం జూపట్టంగా." గుణ్యాం. 3.225.

2. తోంచు.

"తాలిమి చూపట్టును ధైర్య మునంగ." కావ్యా. 2.38.

3. కలుగు.

"సర్వలక్షణపరిపూర్ణ చారుమూర్తి, పట్టి జాంబవతికిని జూపట్టినపుడు." సాంబో. 4.85.

**చూపడు**

చూపట్టు.

**చూపరి**

రూపవంతుడు.

రూపవతి.

"చూపరుల నెరిద నైనను, నేర్పున సంభోగకేళి నెనయం జూచున్." హంస. 4.147.

**చూపఱు**

చూచువారు.

**చూపఱులు**

చూచువారు.

**చూపి చూపక మునుపె**

వెంటనే.

"మొనసి వెల చూపి చూపక మునుపె వారి, సరకు లమ్ముడు వోయె..." శుక. 2.564.

చూ. అనియను ననక మునుపే.

**చూపెడు**

చూపు.

**చూపి మోపి అను**

సోకులవలె పెట్టి నిందించు — సామాన్యంగా ఆడవాళ్ళు [illegible] [illegible]. [illegible] పెట్టి [illegible] ఎవ [illegible] సంబంధం [illegible].

"వినుము ప్రభావతి [illegible] చెలి [illegible] చూపి మోపి [illegible]." శుక. 2.559.

చూ. సూటిపోటి మాటలు.

**చూపుపట్టుము**

ఆకారపుష్టి, నైవేద్యంనష్టి. చూడడానికి బాగుంటుందే కాని పనికి రానిదని.

"సుకవాసి పనిపంచ చూపుగుల్లయు." గౌ. హరి. ద్వితీ. పం. 1494.

"ఆకారపుష్టి నైవేద్యం నష్టి." సా.

**చూపుడు అయికం**

స్వాధీనం చేయకుండా తనఖా పెట్టుట.

అయికం, తనఖా, అను నామాంతరమున్నవి ఒకొక్క-క్క- ప్రాంతంలో ఒకొక్క-క్క-టి [illegible] ఒకటే.

స్వాధీన ఆయికానికి ఇది వ్యతిరేక మయినది.

"ఆ యిల్లు చూపుడు ఆయికం పెట్టి మూడు వందలు తెచ్చాను." వా.

చూపుడుకొంగు

నీటిలో చేపకై బాగా కనబడు నట్లు నిల్చిన కొంగు.

[illegible] ఒంటికాలిగానే చేపకై వచ్చునట్లు చూస్తారు.

చూపుడుకోల

పలుచని నేల [illegible].

బ్రౌ.

చూపుడుగుర్తు

శ. ర.

చూ. చూపుగుర్తు.

చూపుడు పాట

పాట చూపు.

పాటపడిన ఎద్దు.

ఒకరికి బదులుగా ఒకరిని పాట పెట్టి అప్పు తీసికొనుట అలవాటు.

చూపుడు అనగానే, చూపుడు అనే నామము వంటి [illegible] వంటిదే యిది.

తాళ్ల. సం. 10.112.

"చూపుడుఁబాటఁ జూతఁడు ఋణిఁ, జూపవలయుఁ జూపఁ దేని సొమ్ముదుదఁ దగున్." విజ్ఞా. వ్యవ. 86.

చూపుడువ్రేలు

బొటనవ్రేలి ప్రక్క నేలు.

తర్జని.

చూపు తప్పు

గమనించక పోవు, లక్ష్యపెట్టక పోవు.

"నిండఁద బ్రహ్మయ్య చూపుఁ దప్పి తివా." పండితా. స్వాతీ. మహి. పుట. 214.

చూపులనె చుఱుపుచ్చు

తీక్ష్ణముగా చూచు, చూపుల తోనే కాల్చు.

"వచ్చు రిపుఁ జూపుల నె చుఱు పుచ్చుచు.." ఆము. 3.28.

చూపెట్టుకొని

1. గమనిస్తూ.

"నిజవ్యాఘయం గని తమ్ము నంత నంతఁ జూపెట్టుక వచ్చు నొంటని తమ్మికంటు లని." చంద్రా. 5.63.

2. కాచుకొని; కాపాడు కుంటూ.

"అశోకుని చంద మొంది చూపెట్టుక యుండ నేల." ఉత్త. రా. 5.11.

ఉపేక్షతో చూచు అని వావిళ్ళ ని.

కాని రాయలసీమలో నేటికీ పై అర్థంలోనే ఉంది.

"ఏదో మా నాన్నను చూపెట్టుకొని ఉంటూంది మా అక్క." వా.

చూపోపక

అసూయ పడి.

"చూపోపక." నైష. 6.32.

"విధి నాపాపల ముద్వారఁ దోడ్తోఁ, జూపోపక చంపెఁ దత్ప్రిసూతిదిన ములన్." ఉ. హరి. 2.14.

చూపోపని

అసూయ పడునట్టి.

"క్షితి కెల్ల నిను నభిషిక్తుఁ గావింతు, నందుకుఁ జూపోపనట్టి వారలను."
వర. రా. అయో. పు. 340. పంక్తి. 5.

**చూపోపమి**

అసూయ.

"దివిజద్రుమ ప్రసవంబుఁ గాంచిన సపత్నిం జూచి చూపోపక."
ఆము. 5.74.

**చూపోవు**

ఓర్చుకొను.

"ఆ పసిఁడి గిన్నె యెవ్వరి, చే పడిగెనొ" వీరి నేల సిలుగులఁ బెట్టం, జూపోపరుగా."
విప్ర. 5.28.

**చూపోర్చు**

సహించు.

చూపోపమికి వ్యతిరేక మయినది.

"ఒకరి మేలునకుఁ జూపోర్చినవాఁడు."
వర. రా. అయో. పు. 247. పంక్తి. 14.

**చూరకత్తి**

ఒక రకమైన కత్తి.

**చూరనాడు**

కొల్లగొను.

"ప్రచండకుసుమ, కాండ భండనమున సరికట్టఁ బెనఁగి, సుప్తిఁ బొందిరి తెమ్మెరల్ చూరనాడ."
శుక. 2.69.

**చూరుకత్తి**

ఒక రకమైన చిన్నకత్తి.
బ్రౌన్.

**చూరుకమ్మి**

ఇంటి ఆకుకప్పుకు పైన ఎగిరి పోకుండా కట్టే పట్టె.

**చూరుపట్టు**

ఇంటికప్పుయొక్క ఆకు చివ్వనకు కట్టే కట్టు.

**చూరుపట్టుపట్టి**

చూ. చూరుపట్టుబద్ద.

**చూరుపట్టుబద్ద**

చూరు కట్టే సన్నరుబద్ద.

**చూరు పట్టుకొని వేలాడు**

ఎంత తిరస్కరించినా వారినిగూర్చి వదలక వచ్చువారి యెడల ఉపయోగించే మాట.

"వాఁడు అత్తగారింట్లో ఎన్ని మాటలన్నా పడి ఉన్నాడు. మెడ బట్టి తోస్తే చూరు పట్టుకొని వేలాడే రకం."
వా.

**చూరుపట్టె**

చూరుకఱ్ఱ.

**చూరుమొగ్గ**

చూరుపట్టెపై కూర్చిన-చెక్కపని చేసిన-మొగ్గ.

శై. మి. 5.157.

**చూరెలుక**

ఒక రకమైన ఎలుక.

**చూర్ణము సేయు**

నాశము చేయు.

"దుష్టసత్త్వముల్, ధారుణి నేపు రేఁగి బెడిదంబుగ మూఁకలు గట్టి గ్రామముల్, మారి మసంగిన ట్లయి సమస్తముఁ జూర్ణము చేసినప్పుడు."
దశాం. 8.79.

**చూఱకాఁడు**
కొల్లగొనువాఁడు.

**చూఱకాఱుఁడు**
కొల్లగొన్నవాఁడు.

**చూఱకొను**
కొల్లగొట్టు.

**చూఱకోలు**
కొల్లగొనుట.

**చూఱకోలు గొను**
చూఱ గొను.

"నా చిత్తము చూఱకోలు గొన రాగ వ్యక్తి పుట్టించెనే." దశ. 3.63.

**చూఱ గైకొను**
చూఱగొను.

**చూఱగొను**
కొల్లగొను.

**చూఱ దెచ్చు**
కొల్లగొట్టి తెచ్చు.

"కొట్టి సస్యాంగనమునఁ జూఱ దెచ్చెద." భార. విరా. 3.199.

**చూఱపట్టు**
చూఱకొను.

"చెన్నలర మనోభవుండు విశిఖాహతి మానను చూఱపట్టె." శృంగా. శాకుం. 2.156.

**చూఱ పుచ్చు**
చూఱ గొను, నశింప జేయు.

"చెఱకువిల్తునిఁ జూఱఁ బుచ్చిన దై." భీమ. 4.128.

**చూఱ పోను!**
దొంగ లెత్తుకొని పోను!

"చూడరే శివభక్తి చూఱ వోను!" శా. మా. 4.35.

వాడుకలో—

"నీ ఆట దొంగలు దోల! అన్నానికి అయినా రండి రా." వా.

చూఱ పోవుట దొంగలు దోచుటయే. దొంగలు దోల అనేదే నేటి వాడుకలో ఉన్నది.

**చూఱపోవు**
కొల్లబోవు.

**చూఱ యిచ్చు**
ఇష్టం వచ్చినట్టు అనుభవించుకో నిచ్చు.

**చూఱలాడు**
కొల్లలాడు.
హర. 5.53.

**చూఱ లిచ్చు**
చూ. చూఱ యిచ్చు.

**చూఱలు కొను**
చూ. చూఱకొను.

**చూఱలు పట్టు**
చూ. చూఱపట్టు.

**చూఱలు వట్టు**
చూఱపట్టు.

**చూఱలు వుచ్చు**
చూఱపుచ్చు.

**చూఱలు సేయు**
చూఱ యిచ్చు.

**చూఱ లొసగు**
దోచి యిచ్చు.

"పమ్మినబాళి నంటి యొలప్రాయము చూలఱి గాసంగ వానికిన్."
శుక. 2.556.

**చూలఱవట్టు**

చూలఱపట్టు.

**చూలఱి విడుచు**

వదలి వేయు, ఎవరికో అప్ప గించు.

**చూలఱి వుచ్చు**

కొల్ల వుచ్చు.

దొంగలకు అప్పగించు.

దొంగలకు కాక పోయినా సరే పరిపూర్తిగా వదలివేయు అని కూడా వాడుకలోనికి వచ్చి నది.

"తన బండారువు చూలఱి వుచ్చె నాఁడా కందర్పుండు." కుమా. 10.32.

**చూలఱవోవు**

కొల్లబోవు, నశించి పోవు.

**చూఱాడు**

అపహరించు.

**చూలాలితనము**

గర్భిణీత్వం.

భాగ. 8.502.

**చూలుకొను**

గర్భ మగు.

కాశీ. 4.60.

**చూలు చేయు**

గర్భము చేయు.

"తాగ కావల్లు ఘుంటా, చూలు చేసిన వాఁడ దండము సూక్ష్మమైతి."
కాశీ. 4.229.

**చూలుపడు**

గర్భవతురా లగు. శ. ర.

**చెంగ గొట్టు**

ఓడించు.

"వింగపు గుంపులఁ జెంగ గొట్టిన వాఁడు." భాను. 2.209.

**చెంగ గొను**

పారు; జరుగు.

"లంకాప్రాకారంబు చెంగ గొని."
భాస్క. యుద్ధ. 910.

**చెంగలి గొను**

చెంగలించు, ఎక్కు వగు.

చెంగు చెంగున దాటుటలో వలె ధ్వన్యనుకరణ మై వచ్చి ఉంటుంది.

"నరలాడు నయ్యూలు చెంగలి గొనఁగ."
పండితా. ద్వితీ. మహి. పుట. 133.

చెంగలించు తప్పు. చెంగలి గొను కోశములలోనికి ఎక్క లేదు.

**చెంగావి**

ఒక రకమైన ఎరుపు.

"చెంగావి పంచలు నెల్లూరివా ళ్లెక్కు వగా కడతారు." వా.

**చెంగోలు**

అధికార సూచక మగు దండము.

శెంకోల్ అని తమిళము.

"బంగారునారాయముల తగులు నీరాతీన యుట్టి, చెంగోలు కంగేలc గలువుగాc బట్టి" శ్రీనా. ఖ. 5.

## చెండాడు

హింసించు.

"క్రూరసాయకములం జెండాడ." మి. 5.191.

## చెండి కొండలు వైచు

చించి చెండాడుట వంటిది.

"కొండలు చెండి కొండలుగా వైచు." వీర. 4.206.

## చెండి చెకపెక లాడు

చీల్చి చెండాడు.

"చెండి చెకపెక లాడినా యుండ దేని." సింగం. 1. ఆ.

## చెండిపోతు

గయ్యాళి, మాట వినని ది.

## చెండి వేయు

(కర్మణి) ముక్కలు చేయు.

"కరవాలున మాంసము చెండి వేయcగన్." యశ్యాం. 2.87.

## చెండుగోరింపులు

ఒక బాల్యక్రీడ.

"పింపిళ్ళు చెండుగోరింపు గోమన గుంటలు." దశా. 8.81.

## చెండుదానిమ్మ

పూలు మాత్రం పూసే ఒక దానిమ్మ.

శ. ర.

## చెండు బెండాడు

చించి చెండాడు.

చెండ్లవలెను, బెండ్లవలెను ఎగురగొట్టు అనుట ద్వారా ఏర్పడినది.

"చెండు బెండాడి మొకముల బెండు పఱిచి, దేవరకు వేడ్క పుట్టింతు దేవు నాన." శుక. 1.247.

## చెండుబెండొనర్చు

చెండు బెండాడు.

ఇలాగే చెండుబెండు కావించు, చెండుబెండు చేయు కూడా.

"చేగల మొకములc జెండు బెండొనరించి, కాలరిపాcజాల నేలc జమిరి." అచ్చ. రా. సుంద.

మా. చెండు బెండాడు.

## చెండుమల్లె

ముద్దమల్లె, బంతిపూవు.

## చెంప వేయు

చెంపదెబ్బ వేయు.

బ్రౌన్.

## చెందుగపులి

చిఱుత; సివంగి.

బ్రౌన్.

## చెందుప్పు

సైంధవలవణం.

## చెంద్రకావి

సిందూరపు ఎరుపు.

"కలయcగc జెంద్రకావి అవికంబలె." విజ. 2.92.

## చెంద్రపంకలు

ఒక రకం ధాన్యం.

## చెంపకల్లి

ఒక నగ.

పలుకుబడి నూరుసార్లు ఉంటుంది.
ఏటికి వెళ్ళు, కాలవకు వెళ్ళు, గుంటకు వెళ్ళు, బయటికి వెళ్ళు, ఊళ్ళకి వెళ్ళు, పెరటికి వెళ్ళు, పొలానికి వెళ్ళు ఇత్యాదులు.

**చెంబులో ధనము**
కొంగుబంగారము.
నానా. 68.

**చెకపికగా**
వేగముగా.
''......రామో! యోగీ, యతికులకాత్మక! శైశవమున్నఁ ద్వారికింపఁడి నిండువెల్లిం జేరా, పికగాఁ గాల్నడగాఁ గడంగుట కిదం బ్రీతిల్లువాఁ డెల్లియా.'' శంకరవిజయకథా. 2.58.

**చెకబికల్ చేయు**
చెక్కముక్కలు చేయు.
ధ్వన్యనుకరణము.
''చెకబికల్ చేసి తా నరము పైఁ గొట్టి.''
వర. రా. సుం. పు. 153. పం. 12.

**చెకబొకలాడు**
చెండి చెకపిక లాడు.
ముక్కలు చేయు.
చూ. చెండి చెకపిక లాడు.

**చెకాచెకలు**
చెక్క చెక్కలు.
''చెకాచెకలై యవియంగ.''
రంగా. 8.198.

**చెకుముకిరాయి**
నిప్పునకై రాతిని కొట్టే ఉక్కుముక్క.

**చెక్కకొణుజు**
ఒక పిడుదు.
పశువులకు పట్టునది.

**చెక్కచెట్టు**
ఎఱ్ఱరంగు వేయుట కుపయోగించే ఒక చెట్టు.
శ. ర.

**చెక్కతాపీ**
తాపీ పనిముట్టు.

**చెక్కపిడుజు**
చెక్క-పిడుదు.
పశువులకు పట్టే పిడుదు.

**చెక్కపీరు**
చూ. చెక్కకొణుజు.

**చెక్కలు చేయు**
ముక్కలు చేయు.

**చెక్కలు వాపు**
పగుల గొట్టు.
జైమి. 5.72.

**చెక్కలు వాఱు**
ముక్క లగు.
భాగ. 6.32.

**చెక్కికొను**
చెక్కొను.

**చెక్కిటనద్దుకొను**
చెంపలకు అద్దుకొను, ప్రేమతో, ఆదరంతో,

"తే జనకాలు చెక్కు గీటిన వస వల్చు బాలకులకు సంపదనూను సంగసంగ నేర్చు నే." సౌం. 1.17.

చూ. చెక్కు మీటిన వస వల్చు.

## చెక్కు చెదరక

ఉన్న దున్నట్లు.

సాక్షి. 336. పు.

"రాజసౌధం నిర్మించిన లోకే మహాల్ నేటికీ చెక్కు చెదరకుండా ఉన్నది." వా.

## చెక్కు చెమరించు

అలసిపోయినట్లు చేయు.

"ఈ క్రొవ్విరులు గోలు నలిగిపోక్క దలు చెక్కు, చెమరింపకున్నవా చిగురుటాకుడి." పా.హ. 3.62.

## చెక్కు చెమరుచు

అలసి పోవు.

"చిలుక నవ్వు నక్కఁ జెక్కుఁ జెక్కు చెమర్చు."

గౌర. హరిశ్చ. పూ. 1696.

## చెక్కు చెమర్పక

ఏ అలసటా లేక, అవలీలగా.

ఏ ధోకా లేక.

"......పురందరనందను బల్మికల్మి ని, శ్చింతత నుల్లసిల్లెదరు చెక్కు చెమర్పక కౌరవేశ్వరా!" భార. శల్య. 1.50.

"ఖరాదియోధుల సంహరించి చెక్కు చెమర్పక." వర. రా. అర. పు. 121. పం. 23.

చూ. చెక్కు చెమర్పక.

## చెక్కుటద్దాలు

అద్దములవలె నున్నగా నున్న చెక్కులు.

## చెక్కుడుపాలు

గిత్తి మున్నగువానిని చెక్కే పాలు.

"...కస వారని తెమ్మని కూఁతు చేతికిం, జెక్కుడుపాలు యీయ." శుక. 3.410.

## చెక్కున చె క్కొను

చెంప చెంప చేర్చు.

ప్రేమను సూచించు ఒక చేష్ట.

"చెక్కునఁ జెక్కొనుచు నొక్క నవ్వొన యురఃకోణంబుతో రాయఁ గన." కళా. 5.67.

## చెక్కు పిండిన వస యొలుకు

పసితనంలో ఉండు.

చిన్న పిల్లలకు మాటలు వచ్చుటకై వస నూరి పోస్తారు. ఆ వసే బయటికి వస్తున్న దనుట. అనగా చిన్నతనము.

ఇలాంటిదే పాలు గారే చెక్కిళ్లు.

"చెక్కు పిండిన వస యొల్కుచిఱుత వాని." హరవి. 2.76.

చూ. చెక్కు గీటిన వస వల్చు.

## చెక్కు మీటిన వస గారు

పసితనంలో ఉండు.

"చెక్కు మీటిన వస గారు శిశువు భక్తి, నుగ్రతప మాచరించుచు నున్న యతని." విష్ణు. 2.63.

చూ. చెక్కు పిండిన వస యొలుకు.

"తనకుఁ గలయంగ మంతనముఁ, దనుఁ దాఁగ మునోడ నిచ్చి యాగల తెను సన్నిహిత్రిఁ జెట్టగానియును." దశ. 5.81.

## చెట్టుడిచిన చేపెడు

కావలసినన్ని.

అతిసమృద్ధిగా ఉన్న దనుట.

"కొట్టిన గ్రొవ్వులు గలయవి, చెట్టుడిచినఁ జేఁత దేశ మెప్పం బులుఁగుఁ గుఁ." సుమ. 4.24.

చెట్టు కదిలిస్తే నాగానే బాగా పండి ఉన్న చెట్టు చేతినిండా పండ్లు రాలును అన్న వాక్యార్థ వచ్చిన పలుకుబడి.

## చెట్టతనము

దుష్టత్వము.

"చుట్టాలు నీ దగు చెట్టతనంబునఁ, జాని పశ్చాత్తాపగుఁడ వగుదు." భార. అను. 4.382.

## చెట్టపట్టలు

చెట్టపట్టాలు.

## చెట్టపట్టలు పట్టు

చెట్ట పట్టాలు పట్టుకొను, ప్రేమతో ఒకరిచేతులలో ఒకరు చేతులు జోడిపి పట్టుకొను.

"బంతు లేర్పడఁ జెట్టపట్టలు పట్టి." పండితా. పర్వ. 401. పు.

## చెట్టపట్టా లాడు

సరస మాడు, చెమ్మ చెక్క లాడు.

"చేల లంటి గోపికల చెట్టపట్టా లాడి తివి." తాళ్ల. సం. 8.179.

## చెట్టపట్టాలు

అన్యోన్యంగా ఒకరి చేతు లొకరు పట్టుకొనుట.

చూ. చెట్టపట్టలు.

## చెట్టపట్టు

నిందాపూ మాడు.

"వలఁగు శ్రీ కృష్ణరాయలఁ జెట్టపట్టి." కృష్ణ. 4.24.
పాండు. 4.197.

చూ. చెట్టవట్టు.

## చెట్ట యగు

ద్రోహి యగు.

"మీఁదు పరికింపక యమ్మెయి నీవు పాండునందనులకుఁ జెట్ట వై." భార. ద్రో. 4.209.

## చెట్ట యొనర్చు

కీడు చేయు.

"అతి వ్యసనత్వము గల్గువారలుం, జేరువ నున్కి భూపతికిఁ జెట్ట యొనర్చు." భార. శాంతి. 3.469.

## చెట్టలాడు

దూషించు.

"శ్రీకంఠభక్తులఁ జెట్ట లాడెదరు." పండితా. ప్రథ. దీక్షా. పు. 128.

## చెట్ట వచ్చు

కీడు కలుగు.

"మయలం జెప్పిన సౌఖ్యము, రయలం జెప్పినను జెట్ట రయమున వచ్చున్." కవిజ. సం. 39.

## చెట్టవట్టు

1. వివాహ మాడు.

పాణిగ్రహణము సేయు.

పెండ్లిలో పాణిగ్రహణం ప్రధానము కనుక ఇలా ఏర్పడి వచ్చినది.

"......ఈ లతాంగి వసుధావరు నెన్నఁడు చెట్టవట్టునొ క్షో" వసు. 3.43.

"నలఁగి శ్రీకృష్ణరాయలఁ జెట్టబట్టి." కృష్ణా. 4. ..

2. చేయి పట్టుకొను.

"చెట్ట వట్టి నిజాంకతలముఁ జేర్చుఁ [illegible]చు నంత." శుక. 1.296.

## చెట్టాపట్టాలు పట్టు(కొను)

చేతులు చేతులు కలుపుకొను.

"అట్టి రయిడ స్సైంధవోపల, పట్టికలం గట్టినట్టి పలు మెట్టికలకు, మెట్టి డిగి కొలనుఁ జొచ్చిరి, చెట్టాపట్టాలు వట్టి శీతాంశుముఖుల్." బహులా. 2.54.

రూ. చెట్టాపట్టాలు వేసుకొను.

## చెట్టాపట్టాలు వేసుకొను

చేతులు చేతులు కలుపుకొను.

"వా రిద్దరూ చెట్టాపట్టాలు వేసుకొని తిరుగుతుంటారు." వా.

## చెట్టు కట్టు

నిలద్రొక్కుకొను; వర్ధిల్లు.

"నినుఁ గూర్చి చెట్టుకట్టెను గాలవ తపస్వి, ప్రబలించె రుచి మందపాల ఋషి." బహు. 1.116.

"[illegible]" పాండు. 3.139.

రూ. చెట్టు గట్టు.

## చెట్టు కొరడుగా పోవు

చెల్లాచెదరై పోవు.

"[illegible]" [illegible]. 4.103.

నేటికీ వాడుకలో—

'ఆ యింటివాళ్లందరూ చెట్టుకొకరు, పుట్టకొకరు అయి పోయారు.' 'చెట్టుకొకరు పుట్టకొకరు అయ్యారు' అని కూడా అంటారు.

## చెట్టు కొరడు పుట్ట కొరడు అగు

దిక్కులు పట్టి పోవు.

"ఆ యింటి యజమాని చనిపోయేసరికి కొడుకులు అందరూ చెట్టు కొకడూ పుట్ట కొకడూ అయి పోయారు." వా.

## చెట్టు కొరకదై చను

చెల్లాచెదరై — దిక్కుకొకరుగా పోవు.

"ఒకనిభుజ లాపతితుని దోఁచి, కొని రయంబ జెడరఁ జనిరి చెట్టు కొకరుగఁ డ." పాండు. 3.54.

## చెట్టు కొట్టి పైవేసికొను

తనకు తానై చిక్కులు తెచ్చి పెట్టుకొను.

"పడిచి కూర్చుండక లేక చెట్టు గొట్టి పయి వేసికొన్నాడు." ధర్మజ. 70 పు. 2 పం.

లేక అటూ ఇటూ కొట్టు కుంటుంది.

"చెట్టు విడిచినభూతంబు కడుఁ గోడ." హంస. 1.220.

## చెట్టెక్కి చేతులు విడిచినట్లు

ఉన్నతస్థితికి పోయి దానిని నిలుపుకొన లేక పోవు.

ఆధారము లేకుండా చేసు కొను.

"ఇవ్విధంబున నావిద్య లెల్ల మాటు, వడినఁ జెట్టెక్కి చేతులు విడిచినట్లు, శోకచింతానిమగ్నుండ నై ..." వరాహ. 1.96.

## చెట్టెక్కు

మూల బడు.

"కృష్ణునిప్రతిమ చెట్టెక్కె లేద." గీర. గురు. 52.

చూ. చెట్లను గట్టు.

## చెట్టొకడు గాగ పఱచు

దిక్కొకడు గా పోవు.

"ఒకఁడు పోయిన త్రోవ వే ఱొకఁడు పోక, చెట్టొకఁడు గాఁగఁ బఱచిరి చెంచు లపుడు." మను. 4.103.

చూ. చెట్టు కొక డై చను.

## చెట్టొక పిట్ట యగు

చెల్లాచెద రగు.

"తరుణి నీనడలతో సరి రాక యంచలు, చెట్టొక పిట్ట యై చెదరి పాఱె." కవిచకోర.

చూ. చెట్టు కొక డై చను.

## చెట్లను గట్టు

ఉపయోగించక పైన ఎత్తి [illegible] పెట్టు; మూల పెట్టు; ప్రాణ పెట్టు.

[illegible] [illegible] సామెత [illegible] [illegible] [illegible] పెట్టు, [illegible] [illegible] మని పలుగు [illegible] [illegible] స్తుంది.

"[illegible] గ్య ముల చెట్లను గట్టుడు మాడ్కి." [illegible] 6.137.

[illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] పెట్టి- మూల [illegible] [illegible] [illegible] శ్యము మాని...

## చెట్లు పట్టు

అడవుల పాలగు.

"ఎవ్వఁ, డేని సుస్థాంగములు నీకు నిచ్చి చెట్లు, పట్టె పుల్లల తిప్పలు పట్టి తిరుగు." ఆము. 3.24.

"ఇదుముల బొర్లి పాపి య్యై యడవి చెట్లఁ బట్టినవాని" వర. రా. అర. పు. 139. పం క్తి. 18.

చూ. చెట్ల బట్టు.

## చెడగొట్టు

పాడు చేయు.

"ధ్వజంబులఁ జెడఁ గొట్టుచు." ఉ త్త. రా. 2.61.

"పనంతా చెడగొట్టాడు వచ్చి కూచొని." వా.

## చెడనాడు

నిందించు.

“మాగుం జెడ నాడి, వీరం గొని యాడెను.” సునూ. 2.31.
“అఖిలజనులు నిన్, గడుం జెడ మానసు వాం డని, చెడనాడుదురు రనిన మును నినీ యను టగునే...”
భార. శాంతి. 1.117.
“సాధ్వి నారక చెడనాడ నేలా?”
భాస్క. యుద్ధ. 2398.
“తా నెవ్వ తెరము నన్నుం దలిమి యాడ్వ నటంచుం, గోడిగోడులం జెడ నాడువారు.” శుక. 3.121
“ఆదరంబు లేక చెడనాడిన బాణ మయూర కాళిదా, సాంగుల కైనం దప్పు గలదు.” సింహా. 1.14.

చెడబుట్టు

సద్వంశంలో దుర్మార్గుడై పుట్టు.

“అంత మహాపండితులవంశంలో ఈ వెధవ చెడబుట్టాడు.” వా.

చెడమడ తిట్టు

నోటికి వచ్చినట్లు తిట్టు.

“దానిని జెడమడ దిట్టు దిట్టి యితర దేశీయుల కప్పగొప్పితిమి...”
సాక్షి. 322 పే.
రూ. చెడా మడా తిట్టు.

చెడ విలుగు

చెదరి పోవు.

“చెడ విఱిగి యడవిం బడి, యెడ నెడం గట్టులందు దలం గోటి యిడి లోంగడకున్.” ఆము. 3.17.

చెడినసొమ్ము

దొంగసొత్తు.

“చెడినసొమ్మెవ్వనిచే నుండు వాని... పట్టి యరయుం వలయు.”
విజ్ఞా. ప్రా. 25.

చెడి పోలు

చెదరి పోవు.

“మండి పదాతులం గొందఱుం, జెండాడిన నున్నవారు చెడి పోలిరి”
ఉత్త. హరి. 5.225.

చెడిపోవు

నాశమగు.

“సలిలములు జైసి చెడిపోవుం దుది నీరు పాను లగును.” జైమి. 7.82.

చెడి బతికిన

బాగా తక్కువ స్థితిలో ఉండి పైకి వచ్చిన.

ఇలాంటి వారికి గర్వమూ స్వాతిశయము ఎక్కువ అని.

“అది వట్టి చెడి బతికిన ముండ. పెద్దా చిన్నా పాపభీతీ యివన్నీ ఎక్కడి నుంచి వస్తాయి?” వా.

చెడుగడు

క్రూరుడు.

హరి. పూ. 8.103.

చెడుగట్టి

మాంసం ముక్కలు గ్రుచ్చి కాల్చేందుకు పనికి వచ్చే కఱ్ఱ పుల్ల, కడ్డీ.

“చెడు గట్టిల గ్రుచ్చిన నం, జూడు మంటలం దగిలి నెయ్యి జొట జొట వడియున్.” మను. 4.19.

చెడుగాడు

తిట్టు.

“సముఖానం జెడుగాండు.”
మల్ల. నీతి. 49.

చెడ్డయింటి చెదార మగు

1. సంస్కారము లేక, చూచే దిక్కు లేక గాలికి పెరుగు.

కాశీ. 4.91.

2. ఎవరి పోషణా లేక తనకు తానుగా పెరుగు.

"చెడ్డ యింటి చెదార మై శివుని కరుణ, నివ్వటిలు నిర్వ దేవేంద్ర నిన్నుఁ దలఁచి." కాశీ. 4.91.

చెడ్డ యొట్టు

సరిపడని సంగతి.

"కొలుపము చెడ్డ యొట్టు."

హంస. 4.41.

చెడ్డ యొట్టువలెనే బహిష్కృత మనుట.

చెడ్డ సరదా

ఎక్కువ సరదా.

మాటా. 1.

చెత్తగొడుగు

గడ్డితోనో, ఎండిన ఆకుల తోనో చేసిన గొడుగు.

"జాలు బొజ్జయు నుసుదబ్బ సంబెళి యును, జెత్తగొడుగును జక్కఁ దాల్చి." హర. 7.12.

చెత్తాకానీ రకం

చౌకబారు రకం.

"వాళ్ల దంతా చెత్తాకానీ రకం." వా.

"ఈ చెత్తాకానీ రకం కుర్చీ లెక్కడ దొరికాయి రా." వా.

చెత్తా చెదారం

చెత్త. జం.

"ఈ చెత్తా చెదారం అంతా తుడిచే సరికి నాలుగురోజు లవుతుంది." వా.

చెద పట్టిన

పాత పడిన; చెదలుపట్టి పాడయిన.

నిరసనగా అను మాట.

జగ. 117.

చెదపురువునుంబోలె విదలించు

నీచముగా చూచు.

"అకటఁ గటకటంబడి గ్రాసంబు వేఁడినఁ జెద పురువునుంబోలె విదలించు వారలే గాని యాయాసం బెఱింగి రమ్మనువారు లేరు..." శుక. 3.187.

చెదరబడు

చెదరి పడు.

"రాలిన భూషణాలిఁ జెదరంబడి యున్న శతాంగకోటి నా, భీలత నొందె నారణము." భాస్క. రా. యు. 1.182.

చెదర బాఱు

1. వ్యాపించు.

"చెదరం బాఱు దశప్రభంజనము లజ్ శిక్షజ్ సుషుమ్నం బునజ్, గుదియం బట్టి." సర్వే. శ. 48.

2. చెదరి పడు.

చంద్రా. 5.63.

చెనటి పిసాళి వెచ్చములు

దుర్వ్యయములు, దుబారా ఖర్చులు.

"...అన్నతోప పన్నమున్, జెనటి పిసాళి వెచ్చములఁ జేర్చుచు..." పాండు. 3.19.

**చెనకి యాడు**

కొట్టు.

"గొబ్బ గొబ్బునఁ జేతికి, నబ్బినకైదువులఁ జెనకి యాడినఁ జెనకుల్." కళ. 1.181.

**చెనటిప్రతిజ్ఞలు**

కఠినప్రతిజ్ఞలు.

హరిశ్చం. పూ. 404. పం.

**చెనటిమాటలు**

వ్యర్థము లైన మాటలు.

"అనుచు వగచు పలుకు లాలించి భీష్మాది, యోధవరులలో సుయోధనుండు, చెనటిమాట లేమి వినియెద రనిన..." భార. భీష్మ. 2.228.

**చెనుపరిమాటలు**

పల్లెటూరి మాటలు, మోటు మాటలు.

"చెదరిన కేశముల్ చెనుపరిమాటలు, వికృతస్వరంబును వెలయఁ గలిగి." భాస్క. రా. బాల. 593.

**చెన్నటిపోవు**

వ్యర్థ మగు.

"మీరును నే విచారములు మిన్నక చేయక పెంపు మీఱ నా, చేరువ రండు గెల్చుటను శ్రీయును గీర్తియు ముక్తియున్ మృతిం, జేరరణప్రయత్నవిధి చెన్నఁటిపోవునె..." హరి. ఉ. 10.123.

**చెన్నలరారు**

ఒప్పు.

"శ్రీహరి మిత్రుఁ డీ కృతికిఁ జెన్నలరార నధీశుఁడు." రుక్మాం. 1.15.



**చెన్నలరు**

... చూ. చెన్నలరారు.

**చెన్నారు**

చూ. చెన్నలరారు.

**చెన్నుపడు**

ప్రకాశించు.

**చెన్నుపఱుచు**

ప్రకాశింప జేయు.

బ్రౌన్.

**చెన్ను మిగులు**

ఒప్పు.

తారా. 2.16.

**చెన్ను మీఱు**

ప్రకాశించు.

"తొడవు లూడ్చిన నైనఁ దొయ్యలి రూపుతోఁ, జిన్నపోయినపట్లు చెన్ను మీఱు." ఉ. హరి. 1.57.

**చెన్నెసలారు**

ఒప్పు.

హరి. ఉ. 2.128.

**చెన్నొందు**

మనోహర మగు.

"మహిమఁ జెన్నొందు వైకుంఠమందిరంబు." భాగ. స్క. 2.228.

**చెప్పక చెప్పక**

అనక అనక.

'చెప్పితే ఇంకెవరి కైనా చెప్పాలి గాని వీణ్ణా' అను భావచ్ఛాయలో...

"చెప్పక చెప్పక పాండిత్యం విషయంలో వీణ్ణే చెప్పాలా? పొట్ట పొడిస్తే అక్షరం లేదు వీనికి." వా.

## చెప్పక చెప్పు

నోటితో చెప్పకనే సూచించు, తనంతట బోధపడు.

"వచ్చి, ఖను లని యెల్ల వారల కుఁ జెప్పక చెప్పె..."

గుంటూ. ఉత్త. 38.

## చెప్ప కూడ లేదు

చెప్పుటకు కూడా సాధ్యం కాదు.

చెప్ప వీలు కాదు.

కాశీయా. 2.74.

## చెప్ప గిప్ప రాదు

చెప్ప వీలు లేదు.

"చేతులయందము చెప్ప గిప్ప రాదు."

విజయ. 1.131.

## చెప్ప జిట్టలు

వింతలు; చెప్పుటకు అలవి కానివి.

అర్థ మింకనూ ఆశ్చర్యము.

"ఇమ్మహాత్ముని తెఱంగుఁ జెప్పఁ జిట్టలు." భార. శాంతి. 2.429.

## చెప్ప జూపగ రాకుండు

అనిర్వర్ణనీయ మగు.

అపురూపము లయినవాని పట్ల ఉపయుక్త మవు తుంది.

"చెప్పఁ జూపఁగ రావు మక్కాసీమ పీ గుజరీ తివాసులు." శుక. 1.222.

## చెప్ప జూప రాని

అవాఙ్మానసగోచరు డైన.

"చెప్పం జూపఁగ రాని లోకజనకుఁ శ్రీకాళహస్తీశు." కా. మా. 4.101.

## చెప్ప పని లేదు

చెప్పవలసిన అవసరము లేదు.

"ఇదియ కొంత విస్తారంబు నొందఁ గలదది చెప్పఁ బని యేమి ప్రధానకథాభాగం బింలియె..." కళా. 5.61.

## చెప్ప రాదు

చెప్ప గూడదు.

"తన కది చెప్పరా దని పలుకటయు."

కళా. 4.176.

## చెప్పా లేదు చెయ్యా లేదు

చెప్ప లేదు. జం.

"చెప్పంగ లేదొండు చేయలేదొండు."

బసవ. 3.74.

"చెప్పా లేదు చెయ్యా లేదు. తెల్లవారి చూచేటప్పటికి వెళ్లి పొయ్యాడు. నే నెలా ఉండ మంటాను?" వా.

"చెప్పా చెయ్యకుండా ఈ పని చేసేస్తే ఇక నేను చేయగల దే ముంది?" వా.

## చెప్పి చూచు

1. చెప్పు.

"సనకాదుల కంతయుఁ జెప్పి చూపనా, సచ్చరితుల్ సమస్తముని చంద్రులకుఁ గరుణార్ద్రచిత్తులై, యిచ్చిరి బ్రహ్మవిద్య." కా. మా. 2.90.

"ఆయనతో ఈ సంగతి చెప్పి చూస్తాను." వా.

"నా విషయం ఆ అధికారితో ఒక మాట చెప్పి చూడండి."

2. ప్రయత్నించి చూచు.

"నే నేమో చెప్పి చూస్తాను. వాడు వింటా డని నా కేమాత్రం నమ్మకం లేదు." వా.

**చెప్పి చూప వశము కాదు**

ఇంత అంత అని వర్ణింప నలవి కాదు.

"శ్రీకాంతుఁడ నీ మహిమ చెప్పి చూప వశమా !"

తాళ్ల. సం. 7.28.

**....చెప్పి చెప్పగ వలె**

ఈ విషయంలో నీ శే ముఖ్యులు అనుపట్ల వారి నెవరినో పేరెత్తి - చెప్పి ఇంకొకరిని చెప్పవలెను అను రీతిగా ఉపయోగించే పలుకుబడి.

"ముని భీతిలో మునిఁగినరాజు సుధరిం, పఁగ మమ్ముఁ జెప్పి చెప్పవలెఁ గాదె."

శ్రీవ. 2.80.

"వ్యాకరణశాస్త్రంలో తాతా రాయుడుశాస్త్రిగారిని చెప్పి ఇంకెవరి నైనా చెప్పాలి."

వా.

**చెప్పుకాలు**

చెప్పు వేసుకొన్న కాలు.

బసవ. 3. 72.

రూ. చెప్పుఁగాలు.

**చెప్పుకింది తేలు లాగా**

కిమక్కు మనకుండా, చచ్చినట్టు, అతివిధేయంగా.

"అత్తగారి పేరు చెబితే చాలు. వీడు చెప్పుకింది తేలులాగా పడి ఉంటాడు."

వా.

చూ. కుక్కిన పేనులాగా.

**చెప్పుగాలు**

చెప్పు వేసుకొన్న కాలు.

"పావన నిర్మాల్యము చెప్పుఁగాలఁ గొని పోవం ద్రోచి."

కా. మా. 3.105.

మా. చెప్పుకాలు.

**చెప్పుటట్టలు**

చెప్పుల కడుగున నున్న చర్మపు తునకలను అట్టలు అంటారు.

"చెప్పుటట్టలు శోధించి సిగలు విప్పి."

ఆము. 7.14.

"దళసైన అట్టలు వేసి కుడితే చెప్పులు నాలుగు నెల లుంటాయి."

వా.

**చెప్పుడుమాటలు**

దుర్బోధలు.

"చెప్పుడు మాటలు విని వాడు చెడిపోతాడు. మనం ఇప్పుడేం చెప్పినా వాడి చెవి కెక్కదు."

వా.

**చెప్పులలోని కాళ్లు**

ఎప్పుడూ ఒకచోట నిలువని వారనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"చెప్పులలోని కాళ్లనుప్రసిద్ధికి లోనయి యేను బోయితిన్."

నానా. 222.

**చెప్పుల్లో కాళ్లు పెట్టుకొని**

వెంటనే తిరిగి పోవుటకు సిద్ధంగా ఉండి.

తొందరపడుతూ అనుట.

"నువ్వు ఎప్పుడు వచ్చినా చెప్పుల్లో కాళ్లు పెట్టుకొని వస్తావు. ఒక పూట హాయిగా కబుర్లు చెప్పుకుందామంటే కుదరడం లేదు."

వా.

"అత నెప్పుడు వచ్చినా చెప్పుల్లో కాళ్లు పెట్టుకొని వస్తాడు. ఏం మాట్లాడతాం? ఏం చేస్తాం?" వా.

చెప్పెడి దేమి?

చెప్పడాని కే ముంది?

ఏం చెప్పగల మిక?

"చెప్పెడి దేమి లతాంగి..." కళా. 6.265.

చెమట ఓడ్చు

శ్రమించు.

"ఆ పొలం వాడు చెమటోడ్చి సంపాయించాడు." వా.

చెమటకాయలు

చెమటవలన ఒంటిపై లేచే పొక్కులు.

చెమటకోక

వేటలో ఉపయోగించే ఒక విధమైన బట్ట.

"అచటఁ జెమటకోక యమరించి కడిచేతఁ, గడిఁది దేగఁ బట్టి." ద్వా. 1.235.

ఇదే చేతిగుడ్డ, చేతి రుమాలు అయినా కావచ్చును.

చెమటగొట్టు

చెమట కంపు కొట్టేవాడు. మోటు.

చెమటచిత్తడి

విపరీతమైన చెమట.

'చిత్తడిజల్లు' లోని చిత్తడి వంటిది.

"...చెమటచిత్తడిఁ గ్రొత్త చెలువుగాంచిన వళుల్, మొలనూళ్ల కాంతికి బలిమి నొసఁగ." కళా. 1.147.

చెమట నెత్తురుగ తలచు

అతి గారాబంతో చూచు.

ఒక్క చుక్క చెమట పట్టినా 'అయ్యో మా వానికి ఒక్క చుక్క నెత్తురు పోయెనే' అన్నంత గారాబంతో చూచు—అనుట.

"చెమట నెత్తురు గాఁగఁ జిత్తమ్మునఁ దలంచి, యర్మిలిఁ బెనుచు మదంబఁ దలఁచి." విక్ర. 6.59.

చూ. చెమట నెత్తురు గాగ దలచు.

చెమట నెత్తురు గాగ దలచు

అతిప్రేమతో చూచు.

చెమట పట్టినా రక్తము కారినట్లుగా తలచుట అతి ప్రేమ సూచకము కదా.

"నెతి నాదు చెమట నెత్తురు గాఁగఁ దలఁచెడు, మఱఁది కానలఁ గాడుపఱచె నెట్టు." పద్మపు. 9.17.

చూ. చెమట నెత్తురుగ తలచు.

చెమట నెత్తురు గాగ సేవించు

అతిప్రేమతో చూచు.

"చెమట నెత్తురు గాఁగ సేవించు మిత్రులును." శృం. శా. 3.77.

చూ. చెమట నెత్తురుగ తలచు.

చెమట పట్టు

చెమ్మటలు పోయు.

"బాగా చెమట పట్టేదాకా బస్కీలు తీస్తే బలం వస్తుంది." వా.

చెమటపాత

బ్రౌన్.

చూ. చెమటకోళ.

చెమట పోయు

చూ. చెమట పట్టు.

చెమటియావు

చిత్రవర్ణము గల గోవు.

ఆంధ్ర. భా. ద్వి. 262.

చెమరుకాకి

బొంతకాకి.

ద్రోణకాకము.

పార్వ. 6.66.

చెమరుగాయ

బ్రౌన్.

చూ. చెమటకాయ.

చెమరు నెత్తురు గాగ దలచు

అత్యాదరంతో చూచు.

"...పతియెడ, భక్త్యనురాగ సంభ్రమము లెసఁగ, సమసుఖదుఃఖుఁ డై చెమరు నెత్తురు గాఁగఁ, దలఁచుచు."

భార. శాం. 2.369.

చూ. చెమట నెత్తురుగా దలచు.

చెమరు నెత్తురు నగు

రక్తబాంధవ్యము కల.

"చెమరు నెత్తురు నవు బంధు సమితి గరము, బ్రీతి నటుకాళులకు నటుచేతు లొగ్గ, నునికి యెక్కడ కి?"

నిర్వ. రా. 5.104.

చెమరుబోతు

చూ. చెమరుకాకి.

చెమ్మ యుఱుకు

చెమ్మగిల్లు.

"బహుళ జలప్లవమాన, ద్రుహిణాండము చెమ్మ యుఱికి..." మను. ౬.౧౭.

చెయికావలి

చేదోడు.

సమయానికి పనికి వచ్చునది.

కాశీయా. 31.

"దూరాభారం పోతున్నావు. పదిరూపాయలు చెయి కావలిగా ఉంచుకో." వా.

చెయి గాచు

అభయ మిచ్చు.

"పాపాత్మురాలిఁ, జెయి గాచు నేరమింజింతిల్ల వలసె."

వర. రా. బా. పు. 96. పంక్తి. 10.

చూ. చే కాచు.

చెయి చాచు

అడుగుకొను; కోరు.

"అ, బ్బిసరుహాచిత్రవంశ్యుఁ డొకబితరికై చెయి చాఁచెఁ గామినీ, వ్యసనపరాయణుం డెఱుఁగునా? నిజగౌరవవైభవోన్నతిన్."

సుద. 5.156.

"నే నింతకు ముం దెన్నడూ ఒకరి ముందు చెయి చాచి యెఱుగను." వా.

చెయి చేసుకొను

దండించు; తన్ను.

"చెయిఁ జేసుకొన్నది సీత నా మీఁద."

వర. రా. యు. పు. 40. పంక్తి. 12.

చెయి దప్పి పోవు

చేయి జాఱిపోవు.

"ఎసలార బ్రెమొక్కించి యింపులఁ బొదలె, పురిటిలోఁ జెయి దప్పి పోయిన కొడుకు."

ద్విప. కల్యా. పు. 39.

**చెయి పట్టు**

కాపాడు; పెండ్లాడు.

బ్రౌన్.

**చెయిపట్టుగా పట్టి యిచ్చు**

పట్టించి యిచ్చు.

"చెయిపట్టుగా పట్టి నాకు ఒప్పించక."

కాశీయా. 107.

**చెయి మించు**

తన్ను మించి పోవు.

"తనకు చెయి మించినట్టిఁడు ధరణి లేని, ఘనుఁడు." చిత్రభా. 2.107.

2. తనవశం దాటి పోవు.

"చెయి మించిన తరువాత ఏ మనుకునీ ఏం లాభం రా." వా.

**చెయి మీఱు**

1. తన్ను; కొట్టు.

"మేలముతోడఁ బిల్చి చెయి మీఱెద నంచును వేంకటేశ్వరా."

తాళ్ల. శృం. శ.

2. వశం దాటి పోవు.

**చెయి వ్రేసి హసించు**

చేతులు తట్టి పరిహాసము చేయు.

"అనుచు నొండొరుఁ జెయి వ్రేసి యప హసింప." ఉ. హరి. 4.161.

**చెయ్యి కాల్చుకొను**

సొంతంగా వంట చేసుకొను.

"మా ఆవిడ పుట్టింటికి వెళ్లడంతో నేనే చెయ్యి కాల్చుకో వలసి వస్తూ ఉంది." వా.

రూ. చెయి కాల్చుకొను.

చూ. చేయి కాల్చుకొను.

**చెయ్యి చూచు**

హస్తరేఖలను పరీక్షించి భవిష్యత్తు చెప్పు.

"నాకు చాలా డబ్బు వస్తుం దని వాడు చెయ్యి చూచి చెప్పాడు."

**చెయ్యిచ్చు**

ఆసరా యిచ్చు.

చూ. చే యిచ్చు.

**చెయ్యి తడి చేయు**

లంచ మిచ్చు.

"ఆ గుమాస్తా చెయ్యి తడి చేస్తేనే కానీ, ఆ కాగితం బయట పడేటట్టు లేదు." వా.

**చెయ్యి తడి యగు**

లంచము దొరకు.

కొత్త. 188.

**చెయ్యి తిరిగిన**

ఆరితేరిన.

"వాడు కవిత్వంలో బాగా చెయ్యి తిరిగినవాడు." వా.

రూ. చేయి తిరిగిన.

**చెయ్యి విదిలించని**

ఏదో కొంతయినా యివ్వని; అతిలుబ్ధుడైన.

"అతను అంత ఆస్తి ఉన్నా ఎవ రడిగినా యింత చెయ్యి విదిలించనివాడు." వా.

**చెయ్యి విప్పుకొలుపు**

నమస్కారం.

**చెయ్యి పూరికే లేదు**

ఏదో పనిమీదున్నాను అనుట.

కొత్త. 37.

చెయ్యాడు

రెండుమూర లున్న బట్ట.

చెయ్యెత్తి చూపు

తప్పు పట్టు.

"అమరులు మమ్ముఁ, జెయ్యెత్తి చూప నొచ్చిన నోరఁ బలుక, నేరతురో." వర. రా. యు. పు. 249. పంక్తి. 16.

చెయ్యొగ్గు

అంజలించు, ప్రార్థించు.

"చేకొని నీవే మన్నించఁ జెయ్యొగ్గేఁ గాని." తాళ్ల. సం. 10.2.

చెరకుపన్నిద మాడుతెఱగున

పందాలు వేసుకొని చెఱకును నఱికినట్లు.

"చెఱకు పన్నిద మాడు తెఱఁగున గొడ్డండ్లు, నడుములు రెండుగా నఱికి నఱికి." కవిక. 2.169.

చెరగున ముడి వేసుకొను

వశవర్తినిగా చేసుకొను.

బాల. 184.

చెరచెర

త్వరగా, శీఘ్రంగా.

"చెర చెరా నడిస్తే గానీ మనం వేళకు వెళ్ళ లేము." వా.

చెరపనచేట

వెధవ.

కుక్క. 40.

చూ. చెఱపనచేట.

చెరలాట లాడు

చెరలాడు, సరస మాడు.

"చిలుకలు పిల్లులు చెరలాట లాడు." వా.

చెరలాడు

1. సరస మాడు; ఆడుకొను.

"మత్తిల్లు వ్యాఘ్రడింభకులతోఁ జెర లాడు." రుక్మాం. 3.104.

2. జీరాడు.

"చెక్కుటద్దముల పైఁ జెరలాడు నప్పుడు, కస్తూరికాపత్రకములఁ బోలె." శృం. నైష. 6.103.

చెరలు కొట్టు

బుసకొట్టు, ఉత్సాహంతో చెలరేగు.

శ్రీరం. 2.295.

చెరవు పెట్టు

బలి చేయు, నఱుకు.

"అని గొఱియలఁ జెరవు పెట్టి." సింహా. 1.189.

చెర పెట్టుకొను

చెఱ పట్టు.

చెరువుకోడి

నీటికోడి.

హంస. 3.12.

చెర్లాట మాడు

సరసము లాడు.

'పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణసంకటం.' ఇక్కడ చెల గాటమే చెర్లాటం.

"చెర్లాట మాడు మోహము, లేర్లయి వర్తిల్ల." పాండు. 3.63.

చెర్లు గట్టు

చెరలు గొట్టు, చెర గొట్టు మారిన రూపం. బుస

కొట్టుచు, కోపంతో చీద
రించుకొనుచు అని కూడ.
నేటికీ వాడుకలో 'మహా చెర
కొడుతున్నాడే' అంటారు
దక్షిణసీమలో.

"ప్రవాహోదకంబుల దరి జెర్లు గట్టి
యాడంగ."

పండితా. ద్వితీ. మహి. పుట. 155.

"శ్రోన్నమునికోలఁ గదల్చినం గెరలి
చెరలు కొట్టుచు మన్నులపైఁ బాలు
చిలుకవారువంబుల..."

శ్రీరం. 2.295.

"ఇక్కడ కెర్లు గట్టి, కొనియాడునట్టి
యొక్కడు మఱుపట్టి, గొనిపోయి పుత్తు
గక్కునఁ బట్టి మొసలి."

పండి. మహిమ. ద్వితీయ. పుట. 164.
అదే. ద్వితీ. 166.
చూ. చెరలుకొట్టు.

**చెఱకడము**

బెల్లము.

**చెఱకున పండొదవినట్లు**

చెఱకే మధురము. దానికి
పండే పుడితే ఇంకెంత మధు
రముగా ఉండునో అనుటపై
వచ్చిన పలుకుబడి.
ఇలాంటిదే 'బంగారానికి తావి
అబ్బు.'
చెఱకునకు పండ్లుండక
పోవుట ప్రసిద్ధము.

"అఱువదినాలుగు విద్యల, సెఱవాది
త్రికాలవేది నీ వీ చిలుకకా, సెఱపుగఁ
జేపట్టిన నది, చెఱకునఁ బండొదవినట్లు
చిరకీర్తినిధీ!" విక్ర. 7.20.

**చెఱకుల పందెము**

చూ. చెఱకుపందెము.

**చెఱకు పండినపండు**

అసంభవము.

తాళ్ల. సం. 12.75.

**చెఱకుపండు**

అసంభవము.
కుందేటికొమ్ము వంటిది.

"అక్కటా!, చెఱకునఁ బండు పండిన
భుజింప దలంపమి గాక ప్రాయపుం,
చెఱవలతోడ..."

రాజగో. 1.100.

**చెఱకుపందెము**

చెఱకుగడలను నఱుకుటలో
ప్రావీణ్యం చూపుతూ వేసు
కునే పందెం.

"పికిలిపిట్టలఁ గొట్లాటఁ బెట్టి చూచు,
దిట్టతనమునఁ జెఱకుపందెంబు లాడు."

కువల. 5.9.

**చెఱకుపాలు**

చెఱకురసం.

**చెఱగున ముడుచుకొను**

కొంగున కట్టుకొను.
ఏదైనా డబ్బును కొంగులో
ముడి వేసుకోవడం నేటికీ
చాలా చోట్ల అలవాటులో
ఉన్నదే.

"చెఱంగున ముడుచుకొని."

హర. 1.19.

**చెఱగు పెనచు**

స్త్రీలు సిగ్గూ, తత్తరపాటూ
మొదలయినవి కలిగినప్పుడు

పైటచెఱఁగును వేలికి చుట్టు
కొని నులిపెట్టుట అలవాటు.
దానిపై వచ్చిన పలుకుబడి.

"తన చేతి చెఱఁగు బిగియఁగా, వెనఁ
చుచుఁ దల వాంచి నగవు వెరయఁగఁ
బలికెన్." మను. 3.106.

చెఱగు మాయు

ముట్టగు; బహిష్ఠు అగు.

"చెఱఁగు మాసిన మూనాళ్లు సిగ్గు
తోడఁ, బతి విలోకనమార్గంబు పరిహ
రించి." కాశీ. 2.72.

"చెఱగు మాసిన నాల్నాళ్లు జరుగ
నిచ్చి, స్నాన మొనరించి ధౌత
వస్త్రంబు గట్టి."
సానందో. 3.53.

"చెఱగు మాసె నేమి సేతురా, దఱి జేర
నీయ వీలు కాదు." క్షేత్రయ్య.

చెఱగొను

చెఱపట్టు, బంధించు.

"నన్నుఁ జెఱగొని గంధర్వనాయ
కుండు." భార. అర. 6.9.

చెఱచెఱ లాడు

కోపంతో మండిపడు.

"ఏమిటో పొద్దున్నుంచీ మహా చెఱ
చెఱ లాడుతున్నావే?" వా.

చెఱ దెచ్చు

బందీగా పట్టుకొని వచ్చు.

"తొల్లి చెఱ దెచ్చిన వారిఁ బదాఱువేల
ధాత్రీజనమాన్యలన్."
భాగ. 10. ఉ. 206.

చెఱపట్టు

బందీగా చేయు.

"శతమన్యుఁ జెఱపట్టఁ జాలిరె పరవార,
లని." ఉత్త. రా. 5.6.

చెఱపనచేట

తిట్టు.

నాశకారి అనుట.

"పఱతెంచితి రెం డిండ్లకుఁ, జెఱపన
చేట వయి తేమి చేసెడి దనుచున్."
జైమి. 4.69.
చూ. చెరపనచేట.

చెఱపోవు

పట్టుబడి పోవు, బందీ యగు.

"సైంధవుచేతం బాంచాలి చెఱపోయె
నని పలుకుచు..."
భార. అర. 6.196.

చెఱ యిచ్చు

స్త్రీలను బానిసలుగా నిచ్చు.

"దండుగ లిచ్చి వేల గొని దానిపయిం
జెఱ లిచ్చుకన్న నిం, దుండగ నిచ్చెఁ
గాక దనుజోత్తముఁ డలినఁ జంపఁ
బెద్దయే?" కుమా. 10.163.

చెఱ లిచ్చు

బందీలనుగా ఇచ్చు.

"సురపతి వచ్చి నా శరణుఁ జొచ్చి
తగం జెఱ లిచ్చి యున్న నేఁ, గరుణాము
వుట్ట." కుమా. 10.139.

చెఱలు

బందీలు.

"పరుల చెఱలు వృత్తులు నర్థంబులు
మగుడ నిచ్చి." కుమా. 10.194.

చెఱలు గొను

చెఱ పట్టు.

"పుణ్యస్త్రీలఁ జెఱలు గొనిరి."
విష్ణు. 2.123.

చెఱలు చూఱలు పుట్టు శని

బందీ గొనుటలు, దోపిడీలు దాపురించిన దుష్కాలము.

"చెఱలుఁ జూఱలుఁ బుట్టు శని మానుపు మటన్న, వెస నదే మఱియుఁ గావించె దీవు." సింహాద్రినా. శ. 45.

చెఱలు దెచ్చు

చెఱపట్టి తెచ్చు.

హరి. ఉ. 4.45.

చెఱలు పట్టు

చెఱ పట్టు, బందీలుగా పట్టుకొను.

సమీర. 1.150.

చెఱవడు

బందీ అగు.

"ఖలుచేఁ జెఱవడి భీతిం, గలఁగెడు సీతఁ గని." భాస్క. ఆర. 2.163.

చెఱసాల

బందిఖానా.

చెటీ ఒకటి

చెటి సగము, తలా ఒకటి. ఒక్కొక్కరూ ఒక్కొక్క సగం, ఒక్కొక్క వేయి అనుటలో-చెటి సగం, చెటి వేయి అనడం వాడుక.

చెటీ సహాయ స్వాహా

వాళ్ళిద్దరూ కలిసి దానిని అపహరించిరి అనుపట్ల ఉపయోగిస్తారు.

చెటిసగం కాజేశా రనుట.

"ఆ మామగారి ఆస్తిని కాస్తా, ఆ యిద్దరు అల్లుళ్లూ చెటి సహాయ స్వాహా చేశారు." వా.

చెఱుపరి

చెఱుచువాడు.

చంద్రా. 5.108.

చెఱువుకట్ట తెగిన బిరుసుతో

చెఱువుకట్ట తెగినట్లు. అతి వేగముగా - పెద్ద ఉరవడితో.

చెఱువుకట్ట తెగినప్పుడు నీళ్లు మహావేగంతో ముంచుకు రావడంపై వచ్చిన పలుకుబడి.

"అతని వింట వెడలు నమ్ముల వేగవై, చిత్రి యేమి చెప్పఁ? జీవలసిన, మురువు బిరుసుఁ గ్రోవి ముట్టించిన తెఱంగుఁ, జెఱువుకట్ట తెగినబిరుసుఁ దోఁచె." కళా. 8.127.

చెఱువుపా లగు

చెఱువున కాహుతి అగు, గంగపా లగు వంటిది.

బస. 6.165 పుట.

చెఱువు విడిచి కాలువ పొగడు

పెద్దదానిని వదలి చిన్న దానిని స్తోత్రము చేయు.

"అనుటయు హంసుఁడు గమగమఁ, గనలి మదిం జెఱువు విడిచి కాలువఁ బొగడం, జను నే వీనికి నని యి, ట్లను" ఉ. హరి. 4.186.

చెలదితెర

సాలెపట్టు.

"నెలపూఁదాలుపు మన పూజలు మెచ్చునె యని మదిఁ విచారింపక చీకిలిమాకిలిగా నల్లిన, చెలఁదితెఱల్ సూచి సంతసించుట లేదే." సారం. 1.15.

చెలదినేత

అశాశ్వతము.

సాలెపురుగు నేసిన నేత ఒక్క నిమిషంలో గాలి కెగిరి పోతుంది.

"ఊఁతనీరు చెలఁదినేత మాటాయిటి, దూది యెండపసుపు దొట్టియక్కరంబు మేను." ఆము. 6.62.

చెలదిపుర్వు

సాలెపురుగు.

కళా. 3.83.

చెలరేగు

విజృంభించి, ఉల్లాసంతో ఉప్పొంగు.

"అనుచుఁ జెలరేఁగి మంత్రులు, గొని యాడుచు నుండిరి." సా. 1.32.

ఇలాంటి భావచ్ఛాయలలో కొన్ని మార్పులతోనూ ప్రయుక్త మవుతుంది.

చెలామణీ అగు

1. నాణ్యములు చెల్లుబడి అగు.

2. తద్వారా మాట ఇత్యాదులు చెల్లుబడి అగు.

"అతనిమాట ఆ ప్రాంతంలో బాగా చెలామణి అవుతుంది." వా.

చెలికత్తియ

చెలి, స్నేహితురాలు.

చెలికత్తె

చూ. చెలికత్తియ.

చెలికపట్టు

చేను.

"సారంగంబుల ఖురళికారంగంబు లనఁ గనుపట్టు చెలికపట్టులును." మను. 4.37.

చెలికారము

స్నేహం.

"అబ్ధితోఁ జెలికారమంది మైనాకంబు, రచియించె నిజపక్షరక్షణంబు." సాంబో. 1.134.

చెలిమరి

మిత్రము.

చెలిమికత్తియ

చెలిమికత్తె.

చెలిమికత్తె

చూ. చెలికత్తె.

చెలిమికాడు

చెలికాడు.

చెలిమిచెలువ

చెలికత్తె.

కృష్ణ. 4.49.

చెలిమివాడు

చెలికాడు, వలపుకాడు.

"బలిమి వాసవు బెట్టు నులిమి వాకిటఁ బెట్టు, కలిమివాలుఁగకంటి చెలిమి వాని." చంద్రా. 1.84.

**చెలియలికట్ట**
సముద్రతీరము, వేల.
కవిక. 2.146.

**చెలువారు**
ఒప్పు.
"గోడలఁ జెలువారఁ గృష్ణలీలలు లిఖించి." రుక్మాం. 1.118.

**చెలువు మిగులు**
ఒప్పు; అందము అతిశయించు.
"కలిగి కంసవైరి కన్నుల పండు వై, చెలువు మిగిలె." ఉ. హరి. 2.109.
"మహనీయ కురువింద మాణిక్య కాంతుల, చేతఁ బల్లవిత మై చెలువు మీఱు." కళా. 2.10.

**చెల్లగట్టు**
చెల్లించు.
"ఈ రూపాయలు తీసుకొని పోయి ఆ బాకీకి చెల్లగట్టి రా." వా.
పత్రంలో జమను రాసుకొనుటకు కూడా 'చెల్లు' రాసుకొనుట అంటారు.
"ఈ రూపాయలను నీ బాకీకింద 'చెల్లు' వేసుకో." వా.
"ఆ రోజుతో 'చెల్లు'. మళ్లీ వాడి ప్రక్క తిరిగి చూచి ఉంటే ఒట్టు." వా.
ఇక్కడ ఇదే ఆఖరు. తర్వాత రాలేదు అని అర్థం.
చూ. చెల్లుచీటి.

**చెల్లచెదరగు**
చెల్లాచెదరై పోవు.
"అరయ దెస లేక నీ ధనం బడవిలోనఁ, జెల్లచెద రయ్యె." హరి. పూ. 7.39.

**చెల్లదిరుగు**
పూర్తిగా తిరుగు.
చెడ దిరుగు అన్నమాటే నేడు విన వస్తుంది.
"పుడమి యెల్లం జెల్లం దిరిగి యలబ్ధ మనోరథుండై యుండి..." శుక. 2.160.

**చెల్లని**
కాని పోని.
"చెల్లనిపూనిక లవి సెలుప నేల?" సింహా. 6.56.

**చెల్లనికాసు**
పనికి రానిది, మారకం లేనిది.
"కల్లగు జ్ఞానం బేలా, చెల్లనికా సెచట నైనఁ జెల్లనికాసే." సంపంగిమన్న. శ. 36.

**చెల్లపిళ్లలు**
ముద్దుబిడ్డలు.
సెల్వం-(తమి) అందమని అర్థము. పిళ్ళ-(తమి) సంతానము.
"తల్లిదండ్రులు గలవారు తమ లేము లెఱుఁగక, చెల్లపిళ్ల లై యాటలఁ జెందినయట్టు." తాళ్ల. సం. 8.54.

**చెల్లబెట్టు**
వదలి వేయు.
"విషనిభంబు లైనవిషయాభిలాషంబు, లెల్లఁ జెల్లఁబెట్టి..." పాండు. 5.208.

**చెల్లబో....!**
ప్రశంసాద్యర్థాదులలో ఉపస్కారకం.

1. ప్రశంసలో.

"చెల్లంబో యితనికరుణ..."

భార. అశ్వ. 4.

2. సంతాపార్థంలో.

"దీనికిఁ, జెల్లంబో యిట్టి మగడు సేకుతె ననఁగన్." భోజ. 5.326.

3. ఆక్షేపార్థంలో.

"రాజసూయకర్త బ్రహ్మదత్తుం డట్టె, రభస మెసఁగ హంసడిభకు లట్టె, చేయఁ బనుచువారు చెల్లఁబో..."

ఉత్త. హరి. 4.154.

**చెల్లరా !**

ఉపస్కారకపదం.

**చెల్లరె !**

చెల్లరా.

**చెల్లరే !**

చెల్లరె.

**చెల్ల విడుచు**

తెగ విడుచు, స్వేచ్ఛగా అడ్డు విడిచి పెట్టు.

"ఆతఁ డిల్లాలిపై మోహ మతిశయిల్లఁ, బెల్లుగాఁ జెల్లవిడిచి వర్తిల్లుకతన."

శుక. 2.203.

**చెల్లాకు చెదరగు**

చెల్లాచెదరు లగు.

"చెల్లాకుం జెద రైన సైన్యసమితిం జే సాఁచి రావించి."

రంగా. 3.68.

**చెల్లాకు చెదరు చేయు**

చెల్లాచెదరు చేయు.

"చెల్లాకుం జెదరు చేతు శీఘ్రమె వానిన్." రంగ. 2.247.

**చెల్లాచెదరగు**

చెదరి పోవు.

"లావు చాలించి చెల్లాచెద రైరి సా, రణులు గుహ్యకులు తురంగముఖులు."

వరాహ. 3.50.

"పోలీసులు వచ్చేసరికి జన మంతా చెల్లాచెద రై పోయారు." వా.

**చెల్లింపగను**

ముగింప గలుగు.

"నెలకొని రఘురామ నీ ప్రసాదమున, కలఁగక చెల్లింపఁ గంటి నీ క్రతువు."

రంగ. రా. బాల. పు. 36. పం. 2.

**చెల్లి పోవు**

1. చనిపోవు, దాటిపోవు.

"మేది నీ తనయ, చెల్లిపోవుటయును జెప్ప నేర్పరివి."

వర. రా. అర. పు. 218. పం. 24.

2. తీరిపోవు.

"ఈ పదిరూపాయలతో నీ బాకీ పూర్తిగా చెల్లిపోయింది." వా.

3. ఖర్చు అగు.

మాటా. 75.

**చెల్లుచీటి**

బాకీ యెంతో కొంత చెల్లించి నప్పుడు ఆ చెల్లును గుర్తు వేసుకొని వ్రాసి యిచ్చు రసీదు.

**చెల్లుచీటి యిచ్చు**

వదలి వేయు.

"క్షితినాథుచే సొమ్ము చెల్లించి నందు అకు...నితని కిప్పింపు డిట చెల్లుచీటి."

ద్విప. పరమ. 6.480.

చెల్లుబడి అగు

మాట సాగు.

తద్వారా వచ్చిన ధీమా.

ఈ 'చెల్లు' నాణ్యాల మారకం పై వచ్చినది.

ఏదైనా నాణెం చెల్లుతుం దంటే అది మారకంలో ఉన్న దనుట. అనగా దానికి విలువ ఉన్న దనే కదా!

"తన యత్యేఘకం బగురూపసంపదం, జెలువుఁడు కైవసం బనుచుఁ జెల్లుఁబడిం బచరించి పల్కె." కళా. 1.173.

"ఆ జిల్లాలో ఆయన మాట బాగా చెల్లుబడి అవుతుంది." వా.

"ఆ అధికారిదగ్గఱ ఆ కార్యదర్శి మాటకు చెల్లుబడి ఉంది." వా.

చెల్లుబడి వాడు

మాట చెల్లువాడు, ప్రసిద్ధుడు.

"ఎవ్వాఁడును నింత చెల్లుబడివాఁడు నరేశ్వర! లంకలోపలన్, లేఁడు." భాస్క. యుద్ధ. 747.

చెల్లెలికట్ట

హద్దు.

ఆపుదల చేయున దనుట.

తీరము అని వాచ్యార్థము.

"చింతామహాంబురాశికిని జెలెలికట్ట." విప్ర. 1.84.

చూ. చెలియలికట్ట.

చెవాకు

చెవి ఆకు. ముత్తైదువకు ముఖ్యమైన అయిదింటిలో ఒకటి.

శృం. శకుం. 4.78.

చెవికి చవి యగు

కర్ణపర్వ మగు, విన నింపగు.

"వివిధ క్షేత్రచరిత్రలు... చెవికిం జవి యొసఁగెనే." పాండు. 1.151.

చెవికి చేదగు

వినుట కప్రియ మగు.

"కావునఁ జెవికిం జేఁ దగు, నీ వాక్యము వినఁగఁ జాలితేని నిహపర, శ్రీవిభవము లకు..." భార. ఉద్యో. 2.94.

చెవికి తియ్యముగా పల్కు

మధురముగా మాట్లాడు.

"కర మిద్దేవు కపోల ఫాల చిబుక గ్రీవేయసంక్రీడకుం, దిరుగం జేయుచు నొయ్య నొయ్యఁ జెవికిం దియ్యంబుగాఁ బల్కుచున్." ఉ. హరి. 1.128.

చెవికి వేడిగ పల్కు

మనసు నొవ్వ బలుకు.

"ఇట్లురు లెవ్వరొ డెరో, వింత యటన్న నీ చెవికి వేఁడిగఁ బల్కు పికాళిఁ బట్టి శిక్షింతు నటంచు." ప్రభా. 3.132.

చెవి కెక్కు

గ్రహింపు కలుగు. నచ్చు, మనసు కెక్కు.

"మనం ఏం చెప్పినా వాడికి చెవి కెక్కదు-పెండ్లాం చెప్తే గానీ." వా.

చెవి కొఱికి పుల్లింగాలు పెట్టు

ఒకరిపై రహస్యంగా ఏవేవో చెప్పి ద్వేషము కలిగించు.

"వాడి కేం ? ఏదో తినడానికి ఉంది.

వాడిదగ్గఱా వీడి దగ్గఱా చేరి చెవి కొఱికి పుల్లింగాలు పెట్టడమే పని.'' వా.

## చెవి కొఱుకు

రహస్యము చెప్పు.

''గుట్టిడక సెట్టితోఁ జెవి కొఱికి కొఱికి, సరవితోఁ దనకేలికిసానివారి.''
బహులా. 5.76.

''ఏమిటో వాళ్ళిద్దరూ నన్ను చూచి అలా తిరిగారు. వీడు వాడి చెవి కొఱికి నాడు.'' వా.

## చెవి కోసుకొను

అత్యాసక్తిని చూపు.

''వాడు కథ లంటే చెవి కోసుకుంటాడు.'' వా.

## చెవి గూబ లదరు

బాగా దెబ్బ తగులు.

''చెవిగూబ లదిరేట్టు కొట్టాడు.'' వా.

## చెవి గోసిన మేక వలె

మేమే అని అఱచు.

శ్రావ్యంగా లేని పాటలు పద్యాలు మొదలగువాని విషయంలో ఉపయోగించే పలుకుబడి.

''చెవి గోసినమేకలపోల్కిఁ జాల.''
గుంటూ. ఉత్త. 32.

''చెవి గోసిన మేకలాగా అరుస్తున్నాడు.'' వా.

## చెవిచెంత జేర్చు

విను, ఆదరముగా చూచు.

''శివచింత చెవిచెంతఁ జేర్చ నతఁడు.''
జైమి. 1.86.

## చెవి చెక్కు నెఱుగకుండ చెప్పు

అతి రహస్యముగా చెప్పు.

''చెప్పెద మొకబుద్ధి చెవియుఁ జెక్కు నెఱుంగకుండఁ జైత్రక మొనయొడమి గలది.'' భోజ. 6.144.

## చెవిజొఱు పాము

కర్ణజలూక. శ. ర.

## చెవి జెందు

వినబడు.

''చెవిఁ జెందె వధూమృదుగీతవాదములో''. భోజ. 5.

## చెవిటికి పట్టిన సంకు

వ్యర్థము.

''...అక్కట విఫలము గాదే? యొచ్చటఁ జెవిటికిఁ బట్టినట్టి సంకును బోలెన్.'' కళా. 2.96.

రూ. చెవిటికి శం కూదినట్లు.

## చెవిటి పంచాయితీ

అసలు సంగతి తెలియక చెప్పు తీర్పు.

''వాడికి సంగతు లేవీ తెలియవు. అనవసరంగా వాడిదగ్గరికి వెడితే ఏదో చెవిటి పంచాయతీ చెబుతాడు. ఏం ప్రయోజనం?'' వా.

చెవిటి గొల్లవాడు, దారిన పోయ్యే చెవిటి, చెవిటి రాజు కలిసిన కథద్వారా వచ్చినది.

## చెవిటి మాలోకం

చెవిటి.

''మనం ఏమంటే నేం? పాపం! ఆమె కేం తెలుస్తుంది? చెవిటి మాలోకం.'' వా.

**చెవిదండ పల్కు**

రహస్యముగా చెప్పు.

"తాం,బూలముతావి భుగ్గు రని ముంచు కొనం జెవిదండఁ బల్కెనన్."
కళా. 4.113.

"గో,త్రావిభుఁ డొయ్యఁ బల్కెఁ జెవి దండఁ బెనంగఁ దలంకె నింతయున్"
కళా. 7.154.

చూ. చెవిలో చెప్పు.

**చెవిదాకా వచ్చు**

ఎఱుకకు వచ్చు.

"ఆ విషయం యింకా నా చెవిదాకా రాలేదు." వా.

**చెవి దార్చు**

చెవి యొగ్గు.

"చెవి దార్చి విని చీమ చిటుకన్న నొక సారి, సెలవి కెంపుటలారుఁ జిట్ట లెల్ల."
మను. 4.17.

**చెవి దేలగిల నిచ్చు**

చెవి వాలవేయు.

"కనుఁగొని తమ్మతండు కడకంటను జూడక యొక్క చీరికిం,గొనక వచో విలాసములకుం జెవి దేలఁగిలంగ నీక."
విప్ర. 2.70.

**చెవి దోరగట్ట జెప్పు.**

చెవి నిల్లు కట్టుకొని పోరు.

"జూదపుసిరి మేలు గా దని చెవి దోర, గట్టఁ జెప్పిన కృత్తఁ గిట్టి విడిచె."
శ్రీకృష్ణభారతం. ఉద్యో. 1.402.

**చెవి దోర పెట్టు**

చెవి యొగ్గు.

"......వినియెను చెవి దోరపెట్టి నాఁగ, నాలకించెను విని నాలించె ననఁగను." ఆంధ్రభా. 3.119.

**చెవి నాను**

1. చెవి యొగ్గు.

"తన మాట చెవి నాని తా నట్ల సేయుము, న నెడి."
వర. రా. కిష్కి. పు. 492. పంక్తి. 15.

2. చెవి పెట్టుకొను.

"మంధర బుద్ధి చెవి నాని దాని నీక్షించి."
వర. రా. అయో. పు. 270. పంక్తి. 24.

**చెవి నిడు**

విను.

"వెడ వెడ యప్పలుకులు చెవి నిడి."
భార. శాంతి. 1.56.

**చెవిని పడు**

ఎఱుకకు వచ్చు.

"ఈ విషయం వాడి చెవిని పడిన ట్టయినా కొంప లంటుకుంటాయి." వా.

**చెవిని పెట్టకుండు**

మాట వినక పోవు.

"వా డెన్ని చెప్పినా చెవిని పెట్టడం లేదు." వా.

**చెవి నిల్లు గట్టుక చెప్పు**

నిరంతరం బోధ చేయు.

"ఒరులుగా వచ్చి యొడి మరుంగు పడంగఁ, జెవి నిల్లు గట్టుక చెప్పరేని."
విప్ర. 5.40.

**చెవి నిల్లు గట్టుక పోరు**

చూ. చెవి నిల్లు గట్టుక చెప్పు.

**చెవి నులుము**

శిక్షించు.

"ఆ పిల్లలను చెవి నులిమి కూర్చోపెడితే తప్ప వాళ్లంతట వాళ్లు చదువుకుంటారా ?" వా.

**చెవి పట్టి తెచ్చు**

బలాత్కారముగా లాగుకొని వచ్చు.

"కలగుండు వడఁ జెండు కరి సైనఁ జెవి పట్టి, బలిమి మైఁ దెత్తు నీ పాద మాన." మను. 4.34.

వాడుకలో—

"వాణ్ణి చెవి పట్టుకొని లాక్కొని రా." వా.

**చెవి పెట్టు**

విను.

"కట్టఁడు యోగ్యశాటిఁ బొడకట్టఁడు రాచనగళ్లకుం జెవిం, బెట్టఁడు కీర్తి..." బహు. 5.6.

చూ. చెవి బెట్టు.

**చెవిపోగులు**

అంటుజోళ్లు.

**చెవి బడు**

వినబడు.

"ఏ పలుకుం జెవిం బడఁగ నీక పెనం గుచు మోము దవ్వగాఁ, జూపుచు." కళా. 7.157.

"అనుకలకలంబు చెవిఁ బడ." కువ. 4.128.

**చెవి బెట్టు**

విను.

బహు. 5.6.

చూ. చెవిపెట్టు.

**చెవి మెలివేసి**

శిక్షించి, బలవంత పెట్టి.

"ఆవిడ ఎలాగో వాణ్ణి చెవి మెలివేసి తాను చెప్పినపని చేయించుకుంటుంది." వా.

**చెవియాకు**

చెవికమ్మ.

తొలిరోజులలో తాటాకు చుట్టి పెట్టుకునేవారు. అందువల్ల ఏర్పడినదే కమ్మ అను మాట కూడా.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 215.

చూ. చెవ్వాకు.

**చెవి యొగ్గు**

విను, అవధానంతో విను.

చూ. చెవి యొడ్డు.

**చెవి యొడ్డు**

చెవి యొగ్గు.

"చెవి యొడ్డి వినంగఁ దగదు." కాశీ. 6.286.

**చెవిలో చెప్పు**

రహస్యముగా చెప్పు.

"శాలీనుఁడు సుగాత్రి దనపై నొరగ వంచి చెవిలో నొకటి యే మనుచునో నగుచుఁ జెప్పెన్." కళా. 4.50.

**చెవిలో నూదు**

రహస్యముగా దుర్బోధలు చేయు.

"ఆ పెళ్లాం కాస్తా చెవిలో ఊదే సరికి అన్నతో భాగపరిష్కారానికి వాడు తగాదా పెట్టుకొన్నాడు." వా.

**చెవిలో వేయు**

రహస్యముగా తెలియజేయు.

"ఎలాగో యీ సంగతి వాడి చెవిలో వేసి రా. తరవాత సంగతి నేను చెప్తాను." వా.

**చెవిలో వేసికొను**

మనసు పెట్టి విను.

"వా డేం చెప్పినా చెవులో వేసుకోడు." వా.

**చెవిలో సొంటికొమ్మూదు**

మూర్ఛపడినప్పుడు శుశ్రూష చేయు.

"......సూర్యసుతుండు దేవతా, సూదన బాణవేగమున సొమ్మసిలెం జెవిలోన సొంటికొమ్మూఁదినవాఁడ వైతివె యయ్యో..." రామాభ్యు. 8.103.

**చెవి వాలవేయు**

చెప్పేడుమాటలకు లోబడు.

"అది వాళ్ల అమ్మమీద రోజూ ఏవేవో చెప్తూండే సరికి వాడూ చివరికి చెవి వాల వేశాడు." వా.

**చెవి సోక జెప్పు**

మనసునకు నాటునట్లు చెప్పు.

"చెవి సోఁకఁ జెప్పఁగన్." విజయ. 1.31.

**చెవుడు పడు**

చెవులు గడియలు పడు – ముఖ్యంగా పెద్దశబ్దం వినుట వల్ల.

**చెవుడు పఱచు**

చెవుడు కలుగునట్లు చేయు.

**చెవుడుపాటు**

చెవుడు కలుగుట.

**చెవుడ్పాటు.**

చూ. చెవుడుపాటు.

**చెవులపండువుగా**

కర్ణపర్వముగా. వినుటకు ఇంపైనదిగా.

"నాకుఁ జెవులపండువుగ వినిపింపు నీ పలుకు లనియె." కళా. 3.34.

"కవిబుధశ్రేణికిఁ జెవులపండువులుగా, నాస్థానమున మాటలాడ నేర్చు." భీమ. 1.65.

**చెవులపిల్లి**

కుందేలు.

**చెవులపువ్వులు**

ఒక చెవినగ. బుగడల వంటిది.

**చెవులపూవులు**

చెవినగ.

**చెవులపోతు**

కుందేలు.

"చెవులపో తెదు రయ్యెఁ జెమరు డా దెసఁ జూపె." ఉత్త. రా. 6.235.

**చెవుల బెట్టికొను**

విను.

"కాని యా తప్పు నీ, చెవులం బెట్టికొనంగరాని పురి గాసిం బెట్టి కట్టిండి వాఁసవుఁ డెట్టుం దనుఁ జంపఁజాలు......" ఉ. హరి. 1.184.

**చెవుల బెట్టు**

చెప్పినది విను.

"ఏ మనఁగ నేమి నీమగఁ, డేమాటలు చెవులఁ బెట్టఁ డించుకయేనిన్." నలచ. 5.141.

**చెవుల బోయు**

చెప్పు; బోధలు చేయు.

"చెవులఁ బోయమె సవిశేషకార్య వచనములు." భార. స్త్రీ. 1.142.

**చెవులలో చెట్టు మొలుచు**

వినిపించుకోక పోవు.

నిరసనగా అనుమాట.

కొత్త. 346.

**చెవులలో వేళ్లు పెట్టుకొను**

ఏ మాత్రం వినక పోవు.

"వాడే మంచిపాట విన్నా చెవులలో వేళ్లు పెట్టుకొంటాడు." వా.

"మా సంగతి మేం మాట్లాడుకొంటూ ఉన్నాం. ఇష్టం లేకపోతే చెవుల్లో వేళ్లు పెట్టుకో." వా.

**చెవుల వ్రేళ్ళు చెఱివికొను**

చెవులు మూసుకొను– శబ్దము విన లేక.

"బిట్టులిక్క గట్టురాపట్టి దొట్టినభీతిఁ, జెవులఁ జొట్టన వ్రేళ్లు జెఱివికొనియె." దశా. కూర్మ. 49.

**చెవులు గడియలు పడు**

తిండి లేక పోవుటతోనో, పెద్ద శబ్దంవల్లనో చెవులు మూసుకొని పోవు.

"ఉడుగనిపసులఁ జెవులను, గడియలు పడ మేను వడఁక..."

పాండు. 3.103.

"మూన్నాళ్లనుంచీ తిండి లేక చెవులు గడియలు పడ్డాయి." వా.

**చెవులు గఱచు**

చాడీలు చెప్పు.

"పలు గూఁత లఱచువానిన్, గలుద్రావెడువానిఁ జెవులు గఱచెడువానిన్." వేంక. పంచ. 1.445.

**చెవులు గింగురు మను**

దెబ్బతో చెవులలో శబ్దము పుట్టు.

"ఆ శబ్దంతో చెవులు గింగుర మన్నవి." వా.

**చెవులు చిందర్లు వోవు**

చెవులు చిల్లులు పడు.

"చెవులు చిందర్లు వోవ."

విప్ర. 4.19.

**చెవులు చిందఱ పోవు**

చెవులు తూట్లు పడు–శబ్దాతిశయమువలన...

"చెవులు చిందఱ వోవఁ జెలఁగుకపీంద్రుల, పోరంటిమా..." కళా. 7.19.

**చెవులు చిందఱలు వోవు**

చెవులు తూట్లు పడు–ఎక్కువ శబ్దముచే ననుట.

"చెవులు సిందఱలు వోఁ జెలఁగెఁ జిమ్మటలు." హరి. ద్వి. 1 భా.

**చెవులు చికిలీ చేసుకొని**

సావధానతతో.

"నీ పాట వినడానికి చెవులు చికిలీ చేసుకొని కూర్చున్నాను." వా.

**చెవులు చిల్లులు వోవు**

చెవులు తూట్లు పడు.

"చిలుకలు పల్కునో చెవులు చిల్లులు వోవఁగ నంచు నెన్నఁడున్..."

నైష.

చూ. చెవులు చిందఱ పోవు.

**చెవులు చీములు గట్టు**

దుర్భాషల చే బాధ కలుగు.

వినరానిమాటల వల్ల బాధపడు.

"పుడమిజనంబు లెల్ల నినుఁ బ్రువ్వఁగఁ దిట్టఁగ వించు నుస్కి నో, చ్చెడుమది యెప్పుడుం జెవులు చీములు గట్టెడుఁ గౌరవేశ్వరా!" భా. 2.10.

### చెవులు ఝాడించుకొని

పని కాక వెను తిరిగి.

"అంత దూరమూ వెళ్లి వాడు లేక పోయేసరికి, చెవులు ఝాడించుకొని వచ్చాను." వా.

### చెవులు తెగిన వెధవ

ఒక తిట్టు—వ్యర్థుడు.

నిష్ప్రయోజకుడు.

### చెవులు తెగు

విధవ యగు.

ముండ మోస్తే భూషణాదులను తీసి వేస్తారు. ముత్తైదువ లక్షణాల్లో చెవియాకు ఒకటి. అందుపై యేర్పడిన పలుకుబడి.

### చెవులు పట్టి యాడించు

వశవర్తిని చేసికొను.

"గరుడ గంధర్వ యక్ష కిన్నరులఁ గన్నఁ, జెవులు వట్టి యాడించు నశేష లోక..." నిర్వ. 4.22.

"నిను గీతి సాహితీ మోహనవాణులు చెవులు వట్టి యాడింపంగా." విజ. 1.155.

### చెవులు బీటలు వాఱు

అతి శబ్దము చే చెవులు పగులు.

"చెవులు బీఁటలు వాఱంగఁ జెలఁగు నమ్మ, హారవమున కులుకక..." భార. ద్రో. 3.222.

### చెవులు మూసుకొను

వినరాని మాట అంటున్నావు సుమా అని సూచించు.

"ఆ దైవదూషణ వింటే ఏ ఆస్తికుడైనా చెవులు మూసుకుంటాడు." వా.

### చెవులు సోకు

వినబడు, చెవిబడు.

"ఎట్టి వార్త, చెవులు సోఁకు నొక్కొ చే వెట్టి కలఁచిన, భంగిఁ ద్రిప్పికొనఁ దొడంగె మనము." భార. ద్రోణ. 2.230.

"వీణా, స్ఫుటమధురరవంబు చెవుల సోఁకినమాత్రన్." రుక్మాం. 2.126.

### చేంతాడు

బావిలోనుండి నీళ్లు తోడుకు నేందు కుపయోగించే తాడు.

### చేకటులు

చేతులకు పెట్టుకునే ఒక రకమైన కడియాలు.

### చేకట్టుదండ

చేతులకు కట్టు కట్టే దండ. వాకట్టు వంటి దే ఇక్కడి చేకట్టు.

"వాకట్టు బదనిక చేకట్టుదండలు." శృం. శాకు. 1.113.

### చేకత్తి

చేతికత్తి.

చేకత్తికాడు

వీరుడు, భటుడు.

చే కలవాడు

బలశాలి, ఉదారశీలి,

దాత అని శ. ర.

"నీరజగర్భ రమావిభుం గడుం, జే కల వాఁ డటం బ్రతని చిత్తము లాసను రంబు సేసి." శేష. 4.92.

చే కాచు

చేయి అడ్డుపెట్టు.

"కొనగొమ్మ నాటునొ కోమలపాణి, యనుచుఁ జే కాచి."

వర. రా. బా. పు. 49. పంక్తి. 25.

చే కానుక

కానుక.

"నాకుఁ జే, కానుక చేసె నీనృపతి కామిని." శుక. 3.534.

చే కాన్క

కానుక.

దశా. 1.278.

చే కాసు

చేతిలోని డబ్బు. ఉన్నడబ్బు అనుట.

"తడితీపు పుట్టించి తక్క చేకా స్నెల్ల, వడివెట్టి రాఁ దీయ వారిఁ జూచి."

విప్ర. 4.16.

చేకురు

దొరకు.

చేకూడు

దొరకు, నెరవేరు.

చేకూనలు

చేతిబిడ్డలు, చిన్నదూడలు.

"దసరయ్య దివ్యమస్తక సురధేను, లెసగఁ జేకూనల నీనినయట్లు."

పండితా. ప్రథ. పురా. పుట. 305.

చేకూరు

1. దొరకు.

2. కలుగు.

"లోకఖ్యాతి చేకూరు."

రుక్మాం. 2.79.

చే కూలి

దినకూలి.

ఏదో పని చేయడం డబ్బు తీసుకోవడం. నెలకొలువు కాదు.

"బాపని యింటఁ, జేకూలికిని గొల్చి జీవించుచుండి."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 145.

"చేకూలి గాని, పని వెలగొని చేయు బంట్లకు రాశి, గొనవచ్చునే తవ కూలియే తక్క." బసవ.

చే కొణుచు

పచ్చు చెదలు.

చే కొణుదు

పచ్చుచెదలు.

శ. ర.

చేకొద్ది కుంచము

అందు బాటులో నున్న అమూల్యవస్తువు.

"కరతలామలకంబు కైవల్యసంపద, యింటఁ జేరినపంట యీప్సితంబు, ఓడఁ గట్టినమూల మీఁదు లేనిశుభంబు, చేకొద్దికుంచ మశేషభూతి."

చంద్రా. 1.57.

చూ. చేపట్టు కుంచము.

**చేకొను**

దగ్గర తీయు; తీసుకొను.

"మానము మాలినవాని... జేకొంౘె."
భాస్క. యుద్ధ. 1243.

ఇతర భావచ్ఛాయ లనేకం దీని ననుసరించే కానవస్తాయి.

**చేకోల**

చేతికఱ్ఱ.

**చేకోలు**

చేకొనుట.

**చేగగడ్డ**

ఒక ఓషధి.
బ్రౌణ.

**చేగడియ**

వాకిలి కున్న గడియ. చేతితో తీయగలది – చిన్నది.
శుక. 2.127.

**చేగ దేరు**

చేవ దేఱు; గడిదేరు.

"చేగదేరి వారలు సేసినదే చేఁత."
తాళ్ల. సం. 8.118.

**చేగానుగ**

చేతితో త్రిప్పేగానుగ.
హర. 1.18.

**చేగిండి**

చేతితో పట్టుకొనగల గిండి– కూజా చెంబు.
దశా. 4.97.

**చేగొడ్డలి**

గండ్రగొడ్డలి, చిన్నగొడ్డలి.
భాగ. 9.467.

**చేగోడీలు**

ఒక తినుబండం. కోడివడలు, కోడిమెడలు అని దక్షిణాంధ్రం వాడుక.

**చే చమురు**

నెయ్యి – చేతిలో వేసు కుంటారు గనుక.

**చే చాచు**

ఆశించు, సిద్ధపడు.

"ఎవ్వారికిం, జేరన్ రానిమహానిధాన మునకుం జే చాచితిం దొయ్యలీ!"
ఉత్త. హరి. 5.155.

"ఎవ్వనితో నిచ్చోటం, జివ్వకుఁ జే సాఁప వలదు." కాశీ. 1.109.
పరమ. 3.157. పుట.

**చేచేత కుడిపించు**

స్వయముగా అనుభవింపజేయు.

"చేసినకార్యంబు చేచేతఁ గుడిపించె." శశి (అప్ప) 467.

**చేచేప**

చేపు.

"పాలిండ్లు చేచేప, మదిఁ బుత్రుపైఁ బ్రేమ మల్లడి గొనఁగ."

**చేజిక్కు**

వశ మగు.
రాధ. 2.105.

**చేజేతుల చేసికొను**

స్వయంగా చేసుకొను.

"ఆ వ్యాపారంలో దిగి పాడై పోయావు. చేజేతులా చేసుకొన్నదానికి ఒకరిని అని లాభం యే ముందికి?" వా

చేజోడి

చేతులు చేతులు పట్టుకొని పోవువాడు.

"క్రీడ యించుక లేని చేజోడి బాజుగు." కవిక. 4.99.

చేట కొట్టు

ఇం కేమీ లే దను.

ధాన్యం అయిపోయిన దని చేటను తట్టుటపై వచ్చిన పలుకుబడి.

చేటకొల్లారు

త్రిశాల. గృహవిశేషం. ఆంధ్ర. భా. ద్వి. 161.

చేట చేరుపుగా

గోడకు చేట నానించినట్లు - కొంచె మేటవాలుగా.

"చేట చేరుపుగా పెట్టవే పళ్ళెం. పడ గలదు." వా.

చేటపెయ్య

1. పనికి మాలినవాడు.

"చెఱచుటకు చేటపెయ్య చాలును." సా.

2. దూడ పోగా గడ్డి, చర్మంతో కుట్టిన దూడరూపు.

చేటప్పు

చేబదులు.

అందులో డబ్బయితే చేతి అప్పు, ధామన్యయితే చేటప్పు.

చేట యెత్తుక వచ్చు

తన్నుటకై వచ్చు.

ఆడవాళ్లు సామాన్యంగా చేటతోనూ, పొరకత్రోనూ కొట్టుటూ, కొట్టుదు మనుటూ అలవాటు. అందుపై వచ్చిన పలుకుబడి.

"చెవు డనఁగా రాదు చేట యెత్తుక వచ్చు." శుక. 3.21.

చేటలో పడినది మొదలు కాటిలో పడువఱకు

పుట్టినది మొదలు చచ్చు వఱకు.

"చేటలోఁ బడినది మొదలు కాటిలోఁ బడువఱకు, మనము ప్రత్యక్షముగ, నిరంతరముగ నేడువవలసిన యేడుపు లు మనకుఁ జాలునా?" సాక్షి. 66.

పూర్వకాలం మంత్రసానులు పిండం బయట పడగానే చేటలో పెట్టు అలవాటుపై వచ్చిన పలుకుబడి.

చేటలో పడు

పుట్టు.

చూ. చేటలో పడినది మొదలు...

చేటుకాలము

వినాశకాలము.

"చేటుకాల మైనఁ బ్రబిపట్టి నంతియు." భార. ద్రోణ. 4.291.

"నరకుఁ డిమ్మెయి, గారించెం దనకుఁ జేటుకాలంబునఁ దన్." ఉ. హరి. 1.114.

ఇది నేటికీ చిత్తూరు ప్రాంతం లో విశేషంగా ఉపయోగిస్తారు.

"వాడి కేం చేటుకాలం వచ్చింది? అంత మాట అన్నాడు." వా.

**చేటుగాలము వచ్చు**

పొయ్యేకాలము వచ్చు.

చూ. పొయ్యేకాలము వచ్చు.

**చేటుతఱి**

అవసానకాలము.

భాస్క. రా. యు. 461.

**చేటుపడు**

చచ్చు, భగ్నమగు.

చూ. చేడ్పడు.

**చేటుపాటు**

భంగపాటు.

వేం. పంచ. 3.168.

**చేటుపాటులకు లోనగు**

ఇబ్బందులకు, ఇక్కట్టులకు లోబడు.

"అకటా! నీ విటు చేటుపాటులకు లోనై యున్నయిల్లాల వింతె కదా! పుట్టినయిల్లుఁ జేర్చువగ లేదే..." శుక. 3.265.

**చేట్పాటు**

కష్టము.

భీమ. 3.4.

**చేట్లకొఱివి**

ఒక తిట్టు.

దౌర్భాగ్యుడు - దుష్టుడు.

కొంపలకు నిప్పంటించువాడు.

కొఱివి అని కూడా తిట్టుగా ఉపయోగించడం కలదు.

**చేట్లపురులు**

అమాయకురాలు, పసిపాప.

పూర్వం చేటలో పురుడు పోసుకునే వారు.

చేటలోని పురుడు - శిశువు - వంటి అమాయకురాలు.

'చేటలో పడింది మొదలూ' అని పలుకుబడి.

"అతనిఁ గోరి తపము, సేసె దట గౌరి! నీ వెంత చేట్లపురులా!" కుమా. 7.38.

చూ. చేటలో పడు.

**చేడ్పడు**

చేటు చెందు, నొప్పి పెట్టు, చెడు.

"కాలు చేడ్పడఁ దన కేల తిరుగ." భీమ. 4.32.

వాడుకలోనూ 'కాళ్ళు చెడేట్టు తిరిగాడు' అంటారు.

**చేడ్పాటు**

చూ. చేడ్పడు.

**చేతకత్తె**

చెలికత్తె.

"అతను చేఁతకత్తె లమరంగఁ గాంతలు." వేమన.

**చేత కాని....**

అసమర్థమైన, వ్యర్థమైన.

**చేతగట్టు**

కృతకాద్రి.

శ. ర.

**చేతగాని మాటలు**

పనికి రాని మాటలు.

"ఊరికే చేతగాని మాటలు మాట్లాడ వద్దు." వా.

చేత గుండెకాయ యుడినా

ఎంత నమ్మించినా.

"వారల నమ్మంగఁ, గాదు నేత గుండె కాయ యుడిన." భార. శల్య. 2.397.

చే తడి యార లేదు

పని ముగిసి ఇంకా కాసింత సేపైనను కాలేదు. ఆ పని చేసి యింకా క్షణ మైనా కాలేదు – చేతడి యారునంత సేపు కూడా పట్ట లే దనుట. పని ముగించగనే చేతులు కడుగుకొనుట— నిత్య నైమిత్తిక కర్మలలో 'అప ఉప స్పృశ్య' అనుకొనుట ఆచారము. అది యాఱ లేదనగా ఆ తడి యింకా ఆఱ లే దనుట.

"ఆజ్ఞ వెట్టించి చే తడియార దిపుడు, దీని కెబ్బంగి మోహనం బైనవేణి, గలిగె." కా. మా. 1.54.

చూ. చే తడి యాఱ లేదు.

"చెట్టులఁ గట్టి నమ్ము మని చే తడి యాఱదు చంపు టెట్లు..." పంచ. వేం. 1.49.

చూ. చేతడి యాఱకుండ.

చే తడి యాఱకుండ

వెనువెంట నే.

"చెలువ కుమారునిన్ వడుగు చేసిన చేతడి యాఱకుండఁగాఁ, బాలు పెస లారఁగా..." హరవి. 2.103.

చేత తడాఱదు

ఇప్పు డిప్పుడే ఆ పని చేసితి నను సందర్భంలో ఈ పలుకు బడిని ఉపయోగిస్తారు.

దానం చేసేటప్పుడు ధారా పూర్వకంగా చేసే అలవాటుపై వచ్చిన పలుకుబడి.

"చేతి తడాఱ దుచ్చిష్టపు లేమ." గౌ. హరి. ద్వితీ. పంక్తి. 390.

"వాడికి ఎంత పెట్టానో లెక్క లేదు. ఇంకా నా చేతి తడి ఆరక ముందే వాడు ఎదురు తిరగడం మొదలు పెట్టాడు." వా.

క్రమేణా ఈ పలుకుబడి ఏ పనైనా చేసీ చేయక ముందే అనే అర్థంలో కూడా పరిణమించింది.

చూ. చే తడి యార లేదు.

చేత తీఱకుండు

చేయి తీరక పోవు, తీరుబడి లేక పోవు.

"తెంపు సేయఁగఁ జేతఁ దీఱకున్న దియొ." వర. రా. సుం. పు. 91. పంక్తి. 3.

చేత దీఱు

చేత అగు.

"పో నేర నచ్చుటికి నా చేతఁ దీఱదు." వర. రా. బా. పు. 191. పంక్తి. 9.

చేత తీఱ దనగా, చేత కా దనుట.

చేత నగు

చేయుటకు సమర్థు డగు.

ఇది అన్ని రకాలుగానూ ఉపయోగిస్తారు.

చేత కాని వాడు, వాడికి చేత నవుతుంది. వాడి చేత కాదు ఇత్యాదులు.

"అతని నంపించు మిప్పటి కితని చేతఁ, గాక యుండినఁ జూతము గాక యనిన." హంస. 5.194.

చేతనపడు

తెలివి నందు.

చేతనప్రాలు

తలప్రాలు.

"తరంగమాలికా, నీతము లైనము త్తెములు...చేతనఁప్రాలు వోయుగతి." వాల్మీ. 1.70.

రూ. చేతన్నప్రాలు.

చేతనించు

తెలివి పొందు.

చే తప్పు

చేతితప్పు - వ్రాతలో.

చేత నయినట్లు చెప్పు

ఎంత తెలిస్తే అంత చెప్పు.

"ఎఱుంగకన్న నీ,చే నయిన ట్లికం దెలిసి చెప్పు మనన్." కళా. 7.15.

"నేను చెయ్యలే నంటే కుదరదు. ఇం కెవరూ లేరు. నీచేత నయినంతవఱకే చేయి." వా.

....చేత పోవు

...చేత మరణించు.

"కృపాశ్వత్థాను కృతవర్మ కర్ణశల్యులు నీచేతఁ బోయెడువారు." భార. కర్ణ. 2.122.

చేత బట్టు

ఆధారముగా చేసుకొను. భార. విరా. 117.

చేతబడి

మంత్రతంత్రాదులతో ఒకరికి కీడు గలుగునట్లు చేయు ఆభిచారికక్రియ.

"వాడు చేతబడి చేయించినాడు. దానితో ఆ కుటుంబం నాశనం అయి పోయింది." వా.

చేతటికము చేయు

కీడు చేయు.

"ప్రాంత యగుమంత్రి తనకుం, జేత టికముఁ జేసె ననుచు శిక్షించి."

చే తవులు

దొరకు.

"చేతుల కనివోఁ గయ్యము, సేత విలెడు..." ఉత్త. హరి. 5.22.

చేతాకు

సాహసము, పొగరు.

"నాతోఁ దలపోయకరో, పాతురతన్ బ్రతిన వట్టి తవనీనాథ, వ్రాతంబు వినఁగ నిట్టులు, చేతాఁకున దెప్పరంబు సేసితి కంటే." భార. ద్రోణ. 2.302.

చేతా వాతా కాని

చేత కాని.

"వాడు వట్టి చేతా వాతా కానివాడు." వా.

"వాడికి చేతా కాదు వాతా కాదు." వా.

రూ. చేతాకాదు, వాతాకాదు.

చేతి కబ్బు

దొరకు.

"శాపెరవయసుదే చేతి కబ్బెను కొంక నేమిటికి." తాళ్ల. సం. 3.64.

**చేతికాయ**

చేదుకాయ.

ఇలాగే, చేతిదొండ, చేతిదోస, చేతి పుచ్చ, చేతి పొట్ల, చేతి బీర, చేతి సొర ఇత్యాదులు – చేదైన...

**చేతికి అంది వచ్చు**

సాయపడగల స్థితికి వచ్చు.

"సమయానికి కొడుకు చేతికి అంది వచ్చాడు గనక సరిపోయింది గానీ, లేకపోతే నానాబాధా పడిపోయేవాడు." వా.

చూ. చేతికి వచ్చు.

**చేతికి ఎముక లేక**

ధారాళంగా, దాన పరుడుగా.

"చేతికి నెమ్మక యింత యుండమిన్." పాణి. 5.28.

చూ. చేతికి ఎముక లేదు.

**చేతికి ఎముక లేదు**

అతి దానశీలు డనుట.

"వాడిచేతికి ఎముక లేదు. అడిగినవాడికల్లా అడిగినంతా యిచ్చాడు." వా.

**చేతికి చిప్ప యిచ్చు**

సర్వనాశనము చేయు.

భ్రష్టు మొనర్చు.

"వాణ్ణి నమ్ముకుంటే నీకు చేతికి చిప్ప యిచ్చి పంపిస్తాడు." వా.

**చేతికి చెయ్యి నష్టం**

ద్రవ్యం మారకంవల్ల కలిగే నష్టం.

దీనినే వట్టం అంటారు.

కాశీయా. 72.

**చేతికి రాని**

అక్కరకు రాని.

"అలయక నాలుచట్ల పెరుఁ గమ్మినఁ జేతికి రాని రూక నా,వలె నల సంత లోన..." శుక. 2.580.

**చేతికి లోనగు**

దొరకు.

"చేతిపదార్థముఁ దలఁచక చేరువ నుండినవారల, చేతి పదార్థము గోరిన చేతికి లోనానా." తాళ్ల. సం. 5.209.

**చేతికి వచ్చు**

1. తనకు తోడ్పడుటకు తగిన వయసువా రగు.

"వాడి కేం? వాడి కొడుకులు చేతికి వచ్చినారు." వా.

2. దొరకు.

"డబ్బు చేతికి వచ్చిందా." వా.

**చేతిక్రింద....**

అధికారము క్రింద, యాజమాన్యము క్రింద.

"అతని కేమి? అతని చేతిక్రింద బోలెడంతమంది పని చేస్తున్నారు." వా.

"ఆ ఊళ్లో అలాగాజనం అంతా అతడి చేతికిందనే ఉంటారు. వాడు ఏ మయినా చేయగలడు." వా.

**చేతి కీలుబొమ్మ**

చెప్పినట్లు వినునట్టివాడు – వినునది.

"వాడు పెళ్లాం చేతి కీలుబొమ్మ అయి పోయాడు." వా.

**చేతిగరలు కనబడు**

తెలతెలవారు.

రాయలసీమలో నేటికీ వాడుకలో—

'చేతి గీరలు కనబడే పొద్దున లేచిపోతిని.'

'పరువు నేల పోయేటప్పటికి చేతిగీరలు కనబడినాయి.'

అంటారు.

"తన చేతి గరలు కనఁబడఁ, జనియెఁ బ్రభావతి రహస్యసదనంబునకున్." శుక. 4.88.

చూ. చేతిగీరలు కనబడు.

**చేతిగీరలు కనబడు**

తెలతెలవారు.

"చేతిగీరలు కనబడగానే వెళ్ళరా. సులువుగా వూరు చేరుకుంటావు." వా.

**చేతిచమురు భాగవతము**

దండుగపని.

సొంతడబ్బు ఖర్చు పెట్టుకొని చేయు సమష్టి పని.

భాగవత మాడించుటకై అగు ఆముదపు ఖర్చు అంతా తానొకడే భరించడం దండుగే కదా?

**చేతిచిలుము వదలు**

డబ్బు దండుగ అగు.

"ఆ వ్యాజ్యంలో దిగితే చేతి చిలుము వదలడం తప్ప నీకు జరిగే ఉపకారం ఏమీ లేదు." వా.

**చేతి తీట మాన్పు**

భుజకండూతి తొలగించు.

"కలిగెఁ గదా! నాకుఁ గదనరంగమునఁ, గలుషంబుతోఁ జేతిగమి తీఁట మాన్ప." ద్విప. భాగ. కల్యా. పు. 147.

**చేతి నిమ్మపండు**

వశవర్తి.

"చుట్టాల సురభి రాజుల చేతి నిమ్మపండు." బహులా. 5. ఆ.

చూ. చేతిలోని వాడు.

**చేతి బంగారము**

అందుబాటులోని అమూల్య వస్తువు.

తాళ్ల. సం. 9.219.

**చేతిబరువు కనుగొను**

పరాక్రమము రుచి చూచు.

"నా చేతిబరువు, గనుఁగొని యెదవిపుడ యనియె." భార. కర్ణ. 2.12.

**చేతిబిడ్డ**

పసిబిడ్డ.

చంటిబిడ్డకన్న కాస్త పెద్ద.

**చేతిమీదుగా....**

పర్యవేక్షణక్రింద, యాజమాన్యముక్రింద.

"నీచేతిమీదుగా ఎన్ని శుభకార్యాలో జరిపించావు. ఈ ఒక్క కార్యం కూడా నీచేతిమీదుగానే జరగనీ అని నా అభిలాష." వా.

"ఈ ఊళ్లో ధర్మకార్యా లన్నీ అతడి చేతిమీదుగా నడచేవే." వా.

**చేతి యదరువ్రేతలు**

అదురువేట్లు.

"లజ్జారోపభూషితంబు లైన యా యోషారత్నంబు, చేతి యద్దరు ద్వేతలు తమకు నూతనోత్సవంబు లగుచు."
ప్రభా. 5.69.

నేటికీ రాయలసీమలో వాడుకలో ఉన్నది.

"ఒంటిగా చిక్కినప్పుడు నాలుగు దెబ్బలు వేసి పంపితే వాడే దారికి వస్తాడు." వా.

**చేతియద్దము**

పిడి ఉండి చేతితో పట్టుకొనుటకను వయిన అద్దము.

**చేతిలో ఉండు**

వశవర్తియై ఉండు.

"వాడు నాచేతిలో ఉన్నాడు. ఏం చెయ్య మన్నా చేస్తాడు." వా.

**చేతిలో చేయి వేయు**

ప్రమాణము చేయు.

"వాడీపని చేస్తా నని చేతిలో చేయి వేసి చెప్పాడు." వా.

**చేతిలో తడి**

చూ. చేతిలో తేమ.

**చేతిలో తేమ**

డబ్బు.

"చేతిలో తేమ ఉంటే ఈపాటికి యిలా ఉండేవాణ్ణా?"

"చేతిలో తేమ లేక మెత్తబడ్డాడు గానీ..."

చూ. చేతిలో తడి.

**చేతిలోనిది**

వశమైనది, తనది.

**చేతిలోనియది**

చేతిలోనిది.

"సజ్జనుని చేతిలోనియది బ్రహ్మలోకంబు." భార. శాంతి. 6.298.

**చేతిలోని వాడు**

అధీనుడు, వశవర్తి.

"భీమధన్వుండు నీ చేతిలోని వాఁడ యదియ మాకుం బ్రదుకఁ దెరువు."
దశకు. 10.43.

"ఇట్లు సేయకేని యింద్ర! మీ రెల్ల నా, చేతిలోని వార చెప్ప నేల."
ప్రభా. 1.88.

**చేతిలో పెట్టిపోవు**

1. అప్పగించు.

"వాడు పోతూ పోతూ యీ పిల్లలను నా చేతిలో పెట్టి పోయాడు. వాళ్లను ఒకదారికి తెచ్చేభారం నామీ దుంది." వా.

2. ఇచ్చు.

"వాడి కేదో ఒక రూపాయ చేతిలో పెట్టి పంపించు." వా.

**చేతిలో ఉండు**

స్వాధీనమై ఉండు.

"ఒకరిచేతిలో ఉన్నాక చెప్పిన పన్ని చేయాలి కదా!" వా.

**(ఒకని) చేతిలో బ్రతుకు**

ఒకరి ఆధారము మీద బ్రదుకు.

"అ, ట్లే తా నాతని చేతిలో బ్రదుకు వాఁడే యాఁ జుమీ మీఁదటన్."
ఆము. 4.213.

"ఒకరిచేతిలో బతకడం నా కిష్టం లేదు." వా.

**చేతిబ్రాలు**

చేబ్రాలు.

శ. ర.

**చేతుల కసి పోవగా**

చేతుల కసి దీరునట్లు, చేతుల నిండా (యుద్ధము చేయు.)

"చేతులకసి వోవంగ న, రాతులు బెగ్గిలఁగఁ గ్రీడి ప్రకటస్ఫురణన్." భార. కర్ణ. 2.300.

"చేతులకసి వోఁ గయ్యము, చేత వినిన యట్టివిధము చింతించి నను౯." ఉ. హరి. 5.22.

**చేతులకసి వోవునట్లు**

చేతులకసి తీరునట్లుగా.

"వీరు వా రనక వీరావేశంబునం జేతుల కసి వోవం జెలరేఁగి సింహనాదంబులు సేయుచు మోఁదువారును." ఉ. హ. 4.229.

**చేతుల కాటి నిల్చు**

ఎదిరించి నిలువ గలుగు.

"...ఏమియును, డయ్యక కొంతసేపు పెనుఘాకను జేతుల కాటి నిల్చువాఁ, డెయ్యెడఁ బోటుబంటునకు నెంతయుఁ గాతుకకారి కాఁడె." ప్ర. 2.58.

**చేతుల తీట**

భుజకండూతి, యుద్ధేచ్ఛ.

"చెనటి కలహాభీతి చేతుల తీట వోఁ, బొడువఁ జాలునేని..." కుమా. 10.144.

"చేతుల, తీఁట నిలుపరాక త్రిభువనముల రేపుచున్నవాఁడు." కుమా. 11.103.

**చేతుల చఱచు**

చేతులతో కొట్టు.

"ఇరువురు మీఁదన్, జెచ్చెరఁ జేతులఁ జఱచుచు, వచ్చెను గద! దూ ఱటంచు వనరుచుఁ దమలోన్." ఉషా. 3.57.

**చేతులను తేల్చు**

చేతులు కడుగుకొను.

"కర్కారికాముఖాగ్ర, గళితగంధోదకంబులఁ గంసవైరి, చేతులను దేల్చె బాంధవశ్రేణితోడ." పారి. 2.20.

**చేతుల బట్టు**

చేర దీయు.

"సీతఁ గానఁగ లేక చేరిన నన్నుఁ, జేతులఁ బట్టక చెదరఁ ద్రోలుదురు." వర. రా. కిష్కి. పు. 490. పంక్తి. 16.

**చేతుల లావు**

భుజబలము.

"వీఁడు నీ చేతులలా వెఱుంగఁడు." భార. ద్రోణ. 183.

**చేతుల వ్రేళ్లు మడచికొనుచు నేడ్చు**

ఏడ్చుటలో ఏమీ చేయలేక పోవుట సూచిస్తూ చేయు చేష్ట.

"మార్చి మార్చి చేతుల వ్రేళ్లు మడఁచికొనుచు, నింక నెట్లమ్మ యంచు నయ్యింతు లేడ్వ." ఉ. హరి. 5.276.

**చేతు లాడించుకొంటూ**

పని కాక (తిరిగి వచ్చు.)

"ఆ నీ కొడుకు వెళ్ళి కేంఫి వెళ్లాడు. చేతు లాడించుకొంటూ వచ్చాడు." వా.

రూ. చేతు లూగించుకుంటూ.

**చేతులార**

తనివి తీరా, చేతులకు సంతృప్తిగా.

"చేతు లారంగ శివునిఁ బూజింపఁడేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁ డేని..." భాగ. 10.

చేతులార చేసుకొను

స్వయంగా తెలిసి తెలిసీ చేసుకొను.

"చేతులారా చేసుకొన్న దానికి అనుభవించక తప్పుతుందా ?"

చూ. చేజేతుల జేసుకొను.

చేతులు కట్టుకొని

వినయంతో.

చేతులు కట్టుకొని కూర్చుండుట వినయసూచకం.

"వీళ్ళంతా యిక్కడ యిన్ని మాటలు మాట్లాడుతారు గానీ, రెడ్డిగా రొచ్చే సరికి చేతులు కట్టుకొని నిల్చుంటారు." వా.

చేతులు కడుగుకొను

సంబంధము వదలుకొను.

చేతులు కడుగుకొనుట ఏదో పని ముగించుటను తెలుపును.

"ఈ పిల్లను అత్తవారింటికి పంపించి చేతులు కడుక్కొని, కాశీకి వెళ్ళి పోదా మనుకున్నాను." వా.

చేతులు కావు, కాళ్ళు

ప్రాధేయపడునప్పుడు అను మాట.

పట్టుకోవడం చేతులనే అయినా కాళ్లు పట్టుకున్నట్లు భావించు మనుట.

"నీ వెలాగో ఈ పని చేసి పెట్టాలి. చేతులు కా వివి కాళ్లు, వాడిమీద కోపం మానివేసెయ్." వా.

చేతులు తీయు

చేతులు నొప్పి పెట్టు.

"నిరస్తచాపుఁ డై, చేతులు తీయఁగా మరుఁడు సెజ్జపయిం బడు." నిరంకు. 2.11.

"ఈ రోజు రాసి రాసి చేతులు తీస్తున్నాయి." వా.

దీనిపై వచ్చినవే చేతుల తీపులు, కాళ్ల తీపులు.

చేతులు నెత్తిమీదికి వచ్చు

దిగులు కలుగు.

దిగులుగా ఉన్నప్పుడు కూర్చొని రెండు చేతులతో తల పట్టుకొనడం అలవాటు. అందుపై వచ్చినది.

"ఆ వ్యాజ్యం పోవడంతో వాడికి చేతులు నెత్తిమీదికి వచ్చాయి." వా.

చేతులు పట్టి పల్కు

అబ్బురముగా చెప్పుకొను.

"చానలు చేతులు పట్టి పల్కఁగన్." రాధి. 3.79.

చేతులు పిసుకుకొను

ఏమి చేయుటకూ తోచక పోవు.

"భాగ్యదేవతలార ! యీబారి గడవఁ, బెట్టరే యంచుఁ జేతులు పిసికికొనుచు." ఉత్త. హరి. 7.185.

చేతులు బయలూచు

ఊరక చేతు లాడించు.

"గుబు పొడుచువారు... చేతులు బయలూఁచువారు." భాస్క. యుద్ధ. 276.

చేతులు ముడుచుకొని కూర్చుండు

ఏమీ చేయక ఉండు, కర్తవ్య పరాఙ్ముఖు డగు.

"అవసరం వచ్చినప్పుడు ఏదో చెయ్యాలి గానీ, చేతులు ముడుచుకొని కూర్చుంటే యెట్లా?" వా.

చేతులు విచ్చు

చేతులు వెల్లకిల వేయు. నిరసనను తెలుపు.

రాధి. 4.15.

చేతు లెత్తి మ్రొక్కు

ఆదరముతో నమస్కరించు.

"......వసుధావిబుధుం, డచ్చప లాక్షీమణికిన్, ముచ్చటతోఁ జేతు లెత్తి మ్రొక్కినయంతన్."

శుక. 2.462.

"అతను నన్నెంతో ఆదుకున్నాడు. అతనికి చేతు లెత్తి మొక్కాలి." వా.

చేతు లొగ్గు

దోసిలి పట్టు, ప్రార్థించు.

"ఏ తల్లి తనకు నై చేతు లొగ్గినవారి."

జేమి. 1.17.

చేతు లొడ్డుకొను

చేతు లడ్డు పెట్టుకొను.

"వనితలు చల్లెడి,యుదకంబునకుఁ జేతు లొడ్డుకొనుచు..." కళా. 6.229.

చేతెంట

చేతి వెంట.

ప్రతిచేతి పోడవు నేలకూ.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 480.

చేదండ

కై దండ, చేయూత.

"చే యెత్తి తెమ్మని చేదండ యిచ్చి."

ద్విపద. సార్థం. 3.115. పు.

చే దప్పిపోవు

చేయి జారిపోవు.

పొరబాటున అనిష్టము జరుగు అని కూడ.

"ఎంత లే దింతె కద దీని కిట్టు లనకు, తా నె పోయెను గాంత చేఁ దప్పి పోవ, నేమి సేయుదు మని." హంస. 2.215.

చూ. చేదప్పు.

చే దప్పు

చేయి దాటిపోవు.

"చేదప్పిన కార్యములకు, వేదనఁ బొందుదురె..." ఉత్త. రా. 4.105.

చే దరిసెనము

కానుక.

చూ. చేదర్సెనము.

చే దర్సెనము

కానుక.

"నెమ్మి నీరీతిఁ జేదర్సెనమ్ము లొసఁగి."

జైమి. 3.76.

చూ. చేదరిసెనము.

చే దివియ

చేతి దివియ.

చూ. చేదివ్వె.

చేదుకట్టు

పిత్తకోశము.

చేదుడ్డు

చేతికఱ్ఱ.

చూ. చేకోల.

**చేదు మ్రింగు**

సాహసకార్యమునకు పూను.

అపథ్యమును సేవించు.

విషము మ్రింగుట సాహస కార్యము కనుక.

"చేఁదు మ్రింగెద వంచుఁ జిలికి నవ్వె ఘృతాచి, మాయలాఁ డని తిట్టె మంజుఘోష." మను. 3.109.

**చేదోడుగా**

సహాయముగా.

"పని పాట సేయఁ జేదోడుగఁ జెంచెత ల్పలుకుదోడుగ." కా. మా. 2.72.

చూ. చేదోడు వాదోడు.

**చేదోడు పడు**

సాయ పడు.

"హరిపైఁ, జిక్కినచిత్తంబు దనకుఁ జేదోడుపడన్." హరి. ఉత్త. 5.201.

**చేదోడు వాదోడు**

సహాయము.

చేయితోడు, వాయితోడు అనగా పనికి తోడుగానూ, పలుకు తోడుగానూ ఉండు ననుట.

"ఇది యదృచ్ఛానులాభ మై యొదవెఁ దోటపనికిఁ జేదోడు వాదోడు పాటు పడును." వైజ. 2.106.

**చేదోయి ముకుళించు**

నమస్కరించు.

"చేదోయిన్ ముకుళించి వీడుకొనె." జైమి. 1.104.

**చే నిమ్మపండు**

అందుబాటులో నున్నవాడు - ఉన్నది. కరజంభలము.

"క్రమ్మర నిజ వెంకటేశ నీచే నిమ్మపం డైన నీబంటు." తాళ్ల. సం. 11.2 భా. 67.

చూ. కరజంభలము.

**చేనీరు**

చేతిలో తీసుకొన్న నీరు.

"చేనీట నేత్రరాజీవముల్ తుడిచి." వర. రా. యు. పు. 196. పం. 12.

**చేను చెట్ర**

చేలు. జం.

"మీయాట లేమో మీ పాట లేమో యదిరేమే మీకుఁ బట్టెను గాని చేను చెట్ర యేమాయెనో మడిమట్ర యేమాయెనో యది మీకుఁ బట్టదాయె." ధర్మజ. 44 పు. 14 పం.

తె. జా.

**చే నులుచు**

చేతిని మెలిపెట్టు.

"చెచ్చెర నేతెంచి చే నుల్చి చాఁచి, పుచ్చుచు." పండితా. ద్వితీ. మహి. ప్రట. 126.

**చే నెత్తురు కాకుండ**

రక్తపాతము చేయకుండ.

"...అనూనధైర్యనిధి తావకపుత్రుఁ డితండు సేఁడు చే, నెత్తురు గాక యుండ నతినిష్ఠురశాతకృపాణధారచే..." రాజశే. 2.39.

**చేపట్టిన మన్ననలు**

పొందిన బహూకృతులు.

"చేరి వారి కరుణే చేపట్టినమన్ననలు."
తాళ్ల. సం. 8180.

చే పట్టు

1. గ్రహించు.

"...నీ పట్టంబు నీ మంత్రులి, చ్చిరి నా కింతయు నీదు రాజ్య మిది నే చేపట్టు నేఁ బోయెదన్."
భా. రా. కిష్కిం. 1.30.

2. వధువుగా లేక వరునిగా పరిగ్రహించు.

"పుట్టితి వ జా త ను వు నఁ జే, పట్టితివి పురాణపురుషు భవనము..."
భాగ. 1. స్కం. 9.

చేపట్టుకుంచము

అందుబాటులోని అమూల్య వస్తువు.

"కొల్చినవారికిఁ జేపట్టుకుంచమవు."
తాళ్ల. సం. 6.173.

చేపట్టుకొమ్మ

ఆధారము.

"సదాచారమునకుఁ బ్రాపు నై పుణ్యమునకుఁ జేపట్టుకొమ్మ."
ఉత్త. రా. 1.37.

చేపట్టు చేయు

భోజనానికి కూర్చునే ముందు విస్తరి వేయుచోట ముందుగా నీళ్లు చల్లి అలికి ముగ్గుకట్టు వేయు.

"చూపట్టఁగ గోమయమున, జేపట్టొనరించి." శుక. 2.38.

"రా ర య్యా య ని శుద్ధిమచ్చరణు గోత్రా దేవతా పుత్రు వి, స్మే రాగ్ని ప్రభుఁ గూరుచుండ నిడి ప్రోల్చేపట్టు గావించి నీ,రారం బండిన ప్రాంతరాజనపు దివ్యాన్నంబు నొక్కింత..."
పాండు. 4.168.

ఇందులోని 'చేయు' పర్యాయ పదాలయిన ఒనరించు, కావించు ఇత్యాదులు వేనితో నయినా ఇది ప్రయుక్త మవుతుంది.

చేపట్లకు వచ్చు

కొట్లాటకు వచ్చు.

"సిగ వీడఁగ వెనుచక్కి పింజె వదలఁగ జేపట్లకుఁ వచ్చినఁ."
ఉత్త. రా. 6.361.

చేపడవ

చిన్నదోనె.

హంస. 4.182.

చేపడు

1. దొరకు.

"జడధి కియ్యనికి చేపడదు గాక."
విప్ర. 2.65.

"ఆ పసిఁడి గిన్నె యెవ్వరి, చేపడి యెనొ వీరి నేల సిలుగులఁ బెట్టం, జూపోపరు గా." విప్ర. 5.28.

2. అగు, కలుగు.

"శ్రీయును బ్రాయంబుఁ దెలియఁ జేపడును దుదిఁ."
హరి. ఉత్త. 7.106.

3. వశ మగు.

"మాలని చేపడుటకు."
మార్కం. 1.234.

4. పట్టువడు.

"పాండవుల్ చేపడిరేని చంప."
భార. ఉద్యో. 4.68.

చేపలకు చలి

అసంభవం - చేపలకు చలి ఉండ దనుట.

కృష్ణ సీ. 73.

చూ. మొసలి పడిశము.

చే పావడ

చేతిరుమాలు.

"చేపావడల మొగంబులు తుడిచి కొనుచు." రఘు. రా. 2.33.

చేపుణికిళ్లాడు

తడవు లాడు.

సుమతి. 93.

చేపెట్టు మేయు

చెంపదెబ్బ తిను.

"మాని నయినాఁడ రాముని,చే నొక చే పెట్టు మేసి." చం. రా. 5.60.

చే పెట్టె

చిన్న పెట్టె.

శ. ర.

చేబంతు లాడు

చెండ్లు, బంతులు ఆడు.

"పుష్పవాటికలలోఁ బొదలలందు విహరించుఁ, బంతంబు మెఱసి చే బంతు లాడు." బ్రహ్మ. 3.30.

చేబడి

పని, చేతిపని.

"సీనాభి జనియించు నిసువు చేబడి గాదె, భువన ప్రచారంబు పొంక పడుట." సాంబో. 4.21.

చేబదులు

లెక్క వ్రాయకుండా తీసుకునే అప్పు.

"చేబదు లైనా లేవాలి పది రూపాయలు." వా.

చేబాడిత

చేతి బాడిస,

చేబాడిస

చేతి బాడిత.

చే బార లిడు

వట్టిచేతులు చాపు, అంగలార్చు.

"ఆ బలం బెల్ల సహాయంబు గాక, చే బార లిడినఁ దెచ్చెదరె జానకిని." వర. రా. కిష్కి. పు. 438. పం. 3.

చేబారలు పెట్టు

పాఱిపోవు, అంగలార్చు.

"మిటుమిట్లు గొన్న దృష్టులు మిడిచి మన్నీ లెల్ల, బెదరి చేబారలు పెట్టుచుండ." రాజగో. 1.46.

చేబియ్యము

తవుడున్న ముడి బియ్యము.

బ్రౌన్.

చేబిరుసులు

చేతితో కాల్చే బాణసంచా. బిరుసు లనే పేరిని నేడంటారు.

రావి. 5.61.

చేబుఱ్ఱ లిడు

ఒకరకమైన కొమ్మువంటి వాద్యాలను ఊదు.

పరమ. 4.205.

చేబోడి

డబ్బు లేనివాడు.

"నీడ యించుక లేని చేబోడిజోజుగు." కవిక. 4.99.

**చేమంతిపువ్వు**
అలాంటి బంగారు నగ.

**చేమకూర శైత్యాలు**
అసంభవములు.
తాళ్ల. సం. 7.34.

**చేమపూరాజనాలు**
ధాన్యవిశేషం.

**చే మఱచు**
ప్రమత్తుఁ డగు.
"రాముని తేజంబు రావణాసురుఁడు, చేమఱచుటయు నీక్షించి సూతుండు."
వర. రా. యు. పు. 434. పం. 10.

**చే మించు**
చేయి దాటిపోవు.
"చే మించి యిటు నడచిన కార్యమునకు."
వర. రా. కిష్కి. పు. 353. పం. 12.

**చేమిరి పెట్టు**
పాలలో తోడు పెట్టు.
"కలదండి పసిఁడిండి కాఁచి చేమిరిఁ బెట్టి, యొఱఁగకుండఁగఁ దిట్టి యుట్టి నొట్టి." వేం. పంచ. 4.455.

**చేమీదుగా**
స్వయముగా తన చేత.
"అఖిలకల్యాణగుణశీల యా సుశీల, పెట్టెఁ జేమీఁదుగా నెల్లచుట్టములకు."
పాండు. 4.267.
"మీ చేతిమీదుగా ఈ పుణ్యకార్యం కూడా నెఱవేర్చి పుణ్యం కట్టుకోండి."
వా.

**చే ముంచి నేరము చేయు**
బుద్ధిపూర్వకముగా తప్పు చేయు, చేజేతులా చేయు.
"నా మనసే చక్కనైతే నాకుఁ బ్రత్యక్షము గావా, చే ముంచి నేర మేమి చేసితినో కాక." తాళ్ల. సం. 6.175.

**చేముట్టు**
పనిముట్టు, సాధనము.
"చేముట్టు నాగంటి జీవితంబు."
పాండు. 2.66.

**చేమొగుచు**
చేతులు జోడించు.

**చేమొగుపు**
నమస్కారం.

**చేమోడుచు**
నమస్కరించు.

**చేమోడుపు**
నమస్కారం.

**చేమోడ్చు**
నమస్కరించు.

**చేమోడ్పు**
నమస్కారం.

**చేయనిది పాపము**
అన్నీ చేసె ననుట.
"శివలింగముఁ దాల్చిన జన, నివహంబైనఁ జేయనిది పాపము."
అను. 4.44.

**చేయప్పులు**
చేతిబదుళ్లు.
"చే యప్పు లడిగి తెచ్చెద నంచుఁ జని కాంచుఁ, గోడెమిండనిఁ దప్పుకోలు మ్రొక్కు." శుక. 2.368.

**చేయబెట్టు**
చేయించు.

"భోజనము చేయఁబెట్టిన భూవరేణ్యు, పైతృకం బొప్ప సర్వసంపన్న మగుచు." వి. పు. 4.266.

**చేయమ్ము**

చేతితో వేసే బాణం.

చంద్రా. 2.38.

**చేయలతి గను**

చేతి బలము తెలిసికొను.

"చేయలఁతిం గని సమరము, సేయుము నన్నుఁ బోటితోడ."

భార. ద్రోణ. 4.243.

**చేయలతిగా**

దగ్గఱగా.

"పఱచుం దవ్వగఁ జేయలంతి నిలుచుఁ." భార. అర. 6.372.

**చేయలతి యగు**

అధీన మగు.

"నా చిత్త మేకీడునఁ జేయలఁతిగా కేపొద్దు నీయంద యలరుఁ గాక."

హరి. ఉత్త. 5.203.

**చేయలతియా?**

సాధ్యమా? శక్యమా?

"...నీకుఁ జేయలఁతియె యీ యెడ యింక నీవు నిలిచినఁ బడ నడతురు."

నిర్వ. 4.84.

**చేయాడక**

చేయి రాక.

"కాడినయమ్ముచే సొలసి కంసవిరోధి శిరోధ వ్రేలఁ జేయాడక మూర్ఛవోయె." ఉ. హరి. 1.154.

"అతండు గయ్యంబు సేయఁ జేయాడక చెడు." భార. ద్రోణ. 5.311.

"వాణ్ణి తన్నాలంటే నాకు చేయాడ్డం లేదు." వా.

**చేయార**

చేతులారా.

"చేయార నీసేవ నే జేసుట లేదు."

తాళ్ల. సం. 8.60.

నోరార అనుటకు పర్యాయముగా ఇక్కడ మాత్రమే కనిపిస్తుంది.

"ఏమని చేయార నీబంట నని చెప్పుకో నేను." తాళ్ల. సం. 10.2.

**చేయార్చు**

1. చేతులు కొట్టు.

"వాయుపుత్రుఁడు చూచుచుఁ గ వృక్షశాఖ, జేయార్చి రెండుగాఁ జీరి నవ్వుటయు." ద్వి. జగ. 207.

2. చేయి కదల్చు.

"నేనుఁ దోడ్పడ నతనికిఁ జేయార్పవచ్చునే?" భార. ద్రోణ. 4.291.

**చేయార్చుకొనఁగ లేక**

శక్తి లేక, అలసిపోయి.

చేయాడించుకొన లేక.

నీటిలో మునిగిపోవువాడు చేయాడించినప్పుడే పైకి తేలుట సాధ్యమగును. ఆ ఆడించుకొను శక్తి లేదనగా నిస్సహాయు డనుట.

ఈత కొట్టునప్పుడు అలత తేనంత వరకూ చేతులు కొట్టడం సాగుతుంది. బాగా అలసినప్పుడు చేతు లాడవు.

"హా! సరోజాక్షి గోత్రవధార్జవమున, మునిఁగి యున్నాఁడఁ జేయార్చుకొనఁగ లేక." జైమి. 1.106.

**చేయి కడుగకుండ భోజనము చేయ వచ్చు**

వెనువెంటనే, వచ్చినదే తడవుగా.

"...స్వామియారగింపు కాఁగనే వచ్చి, దశవిధభోగములును చేయి గడుగక మీరు భోంచేయవచ్చు." వందక. 47 పు.

**చేయి కడుగుకొను**

సంబంధము వదలుకొను.

చూ. చేతులు కడుగుకొను.

**చేయి కాయు**

అభయ మిచ్చు, అడ్డుకొను.

"మయునంతవాని చేయి గాయక జయించి." పర. రా. యు. పు. 23. పంక్తి. 6.

**చేయి కాల్చుకొను**

వంట చేయు.

"ఇంట్లో ఆడవాళ్లు బయట చేరడంవల్ల నేనే చేయి కాల్చుకోవలసి వచ్చింది." వా.

చూ. చెయ్యి కాల్చుకొను.

**చేయి క్రిందగు**

ఒకరిచే దానము పొందు స్థితిలో ఉండు.

"...నూత్నమ, ర్యాదం జెందుకరంబు క్రిందగుట నా హస్తంబు మీఁదై మేల్, గాదే..." భాగ. స్కం. 8.

**చేయి చాచు**

1. ఒకరిని యాచించు.

"వాడు బతికినన్నాళ్లూ ఒకరి కిచ్చాడు గానీ ఒకరి ముందు చెయ్యి చాచి యెఱుగడు." వా.

చూ. చెయి చాచు.

2. వేకారు.

"శ్రీపతి నీ కయి చేయి చాఁచెదము." తాళ్ల. సం. 8.19.

**చే యిచ్చు**

ఆసరా యిచ్చు, సాయపడు.

"ఇంటివారిని లేపి యీవల దొంగ, బంటుకు చెయ్యిచ్చుపాపాత్మురాల." గౌర. హరిశ్చ. పు. 168.

**చేయి చేయి కలుపు**

సమాధాన పఱుచు.

"వాణ్ణి వీణ్ణి చేయి చేయి కలిపి వెళ్లాడు వాళ్ల నాన్న. అప్పటినుంచీ సంసారం కాస్త కుదటపడింది." వా.

**చేయి చేసికొను**

తన్ను.

"వా డేదో అన్నా డని వీడు చేయి చేసుకొన్నాడు." వా.

చూ. చెయి చేసుకొను.

**చేయి జాఱు**

అధీనము తప్పు.

"ఆ వ్యవహారం నా చేయి జాఱి పోయింది. ఇంక నేను చేసే దేమీ లేదు." వా.

చూ. చేయి దాటి పోవు.

**చేయి తీరదు**

చేతిలో పని ఉన్న దనుట.

చేయి పనికి ప్రత్యామ్నాయంగా మనకు అనేకపలుకుబళ్లలో కనిపిస్తుంది.

"నాకు చేయి తీరడం లేదు. తరవాత రా. గింజలు వేస్తాను." వా.

"నాకు చేయి తీరనంత పనిగా ఉంది."
వా.

## చేయి తీరిక లేదు

తీరుబడి లేదు.

ఏదో పని చేస్తున్నా ననుట.

"ఇప్పుడు చేయి తీరిక లేదు. తరవాత రావయ్యా. ఆ సంగ తేదో చూస్తాను."
వా.

## చేయి దాటి పోవు

మించి పోవు. స్వవశము తప్పి పోవు.

"ఈ విషయంలో నేను చేయగలిగింది యేమీ లేదు. ఆ వ్యవహారం అప్పుడే చేయి దాటి పోయింది." వా.

చూ. చెయి దప్పి పోవు.

## చేయిదోడు

సహాయము.

"సృజియించు బ్రహ్మకుఁ జేయి దోడు." భీమ. 1.44.

చూ. చేదోడు, చేోడు వాదోడు.

## చేయి మఱచు

విధ్యుక్తధర్మమును నిర్వహింపకుండు.

"మీఁద నిట్టి యెడలన్, బ్రమయక చేమఱువ కునికి పటుశౌర్య మగున్ ..."
కళా. 4.191.

## చేయి మించు

అధీనము తప్పు, చేయి దాటి పోవు.

"అని బహు భంగులం దన బలాదిక దర్పవిజృంభణంబు నేర్పున వివరించి పైననియె భోరున నా చెయి మించె..."
రఁగా. 2.44.

"ఆ వ్యవహారం నా చేయి మించి పోయింది. ఇంక నేను చేసే దేమీ లేదు."
వా.

"నే నప్పుడే ఆ నోటు పంపించేశాను. ఇక నా చెయి మించి పోయింది. మీ కేం ఇబ్బందు లున్నా పై అధికారి దగ్గర చెప్పుకోవాల్సిందే." వా.

చూ. చెయి మించు.

2. అతిశయించు, మేలు చేయి యగు.

"చేయి మించఁగవలెన్ జుమీ నీ కని."
విజయ. 3.115.

## చేయి మీదగు

తాను ఇచ్చువా డగు.

"...నూత్నమ, స్యాదం జెందుకరంబు క్రిం దగుట నా హస్తంబు మీఁద దొట మేల్, గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే."

భాగ. స్కం. 8.

## చేయి మీదుగా నడచిన

ఎప్పుడూ ఒకరిని దేహీ అనక, ఒకరికే తాను ఇస్తూ బ్రతికిన.

"చేయి మీఁదుగా, నడచిన పూర్ణకాముఁడవు." పాండు. 3.44.

## చేయి మునుగ జుర్రుకొను

సంతృప్తిగా జుర్రుకొను.

వాడుకలో కొన్ని వర్గాలలో 'చెయ్యి ములగా జుర్రుకొను' అనే వినబడుతుంది.

## చేయి మునుగ పాడి

పాడి సమృద్ధిగా ఉన్న దనుట.

ఇది వాడుకలో కొందరిలో

'చెయ్యి ములగా పాడి' అన్నట్లు వినవస్తుంది.

"వాళ్ళ కేం ? పదావులు, పది యెనుములు. చేయి మునగా పాడి." వా.

**చేయి యెటు లాడు**

ఇంత దుర్మార్గమైన పని చేయుటకు చేతులు ఎట్లా వచ్చును ?

"ఓయి దయావిహీనమతి! యూరక యీ పసిబిడ్డఁ గొట్టఁగాఁ, జే యెటు లాడె నీకు—" మను. 4.87.

"ఆ పిల్లవాణ్ణి కొట్టడానికి నీకు చేతులు ఎట్లా ఆడాయి." వా.

**చేయి వదలు**

రక్షణబాధ్యతను వదలుకొను.

"చేయి వదలక చేపట్టువారిఁ గాచుటలు."

వర. రా. సుం. పుట. 88. పంక్తి. 15.

చూ. చేయి విడుచు.

**చేయివాసి**

హస్తవాసి.

"ఆయన చేయివాసి మంచిది. ఏ మిచ్చినా నయ మవుతుంది." వా.

**చేయి వీచు**

ఆజ్ఞ యొసగు, ప్రోత్సహించు, ముదల యిచ్చు.

"గోత్రభిత్కరముగ బాహు లెత్తి తమకంబున సేనకుఁ జేయి వీచినన్." పారి. 5.14.

"అవృకోదరుపైఁ గవియంగఁ జేయి, వీచె సేనకుఁ గాళింగవిభుఁడు గడంగి." భార. భీష్మ. 2.70.

**చేయాక**

చేతికి దొరకక.

"లేటి బొట్టెలు బిట్టు చెదరి చెదరి చేయాక పఱచిన." హర. 1.3.

**చేయాక తివియు**

చేతి కందక లాగు.

"తనరు మహాభద్రదంతులరీతిఁ, జేతికి నొడిసినఁ జేయాక తివిసి." ద్విప. మధు. పు. 18.

**చేయూత నీదు**

ఏ యితరసహాయం లేక చేతులతో ఈదు.

"చెనఁటి యీ భవవారిధి చేయూఁత నీదు." ద్విప. పరమ. 2.86. పు.

"ఏచి మున్నీరు సేయూఁత నీఁద." భార. విరా. 4.213.

**చేయునది లేక**

ఇంకో మార్గం లేక, గత్యంతరం లేక, తప్పనిసరియై.

"బయటఁబడి చేయునది లేక యాకరకు మగిడి తుఱుముఁ దిద్దుచు." ఆము. 4.35.

"వారల నవ్వలకుం ద్రోసి చనినఁ జేయునది లేక యిచ్ఛావిహారవిరోధి యగు నిజకులాచారంబులం దలంచుకొని..." శుక. 2.10.

**చేయూత**

సహాయకము.

"యోగవిద్యాబలంబు చేయూఁత గాఁగ." నైష. 3.3.

**చే యూదుకొను**

చేతులను ఆధారముగా దేనిపైనో ఆనించు.

"ఒండొరుఁ జే యూదికొనుచు."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 279.

## చే యెత్తి నమస్కరించు

హృదయపూర్వకంగా బహూకరించు, కృతజ్ఞత తెలుపు.
"నా కొక జీవనం కల్పించిన వాడాయన. ఆయనకు చేయెత్తి నమస్కరించాలి." వా.

## చేయేతము

చేతితో తోడు ఏతాము.
"అశ్వానికిఁ జేయేతం, బుబ్బుచుఁ దంబళి యొనర్చె."
హంస. 1.186.

## చే యొడ్డు

అడ్డుపెట్టు.
"ఒరుల యాగికి నకట! చే యొడ్డ కుండు."
భార. శాంతి. 4.158.

## చేరగ బిల్చు

దగ్గరకు తీయు.
"భీమునిఁ జేరఁగఁ బిల్చి."
జైమి 3.45.
చూ. చేర తీయు.

## చేరగిల బడు

విశ్రాంతి తీసుకొను.
"పొద్దున్నించీ పనితో సతమతమయి పోయాను. కాస్త చేరగిలబడితే కానీ వీలు లేదు." వా.

## చేరదీయు

దగ్గఱకు తీయు.
"అల్లనఁ జేరఁదీసి." విప్ర. 4.88.

## చేరబడు

1. కలియు, ఒకటి అగు.
"గోరపుఁ బాపములు నీవుఁ గొడుకులుం నాలుం, జేరఁబడి పంచుకొందురా?"
వాల్మీ. 2.100
2. ఒరగు, చేరగిలబడు.
"ప్రొద్దు చేరఁబడినఁ బోయి రిండ్లకు వారలు." నారా. పంచ. 1.90.

## చేరబొంతల యాట

ఒక బాలక్రీడ.
పండితా. ప్రథ. పురా. పుట. 460.

## చేరల గొలువగ వచ్చు (కన్నులు)

విశాలమైనవి అనుట.
"చేరలం గొలువఁగ వచ్చు కన్నులు."
పాండు. 2.70.
చూ. చెంపకు చేరెడేసి కండ్లు. చేరెడేసి కండ్లు.

## చేరల గొల్వగ వచ్చు

చేరెడంతేసి ఉన్న వనుట.
"కన్ను లంటిమా చేరలఁ గొల్వఁగా వలయు." విజయ. 1.131.

## చేరవచ్చు

సమీపించు.
"నీరజాక్షి నిరంకుశుఁ జేర వచ్చె."
నిరంకు. 4.93.

## చేరవేయు

ఒకచోటికి చేర్చు, ఒకటిగా పెట్టు.
"అవన్నీ యింట్లోకి చేర వేయరా."
వా.
"చిల్లా పల్లా పడిన వన్నీ ఒకచోట చేర వేయవే." వా.

**చేరిక యగు**

సమీపించు.

"అనయమునఁ జేరిక యగుత తి, నని వార్యవ్రీడభయభరాకులగతి యై."
ప్రభా. 5.31.

**చేరిక లొనర్చు**

స్నేహం చేయు.

"చేరిక లొనర్చి తేనియల్ చిలుకఁ బలికి."
హంస. 2.169.

**చేరుకోల**

చెలకోల.

పశువులను తోలే కొరడా వంటిది.

భార. భీష్మ. 3.234.
చూ. చేర్కోల.

**చేరుగడ**

1. ఆధారము.

"వట్టి యపకీర్తులకుం జేరుగడ."
విప్ర. 3.12.

2. చేరబడు దిండు.

"ఆశ్రితశ్రేణి కేయధిపుని పాదరాజీవ యుగ్మంబులు సేరుగడలు."
భాగ. స్క. 1.257.

**చేరుగొండి**

1. తగులాటకత్తె.

శ. ర.

2. చేర వచ్చిన భార్య.

బ్రౌన్.

**చేరుగొండి పశువు**

తప్పిపోయిన పశువు.

బ్రౌన్.

**చేరుగొండియావు**

శ. ర.

చూ. చేరుగొండి పశువు.

**చేరుచుక్క**

పాపట బొట్టు.

"కలువపై యొడ్డాది కటకాధిపతి వధూ, సీమంతవీథులఁ జేరుచుక్క."
కాశీ. పీ. 34.

చూ. చేర్చుక్క.

**చేరుడుబియ్యము**

ముడి బియ్యము.

ఉత్త. హరి. 3.13.

**చేరువకాడు**

1. సేనాని.

రామా. 7.27.

2. ఏకిమీడు, అధికారి.

శేష. 5.98.

**చేరువడు**

సిద్ధించు.

**చేరువపంట**

అందుబాటులోనిది.

"......భుజంగకోటికిఁ, ఘటితనిధానసీమ యుపకాంతుల చేరువపంట..."
హంస. 1.215.

**చేరువఱుచు**

సిద్ధింపజేయు.

**చేరెడుకండ్లు**

విశాలము లయిన నేత్రములు.

**చేరెడు నేల**

కొద్దిపాటి నేల.

"అకటా! చేరెడు నేలకుం దగఁదే

సప్తాంభోధివేష్టితభవత్, ...... రాజకుమారుండు.” హరిశ్చంద్రో.

**చేర్చుక్క**

పాపటబొట్టు.

“చేర్చుక్కఁ జేరిచి చిత్రంబుగాను.” పల. ప్ర. 72.

“చేర్చుక్కగా నిడ్డ చిన్నిజాబిల్లి చే, సిందూరతిలకంబు చెమ్మగిల్ల.” మను. 1.5.

“చానిపె సీమంతవీథిఁ జేర్చుక్కయొత్తు.” ఆము. 6.128.

చూ. చేరుచుక్క.

**చేర్లకోల**

చెలకోల.

వరాహ. 5.108.

**చేర్వచుట్టములు**

దగ్గఱిచుట్టాలు.

నిరం. 4.69.

**చేర్వారు**

సమీపించు, దగ్గఱపడు.

“వైశృంఖల్యంబునఁ బట్టు కళ్లెపు సరుల్ చేర్వార నుచ్చైశ్రవః, కంఖాణంబు గదల్చె.” నిరంకు. 4.125.

**చేఱుకుట్టు**

ఒక రోగము.

**చేఱుకోల**

చూ. చేరుకోల.

**చేఱుబొందు**

కొట్టెడు తోలుపట్టెడ.

శ. ర.

**చేఱులకోల**

చెలకోల.

శ. ర.

**చేలాగిచ్చు**

చేయూత నిచ్చు.

“చేరి చేలాగిచ్చు...” ఇందు. 3.27.

**చేలు దొంతముక్క పడు**

ఎఱ్ఱబాఱు, పక్వ మగు.

“దొంతముక్క వడియెం బ్రాసంగుఁ జేల్.” శివ. 4.19.

“పెస రుసురుకొనియె దవనిక పొదలె, ఱెక్క ప్రాసంగు దొంత ముక్క వడియె.” కాశి. 3.23.

**చేవగల వాడు**

సత్త్వవంతుడు.

చూ. చేవకాఱు.

**చేవట్టి తిగుచు**

చేయి పట్టి లాగు.

“నీకు బలె సన్మానంబుతోఁ జక్క వచ్చెదో యేమే గలదే యటంచుఁ దిగిచెం జేవట్టి యా యంగనన్.” కళా. 7.123.

**చేవ డించక**

చేతితో పట్టుకొని నలిగిపోవునట్లు చేయక.

చేవ – సారము పై, డించు వచ్చిన దనుకుంటే = సారవిహీనము కాకుండ అనుట.

“...చేవ డించక కావడించి...” పాండు. 3.89.

**చే వదలు**

నిరాశ్రయుని చేయు; వదలి పెట్టు.

"చెలికాని నెఱుఁగక చే వదలుదురె."

వర. రా. కిష్కి. పు. 401. పం. 8.

**చేవ బారు**

సత్త్వవంత మగు.

చెట్టు చేవ బారిన దనగా కఱ్ఱ యెఱు పెక్కి బాగా గట్టిపడి నది అనుట.

**చేవ మీఱు**

1. సత్త్వవంత మగు, బల పడు.

"వలపుల్ రేచి మనంబులం గరఁచి చేవల్ మీఱ లోనైన యా..."

రాజగో. 1.103.

2. విజృంభించు.

"సురనాథుల్ చేవ మీఱఁ జన్ సమిత్కేళీ లోలతఁ గాలమేఘముల మాడ్కిన్."

కా. మా. 2.61.

**చేవ యెక్కు**

బలపడు, సత్త్వవంత మగు.

"ఇక్కడఁ బాండ్రభూపతి విహీన వివేకతఁ జేవ యెక్కఁగాఁ, నెక్కడి వాసుదేవుఁడు ?" ఉ. హరి. 3.4.

**చేవ యొసగు**

ప్రోత్సాహ మిచ్చు, బలము చేకూర్చు.

"బహువిధచాతుర్యంబులు శౌర్యంబు లకుఁ జేవ యొసంగ."

ఉ. హరి. 4.213.

**చేవలతులు**

1. చేతి కందుబాటులోనివి.

"చేవలఁతు లగుచు దక్కను."

పాండు. 3.118.

2. భుజబలము.

హర. 1.20.

3. సమీపము.

శృం. శకుం. 1.132.

**చే వాటునేల**

సమీపప్రాంతము.

చేతితో రాయి విసిరినంత దూరము.

"చెలువార నిచటికిఁ జే వాటు నేలఁ, గల దొక నిర్మలకమలాకరంబు."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 1729–30.

**చేవాడికాడు**

చేతి మెలకువ గలవాడు.

"గడిదొంగ చేవాఁడికాఁడు దోఁపుడు కాఁడు." వేంక. మాన. 31.

**చే వాడి మెఱసి**

చేతి మెలకువ చూపి.

"చే వాడి మెఱసి...అస్త్రములకు బలి వెట్టి."

వర. రా. యు. పు. 366. పంక్తి. 13.

**చే వార్చు**

చేతులు కడుగుకొను.

"అందఱు భుజించి చేవార్చు నవసర మున." పార్వ. 5.186.

**చే విచ్చు**

నమస్కరించు.

శ. ర.

**చే విప్పు**

నమస్కారం.

వావిళ్ళ.

**చే వెలుగిడి**

బాగుగా కనబడుటకై కాస్త వయస్సైన వారు చేతిని కనుబొమ్మ దగ్గర అడ్డుగా పెట్టుకొని.

"దీవించి యతని వదనము, చే వెలుఁగిడి చూచి." హర. 2.49.

సా. స.

**చేవ్రాలు**

1. సంతకము.

2. చేతిలోని రేకలు.

**చే వ్రేసి నవ్వు**

చేతులు చఱచి నవ్వు.

"ఆ విదర్భుఁడు గెల్చె ననుచు నొండొరులు, చే వ్రేసి నవ్వుచు సీరి నీక్షింప." ద్విప. కల్యా. 129.

**చే సడలు**

చేయివదలు.

వసు. 6.84.

**చే సరులు**

ఒకనగ.

**చే సఱచి నగు**

చేతులు కొట్టి నవ్వు.

నవ్వునప్పుడు చేతులు కొట్టుట కలదు కదా!

"రాచూలిం జూచి చెలులు, గలకల చే సఱచి నగిరి." నైష. 2.46.

**చే సాచి అడుగు**

యాచించు.

"చేయించె నెందఱో చే సాచి యడిగిన, బ్రహ్మచారులకు వివాహములను." పాణి. 1.66.

**చేసినది జపము, వేసినది గాలము**

చెప్పేదానికీ చేసేదానికీ సంబంధము లేదనుట.

చంకదుడ్డు శరణార్థి వంటిది.

"చేసినయది జపముగా మఱి, వేసినయది గాల మనుట వృథ గాకుండన్." విజ. 2.135.

**చేసి పెట్టు**

నెఱవేర్చు.

"ఈ పని కాస్తా మీరు చేసి పెడితే నేను చాలా సంతోషిస్తాను." వా.

**చేసిపోయిన కాపురము చూడ వచ్చు**

తాను చెడ్డపేరు తెచ్చుకొన్న ఊరికే తిరిగి వచ్చు.

"ఆ మహాతల్లి తిరిగి వచ్చిం దట నే. చేసిపోయిన కాపరం చూడడానికి వచ్చిందేమో!" వా.

**చేసు వెల**

అసలు ధర.

అది ఎంత చేస్తుందో అంత.

"బేరము పొసఁగించి చేసువెల కిప్పించెన్." హం. 5.360.

**చే సేత**

చే జేతుల - స్వయంగా, తనకు తానై.

చేసినచేతనే ఫల మనుభ వించు ననుపట్టున ఉపయో గించే పలుకుబడి.

"ఫలంబు సిద్ధింప నోపు చేసేత."

పండితా. ద్వితీ. మహి. పుట. 61.

"చే జేతుల అనుభవిస్తాడు." వా.

"స్వయంగా వాడు చే జేతులా తలకు ఉరి తెచ్చుకొన్నాడు."

చూ. చే జేతుల.

'వాడు చే జేతులా చేసు కున్నాడు. ఎవ రేం చేస్తారు' అని వాడుక. అలాగే 'ఈ చేత్తో చేసి ఆ చేత్తో అనుభ విస్తున్నాడు'. వెంటనే అనే అర్థంలో ఇట ప్రయుక్తం.

"శివపూజఫలము సేసేత గొన్నట్లు, తవిలి యాతనికి నంతన సమకూడె...."

బసవ. 5.131.

"చేసేత న్మ్రాడలు వే,యేసి దెసలఁ గీర్తి లతిక లెలమి వహింపన్."

కా. మా. 3.146.

"చేసిన నేరమి చేసేతఁ గుడువ."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 423.

## చేసేత బట్టు

చేజేతులతో పట్టుకొను.

"చేసేతఁ బట్టి." కుమా. 10.66.

చూ. చేసేత.

## చేసే నొసగు

ఒకరి కొకరు చేతులతో అందించు.

నలుగురు వరుసగా నిలుచు కొన్నప్పుడు ఒకరి చేతిలోని పాత్రను రెండవవారికి, ఆ రెండవవారు మూడవవారికి ఇలా క్రమంగా ఇచ్చుట.

"చెలువ లొందదఱు హేమకుంభము లతోఁ జేసే నొసంగన్."

పారి. 2.11.

స్వయముగా అని వావిళ్ళ ని. సరిగా కనిపించదు.

## చొంగలు గురియు

నోటిజొల్లు కారు.

"...నోరఁ జొంగలు, గురియఁగఁ గడ లేక నడచె గుజ్జుపుఁబౌజుల్."

కవిక. 2.79.

## చొక్కిళ్ళు వోవు

సొట్టలు పడు.

"గదిసి మై గండంగఁ గౌఁగిట బిగి యింపఁ, జొక్కిళ్ళు వోయిన సొమ్ము తోడ."

యయా. 2.99.

## చొక్కు చల్లినట్లు

మత్తుమందు చల్లినట్లు.

"గొల్లపల్లియలో నున్న గొల్లవారు, చొక్కు చల్లినకైవడి నొక్కరైన, మేలుకొనక నిద్రింప."

వి. పు. 7.76.

## చొక్కుటాకు

వగుడాకు.

## చొక్కునీరు

కల్లు.

యయా. 3.122.

## చొక్కు పెట్టు

మత్తు మందు చల్లి మైమఱపించు.

వి. పు. 8.164.

**చొక్కపొడి**
మత్తు మందు పొడి.
దశా. 1.260.

**చొక్కమందు**
చూ. చొక్కపొడి.

**చొక్క మడగు**
మై మఱుగు, వశము తప్పు.
"శ్రుతిపుటంబుల శక్తి చొక్క మడఁగ." కాశీ. 1.139.

**చొక్క వెట్టు**
మత్తు మందు చల్లి మైమఱపించు.
"సురగి చాడయగారిఁ జొక్క వెట్టితివా."
పండితా. ద్వితీ. మహి. పు. 215.
చూ. చొక్క పెట్టు.

**చొచ్చి వచ్చు**
మీాది మీాదికి వచ్చు.
ఇందు. 4.58.

**చొచ్చో యనిపించు**
తఱిమి వేయు.
"వెచ్చానక లే దనఁగా, నిచ్చటి కేతెంచి యాతఁ డిచ్చిన మేలే, వచ్చినది లాగుకొని మఱి, చొచ్చో యనిపింతు నిదియు నూ మత మనుచున్."
వైజ. 3.99.

**చొటచొట**
ధ్వన్యనుకరణము.

**చొడచొడ**
చూ. చొటచొట.

**చొత్తెంచు**
ప్రవేశించు.
కాశీ. 7.68.

**చొప్ప కాడి**
రెండెడ్లను గట్టి త్రోలెడు దిండుపంటి చొప్ప మోపు.
శ. ర.

**చొప్పడు**
ఒప్పు; సరిపడు ఇత్యాద్యనేక భావచ్ఛాయలలో...
"ఆడువా రగుట రూపింప నేరక రుచులఁ జొప్పడక."
రంగ. రా. బాల. పు. 12. పంక్తి. 10.

**చొప్పదంటు ప్రశ్నలు**
సారం లేని ప్రశ్నలు.
కంకులు వేసిన తరవాత జొన్న దంట్లను చొప్పదంట్లంటారు. అవి చప్పగా ఉంటాయి. అందుపై యేర్పడిన పలుకుబడి.
"ఏమి టోయి! ఊరికే చొప్పదంటు ప్రశ్నలు వేస్తున్నావు?" వా.

**చొప్ప బెండ్ల మంచములు**
ఒక బాలక్రీడ.
హంస. 3.146.

**చొప్పరికించు**
పరికించు.

**చొప్పఱుచు**
ఏర్పఱుచు; ఆరోపించు.

**చొప్పలా చప్పగా ఉంది**
చొప్పదంటువలె సారవిహీనమయిన దనుట.
"ఆ కావ్యం చొప్పలా చప్పగా ఉంది." వా.

**చొప్పాడు**

సత్యము చెప్పు.

"కీడున కోడ కించుకయుఁ గేకయ భూపతి యింటఁ బుట్టి చొ,ప్పాడక పాపజాతి వయి తక్కటట..."

భాస్క. రా. అయో. 20.

**చొప్పు మార్చు**

1. త్రోవ తప్పించు.

"తప్పుత్రోవల నీరీతిఁ జొప్పు మార్చి."

శా. పూ. 4.56.

2. తావు మార్చు.

"రతిశ్రాంతాంగనా నేత్ర కో,ణ ని కాయంబుల డాఁచి తదవళిమన్ డాఁ బూ నెనో చొప్పు మా,ర్ప నన్ వెల్వెలఁ బారె దీపకళికా వ్రాతంబు శాతోదరీ."

మను. 3.56.

3. వేషము మార్చు.

"చొప్పు మార్చితిఁ బెక్క చోట్ల శాత్రవభీతి, నావారు గనలేరు నన్ను నరసి."

కళా. 8.166.

**చొరబడు**

ప్రవేశించు.

వాడుకలో జొరబడు అని విన వస్తుంది.

**చొర జోటు లేదు**

తలదాచుకొనే చోటు లేదు, ఆశ్రయం లేదు.

"చొరఁజోటు లేదంచు సొమ్మసిల్లు చును."

బస. 6.165.

**చొరపోతగా**

ఎడతెరపి లేకుండా.

బ్రౌన్.

**చొరబాఱు**

చొచ్చు.

"సందు సందులం దెఱపిగని చొరం బాఱి మధురసమిళ్ళిత పరాగరా గంబు."

విప్ర. 3.38.

**చొరబెట్టు**

ప్రవేశపెట్టు.

బ్రౌన్.

**చొరవకాడు**

మాంచి చొరవ కలవాడు. ప్రవేశించువాడు.

**చొరవ చేయు**

సాహసించు.

మాటా. 78.

**చొరవడ**

చొరవ, సాహసము.

బ్రౌన్.

**చొరుదల**

మొదలు.

**చొఱచొఱ**

ధ్వన్యనుకరణము.

"చొఱచొఱ నెత్తురులు వడియ."

హరి. 10.184.

**చొల్లువాఱుడు మాటలు**

సొల్లుకబుర్లు, వట్టి వ్యర్థ ప్రలాపాలు.

"చొల్లు వారుడు మాట లెల్ల నేమి టికి."

బస. 6.171.

**చోటిచ్చు**

1. అవకాశ మిచ్చు.

"ఘనతేజంబున నొప్పెద, రనుచుం జోటిచ్చి మత్కుంభాఖ్యలు వినియెన్." కళా. 4.43.

2. ఆశ్రయ మిచ్చు.

"నేను ఆపూట్లో బతుకు లేక బట్ట బుజాన వేసుకొని వస్తే, అత డింత చోటిచ్చి నన్ను ఆదరించాడు. అతనికే నేను ద్రోహం ఎలా తలపెట్టను?" వా.

**చోటు చేయు**

స్థాన మిచ్చు.
తాళ్ల. సం. 4.157.

**చోటు చేసికొను**

ఆశ్రయ మేర్పరుచుకొను.

"వా డేదో ఆ మాటా యీ మాటా చెప్పి వా ళ్లింట్లో చోటు చేసుకున్నాడు." వా.

**చోద్యపడు**

ఆశ్చర్యపడు.

"అచ్చోటి మహిమకుఁ జోద్యపడుచు". నిరంకు. 4.6.

**చోపిడు**

పారదోలు, కలత పెట్టు.

**చోపుడుగోల**

వేటలో మృగాలను సోపుట కుపయోగించే కఱ్ఱ.

**చోపుడు వెట్టు**

ఒకవైపునకు తోలుకొని వచ్చు.
వేటలో సాయుధు లయిన వేటగాళ్లు ఒకవైపు వుంటారు. మరికొందరు డప్పులు మొదలైన వాద్యాలతో శబ్దం చేసుకుంటూ మృగాలను వారివైపుకు తోలుకొని వస్తారు. దీనినే చోపుడు వెట్టుట అంటారు.

"పొలము చోపుడువెట్ట న స్నెలవరులకు, సెల వొసంగిన నృపమౌళి చిత్త మెలఁగి." శుక. 1.257.

"అగ్నియంత్రంబులు ముట్టించియు రొద మిన్ను ముట్టం జోపు వెట్టించిన." మను. 4.37.

**చోపుదారుడు**

వెండిబెత్తం పట్టుకొని రాజులముందు బరాబరులు చెప్పు సేవకుడు.

బ్రౌన్.

**చోపు వెట్టు**

చూ. చోపుడువెట్టు.

**చోరస్వదేశము**

అసంభవము.
దొంగకు ఏ దేశమైనా ఒక్కటే. దొంగతనం చేయక మానడు కదా.

రాధ. 4.79.

**చోఱబుడుత**

చేపపిల్ల, చేపలవంటి కను లున్న స్త్రీ.

**చోఁఱవాడు**

బాలసేవకుడు.

**చోళము విఱుచు తెఱగున**

జొన్నలను పేలాలుగా వేచినట్లు.

"పాదరసంబు మర్దించుపంతంబునఁ, జోళంబు విఱుచు తెఱంగున."
ఉ. హరి. 3.71.

**చోళవాళిక కాక వేళవాళికి కర్తవే?**

జీతమునకే కాని, కాలమునకు నీవు కర్తవా?

జొన్నలకూలికే కాని జీవిత విధానమునకు నీవు కర్తవా? అని ప్రభాకరశాస్త్రిగారు.

నిశ్చితంగా తేల లేదు.

"చోళవాళికె కాక శోణితలేళ, వేళవాళికిఁ గర్తవే?"
పండితా. ద్వితీ. మహి. పుట. 184.

**చౌక అగు**

చులుకన నగు.

"కారు కాలానఁ గలిగిన గౌరవంబు, చౌకయై తోఁచె శరదృతుసౌష్ఠవమున."
పాండు. 4.42.

వాడుకలో—తక్కువవెల అనే అర్థంలో పరిపాటి.

"వంకాయలు ఈ కాలంలో బాగా చౌక అయినవి." వా.

**చౌక చేయు**

చులుకన చేయు.

"సాహిత్యమార్గంబు చౌకఁ జేసిన వాఁడు."
నిరంకు. 2.34.

"వన్నిటు చౌక సేసినను నాతిరో! యేగతి నోర్వ వచ్చునే?"
రాజగో. 3.9.

**చౌకపడు**

చౌక అగు.

మత్స్య. 1.151.

**చౌకపఱచు**

చౌక చేయు.

**చౌక సేయు**

చూ. చౌక చేయు.

**చౌకాడిగుదియ**

నాలుగుప్రక్కలు తీర్చిన ఇనుపదండము.

**చౌకాలిపీట**

నాలుగుకాళ్ళ పీట.

**చౌటిపడియలు**

చౌటినేలలోని చెలమలు.

నీటికుండములు.

"ఇందుల చౌటిపడియ లూహింప, నిరతంబు క్షీరాంబునిధి పుట్టినిండ్లు."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 241.
బస. 7.181.

**చౌటుప్పు**

చౌటి నేలలో తేలేడుప్పు.

**చౌడోలి**

అంబారి.

రూ. చౌడోలీ; చౌడోలు.

**చౌదరితనము**

గొప్పతనము.

శుక. 2.414.

చౌపదము
ఒక గీతి విశేషము.

చౌపుట
నాల్గు కాళ్ళతో కుప్పళించి దుముకుట.

చౌరు కొట్టు
లొట్టలు వేస్తూ ఆస్వాదించు.
"విరులు సిగఁ దాల్చి కర్పూరవీటిఁ జౌరుగొట్టుచు." ఆము. 2.73.
"గొంటు వక్కలు చౌరు గొట్టుచు నమలి."
అష్ట. కల్యా. 2.82. పు.
రూ. చౌరు గొట్టు.

చౌవంచ
అయిదు.
రూ. చవ్వంచ, చౌవంచి.

చౌవీధి
చౌకు.
రూ. చవువీధి.

చౌషష్టికళలు
అరవైనాలుగు విద్యలు.

చౌసాల
చతుశ్శాల.

చౌసీతిబంధములు
ఎనభైనాలుగు రతి బంధ విశేషములు.

ఛత్రచామరములు
గొడుగు, వింజామరము. జం. పండితా. ప్రథ. పురా. పు. 290.

ఛస్తే....
ఎంత కష్టపడినా, ఏమయినా.
మాటా. 134.

ఛిన్నాభిన్నముగ
ముక్కచెక్కలుగా.

జంకించు
జంకునట్లు చేయు, బెదరగొట్టి పారద్రోలు.
"పాతకంబుల జంకించు బహువిధముల."

జంకె యొనర్చు
భయపెట్టు.

జంకె సేయు
భయపెట్టు.

జంగగొను
దాటు.

జంగనడ
అశ్వగతిలో భేదము.

జంగనడక
కాలు చాపి నడచు నడక.
శ.ర.

జంగనడపు
చూ. జంగనడక.

జంగమురాలు
జంగము స్త్రీ.

జంగిలి కాయు
పశువులను కాచు.
"పసుల జంగిలికాయ పాలేరు దున్నఁ, గొఱ మాలి..."
గౌర. హరి. ద్వి. 560-561.

**జంగుబిల్లి**
అడవిపిల్లి.

**జంటిరైక**
ఒక విధమయిన రవిక.
రాధి. 1.99.

**జండా పీకివేయు**
పరారి అగు.
"ఊరంతా అప్పులు చేసి తెల్లారేసరికి వాడు జండా పీకేశాడు." వా.

**జండా యెత్తివేయు**
పరారి అగు.
చూ. జండా పీకి వేయు.

**జంతపట్టు**
పైరునడుమ కలుపు పోవుటకైదున్ను.

**జంతమాటలు**
మాయమాటలు.

**జంతికచుట్లు**
మురుకులు, ముచ్చాటలు, మణుగుబూలు అని వేరువేరు ప్రాంతాల్లో వ్యవహరించే పిండివంట.
జిలేబీ అని బ్రాన్ – సరి అనిపించదు.

**జంతికపుండు**
అనేకరంధ్రా లేర్పడే కుఱుపు, సెలల కుఱుపు.

**జంత్రగాడు**
యంత్రం నడిపేవాడు.

**జంత్రబొమ్మ**
కీలుబొమ్మ, మాయలాడి.

**జందెపువాటుగా**
జందెము వ్రేలు వాటముగా.
"ఖడ్గంబుతో నొడిచి, తీసుక వాని జందెపువాటు గాఁగ."
వర. రా. యు. పు. 337. పంక్తి. 13.

**జందెములు త్రెంచుకొను**
కోపముతో చేయు చేష్ట.
జంధ్యాలు తెంచుకొని సన్యాసినై పోతానని బెదరించే అలవాటుపై వచ్చిన పలుకుబడి.
"ఆసపడి యేమి కోరిన నాగ్రహించు, జందెములు ద్రెంచుకొని తద్ద్విజన్ము ఖలుఁడు." శుక. 4.109.

**జంపు నడపు**
ఆలస్యము చేయు.
"నీ వేల జంపు నడపెదు, రావే మా ఱాడ కిందు రాకేందుముఖీ!"
విజ. 2.18.

**జంపు చెల్లు**
ప్రాభవము, తన ఆనతి నడచు.
చం. రా. 2.24.

**జంపుమాటలు**
జాగు చేసే మాటలు.
విజ. 1.102.

**జంపువలపుబేరము**
కాలహరణము చేయు ప్రేమ.
తాళ్ల. సం. 12.145.

**జక్కిణి గొను**

నాట్య మాడు.

చూ. జక్కిణీ...

**జక్కు గావించు**

చెక్కు వేయు.

"మే,దినికిం దెచ్చితి కార్తవీర్యభుజ
పంక్తిం జక్కు గావించితి." పారి. 3.34.

**జక్కు జక్కను**

ధ్వన్యనుకరణము.
కుమా. 11.155.

**జక్కుల బోనము లగు**

భోజనశూన్య మగు, భోజనం వట్టి దగు.

కొన్ని వర్గాల పెండ్లిండ్లలో అరివేణి కుండల నెత్తుకొని బోనాలు బోనాలు అనడం అలవాటు. ఆ కుండలలో బోనం మాత్రం ఉండదు. అందుపై వచ్చిన దని ఆముక్త మాల్యద టీక.

జక్కు లనగా యక్షులు.

యక్షిణీవిద్య గారడీ విద్య.

కాబట్టి ఊరకే నామకార్థంగా ఉన్నట్టు కనిపించుటే కానీ అస లుండని మాయా భోజనమే అనుట కూడా కావచ్చును.

"బోనంబు ప్రజకు జక్కుల, బోనంబులె
యయ్యెఁ బ్రొయ్యి పొగయ మి
వృష్టిన్." ఆము. 4.126.

**జక్కొను**

వొరకు.

"పలిమెడు మహిసాక్షి ప్రతిదివసంబు,
మలహరునకుఁ ద్రిసంధ్యల సమర్పింప,
నొక్క నాఁ డెట్టును జక్కొనకున్న,
గ్రక్కున మేని కండలు కోసి."
పండితా. పురా. 135. పు.

**జక్కొలుపు**

వినియోగించు, సవరించు.

చూ. జక్కొల్పు.

**జగజంత**

గయ్యాళి, మాయలాడి.

"ఔ,రౌర! జగజంత యని తెల,
వారుటఁ గని భామ కేళివసతికిఁ
జనియెన్." హంస. 3. 243.

**జగజంపు**

ముత్యాల కుచ్చు-పెద్దది...

**జగజెట్టి**

జగదేకవీరుడు.

హర. 3.92.

"జెట్టి నింగారించుకొనే టప్పటికి
పట్నం కొల్లపోయింది." సా.

**జగజోలి ఏల**

(ఈ) జంజాటము (ఈ) వీకు లాట ఎందుకు?

ఎవరి సంగతో మన కెందుకు?

"చాలు చాలును వట్టి జగజోలిమాట,
చాలింపుమా." రంగ. రా. అయో.

"ఎక్కడి జగజోలి యటంచు నెరసి
చన జాతురు." శుక. 3.127.

"ఫలము వారలా కాక పనిమాలినట్టి,
చలమువారలా వట్టి జగజోలి యేల."
ద్వి. పరమ. 7.

జగడగొండి
కలహశీలి.

జగడ మాడు
కొట్లాడు, దెబ్బలాడు.

జగడాల చీలి
జగడగొండి.
శశాం. 40.

జగడాలమారి
కలహశీలి.

జగడించు
జగడ మాడు.
"...వృథా జగడింపకుఁడు."
జైమి. 8.209.

జగదొంగ
గొప్ప దొంగ.

జగనీలి పిసాళిజంత
గయ్యాళి, ధూర్తురాలు. జగనగా జగత్ప్రఖ్యాతురాలయిన, నీలి=కృత్రిమపు మాయలు నటించు, పిసాళి జంత – గొప్ప గయ్యాళి.
"జగనీలి పిసాళిజంత యు, మ్మద్దియ."
పాండు. 3.71.

నీలి అనుటకు—
"ఎన్ని నేరిచితివే మటుమాయల నీలి తాన."
సారంగ. 3.53.
చూ. నీలివార్తలు. నీలియేడుపులు.

జగనొబ్బ గండడు
జగదేకవీరుడు.
(గండ=మగడు, ఒబ్బ = ఒక. కన్నడం.) ఇదొక బిరుదు.

జగబంటు
గొప్పభటుడు.

జగబిరుదు, ముండమొఱ్ఱ
వీరాధివీర బిరుద ముండినా అనాథవలె ఆక్రోశించును అనుటపై వచ్చిన పలుకుబడి. పేరు గొప్ప ఊరు దిబ్బ వంటిది.
"జగబిరుదు ముండమొఱ్ఱయుఁ, దగవే నీ వెఱుఁగవే సుధాకిరణధరా!"
నిరం. 3.16.

జగమగడు
గొప్పశూరుడు.
అచ్చ. యు. 68.

జగ మెఱిగిన బ్రాహ్మణుడు
ప్రసిద్ధుడు.
"జగ మెఱిగిన బ్రాహ్మణునికి జందెం ఏలా?"
చా.

జగాజెట్టి
జగజెట్టి.
"చెరువు గట్టినజగాజెట్టి వీవు".
శ్రీని. 4.86.
చూ. జగజెట్టి.

జగిలెకాడు
తోడల్లుడు.

జగే యను
అపహాస్యసూచకమైన ధ్వన్యనుకరణము.
"అద్దిర మత్పతి వచ్చువేళ నీ, కినుకలు సాగ విచ్చుట జగే యన నాతఁడు భీతచిత్తుఁడై."
శుక. 3.196.

జజ్జరకత్తె
మోసగత్తె.
శ. ర.

జజ్జరకాడు
మోసకాడు.

జజ్జుకొను
బలహీన పడు.

జట్టికత్తె
మారుబేరకత్తె.

జట్టికాడు
కొనువాడు; వర్తకుడు; ఓడనడుపువాడు; జూదమాడించువాడు.

జట్టికొను
కొను, స్వాధీన పడచుకొను.

జట్టి గొను
1. పోటీ పడు.
"విలా, సముల చేతఁ దార జట్టి గొనుచు."
కవిక. 1.21.
2. విలుచుకొను.
"తన నిండుజవ్వనము విలు విచ్చి జట్టి గొన్నది."
తాళ్ల. సం. 12.87.

జట్టి దక్కు
అమ్ముడు పోవు, బేరమునకు కట్టుబడి యుండు.
"దాసుఁడనై జట్టి దక్కుచున్నాఁడ."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1530.

జట్టి యాడు
బేర మాడు.
హర. 1.20.

జట్టి యిచ్చు
సరికి సరి విక్రయించు, ఇచ్చు.
"నా, భామల జట్టి యిచ్చి తన పట్టిన యట్టి కడింది నేమముం,దా మతి కొన్ని నా శ్లవిహతంబుగ నిల్పుకొన న్మనంబులోన్."
కళా. 6.97.
రూ. జట్టి యిడు.

జట్టి పెట్టుకొను
తగాదా వేసుకొను.
"వాడు ఏ చిన్న సందు దొరికినా జట్టీ పెట్టుకుంటాడు."
వా.

జట్టు కట్టు
సావాసము చేయు.
"మా సందులో పిల్ల లంతా జట్టు కట్టాము."
వా.

జడకుచ్చులు
జడలో కొనన పెట్టుకునే ఆభరణము.

జడకొప్పు
కొప్పులలో ఒక విశేషం.

జడ గట్టు
వెండ్రుకలు ఉండలు కట్టు.
"నెరుల్ జడగట్టఁగా." విప్ర. 2.79.
రూ. జడ కట్టు.

జడ గొను
జడగట్టు.
"ఏఁచ మాటలు జడగొన్న పీచుఁ గురులు, గలుగు నెఱుకులు దగఁ బోడగనఁగ వచ్చి."
యయా. 1.102.

జడ చిక్కు దయ్యముచందము

బంధిత మై ఎటూ వెళ్లలే నట్లు.

దయ్యాన్ని మంత్రగాళ్లు తల మీద కొద్దిగా వెంట్రుకలు తీసి, జడ వేసి, అందులోనికి దయ్యాన్ని ఆవహింపజేసి జడ కత్తిరించి వేస్తారు. అందులో తగులుకొన్న దయ్యము దిగ్బంధనం చేసి ఉంటారు కనుక ఎటూ పోలేక గిలగిల లాడుతుందట. దీనిపై వచ్చిన పలుకుబడి.

"జడ చిక్కుదయ్యంబు చందమునను." హంస. 1.220.

"ఇపు డేఁగి యమరనాథుఁడు మెచ్చఁగ, జడ లాడిసి పట్టి తెత్తునె, జడఁ జిక్కిన దయ్యమట్లఁ జనుదేరం గన్." చంద్రా. 3.40.

జడతల

వెంట్రుకలు ఒత్తుగా ఉన్న తల.

"ఆ పిల్లది మంచి జడతల. ఏం చేసుకున్నా అందంగానే ఉంటుంది." వా.

జడను పడు

1. ప్రమాన్పడు.

"ఆ జననాథుఁడు శోక మంది జడను పడియు." భాస్క. అయో. 183.

2. అలస మగు.

"నడ జడను పడియె నా కేర్పడియెన్ జనుమొనలు నల్ల వడియెన్." మను. 3.119.

జడప్రత్తి

జడలు జడలుగా గింజ లుండే ప్రత్తి.

జడబిల్ల

జడలో పెట్టుకునే బిళ్ళ – ఒక నగ.

జడముడి

ఈశ్వరుని జటాజూటం – కపర్దం.

జడలు గట్టుట

మునివృత్తి నవలంబించుట.

"జడలు గట్టుట వృథా శ్రాంతి యాతనికి." గౌ. హరి. ప్రథ. పంక్తి. 565.

జడిగాడ్పు

ప్రచండవాయువు.

బ్రౌన్.

జడి గురియు

ఎక్కువగా కురియు.

"ఆనందబాష్పములు జడి గురియన్." భాగ. స్క. 3.394.

జడిగొను

నిరంతరముగా కురియు.

లక్షణయా వ్యాపించు.

"ఒడి దారముల కాంతి జడిగొనంగ." నిరంకు. 4.89.

ఇది విశేషంగా అన్నట్లు 'జడిగొన్న కోర్కులు' ఇత్యాదులలో విధవిధాలుగా ఉపయుక్త మవుతుంది.

"జడిగొని సమ్మదాశ్రుకణజాలము లొల్కఁగ." పారి. 3.5.

చూ. జడి పట్టు, జడివాన.

జడిగొలుపు

జడిగొనునట్లు చేయు.

"మిగుల బిరు సగుశరముల్, జడిగొలిపి తద్భలంబుల, మడియింపఁగఁ జొచ్చె మారి మసఁగినభంగిన్."

జైమి. 5.56.

చూ. జడిగొను.

జడి పట్టు

1. ముసురు పట్టు.

"మరీ జడిపట్టి కురుస్తూంది." వా.

2. పట్టు పట్టు.

"తడఁబడక తప్పు లాడక, జడి పట్టక పరుసు గాక...మాటాడ వలయు."

సకల నీతి. స.

జడి పెట్టు

భయపెట్టు.

"విడువక జడిపెట్టు వినిగి యల్లమయు."

ప్రభు. 2.32. పు. కాశీ. 4.50.

చూ. జడి వెట్టు.

జడివాన

వదలకుండా ముసురు పట్టి కురిసే వాన.

"క్రొవ్విరి జడివాన కుంభినిఁ గురిసె."

రంగా. రా. బాల.

జడివెట్టు

"......వృథాలాప ప్రబంధోక్తులన్, జడివెట్టం బని లేదు." కాశీ. 4.50.

చూ. జడిపెట్టు.

జడ్డిపెట్టె

నడుమ బరువు కట్టి ఇద్దరు మనుష్యులు మోసుకొని పోవుటకు ఉపయోగించే పొడుగైన కఱ్ఱ—జడ్డి. దానికి కట్టిన పెట్టె – జడ్డిపెట్టె.

బ్రౌన్.

జడ్డియాపె

నడుమ పీడిగల యాపె.

బ్రౌన్.

జడ్డుతనము

మాంద్యము; సోమరితనము.

జడ్డుపడు

అలస మగు.

"జడ్డుపడి యుండె నొక కొంత ప్రొద్దు వేడ్కఁ." శివ. 1.64.

జడ్డుమనిషి

సోమరి.

"వాడు వట్టి జడ్డుమనిషి. వాడితో పెట్టుకుంటే ఏ పనీ కాదు." వా.

జడ్డు వడు

వెనుక పడు.

జడ్డు—జడత, మాంద్యం—జడ్డు మనిషి—సోమరి, అలసుడు అనే అర్థంలో నేటికీ వాడుకలో ఉన్నది.

పండితా. ప్రథ. దీక్షా. పు. 178.

జతకట్టు చేయు

సన్నాహపఱుచు.

"చతురంగబలమున జతకట్టు చేసి."

వర. రా. సుం. పు. 156. పం. 5.

**జత గట్టు**
1. పక్షులు మొదలైనవి జత గూడు.
2. గుంపు గూడు.

**జత గావించు**
సరి చేయు.
"యథార్థవ్రతన్ మెలపు నయ్యాల్ సుమ్ము లోకనీతుల్, జత గావించు మహా మహుల్." మల్లభూ. నీతి. 18.

**జత గూడు**
కలియు.
"కూయిడి జతగూడి కెడని కనుకని పరువులన్." హంస. 4.222.

**జతనపడు**
ప్రయత్నించు.

**జతను పడు**
పదిలముగా ఉండు.

**జతను పఱచు**
పదిలపఱచు.

**జత పట్టు**
సావాసము చేయు.
"వాడు వట్టి పోకిరీ పిల్లవాడులా ఉన్నాడు. వాని జత పట్టవద్దు." వా.

**జతపడు**
జత గలియు, సరిపడు, దొరకు.

**జత పఱచు**
జత పడునట్లు చేయు.

**జత యగు**
సరిపడు, సమకూరు.
భాస్కర. 105.

**జత వచ్చు**
సరి వచ్చు; సమాన మగు.
"జత వచ్చు ననవచ్చు జంభారి కాంతను." జాహ్నవీ. 1.72.

**జత్తాయితం బగు**
సిద్ధ మగు.
"కాకోదర లోకాధిపతిని నతరి త్రాడుగా హవణించి జత్తాయితం బై కూరు లగుదేవదానవవీరులు పొంకం బుగా..." హేమా. పు. 18.

**జద్దువడు**
మైమఱచి యుండు — సంతోషంతో.
శివరా. 1.64.

**జన్ని గట్టు**
బ్రాహ్మడు — యజ్ఞోపవీత ధారి.

**జన్ని గొను**
సన్నిపాతం వచ్చు — అలా ప్రవర్తించు.
"చంకలడేఁచికొంచు శంకరుఁ బొగడు, చును నుర్కుచును గెర్లి చూచుచు జన్నిగొనుచు గంతులు వేయుచునుఁ." పండితా. పర్వ. 371. పు.

**జన్నియ వట్టు**
మీఁదుకట్టు.
"కన్నియఁ గాని వే ఱొకతె గాను మనోహరరూప! నీకు నే, జన్నియ వట్టి యుంటి నెలజవ్వన మంతయు నేఁటి దాఁక." విజ. 1.97.
చూ. జన్నె విడుచు.

**జన్నియ విడుచు**

మీదుకట్టు, దైవప్రీతిగా వదలు.

కవిక. 1 ఆ.

**జన్నె చేయు**

మీదుకట్టు, దైవప్రీతిగా అంబోతునో దేనినో వదలి వేయు.

"గోగణంబులలోన గోవు నొక్కటి నేర్చి, జన్నె చేసిన ధర్మశాలి యొకఁడు." రుక్మాం. 2.105.

చూ. జన్నె విడుచు.

**జన్నె విడుచు**

మీదుకట్టు.

దైవప్రీతిగా ఏ ఆబోతునో, దున్నపోతునో వదలి వేయుట అలవాటు. దీనిని జన్నె విడుచుట అంటారు. ఇలాంటివే మీదుకట్టు, జన్నె కట్టు, జన్నియ వట్టు, ముడుపు గట్టు అన్నవి. ఇప్పటికీ పాలూ, పెరుగూ మొదలయినవానిని దేవునికి మీదుకట్టిన వని అంటారు. అంటే ఆ మొక్కుబడి తీరేవరకూ దానిని ఇతరులెవరూ అనుభవింప నీయరు. ఈ ఆచారం మీాద వచ్చిన పలుకుబడి. ఈ అర్థాన్ని సూచించే ప్రయోగాలు—

"మున్నె కొలు వున్నవానికి, జన్నె విడిచి యన్నెలంత చక్కని వరునే..." శుక. 2.206.

"విషమశరుపేర జన్నియ విడిచి రనఁగఁ, గ్రొవ్వి చరియించు నవ్వీటఁ గోడెగాడ్పు." కవికర్ణ. 1.15.

చూ. జన్నియ విడుచు.

**జన్మ కొక శివరాత్రి**

అరుదుగా వచ్చిన దనుట.

"వాడు రాయక రాయక ఏదో పుస్తకం రాశాడు. చేయక చేయక ఏదో సన్మానం చేశాడు. జన్మ కొక శివ రాత్రి అన్నట్లు వాడి కది ఒక గొప్పగా కనిపించదా మఱి?" వా.

**జన్మవాసన**

పూర్వజన్మవాసన.

వాసనాత్రయములో ఒకటి.

మన స్నేహ శత్రుత్వాలకు పూర్వజన్మవాసనలు కారణమని మన పెద్దల నమ్మకం.

"మెలఁతకుఁ బతికిన్, వలపు సమం బగుట జన్మవాసన చెలియా!" మను. 6.66

**జప్పడించుట**

చప్పరించుట.

ప్చ్ - అంటూ తిరస్కార భావంతో కొట్టివేయుట.

"మాటల మిమ్ము జప్పడించుటలు సొప్పగునే." పండితా. ప్రథ. దీక్షా. పు. 152.

"వా డేం చెప్పినా చప్పరించి వేస్తాడు." వా.

**జప్తీ చేయు**

సొత్తును, సొమ్ములను, ఆస్తిని

అయినా, కోర్టు ఆజ్ఞప్రకారం స్వాధీనపఱచుకొను.

జబురుజంగి

ఒక దినుసు ఫిరంగి.

జబ్బ చఱచుక నిలుచు

పోరాటమునకు సంసిద్ధుడగు.
"వాడు మాట వస్తే ఏ మయినా సరే జబ్బ చఱచుకొని నిలబడతాడు కానీ వెనకంజ వేయడు." వా.

జబ్బపుష్టి

భుజబలం.
"వాడి కేం? మంచి జబ్బపుష్టి కల వాడు. నలుగురు వచ్చినా తిప్పి కొడతాడు." వా.

జబ్బుగా

గాఢముగా కాక – తేలికగా.
"కాంతుని జబ్బుగాఁ గౌఁగలించు." మను. 3.123.

జబ్బు చేయు

అణచు; సుస్తీ చేయు.
గౌర. హరి. పూ.
చూ. జబ్బు సేయు.

జబ్బుతో తీసుకొను

చిక్కిపోవు.
"వాడు నాలుగు నెలలనుంచీ జబ్బుతో తీసుకొంటున్నాడు." వా.
చూ. తీసిపోవు.

జబ్బుపడు

1. మంద మగు.
శ. ర.

2. వ్యర్థ మగు.
కళా. 1.181.

3. నిరుత్సాహపడు.
నీలా. 2.66.

4. చెడు.
"జబ్బుపడు సుమ్ము కార్యంబు లెల్ల." ద్వి. తి. సా.

5. సుస్తీపడు.
"మొన్న జబ్బుపడి చిక్కిపోయాడు." వా.

జబ్బు సేయు

తక్కువ పఱచు; సుస్తీ చేయు.
"భూతసంఘముల యుబ్బులు జబ్బు సేసి." గౌ. హరి. ప్రథ. పంక్తి. 2080.
చూ. జబ్బు చేయు.

జమ కట్టుకొను

లెక్కించు.
"మ, ద్వరకవితామహత్త్వపుఁబ్రభావముగా జమ కట్టుకొంచు ..." నానా. 249.
"వాణ్ణి మనవాడికిందనే జమ కట్టుకో వచ్చు." వా.

జమటపాత

డేగను వేటలో చేత పట్టుకొనినప్పుడు దానిగోళ్ళు గుచ్చుకొనకుండ వేసుకునే మడతగుడ్డ.
బ్రౌన్.

జమలిమండిగ

పొరలపూరీ.
నైష. 6.12.

జమాఖర్చులు

ఆయవ్యయాలు.

జమాబందీ

పన్నులను ఖరారు చేయు

టకై కరణాల నందరినీ చేర్చి తాసీల్దారు జరిపే తతంగం.

**జమాబంది సిరాబుడ్డి**

సమిష్టిది; ఒక అడ్డీ ఆగీ లేనిది; ఒకరి అధికారం లేనిది; అతి వ్యభిచారిణి.

జమాబందీ జరిగేటప్పుడు కచ్చేరిలో ఆ తాలూకా రెడ్లు, కరణాలు అందరూ చేరతారు. అక్కడ ఉన్న సమష్టి సిరాబుడ్డిలో ఎవరంటే వారు కలం ముంచి రాస్తారు అందుపై వచ్చిన పలుకుబడి.

**జమీందారీ**

ఒక జమీందారు క్రింద ఉన్న భూమి.

ఇప్పుడు జమీందారీలు రద్దయినవి.

**జమీందారు**

జమీందారీకి అధిపతి.

చూ. జమీందారీ.

**జముకడకు చను**

మరణించు.

"పాంచాలికొడుకు లందఱు జముకడకుఁ జనిరి." భార. శాన్తి. 203.

**జముదళము**

నిడుపు పిడిగల బాకు.

**జముదాడి**

జముదళము.

**జముదాళి**

చూ. జముదాడి.

**జమునిల్లు చొచ్చు**

చచ్చు.

"జమునిల్లుఁ జొచ్చిన జంతువుఁ దెచ్చు, నమితసత్వాఢ్యు లీ యవనిలోఁ గలరె?" ద్విప. మధు. పు. 30.

**జముబానసము నింటిత్రోవ చూపు**

చంపు.

యముని వంటయింటిదారిని చూపించుట అంతే కదా.

"రక్షగాఁ బుట్టి తిరిగెడురాక్షసులకుఁ, దొలుత జముబానసము నింటిత్రోవ చూపి." ఉ. హరి. 1.139.

**జములా గుడారాలు**

డేరాలు.

కాశీయా. 72.

**జమువాకిలి గట్టు**

బ్రతికించు.

యముని వాకిలిని మూయుట అనగా చావనీ కుండుట.

"మద్గృహంబునఁ, వాడిమితోడ నుండి జమువాకిలి గట్టి మదీయ సంతతిన్." ఉ. హరి. 2.19.

**జమ్ముగూడ**

జంబుతో అల్లిన గూడ.

ఆము. 4.133.

**జమ్ముదాడి**

చూ. జముదాడి.

**జయపెట్టు**

జయజయ అని జేకొట్టు.

చూ. జయవెట్టు.

**జయము జయము**

రాజులను, దేవతలను చూచి నప్పుడు అనుమాట.

"జయము జయము నీకు సంపంగిమన్నా ! నగా, దయుఁ జూడు దక్షిణద్వారకా ధీశ !" హేమా. పు. 68.

**జయ వెట్టు**

జయజయధ్వానములు చేయు.

"జయవెట్టుఁ డిటు గూడ సా తెల్ల ననుచు..."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 291.

**జరుగుడాట**

రాతిపలకల మీది నుండి క్రిందికి జారుతూ ఆడుకొనే ఆట.

శ. ర.

**జరుగుడుబండ**

పై ఆట కుపయోగించే బండ.

**జరుగుబడి**

చూ. జరుగుబాటు.

**జరుగుబాటు**

తిండికి, బట్టకు ఉండుట.

"వాడికి జరుగుబాటు కేం లోటు లేదు." వా.

"వాడిది బాగా జరుగుబాటున్న కుటుంబం." వా.

**జఱజఱ యీడ్చు**

ధ్వన్యనుకరణము.

**జఱభిచెయ్యులు దాల్చు**

గడుసరిచేతలు చేయు.

వ్యభిచారిణుల చేష్టలు చేయు - ప్రస్తుతం.

"జఱభిచెయ్యులు దాల్చిరి జారకామినుల్." కుమా. 8.101.

**జఱభితనము**

గడుసుతనము.

"అడవిలోనఁ దపమువడఁ బోదు నను నంత, జఱభితనము లెందుఁ గఱచి తీవు." కుమా. 6.16.

మూర్ఖత్వము వంటి దని టిప్పణిలోనూ కోశాలలోనూ ఉన్నా అట్లా అనిపించదు. మేనక పార్వతితో అంటున్న మాట యిది.

**జఱభులు**

గడుసువారు, పాపులు, దుష్టులు.

"కలకంఠు శుద్ధ నిష్కల భక్తియుక్తి, జఱభుల కది యేల సమకూడు." బస. 7.204.

"ఎఱిఁగితి మద్ది రయ్య తడ వేటికి గుఱ్ఱపుదొంగ పీఁడె యీ, జఱభునిఁ బట్టి చంపుఁ డతిసాధుమునీంద్రుఁడు వోలె నేత్రముల్, దెఱవక... బెసుకపట్టె..." భాగ. 9.207.

"కొఱగాని జఱభుల కొయ్యన గాంద్ర." బసవ. 5.

**జలకట్టె**

ఒకానొక జేగ - సెలకట్టె.

**జలక మాడు**

స్నాన మాడు.

**జలకము లాడు**

స్నాన మాడు.

**జలకమువాడు**

స్నానము చేయించేవాడు.

ద్వి. పరమ. 3.203.

**జలకము గ్నావించు**

అభిషేకము చేయించు, స్నాన మాడించు.

"గంధోదకములను మఱి జలకంబు గావించి."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 468.

**జలక మార్చు**

స్నానము చేయించు.

పాండు. 2.17.

"మదవతీ కరము క్తమణికుంభసంభృత, సారభోదకముల జలక మార్చి."

పారి. 5.70.

**జల గడిగినట్లు**

బాగా కడిగినట్లు అనుట.

జల గడుగుట అనగా—బంగారంపై పోగర పనీ, ఆకురాతి పనీ చేసినప్పుడు వారు పెట్టుకొన్న చర్మంమీదనే కాక అటూ యిటూ ఏ కొంతో రాలిపడే అవకాశం ఉంటుంది. అందుకని ఆ తావులో కసవూడ్చి ఆ కసవునంతటినీ ఒక చోట ఉంచి పెడతారు. దానిని జలగడుగు వాళ్లు, కాలువకో బావికో తీసుకొని వెళ్లి, నీళ్లు పోసి కడిగి, కడిగి పైన ఉన్న కసవునంతటినీ తొలగించి వేసి, ఆ అడుగున తేలినదానిలో పాదరసం వేసి పట్టి పుతం పెడతారు. అప్పుడు బంగారం తేలుతుంది. కాబట్టే జలగడుగుట అనగా బాగా కడుగుటగా అలవా టయినది.

"వాడి పుట్టు పూర్వోత్తరా లన్నీ ఏకరువు పెట్టి జల గడిగినట్లు వాడి మానం కడిగి వేశాడు." వా.

**జలగడుగు**

నీళ్ళతో కడుగు.

"అలివున సంపాదించితి, జలగడిగితిఁ బున్నె మెల్ల శాంతిపర! ననున్."

కవిమాయ. అం. 4.77.

చూ. జలగడిగినట్లు.
రూ. జల్లగడుగు.

**జల గడుగువాడు**

పైరీతిగా బంగారుపొడి కలిసిన కసవును కడిగేవాడు.

చూ. జల గడిగినట్లు.

**జలజల రాలు**

ధ్వన్యనుకరణము.

"జలజల రాలెఁ బూలు సుమసాయక సంగరకాళలంబునన్."

రాజగో. 4.47.

**జలతరంగములు**

అశాశ్వతములు, క్షణికములు.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 418.

చూ. జలబుద్బుదములు.

**జలతైలబిందు వగు**

నీటిలో వేసిన నూనెబొట్టు

విరివిగా వ్యాపించుట పై వచ్చిన పలుకుబడి.

"జల తెలబిందు వయి నా, మెలఁకువ వెల్లి విరి యైన మే లగునే."

ఉ. హరి. 5.198.

**జలదమును నమ్మి చేనీరు చల్లు**

ఎక్కడో ఉన్నదానిని నమ్ముకొని, చేతిలో ఉన్నదానిని జారవిడుచుకొను.

నమశ్శి. 50.

**జలదారి**

నీళ్లు పోయుటకు వీలుగా ఒక మూల బండ వేసి చుట్టూ కాస్త కట్ట వేసిన తావు. అందులోనుండి నీళ్లు పోవుటకు వెలుపటికి ఒక కాలువ కూడా ఉంటుంది. ఈ మాటను దక్షిణాంధ్రంలో ఎక్కువగా ఉపయోగిస్తారు. ఇదే జలజారిగా కూడా మారినది.

రూ. జలజారి.

**జలదోషము**

పడిశము.

**జలపూత**

బంగారు వెండితో చేసిన మొలాము.

**జలపోసనము**

జలతారు అన్న అర్థంలోనూ కొన్నిట ప్రయుక్తం.

చూ. జలపూత.

**జలపూత బంగారు**

అశాశ్వతము.

పైపై మెఱుగులవంటి మాట. మొలాము వేసినదే కాని అసలు బంగారం కాదు.

తాళ్ల. సం. 11.3. భా. 70.

**జలబాధ కలుగు**

మూత్రవిసర్జనాకాంక్ష కలుగు.

కాశీయా. 238.

**జలబుద్బుదములు**

అశాశ్వతములు, క్షణభంగురములు.

నీటి బుడగలవంటి వనుటకు నీటిబుడగలే అనుట.

ఇట్టివి పెక్కు లున్నవి.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 418.

**జల మాడు**

స్నానం చేయు.

**జలముపా లగు**

నీళ్లపా లగు – వ్యర్థ మగు.

"తన పెద్దతనంబు జలంబు పాలుగ."

నైష. 8.42.

**జలసూత్రము**

1. ధారాయంత్రము.

కాశీయా. 37.

2. అటూ యిటూ నీరు వచ్చుటకై రెండు బానలలో నికీ వదలిన త్రాడు.

**జలుబు చేయు**

పడిసెము పట్టు.

జలుబునీళ్లు వదలిపోవు
పాగ రడగు.
కొత్త. 187.

జల్ల బండి
పైన కప్పు లేనిబండి.
కొత్త. 48.

జల్లి గంప
సందు లున్న గంప.

జల్లి తోక
కుచ్చుతోక.

జల్లి నీడ
మధ్యమధ్య వెలుతురు పొడ లున్న నీడ.

జల్లి పెండెము
ఒక నగ.

జల్లి మాటలు
వ్యర్థ ప్రలాపాలు, వట్టి మాటలు.
జల్లెడ పట్టగా నిలుచునవి గట్టివి. అలా కానివి జల్లి మాటలు.
నడుమ నడుమ సడలి విచ్చి పోయిన అనగా సత్యేతరత బయల్పడిన వగుటతోనూ జల్లిమాటలు కావచ్చును.
"జల్లిమాటలు గాక సరిసేయ వచ్చునే, సవరంబు లీశరోజాతములకు." హంస. 1.210.

జల్లి ముత్తెము
సన్న టిముత్యము.
ప్రాక్.

జల్లి మూకుడు
నడుమ సగండాకా రంధ్రా లున్న మూకుడు, సిబ్బిరేకు.

జల్లి వేరు
కొన కుచ్చుగా ఉన్న వేరు.

జల్దుకొని వచ్చు
త్రోసుకొని వచ్చు.
"జల్దుకొని వచ్చెఁ బైపైని సారమేయ, యూథములు." హర. 7.38.

జల్లుకొను
మూగు. గుంపగు.

జల్లు లాడు
జలక్రీడ లాడు, నీళ్లు చల్లు కొను.
"ఒండొరులమీఁద జలములు నిండు కొనఁగ, జల్లు లాడిరి సరసిలో సరసము గను." ఉషా. 2.12.

జల్లెడపాటు వడు
దట్టంగా పెరుగు.

జవకట్టు
కూడిన, మేళవించిన.

జవకట్టికొను
భద్రపఱుచుకొను, కూడు కొను.
"భవరోగములు వీడి పాఱుంగఁ బెద్దలు మున్ను, జవ కట్టుకొనిన నిచ్చల మైన మందు." తాళ్ల. సం. 5.140.

జవజవ లాడు

ఊగాడు, కంపించు.

చూ. జవదాటు వివరం.

జవజవ మను

కంపించు.

జవదాటు

మేర మీరు.

ఏ కొంత మైన అనే అర్థంలో జవ ఉపయుక్త మైనది. జవ దాటక పోవడం అంటే ఏ కొంత కూడా మేర మీరక పోవడం అని అర్థం. సన్నని గోధుమలను జవగోధుమ లంటారు. సన్నని గోధుమంత కూడా దాటకుండడ మన్నమాట. సన్నని వస్తు వేదైనా కదలుటకు జవజవ లాడుట అంటారు.

"తనయాజ్ఞ జంగమస్థావరజంతుసం, తాన మెన్నఁడు జవదాట వెఱవ."

కా. మా. 1.28.

"ఈ రీతి సకలధర్మవి, చారుం డగు నతనిమాట జవదాటక."

శుక. 1.179.

జవళివాడు

బట్ట లమ్మువాడు.

బ్రౌన్.

జవళియంగడి

బట్టల దుకాణం.

బ్రౌన్.

నేటి వాడుకలో జవిళి.

జవుజవ్వు

ధ్వన్యనుకరణము.

జవాదివంకి

పునుగు, జవ్వాది సౌందర్య వర్ధకములుగా మనకు ప్రతీతి. లక్షణయా అతి సౌందర్యవతి అనుట.

"వరల సొంపుల టెంకి జవాదివంకి, జాతి రతిసీల నారాజదూతి ప్రోల."

హంస. 1.81.

చూ. జవ్వాదివంకి.

జవ్వన మమ్ముకొను

డబ్బుకై వ్యభిచరించు.

"సంత యెన్నఁడో, జవ్వన మమ్ముకొన్న గడసాని ననుం గవయం దలంచితే."

ఉ. హరి. 1.74.

జవ్వాజివంకెలు

ధాన్యవిశేషం.

జవ్వాడు

కదలాడు.

పలుచగా, సన్నగా ఉన్న వాని కదలికలోనే ఇది ప్రయుక్త మవుతుంది.

"నృపుఁ డుపవడ మై, జవ్వాడులతి కయో యన, నవ్వేలఁది వడంకఁ జూచి."

శుక. 1.313.

చూ. జవజవ లాడు.

జవ్వాదిపిల్లి

పునుగుపిల్లి, సంకుమృగం.

జవ్వాదివంకి

చూ. జవాదివంకి.

**జవిళిసరుకులు**

జవిళి అంగడిలోని సరకులు. (జవిళి=గుడ్డలంగడి) అనగా అందుబాటులో నున్నవి.

"నవనిధానంబు లేజేవి జవిళి సరుకులు." పాండు. 1.2.

చూ. జవళి...

**జళపకులు వాలు దంచు**

మెఱుగుపోటు వేసి దంచు. ఒకసారి దంచి, దానిమీద దంచడాన్ని మెఱుగుపోటు అంటారు.

పాండు. 3.87.

చూ. మెఱుగుపోటు.

**జాగఱ గట్టు**

మేలుకొను. జాగారము చేయు.

"జాము పోయినదాఁక జాఁగఱ గట్టి, బాములఁ బొందుచు."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1941.

**జాగుపడు**

సాగు.

విజయ. 1.43.

**జాగుపెట్టు**

జాగు సేయు.

"పెక్కు మాటల నిటు జాగుపెట్ట నేల." కాశీ. 2.88.

**జాగెనకత్తెర**

మల్లబంధవిశేషం.

**జాజరకత్తె**

మాయలాడి.

**జాజరకాడు**

మాయవాడు.

**జాజాలపాలిక**

అంకురార్పణం చేసే మూకుడు.

**జాజాలపాలె**

చూ. జాజాలపాలిక.

**జాజు చేయు**

ఎఱ్ఱవడజేయు.

"బాగుగా జాజు చేసినఁ బ్రజ్వరిల్లు." రాధా. 5.254.

**జాజులు ప్రసాద మగు**

అత్యనుకూల మగు, అత్యభిలషణీయ మగు.

జాజులే కాక ప్రసాదం కూడా అయినప్పుడు మఱింత వాంఛనీయం కదా.

"నీకవితంబనై నిర్దోష మగుచు, మాకు నంకితము రామాయణంబైన, బంగరు పువ్వుల పరిమళమై పొసంగి జాజులును బ్రసాదమ్ము నట్లు."

వర. రా. బా. పు. 6. పంక్తి. 7.

చూ. జాదులు ప్రసాదము నగు.

**జాజువాఱు**

ఎఱ్ఱబాఱు.

"శశికాంతమణిపీఠి జాజు వాఱఁగఁ గాయు, లుత్తుంగకుచపాళి నత్తమిల్ల." మను. 2.27.

**జాజు సేయు**

ఎఱ్ఱరంగు వేయు, ఎఱ్ఱవడ చేయు.

చూ. జాజు చేయు.

**జాడపడు**

ఎక్కువగా ఉన్నవి తక్కువై పోవు, విరళ మగు.

చూ. జాడలు పడు.

**జాడించి తన్ను**

కాలుతో తీసి తన్ను.

**జాడించి పలుకు**

గట్టిగా తిట్టు.

"సామాన్య యోగుల జాడించి పలుక." ప్రభు. 3.86.

**జాడు పేడు**

తృణప్రాయం, సగదుడుపు ప్రాయం. తాడుతోను చెక్కపేడుతోను సమాన మనుట.

"...ధీజనసుత వచోవిభవంబు నశేష చక్రివా, దోడన సాటిగా నతనితోఁ బెఱమంత్రులు జాడు పేడనన్." శృం. శాకుం. 1.6.

**జాతకర్మ**

పుట్టినబిడ్డకు చేయు సంస్కారము.

**జాతాశౌచం**

పురుడు.

చూ. మృతాశౌచం.

**జాతి....**

ఉత్తమ మైన, శ్రేష్ఠ మైన. మంచి జాతికి చెందిన అన్న అర్థంతో ఆరంభ మై, ఉత్తమ మైన అన్న విశేషణంగా నిలిచిన మాట.

జాతివార్తా చమత్కారములు, జాతిపుక్క, జాతిసరుకు, జాతి ముత్యాలు ఇత్యాదులు.

చూ. జాతిగా.

**జాతిగా**

అందముగా.

"జాతిగాఁ దాల్చి నెఱ మిండజంగ మగుచు." హర. 5.41.

చూ. జాతి...

**జాతినాగు**

మంచిజాతి సర్పము.

"జాతినాగులఁ జంపుచుండి, ప్రతిమ నాగులకును బాలోయ్వసినట్టు." పండితా. ప్రథ. దీక్షా. పుట. 202.

బ్రతికి ఉన్న నాగులను వదలి, జాతి నాగులకు పాలు పోసినట్లు – వ్యర్థము.

**జాతివార్తలు**

జాతీయములు.

"జాతివార్తలు దొలఁక రసంబు గులుకఁ, గవిత రచియించుఁ గల్పించి కతలు నుడువు." శుక. 2.14.

**జాదరలు**

పెండ్లిండ్లలో తొలుత కుల పాలికాపూజ చేసి మూకుళ్లలో మొలక పోస్తారు. ఆ మొలకలు.

"ఈశు నుద్వాహమున కమరేంద్ర దిగ్వి, లాసవతి పైఁడిపాలియఁ బోసి తెచ్చు, జాదరలొ నాఁగ రాగపూర్ణోదయేందు, బింబమునఁ బాండుకిరణాంకురంబు లెసఁగె." కుమా. 8.112.

జాదరాడు

గంధవాసి చల్లుకుంటూ క్రీడించు.

జాదుకొను

పరవశమగు, భావాతిరేకముచే నుద్రిక్తమగు.

"సకలాంగకంబులు జాదుకొఁ బులకించి." నైష. 5.9.

"అరి యనుపేరు చెవి సోఁకినంత మాత్ర, జాదుకోఁ బులకించె నజ్జన విభుండు." నైష. 3.48.

జాదులు ప్రసాదము నగు

తనకు సహజంగానే యిష్టమయినది దైవప్రసాదము కూడా అయిన దనుట.

"సంతస మంది జాదులు ప్రసాదము నయ్యె నటంచుఁ బొంగి నా,గాంతకుఁ డంబుజోదర..." పారి. 2.75.

"అనూన మైనచ, క్కందనమున్ సువర్ణముఁ గల్గినఁ బెన్మిటి కేమి చెప్పె? నా, చందనగంధి జాదులు ప్రసాదము గాదె చకోరలోచనా!" కళా. 7.95.

చూ. జాజులు...

జాదులు వేచు

అననురూపకార్యమున కగ్గము చేయు, సుకుమారమైనవానిని కఠినంగా శిక్షించు.

"సరవి యెఱుంగ లేక కకట జాదులు వేఁచెను మంగలంబునన్." శృం. శాకుం. 2.62.

జానకిత్రాడు

1. నిప్పు ముట్టించే తాడు.

2. కర్ణాటకపు తుపాకుల చెవియందుండే నిప్పు ముట్టించే త్రాడు.

బాణసంచా కాల్చేటప్పుడూ ఉపయోగిస్తారు.

జానగు

అందమగు; తేటయగు.

"పల్కెన నబోడి జానగు పలుకు లెసగుచు." అచ్చ. రా. బాల. 6.

జానతి

విచక్షణాజ్ఞానం కలోళ్ళవు.

"జానతి పశుపతి సుతక వి, ధానమహారంభుఁ డైనదక్షుం డనుచ, జ్ఞానికి," కుమా. 2.15.

జానుగా

తేటగా.

జానుతెనుగు

తేట తెనుగు, మంచి తెనుగు.

"సరళము గాఁగ భావములు జాను తెనుంగున నింపుపెంపుతో..." కుమా. 1.35.

"ఉరుతర గద్య పద్యోక్తుల కంటె, సరస మై పరఁగినజాను తెనుంగు, చర్చింపఁగా సర్వసామాన్య మగుట..." బస. 1.

జానుపదు

తేట తెల్లమగు.

భార. అర. 2.214.

జానువాలు

చూ. జానుపదు.

జాపత్తిరి
జాతిపత్రి.

జా పరమేశ్వరా అను
పాటిపోవు.
జానపదకథలలో ఎవరైనా పోవునప్పుడు 'జా పరమేశ్వరా' అనడం వినవస్తుంది. అందుపై వచ్చిన పలుకుబడి.
"జా పరమేశ్వరా యనిన జంతువులన్నియుఁ బోయె మాయమై."
వరా. 1.148.

జాబు జవాబు
ఉత్తరాలు. జం.

జాము వేగు
బ్రతుకు గడచు.
"చట్టు కూఁతురు గలుగ నీ జాము వేఁగ." నిరంకు. 3.30.
వాడుకలో—.
"అలాంటి భార్య ఉండబట్టి నీవు గడుపుకొస్తున్నావు గానీ లేకపోతే యీపాటికి ఏమై పోయేవాడివో ?" వా.

జారీచెంబు
ప్రయాణాదులలో ఉపయోగించే ఒకవిధమైన చెంబు.

జాఱవిడుచు
విడిచి వేయు.
"సత్కులాపంబులు జాఱ విడిచె."
శివ. 2.102.

జాఱిపోవు
పోవు, చ్యుత మగు.

జాఱుకొప్పు
కొనముడి.

జాఱుపైట
జాఱుచుండునట్టు వేసుకొను పైట.

జాఱుముడి
దువ్వుముడి.

జాఱువాఱు
చ్యుత మగు, తొలగు.

జాఱువోవు
తొలగు.

జాలకట్టు
నల్లఱాతియందు బెజ్జము లేర్పఱచిన కిటికీ.
శ. ర.
వెలుతురు ప్రసరించుటకు రాతిలో చేసిన బెజ్జము.
బ్రౌన్.
నిలువుగా కట్టును నాటిన కిటికీ.
వావిళ్ల ని.

జాలవల్లిక
తాంబూలం తట్ట - అందుపై నగిషీ చేసి ఉంటారు.

జాలవాడు
ఈతకాడు.
బ్రౌన్.

జాలిక లేకనే బంగర మాడు
అతి సాహసి, నేర్పరి, జాణ అని నిరసనగా అనుటలో—

"అదా అమ్మా! జాలిక లేకనే బంగర మాడుతుంది." వా.

**జాలిగుండె**

దయాళువు.

**జాలి గుడుచు**

దుఃఖపడు.

**జాలిగొను**

విచారపడు, భయపడు.

**జాలిపడు**

దుఃఖపడు, కష్టపడు. ఇందుకు దగ్గఱి భావచ్ఛాయలలో... నేటి వాడుకలో కృప చూపు అన్నట్లు వినవస్తుంది.

"వాణ్ణి జాలి దలచినవాడు పాపాత్ముడు." వా.

**జాలిపెట్టు**

1. బాధించు.

భీమ. 4.112.

2. సొదపెట్టు.

"పెక్కుమాటల నింక జాలి పెట్ట నేల ?" కాశీ. 2.88.

**జాలి పొందు**

భయభ్రాంత మగు.

"గోలాంగూలకులంబు లాకులపడెన్ ఘోషించె శార్దూలముల్, జాలిం బొందె లులాయముల్." హర. 6.46.

**జాలి మాలి**

కోరిక బలమై ఉద్రిక్త లూగుట. దీనినే వాడుకలో ఆలి జాలి మెత్తు, ఆలి జాలి పడుతున్నాడు అంటారు.

"మనసిజవేదనం జాలి మాలి తిరుగఁ గాన్." హంస. 4.45.

"పుష్పంపుల కైదువుం దిగిచి వంపుచు దావుల యంపసోన వర్షింపుచు జాలి మాలి గొనఁ జేసె మరుం డమరీకదంబమున్." కవిరా. 3.45.

**జాలి వొందు**

జాలిపడు.

"అని జాలి వొంది రయముతో వచ్చు, జనకజాభర్త... !" వర. రా. అర. పు. 210. పంక్తి. 3.

**జాలుకొను**

1. ప్రవహించు, స్రవించు.

2. వరిల్లు.

3. ప్రసరించు.

**జాలువాఱు**

చూ. జాలుకొను.

**జా లెత్తు**

స్రవించు.

"జల జల జా లెత్తెఁ జంద్రకాంతములు." వర. రా. సుం. పు. 18. పంక్తి. 12.

"జా లెత్తె నార!...లోచనాంచలము చెలమ." విజయ. 3.11.

**జాలెత్రాడు**

ఒక జెట్టి సాధనం.

**జావ కారి పోవు**

భయపడి పోవు, నిర్వీర్యు డగు.

"కాస్త గట్టిగా అదిలించా మంటే వీడు జావ కారి పోతాడు." వా.

చూ. జావయి పోవు.

## జావయి పోవు

భయపడి పోవు, నిర్వీర్యు డగు.

"అదిడముందు నిలబడినా డంటే వీడు జావయి పోతాడు." వా.

## జిగటరకం

పట్టుకుంటే వదలనివాడు అనుట.

"వాడిది ఒట్టి జిగటరకం. తగులు కుంటే ఇంక అంతే. కాళ్లు చీములు పట్టవలసిందే." వా.

## జిగిదేఱు

కాంతి తేలు.

## జిగురుకండె

చూ. జిగురు చుట్టిన కండె.
రూ. జిగురుగడ.

## జిగురు చుట్టినకండె

వేటలో పక్షులను పట్టుకొనుటకు ఉపయోగించునది, వదలనిది.

తాళ్ల. సం. 12.75.
చూ. జిగురున పడ్డ...

## జిగురున పడ్డ రాచిలుక

చిక్కిన పడినది.

పక్షులను పట్టుకొనుటకై ఒక శివవంటి దానిపై ఒక చిన్న పలక నమర్చి దాని మీద వజ్రంవంటి జిగురును అతికిస్తారు. దాన్ని ఏ చెట్టు మీదనో పెట్టినప్పుడు చిలుక వాలడం, దాని కాళ్లు కరుచుకొని పోయి వేటకానికి చిక్కడం జరుగుతుంది. లక్షణయా వదిలించుకొని పోవ వీలులేని పరిస్థితిలో పడిన అనుట.

"జిగురునఁ బడ్డరాచిలుకచెల్వున." కా. మా. 4.29.

## జిగురు వైచు

వల వైచు వంటిది.

పూర్వం వేటకాండ్రు కొన్ని పక్షులను పట్టుకొనుటకై పలకలపై జిగురు పూసి చెట్లపై పెట్టేవారు. పక్షులు వాలి చిక్కుకొని వాళ్లకు చిక్కేవి. అందుపై వచ్చిన పలుకుబడి. నేడు కూడా ఈగలకై జిగురుకాగితాలు పెట్టుట అలవాటు.

## జిడ్డుకొను

జిడ్డు తేలు.

పాండు. 4.253.

## జిడ్డుపడు

వ్యర్థ మగు.

## జిడ్డుపఱుచు

వ్యర్థపఱుచు, కలత పెట్టు.

"నీ పడ్డపాటు వృథగా జిడ్డు తేపం గలవారమె." హర. 2.132.

## జితపడు

అనుకూలపడు.

జితపాటు
అలవాటు.

జిత్తులమారి
ఉపాయశాలి, మాయోపాయజ్ఞుడు.

జిత్తులవాడు
చూ. జిత్తులమారి.

జిద్దుగొను
ఎదురొ్కను.
రంగా. 2.40.

జిమ్మ దిరుగు
దిమ్మ తిరుగు.
"...జిమ్మ దిరిగి దశశిరుండు."
భాస్క. అర. 2.135.

జిమ్మ పడ !
ఒక తిట్టు.
వాడుకలో జిమ్మడ! అనీ విన వస్తుంది.

జిరాయితీ హక్కు
సేద్యం చేసుకునే హక్కు.

జిఱకొట్టు
గిరికీలు కొట్టు.
ధ్వన్యనుకరణము.
"చెరలాడు జిఱకొట్టుఁ జెలఁగి పేరెంబు, దిరుగుఁ బర్విడు."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 605-06.
గౌర. హరి. పూ. 699. పం.

జిఱ్ఱ జిఱ్ఱ
ధ్వన్యనుకరణము.

జిఱ్ఱత్రాడు
పురి పెట్టిన తాడు.

జిఱ్ఱ దిరుగు
గిరగిర తిరుగు.
"చక్రభ్రమణంబునఁ జిఱ్ఱ దిరిగి."
నైష. 3.151.

జిఱ్ఱన తిరుగు
గిర్రున తిరుగు.
ధ్వన్యనుకరణము.
"రజత ధరణీధర మస్వైరవృగఁ జిఱ్ఱనఁ దిరిగెన్, బురహరుతోఁ గూడ వెండి బొమ్మరము క్రియన్."
కుమా. 6.155.
"సెగడు మందరగిరి నిలు వెంత కడు భోగి, దిర్చిన జిఱ్ఱనఁ దిరిగ నట్టె."
కుమా. 3.5.

జిఱ్ఱవోవు
జిఱ్ఱు మని చెవులు దిమ్ముపడు.
శృం. శాకుం. 3.115.

జిఱ్ఱున చీదు
ధ్వన్యనుకరణము.
"కడుఁ గపాలము దాఁకి కలఁగంగఁ జక్కఁగాఁ, జే సాఁచి జిఱ్ఱునఁ జీఁది చీఁది."
కా. మా. 2.148.

జిఱ్ఱున దిగుచు
చరాలున లాగు.
ధ్వన్యనుకరణము.
"తూణీకా బాణము జిఱ్ఱునం దిగిచి."
కా. మా. 3.115.

జిలకఱరాజనాలు
సన్నని ధాన్యవిశేషం.

జిలజిల మను

1. చెమ్మగిలుటలో ధ్వన్యను కరణము.

"జిలజిల మంచుఁ జెమ్మగిల." రాధి. 3.110.

2. వ్యాపించుటలో ధ్వన్యను కరణము.

"జిలజిలన వడిసె వెన్నెల, జిలజిల దిక్కులను నొడిసెఁ జీఁకటు లెడసెన్." రంగా. 3. 187.

జిలమబుడతలు

ధాన్యవిశేషం.

జిలితొగల రాజనములు

ధాన్యవిశేషము.

జిలిబిలి

1. మనోహర మయిన.

"తరుణాంగుళీ ధూత తంత్రీస్వనం బుతో, జిలిబిలిపాట ముద్దులు నటింప." మను. 2.27.

2. ఒక నగ.

3. ఇంపైన, ముద్దు ముద్ద యిన.

4. అంద మైన.

5. చిన్న దైన.

జిలిబిలి చీర

చిన్నచిన్న గళ్ళున్న సన్నని పట్టుచీర.

శ. ర.

జిలిబిలి వోవు

1. ఒప్పు.

2. తొట్రుపడు.

నైష. 7.103.

3. ఎక్కు వగు.

విక్ర. 4.224.

జిలుగక్షరాలు

గొలుసుకట్టు వ్రాత.

"ఆ పత్రంలోని జిలుగక్షరా లీకాలం వాళ్లు ఎవ్వరూ చదవ లేరు." వా.

జిలుగువన్నెలు

వస్త్రవిశేషం.

యయా. 4.122.

జిలుగువ్రాత

గొలుసురాత.

చూ. గొలుసురాత.

జిలుబారు

అంద మయిన.

"చెలికత్తె జిలుబారు పలుకుఁ జిలుక." నైష. 1.5.

జిల్లేడుకాయలు

ఒక పిండివంట పేరు.

జివ్వంకలు వంగు

జివ్వున జివ్వున ఆడుతూ వంగి పోవు.

"సెవ్వలి సన్నుల వ్రేఁగునఁ, జివ్వంకలు వంగఁ గౌను." కుమా. 9.113.

జివ్వాడు

జివ్వు జివ్వు మని కదలు.

జిహ్వా ఆడక

నాలుక ఆడక, మాట రాక.

"యెవ్వ తె నంచును జిహ్వాయాడక, త్యంతమును దొట్రిలం బలికె." కళా. 6.131.

**జిహ్వ చచ్చు**

అరుచి యేర్పడు.

"ఆ మధ్య జబ్బు పడ్డాక జిహ్వ చచ్చి పోయింది." వా.

**జిహ్వ త్రుప్పు డుల్లు**

నాలుక త్రుప్పు వదలు.

ఇది నేటికీ వాడుకలో 'నాలుక త్రుప్పు వదలు' అన్న రూపంలో ఉంది.

ఏదయినా ఉపయోగించనప్పుడు త్రుప్పు పట్టుతుంది. దానిని బాగా ఉపయోగిస్తే ఆ త్రుప్పు తొలగి పోతుంది. కత్తులు ఇత్యాదులలో ఇది సుప్రసిద్ధం. అందుపై యేర్పడిన పలుకుబడి.

"అప్ప టప్పటికిని జిహ్వా త్రుప్పు డుల్లి, నా మెత లెటెంగ నీతుపా రాద్రికతన." మను. 2.11.

**జీడి నిట్టి అచ్చొత్తు**

జీడితో – ఓడిపోయినాడని తెలుపుటకై – జింక బొమ్మను ముద్రించు.

"ఉరముపై జీడి నిట్టి యచ్చొత్తి విడిచె." కుమా.

**జీతకాడు**

సేవకుడు

**జీతగాడు**

చూ. జీతకాడు.

**జీతనాతములు**

జీతము బత్తెము. జం.

"...బుధుల్, చెప్పిన కార్య పద్ధతులు చేయుట గొల్చిన పేదసాదలన్, జెప్పన జీతనాతము లొసంగుట భూషణ మయ్యు పుత్రకా!" రాజనా. 2.34.

**జీతపురాళ్లు**

జీతంగా వచ్చే రూపాయలు. రూపాయలను రాళ్లనడం మరి కొన్నిటా కనబడుతుంది. మాటా. 79.

**జీతము పెట్టని బంటు**

జీత మివ్వకనే వచ్చినా సేవకు నిలా చేసేవాడు.

"బడలి జీతము పెట్టని బంట నగుచు, వెఱచి నా కేల నీ వెనువెంటఁ దిరుగ." హరి. 4.35.

**జీతము సేయు**

జీత మిచ్చు.

"భావజవిభుఁ డలి శుకపిక, సేవకతతి కెదరు దీర జీతము సేయం,గా వెలిఁ బోసిన పసిఁడుల, ప్రోవులు నాఁ దమ్మి తెలమిఁ బూచె." కుమా. 4.92.

**జీనపటము**

దట్టీ.

**జీనిగిరివాడు**

కర్ర బొమ్మలూ అవీ చేసి రంగులు వేయువాడు.

చర్మకారు డని... బ్రౌ. ముచ్చివా డని... శ. ర. వాడుకలో అలా వినరాదు.

జీనిసరిపెణ

ఒకరకమైన మెడలోని గొలుసు.

జీనిసరులు

ధాన్యవిశేషం.

జీనువముక్కాలు

ధాన్యవిశేషం.

జీబుకోను

దట్టమగు.

జీరగుండులు

మేల్కట్టున వ్రేలునట్లు కట్టే రసగుండ్లు.

జీరాడు

వ్రేలాడు.

జీరుకాడు

చూ. జీరాడు.

జీరుకుపాటు

తొట్రుపాటు.

జీరుకురాయి

జీరుకుబండ.

జీరులాడు

చూ. జీరాడు.

జీరువాఱు

జీరాడు.

జీఱుకువాఱు

జీఱు.

జీలుగు పెరిగిన మాలెకు కంబము గాదు

బలహీనమైనది ఒక పెద్దరక బలమైనపనికి పనికి రాదు. జీలుగు వట్టి బెండు. అది యెంతగా పెరిగినా యింటికి పెట్టుకొనుటకు స్తంభముగా పనికి రాదు.

"ప్రేలకు జీలుగు పెరిగిన, మాలెకు కంబంబు గాదు."

ఉ. హరి. 3.50.

"జీలువు పెరిగిన మాలెకంబము గాదు, గొడ్డుఁ బెంచిన జాతిగోవు కాదు."

నీతి. 70.

జీవగఱ్ఱ

1. ప్రాణాధారము.

"వలిమల యల్లువాఁడు తలవాఁక ధరించిన పూవుగుత్తి వేల్పుల గమి జీవగఱ్ఱ." పారి. 1.6.

"శ్రేయోవధూటికి జీవగఱ్ఱ."

విప్ర. 1.84.

2. శ్రుతిని హెచ్చించుటకో తగ్గించుటకో ఉపయోగించే వీణపై నున్న కఱ్ఱబిరడా.

"శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగ వలయుచోఁ, జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ."

క్రీడా. 1.36.

జీవచ్ఛవముగా

బతికి చచ్చినవానితో సమానముగా.

జీవనము పడగొట్టు

బతుకుతెరువు చెడగొట్టు.

"నా జీవనం పడగొట్టితే నీ కేం వస్తుంది?" వా.

**జీవనాధారము**
బ్రదుకుదెరువు, జీవనోపాయము.

**జీవన్ముక్తుడు**
బ్రతికి యుండగనే ముక్తిని చెందినవాడు.

**జీవన్మృతుడు**
బ్రతికి ఉన్నా చచ్చినవాని వంటి వాడు.

**జీవమాతృక**
సప్తమాతృకలలో ఒకతె.

**జీవము వచ్చు**
ప్రాణము లేచి వచ్చు.
"సమ్మతిఁ బ్రోవ నిందు, వచ్చితి గాన జీవము వచ్చె నాకు."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 2835-36.

**జీవశ్రాద్ధము**
ఘటశ్రాద్ధము.
కాళ. శత. 34.

**జీవితము ఏమిగా చేసి పోయెదవు?**
నా బ్రదుకు ఏం చేస్తావు? ఎవరినో పూర్తిగా నమ్మినపుడు అతడు దిగనాడగా అనుమాట.
"నా జీవితంబు, నేమిగాఁ జేసి పోయెద వెఱుఁగఁ జెపుము." కళా. 3.59.

**జీవితములు సేయు**
పని కల్పించు, జీతమునకు పెట్టుకొని వారికి జీవనం ఏర్పఱచు.
"తాఁ గాక మఱియు మేదరులు గొందఱను, జీవితంబులు సేసి చేటలు సాలఁ, గావించి బండ్లను గడపి యూరూర, నమ్మించి."
పండితా. ప్రథ. పురా. పు. 476.

**జీవితములో నిప్పులు పోయు**
బ్రతుకు పాడు చేయు.
'ఏమిరా ఎరగని ఆ పిల్లను చెఱిచి దాని జీవితంలో నిప్పులు పోశాడు వెధవ.'
వా.

**జుంజుఱుకట్టి**
వెలుతురుపుల్లలు వగైరాలతో చేసిన దివిటీ.
శ. ర.

**జుంజుఱుపిశాచము**
కొఱవిదయ్యము.
చంద్రా. 6.93.

**జుంటితేనె**
జుంటీగలు కూర్చిన తేనె.

**జుంటిమోవి**
జుంటి తేనెవంటి మధుర మైన ఓష్ఠం.

**జుంటీగ**
తేనెటీగ.

**జుజురుకొను**
దట్టమగు.
"జుజురుకొన్న తనూరుహస్తోమములను." కాశీ. 6.41.

**జుట్టనవ్రేల జూపు**
వేలెత్తి చూపు, తప్పు పట్టు.
"నరునకు నిన్ను జుట్టనవ్రేలనుం జూప వచ్చునే." భార. ద్రోణ. 2.304.

**జుట్టుపట్లు సిగపట్లు**
జగడములు.
"వాళ్లింట్లో పొద్దున్నుంచి సాయంత్రం వరకూ జుట్టుపట్లూ - సిగపట్లూ." వా.

**జుట్టులు ముడిపెట్టు**
వాళ్లకూ వీళ్లకూ తగాదాలు పెట్టి తమాషా చూచు.
"వాడి కా ఊళ్లో ఏం పని ? వాళ్ల వీళ్ల జుట్లు ముడిపెడుతూ కడుపు నించుకొంటూ ఉంటాడు." వా.
రూ. జుట్లు ముడి వేయు.

**జుణిగింత పెట్టు**
వెనుకకు లాగు.
పార్వ. 4.118.

**జుణిగి పోవ నిచ్చు**
తప్పించుకొని పోనిచ్చు, వెనుదీయు.
"పోకలఁ బోయినఁ బోని, మ్మోకరణిం జుణిఁగి పోవ నిత్తునె యింకన్." కళా. 2.86.
"నీ మన సింక లెస్స, చూచుక మాటాడు జుణిగి పోరాదు."
వర. రా. సుం. పు. 167. పంక్తి. 13.

**జునుగుటీత**
మునిగి ఈదే ఈత.

**జున్నుగడ్డ**
జున్నుపాలు కాచిన గడ్డ.

**జున్ను దిన్న యొట్టియవలె**
అపూర్వమైన దానిని అనుభవించిన వెనుక సామాన్యమైన వానిపై మనసు పోదనుపట్ల వాడేమాట.
తేనె తాగిన ఒంటెవలె అని వాచ్యార్థం.
బహుశా జున్ను (తేనె) తిన్న తర్వాత ఇక ఒంటె గడ్డి గాదం మేయ నుంకించదేమో! ఇదలా ఒంటె అలవాటుపై వచ్చినది.
"ఒరుఁ గవయదు జున్ను దిన్నయొట్టియ వోలెన్." కుమా. 8.160.

**జున్నుపాలు**
గేదె గానీ ఆవు గానీ యీనిన వెంటనే కొన్ని రోజులవరకూ వచ్చుపాలు.
కాచితే యిది గడ్డ కట్టుతుంది. అందులో చక్కెరో బెల్లమో కలుపుకొని తింటారు.
చూ. జున్నుబాలు.

**జున్నుబాలు**
ఆవు ఈనిన తర్వాత అయిదారు దినముల పాలు.
దీనిని కాచితే గడ్డ కడుతుంది. చక్కెరో బెల్లమో వేసి కాచి తింటారు.
చూ. జున్నుపాలు.

**జున్నుబిళ్ళ**
చూ. జున్నుగడ్డ.

**జున్నుబ్రాలు**
ధాన్యవిశేషం.

**జున్ను రేచిన రీతి**
తేనెతెట్టెను కదల్చినప్పుడు

తేనెటీగలు పేర్చినట్లుగా అనుట.

జున్నుని గుంపులు గుంపులుగా అయిటలు వెడలుపట్లు ఉపయోగించే సామ్యం.

"జున్ను కేచినరీతి సుర లెల్ల బెదరి, కన్నవారేగిరి కన్నగ్రోవలకు."
గౌర. హరి. ప్ర. 319-320.

**జుబురుకొను**

గుబురుకొను, గుంపు గట్టు.
రూ. జుజురుకొను.

**జుమ్మికాడు**

విటుడు.
రూ. జుమ్మకాడు.

**జుబ్బుపదనుగా**

జుబ్బుకొనుటకు వీలగునట్లు ద్రవముగా.

"పరిపాటి పై జుబ్బుపదను వండి."
హర. 2.121.

**జుబ్బు పదను చేయు**

జుబ్బుటకు వీలగునట్లు ద్రవభూతముగా చేయు.

"చంద్రకాంతపు నీట జాలైన వెన్నెల, ముదురు వెన్నెల జుబ్బు పదను చేసి."
పారి. 2.49.

**జుబ్బుకొను**

జుబ్బున త్రావు, చేతితో జుబ్బుకొను.

**జుబ్బున గ్రోలు.**

ధ్వన్యనుకరణము.

"పెక్కు వాసనల సొంపున నింపు జనింప జుబ్బువక, గ్రుక్కెడు గ్రుక్కెడే మధువు." కళా. 6.128.

**జులుము చేయు**

అధికారము చేయు, పెత్తనము చేయు.

**జూటకాడు**

నేర్పరి.

"పంతమాడినభంగిఁ బందుల నొప్పించు, జూటకాండ్రగునట్టి వేటకాండ్రు."
ద్వాద. 8.22.

**జూటాడు**

మోసగించు.
రా. వి. 3.52.

**జూటామాట**

అబద్ధము.

"...జూటామాట లనుచు నెంచితిరి గదా!" శ్రవ. 2.49.

**జూటుకత్తె**

వంచకురాలు, అబద్ధీకురాలు.

**జూటుడు**

అసత్యవాది.
వేంకటేశ. 9.

**జూదకత్తె**

వంచకురాలు, జూద మాడునది.

**జూదకాడు**

జూదరి.

**జూదరికత్తియ**

జూద మాడునది.

జూదరిధర్మము

నమ్మరానిది.

జూదగాని ధర్మప్రవచనము.

వా డెంత చెప్పినా మోసమే చేస్తాడు.

రాధి. 4.79.

జెండా పీకుకొని పోవు

కాపుర మెత్తివేయు.

కొత్త. 148.

జెండా పీక్కుని వెళ్లు

సంసారము నెత్తివేయు.

"వాడు ఆ ఊళ్ళో జండా పీక్కుని వెళ్లాడు." వా.

జెట్టానజెట్టు

జగజెట్టు.

భార. ఉద్యో. 4.425.

జెట్టిగవీరులు

జెట్టీలు, గట్టి వీరులు, మొనగాండ్లు.

కమా. 11.151.

జెట్టివాడు

మల్లుడు.

జెల్లకాయ

చెంపకాయ, లెంపకాయ.

జెల్ల కొడితే దమ్మిడీ లేదు

ఏ మాత్రం డబ్బు లే దనుట.

"నా దగ్గర జెల్ల కొడితే దమ్మిడీ లేదు. నన్ను పట్టుకొని ఏం చేస్తావు?" వా.

జెష్టవెధవ

ఒక తిట్టు.

దరిద్రపుగొట్టు అనుట.

జేగంట

1. చేతితో కొట్టు గంట.

ఒక త్రాటికి ఒక కంచు పళ్లెం వంటిది కట్టి, ఒక కఱ్ఱసుత్తెతో దానిని కొట్టి కాలమానాన్ని తెలియజేసేవారు. అది జేగంట.

"మును గడియారంబునం గట్టిన పెను జేగంటరవము తే యనునెడ."

సింహా. 2.5.

2. జయఘంట.

జేగురుపురువు

ఆరుద్రపురుగు.

జేగురించు

ఎఱ్ఱ నగు.

జేజే వెట్టు

జయజయధ్వనులు చేయు.

"రాజీవాక్షి కుమారుఁ గాంచె సుమనోరాజన్యమాన్యుల్ జనుల్, జేజే వెట్టఁ బ్రసూనవర్ష మమరశ్రేణుల్ ప్రవర్షింపఁగన్." మను. 4.5.

జేనెంట

ప్రతి జేనెడు నేలకూ (జేన+వెంట.)

పండితా. ద్వితీ. పర్వ. పుట. 480.

జే పరమేశా అను

పారిపోవు.

"దుర్భర పాండిత్యముఁ జూచి దీని దశకుఁ దాఁ బోలు నీయయ్య జే, పరమేశా! యనిపింపఁగావలదె విప్రస్వామి నంచుఁ మదిన్." నిరం. 2.125.

చూ. జా పరమేశ్వరా అను.

జే పెట్టు
స్తుతించు.
ఉ త్త. రా. 1.144.

జేబుదొంగ •
జేబులలో ఉన్న వాటిని తెలియకుండా కొట్టివేసే వాడు.
"పట్నంలో జేబుదొంగలెక్కువ. కాస్త జాగ్రత్తగా లేకపోతే జేబు ఖాళీ అవుతుంది." వా.

జేబులు కత్తిరించు
జేబులో ఉన్న వాటిని దొంగి లించు.

జేబులు ఖాళీ అగు
ఉన్న డబ్బంతా అయిపోవు.
"పట్నం వెళ్లి వచ్చేసరికి జేబులు ఖాళీ అయిపోయాయి." వా.

జేబులు నింపుకొను
డబ్బు సంపాదించుకొను.
ఆ సంపాదన అన్యాయార్జితం అన్న సూచన కూడా ఇందులో ఉంది.
"వా డాకంపెనీ పేరు చెప్పి జేబులు నింపుకోవడం తప్పితే చేస్తున్న పనేమిటి ?" వా.

జేబులో వేసుకొను
వశము చేసుకొను.
ఆ వశము చేసుకొనుట క్రమము కాదన్న ధ్వని కూడా యిందులో ఉంది.
"ఆ పత్రాణ్ణి కాస్తా జేబులో వేసుకొని, వీడు స్వేచ్ఛగా ఆ ఆస్తి నంతా కరగ దింటున్నాడు." వా.

జేరుగళ్లు
కోటలలో ఫిరంగులు కాల్చుటకై చేసిన కుడ్యరంధ్రములు.

జేరుబండు
చుబుకు.

జేవృజుగండ్లు
చూ. జేపగళ్లు.

జేవృజుజపు
చూ. జేగురుపురువు.

జేష్టరయితు
పెద్దరైతు.
కాశీయా. 229.

జైత్రయాత్ర వెడలు
విజయయాత్ర వెళ్లు.
దిగ్విజయానికి బయలుదేరు.

జొటజొట (వడియు)
ధ్వన్యనుకరణము.
"అగ్గికాఁక యించుక యిడినక్, జిడు గజ్జల గ్రుచ్చిన నం,జుడు మంటలఁ దగిలి నెయ్యి జొటజొట వడియుక్." మను. 4.19.

జొత్తుకొను
దట్టమగు, గట్టిపడు.
పద్మ. 9.187.

జొత్తుపాప
నెత్తురుకందు.
అప్పుడే పుట్టినబిడ్డ నెత్తురు ముద్ద అనుట అలవాటు కూడ.

"...తుటం దడిసి జొత్తుపాపలవిధం
బున నొత్తొత్తుల నలసి."
జై మి. 2.75.

"జొత్తుపాప యనఁ బొల్పగు దేహము."
సారం. 3.115.

"వడసినకన్నీరు వడియు నెత్తురులఁ,
దడిసిన ఆవికలుఁ దాము చూపఱకు,
జొత్తుపాపలఁ బోలె శోకంబు నిగుడ."
గౌర. హరి. ప్ర. 1043-1046.

**జొత్తు లెగయు**

జుట్లు రేగు.

"నడితలల జొత్తు లెగయ మొత్తిన..." భాస్క. అర. 2.135.

**జొత్తు వెట్టు**

నఱకు, ఖండించు.
మైరా. 1.86.

**జొన్న బడు గుడ్డియెద్దువలె**

ముందూ వెనుకా చూడకుండా, స్వేచ్ఛగా.
కుక్కు. 35.

చూ. గుడ్డియెద్దు చేలో బడ్డట్టు.

**జొన్నలు గొన్న ఋణము**

పోషితు డయినందువలన కలిగిన ఋణము. ఉప్పు తిన్న ఋణం వంటి మాట.

"కేల్లలన జొన్నలు గొన్న ఋణంబు నీఁగుదున్." కుమా. 11.42.

చూ. ఉప్పు తిన్న ఋణము.

**జొఱజొఱ రాలు**

మిణుగురులు లాంటివి రాలుటలో...ధ్వన్యనుకరణము.

**జొఱీగ**

జోఱీగ.

**జోక చేయు**

1. సన్నద్ధము చేయు.

"మహారథుండు పైనంబు జోక చేసుక."
వర. రా. బా. పు. 208. పంక్తి. 24.

2. సాగు చేయు, బాగు చేయు.

"ఆ యెకరా నేలా సరిగా జోక చేసుకుంటే మా కుటుంబాని కేం ఢోకా లేదు." వా.

3. పోల్చు.

4. సమకూర్చు.

"నీ వేవిధంబున మా విత్తము జోక చేసెదవు." హరిశ్చ. 3.30.

**జోకపడు**

జతపడు.
శ. ర.

**జోకపఱుచు**

జత చేయు, కలిగించు, కావించు.

**జోకలు గట్టు**

మొత్తము లగు, గుంపు కట్టు.

**జోకొట్టు**

1. చిన్న పిల్లలను పడుకొనబెట్టి చేతితో తడుతూ నిద్రపుచ్చు.

"లోకములు నిదుర వోవఁగ, జోకొట్టుచు నిదుర వోనిసుభగుఁడు రమణుల్, జోకొట్టి పాడ నిదురం, గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱవక యున్." భాగ. పూ. 10.193.

2. గెలుచు.

కాశీ. 7.95.

3. మోసగించు.

కవిక. 4.77.

**జోగపట్టియ**

యోగపట్టము.

**జోగరగండ**

స్త్రీపురుషులను కూర్చువాడు, చిత్తైకాగ్రతను చెడచువాడు.

**జోజో**

జోకొట్టుటలో అనుపూట.

**జోటిపని**

మిథునకర్మ.

**జోడుకోడె**

1. సరికోడె, జతకాడు.

"అమరుల బోన పుట్టిక సహస్ర మయూఖుని జోడుకోడె సం,తమసము వేరు విత్తు కుముదంబుల చక్కిలిగింత పుంశ్చలీ, సమితికిఁ జుక్కవాలు."

పారి. 2.41.

2. సమానుడు.

అతనికి ఇతడు జోడుకోడె. బండికి కానీ, కాడికి కానీ కట్టే ఎద్దులు రెండూ సమానంగా ఉండుట పై వచ్చిన పలుకుబడి.

"వాళ్లిద్దరూ జోడుకోడెల్లా పోట్లాడుకొన్నారు."

వా.

**జోడు గట్టు**

జతకట్టు.

నిరం. 3.20.

**జోడు గూడు**

జత కలియు.

**జోడు గూర్చు**

జత కలుపు.

**జోడు దటియు**

కలియు.

"తనరు మాతంగ కుంభ సుస్తనుల జోడు, పటియఁ జాల దురాగతత్వ మునఁజేసి."

హ. వ. 261.

**జోడుబాలు**

ఒక ఆట.

హంస. 3.146.

**జోడు వుచ్చినవాడు**

కవచహీనుడు.

"జోడు వుచ్చినవానిని గెదువఁ బెట్టిన వానిని."

భార. భీష్మ. 3.303.

**జోపాన మగు**

అలసిపోవు.

"తేరుఁ ద్రిప్పెదను, జోపాన మయ్యె దేజులు."

వర. రా. యు. పు. 436. పంక్తి. 10.

**జోపాప లగు**

చంటిపిల్లలవంటి వగు.

"గెలికి హరి వైవఁ గేలఁ దాలిచిన సం, పఁగి బంతికొనల జోపాప లగుచు."

ఉ. హరి. 1.151.

**జోబిళ్లు**

నమస్కారం.

హంస. 4.213.

**జోటీగ**

ఒకరకమైన యీగ, పసుమక్షిక.

**జోఱుటీగ**

చూ. జోటీగ.

**జోలపాట**

పిల్లలను ఊచుతూ పాడే పాట.

**జోల పాడు**

జోలపాట పాడు.

**జోలికూడు**

శిశ్వాన్నము.

పాండవా. 11.

**జోలి త్రవ్వు**

అనవసరమైన విషయాలలో జోక్యము కలిగించుకొను.

వాడుకలో—

ఒకరి జోలి నీ కెందుకు?—వాని జోలి నీ కెందుకు? నీ సంగతి నీవు చూచుకో – వాడు ఒకరి జోలికి రాడు – అనురీతిగా వ్యవహారం. ఇది జంటపదంగా కూడా 'జోలి-శొంఠి' అని వ్యవహరిస్తారు.

"ఆయివారములకై డాయువారలతోడ, జోలి త్రవ్వుచుఁ బెక్కు సుద్దు లాడు."

శుక. 2.172.

"అనఘ! వేశ్యావిడంబ వర్తనము లెన్న, నిసుకపాతఱ యాజోలి యేల త్రవ్వ."

(తె. జా.)

**జోలి యెఱిగించు**

సంగతి చెప్పు.

"తొల్వేలుపు వేలిమి సెఱిచిన, జోలి యొఱింగించి." అచ్చ. యుద్ధ. 458.

**జోలెకాడు**

భిక్షుకుడు.

**జో సఱచు**

జోకొట్టు, చిన్న పిల్లలను పడుకొనబెట్టి చేతితో తడుతూ నిద్రపుచ్చు.

"జో సఱచుచు సన్నుతిఁ బాడు."

బస. 3.59.

చూ. జోకొట్టు.

**జోస్యము చెప్పు**

భవిష్యత్తును జ్యోతిశ్శాస్త్ర రీత్యా చెప్పు.

**జౌజవ్వు**

ధ్వన్యనుకరణము.

**జౌరుకొను**

జవురుకొను, చేతులతో తీసుకొను.

రూ. జవురుకొను.

**జ్ఞాతివైరము**

దాయాదుల పగ.

చూ. దాయాదిపోరు.

**జ్వరము కాయు**

జ్వరము వచ్చు.

"రెండు రోజులుగా వాడికి జ్వరం కాస్తూ ఉంది." వా.

**జ్వరము వచ్చు**

జ్వరము కాయు.

"పది రోజులనుంచీ జ్వరం వస్తూ ఉంది. అందువలన ఎక్కడికీ రాలేదు." వా.

**ఝుంఝూమారుతంగా సాగు**

నిరర్గళంగా, జగన్మోహనంగా.

"వాని మాట కేంకి ఝుంఝూమారు తంగా సాగుతూ ఉంది." వా.

**ఝణఝణత్కారము**
ధ్వన్యనుకరణము.

**ఝణఝణ మ్రోయు**
కంకణాదులు ధ్వని చేయు.
ధ్వన్యనుకరణము.

**ఝణత్కారము**
ధ్వన్యనుకరణము.

**ఝమ్మ ఝమ్మను**
ధ్వన్యనుకరణము.
కుమా. 11.155.

**ఝల్లను**
(ప్రాణములో, గుండెలో) దిగులుపడు.
ధ్వన్యనుకరణము.

**ఝళంఝళ**
ఝణఝణవంటి మాట.
ధ్వన్యనుకరణము.

**ఝళజళ**
ధ్వన్యనుకరణము.

**ఝళఝళ**
ధ్వన్యనుకరణము.

**ఝూడించి నిలుచు**
నిక్కబొడుచుకొను.
"ఝూడించి నిలిచిన స్తబ్ధరోమములచే, బ్రహ్మాండములు తూంట్లు బానలుగను." రాజగో. 5.36.

**ఝూడించు**
తిట్టు.
"వాడు కనిపిస్తే నాలుగు ఝూడించి పంపుదామని ఉంది." వా.

**ఝూళి వేయు**
జాడించి వేయు.
ఝాడించి అని కూడా కొక్కి చెప్పటంలో అంటారు.
"కడిది మావంతుని బడ ఝూళి వేసి." జైమి. 4.93. ప్రట.

**ఝోరు ఝోరున**
ధ్వన్యనుకరణము.
"ఝోరు ఝోరున వారుణా సార మడరె." హంస. 5.50.

**ఞ ఞ ఞ అను**
నంగినంగిగా మాట్లాడు.
"అలా ఞ ఞ ఞ అంటూ నేరా, అదేదో సరిగా ఏడ్చు." వా.

**టంకపుపొడిలా అతుకు**
పొందికగా కుదురు.
బంగారం వెండి వస్తువులను టంకం పొడితో అతుకుట అలవాటు. దానిపై వచ్చిన పలుకుబడి.
"వాడేమి మాట్లాడినా టంకపు పొడిలా అతుకుతుంది." వా.

**టంకముపుల్లి**
కంచరి సాధనము.

**టంకవాటు**
అలనాటి ఒక నాణెము.

**టంకసాల**
నాణెములు ముద్రించే చోటు.

**టంకసాల వాటు**
అలనాటి బంగారునాణెము.

**టంగు (లు) తెగు**
పని అయిపోవు.
"ఆ కొండ యెక్కేసరికి నా టంగులు తెగిపోయాయి." వా.

**టంగున కొడదామంటే దమ్మిడీ లేదు**
బొత్తిగా డబ్బు లేదనుట.

**టంగువారు**
జీనుకు కట్టే పట్టెడ.

**టకటక**
1. కటకట, దైన్యము.
భాస్కర. 96.
2. నడచుటలో ధ్వన్యనుకరణము.
"టకటకా నడచి వస్తున్న ఆవిడెవరు?" వా.

**టకటొంకులు**
మోసములు.
గీత. 18.
రూ. టకటంకులు.

**టక్కరి పూటతాటలు చేయు**
అబద్ధపుపూటలు పెట్టు.
"టక్కరి పూటతాటలు చేసి ధనము, చక్కనగైకొని."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 64. 42.
చూ. పూటపడు.

**టక్కు టమారము చేయు**
మోసము చేయు.
"వాడేదో టక్కుటమారం చేసి ఒక గారమిద్దె కట్టించాడు." వా.

**టక్కు పెట్టు**
మాయ చేయు.
"మబ్బునఁ డక్కుపెట్టి తుచ్ఛాంగన రథ్య వేఁగ..." వేం. పంచ. 1.246.

**టక్కులాడు**
దుర్మార్గుడు, అబద్ధికుడు.

**టముకు వేయు**
దండోరా వేయు, చాటించు.

**టలాయించు**
ఏదో ఒకటి చెప్పి తప్పించుకొను.
"ఇదిగో యిస్తాను అదిగో యిస్తాను అని చెప్పి నాలుగురోజులనుంచీ టలాయిస్తున్నాడు." వా.

**టస్సా దించి వేయు**
తిప్ప వేయు.

**టాకొలు తెగు**
లావగు.

**టాటాలు గుణించు**
కోతలు కోయు.
"కోటికిఁ బడగెత్తి టాటాలు గుణియింప, నే నేర్తు మఱియును నేనె నేర్తు." విప్రనా. 1.29.
"......బళా మంచివాఁడవె పోపో వేటొకచోటు గానవె కదా టాటాల్ గుణించంగ నీ....."
ప్రబంధరా. 748.
రూ. టాటాలు గుణియించు.

**టాటోటుకాడు**
మోసగాడు.
శ. ర.

**టాలాటోలీమాటలు**
మోసపు మాటలు, అబద్ధములు.

"వాడి వన్నీ టాలాటోటీ మాటలు. వాణ్ణి నమ్మితే ముంచేస్తాడు." వా.

**టింగున మీటు**

ధ్వన్యనుకరణము.
దశా. 4.119.

**టింగు రంగా అని**

స్వేచ్ఛగా, తన కేమి అన్న ధీమాతో.

"దిటము మదిలోన నూని యచ్చటుల నేత్ర, టింగు రంగా యటంచు నింటికిని జనియె." శ్రవ. 4.107.

**టెంకాయపాలు**

టెంకాయనీళ్లు.

**టెంకాయ పిచ్చికొండ అను**

భయభ్రాంతు డగు.

సభాకంపంతో ఒక పండితుడు రాజు దగ్గరకు టెంకాయ తీసుకొని పోయి, భయపడి మాటలు తడబడి టెంకాయ పిచ్చికొండ అన్నాడని ఒక కథ.

"టెంకాయ పిచ్చికొం డనగ వలయుం." గీర. 30.

**టెంకి పెట్టుకొను**

ఉనికిపట్టు కావించుకొను.

"వేంకటాచలంబు వంకం టెంకి పెట్టుకొని." కా. మా. 3.46.

**టెక్కులకత్తె**

విలాసవతి.

ఇందులో నిరసన కలదు.

**టెక్కులాడి**

చూ. టెక్కులకత్తె.

**టెక్కులాడు**

టెక్కులు పోవువాడు.

**టెక్కులు పోవు**

జంభాలకు పోవు.

**టెక్కె మెగురగొట్టు**

మరణించు.

వెంక. మాన. 56.

**టొకాయించి మాటలాడు**

తిరుగబడు, ఎదిరించు.

**టోకరా వేయు**

మోసగించు.

"ఇదిగో ఇస్తా నని పది రూపాయలు తీసుకపోయి టోకరా వేశాడు." వా.

**టో కిచ్చు**

మల్లురు భుజాలు తాకించు.

చంద్రా. 4. 211.

**టోకువ్యాపారం**

పెద్ద ఎత్తున జరిపే వ్యాపారం - చిల్లరది కాదు.

**టోపీదాసు**

మోసగాడు.

**టోపీ పడు**

మోసపోవు.

"వాడి మాటలు విని టోపీ పడ్డాను. వెయ్యి రూపాయలు గంగలో కలిసి పోయాయి." వా.

**టోపీ పెట్టు**

మోసగించు.

మాటూ. 65.

**టోపీ వేయు**

మోసగించు.

"అవీ యివీ చెప్పి వాణ్ణి యెలాగో టోపీ వేశాడు." వా.

"వాడికి ఎలాగో టోపీవేసి ఆతడి ఆస్తి అంతా కాజేసినాడు." వా.

## టోపీ వ్యవహారం

దగుల్బాజీ వ్యవహారం.

"వీడు బంగారు చేస్తా ననడం, శిష్యులను చేర్చడం యిదంతా చూస్తే ఇదేదో టోపీవ్యవహారంగా ఉంది." వా.

## ఠంగు ఠంగను

ధ్వన్యనుకరణము.
కళా. 8.109.

## ఠంచనగా

సరిగ్గా.
కొత్త. 280.

## ఠవఠవ పడు

చింతపడు.

"ఠరఠవపడ నేటికి మది, శివగోచర నీవు నన్నుఁ జెంచొకఁడు శ్రుతి, వ్యవహారే తరమతమునఁ, దవిలి మహాభక్తిఁ గొలువ దయ పుట్టుటయుఁ." 
కాళ. 3.107.

## ఠవఠవ లేక

1. శ్రమ లేక.

"ఠవఠవ లే కరుగుదుము హుటాహుటి నడలన్."
మను. 1.76.

2. జంకుకొంకు లేక.

"ఠవఠవ క్రొత్త క్రొత్త యగుటం జని యించెను నీవు నేఁడు."
వేం. పంచ. 4.576.

## ఠస్సా చెప్పు

టిష్ఠ వేయు.

## ఠావుకొను

నెలకొను.

"పావనిముందర మశకము, రావణుఁడన నెంత పట్టి రాచఁగ లేఁడే, దేవుని కీర్తి జగత్త్రయి, ఠావుకొనఁగ నూరకుండుటయ కాక యనిన్."
సమీర. 4.34.

## ఠేవిణీ వేయు

టిష్ఠ వేయు.

"ఆస్వాములవారు పక్క ఊళ్లో ఠేవిణీ వేశా రని తెలిసింది." వా.

## డంగయి పోవు

విభ్రాంతు డగు, బిత్తరపోవు.

"ఆ బంగళా, నిలువెత్తు సోఫాలూ అవీ చూచేసరికి మనవాడు డంగయి పోయాడు." వా.

## డంగుబ్రాలు

తెల్లగా నలిగిన బియ్యము.
దంపుడు బియ్యము.
శ. ర.

## డంగోరా వేయు

దండోరా వేయు.

"ఆవిడకు ఏం తెలిసినా ఊరంతా డంగోరా వేసి వస్తుంది." వా.

## డంబు సూపు

దర్పము చూపు.

"మనుజకోటి కరోటి మాలికాభసితచర్మాంబరంబులు మేన డంబు సూప." శుక. 1.330.

## డక్కించుకొను

కాపాడుకొను.
అచ్చ. సుం. 146.

డగ్గుత్తిక పడు

గద్గదస్వరము కలుగు.

"కూఁతు సెడఁబాయు వగల డగుత్తి వడఁగ." కాళిం. 3.205.

డగ్గుత్తిక వేట్టు

గద్గదస్వను డగు.

"నిట్టూర్పు నిగుడించి డగ్గుత్తిక వెట్టి." భార. కర్ణ. 1.8.

డగ్గుత్తిక వెట్టుకొను

గద్గదిక యేర్పరుచుకొను.

"అని డగ్గుత్తిక వెట్టుకొంచు ఘన పత్న్యంతర్నిరుద్ధాశ్రుఁడై." కళా. 7.97.

డగ్గుపడు

గాద్గద్యము నొందు.

"డగ్గుపడుకుత్తుకలన్." శ్రీరం. 2.251.

డచ్చీలు కొట్టు

డంబాచారములు పలుకు.

"వాడు పొద్దున్నుంచీ సాయంత్రం వరకూ డచ్చీలు కొట్టడంతో సరిపో తుంది." వా.

డప్పిగొను

1. డస్సిపోవు. భార. అర. 7.240.

2. దాహము చెందు. నైష. 8.177.

డప్పి చెందు

తగ్గిపోవు, క్షీణించు. భార. శాం. 1.52.

డప్పులు కొట్టు

డంబాచారములు పలుకు.

డబ్బా డవాల్ బిగించు

సన్నద్ధు డగు. శ్రీరంగే. శ. 22.

డబ్బా వాయించు

విపరీతంగా పొగడు.

"నాఁకూ డబ్బా వాయించే వాళ్లు ఉంటే ఈ పాటికి నేనూ గొప్పవాణ్ని కాక పోయానా?" వా.

డబ్బుకసాల

డబ్బు ఇబ్బంది.

రాయలసీమలో ఇది యెక్కు వగా వాడుకలో ఉన్నది.

"ఈ మధ్య డబ్బు కసాలా ఎక్కు వయింది." వా.

డబ్బు డుబ్బు

ధ్వన్యనుకరణము.

డబ్బూ దసకం

ధనము. జం.

"డబ్బూ దసకం యేమైనా తెచ్చా వా? వట్టి మాటలేనా?" వా.

డయ్యక క్రుయ్యక

అలపూ సొలపూ లేక.

"......కేతు దండఖండన మొన రించుచుం బెనఁగె డయ్యక క్రుయ్య కతండు గండునన్." భార. కర్ణ. 3.169.

డయ్యబాఱు

అలసిపోవు. విక్ర. 5.139.

డవులుకాడు

మహా డంబాచారపు మనిషి, అందగాడు.

**డస్సి దట్టమగు**

చచ్చినంత పని యగు.

బాగా అలసిపోయా ననుట.

"డప్పిఁ గుందితి డస్సి దట్టంబు నైతి."
కాశీ. 6.44.

దట్టం అంటే కళేబరం. ముఖ్యంగా ఎద్దులూ, ఆవులూ, గేదెలూ విషయంలో నేటికీ, ఆ చర్మం ఒలిచి శుభ్రపరిచే జాతుల వారు ఉపయోగించడం బాగా వినిపిస్తుంది – ముఖ్యంగా రాయలసీమలో.

"ఒరే! రామిగా! పోలిరెడ్డిగారింట్లో దట్టం మోసుక రావాలి రా." వా.

**డాకలు**

బండిచక్రం.

**డాకొను**

డాగు.

సిద్ధపడు, తగులుకొను ఇత్యాది భావచ్ఛాయలలో వినవచ్చే మాట.

**డాకొలుపు**

దగ్గఱకు రప్పించు.

**డాగనమ్రుచ్చిళ్ళు**

దాగుడుమూతలు – ఆట.

**డాగనమ్రుచ్చులు**

చూ. డాగనమ్రుచ్చిళ్ళు.

**డాగికొను**

దాగు.

**డాగిలిమూతలు**

చూ. డాగనమ్రుచ్చిళ్ళు.

**డాగిలిమ్రుచ్చు లాడు**

దాగిలిమూత లాడు.

"ఏనుఁగు పీనుఁగుల డొక్కలలోఁ జిక్కి డాఁగిలిమ్రుచ్చు లాడుచయ్యం పుఁ దొయ్యలులు..."
కా. మా. 2.63.

**డాగిలిమ్రుచ్చులు**

చూ. డాగిలిమూతలు.

**డాగి సేయు**

కాలయాపనము చేయు.

"చనునే పెండిలి డాఁగి సేయ."
శ్రీరాధా. 3.109.

**డాగుడుమూతలు**

చూ. డాగిలిమూతలు.

**డాగురుమూతలు**

చూ. డాగుడుమూతలు.

**డాచినట్టరుగు**

ఏదైనా తప్పక తనకు అక్కడే దొరుకును అన్న ధైర్యంతో వెళ్లినప్పుడు ఉపయోగించే పలుకుబడి.

"ఒక్కఁ డడుగత్తి గొఱక పేయుచును డాఁచి, నట్టరిగి పెంకిఁ గని పీఁకఁ బట్టుటయును." మను. 4.48.

పూర్వం ధనాదులను గోతిలో పూడ్చి పెట్టడం అలవాటు. ఆ పూడ్చిపెట్టినవాడు దాని దగ్గఱకు వెళ్లినరీతిగా అనుట.

"నీ అబ్బగంటు నాదగ్గర దాచిపెట్టి నట్టుగా వచ్చి అడుగుతున్నా వేంది?"
వా.

డాచేయి

ఎడమచేయి, దాపలచేయి.

"అలరారు డాచేత నజాకపాలంబు."

పండితా. ప్రథ. వాద. పుట. 617.

డా చేయు

ఊనుకొను.

"లచ్చి నిట్టలపుంజన్నవఁ బోలు మున్నొ రగు మున్ డాచేసి..."

పాండు. 3.160.

డాబు చేయు

1. దర్పము చూపు.

2. మోసగించు.

వేమన.

డింక వేయు

మునక వేయు, చచ్చు.

నేడు డింకీకొట్టు అనేరూపం లోనే యిది కానవస్తుంది.

ఆంధ్రభాషార్ణవము.

డింకా కొట్టు

శ. ర.

చూ. డింక వేయు.

డింకీ కొట్టు

తలక్రిందు లగు, చచ్చు.

"వాడు ఆ చట్టా వ్యాపారంలో దిగి డింకీ కొట్టాడు." వా.

"వాడు దేశంమీద పోయి అప్పుడే యిరవై యేళ్లయింది. అక్కడే యెక్కడో డింకీ కొట్టి ఉంటాడు." వా.

డించి పోవు

దిగవిడిచి పోవు.

"అతి దుఃఖాన్విత డించి పోవఁ దగవా శ్రీ" హర. 3.86.

డిందబడు

క్రిందు పడు. మునుగు.

"దుఃఖాబ్ధి సంగన డిందంబడి వంది."

కుమా. 11.58.

డిందుపడు

1. ఉగులుపడు.

2. తగ్గు.

"దిక్పాలకాదుల డెందంబులు డిందు పడి." భాగ. స్క. 6.282.

డిందు పఱచుకొను

తగ్గించుకొను.

"సంతాపంబు డిందు పఱచుకొని."

భీమ. 3.4.

డిందుపాటు

మనస్థిమితం.

విక్ర. 3.106.

డిగద్రావు

1. అణచి వేయు.

2. విడిచిపెట్టు.

డిగబడు

వ్రేలాడు, కూలు.

డిగువడు

తగ్గు; శాంతించు.

"అనేకవిధంబుల నతని యాగ్రహంబు డిగువడఁ జెప్పి."

భాస్క. అర. 259.

డిగ్గ జాఱు

దిగజాఱు.

డిగ్గ దాటు

కిందికి దుముకు.

డిగ్గ ద్రావు
చూ. డిగద్రావు.

డిగ్గన
తటాలున.

డిగ్గున
చూ. డిగ్గన.

డిగ్గుపడు
న్యూన మగు.
"చుక్కల సోయగంబు ముత్యాల బెడంగు డిగ్గు పడునట్లుగఁ జేసిన బాగ పుంబలీ." యయా. 4.163.

డిప్పకాయ
1. అల్లరివాడు, శుంఠ.
2. ఊరగాయ.

డిప్పకాయ కొట్టు
తలపై కొట్టు.

డిబ్బు డిబ్బను
ధ్వన్యనుకరణము.
కుమా. 11.155.

డిల్ల గుడుచు
భయపడు.
"అయిన నిట్టి మాట యూవెలందుక రొద్ద, ననిన డిల్ల గుడుచు నట్లు గాన." కాళింది. 2.120.

డిల్ల చెడు
అధైర్యపడు.
"కంభిని పణ మూఁదికొని డిల్ల చెడి నట్లు, పరవశ గతి రుగ్ణకరణి నుండ." ఇందు. 4.37.

డిల్లపడు
డీలాపడు.
"మనో౽జున కెర యిచ్చి డిల్లపడ." కవిక. 3.99.

డిల్లపాటు
అధైర్యము.

డిల్లపోవు
అధైర్యపడు.
"ఉరుకుచాద్రుల నంట నూహించు నూహించి, క్రేళ్లు మలంగిన డిల్లపోవు." సాంబో. 1.70.

డివుడివ్వులు లిఖించు
అనుకరించు.
"వృథా, డివుడివ్వుల్ లిఖియింప నేల?" కల. 36.

డీకొను
పూనుకొను, ఎదుర్కొను.

డీకొలుపు
ప్రేరేపించు, కలుపు.
రూ. డీకొల్పు.

డీ డికుక్కలాడు
1. ఒకదానితో ఒకటి కొట్టుకొను.
2. పిల్లలు ఆడే ఆట – తలకు తల డీ కొడతారు.

డీలాపడు
నష్టపడి చితికిపోవు.
"వాడు వ్యాపారంలో నష్టం వచ్చి డీలా పడిపోయాడు పాపం!" వా.

డీలు పడు
బలహీన పడు, వ్యర్థ మగు, బాధపడు.

**డీలు పడుచు**
తక్కువపడుచు.

**డీలుపాటు**
బలహీనత.

**డీలు సేయు**
తగ్గించు.

**డుబుడక్కవాడు**
బుడబుడక్కలవాడు.

**డుఱ్ఱుచ్చి**
యుద్ధానికి పిలుచుటలో పశువుల నదిలించుటలో - మాట.

**డులడుల**
రాలుటలో ధ్వన్యనుకరణము.

**డూడూ బసవన్న**
అన్నిటికీ తల ఊపువాడు.
"పతిగింజలు తింటావా బసవన్నా అంటే డూడూ అన్నాడట." సా.
"వాడు వట్టి డూడూ బసవన్న. వాళ్ల నాన్న నడిగితేనే పోతుంది." వా.

**డెందము కందఁ జేయు**
మనసు నొప్పించు.
"ఆత్మబోధ నిష్ఠం దప మాచరించు ముని సంహతి డెందము గందఁజేయుచుఁ." కా. మా. 2.27.

**డెందము కరగు**
1. హృదయము ద్రవించు.
"బిగియారం గౌఁగిలించుకొని కరంగిన డెందంబుల రెంటి నొక్కటిగ నతికించుపోలిక." పారి. 2.53.
2. మనసు వచ్చు - ఇష్టపడు.
"ఊఁ, డిగ నిటు నటు చేయ నతని డెందము గరఁగుఁ." కళా. 4.69.

**డెందము డిందుపఱచుకొను**
మనసు దిటవు చేసుకొను.
"తదనంతరంబ డెందంబు డిందు పఱచుకొని ధైర్యబలంబునఁ గంఠగద్గదిక వారించుచు..." కళా. 3.102.

**డెందముముల్లు**
హృదయశల్యము.
"ముల్లోకములకు డెందము, ముల్లగు దశకంఠుతోడి ప్రముచ్చుల రగుటఁ." భాస్క. యుద్ధ. 313.
చూ. గుండెగాలము.

**డెందములోని కొఱ్ఱు**
భాస్క. యుద్ధ. 246.
చూ. డెందముముల్లు.

**డెందాన చేయిడి నిద్రపోవు**
నిశ్చింతగా నిద్రపోవు.
"నృపతి డెందానఁ జేయిడి నిద్ర పోవు." ఆము. 4.261.
చూ. రొమ్మున చేయిడి నిద్రపోవు.

**డెబ్బదిపదకొండు**
అనేకం.
"పుటకు డెబ్బది పదకొండు తొటుకు లుంకు." శ్రవ. 1.11.

**డెబ్బై పదకొండు**
చూ. డెబ్బది పదకొండు.

**డేగకళ్లు**
నిశితదృష్టి.
జగ. 111.

**దేగపదనుగ**

అరకొరగా; మితముగా.

"దేగపదనుగ భోజనము సేసి."

సారం. 1.78.

**దేగాట**

పెండ్లిలో అయిదవనాడు వధూవరులను ఎత్తుకొని ఆడే ఆట.

"జంపతుల కైన దేగాట సమయమందు."

బుద్ధ. 3.102.

**దేరా ఎత్తివేయు**

ఆ యూరినుండి వలసపోవు.

"వాడెప్పుడో యీ ఊరినుండి దేరా యెత్తేశాడు." వా.

చూ. గుడారమెత్తివేయు.

**డొంకతిరుగుడు**

సూటిగా చెప్పక అటూ యిటూ తిప్పి తిప్పి మాట్లాడు పట్లా, సూటి కాని దారి మొదలగువాని పట్లా విశేషంగా ఉపయోగిస్తారు.

"వాడు అడిగిన ప్రశ్నకు సూటిగా సమాధానం ఛస్తే చెప్పడు. ఆ డొంక తిరుగుడు మాటల్లో వాడేం చెప్తున్నాడో కూడా తెలియదు." వా.

"గుంటకల్లునుంచి బొంబాయి మెయిలెక్కి సేరుగా మదరాసు చేరక పాకాలమీద ఎందుకు పోవడం? డొంక తిరుగుడు దారిలో చేరడానికి మూడు నాళ్లు పట్టుతుంది." వా.

**డొంకలు దూరు**

అల్పకార్యములకు పూను.

జగన్నా. 17.

**డొంగియాడు**

దోగాడు.

సారం. 1.49.

**డొంగులువాఱు**

తొట్రు లేర్పడు.

**డొకారము చొచ్చు**

శరణు చొచ్చు.

"కరుణను బ్రోవమంచని డొకారము సొచ్చెను నాఁగ."

పార్వ. 5.207.

"గరగరి మాని యొక్కట డొకారము సొచ్చు మహాద్రులో యనన్."

చంద్రా. 1.13.

వావిళ్ల. ని. లో లోపల ప్రకాశించు అనే అర్థ మొకటి యిచ్చి ఇందలి తొలి ప్రయోగ మిచ్చారు. శరణు సొచ్చు అనుటే సరి.

**డొక్క చీల్చి డోలు కట్టు**

తిట్టు.

కొట్లాటల్లో ఉపయోగించే మాట.

"నీవీ వీధిలో ఇంకోసారి కనబడ్డావంటే డొక్క చీల్చి డోలు కడతాను జాగ్రత్త పెధవా!" వా.

**డొక్క జేనెడు గాదే**

కడుపు చిన్నది కాదు కదా! అనుట.

ఇంత కడుపు పెట్టుకొని ఊరక కూర్చున్న ఎట్లు అనుసందర్భములోని పలుకుబడి.

కడుపు చిన్నదే కదా – ఇందు కోసం ఇన్ని పాపాలా? అనీ అవుతుంది.

"అకటా!, బగ్గన మండెడు నీకును, సి గ్గించుక లేదు డొక్క జేనెడు గాదే!" శుక. 3.277.

**డొక్కబుఱ్ఱ**

తేగ పాటి వీడిన తాటివిత్తు.

శ. ర.

**డొక్కలో పెట్టుకొను**

చూ. కడుపులో పెట్టుకొను.

**డొక్కలో మెదలు**

మరచిపోని దురుసుమాటలు అనినప్పుడు అవి మరచిపో లేకున్నాను అను పట్ల ఉపయోగించే మాట.

"వా డా రోజు అన్నమాటలు డొక్కలో మెదులుతున్నాయి. చచ్చినా మరిచిపోలేను." వా.

**డొక్కశుద్ధి ఉన్న....**

చదువుకొన్న . . .

"వాడు శాస్త్ర డొక్కశుద్ధి ఉన్న వాడు. ఏం చెప్పినా గ్రహిస్తాడు." వా.

**డొక్కుపడు**

సంకోచము కలుగు.

కొ త్త. 438.

**డొల్లనడుచు**

చంపు.

భార. విరా. 3.204.

**డొల్లపొట్ట**

బొజ్జకడుపు.

**డొల్లి డొల్లి**

దొర్లుకుంటూ దొర్లుకుంటూ.

"నీ విప్పుడ పామ్ము, వడి డొల్లి డొల్లి శ్రీ వారణాసికిని."

పండితా. ప్రథ. దీక్షా. పు. 113.

**డొల్లుపుచ్చకాయ**

అస్థిరుడు.

"వాడు ఒట్టి డొల్లు పుచ్చకాయ. ఎక్కడా నాలుగురోజులు ఉండడు." వా.

**డొల్లుపుత్తెలు**

లొత్త తలలు, లోన ఏమీ లేనివి.

ఆము. 6.17.

**డొల్లుపోగులు**

బోలుగా ఉన్న పోగులు.

**డోకు వచ్చు**

అసహ్యము కలుగు.

"వానిరూపం చూస్తే డోకు వస్తుంది." వా.

అసహ్యాదృశ్యం చూస్తే వాంతి వచ్చుటపై వచ్చిన పలుకుబడి.

**డోగాడు**

దోగాడు.

**డోగి యాడు**

దోగాడు.

**డోలు కట్టు**

అపహాస్యము చేయు.

**ఢంకామీద దెబ్బ కొట్టి**

బాహాటంగా, గట్టిగా.

"వాడికి ఒక అక్షరం రా దని ఢంకా మీద దెబ్బ కొట్టి చెప్పగలను." వా.

**ఢకాఢకి**

ధ్వన్యనుకరణము.

**ఢకీలు ఢకీలున**

ధ్వన్యనుకరణము.

**ఢక్కా మొక్కీలు తిను**

జీవితంలో కష్టనష్టాలను అనుభవించు – ఎగుడు దిగుళ్ళను చూచు.

"వాడు ఎంతయినా ఢక్కా మొక్కీలు తిన్నవాడు. కాస్త వస్తే కళ్లు తిరిగి పోవడం, కాస్త పోతే దిగులుపడడం అసంభవం." వా.

**ఢిమఢిమ**

ప్రేలుటలో ధ్వన్యనుకరణము.

కృష్ణ. 3.29.

**ఢిల్లికి ఢిల్లి, పల్లికి పల్లి**

పెద్దది పెద్దదే, చిన్నది చిన్నదే.

కాని దేనిలో అందం దానికి ఉండనే ఉంటుంది. దేని కదే అనుట.

"ఢిల్లికి ఢిల్లే పల్లికి, పల్లే యని చెప్పునట్టి పలుకులు వినరే." శ్రీనివా. 1.57.

ఢిల్లి మహానగరం, పల్లె చిన్న గ్రామం.

**ఢోకా లేదు**

లోటు లేదు.

"ఆ పొలం పండుతున్నదాకా వాడికేం ఢోకా లేదు. వా.

Printed at the Freedom Press, 134, T. H. Road, Madras-21.